శ్రీ

# ఆంధ్ర విజ్ఞానము

## (Telugu Encyclopædia)

నాల్గవ సంపుటము.


ప్రసాద భూపాలుఁడు

జమీందార్ ఆఫ్ దేవిడి.




జ్ఞానోదయము.


మొదటికూర్పు 2000 ప్రతులు.

1940

PRINTED AT THE RAZAN ELECTRIC PRESS

BY C. NAGARAJU, B. A.,

RAJAHMUNDRY.



శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాదభూపాలుఁడు

(జమీందార్ ఆఫ్ దేవిడి)

# విషయసూచిక.

**నార్తుకేప్ అగ్రము**—ఇదియిరోపాఖండమునందలి నార్వేదేశపు ఉత్తరభాగమున నున్నది. ఉత్తరధ్రువ ప్రదేశ సీమయందుంటయేగాక ఇటనుండి నడుమ నేయాటంకములు లేక ఉత్తరధ్రువప్రదేశమును దర్శించుటకుఁగాని, అర్ధరాత్రియందు సూర్యబింబమును జూచుటకుఁగాని, సూర్యోదయమే లేని పగలు నీక్షించుటకుఁగాని, అర్హస్థలముగ శాస్త్రజ్ఞులచే నిర్ణయింపంబడిన దీయుత్తరాగ్రస్థలమే.

ఈ విచిత్రదృశ్యము ఆర్కిటిక్ సర్కిల్‌లో చేరిన నార్వేదేశపు టుత్తరభాగపు సీమయందంతటను గాననగుం గాని అందున కిది ప్రధానస్థానముగ నిర్ణయింపం బడినది. ఉత్తరధ్రువస్థానమునకే ఎవ్వరేని యరుగఁగల్గినచో వేసవియంతయు ఆఱునెలలు ఒకేపగలుగను, అనఁగా సూర్యాస్తమయమే లేని పగటికాలముగను, తక్కిన శీతకాల మంతయు ఆఱునెలలు ఒకే రాత్రిగను, అనఁగా సూర్యోదయమే లేని రాత్రికాలముగను ఉండెడిని. అటనుండి దక్షిణదిశగా ఆర్కిటిక్ సర్కిల్ దిశకు రానురాను తగ్గిపోవుచు, ఆరేఖకు దక్షిణప్రదేశములం దర్ధరాత్రి సూర్యుఁడు గాని, సూర్యుఁడులేని పగళ్లు గాని గాన్పింపవు.

ఉత్తరాగ్రమున మేనెల ౧౩ తేదీమొదలు జూలై ౩౧ తేదీవఱకు ఎనుబదిదినములు సూర్యుఁ డస్తమించుట లేక గన్పట్టును. ఇంక నవంబరు నెల ౧౮ తేదీని సూర్యుం డస్తమించి జనవరి నెల ౨౪ తేదీవఱకు సూర్యోదయమే యుండదు.

ఈ విచిత్రదృశ్యముం గాంచుయాత్రికులం గొంపోవుపొగయోడలు నార్వేదేశమందలి బెర్జినుపురమునుండి బయలుదేఱును. ఇది దీర్ఘకాలముబట్టును గాన పెక్కండ్రుయాత్రికులు బెర్జిన్ పురమునుండి ఇనుపదారిపై ప్రయాణమొనర్చుచు ట్రోండ్ ఝెమ్ పురమున కరిగి అట పొగయోడ నెక్కుటయుంగలదు. ట్రోండ్ఝెమ్మనిన సింహాసనస్థల మని నార్వేభాషయందర్థము. ఇది నార్వేదేశపు పురాతనపు రాజధాని. నేటికిని ఆదేశపు భూపతు లీపురముననే పట్టము గట్టుకొనుచుండు నాచారము కలదు. ఇటనుండి ఉత్తరాగ్రము చేర ౫ దినములు పట్టును.

ఈ ప్రాంత మంతయు నాదికాలమున రాక్షసనివాసప్రదేశము లని అచటివా రనెదరు. కొన్ని ప్రదేశములను కొండలను ఒకకొండ కివ్వలకుంగల సమానరంధ్రమును, కొన్ని కథనములను జెప్పి యానవాళ్ళుగ జూపుచుందురు. మార్గమున బోడోపురము లోఫోడెన్‌ద్వీపములు ట్రోమ్సోపురముకడ నున్న హెమ్మరుఫెస్టుపురము తగులును. ఇవియన్నియును కాడ్ చేపలను బట్టుతావులు. అందు హెమ్మరు ఫెస్టుపురము, కాడ్లీవరాయలు చేయు ప్రధానస్థానముగ నున్నది. పిదప నచిరకాలముననే ఉత్తరాగ్రము చేర నగును.

ఉత్తరాగ్రము మాగెరో ద్వీపమునుండి ఉత్తరదిశగా వ్యాపించియుండు నగ్రము. అచటి సముద్రపు నీటిమట్టమునుండి వేయి యడుగుల యెత్తుననుండును. పొగయోడ అచటనే దింపుతావు గలదు. అగ్రముపై కెక్కుటకు మార్గము కలదు. అగ్రము_ అర్హస్థానమున ఓస్కారు భూపతిచేనిర్మితంబగు స్తంభము(King Oscar's Column) కలదు. అటవిశ్రమింపనగును. ఇటనుండి ఉత్తరధ్రువమున కడ్డముగ నేయడ్డమును లేదని కొందఱును, స్పిట్జుబర్గెన్‌యొక్క కొనభాగమున్నదేమో యని కొందఱును తలంచుచున్నారు. అటనుండి చూచిన ఐస్బర్గులు మాత్రమే కన్పించెడిని.

ఉత్తరాగ్రముపై నున్న యీతావునుండి అర్ధరాత్రి సూర్యబింబము,సూర్యోదయము లేని

పగళ్ళు చూడనయ్యెడిని.(అర్ధరాత్రి సూర్యుడు కన్పించుట చూ. ఉత్తరధ్రువ మహాసముద్రము చూ.)

**నార్తు ఫ్రిజిడ్ జోన్** (North Friged Zone—North Pole) ఉత్తర ధ్రువప్రదేశము ఉత్తరధ్రువము.

**నార్తు వెస్టు ప్రోవిన్సెసు అండ్ ఔడ్**—ఇది ఆగ్రాప్రోవిన్సునకు వెనుకటి పేరు. (ఆగ్రా అయోధ్యాసంయుక్తరాష్ట్రములు చూ).

**నార్తువెస్ట్రన్ప్రొవిన్సు** (North Western Province)—(పశ్చిమోత్తర సరిహద్దు పరగణా చూడుడు).

**నార్మానిజమ్** (Normanism)-శిల్పమునందు నార్మన్ దేశీయుల పద్ధతి ననుకరించు విధానము.

**నార్వేదేశము** (Norway) —ఐరోపా ఖండమునందలి స్కాండినేవియా ద్వీపకల్పమునం దుత్తరభాగపు దేశము. దీనిని స్వదేశస్థులు నరగే యనెదరు. మనము వాడుచున్న నార్వే యనునది ఆంగ్లేయు లిడినపేరు. ఐరోపా యందిదిచాలయుత్తరమున నున్న దేశము. ఐరోపాయం దుత్తరపుకడ యని చెప్పఁబడిన నార్తు కేపుఅగ్రమీ దేశమునం దేయున్నది.౧౨౪౦౦౦ చతురపు మైళ్ళ వైశాల్యముగల దేశము. కొండలమయమైన దేశము. సముద్రతీరములందు భూమిలోనికిం జొచ్చుకొనివచ్చిన నీటి కాల్వలంబోలిన ఫియోర్డ్సు అనేకములు కలవు. వాటికడ నచ్చటచ్చట కొండలును, దరినే సముద్రమున చిన్నద్వీపములును గలవు. దేశము యొక్క దిగువభాగమున నేజ్ (Nose) మొదలొక్కని ఉత్తరమునకడవఱకు పర్వతపంక్తి కలదు. దీనిదక్షిణభాగమును హార్డేంజర్ ఫిజెల్డనియు, మధ్యభాగమును డోవ్రిఫిజెల్డనియు, ఉత్తరభాగము కియోలెన్ఫిజెల్డనియు పేరులం గల్గియున్నది. ఫిజెల్డనిన నార్వేభాషయందు మంచుమయమైన గ్లేసియరులసముదాయ మని భావము. ఎల్లప్పుడును కరగని మంచుప్రదేశములకు ఫిజెల్డని యందురు. వీటియందు గోల్డుహోపిం గనుశిఖరము కలదు. అది ౮౫౪౮ అడుగుల ఎత్తుకలది. నార్తు కేపును మేగిరోద్వీపమునందుండి ఉత్తరసముద్రములోనికి వ్యాపించి చొచ్చుకొనిపోయిన పర్వతమే గాని వేఱుకాదు. అది సముద్రపు నీటిమట్టముపై ౧౨౯౦ అడుగుల యెత్తుననున్న శిలాతలము. నార్తు కేపును జూడఁదలఁచిన ప్రయాణికులు పొగయోడలో నటకుఁ జేర్పఁబడుదురు. ఆకొండ నెక్కినపైని అగ్రస్థలమున ఓస్కారు భూపతి నిర్మించిన స్తంభము కలదు. అట నిలిచి స్థితిగతులను పరిశీలించెదరు.

ఈ ఉత్తరధ్రువప్రదేశములందు ఆఱునెలలు పగలును ఆఱునెలలు రాత్రియు నైయుండును. ఆఱునెలలు సూర్యుఁ డస్తమింపనే అస్తమింపఁడు. అస్తమించినపిదప ఆఱునెలలుదయింపనే ఉదయింపకుండెడిని.

ఈచిత్రమేమన భూమియొక్క ఉత్తరపు కొన నుండినవారికి భూమధ్యరేఖపై నెత్తున ఆకసముననుండు సూర్యుఁడు, భూమి తనకు దానెంత గిరగిర తిరుగుచుండినను, ఉత్తరాయణమునందారు నెలలు ఒకేరీతిని కన్పించుచునే యుండును. దక్షిణాయణమున సూర్యుఁడు వంగియున్న భూమి కవ్వల ఆఱునెలలు మరుగుపడియుండుటంజేసి కన్పింపక రాత్రిగనే యుండును. ఇటులనే దక్షిణధ్రువమున(భూమియొక్కదక్షిణ కొన నుండినవారికి భూమధ్యరేఖపై నెత్తున ఆకసమున నుండు సూర్యుఁడు భూమి తనకుఁ దానెంత గిరగిర తిరుగుచుండినను ఉత్తరాయణమునం దాఱు నెలలు ఒకేరీతిని వంగియున్న

భూమి కవ్వల ఆఱునెలలు మరుగుపడియుంటం జేసి కన్పింపక రాత్రిగనే యుండును) దక్షిణాయనమునం దాఱునెలలు సూర్యుఁడు ఒకేరీతిని గన్పించుచు పగలై యుండెడిని.

ఇంకను నార్తు కేపుకడ నవంబరు ౧౮వ తేదీని అస్తమించి, జనవరి ౨౪వ తేదీని తిరుగ నుదయించును. ఈచీకటియందు అరోరాబోరియాలిస్ వెలుతురు కల్గుచుండెడిని. (చూ). వేసవియందు, అనఁగా పగలుగనే యుండుకాలమునందు, అర్ధరాత్రమున సూర్యునికాంతి ఇంచుక తగ్గి, ఎఱ్ఱపడి తిరుగ అచిరకాలముననే పగటివలె దీప్తి యతిశయించు చుండును. (ఉత్తరధ్రువముచూడుఁడు).

లోఫోడెక్ దీవులనుపేరుగలద్వీపములీదేశమునకుం జెందినవి. వాటిలో రెండు ద్వీపముల నడుమ రెండు సముద్రప్రవాహము లొకటినొకటి ఎదుర్కొను వింత దృశ్యము కల దఁట. నీరు పైకెగురుటను Moelstrom అని వాడుచున్నారు.

నార్వే దేశపునదులు కొండజక్కెరలం బోలియుండును. వీటియందు పెద్దనదికి గ్లోమ్మెన్నది యనిపేరు. ఇది స్కాగరాకునందు సంగమించును. ఈశీతలదేశమున వేసవిదినములు చాల తక్కువ సంఖ్యగను, శీతకాలము చాల దీర్ఘముగను నుండును. అందు కడుశీతలమై యుంట చలిబాధ ఎక్కువ.

నార్వే దేశపుగనులందు రాగి, ఇనుము దొరకుచున్నవి. భూమియు సారవంతమైనది కాదు. దక్షిణసీమలందు పీలగుతావులందు ఓట్సుధాన్యము, రైధాన్యము, బార్లీధాన్యము, కొంచెముగా గోధుమలు పైరుచేయంబడుచున్నవి. ట్రోండ్‌ఝెంపట్టణమున కుత్తరప్రాంతమున గోధుమపంట నిరర్థకము. అడవులందు ప్రశస్తమైన కలప గలదు. నార్వేయందుజనాభా చాల తక్కువ(ఐరోపాచూడుఁడు). చతురపుమైలునకు ౧౮ మందిగా లెక్కింపఁబడినది. నిష్కల్మషహృదయులు. అతిథిఅభ్యాగతులనాదరించి భోజనమిడు ధర్మపద్ధతి వీరియందు గలదు. ప్రజలు చిరకాలజీవులు. నూఱుసంవత్సరములుజీవించుట సర్వసాధారణమే. ప్రోటస్టాంటు క్రియిస్తవమతస్థులు.

క్రిష్టియానియా నగరము రాజధాని. (౨౩0000) ప్రభుత్వము లిమిటెడ్ మోనార్కీ. ఇట నొక విశ్వవిద్యాలయము కలదు. బెర్గెన్ పురము, ట్రోండ్‌ఝెమ్‌పురము ఇతరపట్టణములు. ట్రోండ్‌ఝెమ్ అన (Thronehome) అనియర్థము. ఇది తొల్లింటి రాజధాని. ఇప్పటికిని ఈనార్వేరాజుల పట్టాభిషేక మిటనే జరుగుచుండును. క్రిష్టియానియానగరము నాల్గవక్రిష్టియన్ అనుభూపతిపేరునఁ బరఁగునది. నార్వేస్వీడనులు ఒకప్పుడు ఒకేభూపతిక్రింద నుండినవి. క్రీ.వె. ౧౯0౬ నుండి వేర్వేఱు భూపతులక్రింద తిరుగ నుండుట కేర్పాటు జరిగినది. (స్వీడన్ దేశము చూడుఁడు.)

## నాలందనగోత్రము-గవిష్ఠిరగణముచూ.

## నాలంద విశ్వవిద్యాలయస్థానము-

ఇది పాట్నా జిల్లాలోని రాజగృహము (రాజగర్) నకు వాయవ్యదిశగా ఏడుమైళ్ళ దూరమునంగల బరగాన్‌కడ నుండిన తొల్లింటి నాలందపుర ముండినతావు. తొల్లింటిపేరు విహారగ్రామము. రానురాను బిహారగ్రామమై కడకిప్పటికి బారగాన్ ఆయెను. నాలందనామము విశ్వవిద్యాలయనామ మని పెక్కండ్రు తలంచుచున్నారు. ఇది తొల్లింట పెద్దనగర మనియు, నిందు పెక్కండ్రుజనులు, ఏనుఁగులు, గుఱ్ఱములు ఉండిన వనియుం దెలియుచున్నది. ఇది బౌద్ధమతవిద్యకు ప్రధానస్థానమై యుండెను. క్రి.వె. ౧౩ శతాబ్దకాలమువరకుం బనిచేయు చుండె

నఁట. ఇప్పు డంతయు పాడుదిబ్బలమయమై యున్నది.

బుద్ధభగవానుని శిష్యుఁడగు సారీపుత్రుఁ డిట జన్మించినవాఁడఁట. అతఁడు మరణించి నదియు నిచటనే. శంకరుఁడు, ముద్గరగ్రామణి యనుపేరుగల ఇర్వురు సోదరులు సారీపుత్రుని జన్మస్థానమున నీనాలందవిద్యాపీఠము నిర్మించి రని ప్రతీతికలదు. కాని హ్యూనచ్యాంగు శక్రాదిత్యుఁ డనునృపాలుఁడు నిర్మించె నని వ్రాసి యున్నాఁడు. మహాయాన పద్ధతికి నిర్మాత యగు నాగార్జున పండితుఁడు నివసించువాఁ డనియు, నాతఁడే దీనిని మహాయానపద్ధతులలోనికిఁ దెచ్చి నడిపె ననియు, నిది క్రీ. వె. ౧ వ శతాబ్దకాల మనియుం జెప్పఁబడినది. విశ్వవిద్యాలయ భవనములు, మఠములు మొదలగునవిగల యానవాళ్లు బార్గాన్, బేగమ్పూర్, ముస్తఫాపూర్, కపతియా, ఆనందపూరు లనంబరఁగు గ్రామముల నాక్రమించి యున్నవి.

ఇం దొకసరస్సున నాలందుఁ డనునాగముండెడి దఁట. దాని నిప్పుడు కార్గిద్యపుఖార్ అనెదరు. ఇందు మహావీరస్వామి జైనదేవళము కలదు.

క్రీ. వె. ౧౨ శతాబ్దాంతమున భక్త్యారిఖిల్జి యను మహమ్మదీయుఁడు భంగమొనర్చ జేసె నఁట. (మగధరాజ్యము చూ.)

**నాలాయనగోత్రము**—జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు

**నాల్గుకాలములు**-ఎస్ట్రోనామీ శాస్త్రోక్తములగు నాల్గుకాలములు- (ఎస్ట్రోనామీ-సీజన్సు చూడుఁడు.)

౧ Spring-Vernal equinox నుండి ప్రారంభము (మార్చి 21).

౨ Summer-Summer solsticesనుండి ప్రారంభము (జూన్ 21.)

3 Autumn-Autumnal equinoxనుండి ప్రారంభము (సెప్టెంబరు 23.)

౪ Winter-Winter solstices నుండి ప్రారంభము (డిశంబరు. 22).

**నావలు**—ఓడలు చూడుఁడు.

**నావికాశాస్త్రము**--ఈపేరుగల కళనుగూర్చినగ్రంథములు మనవాఙ్మయమునందు గానరాకున్నవి. కాని యవి మనపూర్వు లెఱుంగనివి కావు. ఇతరనిదర్శనములవలన నట్టిగ్రంథములు తొల్లి మనకుండినట్లు తెలియుచున్నది.

వృక్షాయుర్వేద మనంబడు పురాతనగ్రంథమున ఏయేజాతిచెట్లకలప ఏయేతరగతియోడలం జేయ నర్హమో చెప్పఁ బడినది. నావికాచ్ఛందోగ్రంథ మని చెప్పఁబడఁ దగినది కాకున్నను, యుక్తికల్పతరు వనంబడు చిన్న సంస్కృతగ్రంథమునందు సముద్రయానమునకైన యోడలు సామాన్యజాతి యనియు, విశేషజాతి యనియు ద్వివిధముగఁ జెప్పఁబడినవి.

సామాన్యజాతి దశభేదములు కలది. ౧ క్షుద్రజాతి, ౨ మధ్యమజాతి, 3 భీమజాతి, ౪ చపలజాతి, ౫ పాటలజాతి, ౬ భయజాతి, ౭ దీర్ఘజాతి, ౮ పాత్రపుటజాతి, ౯ గర్భజాతి, ౧౦ మందరజాతి యని వీట్లపరిమాణము లీయఁబడియున్నవి.

విశేషజాతి దీర్ఘము లనియు, ఉన్నతము లనియు ద్వివిధము. అందు దీర్ఘజాతి ౧ దీర్ఘిక, ౨ తరణి, 3 లోల, ౪ గత్వర, ౫ గామిని, ౬ తరి, ౭ జంఘుల, ౮ ప్లావిని, ౯ ధారిణి, ౧౦ వేగిని యని దశభేదములుగ నుండును. వీట్ల ఉపయోగములును వేఱుగ నుండెడిని. ఇంక నున్నతజాతియందు ౧ ఊర్ధ్వ, ౨ అనూర్ధ్వ,

౩ స్వర్ణముఖి, ౪ గర్భిణి, ౫ మందార యని మైదువిధములుగఁ జెప్పఁబడినవి.

యుద్ధనావలు నిందే కలవు. అవి ఇవి యని చెప్పుటకు వలయు పరికరములు చాలవు. కాని యుద్ధనావలందు ౧ సర్వమందిరములు, ౨మధ్యమందిరములు, ౩ అగ్రిమందిరములు నను త్రివిధ భేదములుగ నుండినట్లు తోఁచెడిని.

అన్ని దేశములు నిద్రనుండి మేల్కొనక పూర్వ మీస్థితి భరతదేశమునం దుండినది. ఇతరదేశములం దీ నావికాశాస్త్ర మభివృద్ధి గాంచి, ప్రస్తుతము సముద్రమునందుఁ బర్విడు చున్నస్టీమరులు యుద్ధనావలుగ నగు పరిస్థితులు గల్గినవిగాని,భరతదేశపుదురదృష్టముననావలు, రహదారీపడవలు, సరుకులను మోయు తొట్టిపడవలు వీటితోనే మనశాస్త్రము నిలిచిపోయియున్నది. ఆంగ్ల నావికాశాస్త్రము మన కిప్పటున నధికముగ చేదోడువాడో డగుఁ గాక. దాని నభ్యసించుటయే సమంజసమని తోఁచెడిని. ఈవ్యాసమున భరతదేశపుపూర్వస్థితి వివరింపఁ బడినట్లు మాత్రి మెఱుంగఁ దగినది.

**నావిగేటర్ద్వీపములు (సామోఆస్ ద్వీపములు)**— ఇవి ఓసీనియాయందలి పొలినేసియా ద్వీప సమూహామునకుఁ జెందిన ద్వీపములు. వీటిని కెప్టెన్ కుక్కు (Captain Cook) గారు క్రి. శ. ౧౭౭౮ లోఁ గనిపెట్టి, అందలి ప్రజలనావికాచతురత,వాడునామమున నడుచునేర్పుల నెఱింగి వీటి కీపే రిడిరఁట. టోన్గోద్వీపములకు (ఫ్రండ్లీద్వీపములు) తూర్పుగా నున్నవి. స్వదేశస్థులు వీటిని సామోఆస్ ద్వీపము లనియెదరు. (ఓసీనియా, పొలినేసియా ద్వీపములు చూ.)

**నాశరిగోత్రము**—నిధృవగణము చూ.

**నాశావ్యజనగోత్రము**—వార్ధ్యస్వలేకమిత్రుడుపగణము చూడుఁడు.

**నాసాధితంకరణమ్ఇతిన్యాయము**- నెఱవేఱి పూర్ణత నందిన సత్యముతోఁ జేయ నగును గాని అట్టి పరిపూర్ణత నందని సంగతి వేఱొకచర్యయందు ఫలితము గల్గింపఁ జాలదనియు లేక గల్గించుపరికరము గానేర దనియు భావము.

**నాసాశోషరోగము**—ఆయుర్వేదవైద్య శాస్త్రమున ముక్కుయొక్క పరిశోష రోగమునకు పేరు.

**నాసిక జిల్లా**(Nasik Dt.—నాసిక్ పట్టణము ప్రధానస్థానము.(బొంబై రాజధానిచూ.)

**నాసికామయము**— ఆయుర్వేదవైద్య శాస్త్రమున పీనసరోగమునకుఁ బేరు.

**నాసికాక్షేత్రము**-బొంబై రాజధాని నాసిక జిల్లాలోని నాసిక్ అనంబడు పట్టణము. దీనిని నాసికాత్ర్యంబక మనియు నందురు. కాని, త్ర్యంబకక్షేత్రము నాసికకు పదునెన్మిది మైళ్ల దూరమునఁగలదు. అది గోదావరీనది పుట్టిన తావు. గౌతముని యాశ్రమమై యుండెను. ఇట నొక గండశిలనుండి మూఁడు రంధ్రములనుండి పైకి వచ్చుచుండు మూఁడు జలధారలే గోదావరీనది యగును. కాన నిది గోదావరీనదీ జన్మస్థాన మనంబరఁగెడిని. ఇట గౌతమేశ్వర శివలింగము కలదు. దీనికి తొల్లింట జనస్థాన మనుపే రుండెనని చెప్పఁబడినది.

నాసికపట్టణమునకు పంచవటిక్షేత్ర మనియుం బేరుకలదు. గోదావరీనది కుభయతీరములందు వ్యాపించియున్న పట్టణము. నదీతీరములందు దేవళములు, సత్రములు, మఠములు విరివిగఁ గలవు. నదియం దొకద్వీపమున తొల్లింటి పంచవటి (ఐదు మఱ్ఱిచెట్లు) క్షేత్ర ముండెను. అందు పర్ణశాలవైచుకొని శ్రీరాముఁడు సీతతోఁ గొంతకాలము ప్రవాసముఁ గడపెనని చెప్పఁబడినది. రావణుండు సీతాదేవి నపహరించుట ఇటనే

యందురు. శూర్పణఖయొక్క ముక్కును లక్ష్మ ణుండు కోసినదాదిగ నీపురమునకు నాసిక్ అని పేరయ్యెనఁట. పంచవటియందు సీతారామాల యము కలదు. ఇత్తావున దీనిని తూర్పుతీర మని చెప్పనొప్పును. ఇది ఊరిబయట అరమైలు దూరమున నున్నది. ఇట రామకుండముకలదు. అందు శ్రీరాముఁడు జలకములాడుచుండెనఁట.

నాసికయందు పంచవటికడనున్న శివలిం గము కడుపురాతన మనియు, శ్రీరాముఁడీశివ లింగము నర్చించుచుండె ననియు ప్రతీతి కలదు. నాసికయందుఁ గల బలరామస్వామి దేవళము చక్కని పనితనమునకు పేరందినది. నాసికా ప్రాంతము సమశీతోష్ణస్థితి గలది గాన, నిట కూరగాయ లపరిమితముగఁ బెరిఁగి వృద్ధియగుట సుప్రసిద్ధము. ఇవి పెక్కురకము లిట చౌకగ నమ్మఁబడుటయే గాక విస్తారము బొంబైనగర మునకు పంపఁబడి శీఘ్రముగ నమ్ముడుపోవును. నాసికయందుప్రభుత్వమువారి స్టాంపులు ముద్రిం చుయంత్రశాల కలదు. నాసిక ఇత్తడిచేతిపను లకు, రాగిచేతిపనులకు పేర్వడసిన తావు. ఇచటి పనులు అందమైన వని సుప్రసిద్ధి కలదు.

తొల్లింటి ఆంధ్రసామ్రాజ్యమునకు రాజ ధానిగనుండిన ప్రతిష్ఠానపుర మిచటికి నూటపది మైళ్ళ దూరము కలదు. లీనా గుహయందలి శాసనములవలన ఆంధ్ర లీప్రాంతదేశమును క్రీ. ము. ౨౦౦ సంవత్సరములనుండి పాలించి నట్లు చరిత్రవిమర్శనములవలనఁ దేలుచున్నది. ఇది మహారాష్ట్రదేశ మనఁదగు నని తోఁచెడిని.

**నాస్యపంచకము**— బౌద్ధమతధర్మమున ౧ అవిద్య, ౨ అశ్మత (నాది యనుకాంక్ష), 3 అనురాగము, ౪ అభినివేశము (పట్టుదల), ౫ ద్వేషము, నాస్యపంచక మనంబడును.

**నాహునిగోత్రము**— ఉపమన్యుగణము చూడుఁడు.

**నాళికాస్త్రములు** (Fire Arms)— నాళికాస్త్రము లనఁగా తుపాకులు, ఫిరంగులు మొదలగువానిని ప్రాచీనులగు నార్యు లెఱింగి యేయున్నారు. కాని పాశ్చాత్యులవలన మన దేశమునకవి క్రొత్తగా వచ్చినవికావు. ఆర్యుల మహిమలఁ దెల్పుటకై వేదశాస్త్రపురాణముల నుండి కొన్ని ప్రమాణము లిందుదాహరింపఁ బడినవి.

తుపాకులకును, ఫిరంగులకును నళికములు, నాళికములు, నాళీకములు,సూర్మ్యలు,శతఘ్నులు అను పర్యాయపదములు వేదశాస్త్రాదులయందు గాన నగుచున్నవి.

నళయంత్రమున వెలువడునది గావున నాళిక యనుపేరుగల బాణవిశేషము గలదు. శార్ఙ్గధర ధనుర్వేదమునందు,

"నాళికా లఘువో బాణా
నళయంత్రేణ నోదితాః
అత్యుచ్చ దూరపాతేషు
దుర్గయుద్ధేషు తే మతాః॥"

అని యున్నది. నళయంత్రమున వెలువడు నాళిక లనుచిన్న బాణములు గడుదూరముననుండుకోట లను గొట్టవలసినయుద్ధములయందుపయోగించు నని దీని తాత్పర్యము.

తుపాకులు మొదలగునవిగూడ యంత్రముల వలననే వెలువడును. కావున శబ్దశక్తినిబట్టి వాని కిని నాళికములని వ్యవహారము గలిగినది. మఱి యును నాళము గలిగినవి కావున నవి నాళికము లగుచున్నవి. మీఁద నుదహరింపఁబడిన నాళిక లనుబాణవిశేషములకంటె నాళికము లనంబడు తుపాకులు మొదలగునవి భిన్నములని నీతిప్రకా శికవలనఁ దెలియుచున్నది. అందు,

"నాళికా ఋజుదేహాస్యా త్తన్వంగీ
మధ్యరంధ్రికా, మర్మచ్ఛేదకరీ నీలా....."

అనియు,

"గ్రహణం ధ్మాపనం చైవ
స్యాతం చేతి గతిత్రయం
తామాశ్రితం విదిత్వాతు
జేతాఽసన్నాన్ రిపూన్ యుధి"

అనియును జెప్పఁ బడియున్నది. తిన్ననైన ఆకారమును, మధ్యరంధ్రమును గలిగి మర్మములను దోలుచునట్టి నాళిక నల్లనై సన్నముగా నుండును. పట్టుకొనుట, కాల్చుట, గురిపెట్టి కొట్టుట, అను దానిత్రివిధగతులను జక్కఁగా గ్రహించినచో యుద్ధమునం దాసన్నులగు శత్రువులను జయింప నగునని దీనితాత్పర్యము. ఈవివరణమునుబట్టినాళికాశబ్దముచేత తుపాకులె చెప్పఁబడిన వనుట నిర్వివాదాంశము.

వేగమునఁ దైత్తిరీయసంహితయందు-

"ఏషావై సూర్మీకర్ణకావ త్యేతయా హస్మ వై దేవా అసురాణాం శతతర్హాం స్తృంహంతి య దేతయా సమిధమాదదాతి వజ్రమే వైతత్ శతఘ్నీం యజ భ్రాతృవ్యాయ ప్రహరతి" అనియున్నది.

ఈమంత్రమునందలి సూర్మి యనఁగా లోహమయమగు మండునట్టి పోతవస్తువు, కర్ణకావతి యనఁగా లోపల రంధ్రము గలదియు లోపల మండునదియు ననియర్థము. ఒకదెబ్బతో నూర్గురను జంపునట్టియసురులను దీనితో దేవతలు చంపుదురు. కావున నీబుఱ్ఱుకచేత యజమానుఁడు సమిధ నాదానముచేసి వజ్రాయుధసదృశమగు మీఁదఁజెప్పిన సూర్మి యను ఈశతఘ్ని శత్రువులమీఁదఁ బ్రయోగించు నని భట్టభాస్కరభాష్యమును, "సూర్మి" యనఁగా మండునట్టి లోహమయమగు పోతవస్తువు; అది కర్ణకావతి యనఁగా రంధ్రముగలది గనుకనే మండునది యనియర్థము. ఈబుఱ్ఱుక దానివంటిది. ఒక్కదెబ్బతో నూర్గురను జంపునట్టి శూరులు శతతర్హులు, అసురులలో నట్టివారి నీబుఱ్ఱుకతో (దేవతలు) హింసింతురు. దీనితో సమిదాధానముచేసి శతఘ్నియగు నీబుఱ్ఱును వజ్రాయుధముగా నొనరించి (యజమానుఁడు) శత్రువులను సంహరించుటకుఁ బ్రయోగించు నని సాయణాచార్యభాష్యమును దెలుపుచున్నది.

శుక్రనీతియందు నాలుగవయధ్యాయమున-

"అస్త్రంతు ద్వివిధం జ్ఞేయం నాళికం మాంత్రికం తథా।
యదాతు మాంత్రికం నాస్తి నాళికం తత్ర ధారయేత్॥
నాళికం ద్వివిధం జ్ఞేయం బృహత్ క్షుద్ర విభేదతః।
తిర్య గూర్ధ్వ చ్ఛిద్రమూలమ్ నాళం పంచ వితస్తికమ్॥
మూలాగ్రయో ర్లక్ష్యభేదీ తిలబిందుయుతం సదా।
యంత్రాఘాతాగ్నికృత్ గ్రావచూర్ణ దృక్కర్ణమూలకమ్॥
సుకాష్ఠో పాంగబుధ్నం చ మధ్యాంగుళ బిలాంతరమ్।
స్వాంతేగ్నిచూర్ణ సంధాత్రీ శలాకాసంయుతం దృఢమ్॥
లఘునాళిక మప్యేతత్ ప్రధార్యం పత్తిసాదిభిః।
యథా యథాతు త్వక్సారం యథా స్థూల బిలాంతరమ్॥
యథా దీర్ఘం బృహద్గోళం దూరభేదీతథా తథా।
మూలకీల భ్రమా ల్లక్ష్యసమసంధానభాజి యత్॥
బృహన్నాళికసంజ్ఞం తత్ కాష్ఠబుధ్న వివర్జితం
ప్రవాహ్యాం శకటాద్యైస్తు
సుయుక్తం విజయప్రదమ్॥"

అనియున్నది. అస్త్రము నాళిక మనియు, మాంత్రిక మనియు ద్వివిధము. మాంత్రికా

స్త్రము లేనియెడల నాళికాస్త్రము ధరింపవలయును. నాళికాస్త్రము క్షుద్రము (చిన్నది), బృహత్తు(పెద్దది)అని ద్వివిధము. అందు క్షుద్రమగు లఘునాళికము. (తుపాకి) అయిదు జేనల పొడుగుగలిగి నిడుపుగా లోపలరంధ్రమును మొదట నడ్డముగాఁ జిన్నబిలముగల నాళమును గలిగియుండును. మఱియును నాళమునకు మొదటను, చివరను గురిచూచుట కనుకూలముగా నుండు నూగింజవంటి బిందువుండును. మొదట నగ్నిచూర్ణము (మందు) పోయుటకు చెవివంటిచోటును, కీలునొక్కుట చేత నిప్పురాలునట్టి ఱాయి (చెకుముకిఱాయి) యు నుండును.

నాళమునకు కాఁపుదలగా మంచికఱ్ఱతోఁ జేయఁబడిన యుపాంగము(పిడి,) కుందా మొదలగునవి గలిగి నాళమునకు నుపాంగమునకు నడుమ నొకయంగుళ మెడముగల బిలమును గలిగియుండును. నాళములో నగ్నిచూర్ణము (తుపాకిమందును) బోసి దట్టించుటకుఁ దగిన గట్టి శలాక (గజము) యీ బిలమునం దుండును. కాల్బలమును, గుఱ్ఱపుదళమును ధరింపఁ దగిన లఘునాళిక (తుపాకి) యిది. నాళము యొక్క త్వక్సారము (దళముఁ పటిమ మొదలగునవి) కొలదిని, బిలముయొక్క స్థౌల్యము కొలఁదని, పొడుగుకొలఁదిని దూరభేదియగు బృహద్గోళము (పెద్దగుండు) ప్రయోగింపఁబడుచుండును. మొదటనున్న కీలుమఱను త్రిప్పుట చేత గుఱి చూచి ప్రేల్చవలసియుండునదియుఁ, గఱ్ఱతోఁ జేసిన యుపాంగము లేనిదియు, శకటములు మొదలగు వానిపై నెక్కించికొని పోఁబడునదియు, విజయప్రద మగునదియు బృహన్నాళిక (ఫిరంగి) యనంబడునని తాత్పర్యము.

మఱియును శుక్రనీతియందే నాళికాస్త్ర ప్రయోగముంగూర్చి,

"నాళాస్త్రం శోధయే దాదౌ దద్యా
త్తత్రాగ్నిచూర్ణకం।
నివేశయే త్తండేన నాళమూలే యథా
దృఢం॥
తతః సుగోళకం దద్యాత్ తతః కర్ణేఽగ్ని
చూర్ణకం।
కర్ణచూర్ణాగ్నిదానేన గోళం లక్ష్యే నిపాత
యేత్॥
లక్ష్యభేద యథాబాణో ధనుర్జ్యా
వినియోజితః।
భవేత్ సంధాయతు తథా..."

అని చెప్పఁబడినది. తొలుదొల్త నాళికమును (తుపాకిని) శోధించి, పిమ్మట దానిలో నగ్నిచూర్ణము (మందు)ను బోసి, ఆవల నాళమూలమున గట్టిగా దండముతో (గజముతో) దట్టించి, తర్వాత మంచిగోళము (గుండు) ను వేసి, ఆవెనుకఁ జెవిలో మందుఁ బోసి, అనంతరము దానికి నిప్పంటించి ప్రేల్చి గుండుతో గుఱిని గొట్టవలయును. ధనుస్సుయొక్క నారినుంచి ప్రయోగింపఁబడుబాణము గుఱిఁదగులునట్లె గుండును గుఱికిఁ దగులునని తాత్పర్యము.

మఱియు శ్రీమద్రామాయణమునందును-

"నాళికై రథనారాచై ర్భల్లై రథ వికర్ణిభిః।
నిహతో లక్ష్మణః శేతే దివ్య మాదాయ
కార్ముకమ్॥"

అని యింద్రజిత్తు లక్ష్మణునిపై నాళికప్రయోగము చేసినట్లు చెప్పఁబడియున్నది.

భారతమునందుఁగూడ-

"కర్ణినాళికనారాచానుత్సృజంతో మహారథః"
"కర్ణినాళికనారాచాన్ నిర్హరంతి శరీరతః"
"అస్యతః కర్ణినాళీకాన్ మార్గణాన్ హృదయచ్ఛిదః"

"తతో నాళికనారాచై ర్భల్లైః"

అని యనేకస్థలములయందు నాళికాస్త్రప్రయో

గము చెప్పఁబడియున్నది. అథర్వ వేదమునఁ గొన్ని చోట్ల సీసముతో శత్రులను నశింపఁజేయు గాథలు గల మంత్రము లగపడుచున్నవి.

అందు-

" సీసాయాధ్యాః వరుణః సీసాయాగ్ని
రుపావతి।
సీసమ్ మఇంద్రః ప్రాయచ్ఛత్ తదంగం
యాతుచాతనం"

,,యది నో గామ్హంసి యద్యశ్వమ్ యది
పూరుషమ్।
తం హాత్వా సీసేన విధ్యామో యథా నోఽ
సొ అవెరహాః"

అనియున్నది.

ఇంకను గొన్ని మంత్రములయందును సీసముతో శత్రునాశనము చెప్పఁబడి యున్నది. సీసముతో శత్రునాశనము చేయుట యనఁగా గుండుతోఁగొట్టుట యనియూహింపవలయును.

పైనుదాహరించినయథర్వ వేదమంత్రములకు గ్రిఫిత్ దొరగారి భాషాంతరీకరణము—

"Varuna's benson has blessed the *lead and Agni strengthens it.

Indra has given me the lead; this verily repels the fiends."

"If thou destroy a cow of ours, a human being, or a steed,

We pierce thee with this piece of lead

So that thou mayst not slay our men".

The hymn has been translated and annotated by Dr. Julius Crill, Hendert Leider des Atharvaveda (pp. 1;75.)

*The lead: a piece of this metal employed as a charm against demons and socery: See Bk XII 2. 1, 19, 20, 53. So in England a horse shoe was in former times generally regarded as a protection against witches and is still sometimes nailed on or over the door of a house or stable.

Iron in other forms also was used as a charm for stables:—

"Hang up hooks and shears to scare,
Hence the hag that rides the mare,
Till they be all over wet with mire & the sweat,
This observed, the manes shall be,
Of your horses, all knot-free".

Herrick-charms and ceremonies LXVIII

అని వ్రాసియున్నారు. కాని యథర్వవేదమునందలి మంత్రప్రకరణములనుబట్టి పరిశీలించినను సీసశబ్దప్రయోగమునకు సన్నిహితముగా నగ్నిశబ్దప్రయోగము గనఁబడుచుండుటచేతను సీస మనఁగా సీసపుగోళ మనియే యర్థము చేయుట యుక్తియుక్తముగా నుండును. కాని, ఇంగ్లాండులో సీసపుముక్కను గుమ్మమునకు వ్రేలఁగట్టునట్టి యాచార మున్నదిగనుక నథర్వ వేదమునఁజెప్పఁబడిన సీసమునకు సీసపుముక్కయేయని గ్రిఫిత్ దొరగారు వ్రాసినవ్రాత హేతుకముగా నుండలేదు.

## నాళికాస్త్రగోళకములు (గుండ్లు) అగ్నిచూర్ణము (మందు) (Bullets & Gunpowder) —

"గోళో లోహమయో గర్భ
ఘుటికః కేవలోపి వా
సీసస్య లఘునాళార్థే
హ్యాన్యధా తు భవోపి వా॥"

అనియున్నది. గోళము (గుండు) కేవలము

లోహముతోఁగాని, సీసముతోఁగాని యితర ధాతువులతోఁగాని చేయఁబడి లఘునాళికములకు (తుపాకులకు) గర్భఘుటికగా నుండునని దీని తాత్పర్యము. అగ్నిచూర్ణము (మందు) చేయుటంగూర్చి—

"సువర్చిలవణాత్పంచ పలానిగంధకాత్పలం।
అంతర్ధూమవిపక్వార్క–స్నుహ్యా
ద్యంగారతః పలం।
శుద్ధాత్ సంగ్రాహ్య సంచూర్ణ్య
సమ్మీల్యప్రపుటే ద్రసైః।
శుద్ధార్కాణాం రసో నస్య
శోషయే దాతపేన చ।
పిష్ట్వా శర్కరవ చ్చైత
దగ్నిచూర్ణం భవేత్ ఖలు॥"

అనిచెప్పఁబడియున్నది.

సువర్చిలవణము అయిదుపలములు(20తు), గంధకము ఒక పలము (4తు॥), పొగపోకుండ కాల్చిన జిల్లేడుబొగ్గుగాని, జెముడుబొగ్గుగాని, ఆముదపుబొగ్గుగాని 1 పలము. వీనిని వేఱు వేఱుగా మెత్తగా నూఱి, కలిపి తెల్లజిల్లేడు పాలతో మర్దించి తడి యిగురున ట్లెండఁబెట్టి మరల నూఱిన నిసుకవలె నగ్నిచూర్ణ మగునని దీనితాత్పర్యము.

నాళికాస్త్రముకొఱకు—

"సువర్చిలవణా ద్భాగాః
షడ్వా చత్వార యేవ వా।
నాళాస్త్రాగ్నిచూర్ణేతు
గంధాంగారౌతు పూర్వవత్॥

అని యింకొకప్రకారమును జెప్పఁబడినది. సువర్చిలవణము 6 లేక 4 పాళ్లును, మునుపటి వలెనే బొగ్గును, గంధకమును జేర్చిన అగ్నిచూర్ణ మగునని దీనితాత్పర్యము.

"అంగారస్యైవ గంధస్య సువర్చిలవణస్యచ।
శిలాయా హరితాళస్య తథా సీసమలస్య చ।
హింగుళస్య తథా కాంతరజః కర్పూరస్యచ।
జనీల్యాధ సరళనిర్యాసస్య తథైవ చ।
సమన్యూనాధికైరంశైరగ్నిచూర్ణాన్యనేకశః
కల్పయంతి చ తద్విద్యా చంద్రికాభాది
మంతి చ॥"

అని యింక ననేకవిధము లగు నగ్నిచూర్ణములు వివరింపఁబడియున్నవి. బొగ్గు, గంధకము, సువర్చిలవణము, మనశ్శిల (మణిశిల), హరితాళము, సీసమలము, ఇంగిలీకము, ఉక్కుబీడు, కర్పూరము, లక్క, నీలి, సరళ (దేవదారు) నిర్యాసము వీనిలో నెచ్చుతగ్గులు గల పాళ్లను సమకూర్చి వెన్నెల మొదలగు వాని వన్నెలు గల వివిధములగు నగ్నిచూర్ణములను నేర్పరులు కల్పింతు రని దీనితాత్పర్యము. దీనింబట్టి చూడ యుద్ధములలో నుపయోగించు నగ్నిబాణముల చూర్ణములును, పొగలేని యగ్నిచూర్ణములును, విలాసార్థముగా నుపయోగింపఁబడు నాకాశబాణములు, చిచ్చుబుడ్లు, మతాబులు మొదలగు వానిచూర్ణములను జేయునట్టి విధానము సూచింపఁబడుచున్నది.

ఈతీరున మనపూర్వులు నాళికాస్త్రములను, గోళములను, అగ్నిచూర్ణములను జక్కఁగా నెఱిఁగి యున్నను, నాళికాస్త్రప్రయోగ మాసుర మనియు, అది యధర్మయుద్ధమునఁ బ్రయోగింపఁ బడఁదగిన దనియు వారితలంపు. కాఁబట్టియే ధనుర్వేదమునందలి మాంత్రికాస్త్రములతో నాళికాస్త్రము సమగౌరవమును బొందలేదు. దీనికన్న నధిక వీర్యవంతములగు మాంత్రికాస్త్రము లుండుటచేత నిది తుచ్ఛముగా నెంచఁబడు చుండెను. కార్యవశమున నొకానొకప్పుడు వారు దీనినిఁ బ్రయోగించినను దీని కంతగాఁ బ్రసిద్ధి రాలేదు.

మహాభారతమునందు ద్రోణపర్వమున—

"ధర్మయుద్ధ మయుధ్యంత ప్రేప్సంతో గతి
ముత్తమాం।

నత్రతాసీ దధర్మిష్ఠమశస్త్రమ్యుద్ధమేవవా
న తత్ర కర్ణనాళీకో నాలిప్తో న చ వస్తుకః॥"

అని తుపాకులు మొదలగు తుచ్ఛాస్త్రములు మొదలగునవి యేవియు లేని ధర్మయుద్ధమే చేయఁబడినదని చెప్పఁబడియున్నది.

**నాళీజంఘుఁడు**— బకము (కొంగ). దీనికి రాజధర్ముఁ డనుబిరుదనామము కలదు. దీనికొక దైత్యుఁడు చెలికాఁడుండెను. గౌతముఁ డను నొక విప్రుని కొకదుర్మార్గుం డగు సుతుఁ డుండె నఁట. వాఁ డీబకము నర్థింపఁ దనచెలికాఁడగు దైత్యునితోఁ జెప్పిధనమిప్పింపఁ గైకొని మాంసాహార మపేక్షించి యా బకమునే చంపఁబోయెనఁట. దాని మిత్రుండగు దైత్యుం డది చూచి బకమును బట్టుకొని రక్షించి యాకృతఘ్నునిఁ బరిమార్చె నఁట.

**నిండుకుండ తొణఁకదు**— ఆంధ్రలోకోక్తి.

**నిండుసున్న**— అనుస్వారము చూ.

**నింబపంచకము**— ఆయుర్వేదవైద్యశాస్త్రమున నేలవేము, వేఁపచెక్క, తురకవేఁప, కరివేఁప, పెదమ్రాను (అనఁగా పెనువేఁప) చెట్లకు నింబపంచక మనిపేరు.

**నింబార్కమతము**— ఈమతాచార్యునకు భాస్కరాచార్యుండని పేరు. కాని యీ మహనీయునకు నింబార్కుం డని ప్రసిద్ధమగు వాడుకనామ ముంట నీమతమునకు నింబార్కమతమని పేరు ప్రసిద్ధియయ్యెను. ఆతండే యీ మతకర్త. సూర్యసిద్ధాంతకర్తయగు భాస్కరాచార్యుం డీతఁడే యని వాడుక గలదు.

నింబార్కుఁడు సూర్యునియంశమున జనించె నందురు. ఈతనిమతానుసారము వేదభాష్యమీమహాత్ముఁడు రచించెననియు, అది ఔరంగజేబు నాజ్ఞమేర కగ్నిపా ల్సేయఁబడినవాట్లతోబాటు రూపుమాసె ననియు నొకవాడుకయుం గలదు. భాగవతము నీమతస్థు లెక్కువప్రపత్తితో గౌరవింతురు. ఈ మతము వైష్ణవమతములలో నొకటి. విష్ణుపారమ్యము. వీరు రాధాకృష్ణులను పూజింతురు. గోపీచందనమునూర్ధ్వపుండ్రములం ధరింతురు.

గీతగోవిందమును రచించిన జయదేవకవి తమమతమునకుం జేరినవాఁ డని యీమతస్థు లందురు. అట్లగునేని ఇది చైతన్యమతమునకు దగ్గఱమతమై యుండవలయును. వీరును జీవాత్మను రాధ యగునాయికగాను, పరమాత్మను పతిగాను సంభావింతురు. జగదీశ్వరుఁ డొక్కఁడే యున్నాఁడనియు ఆవిగ్రహముంజూచి భూలోకమున నెట్లానందించు చుందురో అట్లే పరలోకమునందునను పరమాత్ముం డగు శ్రీకృష్ణుం గాంచి యానందింప నగు ననియు, అందుకు భక్తియే సాధన మనియు, రాధాకృష్ణులను జీవాత్మపరమాత్మల కైహికభోగము లాపాదింపరాదనియుఁ జెప్పఁబడినది.

ఈ మతగ్రంథములు గిరివ్రజము, రత్నమంజరి, రత్నమాల, సిద్ధాంతరత్నాంజనము, సేతుకము నను నవి గలవందురు.

**నికారగువా ప్రజాపాలనదేశము**— (Nicaragua Republic) ఇది మధ్యఅమెరికాయందలి ప్రజాస్వపరిపాలనదేశము. ౪౯-౨౦౦ చతురపుమైళ్ల వైశాల్యము గలది. ఇం దించుమించు ౪౪౦౦౦౦ జనులు వసించుచున్నారఁట. Leon పురము ప్రభుత్వస్థాన మున్న ప్రధానపురము. (మధ్యఅమెరికా చూ.)

**నికారాగువా ప్రభుత్వము** (Nicaragua)— మధ్యఅమెకా ఖండములోని ప్రజాప్రభుత్వదేశము. నలువదితొమ్మిదివేల రెండువందల చతురపుమైళ్ల వైశాల్య మనియు, ఏడులక్షల ప్రజలు జనసంఖ్యయనియుం జెప్పఁబడినది.

**నికుంపశాఖక్షత్రియులు**—(క్షత్రియ కులము చూ.)

**నికుంభుఁడు** తండ్రి కుంభకర్ణుఁడు. అసురుఁడు. లంకాయుద్ధమున హనుమంతునిచే నిహతుఁ డైనవాఁడు. మఱియు నిక్ష్వాకువంశ క్షత్రియుఁ డగు హర్యశ్వుని కుమారునకును నికుంభుఁ డనుపేరు కలదు. కుమారుఁడు బర్హిణాశ్వుఁడు లేక అమితాశ్వుఁడు, లేక సంభవాశ్వుఁడు, లేక సంహతాశ్వుఁ డనుపేర్లు కలవాఁడు.

**నికోటైన్** (Nicotine)—ఇదిపొగాకునందుండెడి విషము. ఇది తొలుత రంగులేనిదిగా నుండు ద్రవమేకాని మహావాయుపథమునకు బహిరంగపఱచిన పచ్చనిధాతువు కలదిగ నగును. లోనికిచ్చిన ప్రాణము దీయును. విషములలోనిదిగాఁ జెప్పఁబడినది. చుట్టగాల్చుతఱి నిది కాలిపోవును గాన నంత యపాయకరము గాదఁట.

**నిక్నేమ్ (మాఱుపేరు లేక పెట్టుడు పేరు)** Nick Name—ఒకనికి తలిదండ్రులు బాల్యమునందిడిన వ్యావహారికనామము వానికిఁ బేరగుచుండును. భరతదేశమున నామకరణమునందు ఏనక్షత్రమున జన్మించెనో దాని కనుగుణమైన నక్షత్రనామముకూడ నుంచెదరు కాని అది వ్యవహారమున వాడుక నందియుండుట లేదు. క్రైస్తవులందు రామానుజీయ వైష్ణవ దీక్షయందు మతసంబంధనామములిడఁబడుచుండును. కాని వైష్ణవదీక్షానామము వాడుకలోనికి వచ్చుచుంటఁ గానరాదు. ఒక రొనర్చిన ఘనకార్యముల నీచకార్యముల మేరకు వారికి లోకులు వేఱొక పెట్టుడుపేరు లేక మాఱుపేరు పెట్టుచుండుటయు, అది వాడుకనంది ప్రసిద్ధమగుటయు నచ్చటచ్చట జరుగుట గాననగుచుండును. ఇట్టిపే రాంగ్లమున(Nick Name) (నిక్నేమ్) అనంబడుచున్నది. నిక్నేమ్సు మంచివియైనను కావచ్చును. కొన్ని బిరుదము లవే చెల్లుటయుం గలదు. కొన్ని చెడ్డపేర్లు కొన్ని వెక్కిరింత (హేళన)పేర్లు కూడ నైయుండును. ఎట్లున్నను అట్టిపేర్లు నిక్నేమ్సనం బడుచుండునదియే. భరతదేశమున నిట్టి యాచారమున్నను, అమెరికాదేశమునవివి రాజకీయవ్యవహారములందుఁ గూడ వ్యాపించియుండుట గాన నగుచుండెడిని. కొన్ని జాతికంతకుం గల్గి, విదేశస్థులచే వాడఁబడుచుండును. కొన్ని ప్రత్యేకవ్యక్తులకుం జెంది వ్యవహరింపఁ బడుచుండును. కొన్ని దేశములకుఁ, గొన్ని పట్టణములకుఁ జెంది వాఁడబడుచుండును.

కలకత్తానగరమున కాంగ్లమున City of Palaces.

కాశ్మీర్ దేశమునకుకుంకుమపువ్వుల దేశము.

బెల్జియమ్ దేశమునందలి ఘెంటుపురమునకు City of flowers.

శ్రీజగన్నాథము (పూరీ) నకు యాత్రికుల యూరు.

జపాన్ దేశమునకు Land of Raising Sun.

జావాద్వీపమునకు Fairy land అనియు, Land of spirits అనియు నిక్నేమ్సు కలవు.

గ్రీసు దేశమునకు Land of Currents.

ఢిల్లీనగరమునకు Imperial City.

ద్వారకాపట్టణమునకు శ్రీకృష్ణునిపట్టణము.

నేపాలదేశమునకు కస్తూరిదేశము.

నార్వేదేశమునకు Land of Vikings.

ఫరాసుదేశమునకు Land of Fraternity, Equality, and Liberty.

బనారస్ పట్టణమునకు Holy City.

బొంబైనగరమునకు Commercial capital.

బెర్లిను (జర్మనీ) నగరమునకు City of Storks.

బ్రూజెస్ (బెల్జియమ్) పట్టణమునకు Dead City.

మైసూరునగరమునకు City of Electricity

బెల్జియము దేశములోని మెల్లిన్సుపురమునకు Town of Moon Quenchers.

ఫిన్లాండు దేశమునకు Land of Thousand lakes.

అమెరికా సంయుక్త రాష్ట్రములకు Land of Strips and Stars

సిమ్లానగరమునకు Viceroy's City, City of Political atmosphere.

సింహళద్వీపమునకు రాక్షసరాజ్యము.

స్విజర్లాండు దేశమునకు Play ground of Europe, Land of Avalanches.

హరిద్వారపురమునకు స్వాన్నాలయూరు. విష్ణుపాదనగరము.

హృషీకేశమునకు బైరాగులపట్టణము.

హైదరాబాదునగరమునకు Aristocrati City.

హాలండు దేశమునకు Land of Tulips Land of Windmills and Dykes.

అలహాబాదు (ప్రయాగ) పురమునకు City of Holy Baths, City of Distences.

ఈజిప్టు దేశమునకు Land of Pyramids

ఐర్లాండు దేశమునకు Land of Humours and Emotions.

ఇటలీదేశపు ఫ్లారెన్సునగరమునకు City of Flowers.

ఐస్లాండు దేశమునకు Land of Guishers Land of Ponies నిక్నేమ్సు.

స్కాట్లండు దేశములోనిఅబ్బర్డీనుపురమునకు Granite City.

ఈజిప్టు దేశలోని అలెగ్జాండ్రా పురమునకు Delta City.

ఈజిప్టు దేశములోని కైరో నగరమునకు ఉమ్ముద్దున్యా. (భూమికి మాత యని యర్థము).

మెసపొటేమియా దేశపు బాగ్దాదుపురమునకు City of Caliphs.

పాలస్తినా దేశపు జరూసలెమ్ పురమునకు City of Peace అనియు, City of the Great King అనియు, City of Herod అనియు నిక్నేమ్సు.

స్కాట్లండు దేశపు ఎడింబరో నగరమునకు Maiden Town.

జిబ్రాల్టరు దుర్గమునకు Key of Mideteranian.

క్యూబా దేశపు హావనాపురమునకు Pearl of Antelles.

ఐర్లాండు దేశపు లిమరిక్ పురమునకు City of Violated Treaty.

ఇంగ్లాండు దేశపు లండన్ నగరమునకు Modern Babylon అనియు, City of Masts అనియుం బేరులు.

ఇటలీదేశపు మిలాన్ పురమునకు Little Paris.

చీనా దేశపు పీకిన్ నగరమునకు Celestial Town.

కనడా దేశపు క్యూబిక్ పురమునకు Gibralter of America.

ఇటలీదేశపురోమకపురికి Eternal City, City of Seven Hills.

ఇటలీదేశపు వెనిస్ నగరమునకు Bride of the sea, Town of Gondola Roads.

ఆంగ్లదేశపు సేద్యగానికి John Bull.

ఐర్లాండు దేశపు శూరునకు Vat.

డెన్మార్కు దేశపు కూర్రులకు Danish woulves.

అమెరికా సంయుక్తరాష్ట్ర) బాల్టిమోరుపురమునకు Monumental City.

,, బోస్టనుపురమునకు Puritan City యనియు, Hub of the Universe అనియు పేరులు.

,, బ్రూక్లీనుపురమునకు City of Churches.

,, క్లీవ్లాండుపురమునకు Forest City.

,, హన్నిబాల్పురమునకు Bluff City.

,, హోలియోక్పురమునకు Paper City.

,, మిల్వాకీపురమునకు Cream City.

,, న్యూఓర్లీన్సు పురమునకు Crescent City.

,, న్యూయార్కునగరమునకు Gotham అనియు, Empire City యనియు నిక్నేమ్సు.

,, ఫిలడెల్ఫియానగరమునకు Quaker City యనియు, City of Brotherly Love అనియు పేరులు.

,, పిట్సుబర్గుపురమునకు Iron City, Smokey City.

,, పియోరియాపురమునకు Whiskey Town.

,, రిచ్మండుపురమునకు City of Seven Hills.

,, సాన్‌ఫ్రాన్సిస్కో పురమునకు Golden City.

,, సాల్టులేక్సిటీ పురమునకు City of Saints.

,, స్ప్రింగుఫీల్డుపురమునకు Flower City.

,, టోలెడో పురమునకు Corn City.

అమెరికాసంయుక్తరాష్ట్రములందలి వేర్వేరుసీమలు (States) నివాసముగాగల ప్రజలకు సాముదాయకము లగు నిక్నేమ్సు.

| | | |
|---|---|---|
| అలబామా | స్టేటు నివాసులకు | Lizards |
| కాలిఫోర్నియా | ,, | Gold Hunters. |
| కొలరెడో | ,, | Silverites. |
| కనెక్టికట్ | ,, | Nutmegs. |
| డెలావారా | ,, | Blue hen chickens. |
| ఇండియానా | ,, | Hoosiers. |
| ఇయోవా | ,, | Hawkeyes. |
| కాన్సాస్ | ,, | Jayhawkers. |
| కెంటకీ | ,, | Corncrackers. |

| | | |
|---|---|---|
| మేరీలాండు | స్టేటునివాసులకు | Clamthumpers. |
| మిచిగాన్ | ,, | Wolverines. |
| మిస్సోరీ | ,, | Bullions. |
| | ,, | Sage hens. |
| నార్తు హెంపుషైర్ | ,, | Granite Boys |
| ఓహియో | ,, | Buckeyes. |
| వెస్టు వర్జీనియా | ,, | Snake deggers. |

ఇట్లే అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రెసిడెంట్లకుఁగూడ ఈనిక్నేమ్సు తప్పలేదు.

President: Washington—Father of his Country.
... Adams—Colossus of independence.
... Jefferson—Sage of monticello—Long Tom
... Madeson—Father of Constitution.
... Q. Adams—Old man eloquent.
... Harrison—Old Tip.
... Tyler—Young Hickory.
... Buchanan—Old public Functionary.
... Garfield—Martyr President and first gentleman in the land.
... Mackinly—Advance Agent of Prosperty.
... Roosevelt—Rough Rider Teddy.

**నిక్షేపరాయఁడు**— విగ్రహపుష్టి గల్గు నప్రయోజకుఁ డనిభావము. పైకి దర్పముగ నగపడుచున్న చేతగానివాఁ డనుట కీఉక్తిని వాడుచుందురు. ఇది హేళన.

**నిగీరియాదేశము**— ఇది ఆఫ్రికాఖండమున సౌడాన్ లేక నిగ్రీటియా దేశమున నున్నది. ఇందు సోకోటోస్టేటు, బోర్గూస్టేటు అని రెండు స్టేట్సు చేరియున్నవి. నిగెరియా Royal Niger Company వారి టెరిటరీ యనంబడుచున్నది. (ఆఫ్రికాఖండము సౌడాన్ లేక నిగ్రీటియా దేశము చూ.)

**నిగ్రీటియా**—(సౌడాన్ లేక నిగ్రీటియా దేశము చూడుఁడు.)

**నిఘంటువులు**—ఏభాషయం దైనను నిఘంటువు లుండుట ఆభాషాప్రాశస్త్యమును దెల్పెడిని. శబ్దము, దానియుత్పత్తి, దాని రూపనిష్పత్తులు, వానియర్థములం దెల్పు గ్రంథములు నిఘంటువు లనంబరఁగును. సంస్కృతభాషానిఘంటువులందు పైసంగతులే గాక ఆశబ్దము ఏలింగమో, ఏఅంతమో కూడ వివరింతురు. వీటికిందోడుమహానిఘంటువు(Laxican)లందు ఏయేగ్రంథములం దాశబ్దము లేయర్థముల నోసంగ నెట్లు ప్రయోగింపఁ బడినవియుం దెల్పుదురు. భరతదేశపు నిఘంటువు లాదికాలమునుండియు సూత్రరూపమునను శ్లోకరూపమునను నుండుచువచ్చినవి. ఆంధ్రభాషకుఁ బద్యరూపమునను, ఇటీవల మాటలుగను, (వాక్యములుగను) నిఘంటువులు వ్రాయంబడినవి.

సంస్కృతభాషానిఘంటువులం దమరసింహుఁడను బౌద్ధపండితునిచే శ్లోకరూపమున విర

చింపఁబడిన అమరకోశ మను వాడుకనామము నందిన నామలింగానుశాసననామక నిఘంటువు భరతదేశమునం దెక్కువ వ్యాపక మందియున్నది. ఇందుఁ గానంబడని కొన్ని శబ్దములకు అమరశేష మని వేఱొకగ్రంథము కలదు. అమరకోశవ్యాఖ్య యనందగిన గురుబాలప్రబోధిక యనంబడు నిఘంటువొకటి కలదు. ఇంక ధనంజయ నిఘంటువు, నానార్థరత్నమాల, బహురూపకోశము, విశ్వకోశము, మేదినీకోశము, హారావళీకోశము, ఏకాక్షరకోశము, ద్వ్యక్షరకోశము, త్ర్యక్షరకోశము, మొదలగు కోశములు లెక్కకు మితిమీఱునట్లు గానంబడుచున్నవి.

ఇవి గాక వైద్యశాస్త్రమునకు ధన్వంతరికృతమగు ధన్వంతరినిఘంటువును, ధనంజయకృతమగు ఓషధీగుణకల్పమను వనౌషధినిఘంటువొకటియు, రాశినిఘంటువు, నక్షత్రనిఘంటువు, గ్రహనిఘంటువు మొదలగు పెక్కుజ్యోతిషశాస్త్రపరిభాషల నిఘంటువులును గలవు. ఇటీవల మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యు లయ్యవార్లుంగారు రచించిన సర్వశబ్దసంబోధినియు, ఆప్టీగారు రచించిన సంస్కృతాంగ్లకోశమును సుప్రసిద్ధములుగ వాడుక నందియున్నవి.

శ్రీవిజయనగర భూపాలురలో నొకరగు ఆనందగజపతి మహారాజుగారి పోషణము మేరకు తారానాథ తీర్థవాచస్పతి యనంబడిన మహావిద్వాంసుఁడు రచించిన వాచస్పత్యమును, దానినుండి సంగ్రహించి యామహనీయుఁడే వేఱుగవ్రాసిన యొకనిఘంటువును ఉత్తమకోశములై దనరుచున్నవి. ఇంక నిట్టివెన్ని యోగలవని యూరకుండుటయేసమంజసము.

ఇంక తెలుఁగు నిఘంటువులంగూర్చి యోచించిన నవియుఁ గొన్ని పద్యములుగను, గొన్ని మాటలరూపమునను ఉండుట గానవగుట నిదియు సంస్కృతపద్ధతియే యని తోపకపోదు. తర్వాతకాలమున రచింపఁబడిన నిఘంటువులు శబ్దార్థములు మాటలుగనే యుండుట గానవగును.

తెలుఁగు భాషయందు నిఘంటువులు అమరకోశమునకువలె వర్గక్రమమునఁ గాక వర్ణక్రమముననే యుండుట గానవయ్యెడిని. బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరమును, ఓగిరాల జగన్నాథకవికృతమైన శుద్ధాంధ్రపదపారిజాతమును, రంగనాయకులు శ్రేష్ఠిచే విరచితమైన ఆంధ్రదీపికయును, బ. సీతారామాచార్యవిరచితమైన వైకృతదీపికయును, మహాకాళి సుబ్బరాయ విరచితమైన శబ్దార్థచంద్రికయును, మాటలుగ నున్న తెలుఁగు నిఘంటువులందగ్రగణ్యములుగఁ జెప్పం బడెడిని.

మఱియు కోటి వెంకనార్యకృతమైన ఆంధ్రభాషార్ణవనిఘంటువు, రాజా త్యాడ పూసపాటి వీరపరాజ దక్షిణకవాట దుగరాజా బహద్దరు వారు రచించిన ఆంధ్రపదాకరనిఘంటువును, పైడిపాటి లక్ష్మణకవిచే విరచితమైన ఆంధ్రనామసంగ్రహమును, అడిదము సూరకవిరచించిన ఆంధ్రనామశేషమును, రంగకవిచే విరచితమైన సాంబనిఘంటువును, వెంకనకవిచే విరచితమైన వేంకటేశాంధ్రమును పద్యములుగనున్న తెలుఁగునిఘంటువులం దగ్రస్థాన మాక్రమింపఁ దగినవిగ నెన్నంబడి యున్నవి.

పద్యరూపమున రచింపంబడిన ఆంధ్రభాషాభూషణము, ఆంధ్రభాషార్ణవమును, అడిదము సూరకవి రచిత కవిజనరంజన మనంబరఁగునవియు, మామిడి వెంకయ్యగారి ఆంధ్రదీపికయును, బహుజనపల్లి సీతారామాచార్యవిరచితమైన బాలచంద్రోదయమును, ఆంధ్రభాషకైన గ్రంథములే. ఉత్కల (ఓఢ్ర) భాషయం

దిటీవలనే ప్రహరాజపండితమహాశయుని యాధిపత్యమున "బిష్వకోశో" యనంబడు మహానిఘంటు వొకటి వ్రాయంబడుచున్నదని వినుచున్నాము. తమ్మిళమునను ఇట్టిగ్రంథ మొకటి వ్రాతయం దున్నదని విందుము. ఇట్లె వేర్వేరుభాష లిప్పుడు మేల్కొని ఇట్టిగ్రంథముల వ్రాతకుం గడంగుచున్నవని వినుచున్నాము. వంగభాషయందు హిందీభాషయందు నిదివఱకే నిఘంటువులు పెక్కు లున్నవఁట. ఉరుదు, పారశీ మొదలగు భాషల కిదివఱకే వ్రాయంబడినవి. ఆంగ్ల భాషయందు నిఘంటువులు, మహానిఘంటువులు, విజ్ఞానగ్రంథములు మితిమీఱి యుండుట సుప్రసిద్ధమే. ప్రభుత్వావలంబన మందినభాష కేమి కొదువ?

**నిచకుఁడు (నేమి లేక నేమిచక్రుఁడు)**—పరీక్షిత్తు సంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి అసీమకృష్ణుఁడు. కుమారుఁడు ఉక్తుఁడు.

ఈతనినాఁడు హస్తినాపురము ఏటఁ గలిసిపోయె ననియు, పిదప కౌశాంబీనగర మీప్రభువునకు రాజధాని యయ్యె ననియుఁ జెప్పఁబడినది.

**నిచయాత్మకము**— ఆయుర్వేదవైద్యశాస్త్రమున సన్నిపాత రోగభేదములలో నొకటి. సన్నిపాతమన త్రిదోషము లనంబడు వాత పైత్య శ్లేష్మముల మూఁడింటియొక్క ప్రకోప మని యెఱుంగునది.

**నిచ్చెనక్రింద దూరుట అయోగ్యము**- ఒకగోడకు నిచ్చెన ఆనించియుండ దానిక్రింది నుండి దూరి నడుచుట శ్రేయముగాదని భరతదేశమున ప్రతీతి కలదు. ఇందుకుఁ గారణము లందఱికాళ్లను తనపై నానుమెట్లుగల నిచ్చన క్రిందినుండి నడుచుట హేయమని తెలుచున్నది.

ఐరోపా దేశముల తొలింటికాలమున నేరస్థులను నిచ్చెనమెట్ల కురిదీయు నాచార ముండియుంట నిచ్చెన క్రిందుగ నేగుట యమాంగళ్యముగఁ దలఁపఁబడుచుండిన దఁట. క్రైస్తవమత ధర్మమున నిచ్చెనక్రింద దూరుట దోషమని పరిగణింపఁ బడెడిని. తొల్లి ప్రభువగు నేసు క్రీస్తు సిలువవేయఁబడిన పిదప నా కళేబరము దింప ఆయనశిష్యులు నిచ్చెనవేసికొని పైకెక్కి దింపఁ బోయి రఁట. పిశాచములు నిచ్చెనక్రిందఁ జేరి దానిని వెనుకకుం దిరుగఁద్రోయ ప్రయత్నములొనర్చినవఁట. గాన నిచ్చెనక్రింద దూరుట దోషముగఁ బరిగణింతురు.

ఎత్తగుతావుల రంగువేయ రంగుపాత్రం గొని నిచ్చెన నెక్కి రంగులువేయుతఱి,నిచ్చెనక్రింద నుంట కుంచెనుండి రంగుజాఱి మీఁదఁ బడుట మూలముననో, రంగుపాత్ర చేజాఱి మీఁదఁబడుట మూలముననో అదృష్టహీనత నిచ్చెనక్రింద దూరువానికి సిద్ధింపనోపునని ఐరోపా దేశముల నొక లోకోక్తి కలదు.

**నిచోరాళిగోత్రము**- ఔతథ్యఉపగణము చూడుఁడు.

**నిజ మాడితే నిష్ఠురము**— ఆంధ్రలోకోక్తి.

**నిజము నిలకడమీఁద తెలియును**- ఆంధ్రలోకోక్తి.

**నిజాము లేక నైజాము ప్రభువు గారు**— వీరు హైదరాబాదురాజ్య మేలు మహాప్రభువులు. వీరికి "His Exalted Highness the Nizamulmulk" అనియు, "Faithful Ally of British Empire' అనియు బిరుదములు వంశానుగతములుగఁ గలవు. ఇప్పటి నిజాంప్రభువు అసఫ్‌జాహి నృపవంశపు ప్రభువులలో నేడవప్రభువు. ప్రపంచమంతటిలో నెక్కువ భాగ్యవంతుఁ డని చెప్పఁబడినవాఁడు. వీరు పరిపాలించు రాజ్యము

౮౨,౬౯౮ చతురపుమైళ్ళ వైశాల్య మనియు, అది గ్రేటుబ్రిటనునకు వైశాల్యమున సరిపోవు ననియుఁ జెప్పంబడినది. ఇందు పదునాల్గు మిలియనుల ప్రజ లున్నారఁట. అందు నూటికి డెబ్బదిమందికి పైగా హిందూమతస్థు లుందురఁట. వీరికి నమునకు రాఁబడి ఒకలక్ష ఏఁబదివే లందురు. నిజాముల్మొల్కనిన ఆంగ్లమున Discipline of the Realm అని యర్థమగు ననుచున్నారు. హైదరాబాదానృప వంశమునకు అసఫ్‌జా నృపుఁడు మూలపురుషుఁడు. ఆయన కొంతకాలము ఔరంగజేబు చక్రవర్తికడ సేనానిగ నుండి, పిదప హైదరాబాదునకు రాజప్రతినిధిగ నేతెంచి స్వతంత్రుఁడైనవాఁడు. హైదరాబాదు నైజాముప్రభువులు ఆదిని ఫ్రెంచివారికి సాహాయ్యుండి, పిదప ఈస్టు ఇండియాకంపెనీవారికి దన్నుగ నిలిచి, విశ్వాసపాత్రులుగ నుంట వారికి Faithful Ally of the British Empire అనుబిరుద మీయంబడెనఁట. వీరు విద్యాభిమాను లనియు పేరందినవారు. వీరి ఉస్మానియావిశ్వవిద్యాలయము సకలకలలను ఉర్దూభాషయందు నేర్పుచున్న సంస్థగఁ జెప్పంబడినది.

**నిజామువంశనృపులు**— తొల్లింటి బహమనీరాజ్యము క్రీ. వె. ౧౪౮౯ లో ఐదు చిన్నరాజ్యములుగ చీలుటతో నేర్పడిన రాజ్యములలో నొకటి యగును. అహమద్నగరు రాజ్యము నేలిన ముసల్మానునృపులలో చాందు బీబీ సుప్రసిద్ధురాలు.

**నిట్చేవో**— రష్యాదేశమున నిట్చేవో పదముయొక్క వాడుక అధికము. దీనికి ఫరవా లేదు అనియర్థము. ఏది ఎట్లుజరిగినను నిట్చేవో, ఆలస్యమైనను నిట్చేవో, లోప మేదివచ్చినను నిట్చేవో, నిట్చేవో అర్థము గ్రహింపఁ గల్గిన వారు రష్యావారి నెఱుంగఁ గలరను సామెత కలదు.

**నితంతునిపుత్రులు**--వీరు అతిసారుఁడు, సాల్వేయుఁడు మొదలగువారు. (ఎందఱో సరిగాఁ దెలియకున్నది.) అందఱును యను కాంత నొక్కరితనే పెండ్లాడిరి.

**నితుందిలగోత్రము**— విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు.

**నిత్యతార**—(నక్షత్రములు, చరిత్ర చూ.)

**నిత్యనక్షత్రము**-- (నక్షత్రములు చరిత్ర చూడుఁడు.)

**నిత్యము చచ్చేవానికి ఏడ్చేవారెవ్వరు?**—ఆంధ్రలోకోక్తి.

**నిత్యలు (షోడశనిత్యలు)** — దేవీఖడ్గమాలయం దిట్లు చెప్పఁబడినది.

౧ కామేశ్వరి, ౨ భగమాలిని, ౩ నిత్యక్లిన్న, ౪ భేరుండ, ౫ వహ్నివాసిని, ౬ మహావజ్రేశ్వరి, ౭ శివదూతి, ౮ త్వరిత, ౯ కులసుందరి, ౧౦ నిత్య, ౧౧ నీలపతాక ౧౨ విజయ, ౧౩ సర్వమంగళ, ౧౪ జ్వాలామాలిని, ౧౫ చిత్ర, ౧౬ మహానిత్య.

**నిత్యానిత్యవివేకశాంతము**— దీనికి ఆత్మానాత్మవివేకశాంత మనిపేరు. (సాధనచతుష్టయము చూడుఁడు).

**నిదాఘుఁడు ఋషి** — పులస్త్యుని కుమారుఁడు; ఋభుని శిష్యుఁడు.

**నిద్ర**—ఎవ్వ రెవ్వరి శరీరస్థితింబట్టియు, మనస్థితింబట్టియు వారివారికి నిదుర కల్గుచుండును. పనిపాటులు లేక పగలు నిద్రించువారికి రాత్రులందు నిద్ర తక్కువగ నుంట సహజమే. రాత్రులందు తొలుదొలుత గాఢనిద్ర పట్టుటయు సహజమే. దానిని పాశ్చాత్యశాస్త్రవేత్తలు Beauty sleep అనియు, Beautiful sleep

అనియు పేరిడియున్నారు గాఢనిద్రయందు స్వప్నము లుండవు. దానికిం గొంత తక్కువ గాఢమగు నిద్ర సర్వసాధారణనిద్ర యనంబడు చున్నది. ఇందు స్వప్నము లున్నను ఉండ వచ్చును. ఇదియుఁ గొంతవఱకు విశ్రాంతికర మైనదిగనే యెఱుంగవలయును. పిదపఁ జెప్పఁ దగినది కూర్కు (కునుకు) నిద్ర. ఇది చాల తక్కువబలము గల్గినది. ఇందు స్వప్నము లరుదుగఁ గల్గుచుండును. ఇందు మెళకువ యధికమై యుండును. గాఢనిద్రయందు మెళకువ చాల తక్కువగ నుండును గాన నిద్రనుండి లేపుట కధికధ్వని చేయవలసియుండును. తెల్లవాఱుజామున నిద్ర కూర్కునిద్రగ నుండును. కోడి, కాకి, యఱచినధ్వనికే మెళకువ గల్గునంతటి బలహీన మైనది. ఇంక ప్రాతఃకాలపు వెల్గు మేల్కాంచఁ జేయునదియే. బయటనిదురించు పశుపక్ష్యాదులు వెల్గునుండియే మేల్కాంచు నఁట. పసిబాలు రలసినకతన గాఢ నిద్రం జెందుటయు నెల్లరెఱింగినదే.

**నిద్ర మేల్కొనుట—** నిద్ర విశ్రాంతికరము. పగలంతయుఁ బనిచేసి యలసటవలన గల్గినబడలికఁ దీర్చి తిరుగ బలమొసంగ రాత్రులందు నిద్ర యవసరము. ఇది మానవశరీరధర్మముగా నెఱుంగఁ దగినది. పగలు వ్యయమైన శరీరత్రాణ నిద్రయందు విశ్రాంతినుండి తిరుగ శరీరమున బలపడుచుండును. వలయునంత నిద్రకు పిదప మెళకువ తనంతటనే గల్గుట సహజము. ఇంక పసిబాలుర కీనిద్ర యెక్కువయవసరము. గొప్పగొప్పవైద్యవిద్యావిశారదులగు పరిశీలకులు పసిబాలు రాహారము వలన నిద్రయందే యెదుగుచుందు రని నుడివి యున్నారు.

పసిబాలుర నిద్రంగూర్చి యొకనమ్మకము దేశదేశములందు వ్యాపకము గాంచియున్నది. బాల్యమున మనోబలము, బుద్ధిబలము చాల కుంఠును గాన నిద్రయం దెక్కువకాలము గడచుచుండుతఱి పెద్దవా రది కన్పెట్టి వారిని లేపి యాహార మిడుచుండుట పద్ధతిగా నేర్పడి యున్న దని యెల్లరెఱింగినదే. కాని ఇటీవల పరిశీలనలు, నిద్రకుం బిదప మెలకువ గల్గుట యన నిద్రయొక్క యర్వా ఫలమే యనియు, బాలు రవసరమైనంతకన్న నధికముగ నిద్రింపఁ జాల రనియు, నిద్రించుచుండుట ఆశరీరమున కవసరమై యుండియే యనియు బయల్పఱచి నవి. ఎవరో మొద్దునిద్దురగల బాలురును రోగముగలవారును దక్కఁ దక్కినవారు కదలిక సడికి మేల్కాంచుచునే యుందురు. నిద్రకుఁ గారణ మలసట యని మనసునం దుంచుకొనుట చాల సమంజస మని తోఁచెడిని.

**నిద్రయందు శ్రోత్రేంద్రియపుపని—** నిద్రయందు శ్రోత్రేంద్రియము పనిచేయుచునే యుండును గాని, అనఁగా ధ్వనులు చెవుల లోనికిం జేరి నాళములగుండా మేధస్సున కరుగును గాని అది విశ్రాంతిఁ గొని నిద్రించుచుంట చైతన్యశక్తి లేకయుండుం గాన ఇ యల్లే వృథాయై యుండును. ఇవి చిన్నచిన్న ధ్వనులు. ఇంక మేధస్సును ఉలికించి లేపఁగల పెద్దధ్వని యగుతఱి పైపనియే నడిచి మేధస్సుంగూడ నిద్రనుండి మేల్కొనం జేసి చైతన్యము ఆధ్వనిని గ్రహింపఁ జేయును.

విషమువల్ల మేధస్సును చైతన్యశక్తినుండి తప్పించి నిదురింపం జేసినతఱి, ఎట్టిధ్వనియు దానిని లేపఁజాలదు గాన వినిపింపఁ జాలదు. నిద్రించువానిచెవియందు రహస్యముం జెప్పి స్వప్నముం గల్గింప నగునని ఇటీవల కనిపెట్టం బడినది గాన, స్వప్నములకు ధ్వనిగూడ కారణ మగునని తోఁచెడిని.

**నిద్ర లేక నిదుర, నిద్దుర**— శరీరమున కవస్థలుమూఁడు. జాగ్రదవస్థ (మెళకువ), స్వప్నావస్థ (కలఁ గనుట), సుషుప్త్యవస్థ (నిద్దుర). ఇందు నిద్రావస్థ విశ్రాంతి నిచ్చి మరునాఁ డుదయమునకు తాజా పఱచుటకుఁ గల్గుతాత్కాలిక విశ్రాంతి. ఇది సర్వప్రాణులకుం గల్గుచుండు నవస్థయే. ఇందు నోటిరుచి తప్పును. నేత్రములపై ఱెప్పలు మూసికొనును. శరీరస్థమగు మాంసఖండములందు బిగి తగ్గిపోవును. చైతన్యపటిమ కొంతవఱకు తగ్గును. నరములు తమతమపనుల నాఁపును. స్వేచ్ఛగ ఊపిరి యాడుచుండుటదక్క తక్కిన యవయవములు తమతమపనులను చేయుచుండుబాధ్యతయు తగ్గియుండుస్థితి కల్గును. నోటినుండి గ్రోక్కి గుటకలు వేయుచు ద్రవము మ్రింగుచుండుట మొకస్వాసు నిలచి యుండినను ఉండును. ఆఁగిపోయినను ఆఁగిపోవును. ఇట్లు ప్రతిరాత్రియు సంభవించుచు కొన్నిగంటల కాల ముండుచు శరీరమున కించుక వేఁడి అధికమగుటతో వదలి మెళకువగల్గుతఱి విడిపోయెడి యవస్థకు నిద్ర యనిపేరు. నిద్ర సంభవించుటకు శరీరమున మెదడు విశ్రాంతిని గొనవలసి యుండును. మలకోశమున ఉష్ణాధిక్యము లేక సమముగనుండి యుండవలెను.

పాదములు (అందు ముఖ్యముగ నరికాళ్లు), కర్ణరంధ్రములు ఇంచుక వేఁడిదగ్గి వెచ్చఁదనము గోరు స్థితి గల్గియుండ వలెను. శరీరపుబడలిక గాని జాగ్రదవస్థయందలి కార్యములందు విసుగుఁదలయో లేక విముఖతయో మనస్సునకుఁ గల్గియుండి విశ్రాంతియందు వాంఛ పొడముట కున్ముఖమై యుండుట గల్గవలయును. ఇత్తఱి నిద్ర వచ్చుచున్నదని యనుకొందుము. విధిలేక వీలుగాక అట్టిస్థితి గల్గుతఱి మాటలాడుట, కూర్చుండియుండుట తప్పనియదనున కునికిపాట్లుపడుట సంభవించును. కునికిపాట్లు నిద్ర మైఁగ్రమ్ముటయే గాని వేఱు కాదు.

నిద్రించుటయందు తారతమ్యములు కలవు స్వప్నములేని గాఢనిద్ర శరీరమునకు మిక్కిలి తేలికదనము నిచ్చును. చక్కఁగ జీర్ణమొనర్చి ఆఁకలి నుద్దేకింపఁ జేయును. శరీరబలమునకు నిర్బాధకస్థితి గల్గించి, మనస్సునకు వ్యాకులత లేని శాంతి నొసంగి,దృష్టి బలపఱచి, యోచనా శక్తిని దృఢపఱచును. స్వప్నములతో నిండిన నిద్రకుఁ గలఁతనిద్ర యని పేరు. ఇది పైపనులం జక్కఁగ జరుగనీయదు. నిద్రాభంగము గల్గించి నిద్రయందు లేపుట యసౌఖ్యకరమై, కొద్దిగనో గొప్పగనో నిద్రలేని గుణములం గల్గించునని చెప్పఁబడినది. నిద్ర పట్టకుండు జబ్బునకు Insomnia అని యాంగ్లమున పేరు. నిద్ర లేకుండిన శిరస్సునందు వేఁడి, నేత్రములందు భారము, శరీరమునందు బడలిక, నరములందు బలహీనత, ఇంచుక యజీర్తిలక్షణములు సంభవించును. ఇంక నివి యిట్లే యధిక మగు నేని ఒడలునొప్పి, తలబరువు, ఆవులింతలు, బలహీనత, బడలిక, భ్రమ, సోమరితనము, లేక చండితనము, రొంప, దగ్గు, వాతము గల్గునని మనస్సునకు సూచించెడిని.

పసిబాలురు దినమున పండ్రెండుగంటల కాలము నిద్రింపవలె ననియు, వయస్సు ముదిరినకొలఁది నిద్ర తగ్గుచుండు ననియు, బలము గల్గిన యౌవనకాలమున ఎనిమిది గంటల కాలము నిద్ర యవసర మనియు, వార్ధక్యము వచ్చినకొలఁది నిద్ర :తగ్గుననియుఁ జెప్పఁబడినది. వేసవికాలమున ఎండవేళల ఉష్ణాధిక్యమగుతఱి నిద్రించుట యవసర మనియు, ఉష్ణాధిక్యము లేక సౌఖ్యముగ నుండుతఱి పగటినిద్ర యనారోగ్యప్రదమైఅన్నమఱుగకపోవుననియు, వాతమును ప్రేరేపించి బద్ధకమును గల్గించు

ననియు, బుద్ధిమాంద్యము, దుర్బలత తోఁచఁజేయుననియుఁ జెప్పఁబడినది. ఇంక జ్వరము, ఉబ్బుజాడ్యము, అగ్నిమాంద్యము, పాండువు, వాతము, క్షయ,గలరోగులు పగలు నిద్రించుట కీడని చెప్పఁబడినది.

వైద్యులు బలముగలవాఁ డెన్మిది గంటలు నిద్రించుట యవసరమనియు నందురు. ఒకపరిశీలకుఁడు బాధ్యతగల పనులు జేయుచుండు బుద్ధిశాలి కాఱుగంటలు నిద్ర చాలు ననియు, ఆరోగ్యము పూర్తిగఁ గలవారి కెన్మిదిగంటలును, బుద్ధిబలము తగ్గినవారికి బాధ్యతలేనివారికి పది లేక పండ్రెండుగంటలు నిద్రకల్గుననియుఁ జెప్పియుండెను.నిద్రయందు కొందఱుగుఱ్ఱుపెట్టుదురు.కొందఱుకలవరింతురు. కొందఱులేచి నడుచుదురు.ఇట్టివన్నియునిద్రావిధానమునవికారములయొక్క-పరిణామములనికన్గొనఁబడినది. నిద్రకు పైత్యమువిరోధి. పైత్యోద్రేకము గల్గువస్తువులం దినిన నిద్ర రాకుండును. అధికముగ భుజించిన స్వప్నములు కల్గును. యోచన లధికమై విశ్రాంతిచాలకుండిన స్వప్నములుకల్గునందురు.

**నిద్ర లేకుండుట (జాగరము)**—మనుష్యులు నిద్రయే లేకుండిన తొమ్మిదిదినములు మాత్రమే జీవింపగలరని వైద్య, శారీరకశాస్త్రవేత్తలు కనిపెట్టియున్నారు. నిద్రబొత్తిగా పట్టనిజబ్బును ఆంగ్లవైద్యవేత్తలు ఇన్సోమ్నియా (Insomnia) యనెదరు.

ఎంత బలాఢ్యుడైనను ఎడతెగక తొంబది గంటలకాలము నిద్రపోకుండ నుండఁజాలఁడని పరీక్షలవలన తెలిసికొనిరి. ఇంతవఱకు నిద్రింపకుండ శరించి జాగరము సల్పిన ప్రాణాపాయకరమగువ్యాధి గల్గునని తేలినది. ఇంకను శరీరమున నీనాల్గురోజులలోనే చాలఘోరమగు మార్పులు గల్గు నందురు. ఆ మార్పులలో ముఖ్యమగునవి మేనుఅపరిమితముగ భారమగుట, బలము క్షీణించుట, జ్ఞాపకము నశించుట ఇవి అన్నియో కొన్నియో గల్గెడిని.

మధ్యమధ్య కొంచెము కునుకుపట్టుచు మెళకువ కల్గుచు మొత్తమున నిద్ర లేదనుటయందిన్నియాపదలు కలుగక పోవచ్చును. పూర్తియగు ఇన్సోమ్నియా యగునేని మూఁడవ దినమున మాటలే యుండవు. (నిద్ర చూ).

**నిద్రగన్నికచెట్టు**—(నిద్రభంగి చూ.)

**నిద్రభంగిచెట్టు (నిద్రగన్నికలేక అత్తపత్తిచెట్టు)**—ఆంగ్ల.Touch me not tree.

నిద్రభంగిచెట్టును నిద్రగన్నిక యనియు, అత్తపత్తిచెట్టనియు నందురు. దీనిపూవుల రంగులంబట్టి ఇది నాల్గు భేదములు కలదిగ వచింతురు గాని, అవి కానరాకున్నవి. దీనియాకులు సూర్యుఁ డుదయింపగనే విప్పుకొని సూర్యాస్తమయముతో ముడుచుకొనిపోవును. పగటియందు దీనియాకులు విడియున్న తరి దేనితోనైన దానిని దాఁకి గదల్చితిమేని తోడనే ముడుచుకొని తిరుగఁ గొంతవడికి విడును.

నిద్రభంగికి వింతగుణములు చెప్పంబడినవి. దీనిసమూలము పర్వదినములం దాదివారము గూడినతఱి తెచ్చి నీడ నెండించి, చూర్ణముచేసి, పుచ్చుకొనుచుండిన మొదటివారమున పురాణ జ్వరములు, పైత్యరోగములు నివారణ మగుననియు, రెండవవారమున పాండురోగము, మూలవ్యాధి నివారణ మగుననియు, మూఁడవ వారమున పొక్కువ్యాధి, పల్లికలు, పొలుసువాఱు చర్మవ్యాధి, కుష్ఠము తగ్గిపోవుననియు, మఱియు నట్టికాలముననే తీసిన నిద్రభంగివేఱు మెడచుట్టు ధరించిన మొండిదగ్గులు నివారణ మగుననియు, మొలచుట్టు ధరించిన వీర్యనష్టము నివారణమగు ననియుఁ జెప్పఁబడినది. దీనివేఱు రసము లేక కషాయము మూత్రకృచ్ఛ్రమును నివారించు నందురు.

నిద్రభంగియాకుపసరు రసదోషమును హరించును. పైన రాయుచుండిన ఒకబీజము హరించును. దుష్టమగు కురుపులను శుభ్రపఱచి కుళ్ళుట నాపును. గడ్డలం జితుకజేసి లేక కరఁగించి కురుపుల మాన్పును. శరీరరక్తము చెడి కల్గిన పైత్యము నివారించును. భగందర మను పుండ్లుమాన్పును. వ్రణములలోను వాట్లసెలలలోను పోయుటవలననవి మాన్పట్టును. దీనిసమూల కషాయము లేక చూర్ణము మేహశాంతి, పైత్యశాంతి గల్గించి, ధాతునష్టము నివారించి, వీర్య వృద్ధి గల్గించుగుణము కలదనియు, మూలవ్యాధి భగందరముల మాన్పి, జక్కఁగ పనిచేయునని యుం జెప్పఁబడినది.

**నిద్రాంగపథగోత్రము**— భరధ్వాజఉప గణము చూడుఁడు.

**నిద్రించినవానికాళ్లకు మ్రొక్కుట**— ఆంధ్రభాషాసాంప్రదాయార్థ పదము. ఎవరి కొఱకై యొకపని చేయఁబడునో ఆపనినిగూర్చి వారు గ్రహింపలేని యవస్థను దెలుప నీయుక్తిని వాడుచుందురు. (ఆంధ్రలోకోక్తి)

**నిద్రించుతఱి కనుఱెప్పలు వ్రాలియుండుట**— కనుఱెప్పలు వ్రాలియుండుట యన కండ్లు మూసికొనియుండుట యనిభావము. కండ్లు తెఱచుటకు కనుఱెప్పలను బ్రయత్న పూర్వకముగ నెత్తవలసి యుండును. నిదుర విశ్రాంతికొఱకై గల్గునది గాన శరీరావయవము లన్నియు తమతమ పనులను మాని విశ్రాంతి గైకొనెడిని. అట్లె కనుఱెప్పలును విశ్రాంతికై వ్రాలును. అత్తఱినే శరీరభాగమునను ఉత్సాహ శక్తి (Activity) మరుగుపడి యుండెడిని. మేధస్సుయొక్క కొన్ని భాగములు విశ్రాంతికై చైతన్యస్థితిని వదలియుండెడిని. రక్తస్రావము మొదలగు శరీరరక్షణ పోషణ కార్యములు, ఊపిరి మొదలగునవి కొన్ని యత్నావశ్యక ములు పనిచేయుచుండుం గాని యివి అప్రయత్నముగ తమకార్యములు నెఱవుకొనఁ గల్గునవి. అట్లె ఊపిరితీయుట కేయాటంకమును ఏప్రయత్నమును అక్కఱ లేదని ఎల్లరెఱింగినదే. విశ్రాంతికై నిద్రించుట గాన వెలుతురు కండ్లకుఁ గష్టముగఁ దోఁచి కనుఱెప్పలు వ్రాలుటయు వాటి కవసరమని తోఁపకపోదు. ఇంక నిశ్శబ్దస్థితి నిదుర కట్టి యవసర మనియే స్ఫురించెడిని. ఏలయన శబ్దము నిదురనుండి లేపగల్గును. ఇటీవల నిద్రించువానిచెవిలో రహస్యము జెప్పి కలను గల్గింప నగునని కన్గొనఁబడినది. ఇదియు శబ్దసంబంధముగనే యున్నది. స్వప్నము గాఢ నిద్రకన్న తక్కువ నిద్రయందు కల్గున దని ఇదివఱకే కన్గొనంబడినది.

**నిధులు (నవనిధులు)**— ౧ మహాపద్మము, ౨ పద్మము, ౩ శంఖము, ౪ మకరము, ౫ కచ్ఛపము, ౬ ముకుందము, ౭ కుందము, ౮ నీలము, ౯ వరము.

**నిధృవగోత్రము**—నిధృవగణము చూ.

**నిధృవగణము (కాశ్యపసంతతి)**— ౨ నిధృవగణమునందు౮౧గోత్రములు కలవు.

బోధాయన సూత్రోక్త గోత్రములు (౯౨). ౧ అగ్ని, ౨ అగ్నిశర్మాయణ, ౩ అప, ౪ అభూత్య, ౫ అవిశ్రేణ్యా, ౬ అగ్రాయణ, ౭ ఆతప, ౮ అనురాయణ, ౯ ఉత్తర, ౧౦ ఉదర, ౧౧ ఉల్కాయని, ౧౨ ఐతిశాయన, ౧౩ ఔటవృక్ష, ౧౪ ఔదలి, ౧౫ ఔపవ్య, ౧౬ ఔస్థకాయన, ౧౭ కవి, ౧౮ కంసాలాయన, ౧౯ కామ్బలోదరి, ౨౦ కాసలి, ౨౧ క్రోష్ట, ౨౨ కౌశికేయ, ౨౩ కాందాయన, ౨౪ గన్ధేషు, ౨౫ గోమాయన, ౨౬ గౌరివాయన, ౨౭ ఛాగవ్య. ౨౮ చాన్గరి, ౨౯ చైల, 30 జారమాత్స్య, 3౧ జీవంత, 3౨ దక్షపాణీ, 33 ధర్మాయణ, 3౪ ధూమలక్షణ, 3౫ ధూమ్ర,

౩౬ ధూమ్రాయణ, ౩౭ దేవ, ౩౮ దేవపాత, ౩౯ దేవి, ౪౦ నిధ్రువ, ౪౧ నైధ్రువ, ౪౨ పంక్చాయనిక, ౪౩ పాంచాల, ౪౪ పాథిక, ౪౫ పాలస్య, ౪౬ ప్రావర్య, ౪౭ పింగాక్షి, ౪౮ పౌలవి, ౪౯ బైదల, ౫౦ భాగురి, ౫౧ భాలందన, ౫౨ మాఠర, ౫౩ మంత్రిత, ౫౪ మహాచక్రేయ, ౫౫ మారాయణ, ౫౬ మాజ్ఞాలాయన, ౫౭ మాసవి, ౫౮ మితకుంభ, ౫౯ ముసల, ౬౦ మేషాతకి, ౬౧ రంభాణి, ౬౨ రోహితాయన, ౬౩ లాఘాయన, ౬౪ వార్ధకి, ౬౫ వార్ష్ణకాణి, ౬౬ వినుత్స్య, ౬౭ విషగణ, ౬౮ వైకర్ణి. ౬౯ వైకర్ణేయ, ౭౦ వైనశ్య, ౭౧ వైయకి, ౭౨ వైశంపాయన, ౭౩ వైశిప్రి, ౭౪ శంఖామిత్రేయ, ౭౫ శ్రీవస, ౭౬ సామశి, ౭౭ సాయస్వ, ౭౮ సావి, ౭౯ సుర, ౮౦ సురేభ, ౮౧ స్థూణ, ౮౨ సూప, ౮౩ సూర్య, ౮౪ స్థూలబిందు, ౮౫ స్వైరకి, ౮౬ సౌనఘు, ౮౭ సౌమ్య, ౮౮ స్థాలకేశి, ౮౯ హారిత్య, ౯౦ హృద్రోగ, ౯౧ హిరణ్యావాయన, ౯౨ హోత.

కాత్యాయన సూత్రోక్త గోత్రాలు(౪౫)

౧ అగ్నికర్మాయణ, ౨ అన్యకృత్, ౩ అశ్వవాతాయన, ౪ అహోగాయక, ౫ ఆగ్రాయణ, ౬ ఉపత్వాయని, ౭ ఔపప్రతిమ, ౮ కాచాయన, ౯ కాశ్వహాయన, ౧౦ కైకశి, ౧౧ కైరజ, ౧౨ కాశీదక, ౧౩ ఖగద, ౧౪ గవ్యాయన, ౧౫ చక్రిధర్మి, ౧౬ చేదు, ౧౭ చైకేత, ౧౮ త్రైకి, ౧౯ త్రైపణయ, ౨౦ దేవయాత, ౨౧ ద్విహాయన, ౨౨ ఫణీసారహరేయ, ౨౩ పాణి, ౨౪ భాభాల, ౨౫ భావన, ౨౬ మాహూజ్య, ౨౭ మాతృప్త, ౨౮ మానగ, ౨౯ మౌపక, ౩౦ రతికాయన, ౩౧ వాత్స్య, ౩౨ వీరాధ్వర, ౩౩ శతేహి, ౩౪ శ్రేయ, ౩౫ శీఘ్రిక, ౩౬ సరాగోజ, ౩౭ స్వవభ్రష్ట, ౩౮ సానుశస్రిత, ౩౯ సోమభృవ, ౪౦ సోమయాగ, ౪౧ హారితాయని, ౪౨ హస్తి, ౪౩ హార్కారి, ౪౪ హాసలాయన, ౪౫ హాస్య.

మాత్స్యసూత్రోక్త గోత్రములు. (౨౮)

౧ అగ్రావ, ౨ అజీహాయన, ౩ కుప, ౪ కౌష్ఠాయన, ౫ కీరి, ౬ కాశీతకి, ౭ గోష్ఠాయన, ౮ జ్ఞానారాధ, ౯ నాశరి, ౧౦ పస్గోడలాయన, ౧౧ పైలలేభి, ౧౨ పౌలి, ౧౩ బభ్రు, ౧౪ భృగు, ౧౫ భవనంది, ౧౬ మసన, ౧౭ మారీవ, ౧౮ మాషరి, ౧౯ వసు, ౨౦ వాత్యాయని, ౨౧ శ్యామ, ౨౨ సర్వ, ౨౩ సాసిన, ౨౪ స్వాప, ౨౫ హారితాయన, ౨౬ హస్తలాయని, ౨౭ హస్తిక, ౨౮ హస్తిత.

ఇతరగ్రంథోక్తగోత్రములు (౧౬).

౧ కాండవాయన, ౨ కామేపానకి, ౩ కైజాలి, ౪ కౌరిహ్య, ౫ చాకారియణ, ౬ జ్ఞానహస్తి, ౭ నాగశిర, ౮ ప్రతిశిశ్రివ, ౯ పావానుయ, ౧౦ ప్రాతిధేయ, ౧౧ భృగపౌర, ౧౨ భిక్షిరి, ౧౩ వాహహూకాయన, ౧౪ వేలని, ౧౫ శౌకయ, ౧౬ స్వాపశాంత.

ఈ (కశ్యప-నిధ్రువగణ) గోత్రములకుఁ బ్రవరరూపములు ఎన్మిది కలవు.

౧ కాశ్యప, అవత్సర, నైధ్రువ.

౨ కాశ్యప, అవత్సర, నైధ్రువ, రేభ, రైభ.

౩ కాశ్యప, అవత్సర, నైధ్రువ, రేభ, రైభ, శండిల, శాండిల్య.

౪ కాశ్యప, అవత్సర, అసిత.

౫ కాశ్యప, అవత్సర, శాండిల్య.

౬ కాశ్యప, అసిత, దైవల.

౭ కాశ్యప, అవత్సర, దైవల.

౮ శాండిల్య, అసిత, దైవల.

**నినివే పట్టణము** —ఇది టైగ్రిస్ నది ఎడమతట్టున నదీతీరముననే ఉండినపట్టణము.

అస్సీరియా రాజ్యములోనిదిగ నుండెను. మెసపొటేమియా దేశమునందు మసౌల్ పట్టణమునకెదురుగనుండిన తావున నుండెనఁట. పురిని జుట్టియుండిన కోటగోడల యావరణము ౧౮౦౦ యెకరము లుండినట్లు తేలుచున్నది. పట్టణమునకు ౧౫ ద్వారములు, పెక్కు బురుజులం గల్గి మూఁడు దెసలందు ఈపురియందు టైగ్రిసునదిలో చేరుకొను నొకపాటి చిన్ననదినుండి నీటిని నింపిన కందకమును, నాల్గవదెస టైగ్రిసునదియే కందకముగ నుండియుండెను. తూర్పువైపుగోడకు రెట్టింపుబలమీయఁబడెననిపోల్పంబడుచున్నది.

ఱాతిపనిముట్లుగ ఆయుధములు గలవారు తొలుతను, లోహపుపనిముట్ల వాడుప్రజలు పిదపను, ఇట నివసించుచుండిరని తేలుచున్నది. వీరి దేవతకు 'నినా' యనిపేరు. ఆమె మత్స్యాకారమున నుండునది. ఆమెనుండియే వీరిపురికి నినివే అనిపేరు కల్గియుండునని తలంపంబడుచున్నది.

ఈదేవతకొక దేవళము నిర్మింపఁబడి యుండెను. దానిని క్రీ. ము. ౨౧౦౦ నాఁడు బాగుచేయించిరని తెలిసెడిని. ఆదేవత కింకను ఇష్టా రనుబిరుదనామ ముండెను. క్రీ.ము.౧౪౦౦ సంవత్సరప్రాంతమున నిటకు మిటన్నియను లనంబడు ప్రజలు చేరి కాపురము కుదిరియుండిరనియు, క్రీ. ము. ౧౩౦౦ నాఁడు ఒకటవ షాల్మానేసరు క్రింద అసీరియనుజాతివారు దాడివెడలి ప్రవేశించిరనియు, ఈ అసీరియన్భూపతి షాల్మానేసరుగారు కలా యనుతావున తనరాజధాని నేర్పఱచుకొన్నను నినామత్స్యదేవతా దేవస్థానమును బాగుచేయించియుద్ధరించియుండెననియు పరిశీలనలు బయల్పఱచినవి. పిమ్మట క్రీ. ము. ౧౧౦౦ ప్రాంతమున అషూర్బెల్కాలా యను పేరుగల ప్రభువు ఈ నినివే పురిని తనరాజధానిగఁ జేసికొనె నఁట.

పిదప నీదేశము పాలించిన సెన్నాచెరిబ్ ఒకరాజభవనమును, ఒకనక్షత్రశాలను (జ్యోతిషశాస్త్ర పరిశీలనాలయము) నిర్మించె నఁట. ఇటనే జోనాప్రవక్తసమాధి సుప్రసిద్ధమై యుండెనఁట. పట్టణమున దాహోదకపు కాల్వలు త్రవ్వించెనఁట. ఒకతోఁటను నిర్మించిరి. అందు విదేశపుచెట్లు, జంతువులు, పెంపంబడుచుండిన వఁట. అరేబియాపత్తి ఇట చక్కఁగ పెరిగెనందురు.

పిదప ఎస్సార్హాడన్ నృపాలుఁడు నగరపు ఇఱుకువీథులను వెడలుపుచేయించి వేఱొకరాజభవనమును నిర్మించె నఁట. సెన్నాచెరిబునకుత్తరముగా అస్సూర్జానిపాల్ భూపతి తన ప్రాసాదనిర్మాణ మొనర్చుకొని, అందు ఒక గ్రంథనిలయము నేర్పఱచెను. అది కూనిఫారమ్ లైబ్రరీ అనంబడుచు నిప్పుడు బ్రిటీషుమ్యూజియమునం దున్నది.

ఇంత వృద్ధినందిన నినివే నగరము నశించి పాడుపడునని నహూమ్ జెఫానియా ప్రవక్తలిర్వురును ప్రవచించుచుండిరఁట. మీడియను దేశస్థుఁడగు సైనెక్సరీసు దాడివెడలి వచ్చి కొంతగను, క్రీ.ము. ౬౦౬ లో బాబిలోనియా భూపతి నెబూపోలాసార్ను, నినివేపట్టణమును బడఁద్రోసి పాడుచేసి భంగ మొనర్చిరనియుఁ జెప్పంబడినది. క్రీ. ము. ౪౦౧ లోనే ఎక్సనోఫన్ అనువాఁడాపాడుమీఁదుగా ప్రయాణ మొనర్చెననియు, పిదప నాపాడుదిబ్బలపై సస్సేనియనులు గ్రామములు నిర్మించుకొనిరనియు పరిశీలనలు బయల్పఱచినవి.

**నిన్న కుప్పా నేఁడు అళ్లా**—ఆంధ్ర లోకోక్తి.

**నిప్పుకోడి** (Ostrich)—పెద్దపక్షి, గాని ఎగురఁజాలదు. దీనిఱెక్కలు ఎగురుటకు పనికి రావు. ఆఫ్రికాఖండము, అరేబియా, మెస

పొటేమియా దేశపు విజనప్రదేశపు బయళ్లలో వసించెడిని. అడవిజంతువు. సాధువుగా నొనర్ప చనవుచేయ నగును. ఒకమనుజుని వీఁపుపై నెక్కించుకొని త్వరితగతిగల గుఱ్ఱముకన్న నతి వేగముగఁ బర్వెడఁగలదు.

పక్షి ఐదడుగుల యెత్తు. మెడ ప్రత్యేకముగ మూఁడడుగులు. పాదములందు రెండేసి డెక్కలు. శరీరముతో పోల్చినతఱి చిన్నదియనిపించును. అడవులం దుండుట గానరాదు. గ్రుడ్లను నేల పల్ల మొనర్చి అందిడి, పగలు, ఎండవేఁడిమికి వదలి, రాత్రులందు తండ్రిపక్షి పైనఁ గూర్చుండి పొదుగును. పగలు శీతలముగ నుండుతఱి తండ్రిపిట్ట పైనఁగూర్చుండుటయుఁ గలదు. అది తిండికిఁ జనుతఱి తల్లిపిట్టయుం బొదుగుచుండును. దీని వెండ్రుకలు విలువగలవి గాన క్రీ. వె. ౧౮౬౭ మొదలు ఆఫ్రికా ఖండముననే గాక ఆస్ట్రేలియా, అమెరికా సంయుక్తరాష్ట్రములు, అల్జీరియా, అర్జంటినా దేశములందు Ostrich Farms స్థాపింపంబడి పక్షులు పెంపఁబడుచున్నవి. ఐరోపాదేశపు శీతోష్ణస్థితి కీపక్షులు బ్రతుకఁజాల వఁట. (రిహ్యానిప్పుకోడి చూ.)

**నిప్పను (దైనిప్పన్)**— జపాన్ దేశమునకు వారిస్వభాషయందు దైనిప్పన్ అనియెదరు. "దై" అనిన మహా యనియు, "నిప్పన్" అనిన మనము జపాన్ అనుచున్న దేశపుపేరనియు నర్థములు.

**నిప్పును నీళ్లతో నార్పుట** — నిప్పు కఱ్ఱపైనుండి గాని, రాక్షసబొగ్గుపైనుండిగాని, దూదిమొదలగు నితరపదార్థములపైనుండిగాని చమురులు (Oils) చాల వేఁడిగ నగుటవలనఁ గాని, గంధకము మొదలగు నగ్నిప్రమాదకర పదార్థముల నుండిగాని, లేక ఫాస్ఫరస్ మూలమునఁగాని మండుటకు ఆక్సిజెన్ (Oxygen) కావలయును. లేకున్న అగ్ని ప్రజ్వరిల్లనేలేదు. ఆక్సిజెన్ గాలియం దుండునది గాన గాలితో సంబంధ ముండుట అగ్ని కత్యవసరము. గాలి యన నిట బహిఃప్రపంచమహావాయుమండలి యని మనసునం దుంచుకొనవలయును. ఇంతే కాక ఏపదార్థము కాలుచున్నదో దానికి కొంత పరిమితికి తక్కువ గాని వేఁడి తగులుటగూడ మంట కవసరములే.

నీరు అగ్నిని తా నార్పలేదు. నూనె ఎక్కువ కాఁగి మండ నారంభించెనేని నీరు దానిని మఱింత ప్రజ్వలింపఁజేయునేగాని ఆర్పజాలదు. అగ్నిపై నీరుచేయుపని యిది. అగ్నిపై నీరు పోయుదుమేని అది ఒకపొరవలె నానిమిషమున దనరి, బహిఃప్రపంచవాయుమండలికిని ఆయగ్నికిని తా నడ్డమై ఆక్సిజెనును రాకుండ నడ్డగించును. ఇంకను అగ్నియందలి వేఁడిని జల్లార్చి మండకుండఁజేయును. ఈ రెండుపనులు అగ్నిని ప్రజ్వలింపనీయఁ జాలకుండఁ జేసియు, వేఁడిని తగ్గించియు అగ్నిని జయించును. కాని నీరు తాను స్వతంత్రముగ నగ్నిని జల్లార్ప శక్తికలది కాదు. ఎట్లైనను ఉదక సాహాయ్యముననే గొప్పగొప్ప యగ్నిప్రమాదముల నెదుర్కొన నగుచున్నది. నిజముగ నందు జరుగుపని యిది.

**నిప్పు ముట్టుకుంటేనేగాని చెయ్యి చురుకదు**—ఆంధ్రలోకోక్తి.

**నిబంధరోగము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున మలమూత్రావరోధరోగమునకుఁ బేరు. నిబంధమన వేఁపచెట్టునకును పేరుకలదు.

**నిమిచక్రవర్తి**—సూర్యవంశక్షత్రియుఁడు. (వైవస్వతమనువు చూ.)

ఈతఁడు గొప్పయాగ మొనర్చినవాఁడు. కారణాంతరమున వసిష్ఠమహర్షికిఁ గోపము తెప్పించి ఆయనవలన శాప మంది, తానును ఆయనను శపించినవాఁడు.

శాపఫలముగ వసిష్ఠుని శరీరము బ్రహ్మమానసపుత్త్రత్వముఁ గోల్పోయి, కుంభసంభవుఁడై తిరుగ జన్మించి, తిరుగ వసిష్ఠత్వ మందెను. ఈతఁడును శరీరాంగముఁ గోల్పోయెను. ఱెప్పపాటునకు నిమిష మనిపేరు గల్గుట నిమియొక్క జ్ఞాపకార్థమే. ఈయనపేరుననే యని చెప్పఁబడినది.

**నిమిత్తాభావే నైమిత్తికస్యాప్యభావః ఇతి న్యాయము**— చేసినవాఁడు (కర్త) లేకుండిన చేయఁబడెడు పనియుఁ గూడ నుండదని భావము.

**నిమి (రెండవనిమి)**— పాండవసంతతి క్షత్త్రియుఁడు. తండ్రి దండపాణి. పితామహుఁడు మహీనరుఁడు. పుత్త్రుఁడు క్షేముఁడు, లేక క్షేమకుఁడు.

**నిమిలిజమ్ (Nimilism)**—రష్యాదేశమున తిరుగుబాటొనర్చిన సోషలిస్టుల సిద్ధాంతము. ఒత్తిడి సహింపలేక తిరుగుబాటొనర్చినవారి కోర్కెలు ౧ వార్తాపత్రికలందు వ్రాయు స్వాతంత్త్ర్యము, ౨ ఉపన్యాసములం దభిప్రాయములం దెల్పు స్వాతంత్త్ర్యము, ౩ మతసంబంధమున సమానస్వత్వము, ౪ స్త్రీలకు సమానస్వత్వము, ౫ భూమి ప్రజలకొఱకనెడి సిద్ధాంతము. ఇవి వీరి సిద్ధాంతములు.

**నిమి లేక నేమిచక్రుఁడు, నేమి, నిచకుఁడు**— పాండవ సంతతి క్షత్త్రియుఁడు. చంద్రవంశము. తండ్రి అసీమకృష్ణుఁడు. పితామహుఁడు అశ్వమేధజుఁడు. కుమారుఁడు ఉక్తుఁడు. నిమి రాజధాని కౌశాంబీనగరము.

మఱియు సూర్యవంశక్షత్త్రియుఁ డొక నిమి కలఁడు. ఆతఁడు చక్రవర్తి. ఇక్ష్వాకుమహారాజు పుత్త్రుఁడు. పితామహుఁడు వైవస్వతమనువు. కుమారుఁడు మిథిలుఁడు. వీరు విదేహదేశ మేలినప్రభువులు. ఈనిమి ఒక యాగ మొనర్ప వసిష్ఠుని బ్రహ్మమానసపుత్త్రుని పిలిచె నఁట. వసిష్ఠుఁడు రాక దేవేంద్రునికడకు వేఱు పనికై యేగెనఁట. నిమి గౌతముని రావించి క్రతు వొనర్చెనఁట. వసిష్ఠుం డలిగి "నీ వంగహీనుఁడ వగు" మని శపింప, నిమి "నీవు దగ్ధశరీరుఁడవుగ" మ్మని ప్రతిశాప మిచ్చెనఁట. ఉభయులు నట్లు శరీరములం గోల్పోయి, వసిష్ఠ మైత్రావరుణులకుసుతుండుగ కుంభజుఁడై పుట్ట వలసివచ్చె నఁట. నిమి తిరుగ జన్మింప నిచ్చగింపఁడాయెనఁట. నిమిష (ఱెప్పపాటు కాలము) మాతనినామముగ నేఁటికిని వాడుచున్నారు.

**నిమ్నుఁడు (సురథుఁడు)**— అత్త్రి, చంద్ర, యాదవ క్షత్త్రియుఁడు. తండ్రి అనమిత్రుఁడు. సోదరులు శిని, వృష్ణి. అందు శిని కుమారుఁడు సత్యకుఁడు. వృష్ణికుమాళ్లు శ్వఫల్కుఁడు, చిత్రకుఁడు. నిమ్నుని కుమారుఁడు విదూరథుఁడు.

**నిమ్నోన్నతములు**- ఏల్టిట్యూడుచూ.

**నిమ్మగడ్డిచెట్టు**— లా. Andropogon Citratis, Hemionitis Cordifolia ఇం. Lemon grass సం. సౌగన్ధికం. ఇంకను కటతృణ, రోచిషతృణయనియు వాడఁబడినది. కొందఱు కామాక్షిగడ్డి, కామంచిగడ్డి యనియు వాడుదురు. కొన్ని దేశములందు కామాక్షిపూరి, కామంచిపూరి (పూరి గడ్డి)అనుటయుం గలదు. ఇది పెద్దతుంగవలె నుండెడిగడ్డి. ఆకు నలిపి వాసన జూచిన నిమ్మకాయవాసనతోఁ గూడిన చక్కనిపరిమళము గల్గియుండును గాన పూఁదోఁటలందు నాటి పెంచెదరు.

దీని సమూలకషాయము బలకరము. జ్వరమునం దిచ్చిన చెమటపట్టించిజ్వరమునాపుటయే గాక మఱి యొకప్పుడు ఘుందు రానున్న

జ్వరముయొక్క బలము తగ్గించును. నిద్ర దెచ్చును. బడలిక దీర్చును. విషూచిరోగుల కను కూలమై యుండును. నీరసము మాన్పును. ఋతుబద్ధము నివారించును. అజీర్ణశూల, కడుపు నొప్పి, కడుపులోబల్ల, గుండెలలో మంట, దగ్గు, దోషజ్వరము, నీరసము, నీళ్ళవిరేచనములు, రక్తవాతము, వగర్పు, విదాహము, హృద్రోగముల నడంచును. నిమ్మనూనె (తైలము) మర్దన నొప్పుల నివారించును.

**నిమ్మచెట్టు**—లా. Citrus Bergamia, Citrus acida- ఆంగ్ల. Lime Tree. సం. జంబీరః, జంబీరకః, దంతాఘాతః, వక్త్రశోధనమ్, వక్త్రశోధి.

గజనిమ్మకు సంస్కృతపు పేరు. దంతహర్షకః. తియ్యనిమ్మకు సంస్కృతపు పేరు. మధుజంబీకః.

నిమ్మచెట్టు తియ్యనిమ్మ యనియు, పుల్ల నిమ్మ యనియు రెండు ముఖ్యభేదజాతులు కలది. తియ్యనిమ్మయందు పెద్దకాయలఁ గాచు జాతికి అఱవమున 'సాత్తుకుడి' యందురు. పుల్ల కాయలలో పెద్దకాయలఁ గాచుజాతికి గజనిమ్మ యందురు. నిమ్మకాయలలో కోలవాటపు కాయలం గాచుజాతికి పుట్టనిమ్మ యందురు. ఇవి పులుపుకాయలేగాని తీపిజాతి గానరాదు. ఇంకను తీఁగనిమ్మ యనియు, అడవినిమ్మ యనియు రెండు అధమపుజాతులు వేఱుగఁ గలవు.

నిమ్మకాయలరసము కడు నారోగ్యకరమని ప్రాక్పశ్చిమదేశములందలి పండితులు పరిశోధనలవలనఁ గనిపెట్టి పొగడుచున్నారు. విస్తారము స్పానియా దేశమున నిమ్మ పెంచఁబడుచున్నది. ఆంధ్రదేశమునందు సర్వత్ర నీరుగల చోట్లను, విస్తారముగా పశ్చిమగోదావరీమండలమున పాలకొల్లుప్రాంతములను, దక్షిణదేశమున తంజావూర్ మండలమున అయ్యంపేట పరిసరములను వృద్ధినొందుచున్నవి. నిమ్మకాయలందు పెద్దవి శ్రేష్ఠ మందురు. చిన్నజాతి రసముతక్కువ జాతి. అధమపువి.

నిమ్మపండ్లరసము త్రిదోషములను హరించి, ఆఁకలి నభివృద్ధిపఱచి, విరేచనము వెడలించి, ఆరోగ్యము గల్గించు ననియు, విషదోషము నడంచి పైత్యశూలల నివారించి రక్తమును పరిశుభ్రపఱచి నిసాను విఱచి వాంతి రాకుండ నాఁపి సముద్రపుజబ్బు (Sea sickness) రాకుండఁ గాపాడు ననియుఁ జెప్పఁబడినది.

**నియుతి**—మేరుపుత్రిక. విధాతభార్య.

**౨ నియమములు (అంగయోగము) ౧౦ విధములు**-నియమము, నియతి, నియమించుకొను దీక్ష, దశవ్రతములు- ౧ జపము, (చేయుచుండుట), ౨ తపము (శరీరమునకు వేఁడి గల్గించుటమూలమున లఘువుగ నొనర్చుకొనుచుండుట), ౩ దానము (కాంక్షను తగ్గించుకొనుచు త్యాగమున వెనుదీయకుండుట), ౪ వేదాంతశాస్త్రశ్రవణము (వేదాంతరహస్యములను వినుచుండుట), ౫ ఆస్తిక్యభావము (దేవునిగూర్చి సంశయమువీడుట), ౬ వ్రతము (వీలగునంత వఱకును జీవనము నియతులచే నడుపుట), ౭ ఈశ్వరపూజనము (భక్తి గల్గియుండుట), ౮ యదృచ్ఛాలాభసంతోషము (కల్గినదానికి సంతసించుట, దురాశ వదలుట), ౯ శ్రద్ధ, ౧౦ లజ్జ (దంభము మానుట). (అష్టాంగయోగములు చూ.)

**నియాన్ వాయువు** (Neon Gas) — ఇది గాసియస్ ఎలిమెం టని చెప్పఁబడినది. Atmosphere నందు 80000లో నొక పాలుగ నుండును. Argon నందు లభించు చున్నది. దీనిని క్రీ. శ. 1898 లో Sir William Ramsay అను రసాయనశాస్త్రవేత్త కనిపెట్టెనఁట.

నియాన్ వాయువు నింపిన గొట్టముగుండా విద్యుచ్ఛక్తిని నడిపి యవ్వల దీపము వెలిగించిన మంచుగుండా చొచ్చుకొనిపోవు దీప్తి కిరణములు గల వెలుఁగిచ్చు నందురు. దీని Chemical symbol Ne అనియు, Atomic weight 20.2 అనియు, Atomic Number 10 యనియుఁ జెప్పఁబడినది.

**నియో క్రిస్టియానిజమ్** (Neo Kristianism)— ఫ్రాన్సు దేశమున (క్రీ. శ. 1782-1854 ప్రాంతమున క్రైస్తవమతమునందు ప్రత్యక్షప్రమాణము లేనిదే నమ్మరాదనెడు సిద్ధాంతము బయలుదేరినది. దానిని ఈ పేరుతో పిలిచెదరు. గ్రీకుసాంప్రదాయము ననుసరించి ఏ శాస్త్రమందైనను నూతనపద్ధతి వచ్చినపుడు Neo అనఁగా క్రొత్తది అను నర్థముతో వాడెదరు.

**నియోగులు**-(ఆంధ్రబ్రాహ్మణులు చూ).

**నియోడైమియమ్** (Neodymium)- ఇది Cerium group నకుఁ జెందిన Rare Earth metal గాఁ జెప్పఁబడినది. దీని Chemical Symbol Nd అనియు Atomic weight 144.3 యనియు, Atomic Number 60 అనియు, Specific Gravity 6.956 అనియు, Melting point సెంటిగ్రేడు తెర్మోమీటరు 84 డిగ్రీల వేఁడి అనియు చెప్పఁబడినది. క్రీ. శ. 1885 లో Auer Von Welsbach అను రసాయన శాస్త్రవేత్త Didymium నుండి వేఱుపఱచి వెల్లడించెను.

**నిరంజన నది**— నిరంజన లేక నీలాజన నది ఒకటియు, మోహననది యొకటియు (చిన్ననదులు) కలిసి ఫల్గుణీనది యనంబరఁగి గయాపట్టణము ప్రక్కగా ప్రవహించును. ఇందు నిరంజననది హజారీబాగుజిల్లాలో సిమేరియాకడజన్మించునది. ఎత్తగుపర్వతములమధ్య దొరలుచు లోఁతుగఁ గోయఁబడిన పల్లముగుండా ప్రవహించుచుఁ జని హజారీబాగుజిల్లాలోని మాలుడా యనంబడు తావుకడ (ఛత్రా నుండి ౬ మైళ్లు) చాలఎత్తునుండి క్రిందికి జలపాతమై దిగజాఱి, బహుదూరము వినిపించు గొప్పధ్వని చేయుచు నదియై ముందునకు నడచి బుద్ధగయ కెదురుగ రెండుపాయలుగ చీలిపోవును. అందు పెద్దదగు తూర్పు శాఖకు నీలాజనము లేక నిరంజనమని పేరు.

రెండవదియగు మోహనయందు నిశ్వరా యనంబడు చిన్ననది సంగమింప, రెంటును గలిసినతోడనే ఫల్గుణి యనంబరఁగి గయాపట్టణము ప్రక్కంబడి ప్రవహించెడిని.

**నిరంజననది (ఫల్గుణీనది)**— దీనిం గూర్చిన ప్రశంసలు పలుతావులం గలవు. అగ్నిపురాణము ౧౧౬ అధ్యాయమునను, మార్కండేయ పురాణము ౫౭ అధ్యాయమునను, ఇంకను పెక్కుబౌద్ధమత గ్రంథములందునను గాననగును.

**నిరమిత్రుఁడు**— అత్రి చంద్ర పూరు కురుసంతతి క్షత్రియుఁడు. పాండవచతుర్థుఁడగు నకులుఁడు తండ్రి. చేదిదేశపురాజపుత్రికయగు రేణుమతీదేవి తల్లి. భిన్నోదరసోదరుఁడు శతానీకుఁడు. మగధరాజవంశము. బార్హద్రథసంతతి క్షత్రియుఁడు. తండ్రి ఐతావు. పితామహుఁడు శ్రుతశ్రవుఁడు. పుత్రుఁడు సురక్షితుఁడుగాఁగల నిరమిత్రుఁడు వేఱొకఁడుగలఁడు.

**నిరర్థకజాతినామములు**— ఆంధ్రభాషయందుఁ గొన్ని పదములు క్రిమికీటకాది కొన్ని జాతులనామములు చెప్పఁబడినవి. అవి కుమ్మరిపురుగు, వడ్రంగిపిట్ట, గొల్లభామ, మాలకాకి, సాలెపురుగు మొ॥

**నిరర్థకౌన్నత్యనామములు**—ఆంధ్రభాషయందుఁ గొన్ని పదములు నిరర్థకౌన్నత్య

పదములను తమపేర్లకు ముందు కల్గియుండును. అవి నేతిబీరకాయ,పుల్లగుమ్మడికాయ, బంగారు పిచ్చుక, లక్ష్మీదేవిపురుగు, సీతాకోకచిలుక, నేతిదొండకాయ మొదలగునవి.

**నిరశనార్క వ్రతము** — హిందూకుటుంబములందు సుశీలలగు స్త్రీలు మాఘమాసమున ఆదివారములందునను, శుద్ధసప్తమి అనఁగా రథసప్తమిదినమునను, అపక్వపదార్థములనుమాత్రము తిని అశనముం దినక యీవ్రత మాచరించి సూర్యుని బూజించుదురు. (రథసప్తమి చూ.) దీని కింకను అపక్వభానువాసరవ్రత మనియు ననుట కలదు. సర్వసాధారణముగ మాఘపాది వారములనో మని యనుట కలదు.

**నిరాణిగోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూ.)

**నిరాన్కోట (పాతాళపురము, హైదరాబాదు)**— ఇప్పుడు సింధుదేశమున హైదరాబా దనిపేరందిన పురమున కిది (నిరాన్కోట) యనియు, అదిని పాతాళపుర మనియు పేరుండె ననిఆప్రాంతవాసులందురు.(సింధుదేశముచూ.)

**నిరామజ్వరము**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున పక్వమైన జ్వరమునకు పేరు.

**నిరామయస్య కిమాయుర్వేదవిదేతి న్యాయము** — సంపూర్ణారోగ్యము కలవానికి ఆయుర్వేదవైద్య విశారదునితోఁ బని యేమి? యని యర్థము. అవసరము లేదని భావము.

**నిరిజచెట్టు**— (నెరసిచెట్టు చూ).

**నిరుక్తము**- నిరుక్తము వేదానుబంధముగ వేదాంగముగఁ జెప్పఁబడిన గ్రంథము. నిరుక్త మన నిర్వచన మని యర్థము. వ్యాకరణమువలన సాధ్యము గాని వ్యుత్పత్తులుగల శబ్దములను సాంప్రదాయము ననుసరించి వివరించి నిష్కర్షగఁ జెప్పుట యని భావము.

నిరుక్తమునకు శాకపాణి మొదలగువారు పూర్వాచార్యులుగ యాస్కర్షిచేఁ బరిగణింపఁబడిరి. మఱియు వేదములందలి బ్రాహ్మణమున నుడువఁబడిన శబ్దనిర్వచనమే యాధారముగఁ గైకొని శాకపాణి నిర్వచనశాస్త్రమును విస్తరింపఁజేసెనని చెప్పఁబడినది. పిదప యాస్కర్షి నిరుక్తమును సూత్రములుగ రచించెను. దానికే నిరుక్త మని ఇప్పుడు వాడుచున్నారు. ఇది కాశ్యపకృత వేదనిఘంటువునకు భాష్యరూపము. నిఘంటుభాష్యమే నిరుక్త మను పేరం బరఁగుచున్నది. ఈ గ్రంథమున పంద్రెం డధ్యాయములు కలవు. ఇవిగాక పరిశిష్టాధ్యాయములు రెండు వీటికిం జేర్పఁబడినవి. ఈ నిరుక్తగ్రంథమునకు దుర్గాచార్యకృత ఋజువ్యాఖ్యయు, దేవరాజయజ్వకృత మగు వేఱొక వ్యాఖ్యయుం గలవు. ఈ గ్రంథమునందలి "సమామ్నాయ స్సమామ్నాతః" అను సూత్రమే బ్రహ్మయజ్ఞాంగముగ నున్నది.

**నిరూప్ క్షత్రియులు**-(శిశోదియా క్షత్రియులు చూ.)

**నిర్జలైకాదశి**— జ్యేష్ఠశుద్ధైకాదశి. (పండుగలు చూ.)

**నిర్మలక్షేత్రము**—బొంబై బరోడా సెంట్రలిండియా రెయిల్వే బేసిన్‌రోడ్డు స్టేషనునకు పశ్చిమముగా నైదుమైళ్ళ దూరమున నిర్మలక్షేత్రముకలదు.ఇట నెనిమిది దేవాలయములు, శంకరాచార్యస్వాములలో నొకరి సమాధియుం గలదు. ఇట కార్తికమాసమున గొప్పయాత్ర జరగును.

ఇచటికిఁ గతిపయదూరముననే జీర్ణపర్వతముపై నొకయావరణమున నైదుగుహాలు కలవు. అవి పాండవులగుహా లందురు. ఇట ప్రతిష్ఠిత దైవమును వంధ్యలు పూజించుటవలన సంతానవంతు లగుదురని ప్రతీతి కలదు.

బేసినోర్తిడ్జు స్టేషనుకడనే యున్న తూంగార్ పర్వతము సమశీతోష్ణప్రదేశము. ఇట వేసవి నివాసములు జరగును. ఇది అరణ్యప్రదేశమై యుండును.

**నిర్విషమూలిక** — ఇది హిమాలయ ముపై బదరీకేదారప్రాంతమున గలదనియు, దీనికి విషువారిణీ, అపవిషా, విషవారిణీ, బహు విషఘ్నీ అనుపేర్లు కలవనియు, ఇది అనేక విషములను హరించుననియు, తుంగవలె నుండుననియుఁ జెప్పఁబడినది.

**నిర్వేరిణిగోత్రము**-- (అగస్త్యుఁపగణము చూడుఁడు.)

**నిలుకడలేనిమాట నీటిలోనిమాట** - (నీట ప్రతిఫలించిన మూటయొక్క ఛాయ యని భావము) ఆంధ్రలోకోక్తి.

**నిలుచుటకు తావు దొరికితే కూర్చుండుట కాలోచింప వచ్చును** — ఆంధ్రలోకోక్తి.

**నివధితగోత్రము**--(ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**నివాతస్థితదీపన్యాయము**—గాలిలేని చోటనుంచిన దీపకళికవలె ననిభావము. అనఁగా నిర్బాధకముగా జీవించుట యనిభావము.

**నివారానది**—ఇప్పుడు నీరా యనంబరఁ గుచు భీమానదియందు సంగమించు నదిగా నున్నది. పడమటికనుమలందు జనించెను. పద్మపురాణ-స్వర్గ ఆది. 3 యందున దీనిప్రశంసకలదు.

**నివాస స్థలములు** (House sites)--నివాసస్థలముల గొప్పసముదాయమును నగరమనియు, సాధారణముగ పెద్దదిగా నుండిన పట్టణ మనియు, తక్కువగా నుండిన గ్రామమనియు, అత్యల్పముగానుండినదానిని కుగ్రామమనియు ననుచుందురు. ఎందైనను ఒకబాట కిరుదెసలం దున్న నివాసములను వీథి యందురు. నివాసము లాదికాలమున భరతదేశమునందు తృణము (గోగ్రాసమునకును), కాష్ఠములు (వంటచెఱకునకును), జలము (దాహస్నానాద్యుపయోగమునకును) సమృద్ధిగ లభించు తావులందు నివాసముల నేర్పఱచుకొనుపద్ధతి యుండెడిది. ఇప్పు డట్టి దృక్పథము మాఱి సౌఖ్యము నంతగా పాటింపక ధనార్జనసాధనము లగుతావులందు పట్టణము లేర్పడుచున్నవి.

భరతదేశమున ప్రాముఖ్యము గల్గుచున్న తావులందు,పట్టణములు గాకున్న గ్రామములైన నేర్పడుటయు, అదివఱకే గ్రామ మటనుండిన నది పెరిఁగి పట్టణ మగుటయు, అదివఱకే యట పట్టణముండిన నది పెరిఁగి పెద్దది యగుటయుఁ గాననగుచున్నది. ప్రాముఖ్య మన ప్రభుత్వ కార్యాలయములు, న్యాయస్థానములు స్థాపించుటయు, సముద్రపుటోడల నిలయస్థానము (హార్బరురేవు) స్థాపించుటయు,ఇనుపబాటలకుఁ గాని, బండ్లబాటలకుఁ గాని, మోటారు సర్వీసులకుఁ గాని సంధిస్థానముగ నేర్పడుటయు, పడవలు నడుచు కాలువలకు సంధిస్థానముగఁగాని, మొగగాఁ గాని, రెండునుగూడఁ గాని ఏర్పడుటయు, ఆకాశవిమానములు నడుచు మార్గముల కూడలిగఁ గాని, మొగగాఁగాని, ఏర్పడుటయు, వర్తకుల నాకర్షింపఁ దగిన సంతలు మొదలగు కూటము లేర్పడుటయుఁ గల్గిన తావులందు కొద్దిగనో గొప్పగనో అభివృద్ధులు గాన్పించుచునే యున్నవి. అనఁగా నివాసస్థలములసంఖ్య యధికమగుచునే యున్నది.

ఇంక నన్య దేశములందు ఇతరఖండములందీస్థితి యెటులనున్నదియు నిట వివరించి ముగింతుముగాక.సర్వసాధారణముగ నితరదేశములందిట్టి పరిస్థితుల సందర్భమున నొకపాటి పెద్ద గ్రామము నైనను పట్టణ మనియే వాడు

చుందురు. పడవలు నడువందగిన లోఁతుగల నదులనే నదులుగఁ బరిగణింతురుగాని, నీరు తక్కువగల నదులను నదులుగఁ బాటింపరు. ఈరెండు సంగతులును మనస్సునందుంచుకొనఁ దగినవి.

పట్టణములు నదులనంటి యున్నవి, మార్గముల నంటియున్నవి, చేతిపనులవలన ప్రాముఖ్యమునందినవి, వర్తకమునుండి ప్రాముఖ్యము నందినవి యని నాల్గు విధములుగఁ జెప్పుదురు. కొందఱు వర్తకప్రాముఖ్యమును వేఱుగ వివరింప నక్కఅలే దనియు, వర్తకసంబంధమే లేకున్న పైమూఁడింటికినిస్థానమేయుండదనియు, ననిరి. అందు నదుల నంటియున్న పట్టణములు:

౧ దూరమునుండి యరుదెంచిన సరకులను ఓడలనుండి కాలువపడవలలోనికిఁ గాని బాటలపై బండ్లు లారీలపైఁ గాని, ఇనుపదారి బండ్లలోఁగాని ఎగుమతిదిగుమతు లొనర్చుట, సరకులను కొనుట, అమ్ముట, ఇతరులకై మధ్యవర్తిగ నుండికొనుగోలుకార్యములొనర్చుట మొ॥ పనులు చేయు వర్తకస్థానము లున్న పట్టణములు.

౨ నదులపై వంతెనలు,వారధులుఉన్న లేక ఉండఁదగిన పట్టణములు (Bridge Towns.)

౩ నీటిధారల శక్తింగొని యంత్రముల నడుపనీలగుతావులు (Cataract Towns).

౪ అనేకనదుల నడుమను, కొండలపైనను నున్నవి (Defence Towns).

౫ నదీసంగమస్థలముల (వాణిజ్యాది సౌకర్యముల) కు నేర్పడినవి. (Confluence Towns.)

మార్గముల నంటియున్న పట్టణములు:—

౧ పెద్ద పర్వతపంక్తుల కవ్వలిదేశములకు వర్తకపుసరకులం జేర్చు బాట లాపర్వతపంక్తిం దాటఁదగిన కొండలోవ లేక కనుమ మార్గము నంటిగాని,దానికిం గతిపయదూరమున నర్వాస్థలమున కట్టంబడిన పట్టణములు. (Mountain pass Town)

౨ జలసంధులం దాఁటుతావునఁ గలవి. (ఇంగ్లాండు దేశపు డోవరు వంటివి) (Ferry Towns.)

౩ ఏవైన ఇతరవృత్తులకాస్పదమైనతావులం దేర్పడిన పట్టణములు. గనులు, ప్యాక్టరీలు గలతావులందలివి.

౪ హార్బరుల సంబంధపట్టణములు. ఇంక చేతిపనులవలన ప్రాముఖ్యమునందు పట్టణములాయాపనుల కవసరమగు ముడిసరకులు(Raw-materials) దొరకుచు, సులభముగఁ జేరుటకు సదుపాయములు గలతావునందుఁగట్టంబడి యుండును. వాటిని Industrial Towns అనియెదరు.

**నివృత్తినది**—మెసపొటేమియా దేశమున అస్సిరియా (శాల్మలిద్వీపము) యూప్రిటీస్ అను పేరం బరఁగుచు నదిగా పోల్పఁబడిన నది.

దీనిప్రశంస బ్రహ్మాండ పురాణము ౫౩ అధ్యాయమునఁ గానవచ్చెడిని.

**నివృత్తిదేశము**—(వంగదేశము చూ.)

**నిశాకరుఁడు**-ఋషి. ఈతనియాశ్రమము వింధ్యారణ్యమున నుండెను. అందొకచెట్టుపై సంపాతియు, జటాయువు ననుపక్షులు వసించుచుండునవి. అవి యొకతఱి సూర్యునివై పుమింటి కెగయ, జటాయువు మూర్ఛిల్లి జనస్థానము నందునను, సంపాతి తెక్కలు కాలి తిరిగి నిశాకరాశ్రమముననను పడెనఁట. నిశాకరుఁడు సంపాతి నాదరించి, శ్రీరాముని కాపద సంభవించుతఱి వారిమనుష్యుల కా యాపదసంగతి నెఱుంగఁ దెల్పినకతన,నీతెక్కలు మరల మొలచునని యోదార్చెననియు, సీతను రావణుఁడు కొనిపోయినవార్త ఆంజనేయాదులకు సంపాతి తెల్పు తెక్క లుద్భవిల్లెననియుం జెప్పఁబడినది.

జేసినోర్త్ప్రస్టేషనుకడనే యున్న తూంగార్ పర్వతము సమశీతోష్ణప్రదేశము. ఇట వేసవి నివాసములు జరగును. ఇది అరణ్యప్రదేశమై యుండును.

**నిర్విషమూలిక** — ఇది హిమాలయముపై బదరీకేదారప్రాంతమున గలదనియు, దీనికి విడువారిణీ, అపవిషా, విషవారిణీ, బహువిషఘ్నీ అనుపేర్లు కలవనియు, ఇది అనేక విషములను హరించుననియు, తుంగవలె నుండుననియుఁ జెప్పఁబడినది.

**నిర్వేరిణిగోత్రము**-- (అగస్త్యుడుపగణము చూడుఁడు.)

**నిలుకడలేనిమాట నీటిలోనిమూట** - (నీట ప్రతిఫలించిన మూటయొక్క ఛాయ యని భావము) ఆంధ్రలోకోక్తి.

**నిలుచుటకు తావు దొరికితే కూర్చుండుట కాలోచింప వచ్చును** — ఆంధ్రలోకోక్తి.

**నివధితగోత్రము**--(అర్ష్టిషేణగణము చూడుఁడు.)

**నివాతస్థితదీపన్యాయము**— గాలిలేనిచోటనుంచిన దీపకళికవలె ననిభావము. అనఁగా నిర్బాధకముగా జీవించుట యనిభావము.

**నివారానది**— ఇప్పుడు నీరా యనంబరఁగుచు భీమానదియందు సంగమించు నదిగా నున్నది. పడమటికనుమలందు జనించెను. పద్మపురాణ-స్వర్గ ఆది. 3 యందున దీనిప్రశంసకలదు.

**నివాస స్థలములు** (House sites)-- నివాసస్థలముల గొప్పసముదాయమును నగరమనియు, సాధారణముగ పెద్దదిగా నుండిన పట్టణ మనియు, తక్కువగా నుండిన గ్రామమనియు, అత్యల్పముగానుండినదానిని కుగ్రామమనియు ననుచుందురు. ఎందైనను ఒకబాటకిరుదెసలందున్న నివాసములను వీథి యందురు. నివాసము లాదికాలమున భరతదేశమునందు తృణము (గోగ్రాసమునకును), కాష్ఠములు (వంటచెఱకునకును), జలము (దాహస్నానాద్యుపయోగమునకును) సమృద్ధిగ లభించు తావులందు నివాసముల నేర్పఱచుకొనుపద్ధతి యుండెడిది. ఇప్పు డట్టి దృక్పథము మాఱి సౌఖ్యము నంతగా పాటింపక ధనార్జనసాధనములగుతావులందు పట్టణము లేర్పడుచున్నవి.

భరతదేశమున ప్రాముఖ్యము గల్గుచున్న తావులందు,పట్టణములు గాకున్న గ్రామములైన నేర్పడుటయు, అదివఱకే గ్రామ మటనుండిన నది పెరిఁగి పట్టణ మగుటయు, అదివఱకే యట పట్టణముండిన నది పెరిఁగి పెద్దది యగుటయుఁ గాననగుచున్నది. ప్రాముఖ్య మన ప్రభుత్వ కార్యాలయములు, న్యాయస్థానములు స్థాపించుటయు, సముద్రపుటోడల నిలయస్థానము (హార్బరు రేవు) స్థాపించుటయు,ఇనుపబాటలకుఁ గాని, బండ్లబాటలకుఁ గాని, మోటారు సర్వీసులకుఁ గాని సంధిస్థానముగ నేర్పడుటయు, పడవలు నడుచు కాలువలకు సంధిస్థానముగఁగాని, మొగగాఁ గాని, రెండునుగూడఁ గాని ఏర్పడుటయు, ఆకాశవిమానములు నడుచు మార్గముల కూడలిగఁ గాని, మొగగాఁగాని, ఏర్పడుటయు, వర్తకుల నాకర్షింపఁ దగిన సంతలు మొదలగు కూటము లేర్పడుటయుఁ గల్గినతావులందు కొద్దిగనో గొప్పగనో అభివృద్ధులు గాన్పించుచునే యున్నవి. అనఁగా నివాసస్థలములసంఖ్య యధికమగుచునే యున్నది.

ఇంక నన్యదేశములందు ఇతరఖండములందీస్థితి యెటులనున్నదియు నిట వివరించి ముగింతుముగాక.సర్వసాధారణముగ నితరదేశములందిట్టి పరిస్థితుల సందర్భమున నొకపాటి పెద్దగ్రామము నైనను పట్టణ మనియే వాడు

చుందురు. పడవలు నడువందగిన స్రోతుగల నదులనే నదులుగఁ బరిగణింతురుగాని, నీరు తక్కువగల నదులను నదులుగఁ బాటింపరు. ఈరెండు సంగతులును మనస్సునందుంచుకొనఁ దగినవి.

పట్టణములు నదులనంటి యున్నవి, మార్గముల నంటియున్నవి, చేతిపనులవలన ప్రాముఖ్యమునందినవి, వర్తకమునుండి ప్రాముఖ్యమునందినవి యని నాల్గు విధములుగఁ జెప్పుదురు. కొందఱు వర్తకప్రాముఖ్యమును వేఱుగ వివరింప నక్కఱలే దనియు, వర్తకసంబంధమే లేకున్న పైమూఁడింటికినిస్థానమేయుండదనియు, ననిరి. అందు నదుల నంటియున్న పట్టణములు:

౧ దూరమునుండి యరుదెంచిన సరకులను ఓడలనుండి కాలువపడవలలోనికిఁ గాని బాటల్పై బండ్లు లారీలపైఁ గాని, ఇనుపదారి బండ్లలోఁగాని ఎగుమతిదిగుమతు లొనర్చుట, సరకులను కొనుట, అమ్ముట, ఇతరులకై మధ్యవర్తిగ నుండికొనుగోలుకార్యములొనర్చుటమొ॥పనులు చేయు వర్తకస్థానము లున్న పట్టణములు.

౨ నదులపై వంతెనలు,వారధులుఉన్న లేక ఉండఁదగిన పట్టణములు (Bridge Towns.)

౩ నీటిధారల శక్తింగొని యంత్రముల నడుప వీలగుతావులు (Cataract Towns).

౪ అనేకనదుల నడుమను, కొండలపైనను నున్నవి (Defence Towns).

౫ నదీసంగమస్థలముల (వాణిజ్యాది సౌకర్యముల) కు నేర్పడినవి. (Confluence Towns.)

మార్గముల నంటియున్న పట్టణములు:—

౧ పెద్ద పర్వతపంక్తుల కవ్వలిదేశములకు వర్తకపుసరకులం జేర్చు బాట లాపర్వతపంక్తిం దాటఁదగిన కొండలోవ లేక కనుమ మార్గము నంటిగాని,దానికిం గలిపయదూరమున నర్వాస్థలమున కట్టంబడిన పట్టణములు. (Mountain pass Town)

౨ జలసంధులం దాఁటుతావునఁ గలవి. (ఇంగ్లాండు దేశపు డోవరు వంటివి) (Ferry Towns.)

౩ ఏదైన ఇతరవృత్తులకాస్పదమైనతావులం దేర్పడిన పట్టణములు. గనులు, ఫ్యాక్టరీలు గలతావులందలివి.

౪ హార్బరుల సంబంధపట్టణములు. ఇంక చేతిపనులవలన ప్రాముఖ్యమునందు పట్టణములాయాపనుల కవసరమగు ముడిసరకులు(Raw-materials) దొరకుచు, సులభముగఁ జేరుటకు సదుపాయములు గలతావునందుఁగట్టంబడియుండును. వాటిని Industrial Towns అనియెదరు.

**నివృత్తినది**—మెసపొటేమియా దేశమున అస్సీరియా (శాల్మలిద్వీపము) యూఫ్రిటీస్ అను పేరం బరఁగుచు నదిగా పోల్పఁబడిన నది.

దీనిప్రశంస బ్రహ్మాండ పురాణము ౫౩ అధ్యాయమునఁ గాననయ్యెడిని.

**నివృత్తిదేశము**—(వంగదేశము చూ.)

**నిశాకరుఁడు**-ఋషి. ఈతనియాశ్రమము వింధ్యారణ్యమున నుండెను. అందొకచెట్టుపై సంపాతియు, జటాయువు ననుపక్షులు వసించుచుండునవి. అవియొకతఱి సూర్యునివైపుమింటికెగయ, జటాయువు మూర్ఛిల్లి జనస్థానము నందునను, సంపాతి ఱెక్కలు కాలి తిరిగి నిశాకరాశ్రమమునను పడెనఁట. నిశాకరుఁడు సంపాతి నాదరించి, శ్రీరాముని కాపద సంభవించుతఱి వారిమనుష్యుల కాయాపదసంగతి నెఱుంగఁ దెల్పినకతన,నీఱెక్కలు మరల మొలచునని యోదార్చెననియు, సీతను రావణుఁడు కొనిపోయినవార్త ఆంజనేయాదులకు సంపాతి తెల్పి ఱెక్క లుద్భవిల్లెననియుం జెప్పఁబడినది.

మఱియు నిశాకరుఁ డనుపేరు చంద్రునకుఁ గూడఁ గలదు.

**నిశాత్రయము**-ఆయుర్వేద వైద్యశాస్త్రమున సాదాపసుపు, కస్తూరిపసుపు, మ్రానిపసుపులకు పేరు. నిశాద్వయ మన సాదాపసుపు, మ్రదిమపసుపులకుఁ బేరు.

**నిశాని, వ్రాలు, సంతకము**—మనభరతదేశమున పత్రములందు (ఏదస్తావే జైనను పత్రమే)వ్రాసియిచ్చినవారు తమపేరు వ్రాయుటమూలమున సంతక మొనర్చు నాచారము కలదు. సంస్కృతభాష వ్యాపకమునం దుండిన నాఁటి శాసనములయందు పేరునకుం బిదప "స్వహస్తో మమ" అని చేర్చుచుండిరి. మధ్యకాలమునఁ బేరులకుం బిదప వ్రాలు అని చేర్చుచుండిరి. ఇది దస్కతు లేక సంతకము. ఇంక వ్రాయఁజాలనివారు ఏదేని యొకగుర్తు నాపత్రముపై లిఖింప, లేఖకుఁడు సాక్షుల యెదుట "కలము ముట్టిన నిశాని" అని పత్రము వ్రాసియిచ్చినవారిపేరునకుం బిదప చేర్చుచుండును. ఇంకను ఎడమచేతి బొటనవ్రేలిముద్రను సిరాతో నం దంటించు నాచార ముండుట (Thumb impression) గాననగును.

బ్రిటీషుసీమలందు తొల్లి చదువ వ్రాయ నేరనివారు కలముతోనొకసిలువను గుర్తుగ లిఖించి తమశీలును సిరాతో అద్దుచుండిరఁట. సిలువ క్రైస్తవమతపద్ధతి ప్రమాణముగను లేక ఒప్పుదలగను, శీలు (Seal) స్వంతగుర్తుగను నుండినవి. మధ్యకాలమున సిలువను (Cross) లిఖించి తనపేరును వ్రాయుట (సంతకము చేయుట) యాచారముగ నుండెను. ఇక్కాలమున సిలువ వ్రాయుట తగ్గి పేరువ్రాయుటతో (సంతకముతో) పూర్తియగుచున్నది. చర్చిసంబంధముగు ప్రతి పత్రమునందు సంతకములకుముందు సిలువను మానక వ్రాయుచుండుట నేఁటికిని నిలిచియున్నది.

**నిశాయనగోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు.)

**నిశీధసూర్యదర్శనము**—(ఉత్తరధ్రువ మహాసముద్రము చూ. నార్తుకేప్ అగ్రము చూడుఁడు.)

**నిశ్శంక కొమ్మనకవి**—ఆంధ్రకవులలో నాదికవులలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడినవాఁడు. ఈతఁడు రచించినది శివలీలావిలాసము. ఇక్కవింగూర్చి యంతగాఁ దెలియరాకున్నది.

**నిశ్శబ్దతాళము**— (తాళములు చూ.)

**నిశ్శబ్దమార్గక్రియలు** — (క్రియాప్రాణము చూ.)

**నిశ్వాసాసనము**—యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. కాళ్ళను ముందునకు నిలువుగాఁ జాఁచి, మడమల భూమి కానించి, పాదమును నిలువఁ జేసి, రెండుమడమలను రెండు బొటనవ్రేళ్ళను దరిజేర్చి, పైకి నిలువఁబెట్టి కూర్చుండుట. ఇందువలన శరీరమునకు బలముకల్గి శ్వాసగతి నిలుచునని చెప్పఁబడినది.

**నిశ్శ్రేయసగుణమార్గములు**-౧ నిర్ద్వంద్వము, ౨ నిత్యసత్యత్వము (నిజాయితీ లేక సత్యావ్రతము), ౩ నిర్యోగము (కోర్కులు లేకుండుట), ౪ ఆత్మజ్ఞానము.

**నిషధదేశము (నవనాగ)**- గ్వాలియరు పురమునకు వాయవ్యదిశగా నలుబది మైళ్ళ దూరమునఁగల నార్వార్ అనంబడు పురమును నిషధపురముగఁ బోల్చియున్నారు. ఈప్రాంత దేశము నిషధదేశముగా నుండియుండనోపు. తొల్లింట దీనికి నవనాగ దేశమనియుం బేరుండెనని తెలియు చున్నది. సర్వసాధారణముగ

కొంచె మెక్కువ తక్కువలతో మార్వారు దేశము నిషధదేశ మని తలంపఁ బడుచున్నది. నార్వార్‌పురము నలపుర మనుమాటయొక్క పరిణామరూపమా యని తోఁచెడిని.

లాసెన్ పండితుఁడు బీరారునకు వాయవ్యదిశగా నిషధదేశ ముండెననియు, బర్గెస్ పరిశోధకుఁడు మాల్వాకు దక్షిణముగ నిషధ యుండెననియు పరిశోధనలవలన ఫలితముగఁ దెల్పిరి. మహాభారతము,వనపర్వము,౫3 యందు నిషధదేశప్రశంస కలదు. నిషధ యన బురదనేల లేక జౌకునేల యని యర్థము. పరిపాలకులుగ నిషధదేశసందర్భమున నలమహారాజుపేరును దమయంతిపేరును నెఱుంగనివారు మనయాంధ్రదేశమున లేనేలేరు.

తొల్లింటి నిషధదేశవాసులను ఇప్పటి భీలులుగ పోల్చుచున్నారు. వారు తఱచుగ నితరులచేఁ దఱుమఁబడుచు దక్షిణదిశగా మాల్వాదేశ పశ్చిమభాగపు కొండలకు, ఖండ్ దేశములోని కొండలకు వింధ్యనగరమునందలి సాత్పుర వింధ్యపాదపర్వత భాగములకు, మాహీ,తపతీ, నర్మదా నదీతీరములకు నడిచి యటఁ జేరిరని Malcolm's Memoirs of Central India Vol. 1, Page 452 యందుఁ జెప్పఁబడినది.

**నిషధపర్వతము** — (కులపర్వతములు చూడుఁడు.)

**నిషధుఁడు**—అత్రి,చంద్ర,యదు, కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి కురుమహారాజు. సోదరులు పరీక్షిత్తు, సుధనుస్సు, జహ్నువు.

ఈతనినుండి ఈతఁ డేలిన దేశమునకు నిషధదేశ మనిపే రయ్యెను.

**నిషాత్ బాగ్ ఉద్యానవనము**—(కాశ్మీరదేశపు సుప్రసిద్ధోద్యానవనములు చూ)

**నిషాదస్థపతిన్యాయము**- నిషాదులలో నధిపతికి స్థపతి యనిబిరుదము కలదు. ఇచట నిషాదులకు స్థపతి యనియు, తాను నిషాదుఁడనియు నర్థమిచ్చును. కాని కరిబృంహితమువంటి పునరుక్తి కాదు.

**నిషాదుఁడు** — తండ్రి వేనుచక్రవర్తి. తల్లి సునీథ. సోదరుఁడు పృథుచక్రవర్తి. ఏలినది నిషధరాజ్యము. (ఉత్తరపాంచాలము చూ.)

**నిషేధములు**--నిషేధింపఁబడినవి.నిషేధమన తగనివని యర్థము. ఇట్టివి వేర్వేరు కార్యములకు వేర్వేఱు నిషేధములు చెప్పఁబడినవి.

రాజ్యపాలనయందుపక్షపాతము నిషేధము.

ఉద్యోగ నిర్వహణమునందు లంచగొండితనము నిషేధము.

సంఘసంస్కరణమునందు తా నాచరింపకుండుట నిషేధము.

వర్తకమునందు అబద్ధములాడుట నిషేధము.
దానమునందు ప్రతిఫలాపేక్ష నిషేధము.
యుద్ధమునందు అప్రమత్తత నిషేధము.
సన్యాసమునందు కోపము నిషేధము.
ధనార్జనమునందు దురాశ నిషేధము.
వైద్యమునం దపథ్యము నిషేధము.
జ్ఞానమునందు ఆచరణలోపము నిషేధము.
వైరాగ్యమునందు పట్టుదల నిషేధము.
భోజనమునందు మితి లేకుండుట (ఆబ) నిషేధము.

కార్యాచరణమునందు బద్ధకము నిషేధము.
తపస్సునందు నిశ్చలత లేకుండుట నిషేధము.
యాచనయం దసంతృప్తి నిషేధము.
ప్రసంగమందు పరుషవాక్యములు నిషేధము.
సభలయందు మితభాషిత్వము నిషేధము.
గురుత్వమునందు కనికరము లేకుండుట నిషేధము.

అనురాగమునందు మితిమీఱి యుండుట నిషేధము.

గమనమునం దజాగ్రత నిషేధము.

ఆరాధనయందు భక్తిహీనత నిషేధము.

సేవకావృత్తియందు ద్రోహచింత నిషేధము.

గౌరవము లందుటయందు దురహంభావము నిషేధము.

లెక్కించుటయందనాలోచనమునిషేధము

ప్రత్యుత్తర మిచ్చుటయం దనాలోచన నిషేధము.

**నిష్కము**— నాల్గు మాషముల పరిమాణము.

**నిష్క్రామము**—ఇది సంగీతశాస్త్రమందలి క్రియాప్రాణములోని మార్గక్రియయందలి నిశ్శబ్దక్రియలలోనొకటి. (క్రియాప్రాణముచూ.)

**నిష్ఫలస్వప్నములు**— ఇంతదనుకఁ జెప్పఁబడినవి శుభాశుభ స్వప్నములు రెండును సఫలస్వప్నములు. ఇంక నిష్ఫల స్వప్నములు ముదిమి మిగిలినతఱిఁ గల్గునవియు, శోకభయాదులవలనఁ గల్గునవియు, ఆఁకలిదప్పులవలనఁ గల్గునవియు, మూత్రపురీష ప్రకోపనిరోధాదుల వలనఁ గల్గునవియు, దివాస్వప్నములు నిష్ఫలములు.

దోషజ లేక రోగహేతుస్వప్నములు—

వాతప్రకృతితత్త్వములకు ఆకాశ గమనము, ప్రచండవాయువు, నల్లనిరంగు తఱచుగ స్వప్నమునఁ గాననగుచుండు ననియు, పైత్యప్రకృతి తత్త్వములకు మనుష్యులు, బంగారము, రత్నములు, సూర్యాగ్నులు, దీపములు, జ్వాలలు, మెఱపులు స్వప్నమునఁ గానంబడుచుండు ననియు, శ్లేష్మప్రకృతి తత్త్వములకు చంద్రుఁడు, నక్షత్రములు, తెల్లరంగు, సముద్రతరణము, జలములు స్వప్నములం దగపడుచుండు ననియుం జెప్పఁబడినది.

౧ రాజయక్ష్మ(క్షయరోగము) శరీరమునందంకురించి యుండుతఱిఁ గల్గెడి స్వప్నములు: గాడిద, ఒంటె, కుక్క వీట్లపై నెక్కుట స్వప్నమునఁ గలిగెనేని క్షయరోగ మంకురించి యున్నదని గ్రహింపవలయును.

౨ రక్తపైత్యరోగస్వప్నములు—లక్కరంగు, ఎఱ్ఱనిఆకాశము, స్వప్నమునఁ గాననగుట.

౩ రక్తరోగస్వప్నములు— ఎఱ్ఱనిరంగు,ఎఱ్ఱని వస్త్రములు, పుష్పములు, ఎఱ్ఱనిస్త్రీలు స్వప్నమునఁ గనఁబడుట.

౪ గుల్మరోగహేతుస్వప్నములు— కడుపునొప్పి, అపస్మారము తనకుఁ గల్గినట్లు, అస్త్రరోగము సంభవించినట్లు, గోళ్ళు నల్లవడినట్లు స్వప్నమగుట, ఱొమ్మున లతలు మొలచినట్లు కల గనుట.

౫ కుష్ఠరోగలక్షణస్వప్నములు— దిగంబరత్వము, దేహమున నెయ్యి రాచికొనినట్లును, ఱొమ్ముపై పద్మముజనించినట్లును, లేనియగ్నిలో హోమము వేల్చినట్లును కలఁ గనుట.

౬ ప్రమేహరోగస్వప్నములు—స్నానము,చందనానులేపనము,తనపై తేనెటీఁగలు ముసరుట.

౭ మధుప్రమేహరోగస్వప్నములు—చండాల నీచ సాంగత్యములు, నేయి ద్రావుట స్వప్నమగుట.

౮ ఉన్మాదరోగ స్వప్నములు— రాక్షస సహవాసము, నీట మున్గుట, ఈఁదుట, అతివాదము, ఆనందము, క్రోధము, స్వప్నమునఁ గల్గుట.

౯ అపస్మారరోగ స్వప్నములు— అతిభయము, అతిక్రౌర్యము, పగ, నృత్య మొనర్చుట స్వప్నమగుట.

౧౦ బహిరాయామరోగ స్వప్నములు— చక్కిలములు, అపూపములు, (అప్పములు)

తినుట, కక్కుట, తనదేహనాడులు నిలిచి పోవుట స్వప్నమునఁ దోఁచుట.

౧౧ జ్వరరోగదోషస్వప్నములు – శరీరము జ్వరగత మగుకతన జ్వరపరిణామసంబంధములుగ కోఁతులతో స్నేహము స్వప్న మగుట శోషసంబంధ మనియు, రాక్షసమైత్రి స్వప్న మగుట ఉన్మాదసంబంధ మనియు, పిశాచముల మైత్రి మూర్ఛాసంబంధ మనియు, నీరు ద్రావునట్లు స్వప్న మగుట ప్రమేహరోగ సంబంధ మనియు, దాహము ద్రావుస్వప్నము అతిసారరోగసంబంధ మనియు, తైలములు ద్రావుట కుష్ఠరోగసంబంధ మనియు, శిరస్సు హృదయము చంకలు పీట్లయందు మొక్కలు మొలచినట్లు స్వప్నమగుట గుల్మరోగసంబంధ మనియు, తినుట కక్కుట మార్గగమనము శ్వాసపిపాసరోగసంబంధ మనియు, పసుపు దినినట్లు స్వప్నమగుట పాండురోగ సంబంధ మనియు, రక్తపానస్వప్నము రక్తపిత్త రోగసంబంధ మనియు ఋషులుచెప్పియున్నారు. (స్వప్నశాస్త్రము చూడుఁడు.)

**నిస్సారుకము**—(తాళములు చూ.)

**నిహతగోత్రము**--(ఔశనస ఉపగణము చూడుఁడు.)

**నిహతనైకరిష్టగోత్రము**--(ఔతథ్యఉపగణము చూ.)

**నిహోన్‌దేశము**-(జపాన్ దేశముచూ.)

**నీకు రానిదీ నేను విననిదీ లోకములో లేనిదీ ఒకమాట చెప్పు మన్నాఁడట**—ఆంధ్రలోకోక్తి.

**నీచిర్వాగోత్రము**--(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**నీచో వదతి నకురుతే, నవదతి కురుతే సజ్జనః**— ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. నీచుఁడు చెప్పును గాని చేయుట యందు బాధ్యతఁ గల్గియుండఁడు. సజ్జనుఁడట్లు గాదు. చేసియుఁ జెప్పుటయందు బాధ్యతఁ గల్గియుండఁడు.

**నీటిం గాచుతఱి పాత్ర యెట్టిగఁ గాలకుండుట**—నీటిం గాచుట యన పాత్రయందు నీరుండు నని వేఱుగఁ జెప్ప నక్కఱయుండదు. ఇంక నీరు బోయిలింగుపోయింటు వేఁడికిఁగాని ఆవిరి యైపోదు. గాన నంతదనుక (బోయిలింగుపోయింటునకు తక్కువవేఁడియందే) ద్రవరూపము (Liquid form)నసె పాత్రయందుండునని స్పష్టమగును. వేఁడితో నెంతదగ్గఱ సంబంధము గల్గించినను తక్కువ కెంప రేచురునందున్నదానిలోని నీరు పాత్రకుం గల్గుచున్న వేఁడిని పీల్చుకొనుచు లాగికొనుచుండుం గాని దాని నట్లే వదలి పెరుగనీయకుండును.

వేఱువిధముగ నీరంతయు నావిరియై మొగసి పోయినతఱి, పాత్ర వేఁడియై ఎట్టుగఁ గాలినఁ గాలుంగాని, నీరుండుతఱి నెట్టుగఁ గాలదు. నీరు లేని వట్టిపాత్ర ఎట్టుగఁ గాలుటకు ప్రస్తుతాంశముతో సంబంధము లేదు.

**నీటిమట్టము**-- నీటిపైమట్టముసమముగ నొకేరీతి నుండు నని తలంపఁ బడుచున్నది. కాని ఇంచుక పరిశీలించిన నీతలంపు పొరపాటని తోఁచకపోదు. భూమి గుండ్రముగ నుండియు మధ్యమున(భూగర్భమున)గొప్ప యాకర్షణస్థితి గలదు. అదియే భూమిపైనుండు సమస్తపదార్థములను తనదిశ కాకర్షించుకొనుచున్నది. అట్లే భూమియొక్క ఉపరిభాగమును మధ్యభాగము వైపున కాకర్షింపఁబడుచునేయుంట భూమి గుండ్రనిబంతివలె నుండుట సంభవించెను. భూమిపై పల్లములందున్న నీరు సముద్రములుగను, సరస్సులుగను, నదులు మొదలగుజలాశయములుగను నున్నవి. ఇవియు భూగర్భము వైపు నాకర్షింపఁ బడుచునే యుండుట విధియై

యున్నది. నీరు భూమియం దింకుటకును ఆకర్షణ శక్తియే కారణము. ఈఆకర్షణశక్తికి Gravity యని పేరు. సముద్రజలములును భూమితో పాటు తామును అనుకూలించుటకు భూమి గుండ్రముగ నున్నట్లె తమ ఉపరిభాగమగు నీటిమట్టమును నించుక వంచి బంతివలె భూమి యుండునట్లు చేయుచున్నవి. చిన్న సరస్సులందలి నీరును భూమితోపాటు అటులనే తమ నీటి మట్టము నించుక వంచి యుండును. భూజలాదులను నొకేరీతి నాకర్షించు గ్రావిటీధర్మబద్ధమైన జలముల ఉపరిభాగము లిట్లు వంగియుండియు, ఆవంగుట చాల స్వల్పస్వల్పముగవంగియుంట, మననేత్రములకుఁ దెలియకుండుం గాని, పరిశీలనలవలన తెలియకపోదు. (గ్రావిటీ చూడుఁడు.) భూమి బంతివలె గుండ్రముగ నుండుటంగూర్చి వ్రాయనక్కఱయే లేదు. భూమి యెంత స్వల్పముగ వంగి బంతివలె గుండ్రముగ నగుచున్నదో అందలి పల్లములందు నిండియున్న సముద్ర సరస్సుల జలములును అట్లే తామును వంగుచు భూమి గుండ్రముగ బంతివలె నుండుట కనుకూలించు చున్నవని తెల్పుట సమంజసము.

**నీటియడుగున నుండి చూచు చేఁపల కగపడుదృశ్యము**— ఆంధ్రదేశమున పల్లెవాండ్రయందు "మన కగపడని చేఁపలు సైతము మనలం జూడఁ గలవు" అనుసామెత గలదు. దీనిం జక్కఁగఁ బరిశీలించిన నీటినుండి చేఁపలు ఒడ్డున నున్నవారిం జూడఁగల వనియు, దరినున్న వారలకు నీటిలోనిచేప లగపడుట దుస్తర మనియు స్ఫురించెడిని. దీనికి ముఖ్య కారణము ఒడ్డున బయట నున్నవారు ఎక్కువ వెలుతురునం దుండుటయు, నీటియందు తక్కువ వెలుతురుంట చేఁపలు మొదలగునవి తక్కువ వెలుతురునం దుండుటయు నైయున్నది. తక్కువ వెలుతురునం దుండి, యెక్కువ వెలుతురునం దుండువాటిని జక్కఁగఁ జూడఁ గల్గుదురు గాని, ఎక్కువవెలుతురునం దున్నవారు తక్కువవెలుతురునం దుండువాటిని జక్కఁగఁ జూడఁజాలరని యెల్లరెఱింగినదే. కాని యిచట నీటిగుండా చూచుట యనునది పరిస్థితులంగూడ కొంత మార్పు నందించెడిని. ఇటీవలి పరిశీలనలనుండి నీటి యడుగుభాగమున తానుండి పైకిఁ జూచిన చేఁప కగపడుదృశ్య మిట్లు వివరింపం బడినది. నీటియం దొకగుండ్రని ప్రదేశము నీటి యుపరి భాగమునుండి చేఁపకండ్లవఱ కగపడి, దాని గుండా ఆకసమం దెగురుపక్షులు మొదలగు వాటికి చక్కఁగ నగపడునది వెలుతురుగా తెలిసెడిని. అం దగపడుటయే సంభవించునేని దరినున్నవికూడఁ జక్కఁగఁ గన్పించెడిని. అట్టి వెలుతురు (వృత్తము) తావుం జుట్టియున్న కొంత ప్రదేశము కదలిక గల్గినరీతిని బహుముఖముల అద్దమునందువలె చేఁపకుఁ గన్పడును. ఇంకను దానిం జుట్టి దూర మరిగినకొలఁది దృశ్యము బలము తగ్గిపోవుచుండును. ఒక్కొకతఱి వెలుతురు రంగుల ననుసరించి చుట్టు వేర్వేఱురంగు లగపడుటయుంగలదు. దరినున్న వారికిఁ జక్కఁగా నీటిలోనివి కన్పడక వంగినట్లును, కదలునట్లును గూడ నీటిగుండా చూచిన దృశ్య ముండెడిని. చీఁకటిలో నసలే కన్పడకుండును.

**నీటియావిరి, పొగ, ఫోర్సు**— నీటిం గాచిన యావిరి బయలుదేఱును. ఆ యావిరిని బహిర్వ్యాతావరణములోని కరుగనీక యొక యావరణమున నిర్బంధించితిమేని దానికిం బిదప వచ్చునావిరి యొత్తిడిగల్గింప మొదలిడును. ఒత్తిడి యుండుచు నాయావరణమంతయు నిండినపిదప నింకను గల్గుచుండునొత్తిడిచే దానినుండి తప్పించుకొని బయటఁబడ ప్రయత్నింప మొదలిడును. ఆప్రయత్నమునే ఆంగ్లపండితుడు (Force) అనిరి. ఆఫోర్సునేయొకబలముగఁ గైకొనియంత్ర

ముల నడిపించుచున్నారు. అట్టి యావిరియే మానవుల కుపయోగించుచున్నది. ఇంక నట్లు నిర్బంధింపఁ బడక బహిర్వాతావరణమునంబడి గాలితోఁగలియుచుండునావిరి యెందులకుంబనికి రానిదియై పోవును. ఒకపాత్రలోఁ గొంతజలము పోసి, పైని పలుచని రేకుమూఁత వైచి కాచితి మేని ఈపనియే జరుగును. లోన నొత్తిడి యధిక మగుకతన నావిరి పైకిఁ దప్పించుకొన ప్రయత్నముగ పైమూఁత నొకవైపు ఇంచుక పైకెత్తి తాను దప్పించుకొనుచుండుట చూచుచునే యుందురు. ఇట్టి యావిరియే మానవోపయోగ మునకై యుపయోగించుచు యంత్రములను నడుపునది. తప్పించుకొని బయటఁబడిన యావి రియు, మూఁత లేక పైకెగురుచుండు నావిరియు నిరర్థకములే.

ఇంక పొగ ఒకగాలి (Gas) కానేరదు. నిర్బంధింపఁబడినతత్తే తప్పించుకొనుప్రయత్నము చేయునది కాదు. దానియందు ఫోర్సు లేదు. అగ్నియందు కాలక తప్పిపోయిన పదార్థము. పరిశీలించినవా రది గట్టిపదార్థమునందలి త్రస రేణువు లనిరి. అవి చులుకనయై గాలియం దెగురఁగలవు గాని మానవోపయోగమునకుఁ బనికిరానివిగా నున్నవి.

**నీటిలో జాడలు వెతకినట్లు**— ఆంధ్ర లోకోక్తి.

**నీటిలోనిమూట**— ఆంధ్రభాషాసాంప్ర దాయార్థపదము.

మాయాకల్పితమగు భ్రమయే గాని నిజముగ లభించునది కాదని చెప్పుటకు నిరసనగా నీఉక్తిని ప్రయోగించుచుందురు.

"నీటిలో ప్రతిఫలించు ధనపు మూట వలె" నని భావము. ఇది "దర్పణదృశ్యమాననగరీ తుల్య" మను నుక్తి దీనినే పోలినయభిప్రాయము గలది.

**నీటిలో నుండువస్తు వొకప్పుడు వంగియున్న ట్లగపడును**—నీటిలోనుండు నొకవస్తువును చూచుట యన నీటిగుండా చూచుట యగును. నీటిగుండా చూచుట ఆనీటియంత దళసరి అద్దముగుండా చూచుట వంటిది.

ఇంక చూచుటయన నేమో యోచింతము. మన మొకవస్తువును చూచుటయన ఆవస్తురూప మును, వెలుతురుకిరణములు మన నేత్రావయవ ముకడకుం జేర్చుచున్నవని భావము. వెలుతురు కిరణములు పెక్కు కలవు. అం దేడు ముఖ్య ములు. ఈయేడును గలిసి ఎల్లదిక్కులం గాంచు తెల్లరంగు వెలుతురుకిరణము లగుచున్నవి. ఇట్టి వెలుతురుకిరణములు పరంపరగా నెడ తెగక నొకరీతి నావస్తురూపమును మనకడకు తెచ్చు చుంటయు, మనదృష్టి నావస్తువుకడకుంగొంపోవు చుంటయు జరపుచుండుతతే, కొంతదూరము నీటి గుండాగూడ ప్రయాణ మొనర్పవలసియుండును.

నీరు కదలక నిశ్చలముగానుండుతతే, అద్దము గుండా నగపడునట్లు కొంత దర్పితమై (పెద్ద దగు రూపము కలదిగ) గానవచ్చుం గాని నీరేమాత్రమైనను గాలికిఁ గాని తోణకుటవలనఁ గాని కదలుచున్నతతే, వెలుతురుకిరణములును నీటితోపాటుగనే కదలియు, వంకలు తేఱియు, వికారరూపము బహుముఖముల అద్దమునందలి రూపప్రతిబింబమువలెఁ గాననగును. దీనిని వంగి నట్లు కనపడుచున్నదని తలంతుము.

**నీడగడియారము** -(ఛాయాగడియా రము చూ.)

**నీపుఁడు**- -బృహదిషుని సంతతి వంశ క్షత్రియుఁడు. తండ్రి పారుఁడు. నీపునకు నూర్గురుసుతులు. (అందు జ్యేష్ఠుఁడు సమరుఁడు. కాంపిల్యాధిపతి యైనవాఁడు.)

**నీరు కొట్టి చెయ్యి నాకినట్లు**-(ఏమియు రాదని భావము). ఆంధ్రలోకోక్తి.

**నీరుగొబ్బిచెట్టు**—(గొబ్బిచెట్టు చూ.)

**నీరు ఘనీభవించి మం చగుట**—నీటియందుఁగూడ వేఁడి కలిసియుండును పైన నుండుగాలి యధికమగు చల్లఁదనము కలదియగు నేని క్రిందనీటియం దిమిడియుండు వేఁడింగూడఁ బీల్చుకొన నారంభించును. గాన తనయందిమిడి యున్న వేఁడింగూడఁ గోల్పోయిన యాయుదక మింకం జల్లఁబడుచుండును. కాని,యది లోఁతు తక్కువనీ రగునేని క్రిందిభూభాగ మించుక వేఁడింగల్గి యుండుంగాని, అది యుదకముతోఁ గూడ చల్లఁబడఁజాలదు. సెంటిగ్రేడు తెర్మామీటరునందలి లెక్కమేరకు నాల్గు డిగ్రీల వఱకు నీరు శీతలస్థితియందు బరువై, అడుగుపొరగా దిగుచు, నించుక వేఁడి యధికముగ నున్న నీటిం బైకిపోనిచ్చుచుండుం గాని,నాల్గుడిగ్రీలు మొదలు జీరోవరకును అట్లు జరుగక అడుగంటక పైననే యుండును. ఇట జీరో యనిన ఘనీభవించుహద్దని (Freezing point) యెఱుంగునది. అట్లు సెంటిగ్రేడు నాల్గుడిగ్రీలనుండి ఫ్రీజింగుపాయింటుదనుక బరు వెక్కక తేలిక యగుట కారంభించి, కడకు మంచుగనై నీటి పైపొరగ నేర్పడి యుండుంగాన,నీరు అడుగుననుండిగాక పైనుండి యడుగునకు ఘనీభవించు ననుధర్మ మేర్పడి యున్నది. ఇందువలన నింకను మెరకగ లోఁతధికముగ లేకయుండు చెఱువులందు వేగిరముగ ఘనీభవించెడిని. అట్టితఱి లోఁతునీరు నీరుగనే యుండునని యెఱుంగునది. దీని కుదాహరణము హిమవత్పర్వతసీమలందు కాళీనదీజన్మస్థానము కడ నున్న వ్యాసగుహచెంగటి వ్యాససరోవర మెప్పుడు పైపొర మంచుగను, దానిం గజములతోఁ బగులఁదీసిన లోనున్న జలములు ద్రవరూపముగను నుండెడిని. ఇది యాత్రాస్థలమై కైలాసశిఖరముకడ దర్చిన్‌గ్రామమున కరుగు మార్గమం దున్నది.

**నీరుడివిత్తులు**—(బాదము చూ.)

**నీరు తడుపుట- పాదరస మంటకుండుట**—నీరును, పాదరసమును ప్రవహింపఁగల పలుచని ద్రవపదార్థములే. జిడ్డునుండి చేతులను శుభ్రముగా కడిగికొని నీట ముంచిన నాసీ రించుక చేతంబట్టుకొని తడిగాచేయుంగాని పాదరస ముంచిన నట్లు గాక చేయి పొడిగానే యుండెడిని. ఈసందర్భమున శరీరచర్మమునకు జిడ్డుతో కొద్దిగ సంబంధ ముండియేయుండు ననియు, ఆజిడ్డు శరీరములోనుండియే లూబ్రికేషన్ (Lubrication) మూలమునఁ గల్గుచుండుననియు మనసునం దుంచుకొన వలసియుండును. చేతిచర్మమునందు జిడ్డే యుండినతఱి నీరుకూడ చేతుల కంటకపోవచ్చుం గాని లేనట్లు వలె తడపఁజాలకుండును. పాదరస మట్లు గాక జిడ్డులేనిచో చేతి కంటదు. నీరు తడుపును. ఇట నీరుతడుపుట యన శరీరచర్మముచే నాకర్షింపఁబడి దానిం జేరుకొనుట యనియు, పాదరసమ ట్లాకర్షింపబడక యంటుకొనకపోవుట యనియు నెఱుంగునది.

**నీరు పల్ల మెఱుఁగు నిజము దేవుఁ డెఱుఁగు**—ఆంధ్రలోకోక్తి.

**నీరుల్లి**—(ఉల్లి చూడుఁడు.)

**నీరుల్లిపాయలు తఱుగుతఱి కండ్ల నీరుగల్గుట-ఘాటు**— మన కండ్లలోని, కొంకభాగమునుండి నీరు ప్రవహించుమార్గములు సన్ననిరంధ్రములును, వేఱొకవైపున ఆనీటిని శరీరములోని కింకఁజేసి లోనికిం గొంపోవు సన్ననిరంధ్రములును గలవు. వాట్లపని సర్వదా జరుగుచునేయుండును. అనఁగా తఱచుగ కండ్లలోనికి కొన్ని మార్గములగుండా కొంచెముకొంచె

ముగ నీరు వచ్చుచుంటయు, తోడనే మనకంటి రెప్పలు మూసికొని తోడనే తెఱచుటతో నానీటిచే కండ్లయందు పడఁగల చిన్నచిన్న అపరిశుద్ధపదార్థాణువులు కడిగివేయఁ బడుటయు (ఇట్లు నేత్రము పరిశుభ్రముగ నుంచఁ బడుట యైనతోడనే),తిరుగ నానీరు వేఱుమార్గములగుండా శరీరములోని కేగుచుంటయు సర్వదా జరుగుచునే యుండును. ఇది తఱచు కనురెప్పలు మూసి తెఱచుతఱి నడుచుపని.

ఇంక నీరుల్లిపాయ పొరలనడుమ అక్రిడ్ ఆయిల్ (Acrid Oil) అనుపదార్థ ముండును. ఉల్లిపాయలు తఱుగుచున్నతఱి ఈ అక్రిడ్ ఆయిల్ కొంతకొంత బయటఁబడుచుండుట తటస్థించుచుండును. దీనిని వొలెటైల్ (Volatile) పదార్థ మందురు. వొలెటైల్ అన గాలిసంబంధము గల్గునట్లు బయటఁబడఁగనే తాను నెగిరి గాలిలోఁ గలిసిపోయి తనయందున్న (గంధకధృతి)పదార్థమును నలుదెసలకుఁ జిమ్మి పర్విడఁ జేయునది యనియర్థము. ఈగంధకధృతి నేత్రముల మండఁజేయుఘాటు గాన దానిని పరిశుభ్రపఱుప నెక్కువ నీరు నేత్రములలోనికి దానంతట నదియే వచ్చును. దానిని దిరుగ శరీరములోనికిఁ గొంపోవ రంధ్రములు చాలకుండుం గాన నానీరు బైటకుం గాఱ మొదలిడును. కండ్లనీరు గాఱుచున్నదని యనుకొందుము.

**నీరుల్లి వ్యవసాయము**--నీరుల్లి యన లోన నీరుగల ఉల్లి యని భావము. దీనిని ఎఱ్ఱఉల్లి యనియు ననుట కలదు. ఇట్టివాడుక యున్నను ఇందు ఎఱ్ఱనిరంగుగల పాయలు, తెల్లనిరంగుగల పాయలు రెండు ముఖ్యభేద జాతులు కలవు. ఉల్లిదుంపను గడ్డ యనియు, పాయ యనియు నందురు. రెండుజాతులను నీరుల్లి యనియే వాడెదరు.

ఈపైరు తోఁటపైరులలోనిది. భరతదేశము, ఈజిప్టు దేశము, మొదలగు పలు దేశములందుఁ గలదు. బావులక్రింద నీరు తోడి యీపైరు పెట్టుచుందురు. విస్తారము తేలికగా నుండని నల్లభూములు మొదలగున వన్నియు నీపైరున కనుకూలములు. శీతకాలమున నీపైరు చేయుచుండుట వాడుక. చిన్నచిన్న పాయలను విత్తనపుపాయ లనియెదరు.

దీనివిత్తనము రెండువిధములుగా నున్నది. చిన్న సన్నపు ఉల్లిపాయలు పాతిన, మొక్కలు బయలుదేఱి నడుమనుండి కాడలు పైకిలేచును. వాటికడను పూవువలెఁ బుట్టును. వీటిని ఉల్లికోళ్లనియెదరు. ఆపువ్వు ముదిరిన నందే నల్లని గింజలు విత్తులుగ నేర్పడును. వాటిని పాతి నారుచేసిన నారు పుట్టును. వాటిని నూక్చినచో పైని ఉల్లికోళ్లు రావుగాని క్రింద పాయ లేర్పడును.

ఉల్లిపాయలను ఆ అంగుళముల కొకటివంతున పాతుదురు. ఉల్లిమడికి నీరు తోడుచుంట యవసరము. మామూలు పశువులపెంట, బుగ్గి, వీధుల ఊడ్పుచెత్త, ఎరువులుగ వైచెదరు. నీరు ముఖ్యము. మూఁడు నెలలకు పండును.

**నీలకంఠక్షేత్రము**— నేపాలదేశములోని శివపురి (ప్రి. యోపురి యనుచున్నారు.) పర్వత పాదమునఁగల నీలకంఠశివక్షేత్రము. శివపురికి తొల్లింటిపేరు శతరుద్రపర్వతము. ఇది కట్మండు నగరమున కుత్తరదిశగా నైదుమైళ్లదూరము. దీనింగూర్చి బృహచ్ఛివపురాణము, ఉత్తరఖండము 3-౨ యందు ప్రశంసకలదు.

వేఱొక నీలకంఠక్షేత్రము కౌశికీనదీ జన్మస్థానమునఁ గలదనియు, ఇట నీలకంఠేశ్వరశివలింగము కలదనియుం జెప్పఁబడినది. తావు సరిగాఁ దెలియదు.

ఇంకను మైసూరుకడ నున్న నంజన్‌గుడి దేవస్థానము నీలకంఠక్షేత్ర మనియు, నంజుండశబ్దము

నీలకంఠశబ్దమునకు కన్నడభాషానువాదపదమే యనియు నందురు.

**నీలకూట (పర్వతము)**-అసామునందు (తొల్లింటి కామరూపదేశము) కామాఖ్య (కామరూపి) దేవస్థానమున్న పర్వతముపేరు. (కామరూపదేశము చూ.)

**నీలగంగ (నది)**--గంగలో సంగమమగు నొక యుపనది. దీనిని నీలగంగ యనియు, నీలధార యనియు ననుచున్నారు. నిజముగ నిది యొక జలపాతము. హరిద్వారపురముకడ నున్నది.

**నీలగిరిజిల్లా**-అఱవదేశములోనిది. చెన్నపురిరాజధానిం జేరియున్నది. నీలగిరి పర్వతము పేరు. ఉదకమండలపట్టణము ప్రధానస్థానము. ఇది సమశీతోష్ణప్రదేశము. చెన్నపురి ప్రభుత్వమువారికి వేసవినివాసము. కూనూరు, వెల్లింగ్టను, కోటగిరి, యితర సమశీతోష్ణస్థానములు. కాఫీ, తేయాకు, చింకోనా, యూకలిప్టసు తోఁటలు విస్తారముగాఁ గలవు. దీని పరిపాలనయందు వేనాండు పరగణా చేరియున్నది. ఇందు బంగారుగనులు కలవు. మానంటాళి ప్రధానస్థానము. నీలగిరి పళనికొండలశాఖయే. వీటియందే తూర్పుకనుమలు, పడమటికనుమలు కలియును. పళనికొండలయందే పళనిగ్రామముకడ సుప్రసిద్ధ సుబ్రహ్మణ్యక్షేత్రము కలదు.

**నీలజ్యేష్ఠాష్టమి**--భాద్రపదశుద్ధాష్టమిని జ్యేష్ఠానక్షత్రముకూడిన నీలజ్యేష్ఠాష్టమి యనెదరు. ఆదినమున నీలజ్యేష్ఠావ్రతమాచరింతురు.

**నీలతాళము (నల్లతాడి, హింతాలము)**—ఇది తాటిచెట్లలో నొకజాతి. చీఁకటిమ్రానియు నందురు.

**నీలధారా (నది)**-హరిద్వారముకడనున్న జలపాతపునది. (నీలానది చూ.)

**నీలము**-లా. Sapphirus.ఆంగ్ల.Sapphire. ఫ్రెంచి. Saphir జర్మన్. Sappheiros. హీబ్రూ. Sappir.సం. నీలః.

ఎక్కువభాగము స్వచ్ఛత గల్గినరత్నము. ఇది నవరత్నములలో నొకటిగఁ జెప్పఁబడినది. నీలి ఊదారంగు గల్గిన దాయి. ఇటీవలి పరిశోధనలు నీల మొక ప్రత్యేకజాతి గాదనియు, కెంపువలెనే యిదియు కురువింద (Corundum) జాతికిం జెందినదే యనియు వెల్లడించినవి. కెంపునకు నీలమునకు రంగునందుఁ దప్ప వస్తుతః భేదము లే దందురు. కెంపునకన్న నీల మించుక గట్టిగనుండు దాయి. ఇంకను కురువింద మెఱ్ఱనిది కెంపుగను, నీలి ఊదారంగుది నీలముగను అగునట్లు నీలమునందింకను భేదజాతుల రంగులు గల వందురు. నీలమునకు వేఁడిసంభవించిన రంగు గోల్పోయి స్వచ్ఛత మిగులును. తెల్లకురువిందమును నీటినీలము (Water sapphire) అందురు. పసుపుపచ్చనీలమును (కురువిందము) గలదు. దీనిని కనకపుష్యరాగ మనియు వాడుట కలదు. సగటున రంగులేని నీలమును తెల్ల నీలమందురు. (Leucosapphire.)

నీలము స్వచ్ఛత గల్గియుండి విస్తారము గాఢమగు రంగు గాక మనోహరమగు నొకపాటి నీలపురంగు గల్గియుండిన శ్రేష్ఠమని చెప్పఁబడినది. వర్షపుమబ్బుయొక్క నీలిధాతువు నీలమునందుఁ దోఁచుచుండిన నది ఇంద్రనీలమనంబడు నుత్తమజాతి యనియు, శ్రేష్ఠమగు జాతినీలము తనపరిమాణమునకుం దగినట్లు పచ్చగరిక లేఁతపరకను బట్టుకొని యాకర్షించుననియుఁ జెప్పఁ బడినది. దానిని తృణగ్రాహినీల మందురు. నీలమునం దొకప్పుడు పసుపుపచ్చ, తెలుపుధాతువు మచ్చ లుండుటయుం గలదు. నీలములోన మేఘముంబోలిన పొర

యుండును. ఇది దోషముగ నెన్నఁబడుచున్నది. ముదురురంగుగల నీలములకన్న లేఁతరంగు దట్టముగనున్న నీలము లెక్కువవెల కమ్ముఁడు వోవును. ఇట్లనుటవలన రంగుతక్కువ నీలములకు వెల బాగుగ నుండునని తలంపఁజనదు.

ఎక్కువ విలువగల్గిన నీలములు సయాం దేశమున లభించు చున్నవి. మఱియు సింహళ ద్వీపమునను, బర్మాదేశమునను నీలములు దొరకును. ఇవి తఱుచుగ కెంపులుదొరకు గనియందు దొరకుచున్నవి. మహానీల మణి యనంబడునది స్వచ్ఛమగు నాకాశవర్ణము గల్గియుండుననియు, దీనియం దాకర్షణశక్తి యధికముగ నుండుననియుఁ జెప్పఁబడినది గాని అట్టినీలము లభించుట దుస్తరము.

ఆయుర్వేద వైద్యశాస్త్రోక్తముగ నీలమును భస్మము జేయుదురు. ఇది వేఁడిచేసి ఇంచుక పైత్యము జేయును. ఆకలిని రేఁపును. దగ్గులు నివారించును.

**నీలాచలము**—దీనికి నీలపర్వత మనియు వాడుక గలదు. (ఉత్తరదేశములోనిది)

జగన్నాథమున (పూరి) జగన్నాథదేవాలయ ముండిన చిన్నమిట్ట. ఇది పర్వతమని సాధారణముగాఁ దెలియమి నెత్తగు ప్రదేశమని తోఁచెడిని. కాని శిలాతల మగుట స్పష్టము. ౨౦ అడుగులయెత్తుండును. దీనింగూర్చి పద్మపురాణము.పాతాళ, ౯ అధ్యా. ప్రశంసకలదు.

మఱియు సమశీతోష్ణ ప్రదేశమగు నీలగిరి కొండలకును, అసామునందు (తొల్లింటి కామరూపదేశము) గౌహతీపురముకడ కామరూపిణీ దేవీదేవస్థానముండిన పర్వతమునకును ఇదే పేరు కలదు. మఱియు హరిద్వారముకడ (శివాలిక్) కనుమలకును ఈపేరే కలదని తెలియుచున్నది. ఇందు జనించి గంగానదిలోఁ గలియు జలపాతధారానదికి "నీలధార" యనిపేరు.

**నీలాంజనము** — దీనికి ఇతరభాషల యనువాదనామములుసరిగా తెలియరాకున్నది. ఇది Sulphate of Antimony జాతులలో నొకటి యని కొంద అనుచున్నారు. సంస్కృత భాషయందు పార్వతేయం, మేచకం, దుష్పదం, నీలం, అంజనం అను పేర్లు. ఇది సుర్మాతాయి వంటి తాయి. ఇది సుప్రసిద్ధమగు నంజనము. సుర్మాతాయిజాతిదే.

దీనిని శాస్త్రోక్తముగ భస్మమొనర్చి లోనికిచ్చిన గుల్మరోగములు, నాసికారోగములు, మందాగ్నిరోగము, మూలవ్యాధి, విషదోషములు, శ్వాసకాసలు, రక్తకాస, క్షయరోగముల నివారించుననియు, అంజన మిడిన నేత్రరోగములు నివారించు ననియుఁ జెప్పఁబడినది. (సుర్మాతాతికి సౌవీరాంజన మందురు.)

**నీలాత్రేయగోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు.)

**నీలానది (ఆఫ్రికా నైలునది)**—(నైలునది చూ.)

**నీలాయనగోత్రము** — (ఆత్రేయగణము చూ.)

**నీలికారోగము** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున నేత్రరోగములలో నిది యొకజాతికి పేరు. క్షుద్రరోగము.

**నీలిమందుచెట్టు (నీలిమందు)**— లా. Indegofera Tinctoria (Dicum). ఆంగ్ల. Indigo. స్పానియా. Indico. ఫ్రెంచి. Indigo. జర్మన్. Indikon. సం. నీలికా, నీలీ, గ్రామణీ, గ్రామిణీ, గ్రామిణా, గ్రామ్యా, రంజనకేశీ.

నీలిమందుచెట్లు చిన్ననీలి, పెద్దనీలి యని రెండు భేదములుగ నుండును గాని అన్ని లక్షణములందు రెండు నొకటిగనే యుంట భేదము

పాటింపఁబడుట లేదు. నీలి చవిటినిస్సారపుపొల ములకు మంచిబలము నొసఁగు నెరువు, గాన నట్టిపొలములందు నీలి మొలపించి ఎదిగినపైని కలియదున్ని వైచెదరు. సుప్రసిద్ధ మగు ఎరువగు వెంపలిచెట్టును అడవినీలి యనియెదరు. (Wild Indigo).

ఇది భరతదేశము మొదలగు ఉష్ణదేశము లందు పైరగును. ఈచెట్లనుండి నీలిమందు తీయ నగును. ఇట్లె కొన్ని యితరజాతి చెట్లనుండి కూడ నీలిమందు వచ్చునందురు. నీటియం దీచెట్లను కొన్నిగంట లూరవైచిన నీలిమందు నీటిలోనికి జాటి వచ్చును. దాని కాంగ్లమున Indican అనిపేరు. దానిని కాచి నీలిమందు చేయుదురు. గాలి తాకనీయక ఆనీటినుండి నీలిమందును వేఱుచేయఁ గలుగుదు మేని, అది తెల్లనిగుండ యగును. దానికాంగ్లమునIndigo whiteఅని పేరు. దానియం దేరంగు నుండదు. గాలితాఁకు టతో ఆక్సిజెన్‌వాయువును పీల్చుకొని నీలిరంగు గల నీలిమం దగును.

ఇక్కాలమున నిదేరంగు 'కోల్తారు'నుండి చౌకగ తీయఁబడుట కనిపెట్టఁ బడినది. గాన నీలిమందు చెట్లనుండి చేయఁబడుట చాల భాగము తగ్గిపోయినది. ఆంధ్ర దేశమున పెక్కు చోట్ల తొల్లింటికాలపు నీలిఫ్యాక్టరీలు పాడుపడి యుంటఁ గాననగుచుండును.

నీలిచెట్టువేఱు కషాయము జంతువిషము లను, పాషాణవిషములను హరించు ననియు, నీలిచెట్టుఆకు కషాయము సమస్తవిషములు, మూత్రకృఛ్రము, ప్రక్కశూలలు, నోటిపూత, నోటిరసపుపట్లు, పుప్పిపంటిబాధ, గజ్జి, చిడుము మొదలగు చర్మరోగములు, నరములవ్యాధులు, మూర్ఛ, ఒగర్పుదగ్గు, మూత్రనిరోధము నివా రించు నననియు, పైకిరాంచిన మూత్రనిరోధము, శైత్యదాహ మడఁగు ననియు, వేఱునందు విరేచనముజేయు గుణము గల దనియుఁ జెప్పఁ బడినది. నీలిచెట్టు సమూలకషాయము ఎక్కువ బలముగ పనిచేయునందురు. (నీలిమందు చూ.)

**నీలివార్త**— ఆంధ్రభాషాసాంప్రదాయార్థ పదము. కేవలానృత మయ్యు ప్రజలు నమ్మునట్లు దేశమందు వ్యాపించినవార్తకు "నీలివార్త" యని వాడుదురు.

**నీలుఁడు**— అత్రి, చంద్ర, యదుసంతతి క్షత్రియుఁడు. తండ్రి అజమీఢుఁడు. సోదరులు బృహదిషుఁడు, ఋక్షుఁడు. పుత్రుఁడు భర్మ్యాశ్వుఁడు.

మఱియు రాజసూయయాగమునకై పాండవులు దిగ్విజయ మొనర్చుతఱి సహదేవునితోఁ గలహించిన మాహిష్మతీ పురాధీశుని పేరు నీలుఁడు.

ఇంకను సుగ్రీవుని సేనాధిపతులలో నొక నీలుఁ డనువానరుఁడు కలఁడు. ఈతఁడు అగ్ని వలన పుట్టినవాఁడు.

**నీలోదరవృశ్చికము** — ఇది మహావిష వృశ్చికజాతి. (తేలు). అపాయకరము.

**నీవారానది** — దీని నిప్పుడు నిబారా యనియు నందురు. నీరానది యని కొందఱు వాడెదరు. భీమానదిలో సంగమించు చిన్న నది. పడమటికనుమలలో నుద్భవించునది. దీనింగూర్చి పద్మపురాణము- స్వర్గ - ఆది. 3 అధ్యాయమున ప్రశంస కలదు.

**నీళ్లు కొడితే రెం డగునా?**— ఆంధ్ర లోకోక్తి.

**నీళ్లు గాఁచుకొను పాత్రయందు మార్బ్లెలు (బలపము) నుంచుట** — నీటియందు పెక్కు ఉప్పులు, పులుపులు(Salts & Acids) ఉండునని కనిపెట్టం బడియుంట యంద తెఱింగినదియే. నీరు వేడియెనతఱి నవి

యన్నియు నడుగునకుం జేరుకొనుచుండును. పై నీరు వాడుకొన, అడుగున నుండిపోయిననీటియం దివి యుండిపోవుటతో అడుగంటి, రానురాను పొరవలె నేర్పడుచుంట సంభవించెడిని. కాఁగు నీటియం దొక బలపము నుంచుచుండిన, వాటి నాకర్షించుశక్తి గలది గాన, వాటి నొక తావు నకుం జేర్చి పైకి రానీయదు. దానిని శుభ్రముగఁ గడిగికొనుచుండిన వాడుకొనునీటికి వాటి బాధ యుండదు. ఐరోపా దేశములం దిట్లు Kettle పాత్రయందు నీటింగాచుతఱి నం దొక బలపము నుంచుట ఆచారమై వాడుక నంది యున్నది.

**నుయ్యి తియ్యఁబోతే దయ్యము బయటుపడ్డట్టు**—ఆంధ్రలోకోక్తి.

**నులిగడుపు**—(ఆమాతిసారము చూ. అమీబా చూ.)

**నులిదడ చెట్టు (మెలికాయ చెట్టు) తీఁగ**— లా. Helicteres Isora. ఆంగ్ల. Indian Screw Tree. సం. ఆవర్తకీ, రంగలతా, రంగవల్లరీ. అఱవము-వాలంబ్రిమరమ్.

దీనికాయలునులుచుకొనియుండును. చిన్నవి. కాయలచూర్ణ మాముదమునఁ గలిపి చెవిపైని పూసిన చెవిలోని కురుపులు మొదలగునవి మానును. దీనివేఱు, ఆకుల రసకషాయములు గుల్మము, ఉదరరోగము, విషదోషము లడంచి వీర్యస్తంభనము చేయుననియు, చీము మొదలగు దుష్టపదార్థములను వెడలఁజేయు ననియు, దీని యాకులకషాయము పిచికారీ చేసిన విరేచన మగుననియుం జెప్పఁబడినది.

**నులిపురుగులు** (Thred worms)—ఇది సూక్ష్మజీవుల (worms) నుండి సంభవించు నంటువ్యాధి. జీర్ణకోశములోని పెద్దప్రేగుల నాశ్రయించుకొనియుండి, గ్రుడ్లంబెట్టుచు వృద్ధి యగును. పురుగులు, గ్రుడ్లుఁ గూడ మలముతో బయటకు వెడలి, సంపర్కదోషమువలన తిరిగి మానవశరీరములోనికిం జేరుకొనుచు నంటురోగముగఁ బరిణమించు నని చెప్పఁబడినది. ఈ రోగమువలన కడుపునొప్పి, ఆసనమున జిల కల్గుచుండెడిని. (అంటువ్యాధులు, సూక్ష్మజీవులు చూడుఁడు.)

**నువ్వు (ల) చెట్టు**—లా. Sesamum Indicum. ఆంగ్ల. Gingily plant. సం. తిలవృక్షః. నువ్వు ప్రసిద్ధమగు పంట. నువ్వుచేను వ్యవసాయ మందఱు తెలిసినదే. నువ్వు తెల్లనువ్వు, నల్లనువ్వు, ఎఱ్ఱనువ్వు, కాఱునువ్వు అని నాల్గుభేదములు కలది. ఇం దెఱ్ఱనువ్వులు శ్రేష్ఠజాతిగను, కాఱునువ్వు లధమజాతిగను నెంచఁబడుచున్నవి. అన్నిజాతుల నువ్వుగింజలనుండియు నూనె తీయుదురు. నువ్వులపప్పు ప్రసిద్ధభోజనోపయోగ పదార్థము. నూనెయు నట్టిదియే.

నువ్వుపూవును స్త్రీలముక్కుతోఁ బోల్చి, తొల్లింటికవులు వర్ణించి యున్నారు. నువ్వుపూవులరసము లోనికిచ్చిన వాతదోషము హరించి వీర్యవృద్ధి గల్గించి క్రిమి శ్లేష్మరోగములఁ బుట్టించుననియు, కండ్లలో వేసిన నేత్రరోగముల నివారించు ననియుఁ జెప్పఁబడినది. ఆకులందుఁగల జిగురు అనఁగా పచ్చిఆకులు చన్నీళ్ళలోను, ఎండుఆకులు వేఁడినీళ్ళలోను నానించినకల్గుజిగురు మృదువుపఱుప వలసినతావులకు (మోరులు కల్గినతావుల) పైన రాచిన ఆ ప్రదేశము మెత్తఁబడును.

నువ్వులచెట్టు నువ్వులు సహా కాల్చి చేసిన బూడిద (క్షారము) వేఁడి చేయును. అజీర్తి, శూలలు, కడుపునొప్పులు మొదలగు పెక్కుబాధలు లోనికిచ్చిన నివారించును. ఇంకను అనేక దోషములు విఱుచుటకు లోనికిత్తురు. సమూలము నువ్వులు సహా నూటి తేనెతో నుడికించి పైన

కట్టుటవలన పగులని గడ్డలు, కురుపులు కరఁగి అణఁగిపోవుటయో లేక మెత్తపడి పగులుటయో జరుగును.

నువ్వులు, నువ్వులపప్పు, నూనె మొదలగు వాట్లయందు పైత్యము, శరీరబలము, వీర్యవృద్ధి గల్గించి, యొంటినీరు నార్చివైచి, మూత్రము వెడలుటను తగ్గించి, వ్రణములను మాన్పి, స్త్రీల ఋతురక్తమును చక్కఁగ వెడలించి, ప్రసవస్త్రీలఋతురక్తమును చక్కఁగ వెడలించి శరీరమును బిగదీసియు, ఆరోగ్యము గల్గించు గుణము కలదనియు, ఇంచుక మేహము నుద్రే కింపఁ జేయుననియు, ద్వంద్వతత్వములుగల వారికి, మూలవ్యాధి రోగులకు అనుకూల మనియు, ఉప్పు, కలినీళ్లు, తేనె, నువ్వులపప్పు వేయించుట నువ్వులకు విఱుగుడు లనియుం జెప్పఁబడినది.

**నువ్వుల వ్యవసాయము** — ఇంచు మించు నువ్వులజాతియందుఁగాని వ్యవసాయము నందుఁగాని ఎక్కువ భేదములు గానరాకున్నను నువ్వులందు తెల్లనువ్వులు, నల్లనువ్వులు, ఎఱ్ఱ నువ్వులు నను భేదములు గన్పట్టెడిని. ఇందు తెల్లనువ్వులు శ్రేష్ఠజాతి. ఎఱ్ఱనువ్వులను తురి యాలనువ్వులని కొన్ని సీమలందు వాడుటకలదు. నువ్వులు పునాసపంటనువ్వు లనియు, పైరుపంట నువ్వు లనియు రెండుపంటలవి కలవు. అందు పునాసజాతికన్న పైరుజాతి శ్రేష్ఠ మందురు. ఎఱ్ఱజాతి కొంత అరుదుగా నున్నది. అది వైద్య గుణమునం దధికమని కొందఱు పరిశీలకు లందురు.

నువ్వులు చమురుకై పండించు పంట. భోజనపదార్థముగా నుపయోగించుచున్న పంట. తెలకపిండి పశువుల కాహార మగుటయే గాక కొన్నిసీమలందు మనుష్యాహారముగఁ గూడ వాడఁబడు చున్నది. మొక్కల కిది మంచి యెరువుగ నున్నది. నువ్వులపెంటయు మొక్కల కెరువని చెప్పఁబడినది.

పునాసపంటనువ్వులు వర్షాధారమునఁ బెంచఁ బడునవి. వీటికి తేలిక యగు గరపభూము లర్హములు. పైరుపంటనువ్వులు భూమియందుఁ గల పదును నుపయోగించుకొనుచు మంచు చలవకు పండుపంట. వీటికి పదును విస్తారము నిల్పుకొను నల్లరేగటి నేలలు, మంచు విస్తారము పడు ప్రదేశములు శ్రేష్ఠములు. పూనానగర మునఁగల ప్రభుత్వపు వ్యవసాయశాస్త్ర పరి శోధకస్థానమున జరిగిన పరిశీలనలవలన నీక్రింది సంగతులు గ్రహింపఁబడినవి.

| ఉండినట్లు తేలినపదార్థ నామములు | తెల్ల నువ్వులందు | నల్లనువ్వులందు | ఎఱ్ఱనువ్వులందు |
|---|---|---|---|
| తేమ Moist | 4.87 | 5.42 | 5.37 |
| నూనె Oil | 48.13 | 46.50 | 46.20 |
| జిగురు పదార్థము | 14.05 | 9.06 | 15.87 |
| Vegetable matter | 4.49 | 6.52 | 4.18 |
| Ash | 5.96 | 6.69 | 7.35 |
| ఎముకలనువృద్ధిపఱచుబలపదార్థము | 22.50 | 25.81 | 21.03 |
| Sand matter | .37 | .66 | 1 35 |
| ఉప్పు వాయుపదార్థము | 3.60 | 4.13 | 3.37 |

మూఁడురకముల నువ్వులును కొంచెము మెచ్చు తక్కువగ నాల్గు నెలలకాలవుపంటలే యైనను తెల్ల జాతినువ్వులు వేగిరముగ పండి కోతకు వచ్చెడిని. అది అన్నివిధములను శ్రేష్ఠజాతి యని తేలుచున్నది. పైపథకమునఁ జెప్పఁబడిన పదార్థము లందు నువ్వుల నాడి నూనెను వేఱు చేయఁగా మిగిలిన తెలకపిండియందు మిగిలిన పదార్థము లుండునని చెప్పఁబడినది.

నువ్వులు ఎకరమునకు పాతికపౌను విత్తులు చల్లుదురు. నాలుగు నెలలలో ఎనుబది మొదలు నూటయిఱువదివఱకు పౌనులపంట పరిస్థితుల మేరకులభించునని పరిశీలనలనుండి తేలుచున్నది. చేను పండినపై నధికకాలము పొలముననుంచిన కాయలు పగిలి గింజలు రాలిపోయెడిని. నువ్వుల కట్టెను గాల్చినబూడిద వైద్యోపయోగమైనది.

**నూటొక్క తాళములు**--(తాళములు చూడుఁడు.)

**నూతనకవి సూరనామాత్యకవి** —
ఆంధ్రకవులలో నాధునికుఁడుగఁ బరిగణింపఁ బడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. కాశ్యపసగోత్రుఁడు. తండ్రిపేరు తిప్పయ్య. తాతపేరు మల్లయ్య. తిక్కనసోమయాజిబంధువర్గములోనివాఁడు.

రచించినది సకలజనాభిరామ మనునామాంతరముగల ధనాభిరామ మను పద్యకావ్యము. దీనిని ద్రాక్షారామ భీమేశ్వరస్వామికిఁ గృతి యొనర్చెను.

**నూతనవస్త్ర ధారణము**—

కం. గంటువడు ... ... ఆదివారము
కంటఁదడియును ... ...సోమవారము
అంటిన పుణ్యంబువాయు...మంగళవారము
అతిశుభ మిచ్చున్ ... ...బుధవారము
ఇంటికిఁ జుట్టముఁ దెచ్చును...గురువారము
వెంటనె వస్త్రంబు వచ్చు ...శుక్రవారము
వేగమె మాయున్. ... శనివారము

నూతనవస్త్రధారణమున నీవారములం దుదహరించినప్రకారము ఫలితములు కలుగఁ గలవని చెప్పఁబడెను.

**నూనె తెలకపిండి**-- కొన్నిజాతుల చెట్ల గింజలు లేక కాయలలోని పలుకులం బిండిగాని, గానుగయం దాడిగాని,వాట్లయందున్న చమురు పైకి తీయుట యాంధ్రదేశమున ప్రత్యేకమగు నొకకులమువారి వృత్తిగ సనాతనముగ నేర్పడి యున్నది. ఈ దేశమున తీయఁబడు చమురులలో ముఖ్యమైనదియు, పెక్కండ్రకు భోజనోపయోగ మగునదియు, ఊరూర నాకులజులచే వృత్తిగ జరపఁబడి యమ్మఁబడు చుండునది నువ్వులచమురు. ఈ చమురులకు నూనెలనియుఁ బేరు కలదు. తిలలనుండి తైలముఁ దీయుకులమువారికి తిలకులస్థు లని పేరు. ఆపేరు నానాటికి మాఱి తెలుకులవా రనియయ్యెను.

ఇంతియే గాదు. నువ్వులకు తిలలని సంస్కృత నామ మున్నటులనే నువ్వులనూనెకు తైలమనియు, నువ్వులనుండి తైలము పిండివేయఁగ మిగిలిన ద్రవ్యమునకు తిలపిష్ట మనియుం బేరు. అది మాఱి నేఁటికాలమునకు తెలగపిండి యై నిలిచెను. ఇటుల నీనామము లన్నియు నువ్వుల సంబంధమున నేర్పడినవే యైనను ఇతరజాతి గింజలనుండి పిండఁబడిన చమురునకుం గూడ నూనె యనియు, చమురు పిండివేయఁగ మిగిలి నిలిచిన ద్రవ్యమగు పిష్టములకు తెలకపిండి యనియు వాడుకనామములు వ్యాపించి నిలిచెను.

ఈవిధమున వేరుశనగనూనెయు, వేరుశనగ తెలకపిండియు, కొబ్బరినూనె, కొబ్బరి తెలకపిండియు, ఆవనూనెయు, ఆవతెలకపిండియు మొదలగు నామము లేర్పడియెను. ఇక్కాలమున పెక్కుజాతుల నూనెలు, తెలకపిండ్లు

చేయఁబడుచున్నవి. అందునువ్వులనూనె భోజన పదార్థమై ప్రాముఖ్యము నందియున్నది. పిదప ఆవనూనె, వేరుశనగనూనె, కొబ్బరినూనెలు భోజనపదార్థములుగ నుపయోగపడుచు,నితరోపయోగములంగూడఁ గల్గియున్నవి. ఇంకను బాదఁనూనె, వేఁపనూనె, కాఁగునూనె, అవిసినూనె, ప్రత్తినూనె, ఇప్పనూనె మందులలోఁ గలియునవిగను, దీపములం దుపయోగింపఁబడునవిగను,యంత్రములు వేఁడియెక్కి అఁరిగిపోకుండ వాట్ల ఇఱుకుసందులందు జాఱుగుటకు కందెన వేయఁ బడునవిగను ఉపయోగించు చున్నవి. ఆలివునూనె యీ దేశపుదికాక విదేశములనుండి దిగుమతి చేయఁబడుచున్నను, అట్టిదియే వీట్ల తెలకపిండులు కొన్ని పశువుల కాహారముగను, కొన్ని చెట్లకు, చేలకు నెరువులుగను వేయుట కుపయోగించు చున్నవి. కొన్నినూనెలు తలకు రాచుకొనునూనెలుగఁ జేయఁబడు చున్నవి. కొన్ని సబ్బులు చేయుటయం దుపయోగించు చున్నవి. మంచిగందపుకఱ్ఱనుండి తీయఁబడు నూనె పరిమళద్రవ్యముగను మందులందు చేర్చుటకును, సబ్బునందుఁ గల్పుటకును, వాడఁబడు చున్నది. ఇతరమగు కఱ్ఱలనూనెలు వార్నీసులు చేయుటకును ఔషధములుగను వాడుచున్నారు. జీడిపప్పుపిక్కలనూనె ఔషధముల కుపయోగించుచున్నది. పొన్నకాయలనూనె, బలరక్కసిగింజలనూనె మొదలగునూనె లెన్నియో వేర్వేఱుపనుల కుపయోగించెడిని. సువ్వానూనె యనంబడునది వాసనకై యుపయోగింపఁ బడెడిని.

**నువ్వులనూనె**- ఇదియు, దీని తెలగపిండియు భోజనపదార్థములు. నూనె తలంటుకొనుటకు, వంటకములు చేయుటకు వాడుదురు. దీనియుపయోగము లెన్నియో గలవు. ఇంచుక పైత్యము చేయును. పుట్టాండ్రకు శరీరము గట్టిపడఁజేయార్చును. నువ్వుల తెలకపిండి పశువుల కాహారముగను, చెట్లకు, చేలకు నెరువుగను ఉపయోగించును. హిందువులు గ్రామదేవతల నారాధించునదనున తెలకపిండికూర నైవేద్య మిడుదురు. ఇది శరీరమునకు వేఁడి గల్గించును.

వేరుశనగనూనె- నువ్వులనూనెవలెనే భోజన పదార్థముగ వాడఁబడునది. ఇది యించుక పైత్యోద్రేకము గల్గించును. దీని తెలకపిండిని ఎరువులుగ నుపయోగింతురు. ఇది నువ్వులనూనెకన్న రుచ్య మందురు.

కొబ్బరినూనె- ఎక్కువ ఉపయోగములు గల్గినది. మళయాళ దేశమునను, పశ్చిమ సముద్ర ప్రాంతదేశములను కొబ్బరిచెట్లతోఁటలు మెండుగగల్గియుంట నాప్రాంతములవారు కొబ్బరినూనెను నేయిగను, నూనెగను గూడ వాడుదురు. కొబ్బరితెలకపిండి భోజనపదార్థముగను, ఎరువుగను గూడ నుపయోగించును. ఎండుకొబ్బరి భోజనపదార్థము. కొబ్బరినూనె ఔషధముల కుపయోగించును. యంత్రములకును, తలకు రాచికొనుటకును ఇంక నెన్నియో యుపయోగములు కలవు.

కొబ్బరినూనె పుండ్లు, గాయములు మొదలగువానిని మానఁజేయును. వలిసెనూనెకును నిట్టియుపయోగములు కలవందురు. అది అరుదు.

**నూనెలు జలములు**— జిడ్డుగల ద్రవపదార్థము లన్నియు అంగ్లమున Oils అనంబడుచున్నవి. ఉదకములందు జిడ్డుండదు. అవి అంగ్లమున Waters అనంబడుచున్నవి. ఇవి యన్నియు నొకే పదార్థముగ నాంగ్లమున Liquids అనంబడుచున్నను, వీటియందలి పరమాణుపదార్థములు వేర్వేఱుజాతులవిగా నుంట నొకటితో నొకటి కలియకున్నవి. అట్టిపరమాణుపదార్థములనాంగ్గమున Molecules అనఁబడుచున్నవి. ఆయిల్సునందలి మొలెక్యూల్సు ఒక

జాతివి. వాటన్నిటియందలి మొలెక్యూల్సు వేఱొక జాతివి. రెంటికి నొకటితో నొకటి కలిసిపోవు స్నేహబాంధవ్యము లేకుంట కలియకుండెడిని.

**నూమిస్మేటిక్సు** (Numismatics)—నాణెములు (Coins)పతకపుబిళ్ళలు (Medals) వీట్లంగూర్చి తెలుపుశాస్త్రము:

భరతదేశమున శ్రీరాముని పరిపాలనమున శ్రీరామమాడలనంబడిన నాణెములు ముద్రింపఁబడుట అందఱెఱింగినదియే. లైడియా(Lydia) పురమున ఆదిని ముద్రింపఁబడినసంగతిని పాశ్చాత్యులు తెల్పుచున్నారు. పిదప గ్రీకుదేశములందు నాణెములు ముద్రింపఁ బడినవి. సిసిలీ ద్వీపమున చిరకాలమునుండి ముద్రణముజరుగుచుండెను. క్రీ.ము. ఇదిఐదవశతాబ్దకాలమందురు. రోమనులు నాణెములను ముద్రించుట క్రీ. ము. ౩౫౦నుండి అని తెలియుచున్నది. మహమ్మదీయ ప్రభుత్వమున నాణెములు ముద్రింపఁబడుట క్రీ. వె. ఏడవ శతాబ్దమునుండియు నని తేలినది. నగటున ఐరోపాప్రభుత్వములు నాణెములు ముద్రించుట, ఫ్లోరిన్సునగరమున ఫ్లోరినునాణెమును ముద్రించుటతో ప్రారంభ మైన దని సర్వసాధారణముగఁ జెప్పు చున్నారు. ఇది క్రీ. వె. ౧౨౫౨-క్రీ. వె. ౧౨౮౦లో వెనిస్ నగరమున డ్యూకాట్ అనంబడిన నాణెము ముద్రింపఁబడిన దఁట. క్రీ. వె. ౧౩౪౪ లో నోబుల్ అనంబడిన నాణె మాంగ్ల ప్రభుత్వము ముద్రించిన దఁట. ఇది బంగారు నాణెము. క్రీ. వె. పదునాల్గవ శతాబ్దమునుండి నాణెముల ముద్రణము ఐరోపాదేశములందు సర్వసాధారణమయ్యెనని చెప్పవచ్చును.

మెడల్సు పదునాఱవశతాబ్దమునుండి బహుమతులచిహ్నముగా ప్రబలి వ్యాపించిన వనుచున్నారు.

**నూఱుకల్లలాడి ఒకయిల్లు నిలుపుమన్నారు**—ఆంధ్రిలోకోక్తి.

**నూఱుకాకులలో ఒకకోవెలపిట్టవలె**—ఆంధ్రలోకోక్తి.

**నూఱయ్యేవఱకు నన్ను కాపాడితే నూఱైనతర్వాత నేనే పెరుగుతా నన్నదఁట**—(అనఁగా నూఱురూపాయ లని భావము.)

**నూఱుమాటలు ఒక్కవ్రాతకు సరిరావు**—అంధ్రి లోకోక్తి.

**నూర్భాన్ క్షత్రియులు**—(చౌహానులు చూడుఁడు.)

**నృగుఁడు** — అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి ఉశీనరుఁడు. సోదరులు శిబి, నవుఁడు, క్రిమి, సువ్రతుఁడు.

మఱియు వైవస్వతమనుపుత్రుఁడునుఇక్ష్వాకుమహారాజు తమ్ముఁడును నగు నృగుమహారాజొకఁడు కలఁడు. ఈతఁడు బహుధర్మాత్ముఁడు. పేర్వడసిన నరపాలుఁడు. వాపీకూప తటాకారామాదుల పెక్కింటిని దాన మొనర్చినవాఁడు. ఇతఁడే తాను దానమొనర్చియుండిన గోవును తిరుగ దానమొనర్చుట,నూసరవెల్లిగ జన్మించి, శ్రీకృష్ణసందర్శనమున పాపవిముక్తుఁ డయ్యెనని చెప్పఁ బడినది.

**నృచక్షుఁడు** — పాండవసంతతి క్షత్రియుఁడు. తండ్రి సునీతుఁడు. పితామహుఁడు సుసేనుఁడు. పుత్త్రుఁడు సుఖీవలుఁడు.

**నృత్యగోత్రము**—(వశిష్ఠగణము చూ.)

**నృత్యము-నాట్యము**—మనస్సునకుఁ గల్గినయుత్సాహము నాట్యము గల్గించెడిని. ఉత్సాహశ ృజృంభించి చైతన్యమునకన్న నధికమై దాని నాక్రమించుకతన నృత్యమునకు శరీరావయవము లాయత్తమై నృత్యము సిద్ధ

మగును. అట్టిచర్యను వశపఱచుకొని మనోభావములను వెలిబుచ్చుట కర్హమగునట్లు విభజించి యుపయోగించుకొనునట్టికలకు నాట్యమనెదరు.

ఒక ఆంగ్లవిద్యావిశారదుఁడు "Dance is an expression of the Joys of life, an outpouring of the soul such as we have in the burst of music form the throat of a nightingale" అని నృత్యమును నిర్వచించెను. భరతదేశమున నాదినుండియు నృత్యనాట్యముల కళంగూర్చి శివతాండవ మనుగ్రంథమును, అభినయదర్పణ మనుగ్రంథమును గలవు. వీటి నిటీవల డా॥ కుమారస్వామి పండితు లాంగ్లభాషలోని కనువదించిరి. అందు మొదటిగ్రంథమునకు రోమెయిన్ రోలాండు పండితుఁడు పీఠికను వ్రాసి పరిచయ మొనర్చెను. రెండవది నందికేశ్వరుఁడు రచించినది. ఇతరగ్రంథము లింకను గలవు కాని యివి మాత్రి మాదిగ్రంథములు.

అజంతాగుహ (అచింత్యకందరము) లందలి చిత్రములీ నాట్యకలను వేర్వేఱు భేదాకారములతో వివరించునవిగఁ జెప్పంబడు చున్నవి. ఇక్కాలపు నాట్యకలాధురీణుం డగు ఉదయశంకర్ విద్వాంసుఁ డీ యచింత్యకందరములోని చిత్రములు ప్రదర్శించు నాట్యభేదములను ప్రదర్శించుచున్నాఁడని ఎల్లరు "When Uday springs up on his feet an Ajanta fresco comes to life" అని ప్రసిద్ధోక్తిగ వాడుచున్నారు. (అచింత్యకందరము చూ.)

ఉదయశంకరుఁడు రాజపుత్రస్థానమున ఉదయపూరునం దుదయించినవాఁడు. ఈయన తండ్రిపేరు పండిత శ్యామశంకర్. ఈయన గొప్ప సంస్కృతవిద్వాంసుఁడు. సంగీతకలానిధి. ఝూలాప్రటన్ రాజ్యపు ప్రధానమంత్రిగ నుండిన ప్రముఖుఁడు. తండ్రి సభయందు నడిచిన గానముల కనుగుణముగ నెవ్వరు నేర్పకయే తనంతట తాను నైసర్గికముగ నృత్యమొనర్చుట కనిపెట్టి యాశ్చర్యమందుచుండ, ఉదయశంకరుఁడు కొన్ని సంగీతపరికరములను వాయింప నేర్చె నఁట. భూపతి యాశ్చర్యపడి దీన కార్యములే దనితలంచి, లండనునగరమునందలి రోయల్ కాలేజీ అఫ్ ఆర్ట్సు నందు చిత్రలేఖనము నేర్చుకొనుటకై ౧౯-౨౦ లో పంపెను. అట నుదయశంకరుఁడు Self Portraiture కళయందు George Clausen గారి బహుమాన మందుటయే గాక ౧౯-౨౩ పట్టపరీక్షయందుఁ గృతార్థుఁ డయ్యెను. పిదప పారిస్ నగరమున కరిగి విదేశనృత్యవిధానముల నన్నిటిని విమర్శించుచు తన భరతదేశపు విధానములతో సరిచూచుకొనుచు నాల్గు వత్సరములు కృషి చేసెను. వీరి నృత్యాభినయములు శుద్ధములుగను, బలవత్తరములుగను, అందములుగను పేరందినవి. ఈయన విద్యానిపుణత ఐరోపాదేశములందే గాక అమెరికాయందు, తూర్పు దేశములందు పేరెన్నికనందినవి. ఇటీవల సంయుక్త రాష్ట్రములందు ఆల్మోడా పురసమీపమున నొక విద్యాసంస్థ నేర్పఱచి, తనశిష్యుల నటనుంచి విద్యాబోధ లొనర్ప నేర్పఱచి, పనిచేయుచున్నాఁడని తెలియుచున్నది. (అభినయ భరతశాస్త్రము చూ. హస్తాభినయము చూడుఁడు).

**నృత్యాయన గోత్రము**— భరద్వాజ ఉపగణము చూడుఁడు.

**నృపంజయుఁడు**— పాండవ సంతతి క్షత్రియుఁడు. తండ్రి మేధావి. పితామహుఁడు సునయుఁడు. పుత్రుఁడు ధూర్వుఁడు.

**నృపాన్నధాన్యము**—దీర్ఘ కూరకములు చూడుఁడు.

**నృపామయ రోగము**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున క్షయ(రాజయక్ష్మ)రోగమునకు పేరు.

**నృసింహజయంతి**--వైశాఖశుద్ధ చతుర్దశి. ఈదినమున సోమవారము సంభవించి సాయంకాలమునకు స్వాతీనక్షత్రి మమరునేని మహాపవిత్రపర్వముగ నెంచి ఘూర్జరదేశస్థులు కదళీవృక్షసహితముగ నుమామహేశ్వరపూజ యొనర్తురు. (పండుగలు చూ.)

**నృసింహచతుర్దశి**-వైశాఖ శుద్ధచతుర్దశికీపేరుకలదు. ఇది నృసింహావతారదిన మందురు. ఇది శనివారమున సంభవించుటయు, స్వాతీ నక్షత్రము సంభవించుటయుఁగూడ గల్గినచో చాలపవిత్రదినముగ నెంచి నృసింహదేవుఁడగు విష్ణు నారాధింతురు.

**నృసింహద్వాదశి**-- ఫాల్గుణశుద్ధద్వాదశి (పండుగలు చూడుఁడు).

**నృసింహావతారహస్తము**— (హస్తాభినయము చూ. భరతశాస్త్రము చూ.)

**నెగోషియెబిల్ ఇన్‌స్ట్రుమెంట్సు**--వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Negotiable Instruments and Negotiable Paper హుండీలు, నోట్లు, చెక్కులు, బిల్సు మొదలగువారంటు బాండ్సు.ఇవిరూపాయలతో సమముగనే చూడఁబడునవి. ఎవ్వరు వాట్లకు సొమ్మిచ్చి గైకొనెదరో వారికే చెందుచుండునవి. మఱియుఁ గొన్నిహుండీలపైఁగాని,చెక్కులపైఁ గాని Not negotiable అని వ్రాయబడుటయుం గూడ కలదు. అట్టివి Not negotiables అనంబడుచున్నవి.

**నెగ్రోపొంటీద్వీపము**— గ్రీసు దేశములోని ద్వీపము (గ్రీసు దేశము చూ.)

**నెట్** (Net or Nett)-వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Net, Nett నికర మనియర్థము. ఇతరములను తీసివేయఁగా ఉన్న అసలు. అసలువస్తువుయొక్క నికరవుతూనికకు (అనఁగా ఒకబస్తాయందుఁగల ధాన్యమును తూచుతక్కె నంచి, కుట్టినపురితాళ్ళ బరువును, మినహాయింపఁగా ఉన్న ధాన్యముయొక్క అసలుబరువునకు)Nett weight అనియెదరు.

**నెట్బాల్** (Net Ball)— ఈ యాట ఫుట్బాల్, హాకీఆటలను మనసునం దుంచుకొని కల్పించి రని కొంద అనెదరు. ఆంగ్లసీమలం దాఁడుపిల్లలు మిక్కిలిగా నాడుచుండుదు రఁట.

ఆటనాడుతావున నొకపదియడుగులు భూమిపైకుండునట్లు స్తంభము పాతి, దాని కొకవల నంచి గట్టి వేలాడవైచి, ఆటజాగా కన్నిదిశలను దిశ కేడ్గు రాటకాండ్రు నిలిచియుండి బంతి నెగురవేయుచు, ఆచిక్కవుసంచియందు పడఁద్రోయునట్లు ప్రయత్నించుచు నాడెదరు. చేతులతో బంతి పట్టవచ్చును, విసరవచ్చును, నెత్తితో నెదిర్చి త్రిప్పివేయవచ్చును. కాని బంతిని తన్నరాదఁట. బంతిని బట్టియుండుతఱి అడుగుతీసి యడుగు బెట్టరాదఁట. బంతి నెగురవేయుట విసరుట దక్క చేతినిగాని, శరీరమునుగాని,సాగదీసిగాని, చాచిగాని ఇతరులకందీయరాదఁట.

**నెదర్లాండ్సుదేశప్రభుత్వము** (Netherlands)— (హాలండురాజ్యము చూ.)

**నెప్ట్యూన్ గోళము**(Neptune) --ఇది Solar System నకుం జెందిన యొకగోళము. సూర్యునినుండి 2822000000 మైళ్ళ దూరమున నాగోళమును జుట్టి 60624 దినముల పదునేను గంటలలో తిరిగివచ్చుచుండునది యనియు, భూమితో పోల్చి చూచిన దానికన్న 66 రెట్లధికమైన శరీరము కల్గిన దనియు చెప్పఁబడినది.

ఇది Primary planetగాచెప్పఁబడిన ప్రధాన గోళములలో నొకటి.

క్రీ. శ. 1846లో దీనిని ఫ్రెంచిదేశపు గణితశాస్త్రజ్ఞుఁడగు M. Le Verrier గారును, కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయపు పండితుఁడగు Mr. Adams గారును, జర్మనీదేశపు బెర్లినునగర వాసియగు Dr. Galle పండితుఁడును కనుఁగొనిరఁట. ఇది Superior planet అని చెప్పంబడినది. ఇది తనకుతానై గిరగిర తిరుగుటకు ౯౫ సంవత్సరము లగును. సూర్యునిం జుట్టివచ్చుటకు 165 సంవత్సరము లగును. కాని వెనిసుగోళమునకన్న నించుక చిన్నది యని తలంపంబడుచున్నది. నెప్ట్యూనున కాశ్రితగోళమగు చంద్రుఁ డొక్కఁడు కలఁడు. శాటరన్ గోళమును జుట్టియుండిన రింగువంటి రిం గొకటి కలదు. (శాటరన్ గోళము చూ. సోలార్ శిస్టమ్ చూ. ఎస్ట్రొనొమీ చూ.)

**నెపోటిజమ్** (Nepotism) — అధికారులు తమబంధువులు మొదలగు తమవారియందుఁ జూపు పక్షపాతతాభిమానములకు వాడునట్టిపదము. తొల్లింట ఇటలీ దేశమున పోపుల యధికారకాలమున వారిబంధువర్గము వారిపట్ల నడిపిన అనర్హాభిమానమునుండి ఏర్పడిన ఉక్తి.

**నెపోలియానిజమ్** (Nepoleonism)- నెపోలియను ఫ్రెంచి సేనాధిపతి. యూరపుఖండము చాలభాగము తనయధికారముక్రిందికి దెచ్చుకొన్నవాఁడు. క్రీ. శ. 1804 లో తనంతటతానే ఫ్రెంచిదేశమునకు చక్రవర్తియయ్యెను. ఇతని పరిపాలనపద్ధతిని "నెపోలియానిజమ్" అందురు.

**నెపోలియన్ప్రొవిన్సు**-ఇటలీ దేశము చూ.

**నెఫ్తాలైన్ఉండలపరిశ్రమ** (Naphthaline)—ఇందు విస్తారము చతురత అనవసరమైనను హెచ్చు వేఁడిమియందు నెఫ్తాలెన్ మండిపోవుపదార్థము కాన, మంట చాల సన్నముగ నుంచి కరఁగుదనుక జాగ్రతగా నుండవలసి యుండును. కరఁగినతోడనే అచ్చులలో పోసి యుండలుగఁ జేయుదురు. చలారుటతో గట్టిపడును.

నెఫ్తాలెన్ ఘాటగువాసన గల్గియుండి, కాగితపుపుస్తకములను, బట్టలను గొట్టివేయు చిన్న జాతిపురుగులను (Moths) చేరనీయక కాపాడును. ఇది హైడ్రోకార్బన్ అనియు, Dry distilation of Coal వల్ల నేర్పడిన దనియుఁ జెప్పఁబడుచున్నది. పుండ్లను మాన్పుగుణము గలదు. రంగులందుఁ గూడ నుపయోగింపఁ బడును.

**నెఫ్తోల్** (Nephthol)— ఇది గట్టిగ (ఘనరూపమున) నున్న హైడ్రోకార్బన్ అనియు, Phenola in their chemical properties తో సంబంధము కలది యనియు జెప్పఁబడినది. ఇది Alpha యనియు, Beta యనియు ద్వివిధము. రెండును పుండ్లను మాన్పుగుణము గలవి. రంగులందుఁగూడ నుపయోగించును. దీని Chemical formula. C. 16—HO—H అని చెప్పఁబడినది.

**నెబులే** (Nabulae)— ఒక దూరదర్శకసాధనమగు దుర్భిణిం దీసికొని (Telescope) పరిశీలించినచో ఆకాశమున నసంఖ్యాకములగు గోళములంబోలిన పదార్థములు వెలుగిచ్చునట్లు కొంతప్రదేశము నాక్రమించి మేఘముంబోలి గన్పట్టునదియే ఆంగ్లజ్యోతిషవేత్తలచే నెబ్యులా యనంబడునది. ఇది లాటిన్ భాషాపదము. దీని కర్థము మేఘ మనియే. అందు పెద్దవి, నేత్రదృష్టికి గన్పడునవి కూడ నుండును. అందు కొన్ని నక్షత్రముల వలె నుండును. కాని నిజముగ నవి నక్షత్రములు కావని పరిశీలకు లనుచున్నారు. Nebula కు

బహువచనపదము Nebulae. ఇట్టివి ఆకసమున ౧౨౦౦౦౦ వఱకుఁ గలవఁట. వాటిని శాస్త్రవేత్తలు Glowing clouds of matter అనియెదరు. పాశ్చాత్యకవులు అట్టివాటిని Fire mist అని వర్ణించిరి. కొన్ని నెబ్యులే సోలార్ సిస్టమ్ ఆక్రమించిన ప్రదేశమునకన్న పెద్దవి కలవని తేలుచున్నది. కొంద ఱిట్టిదానిని Spiral Nabulae యనిరి కాని అం దట్టి తిరుగుడు ఆకార మేమియుఁ గానరాదు. కాని కొన్నితావుల హెచ్చుదళసరి ప్రదేశములు గానవచ్చెడిని. అవి నక్షత్రము లేమో యని కొందఱు సంశయింతురఁట. అట్టివారు సోలారు సిస్టమ్ మొదలగున విట్టి నెబ్యులానుండి యేర్పడి కల్గినవేయని తెల్పుచున్నారు. ఏదియో శక్తి ఆకాశమునందు పెక్కు మార్పులు గల్గించుచున్న దనియు, అది యిప్పటి నెబ్యులేలను మున్ముందు ఇంకం గొన్ని సోలారుసిస్టములంబోలిన సిస్టములం గలించు ననియు, ఆది నిట్టిదానినుండియే సోలారుసిస్ట మేర్పడిన దనియు నెల్లరంగీకరించు చున్నారు. దీనినిమిల్కీ వే (Milkey way) యనియు ననుట కలదు

**నెమ్మటి (దుంప) చెట్టు**-దీనింగూర్చి యంతగా తెలియరాకున్నది. దీనిపూవులందు క్రిమిరోగము, రక్తపైత్యము, స్త్రీలకుసుమ రోగముల నివారించి శ్లేష్మము నుద్రేకింపఁ జేయు గుణము గల దనియు, దుంపయందు అనఁగా దుంపచూర్ణమందు మేహశాంతి, పైత్య శాంతి గల్గించి శ్లేష్మోద్రేకము చేయుననియు నందురు.

దీనిని నెమ్మదుంప లేక నెమ్మగడ్డ యనియు నందురఁట.

**నెమలిఅడుగులచెట్టు (పూతికరంజ చెట్టు)**-- లా. Guilandina Bonducella. సం. కలికారకః-కలిమారకః- పూతికరంజః. దీని ఆకు, వేళ్ళు, చెక్క రస కషాయములు కఫ దోషము, క్రిమిరోగము, కష్టము, గుల్మరోగము, మూలవ్యాధి, యోనిరోగములు, వ్రణములు నివారించి వేఁడిచేయు నని చెప్పఁబడినది.

**నెమ్ కాన్ గుఱుతు**— ఇది Nemine Contradicente అనుమాటలయొక్క క్లుప్త పఱుపఁబడిన రూపము. (ఈడుక్తిని)ఎవ్వరు నెదుర్కొనలేదని యర్థము. సభయందు అందఱచే నంగీకరింపఁబడిన దనిభావము.

**నెయ్యి**— నెయ్యి పాలలోనుండు బలకర పదార్థము. పా లెంత శ్రేష్ఠమెనవో నేయియు నంత శ్రేష్ఠమై యుండును. పాలయం దావుపాలెంత ప్రశస్తమో నేతులం దావునెయ్యియు నంత ప్రశస్తము. వెన్న గాచిన నెయ్యి యగును. నెయిః ప్రసిద్ధభోజనపదార్థము. అప్పుడుకాచిన నేతికి సద్యోఘృత మనిపేరు. అది శ్రేష్ఠ మనియు, విషదోషమును హరించి నేత్రములకు బల మొసంగి వీర్యపుష్టి దేహపుష్టి యొసంగుటయే గాక జఠరాగ్నిని వృద్ధిపఱుచుననియుఁ జెప్పఁబడినది. గాయము తగిలినవారికి, జ్వరపడి లేచినవారికి, అగ్గిసెగ తగిలినవారికి, క్షయ, కార్శ్య, విసర్పి, రోగములు గలవారికి నెయ్యి మిక్కిలి అవసరమని చెప్పఁబడినది. వసంతర్తువునందు త్రికటుకచూర్ణముతోడను, గ్రీష్మర్తువునందు శర్కరతోడను, వర్షర్తువునందు పంచకోలములచూర్ణముతోడను, శరదృతువునందు యవధాన్యపు పేలాలపిండితోను,హిమవంతర్తువునందు సైంధవలవణముతోను, శిశిరర్తువునందుపిప్పలిచూర్ణముతోడను నేతిని (అందు ముఖ్యముగ ఆవునేతిని) ఔషధప్రాయముగ(వీలగునేనిసద్యోఘృతము) నుదయననే పుచ్చుకొను చుండిః ఆయురారోగ్యములభివృద్ధి గాంచునని చెప్పఁబడినది.

ఇటులనే అగ్నిమాంద్యరోగము గలవారును, కుసుమరోగముగల స్త్రీలును, కుష్ఠరోగులు, జ్వరగతతత్వము గలవారు, జలోదరరోగులు, భగందరరోగము గలవారు, శ్వాస శ్లేష్మప్రకోపము గలవారు, స్థూలకాయము పెరిగినవారును నెయ్యి పుచ్చుకొనరా దనియు, వారికి నపథ్య మనియుఁ జెప్పఁబడినది.

అప్పుడు కాచినఆవునేతి నొక క్రొత్తకుండయందు నింపి, మూకుడుతో బిగించి చీలమన్నిచ్చి దానిని వేఱొకకుండయం దుంచి మూసి భూమియందు పాతి ఒక సంవత్సర ముంచి తీసి ఔషధమువలె లోనికిచ్చిన అపస్మారరోగము, ఉన్మాదము, మదము, మూర్ఛ జబ్బు, కర్ణజములు, నేత్రజములు, యోనిజములు, శిరోజములు నగు పురాణరోగములు నివృత్తి యగు ననియు, ఇది యించుక ఉష్ణము, గురుత్వము చేయుచుండును గాన జాగ్రతగ నడుపుచు పరిహారముగ పన్నీరు లోని కిచ్చుచుండవలె ననియుఁ జెప్పఁబడినది.

మేకనెయ్యి చలవజేసి నేత్రదృష్టికి బలమొసంగు ననియు, జఠరదీప్తి నిచ్చి బలము జేయు ననియు, జ్వరములు, మూలవ్యాధి, వాతదోషముల నడంచి ఇంచుక శ్లేష్మము నభివృద్ధిపఱచు ననియుం జెప్పఁబడినది. పులి నెయ్యి యనంబడునది పులిక్రొవ్వుగాని నెయ్యి కానేరదు. వాతదోషముచేతను మేహవాతముల చేతను కాళ్ళు, కీళ్ళు పడిపోయినవారికి పైని పులినెయ్యి (పులిక్రొవ్వు) మర్దన చేయుచుండిన నివారణమగు ననియు నందురు. చిన్నపిల్లలకు కాళ్ళు బలహీనమై నడక రాకుండిన పందినెయ్యి ఇట్లే పైని మర్దనచేయుచుండిన కీళ్ళు బలపడి నడక ప్రారంభింతురు.

**నెరసి లేక నిరిజచెట్టు**—లా. Cliodendron Roxburghii. దీనింగూర్చి సరిగా తెలియరాకున్నది. దీనివేఱుగంధము లోనికిచ్చియు, పైన లేపనము చేయుటవలన సర్పవిషము హరించుననియు, పైని రాయుటవలన వాపులు, ఉబ్బులు హరించు ననియు, దీనియందు వగరు ఎక్కువగఁ గల్గి యుండును గాన విరేచనములు కట్టుటయేగాక విరేచనబద్ధముగూడఁ గల్గించును గాన లోనికిచ్చుతఱి జాగ్రతగ వాడవలయు ననియు నందురు.

**నెర్వస్ సిస్టమ్ మెదడు** (Nervous System Brain)—మనుష్యులు, పశువులు మొదలగు జంతుజాలమునందు నరములకూడలి స్థానమగు మెద డున్నది. దీనికి "నెర్వస్ సిస్టమ్ బ్రెయిన్" అని ఆంగ్ల శరీరశాస్త్రవేత్తలు పేరులిడి యున్నారు. ఈపద్ధతి ఉత్తమ జాతియందలి విధానముగ తలంచుచున్నారు. ఇంక కొన్ని యధమపుజాతి పురుగులం దట్లుండక మేదస్సు శరీరమందంతటను వ్యాపించియుండునట్లుండును. అవిఅధమపుజాతిపురుగులుగ నెఱుంగుచున్నారు. అట్టివాటి శరీరమును రెండుగ విభజించిన నా గాయములు మాన్పి వీలగునేని ఆరెండుభాగములు గూడ వేర్వేఱుగ జీవింపఁగల్గుననిపోల్పం బడినవి. ఇట్టివి ఆంగ్లమున Worms అనంబడుచున్నవి.

నెర్వస్ సిస్టమ్ బ్రెయిను గల పెద్దజాతిశరీరములందు బ్రెయినునుండి వేఱైన భాగము జీవింపనేరదు. ఏల యన దానియందు నరములను పనిచేయించు మేదస్సు (Brain that controls the nervous system) ఉండదు.

**నెలగంటు**—ఆంధ్రదేశమున రవి ధనూ రాశియందు ప్రవేశించినదినమును నెలగంటు పెట్టిన దినమందురు. అనఁగా ఆనాఁటికి మకర సంక్రాంతిపండుగ (ఇంచుమించుగా) నెలదినములుండుటను గుర్తించుట కీపేరు గానోపు. నాఁటినుండియు హిందువులవాకిండ్ల చిత్రవిచిత్రపు ముగ్గులను వరిపిండితో నిడి స్త్రీ లలంక

రింతురు. విష్ణుదేవస్థానములందు తెల్లవాఱు జామున నే పూతులై పూజారులు వంటజేసి విష్ణుదేవునకు నైవేద్య మర్పింతురు. ఈనెలను ధనుర్మాస మనియెదరు.

ఈ నెలయందు బూడిదగుమ్మడికాయలకు కత్తిగంటు (గాయము, లేక నఱకు, లేక కోఁత) అనర్హముగాన వడియములు పెట్టువారు తత్పూర్వదినముననే గుమ్మడికాయలు కోసి వడియము లొనర్చుటంజేసి గాంబోలు నెలగం టనుపే రేర్పడినది.

**నెల్లిచెట్టు** పెద్దనెల్లి లేక సాధారణపు చెట్టు, చిఱునెల్లి, గబ్బునెల్లి యని మూఁడు భేదములు కలది. అందు పెద్దనెల్లిచెట్టు పెద్దది యగును. ఆకులును పెద్దవియే. చిఱునెల్లి చిన్న చెట్టుగ నుండును. ఇది ఉత్తమజాతిగ నెంచుదురు. దీనియాకులను తక్కలిక్కలికూర యనుట యుం గలదు. ఇంక గబ్బునెల్లి అధమపుజాతిది.

నెలికూర పచ్చడి చేసి భోజనపదార్థముగ వాడుదురు. వైద్యోపయోగమున చిఱునెల్లి శ్రేష్ఠము. లా. Clerodendrum phlomoides అని చిఱినెల్లి పెద్దనెల్లులకును, Premma-integrifolia అని గబ్బునెల్లికిని పేర్లు.

సంస్కృతమున కర్ణికా యని నెల్లిసామాన్యమునకును, గణికారికా యని చిఱునెల్లికిని పేర్లు. కొందఱు అగ్నిమంథః అని గబ్బునెల్లినివాడిరి. కొందఱు నెల్లిజాతి కంతటికిని వాడియున్నారు.

నెల్లిచెక్క, వేఱు, ఆకులు వీటి రసకషాయము వేఁడిచేసి శరీరతత్వమును బాగుసఱచు ననియు, వాతపునొప్పులను హరించు ననియు, వేఱుగంధము పైని పూసిన చర్మరోగములు మాన్పుశక్తి కలదనియు, సమూలకషాయము నందు ఉబ్బుజాడ్యము, పాండువు, జ్వరము, మన్యపుజ్వరము, మలబద్ధముల నడంచు గుణముకల దనియు, నెల్లికాయలవరుగు మేహశాంతిగల్గించు ననియు, ఆకులందు వాతము, పైత్యము, గుల్మము, మూలవ్యాధుల ఉద్ధృతము తగ్గించుశక్తి కలదని యుఁ జెప్పఁబడినది.

గబ్బునెల్లి వేఱుకషాయము జ్వరమాంద్యముల నడంచి బలమొసంగు నందురు.

**నెల్లూరి నెఱజాణ—** నెల్లూరుప్రాంత సీమ లన్నిటికి నెల్లూరుపురమున నధికసంఖ్యాకులుగ నెఱజాణ లుండిరఁట. నెఱ శబ్దమునకు నేర్పరితనము లేక చతురత యనియర్థము. జాణ శబ్దము జ్ఞానశబ్దమునుండి కల్గినది. గాన నెఱజాణ యన నేర్పునం దాతితేఱిన యెఱుక గలవాఁడని భావము. దీనింగూర్చి యొక వాడుక గలదు. నెల్లూరు మూలపేటయందు మూలస్థానేశ్వరుని దేవస్థానముకడ వేమూలనుయ్యి (బహుశః వేములనుయ్యి లేక బావి) యుండెడిదఁట. దానియుదకములు త్రాగుచుండిన శరీరము కడుజాగరూకతను జెందుటయు, మనస్సునకు చక్కనిబలము, అభివృద్ధి, వికసనము గల్గుచుండు గుణ ముండెడిదఁట. దూరదేశవాసిగ నున్న యొకనెల్లూరుపురవాసి, అటనుండి యేతెంచిన వేళ్ళొకనెల్లూరిబాలు నడిగినట్లు గాన్పించుచుని క్రింది చాటుధారాపద్యమునందు దీనిప్రశంస కలదు.

శా. మల్లెల్ మొల్లలు సేమమా? సుకరమా?
మాకందముల్ గేదఁగుల్;
మొల్లం బాఱకయుండునా? సుదతులున్
మోదంబు వాటింతురా?
విల్లుం గోలయుఁ దీయునా మరుఁడు? నా
వేమూలనూ యున్నదా?
నెల్లూరన్ బెదసోమవీథిని గదా నీరాక?
జైవాతృకా!

**నెల్లూరి వీరరాఘవకవి—** ఆంధ్రకవులలో నాధునికులలోఁ బరిగణింపఁ బడినవాఁడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుఁడు. వీ రింటిపేరు

దేశిరాజువారు. తర్వాత నెల్లూరుకాఁపురమగుట నాపే రింటిపే రయ్యెనఁట. ఆప స్తంబసూత్రము కాశ్యపసగోత్రము. తండ్రిపేరు వేంకటపతి. తాతపేరు కొండనమంత్రి.

రచించినది యాదవరాఘవపాండవీయ మను త్ర్యర్థికావ్యము. అనఁగా ప్రతిపద్యమునందు శ్రీరామపర మైనయర్థము, పాండవులపరమగు నర్థము, శ్రీకృష్ణపరమగు నర్థము నిమిడియుండు పద్యకావ్యము. వసుంధరాపరిణయము గూడ వ్రాసెను. 3 ఆ.

**నెల్లూరుజిల్లా**— ఆంధ్రదేశములోనిది. చెన్నపురిరాజధానికిఁ జెందియున్నది. (పెన్నా) పినాకినీ నదీతీరమందున్న నెల్లూరు ప్రధాన స్థానము. గూడూరు రైల్వేకూడలిస్థానము. అభ్రకపు రేకుల వర్తకము జరుగుతావు. అభ్రకపు గను లున్నతావు. బిట్రగుంట, యాదగిరి సుప్రసిద్ధ విష్ణు క్షేత్రములు. నాయఁడుపేట వేజోకపట్టణము. పాకనాటి సీమ ఈజిల్లాలోనిది. (పాకనాటిసీమ చూ.)

**నెస్టోరియానిజమ్**-(Nestorianism) క్రీ. వె. ఐదవ శతాబ్దమునందు కాన్‌స్టాంటినోపిలు నగరమునందు ప్రధానాచార్యుఁడు (Nestoreousఅనుభవముగల, వయస్సుగల) తన యనుభవజ్ఞానమునుబట్టి ప్రబోధించిన తత్త్వము:- ఏసుక్రీస్తునందు రెండు వ్యక్తిత్వము లనియు, నొకటి స్వర్గీయమును,నిత్యము ననియు రెండవది మానసిక మనియు నీసిద్ధాంతము.

**నేచరల్‌థియాలజీ** (Natural Theology)- ప్రకృతిసిద్ధము లగు (దృశ్య) ఉపపత్తులచేతనే మతమును ప్రబోధించు సిద్ధాంతము.

**నేచరాలిజమ్** (Naturalism)— (Idealism) దృశ్యప్రపంచము మిథ్య యను వాదమును త్రోసివేసి ప్రకృతిపరిణామముల నుండియే సత్యమును గుర్తింపవలె నను సిద్ధాంతము. చిత్రకళయందును, కవితయందును దీనిని రియాలిజమ్ (Realism) అందురు. (అనుభవైక విషయములనే ప్రదర్శించుట).

**నేచురల్ గాస్** (Natural Gas) — భూమియం దుండి నిల్వయైన గాలి. ఇది కాలుట మొదలగుపనుల కుపయోగించునఁట. అమెరికా దేశములందు కొన్ని గనులు దొరకియున్నవి.

**నేచురల్ డైస్ రంగులు**—(రంగులు చూడుఁడు).

**నేజ్-నెస్-నోస్**-- Naze-Ness-Nose ఇవి యన్నియు అగ్రమున (Cape) కర్థములు. (Cape చూ. Land portions చూ.)

**నేటాల్‌దేశము** — దక్షిణఆఫ్రికాయం దున్న బ్రిటీషుకోలనీ. స్వపరిపాలనగల దేశము. క్రీ. వె. ౧౮౫౬ లో ఏర్పాటైన దేశము. పిదప ౧౮౯౭ లో జూలూలాండును దీనికిం జేర్చిరి. వైశాల్యము 30000 చతురపుమైళ్ళు. వ్యవసాయార్హప్రదమగు భూమి. వాస్కోడిగామా ఈదేశమును గనిపెట్టినదినము క్రీస్తుపుట్టినదిన మగుట వారిభాషయందు నేటివిటీ యనుట నాయన నేటా లని ఆపేరే ఈదేశమున కిడెనని చెప్పఁబడినది. Pietermaritz burg ప్రధానపురము. డర్బాన్‌పురము, లేడీస్మిత్ పురము నుడువఁదగిన పట్టణములు. దేశమున 3000మైళ్ళ ఇనుపబాట కలదు. కేపుటౌను నుండి ఈజిప్టులోని కైరో నగరముతో ఇనుపబాటచే కలుపుకోరిక ప్రజలకుఁ గలదనియందురు. (దక్షిణఆఫ్రికా చూ.)

**నేతగోత్రము**—అశ్మరథ్యగణము చూ.

**నేత్రనిర్మల్యకారి** — ధాతుకపరికర్మము. (నేత్రశబ్దము చూ.)

**నేత్రపాటివిషయము** — (నతపాటిసీమ చూ.)

**నేత్రబలా**-రసాంజనము(నేత్రశబ్దముచూ.)

**నేత్రభూషణము** — నీలాంజనము. (నేత్రశబ్దము చూ.) సుర్మాజాతికిఁగూడ నేత్ర భూషణ మనునర్థము కలదు.

**నేత్రమంగళకారీ** — ధాతుకపరి. (నేత్ర శబ్దము చూ.)

**నేత్రములకుఁ గన్పించువస్తువునకు నడుమ బలమగు నగ్ని యుండుతఱి గన్పించువస్తు విటునటు వణఁకునట్లు (Quiver) లగపడుట**— చూచు నేత్రములకు చూడంబడు వస్తువునకు నడుమ నగ్ని ప్రజ్వలించు చుండుతఱి నవ్వల కన్పించునది, ఇటునటు వణకుచున్నటులఁ గాన నగుటకుం గారణము. అది వణకుట గానేరదు. ఇట్టి యగ్నియందు పొగ లేకపోవచ్చును. అగ్ని యొక్క వేడిమి మాత్రమే యుండవచ్చును. వాతావరణపుగాలి పెక్కు డెన్సిటీలు (భారము దళసరి) కలదియై వీట్లనుండి ఏర్పడిన వేర్వేఱు పొరలుగ నుంట పరిశీలించినవారికిఁ దెలియఁ గలదు. (డెన్సిటీ చూడుఁడు). ఇది నేత్రదృష్టిని మోసగించుటయే. ఇం దగ్నియొక్క వేఁడిని పైకిబంపుటయు, ఆవేఁడి వాయువునందున్న చెమ్మనుగరఁగించి దానిడెన్సిటీకూటమిం జెదర గొట్టియు,ఆచెదరఁగొట్టంబడిన వాయువు ఇటునటు పలుచవడి పర్విడుటయు, దానినుండి యద్దముం బోలి స్వచ్ఛమైన తావరణము నందు చలనము (కదలిక) గల్గుటయు, ఆకదలిక గుండా వెలుతురు తెచ్చి కంటి కగపఱచు నవ్వలివస్తువుయొక్క బింబము తిన్ననిప్రమాణమున ఇటునటు గదలి ఇంచుక బలము తగ్గుచు చూచువారి కంటికడకుం జేరి, నేత్రేంద్రియమున ప్రతిబింబించి అగపడుటయు, జరుగుచుంట వాయుచలనమునఁ గల్గిన బింబచలనమే గాని నిజముగ నవ్వలి వస్తుచలన మెంత మాత్రము కానేరదు.

వెలుతురు గాలిగుండా నవ్వలి కఱుగుతఱి తిన్ననిమార్గమునందే యరుగునదై వస్తువుల బింబములచలనస్థితిని నేత్రములకడకుం జేర్చునదే యైనను ఈధర్మ మొకేడెన్సిటీయందు మాత్రమే వర్తించు నని మనసునం దుంచుకొన వలసి యుండును. డెన్సిటీ మాఱుతఱి దానిమార్గమును కొద్దిగనో, గొప్పగనో ఇటునటు మాఱవచ్చును. ఒక్కొకతఱి తప్పక మాఱనగును. వేఁడి తగులుట డెన్సిటీని (వాయువులందు) మార్చుచునే యుండునది గాని, ఒకతఱి మార్చి యూరకుండునది కాదు. ఇంక వాయువు వేర్వేఱు డెన్సిటీల పొరలం గల్గియుండినతఱి నింక నీమార్పు చలనముం గూడ వెలుతురునందు పోవుచుండు వస్తు బింబములకుం గల్గించుచుండును. గాన నిట్టివి నేత్రలోపము గాని, వస్తుభేదము గాని గాక వాతావరణభేద మని తెలియ నగును.

**నేత్రరంజనము**—అంజనము (కాటుక). (నేత్రశబ్దము చూ.)

**నేత్రరోగాహ**— తేలుమణి చెట్టు. (నేత్ర శబ్దము చూ.)

**నేత్రశబ్దము**— నేత్రశబ్దమునకు కన్నని యర్థము. నేత్ర నిర్మల్యకారీ యనిన ధాతుకపరి కర్థము. నేత్రబలా యనిన రసాంజనమున కర్థము. నేత్రభూషణ మనిన నీలాంజనమున కర్థము. నేత్రమంగళకారీ యనిన ధాతుకపరి కర్థము. నేత్రరంజన మనిన అంజనమున(కాటుక) కర్థము. నేత్రరోగాహ యనిన తేలుమణి చెట్టున కర్థము. నేత్రభూషణ మనిన సుర్మాజాతి కర్థము. నేత్రారిః యనిన కాడజెముడున కర్థము. నేత్రోపకలః యనిన బాదంచెట్టు కాయ కర్థము.

**నేత్రారిః**-కాడజెముడు(నేత్రశబ్దము చూ.)

**నేతిక్రియ** — యోగాభ్యాసమున వాత పైత్య శ్లేష్మదోషసంజనితరోగముల నిరోధములు కలుగకుండ నిర్బాధకముగ ప్రాణాయామాభ్యాసము నడుచుచుండుటకు షట్క్రియలు చెప్పఁబడినవి. (యోగాభ్యాస క్రియాషట్కము చూడుఁడు.)

అందు నేతిక్రియ యొకటి. ఇది ఒకవిధము. ఒక జేనెడుపొడవు నూలుత్రాడు సన్ననిదిగ చూచి ముక్కురంధ్రముగుండా లోని దింపి, నోటిలోనికి దిగినపిదప ఆ రెంటికొనలను రెండు చేతులతోఁ బట్టుకొని ఇటు నటు కొంచెము సేపు జరిపి, నోటిగుండా లాగివేయుట నేతిక్రియ యనంబడును.

ఇందువలన శ్లేష్మరోగములు నశించుటయు, ఖేచరీముద్రకు వీలుకల్గుటయు, దివ్యదృష్టి గల్గుటకు సాధన మగుటయు సంభవించునని చెప్పఁబడినది.

**నేతిపరిశ్రమ** — వెన్న కాచిన నెయ్యి యగునని యంద ఱెఱిఁగినదే. ఇది చిన్న మంటపై వెన్నయందలినీరు ఇగిరిపోవునంతవఱకు కాఁచిన చాలును. నీరంతయు నెగిరిపోయిన ధ్వని యాఁగిపోయెడిని. కాక ఎక్కువయయ్యేని ఒకవిధమగు వాసనగల్గును. దానిని వడకట్టి కుండయందుఁ గాని తగరపుపూఁతగల పాత్రయందుఁగాని నిల్వయుంచినచాలకాలము నిలిచియుండును. అపరిశుభ్రపదార్థము లందుండిన త్వరలో చెడి దుర్వాసన కొట్టును కాన వెన్న నవీనముగ నుండుతఱినే పరిశుభ్రముగఁ గడిగి కాచవలయును.

నిల్వవాసన గొట్టునేతి నొకయినుపబాణలియందుంచి రెండురెట్లు నీటిని జేర్చి అగ్నిపైఁ బెట్టి కలుపుచుండిన దుర్వాసనకు హేతువగు నపరిశుభ్రపదార్థ మంతయు పైకిఁ దేలుచుండఁ దీసివేయుచుండవలయును. తక్కిన స్వచ్ఛమైన నేయి నీటిపైఁ దేలుచుండ జాగ్రతగా శుభ్రమైన పాత్రయందుఁ గైకొందురు.

తములపాకులు, చలవమిరియాలు, లవంగములు, దాల్చినిచెక్కలగుండ కాఁగుచుండు దుర్వాసనగల నేతియందు వైచి కాచిన నప్పరిశుభ్రపదార్థమును వేఱుచేయును. ములగాకునందుఁగూడ ఈశక్తియే కలదు. వర్తకమునకు నూనెను గాని (అనఁగా నూనెను నీటితో గిలకొట్టి వెన్నవలెఁజేసి వెన్నయందే కల్పి సంకర మొనర్తురు) గోధుమపిండినిగాని అరటిపండ్లను గాని కల్పి అపరిశుభ్రపఱచి మోసగింతురు. ఇవి దానికి వినాశకరములు గాని పరిశుభ్రతను నిల్పనేరవు.

**నేత్రోపకలః** — బాదంచెట్టుకాయ. (నేత్రశబ్దము చూ.)

**నేపాలదేశము (కింపురుషవర్షము).** — ఆదినుండియు పేరు మార్పఁబడకయు, పాలనము మార్పఁబడకయు నేఁటివఱ కొకేరీతిని దనరుచున్న దేశము నేపాలము. ఇది కస్తూరికి వాసిచెందిన దేశము. కాన పండితరాయ లను నొక సుప్రసిద్ధాంధ్రకవి "నేపాలభూపతి ఫాలభాగమున నొకవేళ నల్లబురద పడియుండినను దాని నందఱు కసూరి యనుకొందు"రని నుడివి యున్నాఁడు.

నేపాలదేశమునుగూర్చిన ప్రశంస వరాహపురాణము ౧౮౫-౨౧౫ యందుఁ గలదు. బౌద్ధగ్రంథమగు స్వయంభుపురాణము ౧-3 అధ్యాయములం దీదేశముంగూర్చి ఇట్లు చెప్పఁబడినది. తొలుత నేపాల మొకసరస్సై యుండెడిదఁట. అందు కర్కోటకనాగము వసించుచుండెడిదఁట. దానికి నాగవాస మనియు, కాళీహ్రద మనియు పేర్లుండెనఁట. పదునాల్గుమైళ్ళ పొడవును, నాల్గుమైళ్ళు వెడల్పును గల్గిన

యాసరస్సు జలార్ణవమై యుండ, మహాచీనా ప్రజలు చుట్టుపట్ల ప్రదేశముల కాఁపుర ముం డుచు నేపాల మనుపేరుననే ఆదేశమును వాడు చుండువారఁట. మహాచీనా దేశములోని పంచ శీర్ష పర్వతమునుండి యొకప్పుడు మంజుశ్రీ బోధి సత్వుఁ డేతెంచి దక్షిణదిశనున్న పర్వతమును ఖండించి గండె యొనర్చి కాళీహ్రదమందలి జలముల నవ్వలకుఁ బాఱించి కాళీహ్రదమును కాళీచేసె నఁట. తోడనే భూభాగము బయల్పడ నం దెత్తగుతావున స్వయంభూజ్యోతి స్వరూ పుఁడును, స్వయంభూనాథుఁడును నగు నాది బుద్ధుని గుహ్యేశ్వరీదేవిని (శక్తిని) ప్రతిష్ఠించి దేవాలయనిర్మాణము లొనర్చెనఁట. ఈసంద ర్భమున నుత్తర బౌద్ధ దేశములందు స్వయం భూనాథుఁడగు ఆదిబుద్ధుని, గుహ్యేశ్వరీశక్తిని పూజించు చుందురని మా చదువరు లెఱుంగఁ దగును. మంజుశ్రీ బోధిసత్వుఁడు హిందువుల దేవతాశిల్పి యగు విశ్వకర్మవంటివాఁ డని యెఱుంగునది.

ఇట్టి నేపాలభూమియందు ప్రధాననగర మగు కష్ఠమండపపురమును (ఇప్పటి కట్మాండూ నగరము)గూర్చి కూడ నించుక వివరించుట సమంజసము. ఇట్లు కాళీహ్రదము బాఱించి భూమిని బయలు దేఱఁదీసిన మంజుశ్రీబోధిసత్వుఁ డే నేపాలదేశమునకు బౌద్ధమతభక్తిని దెచ్చిన వాఁడనిస్వయంభూపురాణమను బౌద్ధగ్రంథమున జెప్పఁబడినది. కాశ్మీరదేశము నేలుచుండిన గుణ కామదేవనృపతి భాగమతీవిష్ణుమతీనదులసంగ మముకడ తనరాజధానిని నిర్మించి మంజుశ్రీ బోధిసత్వునిపేర మంజుపట్టణ మని పిలువసాగె నఁట. మఱియు మంజుశ్రీబోధిసత్వుఁడు విశేష కాంతి గలవాఁ డగుట కాంతిమతీపుర మనియుం బేరుండెనఁట. ఈపేరు లిటులనే కొంతకాలము వాడఁబడు చుండె నఁట. కాని, పురమధ్యమున నిర్మింపఁబడిన కష్ఠమండపము (ఇది చాలపెద్దది) ప్రఖ్యాతి యధికమై కష్ఠమండపపురమని వాడఁ బడ నారంభ మయ్యెనఁట. నేఁటికదియుమార్పు నంది కట్మాండూ యనుపేరం బరఁగు నగరమై రాజధానిగనే యున్నది.

కట్మాండూ నగరమున రాజనగరునకుం జెందిన తులజాభవానీ దేవస్థానము గలదు. అది గొప్ప ధనవంతమగు శక్తిపీఠము. మఱి రాజ కుటుంబముచేతను, ప్రజలచేతను గూడ నొకే విధముగ గౌరవింపఁబడుచుండు మత్స్యేంద్ర నాథదేవస్థానమునుగలదు. మత్స్యేంద్రనాథుఁడు బౌద్ధుఁడగు యోగసిద్ధుఁడు. ఒకతఱి నేపాల మున వర్షములు లేక గొప్పక్షామము సంభ వింప మనుష్యులే గాక, గడ్డి లేక పశువులు గూడ నాశన మగుచుండుట నరేంద్రదాసను నేపాలభూపతి సహింపనేరక తనసుతుని అస్సాం (కామరూప) దేశమున కంపి, మత్స్యేంద్రనాథ యోగిని రప్పించె నఁట. ఆతఁడు మహాత్ముఁ డగుట తనప్రభావముచే వర్షములు గురిపించి దేశమున సుభిక్షత వ్యాపింపం జేసె నఁట. పిదప నామహాత్ముఁ డటనే వసించుచు నటనేసిద్ధినందె నఁట. ఆతావే ఇప్పటి మత్స్యేంద్రనాథదేవ స్థానమై యున్నది. అందా మహానీయునికాల మున నుండిన బొంతను భద్రపఱచి యున్నారు. ఏఁటేట గొప్ప యుత్సవ మొనర్తురు. జాతీయ గౌరవములతో దాని నందఱు జరపెదరు.

ఇంక దేశమందలి యొకరాజ్యభాగమునకుఁ గొంతకాలము రాజధానిగ నుండిన భాట్గాన్ తొల్లింట భక్తగ్రామ మనియు, పిదప భట గ్రామ మనియు పిలవంబడుచుండెడి దఁట.

మఱియు నీదేశమునందలి నదులలో విష్ణు మతియనంబడునదిభాగమతీనదిలో సంగమించు నని మున్ను వివరించియుంటిమి. దీని కింకను కేశమతి యనియుం బేరుకలదు.

ఈ దేశమున ప్రధానమగు నది ఇప్పుడు బాచమతి యనంబడుచున్న వాచమతీనది. దీని కే యింకను భాగమతీనది యనియు, భగమతీనది యనియు, భగవతీనది యనియుఁగూడ వాడుక పేరులు కలవు. ఇతరనదులు చిన్నచిన్నవి దీని యందు సంగమించుచుండును. బౌద్ధు లీనదీ సంగమములందుఁ జెప్పఁబడినతీర్థము లన్నియు బౌద్ధమతసంబంధములే యందురు కాని హిందు వులును వానిని గౌరవించుచునే యుందురు. ఈనదియందు పదునాల్గుతీర్థములుకలవనిస్వయంభూ పురాణము, ౪ అధ్యాయమునఁ గలదు.

౧ మరధారికానదీ సంగమమున శాంత తీర్థము.

౨ మానసరోహిణీనదీసంగమమున శంకర తీర్థము.

౩ రాజమంజరీనదీసంగమమున రాజతీర్థము.

౪ రత్నావళీనదీసంగమమున ప్రమోద తీర్థము.

౫ చారుమతీనదీసంగమమున సులక్షణా తీర్థము.

౬ ప్రభావతీనదీసంగమమున జయాతీర్థము.

౭ చింతామణీనదీసంగమమునగోకర్ణతీర్థము

౮ శతలక్షణా నదియు, సురూపా నదియు భాగమతీనదిలో సంగమించుతావున త్రివేణీ తీర్థము.

౯ విమలావతీనదీసంగమమున కామతీర్థము లేక మనోరథతీర్థము.

౧౦ భద్రానదీసంగమమున నిర్మలతీర్థము (దీనినిగూడ త్రివేణి యనెదరు.)

౧౧ స్వర్ణవతీనదీసంగమమున నిధాన లేక అకరతీర్థము.

౧౨ పాపనాశనీనదీసంగమమున యువాన (జుగీన లేక జువన) తీర్థము.

౧౩ కనకవతీనదీ సంగమమున చింతామణీ తీర్థము.

౧౪ విష్ణుమతి లేక కేశమతీనదీసంగమమున విష్ణుతీర్థము.

భాగమతీనదీజన్మస్థానమునను, సంగమము కడను, పశుపతినాథ దేవస్థానముకడను రెండేసి చొప్పున ఆఱుతీర్థములు కలవు.

క్షేత్రములలో నగ్రగణ్యమగునది పశుపతినాథ దేవస్థానము. పశు వన ప్రాణి కర్థము. దీనికిఁ దొల్లి మృగస్థలి యనియుం బేరుండె నఁట. భాగమతీ నదీతీరమున కెగువగ రెండుఫర్లాంగుల దూరముననున్న కట్మాండూ నగరమునకీశాన్యదిశగా మూడుమైళ్లదూరమున నున్న గుహ్యేశ్వరీదేవస్థానమును, పశుపతినాథ దేవస్థానమునుహిందువులకునుబౌద్ధులకునుగూడ నర్చనీయములై యున్నవి. గుహ్యేశ్వరీప్రశంస దేవీభాగవతమున కాననగుచున్నది. (౭-౩౮) నేపాలము కింపురుషవర్ష మని యందురు.

**నేపిల్సు నగరము**- ఇటలీదేశముచూ.

**నేబంతగొరిగించుకొమ్మంటేనెత్తంతా గొరిగించుకొని వచ్చినట్లు**—(నేబు = డబ్బు, లేక రాగినాణెము) ఆంధ్రలోకోక్తి.

**నేమ్ డే** (Name day) — వాణిజ్య సంబంధపరిభాషయందు స్టాకు ఎక్సేఛేంజితీర్మానమునకు మరుచటిదినము.

**నేమిచక్రుఁడు**— (నిచకుఁడు చూ.)

**నేమినాథుఁడు** — జైన తీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూ). ౨౨నేమినాథుఁడు. ఈయన శ్రీకృష్ణుని పితృవ్య పుత్రుఁడు. అనఁగా వసుదేవునిసోదరుఁడగు సముద్విజయునిసుతుఁడు. చిహ్నము శంఖము. యదువంశ క్షత్రియుఁడు. తండ్రి సముద్విజయుఁడు. తల్లి శివాదేవి. జన్మస్థానము సౌరీపూర్ (ద్వారక లేక ద్వారావతీ

పురము). పొడవు పది ధనుస్సులు. కృష్ణవర్ణము. ఆయువు వేయి సంవత్సరములు. గణధర్సంఖ్య ౧౧. నిర్వాణస్థలము గిరినార్ పర్వతము.(పాలిటానా సంస్థానములోనిది. దీనిని శత్రుంజగిరి యనియు నందురు)అంతరాళకాలము ౮౩౭౫౦ వత్సరములు. (గిరినగరము చూడుఁడు).

**నేరెడుచెట్టు**—లా. Syzygium Jambolanum;Engenia Jambolana.ఆంగ్ల. Jambul; Black plum సం. జంబుః (సాధారణమైన పండ్లు గల నేరేడు) జంబుకః (గులాబీజామి యనంబడు గులాబీనేరేడు దీనినే అల్లోనేరే డందురు). జంబూరాజః (పెద్దపండ్లు గల నేరేడు). జంబూహాయం (రాజనేరేడు) దీని పండ్లు చాలపెద్దవి. ఇది చాల అరుదుగ నుండు జాతి.

జంబూరాజః అనంబడు పెద్దనేరేడుజాతిని జంబూనేరే డందురు. ఇది శ్రేష్ఠమగు జాతి. చిన్నపండ్లజాతి అధమపుజాతిగ నెన్నఁబడుచున్నది. అల్లోనేరే డనంబడు గులాబీనేరేడు నేరేడుమొక్క మొదలునకును (Rose apple) గులాబీజామిమొక్క కొమ్మకును అంటుకట్టుదురు. దీనిని తప్పుగా గులాబీజామి యనివాడుచున్నారు. కాని నిజముగ నది గులాబీనేరే డనఁబడఁ దగినది. (జామిసంబంధి కాదు.) నేరేడుచెట్టుయొక్క ముదిరినకఱ్ఱ తలుపులకు,ద్వారబంధములకు, వాసములకు, బల్లలకు,పనికివచ్చు కలపగ నున్నది.

నేరెడుచెక్క, వేఱు, వీటిరసము లేక కషాయము రసదోషము విఱచు ననియు, గొంతుకలో పుండు, నొప్పి మాన్పు ననియు, జిగటవిరేచనములు, రక్తగ్రహణి, గ్రహణి వీట్లను గట్టు ననియు, గర్భస్థవాతమును వెడలించి జ్వరమును గట్టు ననియు, పుండ్లను కడిగిన ముఱికిని వదల్చి మాన్పు ననియుఁ జెప్పఁబడినది. నేరెడువేఱు నుండి నీరుతీసి యారసము లోనికిచ్చిన వాతము, చలవ, మేహశాంతి చేయుననియు, నేరెడాకుల రసకషాయములు రక్తగ్రహణి మొదలగు గ్రహణులు, పండ్లచిగుళ్ళవాఁపులు, పండ్లు కదలుట నివారించి కుదుళ్ళను బిగించు ననియు, నేరెడాకుల చూర్ణముతో పండ్లు తోముచుండిన పండ్లచిగుళ్ళు గట్టిపడు ననియుఁ జెప్పఁబడినది.

నేరెడుపండ్ల రసము-కడుపులోనికి ప్రమాదవశమున పోయిన తలవెండ్రుకలను, రాళ్ళను హరింపఁ జేయును గాన తప్పక సంవత్సరమున కొకసారి యైనను నేరెడుపండ్లను దినుచుండవలె నందురు.

పండ్లరసము - మేహశాంతి, పైత్యశాంతి యొనర్చి అజీర్తిని మాన్పి, ఆఁకలి నభివృద్ధిపఱచు ననియు, ప్లీహరోగమును నివారించు ననియు, గ్రహణిని గట్టు ననియుఁ జెప్పఁబడినది. నేరేడు విత్తులచూర్ణము, ముషిడిగింజలవిషమును విఱచు ననియు, పచ్చిగింజలు ప్లీహరోగమును నివారించు ననియు, అతిమూత్రము నడంచి లోన పంచదారపుట్టుట నాఁపి రోగమును నిర్మూలించు ననియుఁ జెప్పఁబడినది.

నేరెడునకు శొంఠి, మిరియాలు, ఉసిరికపప్పు విఱుగుడులు. ఇంక నేలనేరే డనంబడు దీనికిం జెందిన హీనపుజాతికి లాటిన్భాషయందు Premna herbacea యనియు, సంస్కృతమున భూజంబు అనియుఁ బేరులు కలవు. దీనివేఱుయొక్క రసకషాయములు కఫమును, పైత్యమును, గళరోగమును నివారించి శుక్లవృద్ధి గల్గించు ననియు, నించుక మలబద్ధము చేయు ననియుఁ జెప్పఁబడినది.

**నేలగుమ్మడిచెట్టు**-లా. Ipomaea, Digitata, Convolulus Paniculatus. సం. భూకూష్మాండీ,విదారీ,విదారీకందః.ఇదిగుమ్మడిపాదుతో సంబంధము గలది గాకున్నను దాని

పేరనే పరంగెడిని, గాన నిట వ్రాయఁబడినది. దీని దుంపయందు జిగురుండును. దీని చూర్ణము నిక్కాకశ నడంచి, తత్వమును మంచికి మార్చి, నపుంసకత్వమును బాపి,రక్తమును శుభ్రపఱచి, స్త్రీల ఋతుస్రావమును క్రమముగనిల్పి, దేహ మెండిపోవుటను గుదిర్చి, క్షయ, రక్తపైత్యము, వాతదోషముల నడంచు ననియు, దీని దుంప చూర్ణమును ఆవువెన్న పంచదారలతోఁ గల్పి సేవించుచుండిన నతిత్వరితముగ నిందిర్యపుష్టి, దేహపుష్టి, బలము నొసంగఁగల దనియుఁ జెప్పం బడినది.

దీనికిం జెందినది పాలగుమ్మడిచెట్టు ఒకటి గలదు. అది పాలుగల నేలగుమ్మడియేయం దురు. దీనిదుంప జ్వరములు, ఎండురోగము, వాతము, మేహముల నడంచి బల మిచ్చును. అతిమూత్రము నాఁపు నందురు.

**నేలగురుగుడు చెట్టు**— దీనిని నేల పురుగుడు, పురుగుడుచెట్టనియు వాడుట కలదు. లా. Heliotropum indicum. దీనింగూర్చి సరిగా తెలియ రాకున్నది. దీని యాకునందు ఉష్ణముచేసి వాతదోషము, చర్మరోగము, కండ్లతెప్పలపై లేచుపుండ్లు, ముఖముపై మొలచు మొటిమలు, దంతపు చిగుళ్ళనొప్పి నివారించు శక్తిగల దనియు, ఆకుపసరు గాని, ఎండాకుల కషాయముగాని లోని కిత్తురనియు, పైకి పసరు పూయుదు రనియు నందురు.

**నేలతప్పటచెట్టు**—దీనింగూర్చి యం తగా తెలియదు. దీని వేఱురసము వేఁడి చేసి వాతరోగము, సన్నిపాతదోషము,స్త్రీలయొక్క సూతికావాతము నివారించునని యందురు.

**నేలవేము**—లా.Swertia chirata. ఆంగ్ల. Chirata సం. కిరాతః, కిరాతకః,కిరాత తిక్తః, భూనింబః.

నేలవేము జ్వరాంతకములగు పంచతిక్తము లలో నొకటిగఁ జెప్పఁబడినది. దీని సమూల కషాయము త్రిదోషముల నడంచి, సమస్త జ్వరముల నివారించి, రక్తశుద్ధి గల్గించి, సకల చర్మరోగములనివారించి, ఆమవాతపునొప్పులు, క్రిమిరోగము, కుష్ఠరోగము, గండమాల, గుల్మము, దగ్గులు, దురదలు, నిస్త్రాణ, రక్త కాస, వ్రణములు, విదాహాదోషము హరించి, పునరారోగ్య మీయఁగలదని చెప్పఁబడినది.

**నేవీ బిల్సు** (Navy Bills)— వాణి జ్యసంబంధ పరిభాషయందు ఓడఉద్యోగులు నౌకర్ల జీతములబాకీలకై యిచ్చు హుండీల కన్వయించుపదము.

**నేషనల్ డెట్** (National Debt)— ఒక దేశప్రభుత్వము ఆరాజ్యసంరక్షణమున కత్య వసరమగు వెచ్చమునకుఁ గాని రాజ్యమందలి ప్రజల యభివృద్ధికిఁ గాని ఉపయోగించుటకు ప్రభుత్వముచేసిన అప్పునకు 'నేషనల్ డెట్' అనియెదరు. ఇది దేశమంతకు నైన ఋణము. ఇవి War loans మొదలగునవి. ఇట్టిఋణము లకు బ్రిటీషుద్వీపమున Consols అనియు, ఫ్రాన్సుదేశమున Rentes అనియు పేర్లువాడు చున్నారు. ఈఋణములు Temporary Loans అనియు, Permanent Loans అనియు నిరుతెఱంగులుగ నుండును.

రాఁగలపన్నులు వసూలుపఱచిగాని, కొన్ని కర్చుల నిలిపియు, తగ్గించియు వేఱువిధముల ద్రవ్యము ప్రోగుచేసియు, తీర్చివేయుట కేర్పా టుతోఁ జేసిన అప్పు Temporary Loan అనఁబరగెడిని. ఇనుపదారులు, పంటకాల్వలు, ఆనకట్టులు మొదలగు నిర్మాణముల కిట్టి యప్పులు జేయుదురు. వీటి కింకను Floating Debt అనుటయు గలదు. ఇంగ్లాండుదేశము నందు తొల్లింటి భూపతులు William III భూపతిదనుక ఇట్టి ఋణములను యాదుల

నుండియు, Gold Smiths నుండియు, స్వదేశ విదేశమందలి ధనికులగు వర్తకులనుండియు, Antwerp, Amesterdam, Hamburg, London, Milan, Venice పురములందలి గొప్పగొప్ప ధనికులనుండియు తెప్పించి తీర్చివేయుచుండిరంట.

రెండవపద్ధతియగు Permanant Loans ఎప్పుడును తీర్పక వడ్డీగాని లాభముగాని ఏటేట నిచ్చుచుండు పద్ధతిని చేయఁబడిన అప్పులు. ఇట్టివి, బ్యాంకులు మొదలగునవి దరిమిలా కాలమున నాగరికప్రపంచమున Credit System ను చక్కఁగా Development నడిచిన పిదపనే పెద్దమొత్తముల Permanent Loans నడుప మొదలిడినవి. బేంకు ఆఫ్ ఇంగ్లాండు ఇటుల నేర్పాటైన సంస్థయే. (బేంకాఫ్ ఇంగ్లాండు చూ.)

**నైకజిహ్వాగోత్రము**— (జమదగ్ని వత్స ఉపగణము చూ.)

**నైకరిష్ఠిగోత్రము**—ఆయాస్యఉపగణము చూడుఁడు.

**నైకషిగోత్రము**—ఆర్ష్టిషేణగణము చూ.

**నైకషిగోత్రము**—ఔతథ్యఉపగణముచూ

**నైకర్షిగోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**నైకాయనిగోత్రము**— (కథ లేక కథ్య గణము చూడుఁడు).

**నైగలగోత్రము**- (వసిష్ఠ గణము చూ).

**నైగేరియా లేక బ్రిటిషు అప్పర్గినియా దేశము**— ఆఫ్రికాఖండమున ఆఫ్రికాపశ్చిమ భాగమున అప్ప ర్గినియా దేశమునం దున్న బ్రిటీషువారి దేశము. ఇది పరిపాలనకు ఉత్తర నైగిరియా యనియు, దక్షిణనైగిరియా యనియు రెండుఖండములై, రెండును గలిసి బ్రిటీషు అప్పర్గినియా యనంబడుచున్నది. ఇవి గాక ఇందింకను ఇతరమైన చిల్లరస్థలములును గలవు. వైశాల్యము ౫౦౦౦౦౦ చతురపుమైళ్లు కలవందురు. ఇవి ఒక హైకమీషనరుచే పరిపాలింపఁబడుచున్నవి. విస్తారము విదేశవర్తకము గలదు. నిగేర్ నది బెన్యూనదిలో సంగమించుతావునఁ గల లోకజాపురము ప్రధానకార్యస్థానము. బెన్యూ సైన్యస్థానమై యున్నది.

**నైగ్రిస్టేటు**— ఇది ఫెడరేటెడ్ మలేస్టేట్సులో నొకటి. (మలెయా దేశము చూ.)

**నైజాముప్రభువు**—(నిజాము లేక నైజాముప్రభువుగారు చూ.)

**నైటు టెంప్లర్సు** (Knights Templars). ఇది మధ్యకాలమున మిలిటరీఆర్డరుగా నిర్మింపంబడినది. జరూసలెము నగరమున యాత్రికులరక్షణకై క్రీ.వె. ౧౧౧౮లో నేర్పడి, ౧౩౧౨ లో పోపుగారి అధికారమున రద్దుపఱుపంబడినది.

**నైటుహూండ్డు**(Knight hood)-బ్రిటీషు సామ్రాజ్యమున Baronet నకు తరువాతిగౌరవ బిరుదము. ఇందు రెండువిధములు కలవు.బిరుద మందినవారిపేరునకు ముందు Sir చేర్చుదురు. ౧ Knights Bacholor ఇది తక్కువబిరుదు. కాని చాలపూర్వపుదై యున్నది. ౨ Knight of the various orders ఆ ఆర్డరులు పది కలవు. ౧. Garter, ౨. Thistle, 3. St. Patrick, ౪. Bath, ౫. St. Macheal, ౬. St. George, ౭. Star of India, ౮. Indian Empire, ౯. Royal Victorian, ౧౦. British Empire. ఇది చక్రవర్తిగారి Knight అని యందురు.

**నైట్రేట్సు** (Nitrates) **గనులు** — ఇక్కాలమున (గాలి యందలి) నైట్రోజను

నుండిచేయుచున్నారు. ఇవి పొలములలో నెరువు వేయుటయందును, Explosive పనులయందును నుపయోగించుచున్నవి.

కాని ఛిలీదేశము, పెరూదేశముల సముద్ర తీరములందు నైట్రేట్లునుగనులుకలవు. ఇవిఏపాటి చిన్న వర్షపు జల్లున కైనను కరఁగిపోవును. ఆతీరములం దసలే వర్షములు పడవు గాన నట నీగనులు నిలిచియున్న వందురు. ఆప్రదేశమున ౨౫౦ మైళ్ళ పొడవునను, మూఁడు మైళ్ళ వెడల్పునను నీఖనిజము కలదఁట. అట మఱియే పంటలును గావఁట.

## నైతధాక్షి గోత్రము — (రథితర ఉప గణము చూ.)

## నైతుంద్యగోత్రము— (విష్ణువృద్ధ ఉప గణము చూ.)

## నైదర్ రైమ్ నార్ రీజన్ (Neither Rhyme nor Reason)-

Sir Thomas More మంత్రికడ కొకకవి తానువ్రాసిన యొక Poem తెచ్చి యభిప్రాయ మర్థించె నఁట. ఆమంత్రి దానిని వచనరూపమున వ్రాసి తన కిచ్చినచో బాగుగగ్రహింపఁగల్గుదు ననెనఁట. ఆకవి యట్లొనర్ప మంత్రిపుంగవుఁడు "మునుపు Rhyme లేదు, ఇప్పుడు Reason లేదు" అనెనఁట. పిదప నీఉక్తిని Spencer పండితుఁడు వాడియున్నాఁడు.

## నైద్రాక్షిగోత్రము- గర్గఉపగణము చూ.

## నైధృవగోత్రము— నిధృవగణముచూ.

## నైన్ టైలర్సు మేక్ ఎ మేన్(Nine Tailors make a man)

క్రీ. శె. ౧౭౪౨ వ సంవత్సరమున నొక గొప్ప కుట్టుపనివాని దుకాణముకడ కొక దీనుఁ డగు తల్లిదండ్రులు లేని బీదబాలుఁ డేతెంచి యడుగుకొన, నందు పనిచేయు తొమ్మండుగురు కుట్టుపనివాండ్రు వానిని గనికరించి తొమ్మిది షిల్లింగు లొసఁగి రఁట. వాఁ డాద్రవ్యము పెట్టి పండ్లు కొని, యిండ్లవెంబడి తిరిగి, విక్రయించి కొంత లాభము గొని యాచించుట మాని అట్లే వృత్తిజీవనము సల్పుచు ద్రవ్యమార్జించి, కొంతవడికి ధనికుఁడై కృతజ్ఞతతో పైఉక్తిని తనచిహ్నముగ తనకార్యస్థానమున కిడె నఁట.

## నైమిశగోత్రము హారితఉపగణము చూడుఁడు.

## నైమిశారణ్యము-

దీని నిప్పుడునిమ్సార్ అనుచున్నారు సంయుక్తరాష్ట్రములలోని సీతాపూర్ నుండి ౨౦ మైళ్ళదూరము. లక్నో నగరమునుండి వాయవ్యదిశగా ౪౫ మైళ్లు. గోమతీనదీప్రాంతభూమి. ఈ పవిత్రారణ్యమున తొల్లి అఱువదివేల మహర్షులు వసించిరఁట. పురాణగాధ లనేకము లిటనే శౌనకాదులకు సూతుఁడుపదేశించెనఁట. ఇందు గోమతీ నదీతీరమున నాగపుర మను పట్టణ ముండినదఁట. దీని ప్రశంసలు పలుతావులఁ గలవు. రామాయణము, ఉత్తరకాండము ౯౧ అధ్యాయమున ప్రశంసింపఁ బడినది. (అరణ్యములు చూ).

తొలింటికాలమున ౧ మరీచి, ౨ అత్రి, ౩ భృగువు, ౪ వశిష్ఠుఁడు, ౫ క్రతువు, ౬ అంగీరసుఁడు కలసి అర్హతపస్స్థానమునకై బ్రహ్మ నర్థింప, మనోమయచక్రమును సృజించి దానిని దొరలించి "దీని వెంటనంటి జనుఁడు. అది యెచటఁబడునో అతావు మీకు తపస్స్థానమనియె నఁట. అది చనిచని యొకఅరణ్యమున "నేమి" (చక్రమును జుట్టియుండిన ఇనుపకట్టు లేక కమ్మి) ఊడి నేలంబడెనఁట. గాన దానికి నైమిశ మని పే రయ్యెనఁట. ఇది మహాపుణ్యక్షేత్రము. సంయుక్తరాష్ట్రములలో సీతాపూర్ సమీపమున నిమ్సార్ అను ధూమశకటస్థానముకడ (E. I. R. Nimsar Station)నున్నది.

**నైమిష్యగోత్రము** (జమదగ్ని వత్స ఉపగణము చూ.)

**నైయాయికశాస్త్రమతము** (అక్షపాదమతము చూ.)

**నైరధిగోత్రము**- భృగుసంతతి(ఆర్ష్టిషేణగణము చూ.)

**నైలునదియందలి సడ్ ఆటంకము**- ఆఫ్రికాఖండమందలి ఈజిప్టు దేశములోని నైలు నదియందు ప్రారంభ భాగముల, అనఁగా ఖార్టూమ్ ప్రాంతముల నది కడ్డముగ సడ్ అనంబడు నాటంకము గల్గుచుండును. పలవలతో సహా వృక్షము లందు తేలుచుండ నందుకా ప్రాంతముల విస్తారముగ నీటియందు తేలుచుండు నాచు, మొక్కలు, తీఁగెలు మొదలగున వన్నియుం జుట్టికొని, నదియం దిద్దరియుద్దరులకు రహదారీ పడవలు మొదలగు వాటిని జొరనీయక, రాకపోకల కాటంకము గల్గించుచుండెడిని. సడ్ అనిన ఆటంక మనియే ఆయరబ్బీ పదమున కర్థము. ఇటీవల ఖార్టూము పురమున వీటిని దరికీడ్చు యంత్రపరికరముల నమర్చి దరికీడ్చి యెండించెదరు. దాని నొకయంత్రసాహాయ్యమునఁ జూర్ణముగఁ జేసి ఇటుకలుగనొక్క భద్రపఱచుదురు. ఇవి నైలునదియందునడుచు పొగయోడలకు చక్కని ఫ్యూయల్ గా నుపయోగింపనగుచున్నవి. దీనిని గాల్చి స్టీమరు యంత్రముల నడుపుట పరిపాటి యైయున్నది.

**నైలునది (తొల్లింటిపేరు నీలానది)**- ఆఫ్రికాఖండమునందలి నది. విక్టోరియాసరస్సున జన్మించి, కియోగానదిగుండా నడిచి ఆల్బర్టు సరస్సు ప్రక్కగఁ జని, బహార్ ఎల్ జబెల్ను (White Nile) కలిసికొని, (ఖార్టూమ్కడ బహరెల్ అజారక్ నది (బ్లూ నైలు) బహారెల్ జబెల్ తో చేరికొనును.) నడుచును. ఖార్టూమ్ నుండి సముద్రముకడకు దానిపొడవు ౧౭౫౦ మైళ్ళు. విక్టోరియా న్యాజాకడ జన్మస్థానము నుండి సముద్రముకడకు నదిపొడవు ౩౪౭౦ మైళ్ళని చెప్పఁబడినది.

ఈజిప్టుదేశమును నైలునదియే యింతఫలవంతముగఁ జేయుచున్నది. దారిపొడవునను పొలముల కుపయోగించుచు, కైరోనగరము ప్రక్కంబడి చని చీలి రొజెట్టా డామియెట్టాల సమీపమున మధ్యధరాసముద్రినఁ జేరికొనును. ఖార్టూముకడను, రొజెట్టా డామియెట్టాలకడను ఆనకట్టలు కలవు. పెక్కు కాల్వలు కలవు. సెన్నారుకడ నొక యానకట్ట కలదు.

**నైవాశ్రితేషు గుణదోష విచారణా స్యాత్**-ఇది సంస్కృతభాషయందలిలోకోక్తి. ఆశ్రితులయందలి గుణదోషములను పాటించుచుండుట (విచారణగా పరిశీలింపఁబడుట)జరుగుచుండదు. ఏలయన నాశ్రితులయందు సర్వసాధారణముగా నభిమాన ముండుట సహజము. అది బలపడుటచేతఁ బరిశీలనకుఁ దావీయదని భావము.

**నైషకిగోత్రము**— ఔతథ్యఉపగణము చూడుఁడు.

**నైసర్గికాహారము**—శరీరపోషణమునకుగాను భుజించునది యాహార మనంబడును. ఇది జన్మించినదాదిగ ప్రారంభమై ఆమరణాంతముండెడిది. చక్కఁగఁ బరిశీలించిన తల్లిపాలతో నారంభమైన యాహారము కొంత ముదిరిన వెనుక మార్పులం జెంద మొదలిడును. చెట్లకు బాధ లేకుండ గైకొనఁ దగిన పండ్లు, కాయలు, గింజలు, కొన్నిదుంపలు మొదలగునవి నైసర్గికముగ సృష్టియందు మానవుల కేర్పరుపంబడిన నైసర్గికాహారము లని ఎల్లరకు దోఁపకపోదు. ఇదియె భరతదేశమున నాదికాలపు మహర్షుల వాడుకయం దుండినట్లు తెలిపెడిని. తక్కిన

వన్నియు తరువాత నేర్పడినట్లును, చేపలు, మాంసము మొదలగునవి నైసర్గికాహారములు కావనియు చక్కఁగఁబరిశీలించినతోఁపఁగలదు.

ప్రాగ్దేశపు నాగరికత వరిబియ్యముతో వండిన (Rice) యన్నము లైనను, పాశ్చాత్య దేశపు నాగరికత గోధుమరొట్టె (Loaf, Bread) పైనను ఆధారపడినదిగా ఆంగ్లమున నొకఉక్తి కలదు. ధాన్యపుపంట యథాస్థితినే యుండి వరిబియ్యమున కేయిబ్బందియుఁ గల్గుట లేదు, గాని పాశ్చాత్యుల గోధుమరొట్టెవాడుకకు వలయుస్థితి చాలక, రొట్టెలధర పెరిఁగిపోవుచున్న దని వాడుకలు ప్రబలి యున్నవి. దీనిని తినువారు తెల్లవా రనంబడుచుందురు. వారు వరిబియ్యపుటన్నమునందుకన్న గోధుమరొట్టెలం దధికబల మిచ్చుపదార్థములు, ప్రోటీను మొదలగునవి కలవనియు, అందునను వైట్ బ్రెడ్ నందుకన్న బ్రౌన్ బ్రెడ్ అధికజీర్ణశక్తి గల్గించి తానే గాక పాలు మొదలగు నన్యపదార్థములంగూడ జీర్ణమొనర్చు శక్తిగలది అనియు నను చున్నారు. బ్రౌన్ బ్రెడ్డునం దిట్టి మహాశక్తి గల్గుటకుం గారణము, అందు కలిసెడి గోధుమ ఉముక (Wheat Bran) అందురు. అందు రంగు గల్గించు పదార్థముగూడ నుంట, తెల్లరంగును బ్రౌనురంగుగా మాఱఁ జేయునఁట. ఈ ఊక తినుటయం దేయే మాహాత్మ్యము లింక బయల్పడనున్నవో వింత యయ్యెడిని. అందు ప్రోటీన్ (Protein) అధికముగ గలదఁట.

ఈ పాశ్చాత్య నాగరికతకు పునాది యనంబడిన Loaf, Bread రకములందు తెల్లరొట్టెయందు చెమ్మ యధిక మనియు, బ్రౌన్ రొట్టె Dry గా నుండుటయే దాని యాధిక్యమునకుం గారణ మనియు పరిశీలనలు తెల్పుచున్నవి. బిస్కట్లు మఱియు మంచివఁట.

**నొప్పి**—దీనింగూర్చి సరిగా వివరించుటకు వలనుపడదు. ఆలోపతీ వైద్యవిధానమున దీనికి Pain అని పేరుకాని దీనింగూర్చి సరిగా తెలియుటలేదు. ఆయుర్వేద వైద్యవిధానమున నొప్పి శూల యనంబడి అనేకవిధములుగఁ జెప్పంబడినది. కాని, యిది శరీరావయవధర్మమున నేల కల్గునో వివరింపఁబడలేదు. శరీరమునందు గల నాళములలో కొన్ని చర్మమునకుం దగులు పేగులకు చైతన్యనాళము లనిరి.(Sensitive nerves) అట్టినాళములకు ఇంచుక యుద్ధృతముగాని ఒత్తిడిగాని కల్గిన నవి చైతన్యనాళములు గాన లఘువుగ నగుతఱి సుఖముగను, బలువుగ సంభవించుతఱి కష్టముగను, చైతన్యమును ప్రేరేపించెడిని. కష్టముగ నుండుతఱి గల్గిన బాధకు నొప్పి యని పేరు. ఏకారణముచేత నైనను చైతన్యమును ప్రేరేపింపఁ జాలకుండిన నట్టిబాధ తెలియకపో వచ్చును. అట్టిస్థితియందు చర్మము మొద్దుబాఱిన దని తలంచుచుందురు. నొప్పులందు తలనొప్పియు, కడుపునొప్పియు మొదలగునవి ముఖ్యములు. నడుమునొప్పి, కీళ్లనొప్పులు మొదలగు కొన్ని వాతదోషము లోపల రేఁగి వుండగుట మొదలగుకారణములుగ నొప్పిగ నగును. గానము లేతస్థితియం దనఁగా తక్కువయగు ధ్వనులయందు చెవులకు శ్రావ్యమై, సుఖకరముగ నుండియు, కొంత హద్దు నతిక్రమించి అధికధ్వనియందు చెవులకుఁ గష్టమై నొప్పి గల్గించెడిని. కొన్ని దృశ్యములు సైతము భయంకరము లగుకతన హృదయమునకు అహితములగుట నొప్పి గల్గించునవిగనే యగును. ఇట్టి పరిస్థితులందు నొప్పిగల్గించు మార్పులు, లోన నేమి సంభవించునో సరిగా తెలియదు. కాని నొప్పి నెల్లరు సర్వసాధారణముగ ననుభవించియే యుందురు గాన దీనివివరణము నెఱుంగ నవసరము గలుగుచుంటలేదు.

శరీరమందలి నరములు మంచి యవస్థయం దుండి, ఎంత యొత్తిడిని పనిని గల్గియుండవల యునో అంతగనే యుండిన తప్ప ఎక్కువ యొత్తిడి గాని ఎక్కువ పనిగాని కల్గి చేయ వళ్లసివచ్చుతఱి మనచర్మమునకుంగల చైతన్యము నకు విపరీతదశ సంభవించును. దానిని నొప్పి యందురు. ఇది బాధాకరమై యుండు నవస్థ నరములకు హానియే సంభవించుతఱి చర్మము నకు చైతన్యమే కలుగదు. నరములను రేఁపుట వలన బాధ కల్గునని చెప్పఁబడినది. కురుపును రేపిన బాధ కల్గుటకును ఇదియే కారణము. సంగీత మైనను ఎంత రుచికరముగ పాడినను కొంత ధ్వని చెవుల కనుకూలమై రుచికరముగ నుండును. ధ్వని యధిక మగునేని అది కర్ణేం ద్రియమందలి నరములకు పని నధికముగఁ గల్గించి ఒత్తిడి యధికమై కర్ణకఠోరమై నొప్పి గల్గించును. ఇట్టి నొప్పి శరీరమందలియింద్రియ ములలో దేనికైనను కలుగవచ్చును. అనఁగా మితిమీఱి ఒత్తిడి గల్గుట నొప్పి యని మనము తలంతుము.

**నొవాఖోలీ జిల్లా**—మెగ్నా నదీముఖద్వా రముననున్న బురద నేలలజిల్లా. సందీప ద్వీపము మఱికొన్ని యితర ద్వీపములు నిందులోనివి. నొవాఖోలీపురము ప్రధానస్థానము. (బంగాళా దేశము చూ).

**నొవేషన్ (Novation)**— వాణిజ్య సం బంధ పరిభాషా పదము. ఒకఁడు తీర్పవలసిన అప్పును ఇంకొకఁడు తాను తీర్చెదనని సిద్ధపడి నచో అందునకు అప్పుతీసికొన్నవారు, ఇచ్చిన వారు, తాను తీర్చెదనని సిద్ధపడినవారు ముగ్గురు అనుమతింపవలయును. ఆ యనుమతుల కీపేరు వర్తించెడిని.

**నేఖల్వాంధాః సహస్రమపి పాంథాః పంథానం విదంతీతి న్యాయము**— మార్గమున నడుచు వేయిమంది గుడ్డివా రంద తేకీభవించినను, తా మేగవలసిన సరియగు బాట కనుఁగొనఁజాలరని యర్థము. అసమర్థుల ప్రయత్న మెంతయున్నను నిరర్థక మనిభావము.

**నోట పుక్కిలించినతఱి నీటంగల్గు గడబిడధ్వని (Gurgling noise)**—నోటి యందు నీటిం బోసికొని పుక్కిలించుతఱి గడబిడ ధ్వని కల్గును. దాని కాంగ్లమున Gurgling noise అనెదరు. గాలికి ఒత్తిడిబాధ కల దని ఎల్లరెఱింగినదే. నోట నీటిం బుక్కిలించు తఱి, అందున్న గాలి కొత్తిడిఁ గల్గించుచుండును. ఇంక నీటిచే నింపఁబడిన యొకసీసాను (మూతి సన్నము గలది) వంచితిమేని నీరు ఒలికి కొలఁది లోన కాళీస్థల మేర్పడు చుండుటయు, బయటనుండిన వాయువు లోనికిం జొచ్చుకొని పోయి యాకాళీస్థలమునకుం జేరుకొన మొదలి డుటయు సంభవించెడిని. గళాసువంటి మూతి వెడల్పుగల పాత్రనుండియైన నిట్టిధ్వనికారణము కలుగకుండును. మూతిసన్నపు సీసాలయం దిట్టి పరిస్థితు లుండును. లోనినీరు భూమియొక్క ఆక ర్షణశక్తి (Gravitation pull) వలన వెలు పలికిం దప్పించుకొనునదిగ జాఱుటయు, గాలి లోనికి బలాత్కారముగ త్రోసికొనిపోవం జొఱబడుటయు, సీసాయం దొకయుద్ధము వలె రాపిడి యొత్తిడిగనై యొండొంటితో నొఱసి కొనుటయందు కలఁతతరంగము (Disturbance wave) ప్రారంభమై గాలియందు కదలుచు వినఁబడును. దానినే పుక్కిలింతధ్వని యందుము. ఇది నీటంగల్గినది కాదు; గాలియే కారణముగాఁ గల్గినది.

**నోటరీస్ (Notaries)**- వాణిజ్యసంబంధ పరిభాషయం దవసరము లగు పత్రములను,

దస్తావేజులను ధృవపఱుప నధికారము నందిన వాఁడు.

**నోటికదలిక చూచి మాటలు గ్రహించు విధానము** (Lip Reading)— ఈ విధానమెల్లభాషలందు వ్రాసికొనఁదగియున్నది. ఆంగ్లమున Speach reading అనియెదరు. మూగ, చెముడు గలవారు నోటికదలిక చూచి అనినమాటలు గ్రహించుట కిది సాధనముగ నుండును.

ఇందు పెదవులు, నాలుకల కదలికయు, ముఖవైఖరులు (స్మిత హాసిత విహసితాదులు) ఇందు ప్రధానములై ధ్వనులవలె భావములం దెలుపును. వీటిమూలముననే బధిరులతో ప్రసంగింప వీలయ్యెడిని. తొలుత నొకేధ్వనిగల (ఆభాషయందలి) ఏకాక్షరములను గుర్తింప నేర్పి, పిదప రెండు, పిదప మూఁడు ధ్వనులు గల పలుకులను గ్రహింప నేర్పుదురు. పిమ్మట కలిపి యుచ్చరింపఁదగిన యుమ్మడి పల్కులు గుర్తింపఁజేయఁ బ్రయత్నింతురు. క్రమముగ వాక్యములంగూడ గుర్తింపఁజేయఁ గల్గుదురని విందుము.

Mulb-walle విధాన మనంబరఁగు నీవిధానము తొలుత జర్మనుదేశపు బెర్లిన్నగరమున కల్గినదని విందుము. ఇటీవల అమెరికాయందు వ్యాపించినది.

**నోటి శఠింపులకు నొసలు అనుకూలించాలి**— (నొసలన నుదుటివ్రాత యని భావము). ఆంధ్రలోకోక్తి.

**నోటీస్ ఆఫ్ డిజానర్** (Notice of Dishonour)—ఒక హుండీసొమ్ము చెల్లింపక నిరాకరింపఁబడినప్పుడు హుండీచేతగలఆసామీ, హుండీయిచ్చిన ఆసామీకి (అది నిరాకరింపఁబడిన దని) యిచ్చిన తెలుపుడు పత్రము. ఆహుండీ తిరిగి ఆయనకు చూపియు, సొమ్ము చెల్లింపక నిరాకరించెనేని, నిరాకరించినట్లు ఒక Notary వలన దానిపై Endorse చేయించుటకు Noting a Bill అనిపేరు.

**నోడ్సు** (Nodes)-గ్రహణమునట్లు సూర్యునకు భూమికి నడుమ చంద్రుఁడును, చంద్రునకు సూర్యునకు నడుమ భూమియు, నడుచుట సంభవించిన యవస్థకుఁ బేరు. ఆ Point నకు నోడ్సుఅని పాశ్చాత్యులు పేరిడిరి. అమావాస్య దినమున సూర్యుఁడును, పౌర్ణమి దినమున చంద్రుఁడును నోడ్సు పరిసరముల నేగుచుండుట జరగుచుండును. నోడ్సుగుండా నడుచుట సంభవించునేని గ్రహణము గల్గును. (గ్రహణములు చూడుఁడు.)

ఇది Ascending Node అనియు, Decending Node అనియు ద్వివిధము.

**నోబెల్ ప్రైజులు** (Nobel Prizes)- ఐరోపాఖండమున స్వీడన్‌దేశపు ముఖ్యనగరమగు స్టాక్హామ్ నగరమున క్రీ. వె. 1833 సంవత్సరమున జన్మించి రసాయనశాస్త్రజ్ఞుఁడై గొప్ప పరిశీలకుఁడని పేరందిన ఆల్‌ఫ్రెడ్ బెర్నార్డు నోబెల్ గొప్పధనికుఁడు. ఈయనకు నిరువది లక్షలపౌనుల యాస్తి కలదని చెప్పఁబడినది. దానినుండి వచ్చు రాఁబడివడ్డీనుండి రమారమీ ఎనిమిదివేలపౌనుల విలువగల బహుమానముల నైదింటి నేర్పఱచి, ఎటేట నిచ్చుచుండునట్లు ఉద్దేశ్యపత్రమును (will) వ్రాసి క్రీ. వె. 1896 సం॥రము మరణించెను. అందు ఒక్కొకటి ఎన్మిదేసివేలపౌనులవిలువగల బహుమానములు. ఒకటి ఫిజికల్ సయన్సు (Physical Science) నందునను, ఒకటి కెమిస్ట్రి (Chemistry) యందునను, ఒకటి మెడికల్ సయన్సు (Medical Science) నందునను ఎక్కువ పరిశీలనచేసి ఏదేని యొకగొప్ప విశేషమును కనిపెట్టినవారికి బహుమతిగా

నిచ్చుట కేర్పఱచెను. ఇంకను నొకబహుమాన మంతే విలువగలది విధిలక్షణయుక్త మనిపించుకొనఁదగిన పాండిత్య విద్యావిశేషరచన యగు గ్రంథము రచించినవారికిని (Remarkable litterary work of an idealistic tendency) ఇచ్చుచుండ నేర్పఱచెను. ఈ నాల్గు బహుమానములు స్వీడన్ దేశమేలు భూపాలుఁ డేర్పఱచిన యొకసంఘమువా రిచ్చుటకు నేర్పఱుపఁబడినది.

ఇంకొ నైదవబహుమాన మెనిమిదివేల పౌనులును, సర్వదేశ జనసౌభ్రాతృత్వ ధర్మమును వ్యాపింపఁజేయ నెక్కువసేవ యొనర్చినవారికి (For a person rendering the greatest service to the cause of international Brother-hood in reduction of standing armies and Furtherence of Peace congress.) ఈయఁబడ నేర్పఱచెను. ఇది దేశము సైన్యములు తగ్గించుకొనియుద్ధబాధలు లేకుండపనిచేయుటకై యుద్దేశింపఁబడెను. ఈ బహుమానమును పార్లమెంటు నిర్ణయించి యిచ్చుట కేర్పాటు. లోకమం దెవ్వరైనను ఈ బహుమానముల నందనర్హులు.

**నోమినల్ ఎక్స్ఛేంజి** (Nominal Exchange) వాణిజ్యసంబంధపరిభాషాపదము ఒకానొక కాలమందలి అవసరమువలనఁ గల్గిన తాత్కాలికపు డబ్బుబిగ్గిడివల్ల గల్గిన ధర గాక దేశమునందలి ధనధాన్యములస్థితినుండి గల్గిన ధరవరలు Exchange rate.

**నోమినలిజమ్** (Nominalism)— దీనిని Scolastic philosophy అనియు నందురు. ఇది Realism సిద్ధాంతమునకు వ్యతిరేకమగు నెదురు సిద్ధాంతము.

ఇందు Individualనకుమాత్రము నిజమగు నునికి కలదు. కాని General-Species నకు రెండింటికి నిజమగు నునికి లేదనియు, అవి ధ్వనులుగను, మాటలుగను మాత్రమే యుండుననియు, అవి వేఱుచేయఁ బడిన పరధ్యానము వలనఁ గల్గిన వనియుఁ జెప్పఁబడిన సిద్ధాంతము.

**నోమోగ్రాఫీ** (Nomography)— శాస్త్రగ్రంథములు (Laws) వ్రాయునపుడు విషయ విభాగక్రమము ననుసరించి వ్రాయువిధానము.

**నోమోలోజీ** (Nomology)— నోమోగ్రాఫీ చూడుఁడు.

**నోరమ్** (Noram)—స్టాటిస్టిక్సు చూ.

**నోర్కశాఖ క్షత్రియులు**-(క్షత్రియకులము చూడుఁడు.)

**నోరా వీఁపునకు దేకే!**— (నోటతూలుమాటలు వచ్చిన వీఁపునకు దెబ్బలు తగులు నని భావము.) ఆంధ్రలోకోక్తి.

**నో రుంటే తల కాస్తుంది**- (ఆంధ్రలోకోక్తి.)

**నోరు-ద్రవము**—మన నోటియందగపడని పెక్కు సన్నపురంధ్రములు కలవు. వీట్లగుండా అవసర మగుతటి నోటిలోని ద్రవము స్రవించుచునే యుండును. మనము భుజించు ప్రతిపదార్థమును నోటియందు దంతములతో నమలఁబడి మ్రింగఁబడుటకును,పిదప సుళువుగ జీర్ణమగుటకును సిద్ధపఱుపఁబడును. ఈరెండింటికిని నోటియందు ద్రవము సిద్ధముగా నుండుట (Saliva) అవసరము. అట్లు ద్రవము నోట భోజనపదార్థము నుంచుకొనుసరికి సిద్ధమై యుండుటకు మార్గ మీరంధ్రములగుండా ద్రవము నోటిలోనికి వచ్చుటయే.

రుచికరములగు పదార్థములంగూర్చి మనస్సునకు పూర్వానుభవమువలన నెఱుక గల్గియే యుంట, వాట్లంగూర్చి తలంచునపుడు గాని,

వినునపుడుగాని, నోట పదార్థముంచుకొనఁబోవు నంతటి పనియే జరిగి మనస్సుయొక్క ప్రోత్సాహమున రంధ్రములగుండా నోటిలోనికి ద్రవము ప్రవహించును. నోరూరుచున్న దని అనుకొందుము. ఈద్రవము తఱచు మాటిమాటికి నోటిలోనికి ప్రవహించుచుండుటచేత తఱచు గుటకలు వేసి మ్రింగవలసి వచ్చుచుంటఁ గలుగుచున్నది.

జీర్ణశక్తి బొత్తిగా చెడిపోయినరోగికి నోటద్రవము చక్కఁగా స్రవింపదు.

## నోరుమంచిదైతే ఊరుమంచిదే--

(ఆంధ్రలోకోక్తి.)

## నోవాస్ ఆర్కు (Noah's Ark) పడవ

మహమ్మదీయుల ఖురానునందు, క్రైస్తవుల బైబిలు పూర్వనిబంధనగ్రంథమునందు నోవా మహాత్ముడు ప్రవక్తగాఁ జెప్పఁబడినవాఁడు. ఈయనకాలమున ప్రజలు పాపులై రఁట. వారిని నశింపఁజేయ పరమేశ్వరుఁడగు యహోవ తలంచి, జలప్రళయమువలనవారినంత మొందింప సంకల్పించెనఁట. తనభక్తుండగు నోవామహాత్ముని, ఆతనిసకుటుంబమును, కొన్ని జాతుల మృగపక్ష్యాదులను సంకల్పిత జలప్రళయము నుండి రక్షింప నెంచి, యాయహోవదేవుఁడు నోవామహాత్మునకుఁ బ్రత్యక్షమై "భక్తుఁడా! గోఫరనంబడుజాతి కఱ్ఱతో (ఇది బహుశః Cedar గాని, Cypress గాని కానోవు నని తర్వాతివ్యాఖ్యాత లర్థము చెప్పిరి.) నొక Flat bottomed boat ను నిర్మింప మొదలిడుము. దానిలోపలను, వెలుపలను పూత పూయవలయును. అది మూఁడంతస్థులలోనికి వెలుఁగు రా మార్గములు, ఒకద్వారము గల్గి, 300 మూరలుపొడవు, ౫౦ మూరలు వెడలుపు, 30 మూరలు ఎత్తు గల్గియుండ వలయు" నని విధించెనఁట. దాని నాతఁడట్లే రచింప, "నీవును నీముప్వురు సుతులును, కోడండ్రు మొదలగు వారు రకమునకు రెండేసిచొప్పున మృగపక్ష్యాదులు (ఒకటి మగది, ఒకటి ఆఁడుది) అందు ప్రవేశింపు"డన వా రట్లు చేయ జలము లుద్భవించి లోకమును ముంచివేయ నాశనము సంభవించెనఁట. వీరు మాత్రము రక్షింపఁ బడిరఁట. అంత కొన్నిదినముల కాజలము లింకి, భూమి బయల్పడ, ఈఆర్కుపడవ ఇప్పటి ఎర్జెరమ్ పురము దరిని అరారాత్పర్వతశిఖరమున తేలుచు నిలచియుండె నఁట.

క్రైస్తవులం దీ నోవాఆర్కు సుప్రసిద్ధము.

## నోవెల్సు— (నవలలు చూ).

## నౌటికల్ ఆల్మానక్ (Nautical Almanac)

-ఇది సముద్రమున నోడలునడుపు నావికులకుఁ దెలియఁదగిన సంగతుల నేటేట పంచాంగములవలె ప్రకటింపఁబడునది. ఇందు సోలారుసిస్టము, గ్రహముల (గోళముల) అనుదినస్థితులు, చలింపని నక్షత్రముల (గోళముల) స్థితులు, రాఁగల (భావి) స్థితుల విశేషములు మొదలగు విషయములు చేర్చి ప్రకటించుచుందురు. ఇట్టివి బ్రిటిషుప్రభుత్వము, అమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వము మొదలగు గొప్ప ప్రభుత్వములు ప్రకటించు చుండును.

క్రీ. శ. 1762 లో బ్రిటిషు ప్రభుత్వము ప్రకటించినది చాలగౌరవపాత్రమైనదిగఁ జెప్పఁబడినది. దీని నప్పుడు Astronomer Royal పదవియం దుండిన Dr. Maskelyne పండితులు రచించిరఁట. ఆయనకుం బిదప పంచాంగమువిలువ కొంత తగ్గెననియు, పిదప పథకములను చక్కఁగ సవరించి 1844 నుండియు ప్రకటింపఁ బడుచు సరిగా నడుచు చున్నవని ప్రతీతి కలదు.

## నౌ నావికన్యాయము

—నావ లేకున్న నావికుని ఉపయోగము లేదు. నావికుఁడు లేకున్న నావ యుండిన ప్రయోజనము లేదు.

రెండునుగూడ నుండిననే ఉపయోగమని భావము. దీనిని అన్యోన్యాశ్రియ మందురు.

**నౌప్లియా పట్టణము**-గ్రీసుదేశములోని యొకపట్టణము. ఒకప్పుడు రాజధానిగనుండినది. (గ్రీసుదేశము చూ.)

**నౌలి (క్రియ)**-యోగాభ్యాసమున వాత పైత్య శ్లేష్మదోష సంజనితరోగములు కలుగకుండ నిరోధపరిహారముగను, ప్రాణాయామాభ్యాసము నడుచుచుండుటకును షట్క్రియలు చెప్పఁబడినవి. (యోగాభ్యాస క్రియాషట్కము చూడుఁడు.)

అందు నౌలిక్రియ యొకటి. ఇది ఒకే విధము. పొత్తికడుపునందలి నరములను కడుపు లోపల గిరగిర త్రిప్పుటయు, అటునిటు కదలించుటయు నౌలిక్రియ యనంబడును. ఇందువలన రోగములు నశించి జఠరాగ్ని బలపడునని చెప్పఁబడినది.

**నౌసరి (తొల్లింటి నవరాష్ట్రము)**-(నవరాష్ట్రము చూ.)

**న్యగ్రోధగణము (మఱ్ఱిచెట్టు)**-౧ అశ్వత్థః రావిచెట్టు, ౨ ఆమ్రః మామిడిచెట్టు, ౩ ఔదుంబరః మేడిచెట్టు, ౪ కకుభః మద్దిచెట్టు, ౫ కదంబః కదంబవృక్షము, ౬ కపీతకః దిరిసెనచెట్టు, ౭ కోశామ్రః అడవిమామిడిచెట్టు, ౮ చోరకపత్రః లక్క, ౯ జంబూద్వయః నేరెడు పిన్ననేరెడు చెట్టు, ౧౦ తిందుకః తుమికిచెట్టు, ౧౧ న్యగ్రోధః మఱ్ఱిచెట్టు, ౧౨ నంది నందివృక్షము, ౧౩ పలాశ మోదుగుచెట్టు, ౧౪ ప్లక్షః జువ్విచెట్టు, ౧౫ పావరరోధ్రః, ౧౬ పియాల చారపప్పుచెట్టు, ౧౭ బంధులః బుషభకము, ౧౮ బదరీ రేగుచెట్టు, ౧౯ భల్లాతకః నల్లజీడిచెట్టు, ౨౦ మధుకః ఇప్పచెట్టు, ౨౧ మధూకః ఇప్పచెట్టులో భేదము, ౨౨ రోధ్రః లొద్దుగచెట్టు, ౨౩ రోహిణీ కరక్కాయచెట్టు, ౨౪ సల్లకీ అందుగుచెట్టు.

ఇంకను మతాంతరమున మఱికొందఱు—౧ అర్జునః టేకుచెట్టు, ౨ ఆమ్రః మామిడిచెట్టు, ౩ కదంబః కదంబవృక్షము, ౪ కపీతకః దిరిసెనచెట్టు, ౫ కోలీ, ౬ జంబూద్వయః పిన్నపెద్ద నేరెడుచెట్లు, ౭ న్యగ్రోధః మఱ్ఱిచెట్టు, ౮ నందిః నందివృక్షము, ౯ పలాశః మోదుగచెట్టు, ౧౦ ప్లక్షః జువ్విచెట్టు, ౧౧ పిప్పలః రావిచెట్టు, ౧౨ పియాలః చారపప్పుచెట్టు, ౧౩ బంధులః బుషభకము, ౧౪ మధుకః ఇప్పచెట్టు, ౧౫ మధూకః ఇప్పచెట్లలో భేదము, ౧౬ రోధ్రయుగ్మ లొద్దుగచెట్లు రెండు జాతులు, ౧౭ విరలా తుమికిచెట్టు, ౧౮ సదాఫలా త్రిసంధిపుష్పవృక్షము, ౧౯ సోమవల్కః కాయఫలచెట్టు.

ఈచెట్లను న్యగ్రోధ గణ మనిరి.

**న్యగ్రోధబీజన్యాయము**-- మఱ్ఱిపండులోనిగింజ యణుమాత్రముగా చిన్నదియైనను దానినుండిపుట్టినమఱ్ఱిచెట్టు చాలగొప్పదిగనగును.

స్వల్ప కారణమును, గొప్ప కార్యమును తెల్పుట కీన్యాయము వర్తించును.

**న్యగ్రోధుఁడు**-యదుసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. కంసుని తమ్ముఁడు.

**న్యాయములు(లేక న్యాయ్యములు)**

మునకు వ్యతిరేకింపని పద్ధతులు న్యాయములనంబడును. న్యాయ మన యథావిధి యని భావము. ఎటుల ధర్మమో అటుల జరుగుట న్యాయము.

న్యాయబద్ధమై, తర్కవాదమున నోడింపఁబడక, నిలిచియుండుసిద్ధాంతములు న్యాయ్యములనంబడును. వీటింగూర్చి సంశయపడ నక్కఱ యుండదు గాన వాడకములందు స్థిరపడిన ధర్మములే గాన, వాట్లను నుడువుచు సాదృశ్యము

జుపుచుందురు ధర్మబద్ధము లగుటయే గాక న్యాయ్యము లర్థసాదృశ్యము లగునని వాడుక నందియున్నవి. ఈన్యాయ్యము లోకవిధమున నుండునవి కావు. కొన్ని లోకనటనలు లోకవ్యవహారముల కనుకూలించునవి. కొన్ని వ్యాకరణ శాస్త్రధర్మములం దెల్పున్యాయ్యములు, కొన్ని తర్కశాస్త్రధర్మములం దెల్పు న్యాయములు, కొన్ని కర్మ మీమాంసయందునను, కొన్ని బ్రహ్మ మీమాంసయందునను జెప్పఁబడినన్యాయములు కలవు. ఇంకను పురాణములందు, ఇతిహాసము లందు, ఆగమములందు, తంత్రగ్రంథములందు చెప్పఁబడినన్యాయములు కొన్ని గలవు. ఎచ్చటి వైనను లక్షణము లన్నియు నొకేరీతి గుణలక్షణ ములం గల్గియుండునవియె.

కర్మమీమాంసయందు జైమినికవసరము లైన ధర్మము లన్నియు జైమినీన్యాయమాలయందుఁ గాననగును. పిదప రఘునాథవర్మ యనంబడు రాజపుత్రవిద్వాంసుఁడు కొన్ని న్యాయములం గూర్చి లౌకికన్యాయసంగ్రహమని యొకగ్రంథ ముం గూర్చెను. కొన్ని న్యాయములు తారానాథ తర్కవాచస్పతికృతమగు వాచస్పత్యమున వివరింపఁబడినవి. పండిత సత్యవ్రత సమాశ్రమి కొన్నిటిం జేర్చి యొక చిన్నపుస్తకముగ నొనర్చి యుండెను. సాంఖ్యమతగ్రంథములందు వాడఁ బడిన న్యాయములు లౌకికన్యాయములుగనే యుండును.

ఇందు కొన్ని న్యాయము లిండియా ఆఫీసు లైబ్రరీయందు రెండు వ్రాతగ్రంథములఁ గానం బడును. ఇన్ని తావులనుండి మాకు దొరకిన న్యాయము లీగ్రంథమున వాటివాటి వర్ణక్రమ ప్రదేశములందుఁగాననగును. కొన్ని సంస్కృత లోకోక్తులును న్యాయములవంటివే. వాట్లయందు చేర్పఁబడి న్యాయముల వలెనే ఉపయోగించుట కీగ్రంథమున అక్షరవర్ణక్రమస్థానములం దుంపఁ బడినవి. వాట్లను ఆయా తావులందు చూడ వలయును.

న్యాయము:- ప్రపంచమున నొకరివలన నన్యులకు నెట్టిబాధలు కలుగకుండ జరుగుట కైన యథార్థధర్మవిధానము. ఇట్టి ధర్మపద్ధతు లన్నియుం గూడినదియె న్యాయ మనంబడును. ఇది పరమేశ్వరసంబంధమని తోఁచెడిని. యోగ్యులు న్యాయధర్మమార్గానువర్తులై నడిచెదరు. వాట్ల నతిక్రమించి స్వార్థపరాయణులుగ కొందఱును, దుష్టులుగకొందఱును ప్రవర్తించుటం జేసిదుర్మార్గ లనిపించుకొనుచుందురు.

శాసనములు, న్యాయము నొకటియే యని భ్రమపడరాదు. శాసనములు మనుష్యనిర్మిత ములు. ఆయాదేశముల యాచారముల మేరకుఁ గాని, లేక ప్రజలసౌఖ్యములకు గాని, నిర్మింపఁ బడి శాసింపఁ బడినవి. ఇంక ధర్మశాస్త్రము (Law) ప్రజలప్రవర్తన కై ఏర్పఱుపఁ బడిన పద్ధతి. శాసనములు, ధర్మపద్ధతులు ఒకప్పుడు న్యాయమైనవి కాకపోవచ్చును. కాననే అప్ప టప్పట నివి మార్పఁబడుచుండును. కాని వీలగు నంతవఱకు న్యాయమార్గము దాటకుండ నివి ఏర్పఱుపఁబడుచుండునని తలంపఁబడుచున్నది. వేర్వేఱు దేశముల వేర్వేఱువిధములుగ ధర్మశాస్త్రములుండును గాని,ప్రపంచమంతకు న్యాయ మొకేరీతిని దనరెడిని. న్యాయ మెక్కడను వ్రాయఁబడియుండ లేదు.అట్లయ్యును యోగ్యుల మనస్సులకు న్యాయాన్యాయములు స్ఫురించు చునేయుండును. దుర్మార్గులు దుష్టులకుం గూడ మనస్సులకు న్యాయాన్యాయములు స్ఫురించు చుండనోపుఁ గాని, వారు దానిం బాటింపక దాఁటుచుందురు. పరమేశ్వరుని న్యాయమూర్తి యందురు. భూపాలురు న్యాయపద్ధతినే తమ పరిపాలన నెఱప ప్రయత్నింతు రని తెల్పుటకు తమ న్యాయస్థానముల త్రాసును గురుతుగ

తొల్లింటికాలమున నుంచువారఁట. కొన్ని న్యాయస్థానములందు సింహమును గుర్తుగ వైచెదరు. ఇది పద్ధతుల నాచరణయందు బలాత్కరించుటకు ప్రభుత్వమునకుం గల బలమును సూచించెడిని.

పద్ధతులు గాని, శాసనములు గాని, ఆచార వ్యవహారధర్మములు గాని, నియతులు గాని, న్యాయమునకు లోఁబడకుండిన నిరర్థకములు. ఆంగ్లమున Uncompromising as truth అనియు, Unbending as Justice అనియు సామెత కలదు. అనఁగా సత్యము, సఖ్యపడని దనియు, న్యాయము ఇతరములకు లొంగని దనియు భావము. న్యాయబుద్ధికి కనికరము, అభిమానము నుండరాదని చెప్పఁబడినది.

**న్యాయశాస్త్రవిధి**-న్యాయమునకు, న్యాయపద్ధతులకు, న్యాయస్థానముల ఉత్తరువులకు నెల్లరు లోఁబడి నడువవలసియుండును. ప్రభువు పేరిట న్యాయపరిపాలనము నడుచుచున్నను ప్రభువులుకూడ న్యాయబద్ధులై దానికి లోఁబడ వలసియుండును. న్యాయమున కాంగ్లమున లా (Law) యనెదరు. అది ఆంగ్లోశాక్సనుపదము. Fixed అని ఆంగ్లభాషయం దర్థము. ఇట్టిపద్ధతులు, దేశాచారములు, ప్రజానుకూలధర్మములు, లోకవిహిత ధర్మవిహితములుగా నుండవలసి యుండును. భరతదేశమున మనుస్మృతి, పరాశరధర్మశాస్త్రము మొదలగుపూర్వగ్రంథములు న్యాయపద్ధతులం దెల్పునవి కలవు. పాశ్చాత్యదేశస్థులకు రోమనుల న్యాయ పద్ధతులు పునాదులుగా నున్న న్యాయశాస్త్రగ్రంథము లేర్పడియున్నవి. నిజముగ విధినిషేధములు, పరిహారములు, వారసత్వములు, శిక్షలుమొదలగు వాటి నివి యెరింగించుచుండునవి. వేర్వేఱుదేశములందు వేర్వేరు విధములుగా నుండునవి. అనఁగా దేశానుకూలములై యుండవలయునని భావము. ఆచారములపై నాధారపడిన పద్ధతులు గల న్యాయవిధులు ఆంగ్లమున Common Law అనంబడుచున్నవి. ధర్మన్యాయములపై నాధారపడిన పద్ధతులు Judicial Law అనంబడుచున్నవి. కనికరముపై నాధారపడిన ధర్మము Law of equity యనంబడుచున్నది.

**న్యూకోంబు సిద్ధాంతము**--(Newcomb Theory)-ఇది Simon Newcomb పండితునిచే రచింపంబడిన లా ఆఫ్ గ్రావిటేషన్ నకు సంబంధించిన విధానము. క్రీ.వె. పదునెన్మిదవ శతాబ్దాంతకాలమున చంద్రగోళము ఆర్కు ముందున పదునాల్గు సెకెండ్లతావునం దాకసమున నుండినది. పందొమ్మిదవ శతాబ్దాంతకాలము వచ్చువఱకు ఆర్కువెనుక పది సెకెండ్లతావున నుండెను. అనఁగా నిరువదినాల్గు సెకెండ్లు వెనుకఁబడిన దనిభావము.

లెక్కించి చూచినపిదప నుండవలసిన తావున నుండి పదిసెకెండ్లు వెనుకఁబడె నని తేలినది. ఇది ఒకవిధానమున లెక్కమేరకు గల్గిన వెనుకఁబడుట కాదనియు, గోళములు ఎదురుతిరుగుట, భూమి, చంద్రుల నడుమనుండు గ్రావిటేషను (ఆకర్షణ) శక్తి ఒకేవిధమునఁ బ్రసరింపక మార్పులనందుట, సూర్యునందలి Magnetic activity సంబంధము ధ్రుతమై మార్పు గల్గించుట మొదలగునవి దీనికారణము లనియు సిద్ధాంతపఱచెను. పిదప వేఱొకప్పుడు తొమ్మిది సెకెండ్లు ముందుగ నుండుతావున నుంటఁ గానవచ్చెనఁట.

**న్యూజీలాండు ద్వీపములు**- ఇవి మొదటిద్వీప మనియు, మధ్యద్వీపమనియు, కడద్వీపమనియు మూఁడు ద్వీపములుగ నున్నవి. ఇవి ఓషీనియా, ఆస్ట్రేలేషియాద్వీపసమూహమునకుం జెంది, పసిఫిక్కు మహాసముద్రమున ఆస్ట్రేలియా ఖండమునకు ఆగ్నేయ దిశగా నున్నవి. మొదటి ద్వీపమునకు ఉత్తరద్వీప మనియు,

రెండవ ద్వీపమునకు మధ్యద్వీప మనియు, కడ ద్వీపమునకు Stewart Island అనియు వాడుకనామములు కలవు.

మొదటిద్వీపము ౪౪౫౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము కలది. మధ్యద్వీపము ౫౮౫౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము కలది. వీటిరెండింటి నడుమను కుక్కుజలసంధి కలదు. కడ ద్వీపము చాల చిన్నది. అది ౬౬౫ చతురపుమైళ్లు వైశాల్యము కలది. పర్వతమయ ప్రదేశములు గల్గి సమశీతోష్ణపు తావులుగ నున్నవి. కొన్ని పర్వతశిఖరములం దెల్లప్పుడు మంచు కరఁగక నిలిచియే యుండును. అగ్నిపర్వతములు, ఉష్ణోదకప్రవాహములు కొన్ని కలవు. భూకంపము లప్పటప్పట కల్గుచుండును. భూములు చాల సారవంతము లైనవి. మధ్యద్వీపమున బంగారు గనులు కలవు. గొప్పజాతివగు Fern చెట్లు విస్తారముగఁగలవు. అందు కొన్ని జాతుల ఫెరన్సు వృక్షముల వేళ్లు ఆహారమునకుఁ బనికి వచ్చుచున్నవి. ఇచ్చట నార చాల శ్రేష్ఠతర మని పేరందినది.

ఈద్వీపవాసులం దాదిమనివాసు లగు మలయ తెగవారికి మావోరీ లనిపేరు. ఆదినివీరు నరమాంసభక్ష్యకులుగనుండి ఇప్పుడు విద్యాధికులై నాగరికత నొంది మానివేసిరి. ఐరోపాదేశస్థు లధికసంఖ్యాకులుగ నీదేశమునకుఁ జేరి వసించుచున్నారు. గొఱ్ఱెబొచ్చు, బంగారము ఎగుమతి చేయఁబడుచున్నవి. దేశము బ్రిటీషు సామ్రాజ్యమున స్వపరిపాలన గల్గియున్నది.

క్రీ. వె. ౧౬౪౨ లో టాస్మన్ అనుపేరుగల హాలెండు దేశస్థుఁడే దీనిం గనుఁగొనెనఁట. కాని Captain Cook గారు దీనిని సర్వే చేయుటనుండి క్రీ. వె. ౧౭౭౦ నుండి కుక్కుజలసంధియనియు, మధ్యద్వీపమునందలి౧౩౨౦౦ అడుగులఎత్తుగల ఒక పర్వతశిఖరమును కుక్కుశిఖరమనియు, పేరిడి పిలుచుచున్నారు. ౧౮౪౦ లో స్వపరిపాలనగల బ్రిటీషుకోలనీ యైనది.

కుక్కుజలసంధి నంటియున్న వెల్లింగ్టను పురము ప్రభుత్వస్థానము. ఇందు ఏఁబదివేల జనులు కలరు. ఉత్తరద్వీపమునఁ గల ఆక్లాండు పట్టణము తొల్లింటి రాజధానిగ నుండిన తావు. మధ్యద్వీపమున ఒటాగో సీమయందు ముఖ్య పట్టణము డూనిడిన్ పురము.

## న్యూటన్సు లాస్ ఆఫ్ మోషన్—

(Newton's Laws of motion) (Newton's laws of deduction) హిజాప్రిన్ సిద్ధాంతము చూ). వీటిని న్యూటన్సు లాస్ ఆఫ డిడక్షను అనియు ననుచున్నారు. వీటిని ఎస్ట్రానొమీ శాస్త్రవిదులు కెప్లర్సు త్రీ లాస్‌తోపాటుగ పోలికల నుపయోగించి ఆశాస్త్రమున వాడుచుందురు. (కెప్లర్సు త్రీ లాస్ చూ).

౧. The force under which a planet describes its orbit, always acts along the "Radius vector" in the direction of the Sun's centre.

౨. The force on any planet varies inversely as the square of its distance from the sun.

3. The forces on different planets vary directly as their masses and inversely as the squares of their distances from the sun or in other-words the accelorations of different planets, due to the Sun's attraction very invresely as the squares of their distances from the sun.

ఇందు మొదటిది కెప్లరుయొక్క రెండవ లాకును, రెండవది కెప్లరుయొక్క మొదటి లాకును సరిపోయెడిని.

**న్యూటన్ సిద్ధాంతము—** ఇంగ్లాండునందు చిరకాలము క్రిందట జీవించి యుండిన సర్. ఐజాక్ న్యూటన్ అనుపండితుఁడు (Sir. Isaac Newton) ఒక ఏపిలు చెట్టుక్రింద నుండుతఱి నొక Apple పండు రాలి ఆయన తలపైఁ బడె నఁట. తోడనే ఆయన 'కాపండు క్రింది కేల పడవలయును. ప్రక్కలకు, పైకి ఏల పడరాదు?' అను శంక కలిగెనఁట. పిదప చాల యోచనలు సల్పియు, చాల పరిశీలనలు చేసియు తుదకు ఆకర్షణపద్ధతిని (Law of gravity) ఆయన కనిపెట్టె నఁట.

ప్రతివస్తువును భూమి యాకర్షించు చుండుననియు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, భూమి మున్నగున వొకటి నొకటి యాకర్షించు (Attract) కొనుచున్న వనియు, గనుకనే అట్టివి అర్వాస్థానములం దుండును గాని వివిధాకర్షణములకు పాల్పడకున్న, వీలును చాలును లేకుండ నెగిరిపోవుటయో పడిపోవుటయో జరిగియుండవలసినదనియు, ఆకర్షణములవల్లనే సర్వమును ఆకాశమున విధ్యుక్తగమనములకులోనై యున్నవనియు, నాతఁడు కనిపెట్టి ఋజువు పఱచెను. Gravity యన లాటిన్భాషయందు బరువున కర్థము. ప్రపంచమునందలి సర్వపదార్థములు బరువుగ నుండుటకు కారణము భూమియొక్కయు, ఇతరపదార్థములయొక్కయు నాకర్షణమె (Gravity) యనియు, న్యూటన్ సిద్ధాంతము.

**న్యూడమ్ పాక్టమ్ లేక పేక్టమ్** (Nudum Pactum)—వాణిజ్య పరిభాషయందు ప్రతిఫలములేనిదస్తావేజునకు, ఎగ్రిమెంటునకు యీపేరు వర్తించును.

**న్యూఫౌండ్లాండు ద్వీపము** (New found land)— న్యూఫౌండ్లాండు అనఁగనే ఆజాతికుక్కలస్వదేశమని స్ఫురింపకపోదు. ఈ సుప్రసిద్ధశునకజాతి ఈదేశపుదిగ పేరందినది. ఇది బ్రిటీషు దేశమునకు ప్రప్రథమమునఁ గలిగిన పురాతనపుకోలనీ యైయున్నది. ఉత్తర (బ్రిటిషు) అమెరికాయందు లాబ్రిడోరునకు ప్రక్కగా నున్న Strait of Belle ద్వీపమునకు ప్రక్కగ నున్నది.

దీనిని క్రీ. వె. ౧౪౦౭ సంవత్సరమున Sebastian Cabot అను నావికుఁడు కనిపెట్టె నఁట. ఇట తొలుత బ్రిటీషుప్రజలు ఫ్రెంచి ప్రజలు కూడ నాక్రమించుచుండిరి గాని, క్రీ.వె. ౧౫౮౩లో పూర్ణముగ బ్రిటీషువారి వశమయ్యెనని చెప్పఁబడినది. చాల శీతలప్రదేశము. దీని తీరములందు Cod fisheries (for Cod liver oil) నుండి ఇది విశేష ధనవంతమగుచున్నది. దీనియందు సెంటుజాన్సు (St. Johns) పురము (౩౦౦౦౦) ప్రధానస్థానము.

లాబ అనునది కెనడాకు ఈశాన్యదిశయందు దాని నంటియున్న సముద్రతీరప్రదేశము. ఇది ఎక్సిమోజాతి ప్రజలకు స్వదేశము. ఇది న్యూఫౌండ్లాండునకు చెందిన కోలనియై యున్నది. ఇందు ప్రజలు కొంతవఱకు Cod చేఁపలు పట్టుచుందురు.

సెంటు జాన్సు పురము ఐర్లాండు తీరమునకు వెయ్యిమైళ్ళదూరమని చెప్పఁబడినది.

**న్యూమరికల్సు** (Numericals)—పాశ్చాత్య విధాన సంఖ్యాస్థానములు. ఇందు ఆంగ్ల జర్మను దేశములవిధాన మొకటియు; ఫ్రెంచి అమెరికా దేశముల విధాన మొకటియు సుప్రసిద్ధవిధానములు కలవు. కొన్ని దేశములం దిదియు, మఱికొన్ని దేశములం దదియు వాడుకగా ప్రచారము నందియున్నది.

ఏకస్థానము మొదలు మిలియన్ అనఁగా పదిలక్షలవఱకు నన్నివిధానము లొకేరీతి నున్నవి.

1 ఒకటి. ఏకస్థానము. సున్నలిం దుండవు. One.

10 పది. దశస్థానము. ఒకసున్న ఇం దుం డును. Ten.

100 నూఱు. శతస్థానము. రెండుసున్నలు Hundred.

1000 వేయి. సహస్రస్థానము. మూఁడు సున్నలు. Thousand.

10000 పదివేలు. దశసహస్రస్థానము. నాల్గు సున్నలు. Ten Thousands.

100000 లక్ష. శతసహస్రస్థానము. ఐదు సున్నలు. Hundred Thousands. ఈస్థాన మీశాస్త్రమునఁ జెప్పఁబడలేదు. వాడుకయందున్నది.

1000000 మిలియన్. (వేయివేలు) ఆఱు సున్నలు. Million. (భరతదేశ గణితశాస్త్రమున నిది పదిలక్ష లనంబడుచున్నది.

మఱియు నిటనుండి ఆంగ్లజర్మనువిధానములకును, ఫ్రెంచిఅమెరికను విధానములకును భేదములు గాన్పించెడిని.

ఆంగ్లజర్మనువిధానము - 1000000,000000 బిలియన్ (Billion.) (పండ్రెండు సున్నలు. అనఁగా మిలియనుమిలియను లని భావము). ఎస్ట్రానామీ శాస్త్రమున ఆకాశమండలి గోళముల దూరమును కొలుచుతఱి బిలియనుమైళ్ళ దూరమునకు లైట్ ఇయర్ (Light year) అని పేరిడి వాడియున్నారు.

ఫ్రెంచి అమెరికాదేశముల విధానము— బిలియను (Billion) 1000,000,000. (తొమ్మిది సున్నలు.)

ట్రిలియను. ఆంగ్ల జర్మను విధానము— 1000000,000000,000000 (18 సున్నలు).

ఫ్రెంచి అమెరికా విధానము— 1000000,000000 (పండ్రెండు సున్నలు).

క్వాడ్రిలియన్ (Quadrillion)—ఆంగ్ల జర్మను విధానము— 1000000,000000,000000,000 (21 సున్నలు).

ఫ్రెంచి అమెరికా విధానము— 1000000,000000,000 (పదునేను సున్నలు).

క్వింటిలియన్ (Quintillion)— ఆంగ్ల జర్మను విధానము— 1000000,000000,000000,000000,000000 (ముప్పది సున్నలు).

ఫ్రెంచి అమెరికా విధానము— 1000000,000000,000000 (18సున్నలు)

సెక్స్టిలియన్ (Cextillion) ఆంగ్ల జర్మను విధానము 1000000,000000,000000,000000, 000000,000000 (ముప్పదియాఱు సున్నలు)

ఫ్రెంచి అమెరికను విధానము— 1000000,000000,000000.000 (21 సున్నలు)

సెప్టిలియన్ (Septillion) ఆంగ్లజర్మను విధానము—1, నలువది రెండు సున్నలు.

ఫ్రెంచిఅమెరికావారి విధానము- 1000000, 000000,000000,000000 (24 సున్నలు).

ఆక్టిలియన్ (Octillion) ఆంగ్ల జర్మను విధానము— 1. నలువదియెన్మిది సున్నలు. ఫ్రెంచి అమెరికనువిధానము- 1. 27 సున్నలు.

నానిలియన్ (Nonillion) ఆంగ్లజర్మనువిధానము- ఒకటిపై 54 సున్నలు. ఫ్రెంచి అమెరికనువిధానము— ఒకటిపై ముప్పది సున్నలు.

డెసిలియన్ (Decillion) ఆంగ్లజర్మను విధానము. ఒకటిపై అఱువది సున్నలు. ఫ్రెంచి అమెరికనువి ధానము— ఒకటిపై ముప్పది మూఁడు సున్నలు.

**న్యూమిజ్ మటోలజీ** (Numismatology) — నాణెములు మొదలైనవానిచరిత్ర పరిశోధనముచేయు విధానము.

**న్యూరో ఫిజియాలోజీ** — (Neuro Physiology) నరములంగూర్చిన శాస్త్రము. దీనిని పెక్కండ్రు పొరపడి న్యూరోలోజీ యనివాడుదురు. కాని అది నిజముగ నరములకు గల్గిన వ్యాధులసందర్భమున వాడఁదగిన మాట గాని నరములంగూర్చిన శాస్త్రమున కర్థపదము కాదు. ఫ్రెంచిభాషాపద మగు Neur పదమునుండి కల్గిన పదము. దానికి Neuro అనియు ప్రతిరూపము కలదు. నరము లని యర్థము. ఇది Physiology లోని యొకశాఖ. నరములనుగూర్చియు మెదడును (Brain) గూర్చియు వివరించు కల. నరముల సముదాయమున కాంగ్లమున Nervous system అని వాడెదరు.

ఇది Higher ordered animals జాతులలో పరిపూర్ణత (Development) నొంది యున్నరీతిని Lower ordered animals జాతులలో అర్థస్థితికిఁ జెందియుండనట్లు గాన నయ్యెడిని. మెదడు శరీరాంగము లన్నిటియందు ముఖ్యము గాన దానింగూర్చి ఈశాస్త్రవిదులగు పరిశోధకులు "Brain is the centre of nervous system" అనియు, "It is controlling all the systems of the body" యనియుఁ జెప్పియున్నారు.

నరములు రెండు రకములు గలవు. మెదడునుండి వెలువడువాటి కీశాస్త్రమున Cranial nerves అనిపేరు. ఈసందర్భమున మెదడున్న పుఱ్ఱె భాగమునకు Cranium అనిపేరు గల దని మనస్సునం దుంచుకొనఁ దగును. రెండవ తెగకుఁ జెందిననరములు Spinal nerves అనంబడుచున్నవి. ఏలయన అవి వెన్నెముక (Spinal cord) తో సంబంధము కలవి. ఈ నరములు తిరిగి Sensory nerves అనియు, Motor nerves అనియు ద్వివిధముగఁ జెప్పఁబడియు నున్నవి.

Sensory nerves (నరములు) Sensory cell చేత చేయంబడినవి. ఇవి Feeling ను మెదడునకు నడుపుచుండునవి. ఇదియే చైతన్యమని యనెదరు. రెండవతెగకుఁ జెందిన Motor nerves మోటారుసెల్సుతో చేయఁబడినవి. ఇవి మెదడునుండి తిరుగ వచ్చి శరీరభాగములందు Feeling ను కలుగఁ జేయును. వీటికి Working cells అనియుఁ బేరు వాడుచున్నారు. ఇట్టి మెదడు Control ఒక్కొక తఱి నొక్కొకవిధమున ఇష్టముతోడను, వేఱొకతఱి ఇష్టముతో సంబంధము లేకుండగను శరీరభాగములను Control చేయు చుండును. (witting or unwitting).

మెదడునం దనేక నరముల కూటములు (Nerve centres) కలవనియు, అవి అనేక కార్యములకు కారణములై యున్న వనియుఁ దెలుచున్నది. అందు ముఖ్యములు మూఁడు Nerve centres అని చెప్పఁబడినది.

1. Concious activity centre-ముందు స్ఫురించి పిదప పనిచేసెడి నరములకూడిక.

2. Co-ordinate activity centre-స్ఫురించుటయు, పనిజరుగుటయు ఒకేసారిగ (Symultaniously) జరుపు నరములకూడిక.

3. Automatic activity centre-తెలియక (స్ఫురింపక) తనంతట తానే పని జరుగునట్లు Control సెఱపు నరములకూడిక.

ఇంక చిన్నచిన్నవి యగు నరములకూడికలు పెక్కులు గలవు. కాని, అవి అంతప్రాముఖ్యము నొందినవి కావు. ఇట్టి మెదడు (Brain)నందు మూఁడు భాగములు కలవు.

1. Cerebrum- ఇది పైనుండు భాగము. మెదడునందు 7/8 పరిమాణము గల్గియుండును. పొరలుపొరలుగా నుండి ఒకచీలిక (Fissure) గల్గియుండును. ఈ చీలిక ఎంతపెద్దది యైయున్న

అంత మేధాశక్తి అధికమై యుండునని చెప్పఁబడినది. కేవలము తగ్గియుండెనేని బుద్ధిహీనత యుండునఁట. దానికొకవైపున Sensary part అనియు, రెండవవైపున Motor part అనియుఁ జెప్పఁబడినది.

2. Ceribellum - దీనిని Smaller Brain (చిన్న మెదడు) అనియు నందురు. ఇదికూడ పైవలెనే రెండు భాగములు గల్గి యున్నది. ఇది పైమెదడునకు అనుకూలమై సాయ మొనర్చుచుండు ననియు, పై పెద్దమెదడున కించుక యపాయము వాటిల్లిన పిచ్చియెత్తుట మొదలగు అవగ్రతలు గల్గినఁ గల్గనోపును గాని, చిన్న మెదడున కపాయము వాటిల్లిన మృతియే ఫలిత మని చెప్పఁబడినది. మఱియు నిది Equilibrum of musseles ను సరిగా నడుపుచుండునని చెప్పఁబడినది.

3. Medulla- ఇది చాల చిన్నదియు, మెదడుయొక్క క్రిందిభాగముగ వెన్నెముక నరములకు తలవలె నున్నది. దీనికి Circulation పైనను ఊపిరిపైనను Control కలదు. మఱియు జీర్ణశక్తితో సంబంధించిన దని చెప్పఁబడినది. ఇది ముచ్చిలిగుంటకడ నుండును. ఇట నేపాటిదెబ్బ తగిలినను ఏనుఁగువంటి బలమగు జంతువులు సైతము మృతినొందు నని చెప్పుదురు.

వ్యాయామమువలన శరీరావయవములు పెరిఁగి వికసించినట్లే Culture వలన మేదస్సు వృద్ధినొందు ననియు, దానికిఁ గల్గిన బాధలు Mental disorders గా పరిణమించుననియుఁ జెప్పఁబడినది. అందు ముఖ్యములు-

(1) Improper development of Brain.

(2) Brain Fag.

(3) Degenaration of Brain.

(4) Boncussions (మొట్టికాయలు తగులుచుండుట).

(5) Loss of Memory.

(6) Peralysis (పక్షవాతరోగము తగులుట).

(7) Epilepsy (మూర్ఛరోగము, Fits తగులుట).

(8) Idiocy (or Brainlessness).

ఇంకను అనేక కారణములు కలవు. అవి బలహీనములుగ చెప్పఁబడినవి.

**న్యూస్** (News)-వార్తలు. New అనిన క్రొత్త యని యర్థము. క్రొత్తగ తెలిసినవార్త యని భావము. కొందఱు దీనిని N అనిన North నుండి యనియు, E అన East నుండి యనియు, W అన West నుండి యనియు, S అన South నుండి యనియుఁ దలంతురు. కాని, అది సరికాదని పెక్కండ్రయభిప్రాయము.

**న్యూస్ ఏజన్సీలు**— ప్రపంచమందలి వేర్వేఱు దేశములవార్తలు ప్రోఁగుచేయుచు, ననుదినము వార్తాపత్రికల కందించుచుండు సంస్థలకు న్యూస్ ఏజన్సీ లని పేరు. ప్రపంచమునం దిట్టిసంస్థలు నాల్గు ముఖ్యమైనవి కలవు. అవియే సుప్రసిద్ధములు.

1. Reuter Agency- ఇది బ్రిటీషు సామ్రాజ్యములోనిది. ఇది బ్రిటీషుదీవులలోని వార్తలనే గాక, బ్రిటీషు సామ్రాజ్యమందలి వార్తలను, జపాన్ దేశము మొదలగు మిత్రదేశముల వార్తలను ప్రోగు చేయునది. ఇది సుప్రసిద్ధమైనది. దీని ప్రధానకార్యస్థానము లండను నగరమునఁ గలదు.

2. Havas Agency- ఇది లాటిన్ దేశముల (అనఁగా ఫ్రాన్సు, ఇటలీ, స్పెయిను దేశములు, పోర్చుగలు దేశము, బెల్జియం దేశము, దక్షిణఅమెరికా దేశములు, ఉత్తర

(ఆఫ్రికా దేశములు, వీట్లయొక్క) వార్తలు ప్రోగుచేయునది. ఇది యెక్కువ వ్యాప్తి గలది. దీని ప్రధానకార్యస్థానము పారిస్ నగరమునందుఁ గలదు.

3. Wolf Agency- ఇది ట్యూటోనిక్కు దేశములు, స్లావ్ దేశములు, స్కాండి నేవియను (అనఁగా నార్వే, స్వీడను) దేశములు, వీట్ల యొక్క వార్తలు ప్రోఁగుచేయునది. దీనిప్రధాన కార్యస్థానము బెర్లిను నగరమునందుఁ గలదు.

4. Associated Press- ఇది అమెరికా సంయుక్తరాష్ట్రముల సంస్థ. చాల గొప్ప ఏర్పాట్లు గల సంస్థ. రైటరు ఏజన్సీ, హావాస్ ఏజన్సీ, వుల్ఫు ఏజన్సీలతో వార్తలను మార్చుకొను సఖ్యపు టేర్పాటులు గలిగినది. ప్రపంచమం దన్ని నగరములందు ఆరిందాలగు ఏజంట్ల నుంచి, వార్తలు ప్రోగుచేయించుచుండు వ్యాపారము గలదిగ వినుచున్నాము.

స్వదేశమగు నమెరికాసంయుక్తరాష్ట్రములం దన్ని పట్టణములందునను, అలాస్కా, ఫిలిప్పైన్ద్వీపులు, హావాయిన్ ద్వీపములు, మెక్సికో, మధ్యఅమెరికాస్టేట్సు, కరీబియన్‌సముద్రమందలి ద్వీపములందును ఈ సంస్థయొక్క ఏజంట్లు వ్యాపించియున్నారు. ఈన్యూస్ ఏజన్సీకి అద్దెకు తీసికొనిన ఏఁబదివేల మైళ్ళపొడవుగల టెలిగ్రాఫు లైనులు, టెలిఫోను లైనులు కలవఁట. వీటిపై అస్సోసియేటెడ్ ప్రెస్ ఏజన్సీవారి సొంత యుద్యోగులు వీరికిఁ బనిచేయుచుందు రని చెప్పఁబడినది.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో నున్న ముఖ్యవార్తాపత్రికలే యిందు భాగస్థులై దీనిని నిర్మించియుంట దీనికి"అస్సోసియేటెడ్ ప్రెస్"సని పేరిడఁబడినది. ప్రపంచమంతటినుండియు వార్తలను బ్రోగుచేయు నీమహాసంస్థ, కోఆపరేటివు పద్ధతులపై నిర్మింపఁ బడియున్నది. దీనినుండి వార్తలం గొనుసభ్యులు దీనిభాగస్థులుగ నుంటయేగాని, వారికి లాభములు గాని, డివిడెండ్లు గాని పంచుకొను నేర్పాట్లు లేవనియు, వారు తమతమపత్రికలకు తక్కువధనమిచ్చి ఈన్యూస్ ఏజన్సీనుండి వార్తలు కొనెద రనియు, ఆసొమ్మంతయు వార్తలను ప్రోగుచేయుటకు అన్ని తావుల కనుపుటకు అగు వ్యయములకు వినియోగింపఁ బడుచున్న దనియు వినుచుందుము.

ఇందు ౯౫౦ వార్తాపత్రికలు భాగస్థులై దీనిని నడుపుచున్నవని తెలిసెడిని. వీరు Board of Directors ను తమలోనుండి ఎన్నుకొని యెదరు. ఆ డైరెక్టరులసంఘమునుండి జనరల్ మేనేజరు ఎన్నుకొనఁ బడుచుండును. ఆయనయే వార్తలుప్రోగుచేయించుచు నలుదిశల కనుపుచు దానివ్యవహారములను బోర్డుతీర్మానముల మేరకు నడుపుచుండుటకు బాధ్యత గల్గియుండువాఁడు.

ఇందు భాగస్థులుగనున్న సభ్యులు తమతమ వార్తాపత్రికలకు తమ సొంత రిపోర్టరులగుండా తాము ప్రోగుచేసికొనిన వార్తలను తమతోడి భాగస్థులగు నన్యపత్రికలవారికిఁ గూడ నొసంగుచుండు నేర్పాట్లు గలవని తెలిసెడిని. దీనిప్రధాన కార్యస్థానము న్యూయార్కునగరమునందుంచఁబడినది.

ఈఎస్సోసియేటెడ్ ప్రెస్సుఏజన్సీ అతిత్వరితగతిని వార్తలుచేర్చి కూర్చి యందిచ్చు నేర్పాట్లు గల్గినదని సగర్వముగ నమెరికావారు తెల్పుచుందురు. ఇటలీ దేశములోని రోమకపురికడ నున్న "వెటికాన్" అనుభవనమునపదమూఁడవ లియో పోపు జగద్దేశికుఁడుమృతినొందుతటి వెటికాన్వైద్యశిఖామణితో నీఏజన్సీవారు చేసికొనిన యేర్పాటుల మేరకు రోమక నగరమందలి ఎస్సోసియేటెడ్ ప్రెస్ బ్రాంచిఆఫీసున కామృతవార్త తోడనే యనుపఁబడి, తత్క్షణమే ప్రధాన కార్యస్థానమున కావార్త తంతిద్వారా చేరి,

తొమ్మిది మినిట్లకాలమునకు న్యూయార్కు, సాన్ఫ్రాన్సిస్కో నగరములకనుపఁబడి, ఐరోపా ఖండమందలి దేశములకు నట్లేయనుపఁబడెనఁట. ఇటలీ దేశమునకుగూడ ఈ ఏజన్సీనుండియే ఆమృతి వార్త దెలిసెనఁట. అమెరికాసంయుక్తరాష్ట్రములవారికి దంభవాక్యములు, గర్వము పరిపాటియేయని యంద తెఱింగినదే. (పత్రికానిర్వహణకళ- పత్రికావిధ్యాభ్యాసము చూ.)

**పంకప్రక్షాళనన్యాయము**— బురద యంటిన కడుగుకొనక తీర దనిభావము. తప్పని కార్యములందు అనఁగా ప్రమాదము కల్గినతఱి దానినివదల్చుకొనుట కీన్యాయము వాడుదురు.

**పంక్తిశూల-పరిణామశూల** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున పరిణామశూలకు పేరు. భోజన పదార్థములు జీర్ణమగునదనుసఁ గల్గెడి కడుపునొప్పి. ఇది కడుపుయొక్క అనేకభాగములందు లేచునది. ఒకప్పు డాఁకలివేళ కన్పించుటయుం గలదు. దీనికి సోడా మొదలగు నుప్పులు తాత్కాలికశాంతిని గల్గించెడిని. పులుపులేని చప్పనిమజ్జిగ దీని నివారించు నందురు.

**పంగోడలాయన గోత్రము**— (నిధృవ గణము చూడుఁడు).

**పంగ్వంధన్యాయము**- గ్రుడ్డివానిభుజములపైని కుంటివాఁ డెక్కి పోవుట కర్థము. నడువలేని కుంటివాఁడు గ్రుడ్డివానిపై నెక్కిన పోఁగల్గుటయు, చూడకన్నులులేని గ్రుడ్డివాఁడు కండ్లుగల కుంటివాని నెక్కించుకొని వానిసాయమున నిర్బాధకముగ మార్గమున పోఁగల్గుటయు, నుపాయముచే నన్యోన్యము పోఁగల్గుటను దెల్పుతఱి నీన్యాయము వాడుదురు.

**పంచ కందలు (సిద్ధౌషధులు)** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున సిద్ధౌషధు లైదు విధము లనియు, అవి తైలకంద, క్రోడకంద, సుధాకంద, రుదంతి, సర్పాక్షి యనియుఁ జెప్పఁబడినది.

**పంచకద్వయము**—ఆయుర్వేద వైద్య శాస్త్రమున జీవనపంచమూలములకును హ్రస్వపంచ మూలములకును పేరు. (పంచమూలములు చూ.)

**పంచ కన్యలు**—౧ అహల్య, ౨ ద్రౌపదీదేవి, ౩ కుంతీదేవి, ౪ తారాదేవి, ౫ మందోదరీదేవి.

**పంచకపిత్థములు**—కపిత్థ మన వెలగపంఁడున కర్థము. ఆయుర్వేద వైద్యశాస్త్రమున పంచ కపిత్థములన వెలగచెట్టుయొక్క వేఱు, బెరఁడు, ఆకు, పండు, పువ్వు లని యెఱుంగునది.

**పంచకర్తలు**—(ప్రేత చూడుఁడు.)

**పంచకర్పాతదేశము**— (పంచగౌడదేశము చూడుఁడు.)

**పంచకల్పవృక్షములు** — (కల్పవృక్షములు చూడుఁడు).

**పంచకషాయము**— ఆయుర్వేద వైద్య శాస్త్రమున వస, మాంసరోహిణి, చేదుపొట్ల, ప్రియంగు, నింబ వీట్ల కషాయమునకు పేరు.

**పంచకూళ కషాయము**— (కూళము లైదు) "పిప్పలీ పిప్పలీమూలం శేవ్యం చిత్రక నాగరమ్." ౧ పిప్పళ్లు, ౨ పిప్పలిదుబ్బులు, ౩ శేవ్యము (ఒక గ్రంథేణపుదినుసు), ౪ చిత్రకము (చిత్రమూలము), ౫ నాగరము (శొంఠి).

**పంచకృత్యములు** (పరమేశ్వర కృత్యములు ౫) ౧ సృష్టి (పుట్టించుట), ౨ స్థితి (పెరిఁగి పెద్దవియగునట్లొనర్చుట), ౩ లయము-

(సమసింపఁ జేయుట), ౪ అనుగ్రహము (పరమేశ్వరుని సమీపించు మార్గమున నడుపుట), ౫ తిరోధానము (పరమేశ్వరునకు దూరమగునట్లు నడుపుట).

**పంచకృష్ణానదులు**—(దక్షిణ పంచనదములు చూడుఁడు.)

**పంచక్షారములు**— అయుర్వేద వైద్య శాస్త్రమున యవ, మోదుగు, గంటె, నువ్వు, మొక్కపు చెట్టు, వీటి క్షారమునకు (సమూలము కాల్చినబూడిదకు) పంచక్షారము లనిపేరు. అనఁగా నీచెట్లు కాల్చినబూడిద లేక రొయ్యి యని భావము.

**పంచ క్షీర వృక్షములు**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున మఱ్ఱి, రావి, జువ్వి, మేడి కలజువ్వి [(లేక గంగరావి) దీనికి సంస్కృతమున గర్ధభాండ] వీటికి పంచక్షీరవృక్షము లని పేరు. అనఁగా పాలుగల చెట్లని భావము.

మతాంతరమున నింకను గొందఱు గర్ధభాండమునకు (కలజువ్వికి) బదులు జెత్తపుచెట్టని చెప్పిరి.

**పంచగంగలు**— (గంగలు చూ.)

**పంచగణము** — ఆయుర్వేద వైద్య శాస్త్రమున నేలములగ, పల్లేరు, వాకుడు, కోలాకుపొన్న, ముయ్యాకుపొన్న యను నీయైదింటికి పేరు.

**పంచగాని- సమశీతోష్ణప్రదేశము**— (మహాబలేశ్వరము చూడుఁడు.)

**పంచగౌరీదేశము-పాంఛ్గోరాదేశము-పంచకార్వాతదేశము-దీర్సంస్థానరాజ్యము**-హిందూకుష్పర్వతదక్షిణదిశనుపాంఛ్గోరా జిల్లాగాఁ బరఁగుచున్న సీమ. ఐదుతావులనుండి ఐదు నదులుగ జన్మించి ఐదును గలిసి గౌరీనదియై ఇప్పుడు పంఛ్గోరానది యనంబరఁగుచున్నది. ఇది పంచగౌరీనది యనుమాటయొక్క వికారరూపమే కాని, వేఱు కానేరదు. మొదటి యైదునదులకుంగూడ గౌరీనదు లనియే పేరు. దీనిపై "పాంఛ్గోరా" యను పురమును గలదు. బహుశః ఇది పంచగౌరీపుర మేమో.

మహాభారతము, సభాపర్వము, 3-నియందు పంచగౌరీనదీతీరము పంచకార్వాత మనియు, దానిని సహదేవుఁడు జయించె ననియుం జెప్పఁబడిన దగుట, దీనికి తొల్లింటిపేరు పంచకార్వాత మనియు, దాని యొక్క రూపపు మార్పే పాంఛ్గోరా యనియు స్ఫురింపకపోదు.

ఇప్పటి రాజధాని దీర్ పురము. ఈ దేశము దీర్ సంస్థానరాజ్యముగ తేలుచున్నది.

**పంచజన లేక పాంచజన్యగోత్రము**-(ఆత్రేయగణము చూడుఁడు.)

**పంచజ్ఞానములు (జైనమత పంచజ్ఞానములు)**—జైనమతధర్మమున ౧ మతిజ్ఞానము, ౨ శ్రుతిజ్ఞానము, 3 అవధిజ్ఞానము, ౪ మనఃపరిజ్ఞానము, ౫ కైవల్యజ్ఞానము ననునవి పంచజ్ఞానము లని చెప్పఁబడినది. వీటిని స్వభాషలందు జైనులగు మార్వాడదేశస్థులు ౧ మతి, ౨ శ్రుతి, 3 అవధి, ౪ మన్పర్యోజ్ఞాన్, ౫ కేవలజ్ఞాన్ అని పల్కెదరు. ఇందు మొదటి రెంటను దూరదృష్టి, దూరశ్రవణములుగ తెల్పెదరు

**పంచతంత్రములు** — హితోపదేశ గ్రంథాంతర్గతములగు నైదుతంత్రములు.౧ మిత్రలాభము, ౨ మిత్రభేదము (ఇరువురమధ్య కలహము జనింపఁజేయుతంత్రము), 3 సంధివిగ్రహము (యుద్ధతంత్రమునందు మైత్రిభేదము), ౪ లబ్ధనాశము (దొరకినదానిని వదలివేయుట), ౫ అసంప్రేక్ష్యకారిత్వము(ఆలోచన లేని పని). (హితోపదేశము చూ.)

**పంచతర్క కర్మలు**— ౧ చలనము (కదలుట), ౨ ధావనము (పరుగిడుట), ౩ ఆకుంచనము (ముడుచుకొనుట), ౪ ప్రసారణము (సాగుట), ౫ కంపనము (వణకుట).

మతాంతరము: ౧ ఉత్క్షేపణము (పైకి లేచుట), ౨ అవక్షేపణము (క్రిందికి దిగుట), ౩ ఆకుంచనము (వంగుట లేక ముడుచుకొనుట), ౪ ప్రసారణము (సాగుట), ౫ గమనము (పోవుట).

**పంచతిక్తములు**— ఆయుర్వేద వైద్య శాస్త్రమున ౧ వేము (వేప), ౨ తిప్పతీగె, ౩ అడ్డసరము, ౪ చేదుపొట్ల, ౫ వాకుడు అను నీ యైదింటికి పేరు.

**పంచతిథులు**— కృష్ణ పక్షమునందు ౧ పాడ్యమి, ౨ ద్వితీయ, ౩ తృతీయ, ౪ చతుర్థి, ౫ పంచమి.

**పంచ త్రింశతి తాళములు** (౩౫)— సంగీతశాస్త్రమునందు ౧ ధ్రువ, ౨ మధ్యమ లేక మఠిమ, ౩ రూపక, ౪ ఝంపె, ౫ త్రిపుట, ౬ అట, ౭ ఏక యని తాళము లేడు. సప్త తాళము లని ప్రసిద్ధములు. ఇం దొక్కొకటి త్రిశ్ర, చతుశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణ జాతులుగ నేర్పడి యుంట ముప్పదియైదు తాళములుగ నేర్పడినవి. వాట్ల కర్త్నానామములను పూర్వకాలవిద్వాంసు లేర్పఱచిరి.

౧. ధ్రువ— త్రిశ్ర- మణితాళము. చతుశ్ర- శ్రీకరతాళము, మిశ్ర- పూర్ణతాళము, ఖండ-ప్రమాణతాళము, సంకీర్ణ-భువనతాళము.

౨. మఠిమ— త్రిశ్ర-సారతాళము, చతుశ్ర-సమతాళము, మిశ్ర- ఉదీర్ణతాళము, ఖండ- ఉదయతాళము, సంకీర్ణ-రావతాళము.

౩. రూపక— త్రిశ్ర- చక్రతాళము, చతుశ్ర-పత్తితాళము, మిశ్ర-కులతాళము, ఖండ-రాజతాళము, సంకీర్ణ - బిందుతాళము.

౪. ఝంపె— త్రిశ్ర- కదంబ తాళము, చతుశ్ర-మధురతాళము, మిశ్ర-సురతాళము, ఖండ-చణతాళము, సంకీర్ణ-కరతాళము.

౫. త్రిపుట—త్రిశ్ర-శంఖతాళము, చతుశ్ర-ఆదితాళము, మిశ్ర-లీలతాళము, ఖండ-దుష్కరతాళము, సంకీర్ణ-భోగతాళము.

౬. అట—త్రిశ్ర-గుప్తతాళము, చతుశ్ర-లేఖతాళము, మిశ్ర- లోయతాళము, ఖండ-విదళతాళము, సంకీర్ణ -ధీరతాళము.

౭ ఏకతాళము—త్రిశ్రజాతి-సుధతాళము, చతుశ్రజాతి- మానతాళము, మిశ్రజాతి-రాగతాళము, ఖండజాతి-రతతాళము, సంకీర్ణజాతి-వసుతాళము.

ఈ ముప్పదియైదు తాళములందు త్రిశ్రజాతి తాళములందు లఘువునకు మూడుమాత్రలును, చతుశ్రజాతితాళములకు నాల్గు మాత్రలును, మిశ్రజాతితాళములందు లఘువునకు ఏడుమాత్రలును, ఖండజాతిలఘువులం దైదేసిమాత్రలును సంకీర్ణజాతి లఘువులందు తొమ్మిదేసి మాత్రలును సప్తతాళములందుండునని యెఱుంగునది.

ఇంకను పైవరుసనే ధ్రువతాళమున మీఁది ఐదుజాతులందు త్రిశ్ర౧౧, చతుశ్ర౧౪, మిశ్ర౨౩, ఖండ౧౭, సంకీర్ణ౨౯ అక్షరములను, మఠిమ ౮, ౧౦, ౧౬, ౧౨, ౨౦ అక్షరములను, రూపకము ౫, ౬, ౯, ౭, ౧౧అక్షరములను, ఝంపె తాళము ౬, ౭, ౧౦, ౮, ౧౨ అక్షరములను త్రిపుటతాళము ౭, ౮, ౧౧, ౯, ౧౩ అక్షరములను, అటతాళము ౧౦, ౧౨, ౧౮, ౧౪, ౨౨అక్షరములును, ఏకతాళము ౩, ౪, ౨, ౨ అక్షరములను గల్గి యుండెడిని. (సంగీత శాస్త్రము చూ. పద్యగానకళ చూ.)

**పంచతీర్థములు**—హరిద్వారము పశ్చిమముగాఁ గతిపయదూరమున రెండుకొండల మధ్యప్రదేశమునందు ౧ అమృతకుండము,

౨ తప్తకుండము, ౩ రామకుండము, ౪ సీతాకుండము, ౫ సూర్యకుండము నను నైదు కుండములు.

అర్జునుఁడు తీర్థమాడిన పంచతీర్థములు-సౌభద్ర, పౌలోమ, భారద్వాజ, కారంధమ, ప్రసన్నములు.

**పంచత్యాజ్య(వర్జ)ములు**—౧ మాస మందలి త్యాజ్యములు శరిదినములు, ౨ వారముయొక్క త్యాజ్యములు రాహుకాలము, ౩ నక్షత్రముయొక్క త్యాజ్యకాలము త్యాజ్యము, ౪ యోగముయొక్క త్యాజ్యకాలము మరణయోగములు, ౫ లగ్న లేక రాశియొక్క త్యాజ్యము.

**పంచత్వక్కులు (పట్టలు)**—౧ రావిపట్ట, ౨ మఱ్ఱిపట్ట, ౩ జువ్విపట్ట, ౪ మేడిపట్ట, ౫ మామిడిపట్ట వీట్లకు పంచత్వక్కు లనిపేరు.

**పంచదశయోగములు**— యోగములు చూడుఁడు).

**పంచదార (శర్కర)**—పంచదార దేశ ప్రసిద్ధపదార్థము. ఇది భోజనపదార్థములకు తీపిరుచి గల్గింపఁ గలుపుచుందురు. మన దేశమున శర్కర, కండశర్కర, (కలకండ లేక పటికపంచదార), చక్కెపంచదార, చీనాపంచదార, శక్కరైన్ (పలుకులపంచదార)(Sugar crystalls) అనునవి కలవు. కండశర్కరను కలకండ యనియు నందురు. ఇది శర్కరపాకము ను ముదురునట్లు కాచి, ఆరఁబెట్టుటవలన పలకలుగల్గి గట్టిపడునది. ఇది కొంతవఱకు స్వచ్ఛత గల్గి యుండునది. చక్కెపంచదార యందు ఇంచుక యెఱ్ఱనిరంగు కలిసియుండి తీపురుచి అధికముగ గల్గియుండును. ఇంక చీనా పంచదార యనంబడునది చీనా దేశసంబంధి కాదు. చీనీ యన సర్వసాధారణముగ మాధుర్యమునకు వాడుచుందురు. ఇది ఇనుకవలెను, మెత్తనిగుండవలెను ద్వివిధముగ రచింపఁబడును. అందు మెత్తనిగుండను బనారస్‌చీనీ యందురు. శక్కరైన్ బహుమూత్రరోగులకు సైత మీయఁదగురీతిని దోషరహిత మైనది. మఱియు పలుకులపంచదార తాంబూలమున కొన్నిచోట్ల వాడుచుందురు.

జొన్న, చోడి మొదలగుచెట్ల కాడలరసము తీయగ నుండును గాన ఆరసములనుండి పంచదార చేయ నగును. కాని, ముఖ్యముగ చెఱకుగడల రసమునుండియు, బీటుదుంపలనుండియు పంచదార చేయఁబడు చున్నది. రసవాదశాస్త్రమున (Chemistry) దీనిని Soluble and fermentable carbo hydrate with sweet taste అని పేరిడఁబడినది. ఉష్ణదేశములందు చెఱకుగడలనుండియు, సమశీతోష్ణదేశములందు Sugar-beat అను దుంపలనుండియు పంచదార విస్తారము చేయఁబడుచున్నది. ఫ్రాన్సు మొదలగు కొన్ని దేశములందు విస్తారమూల్యము పెట్టుబడి పెట్టి బీటు దుంపలను పెంచి శర్కరఁజేయు గొప్పగొప్ప ప్రతిష్ఠాపనలు కలవు. వాట్లకు Sugar bounties అనిపేరు. ంచదారను విస్తారముగ మిఠాయీలు చేయుటయం దుపయోగించుచుందురు.

శర్కర సమధాతువుగ నుండి చలవజేసి దాతువునకు బలము గల్గించును. ఏయౌషధముతో దీని ననుపానముగ లోని కిత్తురో, ఆ యౌషధగుణమును త్వరితముగ శరీరమంతటను వ్యాపింపఁజేసి గుణముఁ గల్గించును. కాన, ద్వంద్వరోగములం దనుపానముగ దీని నిచ్చుచుందురు. శర్కర నఱకులను మాన్పును. శరీరమున రక్తమును శుభ్రపఱచును. నరములకు బల మొసంగి, క్రిమిని హరించి, లోని దుష్టపదార్థకూటమిని నడలఁజేసి, కడుపునొప్పిని

శాంతింపఁజేసి ఆరోగ్యమును రక్షించు ననియు, ఉన్మాదము, ఎక్కిళ్లు, కామెర్లు, జ్వరతీవ్రత, తాపము, దాహము, ధాతునష్టము, ప్రదర (యోనిరోగ)ము, ప్రమేహరోగము, పాండు రోగము, పైత్యవికారము, బడలిక, బలహీనత, మూత్రకృచ్ఛ్రము, మూర్ఛ, రక్తపైత్యము, వాంతులు, శ్వాస, శోష, క్షయ రోగముల నివారించు ననియుఁ జెప్పఁబడినది.

పంచదారను పరగడుపునఁ దినినను, అధిక ముగ దినుచుండినను ఆఁకలి మందగించి అజీర్తి కూడఁ గల్గించును. గర్భమున నెమిడికపాము లను, నులిపురుగులను గల్గించును. ఈదోషము లకు విఱుగుడు బాదంపప్పు, పాలు, పులుసు, తుంగముస్తలచూర్ణము నని చెప్పఁబడినది.

**పంచధారల (తీర్థము)**—ఇది విశాఖ పట్టణమండలమున, సర్వసిద్ధి తాలూకాలో, అనకాపల్లినుండి పదునాల్గుమైళ్ల దూరమునను, యెలమంచిలినుండి యెదుమైళ్ళ దూరమునను ఉన్నతీర్థము. ఇటనున్న పర్వతమునకు "ఫణిగిరి" యనిపేరు. పర్వతదక్షిణభాగమున నైదు జల ధార లుద్భవించి, సమీపముననే కలిసిపోయి యుంట నీపే రయ్యెను. అట కైదుఫర్లాంగుల దూరమున "పంచధారల" యనుపేరం బరఁగు గ్రామమును గలదు. ఆధారల కించుక యెత్తున కొండప్రక్కను శివదేవస్థాన మున్నది.

తొల్లి శివభక్తుం డగు మార్కండేయుని హింసించి, యముఁడు శిక్షితుఁ డగుటయు, మార్కండేయుఁడు రక్షితుఁ డగుటయు పురాణ ప్రసిద్ధమే. అత్తఱి నాయముఁడు తనదేశికుఁ డగు వరసిద్ధు నాశ్రయించి, యాయనసలహా మేరకు ఫణిగిరిపై పంచధారల సమీపముననే గురువుగారిపేరిట వరసిద్ధలింగము ప్రతిష్ఠించి, పూజించుచు తపంబొనర్చి శివప్రసీదత నందె నఁట. ఆశివలింగము యమధర్మరాజుచే ప్రతిష్ఠిత మగుట యమధర్మలింగేశ్వరుఁ డని ప్రజలచే వాడఁబడుచు వరసిద్ధలింగ మనుపేరు వాడఁ బడక మాసిపోయెను.

కాలము గడచిగడచి ఆపేరింకను కుపపఱు పఁబడి ఇక్కాలమున ధర్మలింగ మనుపేరఁ బరఁగుచున్నది. (శాలివాహన శక మేమొ?) ౧౩౮౫ సంవత్సరమున చోడచక్రవర్తి యీదే వస్థానమునకుఁ గొన్ని యావుల నిచ్చినట్లును, విష్ణువర్ధనుం డనునృపతి పిదపఁ గొన్ని యావుల నిచ్చినట్లును, ఉపేంద్రదేవచక్రవర్తి కుమారుఁ డగు నృసింహచక్రవర్తి కొన్ని యావుల నిచ్చి నట్లును, దేవాలయావరణమున వాయవ్య దిశనున్న మంటపమున శాసనములు కలవు.

ఇటీవల ధారల కొక ఫర్లాంగుదూరముననే, సమీపముగ ధారపాలె మన్నుగ్రామము నిర్మిం పంబడినది. శాలి ౧౬౬౨ సంవత్సరమున, విజ యనగర మహారాజుగా రీపంచధారల గ్రామ మును బెడదకోట రామజోగిగా రనువారికి ఇట యాత్రికుల కన్నదాన మిడుచుండుట కగ్రహా రముగ నిచ్చివేసినట్లు రాగిరేకులశాసన మొకటి ఆగ్రామమునం దున్నదఁట. కాని, దీని శివారు పల్లె యగు ధర్మవరమును మాత్ర ముంచి, తక్కి నదానిని విజయనగరమువారే తమసంస్థానము నకుఁ దీసికొనిరని యచటివా రనెదరు. ఆబెడద కోటవారును తమభూముల నమ్ముకొని రఁట. వా రెవ్వ రిప్పు డచ్చటఁ గానరారు. దేవస్థాన మున కిప్పు డాఱువందల రాఁబడిగల భూస్థితి కలదఁట.

ఇటీవల నఱువది, లేక డెబ్బది వత్సరముల క్రిందట, ధారకు సమీపముననే మాధవస్వామి కొక చిన్న దేవస్థానము నిర్మింపంబడిన దందురు. ధారతుండలి యుదక మించుక పులుపుతోఁ గూడిన మాధుర్యము గల్గియున్నది. దీనిని బరిశీ లించిన రసాయనశాస్త్రవేత్తలు ధారయొక్క

మార్గమునం దెచ్చటనో గంధకసంబంధముండుటచే చర్మరోగముల నివారించు శక్తి యిందు గలదనినట్లు వదంతి కలదు. ముక్తికి వదలఁజేసి శరీరమునకు తేలికదన మిచ్చుటయందునను, బట్టలను పరిశుభ్రపఱచుటయందునను ధారోదకములు పేరందినవఁట. రెండుగ్రామములందును కొబ్బరి, యనఁటి, పోఁకతోఁటలు చక్కఁగాఁ బెరుఁగుచున్నవి.

**పంచదేవతావృక్షములు**— (దేవతా వృక్షములు చూడుఁడు.)

**పంచనదములు**-జప్యేశ్వరమున సంగమించు నైదునదులు. ౧ జాతోదకానది, ౨ త్రిస్రోతానది, ౩ వృషధ్వనినది, ౪ స్వర్ణోదకానది, ౫ జాంబూనది యని లింగపురాణమున ౧-౪౩ అధ్యాయమునఁ గలదు.

ఇంకను దక్షిణాపథమున సంగమనదములకు దక్షిణపంచనదము లనిపేరు. అవి ౧ కృష్ణానది, వేణా, లేక వేణీనది, ౩ తుంగానది, ౪ భద్రానది, ౫ కోనా లేక కోయన నది యని విష్ణుసంహిత ౮౫ అధ్యాయమునఁ జెప్పఁబడినది. (నదములు చూడుఁడు).

**పంచనారాయణములు-బదరీనారాయణములు**—హిమవన్నగమునగార్వాల్ సంస్థానమం దున్న బదరీనారాయణ క్షేత్రము (బదరీనాథము) నంటి యున్న నారాయణ క్షేత్రము పేరు.

౧ బదరీనారాయణము- దీనిని నరనారాయణ మనియు, బదరీనాథ మనియు నందురు. ౨ వృద్ధబదరీనారాయణము. ౩ యోగబదరీనాథము (పాండుకేశ్వరము). ౪ ఆదిబదరీనాథము. ౫ భవిష్యద్బదరీనాథము. ఇంకను త్రియుగీనారాయణక్షేత్ర మని వేఱొకటి కలదు గాని, అది బదరికారణ్యక్షేత్రము కా దందురు.

**పంచనింబలు**- నింబ యనిన వేము, లేక వేప కర్మము. ఆయుర్వేద వైద్యశాస్త్రమున పంచనింబ లన వేపచెట్టుయొక్క- పైబెరడు, వేపాకు, వేపపూవు, వేపకాయ, వేఱుపైపట్ట (బెరడు) యని యెఱుంగునది.

**పంచనియమములు**— ౧ శౌచము. శరీరములోపలను, వెలుపలను గూడ శుచిగల్గి యుండుట.

౨ తపము-కాయిక వాచిక మానసికముల మూఁటిని వ్రతనియమముచే తపింపఁ (వేఁడి యగునట్లు) జేయుట.

౩ సంతోషము-సుఖదుఃఖములు, ఆపత్సంపదలు, కష్టసుఖములు, దారిద్ర్యైశ్వర్యములు, మొదలగు ద్వంద్వముల (రెండింటి)యందొకేరీతి నుత్సాహముతో వాట్ల వేదనలకు వెఱవక సహించి యనుభవించు చుండుట.

౪ స్వాధ్యాయము- వేదశాస్త్రాదులు పఠించుచుండుట.

౫ ఈశ్వరప్రణిధానము - పరమేశ్వరుని యందు మనస్సు నిల్పి ధ్యానించుట. (నియమము చూడుఁడు.)

**పంచపల్లవములు**— పుణ్యాహవాచనము, వ్రతములు మొదలగువాట్లయందు కలశములలో నైదు చిగుళ్ళ నుంచెదరు. ౧ అశ్వత్థపల్లవములు (రావిచిగుళ్లు), ౨ ఔదుంబరపల్లవములు (మేడిచిగుళ్లు), ౩ వటపల్లవములు(మఱ్ఱిచిగుళ్లు), ౪ ఆమ్రపల్లవములు(మామిడిచిగుళ్లు), ౫ ప్లక్షపల్లవములు (జువ్విచిగుళ్ళు).

ధూపమునకు పంచపల్లవములు-౧మామిడి, ౨ నేరేడు, ౩ వెలగ, ౪ మాదీఫలము (బీజపూర్వకము), ౫ మారేడు (బిల్వము).

తాంత్రికకర్మలకు పంచపల్లవములు: ౧పనసచిగుళ్ళు, ౨మామిడిచిగుళ్ళు, ౩ రావిచిగుళ్ళు, ౪ మఱ్ఱిచిగుళ్ళు,౫ పొగడ(వకుళము) చిగుళ్ళు.

ఆయుర్వేద వైద్యశాస్త్రమున ౧ మామిడిచిగురు, ౨ నేరేడుచిగురు, ౩ వెలగచిగురు, ౪ మారేడుచిగురు, ౫ మాదీఫలపుచెట్లచిగురు, వీట్లకు పేరు.

పితృకార్యములందు యజ్ఞములందు పంచపల్లవము లన ౧ ఆ శ్రా వయ, (౪ అక్షరములు), ౨ అస్తు శ్రౌషట్ (౪ అక్షరములు), ౩ య జ (౨ అక్షరములు), ౪ ఏ. య జా మ హే (౫ అక్షరములు).౫ వ షట్ (౨అక్షరములు).వీటికి పంచపల్లవములని పేరు.
శ్లో॥ "చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిరేవ చ । హూయతే చ పునర్ద్వాభ్యాం సమే విష్ణుః ప్రసీదతు॥" అని వచింతురు.

**పంచపవిత్రసరోవరములు**—౧ ఉత్తరమున- హిమాలయముపై టిబెట్టు దేశమున, కైలాసశిఖరముకడ మానససరోవరము (మాంధాతృచక్రవర్తితపంబొనర్చిపూత మొనర్చెను.)

౨ తూర్పున-ఉత్కల దేశమునందలి భువనేశ్వరమున బిందుసరోవరము.

౩ దక్షిణమున-బళ్ళారిమండలమున జీర్ణవిజయనగరముకడ తుంగభద్రానదికవ్వలి నైజాం రాజ్యపు హద్దులలో ఆనేగొంది (తొల్లింటి కిష్కింధ) కవ్వలి కతిపయదూరమునఁ గల పంపాసరోవరము (సీతాదేవిస్నానమొనర్చెను)

౪ పశ్చిమమున-రాన్ ఆఫ్ కచ్చి యనంబడు దాని పశ్చిమపుకడను, సింధునది సముద్రగామి యగుతావుసమీపమున, లక్ప త్పురమునుండి నైఋతి దిశగా పదునెనిమిది మైళ్ళలోఁ గల నారాయణసరోవరము. దీనిప్రశంస భాగవతము ౬-౫ యందుఁ గలదు.

౫ అజ్మీరు పట్టణమునకు ౧౫ మైళ్లదూరమునఁ గల పుష్కార్ అనంబడుచున్న పుష్కరసరోవరము. ఇది మధ్యనున్న సరోవరము. ఇచట బ్రహ్మదేవున(విధాత)కొకయాలయము కలదు. (శివజటాజూటగంగ చూడుఁడు.)

**పంచపక్షులు**—పంచపక్షి (యనంబడు పక్షి) శాస్త్రమున- ౧ డేగ-సంజ్ఞాక్షరము ఆ. ౨ గుడ్లగూబ (ఉలూకము)-సంజ్ఞాక్షరము ఈ. ౩ కాకి- సంజ్ఞాక్షరము ఊ. ౪.కోడి- సంజ్ఞాక్షరము ఏ. ౫ మయూరము (నెమలి)- సంజ్ఞాక్షరము ఓ.

**పంచపాదినది**— దీని నిప్పుడు పంఝూయ నెదరు. అక్సస్ నదిలో సంగమించుచిన్ననది.

**పంచపాశములు**— ఇహలోకమందున సంసారనిమగ్నుఁడగు పురుషునకు పంచపాశము లావరించి యుండుట కలదు. ౧ ఆణవపాశము, ౨ కార్మికపాశము, ౩ మాయాపాశము, ౪ బైందవపాశము, ౫ నిరోధశక్తి పాశము.

**పంచపితరులు**— (పితరులు చూ.)

**పంచ పిత్తములు (చేఁతికట్లు)** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున చేప, పంది, మేఁక,దున్నపోతు, నెమలి వీటిచేఁతికట్లకుపేరు. ఇం దేది లభింపక పోయినను, దానికి ప్రత్యామ్నాయముగ మొసలిచేఁతికట్టు వేసికొందు రఁట. ఇంకను గొందఱు దీనికి చేదుపొట్లకూడ చేర్చుదు రని తెలిసెడిని.

**పంచప్రయాగలు**—ప్రయాగలు ౫. హిమవత్పర్వతప్రదేశమున నీయైదు ప్రయాగలును గలవు.

౧ కర్ణప్రయాగ- అలకానందతో పిండారి గంగ,లేక కర్ణగంగ కలియుస్థలము. ఇటఅంగరాజగు కర్ణుఁడు క్రతువు లొనర్చెను.

౨ రుద్రప్రయాగ-అలకానందతో మందాకినీగంగ కలియుస్థలము.

౩ నందప్రయాగ- అలకానందతో నందాకినీగంగ కలియుస్థలము.

౪ విష్ణుప్రయాగ - అలకానందతో ధవళ (విష్ణు)గంగ కలియుస్థలము. ఇది జ్యోషిమఠము కడ నున్నది.

౫ దేవప్రయాగ- భాగీరథీనదితో అలకానందా, మందాకినీ నదులుకలియుస్థలము. సంయుక్తరాష్ట్రములలోని అలహాబాద్ నగరముకడ ధారాగంజిప్రయాగకడ గంగాయమునలు కలియును. దీనిని మాధవప్రయాగ యందురు.

త్రియుగీనారాయణముకడనున్న మందాకినీ గంగా శౌనకగంగా సంగమమున శౌనక ప్రయాగయు, బదరీనాథ(బదరీనారాయణ)మునకు నాల్గుమైళ్లదూరమున నున్న మణిభద్రపురనుగ్రామముదరినున్న (కింపురుషవర్షములోని) అలకానందా సరస్వతీ నదులసంగమమున నున్న సరస్వతీప్రయాగయు, సంయుక్తరాష్ట్రములలోని అలహాబాదునగరముకడ, గంగాయమునా సరస్వతు (అంతర్వాహిను)ల సంగముకడ మాధవప్రయాగయు, పైపంచ ప్రయాగలకుఁ గల్పి అష్టప్రయాగ లనెదరు.

**పంచప్రేతలు**— (ప్రేతలు చూడుఁడు.)

**పంచబలములు (పంచబలా)**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున ౧ బలా (ముత్తవపులగము), ౨ అతిబలా (దువ్వెన చెట్టు), 3 నాగబలా (జిబిలిక), ౪ రాజబలా (గొంతెమ గొమరు), ౫ మహాబలా (సహదేవిచెట్టు) వీట్లకు "పంచబలా" యని పేరు.

**పంచబాణములు**-(మన్మథబాణములు చూడుఁడు)

**పంచబీజములు** - ఆయుర్వేద వైద్యశాస్త్రమున ౧ పెద్దదోసగింజలు, ౨ చిన్నదోసగింజలు, 3 దాడిమగింజలు, ౪ తామరగింజలు, ౫ దూలగొండిగింజలు వీటికిపేరు.

మతాంతరమున ౧ ఆవాలు, ౨ అజామోదము, 3 జీలకఱ్ఱ, ౪ నువ్వులు, ౫ గసగసాలు. వీటిని పంచబీజము లని నుడివి యున్నారు.

**పంచ బౌద్ధ (మత) శక్తులు**— ౧ విరోచనధ్యాన బుద్ధుని శక్తిపేరు. వజ్రధాత్వీశ్వరీ శక్తి. ౨ అక్షోభ్యధ్యాన బుద్ధునిశక్తిపేరు లోచనాశక్తి. 3 రత్నసంభవధ్యాన బుద్ధునిశక్తిపేరు. మాముకీశక్తి. ౪ అమితాభధ్యానబుద్ధుని శక్తిపేరు. పాండరాశక్తి. (ఈతఁడిక్కాలపు బుద్ధుఁడు). ౫ అమోఘసిద్ధధ్యాన బుద్ధుని శక్తిపేరు. తారాదేవీశక్తి (ఇతఁడురాఁగలబుద్ధుఁడు)

ప్రజ్ఞాస్వాభావికబౌద్ధమున ఆర్యతారాశక్తి. వీరికి ప్రజ్ఞా, ఆర్యతారా ద్వంద్వము.

**పంచబ్రహ్మమంత్రములు**—౧ సద్యోజాత, ౨ వామదేవ, 3 అఘోర, ౪ తత్పురుష, ౫ ఈశాన మంత్రము లైదును పంచబ్రహ్మమంత్రము లనంబడును. వీట్లను పరమేశ్వరుఁడు కౌశిక, కాశ్యప, భరద్వాజ, అత్రి, గౌతము లనుపంచర్షులను శైవులుగ నొనర్చి యుపదేశించెను. ఈమంత్రములను పరమేశ్వరుఁ డుపదేశించుటంజేసి పరమేశ్వరునకు ౧ సద్యోజాతముఖము, ౨ వామదేవముఖము, 3 అఘోరముఖము, ౪ తత్పురుషముఖము, ౫ ఈశానముఖము ననునైదుముఖములు కలవని వాడుఁదొడంగిరి. పరమేశ్వరుని పంచబ్రహ్మాత్మకుఁడందురు. ఈ పంచబ్రహ్మమంత్రము లైదింటిని వేదమూలము లందురు.

౧. సద్యోజాతమంత్రము- నకారరూపము, పశ్చిమదిశనుండి కల్గిన యుపదేశము. సిద్ధి, బుద్ధి, ద్యుతి, లక్ష్మి, మేధా, కాంతి, స్వధా, ధృతి యనంబడు నెనిమిది కలల కాశ్రయము.

౨. వామదేవమంత్రము- మకారరూపము. ఉత్తరదిశనుండి కల్గిన యుపదేశము. ౧ రజా, ౨ రక్షా, 3 రతి, ౪ పాలీ, ౫ కామా, ౬ సంయమా, ౭ క్రియా, ౮ బుద్ధి, ౯ కార్యా, ౧౦

ధాత్రీ, ౧౧ భ్రామిణీ, ౧౨ మోహినీ, ౧౩ మనోన్మనీ యనంబడు పదమూఁడుకలల కాశ్రయము.

౩. అఘోరబ్రహ్మమంత్రము–శికారరూపము దక్షిణదిశనుండి కల్గిన యుపదేశము. ౧ తమా, ౨ మోహా, ౩ క్షుమా, ౪ నిష్ఠా, ౫ మృత్యు, ౬ మాయా, ౭ భయా, ౮ జరా అను నెన్మిది కలల కాశ్రయము.

౪. తత్పురుషబ్రహ్మమంత్రము– వాకార రూపము పూర్వదిశనుండి కల్గిన యుపదేశము. ౧ శాంతి, ౨ విద్య, ౩ ప్రతిష్ఠ, ౪ నివృత్తి యను నాల్గుకలల కాశ్రయము.

౫. ఈశానబ్రహ్మమంత్రము–యకారరూపము. మధ్యమస్థానమునుండి కల్గిన యుపదేశము. ౧ శశిని, ౨ అంగద, ౩ ఇష్ట, ౪ మరీచి, ౫ జ్వాలినీ యనంబడు నైదుకలల కాశ్రయము.

ఇట్లు పంచబ్రహ్మమంత్రములు శైవపంచాక్షరీమంత్రాక్షరరూపములై ముప్పది యెన్మిది కలల కాశ్రయములై వేదమూలములుగ నున్నవిగఁ జెప్పఁబడినవి.

**పంచభద్రములు**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున తిప్పతీఁగె, పర్పాటకము, తుంగముస్త, నేలవేము, శొంఠి వీటికి పేరు.

**పంచభర్తలు**— (ప్రేత చూడుఁడు.)

**పంచభూతములు**—భూతములుచూ.

**పంచభృంగములు** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున డావరుడంగి, వావిలి, జమ్మి (శమి), గంజాయి, తాళీసపత్రి వీటికి పేరు. గంజాయికి బదులు తేగడ అని కొందఱు వాడుట గలదు.

**పంచభ్రమములు**—భ్రమపంచకముచూ.

**పంచమహాలు జిల్లా**— (బొంబైరాజధాని చూడుఁడు.)ప్రధానస్థానపు కార్యాలయములు వడియాడుపురమునందే యున్నవి.

**పంచ మహాపాతకములు**— (మహాపాతకములు చూ).

**పంచ మహాశబ్దములు**— ౧ ఘన శబ్దము, ౨ వితతశబ్దము, ౩ సుషిర శబ్దము, ౪ వంది శబ్దము, ౫ మాగధ శబ్దము.

**పంచ మాతలు**— (మాతలు చూ.)

**పంచమార్గములు-గురుశిష్య ధర్మము**— ౧ కపి మార్గము- కోఁతిపిల్ల తల్లినిఁ బట్టుకొనినట్లు శిష్యుఁడే గురుని వీడకుండుట.

౨ విహంగమార్గము- పక్షి గ్రుడ్లు పెట్టి వాటిపైఁ గూర్చుండి పొదిగి పిల్లలంజేసి రక్షించునట్లు గురుఁడే శిష్యునియందు బాధ్యత వహించి బోధించి మార్గమునఁ బెట్టుట.

౩ మార్జాల మార్గము- పిల్లి తన పిల్లలను నోటఁగఱచుకొని గొంపోవుచుండునట్లు గురుఁడు శిష్యుని తనతోఁగూడఁదిప్పికొనుచు బోధించుచు మార్గమునఁ బెట్టుట.

౪ మీనమార్గము- చేప గ్రుడ్లుపెట్టి తాను జూచుచుండుట మాత్రమున నాగ్రుడ్లన్నియు పిల్లలై బాగుపడునట్లు గురుండు శిష్యునకు బోధించుచు అప్పటప్పట తానే వానినరయుచు విద్యాభివృద్ధి పరిశీలించుకొనుచు మార్గమునఁ బెట్టుట.

౫ కూర్మమార్గము- తాఁబేలు ఒక తావున గ్రుడ్లనిడి యెచటికో ఏగెడిని. తిరిగి ఆతావునకు రాలేకపోయినను రాలేకపోవును. తన గ్రుడ్లను గూర్చి మనస్సునందు తలంచుకొనుచుండిన యంతమాత్రముననే యవి పిల్లలై పెరిగి పెద్దవి యగును. అట్లే గురుండు శిష్యున కుపదేశించి, తిరుగ నాతనిఁ గాంచకున్నను, తన మదియందాతని యభివృద్ధిఁ గాంక్షించుటంజేసి శిష్యుఁడు పరిపూర్తి నంది మార్గమునఁ బడును.

**పంచముటిగంజి** — బియ్యము, సెనగలు, పెసలు, యవలు, ఉలవలు సమభాగ

ములుగ గాచిన గంజి. వేడిది త్రిదోషహరమై పథ్యమై యుండును.

**పంచముద్రలు**— ౧ భూచరీముద్ర, ౨ ఖేచరీముద్ర, ౩ మధ్యమాముద్ర, ౪ షణ్ముఖీముద్ర, ౫ శాంభవీముద్ర. ఇవి ముఖ్యములగు ముద్రలని చెప్పఁబడినవి.

**పంచమూలములు** — ఆయుర్వేద వైద్యవిధానమున పంచమూలములు చెప్పఁబడినవి. (ఐదుజాతుల వేళులనిఅర్థము). వేర్వేఱు రోగస్థితులపై నుపయోగించుట కివి పలువిధములఁ జెప్పియున్నారు. ఇందు బృహత్పంచమూలము లనియు, స్వల్ప లేక కనిష్ఠపంచమూలము లనియు, హ్రస్వపంచమూలము లనియు, తృణపంచమూలము లనియు, జీవన పంచమూలము లనియు, శతావరీపంచమూలము లనియు, బలాపంచమూలము లనియు, కంటక పంచమూలము లనియు, గోక్షురపంచమూలము లనియు, గుడూచ్యాదిపంచమూలము లనియు, మధ్యమ పంచమూలము లనియు భేదములు చెప్పఁబడి యున్నవి.

సర్వసాధారణముగ ౧ శేవ్యము, ౨ చిత్రమూలము, ౩ గంటుభారంగి, ౪ శొంఠి, ౫ దుంపరాష్ట్రము వీటిని పంచమూలము లనుచుందురు.

నేలములగ, వాకుడు, పృశ్నిపర్ణి, శాలిపర్ణి, పల్లేరులవేళ్ళు వీటిని హ్రస్వపంచమూలము లని వాడుచున్నారు. తృణపంచమూలము లాయుర్వేద వైద్యగ్రంథములందు మూఁడు భేదాభిప్రాయములపాలై యున్నవి. చక్రదత్తుని కుశదర్భవేళ్ళు, రెల్లుగడ్డివేళ్ళు, ముంజదర్భవేళ్ళు, కాకిచెఱకువేళ్లు, దర్భవేళ్లు పంచమూలము లనెను. చరకమునందు ముంజదర్భవేళ్ళు, కాకిచెఱకువేళ్లు, దర్భగడ్డివేళ్లు, తెల్లువేళ్ళు, కాలితృణపువేళ్లు పంచమూలము లని వచించెను. వైద్యక నిఘంటువునం దిటులనే చెప్పఁబడినది. ఇంక సుశ్రుతమున ముంజదర్భవేళ్ళు, కాకిచెఱకువేళ్ళు, దర్భగడ్డివేళ్ళు, తెల్లువేళ్ళు, కిక్కిసగడ్డివేళ్ళు పంచమూలములుగఁ జెప్పఁబడినవి. వీటికి తృణపంచమూలము లనియుఁ బేరిడం బడినది.

జీవనపంచమూలములకు జీవనీయగణ మనియుఁ బేరు కలదు. ఇవి ౧ జీవకము, ౨ ఋషభకము, ౩ మేధా, ౪ మహామేధా, ౫ కాకోలీ యని యనుచున్నారు. ఇవి ప్రచారమునందు లేవని ఒకవాడుకయుం గలదు.

శతావరీపంచమూలములు పిల్లి తేఁగల సంబంధము. పిల్లిపెసర, పెసర, గజ్జేరు, ముత్తవపులగము, ఆముదపుచెట్టు వీట్ల వేళ్ళని వాడుచున్నారు. ఇవి త్రిదోషహర మనుచున్నారు. వీటికి మధ్యమపంచమూలము లనియుఁ బేర్లు.

బలాపంచమూలములు-బల, నాగబల, అతిబల, మహాబల, రాజబల, యనంబడునవి. పసుపు, తిప్పతీఁగె, నేలగుమ్మడి, సుగంధి, ఒద్ది (మేడాశింగి)వేళ్ళను బలాపంచమూలము లని వాడుటకలదు. మఱికొందఱు మతాంతరముగనో అభిప్రాయాంతరముగనో ౧ ముత్తవపులగపువేఱు, ౨ పెన్నేరువేఱు, ౩ సిగ్రిడీకూపము, (చంగోసి వేఱు), పాషాణభేదివేఱు, దువ్వెనచెట్టువేఱు బలాపంచకముగ వాడుటయుం గలదు. కొన్ని దేశములందు చిట్టిగుమ్మడివేఱు, తక్కలివేఱు, కలిగొట్టువేఱు, ముత్తవపులగపువేఱు, నల్లచండ్రివేఱు బలాపంచమూలము లని వాడుచు, వీటికషాయములు జ్వరములు, కఫములు, వాతములు హరించు ననుచుందురు.

కంటకత్రయ మనిన పల్లేరు, నేలములగ, వాకుడులకు పేరు. వీటి వేళ్ళను, కోలాకుపొన్న,

ముయ్యాకుపొన్న వేళ్ళును కల్పి కంటకపంచమూలము లందురు. కొన్ని దేశములందు వీటినే కనిష్ఠపంచమూలము లనుపేరున వాడుచున్నారు.

గోక్షుర మనిన పల్లేరున కర్థము. గోక్షుర పంచమూలము లెవ్వియో స్పష్టపఱుపఁ బడుట లేదు. ఇంక గుడూచి యనిన తిప్పతీఁగె. గుడూచీపంచమూలములు నీతీరుననేయున్నవి.

ఇట్టివి వైద్యవిద్యావిశారదులు తమతమ పరిశీలనానుభవముల మేరకు వాడఁదగినవి.

**పంచయజ్ఞములు**-సోమయజ్ఞములుచూ.

**పంచరుద్రములు** — ౧ అథర్వశిఖా రుద్రము, ౨ కైవల్యరుద్రము, ౩ కాలాగ్ని రుద్రము, ౪ శ్వేతాశ్వతరరుద్రము, ౫ రుద్రము (నమకచమకములు). వీట్లకు పంచరుద్రము లనిపేరు.

**పంచలకారములు** — (ఆంధ్ర భాషా సాంప్రదాయార్థపదము.) ౧ అనుకూల-(లోక విరోధికాక లోకానుకూలప్రవర్తనము కలదియై యుండుట), ౨ విమలాంగ-(నిర్మలములగు శరీరాంగములుకలదియైయుండుట,అనఁగా భయంకరాకారయు, అసహ్యమును,రోఁతయుఁ గల్గించునట్లు శరీరాంగములు గల్గియుండనిది యని భావము.) ౩ కులజ- (సత్కుల సాంప్రదాయ యుక్తకుటుంబమున జనించియుండుట)౪ కుశల-(బుద్ధికుశలత గల్గియుండుట)౫ సుశీలసంపన్న-(నియమయుక్త అనఁగా నీతి కలది యనిభావము). ఈ యైదును స్త్రీల కర్హ లక్షణములుగ జెప్పఁబడినవి. ఇవి కల్గియుండుట స్త్రీలకు గౌరవప్రదమై యుండు ననిభావము. ఈయైదింటియందున్న లకారములకు పంచ లకారము లని వాడుక కల్గెను.

**పంచలవణములు (ఉప్పులు)** — ౧ సైంధవ లవణము, ౨ సౌవర్చ లవణము, ౩ కాచ లవణము, ౪ బిడా లవణము, ౫ సముద్రలవణము.

**పంచవకారములు**—(ఆంధ్రభాషాసాంప్రదాయార్థపదము) ౧ వంశము (ఒకఁడుపుట్టిన వంశము), ౨ వపువు (శరీర సౌష్టవము, లేక రూపము), ౩ వాక్కు- (మాట్లాడుశక్తి, జనరంజకముగ మాట్లాడుశక్తి), ౪ వస్త్రము- (అర్హమగు దుస్తులు ధరించియుండుట), ౫విభవము- (అర్హమగుస్థితిగతులంగల్గియుండుట). ఇవి పురుషులకు గౌరవప్రదము లనిభావము. ఈ యైదింటియొక్క ప్రథమాక్షరములు వకారములే గాన వీటికి పంచవకారము లని పేరయ్యెను.

**పంచవటములు**— ఆయుర్వేద వైద్య శాస్త్రమున మారేడు, రావి, మఱ్ఱి, అశోకము, మేడి, యనంబడుచెట్లకు పంచవటములని చెప్పఁబడినది. వట మనిన మఱ్ఱికి సాధారణార్థము.

**పంచవటి** — ఐదుమఱ్ఱిచెట్లనియర్థము. బొంబై రాజధానిలోని నాసిక్ పురము ప్రక్కగ ప్రవహించు గోదావరినది కవ్వలితీరమున నైదు మఱ్ఱిచెట్లుండినతావున శ్రీరాముఁడు సీతా లక్ష్మణసహితుఁడై తన వనవాసకాలమునఁ గొంతకాలముండెనని రామాయణమునఁగలదు. ఇప్పుడు శైఖేరా యనంబడు గ్రామ మున్న తావున (నాసికకడ) శ్రీరాముఁడు మారీచుని జంపినతావును జూపుచున్నారు.

లక్ష్మణుఁడు శూర్పణఖయొక్క ముక్కుకోసి వంచించినతావు నాసికయే. రావణుఁడు సీతాదేవి నపహరించిన దీపంచవటియందు పర్ణశాలలో వసించునప్పుడే. తొల్లింటికాలమున సతీదేవినాసిక యిటఁ బడుటంజేసి యిచ్చటి శక్తిపీఠము నాసికాక్షేత్రపీఠ మనుప్రతీతిగాంచినది. నాసికకడ నొక చైత్యగుహ గలదు. అది క్రీ.వె. రెండుమూఁడుశతాబ్దముల పనిగ పెరుగ్సన్పండితుఁడు పోల్చియున్నాఁడు. (నాసికాక్షేత్రము చూడుఁడు.)

**పంచవల్కలములు**— మఱ్ఱి, జువ్వి, రావి, మేడి, అమ్లవేతసములకు పంచవల్కలము లందురు.

**పంచవాద్యములు**- వాద్యములు చూ.

**పంచవాయువులు - ఉపవాయువులు**— శరీరమందలి వాయువులు పదివిధములు. పంచవాయువులు- ౧ ప్రాణవాయువు, ౨ అపానవాయువు, ౩ వ్యానవాయువు, ౪ ఉదానవాయువు, ౫ సమానవాయువు అని శరీరమందలి వాయువులు (గాలులు) పంచవిధములు. పంచోపవాయువులు:- ౧ నాగ, ౨ కూర్మ, ౩ కృకర, ౪ దేవదత్త, ౫ ధనంజయ వాయువులు.

**పంచవిధభక్తులు**-భక్తిపంచకముచూ.

**పంచవైద్యకర్మలు**—ఆయుర్వేద వైద్యశాస్త్రమున, వైద్యుఁడురోగికి చికిత్సచేయుచో, ౧ విరేచనము చేయించుట, ౨ వమనము చేయించుట, ౩ ఓషధీనస్యమును పీల్పించుట, ౪ నిరూహము, ౫ అనువాసన వీటికి పంచకర్మ లనిపేరు.

**పంచశక్తులు**- వాతూలాగమమున, తత్త్వభేదపటలమున నిట్లు చెప్పఁబడినది.

శ్లో. బిందురూప దశాంశేన
చోమాశక్తి సముద్భవా।
ఉమాంబికా గణేశీ చ
ఈశ్వరీ చ మనోన్మనీ॥

ఉమాశక్తినుండికల్గిన ఉమాశక్తి, అంబికాశక్తి, గణేశీశక్తి, ఈశ్వరీశక్తి, మనోన్మనీశక్తి పంచశక్తు లనంబడును. ఇవి బిందురూప దశాంశ జన్యములు.

**పంచశిఖుఁడు**- ఋషి. తత్త్వజ్ఞానవేత్త. మిథిలాపురాధినాథుఁడు (సీతాదేవితండ్రి) జనక మహారాజునకు జ్ఞానోపదేశ మొనర్చినగురువు.

**పంచ సస్యములు**— ధాన్యము,నువ్వులు, పెసలు, యవలు, తెల్లావాలు.

**పంచ సాదాఖ్యములు (సాదాఖ్య పంచకము)**— ౧ శివ సాదాఖ్యము, ౨ అమూర్తిసాదాఖ్యము, ౩మూర్తిసాదాఖ్యము, ౪ కర్తృనామక సాదాఖ్యము, ౫ కర్మసాదాఖ్యము.

**పంచసాయకములు**—(మన్మథబాణములు చూడుఁడు).

**పంచసార్**— బంగాళము నేలిన అధిశూరభూపతి. పుత్రకామేష్టి తనచేఁ జేయించిన విప్రుల కొసంగిన యైదు గ్రామములు:—

౧ పంచకోటి, ౨ హరికోటి, ౩ కామకోటి, ౪ కంకగ్రామము, ౫ వటగ్రామము.

**పంచసిద్ధులు**—(లోకనీతిసిద్ధులుచూ).

**పంచసుగంధ చూర్ణము**-ఆయుర్వేద వైద్య శాస్త్రమున తక్కోలములు, పోకచెక్కలు, లవంగములు, జాజికాయలు, పచ్చకర్పూరముల సముదాయచూర్ణమునకు పంచసుగంధచూర్ణ మనిపేరు. ఇది క్రిమిరోగ పైత్యరోగముల నడంచి మలమూత్రముల వెడలించి అగ్నిదీప్తి నధిక మొనర్చునని చెప్పఁబడినది.

**పంచసంజ్ఞలు**—చిదంబరకల్పమునందు ౧ చతుశ్రాకారము, ౨ అర్ధచంద్రాకృతి, ౩ త్రికోణాకారము, ౪ షట్కోణాకారము, ౫ వర్తులాకారము (వృత్తము Circle) పంచసంజ్ఞ లనంబడెను.

**పంచాక్షరి (అష్టవిధములు)**- ౧ స్థూల పంచాక్షరి, ౨ సూక్ష్మపంచాక్షరి, ౩ మూల పంచాక్షరి, ౪ శక్తిపంచాక్షరి, ౫ అఘోర పంచాక్షరి, ౬ ప్రణవపంచాక్షరి, ౭ నియత పంచాక్షరి, ౮ ప్రసాదపంచాక్షరి అని పంచాక్షరీమహామంత్ర మష్టవిధములు.

**పంచాంగము**— ౧ తిథులు- పాడ్యమి, ద్వితీయ, తృతీయ మొదలగునవి ౩౦.

౨ వారములు- ఆదివారము, సోమవారము మొదలగునవి ౭.

౩ నక్షత్రములు- అశ్వని, భరణీ, కృత్తిక మొదలగునవి ౨౭

౪ యోగములు- విష్కంభము, ప్రీతి మొదలగునవి ౨౭.

౫ కరణములు- బవ, బాలవ, కౌలవ మొదలగునవి ౧౧.

ఈ యైదునుగల గ్రంథమునకు పంచాంగ మనిపేరు. ఇది సంవత్సరమున కొక్కటిగ రచింపఁ గుణింపఁ బడుచుండును. సంవత్సరమున కొక్క-పంచాంగము.

**పంచాంగములుచెడితే నక్షత్రములు తిథులు చెడవు**—ఆంధ్ర లోకోక్తి.

**పంచాచారములు**—ఇవి శైవాగమము లందుఁ జెప్పఁబడిన మతధర్మములు.

శ్లో॥ లింగాచార స్సదాచారః శివాచార
స్తథైవ చ।గణభృత్యాచారకౌచ పంచా
చారాః ప్రకీర్తితాః.

శీలసంపాదనక్రమమునందు అనఁగా ౧ లింగాచారము, ౨ సదాచారము, ౩ శివాచారము, ౪ గణాచారము, ౫ భృత్యాచారము. ఇవి పంచాచారము లని చెప్పఁబడినవి.

**పంచాచార్యులు (లేక వీరశైవమత పంచాచార్యులు)**- వీరశైవమతవిధానమున (వీరశైవులు చూడుఁడు.) పరమేశ్వరుఁ డగు శివునకు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానము లను నైదు ముఖము లాగమోక్తములుగ సుప్రసిద్ధములు. కావుననే పరమేశ్వరుఁడు పంచముఖుఁ డని చెప్పఁబడెను అందు పశ్చిమదిశకుం దిరిగియుండు సద్యోజాత ముఖము శుక్ల మనియు, ఉత్తరదిశకుం దిరిగి యుండు వామదేవముఖము తామ్రవర్ణ మనియు దక్షిణదిశకుం దిరిగియుండు అఘోరముఖము మనియు, ప్రాగ్దిశకుం దిరిగి యుండు తత్పురుష ముఖము ధూసర (బూడిద) వర్ణ మనియు,ఊర్ధ్వదిశకుం దిరిగియుండు ఈశానముఖము పింగళవర్ణ మనియుం జెప్పఁబడియున్నవి. ఇంక నీయైదు ముఖములను ధ్యానించు నైదు మంత్రము లాపేరులనే పరఁగుచు "పంచబ్రహ్మ మంత్రము" లని శైవలోకమునం దెల్లెడను శైవు లందఱచే వాడఁబడుచున్నవి.

ఇంక నీ పరమేశ్వరపంచముఖసంబంధులుగ నైదుగురు పరమేశ్వరాచార్యు లుద్భవించిరి. వారు సద్యోజాతముఖసంబంధులుగ రేణుకాచార్యులు, వామదేవ ముఖసంబంధులుగ దారుకాచార్యులు, అఘోరముఖసంబంధులుగ ఘంటాకర్ణాచార్యులు, (లేక శంకుకర్ణాచార్యులు), తత్పురుష ముఖ సంబంధులుగ ధేనుకర్ణాచార్యులు (లేక గజకర్ణాచార్యులు), ఈశానముఖసంబంధులుగ విశ్వకర్ణాచార్యులు ననంబడువారలు. ఈ మహాత్ము లైదుగురు మతగ్రంథములందు గణాధీశ్వరులనియు, పంచ ముఖోద్భవగణాధీశ్వరు లనియుఁ జెప్పంబడినది. వీరిని గురువులని యందురు. వీరిసంతతివారే జంగమదేవరలు.

౧ రేణుకగణాధీశ్వరుఁడు- ఈజగద్గురునకుఁ గృతయుగమున నేకాక్షరశివాచార్యుఁ డనియు, త్రేతాయుగమున నేకవక్త్రశివాచార్యుఁడనియు ద్వాపరయుగమున రేణుకశివాచార్యుఁ డనియు, కలియుగమున రేవణారాధ్యశివాచార్యుఁడనియు నాడుకనామము లుండినది.

వీరికి కొల్లిపాకక్షేత్రమున సోమేశ్వరశివ లింగసన్నిధిని (బాళిహాళి) శ్రీక్షేత్ర వీరసింహాసనము స్థాన మనియు, వీరిది పోడ్వడీ (లేక పోడపటీ) సూత్ర మనియు, వీరేశ్వరగోత్ర

మనియు, ఏకాక్షరశివాచార్యప్రవర యనియు, రేణుకశాఖ యనియు, వీరు ఋగ్వేదాధ్యాయి యనియు, వీరిది అశ్వత్థదండ మనియు, రజతక మండలధారి యనియు, హారిత్ (లేక మణి మయకలశ మనియు, శ్వేతకంథ (దుప్పటము) ధరు లనియు, నకార ప్రధానముగ ప్రసాద పంచాక్షరి జపించినవా రనియు, పృథివీతత్త్వ లక్షణు లనియు, వీరి షోడ్వడీ మహాసూత్ర మున ౧ పురాణ, ౨ పంచకంత, ౩ షడంగీ, ౪ సురగీ, ౫ మహిషీ, ౬ మొరట, ౭ వేణీ, ౮ చిత్తి, ౯ దిగంబర, ౧౦ వాటీ, ౧౧ శౌరి, ౧౨ సూతూన్ముసడీ యను ద్వాదశనామము లుద్భవించె ననియు, ౧ శతాంగ, ౨ ప్రముఖ, ౩ షర్కర, ౪ వృషభ, ౫ సహస్రాక్ష, ౬ వృషభేది, ౭ విషాద, ౮ మోదకంద, ౯ పదర్మండ, ౧౦ కుంజరారి, ౧౧ శేషశిఖండ, ౧౨ హరిద్వీపండ అనునవి వీరి ఉపసూత్రము లనియుం జెప్పఁబడినది. కొలనుపాక (కొల్లిపాక) ఇప్పటి నైజామురాజ్యమున నున్నది. (కొలను పాకక్షేత్రము చూడుఁడు.)

౨ దారుకగణాధీశ్వరుఁడు (వామదేవముఖ సంజాతుఁడు)- కృత యుగమున ద్వ్యక్షర శివాచారి యనియు, త్రేతా యుగమున ద్వివక్త్రశివాచారియనియు, ద్వాపరయుగమున దారుకశివాచారి యనియు, కలియుగమున మరుళారాధ్యశివాచారి యనియు వాడుకనామ ములు గలవాఁడు.

వీరికి ఉజ్జయనీపట్టణశ్రీక్షేత్రమున, సిద్ధేశ్వర శివలింగక్షేత్రముకడ, వటక్షేత్రమఠమున జ్ఞాన సింహాసనము స్థాన మనియు, వీరిది వృష్టి సూత్రము, నందిగోత్రము, ద్వ్యక్షర శివా చార్యప్రవర యనియు, దారుకశాఖ, యజు ర్వేదాధ్యాయి యనియు, పలాశదండము, తామ్రకమండలువు, మాణిక్యమయకలశము, రక్తవర్ణకంథ (దుప్పటము) ధరించినవా రనియు, మకారప్రధానముగ మయాపంచాక్షరీజపపరా యణు లనియు, జలతత్త్వలక్షణు లనియుఁ జెప్పంబడినది.

వీరి వృష్టిమహాసూత్రమున ౧ లోహకంత, ౨ జ్వాలత్కంద, ౩ శృంగీ, ౪ మమతీ, ౫ కుతారీ, ౬ చైత్రీ, ౭ కదారీ, ౮ చాదరీ, ౯ కపాటర, ౧౦ కుక్షీకంత, ౧౧ స్వర్ణకంత, ౧౨ సింహీ యను ద్వాదశనామము లుద్భవించె ననియు, వీరి ఉపసూత్రములు ౧ కేశరాక్ష, ౨ నాగ దంత, ౩ షణావవ, ౪ వృషంబ, ౫ శీలాంగ, ౬ శృంగిశీర్ష, ౭ శతభుజి, ౮ చీలాంబర, ౯ కుహాసన, ౧౦ నౌలేశ, ౧౧ బహుజిహ్వా, ౧౨ మృగారి యనునవి ఉపసూత్రము లనియుఁ జెప్పంబడినది.

౩ ఘంటాకర్ణగణాధీశ్వరుఁడు – వీరి కింకను శంఖకర్ణగణాధీశ్వరు లనియు ననుట కలదు. (అఘోరముఖసంజాతులు). వీరికిం గృతయుగ మున త్ర్యక్షరశివాచార్యుఁ డనియు, త్రేతా యుగమున త్రివక్త్రశివాచార్యుఁ డనియు, ద్వాపర యుగమున ఘంటాకర్ణ శివాచార్యుఁ డనియు, కలియుగమున ఏకోరామశివాచార్యుఁ డనియు వాడుకనామములు కలవు.

వీరికి ద్రాక్షారామ క్షేత్రమున, రామనాథ శివలింగము సన్నిధిని, హిమవన్నగరముపై కేదారక్షేత్రమఠమున, సద్ధర్మసింహాసనము స్థాన మనియు, వీరిది ముక్తిగుచ్ఛ మహాసూత్ర మనియు, వృషభగోత్రము, త్ర్యక్షరశివాచార్య ప్రవర యనియు, ఘంటాకర్ణశాఖ, సామవేదా ధ్యయన మనియు, వీరు న్యగ్రోధదండమును, లోహ (ఇనుప) కమండలువును, నీలమణిమయ కలశమును, నీలవర్ణకంథ (దుప్పటము) ధరించువా రనియు, శికారప్రధానముగ సూక్ష్మపంచాక్షరీ

జపపరాయణు లనియుఁ జెప్పఁ బడినది. తేజస్తత్త్వలక్షణము గలవారు.

వీరి ముక్తిగుచ్ఛ మహాసూత్రమున ౧ గోణికంతా, ౨ దంతీ, ౩ జడరజటీ, ౪ త్రిగుణీ, ౫ కేశకంత, ౬ లలాట, ౭ వ్యాఘ్రకంత, ౮ లోచన, ౯ భగినీ, ౧౦ జాలుకంత, ౧౧ నటన, ౧౨ భదదీ యను ద్వాదశనామము లుద్భవించె ననియు, వీరి ఉపసూత్రములు- ౧ సహస్రశీర్ష, ౨ సీతాంగ, ౩ గణమాలుండ, ౪ నిరశన, ౫ యమద్విశ, ౬ సప్తాంగ, ౭ లలితాంగ, ౮ మృత్యునాశన, ౯ సుతిన, ౧౦ ఘంటవక్త్ర, ౧౧ నిరోగ, ౧౨ భవ అను పేరుగల వనియుఁ జెప్పంబడినది.

౪ ధేనుక గణాధీశ్వరుఁడు- వీరి కింకను గజకర్ణ గణాధీశ్వరుఁ డనిపేరు కలదు. (తత్పురుష ముఖ సంజాతులు) వీరికిం గృత యుగమున చతురక్షర శివాచారి యనియు, త్రేతాయుగమున చతుర్వక్త్రశివాచారి యనియు, ద్వాపర యుగమున ధేనుకర్ణశివాచారి యనియు, కలి యుగమున పండితారాధ్యశివాచారి యనియు వాడుకనామములు కలవు

వీరికి శ్రీశైలమున మల్లికార్జునశివలింగసన్నిధిని సుధాకందాండక్షేత్ర మఠమున వైరాగ్య సింహాసనము స్థాన మనియు, వీరిది లంబమహాసూత్ర మనియు, భృంగిగోత్రము, చతురక్షర శివాచార్యప్రవర యనియు, ధేనుకర్ణశాఖ, అధర్వణవేదాధ్యయన మనియు, వీరు వేణు(వెదురు) దండము, కాంశ్య(కంచు)కమండలువు, ధూసర మణిమయకలశము, బూడిదరంగుకంథ(దుప్పటము)ధరించువా రనియు, వాకార ప్రధానముగ స్థూలపంచాక్షరీజపపరాయణు లనియు, వాయు తత్త్వలక్షణము గలవా రనియుఁ జెప్పంబడినది.

వీరి లంబమహాసూత్రమున ౧ త్రిపుటీ, ౨ రజ్జుకంతా, ౩ భస్మ, ౪ శిఖరి, ౫ రౌషణి, ౬ చంద్రగ, ౭ మృత్కంత, ౮ కాష్ఠక, ౯ ముండీ, ౧౦ భర్గీ, ౧౧ రామగిరి, ౧౨ పమ యను ద్వాదశ నామము లుద్భవించె ననియు, వీరి ఉపసూత్రములు ౧ అగ్నిరుద్భాత, ౨ హావిత, ౩ నిర్జంత, ౪ నిశారూఢ, ౫ నిశాఖ, ౬ లలాటాక్ష, ౭ కరాక్ష, ౮ పాదాస్య, ౯ జాబాలి, ౧౦ హారిన్ముఖ, ౧౧ శిలాద, ౧౨ విటగుండము లని పేరుగలవి యనియుఁ జెప్పంబడినది.

౫ విశ్వకర్ణగుణాధీశ్వరుఁడు-(ఈశానముఖ సంజాతుఁడు) వీరికిం గృతయుగమున పంచాక్షరశివాచార్యుఁ డనియు, త్రేతా యుగమున పంచవక్త్రశివాచారి యనియు, ద్వాపరయుగమున విశ్వకర్ణశివాచారి యనియు, కలియుగమున విశ్వారాధ్యశివాచారి యనియు వాడుక నామములు కలవు.

వీరికిఁ గాశీక్షేత్రమున విశ్వనాథ శివలింగ సన్నిధిని జంగంవాడీ (విశ్వారాధ్య) మఠమున సత్కీర్తిసింహాసనము స్థాన మనియు, వీరిది పంచవర్ణ మహాసూత్రము, స్కంద గోత్రము, పంచాక్షర శివాచార్యప్రవర యనియు, విశ్వకర్ణశాఖ, సూక్ష్మవేదాధ్యయన మనియు, వీరు బిల్వ (మారేడు) దండము, స్వర్ణకమండలువు, పీతముక్తమణిమయ కలశము, పీతవర్ణ కంథ (దుప్పటము) ధరించువా రనియు, యకార ప్రధానముగ మూలపంచాక్షరీమంత్రజపపరాయణు లనియు, ఆకాశతత్త్వలక్షణము గలవా రనియుఁ జెప్పంబడినది.

వీరి పంచవర్ణమహాసూత్రమున ౧ పాశుపత, ౨ కంబళ, ౩ దశముఖ, ౪ గోధర, ౫ వృషభ, ౬ జరత్కంద, ౭ గుహాగ్ర, ౮ గిగీస, ౯ పంచముఖ, ౧౦ ముసల, ౧౧ లగుదీ, ౧౨ వివితి యను ద్వాదశనామము లుద్భవించె ననియు, వీరి ఉపసూత్రములు ౧ త్రివదన, ౨ పంచద్వగ, ౩ గిరివక్త్ర, ౪ దశానన, ౫ వృషాస్య

౬ గోముఖ, ౭ అజాగ్రీన, ౮ విషానన, ౯ స్వర్ణవిభవ, ౧౦ ఉగ్రశేష, ౧౧ శీతపాద, ౧౨ సహస్రస్కంధము లనుపేరులు గలవి యనియుం జెప్పంబడినది. (వీరశైవులు చూ. వీరశైవలింగాయతమతము చూ.)

**పంచాననది**-మగధదేశమున రాజగిర్ ప్రక్కగా ప్రవహించు నది. ఇంద్రబిలము. (ఇంద్రశైలగుహ చూడుఁడు.)

**పంచాప్సరస్తీర్థములు** — రామాయణ మున పంచాప్సర స్తీర్థము లోకసరస్సునం దుండె నని తెలియుచున్నది. కొందఱు పరిశోధకులు నానాఁటి కాసరస్సు మెరకయై, అందు ౧ కాపు, ౨ బంధన్వారు, ౩ బంజియుంచా, ౪ పోని యను చిన్నచిన్న సుస్థానము లిప్పుడున్న తావుగ నున్నదనియుఁ దెల్పుచున్నారు. ది ఛోటానాగపూరునం దున్నది.

చైతన్యచరితామృతమున పంచాప్సరస్తీర్థ ములు గోకర్ణమున నున్నట్లు చెప్పఁబడినది.

శ్రీధరస్వామి (వ్యాఖ్యాత) పంచాప్సర స్తీర్థములు ఫల్గుణపురము (ఇప్పటి అనంత పురము. అంధ్రదేశమున అనంతపురముజిల్లా) కడఁ గల దని వ్రాసెను. భాగవతము ౧౦-౭౯ యందు దక్షిణదేశములం దని చెప్పఁబడియుం టయు, భారతము ఆది. ౨౧౭ అధ్యాయమున దీనిని అర్జునుఁడు, బలరాముఁడు కలిసి సంద ర్శించినట్లు చెప్పఁబడి యుంటయు, బళ్ళారికి ఆగ్నేయదిశగా ౫౭మైళ్ళ దూరమునందుఁ గల పంచాప్సరస్తీర్థమే సరియగునది యని పోల్చి యున్నారు. పీట్ట ప్రశంస మహాభారతము- ఆది పర్వము, ౨౧౭ అధ్యాయమునను, స్కాంద పురాణ- కుమారికాఖండము ౧ అధ్యాయము నను గలదు.

**పంచామృతములు**- దేవపూజార్థమగు పంచామృతములు- పాలు, తేనె, నెయ్యి, పెరుఁగు, శర్కర లని చెప్పఁబడినది. ఆయు ర్వేద వైద్యశాస్త్రమున పంచామృతము లన- తిప్పతీఁగ, పల్లేరు, నేలతాడి, శతావరీ, ముండికా లేక గోకురముండి యని చెప్పఁబడినది.

**పంచాయతనము** — ఆయతన మన స్థాన మని యర్థము. సామాన్యముగ పంచాయ తన మన శుద్ధాద్వైతమతస్థులు పూజించునది యని భావము. ౧ ఆదిత్యము (సూర్యకాంత శిలతోఁ జేయఁబడిన గుండ్రనిసూర్యాకారము). ౨ అంబిక (స్వర్ణశక్తి (స్త్రీ) విగ్రహము), ౩ విష్ణుదేవుఁడు (సాలగ్రామము), ౪ గణనా థుఁడు (విఘ్నేశ్వర విగ్రహము. దీనిని శోణ భద్రానదియందు దొరకు నొకవిధమగుశిలతోఁ జేయవలయును), ౫ మహేశ్వరుఁడు (నర్మదా నదియందు దొరకుబాణలింగము గాని, లేకున్న స్ఫటికలింగము గాని యై యుండవలయును).

శ్రీరామపంచాయతనము- శ్రీరామ, సీత, లక్ష్మణ, భరత, శత్రుఘ్న విగ్రహములు. ఇం దాంజనేయవిగ్రహము కూడ తఱచుగ నుండెడిని.

శైవ పంచాయతనము- శివ, పార్వతి, విఘ్నే శ్వర, నందికేశ్వర, భృంగీశ్వర విగ్రహములు.

విష్ణుపంచాయతనము-విష్ణుదేవుఁడు, శ్రీదేవి, గరుత్మంతుఁడు, విష్వక్సేనుఁడు, అనంతుఁడు, శేషుఁడు. (పాముపైని దేవుఁ డుండెడిని)

**పంచార్థ వివేకము- అర్థపంచక వివే కము**—(రామానుజవైష్ణవమతమున) పంచా ర్థము లెఱిఁగియుండుట యనిభావము

౧. స్వస్వరూపము-(అనఁగా ప్రాణియొక్క లక్షణలక్ష్యముల నెఱుంగుట). ప్రాణులు ౧ నిత్యప్రాణులు, ౨ ముక్తప్రాణులు, ౩ బద్ధ ప్రాణులు, ౪ కేవలప్రాణులు, ౫ ముముక్షు ప్రాణులు నని ఐదువిధములు.

౨. పరస్వరూపము- (అనఁగా పరమేశ్వరునియొక్క లక్షణముల నెఱుంగుట) పరమేశ్వరుఁడు ఐదుస్వరూపములఁ దెలియనగుచుండును. ౧ పరస్వరూపము, ౨ వ్యూహస్వరూపము, ౩ విభవస్వరూపము, ౪ అర్చాస్వరూపము, ౫ అంతర్యామిస్వరూపము నని యైదు విధములు.

౩. పురుషార్థస్వరూపము- ఇది ౧ ధర్మము, ౨ అర్థము, ౩ కామము, ౪ మోక్షము, ౫ పరమపదము అని యైదువిధములు.

౪. ఉపాయస్వరూపము- ఇది ౧ కర్మ, ౨ జ్ఞానము, ౩ భక్తి, ౪ ప్రపత్తి, ౫ ఆచార్యాభిమానము నని యైదువిధములు.

౫. విరోధిస్వరూపము- పైనాల్గింటిని సిద్ధింపనీయని యాటంకము లైదు. ఇవి ౧ స్వస్వరూపవిరోధి, ౨ పరస్వరూపవిరోధి, ౩ పురుషార్థవిరోధి, ౪ ఉపాయవిరోధి, ౫ ప్రాప్తి, లేక సిద్ధివిరోధి యని యైదు విధములు. వీట్ల వివేకము అనఁగా వీటి నెఱిఁగి ప్రవర్తించుట పంచార్థవివేకము.

**పంచారామములు (క్షేత్రములు)**-- గోదావరీమండలములలోని యైదు గ్రామములు. అమరారామ, కొమరారామ, భీమారామ, ద్రాక్షారామ, క్షీరారామములు. వీటిని క్షేత్రములుగ నచటివా రనుచున్నను వీటి నిజస్థితి సంశయగ్రస్తముగ నున్నది.

౧ అమరారామము - దీనింగూర్చి యేమియుం దెలియరాకున్నది.

౨ కొమరారామము-దీనింగూర్చి యేమియుం దెలియరాకున్నది. సుప్రసిద్ధ స్థలమును కాదు. బహుశః కుమారారామ మేమో.

౩ భీమారామము-కృష్ణజిల్లా,గుడివాడయొద్దనున్న భీమవర మని కొందఱును, చామర్లకోట కెదురుగనున్న భీమవర మని కొందఱును అభిప్రాయభేదములు కల్గియున్నారు. గుడివాడయొద్దనున్న భీమవర మనువారు అచటి గునుపూడి గ్రామములోని (జంగాలగునుపూడి) సోమసుందరశివలింగక్షేత్రమును, చామర్లకోట భీమవర మనువారు (చాళుక్య)భీమవరములోని భీమేశ్వర శివలింగమును పవిత్రస్థలము లని వాదించెదరు.

౪ ద్రాక్షారామము-ఇది గోదావరీమండలములోని కోటిఫలికి ఆఱుమైళ్లలో నున్నది. ఇట భీమేశ్వరశివలింగము కలదు.

౫ క్షీరారామము-పశ్చిమగోదావరీమండలములోనిపాలకొల్లును(బహుశఃపాలకొలనేమో). క్షీరారామ మనియెదరు. ఇది వర్తకస్థలమైయున్నది. పశ్చిమగోదావరీమండలమున నర్సాపురమునుండి ఆఱుమైళ్ళదూరమందున్నది. ఇట రామలింగేశ్వర దేవస్థానమును,అందొకయెత్తైన గోపురమును నున్నవి.

**పంచాలవగోత్రము**--(వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**పంచావికములు**-- ఆయుర్వేద వైద్యశాస్త్రమున మేఁకపాలు,మేఁకపెరుఁగు,నెయ్యి, మేఁకమూత్రము, పెంటికలు నని చెప్పఁబడినది.

**పంచాస్త్రములు**--(మన్మథబాణములు చూడుఁడు.)

**పంచోపనిషత్తులు**-- ఉపనిషత్తులుచూ.

**పంజరచాలనన్యాయము**-- వలలోఁజిక్కిన పక్షు లన్నియు నొకేసారి యెగిరిన,వల నెత్తుకొని పోఁగల్గు ననిభావము.

ఇఱుకుకొనఁబడుతఱిఁ గూడ, నంద లేక మనస్కులై ఒకేతఱి ప్రయత్నించిన జయము గల్గి విముక్తినందుదు రనుట కీన్యాయమును వాడుదురు.

**పంజరముక్తపక్షిన్యాయము**--పంజరమునుండి విముక్తిగాంచినపక్షివలె నని అర్థము.

పంజరమునుండి (అనఁగా నిర్బంధమునుండి) తప్పించుకొనిన పక్షికి స్వేచ్ఛ (స్వతంత్రత) గల్గుట యని భావము.

వేదాంతశాస్త్రమున ప్రాణికి కర్మబంధము నుండి విముక్తిగల్గుట కీన్యాయమును వాడిరి.

**పంజరమునుండి తప్పించుకొనిపోయిన చిలుక పిల్లికంటఁ బడినట్లు** — ఆంధ్రి లోకోక్తి.

**పంజాబుదేశము** — ఇండియా దేశము లోనిది. (పాంచాల దేశములు చూడుఁడు.) ఐదునదులనుండి కల్గినపేరు. (ఇండియా దేశము చూడుఁడు). ఉత్తరమున కాశ్మీర దేశము, తూర్పున యమునానదియు, దక్షిణమున రాజపుత్రస్థానము, పశ్చిమమున సులైమా న్పర్వత పంక్తియు నెల్లలు. వాయవ్యదిశయందు నార్తు వెస్ట్రి న్ఫ్రాంటియరు ప్రోవిన్సు కలదు. వైశాల్యము ౯౭౭౦౦ చతురపుమైళ్ళుండును.

ఉత్తరమువైపున పర్వతములు కలవు. వాటియందలి లోవలు చాల ఫలవంతమైనవి. వాటిని దేశభాషయందు "డూను" లని వాడుచున్నారు. వాటిదిగువ సింధునది కడ్డముగా సాల్టు రేంజీ లున్నవి. ఇవి తూర్పున వితస్తా (ఝీలంనది)వఱకు వ్యాపించి యున్నవి. తక్కిన పంజాబు దేశ మంతయు చక్కని సమతల్రపదేశము. ఇది నైరృతిదిక్కువైపు ఏటవాలు కలది.

ఐదునదులు దేశమునఁ బ్రవహించుచుంట దీనికి పాంచాలదేశ మని పేరు కల్గినది. అవి సింధునదియందు జేరుకొనును గాన, పంజాబునందు మొత్త మాఱు ప్రవాహములు కలవు. ఈ యాఱింటినడుమను, సింధుసాగరు దోఆబనియు, జేట్చి దోఆ బనియు, రెచ్నా దోఆబనియు, బారీ దోఆ బనియు, జలంధరు దోఆబనియు నైదు దోఆబులు కలవు. (దోఆబు చూడుఁడు). ఝీలమ్, చీనాబు నదులనడుమ జేట్చిదోఆబు,చీనాబు, రావీనదులనడుమ రెచ్నా దోఆబు, రావీ సట్లెజి నదులనడుమ బారీదోఆబు, (ఇందు జనాభా యధికము). సట్లెజి, బియాస్ నదులనడుమ జలంధరుదోఆబునుకలవు. సింధునదికిని జీలంనదికిని నడుమ నున్నది సింధుసాగర్దోఆ బనంబడుచున్నది. ఇది చాల పెద్దది. వేసవియం దుష్ణాధిక్యమును, శీతకాలమున శీతలాధిక్యమును గలవు. ఉత్తరమున కొండలకడ నేఁటేట నలుబది యంగుళములు వర్షించుచు, దక్షిణమునకు (దిగువకు)వచ్చినకొలఁది వర్షము తగ్గిపోవుచు, సింధు దేశముహద్దున నేఁటేట పది యంగుళములు మాత్రమే వర్షించు చుండును. సాల్టు రేంజీలయందు సైంధవలవణపుగను లధికముగ నున్నవి. కొండలు సింధునది కడ్డము వచ్చినప్రదేశమునఁగల కాలాబాగ్ (Black garden) పురమున పటిక విస్తారము చేయంబడుచున్నది. ఉత్తరమున కొండలం దడవులు కలవు. నగటున పల్లపుప్రదేశము లిసుకపొరం గల్గియుండున ట్లగపడు చుండును. వీటియందు చెట్లుచేమ లధికముగ పెరుఁగవు. కాంగ్రాలోవలందు తేయాకుతోఁట లధికముగా పెరుఁగుచున్నవి. వెస్ట్రి జమ్నా కెనాలు, సట్లెజి కెనాల్సు, బారీదోఆ క్యెనాలు మొదలగుపంట కాల్వ లవ్వారిగ పొలముల నింపుచుండ, భూములు ఫలవంతములుగ నున్నవి. చెట్లు నాటఁబడి పెంచఁబడు చుండును. గోధుమల పంట యధికముగాఁ గలదు. మూల్తాను (తొల్లింటి మూలస్థానము) ప్రాంతముల పట్టుపురుగులు విస్తారము పెంచఁబడుచున్నవి. తేనె, మైనము లధికముగా దొరకుచున్నవి. నూలుబట్టలు, ఉన్నిబట్టలు, పట్టుబట్టలు, శాలువలు విస్తారము నేయంబడు చున్నవి. ఉన్ని, ఇంగువ, ఎండుపండ్లు, ఆఫ్ఘనుస్థానమునుండి విస్తారము రప్పింపం బడుచున్నవ్యాపారము దేశ మంత

టను కలదు. గోధుమలు లాఘనుస్థానమునుండి రప్పింపఁబడుచున్నవి. నదులయందు పడవలు వర్తకపుసరకులం గొంపోవు చుండును. దేశమున నినుపబాటలు వర్తకవ్యాపారముల కుపయోగించు చుండును. పంజాబీ భాషయు, ఉరుదు భాషయు వాడుకయందున్న భాషలు. పట్టణములందు ఉరు దెక్కున వాడుక గలదు. హిందూ పంజాబీ లధికముగను, సిక్కులు కొలఁదిమందిగను ఉన్నారు. వారు మొత్త మిరువదిలక్ష లున్నా రందురు. హిందూమహమ్మదీయులు దేశమున సమముగనే యున్నారని తెలియుచున్నది. (సిక్కుమతము-క్రైస్తవ వాదమతము చూడుఁడు.) మైలునకు ౨౧౦ మంది యని లెక్కింపఁబడినది.

పంజాబు దేశము- లాహోరు, జలంధరు ఢిల్లీ, డేరాజాతు, రావల్పిండి యను నైదు డివిజనులుగను, అవి తిరుగ నిరువది యెనిమిది జిల్లాలుగను విభజింపఁబడి యున్నవి.

౧. లాహోరుడివిజనులో:- లాహోరు జిల్లా, ౨ అమృతసరుజిల్లా, ౩ గురుదాస్పూరుజిల్లా ౪ ముల్తానుజిల్లా, ౫ ఝూంగుజిల్లా, ౬ మాంటు గోమరీజిల్లా.

౨ జలంధరు డివిజనులో:- ౧ జలంధరు జిల్లా, ౨ హోషియార్పూరుజిల్లా, ౩ కాంగ్రా జిల్లా, ౪లూఢియానాజిల్లా, ౫ ఫిరోజ్పూరుజిల్లా.

౩ ఢిల్లీ డివిజనులో:-౧ఢిల్లీజిల్లా, ౨గుర్గాం జిల్లా, ౩ కర్ణాలుజిల్లా, ౪ హిస్సారుజిల్లా, ౫ రోహ్తకి జిల్లా, ౬ అంబాలాజిల్లా, ౭ సిమ్లాజిల్లా.

౪ డెరజాతు డివిజనులో:- డెరాగాజిఖాను జిల్లా, ౨ డెహరాఇస్మైల్ ఖానుజిల్లా, ౩ ముజఫర్ ఘురుజిల్లా, ౪ బన్నూజిల్లా.

౫ రావల్పిండి డివిజనులో:- రావల్పిండి జిల్లా, ౨ ఝీలముజిల్లా, ౩ గుజరాతు జిల్లా, ౪ షహాపూరుజిల్లా, ౫ గుజరాన్వాలా జిల్లా, ౬ సయాల్కోటజిల్లా.

రావీనదీతీరమందలి లాహోరు పట్టణము పంజాబు దేశమునకు ముఖ్యపట్టణము. కొంత కాల మిది యక్బరు చక్రవర్తికి రాజధానిగా నుండినది. రంజీత్సింగుసమాధి చక్కనికట్టడము చూడఁదగినది. గొప్ప వర్తక స్థలము. హైకోర్టిందే కలదు. కతిపయ దూరమునం గల మియానమీరు సైన్యస్థానము.

అమృతసరు పట్టణము జిల్లాయందలి ముఖ్య పట్టణము. సిక్కులప్రధాన దేవళము, ప్రధాన సరస్సు ఉన్నతావు. మతప్రధాన నగరము. గొప్పవర్తకస్థానము. శాలువలు, పట్టుబట్టలు, నూలుబట్టలనేత విస్తారము కలదు. ప్రక్కనే యొక పర్వతముపై రంజితసింగు మహారాజుచే నిర్మింపఁబడిన గోవిందఘుడ్ సైన్యదుర్గము చాల బలమైనదిగా పేరందినది. సెట్లెజి నదీతీరమందలి లూఢియానాపురము శాలువలనేతకు, ఇంగువ, పండ్లు, వర్తకమునకుం బేరందినతావు. అంబాలాజిల్లాయందు ప్రధానస్థానము సైన్యస్థానము నైయున్నతావు సిమ్లానగరు వైస్రాయి గారి వేసవినివాసము, ఇండియాప్రభుత్వస్థానము నైయున్నది. స్థానేశ్వరము కురుక్షేత్రములోనిది, యాత్రాస్థలము. ఇట నాదిని మహాభారత యుద్ధము జరిగెను. పానిపట్టు తొల్లింట యుద్ధములు జరిగినతావున నున్న పురము.

యమునానదిపైనున్న ఢిల్లీనగర మిండియా ప్రభుత్వమునకు ప్రధానస్థానము. తొల్లింట మొగలైచక్రవర్తుల రాజధానిగనుండిననగరము. ముల్తానుపురము చీనాబునదీతీరముననున్న గొప్ప సైన్యస్థానము. నేతపను లధికముగఁ గలవు. వర్తకస్థలము. తొల్లింట హిరణ్యాకశ్యపునిరాజధాని. విష్ణుదేవుండు నృసింహావతార మెత్తినతావు. ప్రహ్లాదగిరి మొదలగునానవాళ్లనేకములు గల

తావు. అటాక్పట్టణము సింధునదిపై నున్నది. ఇట నది దాఁటువంతెన గలదు. రావల్పిండి కాశ్మీరమార్గమున నున్న సైన్యస్థానము. మురీ కాశ్మీరమార్గముననున్న సమశీతోష్ణప్రదేశము. గుజరాతు పట్టణ మితడిపనులు విశేషముగఁ గలతావు. పథానోకోట వర్తకస్థలము. ఇటనుండి సుప్రసిద్ధ సమశీతోష్ణప్రదేశ మగు డల్‌హౌసీకేగు మార్గము కలదు. జలంధరుపురము సైన్యస్థానము. తొల్లింట త్రిగర్తదేశపురాజధానిగ నుండినది. నాగర్కోట కాంగ్రాలోవయందున్నది. దీనిని కాంగ్రాపుర మనియు నందురు. ఇది సుప్రసిద్ధ దేవీక్షేత్రము. (పాంచాల దేశము చూ).

**పంజాబునందలి యైదునదులు**— (పాంచాల దేశపుఐదునదులు చూడుఁడు. సింధునదము చూడుఁడు.)

**పంజికూరచెట్టు**- దీనింగూర్చి యంతగా తెలియరాదు. ఇది నలుపు, తెలుపు, ఎఱుపు రంగులచే త్రివిధ మనియు, దీని రస కషాయములు జ్వరదోషము నడంచి కఫము హరించు ననియుం జెప్పఁబడినది.

**పంజిమ్‌పురము**— (పోర్చుగీ సిండియా చూడుఁడు).

**పంటకాఁపులు**-- వీరు పదునాల్గుశాఖల కాఁపు లనంబడిరి. తొల్లింట కోసల దేశమందలి యయోధ్యనుండి యాంధ్రదేశమున కేతెంచిరఁట. పిల్లలమఱ్ఱి బేతాళరెడ్డి యనువారు వీరికి మూలపురుషు లనియు చెప్పుదురు. వీరియిండ్ల స్త్రీలమెడలయందు పసుపుకొమ్మునకుఁ గట్టిన తాళిని ధరియింతురు. వీరి కిలువేల్పు గంగమ్మ యనుదేవత కులదైవమై యుండెడిని. వివాహములందు గంగమ్మను పూజింతురు.

వీ రుత్తరమునుండి బెజవాడ మీఁదుగా త్రిలింగ దేశభూప తియగు ప్రతాపరుద్రరాజ్యమునకుం జేరి రఁట. బేతాళరెడ్డి సూర్యోపాసన నెఱపువాఁ డని యందురు.

**పంటరెడ్లు**— రెడ్లు, రెడ్డికులమువారుచూ.

**పండితారాధ్యత్రయము** ఆంధ్ర బ్రాహ్మణులు చూడుఁడు.

**పండుగలు-పర్వతిథులు-వ్రతదినములు** — ౧ పాడ్యమితిథులందు సంభవించునవి:—

చైత్రశుద్ధపాడ్యమి-"సంవత్సరాది". (చాంద్రమానమున ప్రారంభదినము). దీని నాంగ్లమున "Telugu new years day" అని యందురు ఇందు నింబకుసుమ (వేఁపపువ్వు) భక్షణము విధింపఁబడినది. సంవత్సరాదిదినము తన కెట్లు గడచునో, సంవత్సరమును తన కట్లె గడచునని ఈ దినమును సూచ్యార్థసూచక దినముగా నెంతురు. ఈదినమున కొద్దిగనో, ఎక్కువగనో అశ్వని నక్షత్రము సంభవించి తీరెడిని.

ఆశ్వయుజ శుద్ధపాడ్యమి-"బలిపూజనప్రతిపత్తు." బలిచక్రవర్తిం బూజింతురు. దేవీనవరాత్రములగు దసరాప్రారంభదినము.

కార్తికశుద్ధపాడ్యమి-"గోక్రీడనప్రతిపత్తు". గోవుల నలంకరించియు, మేపియు, ఊరిబయటికిం గొంపోయి వాట్లతో నాడుకొందురు.

౨ ద్వితీయాతిథులందు సంభవించునవి:—

ఆషాఢ బహుళ ద్వితీయ- "చాతుర్మాస్య ద్వితీయ." (యతుల కాషాఢబహుళ ద్వితీయ మొదలు కార్తికబహుళ ద్వితీయవఱకుం గల్గు నాల్గు నెలలు వ్రతదినములు. వీట్లను చాతుర్మాస్య లందురు. ఇందు వారు సంచార మొనర్పక యొకేతావుననిలిచి వ్రతదినములుగ గడపెదరు).

శ్రావణబహుళ ద్వితీయ - "బహుతల్ప ద్వితీయ"

ఆశ్వయుజ శుద్ధద్వితీయ- "ప్రీతిద్వితీయ"

కార్తికశుద్ధ ద్వితీయ- "యమద్వితీయ" "భాతృద్వితీయ"

కార్తిక బహుళ ద్వితీయ - చాతుర్మాస్య ద్వితీయ. (యతులకు ఈదినముతో చాతుర్మాస్యవ్రతము ముగియును).

మార్గశిర బహుళ ద్వితీయ - "పరశురామ ద్వితీయ"

ఆదివారమున సంభవించిన ద్వితీయ "భాను ద్వితీయ"

3 తృతీయాదినముల సంభవించునవి:—

చైత్రశుద్ధ తృతీయ- "ఆందోళనతృతీయ." ఉయ్యెలలూగు పండుగ.

వైశాఖ శుద్ధ తృతీయ- "అక్షతృతీయ" నృసింహస్వామి దేవాలయములందు, దేవునకుం బూసిన చందనమును తీసివైచి, యభిషేకము లొనర్చి, తిరుగ చందనము పూయ మొదలిడుదురు. ఈదినమున రాత్రి ప్రథమ యామమున పునర్వసు నక్షత్రము సంభవించునేని పరశురామజయంతి యగును.

జ్యేష్ఠశుద్ధ తృతీయ-"రంభాతృతీయ." అరంటిచెట్టుక్రింద గౌరీదేవిం బూజింతురు.

శ్రావణశుద్ధ తృతీయ- "స్వర్ణ (షోడశ) గౌరీవ్రతము" ఈదినమున మంగళవారము తటస్థించునేని "కుజగౌరీవ్రతము".

భాద్రపదశుద్ధ తృతీయ-దక్షిణ దేశమునను కన్నడదేశమునను, స్వర్ణ(షోడశ)గౌరీ వ్రతము. దీనినే పెక్కండ్రు మంగళగౌరీ వ్రత మనియు నందురు.

భాద్రపద బహుళ తృతీయ- "ఉండ్రముల తృతీయ" (ఉండ్రాళ్ళ తద్దె అని యందురు). బాల బాలికలు, అందు ముఖ్యముగ బాలికలు, తెల్లవాఱుజామున మేల్కాంచి, భుజించి, ఆటలాడుకొందురు. పిదప గౌరీదేవిం బూజించి యుండ్రముల నివేదన మర్పింతురు.

ఆశ్వయుజ బ॥ తృతీయ- "అట్లుల తృతీయ" (అట్లతద్దె అని యందురు.) బాల బాలికలు, అందు ముఖ్యముగ బాలికలు, ఉండ్రముల తృతీయ వలెనే ఆటలాడి, గౌరీపూజ యొనర్చి అట్లను నివేదన మర్పింతురు.

౪ చతుర్థిదినముల సంభవించునవి:-

శ్రావణశుద్ధ చతుర్థి- "ధూర్వా గణపతి వ్రతము" గరికె ధూర్వములతో గణపతిం బూజింతురు. నాగచతుర్థి. కొందఱు నాగపూజ చేతురు.

శ్రావణ బహుళ చతుర్థి- "సంకట హారణ చతుర్థి" సంకటహారణ వినాయకపూజ.

భాద్రపద శుద్ధ చతుర్థి-"వినాయకచతుర్థి" సిద్ధివినాయక పూజ యొనర్తురు. ఈ దినము మొదలుగ తొమ్మిది దినములు గణపతినవరాత్రము లందురు. మహారాష్ట్ర దేశమున నీతొమ్మిది దినములు గణపతిపూజలు విశేషముగ నొనర్తురు. దీనినే ఉండ్రాళ్ళచవితి యనియు నందురు.

కార్తికశుద్ధ చతుర్థి- "నాగ చతుర్థి" నాగపూజ. కొందరు గణపతిం బూజింతురు. పాముల పుట్టలో పాలు పోసి నాగపూజ యొనర్తురు.

మాఘశుద్ధచతుర్థి- "కుందచతుర్థి" మల్లెమొగలచే గౌరీదేవిం బూజింతురు. ఆడుపిలలు మల్లెమొగ్గలజడలు వైచుకొందురు. ఇంకను "తిలచతుర్థి" యనియు,"వరదచతుర్థి"యనియు నీ దినమునకుం బేర్లు కలవు.

ఫాల్గుణ శుద్ధచతుర్థి-"శాంతిచతుర్థి"మంగళవారమున చతుర్థి సంభవించునేని భౌమచతుర్థి యనిపేరు.

౫ పంచమీదినమున సంభవించునవి:—

చైత్రశుద్ధపంచమి- "శ్రీపంచమి". "లక్ష్మీ పంచమి" అనియు నందురు. విష్ణుదేవస్థానము

లందు డోలోత్సవములు (విష్ణుదేవునుయ్యాలయం దుంచి యూఁపుట).

ఆషాఢ శుద్ధపంచమి- "స్కందపంచమి". కుమారస్వామిపూజ.

శ్రావణశుద్ధపంచమి-"నాగపంచమి" నాగపూజ, గరుడపూజ. ఈతిథి ఒకేదినమున చతుర్థి, పంచమి, షష్టియుఁ గూడ కొద్దిగనో గొప్పగనో సంభవించెనేని చాల పవిత్రముగ నెంతురు.

భాద్రపదశుద్ధ పంచమి- "ఋషిపంచమి" వ్రతము. సప్తమహర్షులం బూజింతురు.

కార్తికశుద్ధపంచమి- "నాగపంచమి" నాగపూజ.

మాఘ శుద్ధ పంచమి- "మదనపంచమి" "వసంతపంచమి" వసంతప్రవృత్తివ్రత మొనర్చి (మదనపూజ) హరిహరపూజ నొనర్తురు.

౬ షష్టిదినమున సంభవించునవి:—

ఆషాఢశుద్ధషష్టి- "కుమారషష్టి" కుమారస్వామిపూజ.

శ్రావణశుద్ధషష్టి- "సూర్యషష్టి" సూర్యుని పూజింతురు.

శ్రావణబహుళషష్టి "సూర్యషష్టి" సూర్యుని పూజింతురు.

భాద్రపద శుద్ధషష్టి— "లలితాషష్టి"- ఘూర్జరదేశమున లలితాపూజచేయుదురు.

భాద్రపదబహుళషష్టి- "అవమచంద్రషష్టి" ఈ దినమున ఆదివారము, రోహిణీ నక్షత్రము, కుజపాతము గల్గినచో "కపిలాషష్టి" యందురు. సూర్యపూజ, కపిలగోదానము.

కార్తికశుద్ధ షష్టి- "సుబ్రహ్మణ్యషష్టి". దక్షిణదేశమున, అందు ముఖ్యముగ మళయాళమున, సుబ్రహ్మణ్యపూజ లొనర్తురు.

మార్గశిరశుద్ధషష్టి- "స్కందషష్టి" "సంహారషష్టి" "మల్లారిషష్టి" దక్షిణ దేశమున మళయాళమున సుబ్రహ్మణ్యపూజ, దక్షిణదేశారణ్యవాసులు చంపకాదేవిపూజ యొనర్తురు.

౭ సప్తమిదినమున సంభవించునవి :—

చైత్రశుద్ధ సప్తమి- "గంగోత్పత్తి" గంగాతీరప్రాంతముల గంగాపూజ లొనర్తురు. గంగోత్తరియందు ఇది మిక్కిలి ప్రధాన మైనది.

శ్రావణ బహుళసప్తమి- "శీతలావ్రతము" ఉత్తరదేశముల శీతలాదేవిం బూజింతురు.

భాద్రపదశు॥సప్తమి-'ఆముక్తాభరణసప్తమి' వ్రతము.

మార్గశిర శుద్ధ సప్తమి - "మిత్రసప్తమి" సూర్యపూజ. "నందాసప్తమి" హిమవత్పర్వతములపై కూర్మాచల (Kuman Division) ప్రాంతమునంగల నందాదేవీ క్షేత్రమున నందాదేవిని బూజింతురు. "కాలభైరవసప్తమి"- కాశీప్రాంతమున కాలభైరవపూజ.

మాఘ శుద్ధసప్తమి- "రథసప్తమి" సూర్యపూజ. స్త్రీలు సూర్యుని చిక్కుడాకులు, చిక్కుడుకాయలు రథమునం దుంచి పూజించి, చిక్కుడాకులలో క్షీరాన్ననివేదన మొనర్తురు. సూర్యచంద్రవ్రత మొనర్తురు. సప్తమి యాదివారమయ్యెనేని "భానుసప్తమి".

సూర్యపూజకు మరీ పవిత్రముగ నెంతురు. మొత్తమున మాఘమాసమున నన్ని యాదివారములందు స్త్రీలు సూర్యుని బూజింతురు.

౮ అష్టమిదినమున సంభవించునవి:—

చైత్రశుద్ధ అష్టమి - "అశోకాష్టమి". ఈ తిథియందు బుధవారము, పునర్వసునక్షత్రము సంభవించునేని మరీ పవిత్రముగ నెంతురు. అశోకగౌరీవ్రత మాచరించి, (అశోకవృక్షము క్రింద) నాపూవులం బూజించి, వాట్లం దినెదరు. "భవాన్యుత్పత్తి" భవానిం బూజింతురు. మఱియు భవానీనదీతీరముల నానదిజన్మదినముగ పూజ లొనరుదురు.

శ్రావణబహుళ అష్టమి - "కృష్ణాష్టమి" (శ్రీకృష్ణజయంతి). స్మార్తు లీదినమున శ్రీకృష్ణ జన్మదిన మని పూజింతురు. రామానుజీయ శ్రీవైష్ణవులు శ్రావణబహుళ అష్టమి, నవమి, దశమి తిథులలో నెప్పుడైనను రాత్రియందు రోహిణీనక్షత్రము సంభవించినతఱిని శ్రీకృష్ణ జయంతి జరిపి పూజింతురు. ఒకవేళ చాంద్రమాన శ్రావణ మాసమున నట్లు సంభవింపనిచో సౌరమాన సింహమాసమున (అవణి మాసము) నెన్మిది, తొమ్మిది, పది తిథులలో నెప్పుడైనను రాత్రియందు రోహిణీనక్షత్రము సంభవింపఁ జూచి, శ్రీకృష్ణజయంతి జరపి పూజింతురు. వారికి రోహిణీనక్షత్రము రాత్రి యందుంట ప్రధానము. ఇంక మాధ్వ వైష్ణవులకు రాత్రి యనునియమము లేదు. అష్టమితిథియం దెప్పుడైనను రోహిణీనక్షత్రము సంభవింపఁ జూచి శ్రీకృష్ణజయంతి జరపెదరు.

ఈతిథిని రోహిణీనక్షత్ర మర్ధరాత్రమునం దుండుటయు, తులానాథుండగు శుక్రుఁడు ఉదయించుటయు సంభవించునేని దశఫలవ్రతము.

భాద్రపదశుద్ధ అష్టమి - "ధూర్వాష్టమి" శివుని ధూర్వముల (గరికె)చే పూజింతురు. ఈదినమున కేదారవ్రత మారంభము. మఱియు నీదినము మొదలు పదునాఱు దినములు (స్త్రీలు) మహాలక్ష్మీవ్రత మొనర్తురు.

మఱియు, నీతిథియందు జ్యేష్ఠా నక్షత్రము సంభవించినచో "జ్యేష్ఠాష్టమి" యనంబడును. ఇందు మృతవంధ్యలు (పిల్లలుచనిపోవుచుండుట వలన వంధ్యలైనస్త్రీలు)ను, కాకవంధ్యలు(ఒకే పిల్ల గల్గిన పిదప సంతానము లేక గొడ్డువారి వంధ్యలైనస్త్రీలు)ను, దోషపరిహారార్థముగా "అలక్ష్మీపరిహార జ్యేష్ఠావ్రత మొనర్చి, జ్యేష్ఠా దేవిం బూజింతురు. అట్టివ్రతమును అనూరాధా నక్షత్రమున వ్రతారంభ ఆవాహనములును, జ్యేష్ఠానక్షత్రమున పూజయు, వ్రతాచరణ మును, మూలా నక్షత్రమున వ్రతోద్యాపనమును నడిపెదరు.

భాద్రపద బహుళఅష్టమి- "మధ్యాష్టమి" "రుద్రాష్టమి."

ఆశ్వయుజశుద్ధఅష్టమి-"మహాష్టమి" దుర్గాష్టమి బంగాళమునను, కాశీప్రాంతములను దుర్గా పూజలొనర్తురు. "కాళికాష్టమి" ఉత్తర దేశములను, ముఖ్యముగ శైవాలక దేశపుహరిద్వారమునను, దక్షయజ్ఞవినాశనియగు భద్రకాళి (మాయా దేవి)ని పూజించుచు, కాళికాష్టమి యని పిలిచెదరు. ఈదినమున సప్తమి కలియుటయు, ఆదివార మగుటయు కూడదని యందురు.

యుజ బహుళ అష్టమి-"అశోకాష్టమి" వ్రతము అశోకవృక్షము క్రింద గౌరీపూజ, అశోకకుసుమనైవేద్యము, భక్షణము చేతురు.

కార్తిక శుద్ధ అష్టమి- "గోష్ఠాష్టమి".

మార్గశిర శుద్ధ అష్టమి-"కాలభైరవాష్టమి" కాశీయందు కాలభైరవ స్వామిని దర్శించి పూజింతురు

పుష్యశుద్ధఅష్టమి-"మహారుద్రాష్టమి" శివ క్షేత్రముల మహారుద్రాభిషేకము లొనర్చి రుద్ర శాంతిఁ గల్గింతురు.

మాఘశుద్ధాష్టమి- "భీమాష్టమి"

అష్టమితిథియం దార్ద్రా నక్షత్రము సంభవించిన "ఆర్ద్రాష్టమి".

అష్టమితిథియందు సోమవారము సంభవించిన "సోమాష్టమి".

౯ నవమిదినమున సంభవించునవి :-

చైత్రశుద్ధనవమి- "శ్రీరామనవమి" వసంత నవరాత్రములతో సంవత్సరాది దినముననే ప్రారంభించి (ఉత్తర దేశములందు, అందు ముఖ్యముగఉత్తరకోసలదేశమునందలియయోధ్యా నగరప్రాంతముల ఆంధ్ర దేశమునను

శ్రీరామనవమి రోజున శ్రీరామ సీతాకళ్యాణముల నెరపి శ్రీరామజన్మవర్ధంతి జరపెదరు.

భాద్రపదశుద్ధనవమి-"నందానవమి"హిమవన్నందాదేవీక్షేత్రమున నందాపూజయు, బదరీకేదారక్షేత్రమున కేదారేశున కభిషేకార్చనాదులును జరపి "కేదారనవమి" యని వాడెదరు.

భాద్రపదబహుళనవమి-"అహిర్నవమి".

ఆశ్వయుజ శుద్ధనవమి- "మహానవమి" దేవీపూజ, సరస్వతీపూజ.

కార్తికశుద్ధనవమి "అక్షయనవమి" వ్రతము. "కూష్మాండనవమి" (కూష్మాండకుఁడను రక్కసుని విష్ణుదేవుం డంతరింపఁజేసిన యాఁకవాలుగ విష్ణుపూజ లొనర్చుదురు. గుమ్మడికాయలను దాన మొనర్తురు.

మార్గశిరశుద్ధనవమి-"మాధ్వనవమి"ఆనందతీర్థస్వామియొక్క-పుణ్యదినమును మధ్వవైష్ణవులు జరపెదరు.

౧౦ దశమిదినమున సంభవించునవి:—

చైత్రశుద్ధదశమి- "ధర్మరాజదశమి".

జ్యేష్ఠశుద్ధదశమి- ఈ దినమున ౧ జ్యేష్ఠమాసము, ౨ శుక్లపక్షము, ౩ దశమితిథి, ౪ బుధవారము, ౫ హస్తనక్షత్రము, ౬ గరకరణము, ౭ వ్యతీపాతయోగము, ౮ కన్యారాశి (చంద్రలగ్నము), ౯ వృషభమునందు రవియుండుట, ౧౦ సంధ్యాకాలము ఈ పది యోగములు సంభవించునేని దశపాపహరదశమి" యగును. గంగాతీరదేశముల గంగాస్నానము, గంగాపూజయు మహాఫలప్రదమందురు. సర్వసాధారణముగ జ్యేష్ఠ శు. ౧౦ ని దశపాపహరదశమి యని వాడుదురు. తొల్లి యొకప్పు డిది యాప్రాంతముల సంవత్సరాదిగ నుండెడి దందురు.

ఆషాఢశుద్ధ దశమి- "దిగ్దేవతాదశమి" వ్రతము. దిక్పాలకపూజ.

భాద్రపదశుద్ధదశమి-"దశావతారదశమి" విష్ణుపూజ లొనర్తురు.

ఆశ్వయుజశుద్ధ దశమి- "విజయదశమి' శమీ (జమ్మిచెట్టు) పూజ. బేతాళపూజ, ఆయుధపూజ, అపరాజితాదేవీపూజ.

౧౧ ఏకాదశీదినమున సంభవించునవి:—

సర్వసాధారణముగ అన్ని ఏకాదశీతిథులును పర్వములుగ నెంచఁబడును. విష్ణుభక్తు లన్ని మాసములం దుభయపక్ష ఏకాదశీతిథులయం దుపవసింతురు. రామానుజీయ వైష్ణవులును మధ్వవైష్ణవులును గూడ ఏకాదశిరోజున (హరివాసరమున) పితృర్చనలం గూడ పాటింపక నిలిపి మఱునాఁ డొనర్చెదరు.

జ్యేష్ఠశుద్ధ ఏకాదశి- "నిర్జలైకాదశి".

ఆషాఢశుద్ధ ఏకాదశి - "శయనైకాదశి" ఈదినము మొదలు కార్తికశుద్ధ ద్వాదశి వఱకు గోపద్మవ్రతము నెరపి, లక్ష్మీనారాయణపూజ లొనర్తురు. శ్రీజగన్నాథక్షేత్రమున(రథయాత్ర) స్వామిని రథముపై నుంచి ఇంద్రద్యుమ్న నగరునకుం గొంపోయి,యట తొమ్మిదిదినము లుంచి పూజించుచుందురు. పిదప దేవాలయమునకు జేర్చుదురు.

భాద్రపదశుద్ధఏకాదశి-"పరివర్తనైకాదశి"

కార్తికశుద్ధఏకాదశి-"బోధన (మేల్కొల్పు) ఏకాదశి"."ఉత్థానైకాదశి"యనియునందురు. విష్ణుదేవుం డదివఱకు నిద్రించుచుండి, ఈదినమున మేల్కాంచు నఁట.

మార్గశిరశుద్ధఏకాదశి - వైతరణీనదీ తీరమందలి యజ్ఞవరాహక్షేత్రమున (Gagpur) యజ్ఞవరాహైకాదశీవ్రత మొనర్చి (కపిల) గోదాన మొనర్తురు.

మార్గశిర బహుళ ఏకాదశి- "ఉత్పన్నైకా

దశి"(ఉత్పన్నమయుని భార్య) కార్తికమార్గశిర మాసములయొక్క ఉభయపక్షముల ఏకాదశులయందు "శుక్ల కృష్ణైకాదశీవ్రత" మొనర్తురు.

పుష్య శుద్ధ ఏకాదశి- "వైకుంఠైకాదశి". దక్షిణ దేశమున కావేరీ శ్రీరంగ క్షేత్రమున, వైకుంఠద్వార మనంబడు నొక పవిత్ర ద్వారమును తెఱచెదరు. దానిగుండా యాత్రస్థులసంఖ్యాకములుగ జని, స్వామిని దర్శింతురు. ఈకార్య మట చాల పవిత్రవంతము గను, మహాఫలసంధాయకము గను తలంపఁ బడెడిని.

మాఘశుద్ధ ఏకాదశి - "భీష్మైకాదశి" అపుత్రవంతులు సంతానముకొఱకు గాంగేయుఁడగు భీష్ముని పూజింతురు. ఇది వ్రతము. ఐదు దినములు శరపంజరమున పండుకొని యుండి, పాండవులకు ధర్మముల నుపదేశించినభీష్ముం డీదినమున ప్రాణముల విడిచెను. ఏకాదశివ్రత మాచరించి, ద్వాదశి దినమున విష్ణుదేవునకు తులసీవివాహ మొనరురు.

౧౨ ద్వాదశిదినమున సంభవించునవి:-

చైత్రశుద్ధ ద్వాదశి- 'వామన ద్వాదశి" దమనోత్సవవిష్ణుపూజ.

వైశాఖశు॥ద్వాదశి-"పరశురామద్వాదశి" ఈదినమున ౧ వైశాఖ మాసము, ౨ శుక్ల పక్షము, ౩ ద్వాదశితిథి, ౪ హస్త నక్షత్రము, ౫ వ్యతీపాతము, ౬ సింహమున గురు డుండుట, ౭ సింహమున కుజుఁ డుండుట, ౮ మేష రాశియందు సూర్యుఁ డుండుట సంభవించుచో 'పాశద్వాదశి"యనిపేరు. మాధవపూజ యట్టి తఱి మహాఫలప్రద మందురు.

జ్యేష్ఠశుద్ధద్వాదశి- "రామలక్ష్మణద్వాదశి"

జ్యేష్ఠబహుళద్వాదశి- "కూర్మద్వాదశి".

ఆషాఢశుద్ధద్వాదశి- "వాసుదేవద్వాదశి దధివ్రత మాచరింతురు.

శ్రావణశుద్ధద్వాదశి-"దామోదరద్వాదశి"

భాద్రపదశుద్ధద్వాదశి-"ఉపేంద్రద్వాదశి" ఆమలకద్వాదశి, కల్కి-ద్వాదశి, శక్రద్వాదశి, యని పేరు. ఈ దినమున శ్రవణనక్షత్రము సంభవించిన "శ్రవణద్వాదశి" ఇందు వామన పూజ యొనర్తురు.

ఆశ్వయుజశుద్ధద్వాదశి - "పద్మనాభద్వాదశి" గోద్వాదశీవ్రత మొనర్తురు.

కార్తికశుద్ధద్వాదశి- "యోగీశ్వరద్వాదశి-క్షీరాబ్ధి " (చిలుకు ద్వాదశి) యని పేరు. క్షీరసముద్రమథనము) తులసీసహిత లక్ష్మీనారాయణపూజ.

కార్తికబహుళద్వాదశి- "గోవత్సద్వాదశి"

మార్గశిరశుద్ధద్వాదశి-"అంఖండ ద్వాదశి" "మత్స్యద్వాదశి".

పుష్యశుద్ధద్వాదశి-"కూర్మద్వాదశి-త్రివిక్రమద్వాదశి".

మాఘశుద్ధద్వాదశి - "వరాహద్వాదశి - ప్రహ్లాదద్వాదశి-తిలద్వాదశి".

ఫాల్గుణశుద్ధద్వాదశి- "నృసింహద్వాదశి".

౧౩త్రయోదశిదినమున సంభవించునవి:—

చైత్రశుద్ధత్రయోదశి-"అనంగత్రయోదశి"

చైత్రబహుళ త్రయోదశి-ఈదినమున శని వారము శతభిషనక్షత్రము, శని శతభిషమున నుండుట సంభవించినచో "మహావారుణిత్రయోదశి." ఇది దుర్లభయోగము వ్రతము.

ఆషాఢశుద్ధత్రయోదశి- "జయాపార్వతీవ్రతము".

శ్రావణశుద్ధత్రయోదశి-శనివార మగునేని 'శనిత్రయోదశి" పవిత్రదినము.

భాద్రపదశుద్ధత్రయోదశి-ఘూర్జర దేశమున "గోత్రాత వ్రత" మొనర్తురు.

ఆశ్వయుజశుద్ధత్రయోదశి- దక్షిణదేశమున "అశోకత్రిరాత్రవ్రత" మొనర్తురు.

కార్తికశుద్ధత్రయోదశి, కార్తికబహుళత్రయోదశి- ఈ రెండుతిథులు శనివార మయ్యెనేని "శనిత్రయోదశి".

మార్గశిరశుద్ధత్రయోదశి-"అనంగ త్రయోదశి" శివపూజా వ్రతము.

౧౪ చతుర్దశిదినముల సంభవించునవి :—

చైత్రశుద్ధచతుర్దశి "భూతచతుర్దశి" భూతములు రాత్రియందు భ్రమించి తిరుగునని, తొల్లింటికాలమున భూతబలి నిచ్చుచుండిరి. "శివచతుర్దశి" వ్రతము.

వైశాఖశుద్ధచతుర్దశి - "నృసింహజయంతి" ఈదినమున సాయంకాలమున స్వాతినక్షత్రము సంభవించి, సోమవార మగునేని ఘూర్జరదేశమున కదలీవృక్షసహిత ఉమామహేశ్వరపూజ నొనర్చి మహాపవిత్రదినముగ నెంతురు.

భాద్రపదశుద్ధచతుర్దశి- "అనంతపద్మనాభచతుర్దశి" వ్రతము. తిరువానూ్కరునం దనంతపద్మనాభస్వామి దేవస్థానమున నిది విశేషముగ జరుగును. ఇంకను ఘూర్జరదేశమున "కదళీవ్రత" మొనర్తురు.

ఆశ్వయుజశుద్ధచతుర్దశి-"అవమచతుర్దశి".

ఆశ్వయుజబహుళచతుర్దశి-"నరకచతుర్దశి" నరకాసురుని చాముండీదేవి వధించిన జ్ఞాపకార్థపుపండుగ. ఈ దినమున స్వాతీనక్షత్రము సంభవించును.

కార్తికశుద్ధ చతుర్దశి - "పాషాణచతుర్దశి" "వైకుంఠచతుర్దశి" మహారాష్ట్రదేశమున కదళీ వ్రతము.

మాఘబహుళచతుర్దశి- "మహాశివరాత్రి" "ఆరటంతీ చతుర్దశి" కృష్ణపక్షచతుర్దశి మంగళవార మగునేని "కృష్ణాంగారకచతుర్దశి"

౧౫ పౌర్ణమిదినమున సంభవించునవి:—

వైశాఖశుద్ధపౌర్ణమి-"మహావైశాఖపౌర్ణమి" (మహాపౌర్ణమి).

జేష్ఠశుద్ధపౌర్ణమి- "వృషభ పౌర్ణమి" వట (వృక్షచ్ఛాయ) సావిత్రివ్రతము.

ఆషాఢశుద్ధ పౌర్ణమి - "వ్యాసపౌర్ణమి" యతులు వ్యాసపూజ నొనర్తురు. స్త్రీలు గోపద్మవ్రతము(విష్ణుపూజ) నొనర్తురు. ఉత్తరదేశము లందు కోకిలావ్రత మొనర్తురు.

శ్రావణశుద్ధపౌర్ణమి- "జందెములపౌర్ణమి" యజుర్వేదుల ఉపాకర్మ,యజ్ఞోపవీతధారణము, రక్షాబంధనము.

భాద్రపదశుద్ధపౌర్ణమి- "ఉమామహేశ్వర వ్రతము".

ఆశ్వయుజశుద్ధపౌర్ణమి-"కౌముదీ పౌర్ణమి" కౌముదీజాగరవ్రతము. "ఆగ్రయణ (జూదముల) పౌర్ణమి". జూదములు, పాచికలాటలు ఆడుదురు. అనతిక్రాంత మగునేని దానఫల వ్రత మొనర్తురు.

కార్తికశుద్ధ పౌర్ణమి- "త్రిపుర (జ్వాలాతోరణ) దహనము" దీపాలపౌర్ణమి. భక్తేశ్వర (శివపూజ) వ్రతము.

మార్గశిరశుద్ధపౌర్ణమి- ద్వాత్రింశద్వ్రతము లొనర్తురు.

పుష్యశుద్ధపౌర్ణమి-"తూలాపరీక్షాపౌర్ణమి"

మాఘశుద్ధపౌర్ణమి- మహా(మాఘీ)పౌర్ణమి.

ఫాల్గుణశుద్ధపౌర్ణమి- "డోలా (ఉయ్యెల) పౌర్ణమి" హోళీపండుగ, కామునిపున్నమి, మన్మథదహనము.

౩౦ అమావాస్య దినము లందు సంభవించునవి:—

ఆషాఢ బహుళఅమావాస్య- "దిశాగారీ వ్రతము".

భాద్రపదబహులఅమావాస్య- "మహాలయామావాస్య"(మాలాలమావాస్య)సంతాన రక్షణకు కంద, బచ్చలి మొక్కలకింద

గౌరీదేవి నుంచి పూజింతురు. కర్ణాటదేశస్త్రీలు ఫలగౌరీవ్రత మాచరింతురు.

ఆశ్వయుజబ॥అమావాస్య- "దీపావళిఅమావాస్య" చాముండీదేవి మహిషాసురునివధించిన జ్ఞాపకార్థముపండుగ. ఘూర్జరదేశమున సంవత్సరాది (మఱునాఁడు) స్వరప్నాజ యొనర్తురు. వటవృక్షఛాయను కేదారేశ్వరుని పూజించి ౨౧ దినము వ్రతమాచరింప ప్రారంభింతురు.

కార్తికబహుళఅమావాస్య- "లక్ష్మీవ్రతం"

మార్గశిర బహుళఅమావాస్య- "గౌరీతపోవ్రతము".

మాఘబహుళ అమావాస్య- "అర్ధోదయవ్రతము". బ్రహ్మ విష్ణు రుద్ర పూజ.

ఫాల్గుణబహుళఅమావాస్య- "కొత్తఅమావాస్య".

అమావాస్యలందు సోమవారము సంభవించునేని "అమాసోమవారవ్రత" మొనర్తురు. ఇది సూర్యగ్రహణతుల్యముగా పవిత్రవంతము.

సౌరమాససంబంధములు, వారగత, నక్షత్రగతములునగు ఇతరమైన పండుగలు, పర్వములు, వ్రతములు:—

వసంత నవరాత్రములు-చైత్రశుద్ధ పాడ్యమి మొదలు తొమ్మిదిదినములు.

ఇందు వసంతమాధవపూజ నొనర్చి వసంతోత్సవము లొనరురు.

గణపతినవరాత్రములు భాద్రపద శుద్ధ చతుర్థి మొదలు తొమ్మిదిదినములు

ఇందు మహాగణాధిపతి యగు వినాయకుని పూజింతురు.

శరన్నవరాత్రములు- వీట్లను దేవీనవరాత్రములనియు నందురు. ఆశ్వయుజశుద్ధ పాడ్యమి మొదలు తొమ్మిది దినములు దుర్గాదేవిం బూజింతురు.

మహాలయపక్షము- భాద్రపదబహుళమును మహాలయపక్ష మనియు, పితృపక్ష మనియు నందురు. మృతతిథులందు మహాలయశ్రాద్ధ మొనర్తురు. భరణీనక్షత్ర ముండుతిథియందు భరణీమహాలయశ్రాద్ధమును, వ్యతీపాతయోగ ముండుతిథియందు వ్యతీపాతమహాలయమును, ద్వాదశియందు యతిమహాలయ శ్రాద్ధమును, చతుర్దశియందు విషశస్త్రహతమహాలయశ్రాద్ధమును, అమావాస్యయందు తిథిమహాలయశ్రాద్ధమును, జరుగక నిలచిపోయినమహాలయములును జరిపెదరు. ఆశ్వయుజశుద్ధ పాడ్యమియందు దౌహిత్రకృత మహాలయశ్రాద్ధము జరిపెదరు. అష్టమి తిథియందునను అందరు జరుపుటకలదు.

మకరసంక్రాంతి, కర్కాటకసంక్రాంతులు:- సూర్యుఁడు మకరరాశిగతుం డగుటకు ముందు దినము "భోగి" యనంబడును. తర్వాతిదినమగు "సంక్రాంతి" దినమున పితరర్చన విధింపఁబడినది. మూఁడవదినమును 'కను'మందురు. ఇది బలిచక్రవర్తిపరిపాలన జ్ఞాపకార్థముజరిపెడిపండుగ. మకరసంక్రాంతి ఉత్తరాయణమునకు ప్రారంభము.

కర్కాటకసంక్రాంతి :- దక్షిణాయమునకు ప్రారంభము. ఇందునను పితరర్చన విధింపఁబడినది. ఇందు రవి కర్కాటకప్రవేశమున కిరువదిఘటికలకుం బూర్వముగా సర్వకాలముననుృ, మకరప్రవేశమున కిరువదిఘటికల పిదప సర్వకాలమునను పితరర్చన జరుప వలయును.

మంగళగౌరీవ్రతము:- స్త్రీలకు వివాహమైన దాదిగ శ్రావణమాసమునందలి మంగళవారముల మంగళగౌరీదేవిం బూజించి, వ్రత మైదు సంవత్సరములవఱకు జరుపుదురు. ఇది సౌమాంగల్యరక్షణకై యొనర్తురు.

వరలక్ష్మీవ్రతము :- స్త్రీలకు వివాహమైన దాదిగ శ్రావణమాసమునందలి శుక్రవారముల, వరలక్ష్మీదేవిం బూజించి, సుమంగలి యై

యున్నంతవఱకు వ్రతముజరుపుచుందురు. ఇది సౌమాంగల్యమును, ఐశ్వర్యమును భద్రపఱచుటకైన వ్రతము. స్వర్ణమును పూజించుచుందురు.

మహాలక్ష్మీవ్రతము:- స్త్రీలకు వివాహమైనదాదిగ మార్గశిరమాసమున గురువారములందు సుమంగలి యైయున్నంతవఱకు మహాలక్ష్మీపూజ యైశ్వర్యముం గాంక్షించి జరపుచుందురు. ఈదినములందు కపిత్థము (వెలగకాయ)ను విసర్జింతురు.

నిరశనార్క-వ్రతము:- స్త్రీలు మాఘమాసమున ఆదివారములందునను, శుద్ధసప్తమి లేక రథసప్తమియందునను సూర్యునిపూజించి, వండని అపక్వపదార్థములను మాత్రమే తినుచు నిరశన (అన్నముం దినక) వ్రతముం జరిపెదరు. ఈ వ్రతమును అపక్వ (వండని) భానువాసర (ఆదివారము) వ్రత మనియు నందురు. అశనమును (అన్నమును) దినరు గాన నిరశన (అన్నముం దినని) అర్క- (ఆదివారపు) వ్రత మనియు నందురు.

వరలక్ష్మీవ్రతము:-గంగా యమునాసంగమమునఁ (ప్రయాగయందు) గాని, తుంగభద్రానదీతీరమునఁ గాని, ప్రారంభింప వలయు నని చెప్పఁబడినది. ఇది ఆతీరములందు ప్రాముఖ్యము వహించిన వ్రతము. రవి కర్కటకరాశియం దుండుతఱి శ్రావణమాసమున, శుక్లపక్షమున నీవ్రత మాచరింపవలయునని యందురు. అనఁగా పౌర్ణమికి ముందువచ్చు శుక్రవార మీవ్రతమునకు యోగ్య మని యందురు. ఇది స్త్రీలు సౌమాంగల్యరక్షణకై యాచరించువ్రత మని యెఱుంగునది.

సోమవారవ్రతము:-దీనింగూర్చి పెద్దవిధాన మెంతయో గలదు. ఇది పురుషులు, స్త్రీలు, బాలురు గూడ నాచరింతురు. చైత్రమాసము, వైశాఖమాసము, కార్తికమాసము, మార్గశిరమాసము, శ్రావణమాసము ఈ నెలలం దెప్పుడైన ప్రారంభించి, ప్రతిసోమవారమును జన్మకాల మంతయు జరిపెదరు. ఇందు పార్వతీపరమేశ్వరులం బూజింతురు. ఈవ్రతమున దంపతీపూజ లొనర్తురు.

**పండుగలు-పర్వదినములు-వ్రత దినములు**—పండుగలు జాతీయగౌరవమునందిన సంతోష దినములు. జాతికిఁ గల్గినయాపదలు తొలంగుట, జాతికిఁ గల్గిన యభ్యుదయము, లేక సత్పరిపాలన సౌఖ్యముల జ్ఞాపకార్థము సంతోషముతో జాతియంతటిచేఁ గాని, కొంతయగు నొకసంఘముచేఁ గాని, ఏటేట నాచరింపబడుసంతోషదినములు పండుగ లనంబడును.

ఇంక మతగౌరవముతో నాచరింపంబడు దినములు పర్వతిథు లనంబడును. వీటిని పవిత్రదినము లనందగును. ఇవి మహాశివరాత్రి, వైకుంఠఏకాదశి, శరన్నవరాత్రములు మొదలగునవి.

వ్రతదినము లాయా వ్రతముల నాచరించుటకైన దినములు. ఇవి అట్లతద్దె, ఉండ్రముల తద్దె, రంభాతృతీయ, నాగులచవితి, రథసప్తమి మొదలగునవి. హిందువులందు వ్రతములు వందలకొలఁది కలవందురు. కాని, యాచరణమందు చాల తక్కువగఁ గానంబడియెడిని.

భరతదేశమున నీమూఁటికిఁగూడ కొద్దిగనో గొప్పగనో సంబంధముండియేయుండెడిని. గాన కల్పి వివరించుటయే సమంజస మని యటుల వ్రాయంబడినది. వాటిని వేర్వేఱు తావులందు గానగును.

**పండుట ఎండుట**—వరిగడ్డి, గోధుమగడ్డి, పెక్కుజాతుల కాయలు, పెక్కుజాతుల ఆకులు వయస్సుకలుగకపూర్వ మాకుపచ్చని రంగుం గల్గియుండు ననియు, పండినపిదప పసుపుపచ్చరంగుగ మాఱుననియు, నెల్లరెఱింగినదే.

ఆకుపచ్చ రంగునం దుండిన (Greens tuff) దానికి రసాయనశాస్త్రమున Chlorophyll) అను సాంకేతిక నామము నిడియున్నారు. అదియె ఆకుపచ్చరంగున నందు వ్యాపించియుం డునది. ఆకుపచ్చరంగుయొక్క పరిణామముగ అది పండిన (ముదిరిన) పిదప పసుపుపచ్చరం గందు ఏర్పడియెడిని. ఈరెండురంగులు నొకటి నుండి వేఱొకటికొన్నిటిం గలుపుట కొన్నిటిం దీసివేయుటలమూలమునవతిసులభముగమార్చ నగుట రసాయనశాస్త్రపరిచయము గలవారి కెల్లరకుం దెలిసినదే. ఆకులును ఇట్లే సూర్యరశ్మి సహాయమున వాతావరణపు వాయువునుండి కార్బన్-డై-ఆక్సైడును పీల్చుకొనుచుండునంత కాల మివి ఆకుపచ్చరంగుగనే యుండెడిని. అత్తరినే Chlorophyll వాటియందుండి దాని నిజచ్ఛాయయగు ఆకుపచ్చరంగుం బ్రదర్శించు చుండెడిని. శీతపరువున వాటిం గోసిన అపక్వ స్థితియందున్న ఆపదార్థ మొండ కెండి, నీటం గుల్లి వేర్వేఱువికారపురంగులుగ మాఱిపోవును. పక్వస్థితినందినకతన నదియే పసుపుపచ్చరంగుగ మాఱిపోవును. అత్తరి కోసిన నెండియు, నారంగు మారక నిలచెడిని. ఆకులును నిట్టిస్థితికే పాల్పడును. గరికమొదలగు పచ్చగడ్డియు నిట్లె పరిణమించెడిని.

**పందికి పన్నీరుగిండి యేల?**— ఆంధ్ర లోకోక్తి.

**పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?**—ఆంధ్ర లోకోక్తి.

**పందోద్భూత గోత్రము**— అగస్త్య ఉప గణము చూడుఁడు.

**పంఢార్పూర్-పాండురంగక్షేత్రము**-- ఇది మహారాష్ట్ర దేశమునందున్న సుప్రసిద్ధ విష్ణుక్షేత్రము. పంఢార్పూరు పట్టణము గ్రేట్ ఇండియన్ పెనిన్సులా రెయిల్వే, బొంబై రాయచూరులైను (బ్రాడ్గేజి) కురుడ్వాడిసంధిమీఁదుగా, బార్సీలైటు రెయిల్వే (లాతూరునుండి) కురుడ్వాడీ మీరాజులైను పైనున్న తావు. కాని పెక్కండ్రు యాత్రికులు పలుతావులనుండి మోటార్లపైనను, బండ్లపైనను, పోవుట కలదు. ఈ సుప్రసిద్ధ యాత్రాస్థలమున కనుదినము తండోపతండములుగ భక్తులరుదెంచుచు నేగుచుంట క్షేత్రము పట్టణ కిటకిటలాడుచు నిఱుకుగనేయుండెడిని. దీనిప్రసిద్ధి దేవస్థానమునుండియే గాక, ఇట భక్తి నల్పి తరించిన భక్తులనుండి యధికమని తోఁచెడిని. అట్టివారిలో పుండలికుఁడు, జ్ఞానబాయి, నామదేవుఁడు, తుకారామ్, కాన్హోపాత్రుఁడు,చోకమేళుఁడు, జ్ఞానేశ్వరుఁడు, ఏకనాథుఁడు ముఖ్యులని చెప్పుదురు.

దేవునకు పాండురంగ విఠల్, లేక విఠోబా యని పేరు. ఇట భక్తులు దేవతావిగ్రహమును స్పృశించుటయెగాక, కౌఁగిలించుకొని భక్తిపారవశ్యమునఁ దనరు నాచారముకలదు. విగ్రహమిసుక రాతితోఁ జేయంబడినది. (పాండురమనిన ఇసుక యనియు, అంగ మనిన శరీరమనియు నర్థములు.) క్రీ. వె. పదునాల్గవ శతాబ్దమున జీవించియుండిన పుండలిక మహాభక్తుండును, నామదేవుండును, ఈ దేవస్థాన ప్రసిద్ధి నెక్కువగ వ్యాపింపఁజేసి రందురు. నామదేవుం డిట వసింపలే దఁట. ఇట కొలమైలు దూరమునఁగల గోపాలపురమున వసించుచుండెనఁట. కాని, యా మహాభక్తుఁడు తనశిష్యుల నర్థించి, తన శరీరమును దేవాలయద్వారమున కరుగుమెట్లక్రింద పాతున ట్లొనర్చె నఁట. దానిపైనుండి నడిచి లోని కరుఁగుభక్తుల పాదరేణువులు తనపైనుండ,నాయన వాంఛించెనఁట. అట్లె చేయంబడె నని తలంపంబడుచున్నది. ఆ ప్రక్కగనే ఆ మహాత్ముని విగ్రహముంచఁబడి, దానిం దొలుత పూజించి మ్రొక్కియే ప్రధా

దేవాలయములోని కరుగుట యాచారమై యున్నది. భక్తులకోర్కులం దీర్ప పాండురంగ విఠలుఁ డిట సంసిద్ధుఁడై యుండుననియు నొక బలమగు ప్రతీతి భక్తులయందు కలదు గాన, తనువినతు లొనర్చి వెనుక నేతెంచు భక్తుల కిఱుకు లేకుండ నేగవలయు నందురు. ఇట నాషాఢ కార్తిక మాసముల ఏకాదశులందు గొప్ప యుత్సవములు జరుగును.

**పంపానది** — పంపాసరోవరముకడనున్న యొక చిన్న నది. జలధారంబోలు చిన్న కాల్వ తుంగభద్రలో సంగమించును. (పంపాసరోవరము చూడుఁడు.)

**పంపాపురము** — ఇప్పుడు బింధాచల్ అనం బరఁగుచు, వింధ్యాచలవాసినీ దేవిపీఠమున్న తావునకు తొల్లింటిపేరు పంపాపురము. ఇది సంయుక్తరాష్ట్రములందు, మిర్జాపూరు పరిసరముల, గంగాతీరమునందున్న క్షేత్రము. శక్తిపీఠము.

**పంపాసరోవరము**— జీర్ణ విజయనగరమున కవ్వల తుంగభద్రానదిదాటి, ఆనేగొంది పరిసరములనున్న పవిత్రసరస్సు. ఋష్యమూకపర్వతముకడ నున్నది. పంపాదేవి పార్వతీదేవి యొక్క వివాహోత్పూర్వ తపోవస్థ యని చెప్పఁబడినది. ఇందు సీతాదేవి జలకములాడె నందురు. పంపాక్షేత్రము (ఇప్పటి హంపి) విరూపాక్షక్షేత్రముతో సంబంధము గలది. (పంచపవిత్రసరోవరములు చూడుఁడు).

**పంపాస్ ల్లానోస్** — (Pampas and Llanos) దక్షిణఅమెరికా దేశములం దరణ్యములచే నాక్రమింపఁబడని బయళ్లకు పేరులు. (Land portions చూడుఁడు.)

**పక్కిచెట్టు**—లా. Tamarix gallica, Trophis aspera, ఆంగ్ల. Tamarisk. సం. ఝావుక, పిచులః.

దీనిని పక్కిచెట్టనియు ననుట కలదు. పాలుండు చెట్టు. దీనిపాలు కాలిమడమపగుళ్ళకును, చర్మముపైపొర ఊడిపోయిన తావులందునను అంటించిన మాను ననియు, కండపట్టి కలిసిపోవు ననియు, కుళ్ళువ్రణముల ముఱికిం బాపి శుభ్రపఱచి మాన్పటఁజేయు ననియుఁ దీని చెక్కకషాయమునందునను నివేగుణములు కలవనియుం జెప్పఁబడినది.

**పక్షగ్రహణము**—గ్రహణములు చూ.

**పక్షచ్ఛిద్రతిథులు** — కృష్ణ పక్షమున చతుర్థి, షష్ఠి, అష్టమి, ద్వాదశి, చతుర్దశి.

**పక్షములు** — శుక్ల లేక శుద్ధ పక్షమనియు, కృష్ణ లేక బహుళపక్ష మనియు, నొక్కొక నెలయందు రెండు పక్షములు. శుక్లపక్షము- శుద్ధపాడ్యమి మొదలు పౌర్ణమికడవఱకును, కృష్ణపక్షము బహుళపాడ్యమి మొదలమావాస్య కడవఱకును నుండును. శుక్లపక్షమున రాత్రులందు చంద్రిక (వెన్నెల)రోజుకురోజభివృద్ధి నందుచు వెలుఁగు గల్గి యుండుం గాన, శుక్లపక్ష మని (తెల్లనిభాగ మని) యు, కృష్ణపక్షమున రాత్రులందు చీకటి యభివృద్ధి యగుచు,రాత్రులంధకారబంధురమై యుండుం గాన కృష్ణపక్ష మని (నల్లనిభాగ మని) యు పేరు గలెను.

**పక్షవాతము**—ఆంగ్ల. Paralysis. శరీరముయొక్క సగముభాగమున కాలుచేతులందు వ్యాపించి, వాటినరముల సత్తువు లేకుండఁజేసి, పడఁజేయు రోగము. ఒక్కొకతఱి మూతిని వంకరపోఁ జేయును. ఇది నరములరోగము.

నరములబలహీనత నెఱింగి, రోగము బలపడకపూర్వమే తేనెను లోనికిచ్చుచు ధాతువు క్షీణింపకుండఁ జేయుటవలన నీరోగమును నిరోధింపఁదగు నని చెప్పఁబడినది.

ఈరోగ మంకురించినతోడనే రసకర్పూరము లోని కిచ్చుట, లేక గాఢవిరేచనముల కౌషధ మిచ్చుట గావింపవలసిన సహాయకర ముందురు.

**పక్షితీర్థము**— దక్షిణ దేశమున చెంగల్పట్టునుండి మంచిబాటను ఏడుమైళ్ళదూరమున తిరుకళిక్కున్ఱ మను గ్రామము నంటియున్న వేదగిరి యనంబడిన కొండపై నున్న తావు. గ్రామమునందు శంఖతీర్థ మను స్నానఘండము, ఒక దేవాలయమును కలవు. కొండపై కెక్కుటకు మెట్లు కలవు. ఱోలీలు చిక్కును. వేదగిరిపై నొక చరియకడ నొక గండశిలయం దొక చిన్నగుంట చెక్కఁబడినది. దానిని పక్షితీర్థమందురు. ఇట స్నానము లొనర్చుట లేదు. రెండు పక్షులు అపరాహ్ణకాలము కాఁగానే కొండచరియపై వచ్చి వ్రాలును. అట నదివఱకె పాయసము వండి వేచి యుండిన పండార (అర్చకుఁడు) మా పాయసము నా రెండు పక్షులకుం దినిపించును. పక్షులు రెండే వచ్చుటయు, తప్పక వచ్చుటయు, నదే కాలమునకు వచ్చుటయు నాశ్చర్యకరమై యుండును.

పురాణములం దీపక్షులు శాపమందిన ఇరువురు ఋషులని చెప్పఁబడినది. దేవాలయమునఁగల శాసనముల మేర కిది రెండువేల సంవత్సరముల నుండి యున్నటుల తెలిసెడిని. కొండపై తిరుమల చొక్కమ్మాణి (శ్రీగిరి సుందరి) దేవస్థానము చిన్నది కలదు. ఈదేవిని పార్వతి యందురు. (వేదపర్వతము చూడుఁడు).

**పక్షివృక్షన్యాయము**—పక్షియొకకొమ్మ నుండి యెగిరి వేఱొకకొమ్మపై వ్రాలుతరి బరువువల్ల నూఁగుచు రెండుకొమ్మలు కదలును. అనఁగా నదివఱకుండి విడినకొమ్మయు, వ్రాలిన కొమ్మయుం గూడ కదలి యూఁగును. జ్యోతిష శాస్త్రమునదుష్టగ్రహము ప్రవేశించుతరిని వదలిపోవుతరిం గూడ కొంత చలనము అలజడి కలుగుచుండునని చెప్పుటకీన్యాయమువాడఁబడినది.

**పక్షిశకునపరీక్ష**— కాలవిజ్ఞానశాస్త్రమున వివరింపంబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుఁడు.)

పక్షిశకున పరీక్ష యనఁగా దేశమున రాఁగలసుభిక్షముంగూర్చి ఎఱుఁగఁగోరినవారు పైఁడికంటి శకునమును పరీక్షింపవలె ననియు, దాని నెఱుఁగుటకు తొలుత పైఁడికంటిపక్షి నివసించువృక్షము నెఱింగి దానికడకుం జని ఆ వృక్షమును సంభావింప వలయు ననియు సూచించి యున్నాఁడు.

౧ పుష్పాక్షతల నావృక్షముకడ నిడి మనస్సునందు వర్షప్రశ్న మొనర్ప, పైఁడికంటి బెసిగఁ బల్కిన వర్షసమృద్ధి యనియు, నడిగఁ బల్కిన స్వల్పవర్షమనియు,

౨ ఆచెట్టుకడ చక్కెరను, మాంసఖండమును పక్షి కగపడునట్లు నేలంబెట్టి, అది ఆహారముగఁగైకొని వర్షప్రశ్న కుత్తర మిమ్మని మనంబునం దలంప, నాపైఁడికంటి తననివాసవృక్షము నుండి ప్రసన్నతతో దిగివచ్చి వాట్లం దాఁకిన శీఘ్రముగ పెద్దవర్షములు గుఱియుచిహ్నముగ నెఱుంగు మనియు,

3 పైఁడికంటి నివసించువృక్షముం బూజింప, నాచెట్టుకొమ్మలనుండి నాపక్షి సమీపమునం గల వాపీకూపతటాకాదులతీరమున వ్రాలి, తన తెక్కలం దీర్చి సొంపున నేగిన నధికవర్షములు త్వరలో రానున్నటుల నెఱుంగుఁ డనియు,

౪ పూజాకాలమున పైఁడికంటిపెద్దగ రొప్పినను, చెట్టునుండి దిగి వచ్చి నేల వ్రాలినను, మ్రానికుడితట్టున నిలిచినను, చెట్టు వీడి యెగిరి యఱచినను, చెట్టునకు ప్రదక్షిణ మొనర్చినట్టు లెగిరినను, మూత్రము విడచినను, తప్పక వర్షయోగము కలుగనున్న దెలుంగుఁ డనియు,

౫ పూర్వాప్రశ్నకాలముల పైడికంటి రాతి పైని,కట్టెపైనిమాత్రము,రెట్ట,విడువరాదనియు, దాని గ్రుడ్లు బేసిగ నుండినను దోష మనియు, శిలావర్షము, వడగండ్లవాన, సిద్ధమై నష్టము గల్గించు ననియు,

౬ ప్రశ్నకాలము లేక పక్షియుండునో లేక పోవునో యని తలంచుకాలమునం గాని పైడి కంటి చెట్టునుండి ఎడమవైపునకుం జనుటయు, దాంపలిభాగమున కరుగుటయు, అరువక కదలక తనగ్రుడ్లపైం గూర్చుండి కదలకుంటయు (ప్రసన్నత లేకపోవుట) వర్షములేని చిహ్నము లనియు,

౭ వర్షప్రశ్నకడుగుటకై పైడికంటి వసించు వృక్షముకడ కేగుచుండుతఱి- ౧ ఆగ్నేయదిశ నుండిగాని, ౨ దక్షిణదిశనుండిగాని, ౩ వాయవ్యదిశనుండి గాని, ౪ ఉత్తరదిశనుండి గాని యాపక్షి యేతెంచి తీర్చిపోయినను, లేకఆగిశల కడంజేరి నిలచినను శీఘ్రముగ వర్షమువచ్చునని యెఱుంగుండనియు రెట్టదేవజ్ఞుండుకాలజ్ఞానమున దెల్పెను.

**పక్షిశరీర మెగురుటకే యనుకూలము**—పక్షులశరీరము లెగురుటకును, మనుష్యులశరీరములు నడుచుటకును నేర్పఱుపంబడినవి. పక్షిశరీరము వీలగునంత చులకనం గా చేయంబడి యున్నది. అందు Lungs ఉండవలసినంతకన్న పెద్దవియైన అవి గాలిచే నింపంబడు వీలు కలదు. అంతియె గాక, దానిశరీరమునందు గాలిచే నింపంబడందగిన గుల్లభాగములు పెక్కు కలవు. దానిశరీరపు ముందుభాగము సూదిగ నుండుటయు, వెనుకకుం జక్కనివంక గల్గియుండుటయు, ఎగురుట కనుకూలించెడి పద్ధతినే సూచించెడిని. దాని మేని బొచ్చు, రోమములు Water proof గా నుంట, తడి యంటక తడిసినతఱిని దులుపుటతో పొడిగానే యుండెడిని. లేకపోయిన పక్షి తడిసినతఱి బరు వెక్కవలసి యుండును. ఇంక దాని Muscles ఎగురుటే ప్రధాన కార్యముగ దాని శరీరావయవములతో పోల్చిన నధిక బలము గల్గి ఱెక్కలను విప్పి యాడించుచు నెగురున ట్లమర్పం బడినవి. వీటియం దుండు బల మాపక్షి శరీరపు భార మంతటిని మోయుటకువలయుబలముకన్న నధిక మనిపించెడిని. కాననే అంత నిర్లక్ష్యముగా వడితో చెలగాటలుగ గాలిలోనికి దుముకున నెగురంగల్గుచుండును. ఇంచుకసేపు అటునిటు నడుచుట చెట్లకొమ్మలపై వ్రాలుటకుమాత్రము వలయుకాళ్ళు రెండు సన్నముగను, గట్టిగను, పట్టుకొన వీలగు కాలివ్రేళ్ళు గల్గియుండును. తోంకవచ్చు ఓడయందలి చుక్కాని వలె పని చేయుచు నిటునటుం ద్రిప్పుట కనుకూలించుచున్నది. కాళ్ళు దాని శరీరము మోయందగన ట్లుండియు శరీరమును మోయంగలవియె.

**పక్షీశ్వరక్షేత్రము**—ఆగ్రా,అయోధ్యా, సంయుక్తరాష్ట్రములలోని అల్మోడా, లేక కాళీ కుమాన్ డివిజనులో నున్నది. అల్మోడానుండి డెబ్బదిమైళ్ళ దూరము. ఇట బాంగ్రీనది సరయూనదిని చేరును. ఇటనుండి ఆకలిసినప్రవాహమునకు శారదానది యనిపేరు. ఆశారదాప్రవాహము పక్షీశ్వరశివక్షేత్రముకడనే కాళీనది యందు సంగమించును.

పక్షీశ్వరము గొప్పపవిత్రస్థలిగ నెన్నంబడుచు పరిసరప్రాంతముల గ్రామములకు శ్మశానస్థలమై యున్నది. బహుదూరమునుండి శవము లిటకుం దేంబడుచుండును.

**పక్షులదృష్టి మనుష్యులదృష్టికన్న నధికబలమైనది**— మనుష్యుండు కొంత ఎత్తగుతావునకెక్కితిన్నగనుండుక్రిందికింజూచిన కండ్లు తిరుగును. కండ్లు పచ్చబడుట (తాత్కాలికముగ దృష్టి యాంగిపోవుట) సంభవించును.

ఇది దృష్టియందలిబలమున కర్హ్యానుగునంతకంటె నధికమగు యెత్తునుండి క్రిందికిం జూచుటవలనం గల్గునని పరిశీలనలు తెలుపుచున్నవి. పక్షి యటులం గాక చాల యెత్తున కాకసమునం దెగురు చుండును. అది చూచుదృష్టి తిన్నగ క్రిందికే యుండుం గాని వేఱుకాదు. ఏల యన నది యపాయములనుండి జాగ్రత్తం గొనుచుండ వలసియుండునది యైయున్నది. అట్టితెరం గూడ మనుష్యులవలె నిలిచియుండక అది యెగురుచు, ఱెక్కల నాడించుచు, శ్రమనందుచుండుం గాన దానికి కండ్లు తిరుగుట సంభవింప వలసి యుండెడిని. కాని, యటుల జరుగకుండుట దాని దృష్టి మనుష్యులదృష్టికన్న చాల బలమైనదిగాం జెప్పందగి యుండెడిని.

## పక్షులఱెక్కలనుండి(ఈక)కలము లూడుట (Birds moulting feathers)

పక్షులఱెక్కలకడ నుండు ఈంకెకలములు మను ష్యుల నోటిపండ్లం బోలినవి. అవి వాటిఱెక్కల కడల నొకవరుసగను, వాటిక్రింద వేఱొకవరుస గను, వాటికిం దిగువ నింకొక వరుసగను, ఇట్లు పెక్కువరుసలుగనుండును. అవి ముదిరినకొలది ఱెక్కలకడనుబయటికివచ్చుచుండును. ఈనడుమ ప్రాంతఱెక్కలరిగి, చిరిగి భిన్నమై, పటుత్వముం గోల్పోయి, ఒక్కొక్కటిగ రాలిపోవుచుండ, లోనిది పైకి రా మొదలిడుచుండును. ఇవి వాటి రోమములం బోలిన మృతపదార్థమే Dead material) యైనను, దానివలె బలహీనమైనది గాక, లోననే యేర్పడిన బలమగు మృతపదార్థ ముగను, నించుక గట్టిగను నుండునది. ఎగురుట యం దుపయోగించు శరీరావయవముగ నుం డుంగాని, రోమములం బోలి (ఒక్కచలి నాంపి వెచ్చగ నుంటం దక్క) వేఱొక నిరుపయోగ పదార్థము కాదు. ఏటేట నివి ఊడిపోయి క్రొత్తవి వచ్చుచుండు నని తలంపంబడుచున్నది.

కాని, నత్తగుల్లలు, శంఖములు, గవ్వలు మొద లగువాటిగుల్లలం బోలి, జీవితకాల ముండునది కాదు. గుఱ్ఱములు, గొఱ్ఱెలు, కుక్కలు మొద లగునవి వేసవియందు బొచ్చు రాల్చి శీతకాల మునకు తిరుగ బెంచుచుండును. పాములు శీత కాలపుకుబుసము (పైపొర)లను వేసవియందు విడుచును.

## పక్షులు నీరుత్రాగవు

— పిట్టలు నీరు త్రాగవు చూడుండు.

## పక్ష్మకోపరోగము

—ఇది నేత్రవర్త్మగత రోగమునకుం బేరు.

## పగటికలహము పనికిచేటు, రాత్రి కలహము నిద్రకు చేటు

—ఆంధ్రలోకోక్తి.

## పగడపుచట్టు (Coral reef)

—పగ డపుచట్టు సముద్రములం దుండునది. తరచుగ గుండ్రముగనుండును. కొన్ని అర్ధవృత్తములుగం (Semi circle) గూడ నుండుట కలదు. ఇవి సముద్రమందలి పురుగులవలనం జేర్పంబడి నిర్మిం పంబడును. ఏంబదియడుగులకన్న లోంతు లేని దియు, జలచలనము లేనిదియు నగు మెరకప్రి దేశపు నీటియం దివి ప్రారంభింపంబడి, నీటిమట్ట మునకు రాం జేయును. ఏకారణముచేత నైన సముద్రభాగము విపరీత పరిస్థితులకు లోనై, లోతుగ నగునేని, తిరిగి పైకి పెంచంబడును. అట్లే సముద్రభాగము మెరక యగుచోట పగ డపుచట్టు నీటినుండి పైకివచ్చి కనంబడు చుండె డిని. కొన్ని పగడపుచట్టు లిట్టిపరిస్థితులకు లోనై పెరుంగుచు, తిరుగ మెరకయగుచోట చిన్నకొం డలవలె నై యగుపడుచుండుటయుం గలదు.

లోంతుసముద్రములందు పగడపుపురుగులు బ్రతుకవు. పగడపు పురుగున కాంగ్లమున "Coral Polyp" అనిపెదరు. చట్టు ముదిరిన తావులలోపల పండినభాగము ఎఱ్ఱనిపగడ మగును.

**పగడపుతీఁగెచెట్టు** - (ఇదితీఁగనుబోలిన డొంక) లా. Arum colocosta. సం. కపోతాంగీ, విద్రుమలతా, విద్రుమ లతికా.

దీనిని గువ్వగుత్తిచెట్టనియు నందురు. దీని వేళ్ళుఆకులరసము చెక్కకషాయము చలవ,సమధాతువుచేసి నేత్రరోగముల నివారించి, ప్రమేహము వలనఁ గలిగిన రక్తస్రావము నిల్పి, మూత్రకృచ్ఛ్రము, మేహదోషముల నాఁపి, రక్తపైత్యము నడంచి, విషదోషము హరించి, నుఖరోగబాధల నివారించు నని చెప్పఁబడినది.

**పగడము**—(పవడము చూడుఁడు.)

**పగడశీలకులగోత్రము**-(ప్రౌఢశీలచూ.)

**పగలు రాత్రి** (Day and Night)—(దివారాత్రములు చూడుఁడు.)

**పచ్చ**— లా. Smaragdus. ఆంగ్ల. Emerald. ఫ్రెంచి Emeraude. జర్మను భాష. Smaragdos. సం. మరకతమణి.

పచ్చ ఆకుపచ్చవర్ణముగల రత్నము. ఇది నవరత్నములలో నొకటిగఁ జెప్పఁబడినది. పచ్చ నాంగ్ల రసాయనశాస్త్రవేత్తలు Beryl సముదాయమున నిది యొకటి యందురు. Beryl పదము జర్మనుపద మగు Beryllos నుండి కల్గినది. Emerald, Aquamarine, Morganite, Euclase అన్నియు Beryl సముదాయమునకుం జేరినవని యాంగ్ల విజ్ఞాన సర్వస్వమునందు చెప్పఁబడినది. అందు పచ్చను "Beryl" అనుచు అందుత్తమజాతికి Gold Beryl అని పేరిడియున్నారు. అది పరిశుద్ధమైన పసుపుపచ్చ ధాతువులు గల్గిన ఆకుపచ్చ రాయిగను వివరించి, దాని కింకను Chryso beryl అని ప్రత్యేక నామ మిడిరి.

రసాయనశాస్త్రవేత్తలు "Berylను Silicate of Beryllium and Aluminium" అనెదరు. ఇది ఊరల్పర్వతము లందునను, హంగేరీ బ్రెజిల్ దేశము లందునను లభించునని చెప్పఁబడినది.

పదునాఱవ శతాబ్దమునకు పూర్వకాలము నందు మన భరతదేశమునుండి ఐరోపాదక్షిణ దేశసీములకు పచ్చలు వెనిషియన్ వర్తకులే గాక ఇతరవర్తకులు గూడ నెగుమతి చేయుచుండుట సుప్రసిద్ధమే. కాన, భరతదేశవాసు లనాదిగ పచ్చలు గల్గియుండి రనుట నిస్సంశయము. తరువాత పదునాఱవ శతాబ్దమునుండియు స్పానియా దేశస్థులీవర్తకమును బలపఱచుకొనిరి. బైబిలునందు వివరింపఁబడినది పచ్చకా దనియు, Carbuncle అను మణి యనియుం గొందఱు పరిశీలకులు తెల్పుచున్నారు. తొల్లింటికాలమున Upper Egypt నందీగను లుండె ననియు, క్లియోపాత్రా రాజ్ఞి కటనుండియే పచ్చలు లభించె ననియు నందురు. పచ్చ స్వచ్ఛమై గాఢమై యుండునట్టి చక్కని రంగు గలది శ్రేష్ఠము. దీనికి 'గరుడపచ్చ' యనిపేరు. గరుడపచ్చ విషదోషముల హరించు నని వాడుక గలదు. పచ్చలు రంగు తక్కువ యైనను, లోన మేఘముంబోలు పొరలున్నను దోషము లనం బడును. మంచిపచ్చకు వజ్రమునకన్న నెక్కువ విలువ కల దందురు. పచ్చలభస్మము రాజయక్ష్మ, పాండువు, మూలవ్యాధి, సన్నిపాతము, ఉబ్బుజాడ్యముల నివారించు నని చెప్పఁబడినది. (రత్నములు చూడుఁడు.)

**పచ్చ పొడుచుట** (Tattooing)

పచ్చపొడుచుటనవనాగరికపుపద్ధతులకాక్షేపణార్హమో యనునట్లుండును. కాని, జ్ఞాపకమునకు లొంగని తొల్లింటికాలములనుండి పలుదేశముల వ్యాపకము నంది యుండెను. నేఁటికిని వ్యాపకమునం దున్నదియే

తొలుదొలుత భారతదేశమున సౌందర్యా

ధిక్యమును గాంక్షించి, నుదుట చిన్నదిగ పచ్చబొట్టు పొడుచునాచార ముండెను. బైబిలునందు ప్రాతగ్రంథము (Old Testiment) నందు యూదులకు పచ్చబొట్టు నిషేధింపఁబడినది. ఐరోపాదేశములందు సైనికులు చేతులందు వివిధాకారముల పచ్చ పొడిపించుకొనుచుండిరి. నేటికిని ఐరోపా సైనికుల కిది సామాన్యముగనే యున్నది. ౧౮౮౦ ప్రాంతముల నాంగ్ల సైనికులు తప్పించుకొని పాఱిపోయినవారికిని, దుష్ప్రవర్తన గలవారికిని D. అక్షరము గాని, B. C. అక్షరములు గాని పచ్చపొడిచి యెల్లర కగపడునట్లు చేయుట శిక్షగాఁ గల్గియుండెను. కొన్ని జాతులవారు తమ జాతిశాఖకు అగ్గ్నుగు గురుతును పచ్చపొడుచుకొందురఁట. అడవియందు వసించు మూఢులగు ననాగరికులు, తమ వైరుల భయపెట్టుటకు వెఱ్ఱివికారములుగ, భయానకముగ మోములపచ్చ పొడిపించు కొందురఁట.

పచ్చరంగు (కొన్ని యాకులపసరులు) తమ శరీరమున చిన్నసూదితో లోఁతులేని రంధ్రము లొనర్చి, యందు రంగు జొప్పించి మాన్పుటచే "పచ్చ పొడిపించుకొనుట'' యను పేరు గల్గెను. ఇం డైరోపావారి పచ్చ పొడుచుటయందు ఆకు పచ్చయే గాక వేర్వేఱురంగు లుండును.

**పచ్చాకు చెట్టు**— ఆకు లెండినను ఆకు పచ్చరంగు దీనికి నిలిచియుండును కాన, పచ్చాకని పేరందినది. దీనింగూర్చి యంతగా తెలియదు. దీనియాకులు మాత్రి మెల్లచోట్ల అంగడులందు లభించెడిని. ఇది పరిమళమునకుఁగాను వాడఁబడు చున్నది.

కషాయము జీర్ణశక్తి నధికపఱచును. చూర్ణముగాని, కషాయము గాని, కఫదోషమును, వాతదోషమును హరించు నందురు.

**పజ్ఞ్ఛ్యయనిక గోత్రము** — నిధృవగణము చూడుఁడు.

**పటంగిరి**— పాండవుల స్వర్గారోహణ స్థానము. (గంగానది చూడుఁడు.)

**పటనశిష్ట (పటనవశిష్ట) గోత్రము**- (పటకరుల చూడుఁడు.)

**పటములందుండు డిగ్రీ గీతలు**— (Latitude and Longitude) భూగోళ పటము గాని, ఒక దేశపు పటము గాని చూడఁగనే నిలువుగను, అడ్డుగను గీత లుండుటయు, నాల్గకడల సంఖ్య లుండుటయుఁ గాననగును. భూగోళ పటము (Map of Hamisphere) నందుండు గీతలలెక్క నెఱింగినచో నన్నియుఁ దేటతెల్లమయ్యెడిని. ఇవి పటమునందలి ప్రదేశములకొలతలం దెల్పెడిని. ఒకపటమందలి అడ్డుగొలతకు తూర్పుపడమరలకు Longitudeఅనియును, నిలువుకొలతలకు ఉత్తర దక్షిణములకు Latitude అనియును జెప్పఁబడుచున్నవి.

భూమియందొకగోళార్ధపు(Hemisphere) పటము పరిశీలింతము గాక. ఇందలి భూమధ్యరేఖ (Equator) గోళార్ధమును ఉత్తర దక్షిణ భాగములుగ విభజించుచుండెడిని. దీనిని మూలముగ గల్గియుంటయు, నిటనుండియేకొలతగీతలు ప్రారంభ మగుటయు, దీనిని సున్న గీతగ నెన్నుదురు. భూమధ్యరేఖాస్థానమున భూమి యొక్క చుట్టుకొలత ౨౪౯౦౦ మైళ్ళుగ లెక్కింపఁ బడినది. ఇంక నీభూమధ్యరేఖ కుత్తరముగ తొంబదిగీతలును, దక్షిణముగ తొంబది గీతలునుగీయుదురు. ఈగీత లన్నియు భూమధ్యరేఖవలె భూమిని జుట్టియుండునవియే. వీట్లకు డిగ్రీలనిపేరు. తొంబదియవడిగ్రీ ఉత్తరధ్రువము మధ్యగను,దక్షిణధ్రువముమధ్యగను సరిహద్దుగ చుక్కలు (Points) గ మ్మాత్ర ముండెడిని. అనఁగా నీడిగ్రీ లావరించుతావు లేదనియు, ఇది ప్రదేశమాత్రమే అనియు నెఱుంగునది. తక్కిన ౮౯ డిగ్రీలగీతలు కిరుదెసలను

ఉత్తరమున ఉత్తరధ్రువమునందలి ౯౦ వ డిగ్రీ హద్దుదనుకను, దక్షిణమున దక్షిణధ్రువమునందలి ౯౦ వ డిగ్రీహద్దు దనుకను, మధ్యమధ్య వర స్థలములఁ దనరుచు, భూమిని చుట్టుకొని యుండును. ఈ గీతలకు "Parallels" అనిపేరు. ఇట్లు ఉత్తరధ్రువము (North Pole) నుండి, దక్షిణధ్రువము (South Pole కడకు ఈక్వేటరు కాక నూటయెనుబది డిగ్రీలనిఎఱుంగునది.

ఇట్లు ఉత్తరధ్రువమునుండి దక్షిణధ్రువపు కూడికస్థానమగు తొంబదియవ డిగ్రీ స్థానము గుండా భూభాగమున కవ్వలి కేఁగి భూమిం జుట్టి, తిరుగ నుత్తరధ్రువమందలి తొంబదియవ డిగ్రీస్థానమునకుం జేరుకొనునట్లు నిలువుడిగ్రీ గీతల నిరువదినాల్గింటిని గీచెదరు. వీట్లకు మెరిడియన్సు అనిపేరు. ఈమెరిడియన్ మెరిడియన్ మధ్య పదునేను డిగ్రీల పరిమాణ ముండును. కాన, నిల్వుడిగ్రీగీతలు మొత్తము (15 × 24) మూఁడువందల యఱువది యని యెఱుంగునది. పదునేను డిగ్రీల కొకటిగ నిరువదినాలుగు మెరిడియన్ గీతలను మాత్రము లిఖించుట గంటల సౌకర్యమున కని యెఱుంగ వలయును.

లాటిన్ భాషయందు Meridies అన మధ్యాహ్న మనియర్థము. కాన, మన మెరిడియనుకును అదే యర్థము. మధ్యాహ్న మన దినమందలి సగము కాలముగా నెఱుంగునది. అప్పుడు సూర్యుఁడు సరిగాఁ దలపైఁ గాన్పించుటయు, మననీడ మనశరీరమునందే సరిపోవుటయే గాని తూర్పునకుం గాని పడమరకుఁ గాని వ్యాపింపక యుండు కాలమని యెఱుంగునది. ఇందెఱుంగఁ దగినది ఏ మెరిడియన్ నిల్వుగీతపై సరిగా తలపై సూర్యుఁ డుండునో ఆమెరిడియన్గీత పొడవునను సూర్యుఁడు సరిగా పైననే గన్పించుటయును, ఆగీతపై నుండు అన్ని తావులందు అప్పుడు మధ్యాహ్నమే అయి యుండుటయు సంభవించును.

భూమి తనకుఁ దాను గిరగిర తిరుగుచుండుతఱి ఇరువదినాల్గు మెరిడియనురేఖల దాఁటి, మొదటి కేగుతఱి, నిరువదినాల్గు గంటలకాలమగును గాన, నొకమెరిడియనునుండి తర్వాతి మెరిడియనుపైకి సూర్యుఁ డగుపడుకాల మొక గంట యగును. ఇంకను మెరిడియన్ గీతల మధ్యనుండు పదునేనేసి, డిగ్రీలలో నొక డిగ్రీ పైనుండి వేఱొక డిగ్రీపైకి సూర్యుఁ డగపడుటకు నాలుగు మినిట్లకాలము పట్టును.

భూమి తనకుఁదాను గిరగిర తిరుగునప్పుడు సూర్యున కెదురుగ నుండు భూమధ్యరేఖా (Equator) ప్రదేశమున భూమిచుట్టుకొలఁత ౨౪౯౦౦ మైళ్ళుండును గాన, మెరిడియన్ మెరిడియనుల మధ్య ౧౦౩౭ మైళ్ళు నాలుగు ఫర్లాంగుల దూరమును, డిగ్రీ డిగ్రీల నడుమ ౬౯ మైళ్ళు ౧ ఫర్లాంగు 23 గజములు ౧ అడుగు దూరమును ఉండెడిని. ఇట్లనుటవలన భూమధ్యరేఖకడ భూచలనము మినిటున మై. ౧౭ ఫర్లాంగు. ౨ గజ. 23 అడు. ౧ అని తేలుచున్నది.

## పటలగోత్రము లేక పాటలగోత్రము—

(అగస్త్యఉపగణము చూడుఁడు.)

**పటిక**—లా. Alumen. ఆంగ్ల. Alum. సం. స్ఫటికా, స్ఫటికాత్మా, స్ఫటికారిః, స్ఫటికోపలః, స్ఫటీ, స్ఫాటికం, స్ఫాటికోపలః సృటికా.

ఇది Double sulphate of Potassium and aluminium అనిపెక్కుండ్రుమతముగాని సరిగాఁ జెప్పవలయు ననిన Alum సంఘమునకుం జెందిన పటికలలో నిది యొకటి. (Amember of Alum group) అని చెప్పవలయును. మనదేశమున అంగడులలో దొరకు పటికను, మనము దేనిని పటిక యని పిలుచుచున్నామో ఆపటిక నిజముగ Potassium

Alum వయున్నది. Sodium Alum, Ammonium Alum మొదలగు పటికలనేకము లింకను గలవు. ఈ త్రిపటికలందు ఇతరపదార్థములు కొన్ని చేరియున్నను అల్యూమినియము తప్పక యుండితీరును. అర్ధస్వచ్ఛత గల్గి, అన్ని జాతుల పటికలు నొకేరీతిని గన్పట్టెడిని. గనులనుండి యెత్తఁబడిన పటిక మూలమునకు Alumite అనియు, Alum Stone అనియు నందురు.

ఇంకను Alum Shale, Alum Schist, Bauxita, Cryolite అను పదార్థములనుండియు పటిక చేయుదురు. పటిక ముఖ్యముగ రంగులందు కలియును. కాగితములు చేయుతఱి పటిక దానిని పీల్చుకాగితము కాకుండఁ జేయుచు దానియందలి రంధ్రాణువులు కప్పివేయును. వర్షమునందు తడిసిపోక నీటిని నిరోధించుబట్టలను (Water & Shower proof Cloth) చేయుతఱి పటిక ఉపయోగించును. ఇంతయేల? ఛాయాపటములు తీసి గాలకి నిరోధించి నిలుచునట్లు చేయుపనులందు Plaster of Paris తో బొమ్మలు మొదలగువాటిని జేసినతఱి వాటిని గట్టిపఱచుటకును, తోళ్లు బాగుచేయుటయందును పట్టణములందు మురికిజాగాలను శుభ్రపఱచుటకును బురదనీటినుండి బురదను విడిచి శుభ్రపఱచుటకును నీటిని మృదువు పఱచుటకును, అనఁగా సబ్బు కరఁగనీళ్ళను మృదువుపఱచి కరగునట్లుచేయుటకును, ఇంక నెన్నియో పనులకును పటిక యుపయోగించును గాన విలువ గల్గియున్నది.

పటిక విషములను విఱుచు ననియు, రసపుపటు విఱుచు ననియు, పటిక కరఁగించిన నీరు కండ్లలోఁ బోసిన నేత్రరోగములు, కండ్లమెఱుపులు, కండ్లకలక నివారణ మగు ననియు, నోట పుక్కిలించిన నోటిపూత, గళరోగములు నివారణ మగు ననియుఁ జెప్పఁబడినది. పటికకు నెయ్యి విఱుగు డని చెప్పఁబడినది.

**పటికపంచదార పరిశ్రమ**—పటికపంచదారయు పంచదారలలో నొకపంచదారయే. దీని నాంగ్లమున 'Sugar candy' యనియెదరు.

నీటియందు పంచదార చేర్చినఁ గరఁగిపోవును. ఉడుకుచున్న నీటియందు పంచదార చేర్చుదురు. పంచదార అధిక మైనచో నీటియందు శుభ్రముగ పలుచనై కరఁగదు. అట్టి స్థితిని జాగ్రత్తగ నీక్షించుకొనుచు, ఉడుకునీటియందు తెల్లచక్కెరను అధికముగాకుండ పోయఁదగినంతకు తక్కువగాకుండఁ బోసెదరు. కరఁగినతఱి నపరిశుభ్రత కలదేని తీసివేసెదరు. లేకున్న వేడి చల్లారకుండ వడియఁ గట్టుదురు. ఆ వేడిపాకము నచ్చులందుఁ గాని, కఱ్ఱపైఁ దొలువంబడిన గుంటలందుఁ గాని, పోసి చల్లార నిత్తురు. చల్లారి బిగిసిపోకుండ నాయచ్చులలోని పాకములోనికి దారములు చొనిపి బిగియఁజేసి గట్టిపడినపిదప నవి వ్రేలాడఁదీయుదురు.

ఇది పటికంబోలి యుంట పటికపంచదార యని పేరయ్యె నందురు. కాని, పటికతో నేసంబంధమును దీనికి లేదు.

**పటీరవాయురోగము**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున సంధివాయువునకుఁ బేరు.

**పటుత్రయము (త్రిపటులు)** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున కాచలవణము, బిడాలవణము, సైంధవలవణము వీట్లకు పేరు.

**పటూత్తమము**— ఆయుర్వేద వైద్యశాస్త్రమున సైంధవలవణమునకుఁ బేరు. ఇది లవణములందు త్తమలవణ మని భావము.

**పట్టణే విద్యమానేఽపి గ్రామే రత్నపరీక్షా**— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. "పట్టణము దరినుండఁగా పల్లెయందా రత్నపరీక్ష" యనిభావము.

**పట్టుమట్ట సోమనాథ కవి—** ఆంధ్ర కవులలో నాధునికులలో నొకఁడుగఁ బరిగణింపఁబడినవాఁడు. ఆఱువేల నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు వేంకటరాజు.

స్కాంద పురాణములలోని సూతసంహిత నాంధ్రపద్యకావ్యముగ రచించి బిక్కనవోలి కామారెడ్డి కంకిత మొనర్చెను.

**పట్టుమెట్ట సరస్వతిసోమయాజి కవి** ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁబడినవాఁడు. ఆఱువేలనియోగి బ్రాహ్మణుఁడు. హారితసగోత్రము. తండ్రిపేరు పెద్దిరాజు. తాత పేరు పోతరాజు. కవి శివలెంక గౌరనారాధ్యుని కడ విద్యాభ్యాస మొనర్చినవాఁడని చెప్పుకొని యున్నాఁడు. ఈతని తండ్రితాతలు కవు లనియు, అగ్రజుఁడు రఘునాథసోమయాజి యోగాభ్యాసి యనియు, తల్లిపేరు పేరమాంబ యనియు, ఈతనికి బాలసరస్వతి యను బిరుద ముండె ననియు, ఇతఁ డగ్నిహోత్రి యనియుఁ జెప్పఁబడినది.

రచించినది పృథుచరిత్ర మనుప్రబంధము. ఇది దక్షారామభీమేశ్వరస్వామి కంకితముగ సమర్పించెను. శబ్దాలంకారముల విన్యాసమున నీతఁ డెక్కువ పటిమ గలవాఁడు

**పడవలు—**(ఓడలు చూడుఁడు.)

**పడాలు—**కడు మన్యప్రదేశములందు గ్రామాధికారులకు "పడాలు" అని బిరుదనామము. వీరు చాల పలుకుబడి కలవారుగ నుందురు. ఇది ప్రభుత్వోద్యోగపు టధికారనామ మేయని తలంపరాదు. ధనము, పలుకుబడి, పెత్తనము గలవా రందరు పడా లనిపించుకొందురు.

**పడిసెము పదిరోగాలపెట్టు—**ఆంధ్రలోకో

**పతంగిచెట్టు —** లా. Caesalpinia Sappan. ఆంగ్ల. Sappan wood, Brasiletto. సం. పతంగః, పతంగమ్. చందనముజాతిలోని భేద మందురు. కుచందన మనియుఁ బేరు కలదఁట. దీనింగూర్చి యింకను దెలియవలెను.

దీని మ్రానుచెక్కకషాయము స్త్రీల ఋతు రక్తమును జక్కఁగ వెడలించుచు నిరోధములఁ బాపునని చెప్పఁబడినది.

**పతంజలిగోత్రము —** (కపిఉపగణము చూడుఁడు.)

**పతంజలి జన్మస్థానము-** (గోనార్ధ చూడుఁడు.)

**పతంజలి మహర్షి—** చిత్రపటములందు పతంజలిమహర్షి యాకారమును ఊర్ధ్వభాగము ఋషిగను, అధోభాగము సర్పముగను లిఖించుచున్నారు. ఈ మహాత్ముఁ డాది నాదిశేషుఁడుగ సహస్రజిహ్వలు గలవాఁడై యుండె ననియు నందురు. శంకరభగవత్పాదుల (ఆచార్య) పరంపర యనుగ్రంథమునందు,

"శ్లో॥ హారితల్పహరాంఘ్రినూపురమ్మో
ధరసౌమిత్రిబలాత్రి పుత్రజన్మా!
......................
జయగోవిందముని స్సచంద్రనామా."

అని చెప్పఁబడి యుంట నాదిశేషునకు విష్ణుదేవునితల్పము, హరుని యంఘ్రినూపురము, భూభారమును వహించి మోయుసర్పము, సౌమిత్రి (శ్రీరామునితమ్ముండగు లక్ష్మణుఁడు), బలరాముఁడు (శ్రీకృష్ణుని యన్న), పతంజలి మహర్షి ఆత్రేయుని సుతుఁడు), పూర్వాశ్రమమున చంద్రశర్మ (యనుపేరంబరఁగి సన్యాసము గైకొని గోవింద భగవత్పాదుఁ డనుపేరం బరఁగుచు శంకర భగవత్పాదులకు గురుండై తుర్యాశ్రమదీక్ష నిచ్చినవాఁడును) అవతారభేదములే యని తేలుచున్నది

పతంజలి తల్లిపేరు కొనికాదేవి. ఈయ రచించినవి మనోవాక్కాయముల పరిశుద్ధికిఁ గాను మూఁడుమహాగ్రంథములు. అనఁగా మనశ్శుద్ధికి పతంజలియోగసూత్రములు, వాక్శుద్ధికి వ్యాకరణమహాభాష్యము, కాయశుద్ధికి చరకసంహితయు (ఆయుర్వేద వైద్య గ్రంథము) నై యున్నవి.

పతంజలిమహర్షి ఆదిని తనవ్యాకరణవిధాన జ్ఞాన ముపదేశింపఁ దలంచి ఋషికుమారుల రావించె నఁట. వేయిమంది యరుదేఁఱఁ గూర్చుండ నియమించి, తనయుపదేశము ముగియువఱ కం దెవ్వరు నాతావు వదలిపోరాదనియు, పోయిన బ్రహ్మరాక్షసత్వము సిద్ధించుననియుఁ దెల్పి, మనుష్యరూపమున నొకనోటితో నుపదేశించుట కష్టమని తన తెరలోని కరిగి, తన పూర్వనిజాకార మగు సర్పరూపమున వేయి జిహ్వాలతో నుపదేశింప మొదలిడెనఁట. వేయి మందిశిష్యులలో నొకయవివేకి తెరఁదీసి వారి యాకారమును గాంచఁబోవ, వేయి విషజ్వాలా వాయువులు శిష్యబృందముపై వ్యాపింప, తొమ్మన్నూట తొంబదితొమ్మండ్రుగురు మృతినందుటయు, ఒక్కఁ డెట్లో తప్పించుకొని పాఱిపోవుటయు సంభవించె నఁట. ఆదిశేషుండగు పతంజలి దీనిని గాంచి వగచి చేయుటకేమియుఁ దోఁచక బ్రతికినవానిని రావించి యాతనికి వ్యాకరణ మంతయుఁ గల్గుటకుఁ గొంచెము సంతసించి, "నీపే రేమి?" యనియడుగ నాతఁ "డోగురువరా! గౌడపాదుఁ" డని తెల్పె నఁట. గురుండును ఖేదముతో "వత్సా! నీ విఁక బ్రహ్మరాక్షసత్వముం బూని నర్మదానదీ తీరమున, నుత్తరదక్షిణముల కరుగు పెద్దబాట ప్రక్కనే యున్న పెద్దరావిచెట్టుపై వసించుచు, దారినేగు వారల కగపడక 'పక్' (వండుట) ధాతువునకు నిష్ఠతం జేర్చిన నేమగు? ననియడుగుచుండుము. నాబోధ నెఱుంగనివారి కది పక్తం అని తోఁచును గాన అట్లు పల్కుచుందురు. నే నిఁక ప్రయత్నము లారంభించి చంద్రశర్మ యను బ్రాహ్మణబాలుఁడుగ జన్మించి, ఆమార్గమున నరుగుచు నీకడ కేతెంచి నీవలన ప్రశ్నింపఁబడి నాబోధవిధానమున పక్వమ్ అని ప్రత్యుత్తర మిత్తును. తోడనే నన్ను గ నెఱుంగుము. నీ బ్రహ్మరాక్షసత్వమును బాపువాఁడ" నని తెల్పెనఁట. ఈ సందర్భమున వ్యాకరణ శాస్త్రము (సిద్ధాంత కౌముది) నందలి "పచోవః" అను పాణినిసూత్రముమేరకు అట్టిరూపము పక్వం అని యగును గాని పక్తం కానేరదని చదువరులు మనస్సునందుంచుకొనదగును. తోడనే యట్లరిగిన గౌడపాదబ్రహ్మరాక్షసి నర్మదానదీ తీరమునం దారావిచెట్టు చేరి యట్లడుగుచుండెను. ఒకనాఁ డొక విప్రకుమారుఁ డామార్గమున నట కేతెంచి, బ్రహ్మరాక్షసిచే ప్రశ్నింపఁబడి, పక్వమ్ అని ప్రత్యుత్తరమీయఁ, దన బ్రహ్మరాక్షసత్వ విముక్తికిఁ గాల మాసన్నమాయె నని గౌడపాదుఁ డెఱింగి, ఆ పుత్రుని చెట్టుపైకి రావించి, వ్రాయ నియమించి తాను వచింప మొదలిడెనఁట. విప్రుండగు చంద్రశర్మ రావియాకులపై తొమ్మిదిదినములు బ్రహ్మరాక్షసి చెప్పిన దంతయు వ్రాసెననియు, నదియే పిదప పతంజలికృత మహాభాష్యమనఁబరఁగె ననియుఁ జెప్పంబడినది. ఈచంద్రశర్మ ఆదిశేషుండగు పతంజలియవతారమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. పిదప నీచంద్రశర్మయే సన్న్యాసము స్వీకరించి, గోవిందభగవత్పాదుఁడు, లేక గోవిందముని యనఁబరఁగి శ్రీశంకరభగవత్పాదులకు గురుం డాయె నఁట. (గౌడపాదాచార్యులు చూ.)

ఈసందర్భమున నెఱుంగఁ దగిన వేఱొక్క సంగతి. చంద్రశర్మ వ్యాకరణమహాభాష్యమును

రావిచెట్టుపై బ్రహ్మరాక్షసత్వము నందియున్న గౌడపాదుని నుడువుల మేరకు తీసికొనివచ్చుతటి మార్గమధ్యమునం దెచ్చటనో (బహుశః ఉజ్జయినీపుర మని యనుచున్నారు) కొంత ఒకమేఁక తినివేసె ననియు తక్కినదే యిప్పుడున్న వ్యాకరణమహాభాష్యముగ నున్న దనియు, మేఁకతిని వేసినభాగమునకు "అజభక్షితభాష్య" మని పేరయ్యె ననియు ననుచున్నారు. నేఁటికిని నష్టపడి గతించి తిరుగ రానిదానినిఅజభక్షితభాష్యమని సామెతగా వాడుచుందురు. చంద్రశర్మ పిదప ముగ్గురు భార్యలను బరిణయ మై కొంతకాలము గృహస్థాశ్రమమందుండి, మువ్వురియందు నొక్కొకరుగ మువ్వురు కుమారులఁ గని, పిదప సన్యసించి గోవిందభగవత్పాదాచార్యులయ్యెనఁట (శుకయోగి చూ.)

**పతనత్వరితము** — గ్రావిటేషన్ ఫుల్ ధర్మము మేరకు పతన మపాయము కానేరదనియు, ఏల యన ఆకర్షణము చాల మందముగా జరుగుచుండుం గాన నది నిరపాయకరముగనే యుండుం గాని పైనుండి క్రిందకుఁ బడుటయందు క్రమక్రమముగఁ బడు శరీరపు (Mass) బరువునుండి హెచ్చుగ నగుచుండుం గాన నపాయకరముగఁ బరిణమించు ననియుఁ గనిపెట్టంబడినది. నిజముగా నేదియు గ్రావిటేషను నాటంకపఱచునది యుండఁ జాలదు. ఆకాశమునం దెచ్చటనో మేఘములం దేర్పడిన వర్షబిందువు పడుట సాదృశ్యముగఁ గైకొనిన, అది పడుట ప్రారంభించుతటి మందగమనముఁగల్గి మొదటిసెకెండునం దించుమించు ౧౬ అడుగులు మాత్రమే పైనుండి క్రిందికిఁబడ నోపుఁ గాని, దాని (Mass) బరువు వేఁగోశ Forceగా నేర్పడి, రెండవసెకండునందు ౩౨ అడుగుల త్వరితగతిని క్రిందికిఁ బడెడిని. ఇట్లు రెండుసెకెండులకాలమున ౪౮ అడుగు లగును. పైనుండి క్రిందికిఁగల యెత్తు ఎంతయుండునో దాని నిట్లు లెక్కింపవలసియుండును.

**పతనాంతాస్సముచ్ఛ్రయాః** — ఇది సంస్కృతభాషయందలి లోకో క్తి. పైకెగురుట తుద్ర్ముట క్రిందపడుటకే యనిభావము. త్రుళ్ళుపాటునకు తూలిపాటుతో విశ్రాంతి యని లోకోక్తి కలదు.

**పతాక-సంజ్ఞాక్షరములు (జండాఅక్షరములు)**-దీని నాంగ్లమున "Flag alphabet" అనియందురు. కొందఱు దీనిని Semaphore alphabet అనియెదరు కాని, సైనికోద్యోగులు వాడుచున్న సెమాఫోరునకును దీనికిని వ్యత్యాస మున్నది. ఇది ఐరోపాఖండ దేశములందు ప్రచారము నందియుంటఁ గాననగును. దీనియందుఁ గొన్ని గుఱుతులు ఇరువదియేడక్షరములు కలవు. ఇం దుపకరణములుగ వాడంబడును. ఒకమనుష్యుఁడును, ఆతఁడు చేతఁబూనిన రెండుజండాలు నై యుండును.

గురుతులు ౫.



Ready to start.

ప్రారంభము లేక శ్రద్ధగా నుండుము.



Repea తిరిగి చెప్పుము.



Cancill previuos Signal.
ఇదివఱకుఁ జెప్పినది రద్దుపఱుపఁబడినది.



Letters Follow.
అక్షరములు చెప్పుచున్నాను



గ్రహించితి ననుటకు గుఱుతు.



Numerical figures will follow
అంకెలు చెప్పుచున్నాను.



Crossed.
ఇది విరామమునకు గుఱుతు.

అక్షరములు ౨౬ ఆంగ్లాక్షరములు:—



A

ఒకటవయంకె గుఱుతు.



B

రెండంకె గుఱుతు.



C

మూఁడంకె గుఱుతు.



D

నాల్గంకె గుఱుతు.



E

ఐదంకె గుఱుతు.



F

ఆఱంకె గుఱుతు.



G

ఏడవయంకె గుఱుతు.



H

ఎన్మిదంకె గుఱుతు



I

తొమ్మిదంకె గుఱుతు.



J



K

సున్నకు గుఱుతు.



L

M



N



O



P



Q



R



గ్రహించితి ననుటకు గుఱుతు.

S



T



U



V



W



X



Y



Z





(Crossed) విరామము

పద్ధతులు లేక విధులు:—

౧ కుడిచేతి ఎడమచేతి జండాలు రెండును క్రిందికిదించి నిలిపిన సిద్ధముగా నున్నానని యర్థము.

౨ కుడిచేతి ఎడమచేతి జండాలు రెండును పైకెత్తి నిలువం బెట్టిన (అనఁగా వంకరలు లేక తిన్నగా నిలువంబెట్టిన)తిరిగి తెల్పుమని యర్థము.

3 చేతు లేవైపునకుఁ జాఁపినను పూర్తిగాఁ జాఁపవలెను.

౪ జండాలు విప్పియుంచవలెను గాని చుట్టి యుంచరాదు.

౫ అక్షరమున కక్షరమునకును నడుమ కొంచెము కాలమును, మాటకును మాటకును నడుమ నింకఁ గొంత యధికకాలమును విరామ మొసఁగుచుండవలయును.

**పతాకము (క్రియ)**- పతాకహస్తముగా బట్టినచేతిని మీఁది కెత్తుటకు పేరు.

ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణము లోని దేశ్యక్రియ లెన్మిదివిధములలో నొకటి. (క్రియాప్రాణము చూ.)

**పతాకహస్తము**-(హస్తాభినయము చూ భరతశాస్త్రము చూ.)

**పతిత(క్రియ)**--పతాకహస్తముగాఁ బట్టి మీఁది కెత్తినచేతిని క్రిందికి దించుటకు పేరు.

ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణము లోని దేశ్యక్రియ లెన్మదివిధములలో నొకటి. (క్రియాప్రాణము చూ.)

**పత్తిచెట్టు**—ఇది తెల్లపత్తిచెట్టు, ఎఱ్ఱపత్తి చెట్టు, పైఁడి (పచ్చ) పత్తిచెట్టు, చిట్లపత్తి చెట్టు, జందెములపత్తిచెట్టు అని ముఖ్యజాతు లయిదు. కాని, ఇందు లెక్కలేని భేదజాతులు కలవు. వేర్వేఱు దేశముల వేర్వేఱు జాతుల పత్తులు గాననయ్యెడిని. తెల్లపత్తి తెల్లపువ్వులను, ఎఱ్ఱపత్తి ఎఱ్ఱపువ్వులను, పైఁడిపత్తి పసుపుపచ్చ పువ్వులను పూచును. చిట్లపత్తి చిన్న చెట్టు.అధమపుజాతిది.జందెములపత్తి పెద్ద చెట్టు. గింజ లేడేసి కలిసియుండి పెద్దకాయలు కాచునది. కొన్నిజాతులపత్తి విస్తారము ఫలించు నవి. కొన్ని పంటతక్కువ. నల్లరేగటిభూములు పత్తి కనుకూలములు. పత్తియుపయోగములు పెక్కుగలవు. నూలువడకి బట్టల నేయుట ముఖ్య మైనది. పత్తి శుభ్రపఱచి పరుంచుటకు పరుపులు, తలగడలు కుట్టుదురు. దూదితో పలు విధములగు మెత్తలు చేయుదురు.

పత్తిగింజలనుండి నూనె తీయుదురు. అది చాల తేలికగా నుండి చౌకగ లభించును. పత్తి గింజలు పాలిచ్చుపశువులకు మంచిబలము గల్గించునాహారము. పత్తిగింజలలోని పలుకులు జిగట విరేచనముల నాపుశక్తి గలవి కాన నౌషధము లందు వాడుదురు. జందెములపత్తిని జటపత్తి యనెదరు. దీనితో పరిశుభ్రమగు దూది లభించును. కాన దానినుండి యజ్ఞోపవీతము లకుఁ (జందెములకు) గాను దారము తీయుదురు. పత్తిచెట్టునకు లాటిన్భాషయందు Gossypium, Herbeceum అనియు, ఆంగ్ల. Cotton tree అనియు, సంస్కృతమున కర్పాసః, సూత్రపుష్పవృక్షః, బదరీ అనియుం బేర్లు.

పత్తి, ఆకు, కాయ, పువ్వులరసమందు నాభివిష పాషాణవిషదోషముల హరించుగుణముకల దనియు, కండ్లకలకలు, ఎఱుపులు, పోట్లు, నివారించుననియు, చెవిలో వేసిన పోటు మొదలగు కర్ణరోగములు నివారించు ననియు, లోనికిచ్చిన గ్రహిణి కట్టి, మేహశాంతి యొనర్చు ననియు, పత్తిపూవులందు (శ్రేష్ఠముగ పైఁడి లేక ఎఱ్ఱపత్తి పూవులని చెప్పఁ బడినది) స్త్రీల కుసుమజాడ్యముల నాపుశక్తి గలదనియుం జెప్పఁబడినది.

పత్తి ఆకులు రక్తగ్రహణికట్టి, నొప్పుల తీయు

ననియు, ఆకు చూర్ణముచేసి కషాయము గాచి లోని కిచ్చిన కలరా నివారించు ననియు, దీని వేరునందు పూవులందు స్త్రీల ఋతుదోషము నివారించు శక్తిగలదనియుఁ జెప్పుదురు.

**పత్ర్యాల గోత్రము**-(శౌనకి లేక గ్రత్స్న మదగణము చూ.)

**పత్ర గోత్రము**-(విష్ణువృద్ధఉపగణముచూ)

**పత్రఫలన్యాయము**— దీనిని ఫీలుపత్ర ఫలన్యాయ మనియుఁ గొందఱువాడుచున్నారు. ఒకచెట్టుఆకులు కటువుగా రుచిహీనమై యుండి నను ఫలములు రుచిగానే యుండును. సంబంధ పదార్థముల దోషముంబట్టి తక్కిన (కావలసిన) పదారమునందు దోషారోపణ మొనర్చుట అసమంజస మనిభావము.

**పత్రము**—(దీడ్ చూడుఁడు.)

**పత్రికావిద్యాభ్యాసము** — పత్రికలు నడుపుట కొందఱు తలంచునటుల సులభసాధ్య మైనపని కాదు. దాని విధివిధానముల చక్కఁగ నెఱుంగుట కెక్కువ శ్రమ కోర్చుటతో నెక్కువ పరిజ్ఞానముం గల్గినవాఁడుగ నుండవలసియుం డును. కొన్ని దేశములందలి విశ్వవిద్యాలయము లిట్టివిద్యల నొసంగు సంస్థలను నిర్వహించు చున్నవి. ఇది యొక స్పష్టమైనవృత్తి గాన చక్కని తరిబీయతు నందుట యత్యావసరము.

"A man behind the pen (in peace times) is as powerful as a man behind the Gun. (in war times)" అను సుప్రసిద్ధలోకోక్తి యేర్పడి యున్నది. ఇందు "Behind the pen" అనిన వార్తా పత్రికానిర్వహణ మొనర్చువాఁ డనియు, "Behind the gun" అనిన పటాలము నందలి సిపాయి యనియు భావము. పత్రికా విద్యాభ్యాసము లేని యెంతటివిద్యాధికుఁడైనను, ఈకార్యమున నిరర్థకుఁడే యగుచుండును.

పత్రికానిర్వహణశాస్త్రమున కాంగ్లభాష యందు "Journalism" అనెదరు. ఈవిద్య "General journalism"అనియు,"Technical journalism" అనియు ద్వివిధముగ విభజింపం బడినది.

జనరల్ జెర్నలిజము- భాషాజ్ఞానము, విదేశ భాషాజ్ఞానము కల్గినపిదప "Economics, Government procedures, Sociology, Philosophy" అనెకు విద్యలను నేర్వవలసి నదిగాఁ జెప్పఁబడినది.

టెక్నికల్ జెర్నలిజము నాల్గుభాగములుగ విభ జింపంబడి నేర్పంబడుచున్నది. అవి ౧ Elementary course, ౨ Extended course, ౩ Editing and Editorial writing, ౪ Editorial management అనంబడునవి. వీట్లం బరిశీలింతము గాక.

౧ Elementary course — దీనికి "Newspaper Writing"అనియుం బేరు కలదు. ఇది కేవలము వార్తాపత్రికలరిపోర్టరులు (Reporters) చేయుపని యైయున్నది. అట్టి వారినమెరికాయందు"News-paper-man" అనియు ననుచున్నారు. ఇట్టివారు ప్రత్యేక వార్తల కొక్కొకతావున కంపఁబడుదురు. లేక ఒక్కొకతావున నియమింపంబడి, అచటివార్తల నన్నిటిం దెల్పుచుండుటయుం గలదు. వీరి కర్హభాషయందు వ్రాసిపంపుటను నేర్పుట 'ఎలిమెంటరీకోర్సు' అనెదరు.

౨ "Extended Course"—తరువాత నేర్చుకొనవలసినదానికి పేరు. దీనిని "Extended Assignments" అనియు ననుట కలదు. ఇదియు మొదటి పద్ధతిదే గాని "Higher problems" గూర్చియిందువ్రాయ నేర్పుదురు. ఇం దెక్కువగా వేర్వేఱు విషయ ములం గూర్చి ప్రత్యేకముగ చదువ వలసి

ఉండును. ఇందు వార్తలబంపుటకగు చిన్న చిన్న వ్రాతలు గాక, పెద్దవ్యాసములు గూడ వ్రాయ వలసియుండును. ఇంతటితో నాఁగక త్వరిత ముగఁ జదువుటయు, త్వరితముగ వ్రాయుట యుం గూడ నేర్చుకొనవలసి యుండును. ఇట్టి దీర్ఘ వ్యాసము పరీక్షకు లోనుగావలసియుండును. ఆపరీక్షకు "Copy-reading" అనియెదరు.

ఇందు విమర్శనము, తర్కించుట, పునర్లేఖ నము అను మూఁడుపనులు జరిగెడిని. ౧ ఇం దేమైన లోపము లున్నవా? యనియు, వచ్చిన భోగట్టా సంపూర్ణమైనదా? యనియు, ౩ రిపో ర్టరు అడుగవలసిన యన్నిప్రశ్నల నడిగెనా? యనియు, ౪ ప్రారంభపు పేరా బలమగు మాటలలో వ్రాయఁబడి చక్కఁగ నర్థమగు చున్నదా? యనియు, ౫ కడపేరా చక్కఁగా నచ్చఁజెప్పునట్లు వ్రాయఁబడినదా? యని యు, ౬ వ్రాయఁబడిన శబ్దజాలపుభాష తిన్న గను, స్పష్టార్థసంధాయకముగను, నధికపుమా టలు, అధికప్రసంగము లేకుండ వ్రాయఁబడి నదా, లేక యధికశబ్దములం గల్గి గాని, ఈడ్చు చున్నట్లు గాని, దూరాన్వయము గల్గి గాని యున్నదా? యనియు నిందు విమర్శనము జరు గవలయును. ఇం దేదియేని కుదురకున్న దానిం దర్కించుటయు, కుదురనితావులం దిద్ది సవరిం చుటయుఁ గాని, లేక తిరిగి వ్రాయించుటఁ గాని జరుగవలసియుండును. కేవలము తిప్పివేయంబ డుటకు "Creen"అని పేరిడియున్నారు.

ఇంక నీవ్యాసము పూర్తిచేయబడినతోడనే దీనికి "Heading" వ్రాయఁబడ వలయును. అది అర్థవంతమైనదిగను, లోపలిప్రధానాంశము లను స్ఫురింపఁ జేయునదిగను నుండునటుల వ్రాయ నేర్చుకొనవలయును. ఇది కొంతవఱకు కష్టసాధ్యముగనే యుండును.

3 Editing and Editorial writing-పిదప నేర్చుకొనఁదగినది ప్రధానవ్యాసములు వ్రాయునేర్పు. వీటినే సంపాదకీయము లనె దరు. ఇదియె ఈజర్నలిజమువిద్యయం దెక్కువ కఠినవిద్య. ఈయభ్యాసమునకు చరిత్రజ్ఞానము, రాజకీయజ్ఞానము, సైంటిఫిక్కు జ్ఞానము (Scientific Knowledge) జనసంఘముం గూర్చిన పద్ధతులవిజ్ఞానము (Sociology) ల పరిచయ జ్ఞానము లబ్బియుండ వలసియుం డును. ఏలయన నవి యనుదినము వ్రాతయం దవసరములై యుండును.

ఇత్తఱి విద్యార్థి స్వష్టార్థములు స్ఫురించు నటులను, అర్థమగు భాషలో క్లుప్తముగను వ్రాయ నభ్యసింప వలసియుండును. చేవ గలదేని Witt and humor వ్రాతల యందు పొందుపఱుప నేర్వవలసి యుండెడిని. ఇత్తఱినే Colonial policy of Japan, Future of China, Turn over in Turkey మొదలగునవి చక్కఁగ నెఱింగి వ్రాయవలసియుండును. నగటున చాల సంగ తుల నెఱింగినవాఁడుగ నాయత్తపఱుపఁ బడ వలసియుండును.

నిజముగ గతచరిత్రమును చక్కఁగా నెఱుం గనివారు భవిష్యత్తు నెఱుంగఁ జాలరనుసత్యమిట బ్రత్యక్ష మగుచుండును. "Vagaries of style, inaccuracies of statements, unsoundness of Principles" అను త్రిదోషములు లేకుండఁ గుదిరెనేని సంపాద కీయములు నిర్దుష్టములుగ నెంచఁబడును.

పిదప నేర్వం దగినది వార్తాపత్రికా నిర్వహణచరిత్ర. దీని నెఱుంగుట కనేకములగు నాదికాలపువార్తాపత్రికల నెఱింగి పరిశీలింపవలసి యుండును. క్రీ. శ. ౧౬౦౯ నాఁటి Leip-Zic relation (ఇది ప్రపంచమం దాదిని ముద్రింపఁబడిన వార్తాపత్రికగాఁ జెప్పఁ

బడినది), "News Letters" అనంబడిన పత్రిక యొక్క ప్రాత సంచికలు, Weekly Diurnal పత్రికయొక్క ప్రాత సంచికలు, London Gazette సంచికలు, Boston News Letters అనంబడిన పత్రిక ప్రాత సంచికలు Mercurius Politicus పత్రిక యొక్కయు, Mercurius Anticus పత్రికయొక్కయు ప్రాతసంచికలు, దీని కనుకూలించునవిగ పెక్కండ్రు యభిప్రాయము. ముఖ్యముగ నెఱుంగఁదగిన యంశములు Illustrations గూర్చియు, Typography గూర్చియు, General make-up గూర్చియు నై యున్నవి.

౪ Editorial management- ఇది నిజముగ పత్రికానిర్వహణ మని చెప్పఁదగి యుండును. ఇందే నాల్గుభేదములగుపనులనిర్వహించుకొనవలసి యుండును.

(౧) Editorial Policy-ఇది దూరదృష్టి గల్గి ఎక్కువ జాగ్రతతో నప్పటప్పట కుదుర్చుకొనుచుండఁదగినది. దేశకాల పాత్రతల నెఱింగినఁ గాని ఇది చక్కఁగా నిర్వహింపఁబడజాలదు.

(౨) Development of Public opennion-దీనిని జాగ్రతగా పరిశీలించు చుండవలయుం గాని తన కకు పట్టుదలలకు, తన గర్వాతిశయములకు, తావిచ్చి ప్రతిష్ఠలం గోల్పోవరాదు. ఇదియే పత్రికయం దామోదము గాని, విముఖత గాని గల్గించునది.

(౩) Organization—ఇది Editorial force (సంపాదకీయవర్గము)ను, Reportorial force ను అర్హులగువారిని కుదుర్చుకొని పత్రికయొక్క పోలసీమేరకు క్రమముగ పని నడుపుట. దీనికి అప్రమత్తత గల్గియుండుట అత్యవసరము.

(౪) Management of the concern as a whole- ఇది ఆర్థికపరిస్థితులు మొదగు వాటిని జూచుకొనుచు నడుపుట యని భావము. (వార్తాపత్రికానిర్వహణకల చూడుఁడు.)

**పదగండీర రోగము**-- ఆయుర్వేదవైద్యశాస్త్రమున శ్లీపదరోగమునకుఁ బేరు.

**పదాధ్వ**— పరమేశ్వరుని శబ్దతత్త్వము నుండి అకాశ మనంబడుచున్న భూతతత్త్వము కల్గెను. దానియందు సప్తకోటిమహామంత్రము లేర్పడెనని చెప్పఁబడినది. ఈ సప్తకోటిమహామంత్రములందు ముఖ్యపదము లెనుబదియొకటి వాడఁబడినవి. వాటికి సాముదాయికముగ "పదాధ్వ"యని పేరిడియున్నారు. ఆపదములు క్రింద వివరింపఁబడును.

౧ ఓం పదము ఒకేఅక్షరము. శివాత్మక పదము, ౨ వ్యోమవ్యాపినే అ॥ ౫ శివాత్మక పంచాంగవాచకపదము, ౩ వ్యోమరూపాయ అ॥ ౫ శివాత్మక పంచాంగవాచకపదము, ౪ సర్వవ్యాపినె అ॥ ౫ శివాత్మక పంచాంగ వాచకపదము, ౫ శివాయ అ॥ ౩ శివాత్మక పంచాంగవాచకపదము, ౬ అనంతాయ అ॥౪ అనంతవాచకపదము,౭ అనాథాయ అ॥౪సూక్ష్మ వాచకపదము,౮అనాశ్రితాయ అ॥ ౫, శివోత్తమవాచకపదము,౯ ధ్రువాయ అ॥౩ ఏకనేత్ర వాచకపదము,౧౦ శాశ్వతాయ అ॥౪ ఏకరుద్ర వాచకపదము, ౧౧ యోగపీఠసంస్థితాయ, అ॥ ౮ త్రిమూర్తివాచకపదము, ౧౨ నిత్యయోగినే, అ॥ ౫ శ్రీకంఠవాచకపదము, ౧౩ ధ్యానాహారాయ, అ॥ ౫ శిఖండివాచకపదము, ౧౪ ఓం నమ శ్శివాయ, అ॥ ౬ గాయత్రీవాచక పదము, ౧౫ సర్వప్రభవే, అ॥ ౫ సావిత్రీ వాచకపదము, ౧౬ శివాయ, అ॥ ౩ విద్యేశ వాచకపదము, ౧౭ ఈశానమూర్ధాయ, అ॥ ౬ పంచబ్రహ్మవాచకపదము, ౧౮ తత్పురుష

వక్త్రాయ, అ॥ ౭ పం॥ వా॥ ప॥ ౧౯ అఘోర హృదయాయ, అ॥ ౭ పం॥ వా॥ ప॥, ౨౦ వామదేవగుహ్యాయ, అ॥ ౭ పం॥ వా॥ ప॥, ౨౧ సద్యోజాతమూర్తయే అ॥ ౭ పం॥ వా॥ ప॥, ౨౨ ఓం నమో నమః, అ॥ ౫ చండవాచకపదము, ౨౩ గుహ్యాతిగుహ్యాయ, అ॥ ౬ హృదయవాచకపదము, ౨౪ గోప్త్రే అ॥ ౨ శిరోవాచకపదము, ౨౫ నిధనాయ అ॥ ౪ శిఖావాచక పదము, ౨౬ సర్వవిద్యాధిపాయ అ॥ ౭ కవచవాచకపదము, ౨౭ జ్యోతిరూపాయ అ॥ ౫ నేత్రవాచకపదము, ౨౮ పరాయ చండనాదాయ అ॥ ౮ అస్త్రవాచకపదము, ౨౯ చేతనాచేతనాయ అ॥ ౭ ఆసనాత్మకపరమేశ్వరవాచకపదము, ౩౦ వ్యోమవ్యోమ అ॥ ౪ ధర్మవాచకపదము, ౩౧ వ్యాపిన్ వ్యాపిన్ అ॥ ౪ జ్ఞానవాచకపదము, ౩౨ అరూపిన్ అరూపిన్ అ॥ ౬ వైరాగ్యవాచకపదము, ౩౩ ప్రథమప్రథమ అ॥ ౬ ఐశ్వర్యవాచక పదము, ౩౪ తేజస్తేజః అ॥ ౪ కర్ణికావాచకపదము, ౩౫ జ్యోతిర్జ్యోతిః అ॥ ౪ అనంతవాచక పదము, ౩౬ అరూప అ॥ ౩ ఊర్ధ్వఅధోదిక్కులందుగల కేసరసంబంధవాచకపదములు ౩౨, ౩౭ అనగ్ని అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౩౮ అధూమ అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౩౯ అభస్మ అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౦ అనాది అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౧ నానానా అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౨ ధూధూధూ అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౩ ఓంభూః అ॥ ౨ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౪ ఓంభువః అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౫ ఓంసువః అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౬ అనిధన అ॥ ౪ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౭ నిధన అ॥ ౩ ఊర్ధ్వ॥ కేసర॥ ॥ ప॥ ౩౨, ౪౮ నిధనోద్భవ అ॥ ౫ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౪౯ శివ అ॥ ౨ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౫౦ శర్వ అ॥ ౨ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౫౧ పరమాత్మ అ॥ ౪ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౫౨ మహేశ్వర అ॥ ౪ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౫౩ పరమేశ్వర అ॥ ౫ ఊర్ధ్వ॥ కేసర॥ వా॥ ప॥ ౩౨, ౫౪ మహాదేవ అ॥ ౪ సద్భావేశ్వరవాచకపదము, ౫౫ మహాతేజ అ॥ ౪ సద్భావేశ్వరవా॥ పదము,

౫౬. యోగాధిపతి, అ॥ ౫. సద్భావేశ్వరవాచకపదము, ౫౭. ముంచముంచ అ॥ ౪ సద్భావేశ్వరవాచకపదము, ౫౮. ప్రథమప్రథమ, అ॥ ౬ సద్భావేశ్వరవాచకపదము, ౫౯. శర్వశర్వ అ॥ ౪ సద్భా॥ వా॥ ప॥ ౬౦. భవభవ అ॥ ౪ స॥ వా॥ ప॥ ౬౧. భవోద్భవ అ॥ ౪ స॥ వా॥ ప॥ ౬౨. సర్వభూతసుఖప్రద అ॥ ౮ స॥ వా॥ ప॥ ౬౩. సర్వసాన్నిధ్యకర అ॥ ౭ స॥ వా॥ ప॥ ౬౪. బ్రహ్మవిష్ణురుద్రప్రద అ॥ ౮ స॥ వా॥ ప॥ ౬౫. అనర్చితానర్చితాయ అ॥ ౮ స॥ వా॥ ప॥ ౬౬. అసంస్థితాసంస్థితాయ అ॥ ౮ స॥ వా॥ ప॥ ౬౭. పూర్వస్థితపూర్వస్థిత అ॥ ౮ స॥ వా॥ ప॥ ౬౮ సాక్షిన్సాక్షిన్ అ॥ ౪ పత్రివాచకపదము. ౬౯. తురుతురు (ఇంద్ర) అ॥ ౪ అష్టదిక్పాలకవాచకపదము. ౭౦. పతంగపతంగ (అగ్ని) అ॥ ౬ అ॥ వా॥ ప॥ ౭౧. పింగపింగ (యమ) అ॥ ౪ అ॥ వా॥ ప॥ ౭౨ జ్ఞానజ్ఞాన (నిరృతి) అ॥ ౪ అ॥ వా॥ ప॥ ౭౩. శబ్దశబ్ద (వరుణ) అ॥ ౪ అ॥ వా॥ ప॥ ౭౪. సూక్ష్మసూక్ష్మ (వాయు) అ॥ ౪॥ అ॥ వా॥ ప॥ ౭౫. శివ (కుబేర) అ॥ ౨ అ॥ వా॥ ప॥ ౭౬. శర్వ (ఈశాన) అ॥ ౨ అ॥ వా॥ ప॥ ౭౭. సర్వదా అ॥ ౩ సర్వవిద్యాధిపవాచకపదము. ౭౮. ఓంనమోనమః అ॥ ౫ బ్రహ్మశిరోమృతవాచకపదము. ౭౯. ఓంశివాయ అ॥ ౪ రుద్రాణీవాచకపదము. ౮౦. నమోనమః అ॥ ౪ పాశుపత వాచకపదము. ౮౧ ఓం అ॥ ౧ వజ్రాదివాచకపదము.

ఇందు ౩౬ (అరూపశక్తి), ౩౭-౩౮-౩౯-౪౦-౪౧-౪౨ పదములు శివాగమోక్తపదము లనియు, ౪౩ (ఓంభూః) ౪౪-౪౫-౪౬-౪౭-౪౮-౪౯-౫౦-౫౧-౫౨-౫౩ పదములు పరమేశ్వరసంబంధ వాచకపదము లనియు చెప్పఁబడినవి. మఱియు ౩౬ (అరూపపదము) మొదలు ౬౭ (పూర్వస్థితపూర్వస్థితపదము) కడవఱకు ౩౨ పదములును ఊర్ధ్వాధోదిక్కులందు గల కేసరసంబంధ వాచకపదము లని చెప్పఁబడినవి.

**పదార్థము**— పదార్థ మన నైఘంటికముగ పదమునందలి యర్థ మని భావము. లోకమున వాడుకయందు పదార్థ మన ఏదేని యొకవస్తు వనిభావము. ఇంక నాయుర్వేద వైద్యశాస్త్రమున పదార్థమన ద్రవ్య (వస్తువు) గతమైన రసము (రుచి), గుణము (అది గల్గించుగుణము), వీర్యము (బలము), విపాకము, శక్తి ఈ యైదింటికిం బేరు. ఈ యైదు నొకవస్తువునందుఁ జేరియుండునవి. ఆవస్తువు భుజించుట మొదలగు నుపయోగములకతమున లోనికిం జేరి శరీరమునకుఁ గల్గించుగుణములు.

**పదార్థములు**— పదార్థ మన వస్తువు (పదముయొక్క అర్థము) అని యర్థము.

వైశేషికశాస్త్రమునందు పదార్థము లాఱు— ౧ ద్రవ్యము, ౨ గుణము, ౩ కర్మ, ౪ సామాన్యము, ౫ విశేషము, ౬ సమవాయము. మతాంతరమున వీటికి అభావమును జేర్చి సప్త పదార్థములని కొందఱు వాడియున్నారు.

న్యాయశాస్త్రమునందు షోడశ పదార్థములు— ౧ ప్రమాణము, ౨ ప్రమేయము, ౩ సంశయము, ౪ ప్రయోజనము, ౫ దృష్టాంతము, ౬ సిద్ధాంతము, ౭ అవయవము, ౮ తర్కము, ౯ నిర్ణయము, ౧౦ వాదము, ౧౧ జల్పము, ౧౨ వితండము, ౧౩ హేత్వాభాసము, ౧౪ ఛలము, ౧౫ జాతి, ౧౬ నిగ్రహస్థానము.

ఇందు ౧౫ వది యగు జాతి ౨౪ భేదములు కలది. ౧ సాధర్మ్యము, ౨ వైధర్మ్యము, ౩ ఉత్కర్షము, ౪ అపకర్షము, ౫ వర్ణ్యము, ౬ అవర్ణ్యము, ౭ వికల్పము, ౮ ప్రాప్తి, ౯ అప్రాప్తి, ౧౦ ఇతిసాధ్యత, ౧౧ ప్రసంగము, ౧౨ ప్రతిదృష్టాంతము, ౧౩ అనుత్పత్తి, ౧౪ సంశయము, ౧౫ అర్థాపత్తి, ౧౬ అవిశేషము, ౧౭ హేతువు, ౧౮ ప్రకరణము, ౧౯ కార్యము, ౨౦ ఉపలబ్ధి, ౨౧ అనుపలబ్ధి, ౨౨ నిత్యము, ౨౩ అనిత్యము.

మీమాంసమతమందలి ప్రభాకరపక్షమున పంచపదార్థములు— ౧ ద్రవ్యము, ౨ గుణము, ౩ కర్మము, ౪ సామాన్యము, ౫ పరతంత్రత. వీట్లను పంచపదార్థములందురు. మతాంతరమున వీట్లకు ౧ శక్తి, ౨ సాదృశ్యము, ౩ సంఖ్యలు నను మూఁటిని జేర్చి అష్టపదార్థములని మఱి కొంద ఱనిరి. వేదవ్యాసమతమున పదార్థములు రెండు— ౧ పురుష (ఆత్మ లేక ప్రాణి యని యర్థము. ఆత్మలు పరమాత్మపదార్థమే గాన ఇందు జీవాత్మ పరమాత్మలు చేరియున్న వని భావము), ౨ ప్రకృతి (ఇది లోకము. పాంచభౌతికములగులోకములన్నియు నిందే చేరియున్న వని తాత్పర్యము. ఇంతకన్న వేఱు వస్తువులు లేవని భావము.

పాతంజలి గురునివలన ఉద్ధరింపఁ బడిన (శ్వేత యోగి కర్త) సేశ్వర సాంఖ్యమున త్రిపదార్థములు

౧ ఈశ్వరుఁడు, ౨ ఆత్మ (ప్రాణి), ౩ ప్రకృతి. వీట్లయం దీశ్వరుఁడు ప్రకృతిసంబంధము కలుగుటచేఁ జలింపఁ డనియు, ఆత్మకు ప్రకృతిసంబంధము కల్గునంత సంసారవేదనల పాలగు ననియు, దానిని జయించుట కష్టాంగ యోగములు చెప్పఁబడినవి.

ద్వైతసిద్ధాంతమున-౧ ఆత్మ, ౨ పరమాత్మ, ౩ జడము (లోకము) నని త్రిపదార్థములు.

జైనమతసిద్ధాంతమున- ౧ఆత్మ, ౨పరమాత్మ (జినదేవుఁడు), ౩ లోకము, ౪ కాలము, ౫ వేధము, ౬ కర్మము ననునవి షట్పదార్థములు.

అర్హామతమున — ౧ జీవము (భోక్త), ౨ అజీవము (భోగ్యము జడపదార్థము), ౩ ఆస్రవము (శబ్దాది విషయములంగూర్చి శ్రోత్రాదీంద్రియములు పోవుట), ౪ సంవరము (ఇంద్రియ వ్యాపారమును దొంగిలింపఁ దగిన యమ నియమాది యోగములు మొదలగునవి), ౫ నిర్జరము (పాపపరిహారకరములుగ నీమత మునఁ జెప్పఁబడిన తప్తశిలారోహణాదికాయ శుద్ధి సాధనములు), ౬ బంధము (దీనినే కర్మ మనియెదరు), ౭ మోక్షము (కర్మపాశముల జయించి యూర్ధ్వగతి గల్గి నిర్వాణ మందుట) అనునీయేడును సప్తపదార్థములు.

శైవసిద్ధాంతమున- ౧ పశు(ఆత్మ), ౨ పతి (పరమాత్మ), ౩ పాశము (ప్రాణి పరమేశ్వరపదార్థ మయ్యు దానిని జేరకుండఁ జేయఁదగిన కర్మాదులగు నాటంకములు బంధరూపమున ప్రాణిని జుట్టుకొనియుంట పాశ మనంబడెను).

ఇంక లోకమున తక్కిన సర్వమును శివ పదార్థమే యగుట ప యందే చేరి యున్నవని యెఱుంగ వలయును.

విశిష్టాద్వైతసిద్ధాంతమున-౧ చిత్తు (ఆత్మ), ౨ అచిత్తు (జ్ఞానశూన్యమై వికారాస్పదమై యుండునది. దీని సంబంధమున చిత్తు (ఆత్మకు) అజ్ఞానమయ మయ్యెడిని) ౩ ఈశ్వరుఁడు(నిరస్త సంసార కళంకమును, నిఖిల మంగళాధారభూత మును, అనంతమును, సృష్టిస్థితిలయకర్తయును, శ్రీభూనీలాసహితుఁడును నగు పరమేశ్వరుఁడు).

సూక్ష్మశరీర సప్తదశ పదార్థములు :— ఆత్మబోధ ప్రకాశికయం దిట్లు చెప్పఁబడినది-

పంచప్రాణములు-ప్రాణము లైదు.
మనోబుద్ధులు-రెండు.
పంచజ్ఞానేంద్రియములు-ఐదు.
పంచకర్మేంద్రియములు-ఐదు.

**పదార్థ పరిణామము** (Matters Transformations)—భూమి, చంద్రుఁడు మొదలగు ఆకాశగోళము లేపదార్థముతో చేయఁబడినవో దాని నాంగ్లమున రసాయన శాస్త్రసంబంధమున"Matter"అని పరిభాషా పదము నిడివాడుచున్నారు. ఇంక పరిణామరూప ములనుTransformationఅనెదరుఅట్టిపదార్థ పరిణామరూపము లెనుబది యెన్మిది కన్గొనంబడి నవి. ఇంక నాల్గు కన్గొననగు సూచనలు కలవు గాని బయటఁ బడ లే దు గా వ ని ప్ప టి కి బయల్పడినవి యెనుబది యెన్మిదియే. (ఎలిమెంట్సు,గ్రూప్సుచూడుఁడు. ఆటోమిక్ నంబరు చూడుఁడు). ఈ ఎనుబది యెన్మిదింటియం దిఱువది సర్వసాధారణముగ నెల్ల రెఱింగి నవే. అవి ౧ Oxigen, ౨ Selicon, ౩ Aluminium, ౪ Iron, ౫ Calcium, ౬ Magnecium, ౭ Sodium, ౮ Potasium, ౯ Hydrogen, ౧౦ Titanium, ౧౧ Carbon, ౧౨ Chlorine, ౧౩ Bromine, ౧౪ Phosphorus, ౧౫ Sulphur, ౧౬ Borium, ౧౭ Manganese, ౧౮ Strontium, ౧౯ Nitrogen, ౨౦ Fluorine అనంబడునవి. వీటియం దాక్సిజెన్ దృశ్యజగత్పదార్థములం దర్ధభాగమువఱకు నుండు ననియు, ప్లూరైను నూటొక్కభాగమందలి దశాంశముగ నుండు ననియు, అంచనా వేయంబడి యున్నవి. శేషించిన యఱువదిఎన్మిదియుం గలిసి నూటొక్కభాగమందలి సగమై యుండు నందురు. ఈ భాగములయంచనాలెక్క భూమి యొక్క ఉపరిభాగమం దుండు నని చెప్పఁబడి

నది. అనఁగా భూ,జల,వాయువుల మూఁటి యం దని భావము. జీవజంతువులు వీటి నేదో రీతిని ఎంతయో కొంతగ నుపయో గించు కొనుచుండు నఁట. వాటియందు, Titanium చేరియుండదనియు,Aluminium Borium లేక Strontium లుండునో లేకుం డునో యనియు, పెక్కండ్రు రసాయన శాస్త్ర వేత్తల యభిప్రాయమై యున్నది.

బంగారము, వెండి, ప్లేటినమ్ అనంబడు లోహములకు "నోబుల్ ఎలిమెంట్సు" అనిపేరు. లీథియమ్, బేరీలియములకు చులకని (Light) ఎలిమెంట్సు అనిపేరు. తగరము, సీసము, జింకు లోహములు బరువగు(Heavy)ఎలిమెంట్సుగా చెప్పంబడినవి. Rubidium, Yttium, Molybdenum, Chromium, Osmium, Iridium అనునాఱు ఎలిమెంట్సు ఇతరలోహ ములందుఁ గలుపంబడుచు నుపయోగించుచు న్నవి. ఇవి చాల తక్కువగా లభించుచుంట పెక్కండ్రకు తెలియకున్నవి.

తరువాతికాలమునఁ గనిపెట్టఁబడిన Radio active metals అనంబడుచున్నవి నాల్గు కలవు. అవి Radium, Actinium, Thorium, Uranium మైయున్నవి. ఇవి యింకు మించ సాధ్యములుగ తలంపం బడుచున్నవి. పిదపఁ గేవల మసాధ్యములు కాకున్నను దుస్సాధ్యము లని చెప్పంబడు Helium, Neon, Argon, Krypton, Xenon, Niton అనంబడు ఆఱు ఎలిమెంట్సు ఇటీవలనే కొంచెముగ లభించినవి కలవు.

పిమ్మటఁ జెప్పఁ దగిన ఎలిమెంట్సు పదు నొకండు కలవు. అందు ముఖ్యములు Samarium, Europium, Yetterbium, Lutecium, Erbium అనంబడునవి. తక్కిన ఆఱుపేరు లంతప్రసిద్ధములు కానేలేదు. వీటిని Rare earths అని ఆంగ్ల రసాయన శాస్త్ర వేత్త లనుచుందురు. ఇవి చిరకాలమునుండి కొంచెము కొంచెముగాఁ గూడబెట్టఁబడుచు, చేర్పఁబడుచు, పెక్కుపరిశోధనస్థానము (Laboratories) లందు ఆయత్తపఱుపం బడుచు వచ్చుచుంట వీటిపేరులు బయటఁబడక దాగుడు మూఁతలాడుచున్న ట్లప్రసిద్ధములై యున్నవి. ఇవి బహుకష్టసాధ్యము లందురు. (ఎలిమెంట్సు చూడుఁడు.

**పదార్థము లేక వస్తువు (Matter), ప్రదేశము (Space)** — పదముయొక్క అర్థము పదార్థము. పద మనిన ఆవస్తువుయొక్క పేరు. అర్థమనిన ఆపే రేవస్తువుంగూర్చి దెలుపు చున్నదో ఆవస్తువు. దీని కాంగ్లరసాయనశాస్త్ర వేత్తలు Matter అనియెదరు. జగద్వస్తుసము దాయ మంతటిని వారు Matter అనియెదరు. ఒక సుప్రసిద్ధశాస్త్రవేత్త " As far as our earth is concerned electricity in one form or other has proved to be the sole material used by the creator in building up its fabric " అని వ్రాసియున్నాఁడు. ఇట్టిపదార్థము నిజతత్త్వమున ఎలక్ట్రోను లనంబడు పుద్గలములచే జేయం బడియే యున్నదఁట. ఇందువలన ఎలక్ట్రోను లను నాంగ్లపదమునకు పుద్గలములు లేక పర మాణువు లనియే యర్థముగాఁ జెప్పనయ్యెడిని. ఇట్టి జగద్వస్తుతతి కేదోరూపమున చలనమే లక్షణ మని చెప్పంబడినది. చలనమున కాంగ్ల రసాయనశాస్త్రవేత్తలు "Movement" అని పేరిడియున్నారు. ఇట్టిపదార్థవితతి,దానిలక్షణమగు చలనము నందుచుండుతావు కాళీప్రదేశముగ నుండవలయునని స్ఫురింపకపోదు. దాని కాంగ్ల రసాయనశాస్త్రమున "Space" అని పేరిడంబడి యున్నది. ఆస్పేసంతయు ఈథరువలన వ్యాపింప బడియున్నది. (ఈథరు చూ. చలనము చూ.)

**పదార్థము(వస్తుతత్త్వము)** Matter-తత్త్వదృష్టితో వస్తుపరిశీలన మొనర్చిన చైతన్య పదార్థలక్షణమే వస్తు వని తెలుచుండుట లోక విదితమే. అనఁగా ఇందువలన బాహ్యాకారమును ప్రదర్శించు ద్రవ్యము వస్తువు కా దనియుఁ దేలుచున్నది. తరువాతి తత్త్వదృష్టిమేరకు గుణము, లేక లక్షణమే వస్తు వగు నని చెప్పఁబడినది.

పుద్గల (త్రసరేణు లేక Atom) వాద సిద్ధాంతముమేరకు జగ మంతయు పరమాణువుల (Atoms) మయమై యున్న దనియుఁ జెప్పంబడినది. పరమాణుపిండము (ముద్ద) లకు వేర్వేఱు రూపములు గల్గుతఱి, వేర్వేఱు నామములు కల్గుచుండును. ఆరూపము భంగమగుచో నానామమునుగోల్పోవుచుండునని చెప్పఁబడినను జగత్పదార్థములు నామరూపతః మిథ్య యగుచున్నను వస్తుతః సత్యమని పెక్కు మతముల రొప్పుకొనిరి.

ఇది ఇట్లుండ పదార్థములకు ఘన (గట్టి) రూపమో, ద్రవరూపమో, వాయురూపమో గల్గియుండును గాని లేకుండ నుండ నేరదు. ఘన రూపమున నుండుతఱి పుద్గలము లొకటి కొకటి హత్తుకొనియుండును. ద్రవరూపముననుండుతఱి హత్తుకొని యుండక కూడికగ నుండియు,నవసర మగుచో వేఱగుటకు సంసిద్ధమై వస్తువులుగ నుండును. వాయురూపమున నుండుతఱి పుద్గలము లొకదానిబంధమునుండి వేఱొకటి సంపూర్ణవిముక్తి గల్గినవియై ఆవరణ ముండిననే తప్ప ఆవరణము లేకుండిన నెంతదూరముగనైన ఒకటి నుండి యొకటి దూరముగ పోవ నాయత్తమై యుండును.

క్రీ. వె. ౧౯—౨౪ సంవత్సరమున Luis de Broglie అను పేరుగల పరిశీలకుఁడు Atoms (పరమాణు)పదార్థములందు Vibration శక్తియు, Waves ను గల వనియు, నీ Vibration శక్తి ఆపరమాణుశక్తితో సమముగనే యుండు ననియు, పరమాణుశక్తియందు Electrons కలవనియు ఋజువు పఱిచెను.

**పదార్థానుసమయన్యాయము**-దీనిని జైమిని కాండానుసమయన్యాయమని వాడియున్నాఁడు. కొన్ని జాతుల వస్తువులను కొందఱకు పంచి ఈయవలసి యుండుతఱిఁ దొలుత నొక జాతివస్తువులను బంచిపెట్టియుఁ, బిదప మఱియొకజాతి వస్తువులను బంచిపెట్టియుఁ, బిదప వేఱొకజాతివస్తువులనుబంచిపెట్టియు, నిట్లన్నియు వరుసగసమముగనందఱకుపంచుటయనిభావము.

ఇంకను గొందఱు ఒక విధమగు కర్మల నొనర్చి, పైకార్యమొనర్చుటకర్హతనంది, పిదప పైకర్మ నొనర్చి, ఆపైకర్మకర్హతనొందుచు నిట్లే క్రమముగ కర్మల నొనర్చుచు నధికార మందుచుంట కీన్యాయమును వాడియున్నారు.

**పదిమందిలో పడినపామున కైనా కొంతవఱకు దిక్కుంటుంది**— ఆంధ్ర లోకోక్తి

**పదునాల్గు భువనములు** (చతుర్దశభువన (లోక) ములు చూ.)

**పదునెన్మిది పురాణములు**-అష్టాదశ పురాణములు. (పురాణములు చూ. పురాణ లక్షణములు చూ.)

**పదునెన్మిది విద్యలు**-అష్టాదశవిద్యలు (విద్యలు చూ.)

**పదుమూఁడవసంఖ్య**--ఉత్తరహిందూస్థానమున "తీన్, తేరా, నౌ,అఠారా నైహై" అనఁగా మూఁడు, పదుమూఁడు, తొమ్మిది, పదునెన్మిది సంఖ్యలు యోగ్యములు కావనియందురు. క్రైస్తవమతస్థులు ఏసుక్రీస్తు ఆఖరురాత్రి భోజనము పండ్రెండుగురు శిష్యులతోఁ గలిసి

పదుముగ్గురును భుజించిరనియు అది ద్రోహకర మయ్యెం గాన పదుమూఁడవసంఖ్య అశుభకర మనియు వచింతురు. తొలింటికాలమునుండియు ఇటలీదేశమునను, రష్యాదేశమునను, స్పానియాదేశమునను, పోర్చుగలు దేశమునను, మహమ్మదీయదేశమగు తురుష్క (టర్కీ) దేశమునను, పారశీ, ఆఫ్ఘను దేశములనుగూడ పదుమూఁడవసంఖ్యను అమాంగళ్యముగా నెంతురు. క్రైస్తవమతమునకుం బూర్వమే యాంగ్లభూమి యందు పండ్రెండు శుభకర మనియు, (ఏల యన పండ్రెండు సరి, బేసి సంఖ్యల రెండింటిచేతను భాగింపఁబడ నగును గాన అది శుభకర మని యెంచిరి) తర్వాతసంఖ్య పదుమూఁడు అశుభ ప్రదమనియు నెంచుచుండి రఁట.

**పద్మ లేక కంబువేదిక**— శిల్పశాస్త్రమున దేవాలయశిల్ప మనంబడు విమాననిర్మాణమునందుఁ జెప్పఁబడిన సప్తవేదికలలో నొకటి. (విమానలక్షణము చూడుఁడు.) ఈవేదికయందు పద్మములపంక్తిఁ జిత్రించి వాటి పైనను, కడను, జలజంతువులు, లతలు, నాచు మొదలగునవి చిత్రించిన నది ద్మవేదిక లేక కంబువేదిక యనంబడు ననియు, పురుషవిమానములం దీవేదికకు అష్ట వసువులును, స్త్రీ విమానములందు రుద్రుఁడును, మిశ్రవిమానములం దాకాశమును, సంకరవిమానములం దగ్నియు నధిదేవతలనియు, అన్నివిమానములందు పద్మవేదికయందు గౌతముఁడు ఋషి యనియుం జెప్పఁబడినది.

**పద్మకము చెట్టు (పుష్కరమూలము)**— సం. పద్మగంధకం, పద్మగంధి, పద్మతీర్థం, పద్మపత్రిం, పద్మపుష్కరజం, పుష్కరమూలమ్. తొల్లింట పుష్కరద్వీపము నుండి కల్గినది. కాన నీపేరు గల్గెనని యొకప్రతీతి బలముగ నున్నది. ఇప్పుడు కాశ్మీరదేశమున పెరుఁగుచున్నది. దీని కింకను పుష్కరబీజం, పుష్కరశిఫా, పుష్కరసాగరః అనుపేర్లు గాన నగుచున్నవి. పుష్కరాంఘ్రి యనియు, పుష్కరాద్య మనియు, పుష్కరాహ్వ మనియు, పుష్కరిణీ యనియు, పుష్కరహం అనియు వాడుకపేర్లు కలవు. యూనానీగ్రంథములందు "పుఖార్మూల్" అని వాడిరి.

ఇది దుంపగ నీదేశమున దొరకెడిని దీని చూర్ణము, రసము, లేక కషాయము చలవ, సమధాతువు చేసి బుద్ధిని బలబఱచు ననియు, స్త్రీలగర్భమును నిలిపి రక్షించు ననియు, అన్నమందు అహితవు, ఉబ్బుజాడ్యము, కఫవాతము, కామిల, కాస, క్రిమిరోగము, చర్మరోగములు, రక్తపైత్యము, విదాహము, విషదోషముల నిర్మూలించు ననియుఁ జెప్పఁబడినది. శ్లేష్మజ్వరములపై చక్కఁగ పనిచేయు నందురు.

**పద్మకాష్ఠవృక్షము**—దీనింగూర్చి యంతగా తెలియదు. ఇది హిమాలయోపరిభాగముల నుండు ననియు, దీనిచెక్క గంధముతీసి లోనికిచ్చిన స్త్రీల వంధ్యాదోషములు, మర్మావయవదోషములు నివారణ మగుననియుఁ జెప్పఁబడినది. ఇది కాయలు కాయుచెట్టు కాదందురు. దీని కింకను పద్మకం, పాటల, పుష్పవర్ణక, కేదరాజ, శుభపీతరక్త, హిమ యనుపేర్లు వాడుకయందుఁ గలవని తెలిసెడిని.

**పద్మకోశహస్తము**— (హస్తాభినయము చూడుఁడు. భరతశాస్త్రము చూడుఁడు).

**పద్మగిరి**— (శ్రావణబెలగొలము చూ)

**పద్మనాభద్వాదశి**-ఆశ్వయుజశుద్ధద్వాదశి. గోద్వాదశీవ్రత మొనర్చు వ్రతదినము. (పండుగలు చూ.)

**పద్మనాభవ్యూహము**—రామానుజీయ వైష్ణవ, చైతన్య వైష్ణవ మతధర్మము లందు

తదేకాత్మ రూప మహావిష్ణువు. అందు ద్వితీయ చతుర్వ్యూహములలో నొకటి యనియు, అనిరుద్ధ వ్యూహము లైదింటి లో నొకఁడుపవ్యూహ మనియు, వైభవ విలాసమూర్తి యని యు, వరుసగ శంఖ, పద్మ, చక్ర, గద లాయుధము లని యుఁ జెప్పఁబడినది.



(విష్ణుదేవాలయవిగ్రహములు చూడుఁడు.)

**పద్మనాయకులు**— వీరిని వెలమవా రనియు, రాచవెలమ లనియు నందురు. (వెలమ వారు చూడుఁడు).

**పద్మపత్రస్థితతోయన్యాయము**- తామ రాకుపై నీరు చల్లిన దాని నంట దని భావము. దేనికిని లోనుగాక అతిజాగ్రత్తగా నుండువారి కీన్యాయము వర్తించును. పుష్కరపలాశన్యా యముకూడ నిట్టియర్థము కలదియే.

**పద్మపాదాచార్యులు**— వీరు శంకర భగవత్పాదుల (శంకరాచార్యులవారి) శిష్యు లనియు, అద్వైతమత వ్యాపకు లనియు, తొలుత నహోబిల క్షేత్రమునుండి శంకరా చార్యులవారికడకు కాశికేగిన ఆంధ్రబ్రాహ్మణు లనియుఁ దెలియు చున్నది. శంకరాచార్యుల వారుతమకుగోవింద భగవత్పాదగురుండొసఁగిన కైలాస చంద్రమౌళీశ్వర శివలింగము, గణపతి విగ్రహము, శ్రీచక్రము, నవగ్రహయంత్రము, నృసింహ సాలగ్రామమును పద్మపాదాచార్యు నకే యొసంగి రని చెప్పఁబడినది. (శంకరాచా ర్యులు చూ.) పద్మపాదాచార్యులు విష్ణుదేవుని యవతారమని యీమతస్థులు వ్రాసిరి.

**పద్మపు (కాయ) తీఁగ**— దీనింగూర్చి, సరిగా తెలియదు. దీనికాయ గురుత్వము, అగ్ని మాంద్యము, అజీర్తి, విరేచనబద్ధము గల్గించు ననియు, దీనికిఁబరిహారము నఃవ్వులచెట్టు కాల్చిన క్షార మనియు నందురు.

**పద్మపురము**—బీరారులోని అమరావతికి సమీపమున చంద్రపురముకడ పద్మపుర ముం డిన దని మాలతీమాధవ నాటకమున ౧, ౪, ౯, అంకములందుఁ బ్రశంసింపఁబడినది. ఇది ప్రసిద్ధుఁ డగు మహాకవి భవభూతి జన్మ స్థానము.

పద్మపురమునకు పద్మావతీపుర మనియు, పద్మావత మనియుఁ గూడ వాడుక లుండెను. విదర్భదేశమున సింధు, పార్వతీనదుల సంగమ ముకడ నుండినట్లు మాలతీమాధవ చతుర్థాం కమునఁ జెప్పఁబడుటఁ జేసి నార్వార్ పురమునకు దిగువ నిరువదియైదు మైళ్ళ దూరమునఁ గల విద్యానగర మని పేరందిన విజయనగర మని పోల్చు చున్నారు. విద్యానగరము తర్క శాస్త్రము నేర్పు విద్యాస్థానములచే క్రీ.వె. ౭వ శతాబ్దమున పేరంది యుండెను. భవభూతియు నాకాలమునాఁటివాఁడే యనుచున్నారు.

బొంబై రాజధానిలోని కొల్హాపుర సంస్థాన రాజ్యమునకు కరవీరపురము (ఇప్పటి కొల్హా పూర్) నకును పద్మపుర మని యొకప్పుడు పేరుండె నఁట. అట పద్మవర్ణుఁ డనురాజు పాలించినకారణముననో, లేక తొల్లింట దాని నిర్మాత యగుటనో యీ పేరయ్యె నఁట.

కాశ్మీరదేశమున శ్రీనగరమున కాగ్నేయ దిశగా నాలుమైళ్ళ దూరమున జీలమ్‌నది కుత్తరతీరమున నొక పద్మపురము కలదు. అది కుంకుమపూవువిస్తారముపండుతావనిపేరందినది. ఇది క్రీ.వె. తొమ్మిదవ శతాబ్దమున కాశ్మీరదేశ మేలిన బృహస్పతి మేనమామ పద్మవర్మచే

నిర్మితమై, యాయన పేరఁ బరఁగునదిగఁ జెప్పఁబడిన పురము.

ఉజ్జయినీ పురమునకును పద్మావత మనిపే రుండెనని తెలియుచున్నది.

**పద్మపురాణము**— ఇది ఒక్క దేవీ భాగవతమున పదునాల్గవ పురాణముగఁ జెప్పఁబడినది, గాని తక్కిన అన్ని పురాణములందు రెండవదిగనే చెప్పఁబడిన పురాణము. పద్మగర్భ ప్రోక్తము. పద్మకల్పవివరణాదు లిందుఁ జెప్పఁబడినవి. గ్రంథసంఖ్య బ్రహ్మావైవర్త్యమున ౫౫౦౦౦ గను, తక్కిన అన్ని పురాణములందు ౫౫౦౦౦ గను జెప్పఁబడినది.

**పద్మ పూతిక (గడ్డి)**—ఈగడ్డి చూర్ణముగాని, కషాయముగాని, వేడిచేసి విషదోషము, అపస్మారము, పైత్యము వీట్ల నడంచి బలము గల్గించు నందురు.

**పద్మప్రభునాథుఁడు**—జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు.) వీరిచిహ్న మెఱ్ఱని కమలము. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రి ధరణినృపుఁడు. తల్లి సుసీమా దేవి. జన్మస్థలము కౌశాం రము. పొడవు ౨౫౦ ధనుస్సులు. (ధనుస్సు మూఁడున్నరమూర.) ఎఱ్ఱ రంగుకమలవర్ణము. ఆయుపు ముప్పది లక్షలు. గణధర్ సంఖ్య ౧౧౦. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. (శిఖరీజీ లేక అర్బుదపర్వతశిఖరము.) తొమ్మిదివేలకోట్ల సాగర్.

**పద్మరేఖ**— (పురుషసాముద్రికము చూ. స్త్రీసాముద్రికము చూ.)

**పద్మవ్యూహప్రదేశము**— భారతయుద్ధరంగమున అర్జునుని వధింప పద్మవ్యూహము పన్నినతావు. స్థానేశ్వరమున (కురుక్షేత్రమున) కాగ్నేయముగ నైదుమైళ్ళ దూరము. ౨౦౦౦ అడుగులు పొడవుగల మిట్టప్రదేశము. చుట్టుపట్ల భూమట్టము కన్న ముప్పది యడుగుల యెత్తుండు పీఠభూమి. ఇట అదితిదేవస్థానము కలదు. ఆమె యిచ్చటనే తప మొనర్చి యిచ్చటనే సూర్యునిఁ గనె నఁట. అభిమన్యుఁ డిటనే దొరకి మృతినందె నఁట. ఇక్కాలమున నిట ఆమీన్ అనుగ్రామము కలదు. అట నాదిత్యకుండ మనుపవిత్రతీర్థ మున్నది. చక్రవ్యూహస్థల మీప్రాంతమునందే కలదు.

**పద్మశాలీలు**— వీ రాంధ్రులుగ నున్నారు. సాధారణముగ వీరిని పట్టుశాలీలని వాడుచుండుటయుం గలదు. వీరు బట్టలనేత పరిశ్రమను వృత్తిగాఁ గల్గి యున్నారు. దక్షిణ దేశమున మధుర, రామనాథపురము జిల్లాలందలి సౌరాష్ట్రులం బోలియుందురు. కాని, వీరియందు తిరుమణి శ్రీచూర్ణధారులును, విభూతిధారులును గూడ కలరు. ఆరాధ్యులశిష్యు లగు లింగధారి శైవులు గూడ నచ్చటచ్చట గాననగుదురు.

వీరందఱు భృగుసంతతివారనియు,మార్కండేయగోత్రజు లనియు, పద్మశాలీ లనియు, బహూత్తము లనియు, సేనాపతు లనియు, కుల బిరుదములు గలవారు. ఇంకను పడమట,దక్షిణ దేశములందు శ్రేష్ఠి (శెట్టి) యను బిరుదమును గూడఁ గల్గియున్నారు. వీరి కులపెద్దకు తూర్పు సీమలందు "సేనాపతి" యనియు, పశ్చిమదక్షిణ సీమలందు "కులశ్రేష్ఠి, పెద్దశెట్టి, కులస్వామి" యనుచుందురు. వీరు శూద్రకులములలోని వారు కారు. ప్రత్యేక కులము.

నూలువడుకుట, బట్టలనేత వీరికి పవిత్రకుల ధర్మములు కాన, వీరియందు వేదాంతులు పడుగు "పరమాత్మ" యనియు, పేక "మాయ" యనియు సామెతగ వాడుచుందురు. ఇంకను కవ్వమాడని (పాఁడిలేని) యిల్లును, కదురు త్రిప్పనికాంతయు హీనతగ నెంచఁబడుదురఁట.

విష్ణుదేవుఁడు వీరికులమునకు భావమఱఁది యనియు, లక్ష్మీదేవి వీరియింటి యాఁడుపడు

చనియు, విష్ణుదేవుని నాభికమలపు (తామర) తంతువులను వీరి పూర్వుడగు భావనర్షి కొనంగ, నాయన దానిని వస్త్రములుగ నేయుట నాయనసంతతి యగు వీరికులమునకు "పద్మశాలీయు"లని పేరును, భావనర్షికి వైరియై యాయననుండి శివదత్తమగు వస్త్రనిర్మాణవిద్య నపహరించిన విశాలపురాధీశుఁ డగు కాళువాసురునితో నొనర్చిన సంగరమున నీయన సుతులు నూటొక్కరును సేనాధిపతు లై యుంట, వారి సంతతివారగు పద్మశాలీయులకు "సేనాపతి"యని కులబిరుదము గల్గె ననియు, వీరియందు బలమగు ప్రతీతి కలదు.

వీరి పూర్వచరిత్ర యిట్లుఁ జెప్పఁ బడినది. సృష్ట్యాదియందు బ్రహ్మమానస పుత్రులు– ౧ మరీచి, ౨ అత్రి, ౩ ఆంగిరసుఁడు, ౪ పులస్త్యుఁడు, ౫ పులహుఁడు, ౬ క్రతువు, ౭ భృగువు, ౮ వసిష్ఠుఁడు, ౯ దక్షుఁడు, వీరు నవబ్రహ్మలని పేరందిరి. అందు భృగువునకు (కర్దమప్రజాపతి ఏడవసుత యగు) ఖ్యాతి యనుభార్యయందు, ధాత, విధాత యని యిర్వురు సుతులు కల్గిరి. వీరిభార్యలు మేరుపుత్రికలగు ఆయాతి, నియతి యనువా రనియు, మహాలక్ష్మీదేవి (విష్ణుదేవుని భార్య) భృగుపుత్రిక యనియు వీరు తెల్పుచుందురు.

భృగుసుతుఁడగు ధాతకు (ఆయతియందు) మృకండుఁ డనుసుతుఁడు కలైను. ఆయన భోజపురనివాసి యనియు, ఆయనభార్య ముద్గలర్షి సుతయగు మనస్విని యనియు, వారిసుతుఁడు మార్కండేయుఁడునాఁ బరఁగె ననియు, ఆయన శివునిఁ గూర్చి గొప్పతపం బొనర్చి, చిరంజీవియై కపిలాచార్యునికడ వేదములం జదివి, త్రిజగత్సంచారిగ తిరుగుచుండువాఁ డనియు, బ్రహ్మమానసపుత్రు లగు భావనర్షి, పంచపుటర్షి యనువార లిర్వురు మార్కండేయకృత యాగాగ్నికుండమునుండి యుద్భవించి రనియు, వారిర్వురు సహజ యజ్ఞోపవీతధారులును, కనకకుండలధరులు ననియు, అందు పంచపుటి తపోనిష్ఠచే కాలము గడపె ననియు, రెండవ వాఁడగు భావనర్షి కనకాద్రిపుర నివాసి యనియు, విష్ణుదేవునినుండి పద్మతంతువులం గొని కృతయుగమునను, పిదప విష్ణుదత్తమగు ప్రత్తి విత్తులను నాఁటి, ప్రత్తి పండించి వాటి తంతువులచేతను వస్త్రములను నేయుచుండువాఁ డనియు, ఆవస్త్రనిర్మాణ మహామంత్రవిద్యను శివునివలన నుపదేశ మందె ననియు, ఆభావనర్షియె పార్వతివలన సంజీవనీకరణియు, శివునినుండి రథమును, మహాలక్ష్మీదేవినుండి యమృతమును,విష్ణుదేవునినుండిపద్మతంతువులు ప్రత్తివిత్తులునుగొనినవాఁడనియు,ఈయనభార్య సూర్యపుత్రిక యగు భద్రావతి యనియు, వారికి నూటొక్కసుతులు గల్గి రనియు, వారే ఈ పద్మశాలీల పూర్వులనియు, వీరిగ్రంథములందు చెప్పఁబడినది.

భావనర్షి శార్దూలధ్వజము కలవాఁడు. శార్దూలము నెక్కి తిరుగువాఁడు. శివునికి ధరింప పులిచర్మ మొసంగినవాఁడు. ఈయన చేతనే సృష్టింపఁబడి యీయనకు సేవకుఁడుగా నుండిన పాకనేనుఁడు ఈయనయాజ్ఞ మేరకు పులుల నరణ్యమున పెంచి పెద్ద కాపాడు చుండువాఁ డని చెప్పఁబడినది.

వీరి నివాసమగు కనకాద్రిపురమున వీరిచే నాటంబడిన ప్రత్తివిత్తు బ్రహ్మవిష్ణురుద్రాత్మక మని జెప్పఁబడినది. వీరి వైరి యగు విశాలపురాధీశుఁడగు కాళువాసురుని ఈయనయు, ఈయనతనయులును జయించిరి. వీరియిండ్ల వివాహములందు పందొమ్మిది తాంబూలము లర్పింతురు. అవి ౧ విఘ్నేశ్వరునకు, ౨ విరాట్స్వరూపునకు, ౩ బ్రహ్మవిష్ణుమహేశ్వరు

లకు, ౪ సరస్వతీలక్ష్మీపార్వతులకు, ౫ భృగువునకు, ౬ ధాతకు, మృకండర్షికి, ౭ మార్కండేయునకు, ౯ సూర్యచంద్రులకు, ౧౦ పంచపుటర్షికి, ౧౧ భావనర్షి, ౧౨ భద్రావతికి, ౧౩ సింహాచలవరాహనృసింహస్వామికి, ౧౪ గ్రామదేవతకు, ౧౫ జక్కా అప్పలసెట్టికి, ౧౬ సీరం గడ్డెన్న గారికి ౧౭ చింత క్రింది అనాథ శెట్టిగారికి, ౧౮ ఏబదియాఱు దేశములందుగల కులస్థులకు, ౧౯ పెండ్లియింటిపెద్దలకు.

**పద్మశిష్ట (పద్మశ్రేష్ఠ) కుల గోత్రము**—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

పద్మశిష్ఠ(పద్మశ్రేష్ఠ)కుల గోత్రము- ఏకార్షేయము ౨౦గోత్రము, సంస్కృత గోత్రము. మునిరాజసః మునిరాజగణము. ఆపస్తంబయజుశ్శాఖ, ప్రమా-ఆద్యప్రవరఖండ. సమానగోత్రము. చ్యవనస. బ్రహ్మేశుఁడు దేవత. భార్య సర్వాంబ. జగన్నాథము తపస్థానము. సర్వాంబుధి తటాకము. జపము వెయ్యి. దీపములు ౩౬. క్షేత్రసంఖ్య ౨౭. అన్నముదానము. తామర వర్జనీయము.

**పద్మానది**—గంగానది పశ్చిమశాఖ బ్రహ్మపుత్రానదియొక్క శాఖతో సంగమమై యేర్పడిననదికి పేరు. దీనికి పుద్దా యనియు పేరుకలదు.

**పద్మావతదేశము**—కరవీరపురము రాజధానిగ నుండిన దేశమున కీపే రుండినటులఁ దెలియుచున్నది.

**పద్మావతీపురము**—కరవీరపురము.కొల్హాపూర్. (శైలాహార దేశము చూడుఁడు).

**పద్మాసనము (బద్ధపద్మాసనము)**—యోగశాస్త్రమున చెప్పఁబడిన ఆసనములలో నొకటి. పద్మాసన మని చులకనగాఁ వాడుచుందురు గాని దీనికి శాస్త్రతః బద్ధపద్మాసన మని పేరు పెట్టఁబడియున్నది.

ఎడమతొడమీఁద కుడిపాదమును,కుడితొడమీఁద నెడమపాదమును ఉంచి, చేతులను వెనుకనుంచి వీపునంటి త్రిప్పి, కుడికాలి బొటనవ్రేలిని కుడిచేతి అంగుష్ఠ తర్జనుల చేతను, ఎడమకాలిబొటనవ్రేలిని ఎడమచేతి అంగుష్ఠతర్జనుల చేతను పట్టుకొని, గడ్డమును రొమ్మున కానించి, భ్రూమధ్యమున దృష్టుల నిల్పి, శరీరము వంగిపోక దృఢముగా నిలుచునటుల నుంచుట "బద్ధపద్మాసన"మని చెప్పఁబడినది. దీనికి సవ్యాపసవ్యపద్మాసన మనియు, లఘుపద్మాసన మనియు, రెండు అవాంతరభేదసంబంధాసనములు కలవు.

దీనియభ్యాసమున క్రమముగ శ్వాస మందగించుటయు, వృత్తి ఏకాగ్రత నొందుటయు, నిద్రాలస్యములు తగ్గి చురుకుదనము గల్గుటయు సిద్ధించునని చెప్పఁబడినది.

**పద్మిని (క్రియ)**—అరచేతిని క్రిందుగా (అధోముఖముగ) చేయి చాచుటకు పేరు. ఇది సంగీతశాస్త్రమున క్రియాప్రాణములోని దేశ్యక్రియ లెన్మిదివిధములలో నొకటి. (క్రియాప్రాణము చూడుఁడు).

**పద్యగానకళ**—పద్యములను రాగతాళములతోఁ జదువుకళ కీపేరు వర్తించెడిని. రాగతాళము లన్యోన్యసంబంధము గలవియని గానవిద్యావిశారదు లెఱుంగుదురు. రాగము తాళయుతమై యుండును. తాళము రాగమునందే యుండును. పద్యముల నేదోయొక విధమున రాగయుక్తముగఁ జదువుచుంట సర్వసాధారణమేకాని, లయయుక్తముగఁ గూడ నుంటఁ గానరాకున్నది. దీనికిం గారణమగు లోపము పద్యములను రచించు కవులయం దున్న దని స్ఫురింపకపోదు. రచించుతఱినే (పాటలయందు రాగముఁబోలి) తాళముంగూడ నేర్పఱుచుకొని లయమేరకు నడుచునట్లు పద్యరచనకుఁ గడంగుటకు

కవి రాగ తాళ ధర్మములం జక్కఁగ నెఱింగిన వాఁడుగఁగూడ నుండవలసి యుండును. ఇట్టివా రుండుటయే యరుదు.

శ్రీకృష్ణరాయాస్థాన దిగ్గజకవులలో నొకం డగు రామరాజభూషణ మహాకవి ఈప్రయత్న మును గొంతవఱ కొనర్చి, వసుచరిత్రపద్యము లలోఁ గొన్నింటి కీలక్షణంబులు గల్గించె నను ప్రతీతి యాంధ్రదేశమున వ్యాపించియుంటయే గాని, చదివి చూపువారు గానరారు. సాంగము గను, సాంతముగను నభ్యసించువారు లేమి నీవిద్య యడుగంటిన దేమో తెలియరాదు. విద్వాన్ ఆంధ్రభారతీతీర్థోపాధ్యాయ సత్యవోలు రాధామాధవకవిగా రనువా రొకరు ముప్పదియై దుతాళములకు (సప్తతాళములు ఐదేసి జాతు లచేత) వసుచరిత్రపద్యము లమరియున్న వనిరి. ఆంధ్రదేశ మీవిద్య న ద్ధి పఱచుకొను నని మాయాశయము.

వీట్లం బాడుటయందు పద్యములందలి కొన్ని యక్షరములను తాళమున కమరున ట్లధిక ముగ సాఁగదీసి పాడవలసియుండుట గన్పించె డిని. ఐనను మచ్చునకు రెండుపద్యములు చూపి ముప్పదియైదు తాళములను వివరింతుము గాక. (సంగీతము చూ. సంగీతాంగములు చూ.)

చదువరులు త్రిశ్రజాతికి మూఁడు, చతురశ్ర జాతికి నాలుగు, ఖండజాతికి ఐదు, మిశ్రజాతికి ఏడు, సంకీర్ణజాతికి తొమ్మిది మాత్రలు లఘు వున కనియు, ధృతమున కెప్పుడు రెండుమాత్ర లనియు, అనుధృతమున కొకమాత్ర యనియు, ఈసందర్భమున మనసునం దుంచుకొనఁదగినది. ఇంకను ఒకటవకాలమునం బాడుతఱి మాత్ర కొకటియు, రెండవకాలమున మాత్రకు రెం డును, మూఁడవకాలమున మాత్రకు నాల్గును అక్షరముల ప్రమాణమని చెప్పంబడినది. పద్య మం దక్షరములు తక్కువ యుండిన వాటిని సాఁగదీసి పాడుటయం దీ లెక్క కాలమును దెల్పెడిని.

మణితాళము-ధ్రువ. (|0||) త్రిశ్రజాతి. లఘు ౩ ధృత ౨ లఘు ౩ లఘు ౩ మొత్తము ౧౧ మాత్రలు. మూఁడవకాలము మాత్రకు ౪ చొ॥ ౪౪ అక్షరముల ప్రమాణము.

సీ॥ ఒకచాయ ననపాయ (౩ మాత్రలు)
పికగేయ సము (౨ మాత్రలు)
దాయ మొకసీమ నా (౩ మాత్రలు)
నామయూరనినద. (౩ మాత్రలు)
గీ॥ మొక్కమొగిన్క్రమోయ కదళీ (౩ మా.)
గృహోపపన్న (౨ మాత్రలు)
కిన్నరీబృంద (౩ మాత్రలు)
బృందసంగీతరీతి (౩ మాత్రలు)
(తక్కినచరణములును ఇట్లేనడుచుట).

౨ శ్రీకరతాళము- ధ్రువ (|00||) చతు శ్రజాతి లఘు, ౪ ధృత, ౨ లఘు ౪ లఘు ౪ మొతము ౧౪ మాత్రలు. రెండవకాలము మాత్రకు ౨చొ॥ ౨౮ అక్షరములప్రమాణము.

ఉ॥ ఆనగరాజ (౪ మాత్రలు)
భేదియును (౨ మాత్రలు)
నానగరాజము (౪ మాత్రలు)
నోరథంబుతో (౪ మాత్రలు)
(తక్కినచరణములును ఇట్లే నడుచుట).

ముప్పదియైదు తాళములు:—

౧ మణితాళము-ధ్రువ (|0||) త్రిశ్రజాతి. ఇందు లఘువు మూఁడు మాత్రలు, ధ్రుతము రెండు, లఘువు మూఁడు, తిరుగలఘువు మూఁడు మాత్రలు గాన౧౧ మాత్రలప్రమాణము. దీని నింకను (ఇదిమూఁడవ కాలమున పాడఁదగినది గాన) మాత్రకు నాల్గుచొప్పున నలువదినాల్గు అక్షరముల ప్రమాణమని చెప్పంబడినది. నిజ ముగపద్యముయొక్క చరణమునం దన్ని యక్షర ములు లేకున్నను, అట్లు సాఁగదీసి పాడిననే

ఆతాళమున కమరెడిని. దీని కమరిన వసుచరిత్ర లోని పద్యము "ఒక చాయనసపాయ" అను సీసపద్యము దాని నిదివఱకే వివరించితిమి.

౨ శ్రీ కరతాళము-ధ్రువ (|0||) చతుశ్ర జాతి. ఇందు ౪, ౨, ౪, ౪, మొత్తము పదు నాల్గు మాత్రలును (రెండవకాలమున పాడఁ దగినది గాన) మాత్రకు రెండుచొప్పున నిరు వదియెన్మి దక్షరముల ప్రమాణ మనియుఁ జెప్పంబడినది. దీని కమరిన వసుచరిత్రలోని పద్యము "ఆనగరాజభేదియును" అను మత్తల మాలాపద్యము దాని నిదివఱకే వివరించితిమి.

3 ప్రమాణతాళము-ధ్రువఖండజాతి. ఇందు పదునేడుమాత్రలు. (మూఁడవకాలము గాన మాత్రకు నాల్గుచొ॥ ౬౮ అక్షరముల ప్రమాణ మనియు, తాళాతీతముతో ప్రారంభ మనియుఁ జెప్పంబడినది. దీని కమరిన పద్యము "ఆరామా మణిమీఁది ప్రేమమున" అను శార్దూలవిక్రీడిత మఁట.

౪ పూర్ణతాళము-ధ్రువ. మిశ్రజాతి. ఇందు ఇరువది మూఁడు మాత్రలు. మొదటి చర ణము, రెండవచరణము రెండవ కాలమున పాడఁదగిన వనియు, గాన మాత్రకు రెండు చొప్పున ౪౬ అక్షరముల ప్రమాణ మనియు, మూఁడవ, నాల్గవచరణములు మూఁడవకాల మున పాడఁదగినవి గాన మాత్రకు నాల్గుచొ ప్పున ౯౨ అక్షరముల ప్రమాణ మనియు, అమరిన వసుచరిత్రపద్యము "నానాగాయనగా యనీమణుల" అను శార్దూలవిక్రీడిత మనియు జెప్పంబడినది.

౫. భువనతాళము-ధ్రువ. సంకీర్ణజాతి. ఇం దిరువదితొమ్మిది మాత్రలు. రెండవకాలమున పాడందగియుంట మాత్రకు రెండుచొప్పున ౫౮ అక్షరముల ప్రమాణ మనియు, ప్రారం భము తాళాతీతముతో ననియు, అమరిన పద్యము "కలికలు లేఁజిగుళ్ళునకంపు" అను చంపకమాలాపద్య మనియుఁ జెప్పంబడినది.

౬. సారతాళము-మఠిమ. (|0|) త్రిశ్ర జాతి. ఇందు ఎనిమిదిమాత్రలు. మూఁడవ కాల మున పాడఁదగియుంట మాత్రకు నాలుగుచొ ప్పున 3౨ అక్షరముల ప్రమాణ మనియు, అమరినపద్యము "లలితామోదలతావితాన" అను మత్తేభ మనియుం జెప్పంబడినది.

౭. సమతాళము-మఠిమ. చతుశ్రజాతి. ఇందు పది మాత్రలు. మూఁడవకాలమున పాడఁదగి యుంట మాత్రకు నాల్గుచొప్పున ౪౦ అక్షర ముల ప్రమాణ మనియు, అమరిన పద్యము "తలిరుప్రాయమువాని వలరాజు" అను సీసపద్య మనియుం జెప్పఁబడినది.

౮. ఉదయతాళము-మఠిమ. ఖండజాతి. ఇందు పండ్రెండు మాత్రలు. దీని ఒకటిరెండు చరణములు రెండవ కాలమున పాడవలసియుంట మాత్రకు రెండు చొప్పున ఇరువదినాల్గు అక్షరముల ప్రమాణ మనియు, మూఁడు నాల్గుచరణములు మూఁడవకాలమున పాడవలసియుంట మాత్రకు నాల్గుచొప్పున ౪౮ అక్షరముల ప్రమాణ మనియు, అమరినవసు చరిత్రలోని పద్యము "ఆరాజధాని కధిపతి" అను కందపద్య మనియుఁ జెప్పంబడినది.

౯. ఉదీర్ణతాళము- మఠిమ. మిశ్రజాతి. ఇందు పదునాఱు మాత్రలు. రెండవకాలమున పాడఁ దగియుంట మాత్రకు రెండుచొప్పున3౨ అక్షరముల ప్రమాణ మనియు, అమరినపద్యము "కమనీయాకృతి యోగ్యకీర్తనములన్" అను కందపద్య మనియుఁ జెప్పఁబడినది.

౧౦. రావతాళము- మఠిమ. సంకీర్ణజాతి. ఇందు ఇరువది మాత్రలు. రెండవకాలమున పాడఁదగియుంట మాత్రకు రెండుచొప్పున ౪౦ అక్షరముల ప్రమాణ మనియు, అమరిన

పద్యము "కాంబోలు నిది బాల కమనీయ" అను సీసపద్య మనియుఁ జెప్పంబడినది.

౧౧. చక్రితాళము-రూపక. (౦౧) త్రిశ్రి జాతి. దీనియం దైదుమాత్రలు. మూఁడవకాలమ్మున పాడఁదగియుంట మాత్రయందు నాల్గు అక్షరముల చొప్పున ఇరువది యక్షరముల ప్రమాణ మనియు, అమరినపద్యము "నరరాజ కన్యలును గిన్నరరాజ" అనుకందపద్యమనియు జెప్పంబడినది.

౧౨. పత్త్రితాళము-రూపక. చతుశ్ర జాతి. దీని కాఱు మాత్రలు. రెండవకాలమున పాడఁదగియుంట మాత్రకు రెండు ప్పు ౧౨ అక్షరముల ప్రమాణ మనియు, అమరిన పద్యము "వీనుల విందై యమృతపు" అను కందపద్య మనియుఁ జెప్పంబడినది.

౧౩. రాజతాళము-రూపక.ఖండ జాతి. ఇం దేడు మాత్రలు. రెండవ కాలమున పాడఁదగి యుంట మాత్రకు రెండు చొప్పున పదునాలుగక్షరముల ప్రమాణ మనియు, అమరిన పద్యము, "ఎఱువుగఁ జూడసాఁగె హరిణేక్షణ"అను చంపకమాలాపద్య మనియుఁ జెప్పంబడినది.

౧౪. కులతాళము - రూపక. మిశ్రజాతి. ఇందు తొమ్మిది మాత్రలు. మూఁడవకాలమున పాడఁదగియుంట మాత్రకు నాల్గుచొప్పున ౩౬ అక్షరములప్రమాణ మని యెఱుఁగునది. అమరినపద్యము."మాయాశీలురు చంచలాత్ములను కంపాశూన్య" యను శార్దూలవి క్రీడిత మనియు జెప్పంబడినది

౧౫. బిందుతాళము- రూపక. సంకీర్ణజాతి. ఇందు పదునొకండు మాత్రలు. మూఁడవకాలమున పాడఁదగి యుంటమాత్రకునాల్గుచొప్పున ౪౪ అక్షరముల ప్రమాణ మనియు, అమరిన పద్యము "పవమాన మానవప్లవమాన కైరవ". యను సీసపద్య మనియుం జెప్పంబడినది.

౧౬. కదంబతాళము-ఝంపె.(౧౮౦) త్రిశ్రతి. ఇం దాఱు మాత్రలు. మూఁడవకాలమున పాడఁదగియుంట మాత్రకు నాల్గు చొ॥ ఇఱువదినాలు గక్షరముల ప్రమాణ మనియు, అమరినపద్యము "బాలాపాణిగ్రహశుభ వేళా" యను కందపద్య మనియుఁ జెప్పంబడినది.

౧౭. మధురతాళము-ఝంపె.చతుశ్ర జాతి. ఇం దేడు మాత్రలు. రెండవకాలమునఁ బాడఁదగియుంట మాత్రకు రెండుచొప్పున ౧౪ అక్షరముల ప్రమాణమనియు, దీని కమరినపద్యము "వరవిహారధీరలగు సారసలోచన"అను ఉత్పలమాలాపద్య మనియుం జెప్పంబడినది.

౧౮. చణతాళము-ఝంపె. ఖండజాతి. ఇం దెన్మిది మాత్రలు, మూఁడవకాలమునఁ బాడఁదగినది గాన మాత్రకు నాల్గు చొప్పున ౩౨ అక్షరముల ప్రమాణ మనియు, అమరిన పద్యము "చ ప్పన్ నగి పల్కి" యను మత్తేభవిక్రీడితపద్య మనియుఁ జెప్పంబడినది.

౧౯. సురతాళము- ఝం మిశ్రజాతి. ఇందు పదిమాత్రలు. మూఁడవకాలమున పాడఁదగినది. గాన మాత్రకు నాల్గుచొప్పున నలువది అక్షరములకాల మనియు, దీని కమరిన పద్యము "తనకప్పు నెఱిగొప్పనను బూని" అను సీసపద్య మనియుఁ జెప్పంబడినది.

౨౦. కరతాళము- ఝం సంకీర్ణజాతి. ఇందుపండ్రెండుమాత్రలు. మూఁడవకాలమునఁ బాడదగియుంట మాత్రకు నాల్గుచొప్పున ౪౮ అక్షరములకాల మనియు, దీని కమరినపద్యము 'లలనాజనాపాంగవలనావన దనంగ" యను సీసపద్య మనియుఁ జెప్పంబడినది

౨౧. శంఖతాళము- త్రిపుట.త్రిశ్రజాతి.ఇం దేడు మాత్రలు. రెండవకాలమునఁ బాడఁదగియుంట మాత్రకు రెండుచొప్పున పదునాలుగక్షరముల ప్రమాణ మనియు, అమరిన

పద్యము "అని యనుపన్ వినోదసఖుం డచ్చటి" యనుచంపకమాలాపద్యమని యుం జెప్పంబడినది.

౨౨. ఆదితాళము-త్రిపుట.(100) చతుర్శ్ర జాతి. ఇం దెన్మిదిమాత్రలు. మూండవకాలమున పాడందగినది గాన,మాత్రకు నాల్గుచొప్పున ౩౨ అక్షరముల ప్రమాణ మనియు, దీని కమరిన పద్యము "నాళీకాకరతీరసారకదళీనారంగ" అను శార్దూలవిక్రీడితపద్య మనియుం జెప్పం బడినది.

౨౩. దుష్కరతాళము-త్రిపుట. ఖండజాతి. ఇందు తొమ్మిదిమాత్రలు. మూండవకాలమునం బాడందగిన దగుట మాత్రకు నాల్గుచొప్పున ౩౬ అక్షరముల ప్రమాణ మనియు, అమరిన పద్యము, "నానాసూనవితానవాసనల నానం దించు" అను శార్దూలవిక్రీడితపద్య మనియుం జెప్పంబడినది.

౨౪. లీలతాళము- త్రిపుట. మిశ్రజాతి. ఇందు పదునొకండు మాత్రలు. మూండవ కాలమునం బాడందగిన దగుట మాత్రకు నాల్గు చొప్పున ౪౪ అక్షరముల ప్రమాణ మనియు, దీని కమరినపద్యము "అరిగాం బం చమ మేవగించి నవలా" అను మత్తేభ విక్రీడిత పద్య మనియుం జెప్పంబడినది.

౨౫. భోగతాళము- త్రిపుట. సంకీర్ణజాతి. దీనియందు పదమూండుమాత్రలు. ఇందు మొద టిచరణ మొకటవ కాలమున పాడవలసియుంట మాత్రి కొకటి చొప్పున పదుమూం డక్షరము లును, రెండు, మూండు, నాల్గు చరణములు రెండవ కాలమున పాడవలసి యుంట మాత్రకు రెండుచొ॥ ఇరువదియా అక్షరములును, మొత్త ము ఈపద్యమునకు ౩౯ అక్షరముల ప్రమాణ మనియు, దీని కమరినపద్యము "గిరియును, గిరిజామాతయు" నను కందపద్య మనియుం జెప్పంబడినది.

౨౬. గుప్తతాళము-అట. (1100) త్రిశ్ర జాతి. ఇందు పదిమాత్రలు. మూండవకాలమున పాడందగియుంట మాత్రకు నాల్గుచొప్పున నలు వదియక్షరముల ప్రమాణ మనియు,దీనికమరిన పద్యము "మెఱుం గొప్ప నెఱిగొప్ప నెఱగప్ప తఱిం గప్ప" అను సీసపద్య మనియుం జెప్పం బడినది.

౨౭. లేఖతాళము-అట.చతుర్శ్రజాతి. ఇందు పండ్రెండుమాత్రలు. మూండవకాలమునం బాడ దగినది గాన మాత్రకు నాల్గు చొప్పున ౪౮ అక్షరముల ప్రమాణ మనియు, దీని కమరిన పద్యము "ఏపారుపొదరిండ్ల నాపాటలాశోక" యను సీసపద్య మనియుం జెప్పంబడినది.

౨౮. విదళతాళము-అట. ఖండజాతి.ఇందు పదునాల్గుమాత్రలు. రెండవకాలముననిది పాడం దగియుండుటను మాత్రకు రెండుచొప్పున ౨౮ అక్షరముల ప్రమాణ మనియు, నీతాళమున కమరినపద్యము "సారసకైరవంబులకుం జంద్రది నేంద్ర"అను నుత్పలమాలా పద్య మనియుం జెప్పంబడినది.

౨౯. లోయతాళము - అట. మిశ్రజాతి. ఇందు పదునెన్మిది మాత్రలు. రెండవకాలమున నిది పాడందగియుంట మాత్రకు రెండుచొప్పున ముప్పదియా అక్షరముల ప్రమాణ మనియు, దీని కమరినపద్యము "రాజీవాక్షుల నేచుపాత కివి చంద్రా!" యను శార్దూలవిక్రీడిత పద్య మనియుం జెప్పంబడినది.

౩౦. ధీరతాళము- అట. సంకీర్ణజాతి. ఇం దిరువదిరెండు మాత్రలు. ఇది రెండవకాలమునం బాడందగినది గాన మాత్రకు రెండు చొప్పున నలువదినాల్గు మాత్రలనియు, దీని కమరిన పద్యము "ఇమ్ములై మరుహజారమ్ములై పొద లుండ"అను సీస మనియుం జెప్పంబడినది.

౩౧. సుధతాళము- ఏక. (1) త్రిశ్ర జాతి.

ఇందు(లఘువు) మూఁడు మాత్రలు. మూఁడవ కాలమునఁ బాడఁదగియుంట మాత్రకు మూఁడు చొప్పున తొమ్మిదక్షరముల ప్రమాణ మనియు, అమరినపద్యము "లలనామణు లవు అను కందపద్యమనియుం జెప్పంబడినది.

3౨. మానతాళము- ఏక. చతుశ్ర జాతి. ఇందు నాల్గుమాత్రలు. మూఁడవకాలమునఁ బాడఁదగియుంట మాత్రకు నాల్గుచొప్పున ౧౨ అక్షరముల ప్రమాణ మనియు, దీని కమరిన పద్యము "అజాబిల్లివెలుంగు" అను శార్దూల విక్రీడితవృత్త మనియుఁ జెప్పంబడినది.

33. రతతాళము-ఏక. ఖండజాతి. ఇం దైదు మాత్రలు. రెండవ కాలము గాన మాత్రకు రెండు మాత్రల చొప్పున పది అక్షరముల ప్రమాణకాల మనియు, దీని కమరినపద్యము "ఓరఁ గయిు్రవాలు నన మేరువుల" అను లయ గ్రాహిపద్య మనియుం జెప్పఁబడినది.

3౪. రాగతాళము- ఏక. మిశ్రజాతి. ఇం దేడు మాత్రలు. రెండవకాలమునఁ బాడఁదగి యుంట మాత్రకు రెండుచొప్పున పదునాలు గక్షరముల ప్రమాణ మనియు, దీని కమరిన పద్యము "తరువులపొంత పొంచి వసుధావర మిత్రుఁడు" అను చంపకమాలాపద్య మనియుం జెప్పఁబడినది.

3౫. వసుతాళము-ఏక. సంకీర్ణజాతి. ఇందు తొమ్మిదిమాత్రలు. మూఁడవకాలమునఁ పాడఁ దగియుంట మాత్రకు నాల్గు చొ॥ ముప్పదియా అక్షరముల ప్రమాణకాల మనియు. దీని కమరిన (వసుచరిత్ర) పద్యము "కమనీయ ద్యుతిధామమా విమలముక్తాదామమా" యను మత్తేభవిక్రీడితపద్య మనియుఁ జెప్పంబడినది.

వచనము సైత మిట్లే తానమునకుఁ గుదురు నని కొందఱనుచున్నారు.

**పనసచెట్టు**—లా. Artocarpus integrifolia. ఆంగ్ల. Jack fruit tree. సం. కంటకఫలః, మృదంగఫలః, సురజఫలః

పనస పెద్దపనస యనియు, చిన్నపనస యనియు, వేరుపనస యనియు త్రివిధము. పెద్ద పనసయందు కజ్జాపనస యనియు, బురదపనస యనియు తిరుగ ద్వివిధము. చిన్న పనసకు సదా పనస యనియు, ఆంగ్లమున Bread fruit అనియు, సీమపనసయనియు పేర్లుకలవు. ఇందు అంతర్జాతిభేదములు సరావు.

కజ్జ పనస-దీనితొనల రుచిభేదములచే పలు భేదములుగల జాతులు గలవందురు గాని, స్పష్ట పడుట లేదు. పండ్లు పెద్దవిగను, చిన్నవిగను గూడ నుండుట కలదు. ఇది ఉత్తమజాతిగ నెన్నఁబడు చున్నది.

బురదపనస-ఇది పండు పక్వముకువచ్చుతఱి తొనలు బురదవలె నగును, గాని తిన వీలగు నట్లు నిలిచియుండవు. కాన, దీని కీపేరు గల్గెను. దీనిని పండ్లకుఁగాక కూరకుఁగాను తఱచు నుప యోగించు చుందురు. దీని నధమపుజాతిగ నెంచుదురు.

చిన్న పనస- దీనిని సదాపనస యనియు, సీమపనస యనియు నందురు. ఇది గుత్తులు గుత్తులుగ చిన్న కాయల నెక్కువగా కాచెడిని. ఇది త్రిదోషహార మందురు. తఱచు దీనిని కూరకే యుపయోగింతురు. ఇది పనసయందు కూరకు మృదువగు జాతిగ నెన్నఁబడు చున్నది.

వేఱుపనస-ఇది చెట్టుకొమ్మలందు కాయలు కాచుటకు మాఱుగ భూమిలోఁ గాని, భూమి నంటి గాని, వేఱునంటి కాయలు కాచును. ఈ పండుతొనలు చాల రుచిగా నుండును గాన, అత్యుత్తమజాతిగా నెంచుదురు. ఇది చాల యరుదుగ గాననగుట అపురూపపు పనసజాతిగ నెంచుదురు.

పనసజాతి లేతవయస్సున కొమ్మలకడను కాయలు కాచుచు, చెట్టు ముదిరినకొలఁది వల ముగల కొమ్మలందుఁ గాయ నారంభించి, వార్ధక్యదశయందు మ్రానుకడ కాయలు కాచులక్షణము గలది. కాపుస్థితి, స్థలము వీట్లనుబట్టి పనసచెట్టుయొక్క వయస్సు నిర్ణయింప నగును. పనసకాయ, పనసపండు, చాల అపథ్యమనియు, "పనస ప్రాతరోగములు బయటపెట్టు" నని సామెతగను చెప్పుదురు.

పనసపండునందు, అనఁగా తొనలందు పైత్యశాంతి, దేహపుష్టి, శుక్లవృద్ధి, బలము గలిగించి మలమును వెడలించుశక్తి కలదు. ఇవి శరీరరక్తము నభివృద్ధిపఱచి, నరములకు త్రాణ గల్గించును. కాని, పనసగింజలు, పైత్యోద్రేకము గల్గించి అజీర్తి, అండవృద్ధి, శీతపైత్యముల కుద్రేకము గల్గఁజేసి కడుపునొప్పి, విదాహము, జ్వరదోషములు గల్గించెడిని. ఈదోషములకు నూనె, నెయ్యి, అరఁటిపండ్లు పరిహారములని చెప్పఁబడినది. కొందఱు పనసగింజలను నేత్రిలో వేయించుట దోషపరిహార మందురు. మఱికొందఱు చింతపండుపులుసు దోషపరిహార మందురు.

**పనసా లేక పనసికారోగము**— ఆయుర్వేదవైద్య శాస్త్రమున చెవియందలి క్షుద్రరోగమునకు పేరు.

**పనసోదుంబరాదిఫలన్యాయము**— పనసచెట్టు, బొడ్డచెట్టు పూయకయే కాచును. మధ్యావస్థ లేకయే తర్వాతి యవస్థ కేగుటను దెల్ప నీన్యాయము వాడుచుందురు

**పనామాకాలువ**—మధ్యఅమెరికా పనామాభూసంధిగుండా కరేబియన్ సముద్రము నుండి పసిఫిక్కు మహాసముద్రమునకుఁ ద్రవ్వఁబడిన కాల్వ.

తొలుత ఫ్రెంచివారు దీనిని ద్రవ్వింపఁదలఁచి లెసెప్సిఇంజనీయరును నియమించిరికాని ఆపని వ్యర్థ మాయెను. క్రీ. వె. ౧౯౦౪ లో అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమీమహాకుల్యంగొని పనామాశాంపెనీ నేర్పఱచి పని మొదలిడెను. అనఁగా కాల్వకు జాగాకూడ విలువనిచ్చి కొనియెను. ఇట్లు కొనినప్రదేశము పది మైళ్ళ వెడలుపని చెప్పఁబడినది. దీనికి "Cannal Zone" అని పేరిడియున్నారు. దీనిమధ్య నొకసరస్సు కలదు. దానికి నీ రొకనదినుండి తెచ్చియున్నారు. ఈకాల్వయందు లాకులు కలవు. సరస్సు ముప్పదిమైళ్ళుండును. పనామాభూసంది 70 మైళ్ళుండును. క్రీ. వె. ౧౯౧౪ లో కాల్వ తెఱువఁ బడినది. పనామాపట్టణమును కాల్వముఖముననే కలదు. ఇట నినుపదారి సంబంధ మేర్పఱచి యున్నారు. పెద్ద సముద్రపు టోడ లిందు నడిచెడిని.

**పన్నా సంస్థానము (పున్నాసంస్థానము)**— సెంట్రలిండియా ఏజన్సీరాజ్యముల లోని యొక చిన్న రక్షితసంస్థానము. ఇది వజ్రములకు పేరందిన రాజ్యము.

**పనిలేనిమంగలిపిల్లితలగొరిగినట్లు**- ఆంధ్రలోకోక్తి.

**పన్నీరు**—పన్నీరనాదిగ భరతదేశము నందుఁ జేయఁబడు చుండినది. కొందఱు ముసల్మానుల పరిపాలనకాలమున గులాబీచెట్లు రప్పింపఁబడిన వనియు, నాఁటినుండి పన్నీరు పరిశ్రమ మనదేశమున నారంభమయ్యె ననియు పొరపాటున తలంతురు. ఇది సరి కాదు. హిమవన్నగోపరిప్రదేశముల నమితముగ గులాబీచెటడవి చెట్లై పెరుగుచుంటయు, "పన్నీర"శబ్దము సంస్కృతపదమై యుంటయుఁ దెలియక యెట్లు తలంచినను దలంపనగును గాని నిజముగ నిది యట్లు గాదు.

ఇప్పటికిని గులాబీతోఁట లధికముగాఁ గల

ఉత్తర హిందూస్థానపు నగరములలోఁ గొన్నిటి యందు పన్నీరుపరిశ్రమ కలదు. లోఁతగుపెద్ద యిత్తడిపళ్లెములకు తగరపుపూఁతబోసి, సగము వఱకు నీరు నింపి,అందుగులాబిపువ్వులంబోర్లించి మూఁత లిడి, ఆఱు గంటలసే పుంతురు. పిదప వాటినిఁ దీసివైచి, కోడియీకలతో నానీటపైఁ దేఱిన జిడ్డు నూడ్చి, బరిణలం దిడుకొందురు. ఇట్లు కొన్ని పర్యాయము లగువఱకు నానీరు పరిమళయుతమగు పన్నీ రగును. ఆబరిణలలోనిది అత్తరు వగును.తురకలట్టియత్తరువును స్తంబూల్ గులాబీ యందురు. ఏల యన స్తంబూల్నగరము (Constantinople) నుండి యిట్టియత్తరువుముద్ద మనదేశమునకు పంపఁబడు చున్నది.

పన్నీరులు మొగలి మొదలగు ననేకజాతుల పూవులతోఁ జేయుదురు. ఇక్కాలమున Otto of Roses మొదలగు నవియు, లవండరును నీటఁ గల్పి కక్కుర్తిపన్నీరులు తయారు జేయుదురు. కాని, యవి యట్లే యుండఁదగుఁ గాక. పన్నీరు పరిమళమునకె వాడఁబడు చుండును. చలవజేసి సభయందు మనోహరమై యుండును. చెమట పట్టనీయదు. వాయుదోషములు దీని పరిమళముచే నడఁగఁ జేయుదురు.

**పన్నులు-రేట్లు** (Taxes & Rates)- ఈరెండును ఒకేరీతిని స్ఫురించునుగాని, నిజస్థితి యందు భేదము కలదు. దేశమున కంతకును విధాయకములగు పనులనిమిత్తము ప్రభుత్వము వారియేర్పాటుక్రింద విధింపఁ బడునట్టి భూమి పన్ను, ఆదాయముపన్ను మొదలగునవి పన్నులు (Taxes).

ఆయా ప్రదేశముల అవసరములకుఁగాను ఆయాప్రదేశసంస్థలగు మ్యునిసిపాలిటీలు, జిల్లా, తాలూకా, లోకల్ ఫండు బోర్డులు మున్నగు (Local bodies) వార్ల కర్చులకుఁగాను ఆయా అధికారులచే విధింపఁ బడునవి రేట్లు (Rates). ఇట్టిపేర్ల వాడుక ముఖ్యముగా నాంగ్లసీమలందుః గలదు.

**పబ్లికు కంపెనీ** (Public Company)- వాణిజ్యపరిభాషాపదము. బహిరంగముగ నెవ్వరైనను వాటాలను కొన విలుండున ట్లేర్పాటైన కంపెనీ. ఇందలి వాటాలను ఒకరి అనుమతి లేకుండ వా రమ్ముకొనుటకును, ఎవరైనను కొనుటకును వీలుగ నుండెడిని.

**పయస్వినీ నది**- ఇది చిత్రకూటము (రామగిర్యాశ్రమము) నందు, బుందేల్ ఖండ మునఁగల నది. దీనిప్రశంస వామనపురాణము ౧౩ నందు, ౩౬ నందుఁ గలదు. (చిత్రకూటము చూ.)

**పయోముఖవిషకుంభన్యాయము**- దీనిని విషకుంభపయోముఖన్యాయ మనియు నందురు. క్షీరములు పైకిఁగన్పించువిషపుపాత్రయని యరము.

చక్కని కబుర్లుజెప్పు దుర్మార్గుని తెల్పుటకీన్యాయము వుచుందురు.

**పయోశ్వినీనది (పూర్ణానది)**--(క్రొత్త కౌశికానది చూడుఁడు.)

**పయోష్ణీనది** — మధ్యరాష్ట్రములలోని పైన్గంగ యని పిలువంబడుచున్న నదికి తొల్లింటి పేరు. పయోష్ణి భాగవతము ౫-౧౯-౧౭ యందునను, పద్మపురాణము ఉత్తర ౬౧ యందునను, మత్స్యపురాణము ౨౨ - ౩౩ యందునను ప్రశంసింపఁబడినది.

ఇంకను తపతీనదిలో సంగమించు పూర్ణానదిగ మహాభారతము, వనపర్వము ౧౧౯వలన తోఁచెడిని. (విదర్భానది చూ.)

**పరకాయప్రవేశవిద్య** — ఇది భరత దేశమున తొల్లింట ప్రచారమునం దుండిన కల. యోగాభ్యాసవిధానశక్తిచే ప్రాణమును

తనశరీరమునుండి పైకిఁదీసి వేఱు శరీరమునఁ జొప్పించి ప్రాణము లేకుండిన యాశరీరమును జీవించియున్నట్లు నటింపఁజేయు విద్య.

దీని నాంగ్లమున 'Transmigration' అని యెదరు. ఈవిద్యలో శంకరాచార్యులకు సిద్ధి కలదు. అమరుకకావ్యోత్పత్తి కథనము దీని కుపోద్బలకమై యున్నది.

**పరకాయప్రవేశసిద్ధి**—(అంజనాద్యష్ట సిద్ధులు చూడుఁడు.)

**పరతంత్రం బహిర్మన ఇతిన్యాయము**—మనస్సు బహిర్మన మనియు, అంతర్మన మనియు ద్వివిధము.

బహిర్మనము-లౌక్య కార్యములం దుపయోగింతురు. అనఁగా నౌకరియొద్ద సేవకావృత్తి యందుఁ గుదురుతటే వారికార్యములందు మనస్సున బాధ్యత గల్గియుండుట. మఱియొకరికడ నుండుతటే వారికార్యముల కనుకూలుఁడై వారి విశ్వాసము గోరియుండుట మొదలగు మార్పుల కాస్పదమగు మనస్సుయొక్క వృత్తిగల్గిన మనము.

అంతర్మనము-తన స్వాధీనమైయుండి తాను నమ్మిన మతధర్మములందు భక్తిమొదలగు వాటి యందు వ్యాపించునది. ఇందు బహిర్మనము పరతంత్రతకు లోఁబడి యుండునని భావము.

**పరపతిసంఘములు**— వీని నాంగ్లమున "కో ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ" లని యందురు. కో ఆపరేటివు వత్సరము జూలై మాసాదినుండియు ప్రారంభమై జూన్ మాసముతో నంతమగు చుండునట్లు ప్రభుత్వమువా రేర్పఱచియున్నారు. ఇవి పేదసాదల కుపయోగించున ట్లేర్పఱుపఁ బడినవిగ తొలుత శాసన నిర్మాతల తలంపై యుండెను.

వ్యవసాయ ప్రదేశములందు విత్తనములు, ఎరువులు మొదలగునవి చిల్లరగ వేర్వేఱు మనుష్యులుకొనుటకన్న అందఱకొఱకు నీసంఘముద్వారా పెద్దమొత్తములుఁగ నొకేసారి కొనినచో అగ్గువగ కిట్టుటయు, భోజనపదార్థము లెప్పటి కప్పుడు చిల్లరగ కొనుచుండుటకన్న నిట్టి సంఘములద్వారా ఒకేసారి మంచితావునుండి విస్తారముగ కొనిన లాభముగ గిట్టు ననియు, మధ్యవర్తుల లాభము లుండనక్కఱలే దనియు దీనినిర్మాతల యభిప్రాయము. విస్తారపు ధనవంతులు గాని సంసారులు, తాము మిగుల్చుకొనఁగల్గిన స్వల్పమొత్తముల నిట్టి సంఘములందు దాఁచుకొనుచు నిల్వ యుంచుకొనిన నగుటయు, నవసరముల కక్కఱకు వచ్చుటయు మంచి యుపయోగములుగ నెంచఁబడినని.

ఇట్టి పరపతిసంఘములకు ప్రభుత్వమువారు కొన్ని కట్టుదిట్టములకై నిబంధన లేర్పఱచిరి. అంతియేగాక సరకులు కొనుతటే ప్రభుత్వోద్యోగులు సంఘములకు ధరలు, తావులు, కరీదుచేయుట మొదలగువాటియందు సాయమొసంగుచు పనుల నెరవుదురు. దీనికై నౌరికి పద్ధతులు గలవు. ఒక్కొకచో నవసరమగుతటే ప్రభుత్వమువారీసంఘముల కప్పిచ్చి యుద్ధరింతురు. ఈసంఘసభ్యులు తమయాస్తి నీసంఘ బాధ్యతలకు పూచీగా నుంచుటయుం గలదు. ఇట్టిసంఘములు లాభము గడించినచో నది సంఘసభ్యులకే చెందునుగాన, వారు దీనికార్యములకు బాధ్యులుగా నుందురు.

**పరబ్రహ్మ పాదచతుష్టయము**

౧ అవిద్యాపాదము- ప్రాణుల స్థూలదేహ జాగ్రదవస్థలు.

౨ విద్యాపాదము- ప్రాణుల సూక్ష్మదేహ సంబంధ స్వప్నాద్యవస్థలు

3 ఆనందపాదము- ప్రాణుల కారణదేహ సంబంధ సుషు (నిద్ర) ప్త్యవస్థలు.

ర తుర్యపాదము- ప్రాణుల తుర్యావస్థ యోగశాస్త్రాభ్యాసమునఁ గల్గెడి సమాధి యందు నిమగ్నతతో నుండుట.

మతాంతరమున యాత్రి యెయుండుట చర్యాపాద మనియు, ఇష్టదేవతారాధనము పాద మనియు, యోగాభ్యాస యోగ నిష్ఠలు యోగపాద మనియు, ధ్యానసమాధి నిమగ్నత జ్ఞానపాద మనియుం జెప్పి

**పరమదరోగము**— ఆయుర్వేద వైద్య శాస్త్రమున సురాపానాధిక్యముచేఁ గల్గిన రోగమునకుఁ బేరు.

**పరమర్షులు**— ఋషులు చూడుఁడు.

**పరమహంసాభ్యాస ఆశ్రమము**-- (ఆశ్రమచతుష్టయము చూడుఁడు.)

**పరమాత్మ** — ఆత్మ చూడుఁడు.

**పరమార్ రాజకులక్షత్రియులు**— అర్బుదశిఖరము చూడుఁడు.

**పరమేష్ఠి**- సర్వసాధారణముగ బ్రహ్మ (విధాత) కు పరమేష్టి యని వాడుచుందురు. ఇంద్రద్యుమ్నుని కుమారుఁడు పరమేష్టి యని పేరుగలవాఁడు కలఁడు.

**పరవస్తు రంగాచార్యులవారి సీస మాలిక**—మహామహోపాధ్యాయ శ్రీమాన్ ర్యు లయ్యవార్లంగా రను మహాపండితులు క్రి. వె. ౧౮౭౦ లేక ౧౮౮౦ ప్రాంతములందు పరిశీలన లొనర్చి క్షత్రియుల యింటిపేర్లను కూర్చి పరిశీలించి యొకసీసమాలి కను రచించిరి. అది "పరవస్తు రంగాచార్యుల వారి సీసమాలిక"యని ప్రసిద్ధ మయ్యెను. వీరు వసిష్ఠ, కశ్యప, కౌండిన్య, ధనంజయ, గోత్రము లంగూర్చి వ్రాసిరే కాని, భరద్వాజగోత్రపు క్షత్రియకుటుంబముల యింటిపేర్లం గూర్చి వ్రాయ ప్రయత్నింపనే లేదు.

క్షత్రియులలో భరద్వాజగోత్రస్థు లగు కొన్నికుటుంబములు దక్షిణదేశమునందు రాజు పాలెము గ్రామమునను, ఆపరిసరములందునను కలవు. ఆంధ్రదేశమునఁ గానవగు క్షత్రియ కుటుంబము లన్నియు, వసిష్ఠ, ధనంజయ, కౌండిన్య, కాశ్యప, భరద్వాజ యను నైదు గోత్రములలో దేనికో యొకదానికిం జెందిన వారే కాని, యితరగోత్రములవారు లేరు. మఱియుం గొన్ని యింటిపేర్ల వారిలో ఒకేగృహ నామము కలవారిలో కొంద రొకగోత్రమును, మఱికొంద ఱింకొక గోత్రమును చెప్పుచుండు వారును కలరు.

—♦ సీ స మా లి క ♦—

శ్రీమన్మహాపరిచ్ఛేదక వర్ణాట
కోట కాళతి వంశపాటవముల
వాసిష్ఠ కౌండిన్య వరధనంజయ కాశ్య
పాఖ్యగోత్రంబుల నతిశయిల్లు
మహనీయచారిత్ర మహితవిక్రము లైన
వరపూసపాటి సద్వత్సవాయి
కలిదిండి దాట్ల కాకర్లపూడి వులిసి
పెనుమెత్స లేజెళ్ళ పేరిచర
పాకలపాటి భూపతిరాజు వలివర్తి
మంతెన నల్లూరి మందపాటి
గొట్టిముక్కల సాగి గోరింట కొప్పెర్ల
చింతలపాటియుఁ దంతులూరి
సాగిరాజద్వయ జంపన జంపెన
ముదునూరియు మృదుండి ములగపాటి
అడ్డాల పొత్తూరి అడ్డూరి చేకూరి
సేకూరి చెరుకూరి చెరుకువాడ
చోడ్రాజు గండ్రాజు జుజ్జూరి చిట్రాజు
కొండూరి కంతేటి కొత్తపల్లి
నల్లపరాజు కూనపరాజు యుప్పల
పాటి బెల్లముకొండ పత్సమట్ల
గూడూరి నంబూరి గుంటూరి సరిపల్లి
కొప్పూరి చిరువూరి కొలుకులూరి

పెమ్మరాజు కఠారి బెజవాడ బ్రాలాజు
బైఱ్ఱాంజు బేతాళ పాతపాటి
గొడవర్తి యబ్బరాజ్ గురజాల కమ్మెల
సకినేటి చంపాటి లకమరాజు
ఇందుకూరీమని దెందుకూర్ మద్దాల
వేములవాడయు వేగిరాజు
ఏటుకూర్ నందేల యీదరపల్లియు
కోసూరి కనుమూరి కొలనువాడ
రావిపాడ్ గణపతిరా జయినముప్రూడి
వ్రయ్యూరి వీపూరి వోరుగంటి
సామంతపూడి కూసముప్రూ(మూ)డియును ధేను
కొండ ముమ్మపరాజు గోకరాజు
గరికిపాటియు చల్లగల్ల వేగేశన
వాడపల్లియు నున్న వడ్లమూడి
కొక్కెర్లపాటియు కుచ్చెర్లపాటియు
వేటుకూరియు మఱి తోటకూరు
తిరుమలరాజు సద్దేపల్లికు నంత(?)
రాజు మఱియు గాదిరాజుయుగము
రుద్రరాజద్వయారూఢి పిన్నమరాజు
బుద్ధరాజుద్ధరాజ్ బొమ్మడాల
చామర్తి దైవనాల్ సఁయపరాజను
(?)గరాజ్ కంకిపాడమలరాజు
దోసపాటియు దఁడు దుర్గరాజును కల్లె
పలియు నడింపల్లి వెలగలేటి
పోచిరాం జనగను బొల్పు మీఁఱు...
... ... ... ... ...
గీ॥ అష్టవింశోత్తరశతాహ్వయములవారి
ధాత్రిలోపల నాచంద్రతారకముగ
భద్రగిరిధాముఁడగు రామభద్రుఁ డెపుడు
పూర్ణకరుణార్ద్రదృష్టితోఁ బ్రోచుఁగాత!

**పరశునాథము** — పరశునాథము కొండలపైనున్న జైనమతస్థుల యాత్రాస్థలము. ఆ కొండలకు పరశునాథగిరు లందురు. ఈకొండలు కలకత్తానుండి ౨౦౧ మైళ్ళు. ఈస్టుఇండియన్ రయిల్వే గ్రాండు కార్డులైనుపై నున్న గిరిధియా స్టేషనునుండి ౧౮ మైళ్ళు.

దేవస్థానములుగల శిఖరము సముద్రపునీటి మట్టముపై ౪౪౦౦ అడుగుల యెత్తుననున్నది. దీనిని జైనులు "అస్మిద్ శిఖర్" (స్వర్గ శిఖరము) అని పిలిచెదరు. మధు వనమునుండి చిన్న పర్వతపంక్తులను రెండింటిని దాఁటి పోవలయును. మంచిబాట కలదు. శిఖరమున సమతల ప్రదేశము కలదు. అందిరువది జైనదేవళములు కలవు. జైను తీర్థకరు లిరువది నల్వురిలో పదిమంది యిటనే నిర్వాణపద మంది రని చెప్పఁబడినది. కాని, మఱి తొమ్మండ్రి భౌతిక దేహము లిట సమాధిచేయఁబడిన వఁట. అనఁగా ౧౯ సమాధులిటఁ గలవు. ఏఁటేట పదివేల మంది యాత్రాస్థులు దీనిని దర్శించుచుందురఁట. అక్టోబరునుండి మార్చికడవఱకు యాత్రార్థు లధికముగ వచ్చుచుందు రఁట. వర్షాకాలమున పరేశనాథశిఖరము మేఘావృతమై వర్షించుచుండును. కాని మేఘము లేనిదినమున దృశ్యము చాల సుందరము. (శిఖరీజీ చూడుఁడు. చోటా నాగపూరు ప్రోవిన్సు చూఁడుఁడు.)

**పరశునాథుఁడు**— జైన తీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు.)

వీరి చిహ్నము సర్పము. ఇక్ష్వాకుసంతతి క్షత్రియుఁడు. తండ్రి అశ్వసేనరాజు. తల్లి మహిమాదేవి. జన్మస్థానము కాశీపట్టణము (బనారస్). పొడవు తొమ్మిది మూరలు. నీల వర్ణము. ఆయువు నూఱుసంవత్సరములు. గణధర్సంఖ్య ౧౦. నిర్వాణస్థలము. మేరుశిఖరము. (దీనికి 'శిఖరీజీ') యనియు, అద్బుద (ఆబూ) పర్వతశిఖరమనియునందురు.) అంతరాళకాలము ౨౪౭౬ సంవత్సరముల మూఁడునెలల పదిహేను దినములు. మఱియు నీ సుమేరు శిఖరము నందలి జైనక్షేత్రమునకు పరశునాథతీర్థకరుల

నుండియే పరశునాథము (పరేశనాథ్) అని పేరయ్యె నందురు.

**పరశురామచక్రవర్తి**— షోడశమహారాజులలోనొకఁడు. (మహారాజులుచూడుఁడు.)

**పరశురామద్వాదశి** — వైశాఖ శుద్ధ ద్వాదశి. పర్వదినము. మఱియు నీదినమున ౧ వైశాఖమాసము, ౨ శుక్లపక్షము, ౩ ద్వాదశి తిథి, ౪ హస్తా నక్షత్రము, ౫ వ్యతీపాతము, ౬ సింహమున గురుఁడుండుట, ౭ సింహమున కుజుఁ డుండుట, ౮ మేషరాశియందు రవి యుండుట సంభవించునేని "పాశద్వాదశి" యనెదరు. ఆదినమున మాధవపూజ మహాఫలప్రద మందురు. సుప్రసిద్ధుం డగు పరశురాముని పేరం బరఁగుదినము. (పండుగలు చూ.)

**పరశురామద్వితీయ**- మార్గశిరబహుళ ద్వితీయ. పర్వదినము. (పండుగలు, పర్వతిథులు, వ్రతదినములు చూడుఁడు).

**పరశురామపంతుల రామమూర్తి కవి**—ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు.

తండ్రిపేరు పరశురామపంతులలింగమూర్తి. (చూడుఁడు) తల్లిపేరు లింగమ్మ. తండ్రికడనే యోగాభ్యాస మొనర్చి, వేదాంతవిద్య నభ్యసించినవాఁడు. కవిత్వమునుతండ్రికవిత్వమువలెనే యుండి ప్రౌఢిమఁ గల్గి రసవంతమై యుండును. రచించినది "శుకచరిత్ర" మనెడి వేదాంత గ్రంథము.

**పరశురామపంతుల లింగమూర్తికవి** ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. మహాదేవయోగిశిష్యుఁడు. తండ్రిపేరు రామరాజు. తల్లి తిమ్మాయమ్మ.

రచించినదిసీతారామాంజనేయసంవాదము. దీనిని సీతారామాంజనేయ మనుచుందురు. తారక సాంఖ్య రాజయోగము లిందుఁ జెప్పఁబడినవి. జనరంజకమైన ధోరణి. రసవంతమగు కవిత్వము. ప్రౌఢమగు శైలి.

**పరశురాముఁడు**— పుణ్యదంపతులగు రేణుకాజమదగ్నుల కడగొట్టు పుత్రుఁడై జన్మించిన పరశురాముఁ డసమానపరాక్రమవంతుఁ డని ప్రఖ్యాతికెక్కెను. ఇతనితల్లియగు రేణుక క్షత్రియాంగన యని ప్రతీతి. పరశురాముఁడుమహాతపస్వి; బ్రహ్మతేజోవిరాజితుఁడు; అనన్యసామాన్య పరాక్రమశాలి. తపశ్శక్తిచే శివుని మెప్పించి పరశువును (గండ్రగొడ్డలిని) వరప్రసాదముగ నందినవాఁడు. ఇంతటినుండియే యీతనికిఁ బరశురాముఁ డని ప్రసిద్ధనామము కలిగెను. విష్ణువుయొక్క దశావతారములలోఁ బరశురామావతారమొకటి. ఈతఁడు మహాద్భుతకార్యము లనేకము లొనర్చి ప్రసిద్ధుఁ డయ్యెను. పరశురామునిగూర్చిన కథ లనేకము కలవు. అన్నియుఁగూడ నాతని సాహసపరాక్రమాదిగుణములను ప్రకటించునవిగా నున్నవి. ఒకదినమున పరశురామునితల్లి యగు రేణుక జలార్థమై నది కేగి, తిరిగి వచ్చుటలోఁ గొంత తడ వాలస్యము చేసెను. అందుల కామెపతి జమదగ్ని కుపితుఁడై కారణ మడుగ, నామెయు నదీజలవిహారము సల్పుచున్న గంధర్వుని వీక్షించుచుండుటచే నాలస్య మాయె నని ప్రత్యుత్తర మిచ్చెను. ఇందులకు మఱింత కుపితుఁడై యాతఁ డామెను చంపుటకుఁ దన పుత్రుల కనుజ్ఞ నొసఁగెను. మాతృహత్యాదోషభయమున మొదటి నలువురును మిన్నకుండిరి. పరశురాముఁ డటులఁ గాక పితృనుజ్ఞానుసారముగఁ దల్లిని వధించెను. ఈతని సాహసమునకు జమదగ్ని సంతసించి, పుత్రుని కోకవర మీయ, నాతఁడు మరల నావరప్రభా

వముచేఁ దనకుఁ బ్రియతమయగు తనతల్లిని బ్రతికించుకొనియెను. మాతృహత్యాపాతకమున వ్యాకులితమనస్కుఁడగు పరశురాముఁడు పాపనివారణార్థము పుణ్యతీర్థముల దర్శించి, చాల కాలమునకుఁ దిరిగి స్వగృహముఁ జేరుకొనెను. తా నింట లేనితఱి కార్తవీర్యార్జునుఁ డనునృపతి తనతండ్రియగు జమదగ్నిమహర్షిని నిష్కారణముగ హత్యగావించినవాఁ డని యెఱింగి, రోషోద్దీపితుఁడై క్రూరకర్ములగు క్షత్రియులగర్వ మడంచుటకై ప్రతిజ్ఞ బూనెను. తనప్రతిజ్ఞను నిర్వర్తించుటకై యప్పుడున్న రాజవంశములపై నిరువదియొక్క మాఱు దండెత్తి, తన్నెదిర్చినవారినెల్ల వధించి, వారి రక్తములతో పరశురాముఁడు పైతృకతర్పణ మాచరించె నని పురాణప్రసిద్ధమగుకథనము కలదు. ఆకాలమున పరశురాముని నామము వినినంతనే భూపాలు రందఱు భీతావహు లగుచుండిరఁట. కార్తవీర్యార్జునుఁడు తన యనుచరవర్గముతో నీతనిచేతనే చంపఁబడెను.

ఇప్పటి బంగాళాదేశమున,బోగ్రాజిల్లాలోని మహాస్థానఘడమున నీతఁ డొకప్పుడు రాజ్యపాలన మొనర్చె నఁట.

కురువృద్ధుఁ డగు భీష్ముఁ డీతనియొద్దనే ధనుర్విద్యాభ్యాసము చేసెను. కాశీరాజు ప్రథమ పుత్రికయగు నంబ వివాహసందర్భమున, భీష్ముఁడు తనగురువగు పరశురామునితో యుద్ధమొనర్చి యాతని నోడించె నఁట. సీతాకళ్యాణానంతరము వధూవరయుతముగ దశరథభూపాలుఁడు పరివారయుతుఁడై అయోధ్యకు మగిడి వచ్చుతఱి, పరశురాముఁడు వారి నెదిరింప, బాలుఁడయ్యును శ్రీరాముఁ డాతనిని భంగపఱచెనఁట. ఆసమయముననే పరశురాముని యందుఁగల దివ్యతేజము శ్రీరామునియందుఁ బ్రవేశించె నందురు. విష్ణునిదశావతారములలో శ్రీరామావతార మొకటి. అసంఖ్యాకములగు రాజవంశముల హత మొనర్చిన పాపనివారణార్థము పరశురాముఁడు తుదకు తప మొనర్చుటకై యరణ్యముల కేగె నని పురాణములు చెప్పుచున్నవి. అరణ్యముల కేగుటకు ముందు భూపతులనుండి తాను జయించినభూభాగమును ఋషివర్యుల యుపదేశానుసారముగ భూసురులకు దాన మొసంగి నిజపాపనివారణ చేసికొననెంచెనఁట. తాను దాన మొసంగినభూమియందింకను తా నుండుట కిచ్చగింపక, యాతఁడు సహ్యాద్రి (Western Ghats) కరిగి, వరుణు నర్థించి, తాను తన పరశువును సముద్రమున విసరివేయఁ గలిగినంతవఱకుఁ గల భూభాగము తనదిగ నెంచుకొను మనెను. అట్లే యాతఁడు తనపరశువును గోకర్ణమునుండి కన్యాకుమారి అగ్రమువఱకు విసరి,యాభూభాగమును సృష్టించెనఁట. అదియే యిప్పటి కేరళము. జ్ఞాపకార్థమై,పరశురామునిచే సృష్టింపఁబడిన యచటివారతని పేరున "ఓనమ్" పండుగ నిప్పటికి నాచరింతురు. కేరళభూభాగ మొకప్పుడు సముద్రాంతరమగ్నమై యుండి అగ్నిపర్వతోద్రేక ఫలితముగ నేర్పడియె ననిన భౌగోళికశాస్త్రవాదముగూడ దీనినే బలపఱుచుచున్నది. (ఓనమ్ పండుగ చూడుఁడు. జమదగ్ని చూడుఁడు.)

**పరశుస్థాన(రాజ్య)ము**— ఋగ్వేదమున "పరశు" లని పేర్కొనఁబడిన ప్రజలుండిన దేశము పరశుస్థానమనంబడెడిది. దీనిప్రశంస యింకను విష్ణుపురాణము ౨-3 యందు కలదు. ఇక్కాలమున "పహరూ" దని పిలువంబడుచున్న పురము తొల్లింటి శతరోచనపుర మనియు, ఒకప్పుడు రాజధానిగ నుండె ననియు, Journal of Asiatic Society of Bengal. 1911. page 729 యందున్నది.

క్షత్రియోపనివేశము, లేక ఉపనివేశ మనం

బడు దేశపు ప్రజలుగూడ పరశు లనంబడుదురు. వారి దేశమునకును పరశుస్థాన మనిపేరు గలదు. తొల్లింట నీ రెండు దేశములొకటిగనుండెనేమో. (ఉపనివేశ దేశము చూడుఁడు.)

**పరశువేది(పరసవేది)**— దీని నాంగ్లరసాయనశాస్త్రవేత్తలు గెలిసేయుచు "Philosopher's Stone"అని పేరిడియున్నారు. అనఁగా "తత్త్వజ్ఞులమణి"యని యర్థము. వారు దీనిని నమ్మక, ఇటుల గెలిచేసినను, భరతదేశమున నిది సుప్రసిద్ధమగు మూలపదార్థముగ తలంపఁ బడుచున్నది. నేపాలదేశమున కొండలపై నీపదార్థము కలదని యచటివారు తలంచుచున్నారు. పరశువేది యినుము మొదలగు క్షుద్ర లోహములను (Base metals) ఉత్తమ లోహములుగ (బంగారు మొదలగునవిగ) మార్చు నని చెప్పఁబడిన పదార్థము.

"రేడియమ్"అనుధాతుద్రవ్యమును, మేడమ్ క్యూరీ కనిపెట్టినపిదప, దాని శక్తిసామర్థ్యములు లోకమున వెల్లడియై, పరశువేది కేవల ఫిలాసఫర్సు స్టోన్ కాదనియు, అందు కొంత నిజ ముండిన దనియు, తలంపఁ బడుచున్నది. భోజమహారాజుకాలమున నొకసిద్ధుఁడు పరశువేదిశక్తిసామర్థ్యముల నాయన రాజనివాస భవనమున నుపయోగించి పనుల నొనర్చి చూపినటుల భోజరాజీయ మను గ్రంథమునందు చెప్పఁబడినది. దీనినే స్పర్శవేది యనికూడ నందురు.

**పరస్థావి గోత్రము**— లౌగాక్షిగణము చూడుఁడు.

**పరస్పరవిరోధే హి న ప్రకారాంతరస్థితి రితి న్యాయము**— ఇర్వురకు లేక రెంటికిఁ గల పరస్పరవిరోధమందు (అనఁగా అన్యోన్య విరోధభావములందు) ప్రకారాంతర మగు వేఱొకమార్గ ముండ నేరదని యర్థము. ఒకరు "అగు" ననియు, వేఱొకరు "కా" దనియు ననుతఱి అగుటయో, కాకపోవుటయో తేలవలయుం గాని వేఱొకవిధమున నగుటకు వీ లుండదు. ఇట్టివాట్లయం దీన్యాయము వర్తించును.

**పరాన్నం ప్రాణసంకటమ్**— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి. ఇతరులయిండ్ల (వారుపిలువనిది) భుజించు దుర్గతి గల్గుటప్రాణసంకటతుల్యమగు కష్టమని భావము.

**పరామరులు**— వీరుఉజ్జయిని రాజధానిగ మాల్వారాజ్య మేలినవారు.

మహాదాతయు విద్యాపోషకుఁడు నని పేరందిన భోజమహారాజు,ముంజుఁడు నీవంశనృపులే. భోజునికాలమున రాజధాని ధారానగరమే.

**పరార్ధము**— ఆయుర్వేద వైశాస్త్రమున కుంకుమపూవు, చందనము, వట్టివేళ్లు వీటిపేరు.

**పరావసువు**- ఋషి. తండ్రి రైభ్యుఁడు. సోదరుఁ డంతర్ధానుఁడు.

**పరాశరగణము**— (౫ వసిష్ఠ మహర్షి సంతతి, ౪ పరాశరగణము, ౬౪ గోత్రములు). బోధాయన సూత్రోక్తగోత్రములు (౩౧):-

౧ కండు, ౨ కపిముఖ, ౩ కృష్ణాజని, ౪ కార్ష్ణి, ౫ కాహ్వాయన, ౬ క్రైమతి, ౭ కౌముది, ౮ క్రౌఞ్చశారి, ౯ ఖల్వాయని, ౧౦ గార్గాయని, ౧౧ గోపి, ౧౨ గోవాలి, ౧౩ పరాశరి, ౧౪ ప్లాక్షి, ౧౫ ప్రారోహి, ౧౬ పౌష్కరసాది, ౧౭ భైమతాయన, ౧౮ భాలుక్య, ౧౯ వాజిమతి, ౨౦ వాదరి, ౨౧ వారుణి, ౨౨ వార్ష్ణేయ ౨౩ వైకలి, ౨౪ శ్యామాయని, ౨౫ శ్యామేయ, ౨౬ స్యాతి (శ్యాతి), ౨౭ శివాజి, ౨౮ శ్వేతయూపి, ౨౯ శ్రౌతహి, ౩౦ సహాచౌలి, ౩౧ హర్యశ్వి.

లౌగాక్షిసూత్రోక్త గోత్రములు (౧౯):—

౧ అకమ్పన్య, ౨ అవిష్ఠాయన, ౩ ఇషీక హస్త, ౪ కపిశ్రోత, ౫ ఘామి, ౬ కౌకసాది, ౭ జైమి, ౮ తప, ౯ తరణి, ౧౦ ప్రాలి, ౧౧ పౌకరసాది, ౧౨ బైల్వయూపి, ౧౩ మాండికి, ౧౪ వాహి, ౧౫ వాహని, ౧౬ వ్యాప్యాయని, ౧౭ వైరిణేయ, ౧౮ శ్లోకమయ, ౧౯ స్కంభిన్న.

ఇతర గ్రంథోక్త సూత్రములు (౧౪):—

౧ కార్ష్యాయన, ౨ వకిక, ౩ కౌరజాయన, ౪ ఖల్యాయన, ౫ పటిక, ౬ పారాశర్య, ౭ పార్థివయన, ౮ వధిక, ౯ వ్యాస, ౧౦ శాక్తి, ౧౧ స్యానయాని, ౧౨ శిబి, ౧౩ శౌకి, ౧౪ హార్యాలి.

ఈ పరాశర గణమునందలి ౬౪ గోత్రములకుఁ బ్రవర రూపము ౧:— వశిష్ఠ, శాక్త్య, పారాశర్య.

## పరాశర లేక పరాశరిగోత్రము —

(పరాశరగణము చూడుఁడు.)

## పరాశరర్షిగోత్రము—

(శిష్టుకరణములు చూడుఁడు). ఈగోత్రమువారికిఁ బ్రధానర్షి వసిష్ఠుఁ డనియు, వీరిప్రవర వాసిష్ఠ, శాక్త్య, పరాశర యనియుం జెప్పఁబడినది. ఇంటిపేరు శమంతరావువారు. వీ రీగోత్రస్థులైయున్నారు.

## పరాశరుఁడు—

ఋషి. తండ్రి శక్తి. పితామహుఁడు వసిష్ఠమహర్షి. కుమారుఁడు వ్యాసుఁడు. పౌత్రుఁడు శుకుఁడు.

పరాశరుఁడు తనతండ్రిని కల్మాష రాక్షసుఁడు మింగెనని రాక్షసకులముపై పగ బూని, యొక తఱి రాక్షసకులవిధ్వంసన మొనర్ప సత్రయాగ మొకటి మొదలిడె నఁట. దానికి వెఱచి పులస్త్యపులహ క్రతువులు వసిష్ఠుని దీనులై వేఁడుకొని సత్రయాగ మాఁపించి రాక్షసకులరక్షణము గావించుకొని రఁట.

మఱియొకతఱి పరాశరుఁడు యమునానదిని నావపై దాఁటుచు, దాశరాజు పెంపుడుకుమార్తె యగు మత్స్యగంధిని (తొల్లింటిపేరు సత్యవతి) జూచి మోహితుఁడై, గొప్పమంచు గల్పించి, యామెకు యోజనగంధిత్వ మొసంగి, యామెను గూడి మనసు దీర్చుకొనియె నఁట. ఆమెకు యోజనగంధిత్వము గల్గుటతోఁబాటు గర్భమై వ్యాసుని గనె నఁట. పరాశరకృతగ్రంథము లనేకములు గలవు. ఋగ్వేదములో కొన్ని సూక్తములును ఈ మహాత్ముని పేరం బరఁగెడిని. పరాశరస్మృతి పండ్రెం డధ్యాయములది ముద్రితమై యున్నది. వేఱొకపరాశరస్మృతి యిరువదిరెం డధ్యాయములది కల దనియు, అందు సన్యాసధర్మములు కలవనియు వినుచున్నాము. ఇది యేమో పరిశీలింపం దగియున్నది. ఈయన పేరం బరఁగు గృహ్యసూత్రములు, ధర్మసూత్రములు సుప్రసిద్ధములే. ఈయనయే సమస్త పురాణప్రవర్తకుఁ డని విష్ణుపురాణమునఁ జెప్పం బడినది. పరాశరుని శైశవమున బ్రహ్మమానస పుత్రుఁడగు పులస్త్యుఁ డీతనిని పురాణశ్రేణికిఁ గర్తవు గమ్మని వరం బిచ్చె నని పరాశరుఁడు మైత్రేయునితోఁ జెప్పిన ట్లందుఁ జెప్పంబడి యున్నది. ఈమహాత్మునిసుతుం డగు వ్యాస మహర్షి పురాణములను గవిత్వమున రచించిన కారణమున నేమొ పురాణప్రవర్తగ పేరంది యున్నాఁడు.

వేదవ్యాసమహర్షి తండ్రి (పరాశరస్మృతికిం గర్త) యొకపరాశరుఁడు. (అదృశ్యంతి చూ.) వ్యాసునిమనుమఁ డొకపరాశరుఁడు కలఁడు. ఈయనకు వృద్ధపరాశరుండని పేరు వాడుక యుండె నందురు. ఈయన రచించినజ్యోతిష గ్రంథ మొకటి యీయనపేరుననే నేఁటికింబరఁగుచున్నది. (వృద్ధపరాశరుఁడు చూడుఁడు.)

**పరాష్టక దేశము—** ఈపేరుగల రాజ్య మొకప్పు డుండిన దని తెలియుటకన్న దీనిం గూర్చి యేమియుం దెలియరాకున్నది.

**పరాసు (ఫ్రెంచి)దేశపుసామెతలు-**

అడుక్కు తినేవాని కధికారంకలిగితే గర్వం వానివద్ద కావలియుంటుంది.

అధికప్రసంగం అబద్ధాలకు స్వగృహము.

అధికారి అన్యాయానికి వెఱవవలయును.

ఆపద లతిత్వరితంగా వస్తాయి గాని, అంత వేగంగా వెళ్ళవు.

అమ్మేవాళ్ళలో బుద్ధిహీనులు తక్కువ. కొనే వాళ్ళలో బుద్ధిహీను లెక్కువ ఉంటారు.

ఏజోలికీ పోక తప్పించుకుతిరిగేవాఁడే గడుసు వాఁడు.

కందినము వేయని ఇరుసుగల చక్రముల నడుమ కావలసినంత సంగీతము.

కోడి నలుపైనా ఎరుపైనా గ్రుడ్డు తెలుపే.

గడ్డికుప్పలలో సూది పారవేసుకున్నట్లు.

గడుసుతన మధిక మైతే కాలంలోనే దొరుకుతాఁడు.

గుఱ్ఱముపై నున్నంతసేపు కళ్లెమువదలరాదు.

చెడువార్తలు శీఘ్రముగా పరుగిడుతవి.

చేపఁ కీఁత నేర్పవలయునా?

చెప్పుట సులభమే కాని చేయుట కష్టము.

జీవించుట ఎట్లో తెలిసికొనుటకు సగముజీవి తకాలం అయిపోతుంది.

తనకన్న తాను జేసినతప్పే బరువు.

తలుపు మూసియైనా ఉంచు. తీసియైనా యుంచు. ఓరువాకిలిగా ఉంచుట శ్రేయము కాదు.

తప్పినవాఁడు జాగ్రతం గొనినచో బుద్ధి శాలియే.

తిప్పుకుంటూ తిరిగే ఆడుది తెలివితక్కువదే.

దొంగను మోసపుచ్చుటకు దొంగయే కావలయును.

దొంగను మోసపుచ్చేవాఁడేసరియైనదొంగ.

నమ్మించి ఏమరించి దొంగతనం చేసేవాఁడు మోసగాఁడు.

నడిచేదారిలో గడ్డి మొలవదు.

న్యాయవాది మంచివాఁడని పొరుగున కాపుర ముండుట అపాయకరము.

నీవేమి చెయ్యవలెనో చెయ్యి. మానకు. ఏమివచ్చినా రానీ.

నోరు మూసుకుంటే నోటిలోని కీఁగ లెట్లు దూరును ?

పంజరంచక్కదనం పక్షికి రుచించేది కాదు.

పాతకఱ్ఱ కెన్నివంకర లుంటేనేమి బాగా కాలుతుంది.

బడాయి పని నేర్పునకు తావు గాదు.

మాటలాడుటకు ముందు నాల్కను భద్ర పఱచుకోవలెను.

మొదట తగిలినది రెట్టింపుదెబ్బ.

రహస్యమును భద్రపఱచుకొను తావు నీమనస్సే.

రాజులకు చేతులు పొడవు; చెవులు పెద్దవి.

రోగమునుగూర్చిన భయముకన్న వైద్యుని గూర్చినభయ మధికము.

వాడుకవల్ల అరిగి నష్టపడుటకన్న ఇనుము తుప్పుపట్టుట మూలమున ఎక్కువనష్ట మను భవిస్తుంది.

వింటూండేవారిలోనుండే వెక్కిరించేవారు బయలు దేరుట.

సముద్రమును పొగుడుదుము గాని భూమిని వీడము.

స్వల్పసుఖముల కాశిస్తే పిదప పశ్చాత్తాప పడవలసి వస్తుంది..

**పరాసుదేశము—**(ఫ్రాన్సు దేశముచూ.)

**పరిక్రమతాళము-** (తాళములుచూ.)

**పరగర్భిక (రోగము-** ఆయుర్వేదవైద్య శాస్త్రమున బాలపాపరోగమునకుం పేరు.

**పరిణామవాదసిద్ధాంతము** (Evolution ఒకవస్తువు పరిణామమందు వేఱొక వస్తువుగా మాఱుననుసిద్ధాంతము. ఈ సిద్ధాంతమును పాశ్చాత్యులందు Mr. Charles Robert Darwin అను నాయన బయలు దేఱదీసి క్రీ. వె. ౧౮౫౯ గొప్పగ్రంథ మొకటి రచించెను. ఈ సిద్ధాంతము మేరకు మనుష్యులు కోఁతులయొక్క పరిణామ మని తేలుచున్నది. దీనిని డార్విన్ సిద్ధాంత మనెదరు.

**పరిణామశూల—** (పంక్తిశూల చూ.)

**పరిత్యాజ్యపంచకము—** బౌద్ధధర్మమున ౧ రూపరాగము, ౨ అరూపరాగము, ౩ గర్వము, ౪ ఔద్ధత్యము (గొప్ప), ౫ అవిద్య (ఎఱుగమి), ఇవి యైదును పరిత్యజింపఁ (వదలివేయఁ) దగినవి.

**పరిదర(రోగ)ము —** దంతమూలము లందుఁ గలెడిరోగము.

**పరిప్లవుఁడు-** పాండవసంతతిక్షత్రియుఁడు. తండ్రిసుఖీవలుఁడు. పితామహుఁడు నృచక్షుఁడు. కుమారుఁడు సునయుఁడు.

**పరిభవ గోత్రము-** (సంకృతి ఉపగణము చూడుఁడు.)

**పరిభవరోగము—** పారిగర్భిక రోగము. బాలపాప చిహ్నరోగము.

**పరిమి (పండ్ల) చెట్టు —** దీని యితర భాషాసాంకేతిక నామములు సరిగా తెలియకున్నవి. బాగుగ పండిన పరిమిపండ్లు వాతహర మనియు, పథ్య మనియు, పండని కాయలు శ్లేష్మమును, పైత్యమును రేఁపుననియు నందురు.

**పరిలేహి (కర్ణపాలి) రోగము-** ఇదియు కర్ణరోగముగఁ జెప్పఁబడినది.

**పరివర్తన ఏకాదశి—** (మహాఏకాదశులు చూడుఁడు.)

**పరివర్తనైకాదశి-** భాద్రపదశుద్ధ ఏకాదశి. (పండుగలు చూడుఁడు.)

**పరివర్తిక (గరో ము-** శూకరోగము— పురుషులమర్మావయవరోగము. క్షుద్రరోగము.

**పరివేషలక్షణపరీక్ష—** కాలవిజ్ఞానశాస్త్రమున వివరింపఁబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.)

చంద్రుని జుట్టి గాని. సూర్యుని జుట్టి గాని, చిన్నదిగనో, పెద్దదిగనోగుడిగట్టుటకు 'పరివేష' మందురు.

౧ వర్షాకాలమునందు పరివేషము సూర్యునకుఁ గాని, చంద్రునకుఁ గాని గల్గుట వర్షయోగసూచక మనియు, మేఘములు లేనితఱి ననావృష్టిసూచక మనియు,

౨ సూర్యచంద్రుల పరివేషములు బంగారు రంగుతో నుండిన వర్షయోగ మనియు, ఇది వర్షాకాలమున వర్షయోగముగఁ దనరి, అన్యకాలముల ప్రజాసంక్షయకర మనియు,

౩ వానకాలమున సూర్యునకుఁగాని, చంద్రునకుఁగాని, రెండుమూఁడు పరివేషము లుండిన, నధికవర్షములు కల్గుననియు, వానలేనికాలమునఁ గల్గిననృపులకుధనవిహీనత గల్గుచిహ్న మనియు,

౪ వానకాలమున పరివేషము తోఁచిన దిక్కున కలహములు గల్గుననియు,

౫ పరివేషములు తెల్లనికాంతి గల్గియుండిన ననావృష్టియోగ మనియు,

౬ చంద్రపరివేషమున బృహస్పతి యుండిన విప్రులకుఁగీడు. శుక్రు డుండిన వర్షయోగము, శనియుండిన నృపులకుఁగీడు, కుజుడుండిన భూమి

యందు లోహము లభివృద్ధి యగును. బుధుఁడుండిన శిశుపీడనము గల్గుననియు,

౭ చంద్రపరివేష మెఱ్ఱని రంగుతో నుండి, యందు కుజ, గురు, శని నక్షత్రములు లేక గ్రహములుండిన ప్రజలకువిపత్తులుగల్గుననియు,

౮ చంద్రుఁడ స్తమించుతఱి పరివేషముగల్గి, అందు బృహస్పతి యుండిన లోకదుర్భిక్షమనియు, శుక్రుఁ డుండిన బోయకులమునకుఁ గీడనియు రెట్టవిజ్ఞానిఁ దెల్పియున్నాఁడు.

**పరిశుద్ధాత్మ**— దీని నాంగ్లులు "Holy ghost" అనియు, "Holy spirit" అనియు నందురు. క్రైస్తవ మతధర్మమున తండ్రియగు ఈశ్వరుని, కుమారుఁ డగు ఏసుక్రీస్తుప్రభుని, పరిశుద్ధాత్మను "త్రితయ" మనెదరు.

**పరిశుద్ధాస్తికమతమగు బ్రహ్మసమాజ మతనిషేధములు**— విగ్రహారాధనయు, పరమేశ్వరుండగు బ్రహ్మమునందు శరణ్యము నిరాకరించుటయు, అజ్ఞానసంజనితపాపకార్యము లందు- అనఁగా సంఘవిరో

మనస్సు దవిలియుండుటయు, పరమాత్ముని యాశీర్వాదములందు కృతజ్ఞత లేకుండుటయు, మనఃపరిశుద్ధుఁడు గాక యుండుటయు, పరమేశ్వరుఁడే సకలకారణకార్యకర్తగా నమ్మకుండుటయు, పరమేశ్వరునియందు సగుణారోపణము, ఇవి సప్తనిషేధకార్యము లని చెప్పంబడినది.

**పరిషత్తు (విద్యాపీఠము లేక విద్వత్సభ**— ఇది రానురాను విద్యాశాలలు, విశ్వవిద్యాలయములుగ నిక్కాలమున కేర్పడి యున్నది. ఆదికాలమున భరతదేశమునం దిది విద్యయొక్క- అన్నిశాఖలం బరిశీలించునదిగను, పండితులను పరీక్షించునదిగను నుండెను. విద్యలను విద్యార్థుల కుపదేశించువారి నధ్యాపకులనుచుండిరి. ప్రధాన విద్యాధికారికి "కులపతి" యని పేరుండెను.

ఇట్టివి భరతదేశమునందు భరద్వాజమహర్షి నాఁటినుండి యుండినటులఁ జెప్పవలసియున్నది. వారు కులపతులుగ నుండిరి. గంగాయమునల సంగమముకడనున్న ప్రయాగయందు వారి నివాసాశ్రమమును, విద్యాపీఠమును (ఇప్పటి అలహాబాదునగరమున) గూడ నుండెను.

ఐరోపాయందలి గ్రీసుదేశమున Academus అను విద్వాంసుని ప్రూదోఁటయందు వారును, Plato మొదలగు అక్కాలపు విద్వాంసులును కలిసికొనుచుండు వాడుక యుండి, అది విద్వత్సభయై యుండెను. ఆయన నుండియె అట్టిసభకు "Academy" అనిపేరు కల్గెను. ఆయనయనంతరమున విద్వాంసులటనె సభలు జరుపుచు క్రమముగ ప్రభుత్వము వశమై స్థిరపడి యితరదేశములకు వ్యాపించెను. (ఏకాడమీ చూడుఁడు.)

**పరిహ్వాగోత్రము**— (ధనంజయగణము చూడుఁడు

**పరీక్షిత్తు**— ఈపేరు గలవారు నల్వురు గానఁగుచున్నారు

అత్రి, చంద్ర, యదు వంశమున కురుమహారాజుకుమారుఁ డొకఁ పరీక్షిత్తు గలఁడు. ఈతఁడు సంవరుణుని పౌత్రుఁడు.

పాండవులలో నర్జునసుతుండగు నభిమన్యుని సుతుం డొకఁడు పరీక్షిన్నరేంద్రుఁడు. భార్య సుశోభ. కుమాళ్లు జనమేజయుఁడు, శలుఁడు, తలుఁడు. (కడపటిఇర్వురు వామదేవర్షి అశ్వము లనుహరించి నిహతులైరి.) ఈతఁడు వేటాడుచు మృగమును వెంటఁదరుముచు శమీకుఁడనుఋషి నిప్రశ్నింప నాతఁడుమౌనివల్కమికి కుపితుండై చచ్చినపామునాతనిమెడనువైవ,నాతనిసుతుఁడు శృంగి దానిం దెలిసి, యాపరీక్షిత్తు ఏడవనాఁడు సర్పదష్టుఁడై చచ్చునటుల శపించెను. పరీక్షిన్నరేంద్రుండును దానిని విని ఖిన్నుండై

చేయునదిలేక ప్రాయోపవేశమున (మృతిపాన్పు) నుండి, శుకయోగీంద్రునివలన తన పూర్వుల చరిత్రమగు భారతమును విని, తక్షకనాగదష్టుండై మృతినందెను.

ఆతనికుమారుఁడు జనమేజయ మహారాజు రాజ్యాధిపతియై తక్షకునియందు పగగల ఉదంకుఁడను ఋషిచే ప్రోత్సహింపఁబడి, తండ్రిని గఱచిన సర్పకులనాశనమునకై సర్పయాగ మొనర్పసాఁగెను. తక్షకుఁడు వెఱచి, యింద్రుని చింతామణీ భద్రసింహాసనమును జుట్టుకొని శరణ్యా మందియుండ, నిట జనమేజయుఁడు సర్పయాగమునందు "సహేంద్రతక్షకాయ స్వాహా" యని హోమము వేల్చెను. అంత సింహాసనముతో అందున్న యింద్రుఁ సహా తక్షకుఁ డగ్నిగుండంబునం బడనాయెను. అంత నస్తీకుఁడను ఋషి (వాసుకిచెలియ లగు జరాత్కారసుతుఁడు) జనమేజయుని బ్రార్థించి వారించి, వారల రక్షించెను.

పిదప జనమేజయుఁడు వ్యాసునియనుమతిం బడసి, వైశంపాయనునిచే తనపూర్వులకథ యగు భారతమును వినె నఁట.

సూర్యవంశ నృపతులలో నయోధ్యాపుర మేలిన పరీక్షిత్తు ఇంకొకఁడు కలఁడు. ఈతఁడు వేటాడఁ జని మండూకరాజపుత్రిక యగు సుశోభను పరిణయమై సంతానముం గనినవాఁడు. ఆమె దుష్టురా లనియు, ఆమె సంతానము కపటులనియుం జెప్పఁబడినది.

**పరుగెత్తి పాలు త్రావుటకన్న నిలుచుండి నీరు త్రావుట సౌఖ్యము** — (ఆంధ్రలోకోక్తి.)

**పరువిచ్చి పరువు తెచ్చుకోవలెను**- (ఆంధ్రలోకోక్తి.)

**పరుష్ణి నది-రావీనది(లేక ఐరావతి)**- పాంచాలదేశపు ఐదునదులలో నొకటి. పరుష్ణి నది ఋగ్వేదము ౧౦-౭౫ యందు ప్రశంసింపఁబడిన నది.

ఈనదీతీరమున (ఆర్యుల క్రొత్తదినములలో) పదిమంది భూపతు లేకస్థులై పురులరా జగు కుత్సునితో గొప్పసంగర మొనర్చి జయమంది రఁట. అందు తృత్సుభూపతి సుదాశనరపాలుఁడు నాయకుం డఁట. పిదప "పురు" శబ్దము "కురు" యని మాఱె నఁట.

మఱియు బ్రహ్మపురాణమున ౧౪౪ అధ్యాయమున, గోదావరిలో సంగమించు పరుష్ణినదింగూర్చి ప్రశంస గలదు.

**పరేపమతి గోత్రము** భరద్వాజ ఉఃగణము చూడుఁడు.

**పర్జన్యన్యాయము**—దీనికి పర్జన్యవత్ ఇతిన్యాయ మనియు నందురు. వర్ష మన్నిరకముల భూములందు నొకేరీతిని వరించును. అనఁగా నాభూములు శ్రేష్ఠము లయినచోఁ జక్కఁగ నుపయోగించెడిని. చవిటిపఱ్ఱ లగుచో నిరుపయోగ మగును. ఇసుకనేల లగుచో నింకిపోయి వృథా యగును. రాతినేలపైఁ బడిన దొరలి యన్యస్థలముల కావర్షపునీరు పోవును. కాని, వర్షమన్నిరకముల తావులందు నొకేరీతిని గురియునని భావము. సమబుద్ధికీ న్యాయమువాడుచుందురు.

**పర్జన్యుఁడు**—మేఘముల కధినాథుఁడు. సూర్యునకు, వరుణునకు, ఇంద్రునకును పర్జన్యుఁ డని నామాంతరము కలదు.

**పర్ణమయిన్యాయము** — పర్ణమయి యనఁగా కఱ్ఱతెడ్డు. పర్ణ మన ఫలాశ మని యర్థము. పాలాశపుకఱ్ఱతోఁ జేయఁబడిన తెడ్డని యర్థము. ఇది క్రతువులయం దుపయోగించును. దీనికి "జుహూ" యని వేదమునందు పేరు కలదు. (తైత్తిరీయసంహిత ౩-౫-౭). (ఇదియు గోదోహనన్యాయమువంటిదియె చూ.)

**పర్ణాశానది** — రాజపుత్ర స్థానములోని బనాస్ నది. చంబల్ (చర్మణ్వతీ) నదిలో కలియు నది. వాయుపురాణము ౧-౪౫ అధ్యాయమున ప్రశంసింపఁబడినది.

మఱియు ఉత్తర గుజరాతులో అబూపర్వత పరిసరముల బర్నాశ యను వేఱొకనది పుట్టి, కచ్చిసంయుక్తాగ్రగుడములో సంగమించు నని భగవాన్లాలు ఇంద్రజీ పండితుఁడు బొంబై గెజిటీర్ ౧ భాగము, ౧ పుట, ౨౫ యందు వ్రాసెను. బర్నాశ పర్ణాశ యేమో. దీని ప్రశంస మత్స్యపురాణము ౧౧౪ అధ్యా - కలదు. మహాభారతము, ద్రోణపర్వము ౯౨ యందు పర్ణాశానదీప్రశంస కలదు. కాలస్థలవివరణము గానరాదు యమునానదిలో కలియు తమసానది కీపే రున్నదందురు. కాని మత్స్యపురాణము, ౧౧౪ అధ్యాయమున పర్ణాశ తమసలు రెండు చెప్పఁబడియుంట, వేర్వేఱునదులనుట స్పష్టము. రామాయణ యుద్ధకాండమున ౧౧ అధ్యాయ. దర్దురపర్వతముకడ పర్ణాశానది చెప్పఁబడినది.

**పర్ణినీ-పర్ణీ** — ఆయుర్వేద వైద్యశాస్త్రమున పర్ణినీద్వయ మనిన మాషపర్ణి, ముద్గపర్ణి యనియు, పర్ణీద్వయ మనిన శాలపర్ణి, పృశ్నిపర్ణి యనియు, పర్ణీచతుష్టయ మనిన శాలపర్ణి, ముద్గపర్ణి, పృశ్నిపర్ణి, మాషపర్ణి యనియుఁ జెప్పఁబడినది.

**పర్తాపఘుడ సంస్థానము (ప్రతాపఘుడము)** — ఇండియా దేశములోని రాజపుటానా ఏజన్సీయందలి బ్రిటీషు రక్షితసంస్థానము లిరువదింటిలో నొక రాజపుత్రసంస్థానము. ప్రతాపఘుడపురము రాజధాని. (రాజపుటానా ఏజన్సీ చూడుఁడు.)

**పర్పాటకము చెట్టు**—లా. Mollugo Cerviana అనియు, Oldenlandia bilfora Red. సం. పర్పట. ఇది తెలుపు, ఎఱుపు, నలుపు రంగుల త్రివిధము

దీనిని కషాయముగను చూర్ణముగను వైద్యులుపయోగించు చున్నారు. చేదురుచి గల్గు వస్తువు. పంచతిక్తములలో నొకటిగ జెప్పఁబడినది. జ్వరములనుహరించును. అందు ముఖ్యముగ తాపజ్వరముల నడంచెడిని. పైత్యము, విదాహము, శ్లేష్మములపై చక్కగ పనిచేయును. ఇంచుక విరేచనబద్ధము గల్గించెడిని. ఒక్కొకతఱి బాలుర క్రిమిరోగముల నడంచుననియుఁ జెప్పంబడినది. దగ్గులు మాన్పును.

**పర్యశ్వ కర్దమగోత్రము** — శండిల గణముచూడుఁడు.

**పర్యాషణము**—జైనస్వాము లొకే తావున నొకవర్షకాల మంతయు గడపుటకు పేరు.

**పర్వతదేశము** — పంచాలములోని ముల్తాన్ పురమునకు వాయవ్యదిశగా రావి, సట్లెజ నదులమధ్య నుండిన దేశముగా పోల్చు చున్నారు. పాణిని అష్టాధ్యాయియందునను, ముద్రారాక్షసనాటకము తృతీయాంకమునను ప్రశంసింపఁబడిన రాజు. పర్వతకుఁడు లేక పార్వతకుఁడు అనురాజు.

**పర్వత పంక్తి** (Chain of mountains or hills) (పర్వతపంక్తి Mountains చూడుఁడు.)

**పర్వతపాదము** (Foot of the mountain or hills)— (దీనిం గూర్చి Mountains చూడుఁడు.)

**పర్వతమార్గములు** — (Passes) పర్వతములపై నివ్వలనుండి యవ్వల కేగు మార్గముల కనుకూలించు పల్లములు. (Land portions Mountains చూడుఁడు.)

**పర్వతరేఖ**—(పురుష సాముద్రికము చూ. స్త్రీసాముద్రికము చూ.)

**పర్వతశిఖరము** (Top of the Mountain)— పర్వతము యొక్క ఎత్తైన ప్రదేశమునకు Top అనిపేరు. (Mountains చూడుడు.)

**పర్వతశిఖరములు-మంచు**— పర్వత శిఖరములపై మంచు పడుటవలన హిమనిలయము లగు నని యంద తెలిసినదే. తిరిగి పైబడినమంచు అడుగునుంచున కొత్తడి గల్గించుచు పైబరువుగ నుండునని వేఱుగ జెప్ప నక్కఱ యుండదు. అడుగుపొర నొక్కఁబడి గట్టినుం చగును. (ఈసందర్భమున మంచు నీటి కన్న తేలికపదార్థమైనను దానిబరువు దానికి శేకపోలేదని మనసునం దుంచుకొనవలసియుండును). అది పీలగుతావులందు మంచునది (Glacier) గనో,మంచు కరఁగినైన జలములు ప్రవహించునది (River) గనో యై భూమి పెకి దిగును. ఎంతో కొంత యెండలకు నీటి యావిరియై యాకాశమున కెగసి మేఘములందు చేరుచుండును. కొన్ని మంచుపొరలు జాఱి, ఏవలాంచి (Avalanche)యై జాఱి, యడుగంటి, కరఁగి ఇంకియు నావిరియై యెగసియుం బోవ నగును గాన మంచు పర్వతములపైఁబడి దాని కెక్కువ యెత్తును గల్గింప నేరదు.

**పర్వతాసనము** యోగశాస్త్రమున జెప్పఁబడిన యాసనములలో నొకటి. పద్మాసనమువైచి(మఠము)కూర్చుండి చేతులు శిరస్సు పైకెత్తి జోడించి యుండుట పర్వతాసనము. ఉదానవాయు విందువలన బలపడునని చెప్పఁబడినది.

**పర్వతిథులు**—(పండుగలుచూడుఁడు.)

**పర్వతోద్భవద్వయము**—ఆయుర్వేద వైద్యశాస్త్రమున సింగిలీకము, పాదరసము లకుఁ బేరు.

**పర్వభేద (రోగ)ము** — సంధిభంగ రోగము.

**పర్వములు ౫ (పంచపర్వములు)**- కృష్ణపక్షమునందలి ౧ అష్టమి, ౨ చతుర్దశి, 3 అమావాస్యలును, శుక్లపక్షమున ౪ పౌర్ణమి తిథి, ౫ సంక్రమణతిథి (ఆనెలయందలి సూర్య సంక్రాంతి) పంచపర్వతిథు లనంబడును

**పర్వవరౌంజిమగోత్రము** (శండిల గణము చూడుఁడు).

**పర్శిపోలిసు**—(పారశీకదేశము చూ).

**పర్శిపోలిస్ పట్టణము** — (పారశీక (ఇరాను) దేశము చూడుఁడు).

**పలకకులగోత్రము**- ఆర్యవైశ్యుల౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములుచూ.)

పలకకుల (పటనమశిష్ట లేక పటనశిష్ట)గోత్రము. ద్వ్యాష్ణేయ (౯) గోత్రము. సంస్కృత గోత్రము. దాల్భ్యన దాల్భ్యగణము. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణ ఆద్యప్రవరఖుఁడ. వ్యాసేశుఁడు దేవత. గంగాంబ భార్య. హిమాచలము తపస్థానము. గంధసారసరస్సు తటాకము. జపము కోటి. దీపములు ౪౦. క్షేత్రసంఖ్య ౫౫. ఫలములు దానము. పాలపండ్లు వర్జనీయము.

**పలకంపౌర్ణమి**— తొల్లింట దీనిపేరు పల్లవపుపౌర్ణమి యని యుండనోపు. మార్గశిర శుద్ధపౌర్ణమి నీపేరున నాడుచుందురు. చిగురునకు పల్లవ మనిపేరు. కాన, దీనిని "చిగురుల పౌర్ణమి" యననోపు. ఈదినమునాఁటికి చెట్లు చిగుర్చుటయో పుష్పించుటయో సంభవించెడిని. పలకంపౌర్ణమినాఁటికి పడమటికొమ్మలు పూచుట కారంభించునని మామిడిచెట్లంగూర్చి సామెతగాఁ బల్కుచుండుట యాచారమె యున్నది.

మఱికొందఱు తెల్పునట్లు పలకు అనుటకు

పండు లేక ఫలించు నని యర్థము గాన పలక వాఱుట యన ముదిరి ఫలోన్ముఖ మగుట కర మగును. పలకంపౌర్ణమి (మార్గశిర శు॥ ౧౫) నాటికి వరిపంట ముదిరి ఫలోన్ముఖ మగుట నీపే ర్పౌర్ణమికిఁ గల్గెనని వ్యవసాయ మొనర్చు యందొక వాడుక గలదు.

మన్యప్రదేశములందడవిజాతులవారీపౌర్ణ మిని పలకమ్మ యను దేవతకు పండుగ చేసి పూజింతురని తెలిసెడిని.

**పలనాటివీరచరిత్రము**- పలనాటివీరులు మొదటి కాకతీయ రుద్రదేవుని లేక 1-వ ప్రతా పరుద్రునికాలమునాఁటివా రనియు,వీరియుద్ధము క్రీ.వె.౧౧౬౦-౧౧౦౪ అనియు ననుచున్నారు. ఈచరిత్రమును ద్విపదకావ్యములుగ వ్రాసి యున్నారు. అందు కవిసార్వభౌమ శ్రీనాథ మహాకవిదని జెప్పంబడునది పలనాటిసీమ యందు సుప్రసిద్ధము. కాని, అందు పెక్కులు వ్యాకరణదోషములు గానఁబడుచుంట పరిశీల కులు సంశయింపఁ దగియున్నది. ముదిగొండ వీర భద్రకవివిరచిత మగునది నవీనము. క్రీ. వె. ౧౮౬౫నాఁటి కవనము. ఇది పద్యకావ్యము. ఇందు పాఠాంతరభేదము లనేకము లున్నవి.

పలనాటివీరుల కలహకథన మిట్లు వివరింపఁ బడినది. హైహయరాజవంశమున కార్తవీర్యా ర్జునచక్రవర్తిసంతతియం దాతనినుండి యేడవ తరమువాఁ డనంబడిన అనుఁగురాజు, ఉత్తర దేశమున దాహాలమండలములోని బాలమాచా పట్టణము (లేక భంజన్పూర్) నందుండి తన పూర్వుల మహాపాతకములు సంతతికి బాధించు చుండ, విసిగి వేసరి విరక్తిఁజెంది జీడిపిక్కల నూనెలో ముంచిన మైలవస్త్రములు ధరించుచు, తీర్థయాత్రలందు దినములు గడపుచు, దేశముల వెంటఁ దిరుగుచు, నాంధ్రదేశమున నమరావతి కరుదెంచి కృష్ణవేణీనదీస్నాన మొనర్ప, వస్త్ర ములు తెల్లనై పూతుఁ డాయెనఁట. అంతఁ డా నటనే వసించుచు తపం బాచరించుచుండ, నా ప్రాంతము నేలు సామంతభూపాలుఁ డాతని నాదరించి తనపురికిం గొంపోయి,సాహసధైర్యో దారగుణముల కచ్చెరువంది తనసుత మైలమ నిచ్చి పరిణయ మొనర్చి పలనాటిసీమ నరణ మిచ్చెనఁట.

ఆదంపతులు గురజాలయందు వసించుచు, పద్మనాయకకులోద్భవుఁడైన రేచర్ల బేతినాయ కుఁడు మంత్రిగ కార్యనిర్వహణ మొనర్ప, పలనాటిసీమ నేలుచుండిరి. అనుఁగుభూపతి కింకను విజ్జలదేవి, భూరమాదేవి యను భార్యలు గూడ నుండిరి. ఆ యనుఁగుభూపతికి మైలమదేవియందు నలగామరాజు, విజ్జలదేవి యందు పెదమల్లదేవ, చినమల్లదేవ, బాల మల్లదేవులు (ముగ్గురు), భూరమాదేవియందు కామరాజు, నరసింగరాజు, జట్టిరాజు, పెళ్ళి రాజు ననువారలును సంతానము. అందు నల గామరాజును యువరాజుగఁ జేసిరఁట. వీరెవ్వరు జనింపకపూర్వమే మంత్రిసుతుండైన పెద్దన్న, లేక బాదన్న యనువానిం బెంపకముతీసుకొన, నాతండును ఇటనే పెరుగుచుండువాఁడు. అతఁడే వీరిలో జ్యేష్ఠుండని చెప్పఁబడినది. ఆతనిభార్య పేరు ముక్తలవాంబ. ఆతండ త్తవారితో కలహ మురా వారిం బరిమార్చి తిరుగ వచ్చె నఁట. పలనాటివీరచరిత్రమున నాతనిచర్య లద్భుత ములు. మంత్రి దొడ్డనీఁడు గొప్పవిష్ణుభక్తుఁడు. ఆతనిశిష్యుఁడగు తెప్పలి యను మాలకులస్థుఁ డనుచరుఁడుగనుండువాఁడు. ఆతఁడును పలనాటి యుద్ధవీరులలోనివాఁడే. వా రొకతఱి నల్లగొండ వేఁట కరిగి, భూపతి యడ్డుకొన, వారితోఁ గల హించి, వారిఁ బరిమార్చి, వారిభూముల నీపల నాటిరాజ్యమున గలిపివేసి రఁట.

ఈకాలమునందే నాయకురా లనంబడు

ప్రముఖురా లొకర్తు రాజసమ్ముఖమునకుఁ జేరె నఁట. ఈమహాత్మురా లెవ్వారోగాని, పొలముం దున్నుకొనుచున్న చౌదరి రామిరెడ్డి యను పేరుగలవానికి కొంతధనముతో నొకకంచెలో దొరుక, నాతం డాధనముతో భాగ్యవంతుఁడై యాపిల్లం బెంచి, యొకధని కిచ్చి పెండ్లిచేసె నఁట. ఆధనికుండును, రెడ్డియు నచిరకాలముననే మరణింప, నాధనవంతురా లగు నారీరత్నము పప్రముఖురాలె గడసరి తంత్రజ్ఞురాలు భేదతంత్రములు నడుప ననమానప్రజ్ఞానిధి కలహప్రియురాలునై రాజాస్థానమునకుం జేరం బ్రయత్నించు చుండెనఁట. ఆవీరులయాస్థాన మునం దిట్టిప్రముఖురా లవసరముగ నుండె నేమో. అచిరకాలముననే అనుఁగురాజునమ్మ కమునకుం బాత్రురాలై, నాయకురా లని పిలువంబడుచు కొలఁది దినములలోనే ప్రభు మంత్రులకు మనస్పర్థలం గల్గించి, మంత్రిని వృద్ధుం డనునెపమున పదచ్యుతునిగ నొనర్చి, ఆయన రెండవసుతుండగు బ్రహ్మనాయని మంత్రిం జేసి, రాజును స్వర్గమున కరుగఁ జేసి, యువరాజగు నలగామరాజును సింహాసన మధిష్ఠింపఁజేసె ననియు, నిది యామెప్రథమ తంత్రమనియు నందురు. బ్రహ్మనాయకుఁడు మంత్రిగ నున్నను, నాయకురాలిప్రభ ప్రభుత్వ కార్యనిర్వహణతంత్రముల నెల్లెడలఁ గాననగు చుండెనఁట. ఇట్టివెన్నియో చెప్పంబడియున్నవి. నలగామ ప్రభుం డీరాజనీతివిశారద కధికార మొసంగుచుండ, నొకతఱి నలగామరాజు సవతి తమ్ములు కుతంత్రముల పాలై చంపంబడనుండ, దొడ్డనీని భార్య శీలమ్మగారు వారి నాపద నుండి తప్పించి, తనసుతుండైన బ్రహ్మనాయని కప్పగించెనఁట. ఆతండును వారి నట నుంచుట గాని, తా నాపదవియం దుంట గాని, క్షేమము కాదని తెలిచి, రాజు నెటులనో యొప్పించి, వారిని దూరమునం దుండఁజేయు నెపమున చంద్రవంకనదీతీరమున మాచెర్లయందు వారి నుండ నియమింపజేసి, ఆప్రాంతపుతావు వారి వ్యయముల కిప్పించి, తానును తనపదవికి రాజీ నిచ్చి, వారితో నట నివసించుచు విష్ణుభక్తి యందు కాలముం బుచ్చుచుండె నఁట.

పలనాటి వీరచరిత్రమున ముఖ్యుం డగు బ్రహ్మనీనికుటుంబ మిట్లు వివరింపఁబడియున్నది. భార్యపేరు ఐతాంబ లేక ఈడమ్మ. తల్లి పేరు శీలమ్మ. సోదరుఁడు పేర్నీడు. భార్యపేరు గౌరమ్మ. సూర్నీనిభార్య సీరమ్మ. మల్లినీనిభార్య మాచమ్మ. బ్రహ్మనాయనికి విష్ణువరప్రసాదమున సుతుఁడు బాలరాజు. కడమవా రెవ్వరో పరిగా తెలియదుగాని, విష్ణువరప్రసాదజనితులుగ బ్రాహ్మణస్త్రీవలన పోతరాజు, వేంకపద్మనాయకస్త్రీ వలన దొర్నీఁడు, చాకలిస్త్రీవలన పెదచందన్న, విశ్వబ్రాహ్మణస్త్రీవలన చినచందన్న, కులాల (కుమ్మరి)స్త్రీవలన తేర్కుఁడు, మంగలిస్త్రీవలన మంచన్న అనునార్వురు బాలరాజునకుతమ్ములవలె చెలికాండ్రై మెలంగుచు పినతండ్రియగుపేర్నీని యింటఁ బెరుఁగుచుండి రనియు, (వీరందరు పల నాటివీరులలోనివా రే యఁట.) బాలరాజుభార్య గండు కన్నమనాయనిసుత మంచాలమ్మ యని యు, ఉంపుడుకత్తె వేశ్య సబ్బాయి యనియుఁ జెప్పఁబడినది.

నాయకురాలు వీరి నిట్లైనను బ్రతుకకుండ వీరి కనేకయాపదలం గల్గింప, దైవచింతనానిమగ్నుం డై దినములం గడుపుచున్న బ్రహ్మనాయఁడు రాజు నెదుర్కొనుట యుపాయ మనియు, నాయకురాలిని నమ్మ వీలుకానిపని యనియు తలంచియేమో మాచర్లం గూడ వదలి, కృష్ణా నదిం దాఁటి, శ్రీశైలప్రాంతపుభూపతి యగు మాకరాజునుదర్శించి, యిరువదిమూఁడు గ్రామ ములు గుత్తకుం గుదుర్చుకొని "వీరమేడపి"

యను గ్రామమున నివసించుచు, కాలము గడపుచు, కష్టదినము లేడుసంవత్సరములు ముగియ, నలగామరాజుయల్లుండును, రత్నాల పేరమ్మ భర్తయు నగు అలరాచమల్లుని, నలగామరాజు నాయకురాండ్రకడకు రాయబార మంపుచు "తమ్ముం దిరుగ రాజ్యములోనికి రానిచ్చి యట వసింప సెలవొసంగు"మని ప్రార్థించెను గాని నాయకురాలియ్యకొనమి ప్రయోజనకారి గాక పోయెను. మీఁదుమిక్కిలి విషప్రయోగమున తిరుగుడలలో నారాయబారి మరణింప రత్నాల పేరమ్మయు సహగమన మొనర్చె నఁట.

పిదప బ్రహ్మనీఁడు యుద్ధము తప్ప వేఱు సాధనము లేదని నిశ్చయించెను. ఆయత్తుఁడై బ్రహ్మనాయఁడును, పరివారమును, వీరులును కారెంపూడికి దక్షిణముగ నాఱుమైళ్ళ దూరమున మేళ్ళవాగుకడ దండువిడిసి, అచటనుండి కూడ నొక భటాగ్రజును ప్రభువుకడకు సంధికి రాయబార మనిపి, సంగరము మాని సఖ్యత నెఱపుమని యర్థించె నఁట. నాయకురాలును, ప్రభుఁడును, నిరాకరించి సంగరము నెఱపి శిక్షింతుఁగాక యనెనఁట. ఇత్తఱినే అప్పటికి యువరాజుగ నుండిన కోట దొడ్డకేతరాజు రాయబారమును ఫలితములేని దయ్యె నఁట. (ధరణికోట సామంతరాజ్యము, ఆర్వేలనాటి సీమ చూ.) బాలరాజు సోదరులు చెలికాండ్రు గూడ యుద్ధమునఁ బాల్గొనినవారే. యుద్ధము పెక్కురంగముల వేర్వేఱుగ జరిగెను. ఫలితము వీరులమృతియు, నాయకురాలు దొరకి బంధింపఁబడుటయు, నలగామరాజు బ్రహ్మనిని శరణు జొచ్చుటయు నై యున్నది. బ్రహ్మనాయఁడు వారలను క్షమించి పొమ్మని, తక్కిన తన కాలమును వైష్ణవమతబోధతో యుద్ధరంగమున నేగుఱ్ఱపుకొండబిలమున తపం బొనర్చుటతోఁ గడపె నఁట. నేటికిని అందే తపంబొనర్చుచున్నాఁడని యాప్రాంతములవా రనెదరు.

పలనాటియుద్ధకలహములు క్రీ.వె. ౧౧౬౮–౧౧౦౪ అని పరిశీలకు లనుచున్నారు. తదాదిగ నేటివఱకు నాయుద్ధజ్ఞాపకార్థము కార్తికమాసమున నేఁటనామైదానమున చుట్టుపట్ల గ్రామముల ప్రజలు వీరపూజా మహోత్సవము జరుపుచున్నారు. అందమావాస్య రాచగావనియు, పాడ్యమి రాయబార మనియు, మందపూడనియు, కోళ్ళపందెము లనియు, కల్లిపాడనియు, ఏవేవో వింత పేళ్ల ఉత్సవములు జరుగుచుండును. పౌర్ణమి నాఁడు ఎఱ్ఱజెండా నెత్తుదురు. ఈవీరపూజోత్సవముల జరుప బ్రహ్మనాయనిముద్రకర్త యనఁబరఁగు నొక యధికారి యటఁ గలఁడు. మూఁడవదిన మర్ధరాత్రమున నెల్లురు రకాన్నమును యుద్ధమైదానమున బలుల నిత్తురు. (పలనాటిసీమ చూడుఁడు. దండకవిలె చూ.)

**పలనాటిసీమ**—ఇప్పటి గుంటూరుమండలమున, కృష్ణానదికి దక్షిణతీరమునందు, సముద్రమునుండి ౧౨౦ మైళ్ళదూరమునుండియు డెబ్బదియైదు మైళ్ళదనుక గల ౧౦౫౦ చతురపు మైళ్ళ వైశాల్యముగల ప్రదేశమును "పలనాటిసీమ"యనెదరు. దీనికిఁ దూర్పున చిట్టడవియు, ఉత్తరమున కృష్ణవేణీనదియు, దక్షిణమున దట్టమైన యడవియుం గలదు. దీనిగుండా వాగులేరు, చంద్రవంక నదియుం బ్రవహించును.

ఆది నీప్రాంత మంతయు నాగులనివాస భూమిగ నుండెను. ఆంధ్రభృత్యులపాలనకుఁ బిదప పల్లవులు దీని నాక్రమించినతఱి పల్లవనాడని వాడుక యేర్పడి, రానురాను పలనాడై నేటికిని నిలిచియున్నది. పెక్కండ్రు కవు లీ పలనాటిసీమను తమగ్రంథములందునను, చాటుధారాపద్యములందునను వర్ణించుటచేతనే గాక, ముఖ్యముగ దీనిప్రసిద్ధి పలనాటివీరులని చెప్పఁబడినవారి సంగరమునుండి కలిగినదని తోఁపక

పోదు. (పలనాటివీరచరిత్రము చూడుఁడు.) ఆది కాలమున మహాదేవి, లేక మాదేవిచెఱువుల (ఇప్పటి మాచెర్ల) ఇందు ప్రధానపురముగ నుండెడిది. గురిగింజల (మాధవి లేక గురివెంద గింజల) ఇప్పుడు గురజాల యనఁబరఁగుచు పేరందిన పురము. కారెంపూడి మైదానము సంగరము జరిగినప్రదేశము. మాచెర్ల చెన్న కేశవదేవస్థానమునను, గురజాల త్రిమూర్తిదేవ స్థానమునను, క్రీ. వె. ౧౨ శతాబ్దపు చాగి బేతరాజుగారి శాసనములును, వేల్పూర ఆదిత్య దేవస్థానపుశాసనమును, చారిత్రకపరిశీలకులకు సుప్రసిద్ధములు.

పలనాటివీరులనంబడినవారినాఁడు హైహయ వంశజులై, కార్తవీర్యార్జునచక్రవర్తినుండి ఏడవ పురుషుండగు అనుగురాజును, ఆయనసుతుఁడు నలగామరాజును, (అనఁగా పలనాటికలహములు ౧౧౯౮–౧౧౦౪ అని చెప్పంబడి) పిదప బిరుదాంకరుద్రుఁడని పేరందిన చాగి రెండవ బేతరాజును పలనాటిసీమను భూలోకమల్లునకు సామంతుఁడుగ పాలించిరని చెప్పంబడియెను. ఈయనయు హైహయక్షత్రియుఁడే. (పలనాటి వీరచరిత్రముచూడుఁడు. దండకవిలెచూడుఁడు).

దీనిని తరుచు పలనాడని యందురు. పాఁడికి పేరందినది.

పలనాటిసీమగుండా ఇనుపబాట మాచెర్ల బోవును. కామెపల్లి, గణపవరము, ఈసీమ లోనివి. ఒకప్పుడు కామెపల్లి సుప్రసిద్ధమై కామేపల్లిసీమగా దానిప్రాంతదేశ మెన్నఁబడు చుండెడిది.

**పలము**--ఇది నాల్గుతులముల యెత్తునకు పేరు. కొన్నితావుల నెన్మిది తులముల యెత్తు నకుఁ గూడ పలమని వాడుదురని తెలిసెడిని.

**పలలమేహము**— ఛిద్రమయిన చిన్న చిన్న మాంసపురేణువులు మూత్రముగుండా పడునటుల లోనఁజేరెడి జబ్బు.

**పలలాశయ (రోగ) ము**— ఇం దజీర్తి గండరోగము లుండును.

**పలాలకూటస్య సాదృశంకుంజరాదినా ఇతిన్యాయము**—గడ్డిమొదలగు వాటితో నుత్సవములందలంకారార్థమూ రేగించుట కేనుఁగు వలెను, గుఱ్ఱములు మొదలగు జంతువులవలెను విగ్రహములు రచింతురు. ఇవి బాహ్యాకారభ్రమకరములు. ఇది చిత్రాంగనాన్యాయమువంటి యర్థము కలది. (చూడుఁడు.).

**పలాశిగోతము** -(హారితఉపగణముచూ)

**పలాశి గోత్రము**--(వశిష్ఠ గణముచూ.)

**పల్మిటిక్ ఏసిడ్** (Palmitic Acid)- దీనిగుర్తు C 15-H 21-Co 2-H అనియు, ఇది పామ్ ఆయిల్ (Palm Oil) నుండి దొరకుననియుఁ జెప్పఁబడినది.

**పల్లపు ఏల్టిట్యూడ్సు, ఎత్తు ఏల్టిట్యూడ్సు, నీళ్లుకాఁగు బోయులింగు పాయింటు**(Lower Altitudes, Higher Altitudes, (Water) Boiling point)- లోవరు ఏల్టిట్యూడ్సన భూమిపై పల్లపుప్రదేశము లనియు, హైయర్ ఏల్టిట్యూడ్సన పర్వతములు మొదలగు నెత్తుప్రదేశములపై ననియు నెఱుఁగునది. ఇంక బోయులింగుపాయం టన నీళ్లు గాఁచిన నావిరియై పాత్రనుండి పైని మూయంబడిన మూఁత(యడ్డము) నెత్తి తప్పించుకొని బయటఁబః వేఁడిస్థితి యనియెఱుఁగునది.

ఈ సందర్భమున నీ రావిరియై పైమూఁత నెత్తుటకు వాతావరణపుగాలియొత్తిడి (Pressure of the air) ప్రధాన మని మనసునందుంచుకొనవలసియుండును. ఈయొత్తడి లోవరు ఏల్టిట్యూడ్సునం దధిక (భార) ముగను, హైయ్యర్ ఏల్టిట్యూడ్సునం దల్ప(భార)ముగను నుండునని యిదివఱకు తెలిసినదియే.

పైమూఁత నెత్తుటకధిక(భార)ము ఒత్తిడియుండు తావుల నధికబలమును, అల్ప(భార)ముగ నొత్తిడియుండుతావుల నల్పబలము, నీటియావిరియం దుండవలయునని దీనింబట్టి తెలియక పోదు. ఇట్లనుటవలన లోవరుపల్టిట్యూడ్సునందు నీ రెక్కువ కాఁగుటకును, ఆవిరి దట్టమై పైమూఁత నెత్తఁగలదిగ నగుటకును, వేఁడి యెక్కువ కావలసియుండెను. అనఁగా బోయలింగుపోయింటు ఆలస్యముగ గల్గునని భావము. ఇంక హైయ్యర్ ఆల్టిట్యూడ్సునం దంతవేఁడి యవసర ముండదు. ఏలయన తక్కువఆవిరిబలమే పైమూఁతనెత్తుటకు జాలియుండును గాన, నట్టి యెత్తుగుప్రదేశము లందు వేఁడి తక్కువలందే బోయలింగుపోయింటు త్వరితముగనే సంభవించుచుండును. (బోయిలింగుపోయింటు చూడుఁడు. అప్సల్యూటు జీరో చూడుఁడు.)

**పల్లవనృపతులు**— ఆంధ్రదేశమును కాంచిపురము రాజధానిగ పాలించిరి. వీరు పశ్చిమచాళుక్యులచే నోడింపఁబడి పదభ్రష్టులైరి. దక్షిణదేశపు ద్రావిడ సాంప్రదాయ దేవాలయనిర్మాతలు।పల్లవు లనియే చెప్పఁబడెనది. మహాబలిపురమున వీరికట్టడములు సుప్రసిద్ధములు.

**పల్లెటూరికి పదిదారులు** —(ఆంధ్రలోకో సరియగు బాట ఉండదని భావము.)

**పల్లేరుచెట్టు** - - అది కాచు కాయలు ముండ్లు (పల్లేరుముండ్లు) గాన పేరిడినది. ఇది నేలపాఁకు చిన్నమొక్క. పసుపు, ఎఱుపు, తెలుపురంగుపూవులంబట్టి త్రివిధ భేదములు గలది. అం దొక్కొక్కటి పెద్దజాతిపల్లే రనియు, చిన్నజాతిపల్లే రనియు (చిఱుపల్లేరు) ద్వివిధములుగ నుండును. పెద్దజాతి యంతకు గజపల్లే రనియు నందురు.

పల్లేరుకాయల కేనుఁగులు వెఱచును. పల్లేరు ముండ్లుగల జాగాలో అడుగైన నిడక ఏనుఁగు మూర్ఖొంచి వెనుకకు నిలుచును. ఏనుఁగులకు వెఱ్ఱి మదమెత్తి దానింబట్టుట యుపాయమని తోఁచిన తఱి దానిచుట్టు పల్లేరుగాయలు చల్లుదురు. పాప మాగజ మాసుధ్యనుండి పోవును. పిదప దానినిబట్టుకొందురు. ఏనుఁగును వెఱపించును గాన "గజరిపుః" అని పల్లేరునకు నామమిడిరి.

**పల్లేరు**— Tribulus-Terrestris. ఆంగ్. Caltrops plant సం కంటకఫలా, గోక్షురః. ఇవి పల్లేరుసామాన్యమునకును, షడంగః, స్థూలశృంగాలః, గజదంష్ట్రః అనునవి ద్దపల్లేరు లేక ఏనుఁగుపల్లేరునకును త్రికంటః, త్రికంటకః, త్రికంటకా, స్వాదుకంటకః అను పేర్లు చిఱుపల్లేరునకును వర్తించును.

పల్లేరు సమూలకషాయము గాని, ముఖ్యముగా వేరు, ఆకు, కాయల రస కషాయములు గాని, సమశీతోష్ణత గల్గించి, త్రిదోషములను హరించి, పైత్య, మేహముల ఉద్ధృతముల నడంచి, ధాతుపుష్టి, వీర్యవృద్ధి, బలము గల్గించు ననియుఁ జెప్పఁబడినది. మఱియు ల ఋతు రక్తమును ప్రసవస్త్రీల మైలరక్తమును చక్కఁగ వెడలఁజేయుగుణము దీనికిం గలదనియు, ల వంధ్యత్వముఁ బాపుననియు, అగ్నిమాంద్యము, కఫదోషము, కీళ్ళనొప్పులు, నోటిపూత, ప్రమేహము, పల్లికలు (కడుపులోని)బల్లలు, మూత్రనిరోధము, మూత్రకృచ్ఛ్రము, మూలవ్యాధి, రకపొడలు, శూలలు, శోష, తాపములు, సర్పవిషములు నివారింపనిది వజ్రాయుధము వలె పనిచేయు ననియుఁ జెప్పఁబడినది.

ముండ్లు దీసిన పెద్దపల్లేరుకాయలను మువ్మూడ్రావుపాల నుడికించి లోని కిచ్చిన శిథిలమైన శరీరమైనను బలపడి ధాతుపుష్టి గల్గఁజేయు ననియు జెప్పఁబడినది.

**పల్వాల్** (తొల్లింటి అపేలవము)—అపేలవము చూడుఁడు.

**పల్సిమీటర్** (Pulsimeter)—చేతి నాడులయొక్క నిర్ణయమును దెల్పు పరికరము.

**పల్సోమీటర్** (Pulsometer)—పల్సిమీటర్ వలెనే యుపయోగపడు గొట్టము వంటి పరికరము.

**పవడము(పగడము)** లా. Corallum. ఆంగ్ల. Coral. ఫ్రెంచి-De, corail జర్మను. Korallion. సం. ప్రవాలః, ప్రవాళః.

పగడ మెఱ్ఱజాతి తెల్లజాతి యని ద్వివిధము. ఇం దెఱ్ఱజాతి శ్రేష్ఠము. ఎఱ్ఱపవడము నవరత్నములలో నొకటి. ఎక్కువ విలువ గల్గినది. తెల్లపవడమునకు ధర లేదు. దీనిని రాయిగను, దానిని గాల్చి సున్నముగను రాళ్ళు లేనిచోట వాడుదురు. తెల్లపవడములు సర్వసాధారణముగ నెక్కువగఁ గానఁబడును. ఎచ్చటనైన నుష్ణప్రదేశముల సముద్రమున పగడము నీటిమట్టమున ంచుక దిగువగఁ గాని, యించుక పైగాఁ గాని యుండును. మధ్యధరాసముద్రమున (Mediterranian Sea) లభించుచున్నది.

పవడ మించుమించు చంతయు "Carbonate of Lime" అని పోల్పఁబడినది. ఎఱ్ఱపగడము జాతికి "Carallium rubrum" అని లాటిన్భాషయందు పేరిడి యున్నారు. గడములు Polyp అనువాట్లవలన సముద్రపు నీటియందు లభించు నేదో యొక సున్నపు పదార్థముతో నిర్మింపఁబడిన వనియు, అటుల నిర్మింపఁబడిన కతన వాటికి "Solid Skeleton of Zoophyts secreted from sea water within the tissues of polyps" అని రసాయన శాస్త్రవేత్త లనుచున్నారు. మఱియు నీ Coral polyp అనఁబడు నదిజీవముగలజంతువు కాదని తేలినది. కాని, ఇది ఈపగడపుచట్టులను (లెక్కలేనిరకముల చెట్లకుం బోలునటుల) నదే పనిగ కట్టుచు, కాలముగడచినకొలఁది క్రమశః తన నిర్మాణమును బూరిచేయునని కనిపెట్టఁబడినది. ఐ టనిర్మాణ మగు తెల్లపవడము చట్టులకు "Coral reef" అనియు, "Coral bar" అనియు నాంగ్లమున పేరిడియున్నారు ఇట్టి పగడపుచట్టుల సముదాయములవల్ల ప... మహాసముద్రమున Coral island అను పేరం బరఁగు ద్వీప మొకటి ఏర్పడియున్నది. ఇందు మనుష్యులు వసించుచున్నారు. కొబ్బరితోఁటలు మెండుగఁ గలవు.

పరిశీలకుల యిటీవలి పరిశీలనలు ఈపవడపు చట్టులన్నియు చిన్న చిన్న గూడుల సముదాయములనియు, అందు Polyp లు నివసించుటకుఁ గాను నిర్మించుకొనె ...ు, రానురాను ...్రొత్త Polyp లు ఎల్లపై క్రొత్తగూడుల ...ర్మించుచుండి వసించుచుండె ననియు, ఇటుల ...లము గడచినకొలఁది పెరిఁగి పెరిఁగి ...చుండు ననియు వెల్లడించినవి. ఇందు వలన Polyps జీవముగల జంతువు లేమో యని తోఁచక పోదు. ఏది యెట్లైనను పాఁస్ప్రీటు. డెబ్బది డిగ్రీలవేఁడికిఁ దక్కువగ కాయు నెండగల తావులందునను, ముప్పది లేక నలుబది ఫాతములకన్న నెక్కువ లోఁతుగల సముద్రపు నీటియందునను Polyps కానిపింపవు. ఇంకను సముద్రమునం జేరుకొను నదీముఖద్వారముల "Sediment" నీటిబంటు నిల్వయుండునుగాన నచట గాన్పించుట లేదు. ఇందువలన మంచి నీటియందు వర్ధిల్లవనియు నీటిబంటు మొదలగు ఏజాతి నీటియడుగున జేరుకొని అట నిల్వయగు నీటికవ్వగల తావుల వర్ధిల్లవనియు తేలుచున్నది. మఱియు నీకారణములనుండి భూమధ్యరేఖ (Equator) కిరువైపులను 30 డిగ్రీల ప్రదేశముగ భూమిం జుట్టి పవడపుచట్టు లుండునేగాని

వాట్లనుదాటి ఉత్తర దక్షిణదిశల నెచ్చటను గానరావని యెఱుంగునది.

పగడము నాయుర్వేదశాస్త్రోక్తముగ భస్మ మొనర్చిన నాప్రవాళభస్మము శ్లేష్మములపై చక్కగ పని చేయుననియు, పైత్యము, మేహ కారకము, మేహవాతము, అగ్నిమాంద్యములనే గాక, చక్కఁగ అనుపానములతో సేవించిన త్రిదోషములను నివారించు ననియు, అతిమూత్రము, రక్తముస్రవించు మూలశంకరోగములు కూడ నివృత్తియగుననియుం జెప్పఁబడినది.

తేనెతో పగడము నరగఁదీసి నోటికిపూసిన జిహ్వాదోషము నివారణ మగునందురు. పగడమున పుప్పి తిని వైచినటుల గోతు లుండుట దోషము. ఎఱుపునందు తెలుపు ఇంచుక కలిసిన వర్ణము గల్గియుండుట గుణము. బరువు చక్కఁగ గల్గి, పెద్దవిగనుండియే వన్నెగల్గి దోషరహితమైన పవడములు మంచి ధర గల్గి యుండును. విలువగల యెఱ్ఱపవడములవర్తక మిక్కాలమున ఇటలీదేశ హస్తగతమై యున్నది. ఆంగ్లపరిశోధకులు పగడపుచట్టు సముదాయములను ౧ Fringing reef జాలరు వలె కన్నములం గల్గియుండుచు గట్టువలె నుండు పగడపుచట్టు (లేక పగడపుకొండ) ౨ Barrier reef గట్టిదై నీటిని తనగుండా ఒకదెసనుండి వేఱొక దెసకు పోనీయక నిరోధించు పగడపుచట్టు (పొడవున నుండు పగడపుకొండ) 3 Atolls గుండ్రముగనో లేకఅర్ధచంద్రాకారముననో లేక గుఱ్ఱపులాడముం బోలియో నీటిం జుట్టుకొని యుండు పవడపుచట్టు (లేక పవడపురాతి కొండ). ఇది వంగియుండునది.

**పవనతృతీయతిథి** - చైత్రశుద్ధతృతీయ. గురువారము, అశ్వినీనక్షత్రము, వైధృతియోగము గూడి, అప్పుడు కన్యారాశియందు బృహస్పతియుండుట సంభవించునేని దానిని "పవన తృతీయ"య నెదరు.

**పవనముక్తాసనము**— యోగశాస్త్రమున చెప్పఁబడిన ఆసనములలో నొకటి. (ఆసనములు చూడుఁడు). కుడిమడమ కుడిపిఱుఁదునకును ఎడమమడమ యెడమపిఱుఁదునకును తగులునటుల అండముల కిరుపక్కల నుండునటుల గొంతుగూర్చుండి చంకలను మోఁకాళ్లపై నానించి, వీలగునంత దగ్గరగఁ జేర్చి, రెండు చేతులచేత బంధము వైచి కూర్చుండుట "పవన ముక్తాసన" మనంబడును.

ఈ యభ్యాస మపానమునందలివాయువు నడంచునని చెప్పఁబడినది.

**పవనాసనము**— యోగ శాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. మోఁకాళ్ళ నేల నానించి వాటిపై నిలిచి నాభిని రెండు వ్రేళ్ళతో నొత్తుట పవనాసన మనఁబడును ఇది జఠరాగ్నిని బలపఱచునని చెప్పఁబడినది.

**పవమానపర్వతము**— దేవీభాగవతము ౮-౭యందు ప్రశంసింపఁ బడినది. ఇదిపారియాత్రపర్వతశాఖగా చెప్పఁబడినది. హిందూకుష్ పర్వతపంక్తియందలి పాఘ్మాన్ పర్వతమని పోల్చుచున్నారు. దీనిని పాఘ్మాన్ రేంజియనుచున్నారు.

**పవిత్రప్రవాహములు (నదులు)పది**— (దశపవిత్ర ప్రవాహములు చూడుఁడు.)

**పవిత్రము** పవిత్ర మన పూత మని యరము. ఆయుర్వేద వైద్యశాస్త్రమున కుశ దర్భ, జమ్మి (శమి), జలములు, తామ్రము, తులసి, తేనె, నువ్వులచెట్టు, నెయ్యి, పచ్చకర్పూరము, పుత్రజీవిచెట్టు, బంగారము, మేడిచెట్టు, రావిచెట్టు, హిజ్జల (సముద్రఫల) వృక్షముల కీపేరు వాడఁబడినది. యవలను పవిత్రధాన్య మని వాడిరి.

**పవిత్ర సరస్సులు పండ్రెండు**— (ద్వాదశ పవిత్ర సరస్సులు చూడుఁడు.)

**పవిత్రస్థలులు** (Holy centers)—హిందువులకు బనారసుపట్టణము పవిత్రనగరము.

మహమ్మదీయుల కరేబియా దేశములోని మక్కానగరమును, మదీనాపురమును పవిత్ర స్థలులు.

యూదులకు, క్రైస్తవులకు పాలస్తినా దేశపు జరూసలెమ్ పురము పవిత్రనగరము.

పశ్చిమఅరబ్బులకు ఫెజ్ పురము పవిత్రస్థలి

రష్యాదేశపు క్రైస్తవులకు మాస్కోనగరము, కీఫ్‌పురము పవిత్రనగరములు.

మార్మన్‌క్రైస్తవులకు అమెరికాసంయుక్తరాష్ట్రములలోని సాల్టులేకుసిటీ పవిత్రనగరము.

సిక్కులకు అమృతసర్ నగరము పవిత్రస్థలి.

చైతన్యమతస్థులకు బంగాళములోని నవద్వీపము పవిత్రస్థలి.

కబీరుమతస్థులకు హిందూస్థాన్ దేశమందలి మాగర్ గ్రామము పవిత్రస్థలి.

బౌద్ధమతస్థులకు గయాపట్టణముకడనున్న బుద్ధగయ పవిత్రస్థలి.

రోమన్కాతలిక్కు క్రైస్తవులకు ఇటలీదేశములోని రోమునగరముకడనున్న వెటికాన్ పవిత్రస్థలి.

జపాన్‌దేశస్థులకు టోకియో నగరమునకుం గొంత దూరముననున్న ఫుజిసామాపర్వతశిఖరము పవిత్రస్థలి.

తొల్లింటి గ్రీకుదేశస్థులకు ఆదేశమందలి ఒలింఫస్ పర్వతశిఖరము పవిత్రస్థలి.

ద్వైత (మధ్వ) మతస్థులకు ఉడిపి(రజితపురి) పవిత్రస్థలము.

బైరాగులకు(సాధువులకు)హరిద్వారముకడనున్న హృషీకేశము పవిత్రస్థలము

క్రైస్తవులు పాలసినాదేశమందు యేసుప్రభువు తిరిగినప్రదేశమును Holy land అనుచున్నారు.

మహమ్మదీయులు మక్కానగరమును జుట్టి కొంతదూరముదనుక వ్యాపించియున్న అరబ్బీ దేశభాగమును Holy land అనుచున్నారు.

బౌద్ధులగు చీనాదేశస్థులు బుద్ధభగవానునితో సంబంధముగల దేశమును Holy land అనెదరు.

గ్రీకులు ఓలింఫియా పర్వతప్రాంతమును Holy land అనియెదరు.

జపానీయులు ఫుజిసామాపర్వతప్రాంతమును Holy land అందురు.

**పవిత్రారణ్యములు తొమ్మిది**-- (నవ (పవిత్ర) అరణ్యములు చూడుఁడు.)

**పశునాయకత్వము**—దీనిని పంచాంగములందు పశుపాలకత్వమనియు వాడుచుందురు. ఏయేట (ఆసంవత్సరమున కంతటికిని) పశునాయకత్వములు మాఱుచు పంచాంగములందు వివరింపఁబడుచుండును. ౧ యముఁడు, ౨ బలభద్రుఁడు, ౩ గోపాలుఁడు పశునాయకత్వములు వహించుచుందురు.

**పశుపతి**-పరమేశ్వరుఁడగు రుద్రునియొక్క యెనిమిది యాకారములలో నొకటి. (అష్టమూర్తులు చూడుఁడు.)

**పశుపతినాథక్షేత్రము**— ఇది నేపాలదేశపు రాజధానియగు కట్మండూ (తొల్లింటి ఖస్తమండప పురము) నగరమున కీశాన్యదిశగా మూఁడుమైళ్ళదూరమున మృగస్థలి యనంబడు కొండలోవయందు భగవతి లేక భగమతి యనుపేరుగల చిన్న జలప్రవాహముయొక్క పశ్చిమతీరమున దేవీపట్టణ మనుపేరుగల గ్రామముకడనున్న శివక్షేత్రము. దేశముబౌద్ధాక్రాంతమైన పిదప దేవాలయమున శివలింగముకడ బుద్ధభగవానుని విగ్రహ మొకటికూడ నిడియున్నాదు. అట్లొనర్చియు శివలింగము

నర్లై పూజించు చుందురు. ఎదుటనున్న నంది అట్లేయున్నది.

ఇచట భగవతీనది యొకకొండను కోసికొని మృగస్థలిలోవలో ప్రవేశించి దేవీపట్టణముగుండా పశుపతీశ్వరుని దేవాలయమునకు తూర్పుగా దానినంటియే ప్రవహించుచుండును. దీనివెడలు పాయుగజము లుండెడిని. మొలలోతునకుఁ దక్కువగా నుంట స్నానముల కనుకూలమై యుండును. జలము లతినిర్మలములు. వడి కొంచె మధిక మనియే చెప్పఁదగును. మృగస్థలిలోవకు నేపాలదేశస్థులు మృతస్థలి యనియర్థమిచ్చు నీడ యొక్క లోవ యనెదరు. ఇందలి సజత్త్వము మృతి కర్హమగు పవిత్రస్థల మని. పశు వనిన ప్రాణమున కర్థము గాన పశుపతీశ్వరుఁడు ప్రాణుల కధినాథుఁడగు పరమేశ్వరుఁ డని చెప్పఁబడినది. ఈ క్షేత్రమున మరణించుట వలనఁ గలుగుఫలము పాశవిముక్తి. ఇట్లు వేదాంతశాస్త్రమున వివరింపఁబడిన పతి, పశు, పాశముల తా విదిగాఁ జెప్పఁబడినది.

పాశబంధమునుండి ప్రాణికి విముక్తి గల్గించు పతి (పశుపతి) క్షేత్రమున భగవతీనది పరమేశ్వరునిశక్తియొక్క మాయావస్థగాఁ దలంపఁబడుచున్నది. నేఁటికిని దేవాలయావరణము నందే మృతికై నిరీక్షించుచు రోగులు పరుండి మూల్గుటతోఁబాటు పశుపతినాథుని దలంచుకొనుచునుంట ననుదినముకాననగుచునే యుండెడిని. దేవాలయపు తూర్పువైపు గోడ కవ్వలనే నదీతీరముననొకటికన్న నొకటి యెత్తుగ మూఁడు వరుసలను నదియందలి దేవాలయపుస్నానముల సోపానపంక్తి కిరుదెసలను దిమ్మలు గట్టి వాటిపై చనిపోయినవారి కళేబరములను దహన మొనర్చుచుంట నిట సార్వకాలిక దృశ్యమే యనిన నతిశయోక్తి కానేరదు. పశుపతినాథము కట్మండూ నగరమునకే గాక పరిసరస్థ కిని మహాశ్మశాన మని చెప్పఁదగును

ఇట్టి మహాక్షేత్రమున కాదిని అశోకచక్రవర్తికుమార్తె చారుమతీదేవి భక్తితో నరుగుదెంచి, తన కడదినములు గడపి, యిటనే మృతి నొందె నందురు. ఆమె యిచటి కట్టడములను విరివిగఁ గట్టించె నందురు. క్షేత్రమున నేర్పడిన గ్రామమునకు "చారుమతీదేవీపట్టణ" మనియామె నుండియే పేరయ్యె నఁట. కాలవశమున చారుమతి యనుమాట లోపించి దేవీపట్టణ మని వాడఁబడుచునే యున్నది. దేవాలయపు తూర్పు భాగమున నదిలోని క్రిందిమెట్లవరుస కార్యఘట్ట మనిపేరు. దేవాలయమునుండి నేపాళగ్రామమునందలి బజారులోనికి దారిఁ జూపును.

నది కిరుదెసలందు దేవాలయపరిసరముల చిన్న చిన్న దేవాలయములు పెక్కు లున్నవి. ప్రధానదేవాలయము నేపాలదేశపు గొప్ప భవనములం బోలి యంతస్తులుగ నిర్మింపఁబడి కడకుబంగారుమలామాచేసిన కొంతప్రదేశమును స్వర్ణశిఖరమును గల్గి యున్నది. ఇట్టివి కొన్ని దేవళములందుఁ గూడ నిటఁ గానవయ్యెడిని. పశుపతినాథుని యెదుటనున్న నంది రాగిలోహముతోఁ బోఁతపోయఁబడి బంగారుమలామా చేయఁబడినది. ఉదయమునను, సాయంకాలమునను, నీరెండయం దీమలామాపనుల సౌందర్యము చూడఁదగినది. (నేపాలదేశము చూ.) భగవతీనది దాఁటుటకు రెండువంతెనలు కలవు. ఈప్రాంతముల బంతిపూవులపూజ లధికము.

## పశువులు తమపిల్లలను శిక్షించుట-

తప్పొనర్చినకతన తమపిల్లలను ఆవులు పొడువఁ బోవుటయు, పాలుగుడుచుతఱి బాధ గల్గించిన తన్నుటయుఁ గలదు. కోపముగల్గినతఱి తమ వైరిని దఱుముట, పొడుచుట, తన్నుట, కఱచుట పెక్కు మృగములు, పక్షులు, పశువులు మొదలగు జంతువులందుఁ గలదు. తమ పిల్లల కపాయము గలుగకుండునంతటి జాగ్రతతో శిక్షిం

చుట మనము పరిశీలించుచోఁ గానవచ్చెడిని. మాంద్యవిశేషముగలవగుట, కొంతవఱకోర్పుట విశేషముగఁగన్పట్టినను తమపిల్లలనుమందలించు ననియే తెలియఁ గలదు.

**పశువులజ్ఞానము**—పశువులకు నైసర్గికముగఁగల లక్షణములవిధి తప్ప కృతకములు కల్పితములు నగు ధర్మనిబంధనలు, విధినిషేధములు లేవు. వాట్ల బుద్ధియు మాంద్య మగునది. ప్రాణినైసర్గిక మగు ప్రేమయు, భీతియు, సంతసము, తృప్తి, కోపము, కొంచెముపాటిపగ ఇవి యున్నను, మఱవు విస్తారముగ నుండును గాన, తనపిల్లలును, తామును కలిసియేయున్న తావుల పెద్దవైనను తమపిల్లలను జ్ఞాపక ముండునేమో యని సంశయము కల్గెడిని. పశువుల యందు స్నేహము తాత్కాలికముగ నైన నుండును. కాన నాభావమునవో, పరిచయముగలవారిపట్ల నుండు స్వల్పమగు మిత్రభావమునవో, తనపిలలను తలి పెద్దవియైన పిదప నెఱుంగఁ గల్గెడిని. మగపశువులకు తమపిల్లలనియు, తమసంతతి యనియు నసలే తలంపు గలుగదు. అచ్చటచ్చట పెద్దవియైనను పశువులు తమతల్లికడ వార్ధక్యమున నున్నను వినయముగల్గియుంట బాగుగ పరిశీలించినవారు కని ట యున్నారు.

తన్నెడఁ బాసి కొంతకాల మున్ముండి పెద్దదియైన తనపిల్లను ఆఁడుపశువు పరాయి పశువులను జూచినట్లు జూచి మెలంగుట సర్వసాధారణమే. ఇందులకుఁ గారణము మఱపే.

**పశువుల భాషలు** — ఒకరి భావముల నింకొకరికిం దెల్పుటకై నోట ధ్వనిచేయుటకు మాటలాడుట యనెదరు. ఇతరులు తెల్పు భావములలో గల నోటిధ్వనులు గ్రహించుటకు మాటలు వినుట యనెదరు. ఇట్టిపని మానవులలో నొక్కొక్క తెగవారి కొక్కొక్క విధమగు ధ్వనుల యుచ్చారణ మర్థవ్యాకరణనిబంధనములతో ఆంధ్రము,కన్నడము,మహారాష్ట్రము, హిందీ, ఆంగ్లము, ఫ్రెంచి, జర్మను మొదలగు పెక్కుభాష లేర్పడియున్నవి. ఇవి మానవు లందుఁగల యేర్పాట్లు. ఇందువలన భాషలకు మూల మన్యోన్యభావముల మార్పని తేలుచున్నది.

తక్కిన పశుపక్షిమృగాదులందు వ్యాపించి యున్న భాషలు నైసర్గికములు. అనఁగా మానవభాషల వలె నభివృద్ధి నందినవి కాని, వికాసావస్థనందినవిగాని కావు. ఏలయన వాటి యందు శాస్త్రపదములు, వైజ్ఞానికపదములు మొదలగునవి విరివినంది భాష వికసింపలేదు. అన్యభాషలపదము లాయాజంతువుల స్వభాషలం దసలే చేరియుండలేదు. కాని కోఁతులు మొదలగు కొన్ని తెలివిగల జంతువులభాషలించుక యధికములుగ నుండునేమో యనిపించెడిని. పక్షులభాష లేస్థితియం దున్నవో మనము చెప్పుటకు వీలు గాకున్నను నభివృద్ధి నందిన వనుటకు నిదర్శనములు గానరాకున్నవి.

**పశువులు-పాలు**—శరీరములందు తన కవసరమైనకార్యముల కుపయోగించు తిత్తులు (Glands) కొన్ని యుండును. అట్లే యింక గ్లాండ్సు కొన్ని శరీరమున కవసరము లేనివాటిని వడకట్టునవియు, కొన్ని మార్పుజెందించునవియు కలవు. చెమట యిట్లే రక్తమునుండి వడకట్టఁబడినది. వేఱుగ కొన్ని గ్లాండ్సు అన్యుల కుపయోగించుకార్యముల కనుకూలించు నవియు నుండును. పశువులకు పెయ్య లుండుతఱి వాటియాహారముగ నుపయోగించునట్లు రక్తము మొదలగువాటిని వడకట్టి పాలుగ మార్చి పెయ్యలయాహారముగ నుపయోగించునట్లు చేయునవియుఁ గలవు. అట్టిపాలను మనుష్యులుగూడ నుపయోగించుకొనుట పశువుల నధికోపయోగ

మునకు పాలొనర్చుట యని స్ఫురింపకపోదు. భూతయద్దముతో పశువులపోదుగులుపరిశీలించిన రక్తప్రవాహముకడనే దానినివడియఁగట్టిపాలుగ నొనర్చుగ్లాండ్సు కలవని తెలియఁగలదు.

**• పశువులు నిలువుటద్దములోని నీడ చూచినఫలితము**—పశువులను నిలువుటద్దముకడకుఁ గొంపోయి చూపిన అద్దమునందలి తమనీడను జూడఁగలవు కాని, యది తమరూపమని పోల్పఁజాలవు. పశువులు వాసనవలన పసిపట్టునవి గాన నది యొకపశువని యనుకొనఁగల్గినను నమ్మవు. ఇతరపశులనీడను తనపెయ్యనీడను చూచినయావు పోల్చినను పోల్పఁగల్గెడిని. పోల్చుననియుఁ గనిపెట్టఁబడినది. కాని, తనరూప మెట్టిదో తా నసలే యెఱుంగనిపశువు నిలువుటద్దమందలి నిజచ్ఛాయను తనరూపముగా పోల్పఁగల దనుటకు వీలు లేదు.

కోఁతులు తమనీడ చూచుకొని యొనర్చు చేష్ట లన్నియు నితరమగు కోఁతులు తమ్ము సమీపించుతఱి జరుపునవియే గాని తమరూపమును గాంచుతఱి తా మభినయించునవి గావని స్పష్టమగును.

**పశువులు (ఎఱ్ఱనిబట్ట చూచి) బెదరుట**—ఎఱ్ఱనిబట్టలు చూచిన పశువులు బెదరుట పెక్కం డ్రెఱింగినదే. బలహీనమగు మనస్సును,దృఢమగు వివేకజ్ఞానమును లేనిమనుష్యులకు కొందఱకు సైత మెఱ్ఱనిరంగు శరీరస్మారకము సడలించియు, శరీరము బరువెక్కించియు, ఆవేశము నొందించియు సివమూఁగున ట్లుద్రేకము గల్గించును.

మానవతఁగతియే యిట్లుండ మూఢత, అజ్ఞానము, స్వల్పమగు దూరాలోచనము, విశేషమాంద్యము గల పశువులసంగతి ఎఱ్ఱనిరంగు గల బట్టలు మొదలగు పెద్దదృశ్యములచే నతి సులభముగ నాకర్షింపఁబడి, ఉన్మాదముగల్గించి వీరావేశమును గాని, భయమును గాని, ఉద్రేకింపఁజేసి, పొడుచుటకో లేక పాఱిపోవుటకో ప్రేరేపించును. దీనినే మనము బెదరుచున్న దందుము

**పశ్చిమఆఫ్రికా**—ఆఫ్రికాఖండముయొక్క పశ్చిమ భాగమును ఐరోపా దేశములవారు గైకొనియున్నారు. ఈప్రదేశ ముత్తరమున సహారాఎడారి మొదలు దక్షిణమునట్రోపిక్ఆఫ్ కేప్రికోరన్‌వఱకును, పశ్చిమమున అట్లాంటిక్కు మహాసముద్రతీరము మొదలు తూర్పున భూమి కొన్నివందలమైళ్ళదనుక వ్యాపించి యున్నది. ఈప్రదేశమున స్పానిష్ ఆఫ్రికా, సెనిగాంబియా దేశము లుత్తరముననను, అప్పర్ గినియా మధ్యభాగముననను, లోవర్గినియా దక్షిణమున దిగువ భాగముననను గలవు.

పశ్చిమఆఫ్రికాయొక్క యెల్లలలో సూడాన్ వైపు కాంగుపర్వతములు కలవు. సియర్లియన్ (సింహగిరి, Lion Hill)సముద్రపుదరి నున్న పర్వతము, కామెరూన్‌కొండలు, ఫెర్నాండోపో యను పేరుగల ద్వీపమున కెదురుగా నున్నవి. ఈప్రాంతభూమికి 'Bight of Biafra' అనిపేరు కలదు. సెనిగాల్ నది, గాంబియానది, నిగేర్ నది, కొంగోనది ముఖ్యములు. తక్కిన పెక్కు చిన్నచిన్న నదులు తమముఖద్వారము లడవులచే మూయఁబడి తెలియఁబడక సముద్రమునఁ జేరుచుండునవి కలవు. నిగేర్ నదియొక్క దిగువ భాగ మొకడెల్టాయై యున్నది. ఇది చాల పెద్ద డెల్టాయై యున్నది. నైలునది పెద్దది యైనను కాంగోనదిగుండా యెక్కువజలములు సముద్రమునఁ జేరుచుండు నందురు. దేశ మంతయు నుష్ణదేశము. ఐరోపా దేశస్థుల కనారోగ్యకరము.దీనినికొందఱు White man's grave అని వాడుచుందురు. ఇంత అనారోగ్యకరమగు

దీని యేటియిసుకలందు బంగారము దొరకు చుండును. దుంపజాతులు, కసవధాన్యములు, మొక్కజొన్నలు, జొన్నలు, బటానీలు, నీలిమందు, మిరియములు, పైరుచేయఁ బడుచుండును. అరఁటితోఁటలు, Oil nut చెట్లతోఁటలు కలవు. అడవులం దేనుఁగుదంతము దొరకుచున్నది. జనులు నీగ్రోజాతివారు. ఇంత యనారోగ్య భూమియైనను కొన్నిప్రదేశములందు కొంతమంది యైరోపాజాతులవారు వసించుచునే యున్నారు. మహమ్మదీయమతము ప్రధానమతము. బానిస వర్తక ముండెను గాని యిప్పుడు డాఁపివేయఁ బడినది.

నీగ్రోజాతులు వినోదాభిలాషులు గలవారు. సాయంకాలములం దాటపాటలు విస్తారముగఁ గానఁగుచుండును. కొన్నిజాతుల యిండ్లలో మనుష్యులపునుక లలంకారముగ నుంచుటయుఁ గలదు. ౧ స్పానియా పశ్చిమఆఫ్రికాదేశము, ౨ సెనిగాంబియా, ౩ బాతురస్టుకోలనీ, ౪ అప్పర్గినియా, ౫ లోవర్గినియా అని యీ ప్రదేశ మైదుభాగములుగనున్నది. వీట్లంగూర్చి వేర్వేఱు తావులందుఁ దెలియనగును.

**పశ్చిమగోదావరిజిల్లా**—ఆంధ్రదేశములోనిది. చెన్నరాజధానిలో జేరి యున్నది. ఏలూరు ముఖ్యపట్టణము. కొవ్వూరు, నిడదవోలు, తాడేపల్లిగూడెము, తణుకు, నర్సాపురము, భీమవరము, ఆకివీడు వర్తకస్థానములగు నితరపట్టణములు. కొల్లేరుసరస్సు ఈజిల్లాలోనిది. భీమడోలు సమీపముననున్న ద్వారకాతిరుమల సుప్రసిద్ధవిష్ణుక్షేత్రము. పంగిడిగూడెము జమీందారీస్థలము. పాలకొల్లు నిమ్మ, దబ్బ, నారింజతోఁటలకు పేరందినది. ద్వారకాతిరుమల ప్రాంతమున రెడ్డిసీమకలదు. (రెడ్డిసీమ చూ.)

**పశ్చిమచాళుక్యులవంశావళి**-[పశ్చిమచాళుక్యరాజులు(చంద్రవంశక్షత్రియులు)చూ.]

**పశ్చిమచాళుక్య లిపి**— చళూక్ వంశ నృపతుల పాలనములనుండి చాళుక్యశబ్ద మేర్పడినదిగ నెఱుంగ వలయును. అశోకబ్రాహ్మి (మౌర్య) దేవనాగరలిపినుండి యేర్పడిన గుహా లిపినుండి చాళుక్యలిపియు, దానినుండి పశ్చిమ చాళుక్యలిపియు నేర్పడినవి. చాళుక్యుల శాసనములలిపికాలము క్రీ.వె. ౫వ శతాబ్దప్రాంతము.

కల్యాణనగరము రాజధానిగ కుంతల మహారాష్ట్రదేశ మేలినప్రభువులు చాళుక్యులు. వీరియందు జైనుఁడగు బిజ్జల మహారాజుకడనే లింగాయత మతకర్త యగు బసవేశ్వరుఁడు మంత్రిగ నుండువాఁడు. ఇది క్రీ. వె. ౧౧౬౦ ప్రాంతము.

తూర్పుచాళుక్యలిపియందలి యక్షరములు నిలువుగను, చౌకముగను నుండఁగా పశ్చిమ చాళుక్యలిపియందలి యక్షరములు కుడివైపున కొరిగియుండును. ఇది వీట్ల ముఖ్యభేద మని గణింపఁబడుచున్నది. క్రీ.వె. ౬౫౦ తరువాతి శాసనలిపులం దీభేదము తప్పక గాన్పించెడిని.

పరహల్లుపై రేఫము వ్రాయుట వేంగిలిపియందువలెనే దీనియందునను గలదు. క్రమక్రమముగ నిదియే తెలుఁగునందలి రకారపు పొల్లుగ నేర్పడియెను. కదంబరాజులనాఁటి శాసనములీ లిపివంటి (ఇంచుకభేదము గల) లిపియందు వ్రాయఁ బడినవి. (తెలుఁగు కన్నడ లిపులు, దాక్షిణాత్యలిపులు, భరతదేశపులిపులు, తెలుఁగులిపి చూడుఁడు).

**పశ్చిమచిదంబరము**-(పేరూరు చూ.).

**పశ్చిమతానాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. రెండుకాళ్ళు నిలువున చాఁచుకొని కూర్చుండి, కాలిబొటనవ్రేళ్ళను చేతులచే బట్టుకొని, లలాటమును మోఁకాళ్ళకు తగులునట్లు వ్రాలి, (జాలం

ధరబంధము వేసి) భూమిమధ్యస్థానమును చూచు చుండుట "పశ్చిమతానాసన" మనంబడును. దీని యభ్యాసమున కడుపు పలచన యగుటయు, జఠరాగ్ని బలపడుటయు, ప్రాణవాయువు సుషుమ్నగత మగుటయు సంభవించు నని చెప్పఁబడినది. యోగాభ్యాసులు దీనిని తప్పక యభ్యసింతురు.

**పశ్చిమమాళవ**-- (అవంతిదేశముచూ.)

**పశ్చిమవాహినీకావేరీనది**— మైసూరు రాజ్యమున శ్రీరంగపట్టణమునుండి యొకమైలు దూరమునఁ గలదు. కావేరీనదియందలి స్నాన తీర్థము. కావేరీనది పశ్చిమవాహిని (పశ్చిము దిశగా ప్రవహించునది) గాన, మహాపవిత్రము మను మహాఫలదాయినియు నని చెప్పఁబడినది. ఇట మైసూరు స్టేట్ రెయిల్వేపై పశ్చిమవాహిని స్టేషను గలదు. గొప్ప సోపానములను మైసూరు ప్రభుత్వమువారు నిర్మింపఁజేసి యున్నారు.

**పశ్చిమోత్తరపుపరగణాసరిహద్దు జాతి సీమలు**-భరతదేశపుపశ్చిమోత్తరపుసరిహద్దు నకు "డురాండు లైను" నని యెదరు. (డురాండు లైను చూడుఁడు). ఈడురాండులైనున కవ్వల ఆఫ్ఘను దేశమును, ఇవ్వల కొండలప్రదేశమును గలవు. కొండలగుండానే కైబరుప్యాసు నడు చుచు, ఇండియానుండి ఆఫ్ఘనుస్థానమున కేగు మార్గ మైయున్నది. అనఁగా కైబరుప్యాసున కిరుదెసలను పర్వతప్రదేశములు కలవనిభావము. అవియే పశ్చిమోత్తరపుసరిహద్దుజాతి సీమలుగ పరఁగుచున్నవి

మాసిడోనియాదేశస్థుఁడగు అలగ్జాండరు ది గ్రేటు యొక్క చరిత్రకారులు వీటికి "గ్రడో సియా" యని పేరిడియుండిరి. మఱియు, మాకార్విన్ అనియు వాడుకనామము కలదు. ఇది పర్వతమయమై పెక్కులోవలుగ నున్నది. అందు ప్రవహించు మెరకనదులనుండి వీటికి వేర్వేఱునామము లేర్పడియున్నవి. కుర్రంనది ప్రవహించుకొండలోవకు 'కుర్రంవేలీ' యనియు, గుమాల్ నది ప్రవహించులోవకు 'గుమాల్ లోవ' యనియు, టోచినది ప్రవహించులోవకు 'టోచి లోవ' యనియు, ఝోబ్ నది ప్రవహించు లోవకు 'ఝోబ్ లోవ' యనియు పేర్లు వాడుక యందున్నవి. ఈలోవలందు నివసించుజను లిప్పుడు కాలవశమున భేదములపాలై పలు తెగలుగ మాఱియున్నను నందఱు నొప్పును దేశపువా రగు ఆఫ్రిడి తెగకుఁ జెందినవారుగనే గానవచ్చుచున్నారు. వారు మాట్లాడుభాషలు పుస్తుభాషాసంబంధములగు భాషలుగనే తెలియు చుండును.

వీరిట్టివా రయ్యు అలగ్జాండరుకాలముననే రెండుభేదములుగ చీలియుండిరఁట. అప్పటిఅల గ్జాండరుచరిత్రకారులు వీరింగూర్చి పటాక్ లేక ఖటాకు తెగ యనియు, అప్రైటు తెగ యనియు వ్రాసియుండిరి. ఇక్కాలమునకు ఖటాకు ఆఫ్రిడీ లని రెండు ముఖ్య భేదములగు తెగలుగను, అందు ఆఫ్రీడీలందు ఆదమ్‌ఖేల్ ఆఫ్రిడీ లనియు, సాధార ణపుఆఫ్రిడీ లనియు భేదము కల్గినది. వీ రందఱు సున్నీ తెగవారగు మహమ్మదీయమతస్థులు.

ఈతెగలు వసించు పర్వతలోవప్రదేశము లన్నియుంగలిసి ఆంగ్లప్రభుత్వమువారి "Tribal Country" అని చెప్పఁబడు చున్నది. ఇది పెషావరు పురమునుండి కొంతదూరమున ప్రారంభమై, ఆఫ్ఘనుస్థానపు సరిహద్దగు డురాం డులైనువఱకు వెడలుపుగను, నిలువు అచ్చట చ్చట ఏఁబదిమైళ్ళుమొదలు నూఱుమైళ్ళవఱ కును వ్యాపించియుండి, కొండలోవలమయమై వేర్వేఱుసీమలక్రిందఁ బరఁగుచుండును. ఈప్రదే శపుసీమలందు వసించుప్రజ లోకపరిపాలనకు లోఁబడువారు కారు. వీరలైనతత్త్రి వారిజాతివాఁ డగునాయకునింగూడ నతిక్రమింప సంసిద్ధులై

యుందురని చెప్పఁబడినది. సర్వదా ఆయుధములు ధరించి యుందురు. దేశము ధనవంతము కాకుంట వీరి కేబాధయు ఏ పూఁచీపేచీలు, బాధ్యతలు లేనివారై, విద్యా జ్ఞానములు వ్యాపింపక, వారికివారికి దోచినట్లెల్ల చేయు సాహసము గల్గియుందురు. పిఱికితనము వీరికి లేదు. మతావేశము తప్ప ధర్మనియతియు వీరిని నిర్బంధింపఁజాలదు. వీరిప్రదేశములందు పోలీసు, న్యాయస్థానములు లేవు. వీరి దేశముగుండా ప్రయాణ మక్షేమమనియు నందురు. ఇక్కాలమున పెక్కుతెగలుగఁ జీలియున్నారు.

ఈ పర్వతప్రదేశమున కుర్రంలోవగుండా కుర్రంనది ప్రవహించుచుండును. ఇందు టూరీ తెగవారు వసించు చున్నారు. కుర్రం లోవ కొంతవఱకు ఫలవంతమైన దనియే చెప్పవచ్చును. టోచిలోవగుండా టోచినది ప్రవహించును. గుమాల్ లోవగుండా గుమాల్ నది ప్రవహించును. టోచిలోవయందునను గుమాల్లోవయందునను వసించు ప్రజలకు "వజీరిస్" అని పేరు గాన నీప్రదేశమునకు వజీర్‌స్థానమని పేరయ్యెను. వజీరులలో సాధారణపు వజీరీ తెగవా రనియు, మహ్సూద్ వజీరీ తెగవారనియు ద్వివిధముగ నున్నారు. రెండవ తెగ వారిని సాధారణముగ మహ్సూద్ లని వాడుట కలదు.

ఝోబ్ లోవయం దాపేరుగలనది ప్రవహించుచుండును. అందు కొంచెముగ బెలూచీలును, విస్తారముగ వేర్వేఱుపఠాను తెగలవారును వసించుచున్నారు. ఇంక బెలూచిస్థానమున వేర్వేఱుతెగల పఠానుజాతులవారు కొంచెముగను, బెలూచీ లధికముగను గలరు. ఇంకను ఖైబరుప్యాసున కుత్తరదిశగా "అఫ్రిడీ సీమ" యనియు "మహమండుసీమ" యనియు, "యూసూజాయిసీమ" యనియు, "బిరాక్జాయి సీమ" యనియు నాయాజాతులవారు వసించు దేశములు కలవు. కుర్రంలోవకు తూర్పుదెసగా "కోహాట్" అనంబడు పురము గలదు. అచటి అఫ్రిడీ లందరు షిపా తెగవారు. ఆదమ్ఖేలు అఫ్రిడీ దేశమున నొక ఆయుధకర్మాగారము. అందు తుపాకులు మొదలగునవి ప్రశస్తమైనవి చేయఁబడు చున్నవి. ఆకర్మాగారమున కాంగ్లప్రభుత్వసంబంధ మేమియు లేదని తెలియుచున్నది.

కుర్రంలోవ అఫ్రిడీ లాంగ్ల ప్రభుత్వముతో సంధి యొనర్చుకొని వారికి మిత్రులై మెలఁగుచుందురు. వారి దేశము ఫలవంతమై యుంట, ప్రక్కసీమలవారి రక్షణ గావలసి యుండును. వారినుండియె కూర్పఁబడిన వారిపటాలములు కలవు. కాని, దానియుద్యోగులను ఇండియా ప్రభుత్వమువారు తమసైన్యమునుండియె సరఫరా చేయు నాచారము కలదు.

అఫ్ఘనుస్థానములో డురాండుసరిహద్దున నచటనచట కొన్ని అఫ్ఘనుపటాలము లుంచఁబడి యున్నవి. ఖైబరుమార్గ మీప్రైబలుసీమల గుండా నడుచునని పైన వివరింపఁబడియె యున్నది. (ఖైబరుమార్గము చూడుఁడు.) మఱియు నీప్రైబలుసీమలయందు బన్ను, కోహాటులందు సైన్యము లుంచఁ బడినవి. అచటికి రైలుమార్గములు వేయంబడినవి.

## పశ్చిమోత్తరపు సరిహద్దు పరగణా—

ఇండియా దేశరక్షణ నిమిత్తము సైన్యస్థానముల సదుపాయమునకుగా నిటీవల నేర్పఱిచిన క్రొత్త ప్రోవిన్సు, (ఆగ్రా ప్రోవిన్సు చూడుఁడు.) ఉత్తరమునను, ఈశాన్య దిక్కునను కాశ్మీర దేశమును, దక్షిణమున బెలూచిస్థానమును, పశ్చిమమున అఫ్ఘనిస్థానపు సరిహద్దును హద్దులుగా గల్గి, Oblong రూపమున 30000 చతురపుమైళ్ళ వైశాల్యము గలదని తలంపఁబడుచున్నది. క్రీ. వె. ౧౯౦౧ లో ఏర్పాటు పూర్తియైనవి. అఫ్ఘనిస్థానపు మార్గములు

మూఁడింటిలో ముఖ్యమార్గమగు ఖైబరుప్యాసిందులోనిది. అది పెషావరు పురమునకుపశ్చిమమునను,కాబూల్ నదికి (కుభానదికి) దక్షిణమునను గల కనుమమార్గము. కొలఁదిపాటి హిందువులు,పంజాబీలునుగాక,ఆఫ్ఘను తెగలగు వజీరీలు, యూసుఫ్జాయిలు, ఆఫ్రిడిలు మొదలగు పెక్కు తెగల పఠానుజాతులమహమ్మదీయులు ప్రజలై యున్నారు. ఉరుదు, పుస్తు మొదలగుభాషలను మాట్లాడుచుందురు. దక్షిణమున వజీరులును, ఉత్తరమున కోహిస్థానీయులును అధికముగఁ గలరు.

పెషావరుపురము (తొల్లింటి గాంధార దేశములోని పురుషపురము) ముఖ్యపట్టణము. ఇది ఖైబరుప్యాసుద్వారమున కొలఁది దూరముననే యున్నది. గొప్ప సైన్యస్థానము, కోహాట్పురము. ఎడ్వరుడే సాబాదుపురము, అబోటాబాదుపురము ఇతర సైన్యస్థానము లున్న పురములు. ఖైబరుప్యాసున కవ్వల ఆఫ్ఘనుస్థానపు హద్దున లండీకానా, లండీకోటా లనంబడుసైన్యస్థానములు రక్షణకై ఏర్పఱుపఁబడినవి. ముఖ్యమార్గమగు ఖైబరుప్యాసు గాక ఆఫ్ఘను స్థానములోని కేగుటకు కుర్రంలోవగుండా నొక మార్గమును, గోమాల్ ప్యాసుగుండా వేఱొక మార్గమును గూడఁ గలవు. (చూడుఁడు.)

## పసిపిల్లలు మాటలాడ నేర్చుకొనుట

ఈ విషయమును బరిశీలించినకొలఁదియు విచిత్రమనిపించెడిని. పసిపిల్లలు మాటలాడ నారంభించుట యన మాటలాడ నేర్చుకొనుటయే. అది సర్వసామాన్యముగ దేశదేశములందు పనియై యెల్లరుఁ గాంచుచున్నదే యైనను, పరిశీలించిన పిల్లయొక్క నిజస్థితి బయల్పడెడిని. ఇతరులఁ జూచి వారివలె మాట్లాడ నారంభించుట Imitation అయ్యెడిని. తన్నుం గూర్చి భద్రపఱచుట, పాలిచ్చి పెంచుట మొదలగు పనులకుఁ దక్క,తనయెదుటను తనకు వినఁబడునట్లు మాటాడువారు లేకుండ పిల్లను బెంచుచుండిన దాని మాటలు వచ్చు నదనున వచ్చునవన్నియు నఱపులు, కేకలునై యుండును. తనకు కావలసిన వస్తువువైపు చూపించు మూక (మూఁగి) భాషయే యలవడును.

మాటలాడుట ఏభాషయం దైనను మాటలాడు (లేక ధ్వనుల నట్లు పలికించు) చున్న యన్యులను జూచి తానును నక్లుచేయ(Imitation) బ్రయత్నించుటయే. అంతదనుక పసిబాలురకు నేత్రేంద్రియము కనిపించుచుండును గాని చెవులు వినిపించుట సరిగా స్థిరపడి (బలబడి) యుండదు. చక్కఁగా విన్పించువఱకు మాటలాడు ప్రయత్నమే యుండదు. కాననే సర్వసాధారణముగా మూఁగవారు చెవిటివారై యుండుట సంభవించుచున్నది. అనఁగా ఆదినే మూకత్వముగల్గి మాటలువిన్పింపక మాటలాడు ప్రయత్నము జరుగక ఆ యింద్రియమున కవసరమగు నభివృద్ధి (Devolopement) కలుగక వాక్శక్తి చెడినదని యెఱుంగనగును గాన బధిరత్వమే ముం దేర్పడినదని మనసునందుంచుకొనఁ దగును.

తొలుత కర్ణేంద్రియము బలపడి మాటలు విన్పించుచు వాటి నొకటితోనొకటి వేఱుగ ధ్వనులను బోల్పనగు స్థితి పసిబాలునకుఁ గల్గుటతో నితరులవలెనే తానును ధ్వనుల నొనర్చుచు పలుకులు పలుకఁ బ్రయత్నింపఁ మొదలిడును. పుట్టుటతో దృష్టిబలముగూడ సరిగా నుండదు. కర్ణేంద్రియము కడుంగడు లేఁతదిగ నుండి పని చేయఁ జాలకుండును. అవి బలమంది స్థిరపడుచు ధ్వనులు విననై నేత్రానందముగతనపరిచయులు తనతో వినోదములాడుట యెఱింగినతోడ నేకల్గు హృదయవికాసము నవ్వుటకుఁబ్రారంభించెడిని. అదివఱకిట్టియభ్యాసమే లేని పసిపాపకు

మేధస్సు కడు లేతయై పెరుఁగవలసియే యుం డును. అది యాఁకలి యగుతఁటి బాధకల్గుతఁటి నేడ్చుటయు, మెళకువయందు కనులువిప్పిచూచు టయు, అలసట గల్గుతఁటి నిదురించి బడలిక బాపుకొనుటయు మొదలగు కార్యములను మాత్రమే చేయుంప శక్తిగల్గియుండెడిని. నాలు కయే గాక పెదవులపైఁ గూడ స్వాతంత్ర్యము సరిగానుండదని తలంపఁబడుచున్నది. పసిపాపకు దేనియందు పూర్వానుభవము లేకపోవుటచే నేపనినిగూర్చి యైనను యెఱిగియుండదు గాని దేనికిని బ్రయత్నింపఁ జాలకుండును.

## పసిపిల్లలు ఉయ్యాలలో నుంచి ఊఁపిన నిద్రించుకారణము

—పసిపిల్లల కొక్కొక్కప్పుడు సరియగు శరీరవ్యాయామ మాడుకొనుటమూలముననను, ఏడ్చుటమూలము నను గలుగక జీర్ణశక్తి సరిగా పనిచేయక తగ్గి యుండును. తోడనే ఆలేఁతశరీరమున నవిశ్రాంతి కల్గి నిద్రపట్టక పిల్లకు చికాకుజేయును.

ఉయ్యాలలో పరుండఁబెట్టి యాఁపుటయన పసిపిల్లకు చిన్నవ్యాయామమువంటిది. మఱియు నిందువలన జీర్ణకోశము కదలి, జీర్ణశక్తి ప్రజ్వరిల్లును.లోనిఅవిశ్రాంతి(Restlessness) తగ్గును. మనసునం దదివఱకు కల్గిన యలసట నిద్రవలన విశ్రాంతికి పురికొల్పును. పిల్ల నిదు రించును.

## పసిఫిక్ ఓషన్ (Pacific Ocean)

—తనయందల్లకల్లోలములులేక శాంతముగనుండు నదిగాన Pacify శబ్దమునుండి (శాంతమహా సముద్రమని) పేరందినది. ఉత్తరమున ఆసియా, అమెరికా ఖండములును, వాటినడుమ నున్న ముప్పదియాఱుమైళ్ళ వెడలుపుగల బేరింగు జలసంధియు, తూర్పున నమెరికా ఖండమును, పశ్చిమమున నాసియాఖండము, ఆస్ట్రేలియా ద్వీపమును, వాటికి నడుమను దిగువనునుండు సముద్రభాగములును ఎల్లలు. దక్షిణపుహద్దు సిసలుగ నిర్ణయింపఁబడ వీలుగా కున్నది. కొందరు భూమధ్యరేఖనుండి దక్షిణమునకు నలువదిడిగ్రీలవఱకుననియు, మఱికొందరు దక్షిణ ధ్రువసముద్రముదనుక ననియు నభిప్రాయ భేదములం గల్గియున్నారు. అనఁగా దక్షిణ సముద్రము (Southern Ocean) దీనిలోనిదే యనిభావము. ఎటులైనను ఏఁబదియు లేక అఱువదియు మిలియనుల చతురపుమైళ్ళ వైశా ల్యము చెప్పవలసియుండును.

## పసిబాలుఁడేడ్చుట-ఉపయోగము

—పసిబాలుర కేడ్పు స్వభావ మని తలంపరాదు. అది కొంతవఱ కత్యావశ్యకమే. ఏడ్చుటవలననే పిల్ల కేదో కావలయునని మనమెఱుంగఁగల్గుదు ము. ఏడ్పు పసిపిల్లకు వ్యాయామమై ఎదుగునట్లు (Developement)చేయును.ఏడ్చునప్పుడేవాని ఊపిరితిత్తులు(Lungs),గుండె(Chest) తెఱచు కొనుచు, మూసికొనుచు పనిచేయును. శరీర మంతటను రక్తమును ప్రవహింపఁజేసి శుద్ధి గల్గించును. ఏడ్పే ఆఁకలి, అసమ్మతి, చూడ వాంఛ, తన్నెత్తుకొనినవారి మార్పు, ఒకరు తన్ను చేరతీసుకొనుకోర్కి—మొదలగునవి తెలుపు భాష. ఇది పిల్లనవ్వగల్గుదనుకను పిదపవ్యాయా మాదిఉపయోగము లున్నను. ఏడ్పు, బాధను, అనిష్టతను దెల్పును.

## పసిబిడ్డ

—పుట్టఁగనె పసిబిడ్డ యేడుపౌనుల బరు వుండునని యాంగ్లవైద్యధర్మము లెఱిఁగిన పండితులు వ్రాసియున్నారు. కాని, యిటీవల పరిశీలనలవలన యౌవనులు బలాఢ్యులు నగు తలిదండ్రులకడుపునఁ బుట్టినబిడ్డలు పుట్టఁగనే పదిమొదలు పండ్రెండు పౌనుల బరువుకూడ నుండుట కలదని తేలినది. బిడ్డయొక్క-బరు వారోగ్యస్థితిని సూచించెడిని. మఱియు జన్మింపఁ గనే నాల్గుపౌనులు తూఁగినబిడ్డలు సైతము

జీవించుట కభ్యంతరములే దని యాంగ్లవైద్యులనుచున్నారు.

బిడ్డ పుట్టఁగనే కలబరువు పిదప నాల్గైదురోజులలో తగ్గిపోవుననియు, పిదప పదిదినములనాఁటికి జన్మకాలమునాఁటి బరువు తిరిగి కల్గు ననియు ననుభవజ్ఞలగు స్త్రీలు చెప్పుదురు. ఒకటవ నెల ఏడున్నరపౌనులును, రెండవనెల తొమ్మిదిన్నరపౌనులును, మూఁడవనెల పదునొకండు పౌనులును, నాల్గవనెల పండ్రెండున్నరపౌనులును, ఐదవనెలకడను పదునాల్గు పౌనులును, ఆఱవనెలకడను పదునేనుపౌనులును, ఏడవనెల పదునాఱుపౌనులును, ఎన్మిదవనెల పదునేడు పౌనులును, తొమ్మిదవనెల పదునెన్మిది పౌనులును, పదియవనెల పంతొమ్మిదిపౌనులును, పదునొకండవనెల యిరువదిపౌనులును, సంవత్సరపు బిడ్డ ఇరువదియొక్కపౌనులును చక్కఁగా పెరుఁగుట సంభవించుతఱి బిడ్డలబరు విటులుండుట సర్వసాధారణమని చెప్పఁబడినది.

**పసుపుచెట్టు**—లా. Curcuma longa ఆంగ్ల. Turmeric Saffron. హిందీ హల్దీ. సం. పీతకః, పీతకద్రుః, పీతబాలుకా, హార్ద్రదకః, హార్ద్రాఅనునవి. పసుపు సామాన్యమునకును పీతకం, పీతనంఅనుపదములు కాశ్మీరదేశపుపసుపునకును, నిశా, పీతకా, హరిద్రుః, హార్ద్రా, పత్రకంటకా అనుపదములు కస్తూరి పసుపునకు లేక మ్రానిపసుపునకును పేర్లు.

పసుపునందు ముఖ్యభేదములు వలముగ దుంపలంబోలి యుండునది దుంపపసు పనియు, సన్నముగ కొమ్ములఁబోలి యుండునది కొమ్ము పసు పనియు, వెదురుగుంపులంబోలిన కణుపులుగల పసుపు మండపసు పనియు (ఇది వైద్యోపయోగ మైనది. గుంటూరుమండలములోని జాగర్లమూడిప్రాంతముల పైరుచేయఁబడుచున్నది), కస్తూరిపసుపు లేక మ్రానిపసు పనియు (ఇది ఇంచుక తెల్లనిధాతువు గల్గి కొంచెముపరిమళముగల్గి యుండెడిని), అడవిపసు పనియు నైయున్నవి. అడవిపసు మధమపుజాతిగను, కాశ్మీరదేశపుపసు పత్యుత్తమజాతిగను వైద్యు లెన్నుదురు. దుంపపసుపునందు ధాతువు మెండు. ఇది పసిపిల్లల వైద్యమునకు వాడుదురు.

పసుపు పెక్కుపనుల కుపయోగించెడిని. భోజనపదార్థములందు పసుపుగుండ గల్పుదురు. హిందూగృహముల శుభకార్యములలో పసుపు ప్రధానపదార్థమె యగును. ఔషధములందును వాడుచుండుట గలదు. చాయకై పసుపు వాడుట మెండుగఁ గలదు. ఇంకను నుపయోగము లెన్నియో గలవు.

పసుపుపూవులరసము పైకిపూయుచుండిన శోభి మానునందురు. పసుపుకొమ్మునందు వేఁడిచేసి అర్పుచు రక్తమును శుభ్రపఱచి జీర్ణశక్తిని రేఁపుశక్తి కలదనియు, ఉబ్బుజాడ్యము, ఒగరుపు గలదగ్గు, కామిల, క్రిమి, కుష్ఠరోగము, దగ్గులు, మురదలు, పాండురోగము, మేహావ్రణములు, విషదోషము, శ్లేష్మము మున్నగువాని నడంచునని చెప్పఁబడినది.

పసుపు నీళ్ళవిరేచనములం గట్టును. మూత్రరోగనిరోధముల నాఁపి చక్కఁగా వెడలఁజేయును. పండ్లనొప్పుల నివారించును. వ్రణముల మురికి బాపి శుభ్రపఱచి మాన్పట్టఁజేయును. చర్మరోగముల నివారించి మాన్పును. కండ్లకలక వ్యాపింపకుండ నాఁపి మాన్పి కండ్లను తేరఁజేయును. తేలుకుట్టినచోట నలదుచుండిన విషబాధ లేకుండఁ జేయును. గర్భిణీస్త్రీలను సుఖప్రసూతలనుగఁ జేయును.

పసుపుపొగ అపస్మారమునుండి తెలివిదెప్పించును. పసుపుగుండ సున్నము కల్పి నూరిన పారాణియిడిన గోరుచుట్టు, మడమశూల

కణుపుమీద, పంగలిజెష్ట మానును. బ్రతికి యుండిన బ్రహ్మచెముడుచెట్టునందు చొప్పించి యేడురోజులు ఊరనిచ్చినపసుపుకొమ్ము నూరి పైన రాయుటవలన శ్వేతకుష్ఠము, తెల్లపొడలు, మచ్చలు నివారణ మగును. పసుపునకు నిమ్మపండ్లరసము, నారింజపండ్లరసము, పంపరపనస పండురసము పరిహారములు (విరుగుడు).

**పసుపు వ్యవసాయము** — డాక్టరు వాట్ పండితుఁడు పసుపునకు జన్మదేశము చీనా యని యభిప్రాయపడెనఁట గాని భరత దేశమున నవాదిగ ఋషులనాఁడు సైతము స్త్రీలు పసుపును వాడినట్లు చెప్పఁబడుట నిది భరతదేశము గూడ జన్మస్థానముగఁ గల్గియుం డినదని తోఁచెడిని. ఈపంటకు నల్లభూములు, మన్యప్రదేశములందలి యడవులలోని బలముగు నీడప్రదేశములు నర్హప్రదేశములు. ఈపంట అల్లమువలెనే నీడను పైరుచేయ బడఁదగినది. ఇతరవిధానముల నీడంగుదిర్చి, నల్లభూములందు పైరుచేయువారు నీరుతోడుచుండుటయె గాక, ఒకసంవత్సరము పసుపు నాటినచో మఱుచటి సంవత్సరము మాని, వేఱే చులకని మెట్టపంట వైచుచుందురు. (అల్లము వ్యవసాయము చూడుఁడు). నీడకలదేని పసుపు అల్లము కల్పి నల్లభూములందు నీటిపాఱుదల వసరు చూచు కొని నాటినచో, పసుపు వేగిరము పెరిఁగి, అల్లమునకు చల్లనివాతావరణమిచ్చి, చక్కఁగా పెరుగఁజేసెడిని. రెండింటికిని పాటొకటియేగాన సరిపోవును. అడుగడుగుదూరమున నీపసుపు చెట్లను నాటుదురు. పసుపుపండినపైని త్రవ్వి విత్తనమునకు పచ్చిపసుపు నుంచుకొని తక్కిన దాని నుడికించి యెండించి నిల్వచేసికొందురు. పసుపు భోజనపదార్థముగూడ నైయున్నది.

**పస్యస్యద్రౌ జ్వలదగ్నిం నపునః పాదయో రథః ఇతిన్యాయము**—కొండ మీఁద(సైతము)దూరముగ ప్రజ్వలించునగ్నిని గాంచుదువు. గాని, నీకాళ్ళక్రింద నే ప్రజ్వలించు చున్న యగ్నిని జూడఁజాలకున్నావని భావము. అన్యులలోపములు చులకనగా గ్రహింప వీలగునుగాని తనలోపము తెలియుంగుట దుస్సాధ్య మని భావము.

**పస్యాం పుస్యాం**—పదిమందికలిసి ఆలో చించి తుదకు ఒక్కొక్కరే జాఱవిడిచి నీరు గార్చివేసినవ్యవహారమునకు "పస్యాంపుస్యాం" చేశారుఅనులోకోక్తి వ్యవహరింపఁబడుచున్నది. (ఆంధ్ర లోకోక్తి.)

**పహారిజాతివారు**— బీహార దేశమున సంతాల్పరగణా కొండలయందు వసించు నొక కొండజాతివారు.

**పహారిగోత్రము**—(భరద్వాజ ఉపగణ ము చూడుఁడు.)

**పళనికొండలు**— నిజముగ నుదకమం డలమున్న నీలగిరికొండలు పళనికొండలే. పళని కొండలు సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానముచే ప్రసిద్ధిఁ గాంచినవి.

దక్షిణదేశమున సుబ్రహ్మణ్యభక్తి సుప్రసిద్ధము. ఆభక్తికి పళనియందలి సుబ్రహ్మణ్య దేవాలయము ప్రధానస్థానము. ఈదేవస్థాన మొకపాటికొండపై నున్నది. అసంఖ్యాకులుగ జను లరుదెంచి యాత్ర సల్పుచుందురు. (నీలగిరి చూడుఁడు.)

**పాంచజన్యము**— శ్రీకృష్ణునిశంఖము. (పంచజనుఁడను రాక్షసనంబంధము) (ధనుర్విద్య చూడుఁడు).

**పాంచరాత్ర (మత) ము**— ప్రత్యేకపు తెగయైన మతావలంబకులుగల మతము. కాకు

న్నను పాంచరాత్ర మనునది యొక మతముగ నెన్నఁ దగినది. ఇది వైష్ణవ మతభేదములలో నొకటి. దీనికి ప్రమాణగ్రంథము పాంచరాత్రాగమము.

ఈమతమును కొన్ని సిద్ధాంత భేదములతో కొందఱు వైష్ణవులు పాటించుచున్నారు. ముఖ్యముగ దేవాలయాదిప్రతిష్ఠలు,అర్చనాదికములు, సంప్రోక్షణములు, వీట్లధర్మము లీపాంచరాత్రాగమములందుఁ గలవు. ముక్తి యైక్యముక్తి.

ఈ మతము వాసుదేవప్రణీతము. వాసుదేవుఁడే పరమేశ్వరుఁడు. ఈ మతశాస్త్రమున తత్త్వము లిఱువది యైదు కలవు. ౫ భూతతత్త్వములు, ౫ తన్మాత్రతత్త్వములు,౫ జ్ఞానేంద్రియ తత్త్వములు ౫ కర్మేంద్రియ తత్త్వములు, ౩ అంతఃకరణతత్త్వములు, ౧ గుణతత్త్వము, ౧ వాసుదేవతత్త్వము ఇట్లిఱువదియైదు తత్త్వము లీమతమున (సాంఖ్యమత పద్ధతినే) చెప్పఁబడినవి. ఇఱువదియైదవ తత్త్వమగు వాసుదేవ తత్త్వమే యీశ్వరస్థానము. వాసుదేవుఁడే పరమాత్ముఁడు. విష్ణుపారమ్యము.

ఈవాసుదేవ తత్త్వమునుండి ౧ కృష్ణవ్యూహము, ౨ అనిరుద్ధవ్యూహము, ౩ మకరధ్వజ వ్యూహము, ౪ రోహిణేయ వ్యూహము నను నాల్గు వ్యూహములు కల్గినవి. ఇవి జగదుత్పత్తి హేతువులు. వీట్లనుండియే చరాచరాత్మక మగు జగత్సృష్టి యంతయుఁ గల్గెను. జగద్వస్తు సముదాయ మగు జడాజడాత్మక సర్వమును వాసుదేవునిపరిణామము, వాసుదేవస్వరూపము నని చెప్పఁబడినది.అనఁగా వాసుదేవుని స్వపదార్థమునుండియె కల్గుటంజేసి పరమేశ్వర పదార్థమే (పరమేశ్వరస్వరూపమే) జగత్తని యీ మత సిద్ధాంతము.

ప్రాణికర్మ కళంకసహిత మగుట శరీరము, సంసారములు కలుగుచున్న వనియు, సంసారము వేదన లనియు,దీనినుండి విముక్తికిపాంచరాత్రాగమోక్తదీక్ష నంది, ఆగమోక్త విధానమున వాసుదేవార్చనలం జరుపుచుండిన కర్మకళంకములు నశించి వాసుదేవస్వరూపమునం దైక్యమగుట గల్గెడిని.

ఇదియె యీ మతమునందు వివరింపఁబడిన యైక్యముక్తి.ఋగ్యజుస్సామాథర్వణాత్మక మగు వేదమునందు ధర్మార్థ కామమోక్షము లనంబడు చతుర్విధ పురుషార్థములు గానరా వనియు, పాంచరాత్రమను వీరియాగమమునందు నాల్గును గలవనియు నీమతసిద్ధాంతము.

ఇంక నీయాగమములందు వివరింపఁబడిన తెఱఁగున విష్ణు దేవాలయములందు పూజింపఁబడు విష్ణుదేవునివిగ్రహము లిఱువదినాల్గు తెఱఁగులు. (విష్ణుదేవస్థాన విగ్రహములుచూడుఁడు.)

'పాంచరాత్ర'మను సంస్కృతనాటక మొకటి కలదు. అది రచించిన మహాకవి భాసుఁడు.

**పాంచాల గోత్రము** — (నిధృవగణము చూడుఁడు.)

**పాంచాలదేశపు ఐదునదులు**—౧వితస్థానది (జీలమ్), ౨ శతధృ (సట్లెజి), ౩ రవి (రావి), ౪ విపాశ (బియాస్), ౫ చీనాబ్ (ఐరావతి లేక ఇరావతి).

**పాంచాలీ(రీతి)**— (లక్షణ చూడుఁడు.)

**పాంగ్గోరాదేశము**— (పంచగౌరీదేశము చూడుఁడు.)

పాండవ కౌరవ వంశావళి

# పాండవ కౌరవ వంశావళి

అత్రిసంతతి—(చంద్రవంశము) పురూరవచక్రవర్తి—నహుషమహారాజు—పూరుమహారాజు—
హస్తిమహారాజు సంతతి నృపులు.





బృహద్రథుఁడు
(మగధరాజ్యమేలినవాఁడు)
(వీరిసంతతివారు ఈయననుండి బార్హద్రథులనంబడిరి.) (బార్హద్రథవంశావళి చూడుఁడు.)
దేవాపి
శంతనమహారాజు
బాహ్లికుఁడు
(ఈయనపాలననుండి ఈయనపాలించిన దేశమునకు బాహ్లికదేశ మని పేరయ్యెను. వీరిసంతతివారు బాహ్లికదేశ మేలిన ప్రభువులు.)
విచిత్రవీర్యుఁడు
చిత్రాంగదుఁడు
భీష్ముఁడు
సోమదత్తుఁడు
ధృతరాష్ట్రమహారాజు
పాండుమహారాజు
భూరి
భూరిశ్రవుఁడు
శల్యుఁడు
వైశ్యభార్యవలన గల్గినసుతుఁడు యుయుత్సుఁడు
గాంధారీదేవి వలన కల్గినసుతులు దుర్యోధనాదులునూర్గురుకౌరవులు
(వీరుభారతయుద్ధమున నిహతులైరి)
(యమాంశ) యుధిష్ఠిరమహారాజు
(వాయువుఅంశ) భీమసేనుఁడు
(ఇంద్రాంశ) అర్జునుఁడు
(అశ్వనీదేవతాంశ) నకులుఁడు
(అశ్వనీదేవతాంశ) సహదేవుఁడు
ప్రతివింధ్యుఁడు
యౌధేయుఁడు
శ్రుతసోముఁడు
ఘటోత్కచుఁడు
సుగుణుఁడు
అభిమన్యుఁడు
బభ్రువాహనుఁడు
శ్రుతకీర్తి.
శతానీకుఁడు
నిరమిత్రుఁడు
శ్రుతసేనుఁడు
సుహోత్రుఁడు
అంజనపర్వుఁడు
పరీక్షిత్తు
(వీరితర్వాత పాండవులసంతతి చూడుఁడు.)

**పాండరీపురము (పంఢార్పూర్)**— ఈ సుప్రసిద్ధ విష్ణుక్షేత్రము బొంబై రాజధాని యందలి షోలాపూరుమండలములోనిది. దేవుని "విటోబా" యనియు, "విఠల్" అనియు ననుచున్నారు. దేశభాషయందు పాండురంగ పురము లేక పాండరీపురము పంఢార్పూ రనం బడుచున్నది.

తొలింట నీయూర పితృభక్తిఁ బేరుఁ బడిన పండలికుఁడను విప్రుఁ డుండెనఁట. ఆతఁడు తలి దండ్రులసేవ నిరతము చేయుచుండిన యోగ్యుఁ డని పేర్వడసియుండె నఁట. శ్రీకృష్ణుం డొక తఱి వినోదార్థము రుక్మిణీదేవితో సయ్యాట లాడుచు నామె యిటకుఁ దప్పించుకొని రా నామెను వెంటాడించి నీయూరున కేతెంచియు పితృభక్తిచే సకలమహిమాన్వితుండగు పాండ లికునిఁ జూడ నేగెనఁట. అత్తఱి నాపాండలి కుఁడు తండ్రికిఁ గాళ్ళు గడుగుచుండి శ్రీకృష్ణున కొకయిటుక జూపి దయచేయుఁడని పల్కి, పితృసేవ జరుపుచుండె నఁట. కాని దానిని వీడనొల్లఁడయ్యె నఁట. శ్రీకృష్ణుండు పితృభక్తికి మెచ్చి నీ కేమిగావలయు నని యడిగె నఁట. పాండలికుఁడు తనచేతిపనిని వీడక ఓమహా స్వామీ, నీ వచటనే దయచేసియుండవలె నని నాకు వాంఛ కలద నె నఁట. పరమేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు వల్లె యని యట నల్లె యుండి యున్నాఁడనిచెప్పుదురు. శ్రీకృష్ణుని తేజంబీక్షేత్ర మున కలదని యిట్లు బలమగుప్రతీతి కలదు. పాండరీపురము భీమరథి లేక భీమరథ్యానదీ తీరస్థము. (పుండరీక్షేత్రము చూడుఁడు.)

**పాండవగోత్రము** — (అగస్త్యఉపగ ణము చూడుఁడు.)

**పాండవుల సంతతి వంశావళి** — (అభిమన్యుని సంతతి నృపుల వంశావళి)—

పాండవులకుమాళ్ళందరు భారతయుద్ధమున మడిసిరి. అభిమన్యుని కుమారుండగు పరీక్షిత్తు వంశాంకురమై మిగిలి రాజ్యమునకు వచ్చెను. అభిమన్యునిభార్య భర్తపోవువఱకుగర్భిణియై యుండెనఁట. యుద్ధకాలమున నొకబాణ మామెగర్భమును పరీక్షించుటంజేసి గర్భము విచ్ఛిత్తగు నని యందరు తలంచినను, అట్లు జరుగక నిలిచి బాలుఁడు జన్మించుటంజేసి యాబాలునకు పరీక్షిత్తని పేరిడిరఁట. పాండ వులు స్వర్గారోహణ మొనర్ప పరీక్షిత్తు మహా రాజై రాజ్యాధిపత్యమునకువచ్చెనఁట. ఆయన సర్పముచేఁ గఱవఁబడి మృతినంద, నాతని సుతుండు జనమేజయుఁడు రాజ్యాధిపతియై పగఁబూని సర్పయాగ మొనర్చె నఁట. వారి సంతతివారి నీక్రింద వివరించుచున్నాము.

౧ అభిమన్యుఁడు, ౨ పరీక్షిత్తు, ౩ జనమే జయుఁడు, ౪ శతానీకుఁడు, ౫ సహస్రా నీకుఁడు, ౬ అశ్వమేధజుఁడు, ౭ అసీమకృష్ణుఁడు, ౮ నిమి లేక నేమిచక్రుఁడు. మఱియు నీతనికి నిచకుఁడనియు వాడుకనామ ముండెను. ఈతని కాలముననే హస్తినాపురము గంగలోఁగలిసి యంతమైపోవ, కౌశాంబీనగరమునకు రాజధాని మార్పఁ బడియెను. (కౌశాంబీ నగర మిప్పుడు "కోశాం" అనఁబడుఁగుచు అలహాబాదుకడ నున్నది.)

పిదప ౯ ఉక్తుఁడు, ౧౦ చిత్రరథుఁడు, ౧౧ శుచిరథుఁడు, ౧౨ వృష్టిమంతుఁడు, ౧౩ సుసే నుఁడు, ౧౪ సునీతుఁడు, ౧౫ నృచక్షుఁడు, ౧౬ సుఖీవలుఁడు, ౧౭ పరిప్లవుఁడు, ౧౮ సున యుఁడు, ౧౯ మేధావి, ౨౦ నృపంజయుఁడు, ౨౧ ధూర్వుడు, ౨౨ తిమి, ౨౩ బృహద్రథుఁడు, ౨౪ సుదాసుఁడు, ౨౫ రెండవశతా నీకుఁడు, ౨౬ దుర్దమనుఁడు, ౨౭మహీనరుఁడు, ౨౮ దండపాణి, ౨౯ రెండవ నిమి, ౩౦ క్షేమ కుఁడు రాజ్యముచేసిరి.

ఈతనికాలమునకు కలియుగమున వేయి సంవత్సరములాయె నని చెప్పఁబడినది.

**పాండవులసంతతి క్షత్రియులు**— వీరింగూర్చిన గ్రంథములు మాకు లభింపలేదు. ఐననాయాకులములవారియం దనుశ్రుతముగను పరంపరగను ప్రచారమునందున్న కథన మిట్లున్నది. వీరు క్షత్రియుల మని చెప్పుకొనుచున్నారు. కాని, వీరికిని ఆంధ్రదేశమున క్షత్రియుల మనుకొను సూర్యచంద్రవంశ క్షత్రియులకును సంబంధములు గానరాకున్నవి. ఈ కథనము మేరకు వీరు చంద్రవంశక్షత్రియులు, లేక రాజులుగఁ దోఁచెడిని. పాండవు లరణ్యవాసమో, లేక యజ్ఞాతవాసమో యొనర్చుతఱి నైదుగురు నైదుగురు కన్యలను పర్వతారణ్యసీమలందు పరిణయమాడిరఁట. వారాభార్యలతో నాప్రాంతముననే నివసించుచు సంతానము గనిరఁట. అం దెవ్వరిసంతతివా రెవ్వరో మాకు సరియగు స్థితి తెలియలేదు. పాఠశాలలందు నిర్దేశింపఁబడిన యొక గ్రంథమునందు వివరింపఁబడిన కథనమునుండి కోయజాతివారు పాండవద్వితీయుండగు భీమసేనునిసంతతివా రని తెలియుచున్నది. (కోయజాతివారు చూడుఁడు.) వేణుచక్రవర్తి సుతుఁడును, పృథుచక్రవర్తి సోదరుఁడునగు నిషాదుని సంతతివారు నిషాదు లనంబడిరఁట. వారితో నీపాండవు లైదుగురకు సంబంధములు నడిచి సంతానము గలుగ, నైదుగురి సంతాన మైదు వేఱు తెగలుగ నాయెనఁట. ౧ వారుకొండదొరలు లేక కొండరాజులు, ౨ కోయదొరలు, ౩ మన్నెదొరలు, ౪ మూకదొరలు, ౫ గయితదొరలు లేక గదబదొరలు. వీరింగూర్చి సంగంవలస సంస్థానమున ప్రభువులగు శ్రీరాజా మృత్యుంజయనిశ్శంకు బహద్దరువా రేదో గ్రంథము రచించిరని కర్ణాకర్ణిగా వినుచుందుము గాని యది మాకు లభింపమికి వగచుటకన్నఁ జేయునది లేదు.



**పాండురాజు** — అత్రి చంద్ర పూరు కురు సంతతిక్షత్రియుఁడు. తండ్రి విచిత్రవీర్యుఁడు. తల్లి అంబాలిక. ఈతఁడు వ్యాసుని వలన నంబాలికయందు విచిత్రవీర్యుని పుత్రుఁడుగ జనించినవాఁడు. సోదరుఁడు ధృతరాష్ట్రుఁడు. ఇతనికి కుంతి, మాద్రి యని యిర్వురు భార్యలు. ఈతఁడు శాపబద్ధుఁడై భార్యలంగూడి భోగింప వీలు కలుగ లేదఁట. కాన కుంతీదేవియందు యమునివలన యుధిష్ఠిరుని, వాయువువలన భీమసేనుని, ఇంద్రునివలన నర్జునుని, అశ్వినీకుమారులవలన నకులసహదేవులను సుతులుగఁ బడసెనని చెప్పఁబడినది. ఇతఁడు మరుద్గణాంశసంభూతుఁ డని చెప్పఁబడినది. ఈతని సుతు లైదుగురు పంచపాండవు లనఁబడుదురు.

శంతను ననంతరము హస్తినాపుర రాజ్యము నేలఁగల విచిత్రవీర్య చిత్రాంగదులు స్వల్పకాలముననే మృతు లగుటను, వారి వారి క్షేత్రములందు (అనఁగా) అంబ, అంబాలికల యందు సత్యవతీప్రార్థనమున సాత్యవతేయు ననుగ్రహమున ప్రసాదింపఁ బడిన ధృతరాష్ట్రుఁడు జాత్యంధుఁ డగుటను, రాజ్యము నేల ననర్హుఁ డగుటను, రాజ్యపాలనా దక్షుం డగు నొక్కనిఁ బ్రసాదింపు మని మరల సత్యవతీదేవి సాత్యవతేయుం బ్రార్థింప, నాతని ప్రసాదమున జన్మించినవాఁ డీ పాండురాజు. ఈపాండురాజుం గూర్చియు, నాతని రాజ్యపరిపాలనార్హతం గూర్చియు నప్పటి పెద్ద లొకించుక శంకించుటనే విదురు జననమునకుం గతంబయ్యెను. ఆవిదురుండును శూద్రయోనిజుండగుట నాతఁ డనర్హుం డని నిశ్చయించి, ధృతరాష్ట్ర పాండుభూపతు లిర్వురలో పాండుఁడే రాజ్యాధికారనిర్వహణమునకు దక్షుఁడని అప్పటి పౌరులలో పెద్దలును, సత్యవతీసాత్యవతేయ దేవవ్రత నామక త్రిమూర్తులును గలసి పాండురాజే

యఖండ కురుసామ్రాజ్య మేలఁగల మేటియని యాతని కే పట్టముఁ గట్టిరి. ఆతఁడును తనయన్న యగు ధృతరాష్ట్రునందున్న గౌరవము పెంపున తాను సార్వభౌముం డయ్యు, తనయన్న నే సింహాసనమునఁ గూర్చుండఁజేసి, తాను శత్రు రాజులపై దాడి వెడలి, వారి నదిమి కప్పములం గొనుచు, నలుదిక్కుల నున్న పరరాజుల నెల్ల జయించి, వారిని నిజశాసనవశీకృతులం గావించి, వారివలన నేనుంగులును, గుఱ్ఱములును, విలాసినులును, అమూల్యరత్నములును గానుకలుగాఁ గొని తెచ్చి తనయన్న కిచ్చి, తన దిగ్విజయంబున కిది ఫలంబన్నట్టు తనయన్న చే శతాశ్వమేధము లొనర్పఁజేసి మహాప్రఖ్యాత ప్రభుండై ప్రతిభ గాంచెను.

అనంతరమే యాతఁడు వేట వోవుటయు, శాపంబు నందుటయు సంభవించెను.

## పాండురా— దంతపుబరిణె కథ —

ఇది క్రైస్తవులు కాకపూర్వము గ్రీకుదేశమున జరిగిన కథనముగాఁ జెప్పఁబడినది. నేటికి నాదేశమున సుప్రసిద్ధముగా వాడుచున్న కథనము. ఆదేశపుహద్దులందు ఓలింపస్ (Olympus) పర్వతములు దేవతలనివాసమై దేవగిరి యని వాడఁబడుచుండినవి. అట వసించు దేవతాసమూహమునకు గ్యాసుపితరు (Jupeter) అధిపతి. ఆయనసుతుఁడు వల్కనుఁడు, (Vulcan) శిల్పమునను చిత్రకలలందు నేర్పరి. అక్కాలమున మనుష్యులు దుర్మార్గవర్తనులై క్రూరులై యుండుకతన వారికి కఠినశిక్ష విధింపఁబడనుండి దేవతానాయకుండగు గ్యాసుపితరుఁ డవకాశమునకు నిరీక్షించుచుండెను. అ తరుణ మదనుగ నెఱింగి గ్యాసుపితరుఁడు తనసుతునిం బిలిచి సౌందర్యములరాశి యగు నొక వనితామణిం జేయ నాజ్ఞయొసంగ వల్కనుఁ డట్లు చేసి తెచ్చెను. దేవతాధిపతి దానిం జూడ ఓలింపస్ పర్వతశిఖరములలో నొకతావున సమస్తదేవతాసమేతుఁడై యుండి దానిం గాంచి మెచ్చుకొనియెను. మినర్వాదేవి యాపనితనమున కచ్చెరువందుచు ముద్దిడి జీవము గల్గించి దానికి "పాండురా" యని ముద్దుపే గారవింప గ్యాసుపితరుఁడు పాండురాసుందరితో నీవు దేవగిరినుండి క్రింది కరిగి అతీనానగరమున భూపతికి పట్టఁపురాణివై యుందువని మంగళాశాసన మిచ్చి గారవించెను. మఱియు మెర్కురీ (Mercurey) (దేవతలలో నొకఁడు) తోడనరుగ నియమింప, దేవత లెల్లరు దివ్యాభరణములు పాండురాసుందరి కొసంగి, గారవించి, పర్వతాగ్రమునుండి దిగి అతీనా నగరమున కరుగుచు దారిలో నొకయేటిజలప్రవాహమును దాఁటవలసి యచట నిలచిరి. ఆమె ఓలింపసుపర్వతాగ్రము వీడుతఱినే గ్యాసుపితరుం డామెచెవిలో నేద్దియో చెప్పి, యామెచేత నొకదంతపుకరండ మిడి, భద్రమని నుడివెను. పాండురాసుందరాంగియు నద్దానిని జాగ్రతగఁ గైకొని నడుచుచుండెఁగాని ప్రమాదమున నది జాఱి నీటఁ బడిపోయెను. ఆమెయు వగపున నఱచి ఖిన్నతనందియుండ, మెర్కురీ వలదని వారించినను ఆలతాంగి మిన్నకుండినందున నాతఁడు నీట దిగి యాదంతపుబరిణె తెచ్చి యందింపఁ గైకొనుతఱి గల్గిన ప్రతిధ్వనులుగ నాకాశవాణి దురదృష్టపరంపరలన ప్రతిధ్వనులును దానినె తిరుగ పరలు అని ధ్వనించెను. వారచ్చెరువంది ఏమియిది. దోషము శాంతించుఁగాక యన ప్రతిధ్వని శాంతి యని ధ్వనించెను వా రిర్వురు నడుచుచు నగరమునకుఁ జేరి రాజప్రాసాదమున భూపతిని దర్శింప నాతం డాజవ్వనిసౌందర్యమునకు భ్రమమందివలచి యామెను బరిణయమయ్యెను. అంత మఱునాఁ డాదంపతు లామె తెచ్చినకరండపు చక్కఁదన

మును మెచ్చుకొనుటకై నామె యాకారండపు మూఁత తెఱచెను. తోడనే దానినుండి జ్వరములు, పీడలు, వ్యాధులు బయల్వెడలి దేశ మంతటను వ్యాపించి ప్రజలఁ బీడింప మొదలిడ, వారును క్రూరచిత్తులేగాన కలహము లొనర్చుచు, నొకరి నొకరు బాధించుకొన మొదలిడి, దుఃఖములు నాపదలు ననుభవింప దొడఁగిరి. ఆరాజదంపతులు వగచుచు, చేయునది లేక విలపించుచు, దేవుఁడగు గ్యోసుపితరుం గూర్చి దీనాలాపము లొనర్ప, నాకరుణామయుఁడెట్టకేలకు కరుణించి తలంప నాభరిణెనుండియె యొకబంగారుపక్షి బయల్వెడలి రాజదంపతుల నోదార్చి ప్రజలమనంబులకు శాంతి గల్గించి, దేశమున నీతిబాధల మాన్పి, సుభిక్ష మొనగూర్చెను. ఆపక్షి పేరు "కరుణ" యని చెప్పఁబడినది.

**పాండువు**— ఆంగ్ల. Anaemia. దేహమున రక్తము క్షీణించియు, ఇంచుక చెడియు, ఉండవలసినంత రక్తము లేక నేత్రములందు, గోళ్లయందు, నెఱుపుధాతువు తగ్గి, శరీరము వెల్లబాఱి ముఖము, కనుఱెప్పలు, పాదములు, గుహ్యస్థలముల నించుకవాపు కల్గించురోగము. ఇది వాతసంబంధము. వెంటనే జాగ్రతపడి యౌషధపథ్యములచే నిరోధింపకుండిన నపాయకర మగునందురు.

**పాండ్యదేశపు తమిళసంగములు**— (తమిళసంగములు మూఁడు చూడుఁడు)

**పాండ్యదేశపు నాడులు**— (నవనాడులు బిగించుట చూడుఁడు.)

**పాండ్యమహారాజు**— అత్రిసంతతి చంద్రవంశపుక్షత్రియుఁడు. పాండ్య దేశమేలినభూపతులకు మూలపురుషుఁడు. పాండ్య వంశమునకు మూలపురుషుఁడు. (పాండ్య దేశము చూ.)

**పాండ్యదేశము**—ఇప్పటిచెన్నపురిరాజధానిలోని అరవదేశమున దక్షిణసీమయం దిప్పటి మధుర తిరునెల్వేలి జిల్లాలప్రాంతదేశము. అర్జునునిభార్యయగు చిత్రాంగద యీదేశభూపతి యగు మలయధ్వజునిపుత్రిక యని, విజయవిలాస ప్రబంధమున చేమకూర వేంకటరాజను కవిపుంగవుఁడు వ్రాసియున్నాఁడు. పాండ్యరాజ్యము క్రీ. ము. ఆఱవ శతాబ్దమున నుండి యుండినదని తలంచిరి. ఇంకను నెక్కువ పరిశీలన వలన క్రీ.ము. ౨౬–౨౭ సంవత్సరములకాలమున రోమకచక్రవర్తియగు అగస్టస్ సీజరు కడకు రోమకపురి కొకరాయబారి నంపిన పోరస్‌భూపతి పాండ్యరాజేమో యని తలంచువారును కొందఱు కలరు. క్రీ. వె. ౧౧–వ శతాబ్దమున పాండ్యరాజ్యము భంగమై, తిరుగ నాయకనరపాలురలో ప్రథముఁడగు విశ్వనాథనాయకునిచే పునరుద్ధరింపఁబడి తిరుగ నిలిచినది.

మాణిక్యపురము తొల్లింటి రాజధానియై యుండెను. ఇదియె మలయధ్వజునకును చిత్రాంగదార్జునులకు సుతుండగు బభ్రువాహనునకును రాజధానిగ మహాభారతము, అశ్వమేధపర్వము ౭౯ యందుఁ జెప్పఁబడినది. కులశేఖరుఁడను భూపతి వైఘు లేక విఘునసనదీతీరమున తొల్లి హాలాస్యక్షేత్రమనుపేర బరఁగుచుండిన నిప్పటి (దక్షిణ) మథురాపురమును నిర్మించెననియు, నాఁడాదిగ నది రాజధాని యైయుండె ననియు, పద్మపురాణము, ఉత్తర ౯౨ బృహచ్ఛివపురాణము ౭–౨౦ యందు ప్రశంసింపఁబడినది. క్రీ. వె. ౧౨౫౦–౧౨౫౧ కాలమున ఇట సింహాసన మెక్కిన కర్ణాటకరాజగు జటావర్మ హొయాసల్యనృపతి యగు సోమేశ్వరుని జయించుటకై మధురయె రాజధాని యని చెప్పఁబడినది.

ఒకప్పు డిప్పటి తూత్తుకుడి సమీపమున

గల కల్కిపురము రాజధానిగ నుండెనఁట. దీని నిప్పుడు "కొల్కై" యనుచున్నారు. క్రీ. వె. రెండవశతాబ్దమున ప్టోలోమీ కొల్కాంగూర్చి ప్రశంసించియుండుటవలన నించుక కాలమును గూర్చి తెలియఁగలదు. అగస్త్యజాతక మను బౌద్ధగ్రంథమున కారాపురముంగూర్చి కలదు. ఆకారాపురమీ కోల్కై యేమో పరిశీలింపవలసియున్నది. తామ్రపర్ణీనదీతీరమున ఉత్తరపు గట్టున తిరునల్వేలిజిల్లాలోనున్న ఆమలకగ్రామము లేక ఆమలతలము పురాణములయందు చెప్పఁబడిన సహ్యామలకగ్రామము నరసింహపురాణము ౬౬ యందు దీనిప్రశంస కలదు. సహ్యాద్రి (Western Ghats) పైనుంట సహ్యామలకగ్రామమని పేరందిన దఁట.

ఇంక నీపాండ్యరాజ్యము నేలిన పురాతనపు భూపతుల నైదుగురను సుప్రసిద్ధవిద్యాధికులును, చెన్నపురివిశ్వవిద్యాలయమున చరిత్రల కీడరుగను, విశాఖపట్టణకళాశాలకు ప్రధానాధ్యాపకులుగను పనిచేసియుండిన శ్రీయుత పి.టి. శ్రీనివాసయ్యంగారు, తామొనర్చిన చరిత్రపరిశోధనలఫలితముగ పురాతనకాలమునుండి క్రీ. వె. 600 సంవత్సరములదనుక తమిళులచరిత్రను వ్రాసి,యందైదుగురు ౧ముదుకుడుమి, ౨నెడుంజెలియన్, 3 కలభ్రిన్, ౪ నెడుంజడయ్యన్, ౫ ఉక్కిరప్పెరువాలుడి (లేక ఉగ్రపాండియ) భూపతులంగూర్చి వివరించిరి. ఇందు మొదటి ముప్వురును ఆర్యవిధానధర్మములకు లోనుగాని వా రనియు, మొదటిభూపతి క్షత్రియకులుఁడని గాని, గోత్రముగల్గినవాఁడని గాని చెప్ప వీలు గానరాదని వ్రాసియున్నారు. వారి యభిప్రాయ మెట్లున్నను అక్కాలమునకు చతుర్వేదపారంగతులగు విప్రు లాదేశము దుండిరనుటయు, పైని వివరింపంబడిన మొదటిభూపతి యజ్ఞశాలలను నిర్మించి, యూపస్తంభముల నాటించి, యజ్ఞయాగముల నుద్ధరించి పాలించుకతన, "పాల్యాగశాలై" (యాగశాలపాలకుఁడు)అను బిరుదమును ధరించినవాఁడని వారిగ్రంథము నందే గాననగుచుంటయు, భారతయుద్ధకాలమునకుఁ బూర్వ మర్జునుఁడు పాండ్యరాజపుత్రిని బరిణయమగునాఁటికే పాండ్యరాజధానికి "మణిపుర"మని పేరుంటయు, భూపతికి మలయధ్వజుఁడను (సంస్కృతపు) పేరుంటయు, వారి మధురాపట్టణము సంస్కృతపద సంబంధము గల్గియుంటయు చదువరుల కెఱుకపఱచుచు వారింగూర్చి వివరింప ముందునకుఁ జనియెదము గాక.

ముదుకుడుమి భూపతి-ఈయన పూర్తియగు నామము ముదుకుడుమి. ఇతఁడు చరిత్రాత్మకముగఁ జెప్పఁదగినవారిలో మొదటివాఁడు. ఈతనిపూర్వులు పెక్కండ్రు పాండ్యరాజ్యమేలుచుండి రనియు, యజ్ఞముల నాదరించువాఁడు గాన, పాల్యాగశాలై బిరుదము గలవాఁడనియు పాండ్యాధిరాజనంబడినభూపతి యనియు, పాగనూర్కుర్రమ్ సీమయందు కోర్కైగ్రామవాసి యగు నార్కోర్రన్ అనువాఁడు యజ్ఞమొనర్చుచు భూపతి నర్థింప నాగ్రామమునకు "వేళ్వికుడి" యని నామమిడి భూః దానిని వానికి దానమొసంగె ననియు, అప్పటికి రాగిపట్టాలిచ్చునాచారము లేకుండెనుగాన నీయఁబడ లేదనియు, ఆకుటుంబ మాగ్రామము ననుభవించుచుండె ననియుఁ జెప్పఁబడినది.

పిదప రాజ్యమునకు నెడుంజెలియన్ ప్రభువాయెనఁట. ఈయన తనవైరులగు చేర, చోళ భూపతులను అనఁగా నానంగరమున నెదుర్కొనిన యుద్ధవీరసప్తకము నోడించె నని ప్రసిద్ధినందినవాఁడు. యుద్ధరంగమునకు తలైయాలంగానమఁట(తలై = స్థలము; యాలం = యుద్ధము; గానమ్ = ఎదుర్కొనిన)పేరులు. ౧చేరభూపతి, ౨శెంబియన్(చోళభూపతి),3తిడియాన్భూపతి,

(ఈతఁడు భయంకరుఁ డఁట), ౪ ఎలినిభూపతి (ఈతఁడు స్వర్ణాభరణయుక్తుఁడఁట), ౫ ఎరుమ య్యూర్యూపతి (ఈతని రాజ్యమున కల్లు (మద్యము) సాలెపట్టుతో వడకట్టుటను పేరందె నఁట) ౬ ఇరుంగోవెల్యూపతి (ఈతఁడు చందన చర్చానిరతుఁ డఁట), ౭ పోరున న్యూపతి, (ఈతఁడు రథాధిపతియఁట. ఆలస్యముగ నేతెంచి యాలమునఁ జేరుకొన్నవాఁడఁట).

బాల్యముననే సింహాసనమునకు వచ్చిన పాండ్యనృపతి పదునెన్మిదిపంక్తుల యఱవకవితను గూర్చి సంగరమున కురికి, వైరుల నోడించె ననియు, ఈతఁడు శెలియవంశస్థుఁ డనియు, యజ్ఞము నొనర్చినవాఁ డనియు,మధురాపట్టణ వర్ణన మనందగు 'మదురైక్కాంజి' పాట ఈ భూపతి కాలముననే రచింపఁబడిన దనియు, ఈతఁడు బహుశః క్రీ. వె. ఆఱవశతాబ్దమునాఁటివాఁ డనియు శ్రీ అయ్యంగారు సూచించిరి.

నెడుంజెలియన్ భూధవుఁడు ఆక్రమించిన ట్లాగ్రంథమునందు చెప్పఁబడినది.కావిరిప్పూంబ ట్టనునది నెల్లూ రనియు, నది అఱవదేశమున సముద్రపురే వనియు అఱవపాటలం దున్నట్లు వివరింపఁబడినది. నెల్లూ రఱవదేశములోనిది యును కాదు, సముద్రతీరపురేవున్నై యుండినది యును కాదు. మధుర కుత్తరదిశ ననతిదూరమున సాలియూర్ - నెల్లూరు గానోపు నని నస్సినా ర్కినియా రను గ్రంథకర్త తలంచె నని చెప్పఁ బడినది. తననావికాబలమున పాండ్యరాజు దీని నాక్రమించె నఁట.

ఇట్టి పురాతనరాజవంశమును సింహాసనము నుండి తొలఁగించి కలభ్రాన్ అను పేరుగల బలాఢ్యుఁ డగువాఁ డొకఁడు పాండ్యరాజ్య మాక్రమించి వేల్వికుడి గ్రామమును గల్పుకొనె నఁట.

పిదప నెడుంజడయ్యన్ భూపతి కాలమున నాక్కొఱ్ఱన్ సంతతివాఁ డగు కామక్కాని నర్సింగన్ అనునాతఁడు భూపతినుండి తిరుగ వేల్వికుడి గ్రామము దానము వడసి, తామ్రశాస నపూర్వకస్వాధీనము బడసెనని చెప్పఁబడినది. ఎపిగ్రాఫికా ఇండికా XVIII సం. ౨౯౧ పుటయందుగల వేల్వికుడిశాసనమునం దీవిష యము లిఖింపఁబడియున్నది.

కడపటివాఁడుగఁ జెప్పఁబడినవాఁడు ఉక్కి రప్పెరువాలుడి (ఉగ్ర పాండియ) నృపతి. ఈతఁడు "ఇరాసనూయంవెట్ట" రాజసూయ యాగ మొనర్చెననియుఁ జెప్పఁబడినది. ఈతని యాజ్ఞమేరకు అగమ పద (పాటలు) రెండు వందలును, పిదప మఱి రెండువందలును వెరశి నాల్గునూఱులుకూర్పఁబడెననియుఁజెప్పఁబడినది

పాండ్యరాజ్యమునందినాఁడు రాజ్యపతాకపై మత్స్యము చిహ్నముగా నుండెడి దఁట. వీరి రక్షకదేవత యగు మధురయందలి సుందరే శ్వరస్వామి యనుసంగుదేవికి మీనాక్షి (Fish eyed) యనిపేరు. ఆదినుండియు పాండ్య దేశస్థులు సముద్రముపై ఓడల (ఎగుమతి)వర్త కము చేయుచుండినవారు. (వీరి విద్యాసంగము లంగూర్చి తమిళ సంగములు చూ. పాండ్య రాజ్యములం దుండిన నవసీమలంగూర్చి నవ నాడులు బిగించుట చూ.) ఇందు కుమారీనది, పహ్రూలీనది, తామ్రపర్ణినది చెప్పఁబడినవి. కుమారీనదీప్రశంస మహాభారతమునఁ గలదు. పహ్రూలీ కుమారీనదుల పరిదేశములు సముద్ర గామియైనవి గానోపు.

**పాండ్యవంశనృపతులు—** వీరు చాల పురాతనక్షత్రియవంశస్థులు. కులశేఖరపాండ్య, మలయధ్వజుఁడు (అర్జునుని మామగారు) మొద లగునారీవంశనృపతులు. భారతకాలమునుండి యున్నరాజ్యము. మాలిక్కాఫర్ వీరి వంత మొందించెను.

**పాంథిజమ్** (Pantheism)--జగత్తును దైవముగ భావించుమతసిద్ధాంతము. మిథ్యారూపములను (విగ్రహములు) దైవభ్రాంతిచే పూజించుమతము. ఎ. డి. 120-130లో హాడ్రియనుచే కట్టఁబడిన (Pantheon) గుడి క్రీ.శ 610 లో క్రైస్తవచర్చిగా మార్చఁబడి యిప్పటికిని ఇటలీ ప్రభుత్వాధీనమై యున్నది. పారిసునగరమున నున్న (Pantheon) గుడియును చర్చిగా మార్చఁబడినది.

**పాకనాటిసీమ (లేక పాకనాడు)** — ఇప్పటి గుంటూరుమండలములోని కొండవీడు మొదలుకొని నెలూరుమండలములోని కందుకూరువఱకుఁగల ప్రదేశమునకు పాకనాడు లేక

జ్ఞాడని పేరు. ఇ[illegible]గు నియోగి బ్రాహ్మణులకు ప్రాజ్ఞాటినియోగు లనియు, పాకనాటినియోగులనియు, తూర్పునాటినియోగులనియు వాడుకనామములు కలవు.

**పాకనాడు (ప్రాజ్ఞాడు)**— నెల్లూరు మండలములోని పాకనాడనుపేర సుప్రసిద్ధి నందియుండినతావువలన పేరొందిన సీమ. ఆ ప్రాంతమునఁగల పాకనాటినియోగు లీనాటి నుండియే పేరందియుండిరి. ప్రాజ్ఞాడుపద మిటీవల సంస్కరింపఁబడిన రూపముగాఁ దోఁచెడిని.

**పాకపరికరములు (ఉప్పుతోతొమ్మిది)**- వంటకు తొమ్మిది పరికరము లత్యవసరములు. ఆంధ్రమున వీటిని "ఉప్పుతోతొమ్మిది" అని వాడెదరు. ౧ బియ్యము, ౨ పప్పు, 3 కూర, ౪ నెయ్యి, ౫ మిరపకాయలు, ౬ చింతపండు, ౭ పోగుపుసామాను, ౮ కట్టెలు (వంటచెఱుకు), ౯ ఉప్పు.

**పాకము**— కవిత్వ, కావ్య, పాకము. ఇది ద్రాక్షాపాకము, నారికేళపాకము నని ద్వివిధము. కొందఱు కదళీపాకముతో త్రివిధము లందురు. (లక్షణ చూడుఁడు.)

**పాకము (వంట)**— పాక మన వంట చేయుటవలనఁ గల్గినది యని భావము. పాకము చేయుట యన వంటచేయుట యని యర్థము. ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఔషధాదులు వంటచేయుటయందు ఏడు విధములు చెప్పఁబడినవి. ౧ భర్జనము, ౨ తలనము, 3 స్వేదనము, ౪ పచనము, ౫ క్వథనము (ఇది సిద్ధద్రవ్య రస గ్రహణము), ౬ తాందూరము, ౭ పుటపాకము.

**పాకయజ్ఞములు ౭**- శ్రాద్ధములు 3 విధములు.--౧ అష్టక శ్రాద్ధములు, ౨ పార్వణ శ్రాద్ధములు, 3 మాసశ్రాద్ధములు.

కర్మబలులు ౪విధములు. శ్రావణీకర్మ :- శ్రావణశుద్ధపౌర్ణమిని సర్పబలి. మార్గశిరశుద్ధపౌర్ణమిని సర్పబల్యుత్సర్గము; అగ్రహాయణీకర్మ చైత్రశుద్ధపౌర్ణమిని చైత్రి లేక శూలగవ; ఈశానబలి. ఆశ్వయుజ శుద్ధపౌర్ణమిని ఆశ్వయుజి లేక హేమంతప్రత్యవరోహణకర్మ. ఇవి సప్తపాకయజ్ఞములు.

**పాకశాస్త్రము**— పాకశాస్త్ర మాయుర్వేదమునం దొకభాగముగఁ జెప్పఁబడినది. దీని గ్రంథసముదాయ మంతగఁ గానరాదు. నలచక్రవర్తియు, పాండవమధ్యముఁడగు భీమసేనుఁడును పాకశాస్త్రవేత్తలుగఁ జెప్పఁబడిరి.

పాకశాస్త్రమునకు ౧ ఉప్పు, ౨ పులుసు, 3 కారము, ౪ చేఁదు, ౫ తియ్యదనము, ౬ వగరు నను నాఱురుచు లంగము లని చెప్పఁబడినది. వీట న్యూనాధిక్యభేదములచేతను తైల, ఘృత, జల పక్వస్థితులొనఁగూర్చి ఇంగువ, ఆవాలు, మెంతులు, జీలకఱ్ఱ, అల్లము మొదలుగాఁగల వస్తువులనుండి పరిమళములనుగూర్చి రుచులను గుదిర్చి పెక్కువస్తువులు పెక్కురీతుల

పక్వము నొనర్చుచుందురు. నలమహారాజులొక్కొక వస్తువును పదునెన్మిది విధములుగ వేర్వేఱు రుచులతో పక్వ మొనర్చువాఁడని చెప్పఁబడియున్నది.

పాకశాస్త్రము ననుసరించి సిద్ధపఱచు భోజనపదార్థములు భక్ష్యములు, భోజ్యములు, చోష్యములు, లేహ్యములు, పానీయములుగ నైదుభేదములుగ విభజింపఁబడినవి. ఇవి వేర్వేఱు దేశములం దాయాదేశపరిస్థితుల మేరకు వేర్వేఱు విధములుగ నుండెడివి. క్షీరాన్నములు, పులిహోరలు, కేసరిభాతు మొదలగు చిత్రాన్నములు కొన్నిగలవు. వీట్లను లెక్కించుచు వివరించుటకన్న దేశీయములుగ తలంచుట శ్రేయము. శాస్త్రగ్రంథములు లేవు.

**పాక్పట్టణము**--(అయోధనపురి చూ.)

**పాకానుమతి గోత్రము**-(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**పాక్లాండుద్వీపములు**—అట్లాంటిక్కు మహాసముద్రి దక్షిణభాగమునందలి దీవులు. తూర్పు పాక్లాండుదీవులు-౨౯౮౦ చతురపుమైళ్లు వైశాల్యమును, పడమటి పాక్లాండు దీవులు ౧-౭౦౯౮ చతురపుమైళ్ళ వైశాల్యమును గల్గి బ్రిటీషు సామ్రాజ్యమున క్రొన్నొక్కలనీలుగా నున్నవి. స్టాన్లీపురము ప్రధాననగరము. క్రీ. శ. ౧౫౯౨-లో జాన్ డేవిస్ గారివల్ల కనుఁగొనఁబడినవి. ౧౮౩౩-లో బ్రిటీషుసామ్రాజ్యమునకు జెరిపోయినవి.

**పాగులగోత్రము**-(సాహులగణము చూ)

**పాగ్వంశిగోత్రము**—(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**పాచకగోత్రము**-(శాండిలగణము చూ.)

**పాటచ్చరదేశము (పటచ్చరదేశము)**-ఇప్పటి అలహాబాదు (ప్రయాగ) మండలములోని భాగమును, బాందా జిల్లాయును గల్పి యీదేశ ముండినట్లు తలంపఁబడు చున్నది. గంగాతీరప్రాంతమున రాజధానిగఁ గూడ నుండెనని తలంచుచున్నారు.

జైమినీభారతము ౧౫ అధ్యాయమునను, మహాభారతమున సభాపర్వమున ౩౦ అధ్యాయమునను దీనిప్రశంస కలదు. సహదేవుఁడు దీనిని జయించినట్లు చెప్పఁబడినది.

**పాటచ్చరలుంఠితే వేశ్మని యామిక జాగరణ మితి న్యాయము**— దొంగలింటిలోఁ బ్రవేశించి దోఁచుకొని పోయినపిదప కావలివాఁడు మేల్కొనినట్లు. అనఁగా బుద్ధిహీనత కర్థము. చేయి కాలినపిదప నాకులు పట్టుకొనుట యను నాంధ్రలోకోక్తివంటిది. ఆదియందజాగ్రతచే నష్టము కల్గినపిదప జాగ్రత నుదెలుప నీన్యాయము వాడుదురు.

**పాటన మంతరేణ విషవ్రణానాం నోపశాంతి రితి న్యాయము**--విషవ్రణముల కుపశాంతి లేదు. దాని కింక శస్త్రవైద్యమే సాధన మనిభావము. ఇందు విషవ్రణమున విషము పుట్టించు కురుపని భావము. ఇది చాల అపాయకరవ్రణము. ఉపశాంతియన ఔషధములు లోనికిచ్చిగాని, పైకి లేపనములు పూసిగాని మాన్పుట. ఈసాధనములు ప్రయోజనము లేనితఱి శస్త్రవైద్యమే (శస్త్రముతో కోసివేయుటయే) సాధన మనిభావము.

శస్త్రముచేయు పరికరమునకు Lancet అనిపేరు. అది రెండువైపులను దారుగల కత్తి. ఆయుర్వేద వైద్యశాస్త్రమున నిట్టి కత్తికేమిపేరో మాకు సరిగాఁదెలియరాకున్నది.

**పాటపాడుట** అన్యులమనముల రంజింపఁజేసి వారికి సంతసముఁ గల్గింపఁ పాటలు పాడుట (సంగీతము)సర్వసాధారణముగ జరగుచున్నది గాని సంగీతశాస్త్రము చతుష్షష్టివిద్య

గాన దానిని నేర్వవలసియుండును. పసిబాలురు పాటలు పాడుటకు వారిమనస్సునందుఁ గల్గిన సంతసము, ఉత్సాహము కారణములు గాని వారికి సంగీతశాస్త్రవిద్యాభ్యాస మక్కఱలేదు. పక్షులు పాటఁబాడుటకు వాటికిఁగల్గినసంతసమే కారణమని కన్గొనఁబడినది. పక్షులకు సౌఖ్యప్రదమగు కాలమున నవి తమసంతసము దెల్పుటకోయన పాడనారంభించునుగాని విద్యాప్రదర్శన మెంతమాత్రమును గా నేరదు. ఇంతవనుక నీపాటబాడుట సంతసముఁదెల్పు కార్యముగ నెరుంగఁబడుచున్నది. గాని దుఃఖము దెల్పు కార్యముగా దని స్పష్టమగుచున్నది.

ఇటీవల నాటకాదులందు దుఃఖము నెఱిఁగించు పాటలు ప్రారంభమైనవి. మనోగత ఆధివ్యాధులఁ దెల్పుటకును దుఃఖము మనోగతమైన కష్టములఁ దెల్పుటకును పాటలుబాడుచుంటఁగాననగుచున్నది. కాని,ఇట్టివి సంగీతాభినయవిద్యలప్రదర్శనము గాని సరియగు నట్టిస్థితినుండిగల్గిన పరాధీనత గానము గానేరదు.

**పాటలగంధి (పాటలగన్ని లేక గన్ధపర్ణి) తీఁగ**—లా. Ophioxylon Serpentinum. ఆంగ్ల. Serpent Creeper. సం. చంద్రి. దీనివేరుచూర్ణము రసకషాయములుగ వాడుదురు. పాము, తేలు, వెఱ్ఱికుక్క, నక్క మొదలగు విషజంతువులకాటువిషమునివారించి యారోగ్య మొసఁగుననియు, స్త్రీలకు (గర్భిణి) శీఘ్రప్రసవముగల్గింప దీనిచూర్ణము,కషాయము లోని కీయనగుననియు,చూర్ణము గాయములపై వైచుచుండిన మాను ననియు, ఆకులరసము కండ్లలో పోయుచుండిన కూసలు మొదలగు నేత్రరోగములు నివారణమగు ననియు, సమూల కషాయము కడుపునొప్పి, జ్వరము, పేగుల లోనివ్యాధి, మఱిడిజాడ్యము, రక్తగ్రహణుల నాపి నివారించుననియుఁ జెప్పఁబడినది.

**పాటలపురము**-(పాతాళపురము చూ. సింధుదేశము చూడుఁడు.)

**పాటలవృక్షము**—లా. Bignonia, Chelonoides, Bynonia Suaveoleus. సం. పాటలా. మధూద్ధూతీ. కాలవృన్తా. సర్వసాధారణముగ కలిగొట్టుచెట్టనియు, కారుకొల్లిచెట్టనియు నందురు. వైద్యులు ఆకురసము గాని చక్కరసముగాని, వేరుగాని, విత్తులుగాని చూర్ణముగనో, కషాయముగనో రసముగనో వాడుచుందురు.

తీవ్రమైన వేడిచేసి రక్తవాతము నడఁచును. ఉబ్బు, ఎక్కిళ్ళు, కఫము, జ్వరము, జిహ్వాదోషము, పైత్యముల నడంచుననియు, ఆకురసములో నిమ్మపండ్లరసము కల్పి యిచ్చుచుండిన పిచ్చి కుదురు ననియు,చెట్టునీడను వసించుటవలననే గొప్పదోషములు పరిహారమై తాపము, రక్తపైత్యము శమించి, చలవజేసి వీర్యమునకు పుష్టి కల్గుననియు చెప్పఁబడినది.

పూవులరసములేకకషాయము లేకచూర్ణము జలదోషము నడంచుననియు, బుద్ధికి బలమొసఁగుననియు, నిత్యము సేవించుచుండిన పైత్యోద్రేకము, తాపము, రక్తపైత్యముల శమింపఁజేసి జ్వరము రాకుండ నాఁపుననియుఁ జెప్పఁబడినది.

**పాటలాదేవి (పాతాళేశ్వరి)**—పాటలీపుత్రమునఁగలశక్తిపీఠము.మగధరాజ్యముచూ.

**పాటలి గోత్రము**—(జాతుకర్ణ్యగణము చూడుఁడు.)

**పాటలీపుత్రము (పాట్నానగరము)**—ఇప్పుడు బీహారుదేశపు ప్రధాననగరము. దీనికి మొదటిపేరు కుసుమపురము. ఇది అజాతశత్రు నృపాలుని మనుమఁడగు ఉదయాశ్వమహారాజ నిర్మితమని తెలుచున్నది. పాటలపుత్రి మనునది దీనివాడుకనామము. వాయు పురాణమున

పై రెండు పేర్లను చెప్పఁబడినవి. గ్రీకుచరిత్రకారుఁడగు మెగస్తనీస్ స్పష్టముగా పలుకలేక నేమొ పాలిబోత్రా యని వ్రాసికొనియెను. ఇట్లె ఆమహనీయుఁడు చంద్రగుప్తునికి సాండ్రకోటస్ అని పేరిడియున్నాఁడు. కాని, మహమ్మదీయ ప్రముఖులు దీనికి అజీమాబా దని పేరిడిరి గాని ఎవ్వరును పాటించుటలేదు.

ఈప్రసిద్ధపురాతననగరము మగధరాజ్యమునకు రాజధానియై యుండినది. ఇప్పటి పాట్నానగర మీపరిసరములనే పునర్నిర్మితము. సకలవైభవోపేతమునై గవర్నరుగారి నివాసమైయున్నది. పాటలీపుత్రమున పాతాళదేవి (పాటలదేవి) దేవస్థానము ప్రసిద్ధమైనది కలదు. ఇట సీక్కుమతస్థుల తొమ్మిదవగురుండగు గోవిందసింగు జన్మస్థానమగుట సిక్కులగురుద్వార దేవస్థానము కలదు.

**పాటికాయన గోత్రము**-(వాధ్ర్యస్వలేకమిత్రయువగణము చూడుఁడు.)

**పాటియాలా స్టేటు**- పంజాబు దేశమున బ్రిటీషురక్షిత సంస్థానములు 34 లో నొకటి. ఇది సిక్కుస్టేటులలో నొకటి. సర్హిందు జిల్లాలోనిది ఫలవంతమైన భూములుగలరాజ్యము. పాటియాలాపురము రాజధాని. ప్రభువు సీక్కుమతస్థుఁడు.

**పాట్ గాన్ టు పాట్** (Pot gone to pot)— ఈఉక్తిని చావునకు, దివాలాతీయుటకు, జాతిభ్రష్టుఁ డగుటకు వాడుచున్నారు. ఒకప్పుడు సమర్కండునందొకకుట్టుపనివాఁడు శ్మశానమునకేగు మార్గమున నుండువాఁడఁట. శ్మశానమునకుం గొంపోవఁబడిన ప్రతిశవమునకొక్కొకబెడ్డ నొక కుండయందు వైచుచు లెక్కించుచుండువాఁడఁట. ఒకరోజున నాతఁడు మరణింప నొకహాస్యకుఁడు తనబెడ్డకూడ కుండలో వేసికొన్నాఁడాలేదా? అని విచారించెనఁట.

**పాట్నా నగరము**— (కుసుమపురము, మగధదేశము, బీహారదేశము చూడుఁడు.)

**పాఠక్రమన్యాయము**--పాఠక్రమమనమూలగ్రంథములందు చెప్పఁబడిన వరుస లేకక్రమమని యర్థము. ఇట్టిక్రమములుమీమాంసాశాస్త్రమున ఆఱు చెప్పఁబడినవి.

౧ శ్రుతిక్రమము- దీనికి శ్రుతి బలీయస్త్వన్యాయమనిపేరు.

౨ అర్థక్రమము-దీనికిఅర్థబలీయస్త్వన్యాయమని పేరు.

౩ పాఠక్రమము- దీనికి పాఠబలీయస్త్వన్యాయ మనియు, సంప్రదాయ బలీయస్త్వన్యాయ మనియు, ఆచారబలీయస్త్వ న్యాయ మనియు వాడుక నామములు కలవు.

౪ ప్రవృత్తిక్రమము- దీనికి ప్రవృత్తి లేకవిధిబలీయస్త్వన్యాయ మనియుఁ బేరు. ప్రావర్తికక్రమన్యాయ మనియు నందురు.

౫ స్థానక్రమము.

౬ మురవ్యక్రమము.

**పాఠ** (విసబొద్దితీఁగ)— లా. Ciss-ampelos Hernandifolia. సం. అంబష్ఠా, ప్రాచీనా, పాఠా. దీనివేళ్ళు అగరుశొంఠి యనంబడును. దీనివేళ్ళచూర్ణము గాని, కషాయము గాని అత్యుష్ణమును చల్లార్చుననియు, విషదోషములను విఱుచుననియు, వాతశ్లేష్మముల నడంచు ననియుఁ జెప్పఁబడినది. అగరుశొంఠి, శొంఠికషాయము ఆహికజ్వరములనివారించుననియు, పాఠచెట్టునందుఆమదోషము కుసుమరోగము జ్వరము నడంచు గుణము గలదనియు, అగరుశొంఠిత్రిదోషహరమైనదనియు జెప్పఁబడినది.

**పాడగా పాడగా రాగము కుదురుట మూలుగగా మూలుగగా రోగము ముదురుట**—(ఆంధ్రలోకోక్తి.)

**పాడలి గోత్రము**-(కుశికగణముచూ.)

**పాఁడి**—పాలయందు మూఁడువిధములగు వస్తువులు కలవు. ౧ ఉదకము, ౨ క్రొవ్వుఉండలు, 3 నీటగరఁగిపోయి దానితో గలసియుండు తెల్లనిపదార్థమును. ఇం దుదకము తెల్లనిపదార్థముతోఁ గలిసి తానును తెల్లనిరంగు కలదిగనే యుండును. రెండవది యగు క్రొవ్వు ఉండల వలె నతిసూక్ష్మములై గాలికి గట్టిపఱుపఁబడిన (మూఁడవది యగు) తెల్లని పదార్థపుపొరలచే జుట్టఁబడి యుండును. ఇవి పాల నట్లె నిల్వ యుంచితిమేని, గాలికి క్రొవ్వును జుట్టుకొని యున్న పొరలారి, తిరుగ మఱియొకసారి చుట్టుకొని, దళసరి యగుట క్రొవ్వుఉండలు పెద్దవియై తేలుచు వారకు జేరుకొనుచు నుండును.

పాలు కాచితిమేని వేఁడి కాయుండలలోని క్రొవ్వు కరఁగి తెల్లని పదార్థము జేరుకొని పాలపై తెల్లనిపొరవలె నేర్పడి దళసరియై మీఁగడ యనంబడును. ఇంక వేఁడికి పాలయందలినీరును కొంతయావిరియైపోవుటను పాలు చిక్కఁబడును.

ఆపాలను పులియునట్లు జేసితిమేని వెన్న చక్కఁగ బయటపడును గాన, నాకాఁగినపాలయందు కొంచెము పుల్లనిమజ్జిగ గల్పి, పది లేక తొమ్మిదిగంటలకాలము నిల్వయుంతురు. అందువలన పులిసి పెరుఁగగును. మఱియు నందలి క్రొవ్వుభాగము పైకి తేలుచుండెడిని. దానిని దీసి వేఱొకపాత్రమున నుంచి, కొంచెము జలము గలిపి కవ్వముతోఁగిలకొట్టిన నాయదటునకు క్రొవ్వుభాగ మంతయు దరిజేరుచు నొకటి నొకటి హత్తుకొనును. దీనిని దీసి యొకతావున జేర్చిన వెన్న యగును. ఇందు క్రొవ్వును, పైనావరించియున్న తెల్లనిపదార్థపు తొరకలు (పొరలు) కలిసి యుండును.

ఈవెన్న గాచిన క్రొవ్వంతయు కరఁగి నేయి యగును. మిగిలిన తెల్లనిపదార్థపుపొరలన్నియు మాడుటయో, లేక యెఱ్ఱనివర్ణముగ మాఱియో యడుగునకు దిగి యట్టగట్టియుండ దానిని గోకుకొందురు. కొందఱు పిల్లలు దీనిని గోదారి యని పిలిచెదరు. దీనిని తినెదరు.

మిగిలిన పాలయందలి తెల్లనిపదార్థమును, దానితో గూడియున్న జలమును, ఈరెండును గలిసినదానికి మజ్జిగ యనిపేరు. నీటఁగలిసిన తెల్లనిముద్దకు మీఁగడ (Cream) క్రీమ్ అనియు నందురు.

క్రీమునుండి వేరుచేయఁబడిన నీటిని ఐరోపా దేశములందు పందుల కాహారముగా నిడుదురు. దీనికి వే (Whey) అని భరతదేశమున వైద్యులు విషజ్వరము (Typhoid fevers) లందు రోగి కాహారముగ నిచ్చుటయుంగలదు.

**పాఁడిపశువులు-పాలపరిశ్రమ**(Dairy Farms)— ఆవులు, గేదెలు, గొఱ్ఱెలు, మేఁకలు, మొదలగునవి సాధారణముగా పాఁడిపశువు లనిపించుకొనును. కొన్ని దేశములందు ఒంటెలు మొదలగు జంతువులపాలు గూడ మనుష్యు లుపయోగింతురు. పాలు, అందునుండి కల్గిన వెన్న, పెరుఁగు మొదలగు ఉపపదార్థములను (By products), వ్యాపారస్థానములకు ఆంగ్లమున డైరీ (Dairy) అనుచుందురు. ఈఫారములయందు ఆవులును, గేదెలును గూడ పాఁడికొఱకు ఒక వ్యాపారముగా పెంచబడును. ఈవ్యాపారమునకు మూలధనము మొదటపెట్టబడికి ఆవశ్యకము. అమీఁద మంచివంగడముల పశువులను జాగ్రత్తపఱచుట, ఆయా త్తపఱచిన జాతులను అప్రమత్తులై సంరక్షించు పరిశీలన సామర్థ్యము, పాలును, అందువల్ల లభించు నుపపదార్థములు, నెప్పటి కప్పుడు చెల్లిపోవుచుండునట్టి గిరాకీ మొదలగునవియు ఫారములు లాభకరములుగా నుండుటకుఁ బ్రధానాంశములు.

మంచివంగడముల పశువు లధికముగా పాలిచ్చును. భరతదేశమునందలి కొన్ని వంగడములు ఐరోపా, ఆస్ట్రేలియ మొదలగు విదేశములందలి పశువులకుఁ దీసిపోవని గోసంరక్షణమందు విశేషానుభవజ్ఞానముగల పరిశోధకులు చెప్పుచున్నారు. వీనిలో హిస్సార్ (పంజాబు) సింధుదేశపు ఆవులును, ఢిల్లీయందలి నై అను జాతి గేదెలును మంచినాణెమైనవి.

ఏదేని యొకపట్టణమున కైదారుమైళ్ళ దూరములో హత్తియుండి పశువుల పుల్లరికిఁ దగినంత విశాలములైన తృణజలసమృద్ధములైన గయాళిబయళ్ళు విశేషముగాఁ గలతావులు డెరీఫారములు స్థాపించుట కనుకూలములై యుండును. పశువులను పెంచి, పాలుపితికి అమ్ము ప్రతిస్థలమును డెరీ యనఁబడ నేరదు. డెరీకి ప్రధానలక్షణములు మూఁడు. ౧ గోష్ఠమనఁగా పశువులను కట్టుటకు ఆరోగ్యవంతములైన విశాలములైన గోవులశాల లుండుట. ౨ అంటురోగములు వ్యాపింపకుండ నరికట్టుటకును, పశుగణమును నిరంతరము పరిపూర్ణమగు నారోగ్యస్థితియం దుంచుటకుఁ దగినంత యవకాశముండుట. ౩ వ్యాపారము బాహుళ్యముగా నడుపుటకు అవకాశము నొసంగు పరిసరపరిస్థితులు. అనఁగా తయారైన వెన్న, పెరుగు, మొదలగు నుపపదార్థములు నిలువయై చెడిపోవకుండునంతటి గిరాకీయుండుట.

పైనుదహరించిన లక్షణత్రితయము పట్టినప్పుడే కాని, డెరీవ్యాపారము జయప్రదముగా నెఱవేఱఁజాలదు. ఇవి లభించినను మున్ముందు పశువులను కొనుటకును, అవి ఫలోన్ముఖములగునంతవఱకు భరించుటకును మదుపుకొంతకావలసియుండును. తగినవారిచే సువ్యవస్థితముగా జరుపఁబడు డైరీఫారములు లేనిచోట్ల పరిశుభ్రమైన అసలుపాలు లభించుట దుర్లభము. ఒకవేళ విశేషవ్యయప్రయాసములవలన నీళ్ళుకలియని పాలు లభించినను పశువులు మేయు మేఁతను బట్టియు, వాటికి వేయు దాణానుబట్టియు పాల గుణమును, రుచియును, మాఱుచుండును. ఆరోగ్యవంతములు కానట్టియు, అస్వాభావమగు మేఁత మేయునట్టియు పశువులవలన సంభవించు పాలుగాని, వానినుండి తీయు నుపపదార్థములు గాని ఎంతమాత్రమును పరిగ్రహణయోగ్యములు కావు. వీథులందుఁ దిరుగుచు పుల్లాకులు, మలపదార్థములు మొదలగువానిని దిను పశువుల పాలు వాడుకచేయువారికి విషజ్వరము సోకుట (Typhoid fever) వైద్యశాస్త్రవేత్తల పరిశోధనలవలనఁ దేలినది. పా లనినంతనే స్వభావసిద్ధములగు గుణకర్మస్వభావములు గలిగినవై యుండవలయును. గాని అనారోగ్యభూయిష్ఠములై క్షీణగుణముగల తెల్లని యేద్రవపదార్థమైనను పా లనిపించుకొనఁజాలదు.

అపరిశుభ్రమగు జల మందులోఁ గలుపుట వలన పాలద్వారా జలవాహకములగు విషూచి, క్షయ మొదలగు కొన్నిరోగములు వ్యాపించుట సంభవించుచున్నది.

మంచిజాతులకు మంచిమేత పెట్టి మంచి జాతులచే జత కట్టింపకపోవుటచే గోగణమునందలి మంచివంగడములు నానాఁటికి క్షీణించుచున్నవి. కొన్ని వంగడములు రూపుమాసిపోవుచున్నవి. పాలు అన్నిదేశములయందును పసిపిల్లలుమొదలు వృద్ధులవఱకును అందఱకు నత్యావసరమగు నారోగ్యకరమైన యాహారము. అయినను సరియైనరీతిగా సంగ్రహింపఁ బడక దోషపూరితములైనచో వానివలనఁ గలుగు మేలునకన్నఁ గీడే యధికముగా నుండును. సరియైన మూఁతలులేని పాలు నిలువ చేయు ముంతలలో నీఁగలు, దోమలు మొదలగునవి పడి, కలరా మొదలగునంటువ్యాధులువ్యాపింపఁ

జేయుటకు దోహదము లగుచున్నవి. పాడి పశువుల కారోగ్యవంతమగు నాహారము పెట్టక పోవుటవలన నట్టివానిపాల నుపయోగించిన వారికి అనేకవిధములగు నంటువ్యాధులు వచ్చుచుండును. పాలలో నీరు కలిసినట్లే నేతిలో క్రొవ్వు మొదలగు పదార్థములు కలుపఁబడుచుండును.

పాలవిషయమునను తజ్జన్యములగు నుపపదార్థముల విషయమునను అత్యంతజాగ్రతతో పరామర్శించి మఱియు నుపయోగించుట ఆరోగ్య భాగ్యముగోరు ప్రతిమానవునకు నత్యంతావసరము.

తగినంత పరిశీలనచేసి ఉత్తమజాతిపదార్థములనే ఉత్పత్తి చేయుటయం దప్రమత్తులై యుండుటయే దేశముయొక్క ఆర్థికాభ్యుదయమునకు హేతుభూతము.

లాక్టోమీటర్ (Lacto metre)అను క్షీరపరిశీలనపరికరమువలన పాలను పరిశోధించుట శ్రేయోదాయకమని తెలుపవలసియున్నది.

కేంద్రస్థలములయందు డైరీలను నెలకొల్పి ఉచితమైన స్థలములయందు వానిశాఖలను స్థాపించుట మంచిది.

అధికముగా పాలనిచ్చు మంచిజాతిపశువులకు బలమైన మంచి యాహార మిచ్చుట శ్లాఘనీయము.

అంటురోగములుగల పశువులనుండి వేరుపఱచుటయు వాంఛనీయము.

పాలు పితుకువానిని తఱచుగా మార్చుచుండినయెడల పశువులు క్రొత్తచేసి పాడి తగ్గిపోవునని యెఱుంగవలయును.

తమ దేశములో చాలినన్ని పాలు లభింపక పోవుట, విదేశములనుండి ముద్దపాలు (Condensed milk) తెచ్చుకొనుట కొక కారణమగుచున్నది. వట్టిపోయిన పశువులను కసాయివాండ్ర కమ్ముట కొన్ని పట్టణములలో నాచారమైయున్నది. ఆవుపాలకన్న గేదెపాలలో మిసిమి విశేషముగ నుండి హెచ్చువెన్న లభించును

వంగడము:-సరియైనమేత లేకపోవుటచేతను మంచిజాతులచే జతకట్టింపకపోవుటచేతను మేల్మయిన వంగడములు క్రమక్రమముగా ంచుచున్నవి.

అధమజాతి ఆఁబోతులవలనఁ గలుగు సంతతి అనారోగ్యవంత మగు అధమజాతి వంగడమగును. పశువులలో క్షేత్రబలముకన్న బీజబలము ముఖ్యము. నీరసజాతిదూడలకు తప్పనిసరిగా బీజవిచ్ఛేదనము చేయించుట అవసరము. పశురోగముల నాటంకపఱచుటకు తగినప్రయత్నమవసరము.

శీతోష్ణస్థితులనుబట్టి కూడ పశువుల పెరుగుదలయు పాడియు నుండును.

ఆర్యులకు పశుధనమే పూర్వకాలమున ప్రధానమైన ధనము. అట్టిధనము నభివృద్ధిచేసి రక్షించుకొనుటలో నశ్రద్ధ పనికిరాదు.

పాలనుండి వెన్న మొదలగు నుపపదార్థముల తీయు డెరీకి కావలసిన పరికరములు:—మన గృహములయందు పాలుకాచి తోడుపెట్టి మీఁగడతోఁ గూడిన పెరుగును కవ్వముతో ద్రిప్పి వెన్నతీయుట అనాదిసిద్ధముగా వచ్చుచున్న యాచారము. ఇటీవల ప్రకృతిశాస్త్రపరిజ్ఞానము ప్రబలి పచ్చిపాలనుండి వెన్నతీయు పనిముట్లు కనిపెట్టఁబడి ప్రసుతముపయోగములో నున్నవి.

ఈఁగలు, దోమలు, చీమలు, మొదలగు కీటకములు ప్రవేశించుట కవకాశములేని పరిశుభ్రమైనగది ప్రత్యేకముగానుండవలయును.

ఆల్ఫాలేవల్ సెపరేటర్ (Alfalaval seperator) అనఁబడు యంత్రసాహాయ్యము

వలన పాలను క్రీమ్ (Cream) స్కీమ్డ్‌మిల్కు క్రింద వేఱుచేయవచ్చును.

(Cream) ను బట్టర్ బేరల్ అనఁబడు పీపా ఆకారముగల యొకపెట్టెలో తిరుగుడుపిడిని కొంతసేపు త్రిప్పినయెడల నీరు కాఱిపోయి పూసకట్టినవెన్న మిగులును. దీని నొకబల్లమీఁద వేసి తడి యొత్తినయెడల వెన్న (Butter) తయారగును. నిలువ యుండుట కావలసినయెడల శుభ్రమైన లవణము దానిపై కప్పవలయును.

స్కిమ్ అనఁబడుపదార్థమును లేఁగలకు పెట్టుట పాశ్చాత్య దేశముల యాచారము.

Cream ముగానే బిస్కట్లు మొదలగు నవి ముంచుకొని తినుటకు చాలచోట్ల వాడుక చేయఁబడును.

హిందూదేశమందలి ఉష్ణమునకు వన్న తయారుకాక కరఁగిపోవుచుండును గాన మంచు చేర్చఁబడుచుండవలయును. (మేఁకపాఁడి చూ.)

గోగణము, క్షీరములు:- మన దేశమునందు వందమంది జనాభాకు ముప్పది యావుల వంతునఁగలవు. ఇంగ్లాండు దేశమందు వందమం దికి పదునెనిమిది యావులవంతుననే గలవు. కేవలముపాఁడికొఱకే గాక, మాంసముకొఱకుఁ గూడ వారు పెంచుదురు. ఐనప్పటికిని వారికిని పాఁడిలోపములేదు. పాలు మిక్కిలి ఆరోగ్యకర ముగా నుండును.

బెల్జియమ్ దేశములో వందమందికి ఇరువది రెండావులవంతుననే గలవు. తాజాపాలు దేశము లకు సప్లయిచేయుటయే గాక యెనిమిదివందల ముప్పదినాల్గు టన్నులు Condensed milk వారు ఇతరదేశములకు రవానాచేయుచుందురు.

డెన్మార్కు పశుమాంసభక్షణము చేయు దేశ మేయైనను వందమందికి ఎనుబదియాఱు వంతున గోవులు గలవు. అక్కడ 1,47,741 టన్నుల వెన్న తయారగుచున్నది. ఇతర దేశములకు 23,858 టన్నుల Condensed milk రవానా చేయఁబడుచున్నది.

Swiss milk సప్లయిచేయుటకు ప్రఖ్యాతి గాంచిన స్విట్జర్లాండు దేశమునందు వందమందికి ముప్పదియేడు ఆవులవంతున గలవు. ఏటేట ముప్పదియేడువేల టన్నులు ఎగుమతి చేయఁ బడుచున్నవి. నెదర్లాండులో వందకు ఇరువది యే డావులు మాత్రమే యుండినప్పటికిని నలువది యేడువేలటన్నులవెన్నయును, 166 వేలటన్నుల Condensed milk ను ఎగుమతి చేయఁబడు చున్నది.

**పాణిక ఉపగణము**— ఇది అగస్త్య ప్రగణమందలి యొక ఉపగణము. ఇందుఏడు గోత్రములు గలవు. ౧ ఛిలి, ౨ నంది, 3 పాణిక, ౪ పినాక, ౫ మామిక, ౬ మిలి, ౭ విమిలి.

ఈ ౭ గోత్రములకుఁ బ్రవర:— అగస్త్య, పౌనాయక, పాణిక.

**పాణికగోత్రము**—(పాణిక ఉపగణము చూడుఁడు).

**పాణి గోత్రము**-(నిధ్రువగణము చూ).

**పాణిని (పాణిన్యాచార్యుఁడు)**

వ్యాకరణశాస్త్రమునకు సూత్రములు రచించిన మహావిద్వాంసుఁడు. ఇప్పటి పంజాబు దేశమున లాహోరునగరసమీపమున రావీనదీతీరమున నుండిన (తొల్లింటి గాంధారదేశములోని) శాలా తురనివాసి.

ఈతని శేషాంశసంభూతుఁ డందురు. నర స్వతీనది యొాతని ప్రయాశ్రమమునకు సమీప మని కొంద అందురు. (పతంజలి మహర్షి చూ.)

**పాణినిగోత్రము**— (ధనంజయగణము చూడుఁడు.)

**పాణిని గోత్రము**—(జమదగ్ని వత్స ఉపగణము చూ.)

**పాణ్యవత్త గోత్రము**- (పేతహవ్య లేక యాస్కగణము చూడుఁడు).

**పాతకములు (ఉపపాతకములు, మహాపాతకములు, పంచమహాపాతకములు)**— పంచమహాపాతకములు:- ౧ స్వర్ణస్తేయము (బంగారమును దొంగిలించుట), ౨ సురాపానము (కల్లు,సారాయము మొ॥ త్రాగుట), 3 బ్రహ్మహత్య (ప్రాణిని హింసించి చంపుట), ౪ గురుతల్పగమనము, ౫ మహాపాతకసహవాసము.

పంచోపపాతకములు:- ౧ స్త్రీహత్య, ౨ వ్రాత్యత (ఉపనయనాది సంస్కారము ల కాలమున జరుగకుండినవాఁడు వ్రాత్యుఁడు) 3 చౌర్యము (దొంగిలించుట), ౪ ఋణానుపాతకము (అప్పులెగవేయుట), ౫ అనాహితాగ్నిత్వము (ఔపాసనాగ్ని పరిత్యజించుట).

దశపాతకములు:- మహాపాతకము లైదును, ఉపపాతకము లైదును గల్సి దశపాతకము లనంబడును.

ఉపపాతకములు ౪౯:— ౧ గోవధ, ౨ అయాజ్యయాజకము (చేయరాని క్రతువు చేయుట), 3 పరదారాగమనము, ౪ ఆత్మవిక్రయము, ౫ గురుత్యాగము, ౬ మాతృత్యాగము, ౭ పితృత్యాగము, ౮ స్వాధ్యాయత్యాగము (వేదము మఱచుట), ౯ అగ్నిత్యాగము, ౧౦ సుతత్యాగము, ౧౧ పరివిత్తత (అన్నగారిని జెడిపి వదినెను పెండ్లాడుట), ౧౨ జ్యేష్ఠపరివేదనము (తమ్ముని పెండ్లి చెడుపుట), ౧3 పరివేత్తృకన్యాదానము (౧౧ కన్యనుదానమిచ్చుట), ౧౪ పరివేత్తృకన్యాదాన పౌరోహిత్యము, ౧౫ కన్యాదూషణ (నిందారోపణము), ౧౬ వార్ధుష్యపాతకము (ఎక్కువవడ్డీ తీసికొనుట), ౧౭ వ్రతలోపము, ౧౮ తటాక విక్రయము, ౧౯ ధర్మారామవిక్రయము, ౨౦ దారావిక్రయము, ౨౧ అపత్య (సంతాన) విక్రయము, ౨౨ వ్రాత్యత (సంస్కారహీనత), ౨3 బాంధవత్యాగము, ౨౪ భృతాధ్యాపనము (డబ్బు తీసికొని వేదముచెప్పుట), ౨౫ భృతాధ్యయనము (జీతము గైకొని వేదము చదువుట), ౨౬ అపణ్య (నువ్వులు, పాలు, నెయ్యి మొ॥) విక్రయము, ౨౭ సర్వాగారే ష్వధికారము (గనులయందు), ౨౮ మహాయంత్ర (గానుగ) ప్రవర్తన, ౨౮ ఓషధీహింసనము, 30 స్త్రీయా (భార్యవలన) జీవనము, 3౧ అభిచారణము (నిరపరాధిని బాధించుట), 3౨ మూలకర్మ (లోఁబఱచుకొని పాడుచేయుట), 33 అశుష్క (ఎండిపోని) ద్రుమచ్ఛేదనము, 3౪ ఆత్మార్థ క్రియాదంభము (ఆఱవ, దైవ, పితృ, కార్యముల మానుట), 3౫ నిందితాన్నభక్షణము, 3౬ అనాహితాగ్నిత (అగ్నిహోత్రపరిత్యాగము), 3౭ చౌర్యము (దొంగతనము), 3౮ దేవపితౄణవిము (ఋణము తీర్పమి), 3౯ అసచ్ఛాస్త్ర (అయోగ్యశాస్త్ర) భిగమనము, ౪౦ కౌశీలవ్య క్రియ, ౪౧ ధాన్యస్తేయము, ౪౨ పశుస్తేయము, ౪3 స్వర్ణస్తేయము, ౪౪ మద్యప (మత్తిల్లియున్న) స్త్రీనిషేవణము, ౪౫ స్త్రీవధ, ౪౬ శూద్రవధ, ౪౭ వైశ్యవధ, ౪౮ క్షత్రియవధ, ౪౯ నాస్తిక్యము (దేవుని నిరాకరించుట).

**పాతదొంగ ఎప్పుడో ఒకమాటు దొరకిపోవును**—(ఆంధ్రలోకోక్తి).

**పాతవి లేక పాతలి-గోత్రము** — (సాహులగణము చూడుఁడు)

**పాతాళపురము** —రామాయణమున, ఉత్తరకాండమున, ౨3 అధ్యాయమున, దీని ప్రశంస కలదు. దీనిని ఖ్బాలుపట్టణమునకు ఈశాన్యమునకు కొంతదూరమున ఆక్సస్ (బక్షునది

యొక్క ఉత్తరదిశనుసోగ్డినాపరగణాలోని)ఇప్పుడు ఆక్సు అని పిలువంబడుచున్న తావును తొల్లింటి పాతాళపురిగా పోల్చియున్నారు. ఒకప్పుడీ పరిసరప్రాంత దేశమునకు పాతాళదేశ మని పేరుండెనంట. భూపతులు నాగవంశస్థులు.

## పాతాళము, బాహ్లిక లేక వాహ్లిక దేశము, బాల్ఖురాజ్యము (బేక్ట్రియా)—

దీనిని బాహిక లేక వాహిక దేశముగా పొరపడరాదు. వాహిక వేఱుదేశము. ఇది (వాహ్లిక లేక బాహ్లిక) వేఱుదేశమును నై యున్నది.

గ్రీకు చరిత్రకారులు బాహ్లికమును బేక్ట్రియా యనివ్రాసిరి. ఆపేరే నేటికిని నాంగ్లులుసైతము వాడుచున్నారు. బృహత్సంహిత ౧౬ అధ్యాయమున ప్రజలు వాహ్లికు లని చెప్పఁబడియున్నది. ఇది తురుష్కస్థానములోనిది. మత్స్య పురాణము ౧౨౧ యందు తుషారదేశ మని పేర్కొనఁబడినది. తుషారశబ్దము తుఖారముగ మాఱుటతో నాఁగక తురుష్కమునకుఁగూడ దెచ్చెనేమో.

నకులుని అశ్వచిత్రము లీదేశపు ఉత్తమాశ్వములకారోపింపఁ బడినవి. తొల్లింటి బేక్ట్రియా దేశమునం దిప్పటికాబూలుచేరియుండె ననియు, ఒకప్పుడు బొఖారాయును, వేఱొకప్పుడు ఖురాసాన్ దేశమును చేరియుండె ననియుఁ జెప్పఁబడినది. దీనికి నిదర్శనములు గాననగుచున్నవి గాని, అవి మా కప్రస్తుతములు.

ఈ దేశము పాతాళముగఁ జెప్పఁబడిన దేశము. పాతాళమునకు భోగవతీపుర మను నామము గలదు. పాతాళపురము రాజధానిగఁ జెప్పఁబడినది.

ఇప్పటి రాజధానియగు బాల్ఖుపురము నంటియేయున్న పురాతనపు పాడుదిబ్బలుగల ప్రదేశమును తొల్లింటి బాహ్లికపురముగ పోల్చుచున్నారు. బాహ్లికపురము బాల్హికముగా మాఱియు కడకు బాల్ఖుగ నయ్యెనని పరిశోధకులు తలంతురు.

భోగవతీపురమే బాల్ఖుగ మాఱెనో, లేక బాహ్లికపురమే బాల్ఖుగ మాఱెనో గాని గ్రీకు చరిత్రకారులు బక్ట్రా యని వ్రాసియున్నారు. హిందువులు పాతాళపుర మని చెప్పినదియు, పురాణములందు భోగవతీపుర మని వ్రాయఁబడినదియు, పారశీకుల మతగ్రంథమగు జెండవెస్తాయందు బఖ్ది యని చెప్పఁబడినదియు నిప్పటి బాల్ఖు నంటియున్న పాడుదిబ్బలతావే యని నిదర్శనములు గానవచ్చుచున్నవి.

తురుష్కభాషయందు బాలిఖ్ అన రాజ నివాస మని యర్థము. భవిష్యత్పురాణమున ప్రతిసర్గ ౩-౨-౧౧ యందు బాహ్లిక మనియు, రామాయణమున ఉత్తర. ౨౩ యందు బలి ఆలయ మనియు, అమరకోశమున బలిసదన మనియు ఈరాజధానీపురము పేర్కొనఁబడినది. బాల్ఖు పరిసరములందు బలిచక్రవర్తి తొల్లి వసించినట్లు చెప్పఁబడిన నివాసభవనములతావు మొదలైనవి చూపుచున్నారు.

భాగవతమున వామనావతారమున విష్ణుదేవునిచే బలిచక్రవర్తి రాజ్యభ్రష్టుఁడు గాఁ జేయఁబడెననియు, పిదప బరుకచ్ఛదేశమున నొక యాగ మొనర్చెననియు, దానిని శుక్రాచార్యుఁడే చేయించె ననియు, నాదేవుఁడు ప్రసన్నుఁడై పాతాళరాజ్యాధిపత్య మొసంగె ననియు, గానఁ నగుచుండినది ఈబాహ్లిక దేశము. ఇది పాతాళముగ తలంపఁ బడెనని తేలుచున్నది.

గ్రీకుచరిత్రకారుల వ్రాతలనుండి తొల్లింటి బేక్ట్రియా దేశము వైభవోపేత మనియు, కాబూలు, ఖురాసాని, బుఖారాసీమ లిందుఁ జేరియుండెననియు నెఱుంగుచున్నాము. పరిశీలనల వలన ఆఱు,పది శతాబ్దములనడుమ నొకప్పుడు

గుస్తాస్పను లేక విటాశ యనంబడు క్షాజ్ఞపంశ ప్రభుపాలనమున బేక్ట్రియా దేశమున స్పితముఁ డనుపేరుగల జరథుస్త్ర జగద్గురుండు కొంత కాలము వసించెనని చెప్పఁబడినది. ఈసందర్భ మున త్రిస్త యన వరుణుఁ డనియు, జరా అన భక్తుఁ డనియుఁ గొందఱును తలంచుచు జరా త్రస్త్ర యనుపదము కాలగతిని జరథుస్త్ర యాయె ననుచున్నారు. జరథుస్త్ర జగద్గురు శిష్యవర్గమగు పారశీకులు రాక్షస పక్షావలంబు లగుటచేతన దేవతలకు విరోధులైన యార్యు లని యు, దేవాసురయుద్ధములకుపిదప జయమందిన దేవతాపక్షావలంబుల యొత్తిడికి వేఱై చనినవా రనియు నెఱుంగునది.

బాల్ఖపురమునందు,అచట పాడుపడిన తావు లందు మహమ్మదీయులకు భక్తిగౌరవము లధిక మఁట. వారు దీనిని ఉముల్బిలాద్ అని గౌర వముగను, కుబ్బెతుల్లిస్లా మని భక్తితోడను బిలు చుచుందురు. ఉముల్బిలా దన నగరముల తల్లి యనియు, కుబ్బెతుల్లిస్లా మన ఇస్లాముమతాల యోపరిభాగ మనియు నర్థములుగ తెలియ వలయును.

పారశీకు లిట తొల్లింటికాలమున నొక అగ్ని దేవాలయ ముండిన దనియెదరు. ఇప్పుడు దేశ మంతయు మహమ్మదీయమతాక్రాంతభూమియై బాల్ఖదేశ మనఁబరఁగు చున్నది. రాజధాని బాల్ఖపురము.

## పాతాళములు(సప్తపాతాళములు)-

౧ అతలము-Atelites నివసించుదేశము, ౨ వితలము- Abtelites నివసించుదేశము, ౩ నితలము-Neph-thalites నివసించు దేశము ౪ తలాతలము-Tocharis తక్షకులు నివసించు దేశము, ౫ మహాతలము- Haitalites నివ సించు దేశము.

౬ సుతలము - Leidarites నివసించు దేశము. రసానది పైభాగమునఁ గల దేశము. వీరికి సురభి యనియు పేరు కలదు. ఇంకను సుపర్ణులు, గరుడులు అను పేరులు మహాభారత మున ఉద్యోగ. ౧౦౦-౧౦౧ అధ్యాయమున గాననగు చున్నవి. వీరిలో శకులు జరథుస్త్రమ తావలంబులైరి.

౭ రసాతలము- రసానది ప్రవహించులోవ. ఈలోవయందే సిథియనులు, హన్‌లు నివసించు వారు. శకులును గలరు. వీరు నాగసంతతివా రనంబడిరి. హన్‌ల తొల్లింటిపేరు హియుఙ్ను అనియుండె నఁట. వీరి జండాలపై నాగమే చిహ్నముగ నుండెడిని.

మహాభారతమున ఆదిపర్వము ౩౫ అధ్యా యమున నాగములపేర్లు వివరింపఁబడినవి. అవి యన్నియు ఈనాగవంశమువారిలోని భేదములు. ఇట్లే శేషునికులము సిసీస్ తెగ (సోగ్డియానా వారలు). వాసుకికులము ఉసుయివిస్ తెగ. తక్షకసంతతివంశపు తెగ టోచారిస్. అశ్వతర నాగసంతతి తెగ అసిన్. తిత్తిరినాగసంతతి తెగ తాతారులు, తార్తారులనంబడుచున్నారు.

దానవులు తొల్లింట పాతాళదేశములం దుండియే ఇతరప్రాంతములకు వ్యాపించిరనియు, వారు తురేనియను సంబంధ మనియు పెక్రుండ్రు పరిశోధకుల యభిప్రాయము. ఇప్పటి అస్త్రీరాబాద్ కడ నున్న హైర్కేనియా తొల్లింటి హిరణ్యకసిపుని నివాసము. ఇది కాస్పియన్ సముద్రమునకాగ్నేయమునసున్నది. పిదప భరతభూమి కేతెంచి ముల్తాన్ పరిసర ప్రాంతముల తననివాసము గుదుర్చుకొనె నని తెలిసెడిని. బలిచక్రవర్తి నివాసభవనము సుత లము (Trans caspian District) నం దుండెనని హరివంశము ౨౬౨ యందు పొడ కట్టెడిని. సప్తపాతాళములు క్రిందిలోకము

లనుతలంపు మధ్యకాలపుఅజ్ఞానజనితపరిశోధనా ఫలితమువల్లనైన యూహయై యుండనోపు.

**పాతాళవతీనది**—చంబల్ నదియొక్క ఒకశాఖ. దీనిని భవభూతి మాలతీమాధవనాటకమున ప్రశంసించియున్నాఁడు.

**పాతాళా (పాటలా) దేవీపీఠము**—(పాటలీపుత్రము చూడుఁడు).

**పాత్రాపాత్రవిచారస్తు ధేనుపన్నగయోరివ**— ఆవునకు గడ్డివేసిన పా లిచ్చును. పామునకు పాలుపోసినను విష మిచ్చును. ఇట్లే పాత్రాపాత్రవివేక మెఱిఁగి దానము చేయవలెనని భావము. ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

**పాత్వికగోత్రము** — (ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**పాదఅపానగమనాసనము**—యోగశాస్త్రమున చెప్పఁబడిన యాసనములలో నొకటి. ఇది ద్వివిధము.

౧ వామపాదఅపానగమనాసనము- కుడిపాదమును ఎడమమోఁకాలి సందునను, ఎడమ మడమను నాభికడ నుంచి కూర్చుండుట.

౨ దక్షిణపాదఅపానగమనాసనము-ఎడమ పాదమును కుడిమోఁకాలి సందునను, కుడిమడమను నాభికడ నుంచి కూర్చుండుట.

ఇది శాఖాసనము పోలికగలది. దీని వలన అపానవాయువు బహిర్గతమగు నని చెప్పఁబడినది.

**పాదకాయనగోత్రము**—(ఉపమన్యుగణము చూ.)

**పాదగండీరము (పాదవల్మీకము)** - ఇది శ్లీపద (బూరగాలు) రోగమునకుఁ బేరు.

**పాదత్రికోణాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. ఇది మూఁడువిధములు.

౧ పూర్ణపాద త్రికోణాసనము- మోకాళ్లను నేల నానించి నిలిచి ఎడమపాదమును ఎడమ రొండికి సమముగను, కుడిపాదమును కుడిరొండికి సమముగను పైకెత్తి పట్టుకొని ఒక్కొక మూరెడు దూరమునకు సాగించుట.

౨ వామపాదత్రికోణాసనము- కుడికాలిమడమ సీవనికి (గుదస్థానమునకు అండములకు నడుమప్రదేశమునకు) ఒత్తి కూర్చుండి, ఎడమ మోఁకాలినినేలమోపి, ఎడమపాదమును ఎడమ రొండికి సమముగ నెత్తి, మూరెడుదూరమందుండునట్లు సాగించి చేతులను సిద్ధాసనమునందువలె నాభికడ నుంచుట.

3 దక్షిణపాదత్రికోణాసనము- ఎడమకాలిమడమ సీవనిస్థానమునకు ఒత్తి కూర్చుండి, కుడిమోఁకాలిని నేలమోపి, కుడిపాదమును కుడిరొండికి సమముగ నెత్తి, మూరెడుదూరమున నుండునట్లు సాగించి చేతులను సిద్ధాసనమునందువలె నాభికడ నుంచుట.

**పాదప్రసారికాన్యాయము**—"అడుగు పెట్టనిస్తే అంతా నాదే" అనినట్లును "వ్రేలు చూపితే మండకూడా మ్రింగివేస్తా"మనినట్లును అర్థమిచ్చు న్యాయము. ఇది భిక్షుపాదప్రసారణన్యాయమువంటిదే. (చూడుఁడు.)

**పాదభూతగోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు.)

**పాదములందు కాయలు** (Corns on feet)—పాదరక్షలు పాదముల కిఱుకైనకతన పాదములందు ఒత్తిడికల్గిన తావులందు చర్మము మొద్దుబాఱును. దానికి త్వరలో విడుదలయై రక్తము శుభ్రముగ నట ప్రవహింపఁజేసిన కలిసిపోయెడిని. అటు గాక చాల కాలము రక్తప్రవాహ మట గలుగకుండెనేని చర్మము మొద్దుబాఱుటతో నాఁగక కాయలేర్పడును. ఇది యాప్రదేశము వృథా యగుట

యని భావము. అట చైతన్యశక్తి యుండదు. పాదమంతయు నొకేకాయ యగునేని వాటిపని చేయ నిబ్బందియుఁ గల్గెడిని. తొల్లింట చీనా దేశమున స్త్రీలపాదములు బిగియఁగట్టఁబడి యెదుగనీయకపోయినకతన అక్కాలమునవారు నడువలేకపోవుట కిదియే కారణము.

**పాదరసము** (Mercury or Quick silver)— దీనికి ఆంగ్లరసాయనశాస్త్రమున Water silver అనిపేరు. కాని సర్వసాధారణముగ వాడుకయందు దీనిపేరు "మెర్క్యూరీ". ఈపేరు గ్రీకు లిడినది. వారిదేవదూత యగు మెర్క్యూరీయొక్క పేరు. ఇది యాంగ్లరసాయన శాస్త్రమున Element గా చెప్పఁబడినది. దీనికిఁగల పర్వీడుచు దొర్లు శక్తినుండియు, బాహ్యాకారము నుండియు దీనికి Quick silver అను పేరు వాడుక గానోపు. Quick అనిన జీవించియున్న అనియర్థమఁట. సంస్కృత గ్రంథములం దిది పరమేశ్వరవీర్యముగా చెప్పఁబడినది. రసాయనశాస్త్రవిదులు దీనిని లోహములలో నొకటిగఁ జెప్పినను లోహలక్షణము లిందుఁ గానరావు. ఇది బంగారమునందు కలియును గాని, కాల్చిన నెగిరిపోవు లక్షణము గలది. దీనిని భరతదేశపు రసాయనశాస్త్రవిదులు ముద్దగఁ జేయుచుండిరి. అట్టిస్థితియందు దీనితో చేయఁబడిన పాత్రిలోని పాలయందు కొన్నిరోగముల నడంచుశక్తి గలదియందురు. సర్వసాధారణస్థితియం దన్ని శీతోష్ణపరిస్థితులం దిది ద్రవరూపముననే నిలుచును. దీనియందుఁ గల గుణవిశేషములవలన దీనికి భరతదేశపు వైద్యవేత్తలు పాద (మూల) రస మని పేరిడిరి.

ఆంగ్లరసాయనశాస్త్రవిదులు దీనిని ద్రవపదార్థము (Liquid) గా నెంచిరి. అట్లయ్యు దీని విచిత్రగమనమునకుఁ (దొరలుటకు) గారణము బయల్పడలేదు. దీనియందలి పరమాణుసముదాయము (Molecules or particles) ఒకటినొకటి హత్తుకొనుటయం దధికాకర్షణము కలిగియున్నవని మాత్రము పోల్చిరఁట. ఏదియెట్లైనను పాదరసము చాలబరువుగలదిగ నుండును. పైకిఁ జూచుట కిది ద్రవపదార్థ మనిపించదు. కాని ద్రవపదార్థము వలె ప్రవహించెడిని. ఇట్లయ్యు నొకగాజుగొట్టమునం దీపాదరసము నుంచిన వేడికి పైకిలేచుటయు, శీతలత్వమునకు క్రిందికి జాఱుటయు (ఆగొట్టమును నిలువఁ బెట్టినచో) గాననగును. తెర్మోమీటరుయంత్ర పరికర మీపాదరసముతో నిట్లే చేయఁబడినది.

ఇది ఉపరిభాగము (Surface) వలన నాకర్షింపఁబడునది గాక దీనియం దేదేని ఇడిన తటి వెనుకకుఁ ద్రోయఁబడుచుండును. ఇది నీటితో దీనికిఁగల భేదవ్యత్తి.

లా. Hydrargyrum. ఆంగ్ల Mercury, Quick silver. సం. రసః, రుద్రజః, రుద్రరేతః, సూతః, సూతరాజః, శివబీజం, శివవీర్యం, పారదః, పాంతః, ఈరః, ఈశ్వరః.

పాదరసము లోహములలో నొకటిగ నాంగ్లరసాయనవేత్తలు లెక్కించుదురు గాని, అది కాదని తలంపఁబడుచున్నది. దీని atom weight 200. 61, Specific gravity 13.59. దీనిగుఱుతు Hg. అని చెప్పఁబడినది. ఇది సెంటిగ్రేడు 39.5 డిగ్రీల వేడికిఁ గరఁగును. పాదరసము మామూలు వేడియం దించుక హరించిపోవు ననికూడఁ గొందఱుపరిశీలకు లనెదరు. సెంటిగ్రేడు 357 డిగ్రీలవేడికి ఉడుకునది. (ఫారెన్హీటు తెర్మోమీటరు లెక్కకు 674.6 అగునని యెఱుంగునది.) విద్యుచ్ఛక్తి పట్లగాని, వేడిపట్లగాని, పాదరసము poor conductor అని వివరింపఁబడినది. పాదరసమితర లోహములతో కలిసి కడుసులువుగ రసమిశ్రలోహ మైపోవుటకుపేరందినద్రవ్యము.

పాదరసము ఇంగిలీశమునందు ముఖ్యముగ దొరకెడిని. ఇంగిలీశమును Red Sulphide of Mercury అనెదరు. తొలుత ద్రవ్వఁబడి నప్పు డొక్కొకతరి ఇంగిలీశమునుండి జాతి చిన్న చిన్న గోళములుగ చెదరియు ఒక్కొకచో జేరి పాదరసరూపమున విస్తారముగను గూడ గనులందు దొరకుటయుకలదు. గనులందు ద్రవ్వఁబడిన పాదరస మాతృకాద్రవ్యము Horn quick silver, Coccinite, Tiemannite లుగనుండును. ఇందు Horn quick silver ను కెలమిల్ అనెదరు. ఇది Chloride రూపము. రెండవది యగు Coccinite అనంబడునది Iodide రూపము. మూఁడవదియగు Tiemannite అనంబడునది Selinide రూపము.

పాదరస మింకను బంగారు, వెండి లోహముల నింకియు, హత్తుకొనియుంగూడ దొరకుననియు, Coloradoite (ఇది Telluride రూపము) గను, Onofrite (ఇది మెక్సికో దేశములోని San Onofre నుండి పేరందినదఁట) గనుకూడ దొరకుచుండుననియు నందురు.

పాదరసము తెర్మోమీటరులందు, బారోమీటరులందు, ఉంచుట కుపయోగించును. అద్దములకు కళాయి వేయుట కుపయోగించును. అనేకౌషధములలో కలియును. పాదరసముతో శివలింగములం జేసి పూజించుట కాయసిద్ధినందిన యోగులందు సుప్రసిద్ధము. పాదరసమున కేదో కల్పి గిన్నెలుగ జేసి యందు పాలు నిల్వయుంచి త్రావుదురు. ఇట్లనేకవిధముల నుపయోగింతురు.

చక్కగ శుద్ధిచేయఁబడిన పాదరసము రోగులు, ఆరోగ్యవంతులు గూడ సేవింపఁదగియుండుననియు, త్రిదోషములను హరించి కుష్ఠరోగములు, వాతరోగములు, ధాతుగతరోగములు, సర్వవిధములగు విషములు నివారించి పుంస్త్వమును హెచ్చించి చతురింద్రియములకు బలమిచ్చి ముదిమినడంచునని చెప్పఁబడినది.

పలాస్త్రిగ జేసి పైని రాచుటవలన సవాయి కురుపులు మొండివ్రణములు కూడ మానుననియు నందురు. క్రమముగ శుద్ధికాని పాదరసము కీళ్ళనొప్పులు రసపట్లు మొదలగు ననేక వికారములం గల్గించును.

**పాదుకాసిద్ధి**— (అంజనాద్యష్ట సిద్ధులు చూఁడుఁడు.)

**పాదురక్షి గోత్రము**—(అగస్త్య ఉపగణము చూడుఁడు).

**పాధిక గోత్రము**-(నిధృవగణముచూ.)

**పాధిర్వాగోత్రము**— (ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**పాధుశ్రవగోత్రము**—(ఉపమన్యుగణము చూడుఁడు).

**పాధోద్గత గోత్రము**—(అగస్త్య ఉపగణము చూ.)

**పానిప్రస్థము**—దీనికి కుశస్థలి యనియు, కుశప్రస్థ మనియు పేర్లు కలవు. (ఇప్పటి పానిపట్టు) (సామంతపంచకము చూ.)

**పానుబ్రోకరు** — వడ్డీకి అప్పిచ్చువాఁడని వాణిజ్యపరిభాషయందు అర్థము.

**పాన్‌స్లేవిజమ్**(Panslavism)-స్లావిజాతులయందు సంఘీభావము ప్రబోధించు నుద్యమము. అఖిలదేశముల స్లావిజాతుల కాంగ్రెసు క్రీ.శ. 1877 సంవత్సరమున ప్రారంభింపఁబడినది.

**పాపఘ్ని నది**— దీని నిప్పుడు దక్షిణాపినాకినీనది యనుచున్నారు. నంది దుర్గమున జనించిన నది. తొల్లింటి చోళదేశములోనిది.

**పాపనాశనతీర్థము**-అరవదేశమున తామ్రపర్ణీనది పుట్టినతావునకు సమీపముననే ఒక

కుండముగుండా నది నడిచిపోవుచుండుటావున నీతీర్థము కలదు. అందు చేపలు పెక్కు లుండును. తిరునల్వేలి మండలమున దక్షిణ ఇండియా South Indian Railway అంబాసముద్ర మనుస్టేషను (కల్లడకురిచితాలూకా) నుండి ఆఱుమైళ్ళదూరము. ఇచటికిఁ గొంత దూరమున నానదియందే బాణతీర్థము గలదు.

**పాపనాశన (క్షేత్ర) ము** — దక్షిణ దేశమున తంజావూరు మండలములోని యొక సుప్రసిద్ధ విష్ణుక్షేత్రమై యున్నది. సౌతిండియన్ రెయిల్వేపై పాపనాశనము స్టేషను కలదు.

ఇట నొక ప్రాచీనశివాలయమున నూటయెనిమిది శివలింగములు కలవు. ఇట శ్రీరాముఁడు పూజించి యభిషేకాదు లొనర్చె నఁట. కాని, విష్ణుక్షేత్రము పిదపకాలమున ప్రసిద్ధి నంద సాఁగెనఁట.

**పాపము**—ఆర్యులసనాతనధర్మమున ఇతరులకు బాధగలుగఁజేయుట (పరపీడనము), మనోవాక్కాయకర్మలచే నొనర్చు ద్రోహములు, పాతకకార్యములొనర్చుట, పాతకులతో సహవాసము, దుర్మార్గప్రవర్తనము పాపములం గల్గించునని చెప్పఁబడి పరిహారములు వివరింపఁబడినవి.

పాశ్చాత్యులందు దైవాపరాధము, దైవశాసనమగు ధర్మముల నతిక్రమించుట, పాపము లనియు, క్షమ నర్థించుట పరిహార మనియుఁ జెప్పఁబడినది.

దేవుఁడు లేడను మతస్థులకు పాపమనునదియే లేదు. దుర్మార్గకార్యము లన్నియు సంఘాపరాధములే యగుచున్నవి.

**పాపముకలచోటనే భయము, కోపముకలచోటనే వైరము నుండును**— (ఆంధ్రలోకోక్తి.)

**పాపాపురము**— (అపాపపురము చూ.

**పాపాయనిగోత్రము** — (అశ్మరథ్య గణము చూడుఁడు.)

**పాపాల్ ప్రభుత్వము**— (ఇటలీదేశము చూడుఁడు.)

**పాపాల్ స్టేటు** (Papal State)-వీటిని State of the Church అనియు నందురు. పోపుసంబంధమగు విశేషణము పాపాల్ అను పదము. ఐరోపా భాషలందు పాపా (Papa) యనిన తండ్రివంటిమాన్యుఁడని యర్థము. పోపు దేశికునకు (Temporal soveregnty క్రింద నున్న సంస్థానరాజ్య మనిభావము.

Pope Innocent III యను వారికాలమున ఇది గొప్పరాజ్యమై యుండెనఁట. ఇది క్రీ. వె. ౧౩౦౦ సంవత్సర ప్రాంతకాలము. ఒక నెపోలియన్ గడబిడలకాలమునం దక్క వీరి ప్రభుత్వము ౧౮౬౦ వఱకు సాగుచుండెననియె చెప్పవలయును. అత్తఱి ఇటలీరాజ్య మేర్పడి కొన్ని భూము లాక్రమింపఁ బడియెనఁట. పిదప మఱికొన్ని కడకు ౧౮౭౦ లో అన్నియు ఇటలీ రాజ్యమునకుఁ జేరిపోయెను. పోపు ఒక్కమత గురువుగ నుండనయ్యెను. ౧౯౨౯ లో Vatican Soveregnty తిరుగ పోపు దేశికున కంగీకరింపఁబడియున్నది. (ఇటలీదేశము చూ.)

**పాపిజమ్** (Papism)- రోమను కేథలిక్ క్రిస్టియనుమతమునందు పోపు అనఁబడు మతాధికారియొక్క ఆత్మోన్నత్యమును, అధికారమును అంగీకరించు సిద్ధాంతము. ప్రొటెస్టెంటు క్రిస్టియనుసిద్ధాంతమున కిది ప్రతివాదము.

**పాపిటచెట్టు (పాపరచెట్టు)**— లా. Pavetta Indica. ఇది పెద్దపాపర యనియు, చిన్నపాపర యనియు రెండుభేదములు గలది. చిన్నపాపరను పాపరబుడమ యందురు. పాపిట చెట్టనియు ననుట కలదు.

పెద్దపాపర వేడిచేసి విరేచనము కల్గించి కడుపును శుభ్రపఱచు ననియు, జలోదరాది సకలోదరరోగములఁ బాపి జఠరాగ్నిని రేఁపు ననియు, పిన్నపాపిట సమూలకషాయము ఆమశూలలు, కాస, గుల్మరోగము, పాండువు, వాతము, శ్వాసరోగము మున్నగువాటిని నివారించు ననియుఁ జెప్పఁబడినది.

**పాపైరస్** (Papyrus)—ఇది యొకజాతి తుంగ. మూఁడుపలకల కాడలుగల్గి పదియడుగుల యెత్తుగ పెరుఁగునది. దీనిని పొరలుపొరలుగ పలుచని కాగితమువలె విప్పనగును. తొల్లింటికాలమున దీనిపొరల నంటించి టావులుగ జేసి చుట్టలుగఁజుట్టి (Rolls) గ్రంథములను ఈజిప్టు, గ్రీస్ ప్రాంతదేశములవారు వ్రాయుచుండిరి.

దీనికి Biblos అని గ్రీకుభాషానామము. ఆపదమునుండియే తొలుత వీటిపై వ్రాయఁబడిన క్రైస్తవమతగ్రంథమునకు బైబిలనుపేరయ్యెనని చెప్పఁబడినది. నాల్గువేల సంవత్సరములకిత్రి మీపాపైరస్టావులపై వ్రాయఁబడిన గ్రంథములు కలవు. అవి సిరాతోనే వ్రాయఁబడినవి. ఆకాలమున భరతదేశపు పురాతన గ్రంథములు తాటియాకులపై వ్రాయఁబడుచుండెను. ఆతాటియాకులచెట్లు శ్రీతాళ మను శ్రేష్ఠజాతిగఁ జెప్పఁబడినది.

**పాప్యులిజమ్** (Populism) — ప్రజా సంఘముయొక్క సిద్ధాంతము. (Peoples party) క్రీ.శ. 1892లో ప్రజల భావనతుల హక్కులకొఱకును, ఆదాయపుపన్నునిబంధనల కొఱకును, రెయిల్వేల వ్యవహారములనుగురించియు పరిష్కారము చేసికొనుటకుగాను అమెరికాసంయుక్తరాష్ట్రములలో ఒకసంఘము నెలకొల్పఁబడెను. మొదట ఈసంఘమునకు ఇతర పార్టీలతో సంబంధ ముండెడిది కాదు. కాని, తరువాతతరువాత (Republican) ప్రజాసామ్యవాదుల పార్టీతో సంబంధ మేర్పడి అందులో కలిసిపోయినది.

"భారతదేశమునందును అతివాదులు కానట్టియు ప్రజాక్షేమమును కోరునట్టియుఁ గొందఱు ఈపేరుతోనే (Peoples party) ఇపుడు (1927నుండియు) ప్రజాసేవ చేయుచున్నారు."

**పాబియా క్షత్రియులు**— (చౌహానులు చూడుఁడు).

**పామ్ సండే** (Palm Sunday) — క్రైస్తవమతస్థుల పర్వదినము. ఈ సరువండుగకు పూర్వపు ఆదివారము. ఇది క్రీస్తుప్రభువు జరూసలెంపట్టణ ప్రవేశమునకు జ్ఞాపకార్థముగ జరుపఁబడుచున్నది.

**పామన్నృపాలుఁడు** ఈకవిచంద్రుఁడు క్రీ. వె. ౧౭౦౦ సంవత్సరప్రాంతమున సురపురసంస్థానమును పాలించిన ప్రభువని తెలియుచున్నది. ఈసురపుర మిప్పుడు నైజాముఁరాజ్యమునఁ జేరియున్నది. ఇతఁడు భార్గవ పురాణము నాంధ్రమున పద్యకావ్యముగ రచించినవాఁడు. కవిత్వము చక్కని శైలిగల్గి లలితమైయున్నది.

కాణాదము పెద్దనసోమయాజి మత్స్యపురాణమును, శైషశైలేశలీల యనంబడు నైదు వర్గములు కావ్యముగ నీతని కంకిత మొనర్చెను. ఈ కాణాదము పెద్దనసోమయాజియే భద్రాపరిణయము రచించినవాఁ డనియు, గద్వాలసోమభూపతి యాస్థానకవి యనియుఁ జెప్పఁబడినది.

**పామిర్పీఠభూమి** (Pamir Plateau)— దీని నాంగ్లభూగోళశాస్త్రమున Roof of the World అని వివరించియున్నారు. కాశ్మీరదేశమున కుత్తరముగానున్న పర్వతపీఠభూమి. దీని నుండి టియెన్షాన్, క్వెన్లూన్, కారకోరమ్, హిందుకుష్ పర్వతపంక్తులు వెలువడి వ్యాపించియున్నవి. కొంద ఱాంగ్లభూగోళశాస్త్రవేత్తలు

హిమాలయపర్వతపంక్తులును దీని కంటెయున్న వియే గాన నవియు దీని నుండియే వ్యాపించిన వందురు. కాని వాటియందిట్టి వెన్ని యో యుంట నది సరికాదని తోఁచెడిని. సారికోలుపర్వత పంక్తి దీనియందు వ్యాపించినది. అందు ముజ్తా పర్వత మున్నది. ఇది సముద్రమట్టముపై ౨౫౦౦౦ అడుగుల యెత్తుగలది. హిమాలయ మున కుత్తరదిశయందున్న పర్వతములలో నిదియే ఎత్తైనది. ప్రపంచమున నెక్కువ గ్లేసరు లిటఁ గలవని ప్రతీతి.

పామీర్ పీఠభూమి మంచుగ్లేసరుల మయము గనుంట నిర్జనమై యున్నది. గ్లేసరుల నడుమ మంచుచేఁ గప్పఁబడినపర్వతములు పెక్కు కలవు.

**పాములజాడ పాములకే ఎఱుక, స్వాముల జాడ స్వాములకే యెఱుక**-(ఆంధ్రలోకోక్తి).

**పాములతో చెలిమి కత్తులతో సాము పోలీసువారితో స్నేహము ఒక లాటివే**—(ఆంధ్రలోకోక్తి.)

**పాములు పర్విడునేర్పు** — దీనికి మూఁడుశరీరభాగములు చేయుపనులు ముఖ్యము లని కన్గొనఁబడినది. అవి Back bone, Ribs, Large horny scales underneath. వీటిని Muscles కదపుచుండుననియు, అట్లు పాము పాఁకు ననియుఁ గనిపెట్టఁబడినది. నిజమున Ribs కదలచే పాము నడుచునట్లే యగును. ఇవి దానిశరీరమునం దేనకము లుండును. Back bone యొక్క ప్రతిభాగ మున కొకటిచొప్పున నుండును. ఇవి కడుపు యొక్క Scales నకుఁ దగిలియుండుచు Muscles వల్ల ఒకటితరువాత నొకటి కదలుచు పామును బాఁకఁ జేయును. నడుచుతఱి ఈ ప్రక్కనుండి ఆప్రక్కకు, ఆప్రక్కనుండి ఈ ప్రక్కకు మరలుచుంట ఊఁత యగును. కాళ్ళ వలె [illegible]ని గ్రిందకును గాదు. సాఁగఁగల వెన్నెముక దీనికి ప్రధానావయవము. అది కడుచులకనగ తెగిపో నగును. కాన వెన్నుపైఁ గొట్టిన చిన్న దెబ్బదానినడకకు బాధగల్గించెడిని.

**పాములలో మెలఁగవచ్చును గాని స్వాములలో మెలఁగుట కష్టము**—(ఆంధ్రలోకోక్తి).

**పాయసమైనను కుక్క ఎంగిలిపాఱ వేయవలసినదే**—(ఆంధ్ర లోకోక్తి).

**పాయాశ్వినీనది**—చిత్రకూటపర్వతము కడ యమునానదిలో సంగమించు పైశునీనదికి తొల్లింటిపేరుపాయాశ్వినీనది. మఱియుదక్షిణపు కన్నడజిల్లాలోని చంద్రగిరియని నామాన్తరము గల నదికిని ఈపేరు గలదఁట. ఇంకను తిరు వాన్కూరు రాజ్యములోని పాపనాశినీనది కీపేరుకలదని చైతన్యచరితామృతమున గలదు.

**పాయిల లేక పావిలకూరచెట్టు**— ఇది గబ్జెరులోని జాతి. దీనిని గంగపావిల, సన్నపావిల, పుల్లపావిల, గోళకూర మొదలగు పేర్లతో వాడుదురు. త్రిదోషహరమై, చలవ జేసి మూత్రాశ్మరి, మూలవ్యాధి, సంగ్రహణి, విదాహము, నీరుచురుకు, పైత్యము, నిక్కాళ మొదలగు జబ్బుల నివారించును. వెంద్రుకల కుదుళ్ళ బలపఱచును. రక్తమునుశుభ్రపఱచును.

దీనికి పటికపంచదార, పుదీనా విఱుగుడులు. (గబ్జెరు చూడుఁడు.)ఇందు బొడ్డుపాయిల యని భేదజాతికలదు. అదియపథ్యకారి యనియు నజ్జు చేసి నిద్ర దెచ్చుననియుఁజెప్పఁబడినది.మఱియు నీజాతికిఁ జేరిన వెండ్రుకపాయిలకూర (రస, కషాయములు) వేఁడిజేసి వాతమును హరించు ననియు, పైత్యమును బలపర్చి గుల్మవ్రణములు,

ప్రమేహము, నేత్రరోగముల నడంచుననియు జెప్పుదురు. ఇదియుం గూరగ నొనర్పఁదగినదే.

ఈజాతికిం జెందియు కొంత భేదము గల్గిన జాతికి శంగపావిల యనుజాతి యొకటి కలదు. ఇది వాతము, ఉబ్బు, మూత్రరోగముల హరించి, మలబద్ధము గల్గించి పైత్య ...ముల ప్రేరేపించు నందురు.

**పారణ గోత్రము** — (పౌర్ణమాస ఉపగణము చూడుఁడు.)

**పారశీక (జరధుస్త్ర) మతము మాజ్దాయాస్నా మతము** — ఈమతమునకు సరియగుపేరు మాజ్దాయాస్నా మతము. ఈమతస్థుల మతగ్రంథమగు జెండవెస్తాయం దీపేరె వాడఁబడినది. ఈమతస్థులగు పారశీకులు ఆర్యులు తొల్లింటి భరతదేశపు ఆర్యులలోనివారే. తొల్లింట నార్యు లందరు మేరుశిఖరము (పారశీకులపేరు హార్బరేజా) ప్రాంతముల వసించుతరి వీరును వారును కలసియుండినవారే యందురు. దేవాసురయుద్ధకాలమున భరతదేశమందలి యార్యులు దేవతాపక్షావలంబులుగను, పారశీకుల పూర్వులగు నార్యులు అసురపక్షావలంబులుగను వేరైరని చెప్పుదురు.

ఈమతస్థుల కీశ్వరుఁడు వరుణుఁడు. ఆపేరు నానాటికి మార్పులంజెంది జెండుభాషయందు అహురయని మారెనట. అహురశబ్దము అసురశబ్దమునుండి మారెనని తలంపఁబడుచున్నది. వీరి తొల్లింటి యాదికాలమున రాజర్షులు ఈ మతము నుద్ధరించి నడిపిరట.

కృతయుగకాలమున జంషీదు నృపతియు (ఈతఁడు యముండని తలంపఁబడుచున్నాఁడు. కావ్యుఁడు శుక్రాచార్యుండుగ తలంపఁబడుచున్నాఁడు.) ఫరిదూన్‌ప్రభువు (ఈతఁడు మంత్రబలముచే రోగముల నివారించిన మహనీయుఁడట.) వెరెత్రఘ్నుఁడను నామాంతరముగల జైహరాము నృపతియు వీరిమత ముద్ధరించిన రాజర్షులలో నగ్రగణ్యులని చెప్పఁబడినవారు.

వీరికిం బిదప నొకప్పుడు దోషాతిశయమున నహురభక్తి నశించిపోవ నార్మైతీ (భూమి) గోరూపమున నహురుంగూర్చి మొరలిడ నను గ్రహించి ఈమతాధిపతియగు జరధుస్త్ర నను గ్రహించెనఁట. ఈతని తొల్లింటిపేరు స్పితముఁడు. తండ్రి పౌరుషస్పార్యుఁడు. తల్లి దుగ్ధోవ. ఇతఁడు తేజోమయుఁడని చెప్పఁబడినవాఁడు. పదునేనవసంవత్సరముదనుక విద్య లభ్యసించి, మరి పదునైదువత్సరములు తప మాచరించి, జ్ఞానియై, జరధుస్త్ర (ఋషి) యనంబరగి, జగద్దేశికు డనంబరగి, నలుబదియేడు వత్సరము లహురభక్తి (మాజ్దాయాస్నా మతము) నుద్ధరించి తన డెబ్బదియేడవపేట ఆతాష్బెహరామ్ (అగ్ని దేవాలయము)ను అన్యమతస్థులు భగ్న మొనర్పఁ బ్రయత్నించిన, వారితో బోరుతరి ఆకాశమునుండి యేతెంచిన యగ్నియం దైక్యమై అహురసన్నిధికిం జేరుకొనియెను. ఆతఁడే మతాచార్యుఁడు.

ఈమతమున వందనీయులగు షడమృతులు చెప్పఁబడిరి.

౧ ఆతర్ – ఈతఁడు అగ్ని, ఊర్ధ్వగతుఁడు, పవిత్రుఁడు. ఈతని ఆషావహిష్ఠ (వరిష్ఠుఁడని తలంపఁబడుచున్నది.) యనిపేరు గలదు.

౨ వోహుమానో– ఈమహాత్ముఁడు ఆత్మకు పరిశుద్ధత నొసంగ నధినాథుఁడు.

౩ క్షత్రవైర్య– అహురుని మహిమాధిపత్య స్ఫూర్తిగ నెన్నదగినవాఁడు.

౪ స్పెంటార్మైతి– (భూమి) ఈమె భక్తి స్వరూపురాలు. ఈమహాత్మురాలు ఆషావహిష్ఠతో సమానము.

౫ కార్వతాత్ – ఈమె ప్రస్ఫీత యనియు స్పెంట యనియుం జెప్పఁబడినది.

౬ అమేరితాతాత్ - ఈమెయుపస్ఫీత యని యు స్పెంట యనియుం జెప్పఁబడినది. ఈమె సుపవిత్ర.

ఇంకను జరథుస్త్ర మతమున ఐదుగురు ప్రమథాగగణ్యాతం బడసినవారు చెప్పఁబడి యున్నారు. వీరును వందనీయు లని చెప్పఁ బడినది.

౧ శ్రోవోష- ఈతని ఖడ్గమునకు ఇరుదెస లను దారు కలదనియు, దానిబూని రాత్రిలం దీతఁడు భక్తులనురక్షింప నియమింపఁబడినవాఁ డనియుం జెప్పఁబడినది

౨ ఆషీవంగుహి- ఈమె భక్తి కధిదేవత. దాంపత్యసౌఖ్యసంధాయిని యనియు, సిరులీయ కధినాధురాలనియుం జెప్పంబడినది.

౩ ఆతర్ - అగ్ని. ఈమహనీయుఁడు ఆతాషు బెహరాం (అగ్నిదేవాలయము) నందుంపఁబడి యారాధింపఁబడువాఁడు. దోషములను హరించు

౪ దయేన. ౫ ఛిస్తి- వీరిద్వఁరు ప్రాణులకు విశ్వాసబుద్ధి, వివేకము, భక్తులకొసంగుచు హితకర్తలై యుండువారు.

మఱియు నీ యైదుగురు అహురునియాజ్ఞల నవనియందు నెరవేర్చువారనియు, ప్రమథాగ్ర గణ్యులనియుం జెప్పఁబడువారు. వీరు గాశ నైర్యసంఘు యను మహాత్ముఁడు వేళ్కొఁడు చెప్పంబడినవాఁడు. అతఁడు ఆదిదంపతులగు మాష్యో, మాష్యోయీలను అహురుని యాజ్ఞ మేరకుసృష్టించినవాఁడు. భక్తులరక్షించువాఁడు. దూతయై యహురునిఆజ్ఞల నిలకు సంధించు చుండువాఁడు. మహాజ్ఞాని.

జరథుస్త్రమతమున ప్రాణికి పూర్వకర్మ, సంచితకర్మ మొదలగునవి చెప్పబడలేదు. పునర్జన్మమును చెప్పఁబడలేదు. ఏపనినైనను జేయుటకు స్వతంత్రత గలదు గాన, తానొనర్చిన పనియొక్క ఫలములను, శిక్షలను తానే అనుభవించునని చెప్పఁబడినది.

ఆత్మ అహురునిభక్తిగల్గి సత్ప్రవర్తనతో మెలంగుకతన ఆషివంగుహి(పరిశుద్ధత, అర్హత) తనంతటతానే చేకురుచుండును. ఈమతవిధానమున ఆత్మ కర్మ లొనర్చి యనుభవించుటయే విధి. అహురభక్తికి అర్చనకు మూఢభక్తి తగదు. అహురజ్ఞాన మత్యవసరము. ఆత్మ పశువులను, బాగ్యములను, తనువును (శరీరమును), ధనమును బాసినను బాయనగుఁగాని తానొనర్చిన కర్మఫలమును బాయఁజాల దని చెప్పఁ బడినది.

గుణము, దోషము ఈరెండును ఒకేతావున జన్మించినవైనను ఎప్పుడు కలియదగినవి కావని యీమతసిద్ధాంతమున చెప్పఁబడినది. మరియు నీమతమున ఇంద్రుని అహిర్మాను డనంబడువారిని దుర్గుణసాంద్రులనియు, దుష్టులనియు, వీరింగూర్చి ఉదాసీనదృష్టి నెరపి వీరిపట్ల అహురభక్తులు విముఖులుగ నుండవలయుననియు విధింపబడినది. ఇది ఈమతనిషేధము.

ఈమాజ్దాయాస్నామతధర్మమున సంస్కారత్రయము విధింపఁబడినది. ఈమూఁడును మతవిధులు; మతసంస్కారములు.

౧. నవజోత్ - ఇదిఅహురభక్తికి ప్రారంభసంస్కారము. బాలబాలికలకు బాల్యసమయమునవొనర్తురు. ఇందు(౧)హుమ్తా (పరిశుద్ధమానసము) (౨)హుక్తా(పరిశుద్ధవాక్కు) (3) హూఆర్ష (పరిశుద్ధ ఆచరణము) ఈమూఁటి 'టమియు ఆషా (ఈమతధర్మము)కు మూలమగుట దానిచిహ్నముగ శ్వేతవస్త్రము (గిశే బా) నిచ్చి కటిసూత్రగూఢ బంధము బంధించి అహురభక్తి బోధించి అహురవీర్యమస్త్రముపదేశింతురు.

౨. అహురభక్తుల సంతతి యభివృద్ధియై మాజ్డాయాస్నామత మభివృద్ధి గాంచుటకు వివాహమీ మతస్థు లందరకును విధింపఁబడినది. వివాహమగువానికి అహురప్రసీదత గల్గి సకల శ్రేయము లందెడిని.

౩. అంత్యకర్మ- ఇది ప్రాణి శరీరమునువీడిన పైని మూఁడుదినములు శ్రవోషరక్షణయందుండి నాలవదిన ముదయమున చినవత్వారధి మీఁదుగ పరలోకమునకుం గొంపోవఁబడుచు వారధిమధ్యమున దిగంబరిగ నుండియు తాను జీవించియుండుతఱి నొనర్చిన గుణదోషముల కర్హ సురూపకురూపములం జెంది యవ్వలికోనవేయుఁడు రష్ణుమిత్రు లను నిర్వురు న్యాయాధిపతులచే విచారింపఁబడి అర్హఫలితముగ అహురుని దర్శనము, అహుర సామీప్యవాసము, అహురునియం దైక్యము, ముక్తిగఁగాని, దోషఫలితముగ శిక్షగఁగానిఁడుం డెడిని. అదియె ఈమతమున మృతికి బిదప నాత్మకుఁగలుగబోవుముక్తి.

ఈ అహురమాజ్డాయాస్నానామకమగు జరథుస్త్రజగద్గురు మతమున పరమేశ్వరుఁ డగు అహురుఁడు భౌతికసృష్టి నిమిత్తకారణముగను, ఆత్మసృష్టి యుపాదానకారణముగను ఒనర్చెననియు, అహురుఁడే జగత్కర్త జగద్భర్తయనియు, మతధర్మముల బోధింప జరథుస్త్ర దేశికుఁడు నియమితజన్ముఁడనియు, మతగ్రంథమగు జెండుభాషనున్న అవెస్తా పౌరుషము, అపౌరుషేయము నగు వేదమనియు, ఆతాషు బెహరాము(అగ్ని దేవాలయము)నందుఆతర్‌ను (అగ్నిని) దర్శించి నతు లొనర్చుట యర్చనమనియు సిద్ధాంతములుగ నెసఁగఁదగినవి.

**పారశీకజరథుస్త్రమతనిషేధములు**- పరమేశ్వరుండగు అహురునియందు భక్తిలేకుండుటయు, అన్యదైవములందు భక్తి గల్గియుంటయు, ఆషామార్గమున నమ్మకము లేకుంటయు, నవజోతుకర్మయందు విశ్వాసము లేకుంటయు, అవెస్తాయందు నమ్మకము లేకపోవుటయు, జరథుస్త్రజగద్గురుఁడు మతబోధకుఁడుగ దైవనియమితుండను నమ్మకము లేకపోవుటయు, అహురవెర్యమంత్రమహిమయందు నమ్మకము లేకపోవుటయు, పడమృతులందు నిరసన గల్గుటయు, శ్రవోష, ఆశీవంగుహీ, ఆతాషుబెహరాము, దేవస్థానమునం దగ్ని, దయేనా, ఫిస్తి, నైర్యసంఘులందు విశ్వాసము లేకపోవుటయు, ఇంద్రునియందు అహ్రిమానునందు నిరసన, ఉదాసీనదృష్టి తగ్గిపోవుటయు, జరథుస్త్ర జగద్గురుబోధితసిద్ధాంతములందు విశ్వాసహీనత ఇవి ఏకాదశ నిషేధములని చెప్పఁబడినది.

**పారశీకదేశపు ప్రభుత్వము** (Persia)— ఈదేశపు ప్రజలకు పార్శీ లనిపేరు. ఇది ఆసియాఖండమునందలి విదేశము. తొల్లి నిరాతంకపు పరిపాలనావిధాన దేశమై యుండెను గాని ఇటీవల Limited Monarchy మై యున్నది.

ఆఱులక్షల ఇఱువదియెన్మిదివేలు దేశవైశాల్యమనియు, ఒకకోటి జనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

తాఇరాన్ (Tehiran) నగరము రాజధాని. స్వదేశస్థు లీదేశమును ఇరాన్ దేశమని వాడుకొను చుందురు. రమారమి ప్రజ లందరు మహమ్మదీయమత మవలంబించినవారు. కొలదిమంది తొల్లింటి జరథుస్త్ర మతస్థులు అచ్చటచ్చట గలరు.

**పారశీకదేశము**—ఆసియా ఖండమునందున్న సామ్రాజ్య దేశము. తొల్లింట భరతదేశమున మేరుపర్వత పరిసరముల ఆర్యులనంబడుచు వసించుచు, దేవాసురయుద్ధముల కాలమున రాక్షసపక్షావలంబులై, దేవతాపక్షావలంబులైన యార్యులనుండి చీలి, రాక్షసులు

పరాజితు లైనకతన దేశమును వీడి తూర్పుగా గాంధారాపగ దేశములం గడచి, ఇప్పుడున్న దేశమునకుం జేరి, యట పర్శిపోలిసునందునను ఆ ప్రాంతసీమలందునను నివాసమేర్పర్చుకొనిపార శీకులనంబడు ప్రజలు నివసించు దేశముగాన పర్శియా యనంబడుచున్నది. ఈపేరు పిదప గల్గియుండునని తోఁచెడిని. ఏలయన ఆభూమికి తొల్లింటగల్గిన పేరు ఇరాన్ దేశము. వీ రార్యు లగుట ఆర్యశబ్దసంబంధమే ఇరా నని పరిశీల నలనుండి తెలుచున్నది. పర్శిపోలిసునుండి కల్గిన పేరు తరువాత గల్గియుండు నని తలంపఁబడు న్నది.

వైశాల్యము ౬౨౮౦౦౦ చతురపుమైళ్ళు. దేశమధ్యమున పీఠభూమియు, దానిచుట్టు పర్వ తములును కలవు. లోవలును తూర్పుభాగము లును చవిటిపర్రలు. ఇసుక ఎడారిప్రదేశములు గలవు. ఉత్తరము వైపునను పశ్చిమము వైపునను ఫలవంతములగు ప్రదేశములున్నవి. దేశమున నదులు చాల తక్కువ యున్నను చిన్న నదులు, ఉప్పునీటిసరస్సు లనేకములు కలవు. పరిశియా పీఠభూమి ౨౦౦౦ అ.లు మొదలు ౮౦౦౦ అ.ల వఱకు సముద్రపు నీటిమట్టమునకు ఎత్తుగల్గి యున్నది. ఉత్తరపుహద్దున ఎల్బురుజపర్వతము లున్నవి. అందలి డెమావెందుశిఖరము ౧౮౦౦౦ అడుగులయెత్తు గలది. ఇది కాస్పియన్సుకి దక్షి ణమున నున్నది. కారున్నది యొక్క టె పడవలు నడువందగిన లోఁతు గలది. అది షెట్లారబు నదిలో కలియు చున్నది. వాయవ్యదిశయందు ఉరుమియా యనంబడు గొప్పసరస్సుకలదు. అది సముద్రపు నీటిమట్టము పై ౪౩౦౦ అడుగులయెత్తున నున్నది. దానినీరు చాల ఉప్పగానుండును. పల్లపుప్రదేశములందు వేసవియందు వేఁడి చాల తీక్ష్ణముగను శీతకాల మున పీఠభూములపై శీతమధికముగను నుండును పారశీక దేశమున వర్షహీనమగుప్రదేశము కొంత కలదు. గోధుమలు, ధాన్యము, ప్రత్తి,పొగాకు గసగసాలు, ఇంగువచెట్లు పైరుచేయం బడు చున్నవి. ఖుర్బానీ మొదలగుపండ్లతోఁట లపరి మితముగఁ గలవు. పండ్లతోఁట లుత్తరభాగము లందధికము. దేశమున గులాబీపూవు లధికముగ నుంట అత్తరు పన్నీరులు చేయఁబడుచున్నవి.

లొట్టిపిటలు దేశమున విస్తారము కలవు. ఇవి బరువు మోయుచువర్తకపుసరకులం గొంపోవుచుం డును. గుఱ్ఱములు మేలుజాతివి. సింహము లీదే శమునఁ గలవు. పారశీకులు వినయగౌరవములు గల్గి మర్యాదవర్తనముగలవారు. రసజ్ఞులు.వినో దాభిలాషులు. వీరిని ఐరోపావారు French of the East అనియెదరు. తురుష్కులు మహమ్మదీయు లైనను వీరికి సరిపడదు. వీరు గాక దేశద్రిమ్మరులగుప్రజలు కొంతమంది యీ దేశమున హైయత్తు లనంబడువారుకలరు. హై యత్తు లన కుటుంబములని యర్థమఁట. ఈపేరు బహుశః దేశద్రిమ్మరుల కుటుంబము లని యర్థము గానోపు. వీరిని మూఢులును, మూర్ఖు లును ననెదరు. పార్శిభాష కర్ణశ్రావ్యమై, ఆహ్లాదమాధుర్యములకుం బేరందినది. తివా చీలు, శాలువలు, కత్తులు చేయుట,పట్టుపనినేత, నల్లమందు చేత, కొంతవఱకు నూలునేత, దేశ మునఁగల చేతిపనులు. ఈదేశపు గాడిదలు శ్రేష్ఠ మైనవి. ప్రయాణములు గుఱ్ఱములు, గాడిదలు ఒంటెలపై విస్తారము వర్తకముఁ బోలి జరుగు చుండును.

పారశీకులందు తొల్లింటి మతస్థులగువారు జరథుస్త్ర మాజ్దాయాస్నా మతస్థులు కొంత మంది అచ్చటచ్చట గాననగు చుందురు. గాని దేశమంతయు మహమ్మదీయమతస్థులై పోయిరి. వారుషియాలు,ఆర్మీనియనుక్రైస్తవులు కొందరు కలరు. వారు ఆర్మీనియనుచర్చివారై యున్నారు.

భరత దేశమునం దున్న పారశీకులు తొలుత నీ దేశమునుండి తిరిగివచ్చి చేరినవారే.

ప్రభుత్వము లిమిటెడ్ మోనార్కీ యైయున్నది. చక్రవర్తిని "షాహిన్షా" (రాజాధిరాజు) అనెదరు. గొప్ప వైభవోపేతుఁ డనెదరు. రాజ్యము ౧ ఫార్సిస్థానమనియు, ౨ ఇరాక్ జేమీయనియు, ౩ ఖురాసాననియు మూఁడుఖండములుగఁ జేయబడి యున్నది. క్రీ.ము. ౫౫౯ లో సైరస్సార్వభౌమపతి అనేక దేశములం గల్పి, మేడీసుతో చేర్చి పారశీకసామ్రాజ్యమును స్థాపించెనని చెప్పఁబడినది. అది బలపడుచుండుతరి క్రీ. ము. ౩౩౧ లో అలక్జాండరు ది గ్రేటుగారు ఆక్రమించిరి. ఒక శతాబ్దమునకుఁ బిదప పార్థియనులవశమై, క్రీ. వె. ఏడవశతాబ్దమున కాలీఫాలహస్తగతమాయెను. క్రీ.వె. ౧౭౨౨లో ఆఫ్ఘనులవశమై అచిరకాలముననే పరిశియనుఁడగు నాదిర్షా లేచివశపఱచుకొన, తిరుగ స్వదేశపాలన ప్రారంభమయ్యెను. క్రీ.వె. ౧౭౪౭ లో ఆయన చనిపోయినతోడనే, ఆయన సైన్యాధిపతులలో నొకరు దీనిని, వేరొక రాఫ్ఘనుస్థానమును గైకొనిరి. ఇటీవల స్వపరిపాలనయందు లిమిటెడ్ మోనార్కీయై యున్నది.

తెహ్రాన్పురము రాజధానీనగరము. దీనిని పాశ్చాత్యులు Teheran అనుచున్నారు. ఇందు మూఁడులక్షల జను లున్నారు. తొల్లింటి ఆర్మీనియాలోని టేబ్రిజ్పురము గొప్ప వర్తక స్థలము. ఇందు రెండు లక్షలజనులు వసించుచున్నారు. నైరృతిదిశగానున్న హమదాన్పురము తొల్లింటి ఎక్బాతనాపుర ముండినతావనియు, నిది మీడీలనాటి రాజధాని యుండినతావనియు నందురు.

తెహ్రానునగరమునకు దక్షిణముగానున్న ఇస్ఫహాన్పురము తొల్లి కాలీఫాలనాఁటి రాజధానిగ నుండినది. ఇప్పుడు విస్తారము వర్తకము గలతావై యున్నపురము. యెజ్డు పురము, మెషేద్పురము కార్వానా వర్తకపుతావులు. అందు యెజ్డునందు జరథుస్త్రపారశీకులు విస్తారము కలరు. షిరాజుపురము సుప్రసిద్ధులగు హాఫిజు, సాది యను పేరులుగల పరిసియను కవిపుంగవుల గోరీల దేవాలయములం గల్గి యాత్రాస్థానమై యున్నది. ఈ పరిసరములనే తొల్లింటి ప్రారంభ ప్రధానస్థానమగు పార్సిపోలిసునగరముండిన తావు పాడుపడి యున్నది. మఱియు షిరాజ్పుర మిప్పుడు ద్రాక్షారసమునకును, గులాబీ తోఁటలకును, అత్తరుపనులకును పేరందియున్నది. కాస్పియ స్సముద్ర తీరమున రెష్టుపురము, బార్ఫ్రుష్పురమును, వర్తకస్థానములగు రేవులు. పారశీక సంయుక్తాగ్రగుడతీరముననున్న గొప్ప రేవుస్థానముగ నున్నపురము బుషీర్పురము.

ఇంకను బందరబ్బా సనంబడుచున్న గొంబూర్పురమును, లింఘాపురమును విశేషవర్తక స్థానములగు రేవుపట్టణములు. ఓర్మసుద్వీపము (గొంబూర్నుదరిని) ఒకప్పుడు పోర్చుగీసువారిదై యుండి వర్తకపుతావై యుండినది. ఇప్పుడు పెరిశియాకు జెందియున్నది. బెలూచిస్థానపు సరిహద్దున మెక్రాన్ తీరమున నున్న గ్వాదార్పురమున గొప్ప టెలిగ్రాఫు స్టేషను నేర్పఱుపబడియున్నది. (ఇరాన్ దేశము, పాహ్లావ దేశము చూడుఁడు.)

**పారశీకదేశపు సామెతలు—** అంగుడి నాలుక పొడవైతే ఆయుర్దాయము తక్కువ.

ఇనుపముక్క పైనవేసుక యీఁతకుదిగినట్లు.

ఎంతమంచికత్తియైనతనపిడికిగంటుపెట్టలేదు.

ఎవ్వఁపని వారిది.

కస్తూరి, వలపు కప్పి ఉంచితే దాగేవి కావు.

కాలమునుబోలినఘనబోధకుఁడుండబోఁడు.

కాలక్షేపము లేకపోతే కంచిమేఁకను కొనుకొమ్మన్నారు.

కుక్కకు కోవెలలో పని యే ముంటుంది?

కోఅగాని ముండ్లడొంకలు గులాబీపూలు పూచునా?

కోఅగానిభార్య గోడలోఁ బుట్టిన రావిచెట్టు వంటిది.

గోడకు పనికివచ్చే రాయేయైతే బైట పారేసారా?

చుట్టయినా (దూరమైనా) పెద్దబాటయే మర్యాదస్థుఁ డేగఁదగిన మార్గము.

తననీడకు దొరకకుండా తానుపరుగెత్తినట్లు.

నాల్కను జాగ్రత్తగా నడుపుకోకపోతే ఫలితము తలదాకా వస్తుంది.

నీకున్న దానితో తృప్తిచెంది బ్రతుక గల్గితివేని, నీవును రాజువలె సుఖపడ నేర్చినవాఁడవే.

బట్టలు ముఱికిగానియ్యని పరిశుభ్రత యెవ్వరికి నుండదు.

మిరపకాయల చిన్నదని మేలమాడ జనదు. నములిచూస్తే నాలుకే చెప్పుతుంది దానిసత్తువ.

విద్య జీర్ణంచేసుకోడానికి పదింతల తెలివి కావలెను.

వచ్చేవి

రవు.

శునకములు తిని విడిచినదానిని సింహములు తినునా?

సంగీతం బాగుంటే సర్పాలుకూడా బయటి వచ్చి వింటాయి.

స్నేహితుఁడే యైతే సూదిబెజ్జమంత దారే చాలును. బాధ్యత లేనివానికి ప్రపంచమంత వెళుపున్నా ద్వారం చాలదు.

**పార్థ గోత్రము**—(వైన్యగణము చూ.)

**పార్ణకాయన గోత్రము** (వశిష్ఠ గణము చూడుఁడు.)

**పార్ణవల్క గోత్రము**—(వశిష్ఠగణము చూడుఁడు.

**పార్వతి గోత్రము**—(జమదగ్నివత ఉపగణము చూడుఁడు.)

**పార్వతీనది**—ఇది విపాశ (బీయాస్) నదిలో కలియు నొకచిన్న నది. దీనితీరమున కొన్ని ఉష్ణోదకకుండములు కలవు. అందు అన్నము, పప్పులు, ఉడుకునంతటి వేఁడి కలవి. వాట్ల కిప్పుడు "మణికరణ్"అని పేరు. తొల్లింటి పేరు "మణికర్ణిక" యని యుండెనఁట. ఇది స్నానతీర్థమైయున్నది. ఇదియిప్పుడు కోహిస్థానమున పర్బానదిగనున్నది. (జలంధర్ దోఆబ్) బకోరాపురమున కెగువను రెండుమైళ్ళదూరమున సంగమించును. మణికర్ణికసంగమమున కెగువను ౨౦ మైళ్ళ దూరమున నదికి కుడితట్టున నున్నది. లెక్కలేని వేఁడినీటియూటలు చల్లనిజలప్రవాహమున కొన్నియడుగులయెత్తునఁ గలవు. (మణికర్ణక్షేత్రము చూడుఁడు).

**పార్వతీలోచనతాళము**--(తాళములు చూడుఁడు.)

**పార్శ్వరుజః**—ఇది బాలపాపచిహ్న రోగభేదము.

**పారాగుయె దేశము** (Paraguay (Republic)—దక్షిణఅమెరికాయందు తొల్లి యొకదేశముగా నుండి, పిదప ఆఖండమునందే లాప్లాటా దేశమునకుం జేరి, అం దంతఃకలహములచే వేఱుపడి ఏర్పాటైన మూఁడు ప్రజాప్రభుత్వములలో నొకటి. ౧౫౭౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము గలదేశము. Asuncion పురము ప్రభుత్వకార్యాలయములున్న తావు. పిల్కోమెనది, పారాగుయెనది సంగమమగు తావున నున్నది.

**పారాశర లేక పారాశర్య లేక పరాశర గోత్రము**—(పరాశరగణము చూడుఁడు.)

**పార్ణాగారిగోత్రము**- (ఉపమన్యుగణము చూడుఁడు.)

**పారిజాతపుచెట్టు**—లా. Erythryna Fulgens. ఆంగ్ల. Coral tree. సం. పారిజాతః. హిం. తెజ్బల్

పారిజాతమును స్వర్గీయకుసుమ మనియుఁ గూడ నందురు. తొల్లింట నీజాతిచెట్లు స్వర్గమునమాత్ర ముండె నఁట. శ్రీకృష్ణుం డటనుండి యొకకొమ్మను రావించి, దానిపూవులను రుక్మిణీదేవి కొసంగెనఁట. దాని కసూయజెంది సత్యాదేవి యలిగినవార్త దెలిసి శ్రీకృష్ణుం డామె కడ కేగి బ్రతిమాలి ప్రసన్నురాలుగఁ జేసికొనెనఁట. పారిజాత మిటుల భూగతమాయెనఁట. పారిజాతపుపూలు చక్కనిపరిమళముగలవి. పారిజాతపుకొమ్మను గొట్టి వర్షాకాలముల నేల పాతిన వేళ్ళుదన్ని బ్రతుకు మొండిజాతి. దీని శరీరము గొంగళిపురుగులకు నిలయము, బహుప్రీతి గావున, చెట్టును పరిశుభ్రముగ నుండునట్లు జూడకుండిన తోఁటకె నష్టము వాటిల్లును.

పారిజాతపు ఆకురసమున నరములకు బలమొసంగి విరేచనము వెడలించుగుణము కలదు. ఉప్పుగల్పి సేవించిన క్రిమిజాడ్యమును, తేనెగల్పి సేవించిన పురాణజ్వరములు మొదలగు సమస్తజ్వరములు తగ్గిపోవును. లేఁతయాకు లల్లము కల్పి లోని కిచ్చుచుండిన వరుసజ్వరము నివృత్తియగును కషాయమునం దీగుణము లన్నియుంగలవు. విత్తులచూర్ణమునందు తలకురుపులు, చుండు (పైనిరాచిన) నివారించు శక్తి గలదు. పూవులరసమునందు చలవజేయు గుణము గలదు.

**పారిమండలిగోత్రము**—(జమదగ్నివత్సఉపగణము చూడుఁడుఁ)

**పారియాత్ర(పర్వత)ము**— చంబల్ నది జన్మస్థానము మొదలు కాంబె సంయుక్తా గ్రగుడము దనుక వ్యాపించి యుంశి వింధ్యనగపశ్చిమభాగమునఁ గల పర్వతపం కికి "పారియాత్రపర్వత"మని పేరు. డాక్టరు భాండార్కరు పండితుఁ డిప్పుడు వింధ్యపర్వతపం కిగ పేరిడఁబడిన పర్వతసమూహములందు, చంబల్ నది, బెట్వానది జన్మించు భాగమునకు పారియాత్రమని History of Deccan Sec. III యందు వ్రాసెను. వరాహపురాణ. ౮౫ అధ్యా. ప్రశంస కలదు.

ఇందు ఆరావళి, రాజపుత్రస్థానపుకొండలు, పతార్ పర్వతములు కల్పి యైయుండ నోపు. పతార్ పారియాత్రశబ్దముయొక్క వికారమేమో. వీట్లకు జేరి అపరాంత, సౌరాష్ట్ర, శూద్ర, మాల్వ (మాళవ), మాలక మొదలగు దేశము లుండునని కూర్మపురాణ పూర్వ. ౪౭ అధ్యాయమున ప్రశంసింపఁ బడినది. పారియాత్ర పర్వతము పశ్చిమతీరప్రదేశమని రామాయణము కిష్కింధాకాండము ౪౨ అధ్యా. శ్లో. ౨౦న గలదు. (కులపర్వతములు చూడుఁడు.)

**పారిషదన్యాయము**—పరిషత్తన సభ. ఒక్కఁడు నుడివినదానిని తక్కినవా రామోదించుటయో నిరాకరించుటయో జరుగుచుండును. ఒక్కఁడే పనిచేయుట జరుగుచుండినను, నందరు చేసిన ట్లొప్పుకుచున్నది.

**పారిస్ డిక్లరేషన్** (Declaration of Paris)–క్రిమియా యుద్ధానంతర యూరోపా దేశములందు బలవంతమగు ప్రభుత్వము లీక్రింది నాల్గు సంగతుల కంగీకరించి ప్రకటించినవి. దానికి "డిక్లరేష నాఫ్ పారిస్"అని పేరు.

౧ Privateering is and remains abolished.

౨ The neutral flag covers enemy goods with the exception of contraband of war.

3 Neutral goods with the exception of contraband of war are

not liable to capture under the enemy flag.

౪ A blockading force must be able to prevent all ingress to and egress from the enemy Coast.

**పార్చిమెంటు (కాగితము)** (Parchment)—వ్రాయుకాగితపురకములలో నొకటి. గట్టిగ నుండి సాధారణముగ చిరుగనిది. అది నివి తోళ్ళుగ (చర్మములుగ) నుండినది పావిరిస పౌరల కివి ప్రీతిగా వేరందినవి. క్రీ. ము. రెండవ శతాబ్దమున విరివిగ గ్రంథభాండాగారములం దుపయోగింపఁబడెను. మైసియా దేశమున పెర్గామమ్ గ్రామమున తొలుత చేయఁబడుట పేరంది, మాఱిమాఱి నేఁటి కీపార్చిమెంటని నిలిచినది.

కాగితములు బయలు దేఱుటతో నీటిప్రాముఖ్యము చెడిపోయినది. ఇక్కాలమున దళసరి లేకున్నను గట్టికాగితములు పార్చిమెం టనుపేరఁ బరఁగు చున్నవి. దస్తావేజులు మొదలగువాటి కుపయోగించు చున్నారు.

**పార్టింగ్** (Parting)-- వాణిజ్యసంబంధ పరిభాషాపదము. రెండింటియొక్క కలుపుట కీపేరు వర్తించెడిని. బంగారము, వెండి కల్పిన దానిలో బంగార మధికమయిన Gold parting అనియుఁ వెండి యధికమయిన Silver parting అనియు వాడుచున్నారు.

**పార్ణనవి గోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**పార్తినాన్ దేవళము**—ఇది గ్రీసుదేశపు అతెన్సునం దున్నది. అతీనా దేవత యొక్క దేవాలయము. ఇప్పుడు పాడుదశయందున్నది. క్రీ. ము. ౪౪౦ లో ప్రారంభింపఁ బడినది. అప్పటిమేస్త్రి ఫిడియాస్ అనుపనివాఁడు(శిల్పి). దీనిమొంటుపొడవు ౨౨౮ అడుగులు. వెడల్పు ౧౦౦ అడుగులు. Doric Style ంఅంక లోని నెనీపియనుల ముట్టడికాలమున పాడుచేయఁబడినది. ఎలిన్ ప్రభువు కొన్ని పనితనపుమార్బ్లులు రాళ్ళు గొంపోయి ౧౮౧౨ సంవ॥లో బ్రిటిష్ మ్యూజియమునకుఁ జేర్ప, నవి యిప్పుడు "ఎలిన్మార్బ్లుల్సు" అనంబడుచున్నవి. (గ్రీసు దేశము, అతెన్సు నగరము చూడుఁడు.)

**పార్థివగోత్రము**-(ఆయాస్య ఉపగణము చూడుఁడు.)

**పార్థివగోత్రము**—(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**పార్థివగోత్రము**— (ధనంజయగణము చూడుఁడు.)

**పార్థివ లేక పార్థివయు గోత్రము**—(పరాశరగణము చూడుఁడు.)

**పార్షిగోత్రము**—(కుశికగణము చూ.)

**పార్షి గోత్రము**—(గవిష్ఠిరగణముచూ.)

**పార్షిక గోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**పార్సిపోలిస్** (Persepolis)- తొల్లింట పారశీకరాజ్యపు రాజధానిగ నుండిన పురము. పారశీక దేశము (Persia) లేక ఇరాన్ దేశమున షిరాస్ పురమున కీశాన్యదిశగా ముప్పదియైదుమైళ్ళ దూరమున నున్నది. తొల్లింటి రాజభవనము, కచేరీలుండిన కట్టడములు చాల యెత్తున(పట్టణమునుండి కొన్ని మైళ్ళదూరమున) కట్టఁబడి, పట్టణమునుండి మనోహరమైన మెట్ల మార్గ మేర్పఱుపఁబడి యున్నది.

**పారుఁడు**— ఈ పేరుగలవారు ముగ్గురు గానవచ్చు చున్నారు. బృహదిషుని సంతతిలోని పృథుసేనునికుమారుని పేరు పారుఁడు. ఈతని సుతునిపేరు నీపుఁడు.

బృహదిషునిసంతతియందే సమరునిసుతుఁడొకఁడు పారుఁడను పేరుగలవాఁడు కలఁడు.

మఱియు పారుఁ డనుఋషి యొకఁ డుండెను. ఈతనికుమార్తె కలావతి యనునామె రూపలావణ్యవిశేషముగలది. ఆమె నొకగంధర్వుఁడు చూచి మోహించి యామె నిమ్మని యడుగ నిరాకరించినందున నాగంధర్వుఁ డలిగి రాత్రి నిద్రించుతఱి నా ఋషిని జంపెనని చెప్పఁబడినది. ఆంధ్రభాషా సంప్రదాయాను సారము పారుఁడన బ్రాహ్మణుఁ డని యర్థము.

**పార్ (Par)**— వాణిజ్య సంబంధ పరిభాషాపదము. మామూలు (సరియగు) ధర యెంతయో అంత యని యర్థము. ఈయర్థ సందర్భమున "Above Par" అనిన అర్థ మగు వెలకన్న నెక్కువ, లేక ప్రియ మనియు, "Below Par" అనిన అర్థమగు వెలకన్న తక్కువ లేక చౌక యనియు నర్థముల వివరింపవలయును. ఒక దేశము యొక్క Exchange తో ఇతర దేశపు Exchange నిసరిపుచ్చినది లేక సరిగ నుండినదానికి "Par of Exchange" అనిమెదరు. (ఎబౌ పార్ చూడుఁడు).

**పార్‌కాపిటా** — వాణిజ్యపరిభాషయందు "తలఒక్కంటికి" అని అర్థము.

**పాలకసన్నిపాతము**— (సన్నిపాత దోషము చూడుఁడు.)

**పాలకాప్య ముని**- హస్త్యాయుర్వేదము (ఏనుఁగులవైద్యము) రచించినవాఁడు. చంపానాగూరునివాసి. జైనుఁడు. (అంగదేశముచూ.)

**పాలంకి కూర**—దీనిం గూర్చి యంతగా తెలియదు. దీనికి సంస్కృతమున పలక్యా, పాలక్యా, పాలంకః, పాలంక్యా అను పేర్లు గలవు.

చలవ జేసి ప్రమేహము, పైత్యరోగముల నడంచును. శ్లేష్మమును రేఁపును. మూలవ్యాధిను ద్రేకింపించును. దీనికి విరుగుడు ఆవాలచూర్ణ మని చెప్పఁబడినది.

ఇది రెండువిధములు. తియ్యపాలంకి, పుల్లపాలంకి. పప్పులో వేసికొందురు తియ్యపాలంకి కూర. పులుసులో వేసికొందురు పుల్లపాలంకి

## పాలకురికి సోమనాథుఁడు కవి—

ఈయన "బసవపురాణము", ద్విపదగను"మల్లికార్జున పండితారాధ్య చరిత్ర", "వృషాధిపశతకము", "సోమనాథస్తవ" మను ద్విపదయు రచించెను. కాకతీయ(త్రిలింగ) రుద్రదేవమహారాజుకడ నాదరణనందిన పండితుఁ డఁట. శైవమతగ్రంథము లనేకములు రచించినవాఁడు. "అనుభవసార" మొకటి యీయనకృతమైనది కల దందురు. ఈయనగురుఁడు మల్లికార్జునపండితారాధ్యుఁ డఁట. ఇప్పటి వరంగల్లునకుఁ గొంతదూరమున నున్న పాలకురికి జన్మభూమి. కొంతకాల మట నసించెనఁట. ఈయనపే రా గ్రామమున నున్న సోమనాథ శివలింగము పేరే. ఈయన రచించిన ద్విపద స్తవ మీదేవునకే యని చెప్పఁబడినది.

సంస్కృతకావ్యము లాంధ్రీకరింపఁ బడుకాల ప్రారంభమున మూఁడుపాళ్లు తెలుఁగుపదము లుండునటుల రచించినవాఁ డనియు, క్రీ. వె. ౧౧౬౦ ప్రాంతమున జన్మించి, బసవేశ్వర పండితారాధ్యుల నిర్యాణకాలమునకు బాలుఁడై యుండి, ౧౧౯౫-౧౨౨౫ మధ్య బసవపురాణము ద్విపదగ రచించి, ౧౨౩౦ పండితారాధ్య చరిత్రను రచించి, పిదప నచిరకాలముననే మృతినందెనని సుప్రసిద్ధ పరిశీలకులును, శైవులు నగు బండారు తమ్మయ్య దేవరగారు సిద్ధాంతీకరించిరి. ఈయన జంగమదేవర కులస్థుం డగు శైవుండని శ్రీతమ్మయ్య దేవరగారును, ఆరాధ్య బ్రాహ్మణకులస్థుండగు శైవుండని శ్రీకొమర్రాజు

లక్ష్మణరావు గారును తీర్మానించుచు భేదాభిప్రాయులై యున్నారు. (త్రిలింగ కాకతీయ సామ్రాజ్యము చూడుఁడు.)

**పాలకూరచెట్టు**-(మనుబాలచెట్టు చూ.)

**పాలగుండ పరిశ్రమ** — పాలగుండ యనునది యొకవిధమగు దుంపనుండి చేయఁబడుపిండి. పాలగుండచెట్టువ్యవసాయము లెఱుచుగా మన్యప్రాంతములఁ జేయఁబడుచున్నది. పంట స్వల్పమగుటను సర్వసాధారణముగ వ్యవసాయము జేయుట లేదు. భారీగా చేయఁబడిన యెడల లాభకారి యగు వ్యవసాయము కావచ్చును. ఈచెట్టు పసుపుచెట్టువలెనే యుండును. పైరు పెట్టుటకు పిలకలు గాని విత్తులుండవు. అరఁటివ్యవసాయము వలెనే పిలకలు పాతి వ్యవసాయము జేయవలయును. పిలకలు హెచ్చుగా పుట్టుటయు గలదు. వర్షాకాలము కొన్ని దినములకుప్రవేశించు ననఁగా పిలకలను పాతవలయును. పాతిన రెండుమూఁడు మాసములవఱకు పలుచగా గొప్పు త్రవ్వుచుండవలయును. వర్షాకాలములేదుపరిగొప్పులుత్రవ్విన దుంపకు భంగము గలుగును గాన మానివేయవలయును. పిలకలు నాలుగుమూరలదూరమున పాతవలయును. సమీపమునఁ బాతినపిలకలు చెట్టు విస్తరించుట కవకాశ ముండదు. అందుచే దూరముగనాటవలయును. ఇసుకకో డెక్కువగానుండు భూములందు నాటవలయును. బంకరేగడిభూములం దీవ్యవసాయము గాదు. చలువగలభూమియు, జలాధారము గలవియునై యుండవలయును. ఎరువులు బాగుగ వైచిన పంట కనకూలములై యుండును. పశువులగెత్తము, కుళ్లుటాకు, మేకలమంద లాఁపుట, ఈవిధములగు నెరువులచే సత్తువ జేయుట శ్రేష్ఠముగ నుండనోపును. ఈచెట్లు పంటకాల మగుసరికి ఎండిపోవ నారంభించును. పక్వకాలము గనిపెట్టి దుంపలం ద్రవ్వవలయును. దుంపలయాకారము తెల్లకందమూలము వలెనే యుండును. చెట్టునకును, దుంపకును, సున్నితమగు తంతువు ప్రమాణముగల వేరుండును. చెట్టు 1కి దుంపలు ఐదా రుండును. మడి యంతయు ద్రవ్వి ముదురుమొక్కను బాఱవైచి లేఁత పిలకలను ముందువత్సరమునకుఁ బాతవలయును.

ఈదుంపలు మెత్తగా చితుకఁగొట్టి రసము పళ్ళెమునఁ బిండి యెండఁబెట్టిన తెల్లగను, ముక్కలుగను ఎండి పేలును. ఈ ముక్కలను నిలువజేసిన సంవత్సరములతరబడి నిలువయుండును. రగుడునకు మాత్రము పిండిగా మాఱిపెద్దగును.

ఇది ప్రస్తుతము మన్యప్రాంతములందు అనఁగా నవరంగపురము,జయపురము,ప్రాంతములందు తయారగుట గలదు. ఆప్రాంతములవారు తయారుచేయు టధికము గాన, మీఁద నుదహరించినవిధముననున్నితముగ జేయక, చితుకగొట్టి రాళ్ళగుంటలయందు రసమును పిండియుండుటచే నవరలు చేసి విక్రయించుపిండి కధికముగా తొక్కులుండుటయుం గలదు.

పంటలు సర్వసాధారణముగ సమస్తప్రదేశములందు లేకపోవుహేతువున ధర యధికమయి యుండును. ఈపాలగుండ శరీరమునకు చలవ చేయును. దీనిని పాలతోఁగలిపి ముంజెలుగా తయారు చేయుటంబట్టి "పాలగుండ' యను సార్థకనామ మాయెనేమో తెలియరాకున్నది. పాలగుండతోఁ జేయఁబడు భక్ష్యమునకు "పాలముంజె" లనిపేరు.

**పాలగురుగుచెట్టు**— (మనుబాలచెట్టు చూడుఁడు.)

**పాలగోత్రము**-(పాలకుల చూడుఁడు.)

**పాలచెట్టు పాలపండ్లచెట్టు**-ఇది పెద్ద పాల యనియు,చిన్న పాల యనియు ద్వివిధము.

దీనికి సంస్కృతపు పేరులు రాజాదనీ, వానర ప్రియః, క్షీరికా.

పాలచెట్టు మొక్కకు సపోటాకొమ్మతో అంటుగట్టి సపోటాఅంట్లు జేతురు. పాలపండ్లను రుచ్యములే. పాలచెట్టుతొఱ్ఱలలో నీఁగలు చిన్ని పూఁదేనె యను ప్రసిద్ధమైన తేనెపలుకులం జేర్చును. పాలు గలవి.

దీనిపండ్లయందు త్రిదోష సన్నిపాతతీవ్రత నడంచుశక్తి గల దనియు, బలము, వీర్యవృద్ధి గల్గించి, పుంస్త్వబలమొసంగుననియు స్మృతితప్పుటను నివారించు ననియు, ఇంచుక గర్భములో వాయుబంధనమొనర్చి నొప్పి గల్గించుననియు, దీనికి మినుములు విరుగుడనియుఁ జెప్పఁబడినది.

చిన్న పాలచెట్టునకు లా. Asclepias Rosea. సం. క్షీరాలీ, క్షీరావీ, గాహీ శచ్ఛ్రరా, తామ్రమూలా, మరుద్భవా. దీని వేరు, ఆకులు, పండ్లు, రసకషాయచూర్ణములు వాతము, మలబద్ధము, శుక్లవృద్ధి గల్గించును. కఫము హరించును. లగర్భమును నిల్పి రక్షించునందురు.

**పాలతీఁగె** — దీనిం గూర్చి యంతగా తెలియదు.

వాతము జేయుననియు పైత్యము శమింపఁ జేసి నేత్రరోగముల బాగుపఱచి వీర్యవృద్ధి గల్గించు ననియు, స్త్రీలకు పాలు గల్గించు ననియుఁ జెప్పఁబడినది.

**పాలతుత్తము**—ఆం. White Vitriol పాలతుత్తము విరేచనములు చేసి నేత్రము లకు బలము గల్గించును. ఇది శాస్త్రోక్తముగ శుద్ధిచేయఁబడవలయును. లేకున్న పైత్యవికారము వమనము గల్గించును. దీనికి నిమ్మపండ్ల రసము, నీళ్ళలోనానిన వరిపేలాలు విరుగుడులని చెప్పఁబడినది.

చక్కఁగ శుద్ధి చేయఁబడిన పాలతుత్తము క్రిమి, కుష్ఠము, దురదలుగల్గించు విషమును హరించు ననియు, అమితముగ సేవించుట తగ దనియుఁ జెప్పఁబడినది.

**పాలను చూడనా భాండాన్ని చూడనా?**—(ఆంధ్రలోకోక్తి.)

**పాలన్పూరు స్టేటు**—బొంబై రాజధాని ప్రభుత్వపు అధికారమునకు లోఁబడిన స్వదేశ సంస్థానము. కథియవాడ ద్వీపకల్పమునం దున్నది. పాలన్పూరు రాజధాని.

**పాలస్తినాదేశము** (Palestine)—ఆసియాఖండమున సిరియా దేశమునకు నైరృతి దిశగా నున్న చిన్న దేశము. ఇది మహమ్మదీయులకు క్రైస్తవులకు యాత్రాస్థల మగు పవిత్రభూమి. యూదులకు స్వదేశము. ఇశ్రాయెలీయులకు జహోవాదేవునివలన యొసంగఁబడిన రాజ్యభూమి. క్రైస్తవులుదీనిని హోలీలాండని భక్తితో పలుకుచుందురు. బైబిలునందు చెప్పఁబడిన చరిత్రాత్మక దేశ మగుట, వారు క్రీస్తు ప్రభువు పుట్టిపెరిఁగి ప్రజలపాపములకై సిలువ వేయంబడి మృతినంది, మృతులనుండి లేచి యాకసమునకు పరలోకమున కేగినట్టియు, ఆయన తనమతమును తానే బోధించినట్టియు దేశమని అతిశయముగఁ దెల్పుచుందురు. దేశము మెరకపల్లములతో నిండియున్న కొండల దేశము.

దేశమందలి యుత్తరభాగము లెబనాను కొండల నంటియున్నది. కార్మెలుకొండ సముద్ర తీరమునందున్న యెత్తగు శిలాతలము. దానికి తూర్పుగనున్నటాబూర్పర్వతమును, జెరూసలెం కడనే యున్న మౌంటు ఆఫ్ ఆలివ్సు కొండయుఁ జెప్పఁదగిన కొండలు. జార్డనునది యొక్కటియె చెప్పఁదగిన నది. దీని యుదకము

లందే క్రీస్తుప్రభువు జాన్ది బాప్టిస్టునలన జ్ఞాన స్నానము బడసెను గాన నిదిపవిత్రనద మనం బడుచున్నది. ఇదిహెర్మోనుకొండ పాదమున బల మగు జలప్రవాహముగనే జన్మించును. ఈ పవిత్రనదము తొలుత మూఁడుతావుల త్ర్యంబ కాత్మకమై పుట్టి, అతిసమీపముననే సంగమమై నడుచును. జన్మస్థానమునకు "బనియాస్ జల బుద్బుద" మని పేరు. అటకు రెండుమైళ్లదూర మున టానెల్కాది యనంబడుతావున వేఱొక జన్మస్థానము కలదు. ఈప్రాంతమున పాడుపడిన యొకగ్రామ యమై యున్నది. మూఁడవ జన్మస్థానము బనియాస్ బుద్బుదము కడనే వేఱుగ నున్నది. ఇటుల త్రిపథగామిని యైన జార్డను నది అచిరకాలముననే కలసి యేకనదిగ నేర్పడి, దుముకుచు నేడుమైళ్లదూర ములో కొన్ని సెలయేళ్ళ జలములం గలుపు కొని, ఒక పాపీరసుచెట్లడొంకలలోఁబడి నడిచి యొక సరస్సును జేరుకొనును. దానినుండి యవ్వలకుఁ జను జలప్ర హము శాంతమును, స్వచ్ఛమును నగు జలపూరితమై మఱి పదిమైళ్ళు నడిచి హులే యనుపేరుగల సరసునఁజేరుకొనును. పిదప మఱి పదిమైళ్ళలో గలిలీసముద్ర మనంబ పెద్దసరస్సుగుం యవ్వలకు నడుచును.

గలిలీసముద్రముపై క్రీస్తుప్రభువు నడుచుట మొదలగు కొన్ని మాహాత్మ్యములు బైబిలునం దాయన జీవచరిత్రలో చెప్పఁబడినవి. గలిలీ సముద్రమునుండి వెడలుపగు నదిగ జార్డను బయలు వెడలి, దక్షిణవాహిని యై కుటిల గమనయై వంకలందిరుగుచు, నంతకంత కధో గామిని యగుచుండును. ఈపల్లపు ప్రదేశములు చాలవేడిగ నుండి నదీజలములున్న చోట చల్లగా నుండునవి. నది కిరుదెసల దట్టమైన వృక్షము లుండును. మోఆబప్రదేశములనుండి చూచిన నివల్లపుప్రవాహములు వింతగ నుండెడిని. ఇంక కొన్ని మైళ్ళు డెడ్సీ కలదనుతావున నది యొక పాటికొండలలోవగుండా నడుచును. ఇచట చె ట్లధికముగాఁ గలవు. దీనినాంగ్లేయులు "Pride of jordon" అనియు, "Swellings"అనియు ననుచున్నారు. ఇం దొకతావున పవిత్రోదకము లందు క్రీస్తుప్రభువు జ్ఞానస్నాన మందినతావని చూపుదురు. అటనే యాత్రికులు స్నానము లొనర్చుచు, నచటి కొమ్మలతునుకల నిండ్లకుఁ గొంపోవుచుందురు. ఇట్లీనది డెడ్సీ యనంబడు నుప్పునీటిసరస్సున సంగమించి యస్తమించును. (డెడ్సీ చూడుఁడు). డెడ్సీ మధ్యధరాసముద్రపు నీటిమట్టమునకు దిగువ ౧౩౦౦ అడుగుల లోతున నుండి, మహాసముద్రోదకములకన్న నెన్మిదిరె ట్లధికముగ ఉప్పనై యుండును.

పాలస్తినా దేశచరిత్రి బైబిలునందు పూర్తిగ వివరింపఁబడిన సుప్రసిద్ధచరిత్రమే గాన, తిరుగ వివరించుట చర్వితచర్వణ మగును. ఇప్పుడు టర్కీవారిక్రింద నున్నది యనిన చాలును. రైతులు సిరియనులు. భాష అరబ్బీభాష. క్రైస్తవులు గ్రీకుచర్చివారు.

జరూసలెంపురము ప్రధాననగరము. పురా తనస్థలము. ఇందు తొల్లింటి జహ్వాదేవాలయ స్థానమున నిప్పు డుమార్మశీదు కట్టఁబడి యున్నది. దీనిలోని పవిత్రస్థానమునకు యూదు లను రానీయరు. వారు తొల్లింటి ప్రహరీగోడ ప్రారంభ నిర్మాణముకడంజేరి మతకార్యముగ నొక యరబ్బీగురుని ఉక్తులకు వెనుకపాట పల్లవి బాడుచు విలపించుచుందురు. ఇచట క్రీస్తుప్రభు వును సిలువవేసిన తావున గొప్పదేవాలయము కలదు. ప్రధానదేవళముంజుట్టి అందే వేర్వేఱు చర్చిలవారి దేవస్థానములు వేర్వేఱుగఁగలవు. ఇంక పెక్కుతావుల జూపుదురు.

బెత్లెహేము పురము జరూసలెమున కారు

మైళ్ళదూరము. ఇట క్రీస్తుప్రభుని జన్మస్థానము కలదు. ఇదియు యాత్రాస్థలమే. ఇంకను దక్షిణమున పురాతనపు హెబ్రోన్పురమును, జార్డన్ నదికడ జూరిఛోపురమును, కార్మెయిల్ కొండకు తూర్పున నాజరేత్పురమును, గలీలీ సముద్రతీరమున టైబీరియాస్పురమును, ఉత్తర సముద్రతీరమున తొల్లింటి సెడో అనుపేరంబరగిన ఇప్పటి సైదాపురమును, తొల్లింటి టైరను పేరంబరఁగినఇప్పటి టూసురుగ్రామమును దేశమునందు చెప్పఁదగిన యితరతావులు. జాఫా (తొల్లింటి జొప్పా)పురము రేవుపట్టణము. అట నుండి జరూసలెమునకు ఇనుపదారి కలదు. రామ్లె నారింజపండ్లకు పేరందినది. గాజాపట్టణము వర్తకస్థలము.

దీనికి పెక్కుపేర్లుకానంబడుచున్నవి. క్రైస్తవులు భక్తిపారవశ్యమున "Holy land" అనియెదరు. మహమ్మదీయులోక చంద్రుఁడు, మూఁడు నక్షత్రములువారిజాతీయపతాకముపై చిహ్నములుగా గైకొని ఆదేశ మనెదరు. యూదులు "Promissed land" అనియు, "Land of milk and honey" అనియు, "Land of Israel" అనియు నందురు. ఇంకను "Land of Johova" అనియు, Johova's own Land" అనియు, Land of Jews, Johova's own people" అనియు పెక్కండ్రు వాడుచున్నారు.

ఇది యూదుల స్వదేశము. క్రైస్తవులకు పవిత్రభూమి. ఆంగ్లేయులు దీనిని "Holy Land" అనియెదరు. క్రీస్తుప్రభువు జన్మించి బోధించి, సిలువవేయఁబడి మృతినంది, తిరుగ మృతులనుండి లేచి ఆకాశమున కెగసిన పవిత్రసీమ యని చెప్పఁబడినది. ఆయనంగూర్చిన విషయములు నడిచిన తావులు పెక్కు చూపుచున్నారు.

తొమ్మిదివేల చతురపుమైళ్ళు దేశవైశాల్యమనియు, ఎన్మిది లక్షలు జనాభా యనియుఁ జెప్పఁబడినది. జరూసలెమ్ పురము ప్రధాన నగరము. వెనుక నిది టర్కీదేశపుపరిపాలనలో నుండెడిది. ఇప్పు డీదేశపరిపాలన బ్రిటిష్ ప్రభుత్వమునకు స్వాధీనమై యున్నది. టిటస్ అను పేరుగల రోమన్‌చక్రవర్తి జరూసలెమ్ దేవాలయమును కొల్లగొట్టి తీసికొనిపోయిన యూధ బానిసలలో జోసెఫస్ ఫ్లేవియస్ అను చరిత్రకారుఁ డొక డుండెను. (జోసెఫస్ ఫ్లేవియస్ అను చరిత్రకారుఁడు చూడుఁడు.)

**పాలవంశన్నృపతులు**— గోపాలనృపతి అంగదేశ మేలెనని చెప్పఁబడినది. మఱియు నాయంగదేశమును సామంతపాలుఁ డనునృపతి యేలినటుల చంపాశ్రేష్ఠకథయను జైనగ్రంథమునఁ గలదు. కుమారపాలుఁ డనునృపతి భరుకచ్ఛదేశ మేలినటులను, అది క్రీ. వె. ౧౨వ శతాబ్దకాలమనియుఁ జెప్పఁబడినది.

గోపాల నృపతియు, ఆతనిసుతుఁడు ధర్మపాలనృపతియు మగధరాజ్యమును క్రీ. వె. ౮౧౫ మొదలు ౮౬౦ వఱకు నలుబదియైదు సంవత్సరములు పాలించినటుల నిదర్శనములు కలవు. వీరికిఁబిదప మగధరాజ్యము మహమ్మదీయులపా లాయెనఁట. వారినుండి బ్రిటీషువారి వశ మాయెనఁట.

**పాలవేకరి కదిరీపతి కవి**—ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁ బడినవాఁడు. ఈ కదిరీపతినాయకుఁడు కరియ మాణిక్యనృప పౌత్రుఁడును, కదిరిరాజపుత్రుఁడు నెల్లూరిమండలవాసి యని తలంచుచున్నారు.

రచించినది "శుకసప్తతి" పద్యకావ్యము. ప్రౌఢకవిత్వము.

**పాలసాచెట్టు** — దీనింగూర్చి సరిగా తెలియదు. దీనిపండ్లు చలవ శరీరబలము గల్గించి

నొప్పులం దీసివైచునందురు. నూనె, పుదీనా, వేఁపగింజలు, శొంఠి దీనివిరుగుడు లఁట.

**పాలస్యగోత్రము**— (నిధృవగణము చూడుఁడు.)

**పాలింప్సెట్** — ఒక పార్చిమెంటు (Parchment) పైఁగాని, లేక అట్టి కాగితము పైఁగాని, పెపైరస్ (Papyrus) మొదలగు వాటిపై నాదిని వ్రాయఁబడిన (లేక గీయఁబడిన లేక చెక్కఁబడిన లేక గోకి యానవాలుగఁ జేయఁబడిన) యక్షరాదుల వ్రాతను ఉన్నదున్నట్టులుసరిగా వ్రాయుటవలన నాయత్తపఱుపఁబడిన గ్రంథముయొక్క వ్రాతప్రతిని "పాలింప్సెట్" అనెదరు. ఇది రెండు గ్రీకు భాషాపదములనుండి యేర్పడిన శబ్దము. దీనికిఁ దిరుగ గీకఁబడిన దని యర్థమయ్యెడిని. క్రీ. వె. ఏడవశతాబ్దకాలమునుండి యిది యొక కలగా గ్రీకుదేశము, తత్పరిసరదేశములందు ప్రారంభమైనది. అనఁగా ఈజిప్టుదేశపు ప్రభుత్వాధిపతియగు కేలిఫ్ ఒమారు ప్రభువు పేపైర్ కర్మాగారములను భగ్నపఱచినపిదప ప్రాగంభమైన కాగితములు విరివిగఁ జేయఁబడి వాడుకలోనికి వచ్చుటతో నాఁగిపోయినది. పెక్కు పురాతనగ్రంథములిట్లు దేశమునతిరుగ జీవింపఁ గల్గినవఁట. పిదప గన్గొనంబడిన రసాయన ద్రవ్యముల సాహాయ్యమున రెండు మూఁడు వ్రాతలు గూడ నిటుల నొకవ్రాతనుండి గ్రహింపనైనదఁట.

**పాలిరోగము**—ఇది కర్ణ (చెవి) రోగములలో నొకటి.

**పాలు( క్షీరములు)**— పాలు ప్రసిద్ధ భోజనపదార్థము. భోజనద్రవ్యములలో చాల ప్రాముఖ్యము నందినది. పాలనుండియె వెన్న, నెయ్యి, పెరుగు, మజ్జిగలు గల్గెడిని. దేశము సుభిక్షమని చెప్పుట కాదికాలమునుండి పాఁడి పంటలు కలదేశమని వాడుచున్నారు. ఇట్లనుట యందు పాఁడి మొదట వచింపఁ బడుట పాల ప్రాముఖ్యమును దెల్పెడిని. బైబిలునందు పాలస్తీనాదేశముంగూర్చి పాలు తేనెలు ప్రవహించు దేశమని చెప్పఁబడినది. ఇందు పాలు భోజనము నకును తేనెరుచికిని చెప్పఁబడియు సమృద్ధిని దెల్పెడిని.

పాశ్చాత్యపరిశీలకులు పాలను "Natural emulsion consisting of minute globules of fat suspended in Liquid" అని వివరించిరి. పసిపిల్లలకు పాలు ముఖ్యాహారము. ఆహారవిధానమున పా లేదోవిధమున నుపయోగింపఁబడుచునే యుండును. స్విజర్లండు మొదలగు కొన్ని దేశముల నావుల నెక్కువగఁ బెంచి, పా లధికముగఁ దీయువసతులు గలవు. అట్టి సీమలందు పాలను Condenced milk గను, Cheeses గను చేయఁబడి చెడిపోకుండ నిల్వయుండునటుల డబ్బాల నింపఁబడి, విదేశముల కెగుమతి చేయఁబడుచున్నది. ఇంకను Dessicated milk గా కొన్న పాలు వచ్చుచున్నవి. వీట్లం జేయుటకు పాలకు గొంతవేఁడి గల్గించి, నీ రావిరి యగునట్లు చేసి, యించుక శర్కరభాగము కల్పి, గాలి చొరకుండ మూత లంటింతురు. (ఆవుపాలు చూడుఁడు.)

పాలు సామాన్యగుణముగ బలము, దేహపుష్టి,వీర్యపుష్టి గల్గించి,వాతపైత్యములను హరించుననియు, విరేచనము గావించు ననియు చెప్పఁబడినది. కాచినవేఁడిపాలు తాపము శ్లేష్మముల నివారించి వీర్యపుష్టి బలము నిచ్చుననియు, కాఁగిచల్లారినపాలుపైత్యశాంతిగల్గించుననియు, పాలయందు సగము నీరు గల్పి నీ రిగురఁగాచినపా లనుకూలమైన పథ్యమనియుఁ జెప్పఁబడినది. కాచని పచ్చిపాలు బలము గల్గించుంగాని గురుత్వము గల్గించి అజీర్ణి, ఆమవికారము,

వాతముల పేరేపించు ననియుఁ జెప్పఁబడినది. ఈనినపశువులపాలు రెండు లేక మూఁడు దినములవఱకు ముఱ్ఱుపాలనంబడును. వీట్లతోజున్ను వండుదురు. అది గురుత్వముగనుండి మలమూత్రనిరోధము వాపి, బల మొసంగి,ఆమాధిక్యమును వాతశ్లేష్మముల నుద్రేకింపించి, మూత్రాశ్మరిం గల్గించునని చెప్పఁబడినది. దీనికి విఱుగుడు పటికపంచదార యందురు. ఉదయమున పాలుపుచ్చుకొనిన వీర్యపుష్టి, దేహపుష్టి, బలము, ఆఁకలి గల్గించు ననియు, మధ్యాహ్నము శ్లేష్మపిత్తమేహముల శమింపఁజేసి బలమొసంగు ననియు, రాత్రి పుచ్చుకొనిన సమస్తదోషముల నివారించి బల మొసంగు ననియు, పాలు పుచ్చుకొనఁగనే రాత్రి నిద్రింపరాదనియుఁ జెప్పఁ బడినది. క్షుత్పిపాసలు కల్గియున్నప్పుడు, బడలినప్పుడు, ఆయాసము గల్గినప్పుడు, శరీరోష్ణత తగ్గినప్పుడు క్షీరపానము శ్రేయము.

వెండిపాత్రలోనిపాలు శ్లేష్మహర మనియు, కంచుగిన్నెలోని పాలు త్రిదోషహర మనియు, మట్టిపాత్రలోనివి సమస్త రోగహర మనియు, రసపాత్రలోనివి విషదోషముల హరించి రోగశమనముంగూడ గల్గించుననియు, గంధకపాత్రిలోనిపాలు శ్వాస కాస క్షయల నివారించు ననియు, అయస్కాంతపాత్రిలోనిపాలు సర్వశ్రేయముల నొసంగు ననియు, త్రిదోషహర మనియు, రాగిపాత్ర,(తామ్రపాత్ర)లోనివిసకల దోషములం గల్గించుంగాన సురాపానతుల్యమై యనర్హ మనియుఁ జెప్పఁబడినది.

పాలు కాచకుండ నుంచిన ౪౦ గడియలు (లేక పదునాఱుగంటల) కాలమునకును, కాచినవి ౬౦ ఘటికలు (లేక ఇరువదినాల్గుగంటల) కాలమునకును చెడిపోయి విషతుల్య మగునని చెప్పఁబడినది. పాలకు అరఁటిపండ్లు, అల్లము, ఉశిరికకాయ, గోధుమలు, చంచలికూర, ద్రాక్షపండ్లు, పొట్లకాయ, మినుములు, మిరియాలు, ములగకాయలు (కాడలు), శర్కర, శొంఠి, సైంధవలవణము మిత్రము లనియు, అనఁగా కల్పదగినవనియు, ఉలవలు, చల్ల, చింతపండు, తాంబూలము, తెలకపిండి, దుంపకూరలు, పప్పుదినుసులు, పెరుగు, బెల్లము, నేరేడుపండు, వెదురుదవ్వ, క్షీరశత్రువు లనియు, కలుపరాదనియు, రోగప్రద మనియుఁ జెప్పఁబడినది.

ఇంకను క్షీరములు కసరత్తుచేయుచుండువారలకును, గర్భిణిస్త్రీలకును, నల్లమం దభ్యాసము గలవారికిని, బాలురకు,మందుపుచ్చుకొనుచుండు (ఔషధసేవజేయు) వారికి, వ్యాధినుండి నీరసపడినవారికి, వృద్ధులకు, శరీరము శుష్కించి యున్నవారికి పథ్యమనియు, అతిసారము, ఆమరోగము, కఫరోగము, కుష్ఠరోగము, గళరోగము, గ్రహణిరోగము, జ్వరము, పైత్యరోగము, భగంధరరోగము, మేహరోగము, రక్తగ్రహణి, వ్రణములు, విషూచిరోగము మున్నగునవి గలవారి కపథ్యమనియు, ఇయ్యరాదనియుం జెప్పఁబడినది.

పాలపైమీఁగడ ఆపాలగుణంబులుగల్గి, ఆమవాతము నడంచి అగ్నిమాంద్యము, గురుత్వము జేయుననియు, పొడిదగ్గు, ఎక్కిళ్ళు, రక్తపైత్యముల నడంచి, యాలస్యముగ జీర్ణమగుననియు, దీనికి తేనె, అల్లపుమురబ్బాలు విరుగుడులనియు, పాలవిరుగు, పాలబలముం గల్గియు త్రిదోషములను రేపి, రక్తమును విఱుచు ననియు, నాభిశూల గల్గించుననియు, అపథ్యమైనదనియుఁ జెప్పఁబడినది.

పాలయం దిట్టిగుణదోషములు కలవని వివరించుతరి, మానవశరీరమున కననుకూలములగు సమస్తవిధములగు Germs & Bacteriaలకు పాలే ముఖ్యసంధాయక మని పరిశీలకులు దెల్పు సంగతిని వివరింపక మానరాదు. ఈజరమ్సు,

బేక్టీరియాలు, కలరా, విషజ్వరము (Typhoid fever), ఉబ్బసపుదగ్గు (Tuber culosis) లను శరీరములకు సంధించి ప్రయోగించునవి గూడ నుండును. దీని నాఁపుటకు పశువుల మేఁతను చక్కఁగ పరిశీలించి యిడుచుంట యొకసాధన మనియు, పాలను జక్కఁగ గాచుట కొంత దోష పరిహార మనియు చెప్పుచున్నారు. పాలయందు నీళ్ళుకల్పిన దానిం గనుఁగొనుటకు "Lacto meter" అను యంత్ర మొకటి కలదు. ఇంక నేనుఁగుపాలు అజీర్తింగల్గించుననియు, ఒంటెపా లతిబలకర మనియు, ఎనుము (గేదెపాలు) బలమై శైత్యప్రదమనియు, గొఱ్ఱెపా లధమ మనియుఁ జెప్పఁబడినది.

అవుపా లారోగ్యకరము (అవుపాలు చూ.) గుమ్మపాలు అప్పుడు పితికి వేఁడి చల్లారకుండ నురగపోకుండ నుండుదానికి పేరు. అవి మిక్కిలి బలమొసంగు నని యందురు. మేఁకలందు మాలెము మేఁక లేక కంచిమేఁక యనంబడుజాతి యెక్కువపా లిచ్చునందురు. మేకపా లుబ్బు జాడ్యముగలవారికి పథ్యము. ఇవి చక్కని వేఁడి గల్గించునఁట. కాని, మేఁకలపాఁడి రోఁతయని ఒకప్రసిద్ధకవి వర్ణించియుండెను. ఇది బహుశః పాఁడికి గాని పథ్యమునకుగా దని యాయన యభిమతమై యుండనోపు. గొఱ్ఱెపాలు వైద్యమున నుపయోగించెడిని. గాడిదపాలు పురిటి పిల్లలరోగముల రానీయక కాపాడుంగాన అత్తరి లోని కిత్తురు. పందిపాలు పట్టబుఱ్ఱలకు రాచిన వెండ్రుకలు మొలచునందురు.

**పాలు కాచుతఱి పొంగుట**— ద్రవ పదార్థముల గాచుతఱి వేఁడితో సాంగత్యము గల్గుట నవి వేఁడి గాస్ (Gas) గా మాఱు చుండును. అది తక్కినదానికన్న తేలికయై పైకిఁ దేలుటకు క్రిందినుండి ఉపరిభాగమునకు జనుట కారంభించును. పాలయందలిజలము లిట్టగుతఱి పాలు దానింజుట్టుకొని బుడగ యగును. అది ఉపరిభాగమునకుఁ జననగుతఱి గిన్నెయందలివి పొంగక (అధికముగాక) తీరదు. ఆగిన్నెయంద లిది నీరేయగుతఱి బుడగ లగుట సంభవింపక, ఆవిరిగనే యగుచు నెగసిపోయి యుండెడిని. పాలపొర చుట్టునేర్పడుట, బుడగ యగుట, సంభ వించునని యెఱుంగునది. అనఁగాఁ గాచుట వలన కేవలము నీరేయగుతఱి పొంగక ఆవిరియై పైకేగుటయు, పాలు గాన చుట్టును పొరగట్టి అధికముగ నగునట్లు పొంగుటయు సంభవించు నని భావము. ఇట్టిపాలపొర కడకు ఉపరిభాగము నకుం జేరుచు మీఁగడ యనఁ బరఁగెడిని. దీని నాంగ్లరసాయన శాస్త్రమున "Valuable proteins" అనిపోల్చిరి. పాలను గలుపుచుం డిన నీపొర యాటంక ముండక నీటియావిరి వెడలిపోవుచు పొంగకుండును. లేక వాటిపై చల్లనినీరు జల్లిన వేఁడి తగ్గి పొంగకుండును.

**పాలు-క్రీమ్** (Milk & Cream)— పాలయందలి క్రొవ్వుభాగము క్రీమ్ అనం బడును. అం దింకను ప్రోటీన్ (Protein) లేక ఎల్బుమెన్ (Albumen) కూడ క్రొవ్వు ముక్కల నడుమఁ గూడియుండును. పాలు పరి శీలించిన నవి గుండ్రని చిన్న పరమాణువులచే నిండి, ద్రవపదార్థముగ తెలియ నగును. అవి నేతిగ నగుపదార్థములు. పాలు పితికినతఱి నిట్టివి సమముగ నంతట నున్నను, కొంతసేపగు నప్పటికి జిడ్డుపదార్థము నీటికన్న తేలిక గాన పాల యుపరిభాగమునకు జేరికొనును. ఇందుగల ప్రోటీను ఇందలి యుదకభాగముతో కలిసి యుండునుగాన నత్తఱి క్రీమ్ అగుటగ పరిణ మించును.

**పాలుపోసిపెంచినను 'పాముకఱవక మానదు** — (ఆంధ్రలోకోక్తి.)

**పాలు, వెన్న, క్రీము, చీసు, మైక్రోబ్సు సంబంధము** (Milk, Butter, Cream,

Cheese,Microbes)-వీటియన్నిటికిఇంతయో అంతయో మైక్రోబ్సుతో సంబంధము కలదు. పొదుగునుండి పాలు బయటికి వచ్చినదాదిగ దానియం దదివఱకే కలిసియుండు మైక్రోబ్సు, పాలకంటె తేలికవి యగుట పైకి తేల నారంభించి పైపొరగ నేర్పడును. క్రీము పాలయందే యుండును. పాలు మైక్రోబ్సువలన పులియుట కారంభించును. ఇటీవలి పరిశోధనలు మైక్రోబ్సునం దనేకజాతు లున్నవనియు, కొన్నిజాతులనుండి చక్కని Flavour క్రీమునకు, ఛీసునకు, వెన్నకుఁగూడ కల్గుచుండు ననియు బయల్పఱచినవి.కొందఱు విద్యాధికులగు డైరీలనుంచినవారు మంచిజాతి మైక్రోబ్సును పెంచుచున్నా రని కూడ వినుచున్నాము. (జరమ్సు, మైక్రోబ్సు, చూడుఁడు.)

**పాల్కురికి సోమనాథ కవి**- ఆంధ్రకవులయందు పూర్వకవులలో పరిగణింపఁబడినవాఁడు. ఆరాధ్య బ్రాహ్మణుఁడు. నియోగి. భృంగిరిటగోత్రము. తండ్రిపేరు గురులింగము. క్రీ. వె. ౧౧౮౦ ప్రాంతమువాఁ డని కీ. శే. రా. బ. కందుకూరి వీరేశలింగముపంతులుగా రభిప్రాయపడియున్నారు. శైవగ్రంథము లనేకములు రచించెను. తెలుఁగుగ్రంథములలో పండితారాధ్యచరిత్ర, బసవపురాణము ద్విపదలుగ రచించెను. శివానుభవసార మనుపద్య కావ్యము రచించెను. ఇంతియే గాక చతుర్వేదసారసూక్తులు, సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురుగడ, నమస్కారగద్యము, వృషాధిపశతకము మొదలగునవియుఁ, గొన్ని కన్నడ గ్రంథములును రచించి, కడకు చెన్నమల్లు సీసములు 3౬ రచించి శరీరమును విడిచినమహాత్ముఁడు. జననము కాకతీయరాజ్యమందలి పాల్కురికి. నివాసము కర్ణాటదేశమునందలి కలికము. ఇతనిసమాధి యిటనే గలదు. పాల్కురికి యందు సోమనాథశివలింగ మున్నది. ఆరాధ్య బ్రాహ్మణుఁడు. తల్లి శ్రియాదేవి. తండ్రి విష్ణుకామదేవుఁడు. విద్యాగురువు తట్టకూరి పోతదేవుఁడు. కవితాగురువు కరస్థలివిశ్వేశ్వరుఁడు. రచించినవి శివానుభవసారము, పండితారాధ్యచరిత్ర, సోమనాథ (శైవ)భాష్యము, బసవపురాణము మొదలగున వనేకములు కలవు. చతుర్వేద సూక్తులు, చెన్నమల్లుసీసములు, బసవపంచగద్య, శ్రీరుద్రభాష్యము, నమస్కారగద్యము, అక్షరాంకగద్యము, ప్రపంచక ప్రాకారగద్యము, బసవరగడ, గంగోత్పత్తిరగడ, శ్రీసద్గురురగడ. సంస్కృతాంధ్రకర్ణాట కవిత్వములు చెప్పినవాఁడు.

**పాలియోగ్రాఫీ** (Palaeography)--తపురానపు చేతివ్రాతల నెఱుంగఁదగిన వివరములు తెల్పు శాస్త్రము.

Papyrusపై వ్రాత, Vellimపై వ్రాత, కాగితముపై వ్రాత, తాళపత్రములపై వ్రాత, పట్టలపై వ్రాయఁబడిన వ్రాత, బట్టలపై వ్రాయఁబడిన వ్రాత మొదలగున వన్నియు చర్చింపఁబడినవి.

**పాలెయో లితిక్సు** (Palaeolithics) గడచిన కాలముల హద్దులను వివరించుశాస్త్రము. దీని కాంగ్లమున Pre - historic stone age అనెదరు. అప్పటికి లోహముల వాడుక గూడ నెఱుఁగకుండి రఁట. ఇది అనఁగా Palaeolithic కాలము ఎన్మిదిగ Sir John Lubbock (Lord Avebury) పరిశీలకుఁడు విభజించియున్నాఁడు. ౧ Lower age అనియు, ౨ Chellean age అనియు, 3 Acheculian age అనియు, ౪ Mousterian age అనియు, ౫ Upper age అనియు, ౬ Aurignacian age అనియు,

౭ Solutrian age అనియు, ౮ Magdalenian age అనియు ఎన్మిది భాగములు.

**పాలోహగోత్రము**-కుండినగణము చూ.

**పావనీనది** — కురుక్షేత్రమున ఘగ్గార్ అనిపేరుగల నది యొకటి కలదు. దాని తొల్లింటిపేరు పావని యని కొందఱును, ఈ ఘగ్గారు నది సరస్వతీనదిలో సంగమ మెనపిదప కలిసిన యుదకప్రవాహమునకు పావనీనది యని కొందరును బోల్చుచున్నారు. పావనీప్రశంస రామాయణమున ఆది. ౪౩ అధ్యా. కలదు. ఇది గంగానదియొక్క తూర్పుశాఖ యనిచెప్పఁబడినది.

భరతుఁడు గంగాసంగమమున సరస్వతీనది దాఁటెనని చెప్పఁబడినది కాని, గంగతో నీనదికేసంబంధమును గానరాకున్నది కాని స్థానేశ్వరమున కుత్తరముగా సరస్వతీనదియందు గంగాతీర్థమని ప్రసిద్ధతీర్థము కలదు. సరస్వతీ ఘగ్గారు నదులు హ్లాదినీనదికి తూర్పుగా నున్నవి. హ్లాదినీనది గంగయొక్క మూఁడు ప్రాక్శాఖలలో నొకటిగ రామాయణమున అయోధ్యాకాండ. ౭౧ అధ్యాయమునను, ఆది ౪౩ అధ్యాయమునను జెప్పఁబడినది.

ఘగ్గారునది అంబాలాజిల్లాయం దున్నది. ఇంకను సంతాల్పరగణా (బంగాళము) లోని వైద్యనాథధామముకడ నొకనదిని పావనియనుచున్నారు. దీనిప్రశంస బృహచ్ఛివ పురాణమున ౨ అధ్యా. ౩ యందుఁ గాననగును.

**పావాపురము**—(అపాపపురి చూ.)

**పావామయగోత్రము** — (సిధ్రువ గణము చూ.)

**పావుజేరు (పావుదారు)** — ఆంగ. Camels' gall. ఇది ఒంటెచేఁతికట్టు. క్రాఁక చేసి ఇంచుక పైత్యము గల్గించును. సర్వవాతములు, సన్నిపాతములు, వాతసంబంధమగు సకలదోషములు నివారించి సర్వాంగములకు వేఁడి గల్గించునని చెప్పఁబడినది.

**పావురములు ఇల్లుచేరు లక్షణము**- పావురములు పలువిధము లుండును. అందొక విధమగునది ఇల్లుచేరు పావుర మనఁబడును. (Homer లేక Homing Pigeon). ఈ పావురముల నాదికాలమునుండియు వార్తలు గొనితెచ్చుట కుపయోగించుట సుప్రసిద్ధము. ముఖ్యముగ యుద్ధకాలముల నీజాతి పావురములను వార్తాహరులుగ నుపయోగింతురు.

ఈజాతిపావురము లిల్లు సేరుటకుగల శక్తిని (ఒక్కండు) పెక్కువిధములుగఁ దలంతురు. అందు ముఖ్యములు నాలుగు. ౧ దానిజాతిస్వభావము, ౨ దృష్టిబలము, ౩ ఆనవాళ్ళ జ్ఞాపకశక్తి, ౪ మేగ్నటిక్ ఇన్ఫ్లూయన్సు (Magnetic influence) అనునవి.

ఇందు మొదటిదానికి ఎవ్వరు చెప్పనది యేమియు లేదు. కొంతదూరమునకు గొనిపోయి వదలినచో పావురము వంకరలు లేని తిన్నని మార్గమున ఆకాశమున (In a dirrect line in the open sky) ఎగురక, కొన్ని వంకరలుగ గూడ నేగుచుంట కనిపెట్టఁబడియుంట, రెండవదియగు దృష్టిబలమును సరియగుకారణముకాదని తోఁచెడిని. మూఁడవది యగు ఆనవాళ్ళ జ్ఞాపకమును సరియగు కారణముగఁ జెప్పవీలు లేదు. ఏలయన ఒకపావురమును బుట్టయందుంచి మూసి దూరముగ గొంపోయి వదలిన నిలుచేరునప్పుడే యానవాళ్లుండును. ఆనవాళ్ళసలే యుండకున్నను ఇల్లుచేరుటవలన నిదికారణమై యుండఁజాలదు. నాల్గవదియగు మేగ్నటిక్ ఇన్ఫ్లూయన్సు అనునది మొదటికారణమువంటిదే గాన, నెవ్వరును కాదనఁ జాలరు. గాన దాని జాతిస్వభావలక్షణ మనియో మేగ్నటిక్ ఇన్ఫ్లూయన్సో యని సంశయింప వలసియుండును.

**పావులూరి మల్లన కవి**— ఆంధ్రకవు లందు పూర్వకవులలో నొక్కఁడుగ పేర్కొనఁ బడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. గార్గ్యసగోత్రుఁడు. తండ్రిపేరు శివ్వన్న. ఈతఁడు గోదావరీ మండలములోని పావులూరునకు కరణమై యుండెనఁట. దీనిని కమ్మనాటిసీమ యని వాడుటయుఁ గలదు.

రచించినది మహావీరాచార్య కృతమైన (సంస్కృత) గణితసారసంగ్రహమున కాంధ్ర భాషాంతరీకరణ మగు గణితశాస్త్ర మనంబడు పద్యకావ్యము. ఈతఁడు వేఁగిదేశపు ప్రభుఁడగు రాజరాజనరేంద్రుఁడు తనకు నవఖండవాడ యను నగ్రహార మిచ్చినట్లు తనగ్రంథ మందుఁ జెప్పుకొనియుంట నన్నయభట్టుతో సమకాలికుఁడని . శ్రీ. రా. బ. కందుకూరి వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడి యున్నారు.

**పాశద్వాదశి**-(పరశురామద్వాదశి చూ.)

**పాశములు౫ (పంచపాశములు)**— ౧ ఆణవ (మలము.(మలపాశము),౨మాయీయ(మల) ము (మాయాపాశము), ౩ కార్మిక (మల)ము. (కర్మ పాశము), ౪ బైందవము (మాయార్థ మఖిలం జగత్), ౫ రోధశ (తిరోధానశక్తి).

అష్టపాశములు:- ౧ పశుపాశము, ౨ భవ పాశము, ౩ బంధపాశము, ౪ మోహపాశము, ౫ ఆశాపాశము, ౬ కర్మపాశము, ౭ దుఃఖ పాశము, ౮ క్లేశపాశము.

**పాశినీముద్ర**— యోగాభ్యాసవిధాన మునఁ జెప్పఁబడిన వింశతిముద్రలలో నొకటి.

రెండు కాళ్ళను మెడ వెనుకభాగమునకు ఎత్తి లంకె (పాదములచే) దగిల్చి కూర్చుండుట పాశినీముద్ర యనియు, దీనియభ్యాసము వలన కూడలినీప్రబోధమును, శరీరబలమును గలుగుననియుఁ జెప్పఁబడినది.

**పాశుపతమతము** — ఇది అతిమార్గిక మతములలో నొకటి. అతిమార్గికములు:— ౧ పాశుపతము, ౨ మహావ్రతము, ౩ కాపాలము నను త్రిమతములుగనున్నవి. ఈమూఁడుమతము లందు ఋగ్యజుస్సామాథర్వణాత్మక వేదము పాటింపఁ బడక ఆగమములను ప్రమాణమగు మతగ్రంథముగఁ గైకొనఁబడినది.

ఈమతము మాయాతత్వస్థరుద్రప్రోక్త మని చెప్పఁబడినది. నకులీశుఁడు ప్రవర్తకుఁడు. ఈ మతసిద్ధాంతమున ప్రాణు లనేకము లనియు, అవి యొకటితో నొకటి కలియక ప్రత్యేకముగ నుండునవి యనియు, (అనఁగా జ్ఞానమునందు, లేక చైతన్యమునందు నొకప్రాణి వేఱొక్క ప్రాణితోఁ గలియకుండు నని భావము.) శరీర మంతటను వ్యాపించి యుండునవి, నిత్యములు (అనఁగా నాశరహితములు)నని నిర్వచింపఁ బడినది.

ఈ పాశుపతమతసిద్ధాంతమున ప్రాణులకు ఆణవమలము చెప్పఁబడ లేదు. మాయామల ముచే కర్మపాశబద్ధము లనియు, సంసారసంబంధ సుఖ దుఃఖముల ననుభవించు చుండునవి యనియుఁ జెప్పఁబడినవి. కార్మికమలము ప్రాణి కుండుటచే నది కర్మ (చేయుపనులు) సంబంధముగ నిర్వచింపఁబడినది. సంసారసుఖదుఃఖాను భవమునకు ప్రాణి కీరెండుమలములే కారణమని చెప్పఁబడినది. వైరాగ్య ముదయించుతఱి నీ మతవిధానదీక్ష నందుటకు విధి కలదు. అట్టి మతదీక్ష నందినజీవులకు పరమేశ్వరసంబంధము లగు జ్ఞానగుణములు సిద్ధించు ననియు,విరాగము ప్రథమ సోపానమువంటి దనియుఁ జెప్పఁబడినది. పుత్రులందు కుటుంబభారమును వదలి, తండ్రి సన్యసించునట్లు, అనఁగా తండ్రి సంసార

బాధ్యతలనుండి విశ్రాంతి గొనునట్లు, వైరాగ్య వంతుఁడగు ప్రాణియందు తనజ్ఞానము సిద్ధింపఁ జేసి, యీశ్వరుఁడు తాను విరమించు ననియు, (అనఁగా పరమేశ్వజ్ఞానము వైరాగ్యమువలన సిద్ధించు ననియుఁ) జెప్పఁబడినది.

"పశు"వన ప్రాణమునకర్థము. "పతి"యన నధినాథుఁడగు పరమేశ్వరుఁడు గాన పాశుపత మతము పశుపతిసంబంధ ప్రతిపాద్యమాన మతము.

పాశుపతమతగ్రంథములు-పాశుపత సూత్రి మును, గణకారికయును ముఖ్యగ్రంథములు. ఈమతమునం దెన్మిదివృత్తములు చెప్పఁబడినవి.

౧ లాభము-చేయఁదగిన ఉపాయఫల మని భావము. ౧ జ్ఞానము, ౨ తపస్సు, 3 దేవని త్యత్వము, ౪ స్థితి, ౫ శుద్ధి.

౨ మలము-మల మన దోషమని యర్థము. తన్నుఆక్రమించియున్న పంచదుష్టస్వభావములు మల మనంబడును. ౧ మిథ్యాజ్ఞానము, ౨ అధర్మము, 3 సక్తిహేతువు, (ఒక విషయమున మనసు దగిలియుండుట), ౪ చ్యుతి(విడచుట), ౫ పశుత్వమూలము.

3 ఉపాయము-సాధనకుఁ బరిశుద్ధి గల్పించు మార్గము. ౧ దానచర్య, ౨ తపస్సు, 3 ధ్యాన నిష్ఠ, ౪ సదా రుద్రస్మృతి, ౫ లాభము లందలి ప్రతిపత్తి.

౪ దేశము-అర్థానుసంధానపూర్వక జ్ఞాన తపోవృద్ధి నొసంగునది.

౫ అవస్థ-లాభము సిద్ధించుదనుక ఒకదాని యందు స్థిరముగ నుండుట.

౬ విశుద్ధి - మిథ్యాజ్ఞానము నశించుట. ౧ పశు, ౨ పతి, 3 పాశము, ౪ బద్ధజీవనము, ౫ ముక్తజీవనము నని యైదువిధములు.

౭ దీక్ష-ఇది ౧ గురుఁడు, ౨ నియమము, 3 మంత్రము, ౪ జపము, ౫ తీర్థప్రసాదములు నని యైదు తెఱఁగులు.

౮ బలము-ఇది ౧ మనోబలము, ౨ వాగ్బలము, 3 కాయబలము, ౪ కర్మబలము, ౫ తపోబలము నని యైదువిధములు.

ఈ పాశుపతధర్మమునందుఆత్మ, పరమాత్మ, జగత్తు అను త్రిపదార్థములును సత్యము లేయని చెప్పఁబడినవి. తక్కినధర్మములు పాశుపతమహావ్రత, కాపాలమతములకు సమానముగఁ జెప్పఁబడినవి.

పాశుపత మతమునందు మాయాతత్త్వము ప్రధానతత్త్వమని చెప్పఁబడినది. ఈ పాశుపత సూత్రములకు కౌండిన్యుఁడు భాష్యపంక్తి వ్రాసి యున్నాఁడు. ఈగ్రంథము "రోయల్ ఏష్యాటిక్కు సొసైటీ ఆఫ్ బెంగాలు"యొక్క పుస్తక భాండాగారమునందు కలదు.

కాకతీయచక్రవర్తి గణపతిదేవమహారాజీమతస్థుఁడు. వీరిగురువును, ప్రధాన మంత్రియు నగు శివదేవయ్యగారు గోళకీమఠాధిపతి కాన నక్కాలపువారు "గోళకీపాశుపతశైవ" మనివాడుచుండిరి. కాని నిజముగ గోళకీమఠము పాశుపతశైవమునకుఁ జెందిన యొకమఠమే కాని భేదమతముగా నేరదు. డాహలమండలములోని (తొల్లింటిత్రిపురరాజ్యము) గోళకీగిరిపై నున్నది గాన గోళకీమఠ మనంబడెను. త్రిపుర ఇప్పుడు తేవార్ అనంబడుచున్నది. ఈమఠాధిపతులలో మన శివదేవయ్యగారు పదియవవారు. వీరినిజ నామము విశ్వేశ్వరశివదేశికుఁడు.

౧ సద్భావశంభుదేశికుఁడు, ౨సోమశంభువు, 3 వామశంభువు, ౪ (పేరు తెలియదు), ౫ (పేరు తెలియదు), ౬ శక్తిశంభువు, ౭ కీర్తి శంభువు, ౮ విమలశివుఁడు, ౯ ధర్మశివుఁడు, ౧౦ విశ్వేశ్వరశివుఁడు. ఇందుఁగవగురువుత్రిపుర పురము (తేవార్)రాజధానిగ త్రిపుర(డాహల మండల) దేశ మేలిన ఒకటవ యువరాజ దేవ మహారాజునకు సమకాలికుఁడు. ౨వ గురుండు

సోమశంభువు. ఈమతమందు సోమశంభు పద్ధతి నేర్పఱచినవాఁడు. క్రీ. శ.౧౦౭౩ ప్రాంతమువాఁ వాఁడఁట. ౮వ గురుఁడు విమలశివుఁడు. కేరళ దేశీయుఁడందురు. ౧౦వ గురువు విశ్వేశ్వర శివ దేశికుఁడు. త్రిలింగ కాకతీయచక్రవర్తి (గణపతి దేవునకు) గురుండయ్యు ప్రధానమంత్రిగఁగూడ నుండినవాఁడు.

ఆమర్దక మఠాధిపతిగ నుండిన దూర్వాస గురుండుగొప్ప పండితుఁడు,కవియు నై పాశుపత మతగ్రంథములను పెక్కు రచించినవాఁడు. అతఁడే మతప్రతిష్ఠాపకుఁ డనఁబరఁగెను. పరా శక్తిమహిమ్నమును(బ్రహ్మసూత్ర) దూర్వాస, భాష్యమును రచించినవాఁడు. ఈ మతమున కింకను కాలాముఖశైవ మనియు, నకులీశశైవ మనియుఁగూడ పేర్లు కలవు. పెక్కండ్రు విద్వాం సులు నకులీశుఁడును శివభక్తుఁడే యగుట యో గాచార్యులలో కడపటివాఁడుగఁ జెప్పంబడిన లకులీశుఁడు నొకఁడే యని పొరబడుచుంట గాన నగును. కాని యిర్వురును భేదవ్యక్తులు.

**పాశ్చాత్యదేశములందు చెట్లపేర్లు లాటిన్భాషయం దుండుట**— ఇక్కాల మున లాటిన్భాష మాట్లాడు దేశము లేదు గాన, దానిని మృతభాష యనెదరు. కాని, ఆంగ్ల భాషయం దధికసంఖ్యాకపదము లీ లాటిన్ నుండి వచ్చిన వికృతములు, తద్భవములు, తత్సమములు నైయుండును. తొల్లి యొకప్పుడా లాటిన్భాష ముఖ్యమై, విద్వాంసులు వాడు కొను భాషగా నుండుతఱి, రాసాయనిక పదార్థములు తరుగుల్మలతాదులు మొదలగు వాటిపేర్లా భాషనే విద్వాంసులు వ్రాయు చుండిరఁట. ఉపన్యాసము లందే యుండుట గౌరవముగాఁ దలంపఁబడుచుండెనఁట. కొన్ని గ్రంథములుగూడ నాభాషయం దుంటఁ గాన నగును.

స్వీడను దేశస్థుఁడగు Linnaeus పండి తుఁడు తరుగుల్మలతాదులకు పేర్లను వ్రాసిన వాఁడు. ఆయన లాటిన్భాషయందే వ్రాసెను. నాఁడాదిగ నాభాషయం దుండుపద్ధతియే సాఁగు చున్నది.

**పాశ్చాత్య దేశములందలి తాపీ (బాండు)పని**—పాశ్చాత్యదేశములం దిటు కలుపొడవు తొమ్మిది, వెడల్పు నాల్గున్నర, దళ సరి రెండుమ్ముప్పాతిక అంగుళములని మనసునం దుంచుకొన వలయును. మందడు లొకటిపై నొకటి సరిగ నుండునటుల రాకుండ తాపీపని చేయుట కాంగ్లమున బాండు (Bond) అనియె దరు. ఇక్కాలమున పాశ్చాత్యసీమలం దెల్లెడ లను వాడుకయందున తాపీపని విధానములు ఇంగ్లీషుబాండుఫ్లెమిష్‌బాండు,అనంబడునవియె. ఇంగ్లీషు బాండునం దొకవరుసగ ఇటుకలు నిలువు వరుసలుగను (పొడవువరుస) పైనొక వరుస అడ్డమువరుసలుగను వేయుచు (గోళీ కాదని యెఱుంగునది) గోడలను నిర్మింతురు. నిలువువరు సల కాంగ్లమున Stretcher వరుస యనియు, అడ్డవరుసలకు Header వరుసలనియుఁ బేరులు. కాళీవచ్చినతావుల వేయఁబడు ఇటుకముక్కకు "Closer" అనియెదరు. ఫ్లెమిషు బాండుపని యందు వరుసదప్పి వరుస హెడ్డరుగను, వరుసఁ దప్పివరుస స్ట్రెచ్చరుగను ఉండెడిని. అది మిగుల కష్టమైనను గట్టిపనిగా తలంపఁ బడుచున్నది. ఇది ముఖ్యముగ లాదులందు వాడఁబడుచున్న విధానము.

# పాశ్చాత్యలిపుల పరంపర.



**పాషన్ ప్లే** (Passion play)— ఇది ఐరోపా ఖండమున "ఓబెరమ్మర్గౌ" అను గ్రామమున పది సంవత్సరముల కొకతరి గ్రామస్థు లందఱిచే నాడఁబడు నాటకము. ఏసుక్రీస్తు ప్రభుని జీవితము ప్రదర్శింపఁ బడుచుండును. ఇది క్రైస్తవమతభక్తి పునాది గాఁగల ప్రదర్శనము గాన క్రైస్తవమతస్థులగు విదేశస్థు లనేకులు వచ్చి చూచి పోవుచుందురు. గతనాటకప్రదర్శనము క్రీ. శ. ౧౯౩౦ సంవత్సరమున నడిచెను.

నాటకము చూచువారలకు ప్రదర్శనశాల యందు మొదటితరగతివారు ౨౩౦౨ గురును, రెండవతరగతివారు ౧౨౭౮ గురును, మూఁడవ తరగతివారు ౧౧౧౪ రునుకలిసి కూర్చుండుటకు వసతు లేర్పఱుపఁబడినవి. మొత్తమున రంగస్థలి యందు ౫౭౫౮ మందికి జాగా యేర్పాటు కలదు. అనఁగా తక్కిన ౫౬౫ మందియొక్క జాగా నాటకమును ప్రదర్శించువారికై విభజింపఁ బడినది. ఇందు మొదటి తరగతి టిక్కెట్టు పండ్రెండు మార్కులును, రెండవ తరగతిటిక్కెట్టు తొమ్మిదిమార్కులును, మూఁడవతరగతిటిక్కెట్టు ఆరు మార్కులును ఆదేశమునందలి ధనమున మూల్యము నిర్ణయింపఁ బడినది గాని అప్పటి యితరపరిస్థితుల మేరకు మార్పఁబడుచుండును.

ఈనాటకశాల ౧౯౦౦ సంవత్సరమున కట్టఁబడినది. పిదప ౧౯౨౮–౩౦ మధ్యకాలమున మార్పుల నంది మరమ్మతుచేయఁబడినది. కడు విశాలమై యుండెడిని. ఇందు స్తంభములు లేవు గాన చూడ నాటంకము లుండవు.

క్రీస్తుప్రభువు జరూసలము ప్రవేశించుట, పిలాతున్యాయాధిపతియెదుట నుండుట, మొదలగుదృశ్యము లందు ఆఱువందలవఱకు నటకులు (పాత్రములు) నాటకరంగమునఁ గన్పింతురు. నగటున నాటకప్రదర్శనము భక్తిమై వీరావేశమున ప్రదర్శింతు రనియు, కొన్ని పాత్రములు తమ వేషమున కవసర మగు గడ్డము తలయు, కొన్ని సంవత్సరములు ముందుగ పెంచుకొన నారంభింతు రనియు, నాటకప్రదర్శనము నిజనటనకు సమీపముగ నుండుననియు వాడుక నందియున్నది. టిక్కెట్లవల్ల గొప్ప రాబడి కలదఁట.

ఈ నాటకప్రదర్శన సంస్థనుగూర్చి ఓబెరమ్మెర్గౌ గ్రామస్థులు గర్వపడెదరు. ఇందుఁ గుదుర్పఁబడిన సంగీత మెక్కువ రుచికరముగ నుండెడిదందురు. ఆగ్రామపు జనాభా ౨౬౦౦ అనియు, అందు వేయిమంది యీప్రదర్శనమున పాల్గొను ముఖ్యపాత్రలగై కొనువా రనియుఁ దెలిసెడిని. ఇందుదృశ్యముల (Scenes) యేర్పాటును చక్కని జాణతనము జూపునని ప్రతీతి కలదు. తెరలు మంచిపనితనము గలవి. ప్రదర్శనమున మంచివిధానదీపమార్గమును విధించునానికి లోఁబడువిధియు బాగుగఁ గాననయ్యెడిని. దుస్తులును విలువగలవిగనె యున్నవి. ఒక మతగురుని దుస్తు నూఱుపౌను లుండు నఁట. ౧౯౩౦ సంవత్సరమున తిరిగి దుస్తులు మఱికొన్ని చేర్పఁబడినవఁట. గ్రామస్థుల యభిమాన బాధ్యతలపై నాధారపడియున్న సంస్థ. నాటకము లేనితరి మ్యూజియముగా నీశాల యుండెడిని.

**పాషా**— టర్కీదేశపు బిరుదము. గొప్ప గొప్పవారి కొసంగఁ బడునది. ఈజిప్టు దేశమునఁ గూడ ప్రచారమునఁ గలదు.

**పాషాగిరి గోత్రము**— (ఉపమన్యు గణము చూడుఁడు.)

**పాషాణచతుర్దశి**—కార్తికశుద్ధ చతుర్దశి. దీనిని "వైకుంఠ చతుర్దశి" యని వైష్ణవుల నెదరు. మహారాష్ట్ర దేశమున కదళీవ్రతము లాచరించు వ్రతదినముగ నున్నది. (పండుగలుచూ.)

**పాషాణ పర్వతము**— దీని నిప్పుడు "పిషాన్" అనియు, "అమాన్" అనియు నను చున్నారు. (అపగ దేశము చూడుడు.)

**పాషాణము**—ఆంగ్ల White oxide of Arsenic.

ఇది విషములలో నొకటి. పాషాణములు నవవిధము లందురు.

పాషాణమును శాస్త్రోక్తముగ శుద్ధిజేసి భస్మ మొనర్చియు, సింధూరమొనర్చియు, లేక కట్టుగ నొనర్చియు వాడుదురు. చాల జాగ్రతగ వాడఁదగినది. అనేకరోగములనివారించి బలము, దేహపుష్టి, వీర్యవృద్ధి నొసంగు నని చెప్పఁ బడినది. ఇంచుక మత్తుగూడఁ గలుగఁజేయును. పాషాణము పైనవేసిన పొక్కును. వ్రణములపై మితముగ వేయవలెనుగాని నధిక మైన దానిని దినివేసి శుభ్రపఱచుటకుఁ దోడు పెద్దపుండుగఁ గూడఁ జేయును. నూనెలోఁ గల్పి తగు రీతిని పైన పూసిన గడ్డలు, *కురుపులు, వ్రణములు హరించును. పక్వమైనవాటిని బగులఁ జేయును. చక్కఁగ శుద్దిచేయఁబడినపాషాణము కుష్ఠము, జలోదరము, మూర్ఛరోగము, వెఱ్ఱికుక్క విష సంబంధమగు జన్నిరోగము, వాత, దారుణ వాత, మేహవాత, రుధిరవాతములు, వ్రణ ములు, పుట్టవ్రణములు, కళ్ళువ్రణములు, ఆహికజ్వరములు, చలిజ్వరములు, విడువనిజ్వర ములు, శీతపైత్యజ్వరములు, శ్లీపద(బోదకాలు రోగము) జ్వరములు, సన్నిపాత జ్వరములు త్తి యగునందురు.

ఁడిపత్తియాకు, కాయ, పువ్వులరసమును, నీలివేరు, మిరియాలపొడుముల కషాయమును, నేరెడుచిగుళ్లను, కాకరాకుపసరును, వెలగపండ్ల గుజురును, తమ్మలపాకుతీఁగ, మిరియములకషా యమును, సబ్బునీళ్ళను, సున్నముపై తేరిన నీళ్ళను, నేరెడువిత్తుల చూర్ణమును పాషాణ దోషమును పరిహరించు విరుగుడు లని చెప్పఁ బడినది. ఇంకను వమనముద్వారా గాని, విరేచ నముగుండా గాని, పాషాణమును వెడలింపఁదగు ననియు, శరీరము దీనిదోషమున నుబ్బు జూపిన పనసచెక్కకషాయము లోని కిచ్చిన విరుగు ననియు, క్షయదగ్గులపై పాషాణము వాడఁజన దనియు, వాడిన ప్రాణాపాయముఁ దెచ్చు ననియుఁ జెప్పఁబడినది.

పాషాణవైద్యము సగటున శరీరముల పాడు చేసి, దుర్గుణములుగల్గించి,నీరసస్థితికి ననారోగ్య స్థితికిఁ దెచ్చును గాన, పాషాణవైద్యుల నాయు ర్వేద వైద్యవిశారదులు హేళనగాఁజూచి పరిహ సించుచుందురు. ఉత్కలులందు పాషాణవైద్యులు గానఁబడుచున్నారు. ఆంధ్రులందును గలరు.

**పాసిఫిజమ్** (Pacifism)— ప్రచండ సైన్యములును,యుద్ధములును మాని ప్రభుత్వము లన్నిటియొక్కయు ప్రాతినిధ్యముగల International) నానారాజ్య సంఘముద్వారా తగవులను పరిష్కరించుకొనుట మేలని చెప్పు సిద్ధాంతము.

**పాహాంగ్ స్టేటు**—ఇది ఫెడరేటెడ్ మలే స్టేట్సులో నొకటి. (మలెయా దేశము చూ.)

**పాహ్లవ దేశము, పారశక దేశము, పారశీకదేశము, ఇరాన్‌దేశము**— ఇప్పటి పారశీకుల పూర్వులు రాక్షసపక్షావలంబులగు ఆర్యులు. వారు దేవతాపక్షావలంబులగు ఆర్యు లతో కలహించు చుండిరి. దేవాసురయుద్ధము లకుఁ బిదప, వారు వేరై, యప్పటి హరబరేజా (మేరువు) పర్వతప్రాంతమునుండి బయలుదేరి పారశీపోలిసుకడకుం జేరి, యటనుండి పారశీకు లనంబడిరి. ఆర్యశబ్దము "ఇరాన్"గా మారె నఁట. వారి నివాసమై, తొల్లింట "పాహ్లవ" యనఁబరఁగిన దేశము పారశీకము లేక "ఇరాన్" ఆయె నఁట. వారు నిర్మించుకొనిన రాజధానికి

"తా ఇరాన్"అనిపేరు. అది యిప్పు డాంగ్లులచే "పెహిరన్" యనం బరఁగు చున్నది. తొల్లింట "పాహ్లావి" యనంబడిన భాష రెండు భాషగ పేరందెనఁట. వేద శబ్దము "అవెస్తా" యాయె నఁట. ఋగ్వేదమున వాడఁబడిన "పృథు"శబ్దము "పాహ్లావి" యాయె నందురు. మహాభారతము, సభాపర్వము ३౨ అధ్యాయమున పాహ్లావదేశపు ఉత్తమాశ్వములంగూర్చి ప్రశంస కలదు. మత్స్య పురాణము ౧౨౧ అధ్యాయమున పాహ్లావ దేశప్రశంస కలదు. బ్రహ్మాండపురాణము ౫౧ అధ్యాయమున రట యందు పాహ్నావ యని పేరున్నది.

**పాళీభాష**— ఇది ప్రాకృతతుల్య మగు సంస్కృతజన్యము. పురాతనపుభాష. బౌద్ధులు పవిత్రవంతముగ నెంచిరి. బౌద్ధగ్రంథములీభాష యందుఁగలవు. లిపియు సంస్కృతలిపిజన్యమే.

**పి(P)అక్షరమునకుం జెందినక్రైస్తవపురుషనామములు**-Paget, Pakenham, Palmer, Parke, Parker నవీన కల్పితనామములు.

Pascoe హిబ్రూపదము Easter child అని యర్థము.

Pasha నవీనపదము. ఇది టర్కీమాట. Patrick, Patricius లాటిన్పదము Nobleman అని యర్థము. ఐర్లాండు దేశరక్షకుఁడగు ఋషి యనఁదగిన "St. Patrick" మహాత్మునిపేరు. దీనినుండి కల్గిన ముద్దుపేర్లు Pat, Paddy అనునవి.

Paul, Paulet, Paulus, Paulivus, Pawel లాటినుపదములు.little అనియర్థము. St. Paul బోధకుని పేరు.

Payne లాటిన్పదము. Country man అని యర్థము.

Peile, Pelham, Penrose నవీన కల్పిత పదము.

Penticost, Penticoste గ్రీకుపదము. "white sun side" అని యర్థము.

Percival, Percyvall సెల్టిక్కుపదము. "Champion of the Chalice' అని యర్థము. దీనిముద్దుపేరు Percy.

Peregrine లాటిన్పదము. Traveller అనియర్థము.

Perrin Pering జర్మనుపదము. రాయి (శిల) యనియర్థము.

Peter గ్రీకుపదము. Rock అని యర్థము. St. Peter బోధకునిపేరు. Peter the great అను రష్యాచక్రవర్తి కీపేరుండెను.

Phelim ఐరిషుపదము. మంచి యని యర్థము.

Philander గ్రీకుపదము. Lover of fellow men అనియర్థము.

Philemon గ్రీకుపదము. Loving and thoughtful.

Philip, Philp. Fylip గ్రీకుపదములు. lover of horses అని యర్థము. పెక్కండ్రు రాజుల కీపేరుండెను. దీనికిఁగల్గిన ముద్దుపేర్లు Phill or Phil, Pip. ఫ్రాన్సు, స్పెయిన్ దేశపురాజుల కీపేరు తఱచుగ పెట్టబడునది.

Phineas Phinehas హిబ్రూపదము. Oracle లేక Aspect అనియర్థము.

Pierce Piers Pierre గ్రీకుపదము. same as Peter. "Rock" అనియర్థము.

Pilgrim లాటినుపదము. Traveller అని యర్థము.

Pius లాటిన్పదము. రోమ్నందుగురు పోపు గురుస్వాముల కీపే రుండెను.

Plantagenet లాటిన్పదము. Spring of broom అనియర్థము.

Pollock నవీనకల్పితపదము.

Polycarp గ్రీకుపదము. Fruitful అని యర్థము. St. Polycarp ఋషిపేరు.

Pompey Pompeius లాటిన్పేరు.

Ponce Pontius లాటిన్ పదములు. ఐదవసంతాన మని యర్థము.

Ponsonby (ఉచ్చారణ Punsunby అని) నవీనకల్పితపదము.

Popham నవీనకల్పితపదము.

Porcius లాటిన్పదము. Pigs అనియర్థము

Power, Prince, Pritchard నవీన పదములు.

Ptolemy గ్రీకుపదము. Mighty warrior ఈజిప్టురాజుల కీపేరుండెను.

Purcell, Purvis నవీనకల్పితపదములు.

Purvan రష్యనుపదము. మొదటి అని యర్థము.

**పి (P) అక్షరముకుంజెందినక్రైస్తవ స్త్రీల నామములు**—Palma లాటిన్పదము. తాటిచెట్టని యర్థము.

Pamela నవీనాంగ్ల కల్పితపదము

Patience లాటిన్పదము-ఓర్పని యర్థము.

Patrica Patrice లాటిన్పదము. గొప్ప యని యర్థము. Patrick యొక్క స్త్రీవాచక పదము.

Paula, Paule, Paulina, Paulette, Pauline లాటిన్పదములు. చిన్నదియని యర్థము. Paulయొక్క-స్త్రీవాచకరూపపదము.

Peace నవీనకల్పితపదము. అర్థముస్పష్టమె (శాన్తి యని).

Pearl, Pearline నవీన కల్పితపదము. ముత్యమని యర్థము.

Penelope గ్రీకుపదము. నేతపనికత్తె యని యర్థము.

Perceval సెల్టిక్కుపదము. Percival యొక్క స్త్రీవాచకపదరూపము.

Perdita లాటిన్పదము. పోఁగొట్టుకొనఁబడిన యని యర్థము.

Perpetua లాటిన్పదము. సహించు భరించు,ఓర్పు అని యర్థము.

Perrine, Petrica Petrine, Petronella ట్యూటోనిక్కు పదములు. శిల కర్థమిచ్చునవి.

Persis లాటిన్పదము. Persius యొక్క స్త్రీవాచకపదము.

Philadelphia గ్రీకుపదము. ఇతరుల ప్రేమిఁచెడి యని యర్థము. అమెరికాయందు, యునైటెడ్ స్టేట్సులో గ్రీకు క్వేకరుస్గూడి తొలుత నీపేరున పురనిర్మాణమునకుఁ గడంగిరి. వారి ముఖ్యవిధాన మన్యోన్యప్రేమయె. నేఁటికి నాపేరఁ బరఁగుచునే యున్నది. దీనంగల్గిన ముద్దు పేరు Delphy.

Philine గ్రీకుపదము. అనురాగ మని యర్థము.

Philippa, Philippe, Philippine గ్రీకుపదము. గుఱ్ఱములయందనురాగముగలవాఁడని యర్థమిచ్చు Philipps యొక్క స్త్రీవాచకపదము. ఇది అంగ్లభూపతి మూఁడవఎడ్వర్డు యొక్క-రాణి యగు ఫిలిప్పారాజ్ఞి పేరుగ ప్రచారమందిన దఁట.

Phoebe, Phebe గ్రీకుపదములు. జన్మము యొక్క వెలుతు రని యర్థము.

Phrynia దీనింగూర్చి యేమియుఁ దెలియదు.

Phyllis, Phillis గ్రీకుపదము. పచ్చని కొమ్మ యని యర్థము.

Piety లాటిన్పదము. సచ్చరిత్ర,కనికరము, లేక దయామయహృదయము సనియర్థము.

Polly హీబ్రూపదము. మహాన్నత్యమని యర్థము,

Polonia గ్రీకుపదము. గ్రీసు దేశమున సూర్యాధి దేవతకు "అప్పోలో,, అని పేరు. సూర్యసంబంధురా లనియర్థము.

Polyxena గ్రీకుపదము. అతిథిసత్కార మని యర్థము.

Portia, Porcia లాటిన్పదము. Por అనిన వరాహ మని యర్థము.

Priscilla లాటిన్పదము. కొంచెము పెద్ద యని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరులు Scilla, Pris.

Prittie నవీనకల్పితము. Pretty అని యర్థమందురు.

Prudence, Prudella ఆంగ్లోశాక్సను పదము. ఆర్జితము అనియర్థము. దీనఁగల్గిన ముద్దుపేరులు Prue, Prudy.

Psyche గ్రీకుపదము. ప్రాణి యని యర్థము. ఇదియొక అధిదేవతపేరు. ఆమె Cupid (మన్మథుని) భార్య (రతీదేవి).

**పింక్ ఐ** (Pink eye)—ఇది పాశ్చాత్య వైద్యవిధానమున గుఱ్ఱములకుఁ గల్గు ఇన్ఫ్లూఇంజా జ్వరమునకుఁ బేరు.

**పింగగోత్రము**-(హారితఉపగణము చూ.)

**పింగళాజపము**—(త్రికరణశుద్ధి చూ.)

**పింగళానాడి** (అష్టాంగయోగములు చూడుఁడు.)

**పింగళి ఎల్లన కవి**— ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. శైవదీక్ష నందినవాఁడు. భారద్వాజసగోత్రము. తండ్రిపేరు నాగరాజు. గుంటూరిమండలములోని కొండవీటిసీమ కాపుర మని తెలుచున్నది.

ఈతఁడు బహుశః కొండవీటిరెడ్లసంబంధుఁడగు రాయపరెడ్డి కాశ్రయుఁడై యుండి యాతనిమెప్పించుటకో లేక యాతని ప్రోత్సాహముననో సర్వేశ్వరమాహాత్మ్య మను "తోభ్య చరిత్ర"మును(క్రైస్తవమతగ్రంథమును) పద్య కావ్యముగ రచించెను. దీనింబట్టి యారాయప రెడ్డిగారు క్రైస్తవమతస్వీకార మొనర్చినవాఁడేమో యనితోఁచెడిని. ఈతోభ్యచరిత్ర మది వఱకు వచనకావ్యముగ నున్న దానినే పద్యములుగ రచించియుండనోపు ననియు, నిది వేదాంత సారమునకన్న (మంగళగిరి ఆనందకవి చూ.) మున్నె రచింపఁబడి యుండు ననియు, రా. బ. కందుకూరి వీరేశలింగంపంతులుగారు తలంచిరి.

**పింగళివారి పేకి**--ఎంత చెప్పినను వినక, ఎంత యిచ్చినను వదలక, ఎంత పొమ్మనినను పోక వెంటాడించు మొండివారిని పింగళివారి పేకివలె వదలనిదిగా సామెతవలె ననుచుందురు. ఈ"పింగళివారిపేకి" యనుట కొక పూర్వపు గాథ కలదు. ఇది యెంతవఱకు నిజమైనను, ఎంతవఱకబద్ధమైనను చిరకాలమునుండి యాంధ్ర దేశమున ప్రచారమునంది వాడుకయందుంట అంద ఱెఱింగినదే.

ఎఱింగి యున్నంతవఱకు పింగళికుటుంబమునకు మూలపురుషుఁడు గోకమంత్రి(లేక గోకర్ణరాజు) గొప్పతపస్వియు, మంత్రవేత్తయునై యుండె నఁట. ఆయన యోగసాధనము

లొనర్చిన పూర్ణుఁడఁట. ఆయనకు స్వాధీనమై యొక పిశాచమో యక్షిణి (యక్షస్త్రీ)యో యొకటి పరిచారికగ నుండెడి దఁట. దాని కెల్లప్పుడు నేదేని యొకపని జెప్పి చేయించు చుండ వలయు నేగాని తీరుబాటుగ(పనిలేకుండ) నుంచిన నపాయకరమగు పనులుకూడఁ జేయు చుండు లక్షణవతి గాన, దాని కాయన కుటుంబమువారు కొంత వఱకు వెఱపొంది జాగ్రత్తం గొనుచునే యుందు రఁట. పేకి తనకుఁ జెప్పఁబడినపనులలో నింటిపనులే గాక దూలములు, దుంగలు, రోళ్ళు, రాళ్లు మొద లగు కడుభారమగువాటినిగూడ పాటింప కవలీల మోసికొని పోఁ గల్గినది గాన, నెట్టికష్టమైన పనులున్నను సరకుఁ గొనక, "పనిచెప్పుఁడు, పనిచెప్పు" డని వేధించుచుండిన దఁట.

వారియింట నున్నవారిలో నొక రొకతఱి దూరాలోచన యొనర్చి నొక్కులునొక్కులు వోయి ఉంగరములవలె చుట్టుకొను(తుప్పతల) తలవెండ్రుక నిచ్చి దీనిని తిన్నఁగ సాఁగఁదీసి వంకరలు తీర్పుమని పని నియోగింప, నాపేకి ఎంత జాగ్రత్తగ సాఁగఁదీసియు, లాగియు, తిన్నఁ జేయఁ బ్రయత్నించినను నదికుమరక తిరుగ తిరుగ వంకరలు చుట్టుకొని ముడుచుకొనిపోవు చుంట విసిగి, చెప్పక పలాయన మయ్యె నఁట. వారును అది పోయినందుకు సంతసించి రఁట. నాఁడాదిగ "పింగళివారి పేకి" యని వదలని మొండితనమునకును, మహాభూతమున కొక వెండ్రుకముక్క యనుమాట సులభోపాయము నకును సామెతలై యున్నవి.

**పింగళి సూరనకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రము. గౌతమసగోత్రము. తండ్రిపేరు అమరరాజు. తల్లిపేరుఅబ్బమ్మ. పితామహుఁడు సూరపరాజు. తమ్ములు అమరరాజు,ఎఱ్ఱంరాజు. ఈ పింగళివంశ మునకుగోకరాజు మూలపురుషుఁడుగాఁ జెప్పఁ బడినది.(పింగళివారి వంశవృక్షము, పింగళివారి పేకి చూ.) తొలుత కృష్ణాజిల్లావాఁ డనియు పిదప ఆకువీడు, నంద్యాల మొదలగు సంస్థాన ములకుఁ జేరినవాఁడనియు కీ. శే. రా.బ. కం. వీరేశలింగము పంతులువా రభిప్రాయపడియు న్నారు. క్రీ. వె. పదునాఱవ శతాబ్దమధ్యమునం దుండినవాఁడని తెలుచున్నది. క్రీ. వె. ౧౫౬౦ తరువాతకాలమువాఁడు.

రచించినవి:- కళాపూర్ణోదయము. (దీనిని ఆర్వీటి కృష్ణమరాజునకుఁ గృతి యిచ్చెను). రాఘవపాండవీయ మను ద్వ్యర్థికావ్యము.(దీనిని ఆకువీడు సంస్థానాధిపతియైన (కర్నూలు లేక కందనూరు మండలము)పెదవేంకటాద్రిప్రభున కంకిత మొనర్చెను. ఆకువీడు ఇప్పటి కోవెల కుంటకు పశ్చిమముగా పండ్రెండుమైళ్ళదూర మున నున్నది. అది తుంగభద్రానదీతీరము. అట విరూపాక్షేశ్వరశివలింగము కలదు. సూరన రచించినట్లుచెప్పఁబడిన గరుడపురాణ మిప్పుడు గానవచ్చుటలేదు. ప్రభావతీప్రద్యుమ్న మను ప్రబంధమునుగూడ నితఁడు రచించెను.

ఈ సూరకవి క్రీ. వె. ౧౫౬౦ ప్రాంతము వఱకు జీవించియుండినవాఁ డఁట. ఈతనిభార్య అల్లసాని పెద్దనామాత్యునిమనుమరా లఁట. పింగళి సూరన గిరిజాకల్యాణ మనుప్రబంధము సైతము రచించెనని చెప్పుదురు.

# పింగళి సూరన్నకవి వంశావళి.

ఆపస్తంబ సూత్రము - యజుశ్శాఖ - గౌతమసగోత్రము.

ఈతఁడు రచించినవి రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్నము.

వీరి మూలపురుషుఁడు గోకనామాత్యుఁ డనియు, పింగళివారి పేకికథ వారినాటిదే యనియుఁ జెప్పుదురు.

- గంగరాజు
  - సూరపరాజు
    - సూరన్న
      - అన్నయ
      - మారన
        - అమరన్న
          - సూరన్న (కళాపూర్ణోదయాది గ్రంథకర్త.)
          - అమరన్న
        - మల్లన
          - జగ్గన్న
          - తిమ్మన్న
          - సూరయ
          - చిన్నయ
          - తిమ్మయ
        - అక్కన్న
      - నల్లన
        - సూరన
      - లింగన
        - పుల్లన
          - అక్కయ మంత్రి
        - అక్కయమంత్రి
  - కుప్పన్న
    - మారన్న
      - బొనయ్య
      - భద్రయ్య
      - కుప్పన్న
        - ఎఱ్ఱయ్య
        - పాపయ్య
  - రామన్న
    - గంగరాజు
      - గాదన్న
        - పెద్దన్న

**పింగాక్షి గోత్రము**—(లౌగాక్షిగణము చూడుఁడు.)

**పింగాక్షి గోత్రము**— (నిధృవగణము చూడుఁడు.)

**పింగాణీ (చైనా)పై నగపడు బ్రౌను రంగు మరకలు**- పింగాణీ సామానున కాంగ్లమున చైనాసామా నని వాడుచుందురు. ఇది నిజముగ కుండసామానే గాని గాజుతో చేయఁబడినపనికాదు. అదిని చీనాదేశమునుండి ఇతర దేశముల కంపఁబడిన కతన దానికి "చైనా సామా" ననిఆంగ్లసీమలందువాడఁబోడంగిరఁట. పిదప దానికి వలయునట్టి చైనా క్లే (China Clay) యనంబడు మన్ను చాల దేశములం దున్నట్లు కన్గొనఁబడి,చాల దేశములందు చేయం బడుచున్నవి. ఈమట్టి కర్ణభాగముగ చకు ముకిరాళ్ళపొడుమును, కార్నిష్‌రాళ్ల పొడుమును గల్పి, అం దింకను ఒకజాతి బంకమట్టిని గూడ చ్చి అక్షాకారములుగ నొనర్చి, మెండించి కాల్చి మెఱుఁగిడుదురు. దీనియందు పొడుముగఁ జేయఁబడిన ఇనుప పరమాణువులు మట్టితోఁ జేరియుండు నఁట. వాటిని దీసివేయుటకు అయ స్కాంతముల (Magnets) నుపయోగించి ఆకర్షింపఁజేసి పరిశుభ్రపఱచి స్వచ్ఛముగ నుండునట్లుఁ జేయుఁ బ్రయత్నింతురు. ఐనను కొన్నిటియందుఁ జక్కఁగఁ బరిశుభ్రము కాకుం డుటచేఁ గాల్చినపిదప బ్రౌనురంగు (Brown colour) మచ్చలుగ నేర్పడి కన్పట్టుచుండును. ఇవి కడుంగడు చిన్నవిగ నుండెడిని.

**పింగ్పాంగు**—(Pingpong or Table Tennis) దీనిని టేబి ట్టెన్నిస్సు అనుటయుఁ గలదు. ఇది లాంటెన్నిస్సు ఆటయే. బల్లపై నాడుదురు. తొమ్మిది దడుగుల పొడవు, ఐదడు గుల వెడల్పు, రెం డడుగుల ఆఱుఁగుళముల ఎత్తుగల బల్లపై నడుమ నడ్డముగ చిక్కపు తెర కట్టుదురు. ఈ తెర ఆఱుమ్ముప్పాతిక అంగుళముల యెత్తుగలదిగ నుండెడిని.

ఆడుటకు రబ్బ రంటింపఁ బడిన కఱ్ఱఫలక ములబట్టి,సెల్యులోయిడ్ బంతులతో టెన్నిస్సు ఆటవలెనే ఆడుదురు. ఇం దాటకు ౨౧. పాయింట్లవఱకు లెక్కింతురు

**పింటు** (Pint)—ఇదిఆంగ్లుల కొలతపరి మాణము. ఇంగ్లీషుపింటు ద్రవపదార్థములకును ఘనపదార్థములకును గూడ వర్తించెడిని. ఇది ఇంపీరియల్ గాలనునం దెన్మిదవభాగ మని చెప్పఁబడినది 34.65925 ఘనాంగుళములు పట్టును. రెండుపింట్సు క్వార్టు అనంబడును. పింటునందు నాల్గవభాగమునకు గిల్ అనిపేరు. మూఁడు ఇంపీరియల్ పింట్సు స్కాట్లాండు దేశపుపింటగు నఁట. అమెరికా దేశమున పింటు 28.875 ఘనాంగుళము లఁట. దీనిని స్టాండర్డు పింటు అనెదరఁట.

పాశ్చాత్యౌషధ పరిమాణమున నిరువది Fluid ounces ఒక పింటుగ లెక్కించు చున్నారు.

**పిండగ్రీవ గోత్రము**— (కథ లేక కథ్యగ ణము చూడుఁడు).

**పిండం త్యక్త్వా కరం లేఢి**— ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

పిండమును (మోదకము లేక లడ్డుండను) వదలి, చేతినినాకినట్లు. అనఁగా ఉపయోగకార్య మును వదలిపెట్టి నిరుపయోగకార్య మవలంబిం చుట యనిభావము.

**పిండ ముత్సృజ్య కరం లేఢి ఇతి న్యాయము**-ముద్దను వదలి వ్రేలు నాకినట్లు అని యర్థము. ఉన్న దానిని (లేక కల్గినదానిని వదలి) వట్టిభ్రమలో పడుట యని భావము.

**పిండవిజ్ఞానము**(Embryology)లాటి న్భాపాపద మగు Embryo నుండి జనించిన

పదము. ఇట్టిదియె ఒక ఫ్రెంచిభాషాపదమును కలదు. దీనికి "లోపలి" యని యర్థము. తక్కిన భాగమునకు "శాస్త్ర" మనిఅర్థము. పిండవిజ్ఞాన శాస్త్రమునందు పిండ మేర్పడుట. (అనఁగా గర్భోత్పత్తి) పెరుఁగుట, బయటకు వచ్చుట, (అనఁగా జన్మించుట) మొదలగు వాటినిగూర్చి తెలుపు కల.

ఈ శాస్త్రము మేరకు మనుష్యులు, ఇతర జంతువులు గర్భముధరించుట యనఁబడు పిండోత్పత్తియు, చెట్లబీజములు మొలకలెత్తుటయు, పక్షులు గ్రుడ్లుబెట్టి పొదిగి పిల్లలం జేయుటయుఁ గూడ పిండోత్పత్తివిధానమే యనియు, దీనిం గూర్చిన విజ్ఞానమునకు పాశ్చాత్యభాషలందు "ఎంబ్రియోలోజీ" యని పేరనియుఁ జెప్పఁబడినది.

ఈ శాస్త్రమున మనుష్యులయందుఁ గాని, జంతువులందుఁగాని వృక్షములందుఁగాని Male and female cells సంయోగమగుట పిండోత్పత్తికిఁ గారణమని చెప్పఁబడినది. మనుష్యులందు,కొన్ని జంతువులందు ఇదిగర్భముధరించుటగను, పక్షులందు గ్రుడ్లు పెట్టుటగను, చెట్లయందు కాచి, బీజము లేర్పడుటగను ప్రారంభమగునని చెప్పఁబడినది. ప్రారంభమైనతోడనే మనుష్యులు, చతుష్పాత్తులు మొదలగునవి గర్భము ధరించి పిల్లలనుగను ప్రాణులందు తొలుత శిరస్సును, పిదప మొండెమును (Trunk) , పిదప కాళ్లు చేతు లు ను, పొడసూపి, మెదిగి ఏర్పడుట ప్రారంభ మగునవియు, ఇత్తటి తల్లిశరీరరక్తము బొడ్డుచేరు ద్వారా పిల్లలోనికిఁబ్రవహించుచు, పుష్టినొసంగి పోషించుచుండుననియుఁ జెప్పఁబడినది. గర్భము ధరించి యుండుకాలము మనుష్యులందు ౨౮౦ దినములనియు, ఇది సర్వసాధారణపరిస్థితి యనియు,ఇంక నిది వేర్వేఱుజంతువులందు వేర్వేఱు పరిమితులం గల్గియుండు ననియు, దీని కాంగ్లమున Duration period అనెద రనియుఁ జెప్పఁబడినది.

పక్షులం దీగర్భధారణవిధానమే వేఱు. స్త్రీ పురుషపక్షులసంగమమునకు మఱునాఁడే గాని, మూఁడవనాఁడే గాని, ఇంక వేర్వేఱు పక్షులు వేర్వేఱుకాలములందు గాని గ్రుడ్లు పెట్టివేయును. ఇదియె వీటికి గర్భధారణకాలము. గ్రుడ్లయందు పిల్ల లుండి అవయవము లేర్పడి యెదిగి పిల్లలుగ బయటికి వచ్చువఱకుఁగలకాలమున కాంగ్లమున "Embryonic devolopement period" అని పేరిడి యున్నారు. ఈకాలమున పక్షులు గ్రుడ్లను బొదుగుచుండును గాన దానిని Period of incubation" అనియు నందురు. గ్రుడ్లను బొదుగుట కాంగ్లమున "Hatching" అనెదరు. అక్కాలమున పిలకు గ్రుడునందే యాహారపదార్థ మమర్పఁబడి యుండి, పిల్లకు బలపోషణ లందిచ్చు చుండునని చెప్పఁబడినది. పిల్లలు లోనుండియు, తల్లి బయట నుండియు నకాలమున గ్రుడ్లను పొడిచి గ్రుడ్లను పగుల గొట్టుకొని పిల్ల బయటికి వచ్చెడిని. ఇదియె పక్షులజన్మకాలము. దీనికి "Clucking" అని పేరిడి యున్నారు.

ఇంక చెట్లయం దీవిధానము మఱియొకవిధమున నున్నది. విత్తనపు గింజలందు బీజ మేర్పడి నిల్వయుండును. ఇట్టి Embryo విత్తనము

లందు నిలిచియుండుకాలమున దానికి "Vitality of the seed" అనియు నందురు. అట్టి విత్తనము తడిసినతోడనే Passive stage నుండి, Active stage ప్రారంభ మగును. దానికి గాలి, నీరు, చెమ్మ, వెలుతురు, వెచ్చదనము అవసరములై, అవి గల్గినతోడనే మొలకెత్త ప్రారంభించును. మనుష్యులందు మావిత్తివలె వృక్షబీజములందు 'Seed coat' అనంబడుపొర బీజమును జుట్టుకొని యుండి దానిని జెడనీయక పటిమను గొంతవరకు నిల్పెడిని. దాని కాంగ్లమున "Testa" యని పేరిడియున్నారు.

ఇటుల మొలకెత్తినతోడనె యవసర మగు తాత్కాలికాహారమునుగూర్చి వివరింప వలయును. Monocoty ledons (అనఁగా ఏకదళబీజము) లందు Endosperm అనం బడుపదార్థము అట్టి తాత్కాలికాహారముగ నుపయోగించును. Dicotyletonous (అనగా ద్విదళబీజము)లందు సర్వసాధారణముగా పప్పు బద్దలం దాహార మమర్పఁబడియుండి యుపయోగించును. దీనికి "Starch" అని పేరిడియున్నారు. ఇది క్రమక్రమముగ Sugar (మాధుర్యము) గా మాఱుచు నీటితో కలిసి పలుచనై మొలక యొక్క వివిధభాగములకు వ్యాపించును. చిన్న మొలకలకు "Germ plant" అని పేరిడి యున్నారు.

ఇంక నీపిండోత్పత్తివిధానమున నెఱుఁగఁ దగిన ముఖ్యాంశ మొకటి కలదు. Lower order జంతువులగు Bacteria, cholera germ మొదలగువాటియందు Sexual means (స్త్రీపురుషసంయోగము) అవసరము లేకుండఁగనే A sexual multiplication కలుగును. అనఁగా Cell division వల్లనే వృద్ధి సంభవించును. దీనినే Unicellular organisam అనియు, Amoeba అనియు నందురు.

సర్వసాధారణముగ తక్కిన జంతుజాలము లందు Sexual means వలన పిండోత్పత్తి విధానము గల్గి, వృద్ధి సంభవించును. ఈ Embryology కళ Maternity శాస్త్రము లోని యొకభాగము.

**పిండారకతీర్థము**— (పిండారకక్షేత్రము చూడుఁడు)

**పిండారకక్షేత్రము (పిండారకతీర్థము)** ద్వారకకడ నీక్షేత్రము కలదు. బొంబై రాజధాని. (తొల్లింటి సౌరాష్ట్ర దేశము). ఇందు కొందరు మహర్షు లొకప్పుడు తప మాచరించు చుండిరఁట. అత్తఱి యాదవులు మత్తతతో శ్రీకృష్ణునిసుతుఁడగు సాంబుని గర్భిణీస్త్రీవలె వేషము వేచి వారికడకుం గొంపోయి కపటవినయముతో "నీయువతి కేశిశువు గల్గు" నని యడుగ నాఋషు లామాయ నెఱింగి కినుక వహించి "యాదవాధికార విధ్వంసకర మగు ముసలము (రోఁకలి) గల్గు" నని రఁట. అటులనే యచిర కాలమున నొక రోఁకలి జనించె నఁట. దానిని శ్రీకృష్ణుఁడెఱింగి ఖన్నుఁడై వారల మందలించి యాముసలము నఱుగఁదీసి నీటఁ గల్పుఁ డనె నఁట. వా రటులనే యొనర్ప కడ కొక గుంపు

అఱుగక నిలువ దానిని బాఱవైచి యాగంధపు ముద్దను నీటఁ గల్పిరఁట.

ఆగుంపే ముల్కి-యై శ్రీకృష్ణునకుఁ దగిలి యాయన మ గారణ మాయెనఁట. ఇంక నీటఁ గలిసిన యాగంధపుముద్ద తుంగవంటి మొక్కలుగ మొలిచి బలపడియుండె నఁట. శ్రీకృష్ణనిర్యాణానంతరము యాదవులు మత్తులై ఒకరితో నొకరు కలహించుచు నందఱు మడిసి రఁట.

**పిండారిగంగ**—(కర్ణగంగ చూడుఁడు).

**పిండారీదోఁపిడికాండ్రు (దండు)**—వీరు దోఁపిడిగాండ్రు. వింధ్యారణ్య గూఢప్రదేశములం దీకూర్రుల ప్రధానస్థానము లెన్నియో యుండెను. దోఁచుకొనియు, హత్య లొనర్చియు, ఆస్తులు కొల్లగొట్టియు పాఱిపోవుచుండెడివారు. క్రీ. వె. ౧౯ వ శతాబ్దప్రారంభ కాలమున వీరిభయ మత్యధికమై యుండెను. వారన్ హేస్టింగ్సు గవర్నరుజనరల్ గారి సైన్యములు ౧౮౧౭ సంవత్సరమున వీరి నడఁచివైచె నని చెప్పఁబడినది.

**పిండికుండచెట్టు**—లా. Tranquibar justica. అఱవములో తవశుము, పూండు, పూనక, రంగే. దీనియాకు నూఱి కట్టిన గాయములు, కవుకుదెబ్బనొప్పులు నివారణ మగు ననియు, సమూలరసము ఱొమ్ము, పార్శ్వము లందలినొప్పులు కుదుర్చు ననియు, చలవచేసి, విరేచనము వెడలించి, స్ఫోటకముల ఉద్ధృతము నాఁపుశక్తి గలదనియుఁ జెప్పుదురు.

**పిండికొండ (కొండపిండి లేక పిండి) చెట్టు**-లా. Lycopodium Imbricatum.

సం. పాషాణభేదః, పాషాణభేదకః. పాషాణభేదనః, పాషాణభేదీ, అశ్మఘ్నః.

దీనిని తెలకపిండిచెట్టనియు, కొండపిండిచెట్టనియు, పిండిచెట్టనియు వాడుట కలదు. దీనిసమూలరసకషాయములు చక్కఁగ మూత్రమును వెడలించుచు బహుమూత్రము నాఁపు శక్తి గలదనియు, మేహశాంతి, పైత్యశాంతి, ఉబ్బు, శూలలు, శుక్లదోషము, గుల్మము, మూలవ్యాధి, వ్రణములు మాన్పి పొత్తికడుపును శుభ్రపఱచు ననియుఁ జెప్పఁబడినది.

**పిండికొలఁది రొట్టె** - (ఆంధ్రలోకోక్తి.)

**పిండిప్రోలు లక్ష్మణకవి** — ఆంధ్ర కవులలో నాధునికులందుఁ బరిగణింపఁ బడిన వాఁడు. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. అపస్తంబసూత్రము. భారద్వాజసగోత్రము. తండ్రిపేరు గోపాలరాజు. ఈతఁడు గోదావరీమండలములోని రామచంద్రపుర పరిసరముల నున్న కుయ్యేరుగ్రామమున కరణ మని తెలియుచున్నది. తన లంకభూమిప్రదేశములను రావు ధర్మారాయణింగా రాక్రమింప, నాతనిని దిట్టుటకు "లంకావిజయ"మను గ్రంథమును రచించిన తిట్టుకవి. ఇతని కవిత్వమును మెచ్చుకొనుచుందురు. ఈగ్రంథమునకు "రావణదమ్మీయ"మని వాడుకనామము కలదు. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగా రను మహావిద్వాంసుఁడగు కవిని పరాభవించిన ప్రతిస్పర్ధి.

# పిండిప్రోలు లక్ష్మణకవి వంశావళి.

ఆపస్తంబసూత్రము – భరద్వాజసగోత్రము.

పిండిప్రోలు వీరరాజు




*ఈతఁడు లంకావిజయమనంబడు రావణదమ్మీయము రచించినసత్కవి. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రికవిని బరాభవించినప్రతిస్పర్ధి. కుయ్యేరుకరణము

**పిండి ఎంతో రొట్టె అంతకు తగినటే-** (ఆంధ్రలోకోక్తి.)

**పిండోత్పత్తి (విధానము)**-స్వరశాస్త్రమున పిండోత్పత్తివిధాన మిట్లు చెప్పఁబడినది. పిండోత్పత్తి స్వరోదయమునకు కారణము. ఇది ఇఱువదియైదు విధముల భేదములు కలది. శరీరమునందు స్వరము జనించును. స్వరమునందు నాడి జనించును. శరీరమున కీ శాస్త్రగ్రంథములందు పిండ మనిపేరు. పిండము శుక్లశోణితసమ్మిశ్రము. చైతన్యము గల్గియుండు నది. శుక్లశోణితములు నాల్గుదినములవఱకు అనుదినము మేళనమగుచుండుననియు, ఆయైదవదినమున ముద్దయై బుగ్గవలెనుండి, పదిదినములకు రక్తమేర్పడి పదునేనుదినములకు మాంసపుముద్దయగుననియు, ఇఱువది దినములకు గట్టిపడుననియు, మఱి నాలుగైదు దినములలో మనుష్యాకారమేర్పడు ననియుఁ జెప్పఁబడినది.

ప్రథమ మాసమున పంచభూత సంకలితమగుననియు, ద్వితీయ మాసమున మేధస్సును, తృతీయమాసమున ఎముకలును ఏర్పడి, మజ్జ గల్గుననియు, నాల్గవ నెలయందు అవయవము లేర్పడు ననియు, ఐదవ నెలయందు రంధ్రములతోఁ గూడిన చెవులు, ముక్కు, నోరు మొదలగునవి ఏర్పడుననియు, ఆఱవనెలయందు గళరంధ్రము, ఉదరము మొదలగునవి కల్గుననియు, ఏడవ నెలయందు జన్మము సంభవించిన, అల్పాయువు, బలహీనత, క్షీణధాతువులు గల్గుననియుఁ జెప్పఁబడినవి. ఎన్మిదవమాసమునజన్మము సంభవించిన తల్లి గాని, పిల్లగాని మృతిచెందుదురనియు, తొమ్మిది లేక పదియవ మాసమున జన్మించుట శ్రేయస్కరమనియుఁ జెప్పఁబడినది.

స్త్రీలకు ఋతుదినము మొదల్కొని పదునాఱుదినములవఱకు గర్భము నిలుచు ననియు, అందు సరిదినములందు నిలిచిన పురుషుఁడును, బేసిదినములందు నిలిచిన ఆఁడుపిల్లయు గర్భమున నేర్పా టగుదు రనియు, స్త్రీబల మధికమైన ఆఁడుపిల్లయు, పురుషబల మధికమైన మగపిల్లయు గర్భమున నేర్పా టగుదు రనియుఁ జెప్పఁబడినది. ఈ శాస్త్రమతమున మెదడు, వీర్యము, ఎముకలు తండ్రిసంబధమున నేర్పడు ననియు, రక్తము, లోమములు, మాంసము తల్లిసంబంధమున నేర్పడు ననియుఁ జెప్పఁబడినది.

రోమములు, ఎముకలు, చర్మము, మాంసము పృథివీతత్త్వసంబంధము లనియు, మూత్రము, శుక్లము, పురీషము, నిద్ర, ఆలస్యము మొదలగునవి ఉదకసంబంధము లనియు, దేహకాంతి, ఆఁకలిదప్పికలు అగ్నిసంబంధము లనియు, నిలచుట, వణఁకుట, కదలుట, చాఁచుకొనుట, ముడుచుకొనుట వాయుసంబంధము లనియు, కోపము, సిగ్గు, భయము, మోహము మొదలగునవి ఆకాశసంబంధము లనియు, (అనఁగా ఇవి కల్గుటకు కారణ మాయాభూతము లనియుఁ) గలదు.

**పిక్షి గోత్రము**—(వార్ధ్యస్వ లేక మిత్రియువగణము చూడుఁడు.)

**పిక్కచెట్టు**— దీనిని గూర్చి సరిగా తెలియదు. దీనివేరురసము లేక చూర్ణము చలవయు, వీర్యవృద్ధియుఁ గల్గించు ననియు, త్రిదోషహర మనియుఁ జెప్పుదురు.

**పిక్టోగ్రాఫీ (Pictography)**--సాంకేతిక నియమములు గలిగినచిత్రములతోఁ గూడిన ఆకృతులుగల అక్షరసముదాయమును రచించు విధానము. చైనా, బాబిలోనియా, ఈజిప్టు దేశములలో ఈలిపి ప్రాచీనకాలమున నుండెను.

**పిక్నిక్ (Picnic)**— ఒకరు చేసినదికాక తమంతట తాము లేక అందఱు కలిసి చేసికొను

విందున కీపేరు వర్తించుచున్నది. ఇది బహుశః క్రీ. వె. ౧౮౦౩ సం॥రము ప్రాంతములనుండి ఇంగ్లాండునందు వాడుకలోనికి వచ్చెను. తొలుత నొక్కొక రొక్కొక భోజనాంగపదార్థము నొనగూర్చు, నన్నియుఁగలిసి యొకటగు విందగును. తొలుత ౧౮౦౩ సంవత్సరము Annual Register నందు వివరింపఁబడినది.

**పిక్రికాసిడ్ (ఆమ్లము)** (Picric acid)- దీనికి Trinitrophenol అనియుఁ బేరు కలదు. దీనిని రసాయన శాస్త్రులిట్లు "Bright yellow Crystalline powder obtained by the action of Nitric acid on Carbolic acid" అని వివరించియున్నారు. కార్బొలిక్ ఆసిడ్‌ను Phenol అనియు ననెదరు. పైక్రికాసిడ్ నందు పుండ్లుమాన్పు గుణముకలదు. Explosives చేయుటయందుఁగూడ నుపయోగించుచున్నారు.

**పిగ్గెరీ** (Piggery)— పందులను పెంచు విధానము. పాశ్చాత్యుల ఆహారపదార్థములలో పందిమాంసము ముఖ్యముగుటఁజేసి పందులను పెంచుటముఖ్యమగువిధానముగవృద్ధిపొందినది.

**పిచ్చటకము**—ఇది నేత్రరోగములలో నొకటి.

**పిచ్చికుక్కకాటురోగము** (Rabies decease)-ఇది పిచ్చికుక్కలు, పిచ్చినక్కలు (రోగముతగిలిన కుక్కలు, నక్కలు) కఱచుట వలన మనుష్యులకు తగులు వ్యాధి. ఈజంతువులు కఱచినతఱి వాటినోటియందలి చొంగ (Saliva) గుండా నీరోగపు సూక్ష్మజీవులు మనుష్యుల శరీరమున ప్రవేశించి వ్యాధిని గల్గించును. రోగలక్షణము కఱచిన కొన్నివారముల దనుకఁ గనఁబడకపోవచ్చును. ఇది ఘోరాపాయకరమగు వ్యాధి.

రోగియందు రోగ మతిశయించినకొలఁది కఱచిన జంతువు అఱపులంబోలిన యఱపులను ఆరోగి అఱచుచుండును. ఇట్టి ఘోరతరమగు వ్యాధి ఒక్కమనుష్యులందే అపాయకర మనుటకాదు. ఈవ్యాధిసోకిన కుక్కలకు, నక్కలకు స్వభావము మాఱి, అకారణముగఁ గఱవఁబోవుట, స్థిమితము లేకుండుట, కనఁబడినదానినెల్ల గఱవఁ బ్రయత్నించుట, పరుగిడుచుండుట, మొదలగు పిచ్చిలక్షణములు ప్రారంభమై పదిదినములలో బలపడి, మఱి పదిదినములలో ఆజంతువు మరణించెడిని. కొన్నిటికి వెనుకకాళ్లు వాతముచే ఆవరింపఁబడి శరీర మంతయు వాతపూరిత మైపోవుటయుఁ గలదు.

నెగ్రి యనుపేరుగల పరిశీలకుఁడు పిచ్చికుక్కలను బరిశీలించి, మెదడునం దీవిషపదార్థ ముండునని కనిపెట్టుటఁజేసి ఆ విషపదార్థము నెగ్రిపదార్థ మని వాడుకయయ్యెను. అట్టి నెగ్రి పదార్థము దానిమెదడునం దుండునేమోయని కుక్కగాని, నక్కగాని కఱచినచో దానిని బరిమార్చి మెదడును పరీక్షింపవలయును లేకపోయిన కఱచిన పదిదినములలో నాకుక్కగాని, నక్కగాని వ్యాధిగ్రస్తము కానట్లు తేలిన నిరపాయమని యెఱుంగనగును.

భరతదేశమున నీరోగమునకు చికిత్సయొనర్చుసంస్థలు హిమాలయపర్వతములపై (ఉత్తరదేశమున) "కసౌలీ" యనుతావు నం దొకటియు, (దక్షిణదేశమున) "కూనూరు" నం దొకటియు రెండుసంస్థలు కలవు. వీటియం దిరువదియొక్కదినములు చికిత్స యొనర్తురఁట.

**పిచ్చిగుంటవారు**— పిచ్చిగుంటకులస్థులనుగూర్చి సరిగా తెలియదు. వారి యుత్పత్తిని గూర్చిన గ్రంథములును గానరాకున్నవి.

అఱవదేశస్థుఁడగు వెల్లాలజాతివానికి తెలుఁగుదేశస్థురాలిని బరిణయ మొనర్ప, వారికిఁ గల్గిన సంతతివారని వారియం దొక వాడుక గలదు.

**పిచ్ఛితము**-ఇది అస్థిభంగరోగసంబంధ రోగము.

**పిచ్ఛిలానది**-ఇది కామరూపదేశమందలి యొకనది. మహాభారతమున భీష్మపర్వమున ౯ యందు ప్రశంసింపఁబడినది. యోగినీతంత్ర మను గ్రంథమున ఉత్తరఖండ. ౧ అధ్యాయ మునఁ గూడ దీనిప్రశంస కలదు.

**పిచ్చుకపై చంద్రాయుధము**-ఆంధ్రభాషాసాంప్రదాయార్థ పదము. అల్పుఁడు, సాధువు నైనవానిపై బలవంతమును, ఘోరమును నగు బలప్రయోగమును జేయుటను దెల్పుటకు వాడుచున్నారు. పిచ్చుకపై చంద్రాయుధప్రయోగ మనిభావము దీనిని కొందఱు బ్రహ్మాస్త్రప్రయోగ మనియు, బ్రహ్మాస్త్ర మనియుఁ గూడ వాడెదరు. అన్నియు నొక్కటియే. (ఆంధ్రలోకోక్తి)

**పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా?**-(ఆంధ్ర లోకో )

**పిచ్ (Pitch)**—ఇదిCoal tar సంబంధ మగు Product అని చెప్పఁబడినది. నల్లగ నుండి వేడియందు మెత్తపడి శీతలమునఁ గట్టి పడునది. ఆస్ఫాల్టునందుఁ గలుపుచున్నారు.

**పిచ్ స్టోన్** (Picth stone)— ఇది యొకఱాయి. దీనియందు నీరుండి నిగనిగలాడు చుండునది. మూఁడు నాలు రంగులందు దొరకును. సాక్సనీదేశమునను, అరాన్ దేశము నందునను దొరకుచున్నది.

**పిటకత్రయము (త్రిపిటకములు)**-బౌద్ధమతగ్రంథములకు త్రిపిటకము లని పేరు. కాశ్మీర దేశాధీశుం డగు కనిష్క మహారాజు కూర్చిన మహాసభయందు బౌద్ధభిక్షువులు బౌద్ధోక్తాది మహాధర్మబోధకోక్తులం గూర్చి మూఁడు వేర్వేఱు పిటకము (గంప) లందుఁ గూర్చిరి. నాఁడాదిగ నాగ్రంథములకు "త్రిపిటకము" లనిపేరు.

అవి ౧ సుత్తపిటకము, ౨ వినయపిటకము, 3 అభిదమ్మపిటకము నను బౌద్ధమతప్రధాన గ్రంథములు.

**పిటికా లేక పిండకారోగము**— ఇది మసూరికారోగమునకుఁ బేరు.

**పిటీషనింగ్ క్రెడిటర్**— బేంక్రప్ట్సీ సందర్భమున బాకీయున్నవానిపై న్యాయస్థానమువారికి అర్జీ యిచ్చుకొను అప్పులవానికీపేరు వర్తించును.

**పిట్ట కొంచెము కూఁత ఘనము**—(ఆంధ్ర లోకోక్తి).

**పిట్టలు నీరుత్రాగవు**—ఒకని యధికార గరిమకు వెఱచి పక్షు లైనను నీరుత్రాగ వెఱపందునని భావము. అనఁగా నశాంతికరమగు నధికారగరిమను దెల్పును. కాని, యొక్కొకతఱి దుర్మార్గులను కఠినముగ నరికట్టుటను దెల్పుటకుఁగూడ నిట్లు వాడుచుందురు. అధికారగరిమ యనుట స్పష్టము. (ఆంధ్రలోకోక్తి).

**పిట్టా పిట్టా పోరు పిల్లితీర్చినట్లు**—తినివేసినట్లని భావము (ఆంధ్రలోకోక్తి.)

**పిట్మేన్ (Pitman)** — ఈ తఁడు Short-hand writing కనిపెట్టినవాఁడు. ఈమహామేధావిపేరు Sir. Isaac Pitman ఐ యున్నది. Trowbridge పురమున క్రీ.వె. ౧౮౧3 జనవరి ౪ తేదీని జన్మించినవాఁడు. ఉపాధ్యాయుఁడై ౧౮3౭ యందు Stenographic Sound-hand అను విద్య బోధించుచు ప్రకటించెను. ౧౮3౯ లో తానే ఒక పాఠశాలను స్థాపించి (బాత్ పురమున) ఒక ముద్రాయంత్రమును నెలకొల్పి, Pitman's Journal అనంబడిన Phonetic పత్రికను

ప్రకటింప మొదలిడెను. 1842 లో Isaac Pitman & Sons అనుసంస్థను నెలకొల్పెను. 1894 లో ఈయనకు Sir బిరుదమీయబడెను. 1897 జనవరి 22 మృతినందెను. ఈయన విధానమునకు Short-hand అని వాడుక గల్గెను.

**పిట్‌వజ్రము**—(కంటువజ్రము చూ.)

**పిడపర్తి బసవకవి** — ఆంధ్రకవులలో మధ్యకవులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. ఆరాధ్యబ్రాహ్మణుఁడు. బసవ పురాణము పద్య కావ్యముగ రచించిన పిడపర్తి సోమనాథుఁ డీతనికి పెదతండ్రి. తండ్రిపేరు పాలనారాధ్యుఁడు. (పిడపర్తి సోమనాథకవి చూడుఁడు.)

ఈతఁడు, పాల్కురికి సోమనాథుఁడు ద్విపదగా రచించిన అల్లమప్రభు చరిత్ర మగు ప్రభులింగలీల నాంధ్ర పద్యకావ్యముగ ప్రభులింగలీల యనుపేరను రచించినవాఁడు.

క్రీ. వె. ౧౫౨౦ సంవత్సర ప్రాంతమున నుండినవాఁడని తలంపఁబడుచున్నది.

**పిడుగు-ఉఱుము**— మేఘములగుండా జరుగుచుండు ఎలక్ట్రిక్ డిస్ఛార్జిని (Electric discharge) పిడు గందురు. అది కన్పించుటయే మెఱుపు. దానిధ్వనిని వినుట లేక దాని వలనఁగల్గు ధ్వనియే ఉఱుము. ఒక్కొకతఱి ఎలక్ట్రికల్ డిస్ఛార్జి మేఘములనుండి భూమిపైఁ బడుటకలదు. దానినే పిడు గందురు. ఆంగ్లమున పిడుగునకు Thunder bolt అనియెదరు. అది ఆదికాలపు పాశ్చాత్యులు తమ దేవుఁడగు జ్యూపిటర్ (ద్యౌసుపితరుఁడు) ఆగ్రహపరవశుండగుతఱి మేకు (Bolt) పడవేయుచుండు ననుచుండిరి. గాన పిడుగునకు థండర్‌బోల్టు అని పేరయ్యె నఁట. ఇటీవల పాశ్చాత్యరసాయన శాస్త్రవిదు లిది ఎలక్ట్రిక్ ప్రవాహ మనిరి. పిడుగు చెట్లపైనను, పెద్ద కట్టడములపైనను, మనుష్యులపైనను పడి నష్టము గల్గించుచుండుటయుఁ గలదు.

**పిడుగు**—(ఉఱుము చూ. మెఱపు చూ.)

**పిడుగువల్ల బాధకులోఁబడనివృక్షములు** — పెద్దపెద్ద వృక్షములపై పిడుగు పడుట తఱచు సంభవించుచుండు నని లోకప్రసిద్ధియే. అయినను శాస్త్రవేత్తలు జాగ్రతగ వేర్వేరు దేశములవారు పరిశీలనలు సల్పి కొన్ని జాతులచెట్లకు పిడుగుబాధ ఎక్కువ గల్గుచుండుననియు, కొన్ని జాతులకు పిడుగుబాధ అంతతఱచుగఁ గల్గుచుండఁజాలదనియుఁ గొంతసంశయముతోఁ గనిపెట్టియున్నారు.

బీచి (Beech) వృక్షములు విస్తారముగను, ఇతర వృక్షము లక్కడక్కడను గల ఒక యడవియం దీపరిశీలన పదునొకండు సంవత్సరములు జరపిరి. ఆకాలమున నితరవృక్షములపై పిడుగులు పడెను గాని విస్తారముగ దట్టమైయున్నను బీచివృక్షములపై పిడుగు పడ లేదఁట.

**పిడుగుకు గొడు గడ్డమా ?**- (ఆంధ్ర లోకోక్తి).

**పిడుపర్తి సోమనాథ కవి**— ఆంధ్రకవులలో మధ్యకవులందు పరిగణింపఁ బడినవాఁడు. ఆరాధ్యబ్రాహ్మణుఁడు శైవుఁడు.

తండ్రిపేరు బసవయ్య. పితామహునిపేరు దేవళరాజు. ప్రపితామహునిపేరు సోమనాథుఁడు, సోమరాజు. వీరిపూర్వులకు కాకతీయ ప్రతాపరుద్రుని రాజ్యములో దోకిపర్తి యను గ్రామ మగ్రహార ముండెడిది. అది చిక్కులలోఁ బడినకతన ప్రౌఢ దేవరాయలు దానిని ఈ కుటుంబమునకె తిరుగ స్వాధీనపఱచె నఁట.

ఈకవి పాల్కురికి సోమనారాధ్యుఁడు రచించిన ద్విపద బసవపురాణమును పద్య కావ్యముగ రచించెను. ఈతఁడు క్రీ. వె. ౧౫౦౦ ప్రాంతమున నుండినవాఁడు.

సోమనాథుని తమ్మునిపేరు పాలన్న. పాలన్న సుతునిపేరు బసవరాజు. ఈతఁడు ప్రభులింగలీల పద్యకావ్యముగ రచించెను. ఈయన జంగమ దేవర యని సుప్రసిద్ధపరిశీలకులగు బండారు తమ్మయ్య దేవరగారు చెప్పుచున్నారు.

**పిణ్యాకయాచనార్థం గతస్య ఖారికా తైలదాతృత్వాభ్యువగమేతిన్యాయము** వదలివేసిన తవేఁడు నువ్వుగింజల నడుగఁ బోయి పదునాఱుసేర్లనూనెను దండుగ సమర్పించుకొొన నొప్పుకొనినట్లు. దండుగ తెచ్చుకొనిన పనిని దెల్పుట కీన్యాయము నుపయోగింతురు.

**పితరులు (తండ్రితో సమానులు)**- పంచపితరులు:- ౧ దేశ మేలుప్రభువు. (తనను పోషించుచుండు యజమానుఁడు సహా). ౨ ఉపాధ్యాయుఁడు (విద్యాగురువు). ౩ తనను గన్న తండ్రి. ౪ తనభార్యతండ్రి. ౫ జ్యేష్ఠసోదరుఁడు.

ఏకాదశపితరులు:- శ్లో॥ ఉపాధ్యాయః పితా జ్యేష్ఠభ్రాతాచైవ మహీపతిః । మాతులశ్చ శ్వశురస్త్రాతా మాతామహ పితామహా॥ బంధుర్జ్యేష్ఠ పితృవ్యశ్చ పుంస్యేతే పితరస్మృతాః॥ ౧ ఉపాధ్యాయుఁడు, ౨ తండ్రి, ౩ అన్నగారు, ౪ ప్రభువు, ౫ మేనమామ, ౬ మామగారు, ౭ అభయప్రదాత, ౮ మాతామహుఁడు, ౯ పితామహుఁడు, ౧౦ బంధువులలో పెద్ద, ౧౧ తండ్రిసోదరుఁడు. వీరు పితృ సమానులు.

**పితాపుత్రన్యాయము**— తండ్రియందు కంటె కుమారునికి గౌరవస్థానము మఱియొకటి లేదు. కుమారునియందుకంటె తండ్రికి అసూయలేని స్థానము మఱియొకటి లేదు. అనఁగా తండ్రికంటె కుమారుఁడు విద్యాధికుఁడైనను, ధనాధికుఁడైనను, ఎక్కువగౌరవములు పొందుచుండినను, తండ్రికి ముదమే గాని అసూయత యుండదు. ఇది లోకమున ప్రసిద్ధానుభవము.

**పితృకార్య పంచపల్లవములు** — (పంచపల్లవములు చూ.)

**పితృగణము లేక పితృదేవగణము**- ఇది మూఁడువిధములు:—

౧ వసుగణము. ఇది శ్రాద్ధాదులయందు పితృస్థాన మనియు, పదునొకండుకోట్ల సంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

౨ రుద్రగణము. ఇది పితామహస్థాన మనియు, పదునొకండుకోట్ల సంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

౩ ఆదిత్యగణము. ఇది ప్రపితామహస్థాన మనియు, పదునొకండుకోట్లసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

ఇట్లు పితృదేవతలగు వసురుద్రాదిత్య గణములు మూఁడును గలసి ముప్పదిమూఁడు కోట్ల (పితృ) దేవత లని చెప్పుదురు.

**పితృమానము (కాలమానము)**— భూమి యొకసారి సూర్యుని జుట్టివచ్చుట కొక సంవత్సరకాలము పట్టు ననియు, అట్లు చుట్టివచ్చునపుడు తనకుతాను గిరగిరతిరుగుచు మఱియేగు ననియు, అట్లొకసారి తనకుతాను దిరుగుట కిరువదినాలుగుగంటలు, లేక అఱువది గడియలు గల ఒకదినము పట్టు ననియు నెఱిఁగినదే. ఈదినము మనుష్యులకు మనుష్యమానముచే నని యెఱుంగునది.

ఇట్టి మనుష్యమానపు దినములు చాంద్రమానపు నెలయందు రమారమి ముప్పది యుండును. ఇవి శుక్లపక్ష మనియు, కృష్ణపక్షము లేక బహుళపక్ష మనియు రెండు తెఱంగులు. ఇందు శుక్లపక్షము పితృదేవతలకు పగలనియు, కృష్ణపక్షము రాత్రియనియు, రెండుపక్షములును గలిసిన మాసమును, నొకపగలు, రాత్రియుం గలిసి దిన మనియుఁ జెప్పఁబడినది. అనఁగా మనుష్యమానపు మాసము పితృమానమున

నొక్కదిన మగునని భావము. కాన మన ముప్పది మాసములు పితృమానమున నొక్క మాసమును, మన ముప్పది సంవత్సరములు పితృమానమున నొక్కసంవత్సరము నగును.

**పితృసములు**—(పితరులు చూడుఁడు)

**పిత్తకఫోల్బణసన్నిపాతము**—(సన్ని పాతదోషము చూడుఁడు.)

**పిత్తళి**— (ఇత్తడి చూడుఁడు.)

**పిత్తోల్బణసన్నిపాతము**— (సన్నిపాత దోషము చూడుఁడు.)

**పిన్న కటుక రోహిణి**—(నాగములసలు చూడుఁడు.)

**పినాక గోత్రము**—(పాణిక ఉపగణము చూడుఁడు.)

**పినాకము**-శివునివిల్లు. (ధనుర్విద్య చూ.)

**పినాకినీనది**— దీని కఱవదేశపు పేరు పెన్న యనుచున్నారు. స్కాంద పురాణమున మహేశఖండమున(అరుణాచలమాహాత్మ్యము), అధ్యా. ౨ ప్రశంసింపఁబడినది.

ఇది ఉత్తరపినాకినీ, దక్షిణపినాకినీ యని రెండై యున్నది. మైసూరు రాజ్యములోని నందిదుర్గమనుపర్వతమందు ఒకనీటియూటనుండి జనించు నది. ఉత్తరపినాకిని నెల్లూరు ప్రక్కఁ బడి ప్రవహించుచు బంగాళాఖాతమున బడును.

దక్షిణపినాకినికి పాపఘ్ని యనియుఁ బేరు కలదు. (నందిదుర్గము చూ.)

**పినాకినీ నదియందలి గండికోట (దుర్గము)**— పినాకినీనది ఉత్తరపినాకినీనది యనియు, పెన్న యనియు ననంబడునది. ఈ నదీప్రవాహము పర్వతభూములగుండా ప్రవహించుచు, మెత్తని ప్రదేశమును కోసి, గండిగఁ జేసి, దానిగుండా ప్రవహించుతావున నెత్తగు ప్రదేశమున నీదుర్గము కట్టబడియుంట సర్వసాధారణముగ దీనిని "గండికోట" యని యొకగ్రామనామమును వలెనే వాడుచున్నారు. ఇది కడప మండలమున, జమ్మలమడుగుతాలూకాలో, పినాకినీనది గండికి కుడివైపున, (సముద్రపు నీటిమట్టమునుండి ౧౬౭౦ అడుగుల యెత్తుప్రదేశమున) కట్టఁబడిన దుర్గము గండికోట. ఇట నది రెండుమూఁడుమైళ్ళ పొడవునను గండకోసి, అందు లోతుప్రవాహముగా పైకి రెండువందల యడుగులయెత్తునకు నీ రెగురఁ గొట్టుచు నురుగులగ్రమ్ముచు దుర్గమునకు రక్షక కందకమువలె ప్రవహించుచుంట, నిది శత్రువుల కజేయమగు దుర్గ మనిపించు చుండును. గొప్పగొప్ప సైనికోద్యోగులు దీనిని బరిశీలించి సరియైనస్థితియం దుంచి సైన్యపరికరస్థితి చక్కఁగ నమర్చిన, పరుల కసాధ్యమగు దుర్గ మని నుడివి యున్నారు. గండికోట కమ్మవారు పౌరుషశాలు రని యిటనుండియే పేరందిరి. కోటయందున్న యొకశాసనము మేరఁ కీసమీపముననే యున్న "బొమ్మనపల్లి" యందు వసించుచుండిన కాప ప్రభుండను పాళెగాఁ డీదుర్గము నిర్మించెనని కలదు. ఇందున్న దేవాలయము కర్ణాటకాంధ్ర (విజయనగర) చక్రవర్తి హరిహరరాయలు నిర్మించెననియుఁ దెలిసెడిని. ఫెరిస్తా చరిత్రకారుని వ్రాతలం దీ గొప్పదుర్గము పేర్కొనఁ బడమి కొంద రాంగ్లేయ పరిశీలకులు దీని నిర్మాణము క్రీ. శ. ౧౫౮౭ పూర్వముకా దని యభిప్రాయపడియున్నారు.

గోల్కొండనవాబు దీనిని బట్టుకొని సైన్యముతో మీర్ జుమ్లాసేనాని నిం దుంచెననియు, పిదప నొకప్పుడు కర్ణాటక బాల్ ఘాటునకు ప్రధానస్థానముగ నుండె ననియు,కడప పఠాన్ నవాబుస్వాధీనమునం దుండెననియు, క్రీ. శ. ౧౭౯౧ టిప్పుసుల్తానుతో యుద్ధములలో కెప్టన్ లిటిల్ సేనానివశ మాయె ననియు

చరిత్రపరిశోధనలనుండి తెలియుచున్నది. దీని నంబయదేవ మహారాజు పాలించెనని బలమగు నాధకలు కలవు. ఇటనుండి ములికినాటిసీమ ప్రారంభ మంట. ఈనగరము కడపపట్టణము నకు వాయవ్యదిశగా నుండును. ఈప్రాంతపు గనులలో మైలతుత్తపురంగుల నీలశిలలు దొరకెడిని. పులివెందల (పులిమందల) ప్రాంతము.

**పిప్పలాద మహర్షి**—పిప్పలాదమహర్షి తండ్రి దధీచిమహర్షి. తల్లి లోపాముద్ర యను నామాంతరముగల సువర్చాదేవి. భార్య అనరణ్యునికుమార్తె యగు "పద్మ". దేవతలు తన తలిదండ్రుల చావునకుఁ గారణమని పగబూని వారిపై తన తపోమహిమవలన "కృత్య" యను మహాక్రూరశక్తిని ప్రయోగించి వేధించినవాఁడు. (దధీచిమహర్షి చూడుఁడు).

**పిప్పలికుల గోత్రము** -ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య: గోత్రములు చూఁడుఁడు.)

పిప్పలికుల (పిప్పాలకుల,పుప్పాల,పుప్పాల) గోత్రము.ఏకార్షేయ(౧ ౨)గోత్రము. సంస్కృత గోత్రము. విష్ణువృద్ధన. విష్ణువృద్ధగణము. పేశలర్షి. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాశ్వలాయన సూత్రము. సమాన గోత్రము. విష్ణున. పేశలన. భీమేశ్వరుఁడు దేవత. భార్య భాను. తపస్థానము గోదావరీనదీతీరము. భాను సరస్సు తటాకము. జపము లక్ష. దీపము ౫ ౧౬. క్షేత్రసంఖ్య ౧౬. గోదానము. తెలకపిండి, గజపిప్పలి వర్జనీయము ౫.

**పిప్పలిచెట్టు**—లా. Piper longum. ఆంగ్ల. Long pepper. సం. కోరంగీ, కోలా, కోల్యా, మాగధీ, మాగధికా, పిప్పలిః. ఇవి సాధారణపు పిప్పళ్ళు లేక చిన్నపిప్పళ్ళు, లేక పిప్పలి సామాన్యమునకుఁ బేర్లు. పిపీలకః, పిపిలకా, పిప్పలీహాయం అనుపదములు పెద్దపిప్పళ్ళు లేక గజపిప్పళ్ళకుం బేర్లు. పిప్పలీమూలం, మూలం, సర్వగ్రంథి, సర్వతశ్చభా, మాగధం, మాగధీమూలం, మాగధీజటా యనుపదములు పిప్పలివేరు, పిప్పలిమూలము, పిప్పలిదుబ్బు లేక పిప్పలిమోడికిని పేరులు.

పిప్పళ్ళు త్రికటుకములలో నొకటి. ఇది పెద్ద పిప్పళ్ళు, గజపిప్పళ్ళు, చిన్నపిప్పళ్ళు అన రెండు భేదములుగ నుండును. చిన్న పిప్పళ్ళను సామాన్యముగ పిప్ప ళ్ళని వాడుచున్నారు. పిప్పళ్ళను; పిప్పలిదుబ్బులును పంచకోలములలోనివి.

పిప్పళ్ళు పైత్యము వేఁడి చేసి వీర్యపుష్టి జఠరదీప్తిఁ గల్గించుననియు, ప్రసవమైన స్త్రీల మైలరక్తమును వెడలించు ననియు, విరేచనము గల్గించి యాకలి నధికపఱచు ననియు, గర్భిణీస్త్రీల కీయ రాదనియు, ఇచ్చిన గర్భస్రావము గల్గించు ననియు, మఱియు నామవాత, పక్షవాత, రుద్రవాత, సూతికావాతముల నివారించుననియు, విషూచిపై చక్కఁగ పనిజేసి యాఁపుననియు, ఎక్కిళ్లు, జ్వరములు, దగ్గు, ఒగర్పు, వాతదోషము, శ్లేష్మముల నివారించు ననియు, సర్పవిషదోషమును హరించుననియు, పిప్పళ్ళను వేయించుటదోషపరిహారమనియు చెప్పఁబడినది. కొందరు శొంటిపొడుమును పిప్పళ్ళకు విరుగుడందురు.

**పిప్పలుఁడు**—తండ్రి, మిత్రుఁడు. తల్లి రేవతి. (ఈతఁడు రెండవ కుమారుఁడు) జ్యేష్ఠ సోదరుఁ డరిష్టుఁడు.

మఱియు నిల్వలుఁ డను రక్కసుని పుత్రుఁడును పిప్పలుఁడనుపేరు కలవాఁడే.

**పిప్పాలకుల గోత్రము**—(పిప్పలికుల చూడుఁడు.)

**పిపీలికాన్యాయము**—చీమ తానుదిను పదార్థ మెంత దూరముగా నున్నను, ఓపిక పట్టుదలలతో నెన్ని వంకరలు మార్గమునందు

కల్గినను, ఇతరచీమలతో సహవాసముఁ గూర్చు కొనిపోయి గమ్యస్థానమును జేరును. దీనికి "పిపీలికాగతి" యనియు నందురు.

**పిపీలికాయతి**— ఇది సంగీతశాస్త్రసంబంధపు యతి. కవిత్వసంబంధము కాదు. (యతిప్రాణము చూడుఁడు.)

**పియెర్సు** (Piers)--(వంతెనలు చూ.)

**పియకౌస్లియర్ సెల్** (Peaucellier cell)—ఇది Machanical Engineering సంబంధమగు యంత్రగమన విధానము. ఫ్రెంచిదేశస్థుఁడగు Lieut. C. N. Peaucellier గారు కనిపెట్టియుంట ఆయనపేరఁ బరఁగుచున్నది. క్రీ. శె. ౧౮౬౪ లో నాయన దీనిని వెల్లడించెను.

Consisting a pair of Links (a) of equal length pivoted together at one end (y), and at their other ends connected with opposit angles of four links (c. d. e. f) forming a rhombus. Pivoted to the links (c. d) is a further link (g) the end (z) of which is located half way between the point (y) and the junction of the links (c. d).



This is the principle of machanism. The dotes show how the points x moves up and down on the verticle line.

**పిరాని కలియార్** - ఇది మహమ్మదీయ సుప్రసిద్ధ యాత్రాస్థలము. షహరాన్పూరు జిల్లా, రూర్కీ నుండి ఆరుమైళ్ల దూరమునఁగల ఈ పేరుగల గ్రామమునం దున్నది.

ఇట "ఇమామ్షా"అను భక్తునియొక్కయు, అతని మేనల్లుండగు "సబీర్షా" యను భక్తునియొక్కయు రెండు గోరీలు దేవస్థానమునఁ గలవు. ఏటేట ఎండకాలమున నిట ఉత్సవములు జరగు నఁట. ఈతావును సర్వసాధారణముగా "కలియా"రని వాడుచుందురు. రూర్కీ హరిద్వారమున కవ్వల ప్రభుత్వమువారి ఎంజనీరింగు వర్కుషాపు కళాశాలగల తావు.

**పిరామిడులు(సమాధికట్టడములు)**- పిరామిడుశబ్ద మైగుప్తుదేశభాషాజన్యమై, గ్రీసుదేశపు భాషాసంపర్కమందు, ఇంచుక మార్పునందు, ప్రస్తుతరూపమున నున్నది. పిరామిడులన్నియు ఆదికాలమున నీజిప్టుదేశ మేలిన భూపతులయొక్కయు, ఆదేశస్థులచే నకాలమున పవిత్రజంతువులుగ నెంచఁబడి పూజింపఁబడుచుండిన కొన్ని జంతువులయొక్కయు శరీరముల పాతి, భద్రపఱుప నిర్మింపఁబడిన సమాధికట్టడములు. ఆ భూపతులు మహమ్మదీయమతస్థులు కారని తేలినది.

పిరామిడు లైగుప్తుదేశమున నీలా (నైలు) నది వామభాగప్రదేశమున నిప్పటి కైరో పట్టణమునుండి మంచిబాటను కొన్ని మైళ్ళదూరమున నైలునది ఫలవంతముగ నొనర్చు ప్రదేశమును దాఁటి, యవ్వలి యిసుకయెడారి ప్రారంభమైనతోడనే బహిష్కృపదేశమున గిఝే యనుపేరు గల గ్రామపరిసరములఁ గానవయ్యెడిని.

పిరామిడులలో పెద్దదానియందు సెనేపెరూ భూపతిసుతుండగు కుపూ (లేక ఛియోప్సు) ఫరోగారి సమాధియున్నది. దీని క్రిందిమట్టము

కొలత ౭౭౫ అడుగులును, ఎత్తు ౪౮౧ అడుగులును కలవు. ఈపిరామిడునందు ౮౯౫౦౦౦౦౦ ఘనపుటడుగుల కట్టడపుపని కలదనియు, బరువు ౬౮౦౦౦౦౦ టన్నులుగ నుండుననియు ఎంజినీయరులు లెక్కించి యున్నారు. చుట్టు కొలతలకు లోఁబడిన ఈపిరామిడుభూమట్టపు ప్రదేశ మించుమించు పండ్రెండున్నర యెకరము లుండునందురు.

ఇంక నీపిరామిడులయాకార మిట వివరింప నగును. భూమట్టపు చతురపుసమతలమున సమ పరిమాణము లగు నాలుగు వైపులఁ గల యంచులనుండి ఆకాశమువైపు, పైకి ఏవైపునకా వైపే సమత్రికోణాకారము లగునట్లును, అన్ని త్రికోణముల పైమూల లొకే తావునఁ గలియునట్లును, నిర్మించుటంజేసి సూదిగ తల ఏర్పడును. నాల్గుప్రక్కలు వెనుకకు వ్రాలియుండు నని వేఱుగ వ్రాయ నక్కఱలేదు.

కాలము గడచి గడచి ఈపిరామిడుపైపూత మెరుఁగు ఛిద్రమైనకతన దీనిని లెక్కించుటకును, పైకెక్కుటకును వీలగుచున్నది దీనియందలి రాతిపలక లొక్కొక్కటి రెండు టన్నులబరువుండునఁట. ఇట్టి రాతిపలకలవరుసలు ఒక వరుసపై నొకవరుసగ రెండువందల పది వరుస లీకట్టడమున గలవని లెక్కించి యున్నారు.

ఈ రాతిఫలకములు అసా ఆన్ పురముకడనుండి నైలునదిపై ఇటకుఁ దేఁబడిన వందురు. దీనికిఁ బిదపఁ జెప్పందగిన పిరామిడు గిఝె గ్రామపరిసరములనే కలదు. అది కాఫ్రాఫరో గారి సమాధి గల్గియున్నది. దాని యెత్తు నాల్గువందల యేఁబదినాలుగడుగులు. తరువాతఁ జెప్పఁ దగినదియు, గిఝె గ్రామపరిసరములందే వేఱొకటి కలదు. అద్దానియందు మెంకారా ఫరోగారి సమాధి యున్నది. దాని యెత్తు రెండువందల పందొమ్మిదడుగులు. తక్కినపిరామిడు లన్నియు వీటికి తగ్గియుండును. ఇక్కాలమున లెక్కింపఁదగినవి డెబ్బది యైదుగా ననగుచున్నవి. (ఈజిప్టు దేశము చూడుఁడు. కైరో నగరము చూడుఁడు. ఐగుప దేశము చూడుఁడు).

**పిల్లచచ్చినవాఁడు పిల్లకేడుస్తూంటే కాటికాపరి కాసుతెమ్మన్నాఁ డఁట**— (ఆంధ్రలోకోక్తి).

**పిల్లఏడవనిదీతల్లియైనాపాలివ్వదు; అడగనిదీ అమ్మఅయినా పెట్టదు**— (ఆంధ్రలోకో .)

**పిల్లరోగము** — నేత్రములందు పుసులు గట్టుచుండు రోగము.

**పిల్లలకోడి నక్షత్రము**— ఇది సప్త మహర్షి నక్షత్రము లనఁబడునవి యేడును, అరుంధతి యనంబడు నక్షత్రమొకటియుఁ గలిసి యొక నక్షత్ర సముదాయముగ (Constalation) గన్పడు నక్షత్రములగుంపు.

దీనిని కొరొల్లాజాతి ఎన్మిది పుష్పములతో పాశ్చాత్యులు పోల్చి ఆపేఁరిడిరి. అవి 1. Corolla, 2. Tubular, 3. Rotate, 4. Cruciform, (4. Infundibuli form), 5. Companulate, 6. Ligulate, 7. Bilabiate ringent, 8. Papilionoccous. దీనిని Southern Constalation అనుచుందురు.

కాని, కొరొల్లా తెగ ఎన్మిది పుష్పములు దృష్టుల నాకర్షించు తేజము కలవియై చిన్న కీటకాదుల నాకర్షించి పిల్చుకొనుజాతి వని చెప్పఁబడినవి.

**పిల్లలమఱ్ఱి పినవీరన్న** — తండ్రి గాదయ్య. తల్లి నాగాంబ. పెద్దవీరన్న (కర్ణాటక భూపాలునికడ మంత్రిగనున్న వాఁడు.) తమ్ముఁడు.

ఆర్వేలనియోగి. శివభక్తుఁడు. కాలము క్రీ. శ. ౧౪౫౦-౧౫౦౦. భారతీతీర్థస్వామిశిష్యుఁడు. రచించినది జైమినీభారతాశ్వమేధపర్వము. ఇది ఆంధ్రకర్ణాటక సామ్రాజ్యమేలిన సాళువ (గుండరాజపుత్త్రుఁ డగు) నరసింహరాయల కంకిత మొనర్చెను. ఈతఁడు "వాణి నారాణి" యనినవాఁడఁట. ఈతనింగూర్చి యనేకకథలు చెప్పుదురు గాని నాటి కివి తావు గాదు. ఆంధ్రకవులలో పూర్వకవులలో నొకఁడుగ నెన్నఁబడినవాఁడు.

**పిల్లలమఱ్ఱి బేతాళరెడ్డి**-ఈమహనీయుని పూర్వనామము చెవ్విరెడ్డి యఁట. అయోధ్య నుండి వచ్చినవాఁడని కొన్నితావులందు చెప్పఁబడెను గాని స్పష్టముగఁ దెలియకున్నది. (వీరిని గూర్చి వెలమవారు చూడుఁడు.)

**పిలాటస్ శిఖరము** (Mount Pilatus)—స్విజర్లాండు దేశమున ఆల్ప్సు పర్వతములందలి యొకశిఖరము. లూసెర్న్ పురప్రాంతమున నున్నది.

క్రీస్తుప్రభుని సిలువవేయ విధించిన రోమనుగవర్నరగు పోంపియస్ పిలాత్తనునాతనిప్రాణముశాంతిలేక ఈపర్వతశిఖరమందుండిన యొకచిన్న జలనిలయమున వేదననందుచుండెనఁట. దాని నొకవిద్వాంసుఁడు శాంతింజెందించెనఁట. నాఁడాదిగ నాశిఖరమున కీపేరయ్యెను. ఇక్కాలమున నాశిఖరము స్వచ్ఛమైగన్పించిన, చక్కనికాలము రానుండు ననియు, మేఘావృతమైన, గాలివానలు హిమపాతములు కల్గుననియు నచటివా రనెదరు.

**పిలిగోత్రము**-(వీతహవ్య లేక యాస్కగణము చూ.)

**పిల్లి కండ్లు పోఁగొరునఁట, కుక్క పసిగొరునఁట**—(ఆంధ్రలోకోక్తి.)

**పిల్లి కండ్లు మూసికొని పాలు త్రాగినట్లు**— తన్నెవరును పాలకుండలోని పాలు తస్కరించి త్రాగుట చూడలేదని తలంచుచుండు ననిచెప్పెడుసామెత. (ఆంధ్రలోకోక్తి).

**పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటము**—(ఆంధ్రలోకోక్తి.)

**పిల్లికి ఎలుక సాక్షి, ఎలుకకు పిల్లి సాక్షి**—(ఆంధ్రలోకోక్తి.)

**పిల్లికోపము-తోఁక విదల్చుట**--పిల్లికి కోపముగల్గుతఱి తోఁకను విదలుచుట చూతుము. పశువులకు తోఁక అవసరములందు శరీర బలమును సమపఱచుటకు పడవను నడుపు చుక్కానివంటిది. నడుచుతఱి పశువులుతోఁకను నదల్చుచు నడుచుచుండుటయు, పరుండి కదలి పోవుకోర్కి గలుగుతఱి తోఁక జాడించుటయు ప్రసిద్ధమే. కుక్కలు, తోఁడేళ్ళు, కోఁతులు మొదలగునవి కోపమువచ్చినతఱి పండ్లు చూపునట్లే,ఎద్దునుకోపముగల్గి వైరిపై లంఘించునపుడు తోఁక నదల్చును. పిల్లియు నట్లే తనవైరిపై లంఘించుతఱి తోఁక నదల్చును. తోఁక పిల్లి శరీరమున బలిష్ఠమైన అవయవము.

**పిల్లిదృష్టి** — పిల్లులు మొదలగు కొన్ని జంతువుల కండ్లయందు, కనుపాపలకు వెనుక ప్రక్కగ, నొకపాటి తళతళమని ప్రకాశమును ప్రతిఫలింపఁజేయఁదగిన రిఫ్లెక్టరు(Reflector) అవయవము కలదు. కావుననే రాత్రులందు మనము మోటారులు మొదలగు గాఢదీపము ముందుగల బండ్లలో నేగుచుండుతఱి, నెదురుగ వచ్చు నెద్దు, పిల్లులు మొదలగు జంతువుల నేత్రములలో నీదీపముల వెలుతురుకిరణములు ప్రతిఫలించి, పెద్దవైదూర్యమరకతముల వలె వాటికండ్లలో ప్రకాశించుట గాంతుము. పిల్లి కండ్లు చీఁకటియందు మెఱయుచుంట సర్వసాధారణముగ నంద ఱెఱిఁగినదే.

పిల్లి పగలు తన కనుపాపలను చిన్నవిగ నుంచుకొని యుండును. పర్విడుతఱి ఆ కనుపాప లను తెఱచి పెద్దవిగ నొనర్చుకొనును. రాత్రు లందుఁ జీఁకటిలో ఆ కనుపాపలను చక్కఁగ తెఱచియే యుంచుకొనును.

మనము రాత్రిలందు చీఁకటియని యను కొనినది సరియగు చీఁకటియే కాదు. అరు బయట నక్షత్రములో, ఆకాశమందు తెలుపో, మఱి యేదియో కొంత హీనమగు చిన్న వెలు తురును ఇండ్లలోనికి సైతము పంపును. ఇంట నెకడనుండు దీపకాంతి లేశ మైనను కొంతయైన తెల్వి గల్గించును. ఈకొంచెపు వెలుఁగు పశువుల నేత్రములఁ బడి, లోని Reflector వలన ప్రతిఫలించి దానిముందునకు తెలివిని జూపును. అందుచే పిల్లి చక్కఁగాఁ జూడఁగల్గును.

కాని, తల వెండ్రుక దూరునంతటి సందైనను లేనిగదిలోనికి రాత్రి యేగి తల్పులు మూసికొని నను, భూమియందు లోఁతుగఁ ద్రవ్వఁబడి వెలుఁగు బొత్తిగాఁ జొరనితావున కేగినను అట పూర్తియైన చీఁకటి గాననగును. అందు మనుష్యులకే గాదు పిల్లికిఁగూడ నేమియుఁ గానరాదు. గాఢాంధకార బంధురస్థితిలో పిల్లి కండ్లును పనికిరావు.

**పిల్లిపాటు**- పిల్లిశరీరము దానిస్వేచ్ఛ నను సరించి ముడుచుకొనుటకుఁ గాని సాఁగఁదీసి చాఁచుకొనుటకుఁ గాని అనుకూలించు మృదు లక్షణమును, వ్యాపకలక్షణమును గలది. దాని కాళ్ళు మెత్తనివై రబ్బరువలె దెబ్బయొక్క తోఁపు నాఁపుకొనులక్షణము గలవి.

పడుటయందు శరీరమునకు పటిమ తప్పి చాఁచుకొనుట మామూలైనను పిల్లికిఁగల లేశ మాపదయందు నపాయస్థితియందు నధికమై సాహసవంతమైన దగును. (వేఱుమా ర్గము లేనప్పుడు పిల్లి తిరుగఁబడి మనుష్యుల నెదిర్చి, యపాయ మొనర్చుట ప్రసిద్ధమే). తోడనే తనశరీరము నది ముడుచుకొని తిన్నగ నిలిచియుండునట్లు జాగ్రత్తగొని నేలఁ బడుతఱి నాఁచుకొనఁగల్గును. కావున పిల్లి ఎత్తునుండిపడి దెబ్బతినుట తఱచు గలుగును. మిక్కిమీఱుతఱి నలుచుకొనుచు కొంత జాగ్రత్తగొనఁగల్గును. ఇది దానికి జాతిస్వభావశక్తి యని చెప్పఁబడు చున్నది.

పిల్లి యెత్తునుండిపడుటయు, జాగ్రతగొనిదెబ్బ తగులకుండ పాదములపై నేల కుఱుకుటయు సినీమాఫిలుముల (Cinema films) లోని కెక్కించియున్నారు. కాని, మరీచాల యెత్తు నుండి పడుటలో పిల్లికి జాగ్రత నిలువ దనియు, నపాయకర మగుననియుఁ దలంపఁబడుచున్నది.

పిల్లి అపాయములనుండి తప్పించుకొనునను నమ్మకమువలన నాంగ్లేయులందు పిల్లికి తొమ్మిది ప్రాణములు కలవను వాడుక గలెను. అనఁగా ప్రాణము పోవునంతటిగండము లెన్మిది సంభ వించినను లి చావక బ్రతికియుండు నని భావము.

**పిల్లిపీచర చెట్టు**— (పిల్లితేఁగలు లేక శతమూలి, శతావరి) లా. Asparagus racemosus. సం. మదభంజనీ, శతపదీ, శత పత్రీ, శతమూలీ, శతవీర్యా, శతసుతా, శతా, శతావరీ, శతాహ్వా, అభీరు.

దీఁకి పిల్లితేఁగలనియు, శతమూలీ, శతావరీ యనియు వాడుకనామములు కలవు. ఇది సామాన్యపు పిల్లిపీచర లేక చిన్నపిల్లిపీచర యనియు, పెద్దపిల్లిపీచర యనియు రెండు భేద ములు కలది. రెండింటికిని గుణ మొక్కటియే. లెక్కలేని (బహుశః నూఱు) దుంపలు దీని కుండును గాన నీపేరంవినది. వేఁడిచేసి, దేహ పుష్టి, వీర్యవృద్ధిఁగల్గించి, పుంస్త్వము నుద్దీపింపఁ జేయును. స్త్రీలకు పాలుపడ జేయును. చర్మరో

గముల నడంచును. సెగరోగమును నివారించును. అతిసారము, ప్రమేహము, భ్రమ, మూర్ఛరోగము, మేహవాతము, రక్తపైత్యము, క్షయరోగము వీట్లను నివారించును. దీనికి తేనె, జీలకఱ్ఱ విఱుగుడు లని చెప్పఁబడినది.

**పిల్లిబ్రహ్మహత్య** — పిల్లిబ్రహ్మహత్య యని యుండనోపు. ఆంధ్రసాంప్రదాయార్థపదము. దీనునకు ఘాతయొనర్చి పాపము కట్టుకొనుటను దెల్పుతఱి ప్రయోగించుచున్నారు.

**పిలువనిపేరంటము చెప్పనివిందు**- (ఆంధ్రలోకోక్తి.)

**పిల్లులు నీటికి వెఱచును** - కుక్కలు, నక్కలు, కోఁతులు మొదలగు పెక్కుజంతువులు తమ చర్మమునుండియే అవసర మగుతఱి నొకజిడ్డుపదార్థమును వెడలఁజేసి, తమశరీరములు నీటఁదడిసినతఱి, ఆతడినుండి తమ్ముఁదామురక్షించుకొనఁగల్గును. కొన్నిటికి చర్మము దళసరిగానుంట ఏనుఁగులు,ఎనుములు మొ॥ తడి కనలేవెఱవకుండును. కోఁతులు, కుక్కలు మొదలగువాట్లకు రోమముల ప్రారంభమున కుదుళ్ళకడ జిడ్డుగల్గి వెంట్రుకల పైభాగమె తడియును గాని, చర్మము నంటియున్న అడుగుభాగము తడియక పొడిగా నుంట దులిపివేసిన తడి దుల్లిపోవును.

పిల్లి కట్లు గాదు. నీటఁ బడవేసిన వెండ్రుకలు చర్మమువఱకు తడిసిపోవుటయేగాక, నీటిని లోన నిలుపుకొనునంతటి మెత్తగానుంట స్పంజివలె మేన నీరావరించి నిలిచియుండును. దీనికిఁదోడు పిల్లి కుక్కవలె తనశరీరమును దులుపుకొన చేతగానిది. వీలగునంత తన శరీరమును నాకికొనుటయే దానికి చేతనైనన్ని సాధనము. కావున తోడనే రొంపపట్టి రోగము గల్గును. పిల్లులు నీటికి చాలభయపడి దరిఁ జేరవు.

**పిశాచానాం పిశాచభాషయై వోత్తరం దేయ మితి న్యాయము** - పిశాచములకు పిశాచభాషతోనె ప్రత్యుత్తర మీయవలయునని యర్థము. ఎట్టివారి కట్టికార్యము నెఱపవలెనని భావము.

ఇంకను "అహృదయవచసా మహృదయముత్తర" మితిన్యాయమును (మనస్ఫూర్తిగా కాకుండా అడిగినమాటకు హృదయపూర్వకముగాని ప్రత్యుత్తరమె యొసంగఁ బడవలెను.) నిట్టియర్థమే కలదు. మూఢం మూఢభాషైవ బోధయేత్ (మూఢునకు మూఢభాషలో బోధింపవలెను) అనియుం గలదు.

**పిశాయన గోత్రము**— (వార్ధ్యశ్వ లేక మిత్రయువగణము చూ.)

**పిష్టపేషణన్యాయము**—పిండిని తిరుగ తిరుగలియందు పోసి విసరుట యని యర్థము. నిరర్థకకార్య మొనర్చుటయం దీన్యాయమును వాడుదురు.

**పిష్టల్ గ్రాఫ్** (Pistolgraph) — (ఫ్రెంచిభాషాజన్యపదము. ఆకస్మికఛాయాచిత్రములను తీయుట కుపయోగపడునట్టియు, పిస్తోలువలె చిన్నదిగా నుండునట్టియు "కెమిరా"కు సంబంధించిన యొక యంత్రపరికరము. దీని విధానము దెల్పువిద్యకు పిస్టల్గ్రాఫీ అనిపేరు.

**పిస్తాచెట్టు** — లా. Pistacia vera. ఆంగ్ల. Pistachid or Pistacho tree. సం. దారుఫలమ్.

పిస్తాచెట్లు ఐరోపాదేశములందు, భరతదేశమునందు, సమశీతోష్ణప్రదేశములం బెరిగి కాఁచును. బాదముపప్పుగుణములే పిస్తాపప్పునకుండును. పిస్తాపప్పు భోజనపదార్థము. పప్పు తొక్కలందు పైత్యము, కడుపుబ్బరము గల్గించు గుణమును, పప్పునందు బలము, వీర్యపుష్టి,

దేహపుష్టి గల్గించుగుణమును గలదు. నూనె యందు స్త్రీలగర్భమును జెఱుపుగుణము కలదు. దీనికి పులుపు, దానిమ్మరసము విరుగుడులని చెప్పఁబడినది.

**పీకింగు నగరము**- చీనాపూర్వపురాజధాని. దీని నిప్పుడు పియ్పింగనుచున్నారు. ౧౩,౦౦,౦౦౦ జనాభా కలదు. చిహ్లా సంయుక్తా గ్రగుడసముద్రమిటకు ౧౦౦ మైళ్లుండును. దీని నిర్మాత కుబ్లైకాన్ చక్రవర్తి. అది ౧౨౬౪ సంవత్సర మందురు. ఇది చీనావారిభాగము, తార్తారులభాగము నని రెండు భాగములుగ నున్ననగరము. (చీనాదేశము చూడుఁడు).

**పీక్** (Peak)-పర్వతశిఖరము. (Mountains చూ.)

**పీట్ దుంపలు** (Peat)— పల్లపునేలలందు భూమియందు పారుదుంపలు. చాల పెద్దవిగను గట్టిగను, నుండును వీటిని రేకులుగ నరికి యెండించి వంటచెఱకువలె వాడుకొందురు. ఐరోపాదేశములలో కఱ్ఱలుదొరకనిప్రదేశముల పీట్దుంపరేకులే వంటచెఱకు. చాల వేడి నిచ్చును. ఒకంతట నిప్పు ఆరి పోదు. పెక్కుడుగుల దళసరిగల పొరలు పొరలుగా ఇవి తంపరప్రదేశములందు బయలు వెడలును. ఐర్లండుదేశములో ఏడవభాగ మిట్టి తంపర లనియు, అం దివి కొద్దివిగనో గొప్పవిగనో నిలిచియున్నవనియు చెప్పఁబడినది. కఱ్ఱకును రాతిసబొగ్గునకును నిది మధ్యావస్థయని చెప్పబడినది. దీనియందు ఐదింటమూఁడుభాగములు కార్బన్ డి. ఆక్సైడ్ కలదని చెప్పఁబడినది.

**పీటికామేహము**- ఇది సవాయిసంబంధ వ్యాధి. దేహ మంతటను గట్టివి యగు పొక్కులు లేచెడి మేహరోగము.

**పీఠవేదిక**- శిల్పశాస్త్రమున "దేవాలయ శిల్ప" మనంబడు విమాన నిర్మాణమునందు చెప్పఁబడిన సప్తవేదికలలో నొకటి. (విమాన లక్షణము చూడుఁడు).

పురుషవిమానములందు పీఠవేదికకు బ్రహ్మయు, స్త్రీవిమానములందు విష్ణువును, మిశ్రవిమానములందు పృథ్వియు, సంకరవిమానములందు విష్ణువును అధిదేవత లనియు, అన్ని విమానములందునను పీఠవేదికయందుఁ కశ్యపుఁడు ఋషి యనియు చెప్పఁబడినది.

కాగళవేదిక:- శిల్పశాస్త్రమున దేవాలయ శిల్పమగు విమాననిర్మాణమునందు చెప్పఁబడిన సప్తవేదికలలోనొకటి.(విమానలక్షణము చూ.)

పురుషవిమానమునం దీవేదికకు ఇంద్రుఁ డధిపతి యనియు, స్త్రీవిమానములం దగ్నిహోత్రుఁ డధిపతి యనియు, మిశ్రవిమానములందు జల మధిదేవత యనియు, సంకరవిమానములం దీశ్వరుఁ డధిదేవత యనియు, అన్నివిమానములందు కాగళవేదికయందు అత్రి మహాముని ఋషి యనియుఁ జెప్పఁబడినది.

**పీతచందనము (చెట్టు)**- ఇది మంచి గంధపుజాతిలోనిది. దీనిగంధము, చూర్ణము, కషాయము, అతిసారము, ఎక్కిళ్లు, చర్ది, తాపము, ప్రమేహము, రక్తపైత్యము, విదాహము, సర్పి మున్నగురోగముల నివారించునని చెప్పఁబడినది.

**పీనస**—ఆంగ్ల. Polypus of nose. ముక్కువెంట చీము, రక్తము దుర్గంధయుతమై పడెడి మొండిజబ్బు. ఇట్టిరోగము చెవికిఁగూడ కల్గుట కలదు.

**పుంగీ**— బౌద్ధసన్యాసి. (లామా చూ. లుంగీ చూడుఁడు.)

**పుండరీక క్షేత్రము** - దీనికి పాండరీపుర మనియు, పంఢార్పూర్ అనియు నిప్పుడువాడుచున్నారు. భీమరథినదీతీరము. బొంబై రాజధానిలోని షోలాపూర్ జిల్లాలోనిది.

దీని తొల్లింటిపేరు పుండరీకక్షేత్రమనియు, తాపసాశ్రమక్షేత్రమనియు, పౌండరీకపురమనియు, పాండుపురమనియు, పుండరీకమనియు, పాండేర్పూరనియు పెక్కు నామములఁ బరఁగెనఁట. పుండరీకర్షి యిట తపమొనరించువాఁడు. కృష్ణుఁడును, రుక్మిణియు నిట కేతెంచి యాఋషిం జూచిరి. ఇట విష్ణుదేవస్థానము చాల గొప్పది. కడు ప్రసిద్ధవంతము. దేవాలయమున శ్రీకృష్ణునివిగ్రహము పూజింపఁ బడుచుండును. అమ్మవారు రుక్మిణీదేవి. దేవునిం బ్రాంతమువారు "పాండురంగ విఠల్" అనియు, "విఠోబా" యనియు నందురు. విఠలునాథుఁ డనియు నందురు. ఇది చైతన్యులచేతను కూడ గౌరవింపఁ బడిన క్షేత్రము. చైతన్యచరితామృతము.మధ్య ౯ అధ్యా. ప్రశంసింపఁ బడినది. వరాహమిహిరుని బృహత్సంహిత ౧౪ శ్లో॥ ౧౫ కమునను ప్రశంస కలదు.

**పుండ్రదేశము లేక పుండ్రకదేశము**—(కరూష యనియుం పేరు గలదు.) పుండ్ర, పౌండ్రకదేశము వేర్వేరు గాన నొకటే యని పొరపడరాదు. ఈసంగతి పార్గిటరు పరిశోధకుఁడు స్పష్టముగఁ దెల్పియున్నాఁడు. దీనిని కొందరు కరూషదేశమనియు వాడుచుండిరఁట. గాని, వేఱొక కరూశ యగు అధిరాజదేశము వేఱుదేశమై దీనితో నేసంబంధము లేనిదిగా నెఱుంగఁ దగును.

Prof. Wilson పరిశోధకుఁడిప్పటి రాజషాయి, దినాజ్పూరు, రంగపూరు, మాల్డా, బోగ్రా, తిర్హూత్ మండలములు చేరియుండినదనియు, పెరుగన్పండితుఁడు దినాజ్పూర్, రంగపూరు, బోగ్రా ప్రాంతదేశములు చేరినదనియు, కన్నింగ్హామ్పండితుఁడు మహాస్థానగడము, బోగ్రా జిల్లాలలో కరతోయానదిపై నుండినట్లును, పార్గిటర్పండితుఁడు మాల్డా జిల్లా పూర్ణియాలోని భాగము (కోశనది తూర్పువఱకు) దినాజపూ ర్రాజషాహి జిల్లాల భాగములం గల్గియుండె ననియు నభిప్రాయము లిచ్చియున్నారు. మహాభారతము సభాపర్వము ౫౧ యందు గంగానది కుత్తరమున అంగవంగలమధ్య నని వివరింపఁబడెను. మఱియు నందు పుండ్ర, పౌండ్రక వేఱు దేశములని చెప్పఁబడెను. ఇటీవల పరిశోధకులు సంతాల్పరగణాలు వీరభూమి(Birbhum)హాజరీబాగు ఉత్తరభాగము పుండ్రదేశమని పోల్చిరి. ఇంకను కొందరు గంగానది కుత్తరమున పుండ్ర లేక పుండ్రకదేశమును, దక్షిణమున పౌండ్రకదేశమును ఉండిన వని పోల్చుచున్నారు. మహానది, కామరూప,కరతోయ,గంగానదులు కొంచెము హెచ్చుతక్కువ ఎల్లలనియు, ఉత్తరబంగాళమున కీపే రుండెననియు తలంపవలయునని తేలుచున్నది.

ఐతరేయ బ్రాహ్మణమున పుండ్రదేశప్రశంస గలదు. రాజధాని మహాస్థానపురము. ఇది మహానదీతీరము. ఇట పాటలీదేవిదేవస్థానము కలదని పద్మపురాణమున ఉత్తర ౫౧ యందు ప్రశంసింపఁ బడినది. ఇది ఇప్పటి బోగ్రా కుత్తరముగా నేడు మైళ్ల దూరమున నున్నది. దీని పరేంద్ర లేక బరేంద్రపురమనియుఁ బేరుండె నఁట. పుండ్రవర్ధనమనియు నెక్కువ వాడుక యుండెనఁట. రానురా నదిమాఱి, పాండువా యయ్యె నఁట. (మాల్డా కుత్తరముగా నాఱుమైళ్లు).

ఒకతఱి క్రీ. వె. ఎన్మిదవ శతాబ్దమున ఈ రాజధానిపై కాశ్మీరదేశాధీశుం డగు జయాపీడుఁడు వచ్చినటులను, అప్పుడు జయంతుఁడనునృపతి పుండ్రవర్ధనము నేలుచున్నటులను, రాజతరంగిణి IV యందు కలదు. ఈ దేశమేలిన నరపతులలో వాసుదేవుఁ డనునాతఁడు

శ్రీకృష్ణునిసమకాలికుఁడుగ హరివంశము-౨౮-౧-౨౮-౨ యందు కలదు. పద్మపురాణ, ఉత్తర ౯౮ యందునను, బ్రహ్మాండపురాణ పూర్వ ౫౫ యందును ఈసంగతి చెప్పఁబడినది.

• • వేఱొకతఱి తూర్పుబంగాళమునకు సోనా ర్గాన్ రాజధానిగను, పశ్చిమ బంగాళమునకు సాత్గాన్ రాజధానిగను నుండెనఁట. ఇక్కా-లము క్రీ. వె. ౧౩౫-౨ అందురు. సోనార్గాన్ ఢక్కా-కడ నున్నది. దీనిసంబంధ మెంతవఱకో కనుఁగొనవలసియుండును. ల్యాస్ షా యనువాని క్రింద మహమ్మదీయసైన్యము వంగదేశముపై దాడివెడలి, తూర్పు, పశ్చిమ బంగాళభూపతుల నోడించి, ( )వర్ధనమునకు (అక్కా-లపు పాండు ◦)ఫిరోజాబాదను పేరిడఁబడెనఁటగాని ఎవ్వరును వాడకుండిరఁట. పిదప క్రీ. వె. ౧౮౮౬ వఱకు మహమ్మదీయపాలనమం దుండెనఁట.

కాని, యింకొక్క- సంగతికూడ తెలియు చున్నది. కాశ్మీరదేశాధీశుఁడగు జయాపీడుఁడు, పుండ్రవర్ధనమేలుచుండిన జయంతు నోడించె ననియు, మఱియు తనమామగా రగు జయం తుని అట రాజుగాఁజేసె నిల్పెననియుఁ గూడ తెలియుచున్నది. అత్తరుణముననే లౌకికశకము లేక సప్తర్షిశకము ౩౮-౨౫ (క్రీ. వె ౭౫౦) ఈదేశమున స్థాపింపఁ బడినదని చెప్పఁబడినది గాని దీనినిజ మింకను పరిశీలింప వలసియె యుండును.

**పుండ్రుఁడు** — అత్రిసంతతి. చంద్ర వంశక్షత్రియుఁడు. తండ్రి బలి. ఈతనినుండి యాతఁ డేలినదేశమునకు "పుండ్రదేశ" మని పేరయ్యెను. పుండ్రుని సోదరులు అంగుఁడు, వంగుఁడు, కళింగుఁడు, సుహ్మఁడు లేక సుబ్ర హ్మఁడు. (పుండ్రదేశము చూడుఁడు.)

**పుచ్ఛకశిలగోత్రము**-(పునీతకులచూ.)

**పుచ్ఛకాయలదొంగా! అంటే భుజ ములు తడవి చూచుకున్నాఁడఁట**-(ఆంధ్రలోకోక్తి.)

**పుచ్ఛకుల గోత్రము** -(పునీతకులచూ.)

**పుజియామా శిఖరము**—దీనిని భక్తి కొలఁది జపాన్ దేశస్థులు "ఫుజిసాన్" అనె దరు. జపాన్ దేశమునఁ గల పర్వతశిఖరము. ౧౨౩౯౫ అడుగులయెత్తు. చాల సౌందర్యవం తమై గంభీరముగ గన్పట్టునది. టోకియో నగరమునకు నైరృతిదిశగా నలువది మైళ్ళదూ రము. తొల్లింట నిది యగ్నిపర్వతమై యుండె నఁట. దీనిబిలము చుట్టుకొలఁత మూఁడుమైళ్ళు, ఐదువందల యడుగులలోఁతు నుండును. జపానీ యుల కిది పవిత్రయాత్రాస్థలము. సముద్ర మునఁ జనుచున్న యోడలలోనివారికి దేశభూమి గానబడకమున్నె "ఫూజీయామా శిఖర మగు పడును. (జపాన్ దేశము చూడుఁడు.)

**పుట్** (Put)-వాణిజ్యసంబంధ పరిభాషా పదము. Put- దీనికి Put option అనియు నందురు. చెల్లింపఁబడిన ప్రీమియము నుబట్టి నిర్ణయింపఁబడిన యొకధరకు నిర్ణయింపఁబడిన దినమున అమ్ముటకు లేక అమ్ముట కేర్పాటు నకు Put అనియెదరు. Option నకు రెట్టిం పగుతఱి Put and Call అనియెదరు. Put Optionనకు పైఁగా రెట్టింపుమొత్తమును గూడ నమ్ముటకు అనుమతిగల అమ్మకమునకు Put of more అనిపేరు.

**పుటక లేక పుటస్రవ రోగము**— ఇది నాసికా (ముక్కు-) రోగము.

**పుటత్రయము**- (త్రిపుటములు చూ).

**పుటపాకసన్నిపాతము**— (సన్నిపాత దోషము చూడుఁడు).

## పుటసప్తకము (సప్తవిధపుటములు)

ఆయుర్వేద వైద్యశాస్త్రమున ఔషధములు పుటమువేయుట ఏడు విధములు.

౧ మహాపుటము, ౨ గజపుటము, ౩ వరాహపుటము, ౪ కుక్కుటపుటము, ౫ కపోతపుటము, ౬ గోవరపుటము, ౭ భాండవపుటము.

## పుట్టకొక్కులు (కుక్కగొడుగులు)

(Agaricus)— ఆకారములచే లెక్కపెట్టలేనన్ని భేదములు గల పుట్టకొక్కులను ఆంధ్రదేశపువ్యవసాయకుఁడాఱు ముఖ్యభేదములుగ విభజించును. ఇది సనాతనముగ నాంధ్రదేశస్థుఁడెఱిఁగినది. మంచిపుట్టకొక్కు, గరువు లేక కూటిపుట్టకొక్కు, దసరాపుట్టకొక్కు అను మూఁడు భేదజాతు లాహారముగ పనికివచ్చుననియు, పాముపుట్టకొక్కు, ధూళిపుట్టకొక్కు, మొండిచేయిపుట్టకొక్కు అనునవివిషప్రాయములై భోజనానర్హము లనియు చెప్పుదురు. పుట్టకొక్కులను కుక్కగొడుగు లనియు నందురు.

మంచి పుట్టకొక్కు:- ఇది తాటితేఁగవలె పొడుగుగ నొక్కొక్కప్పుడు తొమ్మిది అంగుళములవఱకు పొడవుగల్గియు, భూమిలోనికిఁ గూడ కొంత పాతఁబడియునున్న కాడతో అంగుళమునర మొదలు ఐదంగుళములవఱకు అడ్డుకొలతలుగల గొడుగుల విప్పి తెల్లనిపొరలను ప్రదర్శించుచుఁ గన్పించును. ఇది తెలుపురంగుతప్ప ఇతరమగు రంగులను గల్గియుండదు. తాటిఆకు పొరలం బోలి పొరలు పైకి అగపడుచునే యుండును. తఱచుగ నిది యెఱుపుసంబంధము. తాకని కంచెలకడను, పుట్టలపైని, చెట్లక్రింద ఎఱ్ఱమట్టి పచ్చమట్టిగలతావుల నుత్పన్నమగును.

గరువుపుట్టకొక్కు—దీనిని కూటిపుట్టకొక్కను టయుఁ గలదు. ఇది చిన్నదిగను, ఒక్కొక్కచో పెద్దదిగను కూడ నుండును. మంచిపుట్టకొక్కు జాతివలెనే అన్నిలక్షణములు గల్గి పరగడి బయళ్ళయందు నుత్పన్నమగును. ఇదియు భోజనోపయోగ మైనదియే.

దసరాపుట్టకొక్కు - ఇది ఆశ్వయుజమాస ప్రాంతముల నుద్భవించుటంజేసి దసరాకాలము గాన నాపే రిడఁబడి యుండనోపు. ఇదియు భోజనపదార్థమే. మంచిపుట్టకొక్కువలెనే అన్ని లక్షణములు గల్గియుండును. కాని,ఇవి పెద్దవిగ నుత్పన్న మయ్యెడిని. ఇవి పుట్టలపైని, కంచెలకడను అచ్చటచ్చట స్వచ్ఛమగు పచ్చమట్టి, ఎఱ్ఱమట్టి బయళ్ళయందు నుత్పన్నమై విస్తారముగ దొరకును. పరిశీలకులు మంచిపుట్టకొక్కు, గరువుపుట్టకొక్కు, దసరాపుట్టకొక్కుల భేదములు కాలభేదము, స్థలభేదము, వర్ష భేదములనుండి కల్గినవే యని పోల్చిరి. ఈ మూఁడుజాతులు పెక్కండ్రకు:భోజనోపయోగములుగ నున్నవి.

భోజనమున కుపచరింపని విషజాతి యగు పాముపుట్టకొక్కుగొడుగు గన వేర్వేఱు రంగులు, గీతలు, గళ్లు మొదలగువాటిని గల్గియుండును. ఇందు పెక్కులు ఉండలుగనే తనుగొడుగుభాగమును ప్రదర్శించును. ఒకవేళ గొడుగు విప్పినను వాట్లపై మెత్తనిపిండి జల్లినట్లు కన్పించు దృశ్యము కలగి. పైయాకారమే అట్లు గన్పించును గాని అందు పిండి యుండదు.

విషజాతియందు రెండవదియగు ధూళిపుట్టకొక్కు ఇంచుక నీలవర్ణము గల్గియుండును. గొడుగు నించుక రేఁపిన, అందుండి నీలవర్ణపు ధూళి పైకెగురును. ఇది భోజనమునకువాడరు. విషజాతియందు మూఁడవది యగు మొండిచెయ్యిపుట్టకొక్కు భూమినుండి పైకి మొండిచెయ్యివలె లేచి ఒకటియొ రెండో వ్రేళ్ళు పైకి నిలువఁబెట్టినట్లు పిదప విడఁబాఱును. పుట్టకొక్కులన్నిజాతులు ఒకేరాత్రియం దుద్భవించి తెల్లవాఱువఱకు పెరిఁగి పెద్దవియై యుండును. ఇందు తినవలసినవాటిని పిదప పదిపండ్రెండుగంటలలో

తీసివేయవలయునే గాని ఆలసించిన నవి ముదిరి నారగట్టిపోవును. తిరుగ తెల్లవాలు వఱకే పురుగుపట్టి చెడిపోయియుండు నందురు. ఒక్క మొండిచెయ్యిమాత్ర మొకవారమువనుక నిలిచి యుండునందురు.

సనాతన హిందూకుటుంబములందు మొండి చెయ్యి ఇండ్లకడఁగాని, ఇంటిపైని గాని మొలచుట దుశ్శకున మనియు, ఇంట చావులు, ఆపదలు, కల్గుట నిది సూచించు ననియు నొక ప్రబలమగు నమ్మకము కలదు. ఇది విషజాతి యగుట తినఁదగినదియుఁ గాదు. పుట్టకొక్కు జాతులలో మొండిచెయ్యి మిగుల బలమగునది.

పుట్టకొక్కులకు వేళ్ళుండవు. ఇది జీవముగల మొక్క గాదనియు, క్రోటన్మొక్కల ఆకులనందగు కాడల నంటి పట్టుకొని తెల్లగ బయలు వెడలు ఫంగస్ లేక పంగాజాతి యొక్క విజృంభణపరిణామములుగ జెప్పఁబడినది. ఈఫంగస్ జంతువు గాని, పురుగు గాని గాదనియు, రోగ పదార్థమనియు, క్రోటన్ మొదలగుచెట్ల యాకుల కాడల నంటి, వాట్లం గోఱికిపైచి ద్రవము వెలువమునట్లు గల్గించి చెట్ల నెండఁజేసి చంపునదిగ నంద రెఱిగినదే. అట్టి ఫంగస్ గాలికెగిరి నేల అదియే పుట్టకొక్కులకు బీజ మని చెప్పఁబడవలయును. దానికి భూసంబంధముకల్గి వర్షములవల్ల నానుట కలుగకనే ఇటుల విజృంభించి పరిణమించునని కనిపెట్టఁబడినది. ఆంగ్ల వృక్షశాస్త్రవేత్తలును ఇట్లేయని తాము కనిపెట్టినట్లు వ్రాసిరి. వారింకను ఫంగస్ భూమికిఁ జేరినతరి, అట ఎరువు (Manure)సంబంధము ఏదో (తెలియరానిది) దానికిఁ గలియుకతన విషపూరితమగుచుండుననియు, వర్షమున నాని యది విజృంభించి పుట్టకొక్కగుటతో నది విష సంబంధమగు పుట్టకొక్కగుననియు, దానిని దినరాదనియు ననుచున్నారు.

ఆంగ్ల శాస్త్రవేత్తల పరిశీలనల మేరకు పుట్టకొక్కునందు Chlorophyll అనంబడు చెట్లయందుండు రంగుపదార్థ ముండదనియు, దీనికి వేళ్ళుండవనియు మహావాయుమండలియందుండు (Atmosphere) గాలిభాగములును ఇతర జాతిమొక్కలు తమయాహారముగ పీల్చుకొనునట్లీఫంగస్సు పరిణామమగు పుట్టకొక్కులును ఇతరఫంగస్సులవలెనే పీల్చుకొనలేవనియు తేలినది. పుట్టకొక్కు ఫంగస్ పరమాణువులనుండి ఉద్భవించును. ఆపరమాణువులకు Sporesఅని పేరిడియున్నారు. ఒకరాత్రియందే పుట్టి పెరుగును. ఆంగ్లులు పుట్టకొక్కులను Ketchup అను పేరుగల ఊరగాయగ జేతురఁట.

ఐరోపాసీమలం దీపుట్టకొక్కులు గుఱ్ఱములు మేయు పరగటి బయళ్ళయందు విస్తారముత్పన్నమగునట. గొడుగులు 3 మొదలు 5 అంగుళము లుండునఁట. అవి నైసర్గికముగ మే నెలమొదలు డిశంబరునెలకడకు జనించునఁట గానిచిన్నచిన్నమళ్ళయందు ఫంగస్ విత్తనముగ నిడి నాటించి అన్నికాలములందు మొలపించుచుందురఁట.

ఆయుర్వేదవైద్య శాస్త్రమున పుట్టకొక్కులను తెల్ల,ఎఱ్ఱ,నల్ల జాతులు మూఁడుగ విభజించిరి. ఎన్నివికారరూపములనందినను రంగు లేగుణమునకు ప్రధానమని వారి యభిప్రాయము గానోపు. పుట్టకొక్కుల లోనికిచ్చిన నవి అగ్నిమాంద్యము గల్గించి, మలమూత్రనిరోధమును జేసి మేదోరోగము, మేహరోగముల మొలకెత్తజేసి వాతప్రకోపము, శ్లేష్మప్రకోపముల రేపి గురుత్వముగ నుండి చక్కగ జీర్ణమగునేని బలము, దేహపుష్టి గల్గించు ననియు, అధికముగఁ దినిన గుహ్యరోగముగూడ గల్గించుననియు, పుట్టకొక్కులసామాన్యగుణముగఁ జెప్పఁబడినది. తెల్ల పుట్టకొక్కు వాతమును రేపి జ్వరమును గల్గిం

చుననియు, ఎఱ్ఱపుట్టకొక్కు వాతమును రేపి అగ్నిమాంద్యము గల్గించు ననియు, నల్లపుట్ట కొక్కు వాతమును రేపికఫమును దేకింపించినర్వ దోషములను గల్గించి శరీర మనారోగ్యము పాల్చేయుననియు, తెల్లపుట్టకొక్కునకు ఆవాలు జీర్ణౌషధములు పరిహారములుగ లోనికీయనగు ననియు, ఎఱ్ఱ నల్ల పుట్టకొక్కులకు శక్కించు టయు, విరేచనముల జేయించి వెడలించుటయు, ఆలస్యమైనచో జీర్ణౌషధములం దావించి దోషశాంతి గల్గించుటయు పరిహారము లని చెప్పఁబడినది.

**పుట్టని బిడ్డమొలకు పూసలుకొన్నట్లు**—(ఆంధ్రలోకోక్తి.)

**పుట్టవ్రణము (Cancer)** సెలలు వేసెడి వ్రణము. ఇది చాల మొండికుఱుపు. మానుట చాల కష్టము. ఎక్కువ జాగ్రత్త గొనఁదగిన వ్రణము.

**పుట్టించినవాఁడు పూరిమేపఁడు**—(ఆంధ్రలోకోక్తి.)

**పుట్టినన్నాళ్ళకు పురుషుఁడుయజ్ఞముచేసినట్లు**— (ఆంధ్రలోకోక్తి)

**పుట్టుట**-(జననమరణములు చూడుఁడు.)

**పుట్టుమచ్చ**—పుట్టినప్పటినుండి శరీరము నందున్న మచ్చను పుట్టుమచ్చ యందురు. (తిలకఫలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.)

**పుట్టెడుఆముదము రాచుకొని పొరలినా తనకుగానిది అంటదు**- (ఆంధ్రలోకోక్తి.)

**పుడ్డానది**—(పద్మానది చూడుఁడు.)

**పుణ్యకాలములు**—రవి మేషాదిరాసు లందు ప్రవేశించు కాలమునకు సంక్రాంతి యనిపేరు. సంక్రాంతియందలి పవిత్ర మగు ప్రధానకాలమునకుఁ బుణ్యకాల మని పేరు. ఇందు పితౄర్చన మొనర్తురు.

సూర్యుఁడు మేష తులా రాసులందు ప్రవేశించుకాలమునకు విషువత్పుణ్యకాలమని పేరు.

సూర్యుఁడు వృషభ, సింహ, వృశ్చిక కుంభ రాసులందు ప్రవేశించు కాలమునకు పారిపద లేక విష్ణుపద పుణ్యకాలమని పేరు.

సూర్యుఁడు మిథున, కన్య, ధనుస్సు, మీన రాసులందు ప్రవేశించుకాలమునకు షడశీతి పుణ్యకాలమని పేరు.

సూర్యుఁడు కర్కాటక మకర రాసులందు ప్రవేశించుకాలమునకు అయనపుణ్యకాల మని పేరు. ఇటుల సంవత్సరమున సంక్రాంతిపుణ్యకాలములు పండ్రెండని యెరుంగునది.

ఇందు మకరసంక్రాంతిమొదలు కర్కాటక సంక్రాంతివఱకు ఉత్తరాయణ మనియు, అది మొదలు మకరసంక్రాంతివఱకు దక్షిణాయన మనియు సూర్యుఁడుత్తరదక్షిణదిశల నాకసమున సంచరించు మార్గముం గూర్చి అయనములం దెల్పుచున్నారు. అయనము అర్ధసంవత్సరముగ నుండెడిని.

కర్కాటకసంక్రమణ ప్రవేశమున కిరువది ఘటికలు(అనఁగాఎన్మిదిగంటలకు)ముందుగను, మకరసంక్రమణప్రవేశమున కిరువదిఘటికలతరు వాతను పితౄర్చనము విధింపఁబడినది. అనఁగా ఉత్తరాయణమునందే పితౄర్చనలు జరుపవలయునని భావము. తక్కిన సంక్రమణములందర్శ కాలములందే పితౄర్చనలు సలుపవలయునని చెప్పంబడినది.

**పుణ్యదినములు**-(మాధ్వవైష్ణవపుణ్యదినములు చూడుఁడు.)

**పుణ్యానికి పుట్టెడిస్తే పిచ్చకుంచమని పీక్కుతిన్నదఁట**-(ఆంధ్రలోకోక్తి)

**పుత్రికగోత్రము**—(అత్రిపుత్రికాపుత్రుల గణము చూడుఁడు.)

**పుత్రిగోత్రము** (అగస్త్యఉపగణము చూడుఁడు.)

**పుత్రిణగోత్రము**-(విష్ణువృద్ధఉపగణము చూడుఁడు.)

**పుత్రులు పండ్రెండు విధములు (ద్వాదశవిధపుత్రులు)**— ౧ ఔరసుఁడు- తనధర్మపత్నియందు తనకుఁ గల్గిన సుతుఁడు. ౨ దౌహిత్రుఁడు - కుమార్తెయొక్క కుమారుఁడు. ౩ క్షేత్రజుఁడు- తనభార్య కితరునివల్లఁ గల్గినవాఁడు. ౪ గూఢజుఁడు - తన కన్యస్త్రీయందు గూఢముగఁ గల్గినవాఁడు. ౫ కానీనుఁడు- అవివాహిత యగుకన్యయందుఁ గల్గినవాఁడు. ౬ స్వయందత్తుఁడు- తనంతట తానే పుత్రుఁడ నగుదునని చేరినవాఁడు. ౭ పౌనర్భవుఁడు- పునస్సంధానము లేనిస్త్రీకిఁ గల్గినవాఁడు. ౮ దత్తుఁడు - తలిదండ్రులవలన నొసంగఁబడినవాఁడు. ౯ క్రీతుఁడు - విక్రయింపఁబడి (కొనఁబడి) పుత్రుఁడుగ పెరిగినవాఁడు. ౧౦ కృత్రిముఁడు-వీని నభిమానపుత్రుఁడని యందురు. ౧౧ అపవిద్ధుఁడు-తల్లిదండ్రులు విడువఁగ తనచేఁ బెంపఁబడినవాఁడు. ౧౨ సహోఢజుఁడు - ఒక్కతల్లివలననె దత్తత ఈయఁబడినవాఁడు.

**పుద్గల** (Atoms) **సంకలిత పుద్గల** (Compound Atoms) **లేక మొలక్యూల్సు** — వేర్వేరు ఎలిమెంట్సు (Elements) యొక్క పుద్గలములను (Atoms) కలిపి Compound atoms గా చేసినప్పుడవి మొలక్యూల్సు (Molecules) అనంబడును. వాటింగూర్చి "They are all alike and of the same weight" అని చెప్పంబడి యుంట వాటింగూర్చి యించుక తెలిసెడిని. Dalton పండితుఁడు వీటింగూర్చి గొప్పపరిశీలనల నొనర్చినవాఁడు గాని కొంత పొరపడె నని చెప్పఁబడినది. ఆయన ౨౩ ఎలిమెంట్సు కనుగొనెనఁట. పందొమ్మిదవ శతాబ్దమునందు ౬౦ ఎలిమెంట్సు కనుగొనఁబడె నఁట. ఇక్కాలమున ౯౨కలవని కనుగొనఁబడియున్నది. (ఎలిమెంట్సుగూర్చిన్ని చూడుఁడు.)

వీటిని బరిశీలించి కనుగొనినమహనీయులు చిరస్మరణీయు లగుదురుగాక. డాల్టన్ పండితుఁడు క్వేకరుగా చెప్పఁబడినవాఁడు. పిదపఁ జెప్పఁదగినవాఁడు. క్రీ. వె. ౧౭౭౮-౧౮౫౦ నాఁటివాఁడగు ఫ్రెంచిదేశస్థుఁడు. రసాయనశాస్త్రవేత్తయు నగు Gay Lussac పండితుఁడు. ఈయన gasesను కలుపుటనుగూర్చిన(Uniting gases) ధర్మములఁ గనుగొనినవాఁడు.

పిదపఁ జెప్పఁదగిన మహనీయుఁడు క్రీ. వె. ౧౭౭౯-౧౮౪౮ నాఁటివాఁ డగు స్వీడనుదేశవిఖ్యాతినిగన్న Berzeliusపండితుఁడు. ఈయన మొలక్యూల్సు, ఏటోమ్సుయొక్క బరువులం గనుగొని నిర్ణయించి తెల్పినవాఁడు. చనిపోవు దినమువఱకు పరిశీలనల నెఱపుచుండినవాఁడని యీయనంగూర్చి చెప్పుదురు. గొప్ప రసాయనశాస్త్రపరిశీలకుఁ డందురు.

పిదపఁ జెప్పఁదగినవాఁడు క్రీ. వె. ౧౭౭౬-౧౮౫౬ నాఁటివాఁ డగునట్టి Avogadro పండితుఁడు. ఈయనపరిశీలనకు ఫలితముగా "Equal volumes of all gases when under the same pressure and at the same temperature shall contain the same number of molecules" అను ధర్మమును గనిపెట్టిన మహనీయుఁడు. నేఁటికి నీధర్మ మాయనపేరనే "Avogadro's Law" అనఁబడుచున్నది.

పిదపఁ జెప్పఁదగినవాఁడు క్రీ. వె. ౧౮౨౬-౧౯౧౦ నాఁటివాఁడగు ఇటలీదేశస్థుఁడగు రసాయనశాస్త్రవేత్త Canizzaro పండితుఁడు.

ఈయన పరమాణుప్రమాణముల (Atomic weights) నిర్ణయించినవాఁడు. వాటి వరుస గుదిర్చినవాఁడు. ఏటోమ్సు, మొలక్యూల్సు లందలి భేదములఁ బరిశీలించి స్పష్టపఱిచిన వాఁడు. మొలక్యూలు లెట్లు రచింపఁబడెనో పరిశీలించి చూపినవాఁడు. వీ రెల్లరు చిరస్మర ణీయు లగుదురు గాక.

**పుదీనా**—లా. Mentha Sativa లేక Arvensis. ఆం. Marchmint. సం.పూతనీ.

పుదీనా పాలలో వైచిన వేగిరము విఱిగి, చెడిపోక నిలుచునట్లు చేయును. పుదీనాయాకు, కాడలు వేఁడి చేయును. సమూలచూర్ణకషాయ ములు వేఁడిచేసి జీర్ణశక్తి నధికపఱచును. వాం తులఁ గట్టును. మలమూత్రములను, స్త్రీలఋతు రక్తమును చక్కఁగ వెడలఁజేసి తెరతెరలుగ వచ్చు కడుపునొప్పి నాఁపును.

పుదీనా సేవనమున నపస్మారరోగము, ఈడ్పు లు, కఫదోషము, పాండురోగము, వాతరోగము, వికారములు నివారింప నగునని చెప్పఁబడినది.

**పుదుక్కోట సంస్థానరాజ్యము** — ఇది తిరుచునాపల్లి, తంజావూరు జిల్లాలనడుమ నున్న చిన్న స్వదేశసంస్థానము. భూపతికి "తొండైమాను మహారా"జను బిరుదముకలదు. రాజధాని పుదుక్కోటపురము. ఈరాజ్యమున కొన్ని సుప్రసిద్ధ దేవస్థానములు కలవు. ఇది బ్రిటీషు ప్రభుత్వరక్షితసంస్థానము. మద్రాసు రాజధానీప్రభుత్వాధికారమునకు లోఁబడినది.

**పుదుచ్చేరి** — ఈనగరమును ఫ్రెంచి వారు "పోండిష్చెర్రి" యనియు, ఆంగ్లేయులు "పాండిచేరి" యనియు, అజ్ఞులు "పుల్చేరి" యనియు వాడుచున్నారు. ఇది భరతదేశము లోని పరాసువారి పరిపాలనకు ముఖ్యనగరము. ఇట ఫ్రెంచిగవర్నర్ నివసించుచున్నాఁడు. ఒక పాటి మెగుమతిదిగుమతులుగల రేవుపట్టణమై యున్నది. ఇట ఆర్టిజన్ వెల్సునుండి నగరమున నీటిగొట్టము లమర్పఁబడినవి. (ఫ్రెంచిఇండియా చూడుఁడు.)

**పునగశీలిగోత్రము**-(పునగోశీల చూ.)

**పునగోశీలకుల గోత్రము** — ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.)

పునగోశీల (పునగశీల, గోశీలకుల) గోత్రము దశార్ణేయ(౧)గోత్రము. సంస్కృత గోత్రము. పౌలస్త్యస. పులస్త్యగణము. ఈ గోత్రమునకు ఆంగీరసపౌలస్త్యేతి అని యొక ద్వ్యార్షేయప్రవ రయును, పునగోశీల యను గోత్రరూపమునకు గోశీల, ఉత్తమ గోశీల, పల్లవ గోశీల, పటు గోశీల, సత్యగోశీల, భీమగోశీల, శ్రీగోశీల, నంది గోశీల యనియు, అష్టార్షేయప్రవరయును కలదు. ఇంకను కొందరీగోత్రజు లీఅష్టార్షేయప్రవరకు కడను సూర్యకుల అని చేర్చిన వార్షేయప్రవర చెప్పుదురు.

పునగోశీలగోత్రమువారిది ఆపస్తంబసూత్ర ము. యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్య ప్రవర ఖండ. సమానగోత్రములు లేవు. ఈ గోత్రము కొందఱికి. పృథ్వీశానుఁడు దేవత. భార్య పుష్పాంబ. మందరగిరి తపస్థానము. పుష్పసర స్సు తటాకము. జపము లక్ష. దీపములు ౪౦. క్షేత్రసంఖ్య ౩౦. స్వర్ణముదానము. తెల్లపట్టు, పులిగోరులు, పునుగు, దేవకాంచనము వర్జనీ యములని చెప్పఁబడినది.

ఈ గోత్రజులలో మఱి కొందఱకు సువర్ణే శుఁడు దేవత. సువర్ణాంబ భార్య. అంతర్వేది తపస్థానము. సువర్ణాంబుధి తటాకము. జపము దశకోటి. దీపములు ౩౬. క్షేత్రసంఖ్య ౬౫. స్వర్ణము దానము. ఎఱ్ఱచెఱకు వర్జనీయము. అనిచెప్పఁబడినది.

**పునఖాపట్టణము**—(బూటాన్ దేశము చూడుఁడు.)

**పునరుక్తి పదములు**— ఆంధ్రులు వాడుకయందు కొన్నిపదము లనవసరముగ పునరుక్తములుగ నుపయోగించు చున్నారు. అగ్గినిప్పు, నిశిరాత్రి, కారునలుపు, పైమీద, నారతడప, తాచుపాము మొదలగునవి.

పునరుక్తుల వలె నుండియు మొదటిపదము (1) ప్రత్యేకార్థముదెలుపుటకొఱకును (2) విశేషణముగా నుండుటకొఱకును వాడఁబడు చున్న పదములు కొన్నియు కలవు.

(1) పైమీద = భుజముపైని

(2) కారునలుపు = మిక్కిలినలుపు.

**పునర్వసు**— యదుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి దుందుభి. సోదరుఁడు దవిద్యోతుఁడు.

దక్షపుత్రికలలో పునర్వసు వనునామె యొకతె గలదు. ఆమె చంద్రునిభార్య. నక్షత్రము.

**పునర్వసునక్షత్రము** — ఆకసమున కుమ్మరసానంబోలిన యైదునక్షత్రములసముదాయము. జ్యోతిషశాస్త్ర గ్రంథములందు దీనికి అదితి ఆదిత్యం, దేవమాతా యనుమాటలను పర్యాయపదములుగ వాడియున్నారు.

దీని కదితి అధిదేవత యనియు, దేవగణ నక్షత్ర మనియు, తిర్యఙ్ముఖము, పుంస్వభావ మనియు, ప్రవేశించిన ముప్పది ఘటికలపై త్యాజ్య (విషఘటికలు) మనియు, ఏఁబదినాల్గు ఘటికలపై నమృతఘటిక లనియు, చరస్వభావ నక్షత్ర మనియుఁ జెప్పఁబడినది.

**పునఃపునానది-గంగానదీ సంగమము**-ఈ పవిత్రతీర్థస్థలి. పాట్నానుండియు, బంకీపూర్ నుండియు నెన్మిదిమైళ్ల దూరమునయున్నది. గంగానదియందు పునఃపునానది సంగమించుతావునఁ గల గ్రామమునకు "ఫత్వా" యని పేరు. ఇట పితృర్చన లొనర్తురు. ఇచట గొప్ప గొప్ప స్నానయాత్రలు జరగునఁట. సంగమమున కెగువనున్న బైకాన్తపూరు పెద్ద పట్టణము. ఇందు బట్టలు విస్తారముగ నేయఁబడుచున్నవి. ఇంక కొంత యెగువను "పూన్పూ" నను బడు పట్టణము గలదు. దీనిపేరు నది నుండియె కల్గెనఁట. పూన్పూనునదియందు పితృర్చనలు గయయందు వలె నడుచును.

**పృనఃపునానది**-దీని నిప్పుడు 'పున్పూన్ అనుచున్నారు. గంగానదిలో సంగమించునది. పాట్నాజిల్లాలోఁ గాననగును.

వాయుపురాణము ౧౦౮అధ్యాయమునను, పద్మపురాణము సృష్టి ౧౧ అధ్యాయమునను ప్రశంసింపఁ బడినది.

**పున్నచెట్టు**- ఇది కోలాకుపున్న (కోలటి ఆకులుగల జాతి) యనియు, మొయ్యాకు (మొండిగ నుండిన (పొట్టి) యాకులుగల జాతి) పున్న యనియు రెండు భేదములు గలది. అజ్ఞత వలన వాడుకయందు కోలాకుపొన్న యనియు, ముయ్యాకుపొన్న యనియుఁ గొందరు వాడు చుండుట గలదు. కోలపొన్న చెట్టనియు వాడుట గలదు.

కోలఆకులజాతి-లా. Phaseolus Trilobus అనియు, Hoemonites Cordifolia అనియు, Doodia lagopodioides అనియు పేర్లు. సం. అంఘ్రిపర్ణీ,అంఘ్రివల్లికా,చిత్రపర్ణికా, పృశ్నికా, పృశ్నిపర్ణికా. దీనిరసము లేక సమూలకషాయము కొద్దిగ వేడిచేసి త్రిదోషహరమైయుండు. జ్వరతాపము,జ్వరదాహము, శ్వాస కాసలు నివారించును.

మొయ్యాకుల (పున్న) జాతి. లా. Hedysarum Gangelicum. సంస్కృతపుపేరు తెలియదు. కొందఱు విదారిగంధా, సర్వాను

కారిణీ, సాలపర్ణి యని వాడియున్నారు. వేరు రసము గాని, సమూలకషాయరసములు గాని, మిక్కిలి వేఁడిచేసి పైగుణములే గాక విషమజ్వరములు, మేహములు, కఠినములగు వాతములు, ఉబ్బులు నివారించును.

**పునాది**(Foundation)-పునాది యనుట వలన ఏపనికైనను ప్రారంభ మని యర్థమగుట గాననగుచున్నది. కట్టడములందు పునాది బేస్మెంటు (Basement) కట్టడము (Super Structure) అని మూఁడుభాగము లుండునటుల పాశ్చాత్య దేశపు శిల్పశాస్త్రవిధానమున (Western Engineering) చెప్పఁబడినది. పునాదులయేర్పాటు ల్లాయాతావులందలి మట్టినిబట్టియు, దానియందలి పొరలనుబట్టియు (Layers) నుండునని చెప్పఁ బడినది.

అడుగుమట్టి స్వభావము మచ్చుగాతలం ద్రవ్వి (Trenches)గాని, బోరింగుచేసిగాని కనుఁగొన నగును పిఱికిమట్టితావులందు గట్టి పొర తగులుదనుక నిట్టిశోధనలు జరుగవలసి యుండును.

పునాదు లేడువిధము లిక్కాలమున ... యందున్నవి. గట్టిదగు రాతిప్రదేశమున, అనఁగా గండశిలాతలమున పునాది త్రవ్వ నక్కఱ లేక యే కట్టడనిర్మాణము చేయనగు నని చెప్పఁబడినది. అట్లనుటయందు శిలాతలమున బీటలు మొదలగునవి లేక ఏకశిలాప్రదేశమై యుండవలె నని భావము.

(1) Open concrete or masonry foundations- అనగా పునాదిగాతల నవసరమగునంతటి లోతుదనుక ద్రవ్వి, వాటియందు Concrete గాని, Masonry గాని నింపి, పైని Basement చేయుట కీపేరు వర్తించెడిని. ఇది సర్వసాధారణమైన మార్గము. పునాదులందు నీరు రూరునపుడు దానిని తోడివైచి Cement concrete ఉపయోగించుట శ్రేయము.

(2) Roft foundations - అడుగుభాగమున పిఱికిమట్టి తగిలినచో భారమును సమానముగ నానునటులఁ జేయుటకు నిర్మాణావర్ణమున నవసరమగులోతునకు ద్రవ్వివైచి ఉపరిభాగమున దూలములఁగాని, పలకలఁగాని వైచి బేస్మెంటుచేయుట పేరు వర్తించెడిని. ఇట్టితావులందు తరచు Reinforced concrete నుపయోగించుటయె శ్రేయము.

(3) Slab foundations-అడుగుభాగమునందు చాల లోతువఱకు ఉన్న దంతయు గుల మట్టియై విశేషభారము నానుకొనవలసి వచ్చిన తఱి సున్నపుపని (Masonry) విస్తారము కాకుండునటుల, కఱ్ఱదిమ్మలంగాని రెయినోఫోర్సుడు కాంక్రీటుపలకలంగాని పఱచి, వాటిపై తక్కువ వెడలుపు గోడలతో కట్టడములు గట్టుదురు. ఇట్టివి కేవలము పిఱికిమట్టిప్రదేశములందు చేయుచుందురు. తొల్లింటికాలమున భరతదేశమునందు రాతిపలకలను పెద్దపెద్ద బండల నిటుల పునాదిగోతులందు నింపి, నడుమ ప్రదేశముల నిసుకతోనింపి, పైని కట్టడములను నిర్మించుచుండిరి.

(4) Pile foundations- చాల లోతు వఱకు పిఱికిమట్టి యున్నభూములలో నధికములగు భారముగల నిర్మింపఁ బడవలసినతఱి Piles (స్తంభములవంటి) ఇనుపవి గాని కఱ్ఱవిగాని Rain forced concrete వి గాని, నిలువుకొయ్యలను పునాదులందు దింపి, లేక వరుసగ దిగఁగొట్టి, పైని పలకలు పఱచి దానిపై కట్టడపునిర్మాణ మొనర్చుట కీపేరు వర్తించును. ఈపద్ధతిపునాదులు తరచుగ డెబ్బది లేక యెనుబది యడుగులలోఁతు పిఱికిమట్టిగల ప్రదేశములందునను, ఒక్కొకతఱి

నూరడుగుల లోఁతుగల ప్రదేశములందునను వాడుచుండుట గాననగును.

(5) Well Foundations-ఇవి తఱచుగ నీరు పాఱుచుండు జీవనదులపై వంతెనల నిర్మించుతఱి రెయిన్ఫోర్సుడు కాంక్రీటుతోఁ గాని, ఇటుక సిమెంటులతోఁ గాని నూతు లంబోలిన పునాదులం ద్రవ్వుచు పునాది గోడలను దింపుచు, పైని తిరుగఁ గోడలం గట్టుచు, తిరుగ దింపుచు, పైనిపలకలను వైచి పైని వంతెనదిమ్మలను నిర్మింతురు. ఇట్టిపునాదుల కీపేరు వరించెకిని.

(6) Caisson foundations- ఎక్కువ లోఁతుగల అగాధజలప్రదేశములందు పునాదుల కినుపరేకులయావరణము నిర్మించి, లోన కాంక్రీటుతో నింపి, పైన కట్టడమును నిర్మింతురు. ఇట్టిపునాది కీపేరు వర్తించెడిని.

(7) Sand foundations- నల్లరేగడిభూములు గట్టివిగ గన్పట్టినను, బీటలువారుగుణము గలవిగాన, పునాదులం ద్రవ్వి యిసుకచే నింపి పైని పునాదుల నిర్మించి కట్టడము గట్టుదురు. ఇట్టి పునాదులకు నీపేరు వర్తించెడిని.

**పున్నాసంస్థానము**— (పన్నా సంస్థానము చూడుఁడు.)

**పునీతకుల (పుచ్ఛకుల) గోత్రము**- ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.)

పునీతకుల (పునీత, పుచ్ఛకుల, పుచ్ఛకశిల) గోత్రము. ఏకార్షేయ (౧౮) గోత్రము. సంస్కృతగోత్రము. సుకాంచనస. సుకాంచనగణము. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. విమలేశుఁడు దేవత. భార్య విమలాంబ. పురుషోత్తమక్షేత్రము తపస్థానము. విమలాంభోధి తటాకము. జపము వెయ్యి. దీపములు ౪౦. క్షేత్రసంఖ్య ౪౦. మణులు దానము. తెల్లఅనుములు పుచ్చకాయ వర్జనీయములు.

**పుబ్బదేశము**-ఈపేరుగల రాజ్య మొకప్పు డుండిన దని తెలియుటకన్న దీనిం గూర్చి యేమియుఁ దెలియరాకున్నది.

**పుబ్బ (పూర్వఫల్గుణి) నక్షత్రము**— ఇది ఫల్గుణీనక్షత్రమునందలి పూర్వార్ధము. ఆకసమున నిదియు, ఉత్తరఫల్గుణియుఁ గలిసి నేత్రాకారమున నిరువదియైదు నక్షత్రములు గూడియుండిన నక్షత్రవితతి. దీని కింకను పర్యాయపదములు పూర్వాఫల్గుణి, భాగ్యం, భగాఖ్యం, భగసంజ్ఞకం అనునవికలవు. భృగుఁ డధిదేవత. మనుష్యగణము. అధోముఖము. స్త్రీస్వభావము. ఆఁడుఎలుక, గద్ద, పాలాశచెట్టు ఈనక్షత్రసంబంధములు. ప్రవేశించిన యిరువదిగడియలపై త్యాజ్యమనియు, నలువదినాల్గు గడియలపై యమృత మనియు, నిది క్రూరస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది. (ఉత్తర (ఉత్తరఫల్గుణి) చూడుఁడు.)

**పుమాన్ కీర్తిసంయుక్తో జీవన్నపి మృతోపమా**—అపయస్సు(అపకీర్తి) జీవనము గలవాఁడు జీవించియున్నను మృతిజెందినను లేనివారిలోననే లెక్కింతురు.

**పురగిరిక్షత్రియులు**- వీరిని అజ్ఞులు పెరికీలని యనుటయుఁగలదు. వీరియందు రాచపెరికీలనియు, పీచుపెరికీ లనియు ద్వివిధముగ వాడుచుంట గలదఁట. రాచపెరికీలలో స్త్రీలకు రాణివాసము కలదు. పీచుపెరికీలయందు లేదఁట. ఇందువలన రాచపెరికీలు క్షత్రియకుల సంబంధు లని స్ఫురించెడిని. దీనికిం దోడు పైరెండు తెగలకు సంబంధ బాంధవ్యములు లేవనియెదరు.

వీరింగూర్చిన గ్రంథములు సరిగా దొరకకున్నవి. "పురగిరిక్షత్రియచింతామణి" యను

గ్రంథ మొక్కటి గానంబడు చున్నను అది అసమగ్రముగ వీరికథనముం దెల్పెడిని.

ఆదిని వీరు సూర్యవంశక్షత్రియు లనియు, పరశురామునిదాడికి వెఱచి పాఱిపోయినకతన పిఱికివా రనియు, పిఱికిక్షత్రియు లని లోకులు వాడుచుంట, నానాఁటి కాపదము పెఱికిగా మాఱి, వీరికి పెరికీలని పేరు అజ్ఞులచే వాడంబడుచున్న దనియు, వీరియందు బలమగు వాడుక అనుశ్రుతముగ వచ్చుచున్నది కలదు.

ఈ కులమువారికి మూలపురుషుఁడు సిద్ధమహారా జనియు, ఆయన శ్రోత్రియవంశజుఁడనియు, ఆయనసంతతివారికి మల్లు రని వాడుక నామ ముండె ననియు, పరశురాముని దాడికి వెఱచిననాఁడు శూద్రవేషధారులై రనియుఁ జెప్పెదరు. వీరివివాహములందు వధూవరులకు రక్తాంబరములు కట్టుకొన నిచ్చి, ఖడ్గమును బూజింపఁజేతు రఁట. అట్లేఁ గొందఱు యజ్ఞోపవీతములను, అందఱు ఖడ్గబాణధారణము జేయుట యాచార మఁట. కొన్ని కుటుంబములు శక్తిపూజయు, బలియు నొసఁగుదు రఁట. వీరు సూర్యభక్తులని (సూరేబత్తులు) చెప్పఁబడుచున్నారు.

తొల్లింట పరశురాముని యన్నకుమార్తె యగు గౌరీదేవి యనునామె, సిద్ధమహారాజు సుతుఁడో లేక సంతతివాఁడో యగు వీరమల్లుని వరిణయమాడె ననియు, ఆ వివాహమునకుఁ గాను సంగరము నడిచి, ఎట్టకేలకు సఖ్యము కుదిరి వివాహమాయె ననియు, అచిహ్నముగ జ్ఞాపకార్థమే వీరివివాహములందలి పైవివరించిన కార్యముల నడుపుచున్నా రనియువాడుక కలదు.

పిదప ఈమల్లురు త్రిలింగదేశమున కాఁపురముఁ కుదిరి పురగిరియనుపేరుగల పట్టణమునిర్మాణ మొనర్చుకొని, యటనుండి పురగిరిక్షత్రియ నామ మంది ఇతరస్థలములకు వ్యాపించి రఁట. ఇక్కాలమున పెక్కండ్రు ఇప్పటి విశాఖపట్టణ మండలమునను, గోదావరీమండలద్వయప్రాంతములను, కృష్ణాతీరములందునను, నైజాము రాజ్యమునను, గొందఱు బొంబాయిరాజధాని ప్రాంతములను గానవగుచున్నారు. పెక్కండ్రు నాయఁడుల మనియెదరు. కొందఱు పాండవ సంతతిక్షత్రియులతో సంబంధములు గల్పుకొని రని తెలిసెడిని. (తెలగాలుచూడుఁడు. బలిజలు చూడుఁడు. పాండవసంతతి క్షత్రియులు చూ.) వీరు పరశురామునిసంతతివా రని కొందఱు అను చున్నారు. పురగిరిక్షత్రియు లాంధ్రభూమికి నలదనుయంతులకాలమున నేతెంచినట్లు వీరి యం దొకవాడుక కలదు. అది యెట్టిదో పరిశీలన జరుగవలసి యున్నది.

**పురంజయుఁడు**—అత్రిసంతతి. చంద్రవంశపుక్షత్రియుఁడు. తండ్రి సృంజయుఁడు. పుత్రుఁడు జనమేజయుఁడు. సువీరసుకుమారు (సృసంజయుఁడనంబడు)నకును పురంజయుఁడని పేరు కలదు. ఇక్ష్వాకుసంతతియందలి వికుక్షి కుమారుఁడగు కకుత్స్థునకు ([illegible]) పూర్వనామము పురంజయుఁ డనియే. (కకుత్స్థుఁడు చూడుఁడు.)

వేఱొక పురంజయుఁడు లేక రిపుంజయుఁడు అనంబడినవాఁడు మగధ బార్హద్రథ సంతతి క్షత్రియుఁడు కలఁడు. తండ్రి విశ్వజిత్తు. పితామహుఁడు సత్యజిత్తు.

రిపుంజయుని కాలమునకు కలియుగమున వేయిసంవత్సరము లాయెను. పురంజయుని మంత్రియగు శునకుఁ డీతనిని జంపి తనపుత్రుఁడగు ప్రద్యోతునునకు మగధరాజ్యాధిపత్యమిచ్చెను. కాన రిపుంజయునితో మగధ బార్హద్రథరాజవంశము సరి.

**పురమీఢుఁడు**— అత్రి చంద్ర పూరు సంతతి క్షత్రియుఁడు. తండ్రి హస్తిమహారాజు.

**పుర్యష్టకము**— ౧. పంచ భూతములు- (పృథివ్యప్తేజోవాయురాకాశ పంచకము), ౨. పంచతన్మాత్రలు-(గంధరసరూపస్పర్శశబ్ద పంచకము) ౩. పంచకర్మేంద్రియములు- (పాయూపస్థపాదపాణివాక్పంచకము), ౪. జ్ఞానేంద్రియ పంచకము- (ఘ్రాణజిహ్వాచక్షుత్వక్ శ్రోత్ర పంచకము) ౫. అంతఃకరణత్రియము- (మనోబుద్ధ్యహంకారములు), ౬. పంచ కంచుకములు- (రాగనియతికాలవిద్యాకళాతత్త్వ పంచకము) ౭. ప్రకృతి, ౮. పుంస్త్వము లేక పురుషతత్త్వ లక్షణము.

మతాంతరమున:- ౧ జ్ఞానేంద్రియములు, ౨ కర్మేంద్రియములు, ౩ అంతఃకరణ చతుష్టయము, ౪ ప్రాణ, లేక వాయుపంచకము (అజ్ఞానమని భావము), ౫ భూతము లైదు, ౬ కామము, ౭ కర్మ, ౮ తమస్సు.

**పురాణజ్వరము**---(Cronic fever) దేహమున జీర్ణించి వెన్నునపట్టిన జ్వరము.

**పురాణములు**(Epics)- పురాణ మన తొల్లింట జరగిన విశేషమని యర్థము. ఇది పూర్వపుచరిత్ర యని చెప్పఁదగినది. మీమాంసాశాస్త్రమునందు చర్చింపఁ బడుచున్న సంగతిని వేదమునుండి విధినిదర్శనము చూపి, తదనుగుణముగ తొల్లింట నడిచిన చరితమును పురాణములనుండి ఉపబృంహకమును జూపుచుందురు. ఉపబృంహక మన సమీపమున విస్తరించిచెప్పుటయని భావము. పురాణములు ధర్మములను జక్కఁగఁ దెల్పునవిగాన, విస్తరించిచెప్పుటగాఁ నెంచఁబడినది. అనఁగా క్లుప్తపఱచుట కాదని యభిప్రాయము. పురాణములు వేదోక్తులవలెను, కల్పసూత్రాదులవలెను విశేషార్థపదములను గుప్తముగఁ బల్కునవిగాక స్పష్టమగు భాషతోఁ దెలుపఁబడి యుండును. శ్లోకరూపములఁ దనరునవి.

పురాణసమూహమునకుఁ బురాణసంహిత యనియుఁ బేరు కలదు. సంహిత యన సంధింపఁబడినది యని యర్థము. పురాణములు పదునెన్మిదియు, ఉపపురాణములు పదునెన్మిదియుఁ గలిసి పురాణసంహిత యయ్యెడిని. పురాణములు పదునెన్మిదింటిని శ్లోకరూపమున సంస్కృతభాషయందు వ్యాసమహర్షి రచించెను. ఆయననుండి నేర్చినట్లు సూత మహర్షి శౌనకాదిఋషులకుఁ దెల్పి ప్రకటించినవాఁడు. సూతుఁడు సకలపురాణోపేతుఁడు. ఉపపురాణములు పదునెన్మిదియును, వేర్వేఱు పురాణములను వేర్వేఱు మహాత్ములు రచించిరి.

పురాణములందు ౧ సర్గము, ౨ ప్రతిసర్గము, ౩ వంశము, ౪ మన్వంతరము, ౫ వంశానుచరితము నను నైదు లక్షణములు వివరింపఁబడియున్నవి కావుననే" పురాణం పంచలక్షణ" మ్మనియెదరు. భాగవతము, భారతము పురాణములలోనివి గావు. భారతము వ్యాసప్రోక్త మైనను ఇతిహాస మనంబరఁగుచున్నది. భాగవతము బొప్పనపండితుఁడు రచించినదిగాని, వ్యాసప్రోక్తము కానేగాదు. వ్యాసప్రోక్తమై పదునెన్మిది పురాణముల సంఖ్యలోఁ జేరినది దేవీభాగవతము. రామాయణము వాల్మీకిప్రోక్తమగు నాదికావ్య మనంబడునది, కాని పురాణముల సంఖ్యలోఁ జేరినదికాదు పురాణేతిహాసములు తెనిఁగించినవారు పెక్కండ్రు కలరు.

పౌరాణికమతమున మీమాంసకు లంగీకరించిన ౧ ప్రత్యక్షము, ౨ అనుమానము, ౩ ఉపమానము, ౪ శబ్దము. ౫ అర్థాపత్తి, ౬ అనుపలబ్ధి యను షట్ప్రమాణములే గాక, ౭ సంభవము, ౮ ఐతిహ్యము లను అష్టప్రమాణము లంగీకరింపఁ బడియుంట గానవయ్యెడిని.

ఇవిగాక బసవపురాణము, చెన్నబసవపురాణము, నందికేశ్వరపురాణము,ఆత్మపురాణము,

కన్యకాపురాణము, దేవాంగపురాణము మొదలగు పెక్కుపురాణములును, జైనమతగ్రంథమగు మేరుమందిర పురాణము మొదలగునవియుఁ గలవు. అవి వేర్వేఱుకాలముల వేర్వేఱు మహనీయులు రచించినవి.

**పురాణలక్షణములు ౫.** ౧ సర్గము (సృష్టివిధానము)

౨ ప్రతిసర్గము (ప్రతిసృష్టివిధానము లేక ప్రళయవిధానము)

౩ వంశము. (వంశానుక్రమణిక)

౪ మన్వంతరము (మన్వంతరకాలాదుల వివరణము).

౫ చరిత్ర (కథలు, సందర్భము).

మహాపురాణలక్షణములు ౧౦. ౧ సర్గము, ౨ ప్రతిసర్గము, ౩ వృత్తి, ౪ రక్ష, (పరిపాలనమున భద్రత), ౫ మన్వంతరము, ౬ వంశము, ౭ వంశానుచరితము (సూర్య చంద్ర వంశజుల చరిత్ర), ౮ సంస్థ (స్థితి), ౯ హేతువు (తొల్లింటి కారణములు, ౧౦ అపాశ్రయము (వచించు కథావిధానము).

**పురాణవైరాగ్యన్యాయము**—పురాణము వినుచుండినతఱిఁ గల్గిన వైరాగ్యము నిలుచునది కాదని భావము. ఇట్టి యర్థముననే ప్రసూతి వైరాగ్య,శ్మశానవైరాగ్యన్యాయములు నిచ్చుచున్నవి.

**పురాణస్థలము**— వైష్ణవ మతస్థులకు యాత్రల నొనర్ప పురాణస్థలము లాఱు.

౧ శ్రీముష్ణము— చిదంబరమునకు సమీపమున (పడమరగా ౨౦ మైళ్ళు) స్వయంవ్యక్త స్థలము. వామన విమానము. నిత్య పుష్కరిణి. పశ్చిమ ముఖము. అశ్వత్థనారాయణునకు ప్రత్యక్షస్థానము.

౨ పాపవినాశము—తంజాపూరు మండలమునందున్నది. పుండరీకపుష్కరిణి. ప్రాఙ్ముఖము. పాపవిమోచనవిమానము. చోళమహారాజునకు ప్రత్యక్షమైన స్థలము.

౩ రాజమన్నారుకోవెల- (మన్నార్ కోవిల్ అని వాడుదురు.) తంజాపూరు మండలమునందున్నది. హరిద్రానదీతీరము. చంపకారణ్యక్షేత్రము. ప్రాఙ్ముఖము. రాజమన్నారుస్వామి లేక రాజగోపాల స్వామి యందురు. స్వయంభూ విమానము. సంతాన గోపాలస్వామి. గోప్రళయమహామునికిఁ బ్రత్యక్షమైన తావు. ఇట రజిత ధేనువు, పంచభైరవులు కలరు. దీనిని "దక్షిణ ద్వారక" యని యిచటివా రనెదరు.

౪ తిరునారాయణపురము—దీనిని మేలుకోట యనుచున్నారు. ఇట రామానుజ దేశికులు కొంతకాలము వసించిరఁట. ఈ నాల్గింటిని శ్రీమద్రామానుజీయ వైష్ణవపురాణస్థలము లని యెదరు.

౫ శ్రీపెరుంబూదూరు— దీనిని భూతపురి యనియెదరు. చెన్నపురికి సమీపము. రామానుజుల జన్మస్థానము.

౬ బృందావన క్షేత్రము - వ్రజమండలములోని శ్రీకృష్ణుని బాల్యపు స్థలము.

ఈయాఱింటినిషట్పురాణస్థలములనియెదరు.

**పురిహార (శాఖ) క్షత్రియులు**— అర్బుదపర్వతముపై ఋషులచే నొనర్పఁబడిన తపోహోమాదులవలన రుద్రాంశసంభూతులుగఁ జెప్పఁబడినవారు. అక్కాలమున ఋషులచే పురిహారశాఖక్షత్రియులకు నవమరుస్థలి, లేక నవకోటిమరుస్థలి రాజ్యముగ నీయఁబడినది. (క్షత్రియకులము చూడుఁడు.)

వీరిలోని అంతశ్శాఖలు పండ్రెండు కలవని చెప్పఁబడుటయే గాని, కానవచ్చుట లేదు. అందు ఇండో శాఖ యొకటియు, సింధిల్ శాఖ యొకటియు ముఖ్యములుగఁ గానవచ్చెడిని. చౌరా లేక చావూరాశాఖ యని వేరొక్కటి

కలదు. అది సూర్యవంశమునకుఁ గాని, చంద్ర వంశమునకుఁ గాని చెందినదికా దనుచుందురు. పాటలందు తప్ప వీరినిగూర్చి యేమియుఁ దెలియరాదు.

చౌరారాజుల రాజధాని దేవబందద్వీప మని చెప్పఁ బడినది. ఇది సౌరాష్ట్రి దేశముకడ పశ్చిమసముద్రిమునం దుండెనని ప్రతీతికలదు. వీరికి బలభీనగరరాజ్య మేలుచుండిన సూర్య వంశక్షత్రియులతో సంబంధ బాంధవ్యము లుండె నని చెప్పఁబడినది. చౌరారాజులు యదుసంతతి వా రనియుఁ గొంద అనుచున్నారు. వీరివాఁడే యనంబడిన బాణరాజును, ఆయనసంతతివారును నూటయెనుబదినాల్గు వత్సరములకాలము పాలన నెఱపి రని మాత్రిము పాటలందుఁ గలదు గాని తావులు వివరింపఁబడ లేదు.

కడపటిభూపతి భోజరా జనియు, ఈయన సుతనే చాళుక్యమూలపురుషుఁడగు జయసింహ మహారాజు పరిణయమాయె ననియుఁ జెప్పఁ బడినది. శ్రీరామునిసంతతివాఁడగు ఉదయజవ నాథసింగుగారి తల్లి చౌరావంశ క్షత్రియ కుమార్తెగఁ జెప్పఁబడినసాధ్వి. వీరివారే యనం బడుచున్న జిత్ జాతి క్షత్రియులు యాదవుల మనుచున్నారు.

ఇప్పటి ఝోోడ్పూరున కుత్తరముగా నైదు మైళ్ళలోనున్న మందాడూర్ తొల్లింటి మందా ద్రిపురమే యనియు, అది యప్పటి మార్వార్ దేశములో నుండి పురిహరశాఖ రాజులకు రాజధానిగనుండి వారినుండి లాగుకొనఁ బడిన దనియుఁ జెప్పఁబడినది.

**పురుకుత్సుఁడు (మహారాజు)** — ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి మాంధాత. పురుకుత్సుఁడు షడ్చక్రి వర్తులలో నొకఁడు. భార్య నర్మద (నాగకన్యక). కశ్యపునకు మునివలనఁ గల్గిన సంతానమగు మౌనేయులవలననైన బాధనుండి ఈమహారాజు నాగములను రక్షించుటం జేసి, నాగములు తమ సోదరియగు నర్మద నీతని కొసంగిరని చెప్పఁ బడినది.

కుమారుఁడు త్రసదస్యుఁడను నామాంతరము గల వసుదుఁడు.

**పురుగుడు (పలుగుడు) తీవ**—లా. Fluggea Leucopyrus తెల్లపురుగుడు Phyllanthus నల్లపురుగుడు. సంస్కృతమున తెల్లపురుగుడునకు కాంభోజీ, రాజపర్ణీ, వాతాం గిణీ యనియు, నల్లపురుగుడునకు కృష్ణకాంభోజీ, క్రిష్ణపతంగినీ, సైలిక యనియు కొంద అనిరి గాని యీపేర్లు నైఘంటికముగఁ గానరాకున్నవి. ఇది నలుపు, తెలుపు భేదములచే ద్వివిధము.

తెల్లపురుగుడు వేఱు చెక్క అకురసము వీటి రస కషాయములు, రక్తగ్రిహణిని, రక్త స్రావమును గట్టి, మేహశాంతి గల్గించి, వీర్య మునకు బలము గల్గించి, యౌవనపటిమను నిల్పు ననియు, కండ్లకలకను మాన్పుగుణ మాకు నందు, విరేచనములను గట్టుశక్తి వేఱునందుఁ గలదనియు, దీనికాడతో దంతధావనముచేయు విధివలన నింద్రియనష్టము వాయు ననియుఁ జెప్పఁబడినది.

నల్లపురుగుడు చలవ, మేహశాంతి చేసి మూత్రము వెడలించి శరీరములోని దుష్టప దార్థకూటమును విప్పు శక్తిగలది యనియు, శరీరతత్త్వమునుసుస్థితిలోనికిఁ దెచ్చుననియు, ఆకులందు నోటిపండ్లరోగములు మాన్పుశక్తి గలదనియుఁ జెప్పఁబడినది.

**పురుజిత్తు**—యదుసంతతిలోనను, చంద్ర వంశక్షత్రియులలోనను ఇద్దు రీపేరుగలవారు గాననగుచున్నారు. రుచికునిసుతుఁడు పురుజిత్తు.

వసుదేవుని తమ్ముఁడగు కంకుని మూఁడవ కుమారుఁడును పురుజిత్తనుపేరుగలవాఁడే.

**పురుజుఁడు**-పూరుసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. తండ్రి సుశాంతి

**పురువిాఢుఁడు**-- పూరుసంతతి. చంద్ర వంశక్షత్రియుఁ తండ్రి హస్తి. సోద రుఁడు అజమీఢుఁడు.

**పురువంశనృపులు**-మహాకవి కాళిదాసు శకుంతలనాటకమున వివరించిన దుష్యంతమహారాజు పౌరవవంశనృపతి. ఆవంశమును, పురువంశమును ఒకటిగా పొరపడరాదు. పౌరవులు క్షత్రియులు.

ఈపురువంశనృపుఁ అలగ్జాండరుతో పో రిన పోరస్ నృపతి. న్యులు పురుషో త్తముఁ డనిరి కాని అది యతనిపేరు కాదు.

**పురుషతిరస్కృత(స్త్రీ)లు**-కొందఱు స్త్రీలు పురుషులను తామేతొలుత వాంఛించి భగ్నమనోరథ లగుటయు, పదపడి యాపురుషులపైఁ బగ సాధించుకొనుటయు, మఱికొన్ని యెడల పురుషతిరస్కృతావమానమును భరింపలేమి నేమియుఁ జేయఁజాలక మిన్నకుండుటయు దెలిపెడి గాథలను పురాణములయందును, దేశచరిత్రలందును వినుచున్నాము. అట్టి పురుషతిరస్కృతస్త్రీలు మన కిపుడు లెక్కకు వచ్చువారు పదుగురు.

1 అంబ- తనతమ్ముఁడగు విచిత్రవీర్యునకు వివాహము సేయ భీష్ముఁడు కాశీరాజు కుమార్తెలగు అంబను, అంబికను కరినగరమునకుఁ గొనివచ్చెను. అంబ సాళ్వుని వరించియుంటి ననియు, తన్ను కరినగరమునకుఁ దోడ్కొనిపోవల దనియు స్పష్టముగఁ జెప్పినను సరకుగొనక బలాత్కారముగా నామెను భీష్ముఁడు గొనిపోయెను. విచిత్రవీర్యుఁ డంబికను వరించి, అంబను విడిచెను. భీష్ముఁ డంబను మరలఁ గాశీరాజుకడనే విడిచెను. ఆమె సాళ్వుని వరించియుండుట, నతనిని బరిణయ మొనర్పు కొనఁ గోరెను. తనంతదా వలచివచ్చిన కన్నియ యగుట సాళ్వునిచే తిరస్కృత యయ్యెను. భీష్ముఁ డీమెను కరినగరమునకు అంబికతోపాటు గొనిపోయెనుగదా యనియు, విచిత్రవీర్యునిచే నేలుకొనఁబడిన అంబిక గాక మిగిలిన యీామె పరిత్యక్త యనియు నెంచి, అంబ యొనర్చిన ప్రార్థనములను వినక ఆమెను విసర్జించెను.

పర్యవసానము- భీష్మునివలననే తన కింతటి చేటు మూడెనుగదా యని ఆతనిపై పగబూని, భారతయుద్ధకాలమునాఁటికి 'శిఖండి'' యై పాండవపక్ష మూని, ఆభీష్మున కభిముఖియై, ఎదుర్కొని, ఆతని సమరపరాఙ్ముఖునిగ నొనర్చి తుద కాతని మరణమునకే హేతుభూతురాలయ్యెను.

2. ఉత్తర దిక్కాంత:- విశ్వావసు పుత్రుఁడు మహర్షి ఒకయెడ హిమాలయపర్వతముపై నొక తరుణ...న నొక హేయమగు భవనమున భువనమోహనమైనసుందరీనికాయ మధ్యమున నుండవలసినపరిస్థితు లేర్పడినవి. ఒకనాత్రియెడన యష్టావక్రుఁడు బరుండియుండిన సెజ్జకడ కొక నవయౌవనవతి తన విలాససంపదలతో సమీపించి ఆతనిసెజ్జపైఁ గూర్చుండెను. అష్టావక్రమహర్షి, యీాపరిస్థితులకు వికలచిత్తుఁడు కాలేదు. తానున్న దిశ యుత్తరదిశ యగుట, నాయుత్తరదిక్కాంతయే పరీక్షించుటకు దన్ను సమీపించె నని యెంచి, మెలకువతోఁ బ్రవర్తించెను.

పర్యవసానము:- ప్రత్యేకపర్యవసాన మేమియు లేదు గాని, పండితులు మాత్ర మిదియంతయు స్వప్నదృశ్యమనియు, స్వప్నసదృశ మనియు నెంతో తేలికగా వ్యాఖ్యానము సేయఁ గల్గుట సంభవించినది.

3. ఊర్వశి - అర్జునుఁడు:- దేవలోకమున కొకానొకసమయమునఁ జుట్టపుచూపుగా నేగిన

యర్జునుని జూచి, కామించి, తానుసింగారించు కొని వివిక్తప్రదేశమున విభావరీసమయమున నాతనిసమీపించి తనకోరిక నెఱుంగఁ జేసెను.. అర్జునుఁడు పాతివ్రత్యవావులు పెగులఁదీసి, తన్నామె కామింపఁదగదనియు, నట్టికోరిక అసమంజస మనియు నచ్చఁజెప్ప, నామెయు నొచ్చుకొని తానుతిరస్కృత యగుట క్రోధదీప్తులతో "నీవు నపుంసకుఁడ వగుదువు" అని శపించెను.

పర్యవసానము:- ఊర్వశిని దిరస్కరించుట వలన నామెచే శపితుం డగుట యను(Direct) పర్యవసాన మటుండనిచ్చినచో ఈశాపమర్జునున కొకసమయమున ననఁగా పాండవులు విరటునగ రమున కేఁగి యట విరటుగొల్వుం జేరి, యజ్ఞాత వాసదీక్ష జరుపుకాలమున పేడిగ (మీసములు లేనివాఁడై) నపుంసకుఁడుగ నెన్నఁజేసి సమయ భంగము గాకుండుటకు దోడుపడినది.

4. గంగ- చంద్రవంశమున కురురాజ్యమే లిన రాజులలో నొకఁడగు ప్రతీపుఁడను మహా రాజు పరమనిష్ఠాగరిష్ఠుఁడై గంగయొద్దను తప ము జేసికొనుచుండ, నాతనిసుగుణసంపద నదివ ఱకే విని యాతనిపై మరులుకొని, రూపొందిన గంగాదేవి యాతనిసమీపించి తనకోరిక నెఱిం గించెను. ఆతఁ డంగీకరింపలేదు. ఆతనితొడపైఁ గూడ నీగంగాదేవి కూర్చుండెను. మఱెంత బ్రతిమాలుకొనెను కాని, ప్రతీపుఁ డంగీకరింప లేదు. ఇట్లు ప్రతీపతిరస్కృతయగు గంగాదేవి యాతనిపైఁ బగసాధింపలేదు.

పర్యవసానము:- ఇట్లు ప్రతీపునిచే నంగీక రింపఁబడని గంగను ఆతని పుత్రుండగు శంత నుఁడు వరించి యామెవలన సంతానము వడ సెను. ఆసంతానమున కడగొట్టువాఁడే మన భీష్ముఁడు

5. చిత్రాంగి- ఈమెచరిత్ర అద్భుతచరిత్ర ములలో నొకటిగ నెన్నఁబడుచునే యున్నది. తన్ను ద్వితీయజాయగా వివాహమొనర్చుకొ నిన రాజరాజునకు వలపుల మోహనాంగియై యుండియు, రాజరాజునకుఁ బట్టమహిషి.యగు రత్నాంగిపుత్రుఁడగు సారంగధరుని కామించి, యాతనిచేఁ దిరస్కృతయైనది.

పర్యవసానము:-దుర్లభమని యెంచక సారం గధరునిపై మరులుగొనిన యీచిత్రాంగి, తన మోహము ద్వేషముగా మాఱ, నాతనియుత్త రీయమును సంగ్రహించి, అదియె యానవాలు గఁజేసి తండ్రిచేఁగొమరుని దావలచిన యాతని భౌతికశరీరము మఱి లేకుండఁ జేసెను.

6 తిర్యరక్ష-కుణాలుఁడు - అశోకచక్రవర్తి కుమారుఁడు కుణాలుఁడు. ఈతనియుంపుడుకత్తె తిర్యరక్ష. ఈమె మంగలిది.

(నోటు :- ఈ"రక్ష"శబ్దము మంగలిజాతి యాఁడువాండ్రకు నామాంతరమునఁ జేర్చెడు పదము.)

ఈతిర్యరక్ష కుణాలుని జూచి కామించి, యాతని నెంత బలవంతపఱచినను ఆతఁ డియ్య కొనమి నీమె కుణాలతిరస్కృత యైనది.

పర్యవసానము:- పరిభవఖిన్నయగు నీమె అశోకచక్రవర్తి గాథ యంతయు దాఱుమా ఱుగఁజెప్పి, కుణాళునం దంతఃపురద్రోహము మోపించి, యాతనికన్నులూడఁబెఱికించెను.

(నోటు:- చరిత్రాత్మకమైన ఈ తిర్యరక్ష కుణాలురగాథయే కాలము నడువనడువ మన ముసలమ్మలు కథలుచెప్పురీతి ననుసరించి ఈ నోట నానోట పోయిపోయి, రాజరాజనరేం ద్రునినెత్తికి జుట్టబడియుండునని గూడ పరిశీలకు లనుచున్నారు.)

7 దేవయాని-కచుఁడు- తనతండ్రి యగు శుక్రునియొద్ద విద్యాభ్యాసమొనర్చు చుండిన కచుని, అనూఢయగు దేవయాని వలచినది. కచుఁడు కానరానినా డీదేవయాని యాహారము

మానియుండినకాలమును గలదు. కొన్నికొన్ని విపత్తరుణములలో కచుని తప్పించి ఈమె రక్షించినది. కచుఁడు శుక్రునికడ విద్యాభ్యాసము చాలించి గురుప్రనోద్ద ననుజ్ఞగై కొని పోనున్న సమయాన, నీ దేవయాని తన్ను బెండ్లాడవలసిన దని కచుని బ్రతిమాలెను. తనకుఁ దా వలచి వచ్చిన యాకన్యారత్నమును కచుఁడు వలదని కాలందన్ని నట్లు తిరస్కరించెను.

పర్యవసానము:-- కచతిరస్కృతయగు దేవయాని పరిభవాగ్నిచే సంతప్తయై క్రుద్ధురాలై కచునిఁజూచుచు, "నిన్ను వలచివచ్చిన నన్నింత చులకన జేసితిరస్కరించితివి. కావుననాతండ్రికడ నీనేర్చినవిద్య యెల్ల నీ కుపయోగపడకుండుఁ గాక" యని యామె కచుని శపియించెను.

8. రంభ- దేవవేశ్యలందఱిలో నీమె మిక్కిలి రూపసి. రూపసులలోనికెల్ల నీమెయే పేరుమోపినది. ఒకతరుణమున రావణునివంటి జగదేకవీరుని గూడ తిరస్కరించి, తూష్ణీంభావముఁజూపినయారంభ, శుకమహర్షిని సమీపించి తన్ను వరింపుమని యెంత ప్రార్థించినను, అమ్మహర్షి సమ్మతింపక తిరస్కారముజూపెను. "మాకీవిశ్వంబున గెల్వఁగూడని విభుండే లేఁడు లేఁడెప్పుడున్" అని గర్వించినరంభ, ఖిన్నురాలై పరాభవాగ్నికిఁ దాళఁజాలక వెడలిపోయెను.

పర్యవసానము:- శుకయోగీంద్రుని దావలచినది పరిత్యేకకారణమున నగుట, నాతనియెడ పగ బూనక మెల్లమెల్లన వెనుదిరిగి పోయెను.

9. వరూధిని- ప్రవరాఖ్యుఁడు- సిద్ధుఁడొసగిన పాదలేపన మెంతబలము గలదో (సోదా) పరీక్షింప నెంచి, తననివాసస్థలమగు నరుణాస్పదమునుండి కాశీ, గయా, ప్రయాగ మొదలగు పుణ్యస్థలములఁ జూడఁ బోనె చన, తన బుద్ధిజాడ్యజనితోన్మాదంబున హిమవన్నగముం జూడఁ బోఁగోరి, తత్పాదలేపన మహిమమున నట జేరి, కొంతవడి యటనున్న వినోదములం బరికించుచు, సాయంసమయ మగుట నింటికి మరలనున్న సమయానఁ, దన పాదలేపనము కరఁగిపోవుట(నింకనిలు సేరజాలక)ఆందోళనమున తోఁవ నెఱుకొనుచున్న ప్రవరాఖ్యు నాసమీపమునన్న వరూధిని యను గంధర్వకాంత కాంచి, మోహించి, త న్నంగీకరింపుమని వానిని ప్రార్థించి, యెన్నిమాయలు పన్నినను ఎన్నెన్ని వలపుపలుకులు బలికినను నవి వానియెడ కార్యకారులు కాకుండుట నెఱింగి, తుట్టతుదకు తన "పాలిండ్లు పొంగార పైయంచుల్ మోనగఁ గౌఁగిలించియధరంబాసించె." అంతకును ప్రవరాఖ్యుఁ డియ్యకొనక నామెను "పో"మ్మంచున్ ద్రోసివైచెను. తనంతఁ దా వలచి వచ్చినకాంత కింతకన్న నింకేమి పరాభవము కావలెను?

పర్యవసానము:- తా నాశించిన పురుషుఁడు తనకుం జిక్కకపోవుటకుఁదోడు తన్ను వెనుకకు ద్రోసివైచెనన్న పరాభవమునకు లోఁబడియు, ద్వేషభావమూనని దీమానినీమణి.

10 శూర్పణఖ - తనభర్తయగు విద్యుజ్జిహ్వుఁడు తనయన్నయగు రావణునిచే కాలకేయులతో నొనర్చినరణమధ్యమున నిహతుఁడయ్యెను. గతభర్తృక యగు నీమెకుమారుఁడగు జంబుకాసురుఁడు మఱికొంచెముకాలమునకే నరులచే(రామాదులచే)నిహతుండయ్యెను. ఇంతదుఃఖములో నుండియు, తనకుమారుని జంపిననరునిఁజంపు ప్రయత్నమునబయలుదేఱిన యీశూర్పణఖకు, శ్రీరాముఁడు దృగ్గోచరమైన వెంటనే క్రోధాగ్ని మన్మథాగ్నిగా మాఱిపోయినది. ఈవలపుకాఱులో, తాను గతభర్తృకనని గాని, తన్ను వేధించుచున్న పుత్రవియోగానలము గాని, తనకు జ్ఞాపకము రాలేదు. ఆమె వలచిన శ్రీరాముఁడు గాని, శ్రీరామునను జ్ఞను నామెఁ సమీపించిన లక్ష్మణుఁడుగాని, యామె నంగీక

రింపలేదు సరిగదా, ఆశాభంగమునకునవమాన ము జోడైనట్లు, తనవలపుపొలివోవ తనముక్కు- సెవులకు గోతము సంభవించినది.

**పురుషపురము(పెషావరుపురము)-** (ముకంద దేశము చూడుఁడు.)

**పురుషరేఖ** (సాముద్రికము చూడుఁడు. స్త్రీసాముద్రికము చూడుఁడు.)

**పురుషసాముద్రికము**—(సాముద్రిక శాస్త్రము చూడుఁడు.)

౧ పాదతలరేఖలు-ఇచట ధ్వజరేఖ, వజ్ర రేఖ, అంకుశరేఖ, ఛత్రరేఖ, చామరరేఖ, శంఖరేఖ, పద్మరేఖ, కలశరేఖ, మత్స్యరేఖ, కుండలరేఖ, హలరేఖ ఇవి అన్ని గాని, కొన్ని గాని యుండిన ధనవంతుఁడుగఁగాని భూపతిగఁ గాని చెప్పవలయును. రేఖలు ఎఱ్ఱగ, రక్తవర్ణ ములై లోఁతుగనుండిన శుభప్రదము. ప్రతిభ గల్గు ఁడని గ్రహించునది. ఈరేఖ లాయా వస్తువులపోల్కిఁగల్గి యుండునని యెఱుఁగునది. కొందఱ కఱచేతియందు, అరచేతివ్రేళ్ళయందు, అందు ముఖ్యముగ వ్రేళ్ళ కడభాగమునందుఁ గ న్పట్టెడిని.

౨ పాదతలములు- తామరపూవుం బోలి యెఱ్ఱనై మృదువుగను, చెమట లేకయుండినను నైశ్వర్యవంతుఁ డనియు, చేటలవలె పాదము లుండినను, చెమట గల్గియుండినను, కాలివ్రేళ్ళ నడుమ సందు లుండినను, పాదములు తెల్లబాఱి యెఱుపు లేకయుండినను దారిద్ర్యదుఃఖము లనుభవించువాఁడుగ నెఱుంగునది.

3 పాదనఖములు(కాలిగోళ్లు)- ఎఱ్ఱగను, తామ్రవర్ణముగలవిగను నుండిన ధనవంతుఁడు సౌఖ్యజీవియు నని యెఱుంగునది.

౪ పాదాంగుళములు (కాళ్ళివ్రేళ్లు)- ఇవి పొడవుగను, సమముగను నుండిన సుఖి యనియు, వ్రేళ్ళకొనలు సమములయి వంకరలు లేకయుండిన భూపతి యనియుఁ జెప్పవలయును. వంకరలుతిరిగి విరళములుగ వేర్వేఱుగఁ గన్పించు చుండిన దుఃఖి యని చెప్పఁదగును. బొటన వ్రేలికన్న రెండవవ్రేలు పొడవుగ నుండిన భోగమునం దాసక్తి మెండనియు, మూఁడవవ్రే లధికముగ నుండిన భార్యలేనివాఁ డనియు నాల్గవవ్రేలు కుఱుచగ నున్న పరనారీలంపటుఁ డనియు, కడవ్రేలు కుఱుచ యగునేని భోగి యనియుఁ జెప్పవలయును.

బొటటనవ్రేలు, రెండవవ్రేలు, మూఁడవ వ్రేలు సమము లయిన నుత్తముఁడనియు, చిటి కెనవ్రేలు పొడవు వ్రేళ్ళమధ్య నెడముగ సందులు గానవగు చుండునేని దాసత్వజీవనము గల్గువాఁడనియుఁ జెప్పఁబడినది.

౫ మీఁగాళ్లు- తాఁబేలువలె నున్నతములై ఎఱ్ఱనిచిగురువంటి వర్ణము గల్గియుండిన ప్రభు వనియు, మచ్చయున్న భోగి యనియు చెప్పఁ బడినది.

౬ మడమలు- సమముగ నెఱ్ఱనిరంగున నుండిన సౌఖ్యజీవి. లేకుండిన విస్తారము నడుచు వాఁ డని చెప్పఁబడినది.

౭ చీలమండలు- సమముగను చిన్నవిగను నుండుట సల్లక్షణము.

౮ గతి (నడక) - ఎద్దు, సింహము, పులి, ఏనుఁగు, హంస వీట్లంబోలిన గమనము గల్గిన శ్రేయము. ఇది ప్రభుత్వమునకు భోగతమునకు లక్షణము.

లొట్టియ, కుక్క, దున్నపోతు, పంది నడక వంటినడక గల్గిన ధనహీనుఁడని చెప్పఁ దగును. కాకివంటి నడకగల్గిన దుఃఖి యనియు, గుడ్లగూబనడకవంటి నడకగల్గిన రోగియనియుం జెప్పఁబడినది.

౯ పిక్కలు- తురగమువలె నున్న ధనవం తుఁడు, లేడివలెనున్న దీర్ఘాయుష్మంతుఁడు,

వలమగుపిక్కలుగల్గిన నడుచువాఁడు, యాత్రార్థి యగును. సింహముంబోలిన బలశాలి, పులింబోలిన కీర్తియుతుఁడు, సృగాలముం బోలి రోమములు లేకుండిన దరిద్రుఁడు, మొసలి, పంది వీట్లంబోలు పిక్కలు గల్గిన లక్ష్మీకటాక్షముగలవాఁడు, సూక్ష్మములయిన భోగి, లొట్టియంబోలిన నాపదలుగలవాఁడు. కాకజంఘుఁడైన ప్రభులక్షణము. కరికరజంఘుఁడు శ్రీమంతుఁడు.

౧౦ దేహమున కుదుళ్ళయందలి రోమములు– కుదురునం దొక్కొక రోమమున్న ప్రభుత్వలక్షణము. రెండేసి యుండిన ధనవంతుఁడు. మూఁడేసియుండుటవిద్వాంసుని లక్షణము. బహురోమములు దారిద్ర్యలక్షణము.

౧౧ మోఁకాళ్లు– నునుపు,గుండ్రని యాకారము, సమముగా నుండుట, ఉత్తముని లక్షణములు. లేకున్న దుర్మార్గుఁడు.

౧౨ తొడలు– పొడవుగ మాంసయుక్తములై లావుగ నెముకలయానవాళ్ళు కానరాకుండిన ప్రభుత్వలక్షణము. రోమములు దట్టముగ నుండిన భోగియో లేక దయాంతరంగము గలవాఁడో యైయుండును.

౧౩ అండములు– సమముగానుండుట దీర్ఘాయుర్లక్షణము. చిన్నవిగ నుండుట ప్రభుత్వలక్షణము. వంకర సేవకావృత్తి జీవనమునకు లక్షణము. నిర్బీజము లయ్యెనేని పౌరుషహీన లక్షణము.

౧౪ లింగము– ఎడమవైపునకు వ్రాలిన ధనవంతుఁడు. కుడివైనకు వ్రాలిన పుత్రవంతుఁడు. స్థూలమగునేని దుఃఖి, దీర్ఘమైన దరిద్రుఁడు. కృశించియున్న భాగ్యవంతుఁడు. సూక్ష్మమైన రక్తవర్ణపు జాఱలం గల్గియుండుట ప్రభుత్వలక్షణము. ప్రలంబవక్త్రమైన సుఖి. ధవళవర్ణమైన నిర్ధనుఁడు.

౧౫ మూత్రము– విరివిగ దక్షిణావర్తముగ నేకధార ప్రభుత్వలక్షణము. కడకు ఏకధార రెండుగ చీలుచుండిన ధనికుఁ డగును. ఎక్కువ ధారలు చీలుటయు నిశ్శబ్దముగ పడుటయు దరిద్రలక్షణములు. ధ్వని యగుట సుఖవంతుని లక్షణము.

౧౬ శుక్లము– స్ఫటికమువలె తెల్లనైయుంటయు, తామరపూవు, మదిరగంధము (వాసన) గల్గియుండుట బ్రభుత్వలక్షణములు. తేనెవాసనయు, చేపలవాసనయుఁ గల్గిన స్త్రీసంతతి యధికమై ధనవంతుఁ డగును. లక్కవాసన గల్గిన భోగి యనియు, మాంసమువాసన గల్గిన దొంగ యగు ననియు, దుర్గంధమును, ఉప్పునీటివాసనయుఁ గల్గిన దరిద్రుఁ డగుననియు నెఱుంగునది. శీఘ్రస్ఖలనము దీర్ఘాయుష్మంతు నగును, చిరస్ఖలనము అల్పాయుద్దాయ వంతు నగును లక్షణములు.

౧౭ రక్తము– లత్తుకదూదిరంగు ధనవంతుఁడు. పగడపురంగు ప్రభువు. తామరాకువలె నున్న స్త్రీసంతతి యధికము; దుఃఖముగలవాఁడు. గోమయవర్ణము రోగియగును. జంతురక్తముంబోలిన నిర్ధనుఁ డగునని చెప్పఁబడినది.

౧౮ పిఱుఁదులు– సింహము, అశ్వము,పులి వీట్లంబోలి బలిసియున్న ప్రభుత్వలక్షణము. విశాలమై ఎత్తు తక్కువగనున్న బహుపుత్రవంతుఁడు. కోఁతిపిఱుఁదులవలె శుష్కించియున్న ప్రతిష్ఠలేనివాఁ డని చెప్పఁబడినది.

౧౯ నాభి– (బొడ్డు).దక్షిణావర్తమై గుండ్రముగ గంభీరముగ నున్న యోగ్యుఁడు. వామావర్తమై కడులోఁతుగల్గి మూసుకపోయియున్న దుశ్చరిత్రగలవాఁడు. ఉబ్బెత్తుగనున్న దుఃఖి.

౨౦ కడుపు–గంభీరమైన ప్రభుత్వలక్షణము. పెద్ద (బానవంటి) దయ్యెనేని ధన్యుఁడు. పులినిబోలు కడుపుగలవాఁడు ఏనుఁగులు గలవాఁ

డగును. నక్కవలె ఎండుకడుపు గలవాఁడు అధముఁ డగును. నృసింహోదరుఁడైన ధన ధాన్యసమృద్ధి గలవాఁడు.

౨౧ నడుము- సింహముంబోలిన శ్రేష్ఠము.

౨౨ వళులు(కడుపుపైనున్న ముడుతలు)-ఒక మడతగల్గిన శస్త్రహతుఁ డగును. రెండుగల్గిన స్త్రీలను గెల్చువాఁడు. మూఁడుగల్గిన స్త్రీసుఖ మనుభవించువాఁడును, నాల్గుగల్గిన పుత్రవంతుఁడును పరాక్రమశాలియు నగును. పార్శ్వములు (ప్రక్కలు) వంకరలుగల్గినవాఁడు నిత్య సంతోషి యగునని చెప్పఁబడినది.

౨౩రొమ్ము-ఎత్తుగ నునుపుగల్గిన శూరుఁడు. వెండ్రుకలు లేకున్న వాఁడు కపటి..ఎండురొమ్ములు కల్గి (మాంసహీనుఁడు) కురూపముగల రొమ్ములున్న వాఁడు దుఃఖి యగును. రొమ్ముల మధ్య భాగ మెడముగ నున్న దీర్ఘాయుష్మంతుఁడు. స్వల్పమైన అల్పాయుష్మంతుఁడు. హృదయ మధ్యమున గుంట లోఁతుగ నుండిన మాట దాచఁగల దూరాలోచనాపరుఁడు.

౨౪ వక్షము- విశాలమై దృఢమైన ధన ధాన్యసంపన్నుఁడు, దయామయుఁడు. నరములు గానఁబడునేని దుఃఖి.

౨౫ జత్రువు- (మూఁపునకు మెడకుఁ గల సంధిప్రదేశము) గూఢముగ నున్న యోగ్యుఁ డగును.

౨౬ స్కంధము- (మూఁపు లేక మూఁపురము) వృషస్కంధుఁడు మహాభోగి. గజస్కంధుఁడు ధన్యుఁడు. కదళీ (అరఁటి) స్కంధుఁడు రాజతుల్యుఁడు.

౨౭ భుజములు - ఏనుఁగుతుండములవలె నుండి ఆజానుబాహువు (మోఁకాళ్ళవఱకు పొడవుగల బాహువులుగలవాఁడు)భూపతియు, అదృష్టవంతుఁడు నగును. కుఱుచలైన నిర్భాగ్యుఁడు.

౨౮ కక్షములు (చంకలు)- ఎచ్చుతగ్గులైన దుఃఖి. సమమైన సంతోషి. రోమరహితుఁడైన దరిద్రుఁడగును.

౨౯ మణిబంధములు - (ముంజేతులు) కుఱుచఁగ నందముగ నున్న ప్రభుత్వలక్షణము. ముడుసులు గానంబడుచున్న దుఃఖి. మూఁడు రేఖ లుండిన భూషణముల ధరించువాఁడు.

30 హస్తపృష్ఠము- అట మచ్చ యున్న కులనాశకరుఁడు.

3౧ హస్తతలములు (అఱచేతులు)- మోదుగుపూవుంబోలిన వర్ణము గల్గిన ప్రభుత్వలక్షణము. కఠినములైన ప్రతిభ గలవాఁడు. లోఁతుగనున్న ధనవంతుఁడు. గట్టిగ నున్న స్త్రీలోలుఁడు. మెఱుఁగు లేకయున్న దరిద్రుఁడు. సమముగనుండక వ్యత్యాసముగనున్న ధనహీనుఁడు, కష్టజీవియు నగును.

3౨ హస్తాంగుళములు (చేతి వ్రేళ్ళు)- ఎడము లేక పొడవుగ నున్న యోగ్యుఁడును, భోగియు నగును. ఎడము గల్గిన నిర్ధనికుఁడు. వంకరలున్న క్రూరుఁడు. నరములు గన్పించిన పాపకర్ముఁ డగును.

33 హస్తాంగుళనఖములు(చేతివ్రేళ్లయందలి గోళ్ళు)- ఎఱుపురంగును సొగసైన కళయును గల్గిన ప్రభుత్వలక్షణము. గుండ్రముగ నున్న నైశ్వర్యవంతుఁడు. మొనలు వంకరలు గల్గి త్రిశూలములవలెనున్న దరిద్రుఁడు. తెల్లనైన దుఃఖి. పుప్పిగల్గిన దుశ్శీలుఁడు. మెఱుఁగులేకుండిన కామభోగహీనుఁడు.

3౪ హస్తరేఖలు(అఱచేతియందలి రేఖలు)- ఇవి అసంఖ్యాకములు కలవు. శాస్త్రగ్రంథములందు పెక్కులు వివరింపఁ బడినవి. అందు ముఖ్యములను వివరించుచున్నారము.

(౧) ఆయుర్దాయ రేఖలు:- చిటికెనవ్రేలి మొదటినుండియు భిన్నము గాకుండ రెండవ వ్రేలి

(మధ్యను) మొదటికి జేరిన ౧౦౦ ఏండ్లు ఆయుర్దాయము చెప్పఁబడినది.

ఈ ఆయుర్దాయ రేఖయే మూఁడవ వ్రేలు (అనామిక) మొదటికిఁ జేరిన ౮౦ సంవత్సరములాయుర్దాయము చెప్పఁబడినది.

ఈ రేఖయే నాల్గవ వ్రేలి మొదటికిఁ జేరిన నలువది సంవత్సరములాయుర్దాయము చెప్పఁబడినది.

చిటికెన వ్రేలి మొదలున ఊర్ధ్వ రేఖ యున్న పరదేశవాసియైనూఱుసంవత్సరములుజీవించెడిని.

చిటికెన వ్రేలినాల్గవ(చూపుడు వ్రేలు) పర్వము (మూఁడవ కణుపు)నుమించియున్న ౧౦౦ఏండ్లును సమముగనున్న ౮౦ఏండ్లును, ఇంచుక తక్కువయైన ౬౦సంవత్సరములును ఆయుర్దాయము.

(౨) ప్రభుత్వలక్షణ రేఖలు :- బొటనవ్రేలి మొదటనూర్ధ్వ రేఖలున్న ప్రభుత్వలక్షణము.దండసహితాతపత్ర రేఖ (గొడుగుకఱ్ఱసహా) గాని, చామరద్వయ రేఖలు (౨ చామరములు) గాని, హస్తమం దుండిన చక్రవర్తియంతటి ప్రభుత్వ లక్షణము. మత్స్య(చేప) రేఖ గాని, చక్ర(చక్రము) రేఖ గాని, కుండల (మకరకుండలము) రేఖ గాని, ధ్వజ(జెండా) రేఖ గాని, వజ్ర రేఖ గాని, అంకుశ రేఖగాని, ఛత్ర రేఖగాని,శంఖ రేఖగాని, పద్మ(తామరపూవు) రేఖ గాని, కలశ(చెంబు) రేఖగాని,హల(నాఁగలి) రేఖగాని హస్తములం దుండుట ప్రభుత్వ లక్షణమని చెప్పఁబడినవి.

శక్తి, తోమర, దంత (ఏనుఁగుదంతము), ఖడ్గ(కత్తి),చాప, గద రేఖ లఱచేతియందుంట రాజలక్షణములు.

(3) ధన రేఖలు:-పురుష రేఖ సమీపమునం దుండి, నాల్గవ (చూపుడు) వ్రేలి నడుమవఱకుండునది ధన రేఖ యనంబడును. హస్తమున పద్మ రేఖలున్న కోటీశ్వరుఁడని చెప్పవలయును. మీన రేఖ ధనసంపత్తిని దెలుపుటయే గాక కర్మసిద్ధిని, బహుసంతానవృద్ధిని గూడఁ దెలుపును. మకర రేఖ ధనవిశేషమును దెలుపును. అంకుశ రేఖ, శంఖ రేఖ, కలశ రేఖ, హల (నాగలి) రేఖ, చక్ర రేఖ, కుండల రేఖ ధనికుని లక్షణములు. ఖడ్గ రేఖ, అష్టకోణ రేఖ ధనవంతుని లక్షణములుగ పెక్కండ్రు నుడివియున్నారు. మత్స్య రేఖ లెదురై రెండున్న అష్టైశ్వర్యములుగలవాఁ డగునని చెప్పఁబడినది,

(౪) విద్యా రేఖలు:-ఆయుష్య రేఖకునునాల్గవ వ్రేలికిని నడుమ నిలువుగ నుండునది విద్యా రేఖ యనంబడును. శంఖ, చక్ర,మత్స్య,ధ్వజ రేఖలు విద్యావంతుని లక్షణములుగఁ జెప్పఁబడినవి.

(౫) జీవనము:-చేతి నాల్గు వ్రేళ్ళయందు నూర్ధ్వ రేఖలున్న కృషీవలనజీవనమును, ధనధాన్యపుత్ర పౌత్రాదులును, కష్ట సుఖములును జెప్పఁబడినవి. చిటికెనవ్రేలు మొదటికి ఊర్ధ్వ రేఖ లున్న పరదేశజీవనమును,స్వల్ప రేఖలున్న నిర్ధనజీవనమును, బహు రేఖలున్న దరిద్రజీవనమును, నాల్గు రేఖలు సౌఖ్యజీవనమును, రక్త రేఖలున్న సుఖజీవనమును,కృష్ణ రేఖలున్న దాస్యజీవనమును,త్రికోణ,సీర(నాగలి),ముసల(రోఁకలి), ఉలూఖ (ఎలుక) రేఖలు హస్తమునం దుండుట కృషీవల (వ్యవసాయ) జీవనమును తెల్పు రేఖలుగ నెఱుంగునది.

(౬)సంపద రేఖలు:-(సంపదయనకుటుంబాభివృద్ధి). ఆయుష్య రేఖకు దిగువను మణిబంధమునకు మీఁదను కరపార్శ్వమందలి రేఖలు సంతానసంఖ్య తెలుపునవి.బొటనవ్రేలి మొదటి నుండి మణిబంధమువఱకుఁ గల రేఖలు సోదర సంఖ్యను వివరించునవి. మూఁడవ వ్రేలు మొదట నూర్ధ్వ రేఖలున్న ధనవంతుఁడైన పుత్రపౌత్ర సంపదగలవానికి లక్షణ మని చెప్పఁబడినది. నాల్గవ వ్రేలునందు ఊర్ధ్వ రేఖలున్న కృషీవలన ధనమును, పుత్రపౌత్రగృహసౌఖ్యములును గల

వాఁడని చెప్పఁబడినది. మీనరేఖ(మత్స్యరేఖ) బహుసంతానవంతుఁడని తెలుపును.

(౭) సుఖ(సౌఖ్య)ము దెలుపు రేఖలు:- బొటనవ్రేలినడుమ యవరేఖ(యవధాన్యముంబోలిన రేఖ) యుండిన భోజనసౌఖ్యము కలవాఁడనియు, హస్తమున స్వస్తికరేఖ యున్న సకల సౌఖ్యములు కలవాఁడనియు, చాప, ఖడ్గ, అష్టకోణరేఖ లున్న సౌఖ్యవంతుఁ డనియుఁ జెప్పఁబడినది.

(౮) భార్యా రేఖలు:-మణిబంధము నడుమనుండి బొటనవ్రేలు రెండవకణుపునకును, రెండవ వ్రేలు నడుమకణుపునకును వ్యాపించియుండు రేఖ పురుషరేఖ యనంబడును. పురుషరేఖకు ఆయుష్యరేఖకు నడుమనుండి పురుషరేఖతోఁ గూడియుండునది స్త్రీరేఖయనంబడును. చిటికెన వ్రేలి పార్శ్వము మొదటను ఆయుష్యరేఖ సందునను నుండు రేఖలు భార్యలసంఖ్యను దెలుపు రేఖ లని చెప్పఁబడినది.

(౯) గండపురేఖలు:-బొటనవ్రేలు రెండవ వ్రేలు నడిమిరేఖలు ఒకనికి సంభవించు గండములసంఖ్యను దెలుపును.

(౧౦) పశురేఖలు-: బొటనవ్రేలి పార్శ్వ రేఖలు ఒకనికి గల్గుపశువులసంఖ్యను దెలుపును.

(౧౧) సత్కర్మరేఖలు:-హస్తమున మత్స్యరేఖయున్న కర్మసిద్ధి యగుపురుషుఁ డని చెప్పఁబడినది. కరమధ్యమునందు త్రిశూలరేఖయున్న యజ్ఞాదికర్మలు, దానధర్మాది సత్కార్యములు చేయువాఁడని చెప్పఁబడినది.

(౧౨) పూజ్యతరేఖలు:- మత్స్యరేఖ సర్వపూజ్యతగలవాని లక్షణ మనియు, అంగుళిపర్వముల దక్షిణావర్తములు గల్గి, యెఱ్ఱనై ఎత్తుగల నునుపగు నఖములుండుటపూజ్యుఁడగుపురుషుని లక్షణము లనియు, పర్వతరేఖయు, కంకణ (చేతికంకణము) రేఖయు, యోని (త్రికోణ) రేఖయు, కరమునం దున్న పురుషుఁడు మంత్రిత్వ మొనర్చువాఁ డనియు, రెండవ వ్రేలు మొదట నూర్ధ్వరేఖలున్న రాజదూతయైయుండు వాఁడుగను, అట్టివాఁడు రాజదూత యయ్యు నితరధనరేఖలు బలముగ లేకుండునెడ ధననాశన మనియుఁ జెప్పఁబడినది.

౩౫ పృష్ఠము (వీపు)- వీపున మచ్చయున్న అన్యులచే నర్థింపఁబడి వారలకోర్కులీడేర్చు గుణముగలవాఁడని చెప్పఁబడినది. పాఁడవమధ్యముఁడగునర్జునునకిట్టిమచ్చ వీఁపుననుండెడిదఁట.

౩౬ ముఖము- పూర్ణచంద్రునిం బోలి సమముగ నుండిన దానధర్మనిరతుఁ డగు ననియు, కరాళమైన దరిద్రుఁ డనియు, హయవక్త్రము, మర్కటవక్త్రముగలవాఁడు దుఃఖదరిద్రజీవనుఁ డనియు, జంబుకవక్త్రుఁ డైన కుటిలుఁ డనియుఁ జెప్పఁబడినది.

౩౭ కంఠము- గుండ్రమై నరములు గానరాక యుండిన ధనధాన్యసంపదలు గలవాఁడు. శంఖముం బోలిన యాకారమునఁ దనరుట ప్రభుత్వలక్షణముగల ఉత్తముఁడు, భోగి యని చెప్పఁబడినది. మహిషగళ ముండినవాఁడు భోజనప్రియుఁ డనియుఁ జెప్పఁ బడెను.

౩౮ చుబుకము (గడ్డము)- రోమములు లేకుండిన అపుత్రవంతుఁడో నపుంసకుఁడో యగుననియు,చివరలు పగులక కుదురుగ నున్న నైశ్వర్యలక్షణ మనియుఁ జెప్పవలయును.

౩౯ అధరము (క్రిందిపెదవి)- పవడపు రంగుతోఁ దనరిన ప్రభుత్వలక్షణము. ఎఱుపు రంగు భోగి యగుటఁ దెల్పును. వక్రత (వంకర) దుఃఖమును, వలముగనుంట యశక్తతను నిరూపించును.

౪౦ దంతములు (నోటిపండ్లు)- మల్లె మొగ్గలవలె రూపకాంతులు గల్గిన ప్రభుత్వ లక్షణ మనియు, రాక్షసులఁబోలిన పండ్లున్న

నిశ్శ్వాసముకలిగినవాఁడనియు, కోఁతిపండ్ల వంటి పండ్లున్న ఐశ్వర్యము, దారిద్ర్యము, కానట్టి సామాన్యస్థితి గలవాఁ డనియు, వరుస దప్పినపండ్లు, ముడిపండ్లు, విడిపండ్లు, పుప్పిపండ్లు ఉంట పాపకర్మునిలక్షణము లనియు, ముందు నకువచ్చినపండ్లుగలవాఁడు ముక్కోపి యనియుఁ జెప్పవలయును.

౪౧ తాలువులు (బుగ్గలు)- తామరరేకులం బోలిన తాలువులు ప్రభుత్వలక్షణము. రక్త వర్ణములైన ధనికుఁడై భోక్త యగును. నీలవర్ణ ముగల్గిన దరిద్రుఁ డగును.

౪౨ జిహ్వ (నాలుక)- నాలుక దళసరియై స్థూలమైన నసత్యవాది, క్రూరుఁడు, అవిద్యా వంతుఁ డనియు, రక్తవర్ణమై పలుచగ నున్న విద్వాంసుఁ డనియు, తామరపూవుంబోలిన రంగుగల్గిన భోగి యనియు, తెల్లనిధాతువు గల్గిననాల్క యుంట ఆచారహీనుఁ డనియుఁ జెప్పఁబడినది.

౪౩ స్వరము (కంఠధ్వని)- హంసస్వరము ధన్యజీవనమును, మేఘస్వరము (ఉఱుమువలె పెళపెళలాడు గంభీరధ్వని) ప్రభుత్వలక్షణమును, తుమ్మెదవంటిస్వరము అధికారలక్షణము గాని, భోగి యగుట గాని వివరించును. క్రౌంచపక్షిం బోలిన స్వరము ధనవంతుఁ డగుటఁ దెలుపును. దుందుభిస్వరము గల్గినవాఁడు సుఖి. గార్దభ స్వరముగలవాఁడు నిర్ధనుఁడు, కాకివంటి స్వరము గలవాఁడు దుష్కర్ముఁ డనియుఁ జెప్పఁబడినది.

౪౪ హసితము (నవ్వు)- తఱచుగ నవ్వు చుండువాఁడు అంతఃకరణశుద్ధిగలవాఁడు. లేని వాఁడు కుటిలుఁడు. ఊరక బెకబెకనవ్వువాఁడు పటిమలేనివాఁడు. కొంచెముగనుమధురముగను నవ్వుట ఉత్తమునిలక్షణముగ నెఱుంగవలెను.

౪౫ మీసపు వెండ్రుకలు- తుమ్మెదవర్ణమున నీలములై దీర్ఘము లగుట ప్రభుత్వ లక్షణము. కపిలవర్ణము గల్గినమీసములు గల వాఁడు శూరుఁడు. మృదుత్వముగల్గి సూక్ష్మమై కొనలుదేఱి యుండిన సుఖవంతుని లక్షణము. ముందు మీసమును, పిదప గడ్డమును వచ్చిన దీర్ఘాయుష్మంతుఁడనియు, ముందే గడ్డమువచ్చి పిదప మీసము వచ్చిన అర్ధాయుష్మంతుఁ డనియుఁ జెప్పఁబడినది.

౪౬ నాసిక (ముక్కు)- చిలుకముక్కు వలె నున్న ప్రభుత్వలక్షణము. దీర్ఘనాసికభోగియొక్క లక్షణము. హ్రస్వనాసిక ధర్మశీలుని లక్షణము. నాసిక సౌందర్యయుక్తముగ నుండిన మేలు. వికారాకారముగ నుండిన నిర్ధనికుఁడు, నిర్భాగ్యుఁడు, శీలరహితుఁడు, క్రూరచిత్తుఁడు నని యెఱుంగునది.

౪౭ నేత్రములు- ఎఱ్ఱనిజీర లున్న నేత్రములు ధనవంతునకు లక్షణమును. పులివంటినేత్రములు ముక్కోపిలక్షణము. కోడికండ్లవంటి నేత్రము లుండిన దుఃఖి యగును. లేడినేత్రములవంటివి గలవాఁడు లాభము నొందు చుండువాఁ డని యెఱుంగునది. పిల్లికండ్లు, హంసకండ్లు నరాధముఁ డనిపించుకొని యాపదలపా లగువానివి. నెమలి కండ్లు, ముంగిసకండ్లు గలమానవుఁడు మధ్యము డని కొందఱనిరి. నేత్రాంతము లెఱ్ఱనైన ధన వంతుఁ డగును. మధుపింగళ (తేనెరంగు) వర్ణము గల్గియుండిన నైశ్వర్యారోగ్యములు గల్గినవాఁ డని కొందఱు ఋషు లనిరి. కాని, పెక్కండ్రు ఇది ప్రతిభగలవాని లక్షణము గా దనిరి. ఒక నేత్రము జన్మదారభ్య గలవాఁడు, క్రూరకర్ముఁ డనియు, మిడిగ్రుడ్లు కలవాఁడు నైష్ఠికులలో మూర్ఖుఁ డనియుఁ జెప్పఁబడినది. తడికన్నులు గలవాఁడు దుఃఖి యనియు, గుంటకన్నులు దరిద్రలక్షణ మనియు నెఱుంగునది.

౪౮ కనుబొమలు- వర్తులాకారముగ వంగి దక్షిణావర్తమైయున్న శతాయుష్మంతుఁడనియు

ఇవి దళమైన యధికారమూర్తి యనియు, సన్నముగ దిద్ది తీర్చినటుల నున్న ప్రభు వగు ననియు, పార్శ్వశిరోజముల నంటియున్న నల్పా యువనియుఁ జెప్పఁబడినది.

౪౯ కర్ణములు-కర్ణములు పెద్దవిగ నుంట దీర్ఘాయుష్మంతునిలక్షణము. చిన్న చెవు లుండిన నల్పాయువుగఁగాని లేక మహానుభావుఁడై గాని యుండును. రోమములు గల్గియుండిన సుఖి. మచ్చ యున్న ధార్మికుఁడు.

౫౦ శిరము(శిరస్సు)- విశాలముగ నుండుట ప్రభుత్వలక్షణము. శిరమున మచ్చ గల్గియుం డిన రాజ్యలాభము నందువాఁ డని చెప్పఁబడి నది. నరములు గానవగుచుబుడుపులుగలశిరము కలవాఁడు కష్టము లందువాఁడుగను, ఎండిన శిరమువలె నున్న శిరముగలవాఁడు దుఃఖియు నగునని చెప్పఁబడినది.

౫౧. లలాటము (నుదురు)- అర్ధచంద్రుని వలె నుండుట ప్రభుత్వలక్షణము. త్రిశూలరేఖ నుదుటఁగల్గియుండుట మండలేశ్వర లక్షణము. నుదురు వెడలుపుగ నుంట విద్వాంసుఁడనియు, దీర్ఘాయుష్మంతుఁ డనియు, నుదుట నాల్గు లున్న ౮౦ సంవత్సరములును, మూఁడు రేఖ లున్న ౬౦ సంవత్సరములును, రెండు రేఖలున్న నలుబది వత్సరములును ఆయుర్దాయమనియుఁ జెప్పఁబడినది. నుదురు విశాలము తక్కువ యైన కొలఁదినల్పాయుర్దాయమునువిద్యాలోపమును సూచించెడిని. నుదుట నైదు రేఖ లుండుట మహావైభవముల నందువాఁడు, దీర్ఘాయుష్మంతుఁడు నని చెప్పఁబడినది. నుదురు విపులమైన బహుధనికుని లక్షణము. నుదుట సుడి యున్న దరిద్రుఁ డగును. మచ్చ యున్న స్థానభ్రష్టుఁ డగునని చెప్పఁబడినది.

౫౨. తలవెండ్రుకలు- పొడవుగ నుండిన దీర్ఘాయువు, సాపుగ నుండుట ఐశ్వర్యవంతుని లక్షణము. విరళములు, నునుపు గలవి, తుమ్మెదరంగు గలవి, సుఖవంతునకు భోగికి లక్షణములు. ఉంగరములజుత్తు కాముకత్వసూచకమని కొందఱనిరి. ఎఱ్ఱని రావిచిగురువంటి ధాతువుగల వెండ్రుకలు దరిద్రుని లక్షణములుగఁ జెప్పఁబడినది. తుప్పతల ద్రవ్యహీనుం డగు వేషధారి లక్షణము. కుఱుచబాఱిన మొండివెండ్రుకలు,ఎంతసంరక్షించినను తిరికెల వలెనుండు శిరోజములు ప్రతిభాహీనతం దెలిపెడిని. కళాహీనమగు వెండ్రుకలు గలవాఁడు ధనహీనుఁడని చెప్పఁబడినది. ఎఱ్ఱని వెండ్రుకలున్నక్రూరకర్ముఁడని చెప్పఁబడినది.

పురుషలక్షణములందు మొత్తమున దేహము మిక్కిలిపొడవును, మిక్కిలిపొట్టియు, వలమును, కేవలము శుష్కించినయవస్థయుఁ గాక, మధ్యరకముగ నుండుట యోగ్యమని చెప్పఁబడినది.

భోజనము, నిద్ర, రతి శీఘ్రముగను, స్నాన మాలస్యముగను జేయుచుండువాఁ డిబ్బందులు లేక కాలముఁ గడుపువాఁ డనియు, ౧౦౮ అంగుళముల పొడవుగల శరీరముగల వాఁడు దివ్యపురుషుఁ డగు ననియుఁ జెప్పఁబడి నది. ఇవి పురుష సాముద్రికలక్షణములు.

**పురుషార్థములు నాలుగు**-౧ధర్మము, ౨ అర్థము, ౩ కామము, ౪ మోక్షము.

**పురుషోత్తమవ్యూహము**— రామానుజీయవైష్ణవ, చైతన్యవైష్ణవ మతధర్మములందు



తదేకాత్మరూప మహా విష్ణువు. అందుద్వితీయ చతుర్వ్యూహ ములలో నొకటి యనియు, వాసుదేవ వ్యూహము లైదింటిలో నొక ఉపవ్యూహ మనియు, విలాసమూర్తి అనియు వరుసగ చక్ర, పద్మ, శంఖ, గదలాయుధము లనియు జెప్పఁబడినవి. (విష్ణు దేవాలయము లందలి గహములు చూడుఁడు)

**పురుహోత్రుఁడు**— అత్రి. చంద్ర యాదవవంశక్షత్రియుఁడు. తండ్రి అనూరథుఁడు. పుత్రుఁడు సత్యశ్రుతుఁడు.

**పురూఢుఁడు**— యదుసంతతి. చంద్ర వంశక్షత్రియుఁడు. తండ్రి వసుదేవుఁడు. తల్లి సహదేవి.

**పురూరవచక్రవర్తి**— షట్చక్రవర్తులలో నొకఁడు. చంద్రవంశము. తండ్రి బుధుఁడు. తల్లి ఇలాదేవి. (వైవస్వతమనువు చూడుఁడు). ఇతనిరాజధాని ప్రతిష్ఠానపురము. ఇది సంయుక్త రాష్ట్రములలోని ప్రయాగకు సమీపము. ఇప్పటిపేరు ఝూంసి. చంద్రవంశపునృపతులలో మొదటివాఁడు.

పురూరవునకు ఊర్వశివలన ౧ ఆయువు, ౨ ధీమంతుఁడు, ౩ అమవసువు, లేక విజయుఁడు, ౪ చిరాయువు, లేక శతాయువు, ౫ వసుమంతుఁడు లేక శ్రుతాయువు నను నైదుగురు పుత్రులు గల్గిరి.

జాతవేదుఁడు అను నగ్నిని గల్గించినవాఁడీ పురూరవుఁడే యని చెప్పఁబడినది. ఆయగ్నియె ఆహవనీయాదిరూపముల నెగడిన దఁట.

**పురోచనుఁడు**—ఒకశిల్పి. దుర్యోధనుని చెలికాఁడు. లాక్షాగృహ(లక్క-యిల్లు)నిర్మాత. (ఇందు పాండవులంగాల్చి చంప నేర్పాటు.)

**పురోధస గోత్రము**— (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**పుట్టెనుబుట్టినబుద్ధిపుడకలతోఁగాని పోదు**— (ఆంధ్రలోకోక్తి.)

**పులగముపై పప్పు**— అవసరములేని జేనుని భావము. (ఆంధ్రలోకోక్తి.)

**పులస్తి గోత్రము**—(జమదగ్నిభిదా ఉపగణము చూడుఁడు.)

**పులస్తిగోత్రము**-(అగస్తిఉపగణముచూ)

**పులస్త్య నక్షత్రము లేక గోళము**-(నక్షత్రములు భారతీయులు గుర్తించినవిచూ).

**పులస్త్య మహర్షి** — బ్రహ్మమానస పుత్రులలో నొకఁడు. ఊర్వశిపైగల వలపున జనించినవాఁడని కొంద ఱనెదరు. పులస్త్యుని యొక్క-భార్య యదుమహర్షికుమార్తె యగు ప్రియమతి. ఈమెవలనవిశ్రవసుఁడు, అగస్త్యుఁడు కలిగి. వేఱొకభార్యతృణబిందుమహర్షికుమార్తె. ఈమెవలన విశ్వవసోబ్రహ్మ కలిగెను. ఇంకొక భార్య హావిర్భువు. ఈమె కర్దమ ప్రజాపతి కూఁతురు. ఈమెవలన అగస్త్య విశ్రవసువులు కలిగిరని దేవీభాగవతమునందునను ఉత్తరరామాయణమునందునను చెప్పఁబడినది.

# పులస్త్యమహర్షి సంతతి.

- పులస్త్యమహర్షి (బ్రహ్మమానసపుత్రుఁడు) భార్య హావిర్భుక్కు లేక ప్రీతి
  - అగస్త్యుఁడు భార్య లోపాముద్రాదేవి
  - ఆబాల్యజ్ఞానియై వ్యవహారనామము లేనివాఁడు. ఈయన నగస్త్యభ్రాతయందురు.
  - విశ్రవసువు భార్యలు నల్వురు
    - భార్య ఇలబిల
      - కుబేరుఁడు
        - నలకూబరుఁడు
        - మణిగ్రీవుఁడు
    - భార్య కైకసి
      - రావణుఁడు భార్య మందోదరీదేవి
        - మేఘనాదుఁడు (ఇంద్రజిత్తు)
        - అతికాయుఁడు
        - మహాపార్శ్వుఁడు
        - దేవాంతకుఁడు
        - నరాంతకుఁడు
        - త్రిశిరుఁడు
      - కుమార్తె శూర్పణఖ విద్యుజ్జిహ్వుని భార్య కుమారుఁడు జంబుకుమారుఁడు
      - కుంభకర్ణుఁడు భార్య విద్యుజ్జ్వాల
        - కుంభుఁడు
        - నికుంభుఁడు
      - విభీషణుఁడు భార్య సరమాదేవి
        - కుమార్తె త్రిజట.
    - భార్య పుష్పోత్కట
      - మహోదరుఁడు
      - మహాపార్శ్వుఁడు
    - భార్య రాక
      - ఖరాసురుఁడు
      - దూషణుఁడు
      - త్రిశిరుఁడు

**పులహ గోత్రము**--(అగస్తిఉపగణము చూడుఁడు).

**పులహ నక్షత్రము లేక గోళము**—
(...ములు భారతీయులు గుర్తించినవి చూ.)

**పులహాశ్రమము**--సాలగ్రామనదియొద్ద నుండెనని వరాహపురాణము ౧౪౩యందున్నది. (సాలగ్రామనది చూ. గండకీనది, సాలగ్రామ క్షేత్రము చూడుఁడు).

**పులహునిసంతతి**—పులహుఁడు బ్రహ్మ మానసపుత్రుఁడు. నవ బ్రహ్మలలో నొకఁడు. భార్య క్షమాదేవి (దక్షప్రజాపతికుమార్తె). (కర్దముఁ డీతనికొడుకని కొందర నెదరు). ఈతని సంతతివారు కొందరు కిన్నరులు, కొందరు కింపురుషులు ననిపించుకొందురు.

**పుల్ల గ్రామము**—దీని నిప్పటిఆసాము లోని చిట్టగాంగుపురిగా పోల్చియున్నారు.

**పులి**—సంస్కృతమున వ్యాఘ్ర మనం బడిన అటవీఘాతుకమృగము. ఇది పెద్దజాతి చిన్నజాతి యని ద్వివిధజాతులు గలది. పెద్ద జాతిని పెద్దపులి యనియు, చిన్నజాతిని చిఱుత పులి యనియు వాడిరి. కాని, యాంగ్లమున పెద్దపులికి "Tiger"అనియు చిఱుతపులికి "Cheeta"యనియు వాడుచున్నారు. రెండును ఘాతుకమృగములే. చిఱుతపులిని కొందఱు వేఁటకాండ్రు మచ్చికచేసి మాంసాహార మిడుచు తమవెంటఁ గొంపోయి చిన్నచిన్న జంతువులను వేఁటాడునటుల నేర్పి వేఁటయందుపయోగించుచుందురని తెలియుచున్నది.

**పులికట్టు సరస్సు**— ఇది చెన్నపురి కాగ్నేయదిశగా పొన్నేరిస్టేషనునుండి యీశాన్యదిశగా ౧౦ మైళ్ళదూరమున నున్న సరస్సు. ఎన్నూరు స్టేషనునుండి బక్కింగ్హాము కాలువ గుండా పడవలలో పోవుటయుఁ గలదు. అది యిందే చేరిపోవును. సరస్సు ౩౭ మైళ్ళపొడవును వేర్వేఱు తావులందు రెండు మొదలు పదునొకండుమైళ్ళవఱకు వెడల్పును కల్గియుండును. తీరమున పులికట్టుగ్రామము కలదు. అది తొల్లింటి డెన్మార్కు-వారి సెటల్మెంటుగ చెప్పంబడినది. ఇట వారు ఆదిని Geldria అనుపేరుగలకోటను తమ ఫేక్టొరీలను నిర్మించుకొని వర్తకము సాగించిరఁట. ఇప్పు డాయానవాళ్లమియుఁ గానరాకున్నవి.

**పులిని జూచి నక్క వాతపెట్టు కొన్నట్లు**— పులిచాఱల వలె తనయొడలిపై వాతలిడుకొనుట యని భావము. (ఆంధ్రలోకోక్తి.)

**పులింద దేశము**—దీనింగూర్చి పెక్కు సందియములు గలవు.

మహాభారతము-వనపర్వము ౧౩౯యందు ప్రశంసింపఁబడిన పులిందదేశము హరిద్వారపురమునకు వాయవ్యదిశయం దుండినటుల చెప్పఁబడినది.

వామనపురాణమున ౧౭౬ అధ్యాయమున చెప్పఁబడిన పులింద, బుందేల ఖండములోని పశ్చిమభాగమును, సాగర్ప్రాంతసీమలం గల్పుకొని యుండినటుల తేలుచున్నది.

"తారాతంత్ర" మనుగ్రంథమునఁ జెప్పఁబడిన పులింద, శిలాహట్పట్టణమునకు తూర్పున నుండినటులఁ గాన్పించెడిని. ఒకవేళ శిలాహట్పట్టణ మిప్పటి సిల్హెట్ పురమేమో. మఱియు నందే కామరూపదేశమున కుత్తరముగ పులింద యెల్లయుని చెప్పఁబడినది.

దీని నింకను చక్కఁగఁ బరిశీలించి మూఁడుపులింద లెవ్వియో గనుఁగొనఁదగియున్నది.

**పులిపక్క జోరీఁగ**--(ఆంధ్రలోకోక్తి.)

**పులిపిల్ల పులిపిల్లే, నక్కపిల్ల నక్క పిల్లే, తొండపిల్ల తొండపిల్లే**—ఇది వి త్తన మొకటి నాటితే చెట్టు వేఱుజాతిది పుట్టదను నట్టి సామెతవంటిదని భావము కలదియే. (ఆంధ్రలోకో .)

**పులిమీఁది పుట్ర**—ఒకపాంథుఁ డడవి నడుచుచు రాత్రి యెద్దనుకొని యొక పులిపై నెక్కి పరుగెత్తించుచుండె నఁట. ఆపులి వానిని మనుష్యుండని యెఱుంగక పులిమీఁదిపుట్ర యను జంతువుగా భావించెనఁట. ఉదయమున వాఁ డది పులిగా నెంచి జడిసి యొకకొమ్మను బట్టుకొని చెట్టెక్క, పులి తనను పుట్ర విడిచినదే చాలు నని దౌడువైచి పాఱిపోయె నఁట. (ఆంధ్ర లోకోక్తి).

**పులిమీసాలు పట్టుకొని ఉయ్యాల లూఁగినట్లు**— (ఆంధ్రలోకో .)

**పులోమ**— దక్షప్రజాపతికుమార్తెలలో నొకరిత. కస్యపమహర్షి భార్య. ఈమెసంతతివారు పౌలోము లనంబడిరి. దేవేంద్రునిభార్య యగు శచీదేవి యీామె సంతతిలోనిదె. (కస్యపుని భార్యలుచూడుఁడు.)

**పువ్వులమ్మిన ఊరనే కట్టెలమ్ముట**- (ఆంధ్రలోకోక్తి).

**పుష్కరము-తీర్థము** — ఈ మహా తీర్థమును తీర్థరాజ మనియు, తీర్థనాయక మనియు నందురు. రాజపుత్రస్థానపు అజమీరు (తొల్లింటి అజయమేరు) పురమునుండి యేడు న్నరమైళ్ల దూరమున నున్నది. ఇచటి గ్రామ మునకు "పుఖా" రని వాడుచున్నారు. ఇది కొన్ని వేలజనాభాగలచిన్న గ్రామము. పుష్కర తీర్థము (చెఱువు)నకు మూఁడు దెసల స్నాన ఘట్టములు దేవాలయములతో నిండి యున్నవి. ఇది పితామహుని (విధాత) పశ్చిమవేది.

ఆదిని పరమేశ్వరుఁడగు శంకరుఁడు శక్తిని పరిణయమగు కాలమున చూడవచ్చినవారిలో చపలచిత్తుఁ డగు విధాతకు మనస్సునందు మోహావేశము కల్గుకతన, మానసికదోష మే గాక, కాయికదోషము గూడ సంభవమై, సభ యందు హాహాకారమును, స్త్రీలయందు విన్న దనమును జనింప, పరమేశ్వరుఁ డనుగ్రహించి అంతటి సంతోషసమయమున రక్షింప నెంచి, భూమియందలిసారముఁదీసివిధాతకిచ్చి, యిందు స్నాతుఁడవై పూతుఁడవుగమ్మనియె నఁట. దాని నావిధాత గైకొని పూతుఁడై తనకమండ లువున నిడికొనియె నఁట. పిదప వామనావ తారకాలమున బలిచక్రవర్తి నడిగి మూఁడు పాదములప్రదేశము నందిన వామనుని పాదము బ్రహ్మలోకమున కరుగ,విధాత దానినితనతండ్రి పాదముగ నెఱింగి తనకమండలువునందలి గంగో దకమున పాద్యమిచ్చి కడిగెనఁట. అది యట నుండి జాఱి యిచటఁబడి ఈతీర్థమయ్యె నఁట. పద్మపురాణమున దీనిగాధ కొంత చెప్పఁబడి నది. విధాత యిట నొక క్రతువు నాచరింప నెంచి, తనభార్యలగు సరస్వతీ సావిత్రులు రా నిరాకరించినందున గాయత్రితో నిట క్రతు వొనర్చె నఁట. దాని నావ ండ యగు రత్నగిరినుండి గాంచుచుండిన సావిత్రి యలిగి వారల నందఱను శపించెనఁట. నాఁడాదిగ నాగి రికి "సావిత్రీగిరి"యని పేరయ్యెను. పిదప గాయ త్రియే ఆశాపమును బాపె నఁట.

ఇట ప్రధాన దేవళము బ్రహ్మదేవునిది గాయత్రీదేవితోఁ గూడియున్నది. పుష్కరము నందు జ్యేష్ఠవేది, మధ్యమవేది, కనిష్ఠవేదులు కలవు. పుష్కరసరస్సునందు తీర్థసంఖ్య పదికో ట్లని యందురు. కార్తికపౌర్ణమి నిట గొప్పస్నా నయాత్ర జరుగును. ఇట నక్కాలమున గొప్ప పశువుల సంతయు, పశువుల ప్రదర్శనమును,

జరపుచున్నారు. అందు ఒంటెలు, ఎడ్లు, గుఱ్ఱములు విక్రయింపఁ బడుచుండును. రాజపుత్రులు, పంజాబీలు, ఆఫ్ఘనులు మొదలగువర్తకులు వాణిజ్యము నడుపుదురు.

ఈ పుష్కరుఁడు పండ్రెండు నదులయందు పండ్రెండుసంవత్సరములలో తిరుగుచుండునఁట. బృహస్పతి యేరాశియం దుండునో ఆకాలమా సంబంధినది యని యెఱుంగునది. వాటినే "ద్వాదశనదీపుష్కరము" లనియెదరు.

ఈపుష్కరుఁ డాయానదులయందు ప్రవేశించి ముఖ్యముగా పండ్రెండు దినము లుండెడి నని చెప్పఁబడినది. ౧ గురుఁడు మేషరాశిగతుఁడగుతఱి గంగానదీపుష్కరము. ౨ వృషభరాశిగతుఁ డగుతఱి నర్మదా(రేవా)నదీపుష్కరము. ౩ మిథునమున సరస్వతీనదిపుష్కరము. ౪ కర్కాటకమున యమునానదీపుష్కరము. ౫ సింహమున గౌతమీ (గోదావరీ) నదీపుష్కరము. ౬ కన్య కృష్ణానదీపుష్కరము. ౭ తుల కావేరీనదీపుష్కరము. ౮ వృశ్చికమున తామ్రపర్ణీనదీపుష్కరము. ౯ ధనుస్సున సింధునదీపుష్కరము. ౧౦ మకరమున (తుంగభద్రా) నదీపుష్కరము. ౧౧ కుంభమున భీమరథీపుష్కరము. ౧౨ మీనరాశిగతుం డగుచుండఁగ (గురుఁడు) ప్రణీత లేక ప్రాణహితానదీపుష్కరమును వచ్చును. పుష్కరము గురుని ప్రవేశముతో ప్రారంభమై పండ్రెండుదినములవఱ కుండునని చెప్పఁబడినది.

**పుష్కరవతి (పురము)**- శ్రీరాముని సోదరుఁ డగు భరతుని రెండవసుతుఁడగు పుష్కరునిచే నిర్మింపఁబడిన పురము.

**పుష్కరారణ్యము** — అజయమేరు (ఇప్పటి అజ్మీరుపురము) ప్రాంతమున విధాత పశ్చిమవేదిక యగు "పుఖార్"కడ పుష్కరమను సరస్సు కలదు. ఆ ప్రాంతారణ్యమునకు పుష్కరారణ్యమని పేరు. (నవారణ్యములు చూ).

**పుష్కరారుణి**-పూరుసంతతి చంద్రవంశ క్షత్రియుఁడు. బ్రాహ్మణుఁడైనవాఁడు. తండ్రి ఋక్షుయుఁడు. ఇతనిసంతతివారు బ్రాహ్మణులైరి.

**పుష్కరాంశ**—జ్యోతిష శాస్త్రమునందు మేషరాశిలో నిరువదియొకటవభాగమును, వృషభరాశిలో పదునైదవ భాగమును, మిథునరాశిలో నిరువదినాలుగవ భాగమును, కర్కాటకములో ఏడవభాగమును, సింహరాశిలో నిరువదియొకటవ భాగమును, కన్యారాశిలో పదునాలుగవ భాగమును, తులలో నిరువదినాలుగవ భాగమును, వృశ్చికములో నేడవభాగమును, ధనుస్సునం దిరువదియొకటవభాగమును, మకరరాశియందు పదునాలుగవ భాగమును, కుంభరాశియం దిరువదినాలుగవ భాగమును, మీనరాశియం దేడవభాగమును పుష్కరాంశ లనఁబడును. ఇవి శుభప్రదము లయిన మేలును, లేకున్న కీడు నని చెప్పఁబడినది.

**పుష్కరిణి**—ఈ పేరుగల వా రిద్దఱు స్త్రీలు గాన నగుచున్నారు. ఉల్ముకుని భార్యయొక పుష్కరిణి. ఈమె కుమారుఁడు అంగుఁడు. వ్యుష్టి భార్యయొకతె. ఉల్ముకుని భార్య మఱియొక పుష్కరిణి. కుమారుఁడు సర్వతేజస్సు.

**పుష్కలద్వీపము**—ఆక్సస్ నది కుత్తర భాగము మొదలుపశ్చిమతార్తార దేశభాగమును గల్పుకొనిన మధ్యఆసియా యనంబడు దేశభాగము. దీని కుత్పత్తి భూష్కర. (ఇప్పటి బొఖారా)శబ్దమని పెక్కండ్రు తలంచుచున్నారు.

**పుష్కలావతీ పురము** — తొలుత ఉత్పలావతీపురము. ఇప్పుడు 'కేలీ' యనంబడు తావు. (గాంధార దేశము చూడుఁడు.)

**పుష్పకము**-- ఆకాశగమన అంతరాళ గమన శక్తులుగల యొక విమానము. ఇది తొలుత బ్రహ్మదేవునివలన కుబేరున కీయఁబడుట 'కుబేరపుష్పక' మని వాడుక యయ్యెను. ఇం దెందఱు కూర్చుండినను నింకొక్కరికిఁగూడ తావుండెడి దఁట. కాన నేఁటికిని అనుకొన్న లెక్కకన్న నెక్కుడుమంది కూర్చుండఁ గల్గినతావు నకు 'కుబేరపుష్పక' మని సామెతగానందురు.

రావణుఁడు కుబేరు నోడించి యీపుష్పకము నపహరించె ననియు, లంకాయుద్ధమున రావణుఁడు నిహతుఁ డైనకతన నీపుష్పకము శ్రీరామునివశమయ్యె ననియుఁ జెప్పఁబడినది.

**పుష్పకాసీసము**-ఆంగ్ల. Green Sulphate of Iron సం. పుష్పకాసీసం. ఇది యించుక పచ్చరంగుధాతువు గల్గియుండునది. వేఁడిచేసి కఫరోగములు, కంఠరోగములు,కంటి దగ్గరపుట్టిన వ్రణము (అనఁగాలూతికరోగము), తాపము, శీతలము, శ్వేతకుష్ఠము (అనఁగా బొల్లి),వాతరోగములునివారింప నగునని చెప్పఁబడినది.

**పుష్పగిరి తిమ్మన కవి**— ఆంధ్రకవులలో నాధునికులందు పేర్కొనఁబడినవాఁడు. బ్రాహ్మణుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు. విశ్వామిత్రసగోత్రము. తండ్రి పే రప్పన్న. నివాసము నెల్లూరు మండలములోని మోడేగుంట యని చెప్పఁబడినది.

ఈతఁడు రచించినది "సమీరకుమారవిజయము", "భర్తృహరినీతిశతకము" (తెనిఁగించినది.

**పుష్పగిరి (పర్వతము)**— దక్షిణదేశమున మలయపర్వతమున నిప్పుడు "వైగై" యనంబడుచున్న (దక్షిణమధురాపురముప్రక్కనంతర్వాహినిగ ప్రవహించుచున్న) కృతమాలానది జన్మించుతావునఁగల పర్వతభాగమునకు పేరు. ఇది తొల్లింటిపేరని పెక్కండ్రు తలంచుచున్నారు.

దీనిప్రశంస మార్కండేయపురాణము ౫౭ అధ్యాయమునను, విష్ణుపురాణము ౨-౩ యందునను గానవగుచున్నది.

**పుష్పగిరి (పీఠము)** — పుష్పగిరిపీఠమన నంద తెలిఁగినమాటయే. ఇది శ్రీ శంకరాచార్యస్థాపితపీఠములలో నొకటి. పుష్పగిరి దేవాలయము సుప్రసిద్ధము. M.S.M. రైల్వే బొంబై లైనుపై నున్న కమలాపురం స్టేషనునుండి ఈశాన్యదిశగా నైదుమైళ్లలో పుష్పగిరిఉన్నది.

**పుష్పదంతనాథుఁడు**— జైనతీర్థకరులలో నొకఁడు. (తీర్థకరులు చూడుఁడు). వీరి చిహ్నము మొసలి. ఇక్ష్వాకువంశక్షత్రియుఁడు. తండ్రిపేరు సుగ్రీవరాజా. తల్లి రామాదేవి. జన్మస్థలము కాకంది నగరము. (కాకనదపురము ఇప్పటి భోపాల్రాజ్యములోని సాంచి). పొడవు నూఱుధనస్సులు.(ధనుస్సు మూఁడున్నర మూర). శ్వేతవర్ణము. ఆయువు రెండులక్షలు. గణధరసంఖ్య ౮౮. నిర్వాణస్థలము సుమేరుశిఖరము. (శిఖరీజీ లేక అర్బుపర్వతశిఖరము). తొమ్మిదికోట్ల సాగర్.

**పుష్పపుటహస్తము** -(హస్తాభినయము చూ. భరతశాస్త్రము చూ.)

**పుష్పఫలపరీక్ష** —(కాలవిజ్ఞానశాస్త్రమున వివరింపఁబడిన పరీక్షలలో నొకటి. (కాలవిజ్ఞాన శాస్త్రము చూడుఁడు).

చెట్లు పూవులు పూచుట, కాచుట ఎటులంగఁ దగినవి.

౧ అశోకవృక్షములు, బ్రహ్మదండి లేక బ్రహ్మమేడిచెట్లు విస్తారముగ పూచి కాచినసంవత్సరము పైరుపంటలు బాగుండు ననియు,

౨ కర్పూరపు టర్రంటిచెట్లు బాగుగ కాచిన సంవత్సరము నల్లయవిసె మొదలగు నల్లధాన్యములు చక్కగ ఫలించుననియు,

3 చింతచెట్లు, పాలచెట్లు నల్లవేములు విస్తారముకాచిన ధాన్యము చక్కగా పండుననియు,

౪ తుమ్మికిచెట్లు (తిందుకము) విస్తారము కాచిన జొన్నలు చక్కగా పండుననియు,

౫ ములుమోదుగులు విస్తారము పూచికాచినకొఱ్ఱలు చక్కఁగా పండుననియు,

౬ మొల్లలు విస్తారముపూచినను, రావిచెట్లు విస్తారము కాచినను, ఆవాలు, జనుము, ప్రత్తి చక్కఁగా ఫలించుననియు,

౭ వావిలిచెట్లు విస్తారముపూచినచో ముత్యములు విస్తారము దొరకుననియు,

౮ తిలకములు (బొట్టుగుచెట్లు) విస్తారము కాచినచో వెండి చౌకయగు ననియు,

౯ బిక్కిచెట్లు, మారేడుచెట్లు విస్తారము కాచినచో బంగారము చౌక యగు ననియు,

౧౦ అత్తిచెట్లు విస్తారము కాచినచో రాగి చౌకయగు ననియు,

౧౧ ఎఱ్ఱగోరింట చెట్లు విస్తారము కాచిన వజ్రములు చౌక యగుననియు,

౧౨ మంకెనచెట్లు విస్తారము పూచినకాలమున పగడము లధికముగ దొరకు ననియు,

౧3 బచ్చలిచెట్లు విస్తారము కాచినచో ఒంటెలు వృద్ధియగు ననియు,

౧౪ అరంటిచెట్లు విస్తారము కాచిన సంవత్సరము గొఱ్ఱెలు వృద్ధియగు ననియు,

౧౫ బలరక్కసిచెట్లు విస్తారము పూచిన సంవత్సరము ఏనుంగులు వృద్ధియగు ననియు,

౧౬ పాదిరిచెట్లు విస్తారము పూచిన గోవు లభివృద్ధి నందుననియు,

౧౭ అడవితంగేడు, రెల్ల, అనప, కుసుమ ఈవృక్షములు విస్తారము పూచినచో దేశము సుభిక్షమై యుండు ననియు,

౧౮ తామరలు విస్తారము పూచినసంవత్సరము బ్రాహ్మణశాఖ లభివృద్ధిగాంచుననియు,

౧౯ కలువలు విస్తారము పూచినకాలముల క్షత్రియశాఖ లభివృద్ధి గాంచుననియు,

౨౦ జమ్మిచెట్లు, చండ్రిచెట్లు విస్తారముగ గాచినకాలమున దేశమున పంటలు చక్కఁగ ఫలించు ననియు,

౨౧ వేఁపచెట్లు విస్తారముగ గాచినకాలమున దేశమున రోగబాధలు లేక ప్రజ లారోగ్యమున మనెద రనియు,

౨౨ అడవులలో వృక్షములు విస్తారముగ గాచినకాలమున దేశమున పంటలు తక్కువగ ఫలించు ననియు,

౨౩ కొడిసెచెట్లు విస్తారముగ కాచినకాలమున దేశమందు జనులు రోగపీడితులైయుందు రనియు,

౨౪ కడపచెట్లు విస్తారము కాచినకాలమున వర్షములు స్వల్పముగ గురియుననియు,

౨౫ జీడిచెట్లు విస్తారము కాచినకాలమున ప్రజలకు భయముగల్గి యుండుననియు,

౨౬ నాగకేసరములు విస్తారము కాచిన కాలమున దేశమున వాంతివ్యాధులు కల్గి యుండు ననియు,

౨౭ బిళ్ళుడుచెట్లు విస్తారము కాచినకాలమున దేశమం దగ్నిభయ మనియు,

౨౮ వెలగచెట్లు విస్తారము కాచినకాలమున గాలి మిక్కుటముగఁ గల్గియుండు ననియు,

౨౯ బుడమచెట్లు విస్తారము కాచినకాలమున అంతఃకలహములు కల్గియుండు ననియు,

30 లొద్దుగ(లోధ్ర), దిరిశెన విస్తారము పుష్పించినకాలమున దేశమున పంటలు తక్కు

వగ ఫలించు ననియు రెట్టమతమునఁ జెప్పఁబడినది.

**పుష్పలగుడన్యాయము**-అఱచిఅల్లరి చేయుచున్న కుక్కలలోనొకకుక్కపైవిసరినకఱ్ఱ, దానిచుట్టుపట్లనున్న కుక్కలంగూడ శాంతింపఁ జేయును.

బాధగల్గించుదుష్టులలో నొక్కనికిఁ బ్రతిహతి నొసఁగిన తక్కినవారు శాంతింతురనిభావము.

**పుష్పవంతగోత్రము**—(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**పుష్పవంతుఁడు**- ఉపరిచరవసువుసంతతి వాఁడగు నొకనరపాలుఁడు.

**పుష్పవంతోపకారన్యాయము**—ఇది జ్యోతిశ్శాస్త్రమందలి న్యాయము. పుష్పవంతులన సూర్యచంద్రులని యర్థము. వీ రుపకారము చేయుటయందు దక్షులని చెప్పఁబడినవారు.

**పుష్పవతీనది**—ఇప్పుడు తిరువాన్కూరు రాజ్యమున "పంచై" యనుపేరఁ బరఁగుచున్న నది. వరాహపురాణము ౮౫ అధ్యాయమున దీనిప్రశంస గానఁగు చున్నది.

**పుష్పాంజనము**—ఇదియొకజాతి రాయి యనియు, దీనిచూర్ణము లేక భస్మము ఊపిరిగొట్టునొప్పి, ఎక్కిళ్ళు, ఎలుకకాటు విషము, కఫము, పీనస, నేత్రములనుండి నీరుకాఱుజబ్బు, లూతిక (నేత్రములకడ వ్రణములు) శ్వాసకాసలు నివారించునని చెప్పఁబడినది

**పుష్పార్ణుఁడు**- తండ్రి వత్సరుఁడు. తల్లి సర్వర్థి. పితామహుఁడు ధ్రువుఁడు. (ఈతఁడు జ్యేష్ఠపుత్రుఁడు). భార్య లిద్దఱు.

౧ ప్రభ- ఈమెవలన సుతులు ప్రాతర్మధ్యందిన సాయంతనములు. ౨ దోష- ఈమెవలన సుతులు ప్రదోష, నిశీథ, వ్యుష్టులు.

**పుష్పాలగోత్రము**- (పిప్పలికులగోత్రము చూడుఁడు).

**పుష్పిగోత్రము**— (ఆత్రేయగణము చూడుఁడు.)

**పుష్యమి నక్షత్రము**— ఆకసమున తొండరూపమును బోలి కనిపించు మూఁడు నక్షత్రములు కలిసియుండిన నక్షత్రసముదాయము. జ్యోతిశ్శాస్త్రగ్రంథములందు దీనికి అమరేజ్యః, ఆద్యః, ఇజ్యః, గురునామకః, జీవః, తిష్యః, దేవపురోహితః, పుష్యః, పూజితః వాగీశః అను పదములను పర్యాయపదములుగ వాడియున్నారు. దీనికి బృహస్పతి అధిదేవత. దేవగణము నక్షత్రము. ఊర్ధ్వముఖము, పుంస్వభావము. ఆఁడుమేఁక, [illegible] ఈ నక్షత్రసంబంధము లనియు, ప్రవేశించిన యిరువదిగడియల త్యాజ్యము (విషఘటికలు) నియు, నలువదినాల్గుగడియలపై నమృతమనియు, క్షిప్రస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది

**పుష్యమిత్రుఁడు**— మగధదేశమేలిన శృంగవంశనృపతులలో మొదటివాఁడు. ఈతని సుతుఁడగ్నిమిత్రమహారాజు. (భార్యమాళవిక).

ఈవిషయము మహాకవి కాళిదాసకృతమగు మాళవికాగ్నిమిత్రమున స్పష్టీకరింపఁబడినది.

తొలుత పుష్యమిత్రుఁడు మౌర్య (మురసంతతి)వంశనృపతులలో కడపటివాఁడగు బృహద్రథునికడ సేనాధిపతియై యుండి వీలుచూచికొని యాతనిఁజంపి తాను రాజైనవాఁడు.

**పుష్యరాగము**- పుష్యరాగము నవరత్నములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇది వజ్ర . ప్రారంభదశయని పెక్కండ్రు తలంతురు. రసాయనశాస్త్రవేత్త లిది మరకత కుటుంబమునకుఁ జెందిన దనెదరు. దీని నాంగ్ల రసాయనశాస్త్రవేత్తలు "A transparent

or translucent precious stone composed of oxides of aluminium, silicon, and fluorine" అని వివరింతురు. ఇది సామాన్యముగ తెల్లదిగ నుండును గాని, యిందు పసుపుపచ్చరంగువి, ఒకప్పుడాకుపచ్చ రంగువి. ఊదారంగువి, ఎఱుపురంగువి, రంగులేక కేవల స్వచ్ఛతగలవి కూడ గల్గుచుండు నందురు. ఇందు మేలుజాతి పుష్యరాగములు అన్నివిధముల వజ్రపుతళుకులం గల్గియుండును.

ఆంగ్లఖనిజశాస్త్రము మనఁదగిన Mineralogy మేర కిది A mineral aluminium fluosilicate అని వివరింపఁ బడినది. పుష్యరాగము Greiss (లేక Granite) శిలలం గూడి దొరకెడిని. ఇంకను Tinstone Tourmaline, Mica, Beryl లతో సంబంధము గల్గి దొరకెడిని.

పుష్యరాగములం దించుక దట్టమై నారింజ రంగు ధాతువు గల్గినమణికి విలువ యధికముగ నుండు నందురు. శ్రేష్ఠము లగు పుష్యరాగములు ఊరల్ పర్వతములందు దొరకునఁట. బ్రెజిల్ దేశపు రాళ్లును శ్రేష్ఠము లందురు. బ్రెజిలు పుష్యరాగములు వేడి చూపిన Pink వర్ణము నందునఁట. ఇవి చౌకధరలు గల్గియుండును. ఇందు హీనపుజాతికి Topazolite అనెదరు. ఇవి పసుపుపచ్చ, ఆకుపచ్చ, ధాతువులు గల్గియుండు నఁట.

లా. Tapozos. జర్మను, Topazos. ఆంగ్ల Topaz. సం. పుష్యరాగమణిః.

పుష్యరాగము శాస్త్రోక్తముగ భస్మము చేసిన, నది వాతదోషము నడఁచి యధికముగ జఠరదీప్తి నిచ్చుననియు, ఆయుర్వృద్ధి, వీర్యవృద్ధి, బుద్ధి బలము గల్గించు ననియుఁ జెప్పఁబడినది. మన దేశమునపుష్యరాగములు తెల్లనివి మాత్రమే తఱచు గాననగు చుండును. లేక తెల్లనిరాళ్లనె పుష్యరాగము లనుచుందురు.

**పుస్తకభాండాగారము లేక లైబ్రరీ—** భరతదేశమున పుస్తకభాండాగారము లనాదిగ నుండినవి. వాటిని సరస్వతి కాలయములుగ తలంచెడివారు. లైబ్రరీయందు గ్రంథములను నిల్వజేసియుంచుదురు. ఈజిప్టుదేశమునను, బేబిలోనియా దేశమునను, ఆసియామైనరు దేశమునను కొన్ని పుస్తకనిలయములు తరువాతచెప్పఁదగినవి యుండినవి. ఐరోపాదేశపు లైబ్రరీలు క్రిస్టియను మతవ్యాప్తికిఁ బిదప నేర్పడినవి. ఇక్కాలమున వ్రాతగ్రంథములు, అచ్చుగ్రంథములు, కాగితపుపుస్తకములె గాక, తాళపత్రగ్రంథములు మొదలగున వన్నియు పుస్తకములే. ఐరోపాయందు గొప్పగొప్ప పుస్తకభాండాగారము లేర్పడి యుంట విచిత్ర మనిపించెడిని. బరోడా సంస్థానమునందు "ట్రావెలింగు లైబ్రరీలు" కలవఁట. అవి చక్రములపై నూరూరి కంపబడుచు తిరుగుచుండు నఁట. విజ్ఞానము వెదఁజల్లు నీపుస్తకసముదాయములు విద్యావ్యాపకసాధనములు.

**పుస్తకము** – సంచితమైన యొకవిషయము పుస్తక మనంబడును. పుస్తకమునందు చేర్పఁబడిన విషయము విజ్ఞాన మైనను గావచ్చును, లేక శాస్త్రమైనను గావచ్చును. కేవలవిషయములచే నిండి మనోరంజకమైన ప్రబంధపద్యములుగఁ గాని, కథలుగఁగాని, నవలలుగఁ గాని, ఇతరవిషయములు నిండినదిగఁ గాని చరిత్రగఁ గాని ఉండవచ్చును. ఏది యైనను నొకచోఁ జేర్పంబడినది పుస్తక మనిపించుకొనును.

భరతదేశమున నాదికాలమునుండి పుస్తకములు తాళపత్రములతో చేయఁబడినవిగ నుండినవి. అందు శ్రీతాళ మనంబడిన వెడలుపు పొడవు నధికముగఁ గల్గిన యొక శ్రేష్ఠమగు

జాతితాళపత్రము (తాటియాకు)లు పుస్తకములుగఁజేయుపద్ధతి చరిత్ర వ్రాయ జ్ఞాపకము లేని తొల్లింటి కాలమునుండి భరతదేశమున నుంట సుప్రసిద్ధమే.

ఇప్పటి కేడువేల సంవత్సరములకు పూర్వము ఖాల్డియనులు వారి గ్రంథములను మట్టిఇటుకలం బోలిన దిమ్మరేకులపై లిఖించి కాల్చి గట్టిపఱచి పుస్తకభాండాగారములందునిల్వయుంచువారని బయల్పడియుంట యందరెఱింగినదే. ఈజిప్టు దేశమున పాపిరస్ (Papyrus) చుట్టలను విప్పి వ్రాసి వాటిని దిరుగ చుట్టి గొట్టములలో దూర్చి నిల్వయుంచు చుండెడివారు. తర్వాత పార్చిమెంటు కాగితములు, గోనెపీచు కాగితములు, వాటిస్థానము లందుకొని పుస్తకములు కాసాగినవి. ఆకాలమున పలుచని చర్మములపై వ్రాసి చేసినపుస్తకములును గలవు. ఇవి యన్నియు వ్రాతగ్రంథములే.

క్రీ. వె. ౧౪౫౦ వద్దనుండి ముద్రాయంత్రములును, వాటితోపాటు కాగితముల యభివృద్ధియు, నూతనపరిస్థితులు గల్గించినవి. ఇప్పుడు కాగితములపై నచ్చువేయఁబడిన గ్రంథములు సర్వసామాన్యములే. (కాగితములుచూడుఁడు).

**పూచినపూవులన్నీ కాయలే యైతే పుడమి భరింపఁగలదా?**-(ఆంధ్రలోకోక్తి)

**పూతికచెట్టు (తూతికచెట్టు, పూతికపండ్లచెట్టు)**—లా. Morinda Citrifolia, Mulberry tree. పూతికచెట్టుపై పట్టుపురుగు నివాస మేర్పఱచుకొని చక్కఁగ పెరుఁగును గాన పట్టుపురుగులఁ బెంచువా రీచెట్లను నాటి పెంచుదురు. ఇవి పండ్లకుఁగూడ పెంచుట కలదు. ఇది పెద్దపూతిక, చిన్నపూతిక యని ద్వివిధము. పెద్దపూతికపండ్లు నాలు గంగుళముల పొడవు వఱకుఁ బెరిగి పెద్దవిగా నుండును. చిన్నపూతిక పండ్లు ఒకటి లేక ఒకటిన్నరయంగుళమునకంటె పెరుఁగవు. ఈ రెండింటియందు తీయనిరుచి గలవి పుల్లనిరుచి గలవి యని యొక్కొకటి ద్వివిధమై యుండును గాన పూతిక నాల్గు భేదములని చెప్పఁదగి యున్నది.

పండ్లు సమధాతువు గల్గించును. శరీరరక్తమును శుభ్రపఱచును. పట్టుపురుగులకు దీని యాకులు మంచియాహారము గాన వాట్లపై బ్రతికి పట్టుకాయల (Cocoons) నిడును.

తీయనిపూతికపండ్లకు సికింజబీనును, పుల్లని పండ్లకు తేనెయు పరిహారములని చెప్పఁబడినది.

**పూతికరంజచెట్టు** — (నెమలిఅడుగుల చెట్టు చూడుఁడు.)

**పూతిమాష గోత్రము**—(సంకృతి ఉపగణము చూడుఁడు.)

**పూతిమాష గోత్రము**— తుకర్ణ్యగణము చూడుఁడు.)

**పూతిమాష గోత్రము**—(వసిష్ఠగణము చూడుఁడు.)

**పూతిమాష గోత్రము**--(భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**పూనానగరము**— బొంబై రాజధానియందు బొంబైనుండి ౧౧౯ మైళ్ళదూరమందున్న మహారాష్ట్రనగరము. తొల్లింట "పునఖా" యని పేరుండిన యీపురము రాను రాను 'పున' యనఁబడి, ఆంగ్లకాలమునాడు "పూనా" యయ్యెను. మహారాష్ట్రులు "పూణే" యనెదరు.

మూతా నది (ముక్తిదా నది) మూలానదిలో (భీమరథీ లేక భీమరథ్యానదికి మూలమగునది) సంగమించుతావున తొల్లింట నిర్మింపఁబడి నలు దెసల వ్యాపించి, యిప్పుడు గొప్పనగరమై యున్నది. పరిసరములఁ గల పార్వతీగిరిపై నుండు పార్వతీ దేవాలయము సుందరమై సుప్రసిద్ధమై యున్నది. ఇట సంవత్సరమున రెండు నెలలు బొంబై గవర్నరు నివాసమొనర్చు నుగాన ప్రభుత్వభవనములు, కచేరీలు "గణే యఖం"డనంబడుతావున నిర్మింపఁబడియున్నవి. పూర్వము మహారాష్ట్రుల ఔన్నత్యకాలమున నిది పీష్వాపరిపాలకులకు నివాసనగరమై యుం డెను. వారినాటి భవనములు, కట్టడములు, నిటీవల నిర్మింపఁబడిన శివాజీమహారాజువిగ్రహము, చక్కనినవీనమైనకట్టడములు, నగరసౌందర్యము నభివృద్ధిపఱచినవి. పీష్వాలనాటి హీరాబాగు నందలి వారి వినోదభవన మిప్పుడు టౌన్‌హాలుగ నున్నది. విద్యావంతమగు స్థానము. ఇచట సైన్య స్థానమగు "కిర్కి" నాల్గు మైళ్ల దూరమున గలదు. వేఁడి తగ్గి యించుక సమశీతోష్ణప్రదేశ మగుట పూనాపరిసరముల వృక్షములు మొక్కలు లతలు చాల బాగుగ పెరుఁగును. కాన నీనగర మున తోఁట లధికముగఁ గలవు. పదిమైళ్ల దూరమునం దున్న శింగూర్ నందలి శింఘు ఘడము (దుర్గమును), ఇరువదిమైళ్ల దూరమునం దున్న పురంధరదుర్గమును, మహారాష్ట్రప్రభు త్వమునాఁటి దుర్గము లిప్పుడు చల్లదనపు టారోగ్యప్రదేశములుగ వాడఁబడు చున్నవి. బొంబాయినుండి పూనాకు ఎలక్ట్రికు రెయిల్వే సంబంధము కల్పఁబడియున్నది.

ఇది యిప్పుడు బొంబై రాజ్యమున, బొంబైకిఁ బిదప, ముఖ్యనగరము. క్రీ. వె. ఎన్మిదవ శతాబ్దమున తెలిగాంవద్ద దొరకిన రాగిరేకుశాసనములందు పూనానగరమునకు తొల్లింటికాలమున పునాక-పౌనిక-పున యని పేర్లుండినటులఁ దెలియుచున్నది.

దీనిప్రశంస వాయుపురాణము ౪౫ అధ్యాయమునఁ గాననయ్యెడిని.

**పూనీశాఖ క్షత్రియులు**— (ప్రమార శాఖ క్షత్రియులు చూడుఁడు)

**పూపరి గోత్రము** — (శండిలగణము చూడుఁడు.)

**పూమీస్ రాయి** (Pumice stone)- ఇది లాటిన్ భాషా జన్యపదము. నురగరాయి యని యర్థము. స్పంజింబోలిన చులకనిరాయి. నురగంబోలియుండును. అందు గుల్లతావులందు గాలి యుండె ననియు, నిది భూగర్భమందలి మహాతీక్ష్ణమైన వేఁడి కేర్పడిన దనియు పరిశీల నలు తెల్పుచున్నవి. ఇది అగ్నిపర్వతముఖముల నుండి వెలువడుచు బైటఁబడుచుండును. ఇంచుక ఇండియారబ్బరుకన్న గట్టిదై, అది చేయుపనినే అధికమగు బలముతో చేయుచుండునది.

ఇది లాటిన్భాషాపదమగు నురగ యనునర్థమిచ్చు Pumex పదజన్యము. నీటినురగ వలె నుంట నీపేరందినది. అగ్నిపర్వతశిఖరములనుండి ద్వారముగుండా నొక్కొకప్పు డుడుకుచున్న ద్రవముచే నెగురఁగొట్టఁబడి బుడగలసహితముగ నతిత్వరితముగ చల్లారి గట్టిపడునది. ఇంచుక కరకుగ నుంట సిరామరకలను వదలఁగొట్టుటకు దీనితో రుద్దుచుందురు. దీనిపొడుము పండ్ల

పొడియం దొకభాగముగఁ గల్పుచుందురు. Metal polish నందిది చేర్పఁబడుచుండును.

ఇది భూమిలోపలినుండి యేర్పడునది గాన పరిశీలకులు భూమిలోపలి పదార్థములను దీని నుండి యెఱుంగుచున్నారు.

**పూరకము**—యోగశాస్త్రమునఁ జెప్పబడిన అష్టాంగ యోగములలో ప్రధానమగు నది ప్రాణాయామము. ఆ ప్రాణాయామము పూరక, కుంభక, రేచకాత్మకము. (ప్రాణయామము చూడుఁడు.)

పూరక మనఁగా వాయువును లోనికి పీల్చి శరీరములోపలిభాగమున పూరించుట(నింపుట) యని యర్థము. యోగశాస్త్రమునందు యం అనువాయుబీజమును పదునాఱుసారు లుచ్చరింపఁ దగినకాలమున కుడిముక్కును మూసి యుంచి, యెడమముక్కుద్వారమున వెలుపలి వాయువును లోనికిం బీల్చుట పూరక మనఁబడును. (ప్రాణాయామము చూడుఁడు.)

ప్రథమప్రాణాయామ మనియు, ద్వితీయ ప్రాణాయామ మనియు, తృతీయప్రాణాయామ మనియు ప్రాణాయామాభ్యాసము త్రివిధముగఁ జెప్పఁ బడినది. అందు ప్రథమప్రాణాయామమున పూరకము కుడిముక్కు రంధ్రమును మూసి, యెడమముక్కురంధ్రముతో వాయువును లోనికింబీల్చుట యనియు, ద్వితీయప్రాణాయామమున పూరకము ఎడమముక్కును మూసి, కుడిముక్కురంధ్రముగుండా వాయువును లోనికిం బీల్చి పూరించుట యనియు, తృతీయప్రాణాయామమున పూరకము రెండుముక్కురంధ్రములగుండా వాయువును లోనికిం బీల్చి పూరించుటయనియుఁ జెప్పఁబడినది.

పూరకక్రియ కధిపతి బ్రహ్మ యనియు, ఇది ఉత్పత్తిచిహ్న మనియు, పండ్రెండంగుళములవఱకు వాయువును బిగియఁబట్టి లోపలికిఁ బీల్చవలె ననియు, క్రమముగ నభ్యాసాతిశయమున దేహమునందలి సర్వావయవములు నిండునటుల వాయుగ్రహణ మొనర్పనగు ననియు, దీని యభ్యాసము పుష్టి, ధాతుసామ్యత, బలము, తేజము, అగ్నిదీపనము గల్గించుననియుఁ జెప్పఁబడినది. (అష్టాంగయోగములు చూ).

**పూరణ (లేక పౌరణ) గణము**—ఇది విశ్వామిత్రసంతతియందలి యొకగణము. దీనిని పౌరణగణ మనియు నందురు.

ఇందు ౧ పూరణస, ౨ పౌరణస, ౩ వారిధాపయంతస అని (౩) గోత్రములు కలవు. వీట్లకు ప్రవరరూపములు రెండు కలవు.

౧ విశ్వామిత్ర, పౌరణ, ౨ విశ్వామిత్ర, దైవరాత, పౌరణ.

**పూరణ లేక పౌరణ గోత్రము**—(పూరణగణము చూడుఁడు.)

**పూరీ (పురుషోత్తమ క్షేత్రము)**—(చరిత్రపురము చూడుఁడు).

# పూరుమహారాజు సంతతి వంశావళి.

వీరు అత్రిసంతతి - చంద్రవంశపు క్షత్రియులు.





అహంయాతి [భార్య భానుమతి
ఈమె కృతవీర్యుని కూఁతురు.
కార్తవీర్యార్జునుని సోదరి.]
రౌద్రాశ్వుఁడు [భార్య ఘృతాచి
ఈతనికి పదిమంది పుత్రులు.]
[జ్యేష్ఠుఁడు] ఋచేయువు
వీరు పదిమంది సోదరులు.
బృహత్క్షత్రుఁడు
సుహోత్రుఁడు
హస్తిమహారాజు
[హస్తినాపుర నిర్మాత]
అజామీఢుఁడు
ద్విమీఢుఁడు
పురమీఢుఁడు
నరుఁడు
రంతిదేవుఁడు
గర్గుఁడు
గార్గ్యుఁడు
[వీరి సంతతివారు
బ్రాహ్మణులు]
మహావీర్యుఁడు
[ఈతని పేరు తెలియదు]
బృహదిషుఁడు
భల్లాదుఁడు
[బృహద్ధనువు]
బృహత్కర్ముఁడు
[బృహత్కాయుఁడు]
[తరువాయి
బృహదిషులు
చూడుఁడు.]
నీలుడు
భర్మాశ్వుఁడు
ముద్గలుఁడు
[తరువాయి
ద్రుపదమహా
రాజువంశము
చూడుఁడు.]
యవీనరుఁడు
బృహదిషుఁడు
కాంపిల్యుఁడు
సృంజయుఁడు
సుశాంతి
ఋక్షుఁడు
సంవరణుఁడు
కురుమహారాజు

**పూరుషామృగము**—దీనివృత్తాంతము కొంతవఱకు భారతాంతర్గతమగు సౌగంధికహరణకథను బోలియుండును. ధర్మరాజు రాజసూయము చేయుటకు సంకల్పించుకొని తద్విషయములగు నేర్పాట్లంగూర్చి శ్రీకృష్ణునితో నాలోచించుచుండ దినమునకు కోట్లకొలఁది భుజించు భోజనశాలలను పరిశుభ్రముగ నుంచువిషయమగు ప్రసంగము వచ్చెను. ఎంతమంది పరిచారకుల నేర్పాటుచేసినను నిత్యము కోటానుకోట్లు భుజించి పోవుచుండు భోజనాగారములను ఆరోగ్యకరమగు పరిశుభ్రస్థితిలో నుంచుట కష్టతరమనియు, అందులకు శక్తికలది పూరుషామృగమను పేరిటి నరమృగాకారమగు వింతజంతువు కలదనియు:, అయ్యది యతిమానుషప్రజ్ఞగలదియగుట కేవలము భోజనశాలలే గాక, యజ్ఞావరణ మంతయు నిరంతరము పరిశుభ్రస్థితియందుండునట్లు చూడఁగలదనియు, కావున దానిని రప్పించుట వాంఛనీయ మనియు శ్రీకృష్ణుఁడు ధర్మజునితోఁ జెప్పెను.

అందుచే నద్దానిని దోడ్కొని రా భీమునుడు నియోగింపఁబడెను. భీముఁ డుత్తరాభిముఖుఁడై శ్రీకృష్ణనిర్దిష్టమార్గమున బయలు వెడలెను. హిమవన్నగము దాటి కొంతద వ్వరిగిన యనంతరమక్కడ నిరుదరుల నెత్తయినపర్వత పంక్తులచే నాక్రమింపఁబడిన యొక యిరుకైన మార్గమున మారుతి పోవుచుండెను. దారి కడ్డుగా జరాకృశమైన యొక వృద్ధవానరము పండుకొనియుండెను. మర్కటము నధిగమించిపోవుట శుభోదర్కము కాదని భీముఁడు దారినుండి తొలఁగుమని యాముసలికోఁతిని సామ భేద దాన దండోపాయములసంప్రదించెనుగాని కార్యము లేకపోయెను. భీమసేనుఁడు తనబలమంతయువినియోగించినను ఆపండుకోఁతితోఁకనైనఁ గదల్పఁజాలఁడయ్యెను. అందుపై భీముఁ డదిసామాన్యమగు వానరముకాదనియు, తనయన్న యగువాయుపుత్రుఁడే (హనుమ) తన్నిట్లు పరిశోధించుచుండె ననియు గ్రహించి శరణాగతుఁడై తనకార్యము నివేదించెను.

ఆంజనేయుఁ డనుగ్రహించి సోదరుని హెచ్చరించి పూరుషామృగోదంతమంతయు పూర్తిగా నెఱింగించి తనవాలమునందలి రోమములను రెండు గుప్పిళ్ళు తీసికొనిపొ మ్మనియు, వానిలో నొక్కొక్క రోమము విడిచిన చోటునందెల్ల నొక్కొక్క శివలింగ ముద్భవించుచుండు ననియు, ఆపూరుషామృగమునకుఁ దాను శివలింగము నెక్కడఁ జూచినను ముమ్మాఱు ప్రదక్షిణము చేయునియమము గలదనియు మఱికొన్ని సంగతుల నెఱింగించి దీవించి పిడ్కొల్పెను.

భీమసేనుఁడు పూరుషామృగముండు పట్టునకుఁ బోయి తనయన్నగారికార్యము నివేదించెను. పూరుషామృగము వచ్చుట కంగీకరించెను గాని యొక్కసమయము కోరెను. యజ్ఞశాలలో ప్రవేశించులోపున భీమసేనుఁడు తన కెక్కడఁబట్టువడినను చంపి తినివేయుదుననియు, యజ్ఞశాలలో ప్రవేశించినవెనుక నీనియమము లేదనియుఁ జెప్పెను. భీముఁ డందుల కంగీకరించి బయలుదేఱెను. పూరుషామృగము వెంటఁబడుచుండెను. భీముఁడు ముందు పూరుషామృగము వెనుక. మృగము దగ్గర పడినపుడెల్ల భీముఁ డొక్కొక్కరోమము రాల్చుచుండెను. వెంటనే యక్కడ నొక శివలింగము పుట్టుచుండెను. పూరుషామృగము తన యాచారప్రకార మాలింగమునకు ముమ్మాఱు ప్రదక్షిణము చేయుటలో కొంత కాలాతీత మగుచుండెను. భీముఁ డింతలో ముందగుచుండెను.

ఇట్లు రాజసూయయజ్ఞశాలాద్వారమువఱకు వచ్చిరి. భీముని శరీరములో నర్ధభాగము శాలా

వరణములో నున్నది. మిగిలినసగము పైనున్నది. పూరుషామృగము పట్టుకొన్నది. తగవు ప్రారంభ మైనది. ఉభయులును ధర్మరాజునే తగవరిగాఁ గోరియుండిరి. ధర్మరా జుభయవాదములను పూర్తిగా విని నిష్పక్షపాతబుద్ధితో సగముశరీరమునందు పూరుషామృగమునకు హక్కుగల దనియు, భీముఁడు తనశరీరమునందలి పైనుండి పోయిన యర్ధభాగమును గోల్పోక తప్పదనియు తీర్పు చెప్పెను.

పూరుషామృగము ధర్మరాజు ధర్మబుద్ధి కెంతయు సంతోషించి భీముని సగముశరీరము ధర్మజుని కిచ్చివేసి రాజసూయానంతరము వఱకు వారిచెప్పుచేతలలో నుండి పిదప వెడలి పోయెను.

**పూర్ణగిరిమాయా దేవీక్షేత్రము** — ఆగ్రా అయోధ్య సంయుక్తరాష్ట్రములలోని తనక్పూరు రెయిల్వేస్థానమునుండి "సుఖిడంగ్" (నిర్జల) పర్వతము, తుండ్యాసుల్ మీఁదుగా ౨౩ మైళ్లుండును. ఇది సుప్రసిద్ధ దేవీక్షేత్రము. చంపావతీ పట్టణమునుండి సాలిగ్రామము, బ్రహందేవుమండి (బజారు) పాత్రరోడ్డు తుండ్యాస్ మీఁదుగా నడుచును. ఈమార్గమున చంపావతినుండి పూర్ణగిరిమాయాక్షేత్రము నకు ౧౮ మైళ్ళుదూర ముండెడిని. ఇది దేవీపురాణ ప్రసిద్ధమగు క్షేత్రము.

**పూర్ణతిథులు**—కృష్ణపక్షమునందు షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి.

**పూర్ణదర్భ**—కాలాంజరమున కీపేరు గల దని వాయుపురాణము ౭౭ యందు కలదు.

**పూర్ణపాదాసనము**-యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. రెండుపాదములు నేల మోపి, తిన్నగ నిలువంబడి, రెండు చేతులను మోఁకాళ్ళకడకు వ్రేలవేయుట "పూర్ణపాదాసన" మనఁబడును. దీనివలన నిద్రయు, నాలస్యమును తగ్గిపోవునని చెప్పఁబడినది.

**పూర్ణానది**—తపతీనదియొక్క శాఖ కీపేరు కలదని పద్మపురాణము, ఉత్తర ౯౧ వలన తెలిసెడిని. (క్రౌంతకౌశికానది

**పూర్ణానుస్వారము** — (అనుస్వారము చూడుఁడు).

**పూర్ణిమ**—ధాతకు అనుమతి యనుభార్య యందుపుట్టిన కుమార్తెకు పూర్ణిమ యని పేరు. మఱియు మరీచికి (బ్రహ్మమానసపుత్రుఁడు) కళ యను భార్యయందు గల్గిన కుమార్తెకును పూర్ణిమ యని పేరు.

చాంద్రమానమున చంద్రుఁడు షోడశకళాపరిపూర్ణుఁడై యుండు మధ్య (పదునేనవ) దినము, లేక శుక్లపక్షమునందలి కడదినమునకు పూర్ణిమ (పౌర్ణమి) యని వాడుచున్నారు.

**పూర్బియాక్షత్రియులు**-(చౌహానులు చూడుఁడు.)

**పూర్వకర్మ సిద్ధాంతము** — (విధి విధానసిద్ధాంతము చూడుఁడు.)

**పూర్వగంగ**—నర్మదానది కీపేరు కలదు.

**పూర్వచాళుక్య లిపి** — ఇది తూర్పు చాళుక్యలిపి యని గూడు వాడఁబడు చున్నది. ఇది వేంగిలిపినుండియు, నది గుహాలిపినుండియు, నయ్యది(మౌర్యాశోకబ్రాహ్మి) దేవనాగరి లిపి నుండియుజనించినది.(దాక్షిణాత్యలిపులు చూ.) పూర్వపశ్చిమ చాళుక్యలిపులు తిరిగి కలిసికొని సంధికాలపులిపి యైనది. (దానిం జూడుఁడు) పూర్వచాలుక్యలిపి యిప్పటి తెలుఁగులిపికి ఎక్కువగా పోలికలసంబంధమున సన్నిహితపూర్వ స్వరూప మని సుప్రసిద్ధపరిశీలకు లగు శ్రీకొమరాజు లక్ష్మణరావు ఎం. ఏ., గారు పేరిడి యున్నారు.

నన్నయ భట్టారకుఁ డీలిపియందే ఆంధ్ర భారతమును రచింపఁ బ్రారంభించెను. ఇప్పటి యాంధ్రపూర్వగ్రంథము లీలిపియందు పెక్కులు వ్రాయఁబడి యుండనోపు.

తూర్పుచాలుక్యరాజులగు వేంగిదేశాధీశు లగువారి శాసనములు పెక్కు కలవు. అందు మిక్కిలి పురాతన మనఁబడిన క్రీ. వె. ౬౭౨ నాఁటి విష్ణువర్ధనమహారాజు వేయించిన దొక టియు, రాజరాజనరేంద్రునినాటి నందంపూడి శాసన మొకటియు భాషాలిపుల పరిశీలనలకు మిక్కిలి యుపయోగకరము లగుట ముఖ్యము లుగ నెంచఁబడు చున్నవి. నందంపూడి శాసనలేఖకుఁడు నన్నయభట్టుగారే.

(దాక్షిణాత్యలిపులు, భరతదేశపు లిపులు, తెలుఁగులిపి చూ. తెలుఁగుకన్నడలిపులుచూ.)

**పూర్వ మీమాంసాంగములు** — (అంగములు చూడుఁడు.)

**పూర్వశ్వానన క్షత్రగోళములు లేక లఘుశ్వాన గోళములు**—(నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.)

**పూర్వస్థలి**— బంగాళములోని బర్ద్వాన జిల్లా (తొల్లింటి రాధాదేశము)లోని గంగానదీ తీరమందలి పార్థాలీస్ అనంబడు గ్రామ మని పోల్చియున్నారు.

**పూర్వాగమములు**-(ఆగమములుచూ)

**పూర్వాతిథి గోత్రము**—(గవిష్ఠరగణము చూడుఁడు.)

**పూర్వాభాద్రనక్షత్రము**—ఇది భద్రా నక్షత్రమందలి పూర్వభాగము. పూర్వాభాద్ర ఉత్తరాభాద్రలు కలిసి మంచపుకోళ్ళంబోలిన నాల్గు నక్షత్రములుగఁ గన్పట్టును. దీని కింకను అజా యనియు, ఏకపాత్తనియు, పదా యనియు, ప్రోష్ఠపదా యనియు పర్యాయనామములు కలవు. దీని కజైకపాదుఁ డధిదేవత. మనుష్య గణము. అధోముఖము. పుంస్వభావనక్షత్రము. ఖడ్గరూప నక్షత్రము.

సింహము, పావురము, బూరుగుచెట్టు ఈ నక్షత్రసంబంధము లనియు, ప్రవేశించిన పదు నాలుగడియలపై త్యాజ్య (అనఁగా విషఘటికలు)మనియు, నలువదిరెండు గడియలపై నమృతఘటిక లనియు, క్రూరస్వభావనక్షత్ర మనియుం జెప్పఁబడినది. (ఉత్తరాభాద్ర నక్షత్రము, నక్షత్రములు చూడుఁడు.)

**పూర్వాషాఢ నక్షత్రము**—ఇది ఆషాఢ నక్షత్రముయొక్క పూర్వార్ధము. పూర్వాషాఢ ఉత్తరాషాఢలు కలిసి యాకసమునం దొకచౌకము వలె నాల్గునక్షత్రములకూడిక యై యుండును. దీని కింకను ఆపః, ఉదకం, జలం, తోయం అను పర్యాయపదములు జ్యోతిషశాస్త్రగ్రంథములందు వాడఁబడినవి. దీనికి జల మధిదేవత. మనుష్యగణ నక్షత్రము. అధోముఖము. స్త్రీస్వభావము. దండాకార నక్షత్రము. కోఁతి, కొంగ, చింతచెట్టు ఈ నక్షత్ర సంబంధము లనియు, ప్రవేశించిన యిరువదినాల్గు గడియలపై త్యాజ్య (విషఘటికలు)మనియు, నలువదియెనిమిది ఘటికలపై నమృతఘటికలనియు ఇది క్రూరస్వభావనక్షత్ర మనియుఁ జెప్పఁబడినది. (ఉత్తరాషాఢ నక్షత్రము చూడుఁడు.)

**పూర్వాహ్ణచ్ఛాయా న్యాయము** — పూర్వాహ్ణచ్ఛాయ ఆదియందు (సూర్యోదయముతో)పెద్దదిగ ప్రారంభమయి, క్రమముగ మధ్యాహ్న మగువఱకు తగ్గిపోవుచుండును. గర్దభరుతన్యాయమును (గాడిదకూత) ఇట్టిదే. పెద్దదిగా నారంభమై రానురాను క్షీణదశ నందుటను దెల్పుట కీన్యాయము వాడుచుందురు.

**పూల్** (Pool) — వాణిజ్యసంబంధమున కొందరేకస్థులై లాభనష్టములను సమముగా ననుభవింప కలిసి పనిచేయుట యని యర్థము.

**పూల్ ఆట** (Pool)-- ఈయాటయందు పెక్కురంగులబంతుల నొక్కొక రొక్కొక రంగుగ మూఁడేసి బంతులతో పెక్కుమంది ఆడుదురు. ఈయాటబల్లపై పూల్ అనంబడు గుంటయు, హోల్ అనంబడు కన్నమును, ఒకచిక్కుపు సంచియు నుండును. ప్రతిఆటకానికి మూఁడు Life లు చొప్పున గల్గియుండెడిని. ఒకనిబంతి హోలునందు బడిన నొకవైపు లెక్కకు వచ్చును. తిరుగ అతఁడె ఆడుచుండ వలెను. హోలు తప్పిపోవువఱకు అతఁడేఆడుచుండును.

అతనిబంతిచిక్కుపుసంచి(Pocket)యందు పడినచో నతని కొకవైపు నష్టము లెక్కింపఁ బడును. కడకు మిగిలిన ఆటకానికి పూల్ (Pool)అపజయము సిద్ధించును. ఇద్దరుసమాన భాగులు మిగిలిరేని లాట్సు తీసికొని యెవ్వరో యొక రపజయపుపూలునకు పాల్పడుదురు.

ఇటులనె "రష్యన్పూల్" అను నాటయుఁ గలదు గాని, యందు చిక్కైన విధానములు చాల గలవు.

**పూలచెట్ల నిద్దుర-మెలకువ**— ఆంగ్ల వృక్షశాస్త్రవిదులు పూలచెట్లు నిద్దురమెలకువలు గల్గియున్నవిగా పోల్చుచున్నారు. అవి పూవులు పూచుట మెలకువకాలమునందే యనెదరు. పూవులు రాలిపోవుట గాని, తిరుగ ముకుళించు కొనియుండుట గాని, నిద్రించుకాల మని పోల్చిరి. దాసాని (మందార) సూర్యోదయ మైనపిదప మేల్కాంచుటతో పూవులుపూచు ననియు, సూర్యాస్తమయముతో పూవులను రాల్చివేయుట, లేక తిరుగ ముడుచుకొనుట, నిద్రను సూచించు నందురు. చంద్రకాంతపూల చెట్లు సాయంతనమే మేల్కాంచిపూచుననియు, రాత్రియంతయు గాక మఱునాఁ డుదయమైన పిదపఁ గూడ నించుకకాలము మేల్కాంచియుండి పూలుకళాహీనమై ముడుచుకొనుటతో సాయం తనముదనుక నించుక స్వల్పకాలమే నిద్రించు నఁట. హాసనోహానా (Night queen)అనం బడు జపానుదేశపు పూలచెట్టు రాత్రులందు మేల్కాంచి యుండుచు, పగలు పూవులు ముకుళించుకొనినిదురించి,తిరుగరాత్రిమేల్కాంచు ననెదరు. తామరలు సూర్యోదయముతో నిద్ర నుండి మేల్కొని సూర్యాస్తమయముతో పూవ్వుల ముకుళింపఁ జేసి నిద్ర కారంభించుటను దెల్పు దురు. అట్లే కలువలు చంద్రోదయముదనుక నిదురించుచు, అత్తటిమేల్కాంచితిరుగచంద్రా స్తమయకాలమునకు నిదురింప నారంభించు నందురు. వీటి కమావాస్యలందుఁ గూడ చంద్రోదయము (ఉదయము)తో మెలకువగల్గి చంద్రాస్తమయము (సాయంతనము)ననే నిద్ర కారంభించు నఁట. నిద్రభంగి (Touch me not) పెద్దఉసిరిక, వర్షపుచెట్టు మొదలగునవి పగలు మేల్కొనియుండి, రాత్రులం దాకులు ముడుచుకొనిఁ నిదురించు నందురు. సర్వ సాధారణముగవృక్షజాతులు రాత్రినిదురించుచు పగలు వెలుతురునందు మేల్కొని యుండు నందురు.

**పూవులు—తేనె—తేనెటీఁగలు** — పెక్కండ్రు తలఁచునటుల తేనె పువ్వులందుద్భ వించుటయు, దానిని తేనెటీఁగలు గొంపోయి తమపట్టునందు భద్రపఱచుకొనుటయు నిజము కానేరదు. పూవులుపూచు చెట్లు తమయుప యోగార్థమై వేళ్ళతో నాహారముఁ గైకొనునట్లె తేంట్లుపూవులందు తీపిపదార్థము నింపునుగాని ద్రవరూపమగు తేనెగ నొనర్పవు. ఆతీపిపదార్థ మగుటకు చాల యాలస్యము పట్టును. అట్టిదాని నాంగ్లశాస్త్రవేత్తలు కెమికల్ప్రోసెస్‌గా నెంచి

యున్నారు. దానినుండి ద్రవపదార్థమును దానికి జేర్చి తేనెటీఁగలు తేనెచేసి తమ తేనెపట్టులం దుంచుకొనునని కనిపెట్టఁ బడినది. ద్రవము జేర్పకము న్నాతీపిపదార్థమును గట్టిపఱచి, పలుకులవలెఁ జేయుటయుఁ గలదు. అట్టిపలుకులను చిన్నిపూఁదేనె(Cristal honey) యనెదరు. అట్టివని తరుచుగ పాలచెట్లతొఱ్ఱలయందు జరగుచుంటఁ గాంచనగు చున్నది. సర్వసాధారణముగ తేనె, తేనెటీఁగలు కూర్చుమైనవుపట్టులం దేర్పడుచున్నను, పుట్టలందుఁ గూడ తేనెపట్లుండుట కలదు. వాటికి పట్టుతేనె యనియు, పుట్టతేనె యనియు పేర్లు వాడుకయం దున్నవి. ఇటీవలఁ గొన్ని దేశములందు తేనెటీఁగలను పెట్టెలయం దుండఁజేసి పెంచి నెపట్లు బెట్టించుటయుఁ గలదు. తేనె ధాతుపుష్టి త్వరితముగ నొసంగుబలపదార్థము. ఆయుర్వేద వైద్యవిధానమున తరచుగఁ దేనె యనుపానముగ (Vehicle)గా వాడుచుందురు. అందువలన ఔషధ మతివేగముగ గుణమిచ్చు నఁట.

**పూవులుపూచు చిన్న జాతిమొక్కలు**— ఆంగ్ల వృక్షశాస్త్రవేత్తలు పరిశీలించి విభజించినమేరకు వీటియం దేడు భేదజాతులు కలవని తెల్పుదురు. క్రీ. శ. ౧౮౯౦ సంవత్సరపు ప్రొఫెసరు వైన్సు పండితునిలెక్కమేరకు ఈక్రిందవిభజనము తెల్పఁబడినది.

కేవలము పూవులుపూచు మొక్కలజాతులు (True flowering plants) ౧౦౩౦౦౦.

ఫంగస్, బేక్టేరియాజాతులు (Funguses and Bactaria) ౪౦౦౦౦.

ఆల్గే లేక సముద్రపు గడ్డిజాతులు (Algae or sea Weeds)- ౧౪౦౦౦.

మాస్ జాతులు లివరువర్టు జాతులు (Mosses and Liver worts) ౭౫౦౦.

నాచు జాతులు (Lichens) ౫౫౦౦.

పూవులుపూయని జాతులు (Flowerless plants with vessels) ౩౫౦౦

విత్తనములనుండి పుట్టుజాతులు (Nature seeded plants) ౨౫౦౦. మొత్తము ౧౭౬,౦౦౦ జాతులు.

**పూవులుపూచుకాలములు** — చెటుపూవులు పూచుకాలము ఋతు వని చెప్పఁబడుచున్నది. ఈఋతుకాలములు వేర్వేరుచెట్లకు వేర్వేరుగ నుండెడివి. వేసవియందు మల్లెలు, వర్షారంభమున విరజాజులు పూచునట్లే, అన్ని వృక్షములు తమతమ ఋతువులందు పూచి కాచి ఫలించు చుండెడివి. కాని, అన్నివృక్షములు ఉష్ణదేశములందు మండువేసవియందును, శీతలదేశములం దతిశీతలకాలమునను, పూచుట యాగియుండెడివి. దీనినుండి చెట్ల ఋతుకాల ధర్మమున శత్యుష్ణము, అతిశీతలము అనను కాలములని తెలుచున్నది. ఇట్లగుట శీతలదేశములందు వేసవియందునను, ఉష్ణదేశములందు వర్షాకాలశీతకాలములందునను పూవులుపూచుట చక్కఁగా నడిచెడివి. హిమవన్నగముపై నుండు శీతలప్రదేశములందు గులాబీ లధికముగ వేసవియందు పూచుట, త్వరితముగనె యలసి చచ్చిపోవుచుండును గాన పూత యధికమగుట చెట్టునకు బలహీనత గల్గించునని తోఁచెడివి.

— (అష్టాంగయోగములు చూడుఁడు.)

**పూసాశాఖక్షత్రియులు**-వీరు ప్రమారశాఖవారు. (క్షత్రియకులము చూ.) పూసాక్షత్రియులు చిత్తూరునుండి వెలువడి దక్షిణదేశమునకరిగిరని Lef. Col. James Todd చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. పూసవాడ్ (లేక పూసపాటి) వారుగ ఆంధ్రదేశమునందు

వీరు తాము ఆశాఖవారము కామని చెప్పుచున్నారు. "కీచీ" యను పేరుగల (హిందీ పాటల) కవి. తన పాటలందు వీరినిగూర్చి వ్రాసియున్నాఁడు. పూసపాటివారు మొదలగు కుటుంబములు ప్రమారశాఖవారని తెలిసెడిని. (క్షత్రియకులము ఆంధ్రదేశమండలిక క్షత్రియులు చూడుఁడు.)

**పూషుఁడు**— ద్వాదశాదిత్యులలో నొకయాదిత్యుఁడు. దక్షాధ్వరధ్వంసకాలమున వీరభద్రస్వామి యీతని పండ్లూడఁదన్నె నని చెప్పఁబడినది.

**పూసపాటి తమ్మభూపాలకవి**-- ఆంధ్రకవి. క్షత్రియుఁడు. సూర్యవంశము. రచించినది శ్రీకృష్ణవిజయ మను ప్రబంధము

**పృథ్వీశిష్ట గోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). పృథ్వీశిష్ట(పృథ్వీశ్రేష్ఠ)గోత్రము. ఏకార్షేయ (౩-౨) గోత్రము. సత్కృత గోత్రము. భార్గవస, భృగుగణము. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రంథమాద్య ప్రవరఖండ పృథివీశుఁడు దేవత. రామపార్థివభార్య. గజతాద్రి తపస్స్థానము. పార్థివసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౨౩ క్షేత్రసంఖ్య ౧౭. భూమిదానము. నేరేడుపండ్లు వర్జనీయము.

**పృథుచక్రవర్తి (వైన్యుఁడు)**- స్వాయంభువమను సంతతివాఁడగు వేను చక్రవర్తి సుతుఁడు. తల్లిపేరు సునీథ (మృత్యువుకూఁతురు). భార్య కేతపీదేవి. సోదరుఁడు నిషాదుఁడు. నిషద(ధ) రాజ్య మీతనినుండియే పేరందినది. నిషాదజాతుల కితఁడు మూలపురుషుఁడు గానోపు. షోడశమహారాజులలో నొకఁడు. (మహారాజులు చూడుఁడు).

**పృథుధాక పృథుంధాక (పిహోవా లేక పిహీవా)**— ఈపట్టణము కురుక్షేత్రము లోనిది. సరస్వతీనదీతీరము. స్థానేశ్వరమునకు పశ్చిమముగా పదమూఁడు మైళ్ళ దూరమందున్న పవిత్రస్థానము. స్నానతీర్థము. పురాతనపుకట్టడములు కొన్ని యిటఁ గలవు. పృథుధాక యన వెడలుపగు లను లని యర్థమందురు. బహూశః సరస్వతీనది పొంగి వెల్లువ యగుటచే నుండుస్థితినిబట్టి కల్గినపేరై యుండనోపు.

**పృథులాక్షుఁడు**— చతురంగుని కుమారుఁడు.

**పృథువు(త్రిధన్వుఁడు)**- మరీచి, ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి సుయోధనుఁడను నామాంతరము గల అనరణ్యుఁడు, లేక అనేనస్సు. పితామహుఁడు కకుత్స్థుఁడు. కుమాళ్లు సూర్యారణ్యుఁడు, లేక త్రయారణ్యుఁడు, విశ్వగంధుఁడు, యువనాశ్వుఁడు నను ముగ్గురు. పృథుచక్రవర్తికి శాశ్వతుఁడనియు, విశ్వకుఁడనియు, త్రిధన్వుఁడనియు బిరుదనామములు కలవు.

మఱియు, బృహదిషునిసంతతియందు పారుని కుమారుఁ డొకఁడును, యదుసంతతియందలి రుచికునికుమారుఁ డొకఁడును వేఱొకప్రసాదుఁడనువానిసుతుఁ డొకఁడును పృథువను నామములు కలవారు. ఇంకను స్వాయంభువునివంశమున వేఱొకపృథుచక్రవర్తి కలఁడు. అతనితండ్రి పేరు వేనుఁడు. భార్య అర్చిదేవి. సుతులు విజయాశ్వుఁడు లేక అంతర్ధానుఁడు, ధూమ్రకేశుఁడు, హర్యశ్వుఁడు, ద్రవిణుఁడు, వృకుఁడు. ఇతను సనత్కుమారుని శిష్యుఁడై బ్రహ్మజ్ఞాని యయ్యెనని చెప్పఁబడినది. మఱియు నితఁడు గోరూపధారిణి యగుభూమిని, మను వను వత్సు నుంచి, ఓషధులు పితికె నని చెప్పఁబడినది.

**పృథుశ్రవుఁడు**— యదుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి శశిబిందుమహారాజు. కుమారుఁడు ధర్ముఁడు.

**పృథుసేనుఁడు**—బృహద్విష్ణునిసంతతి. క్షత్రియుఁడు. ఇఁడు పార్జ్యుఁడు. కుమారుఁడు పారుఁడు.

**పృశ్ని**—అత్రి చంద్ర యాదవ హైహయ వంశక్షత్రియుఁడు (తాళజంఘుఁడు). చేదిదేశాధిపతి. తండ్రి ఒకటవ మాహిష్మంతుఁడు. కుమారుఁడు వృష్ణి.

ఇంకను వేఱొకపృశ్ని యాదవ(చంద్రవంశ) క్షత్రియుఁడు. తండ్రి అనమిత్రుఁడు. కుమారుఁడు శ్వఫల్కుఁడు; సత్యకుని పినతండ్రి.

**పృషదశ్వ గోత్రము** — (రథీతర ఉపగణము చూ.)

**పృషదుఁడు**— పాంచాలదేశాధీశుఁడు. తండ్రి సుజన్మకృతుఁడు. కుమారుఁడు ద్రుపద మహారాజు.

**పృష్ఠతాడనా ద్దంతభంగన్యాయము**- తుంటిపై కొట్టిన నోటిపండ్లకు దెబ్బ తగులుట యని యర్థము. అసందర్భమని భావము

**పృష్టా న్యాయము**—అడిగినదానికి ప్రత్యుత్తర మిచ్చుటలో నెంతవఱ కవసరమో అంతవఱకే ప్రత్యుత్తర మీయఁదగును. దాని సంబంధమె యైనను అనవసరమగు సంగతులు నుడువుట సమంజసము కాదని భావము.

**పెంకులపరిశ్రమ** (Tile Industry)- ఇది కొంచెము హెచ్చుతక్కువ ఇటుకలుచేయు పరిశ్రమవంటిదియే కాని యెక్కువ శ్రద్ధయు, ఎక్కువ జాగ్రతయు నిందవసరములు. మన్నును ఎక్కువపరిశుభ్రమైనదిగా నుండవలసియుండును. (ఇటుకలపరిశ్రమ చూడుఁడు.)

పెంకులందు ఇంటినేత పెంకు (Roofing tiles),మూలపెంకు లేక వెన్నుపెంకు(Ridge tiles), గొట్టముపెంకు (Pot tiles), బిళ్ళపెంకు (Flat tiles), తూములపెంకు(Drain tiles, లేక Gutter tiles), దోనెపెం (Pan tiles), మెంగుళూరు మచ్చుపెంకు (Manglore pattern tiles- Glazed tiles or Paving tiles or Encaustic tiles for Flooring or Paving tiles· వీటినే(Ornamental tiles అనియునందురు) మొదలగు కొన్ని రకముల పెంకులు వాడుకయం దున్నవి.

భరతదేశమున ఇండ్లు నేయుటకు వాడుకయందున్న ముఖ్యజాతుల ఇంటిపెంకు మంగుళూరుపెంకు లైయున్నవి. అందు మంగుళూరు మచ్చువి పెద్దపెంకులుగాన, దళసరిగా జేయఁబడును. దేశవాళీఇంటిపెంకులు కొంతపలుచనగా నుండుటయే గాక చిన్నవిగాఁ గూడ నుండెడిని. ఈ రెండువిధములగు పెంకులందు ఇండ్లనేత పెంకులు,మూలపెంకులు, దోనెపెంకులు మొదలగు వివిధోపయోగములపెంకులు చేయఁబడు చున్నవి. ఇవిగాక,గ్లేంజింగుటైల్సు లేక ఫ్లోరింగు టైల్సు, లేక పేవింగ్ టైల్సు అనంబడునవి అలంకారార్థ మగునవి. వానితో నేలభాగములను (Floors), గోడలును (Walls) గిలాబావలె నతికించి సుందరముగ నొనర్తురు.

పెంకులపరిశ్రమ- Civil Engineering కళయందలి గృహనిర్మాణపరిశ్రమకుఁ జెందిన విద్య యైయున్నది. ఈవిద్య బంకమట్టిజాతిపైనను, దాని కొనసంగుపదునుపైనను, దాని కొనసంగుకాల్పుపైనను ఆధారపడి యుండును.

వర్షములకు ముందు తఱుచుగ నీబంకమట్టి త్రవ్వి యెండ వాన గాలులకు ఆస్పదమగునట్లు బహిరంగ పఱచుదురు. దీని కాంగ్లమున Weathering లేక Mellowing అనియెదరు. ఈ పెంకులమట్టియందు ఇటుకలమట్టియందున కన్న ఇసుక తక్కువగా నుండవలయును. ఇట్లు వర్షాకాల మంతయు నిల్వయుంచుట శ్రేయము.

పిదప నామట్టిని దెచ్చి అడుగులోఁతుగల నీరింకనికుండులయందుఁ బోసి పైని నీరు నింపి ఇరువదినాల్గు గంటల కాలము నాననిత్తురు. పిమ్మట నామట్టిని ఇంటినీడకుఁ జేర్చి, పండ్రెండు గంటలకాలము నీ రాఱనిచ్చి పదును గల్గిన తోడనే మెత్తగఁ గ్రుమ్ముదురు. ఇందు చక్కని పదును కల్గుదనుకఁ గ్రుమ్ముచునే యుండవలయును. ఇందు ముతుకయిసుకగాని, చిన్న చిన్న ఱాళ్ళుగాని ఉండరాదు. ఉండెనేని పెంకుప్రేలి పగులుటయు, విచ్చిపోవుటయు సంభవించును.

పదునుగల్గిన యామట్టిని నిలువున నిలువఁ బడునట్లు దిమ్మలుగ వైచి పలుచని రేకులుగ అడ్డుగాఁ గోయును అచ్చులం దుంచి, వలయు పెంకులుగ రూపములు కుదిర్చి మట్టిపెంకులు చేయుదురు. తఱచుగ నీపనివాండ్రు ముగ్గు రేకకాలమునఁ గూడి చేయుట కలదు. వారిలో నొకఁడు మట్టిపదును చూచుకొనువాఁడుగను (Temperer), వేఱొకఁడు అచ్చులలో రూపము కుదుర్చువాఁడుగను (Moulder), వేఱొకఁడు చేసిన పెంకులు పరిశుభ్రపఱచువాఁడుగను (Cleaner) ఉందురు. అందు క్లీనరుపని నేర్చుకొనుచుండువాఁడు బాలుఁడుగ నుండవచ్చును.

ఈ చేతయందు చేతికి మట్టి అంటుకొనకుండ కొంచెము నీరు చల్లుటకాని, పొయిబుగ్గి లేక కుమ్మరబుగ్గి చల్లుట గాని చేయుటకు Watering అనియు, అచ్చులయం దణఁచుటకు శబ్దమిచ్చు ఘాతకు Striking అనియు, సర్వసాధారణముగ అచ్చునుండి పెంకు చేయుటకు Moulding అనియు ఆంగ్లనామములు కలవు. ఈ పెంకు నీడనే ఆఱవలయును గాన ముప్పదివేలపెంకు వారము మొదలు పదిదినములవఱకు ఆఱనిచ్చి గుండ్రని యావములందుఁ గాని, లేక ఇటుకబట్టీలపైఁ బేర్చి గాని కాల్చుదురు.

వీటిని గాల్చుటకు పిడకలను కఱ్ఱలతోఁ గల్పి, అవముపేర్చి, తొలుదొలుత వేఁడి తక్కువగా ప్రారంభమై క్రమక్రమముగ హెచ్చుచు మూఁడుదినములు కాలునట్లు ఏర్పఱచి కాల్చుదురు. బహుశః నూటికి పదిపెంకులు సరిగా కాలకపోవు నని చెప్పుచున్నారు.

మంగుళూరు మచ్చుపెంకు తొలుదొల్త కొంకణదేశమందలి మంగుళూరుపురప్రాంతపు ఫెరోకు పురమునఁ జేయఁబడి అట్లు పేరందినది గాని, ఇక్కాలమున మన్ను అనుకూలించు పలు తావులందుఁ జేయఁబడుచునే యున్నది. అర్నమెంటల్ టైల్సు అనంబడు పెంకల కెక్కువ మెఱు గీయఁబడుటయు, కొన్ని లతలు పద్మములు గల్గి యుంటయు వేఱువిధమగు పనియై యుండును.

**పెంటాటచ్ (యూధమతగ్రంథము)**- ఇది జహ్వాదేవునకు బలిగా నర్పింపఁ బడిన గొఱ్ఱెల యొక్కయు, మేఁకపిల్లలయొక్కయు, చర్మములపై లిఖింపఁ బడినదఁట. అదివఱకే యుండిన మతగ్రంథము క్రీ. ము వేయి సంవత్సరములకుఁ బూర్వమే కూర్పఁబడిన దనియు, ఇప్పటి యీ పెంటాటచ్ గ్రంథము క్రీ. వె. ౮౦౦-౯౦౦ మధ్యకాలము వ్రాయఁబడె ననియు నందురు.

“పెంటాటాచ్” అను మాట జర్మనుభాషా పదములగు పెంటం అన నైదనియు, టాచోస్ అన సంపుటము లనియు నర్థముగల పదముల నుండి కల్గినది. “పంచసంపుటము” లని యర్థము. క్రైస్తవుల యాదివిధాన మగు పురాతనగ్రంథము (Old Testament) నందలి మొదటి యైదుగ్రంథములు నని భావము

(డియూటరోనోమీ లేక హెక్సాటాచ్ చూడుఁడు).

**పెంటోగ్రాఫీ** (Pentography)-పెంటోగ్రాపు చిన్నపటములను పెద్దవిగా వ్రాయుటకు గాని, పెద్దపటములను చిన్నవిగా వ్రాయుటకుఁ గాని ఉపయోగించు పనిముట్టు. దీనికి పెంటోగ్రాఫ్ అనియు, ఆవిద్యకు పెంటోగ్రాఫీ యనియుం బేర్లు.

**పెండలపు తీఁగె**-- పెండలపు దుంపకై పెండలము తీఁగలు పైరు చేయఁబడుచున్నవి. భోజనపదార్థము. పెండలమునందు తెల్లనిస్వచ్ఛధాతువు గలది తెల్లపెండల మనియు, ఇంచుక యెఱుపు ధాతువుగల్గినది ఎఱ్ఱపెండల మనియు, ప్రధానజాతి పెండలము రెండుగఁ గలదు. కాని ఈభేదము పాటింపఁబడుటయే లేదు. కాని తెల్లపెండల మిందు శ్రేష్ఠమని తలంపఁబడుచున్నది. ఎఱ్ఱపెండలము ఇంచుక దురద గల్గియు రుచి తక్కువగా నెంచఁ బడుచున్నది. నాగపెండల మనంబడుజాతి వేఱొకటియు, కఱ్ఱపెండలమనం బడుజాతి మఱియొకటియు నీప్రకరునఁ గలవు. కాని, కఱ్ఱపెండలము ప్రత్యేకజాతి గాని,యిందు చేరదని తోఁచెడిని. అది కఱ్ఱ పాతిన వేళ్ళు దన్ని బతుకునది గాని తీవ కాదు. అది యంత రుచికరముకూడ కాదు గాన పెండలపువిలువ దానిదుంపల కుండదు.

తెల్ల, ఎఱ్ఱ పెండలములజాతికి లాటిన్భాషయందు Disoscorea alata యనియు,ఆంగ్లమున Yam అనియు పేరులు.

ఎఱ్ఱ, తెల్ల పెండలములు ఏటేట త్రవ్వి దుంపలు తీసికొందురు. ఇవి చలవయు, ఆమమును, వాతము జేసి, వీర్యపుష్టియు, దేహపుష్టియు, బలమును గల్గించు ననియు, మేహశాంతి గల్గించి, మూత్రమును చక్కఁగా వెడలఁజేసి ఇంచుక మలబద్ధము, వాయుదోషము, కఫమును దేకింపఁ జేయుననియుఁ జెప్పఁబడినది.

పెండలపుపాదులు కాచుకాయలును భోజన పదార్థముగ వాడఁబడు చున్నవి. పాదులు త్రవ్వక అట్లే నిలువయుంచిన రెండవసంవత్సరమున కాయలు కాచెడిని. కాయ లించుక వేడియు, పైత్యమును జేసి దేహపుష్టి, బలము గల్గించి, వాతదోషమును హరించి నీరసము గల్గించు నని చెప్పఁబడినది.

నాగపెండలమునందు పెండలపు గుణముల తోపాటు పైత్యశాంతియు, కఫశాంతియుఁ గల్గించి వీర్యవృద్ధి, బలము గల్గించి ఇంచుక మలబద్ధము గల్గించు గుణము కల దనియు, పెండలపుదోషమునకు బెల్లమును, తములపాకులును పరిహారము లనియుఁ జెప్పఁబడినది. (కఱ్ఱపెండలము చూడుఁడు.)

**పెండెచాటు** — బధిరమున (చెవుడున) కర్థముగ వాడుచున్నారు. ఇది ఆంధ్రభాషా సాంప్రదాయార్థపదము.

**పెండ్లికులగోత్రము**-(ఉద్వాహకులచూ).

**పెండ్లికొడుకు**— పెండ్లి యన వివాహ మనియు, కుమారుఁ డన సద్వంశజాతుఁ డని యు భావము. పెండ్లికొడుకున కాంగ్లమున Bride-groom అనెదరు. ఇది కొంత వికారముగ నుండును. గాని దీని పూర్వోత్తరములు వేఱు. Old English పదములగు Bryde guma అనెడి పదములగతి Bride-groom ఐనది. ఇందు Bryde పెండ్లిసంబంధార్థము. Guma అన మనుష్యుఁ డని యర్థము.

**పెండ్లి సందడిలో పుస్తెలు మఱచి నట్లు**— (ఆంధ్రలోకోక్తి.)

**పెంపుడుజంతువువలన సంతసము గల్గుట**— మనుష్యులు తాము పెంచిన కుక్కలు, పిల్లులు, మొదలగు గృహమున మచ్చికయగు జంతువులను పెంచి వాట్లతో

నానందించుట గాననగును. అందుకుఁ గారణములు రెండు. ఎల్లరు తలంచురీతిని ఉపయోగమని యొకకారణము గన్పట్టెడిని. పెంచిన జంతువులవలన అర్థోపయోగప్రతిఫలము గల్గినను, కలుగకపోయినను ఆజంతువులు తనకు లోఁబడి తనయందు యాజమాన్యభక్తి గల్గియున్నంతదనుక వాట్లను గాంచినంతనే సంతసమతిశయించును.ఇందువలన మానవస్వభావము తా నధిపతియై యుంటయు, ఇతరములు తనకు లోఁబడి తనస్వాధీనమున మసలుటయు వాంఛించు చుండునదిగఁ దేలుచున్నది. ఇది సర్వసాధారణము. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కరియం దీవాంఛ తగ్గి యుండుటయు, కేవలోపయోగ వాంఛయే అతిశయించియుంటయుగూడఁ గాననగును.

**పెగ్స్ ఎండ్ విషిల్సు** (Pegs and whistles) — కలవరము, క్రమముచెడుట, గల్లంతు అనుట కీడుక్తి నుపయోగింతురు.

**పెటగోనియా దేశము** (Patagonia Republic)—దక్షిణ అమెరికాయం దున్న ప్రజాప్రభుత్వదేశము. అఖండమునఁ గడుదక్షిణముగ నున్నది. చాల చలిదేశము. ఱాళ్ళమయమై నిరుపయోగ ప్రదేశములమయమైయున్నది. రెడ్ ఇండియను లిందు నివసించుచున్నారు. వీరుచాలకఠోరులు. సదా గుఱ్ఱములపైతిరుగుచు వేఁటాడుచుండువారు. ఇప్పుడీదేశము అర్జంటైను రిపబ్లికునకుజెందియున్నది. పట్టణములని వేఁటే లేనిదేశము. (అర్జంటైను దేశము, లాప్లాటా దేశము, దక్షిణఅమెరికా చూడుఁడు).

**పెటర్నాలిజమ్** (Paternalism)--- తండ్రియే గృహయజమానుఁడై అందఱియొక్క యోగక్షేమముల నరయుటను, రాజ్యమునందలి ప్రజలకు రా జొక్కఁడే పాలకుఁడై పరిపాలించు పద్ధతిని సమర్థించుసిద్ధాంతము.

**పెట్టి తినేవారే కాని తిట్టితే పడేవారుందురా?**—(ఆంధ్రలోకోక్తి).

**పెట్టినవారికి పుట్టినదే సాక్షి, పెట్టనివారికి పుట్టనిదే సాక్షి**-(ఆంధ్రలోకోక్తి).

**పెట్టు చుట్టము, తిట్టు వైరము** —(ఆంధ్ర లోకోక్తి).

**పెట్రోలియమ్**—(మట్టితైలము చూ).

**పెట్రోలోజీ** (Petrology)— ఱాళ్లను గూర్చిన శాస్త్రము. ఆంగ్లకల. జర్మనుభాషయందు Petra యన ఱాతి కర్థము. ఇది జియాలోజీలోనియొక భాగముమిన రాలోజీవంటి శాస్త్రము ఱాతియందుఁగల వివిధపదార్థములు, వాటిరంగులు, గట్టితనము మొదలగునవి వివరించుకల.

**పెడిమాంటు**-(ఇటలీదేశములోని యొక పోవిన్సు చూడుఁడు).

**పెడిమెంటు** (Pediment) — గొప్ప భవనముల వరండానంటి స్తంభములపై



అందముకొఱకు త్రికోణాకారముగ నిర్మింపఁబడుపని.

**పెడోమీటర్** (Pedometer)-- నడుచుతఱి నెక్కినమెట్లెన్నియో లెక్క తెల్పు యంత్రపరికరము.

**పెథగొరియానిజమ్**—(Pythagorianism) గ్రీకుతత్త్వశాస్త్రజ్ఞుఁడగుPythagoras) అనువాని సిద్ధాంతములు.

**పెథటిక్స్** (Pathetics)-ఫ్రెంచిభాషాజన్యపదము. దుఃఖపరిస్థితులవలన కలిగెడు భావములను జాలిపుట్టించునట్లు కరుణరసప్రధానముగ కవితచెప్పుపద్ధతి. ఆంగ్లమునందు "Oliver Twist" అనుగ్రంథ మీవిధానమునకుఁ జెందును. ("ఉత్తరరామచరిత్ర" నాటకము సంస్కృతమునందు, "సుగుణమణి" తెలుఁగునందును గలవు. నవీనవాఙ్మయమునం దిట్టిగేయము లెక్కువగ రచింపఁబడుచున్నవి.)

**పెథోలజీ** (Pathology)—రోగలక్షణపరిణామములను దెలుపు శాస్త్రము.

**పెదవికి మించిన (నోటి) పండ్లు, ప్రమిదకు మించిన వత్తులు బాధాకరములే**—(ఆంధ్రలోకోక్తి).

**పెదవి దాఁటితే పృథివి దాఁటుతుంది**— రహస్యమై యుండదని భావము. (ఆంధ్రలోకోక్తి).

**పెదవేంకటాద్రిప్రభువు**—క్షత్రియుఁడు. వీరియింటిపేరు ఆకువీటివారు కానోపు. కౌండిన్యసగోత్రము. నివాసము విజయనగరము. (ఆంధ్ర కర్ణాటకరాజ్యము). వీరు రాఘవపాండవీయమును పింగళి సూరనామాత్యునిచేఁ గృతినందిరి. వీరిసోదరులు చినవేంకటాద్రిరాజు, వేంకటరాయఁడు, వేంకటవరదరాజు ననువారలు. వీరి తండ్రిపేరు తిమ్మరాజు. ఈయన విజయభైరవుఁడని బిరుదమందినవాఁడు. పినతండ్రి బొమ్మరాజు. పితామహుఁడు ఇమ్మరాజు. (ఈయన రాజమహేంద్రవరము జయించినవాఁడని చెప్పఁబడినది.) ప్రపితామహుఁడు భావరాజు. ప్రప్రపితామహుఁడు ఇమ్మరాజు. (ఆకువీటి పట్టణాధిపతి. ఈకుటుంబము శ్రీకృష్ణరాయ సార్వభౌముని కుటుంబమునకు) ఆంధ్రకర్ణాటకసామ్రాజ్యమునకు సామంతరాజులు.

## పెదవేంకటాద్రిప్రభువు-ఆకువీటివారి వంశావళి—

క్షత్రియులు. కౌండిన్యసగోత్రము. నివాసము ఆకువీడుదుర్గము. (కందనూరుమండలము, ఇప్పటి కర్నూలు) జీర్ణవిజయనగరమున వీరి నివాసభవన ముండెనఁట.

ఇమ్మరాజు (ఆకువీటిపురాధిపతి)
|
భావరాజు
|
ఇమ్మరాజు (శ్రీకృష్ణరాయనికి రాజమహేంద్రవర యుద్ధమున జయము తెచ్చినవాఁడు)

తిమ్మరాజు (విజయభైరవబిరుదమందినవాఁడు) — బొమ్మరాజు కనిష్ఠుఁడు

పెదవేంకటాద్రి ప్రభువు (పింగళిసూరన్నచే రాఘవపాండవీయము కృతినందినవాఁడు) — చినవేంకటాద్రి రాజు — వేంకటరాయలు — వేంకటవరద రాజు

**పెద్ద ఆంటిలీ ద్వీపములు** (Greater Antilles)--ఇవి పశ్చిమగోళార్థమున పసిఫిక్ మహాసముద్రమునందు వెస్టిండీస్ దీవులకుఁజెందిన మూఁడు ద్వీపసమూహములలో నొకద్వీప సమూహము. (వెస్టిండీస్ దీవులు చూ.) ఇందు క్యూబా ద్వీపము, హెయితీద్వీపము, జమైకా ద్వీపము, పోర్టోరైకో ద్వీపము ముఖ్యమైనవి తక్కినవి వీటికిఁ జెందిన చిన్న చిన్న దీవులు. వాట్లనుగూర్చి వేర్వేఱు తావులందుఁజూడనగును.

**పెద్దఈఁగలు** - (ఈఁగలు చూడుఁడు).

**పెద్దగుమ్మడి (పెగ్గుమ్మడి) చెట్టు**-ఇది గుమ్మడికఱ్ఱచెట్టువంటిచెట్టు గాని గుమ్మడి పాదుజాతి కానేరదు. ఆఙ్గ. Pumpkin. సం. మధుపాలికా.

దీనివేఱుచెక్కఆకుల రసకషాయములు తీవ్రమైన వేఁడి నడంచుననియు, త్రిదోషహర మనియు, రక్తపైత్యము, అరుచిదోషము, జ్వరము, తాపము, విదాహరోగము వీట్లను నిర్మూలించుననియుఁ జెప్పుదురు.

**పెద్దగోపన్నగారి పెట్టె**— గోల్కొండ ప్రభువై యుండిన తానీషాకడ ప్రధానులుగ నుండిన అక్కన్న, మాదన్నగార్లకు మేనల్లుఁడగు కంచెర్ల గోపన్నగారు భద్రాచలము దేవస్థానాధికారిగ, తహశ్శీలు ఉద్యోగిగ నుండిరి. వారు శ్రీరామభక్తులు. దాశరథి శతకమును వ్రాసిన కవిశిఖామణి. సొంతద్రవ్యమునేగాక ప్రభుత్వమువారి ద్రవ్యమునుగూడ దేవాలయ మంటపాదుల నిర్మాణమునకై వ్యయపఱచివేసెనఁట. ప్రభుత్వధనాగారమునందలి పెద్దపెట్టె ఖాళీ మైపోయెనఁట. దానిని "పెద్దగోపన్నగారి పెట్టె" యని (గోపన్నగారి పెద్దపెట్టె యని) లోనధనము లేకుంట హేళనగా నందఱు వాడసాగిరఁట. నేఁటినికి పెద్దగోపన్న గారిని స్మరింప జేయునట్లు వాడుకయందున్నది. ఈగోపన్న గారికే రామదాసుగా రను వాడుకనామము గలదు. (ఆంధ్రలోకోక్తి).

**పెద్దతామర (కమలము)** (Victoria Regia)—దీని నాఙ్గశాస్త్రవిధులు Gigantic water lily అనియు ననెదరు వారే దీని కాఙ్గమున విక్టోరియారిజియా అని పేరిడిరి. దీనియాకులకాడలు (తూండ్లు) చాల వలముగ నుండి ఆకులు సర్వసామాన్యముగ ఏడడుగులు మొదలు పదిఅడుగులవఱకు నడ్డుకొలత (Diameter) గల్గియుండును. ఉష్ణదేశములం దనుకూలపరిస్థితు లమరిన నింతకు రెట్టింపుగ నుండునని శాస్త్రవేత్త లనుచున్నారు.

బురదనేలలందు నీట నిది చక్కఁగా పెరిగెడిని. ఏమజాన్ నదీతీరమున బురదలందు, కోమో సరస్సుతీరపుబురదలందు, St. Paul Minnesota పురప్రాంతముల నివి బురదనేలలనీటియందు చక్కఁగా పెరుగుచున్నవి. చిన్నపిల్లల నీయాకు మోయఁగలదఁట. ఆకులకొనలు పైకి వంగి యొక పళ్లెమువలె నగపడుచుండును. దీనిపూవులు చాలపెద్దవి. గాటపు పరిమళముగల్గి ఎఱ్ఱనిరంగు గలవి. పూవులఅడ్డుకొలత పండ్రెండంగుళము లుండును.

**పెద్దవస్తువులు**—(ప్రపంచమున పెద్దవి చూడుఁడు).

**పెద్దిశిష్టకులగోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు).

పెద్దిశిష్టకుల. (పెద్దశ్రేష్ఠ బద్దశిష్ట-బధశిష్ట) గోత్రము. ఏకార్షేయ (?) గోత్రము. సంస్కృత గోత్రము. చామర్షణస. చమర్షణగణము. ప్రీతమనస్కర్షి. . ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణ ఆద్యప్రవరఖండ. సమానగోత్రములు బుధురుస,

ప్రీతమనస్కాన. జయేశుఁడు దేవత. రాజాంబ భార్య. జయవాటి తపస్థానము. రాజాంబుధి తటాకము. జపము లక్ష. దీపములు ౫౦. క్షేత్ర సంఖ్య ౨౧. మహిషము దానము. పచ్చ పెసలు వర్జనీయము.

**పెద్దశ్రేష్ఠ గోత్రము**—(పెద్దిశిష్ట చూ.)

**పెద్దాపుర సంస్థానము**-ఇప్పుడు పెద్దాపురసంస్థాన మంతరించిపోయినది. ఇది తూర్పు గోదావరీమండలమున చామరకోట రెయిలుస్టేషనున కనతిదూరమున నున్నది. అచట ప్రభుత్వముండిననాఁటి పాడుపడిన కోట యున్నది. ఈ ప్రాంతదేశమున కొకప్పుడు కిమ్మూరుసీమ యని పేరుండెను. (కిమ్మూరుసీమ చూడుఁడు.)

ఈసంస్థానపు రాజధానిగ నుండిన పెద్దాపురము, కిమ్మూరుసీమను సామంతరాజ్యముగ రెడ్ల ప్రభుత్వకాలమునం దేలిన ఇసుకపల్లి పెద్దాపాత్రుఁ డను పాలకుఁడు తన పేరిటఁ గట్టించి, పెద్దాపుర మని పేరిడె నని చెప్పఁబడి నది. పిదప నారాజ్య మేలిన విస్సమ్మ యను రెడ్డిరాణి వత్సవాయి మునసమ్మరాజు గారను వారియొద్ద అప్పు తీసికొని దీనిని కుదువఁగా చెను. అయన అదివఱకు రెండువేల సైన్యము నకు ఫౌజుదారుగ నుండెననియు, పిదప బలపడిన హేతువుగ నీసీమకు ప్రభుఁడై యేలె ననియు, అయనయే ఈ సంస్థానాధిపతులలో ప్రథముఁ డనియు నందురు. ఈయన పేరరాజు గారి పుత్రుఁ డనియు, జగ్గరాజు గారి పౌత్రుఁ డనియు, తిరుపతిరాజుగారి ప్రపౌత్రుఁ డనియుఁ జెప్పఁబడినది. వీరింటిపేరు వత్సవాయివారు. ఆదిని సాగి లేక సాగిరాజువారని యుండెడి దఁట. ఈ తిరుపతిరాజుగారి ప్రపితామహుఁ డగు (ముత్తాత తండ్రిగారు) శ్రీరామరాజుగారు వత్సవాయ గ్రామ నివాసులగుట వారినాఁటి నుండియు నింటిపే రట్లు మాఱెనందురు. అసలు సాగి శబ్దము. త్యాగి పోతరాజు (లేక త్యాగ పోతరాజు) గారి నుండియు, త్యాగి శబ్దము సాగిగ వాడఁబడుచు నేర్పడియె నఁట. ఆ త్యాగి పోతరాజుగారు పైని జెప్పఁబడిన శ్రీరామరాజు గారికి ప్రపపితామహులని యందురు. అంతకు పూర్వులు అగ్గురపేర్లను శ్రీపెద్దాపుర సంస్థాన చరిత్రయందు వివరించియుండిరి. కాని వారి ఇంటిపేర్లు వివరింపఁబడలేదు.

ఈ ముసలితిమ్మభూనాథుఁడు స్వతంత్రుఁడై రాజ్య మేలెనో లేక ఒకరికి సామంతుఁడై రాజ్య మేలెనో గాని, ఈయనయే మొదటిభూనాథుఁ డని చెప్పఁబడినది. ఈయననుగూర్చిన యితర సంగతులు శ్రీకాకుళపు నవాబగు షేరుమహమ్మదుఖానునుండి యొకకత్తిని బహుమానమందె ననియు, విశ్వనాథకవికృత శేషధర్మమును కృతి నందె ననియు, వీరి పెద్దాపురపు కోటయొక్క ఒకబురుజుపై (తాళ్లబురుజు) నృసింహ దేవాలయ మేర్పఱచెన నియు, ఈతఁడు వైష్ణవ మతావలంబుఁ డనియు, ఈయనకాలము క్రీ. శ. ౧౫౫౭-౧౬౦౭ స॥రం అనియు ననెదరు.

ఈయనకుఁ బిదప ఈయనసుతుఁడు రాయపరాజుగారు రాజ్యమునకు వచ్చిరి. (౧౬౦౭-౧౬౪౯). ఈయన "హరిభక్తిసుధోదయ" మను ప్రబంధమును గృతి నందె నఁట. కాని, అది బయల్పడుట లేదు. వీరికిఁ బిదప వీరి కుమాళ్ళు రెండవతిమ్మజగపతిరాజుగారు రాజ్య మేలిరి. వారికాలము ౧౬౪౯-౧౬౮౮.

ఈయనకడ రామవిలాసమురచించిన ఏనుఁగు లక్ష్మణరాజు(కవి)గారి పితామహుఁడు లక్ష్మణ కవిగారు ఆస్థానపండితులుగా నుండిరఁట. ఈయనకు కీర్తితిమ్మరాజుగారనియు, సార్వభౌమ తిమ్మజగపతి యనియు వాడుక లుండె నని వీరివా రనుచున్నారు. వీరు ద్రౌపదీపరిణయము కృతినందెనందురు. కాని యది గానవచ్చుటలేదు.

వీరికిఁ బిదప వీరితమ్ముఁడుగారి కుమారులు రాయజగపతిరాజుగారు పరిపాలనకు వచ్చిరి. ఈయన కుద్దండుఁ డని బిరుద ముండెనఁట. వీరికాలము క్రీ॥ వె. ౧౬౮౮-౧౭౧౪. వీరికిఁ బిదప వీరిసుతుఁ డగు మూఁడవ తిమ్మజగపతి రాజుగారికి రాజ్యము వశమయ్యెను. ఈయన తండ్రిపోవువఱకు పది వత్సరముల బాలుఁడు గాన, తల్లిగారగు రాఘవయ్యగారు(రాగయ్య గారు) రాజ్యపాలన నడుపుచుండిరఁట. కాని, యీబాలుని నొకకుట్రలో హాజీహుసేనను మహమ్మదీయోద్యోగి)హత్య యొనర్చెనఁట. ఇది౧౭౩౪సం॥రంలోజరిగెను.తోడనేతల్లిగారగు రాగమ్మగారును చితిని బేర్చుకొని మరణించిరఁట. పిమ్మట పెద్దాపురరాజ్యము మహమ్మదీయుల వశమయ్యెను. ఆ తిమ్మరాజుగారి కొక సంవత్సరము వయస్సుగల బాలుఁ డుండ, నాబాలుని విజయనగరసంస్థానాధిపతులు పెంచి పెద్దఁజేసిరి. ఆబాలునిపేరు జగపతిరాజుగారు. విజయనగరమువారే ౧౭౪౯లో గొప్పప్రయత్నములు సల్పి మహమ్మదీయులను గట్టుకొని, తిరుగ పెద్దాపురరాజ్యమునకు పట్టాభిషిక్తుని జేయించిరి. జగపతిరాజుగారికాలము ౧౭౪౯-౧౭౫౮ అని చెప్పఁబడినది. అనఁగా పదునేను వత్సరములు మహమ్మదీయుల వశమందు సంస్థానముండెను.

జగపతిరాజుగారికాలమున ౧౭౫౮ సం॥లో వారు విజయనగరప్రభుఁడగు ఆనందగజపతిచే నొకయుద్ధమున బలాత్కరింపఁబడి రాజ్యమును వీడి వారికి వశపఱుపనయ్యెను. పిదప ౧౭౫౯ వారు వేఱొకసంగరమున నిహతులైరి. తోడనే రాజ్యము విజయనగరగజపతులవశమాయెను. ఇటుల ౧౭౬౦ వఱకు నుండెను.

క్రీ. వె. ౧౭౬౦ లో పెద్దాపుర సంస్థానము జగపతిరాజుగారి కుమారుఁడు తిమ్మరాజుగారి వశము చేయఁబడెను. వీరికాలము ౧౭౯౭ వఱకుండెను. వీరు నాల్గవతిమ్మ జగపతిరాజుగా రనంబడిరి. వీరియాస్థానముననే సుప్రసిద్ధుఁడగు ఏనుఁగు లక్ష్మణకవి (రామవిలాసగ్రంథకర్త) కవీశ్వరుఁడుగ నుండినవాఁడు. వీరికాలముననే ఆనరెబిల్ ఈస్టిండియా కంపెనీవారి యధికారము త్తరసర్కారులందు స్థిరపడెను. తోడనే పెద్దాపుర సంస్థానము జమీందారీ యయ్యెనందురు.

వీరికిఁ బిద: వీరిపుత్రులు ాయజగపతి రాజుగారు సంస్థానాధిపతులైరి. వీరికాలము ౧౭౯౭ మొదలు ౧౮౦౪ వఱకు నని చెప్పఁబడినది. వీరికి లక్ష్మీనరసయ్యగారనియు, బుచ్చిసీతయ్యగారనియు,బుచ్చిబంగారయ్యగారనియు ముగ్గురు భార్య లుండిరఁట. సంతానము లేనందున దత్తత కనుజ్ఞ నిచ్చియుండిరఁట. వీరికిఁ బిదప జ్యేష్ఠపత్ని లక్ష్మీనరసయ్యగారు ంస్థానాధిపత్యమునకు వచ్చి

వీరికాలము ౧౮౦౪-౧౮౧౪ అని చెప్పఁబడినది. వారికాలముననే అదివఱకు వీరిదిగా నుండిన కొతాం ఎస్టేటు వీరిజ్ఞాతులగు వత్సవాయ జగన్నాథరాజుగారికి వశపఱుపఁబడె నఁట. అది మందురు. వీరికిఁ బిదప రెండవభార్యయగు బుచ్చిసీతయ్యగారు అధిపతులై ౧౮౩౧లో మృతినందిరి. వారికిఁ బిదప మూఁడవభార్య యగు బుచ్చిబంగారయ్యగారు అధిపత్యమునకు వచ్చి ౧౮౩౩ లో మరణించిరి. వీరికిఁ బిదప వీరిసమీపజ్ఞాతులు, కొతాంజమీందారులు నగు వత్సవాయ సూర్యనారాయణ జగపతిరాజుగారు(జగన్నాథరాజుగారిపుత్రులు) సంస్థానాధిపతులైరి. కాని వారు కొతాం మాత్రము తమక్రింద నిడుకొని పెద్దాపుర సంస్థానము బ్రిటీషుప్రభుత్వమువారికి వదలివేసి ౧౮౭౩ లో వశపఱచిరని చెప్పఁబడినది.

**పెనాంగుసెటల్మెంటు**—ఇది స్ట్రెయిటు సెటల్మెంట్సులో నొకటి. (చూడుఁడు)

**పెనుగొండ దుర్గము**-ఆంధ్రదేశమున, అనంతపురమండలమున, పెనుగొండ కలదు. అది దుర్గముచే పేరుగాంచినది. విజయనగర సామ్రాజ్యకాలమున నిది ప్రాముఖ్యమునందిన సైన్యదుర్గముగా నుండినది. క్రీ.శ. ౧౫౬౫లో తాలికోటయుద్ధముజరిగి,విజయనగరము ధ్వంసము చేయఁబడినతరువాత రాజకుటుంబము పెనుగొండకుఁ జేరి, యట ౧౫౯౨ వఱకు నివసించెను. పిదప చంద్రగిరి కేఁగిరి. దీనిని విజయనగరచక్రవర్తు లెవరునిర్మించిరో సరిగా తెలియకున్నది.

క్రీ. ౧౫౭౭లో బిజాపూరునవాబు దీనిని ముట్టడించి యోడిపోయెను గాని ౧౬౫౦లో బిజాపూర్నవాబులస్వాధీనమైనతోడ నేహిందూ దేవాలయములు, పాడుచేయఁబడి మసీదులు కట్టఁబడెనఁట. పిదప నచిరకాలముననే మహారాష్ట్రులు, మొరారిరావు సేనాని క్రింద పెనుగొండను ముట్టడించి, మహమ్మదీయు దరిమి వైచిరి. వారినుండి ౧౭౬౬లో హైదరాలీకి వశమయ్యెను.

విజయనగరరాజులనాఁటి గగనమహాల్ నేఁటికిని గలదు.

**పెనంబ్రానీడ**— (ఆబ్టిక్సు చూడుఁడు. నీడచూడుఁడు.)

**పెనుపల్లె బాపనామాత్యకవి**--ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు. తండ్రిపేరు కోనయ్య. రచించినది సీతావిజయము.

**పెనెన్సులా**— (ద్వీపకల్పము చూ.)

**పెనోలజీ** (Penology)-నేరముచేయుట శిక్షింపఁబడుట అనునది లేకుండ నేరములనే చేయకుండునట్లు సంఘమును సంస్కరింపవలెనను సిద్ధాంతము

**పెన్నేరుచెట్టు (అశ్వగంధ)** — లా. Physalis Flexuosa సం. అశ్వగంధా, అవరోహకః,అవరోహికా,వాజికరీ,వాజిగంధా, వాజినామా, వాజినీ. ఇది పెద్దపెన్నేరు, చిన్న పెన్నేరు అని ద్వివిధభేదములు కలది. కాని రెండింటికి గుణభేదము లేదు. దీనిదుంపను పెన్నేరుగడ్డ, పెన్నేరుదుంప యనెదరు. దీని రస కసాయ చూర్ణములు ఉబ్బసము, కఫము, మేహము, రక్తపైత్యము, వాతరోగములు, సన్నిపాతము, స్త్రీల సూతికావాతము, క్షయరోగములు వీట్లను నివారించు ననియు, మలమూత్రములను వెడలించి జఠరాగ్ని బలపడునట్లొనర్చి బలము, వీర్యవృద్ధి గల్గించి, పుంస్త్వము నధికపఱచు ననియుఁ జెప్పఁబడినది.

పెన్నేరుదుంపను నూరి పసవసి కట్టిన మానని వ్రణములు, మొండిజాతికురుపులు మానును. వాతపునొప్పులు, మేహవాతపునొప్పులు హరించును. పెన్నేరుపండ్లు మూత్రమును వెడలించును. విత్తులు పాలను తోడుకొనునట్లు చేయును. కొందఱు చిన్నపెన్నేరు బలముగ పనిచేయు నందురు.

**పెన్మెచ్చ బుచ్చిరాజ కవి**— ఆంధ్రకవులలో నాధునికులందుఁ బరిగణింపఁ బడినవాఁడు. క్షత్రియుఁడు. ధనంజయగోత్రుఁడు. తండ్రిపేరు వేంకటపతిరాజుగారు.సూర్యవంశము. కాపురము కర్లపాలెము. రచించినది పరతత్త్వ ప్రకాశిక యను వేదాంతగ్రంథము. ఇది భాగవతమునందలి కపిల దేవహూతిసంవాదములోని కథ నాధారముగఁ గైకొని రచించినదందురు.

**పెన్యనిజమ్ లేక సిన్ఫెనిజమ్** (Fenianism) — పెన్యనిజమును సిన్ఫెనిజమ్

అనియు వాడిరి. ఐరిష్ దేశచరిత్రమున పేరందిన ఫెన్నా లేక ఫియన్నా (Fianna) అను పదమునుండి కలిన శబ్దము. ఐర్లండు నుండి అమెరికాకు వలస పోయినవారును, ఐర్లండు దేశవాసులగు కొందఱును గలిసి బ్రిటీష్ ప్రభుత్వ పాలనము తప్పించి, స్వతంత్రపరిపాలనము నెలకొల్పు నుద్దేశ్యముతో బయలు దేఱదీసిన తిరుగుబాటుపక్షికి పేరు. పిదప సామ్రాజ్యాంతర్గతమగు ఫ్రీస్టేటుగా నేర్పాటున కంగీకరించి లోఁబడి యున్నారు.

**పెన్సలు**— తొల్లింటికాలమున నిప్పుడు వాడుకయం దున్న పెన్సలు లేకుండుటచే సీసపు కడ్డీలను కాగితముల వ్రాయుట కుపయోగించుచుండిరి. కాని అది సరిగానంటక, [illegible] యునది సరిగా తెలియకుంటయు,అతిత్వరితముగనే యావ్రాత రూపుమాసిపోవుచుండుటయు సంభవించుచుండెను.

పిదప కొంత యభివృద్ధి కల్గి, గ్రాఫైటు (Graphite) అనఁబడు నొకవిధమగు లోహపదార్థమును గల్పి చేసియు, పిదప గ్రాఫైటుతో బంకమట్టిని జేర్చి, పెన్సలుగఁ జేసియు వాడ నారంభింపఁ బడినది. ఆపెన్సలును రబ్బరుతోఁ పెనఁ జెఱిగిపోవును గాని కొంతకాలము వఱకు స్పష్టముగఁ గన్పించెడిని. ఇందు సీసము మానివేయఁబడినను సీసపుపెన్సలు (Led pencil) అని వాడుక అచట నచట నింకను నిలిచియుండుట గాన నగును.

పిమ్మట దానియందు ఏనిలైన్ (Aniline) రంగును, బంకయుఁగూర్చి పెన్సలు చేయఁబడ నారంభ మయ్యెను. దీనికి ఇండెలిబిల్ పెన్సల్ (Indelible pencil) అని పేరు. ఇది కొంచెము కాగితములోనికిఁ జొచ్చు శక్తిగల పదార్థముతో వ్రాయుటఁజేసి త్వరితముగఁ జెడదు. రబ్బరుతో అంత స్పష్టముగను జెఱిగిపోకుండును. కాని తడిపి వ్రాసినను, లేక తడికాగితముపై వ్రాసినను కాగితములోనికి చొచ్చుకొనిపోయి,సిరాతో కలమువలన వ్రాసినఫలితమునే ఇచ్చెడిని. సిరాలో ముంచి కలముతో కాగితముపై వ్రాయుట అందఱకు స్పష్టమే. తొల్లి భరతదేశమున తాటియాకులపై సూదిమొనగల గంటముతో వ్రాయుచుండిరి. అది తాటియాకుపైపొరను చింపి నడుచుటచే చెఱుపుటకుఁ గాని, దిద్దుటకుఁగాని వీలుకాదు.

**పెప్సిన్-హైడ్రోక్లోరికాసిడ్**(Pepsin & Hydrocloric Acid)— భుజించిన పిదప గ్లాండ్సు, సెల్సు, పొత్తికడుపు (Stomach) నందు చేయుపని జీర్ణ మనఁబరఁగెడిని. ఇది విచిత్రకార్యము. అజీర్తి కల్గియున్నతఱి నాంగ వైద్యులు హైడ్రోక్లోరిక్ ఆసిడ్ అను నౌషధము నిచ్చుచుందురు. భోజనపదార్థములతో లోని కరిగిన లవణము రక్తమునందుఁ జేరి పొత్తికడుపులోనికిం జేరనగును. ఇంక పొత్తికడుపులోని వేఱొకతెగ సెల్సు (Cells) లెక్కలేని చిన్నచిన్న త్రిసరేణువులు గల్గియుండును. అవి రక్తమునుండి జనించినవిగ నెఱెంగియున్నారు. ఇవి మైక్రోస్కోపుయంత్రముతో భోజనాత్పూర్వము చూచిన గానన గును. భోజనానంతర మవి గానరాకుండును. ఇయ్యవి పులుపుపదార్థములని పరిశీలనలు బయల్పెట్టినవి. దీనిపేరు పెప్సిన్ అనెదరు. ఇదియే జీర్ణశక్తికి మూలకారణ పదార్థము. అంగడులందు దొరకు పెప్సిన్ పసుపుపచ్చరంగుగల చూర్ణము. ఇది గోవులందుఁగూడ లభించెడిని. అతఱి దీనికి గోరోజన మని ఆయుర్వేద వైద్యశాస్త్రమునఁ బేరిడంబడి యున్నది.

అజీర్ణకాలములం దీపెప్సిన్ రోగుల కిచ్చిన జీర్ణమగును గాని, దీనియం దొకదోషము కలదనియు, ఆరోగ్యము కల్గినపిదపఁగూడ పెప్సిన్

వలన జీర్ణము చేయించుకొన మరగిన పొత్తి కడుపులోని గ్లాండ్సు పనిచేయక, దీనిపైననే జీర్ణాధారము నేర్పఱచుకొనునట్లు మూర్ఛించి జీర్ణశక్తిఁ గలించు పెప్సిన్‌ను చేసికొనక మాను నని కనిపెట్టఁబడినది. గాన వైద్యవిద్యావిశారదు లేదో ఒకప్పుడు తప్ప దీనిని వాడనిరాకరింతురు. దీనినుండియే అలోపతీవైద్యమున "All life that the health of any part of the body can be maintained only if it does its own work" అను ధర్మ మేర్పడియుంట గాననయ్యెడిని.

ఈసందర్భమున తొలుత హైడ్రోక్లోరిక్ ఆసిడ్ భుజించిన పదార్థములందు కలిసి పెప్సిన్ పనిచేయుట కనుకూలస్థితిని గల్గించి ఆయత్తపఱచు ననియు, పెప్సిన్ దానిని జీర్ణముగ నొనర్చి వేర్వేఱు పదార్థములుగ విడదీసి రక్తమునకు గల్పవలసినదాని నందుఁ గల్పు ననియు, పరిశీల నలనుండి ఎఱింగియున్నారు. ఇట్లు జీర్ణమగుటకు Ferment అని సాంకేతికనామము ఆంగ్లవైద్య శాస్త్రపరిభాషాపదముగ నిడిరి. కొంత యనవ సరపదార్థము మలకోశమునకు (Bowles) చేర్పఁబడి వేఱగును. అది తాపీగా జరగును గాని యొకేతఱి జరుగుపని కాదందురు. ఇందు నుండి భోజనము మితముగా నుండిన మేలని తోఁపకపోదు.

**పెస్సిమిజమ్** (Pessimism)— (మాలిజమ్ చూడుఁడు).

**పెరటిచెట్టు మందునకుఁగాదు** (ఆంధ్రలోకోక్తి)

**పెరసనల్‌ప్రోపర్టీ**— వాణిజ్యపరిభాష యందు ఫీర్లెపోల్డులు గాక తక్కినఆస్తి యని యర్థము. మఱియు దీనికి పెర్సనాలిటీ అనియు ననుచున్నారు.

**పెరాక్‌స్టేట్**— ఇది ఫెడరేటెడ్ మలే స్టేట్సులో నొకటి. (మలెయాదేశము చూ.)

**పెరిపెటెటిక్సిజమ్(అరిస్టాటలిజమ్)** (Peripateticism)—తత్త్వశాస్త్రమునందు అరిస్టాటలుయొక్క సిద్ధాంతము.

**పెరిముదా ద్వీపము**— బొంబాయివద్ద సాలసెటీ ద్వీపమని పోల్చియున్నారు. గ్రీకు చరిత్రకారులు దీనిని పెరిమూలా యని వ్రాసిరి.

**పెరిశియా (ఇరాన్) దేశము**— (పారశీకదేశము చూడుడు,)

**పెరిశిష్టగోత్రము**— (పెరుశిష్ట చూ.)

**పెరిస్కోపు**—(Periscope) పెరిస్కోపు లనంబడుదూరదర్శకదుర్భిణీయంత్రపరికరములు సబ్మెరైనుఓడలపై నడుచువారు తమ చుట్టుపట్ల నుండువాటిని స్పష్టముగ నెఱుంగుటకు చూడ నుపయోగించునవి. ఇవి పొడుగుపాటి గొట్టము లునందుండి నీటిపైమట్టమునకు అందియుండును. ఇందు ప్రతిబింబముచూపు Reflecting prisms or mirrors గల్గియుంట ఓడలోన ఒకకోననుండి చూచువారు ఈ పెరిస్కోపున కెదుట నుండువాటిని జూడఁగలరు. ఈ పెరిస్కోపు ముఖమును అన్ని దిక్కులకుఁ ద్రిప్పుకొన వీలు కలదు. ఈత్రిప్పుడు సాధనము ఓడయందే అమర్పఁబడియుండి పనిచేయుచుండు నని చెప్పఁ బడినది. (సబ్మెరైన్‌ఓడ చూడుఁడు.) యుద్ధరం గమునపెర్లించిలయం దుపయోగించుచుందురు. చుట్టుపట్లనుండు లేక జరుగుచుండు సంగతులు గమనించుచుండుట కుపయోగింపఁబడుచున్నది.

**ప్రరిహిలియన్**(Perihilion)-(మోషన్ ఆఫ్ ది ఎర్తు చూడుఁడు.)

**పెరుఁగు**- -పాలుకాచి దానికి మజ్జిగఁ బోలు తోడు గల్పిన తోడుకొని పెరుఁగగును. పైత్యశాంతి గల్గించి వీర్యవృద్ధి బలముం గల్గిం

చును. ఇంచుక విరేచబద్ధమును బలపర్చును. గురుత్వముగ జీర్ణమగును. ఊపిరిగొట్టునొప్పి నివారించునని చెప్పఁబడినది. పెరుగు సుప్రసిద్ధభోజనపదార్థము. భోజనాంతమున పెరుగుతోఁకల్పిన యన్నము తిందురు. పెరుగునకు ఉప్పు, జీలకఱ్ఱ, బెల్లము, వర్ణావాలు, వేఁడి నీళ్లు, శంఖభస్మము, శొంఠిపొడుము, సైంధవ లవణము విరుగుడులనియు, పెరుగువలనగల్గిన దుర్గుణముల నివారించు ననియుఁ జెప్పఁబడినది.

ఉదయముననే వచ్చుతలనొప్పి, ఒంటికణత నొప్పి, ఉదయముననే పెరుగుఅన్నము తినిన నివారణ మగునందురు. పెరుగునందు మెంతులను నానించి ఒకరాత్రి నిల్వ యుంచి పుచ్చుకొనిన జిగటవిరేచనములు కట్టునందురు. సగటున పెరుగుఅన్నము నిక్కాఁక నడంచునని చెప్పఁబడినది.

ఆయుర్వేద వైద్యశాస్త్రమున మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణ మాసములందు పెరుగు పుచ్చుకొనుట శ్రేష్ఠమనియు, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, ఆశ్వయుజ, కార్తిక మాసములందు పెరుగు పుచ్చుకొనుట అనారోగ్యకర మనియుచెప్పఁబడినది. పరగడుపునను భోజనమున కాదియందునను పెరుగు పుచ్చుకొనుట అనారోగ్యకర మందురు. ఇది అజీర్తియందు పెరుగుపుచ్చుకొనుటవలెనే యగును. అతిశీతల ప్రదేశములందు వసించుతఁటని మన్యప్రదేశముల నుండుతేఱ్ఱని పెరుఁగు అనారోగ్యకరమందురు. మేహకారకపైత్యతిత్త్వములు కలవారు, నల్లమందభ్యాసమున్నవారు తప్ప తక్కినవారికి రాత్రి కాలముల బెరుఁగు అపథ్యమని చెప్పఁబడినది. పెరుఁగునకు గంజి, ఉశిరికకాయలు, తేనె, పాలు, పెసరపప్పు, మినపపప్పు, సీతాఫలము విరుద్ధపదార్థములు గాన నివి పెరుఁగుతో పుచ్చుకొనరాదనియు, పాలతో పెరుఁగుమజ్జిగలు కల్పి పుచ్చుకొనరాదనియు, విషతుల్యమై పాండువు, కుష్ఠము, సర్పి మొదలగురోగములు గల్గించు ననియుఁ జెప్పఁబడినది.

కొంద రాయుర్వేదవైద్యవిశారదులు పరిశీలనలవలనఅతిసారము, అరుచి దోషము, కార్శ్యరోగము, గ్రహణి, దోషజ్వర (Typhus fever) ఆరంభకాలము (తర్వాత కూడదు), పీనసరోగము, మూత్రకృచ్ఛ్రము, విషజ్వరము, శీతజ్వరములందు పెరుఁ గనుకూలమై యుండు ననియు, అగ్నిమాంద్యరోగము, ఆమజ్వరము, ఉబ్బు, కఫరోగము, కుష్ఠరోగము, దగ్గు, మేహరోగము, వగరుపు, వాపులు ఇఁకవ్రణముల వలనబాధనందుచుండు రోగులకు పెరుఁగు విషతుల్యమై బాధించు ననియు కనిపెట్టియున్నారు. పెరుఁగునందలి నీరు కఫమును, వాతమును నడంచి, జఠరదీప్తిని గల్గించుననియు, ఎండవేళ శ్రమ దాహము తాపముల నడంచు ననియు, దీనిని రాత్రులందు పుచ్చుకొనరా దనియు నందుగ.

మీఁగడతోనున్న పెరుఁగు బలమును, వీర్యవృద్ధిని గల్గించుననియు, గురుత్వముగ నుండు ననియు, జఠరదీప్తి బలముగఁ గలవారు పుచ్చుకొనఁదగుననియు చెప్పఁబడినది. మీఁగడ తీసివేసినపెరుఁగు తేలికగ నుండి, ఆఁకలి నుద్రేకింపించి, యించుకమలబద్ధము, వాతము, అరుచి దోషము గల్పించుననియుఁ జెప్పఁ బడినది. పెరుఁగుపైనుండి తీయఁబడి పెరుఁగుతో సంబంధముగల్గియుండిన మీఁగడ మిశ్రగుణములు గల్గి యుండుననియు, నిక్కాఁకమంటల నడంచి, మేహవ్రణముల మాన్పఁజేసి, వాతముల శమింపఁజేసి, వీర్యపుష్టి బలము గల్గించు ననియు, గురుత్వముగ నుండి యగ్నిమాంద్యమును బలపఱచి కఫరోగము, పైత్యరోగములనే గాక యితరరోగములఁగూడను దేకింపించు

ననియు, దీనికి తేనెయు, అల్లపుమురబ్బాయును పరిహారములనియుఁ జెప్పుదురు. మఱియు వడ కట్టినపెరుఁగు అనఁగా లోననుండునీరు తీసి వేసినపెరుఁగు వాతమును, పైత్యమును శమింపఁ జేసి, దేహపుష్టి నొసంగి, కఫోద్రేకముగల్గించు ననియు, అన్నహితవు నధికపఱచు ననియు నందురు.

సగటున తియ్యనిపెరుఁగు ఇంచుక పైత్య శాంతి గల్గించి నిక్కాకల నడంచి కఫోద్రేకము గల్గించి విరేచనబద్ధము జేయుననియు, పులిసిన పెరుఁగు పైత్యోద్రేకము, అజీర్తి, శ్లేష్మప్రకోప ముల గల్గించుననియు, పెరుఁగుదోషములకు ముఖ్యపరిహారములు సైంధవలవణము, శొంఠి యనియు జెప్పఁబడినది.

ఇంక నీపెరుఁగునకు నీరు కల్పిగాని కల్పక గాని రుద్దినది తక్రి (చల్ల) మనంబడును. చల్ల పెరుఁగుతో సకలసంబంధములు గల్గియె యుం డునుగాన దశవిధ తక్రిములు (చల్ల) చక్కఁగ పరిశీలించి యెరుంగఁదగును.

పాలు తోడువేయ నది తోడుకొన నారం భించి, తోడుకొనుట పూర్తియగులోపున నది "మండక"మను పేరుగల పెరుఁగగును. ఇది దోషముజేయు ననియు, త్రిదోషములను రేఁపు ననియు, మలమూత్రిముల వెడలఁజేయుశక్తి దానియందు కలదనియు, పుచ్చుకొనుట శ్రేయ స్కరము గాదనియుఁ జెప్పఁబడినది.

ఆంధ్రిదేశమునం దంతటను పెరుఁగు నిండ్ల కుఁదెచ్చి విక్రియించునాచారమే కలదు. కాని ఒక్కమచిలీపట్టణము, బందరు Masulipatamలో మాత్రమే"చల్లబజారు"అనుపేరప్రత్యే కవిక్రయశాల కలదు. ఇట్లు ప్రత్యేకముగా చల్ల, పెరుఁగు, పాలు, మీఁగడ, వెన్న మొద లగు పదార్థములను విక్రియించుటకు ప్రిత్యేక విక్రియశాల యేర్పడుట, బుస్సీ, డూప్లే మొద లగు ఫ్రెంచిగవర్నరు, గవర్నరుజనరలు ఈ మచిలీపట్టము స్వాధీనపఱచుకొనినకాలముననే యని తెలియుచున్నది.

Dealon:- 1. ఇవి తయారుచేయుజాతి, 2. ద్రాక్ష నారింజ మొదలగువాని చికిత్సలవం టిదే యీచల్లచికిత్సయు, 3. పచ్చిపాలనుండి వెన్నతీయుకళ, 4. నెయ్యి తయారుచేయువిధ ములు, వెన్న యక్కఱలేకయే నెయ్యి తయారుచేయు విధి.

**పెరుగుంట విఱుగుంటకొఱకే** — (ఆంధ్రిలోకోక్తి).

**పెరు స్టిర్పేస్** — దీనిని బైస్టాక్ (By stock అనియు, బైస్టంపు (By stump) అనియు బైరూటన్ (By root) అనియు కూడ వాడుచుందురు. సంతతివారికి ఆస్తి సంక్ర మించుట యని వాణిజ్య పరిభాషార్థము.

**పెరూదేశపు ప్రభుత్వము**–(Peru) దక్షిణఅమెరికాఖండమునందలి ప్రజాప్రభుత్వ దేశము. ఐదులక్షల యేఁబదివేల చతురపు మైళ్ళ దేశవైశాల్య మనియు, ఏఁబదియైదు లక్షలు జనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

**పెరూ దేశము** —దక్షిణఅమెరికాఖండ ములోని ప్రజాప్రభుత్వ రాష్ట్రము. ఉత్తరమున ఈక్వెడార్ దేశము, తూర్పున బ్రెజిల్ దేశము, దక్షిణమున బొలీవియాదేశము, పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రిమును ఎల్లలు. వైశాల్య మించుమించు 200000 చతురపుమైళ్లనియం దురు. సముద్రిముదరి నిసుక బయళ్ళు కలవు. అవి వేఁడిగనుండును. మధ్యభాగమున ఆండీసు పర్వతములును, వాటిమధ్య లోవలును కలవు. తూర్పుభాగమున గొప్ప మైదానములు గలవు. వీటియందు కొన్ని యరణ్యప్రిదేశములు,కొన్ని పచ్చికబయళ్ళు. ఏమజాన్నదియు, దాని ఉప నదులును వీటినితడుపుచు వర్ధిలఁజేయుచుండును.

సముద్రతీరపుబయళ్ళలో వర్షములు, మెఱపులు, ఉఱుములు ఉండ నేయుండవు. ఈ దేశపు ఆండీస్ పర్వతములందుఅమజాన్నది జన్మస్థానముకలదు. పెరూ దేశమున చింకోనా(క్వైనైను)తోఁట లధికము. తొల్లింట నీ దేశమున వెండిగను లుండెను. ఇప్పుడు చాలభాగము తగ్గిపోయినవి. రాగి, గనులందుదొరకుచున్నది; చెఱకు,పత్తి,కాఫీపైరు చేయఁబడుచున్నది. ఆల్పేక ఉన్నినిచ్చు ఆల్పేక గొఱ్ఱెలమందలు పచ్చిక బయళ్ళయందు విస్తారముగ బెంచఁబడుచున్నవి. ప్రజలు ముఖ్యముగ ఇండియన్ జాతులవారు. ఐరోపాదేశస్థులపేక్షణములు ఈ దేశముపై బడువఱకు బలమును,నాగరికతయుగల్గినప్రభుత్వ మీ దేశమందుండెనఁట. దానిని క్రీ. వె. ౧౫౩౩ స్పానియా దేశ మాక్రమించి చిరకాల మేలెనఁటగాని క్రీ. వె. ౧౮౨౩ ప్రజలు తిరుగఁబడి విముక్తినంది ప్రజాప్రభుత్వమును స్థాపించుకొనిరి. ఇటీవల పెరూ దేశము చిలీ దేశముతో కలహించి, నష్టపోయి ఒక సీమను గోల్పోయెనని చెప్పఁబడినది.

ఈ దేశమునకు లైమానగరము (౧౦౦౦౦౦) రాజ్యకార్య ప్రధానస్థానము. దీని కేడుమైళ్ల దూరమందున్న కాలావోపురము రేవుపట్టణము. లైమానగరపు చర్చియందు దాని ప్రారంభించిన స్పానియా దేశస్థుఁడగు Pirarro (క్రీ. వె. ౧౫౪౧) అనువారి సమాధి కలదు. సముద్రపు మట్టముపై ౧౩౭౨౦ అడుగుల యెత్తుననున్న పాస్కోప్రాంతములనుండి ఇనుపదారి కలదు. పాస్కోపురము ప్రపంచములోని పురములలో నెక్కువ యెత్తగు తావున నున్న పురమని చెప్పఁబడినది. ఆరిక్విపా మరియొక పేరందిన పురము. కుజ్కోపురము తొల్లింటి రాజ్యమునాటి రాజధానిగనుండినపురము. ఇటఆనాటిసూర్యుని దేవాలయముయొక్క పాడు చూడఁ దగినది. తొల్లింట అది చాల గొప్ప దేవస్థానమై యుండనోపు.

**పెరెంథిసీస్ (Parenthesis)** — ఇది యాంగ్లభాషాసాంగత్యమున నాంధ్రభాషలోనికి తెచ్చుకొనిన యొకగురుతు. అదివఱకు చెప్పఁబడినసంగతిలోనుండి అధికావసరమగు నొక వివరణముం దెల్పుటకుగాను, ఆవివరణమున కిరుదెసలందు అది వివరణమని సూచించుటకు మొదట (ఇట్టిగురుతును—కడను ఇట్టిగురుతును) ఇడుదురు. అనఁగా (గురుతు మొదలు) గురుతువరకు గల్గువాత అదివఱకు చెప్పఁబడిన సంగతికిచేరిన ముఖ్యవివరణమని యెఱుంగునది. అది యెక్కువ స్పష్టముగఁ దెల్పునదియని భావము.

**పెరోటైన్ ప్రింటింగ్ (Block printing by Machine)**--యంత్రసహాయమున చేయు అద్దకము. (కలంకారిపరిశ్రమ చూ.)

**పెర్నెలిజమ్ (Parnalism)**— క్రీ. శ. 1846-91 ఐరండు దేశీయుఁడగు చార్లెస్ స్టూవర్టుపెర్నెల్ అనువానిరాజకీయసిద్ధాంతము. పార్లమెంటుసభ్యుఁడుగ నుండి ఐర్లండు దేశముకు హోమురూలు నార్జించుటకు శ్రీవ్రకృషి ల్పనదీనుఁడు.

**పెర్మిట్**— వాణిజ్యసంబంధ పరిభాష యందు "అంగీకారపత్రి"మనియు, "అనుమతి నొసంగినకాగిత" మనియు నర్థము.

**పెసరచెట్టు (పెసలచెట్టు)** — పెసలు లేక పెసరగింజలపప్పునకై పెసర పైరు చేయఁబడుచున్నది. పెసర ప్రసిద్ధ భోజనపదార్థము. పసరజాతియందు పచ్చపెసలు, నల్లపెసలు, డిల్లిపచ్చపెసలు, అడవిపెసలు, కొమ్ముపెసలు, పిల్లిపెసలు అను ముఖ్య జాతిభేదములు గన్పడెడిని. ఇందు దేశవాళీ పచ్చపెసలు ఉత్తమ జాతిగను, డిల్లిపచ్చపెసలు అత్యుత్తమజాతిగను ఎన్నఁబడుచున్నవి.

దేశవాళీ పచ్చపెస లాకుపచ్చరంగు గల్గియు, నల్లపెస లాకుపచ్చయుం దించుక నల్లరంగు కలిసినరంగు కల్గియు, ఢిల్లీపచ్చపెసలు పసుపుపచ్చరంగు కల్గియు నుండును. లాటిన్భాషయందు దేశవాళీ పచ్చపెసలకు Phaseolus mungo (ఆంగ్ల. Green Gram) అనియు, నల్లపెసలకు "Phaseolus Radiatus" అనియు పిల్లిపెసరకు "Phaseolus Tribolus" అనియు పేర్లు కలవు. సంస్కృతమున ముద్గః అని పెసర సామాన్యమునకును, హరిముద్గః అని దేశవాళీపచ్చపెసరకును, హరిమంథకః, కృష్ణముద్గః అని నల్లపెసరకును ముద్గపర్ణీ, ముద్గష్టః, ముద్గష్టకః, కాకముద్గా, వనముద్గా, కులీనకః అని అడవి పెసరకును పేర్లు గానవచ్చెడిని. మఱియు నీయడవిపెసరకు కారుపెసర యనియు, కాకిపెస లనియుఁ గూడ వాడుకనామములు కొన్నిసీమలందు కలవు. పిల్లిపెసరకు పేర్లు గానరావు. తక్కిన పసుపుపచ్చరంగు పెసరజాతికి దేశవాళీ పచ్చపెసర పేర్లే ఆయా దేశములందువాడుకయందున్నవని తెలిసెడిని.

దేశవాళీ పచ్చపెసలును ఢిల్లీపసుపుపచ్చ పెసలును పప్పుజాతులలో శ్రేష్ఠమనియు, మేహశాంతి, పైత్యశాంతి గల్గించుననియు, రక్తపైత్యమును కఫదోషమును శమింపఁజేయుననియు చెప్పఁబడినది. పిదప శ్రేష్ఠమగునది నల్లపెసరజాతి. ఇది పైగుణములకుఁదోడించుక వాతమును, శీతపైత్యమును రేపునని చెప్పఁబడినది. కొమ్ముపెసరయందు పైత్యశాంతియు, బలము, వీర్యవృద్ధి, యించుక చలవగుణములును, అడవిపెసరయందు చలవజేసి పైత్యశాంతి, మేహశాంతిగల్గించు ననియు, తాప మడంచుననియు, శరీరమునందలి నులిపురుగులఁ జంపుననియు, శుక్లవృద్ధి గల్గించుననియు ఇంచుక కఫోద్రేకముఁ గూడఁ జేయుననియుఁ జెప్పఁబడినది. పిల్లిపెసర పైత్యతత్త్వము గలవారికి చాల అనుకూలమనియు, మేహశాంతి, పైత్యశాంతి గల్గించి తలతిప్పు, వికారము నడంచి, దేహబలము, వీర్యపుష్టి జేసి చలవ జేయుననియుఁ జెప్పఁబడినది.

పెసరజాతికి ఉత్తరేణిచెట్టు(తెల్లది శ్రేష్ఠము) సమూలము కాల్చినబూడిదయు, తేనె, నువ్వులనూనె, అల్లము, పంచదార, పుల్లనిమజ్జిగ విఱుగుడులనియు, పప్పుపైతొక్కయందు పైత్యశాంతియు, జీర్ణశక్తియుఁ గలదనియు, అధికమైన నించుక కడుపుబ్బరము గల్గించుననియుఁ జెప్పఁబడినది.

**పెసరవ్యవసాయము**—ఇది మినుములనుబోలినపంట. భరతదేశపుపంట. పప్పుజాతి. ఆఫ్రికాలోని నైలునదీతీరములందుఁగూడ పైరు చేయబడుచున్నది. పెసలందు పసుపుపచ్చ, ఆకుపచ్చ, నల్లరంగుల పెసలు కలవు. ఉత్తరహిందూస్థానమునందు పసుపుపచ్చపెసర వ్యవసాయము చేయఁబడుచున్నది. ఆంధ్రదేశమున సర్వసాధారణముగఁగలది ఆకుపచ్చరంగు పెసజాతి. నల్లపెస లధమపుజాతిగ నెంచఁబడుచు నరుదుగ వ్యవసాయము చేయఁబడుచున్నది.

సర్వసాధారణముగ పల్లపువరిపొలములందు పల్లపుగోధుమలందు ఆపంటలుకాగానే పెసలు చల్లుదురు. ఇతరములగు పంటలతోఁ గూడ గల్పి తొలకరియందే జల్లుటయుఁ గలదు. నల్లరేగడి భూములందుప్రశస్తముగ పెరగును. సంవత్సరమునందు 3౦ దుక్కులకన్న నధికవర్షములు పడని సమస్తప్రదేశములు పెసరవ్యవసాయమున కనుకూలములనియు, అంతకెక్కువ వర్షించుతావుల నీవ్యవసాయము నష్టముఁ గల్గించు ననియు, చేనుపూతపట్టు నదనున వర్షముపడిన నాపంట నష్టమనియు, పరిశీలనలవలన తేలినది. ఏసంవత్సరమునం దైనను ఈపంటకాలమున నధికవర్ష

ములు పడిన ఈపంట నష్టమని అనుభవజ్ఞులగు రైతు లనుచున్నారు. ఎకరమునకు 15 మొదలు 20 పౌనులవఱకు విత్తులు చల్లుదురు. గొంగళి పురుగు, అధికవర్షములు లేని మంచికాలమున ఎకరమునకు 300 మొదలు 600 పౌనులపంట పండును. పెసరచేను వేయుచుంటవలన భూమి బలపడునని చెప్పఁబడినది. (మినుముల వ్యవసాయము చూడుఁడు.)

**పెస్టొలోజీ** (Pestology)— బాధాకరమైన చిన్నపురుగులు (Pest)గూర్చి వివరించు శాస్త్రము

**పేకాట (చీట్లాట)**— ఈయాటనే చీట్లాట లేక చీట్లపేకయాట యనియుఁ గూడ వాడుక కలదు. ఇం దున్నవి నాల్గురంగులు.

నాల్గు రాజుల బొమ్మలు, నాల్గు రాణుల బొమ్మలు, నాల్గు మంత్రుల బొమ్మలు అని మనము పోల్చు చున్నాము. ఇఁక నాపైనున్నవి ఒకటి మొదలు పదివఱకును చుక్కలు. 1 హార్ట్సు (Hearts), 2 స్పేడ్సు(Spades), 3 డైమండ్సు (Diamonds), 4 క్లబ్సు (Clubs) గా గుర్తింపఁ బడుచున్నవి.

ఈయాకృతులను సృష్టించుట తొల్లి 1390 లో ఫ్రాన్సు దేశములో జరిగినట్లు తెలియుచున్నది. అప్పటి ఫ్రాన్సురాజు ఛార్లెస్ VI (Charles VI). ఆరాజునకు ఆకాలమున సంఘటిల్లిన జాయావియోగముచే పలుమాఱు సంభవించు చుండెడి Fits of Meloncholy (మనసున జీర్ణించుచుండిన దుఃఖకారణమున సంభవించెడు) మూర్ఛలవలన బాధ పడుచుండుట చూచి, రాజమిత్రుఁ డొకఁడీయాటను గల్పించెను. ఈయాటలో నున్న నాల్గురంగులలో నాల్గు ప్రధానచిత్రములును ఆనాఁటి నాల్గువృత్తులను తెలియఁజేయుటకును, తన్మూలమున రాజుమనసు త్రిప్పుచు, అతని దుఃఖము మరల్పఁ బ్రయత్నించుటకును, ఆ రాజమిత్రుఁడు సంకల్పించెనని తెలియుచున్నది.

(1) హార్ట్సు(Hearts)ఆకీను-ఇదిహృదయకోశాకృతి గలది. ఈయాకృతిగల రూపము చిత్రించి, మతాచార్యుని ముఖరూపముతో తయారు చేయఁబడినది. అనఁగా హృదయమునందు మత మున్నదని భావము

(2) ఇస్పేటు (Spades-spears)- ఈ చిత్రము మొట్టమొదట స్పీయర్స్ అనియే వాడుకయం దుండెను. ఇది మిలిటరీ, నొబిలిటీలను తెలియఁజేయుటకు సంకల్పింపఁ బడెను. ఈ చిత్రమునందుఁ జూపఁబడిన చుక్కయొక్క ఆకృతి ఈటె(Spear) యాకృతి. ఆకాలము నాఁటి మిలిటరీ (పటాలము) గుర్తును సూచించుచుండ, చిత్రమునందున్న ముఖాకృతి Nobilityని (ఘనతగల మండలాధిపులను)స్ఫురింపఁ జేయుచున్నది. అట్లగుటనే ఆముఖమున వీరత్వమును, ఘనతయు సూచింపఁ బడుచున్నవి.

స్పేడ్, స్పీయర్ అనుశబ్దము లుచ్చరించుటకు సౌలభ్యము చాలనందున, మొదట 'ఇ' అను నొకఅచ్చును జేర్చి, ఇస్పేటు అని యుచ్చరించుటయె ఇప్పటివాడుకకు కారణము. (ఇట్టి పరిణామరూపమే (Schcol) ఇస్కూలు.)

(3) డైమండ్సు (Diamonds)—దీనినే ఉచ్చారణసౌలభ్యముకొఱకు డైమాను అని యనుచున్నారు. ఈచిత్రమునందు వజ్రాకృతిగ నొకచుక్కయు, వజ్రములవర్తకులయొక్కయుఁ లేక జెనరల్ (ట్రేడ్స్మెన్) సాధారణవర్తకుల యొక్కయు రూపమును చిత్రించినాఁడు.

(4) క్లబ్సు(Clubs)-దీనినే మనవారిపుడు కళావరు అనుచున్నారు. ఈ క్లబ్స్‌నే (Picks) పిక్స్ అని కూడా నందురు. ఈయాకృతి కర్షకుల చేతనుండు ఒకవిధమగు పనిముట్టును బోలియుండును. కాని, ఈయాకృతి తొల్లి క్లోవరులను

నొక సువాసనగల పొట్టి గడ్డియాకు ఆకృతిని బోలియుండెను.

ఆస్ట్రియాలో నిప్పటికిని వాడుకలో నున్న కర్షకుల పనిముట్టుయొక్క ఆకారమును బోలియున్న ఈశ్లబ్బు అనుదానిని ఇప్పటియనవారు కళావరు అనుపేర వాడుచున్నారు.

ఇట్టి నాల్గు వృత్తులను అనఁగా(1)మతాచార్యుఁడు, (2)సేనానాయకుఁడు, (3)వర్తకుఁడు, (4) కర్షకుఁడు నను నాల్గురూపముల స్ఫురింపఁజేయుచు, నా రాజమితుృఁడు సృష్టించినాఁడు.

మనవా రాయా రంగులలో నున్న చిత్రము లయందు (1) వర్తకునిచిత్రము చూచి, రాజనియు, (2) మతాచార్యునిచిత్రము చూచి రాణి యనియు, (3) సేనానాయకునిచిత్రము చూచి వజీరు లేక మంత్రియనియు, (4) సేద్యగానిచిత్రము చూచి రా జనియు నిట్లు పొరపడి, వేర్వేఱుపేర్లచే సంకేతము లేర్పఱచుకొని మనవారిలోఁ గొందఱు విలాసముగఁ గాలము పుచ్చుటకుందును, మఱికొందఱు పందెముల నొడ్డుచు, తమతమఆస్తులు గోల్పోవుచు, వ్యసనములలోఁబడి చెడిపోవుచున్నారు. ఈపేకాటయే జూదముగమాఱి సప్తవ్యసనములలో నొకటియై కుటుంబములు కూలుటకుఁ గారణ మగుచున్నది.

**పేఁగుచుట్టమా? పెట్టుచుట్టమా?**--(ఆంధ్రలోకోక్తి.)

**పేటకగోత్రము**-(కుండినగణము చూ).

**ప్లేటెంటు లెదర్ (Patent leather) జోళ్ళు**— చాలకాలముక్రిందట కాలిజోళ్లు ఆకారములు మాఱుచుండిన కాలమున, నాంగ్లసీమలందు కాలిజోళ్ళుచేయుట కనుకూలించు నొకమంచిచర్మమునకు నల్లరంగు పూసి, నిగనిగ మెఱయునట్లు చేసి విక్రయించుచో నారహస్య మితరు లెఱుంగకుండునట్లు గోప్యముగ నుంచి దానిని ప్రభుత్వపుశాఖయందు పేటెంటు (Patent) చేయించిరి. ఇందువలన నితరు లీవిధానముప తోలు తయారుచేయరాదని రక్షణ గల్గించుకొని యుండిరి.

ఆతోలుతోచేసిన కాలిజోళ్ళు నిగనిగ మెఱయుచు, మంచివెలలకమ్మఁబడుచుంట పెక్కంద్రు వేర్వేఱువిధముల పరిశీలన లొనర్చుచు, తమతమ విధానమున నల్లరంగునిడి మెఱుఁగు గల్గించి పెక్కువిధానముల నాతోలుమచ్చునవే చేసి పాదరక్షలుగ నొనర్ప మొదలిడిరి.

కాలానుగుణముగ నీపెక్కు నల్లని నిగనిగ మెఱయు చర్మసముదాయ మంతయు పేటెంటు లెదర్ (Patent leather) అను పేరునఁ బరఁగుచు, ప్రభుత్వ కార్యస్థానమున పేటెంటు చేయఁబడనివయ్యు, రక్షణ నందినట్లు తెల్పు పేటెంటుపదమును పేరుగ (నామమాత్రముగ) గల్గి, నిగనిగలాడు నలతోలుతో చేయఁబడిన పాదరక్షలకు "పేటెంట్ లెదరు జోడు" లని వాడుక వ్యాపించెను.

నేఁటికి నట్లె యున్నది. ఇప్పు డాపేటెంటుపే రొకవర్తకపు గురుతుగ గ్రహింప నగును. (Trade mark).

**పేట్రన్ సెయింట్సు**—(క్రైస్తవ సత్పురోధాభిమానులు చూడుఁడు.)

**పేట్రినిజమ్** (Petrinism)-సెయింటు పీటరనువారియొక్క క్రైస్తవతత్త్వసిద్ధాంతము.

**పేట్రిమొనీ** (Patrimony)— ఫ్రెంచి భాషాజన్యపదము. ఏదియేని ఆస్తి పైతృకసంబంధ మగువారసత్వరీతిని సంక్రమించుటయును, ఏదియేని ధర్మాదాయము పూర్వాచారము ననుసరించిశిష్యపరంపరకు సంక్రమించుటయును, లేక మరణశాసనపూర్వకముగ చెందుటయును విధించుసిద్ధాంతము.

**పేట్రియాటిజమ్** (Patriotism)— స్వదేశమును ప్రేమించుచు ప్రజాసంఘమునకు

వలయు స్వాతంత్ర్యమును సంపాదించుట స్వసౌఖ్యమును, ఐశ్వర్యమును త్యాగముచేసి ధీరుఁడై పనిచేయు సిద్ధాంతము.

**పే డే** (Pay day) — వాణిజ్య సంబంధపరిభాషాపదము. పైసలాతీ దినము. Stock exchange పైసలాతీలకు నిర్ణయింపఁబడినదినము. వర్తకసంఘములందు లెక్కల బరిష్కరించుకొనుదినమునకును ఈపేరు వాడెదరు. పనివాండ్రకు జీతములు, లేక కూలుల నిచ్చుదినమునకును ఈపేరు వర్తించును.

"Pay" అనిన చెల్లించుట కర్థమగును. పరిష్కరించుట యనియర్థము. ఎవ్వరికి సొమ్ము చెల్లింపఁ బడవలయునో వారికి "Payee", ఎవ్వరు చెల్లింతురో వారికి "Payer" అనియు పేరులు. ఒక Bank లోనికి ఒక Customer సొమ్ము చెల్లించుతఱి, ఆసొమ్ము మొత్తమును తప్సీల్లు వ్రాసియిచ్చు అచ్చుఫారముపత్రమునకు "Paying in Slip" అని యందురు. తన కంగీకారము లేకయుండియు విధి లేక బలాత్కారముగఁ జెల్లింపవలసివచ్చి చెల్లించుటకు "Payment supra under Protest" అనియు, "Payment under Protest" అనియు నను చున్నారు.

**పేథోలోజీ** (Pathology) — రోగపరిశీలనాశాస్త్రము లక్షణముల బరిశీలించి రోగనిర్ణయము చేయువిధానము. ఇది ఆంగ్ల వైద్య సంబంధమని యెఱుంగునది.

**పేదవానికోపము పెదవులకుచేటు**— (ఆంధ్ర లోకోక్తి)

**పేనపాస్తలిన గోత్రము**—(జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.)

**పేనారాజభవనము**(Pena Palace)— "గాలిలోమేడ" యని లోకోక్తికలదు. అనఁగా గాలిలో తేలుచు నంతరాళమునం దుండు భవనమని యర్థము. నిజముగాని మాయాకథనముల కీఉక్తిని వాడుచుందురు. కాని, నిజముగ నట్టిదికాకున్నను, అట్లుగన్పించు విచిత్రభవన మొకటి కలదు. పోర్చుగీసుదేశమున, లిస్బను నగరమునుండి ఉత్తరదిశగా పదునేడు మైళ్ళ దూరమున సింత్రాపట్టణమును, వెనుకనే సముద్రపునీటిమట్టముపై ౧౭౦౦ అడుగుల యెత్తుగల కొండలవరుసయుఁ గలవు. దానిపశ్చిమపుకొన సముద్రములోనికి జొచ్చుకొనిపోవుట ఆదికాలపుజ్యోతిషవేత్తలు దానిని Great Promontary అని వాడియున్నారు. అక్కాలపు అరబ్బులు చంద్రునిపర్వత మనిరి. దానియందెత్తైన తావున నీపేనాప్రాసాద మున్నది. దానినుండి చూచిన దక్షిణముగా టేగసునది, లిస్బనునగరము, వాయవ్యదిశగా మాఫ్రా విశాలమైదానమును, అవ్వలి అట్లాంటిక్కు మహాసముద్రమును గాన్పించెడిని. ఆది నిత్తావును ౧౧౪౭లో పోర్చుగీసురాజ్యస్థాపకుఁడైన డాన్ అల్ఫొన్సో హెన్రి క్వీసుభూపతి మూరులనుండి లాగికొని రాజ్య మేర్పఱచెను. క్రీ. వె. ౧౫౦౧లో అప్పటి ఒకటవ మాన్యూ అల్ భూపతి, ఒకమఠమును గట్టించి, క్రైస్తవసన్యాసుల కిచ్చెను. పిదప Ferdinand of Saxe-coburg Gotha (Prince Consort)గా రీపేనారాజభవనము నొకజర్మను నిర్మాతపరిముఖమున నిర్మింపఁ జేసెను. ఈయనశిలావిగ్రహము ప్రక్కనున్న వేఱొకశిఖరమున స్థాపింపఁబడినది. లోన దేవస్థానము, భూపతి వసించు గదులు, నేరస్థులుండు బందిఖానాకొట్లు, చుట్టు తిరుగుచు మీఁదియంతస్థుల కెక్కు చంద్రకాంత శిలాఫలకనిర్మితసోపానపంక్తులు, గొప్ప పనితనము ప్రదర్శించు కిటికీలు, తలుపులు, చక్కని క్రిందిచప్టాలు కలవు. ఒకగదియందొక

భూపతిపిశాఖ మున్నదని కావలివా రనెదరు. గోడలపై మూరులకాలమునాఁటి చిత్రపువన్నె పెంకులతో విగ్రహ చిత్రములు గచ్చులో బిగింపఁబడియున్నవి. అనాఁటిసామాను లల్లే కొన్ని యుంచఁబడినవి.

ఇట్టి ప్రాసాదమునకు 'Castle in the air' అను పేరు కల్గెను. ఈ వింతపేరు గల్గుటకు కారణము గలదు. క్రింది పట్టణపరిసరసీమ తేమ గల పల్లపు ప్రదేశ మగుట, నెండచే నేర్పడిన నీటియావిరి దట్టమై, రాత్రులందలి శీతల వాయువులచే తెల్లని మేఘములుగ నేర్పడి, కొండలను బూర్తిగఁ గప్పివేసి మఱుగుపఱుప, మేఘములపై గాలిలో నల్లలాడుభవనము వలె దూరమునుండియే గాక, దరి కేగినవారికిని, కొండపై కెక్కుచున్నవారికిఁ గూడఁ గన్నట్టు చుండుటం జేసి దీని కీపేరు గల్గెను. కొండ నెక్కుటకు బాటలు కలవు. దారి యరణ్యమయము. భవనమునుండి చూచిన మూరులనాఁటి వేలోక దుర్గము మంచుగుండా నీడవలెఁ గాన్పించెడిని.

**పేప (బెత్తము) చెట్టు** — అంగ్ల. Rattan (cane) Plant.

పేపచెట్టునందు లెక్కలేని జాతి భేదము లున్నను లెక్కింపఁబడలేదు. దీని బెత్తములతో కుర్చీలు, చేతికఱ్ఱలు మొదలగునవిచేయఁబడును. కొన్నిచోట్ల పెట్టెలు, బుట్టలు, తట్టలు, చేతి కఱ్ఱలు, గొడుగుకఱ్ఱలు చేయఁ బడుచున్నవి. మలాకా నగరముకడ నుండుజాతి చేతికఱ్ఱలకు శ్రేష్ఠమందురు. మలయాళి దేశపుజాతి మిగుల వలమగుజాతి బెత్తపుకఱ్ఱల నిచ్చును. సన్నపు బెత్తముల నిచ్చుజాతి పేముయొక్క పైనార పెచ్చుతో కుర్చీలు చేయుదురు. ఇంక నెన్నియో యుపయోగములు కలవు. పేపచెట్టునందు అంప మునుబోలిన పండ్లు ముండ్లవలె పొదవై పెరిగి అల్లుకొనును గాన తోఁటలకు కంచెలుగ పేపచెటు నాటెదరు. నల్లరేగడిభూములందు బలమైన భూములందు పేపచెట్లు చక్కఁగా పెరుగును.

పేపపండునందు రుచిగ నుండి, అగ్నిదీప్తి నిచ్చి, దాహము నడంచి, ఇంచుక వాతమును రేపుగుణముగలదనియు, పేపఆకుచిగుళ్ళయందు కఫపైత్యముల నడంచి ఇంచుక వాతము చేయు గుణము కలదనియు, పేపజాతికి సజ్జాఖారము విఱుగుఁ డనియు నందురు.

**పేపర్ షెల్ బాదము**-(బాదము చూ).

**ప్యేరలెల్సు (డిగ్రీలు)** Parallels- భూగోళముయొక్క పటమునందలి అడ్డుగీతలు (తూర్పు పడమరల కుండునవి). ఇవి భూమధ్య రేఖకు Parallel గా నుండున వనిభావము. (డిగ్రీలు చూడుఁడు).

**పేరాఫిన్** (Paraffin)—ఇది హైడ్రో కార్బన్ జాతులలోనిది. ఘనీభవించి (గట్టిపడి) యుండును. పెట్రోలియమ్ ఉన్న తావులందును రాతిసబొగ్గు ఉన్నతావులందును దొరకును.

కొవ్వువత్తులు చేయుట కుపయోగించు చున్నారు. అగ్గిపుల్లలు చేయుటకును, Water proof గుడ్డలు చేయుటకునుగూడ నుపయోగింతురఁట.

**ప్యేరాసైటు జంతువులు**-ఇతరజంతువులపైఁ గాని, మనుష్యులపైఁ గాని ఆధారపడి అంతకాలముగాని, కొంతకాలముగాని జీవించునట్టి పేలు, దోమలు, నల్లులు మొదలగు చిన్న జంతువుల కీపే రిడియున్నారు. ఇట్లే ఏపనిపాట్ల కుపయోగింపక స్వాంతంత్రజీవనములేని పోషితులను హేళనగా "పేరాసైట్సు" అను నాం పదముచే వాడుట కలదు. ఇందుఁ గొన్ని జంతుజాతికిఁ జెందినవిగను, మఱికొన్ని వృక్షజాతికిఁ జెందినవిగను ఉన్నవి. ఒకచెట్టుపై

మొలచి దానిశరీరమువలననే బ్రతుకు బదనిక మొదలగుచె ట్లీజాతికిఁ జెందినవి. ఏలిక పాములు, బోదకాలుపురుగులు, కొంకిపురుగులు మొదలగునవి ముఖ్యముగ నిట్లే శరీరములో మనుచుండును. (అంటువ్యాధులు చూడుఁడు. సూక్ష్మజీవులు చూడుఁడు).

**పేరింటచెట్టు**— లా. Corchorus olitorius. దీనినిగూర్చి సరిగా తెలియకున్నది. కొన్నిమాసములు జీవించు కూరచెట్టనియు, దీనిని కొందఱు కూర వండుదు రనియు, ఇది మేహశాంతి, పైత్యశాంతి గల్గించు ననియు, దీనియాకు నెండించి చూర్ణము చేసి నేతితో వేయించి లోని కిచ్చిన జీర్ణశక్తి యధికమగు ననియు, దీని గింజలరసమునందు సర్పవిషము హరించుగుణమును, గింజలచూర్ణమునందు కుష్ఠ రోగము నడంచుగుణమును, చెట్టునందు బుద్ధి బలమిచ్చి శిరోవాతము నడంచుగుణమును గల దనియు నందురు.

**పేరీ**— పారశీకజరథుస్త్రధర్మమున హిందువుల అప్సరసవంటి దయ్యి అప్సరస కానిదియు, స్వర్గమున కేఁగ నర్హత లేనిదియు నగు నొక తెగవారు.

పేరీలు పిశాచములకన్న నెక్కువయై అప్సరసలకుఁ దక్కువయై రెంటింటికిని మధ్యజాతిగ నెన్నఁబడినవి. సుందరమును, నిరపాయకరమును నని చెప్పఁబడినజాతి.

**పేరుశిష్ట కుల గోత్రము**—ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు).

పేరుశిష్ట (పెరిశిష్ఠ పైరుశిష్ట) కులగోత్రము. ఏకార్షేయ (౬) గోత్రము. సంస్కృతగోత్రము బృహదశ్వస, బృహదశ్వగణము. ఆపస్తంబయ జుశ్శాఖ. ప్రమాణగ్రంథ మాద్యప్రవరఖండ. పాణికేశుఁడు దేవత. భార్య సర్వాంబ. గంగా తటము తపస్థానము. సర్వసరస్సు తటాకము. జపము అర్బుదము. దీపములు ౫౦. క్షేత్రసంఖ్య ౨౦. ముత్యములు దానము. గోత్తి పెరుఁగు వర్జనీయము.

**పేరూరు (పశ్చిమ లేక మలెచిదంబరము)**— పేరూరుప్రాంతపు వరంగమాను నుండి ద్రావిడులు మన్నాంధ్రదేశమున కరుదెంచి, ఇప్పటి తూర్పుగోదావరీమండలములోని పేరూ రను గ్రామనిర్మాణ మొనర్చుకొని ఆంధ్రులలోనివారుగ పేరూరుద్రావిడు లనం బడువారినిగూర్చి యెఱుంగుదుము. (ద్రావిడ బ్రాహ్మణులు చూడుఁడు). ఆయఱవ(ద్రావిడ) పేరూరు తొల్లింటి కొంగుదేశము లోనిది. కోయంబత్తూరునకు పశ్చిమముగా నాల్గుమైళ్ళ దూరమున, నోయాల్ (పూర్వపుపేరు కాంచీ) నదీతీరమున తొల్లింటి పిప్పలారణ్యమునను న్న శివక్షేత్రము. కొంగుదేశ ముండినతఱి నేలిన మొదటినృపతి విక్రమ (కొంగు) చోళభూపతి క్రీ. శ. ౧౦౦౪-౪౫ మొదటివాఁ డనియు, ఆతఁడే యిచటి శివాలయనిర్మాత యనియు వాడుకలు కలవు. దేవాలయము ౯౦౦ సంవత్సరములనాఁటి దని శాస్త్రవిదులు పోల్చి యున్నారు. అదివఱకే యుండిన ఇచటిశివలింగ మొక పశువులపాక (అఱవమున పట్టి) యం దుంట ట్టరుఁ డని పేరయ్యెనఁట. మరకత వల్లీదేవి అమ్మవారు

పేరూ రనిన పెద్దగ్రామ మనియర్థ మఁట. దీని కింకను వేర్వేఱుకాలములందు అధిపురము లేక అధిక్షేత్రము, కామధేనుపురము అను పేరులు వాడుకయం దుండె నందురు. ఇప్పుడు పశ్చిమ చిదంబరము (కొండ లైదింటినుండి), మలైచిదంబరము అనంబడుచున్నది. ఈయూరనే వేఱుతావునఁగల కనకసభ యనఁ బరఁగు నొకమంటపమున నటరాజస్వామియొక్కయు,

శివకామినీదేవి యొక్కయు విగ్రహములు పూజింపఁబడుచున్నవి.

ఇటనే పరమేశ్వరుఁడు నృత్య మొనర్చె నందురు. ఇది గొప్పపనితనము ప్రదర్శించు స్తంభములపై నిర్మింపఁబడినమంటపము. చూడఁదగినపనితనముగల చిత్రము. కాంచీ(నోయాల్) నదియందు స్నానతీర్థములు కలవు. ఇందువేయబడిన యస్తులు (ఎముకలు)శిలీభూత మగునఁట. ఎముకల యాకారమేగలతా ళ్ళిందు కాననగుచున్నవి. నేటికిని మృతులయస్తు లానదియందు భక్తితోఁ బడవైచుచుందురు.

ఇచటఁగల వేదకైలాస మనుదేవస్థానప్రాంతమున, రేడియమ్ లోహము భూమియందు కలదని యనుమానించుచున్నారు. ఈ దేవస్థానమునందలి శివలింగము బ్రహ్మచే ప్రతిష్ఠింపఁ బడినదందురు. ఇటనే గల బ్రహ్మకూపము, పవిత్రతీర్థము(నూయి), దీనిజలములలోఁబడినలోహపు నాణెములు ప్రకాశవంతము లాయెడిని. జలకములాడిన మనస్సున కుత్సాహము గల్గుటచే క్రమముగ శరీరము నిరోగమై, తేజోవంత మగునందురు. ఇట పేడ ఎన్నాళ్ళు మురగఁ బెట్టినను కుళ్లి చెడదందురు. ఒకతాటిచెట్టు ఇట నున్నది. అది చావులేని దనుచున్నారు. అప్రక్కనే గల చింతచెట్టు, చావులేకపోవుటయే గాక,విత్తనము నిర్వీర్యమై మొలక లెత్తదని చెప్పుచున్నారు. అత్తావుననే గల బ్రహ్మ (యాగ) కుండము నందలి విభూతి స్త్రీలవంధ్యత్వము బాపుగుణము కలదిగ నెంచఁబడు చున్నది. (తిరువెలంగాడు చూడుఁడు. చిదంబరము చూడుఁడు).

**పేలయోంటోలోజీ** (Palaeontology)- ఖనిజము లేక భూమిలోనుండితీయఁబడిన Fossil ఓషధులకు, జంతువులకు సంబంధించిన పరిశోధనావిధానము. ఓషధులకు సంబంధించినదానికీపేరే Palaeo botany అనియు కలదు.

**పేలస్టైన్ దేశము**- (పాలస్తీనా దేశము చూడుఁడు.)

**పేసివ్ బాండ్సు** (Passive bonds)- వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ప్రత్యేకముగ నప్పటప్పట వడ్డీనీయక అంతకు నొకేసారి అదనపుమొత్తముగ తీర్మానముగల పత్రములకు ఈపేరు వర్తించెడిని. అట్లే లాభమునీయక నిల్వయుంచి విలువ నెక్కువచేయు వాటాలకు Passive Share అనియెదరు.

**పైంగలగోత్రము**—(హారిత ఉపగణము చూడుఁడు.)

**పైంగలాయున లేక పైగలాయున గోత్రము**—(గర్గ ఉపగణము చూడుఁడు.)

**పైంగలాయునిగోత్రము**— (జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**పైజానగరపు టొరగినగోపురము**— ఇది మధ్యకాలములందు ప్రపంచమందలి గొప్ప వింతలలో నొకటిగ పరిగణింపఁబడినది.

పైజానగరము ఇటలీదేశమున సుప్రసిద్ధమైనది. టిస్కాన్ కొండలయందు ఆర్నోనదీ తీరమున నున్నది. ఇచట నొక కెతీడ్రల్ కలదు. దాన గంటనుంచుటకు నిర్మింపఁబడిన గోపురమే ఒకదెస కొరగియుంట, "పైజానగరముయొక్క ఒరగిన గోపుర"మని పేరంది యున్నది. ఈకట్టడము లన్నియు మార్బల్ రాతితో నిర్మింపఁబడియు Lombard Gothic architecture అను పనితనముచే నొప్పుచున్నది. దీని నచటివారు Campanile అని యనెదరు. ఆంగ్లమున Bell Tower అని పేరు. ఈ మార్బెలునకు "కరారామార్బె!" లనియెదరు. దీనిరంగులు ఉదయమున, సాయంతనమున, ఎండవేళ, వెన్నెలయందు వేర్వేరై కన్పించును.

పెక్కు సంవత్సరములు గోపుర మొకదిక్కు

కొరగియుంట పోల్పలేక పలుపలువిధములుగఁ దలంచుచుండిరి. కాని ఇటీవల పునాది త్రొక్కి-వేయుటవలన యొరగిపోయిన దని తేలినది. కాని కట్టడము బలవత్తర మగుట నంతయు నొకేరీతి నొరగినది. కాని యెచ్చటను శిథిలము కాలేదు. ఒరగుట స్పష్టముగాఁ గాన్పించును. కొంతకాలము పైజానగరమున వసించుచుండిన Galileo పరిశీలకుఁడు ఈఒరగిన గోపురముననే తన Gravitation పరిశీలనలను నడుపుచుండు వాఁ డఁట.

**పైడవ గోత్రము**—(వశిష్ఠగణము చూ.)

**పైడికులగోత్రము**-(ప్రహీణికుల చూ).

**పైఁడిపాటి వేంకటనృసింహకవి**— ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రము. శతమర్షణగోత్రము. తండ్రిపేరు లక్ష్మీపతి. తల్లి వేంకమాంబ. నెల్లూరుమండలములోని వాసము. ఇది కందుకూరిసీమలోనిది. రచించినది నృసింహవిలాస మను ప్రబంధము.

**పైఁడిమఱ్ఱి వేంకటపతికవి**—ఆంధ్రకవులలో నాధునికుఁడుగపరిగణింపఁ బడినవాఁడు. నియోగిబ్రాహ్మణుఁడు. తండ్రిపేరు చిన్నపర్వతరాజు. పెద్దపర్వతన్న, బోడిపర్వతన్న, తిరుమలన్న, కేశవన్న యనువారలు సోదరులు. కృష్ణరాయభూషణుఁ డనుబిరుదము కలవాఁడు.

రచించినది చంద్రాంగదాచరిత్ర మనుప్రబంధము. ఈకవితండ్రి పర్వతరాజు. తాత కేశవరాజు. ముత్తాత రామరాజు గా చెప్పఁబడినది.

**పైతాగరస్ సూత్రము**— దీని నాంగ్లమున Pythagoras Theorem" అని యెదరు. ఇది పాశ్చాత్యుల రేఖాగణితశాస్త్రమగు జియోమిట్రీ సంబంధమగు సూత్రము. దీనిని వివరింపకపూర్వము పైతాగరస్ నుగూర్చి వివరింతుము గాక.

ఈయన క్రీ. ము. ఆఱువందల సంవత్సరములక్రిందటివాఁడని యనుచున్నారు. తనశిష్యులకుబ్రహ్మచర్యవిధి విధానములు, మౌనము, రేఖాగణితశాస్త్రధర్మములు బోధించినవాఁడని బలమగుప్రతీ కలదు. అది గ్రీసుదేశస్థులందు వ్యాపించియున్నది. మఱియు నీతఁడే Transmigration of Souls కూడ బోధించెనని యందురు.

ఆపస్తంబర్షి బుద్ధభగవానునకు పూర్వుఁడనుట నిర్వివాదాంశము. బౌద్ధమత వ్యాపకమునకై బౌద్ధగురువులు విదేశముల కరిగి పనిచేసియుండిరి. ఇప్పుడు బీహారుదేశ మనఁబడుచున్న మగధదేశమున కాదిని ఫలాసదేశ మని పేరుండెడిది. ఫలాసదేశస్థు లన్యదేశములందు పెలాస్గీ లని వాడఁబడుచుంటయు, వారే గ్రీకుల పూర్వులగుట నాపేరఁ బరఁగిరనియు ఇటీవలి పరిశీలనలనుండి బయల్పడుచున్నది. కొందఱు పరిశోధకులు రాజగృహ (మగధరాజధాని లేక ప్రధాననగరము) దేశస్థు లన్యదేశములందు తొలుత గృహకు లనంబడి, కాలము గడచినకొలఁది గ్రీకులుగ మాఱి రని దెలుపనారంభించియున్నారు. ఇది యింకను కొంత కాలము నిరీక్షించి యోచింపఁ దగినదిగా తలంపఁబడినను, ఒక సంబంధమును బయల్పడఁ జేయుచున్నవి గాన, నశ్రద్ధగా విడువఁ దగినవి కావు. వీటిని ఎడ్వర్డు ఫోకోక్ పరిశీలకుఁడు తన "ఇండియా ఇన్ గ్రీస్" అను గ్రంథమున సూచించియే యున్నాడు.

ఇటులనే మతబోధకై విదేశముల కరిగిన బౌద్ధమతగురువు (పేరేమో కాని) క్రిమక్రమము గనో లేక గ్రీకులచే పైతాగర స్సాయె నని పరిశీలకు లనుచుంట యిటీవల వినఁబడుచునే

యున్నది. ఇదియే నిజమగునేని ఈయనబోధించినశాస్త్ర ధర్మములలోని రేఖాగణితధర్మము లాప స్తంబశుల్బసూత్రధర్మము లై యుండునని తలంపవలసివచ్చును. ఇటుల బౌద్ధ గురుశబ్దము పైతాగరస్ శబ్దముగమాఱినసంగతియు ఫోకోక్పండితుఁడే అభిప్రాయపడి యున్నాఁడు. ఇట్టి రేఖాగణితము గ్రీకు దేశమున నభివృద్ధినంది "జియోమిట్రీ" ఆయెనఁట. ప్లేటో పండితుఁడు దీని నుద్ధరించె నఁట.

పైతాగరస్ గారి సిద్ధాంతసూత్రి మాంగ్ల భాషలోని కనువదింపఁబడినది యిట్లున్నది—

"The Square on the Hypotenuse of a right angled triangle is equal to the sum of the squares on the other two sides"

ఈసూత్రమును "Basis of the Trigonometrical Science" అని వాడుచున్నారు. అనఁగా త్రికోణగణిత మూలధర్మమని భావము. దీని నంకెలతో వివరింతుము.

$3 \times 3 + 4 \times 4 = 5 \times 5 = 25.$

$5 \times 5 + 12 \times 12 = 13 \times 13 = 169.$

$8 \times 8 + 15 \times 15 = 17 \times 17 = 289.$

$7 \times 7 + 24 \times 24 = 25 \times 25 = 625.$

$12 \times 12 + 35 \times 35 = 37 \times 37 = 1369.$

$15 \times 15 + 36 \times 36 = 39 \times 39 = 1521.$

ఇంక నీవిషయ మాప స్తంబశుల్బసూత్రిమున నిటుల వివరింపఁబడి యున్నది.

త్రికచతుష్కయోః ద్వాదశికపంచికయోః పంచదశికాష్టికయోః సప్తిక చతుర్వింశికయోః ద్వాదశిక పంచత్రింశికయోః పంచదశికషట్త్రింశికయోః ఇత్యేతాసూపలబ్ధిః.

పరిశీలకులు నిజము బయటఁబెట్టుదురుగాక.

## పైత్యవికారములు పది విధములు, అనుపానములు అఱువై విధములు, వెఱ్ఱి వెయ్యివిధములు-(ఆంధ్రలోకోక్తి)

## పైనాబట్ట (Pina Cloth)—

ఇది ఫిలిప్పైన్‌ద్వీపములందు అనాసపండు చెట్టుఆకుల నారనుండియు ఇంక నిట్టివిమొదలగు నారలనుండియు నేయఁబడును. మిగులనందముగఁ గన్పించునదై ఖరీ కలది. జేబురుమాళ్ళు మొదలగువానినీబట్టతో జేయుదురు.

## పైప్ (Pipe)—

I ఇది పాశ్చాత్య దేశముల కొలఁతపరిమాణము. ఇం దనేక భేదములు కలవు. ఒకపైపునందు సర్వసాధారణముగ రెండు హాగ్హెడులును, ౧౦౮ ఇంపీరియల్ గాలనులును అని లెక్కింతురు. ఇది ౧౨౬ వైను గాలనులుగ సరిపోవును. ఒకటన్నునందు రెండు పైపులు సరి యగును.

Maderia పైపునకు తొంబదిరెండు గాలనులును, షెర్రీపైపునందు నూటయెన్మిది గాలనులును, పోర్టులెను పైపునందు నూటపదునేను గాలనులును ఉండునఁట.

II ఇంగ్లాండున నెలుకలబాధ భరింపరానిదిగ నున్నకాలమున (900A. D.) ఎలుకలనుపట్టుటకు పైప్ అను నొకవిధమగు (పిల్లనగ్రోవివంటి)వాద్యవిశేషము నుపయోగించుచు వచ్చిరి.

## పైహార మంచుచేఁగప్పఁబడిన సరస్సున జీవజంతువులు వసింపఁగల్గుట-

హిమవత్పర్వతసీమలందు ఆల్మోడానుండి కైలాసశిఖరమున కరగుమార్గమున కాళీనదీజన్మస్థానపరిసరముల వ్యాసనరోవర మను సరస్సును దఱినే వ్యాసగుహయనుకందరమును యాత్రాస్థలములై యున్నవి. అది యాదిని వ్యాసమహర్షి నివాసముగ కొంతకాల ముండెనఁట. ఆసరస్సునందు అడుగుదళసరిని పైహార గట్టి మంచుచేఁ గప్పఁబడియుండును. ఆక్రిందనున్న సరస్సునీటి భాగమునకు వాతావరణముతో

సంబంధముండదు. అందువసించుజీవజంతువులు ఊపిరి దీయుటకై పీల్చుటకు ప్రాణవాయువు (Oxigen gas) వచ్చువీలు గానరాదు. నీటి యందు కరఁగియున్న ప్రాణవాయువు నవి పీల్చి వేయఁగనె క్రొత్తగాలి యెట్లు దానిలోనికి వచ్చునని శంక చూచువారలకుఁ గలకపోదు.

పరిశీలన లీసరస్సులోని క్రిందిభూభాగము నుండి యొకజలమార్గము కలదనియు, దాని గుండా నిల్వనీ రవ్వలికిఁ బోవుచు క్రొత్తజల మూరుచు వచ్చు చుండు ననియు, ఆక్రొత్తనీటను గరఁగియున్న ఆక్సిజెనుగాలిని అందలిచేఁపలు మొదలగు జీవజంతువు లుపయోగించుకొనుచు జీవింపఁ గల్గుచున్న వనియు పోల్చియున్నారు.

**పైప్పలగోత్రము**—(శండిలగణము చూ.)

**పైప్పలాదిగోత్రము**— (కుండినగణము చూడుఁడు).

**పైప్పలాదిగోత్రము**—(శండిలగణము చూడుఁడు.)

**పైఁబడ్డమాట మడిఁబడ్డనీళ్లు వృథా పోనేరవు**—(ఆంధ్రలోకోక్తి.)

**పైయొనీర్ (Pioneer)** — ఒకక్రొత్త భూమిని మొట్టమొదటకనిపెట్టినవారికిని, తదితరు లనుసరించుట కనుకూల మగు మార్గము ంచినవారికిని, ఏదేని యొకనిర్మాణమును తొలుదొల్త ప్రారంభించినవారికిని వర్తించును.

**పైరామిడ్సు ఆట (Pyramids)** — ఇది యొక మాదిరి బిలియర్డ్సుఆటగాఁ దలంపఁ బడుచున్నది. ఒకమేజాబల్ల కొకకడను త్రికోణా కారముగనుండు నొకచట్రమున పదునేను ఎఱ్ఱ బంతుల నమర్చి, ఒక తెల్లబంతితో ఆట నారం భింతురు. ఆట ప్రారంభించునాతఁడు చట్రపు మూలకడను బల్లకు కొననుండి యాట నారం భించును. ఎక్కువ ఎఱ్ఱబంతుల నేయాటకాఁడు చిక్కుపుసంచియందు త్రోయఁగల్గునో యాతఁడు జయమందిన ట్లెంచఁబడెడిని.

తప్పిపోయినచో రెండవవాని కాట ప్రారం భించుట లభించుచుండును. తెల్లబంతిని చిక్కుము నందు త్రోయుట గాని, కొట్టలేక తప్పిపోవుట గాని ఒక పోయింటు (Point) తగిపోయినటు లెక్కింపఁబడుచుండును. బల్లపైనుండి బంతి పైకి పడిపోయినను ఒక పోయింటు తగుటయే. కడకు మిగిలినవారు, అప్పులు పడినవారు ఓడినట్లు లెక్కింపఁ బడుదురు ఎక్కువ యెఱ్ఱబంతులను చిక్కు సంచియందు త్రోసినయాటకానికి జయము గల్గును.

ఈఆటయందు "Shell out" అనంబడు నించుక భేదపుటాట కలదు.

**పైరుశిష్టగోత్రము**—(పేరుశిష్ట చూ.)

**పైరోగ్రాఫి (Pyrography)**— కఱ్ఱల మీఁదను ఇతర గట్టిపదార్థముల మీఁదను వేఁడి చేసి చిత్రములను తయారుచేయువిధానము.

**పైరోనిజమ్ (Pyrrhonism)**-సంశయ జ్ఞానము. ఈశ్వరుఁ డున్నాఁడా లేఁడా యను సందేహముతో కూడుకొన్న జిజ్ఞాస.

**పైరోఫొటోగ్రాఫి(Pyrophotograph)**- ఫ్రెంచిభాషాజన్యపదము. ఫొటోగ్రాపుతీయఁ బడిన పటముయొక్క రూపము నొక తరగతి అద్దముపైఁ గాని, పింగాణీ ఁ గాని, యమర్పు లేక యంత్రముచేఁ జిత్రించుకల. కట్టివి కాగిత ములు కావని యెఱుంగునది.

**పైరోమీటర్ (Pyrometer)**— పాద రసము సాధనముగాఁగల థెర్మోమీటరులు చూపలేనివేఁడిని చూపు యంత్రపరికరము.

ఎలక్ట్రికల్ పైరోమీటరు Radient heat వలన చూపునది. Optical పైరోమీటరు కాలినవస్తువురంగునుండి వేఁడిని దెలుపునది.

**పైర్హస్ జయము** (Pyrrhus Victory)— పూర్వకాలమున ఎపిరస్ పుర భూనాథుఁడగు "Pyrrhus" అను పుడమితేఁడు గ్రీకులపక్షమున వారితోఁజేరి రోమనులపై దండయాత్రవెడలి సంగర మొనర్చె నఁట. ఇది క్రీ. ము. ౨౮౦ నాటికాల మఁట. రెండు సంగరములకడ నాతఁడు జయ మందియు, సైన్య పుచావులు, గాయములు, ధనవ్యయములచే కడునష్టములంది, అంతెకన్న నోడి పలాయన మగుటయె మెరుగని తోఁచి సిసిలీయందు తల దాచుకొనవలసి వచ్చెనఁట. నాఁడాదిగ జన నష్టము, ధననష్టము ఫలితములుగఁగల్గిన నిరర్థక జయమును పైర్హిక్ జయమని (Pyrrhic Victory) హేళనగా వాడుచుండు నుక్తి యేర్పడిన దఁట.

**పైల గోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**పైలన్నాయనగోత్రము**— (జమదగ్ని వత్స ఉపగణము చూ.)

**పైల (లేక పౌలి) గోత్రము**—(భర ద్వాజ ఉపగణము చూడుఁడు.)

**పైలలేబి గోత్రము**— (నిధ్రువగణము చూడుఁడు).

**పైలుఁడు**— ఈ పేరుగల ఋషు లిర్వురు గలరు. వ్యాసశిష్యుండగు ఋగ్వేదాధ్యాపకుఁ డొక పైలుఁడు కలఁడు. రెండవఋషి జాతకర్ణి శిష్యుఁడు.

**పైల్ ఫౌండేషన్** (Pile foundation) (పునాది చూడుఁడు.)

**పైశ్వంగ గోత్రము**—(గర్గఉపగణము చూడుఁడు.)

**పైశాచీభాష**— ఇది ప్రాకృతభాషా భేదము. ఇది పైశాచి యనియు, చూళికా పైశాచి యనియు ద్వివిధముగ నుండునది. ఈభాషపిశాచ దేశములనిన పాండ్య, కేకయ, నేపాళ, బాహ్లిక, కుంతల, చోళ మొదలగు దేశములందు వాడఁబడునదిగఁ జెప్పఁబడినది. (ప్రాకృతభాష చూడుఁడు.) ప్రాకృతజన్యము అష్టభాషలలో నొకటి. (భాష ఎన్మిదివిధములు చూడుఁడు.)

**పైశ్వికాయనగోత్రము**-(గర్గఉపగణము చూడుఁడు).

**పొంగల్పండుగ** — (మకరసంక్రాంతి పండుగ చూడుఁడు).

**పొంపీనగరపుపాటిస్థలము** — ఇటలీ దేశమునందు నేపిల్సునగరమున కాగ్నేయదిశ గా పదునొకండుమైళ్ళదూరమున వెసూవియస్ పర్వతపాదముననున్నది. లావాచేతఁ గప్పఁబడి ఇటీవలత్రవ్వఁబడినది. క్రీ. వె. ౬౩లోకొంతవఱ కును ౭౯లోపూర్తిగనులావాచే పూడిపోయెను. ౧౭౪౮లో త్రవ్వట ప్రారంభింపఁబడి, ఆకాల మున రోమకజీవనవిధానమునుబయల్పఱచినది.

**పొగ**—అగ్ని మండుటకు పూర్వము పొగ పైకిలేచును. పొగయందు కాలనిపదార్థపుత్రోస రేణువులు, బొగ్గుత్రోస రేణువులు, ఆవిరి యుంట నలగ నగపడుచుండెడిని. పొగాకుచుట్ట కాల్చి నను పొగ వచ్చును. సరిగా కాలని ఫలితము పొగ యనియు, చక్కఁగాకాలిన కొన్ని గాలు లును పైకి లేచునని కన్గొనఁబడినది. పొగ కండ్ల కగపడును గాని, గాలులు కండ్ల కగపడవు.

పొగయందు కాలని కార్బను విస్తార ముండు నని కనుగొనఁబడినది. ఇంకను నందు ననేకము లగు Gases & Acids కూడ నుండును. పొగ ఆకాశమున కెగయును. మహావాయు మండలముగుండా తేలుచుఁ బోయి మేఘము లందుఁ జేరుకొనును. పై కెగసినకొలఁదిపలుచనై తుదకు నేత్రములకుఁ గానరాకుండునంతటిదిగ చెదరిపోవును.

వంటచెఱకుపైఁగాని, బొగ్గుపైఁగాని,ఉముక (ఊఁక)పైఁగాని అగ్ని ముట్టించి ప్రజ్వలింపఁ జేసినచో వేఁడి కలుగుటతో నందుండు గాస్ (Gas) ఆవేఁడికి బయటపడును. ఆ గేసునకు బాహ్యమందలి మహావాయుమండలియందలి ఆక్సిజన్‌సంబంధమున మంట గల్గును. మంట వేఁడిని గల్గించుచుండుఁ గాన ఎక్కువ గేస్ (Gas) బయటపడుచు కాలుచు నిట్లు పని చేయుచుండి తుదకు సర్వము రొయ్యి (ashes)యై చల్లారిపోవును. ఇది సామాన్యపరిస్థితి యందు జరుగు కృత్యము.

కఱ్ఱలు, బొగ్గు మొదలగు Fuel తడిగా నుండి మండక పోయినచో వేఁడి చాలకుండును. గాన Gas సరిగా బయటపడదు. అట్టితఱి Fuel నందలి అపరిశుద్ధపదార్థములును కాలి పడును రాక, అఱకాల్పు Gas ను విస్తారముగ పైకి వచ్చుచుండును. అప్పుడు అగ్నిని విసరుచు వేఁడి ఎక్కువచేయ ప్రయత్నింతుము. అదియె పొగ. మనము విసరుటవలన అగ్ని ప్రజ్వరిల్లి వ్యాపించి వేఁడి యధికమగుతఱి తిరుగా గేస్ బయటపడుట, మండుట మొదలగునవి సంభవించుతఱి పొగ రాక నిలిచిపోవును.

పొగ (Smoke) కాల్పు నందలి లోపము వలనఁ గల్గినదిగ నిర్వచింపఁబడి ఉన్నది. సరిగా కాలుటవలన గాలులు తప్ప, మఱియేది గలుగదు. అందు మిగిలినది బూడిదయే. గాలులు (Gases) నేత్రముల కగపడునవి కావు. రాక్షసబొగ్గు కాల్చిన చిన్న చిన్న ముక్కలు మిగులుటయు, అందు కాలిపోయిన బుగ్గి కలిసియుంటయు సంభవించి, పొగయందు జిడ్డుగల పరమాణువు లెగసిపోవును. అవి వేటికైన నంటుకొనుచుండును. కాలుటయం దేర్పడి కాలకుండనుండు ముక్కలను Cock అనెదరు. అట్లెగసిన రాక్షసబొగ్గుపొగ యధికమగుతఱి సూర్యరశ్మినిగూడ మేఘములవలె మరుగుపఱచి తిరుగ నేలఁబడుటయందు ప్రతివస్తువును రంగు మాపి మొక్కలనే గాక చెట్టుచేమలను పాడుచేసి పీల్చెడి యూపిరిగాలితో శరీరమందలి ఊపిరితిత్తులలోఁ (Lungs) బ్రవేశించును. ఇది సరిగా కాలనిఫలితమే.

కఱ్ఱలఁ గాల్చుటయం దిట్టిచిక్కు లంతగా నుండవు. అవి చక్కఁగా కాలుట తఱచుగ సంభవించుచుండును. పొగ గల్గినను అం దంత యపాయకరపదార్థము లుండవు. ఇంకను దట్టమైనపొగకు అగ్గిపుల్ల గీచి ముట్టించిన కాలుటయుఁ గలదు. ఏలయన అందు హైడ్రొజెన్ ఆక్సిజెన్ మొదలగు గాలులు గూడ నుండెడిని.

**పొగచుట్టలపైనుండుచిన్న "వేరుల ఆనవాళ్ల కాగితములు"** (Brands)—అదికాలమున పొగాకునకు క్యూబా (Cuba) దేశము స్వస్థలము, జన్మభూమి. ఆ దేశము నుండియే పెక్కు దేశములకుఁ గొంపోఁబడి పండింపఁ బడుచున్నది.

తొల్లింటికాలమునక్యూబాదేశస్థులుపుగాకు సగ మారియు,సగమారకయు నుండుతరుణమున చుట్టలు చుట్టి ఆపదునుమీదనే కాల్చువారఁట. ఇప్పటివలె ఆరినపొగాకు చుట్టలు గాల్చుట వారికి రుచ్యము కాకుండిన దఁట. అది యొక మోస్తరు చలిదేశముగాన, అచటిధనికులు, సాధారణులుగూడ ధరించువస్త్రములువలెనే చేతులకు(వ్రేళ్లకు)గ్లోవ్సు (Gloves)గూడ ధరించువారఁట. పూర్తిగా ఆరని పచ్చిపొగాకుచుట్ట కాల్చుతఱి దానిపైఁగ్రమ్ము నికోటెన్ (Nicotine), అనఁగా పొగాకుననుండెడి నల్లనిరసము (దీనినె Nicotine Poison అనెదరు.) స్పానియా దేశమునుండి క్యూబాదేశభూమి నాక్రమించి నివసించుచుండిన వేషాభిలాషులగు ధనికుల చేతిగ్లోవ్సును మచ్చలషా లొనర్చి పాడు

చేయ మొదలిడె నఁట. దానికొఱకు కాల్చువారొకకాగితపుపేలికనుజుట్టి పట్టుకొని కాల్చుచుండిరఁట. చుట్టలవర్తకులు దీనిం గాంచి, అకాగితపు పేలికలను తామె చుట్టి మఱియు విక్రయించుచుండిరఁట.అందొకబుద్ధిశాలిఆకాగితపుపేలికపై తనపేరు ముద్రింపించి తనవర్తకప్రకటన మొనర్చి ధనవంతుఁడగుటగాంచి యెల్లరు నాపనికే మొదలిడి రఁట. రానురా నది పరిపాటియై చుట్టలపై బ్రాండ్లు, కాగితపు పేలికలు చుట్టఁబడుచున్నవఁట.

**పొగడచెట్టు**-లా. Mimusops elengi సం. మధుపుష్పకి,వకులః,కొందరు సింధుగంధః అని వ్రాసిరి.

ఇది పొగడపూవులకై పెంచఁబడు వృక్షము. దీనిపూవులందు చక్కని పరిమళము కలదు. పూవులచూర్ణము లోనికిఁబీల్చిన శరీరమందలి నొప్పులు, తలనొప్పి, పడిసెము నివారణమగు ననియు, లోనికిచ్చిన తీవ్రజ్వరము, శిరోవాతము, నేత్రరోగములు నడఁగుననియుఁ జెప్పఁబడినది. పొగడపండు చూర్ణజేసి ప్రమేహము, సంగ్రహణి, శ్లేష్మదోషము, పైత్యరోగము నడంచుననియు, దంతములకు పటిమ నిచ్చు ననియు, ఒక్కొక శరీరమునకు ప్రేగులలోని వాతమును బంధించుననియు, దీనికి విఱుగుడు దీని వేరుచక్కయనియు చెప్పఁబడినది. మఱియు పొగడగింజలలోని పప్పు తీసివైచి నూరి తినిన విరేచనము జేయుననియు, పొగడపండ్లలోని గుంజు పంచదారతో లోనికిచ్చిన విరేచనములే గాక పురాణరక్తగ్రహణి సైతము నివారణ మగు ననియుఁ జెప్పఁబడినది.

పొగడచక్క రసకషాయములు చలవజేసి విషదోషము హరించు ననియు, సంగ్రహణి, జ్వరము హరించి, మూత్రమార్గమునఁ గల పుండ్లను మాన్పి చీముకారుట కట్టుననియు,నోట పుక్కిలించుచుండిన దంతరోగములు నివారణమై దంతములు, చిగుళ్లు, గట్టిపడు ననియు, చెక్క చూర్ణము లోనికిచ్చిన స్త్రీల వంధ్యత్వదోషము నివారణమై సంతానముగల్గు ననియుఁ జెప్పఁబడినది.

**పొగమంచు** (Fog)--పొగ్రగమ్మినటుల దట్టమైయుండునది. శీతలముగ నున్న తెఱి సముద్రముపై వెచ్చనిగాలి వీచెనేని చల్లనినీటిసాంగత్యముననాగాలి చల్లబడిపోవును. అది వెచ్చగ నున్నప్పు డందుఁగల నీటియావిరి అదుమఁబడినటుల దట్టమై వాయుప్రవాహమున భూమిపైకిఁ దరుమఁబడెనేని భూమిపైనను, లేకున్న సముద్రముపైనను దట్టమైన మంచుగ నుండి, ఒక్కొకతఱి దారిని గూడ మరుగుపఱచుచుండును. (మీటియారోలోజీ)స్లీటు,ఉదకము, దానికార్యములు మంచు చూడుఁడు.)

**పొగమంచునందు ధ్వని సరిగా విన్పింపకపోవుట**— ధ్వని యొక్క గాఢత్వము (Intensity of sound) అది పయనమొనర్చుపదార్థపు శరీరత్వమునుండి యుండును. దీనిని "Law of Physics" అని యాంగ్ల రసాయనశాస్త్రవిదు లనెదరు. ఈధర్మము వెలుతురునకు,వేఁడిమికి,ఆకర్షణశక్తి (Gravitation Pull)కినిగూడవర్తించునఁట.దూరమునకు ధ్వని తగ్గి వినిపించుట యెల్ల రెఱింగినదే. వెలుతురును దూరమునకు తగ్గి కన్పట్టును. వేఁడిమియు తగ్గిపోయి తెలియ నగును. ఆకర్షణశక్తియు నటుల నగునదే. ఇది యిట్లున్నను దేనిగుండా నివి నడువవలయునో దానిదళసరి (Density) నుండికూడ (డెన్సిటీ చూడుఁడు) మార్పు నందవలసియుండును. మంచు బాగున్న రాత్రులందు ధ్వని చక్కఁగ విన్పించుచుంట ఎల్లరెఱింగినదే. గాలి దళసరిగానుంట త్వరితముగ ధ్వనిని నడువఁజేసి యందిచ్చుచుండును.

వేసవివేడిమియందునను, పర్వతోపరిభాగములందుండు Rarety of air స్థితియందునను, గాలి పలుచఁబడియుంట దానిగుండా ధ్వనులు తగ్గి విన్పించునుగాని, సరిగా విన్పింపకుండెడిని. పొగమంచు (Fog) నందు గట్టిపరమాణువులు పెద్దవిగ నుంట, ధ్వని నడుచుట కాటంకము గల్గించునవిగ నుండి ధ్వనిని తగ్గఁజేయును.

పొగమంచు (Fog) స్మోగ్ (Smog)- భరతదేశపుస్థితినుండి భేదముగల ఇంగ్లాండు దేశమున పొగమంచు ద్వివిధముగ చెప్పఁబడుచున్నది. దేశమందు సంభవించు చుండునది భరతదేశమున నెఱిఁగినపొగమంచువంటిదేగాని, లండనునగరము మాంచెస్టరునగరము మొదలగు కర్మాగారము(Factories) లధికముగాఁ గల నగరములందు పొగమంచునం దధిక భాగము రాక్షసబొగ్గుపొగ. అందలి పరమాణువులు చేరియుంట, దానిస్థితియే వేఱుగనుంట, దానికి ఫాగ్ అని పేరున్నను పెక్కండ్రు (Smog) అనివాడుటయుఁ గలదు. బ్రిటీషుదీవులందుగల్గుచుండునది దట్టమైన Dense mist గాని వేఱు కాదు. అది మేఘమే కాని భూమికిఁ గడుసమీపమునం దుండుటయేదానికిని మేఘమునకును గలభేదము. ఆదేశపరిసరసముద్రములం దిది కల్గినతఱి, ఓడలకు దారితెలియక కష్టమగు చుండెడిని. అది చాల స్వచ్ఛత గల్గి శరీరస్థితి కపాయకరము కాదు. నగరములందు కల్గిన స్మోగ్ నందు కాలి కాలని రాక్షసబొగ్గుపొగవంటి అపాయకరపదార్థములు దట్టముగ నుంట, అది గల్గినతఱి వేలకొలఁది జనుల యారోగ్యమును జెఱుపును. దారి గన్పడక రహదారీ ఆగిపోవలసివచ్చును. గొప్ప భవనములను మకిలిరంగుపాలుచేసి అంచులను పాడుచేయును. శీతము గల్గి ఈ స్మోగ్ సంభవించినఫ్యాక్టరీచిమ్నీలనుండి పొగ పైకి పోక ఇందుచేరుకొని పైకష్టము నధికపఱచెడిని.

## పొగయోడజీతము లిచ్చివేయుట

(Paying off a Ship)--పొగయోడలందలి యుద్యోగులకు పరిచారకులకు జీతములు సంవత్సరమునకుఁగాని నెలనెలకుఁగాని యిచ్చునవి గావు. ఒకసబురుకింతయని నిర్ణయింపఁబడి, ప్రయాణ మారంభించినతావునుండి తిరుగ నా తావునకుఁజేరువరకు నిర్ణయింపఁ బడును. ఇందు కొందరు పెర్మెనెంటుగా నోడ గనిపెట్టుకొని యుండువారున్నను,వారికి జీతము వేఱుగనున్నను సబురుముగిసి తనసొంత రేవునకుఁజేరినపైని ఆసబురున కేర్పఱచుకొన్న నిర్ణీతధనమునిచ్చివేయుదురు. దీనికి 'Paying off the Ship' అనెదరు.

ఇంక యుద్ధనావికులకు కొన్నిసంవత్సరముల పరిమితికాలములకు ఏర్పాటు లుండును గాని, ఆనావ యొకకమీషనుపైతిరిగివచ్చినపిదపఅడ్వాన్సులు మొదలగువానిని లెక్కించుకొని,అక్కడికైనదానిని నిచ్చివేయుటయుఁగలదు. యుద్ధనావలందుండు సైనికులకు జీతములయేర్పాటే యుండును.

## పొగయోడలయందు కాలమును లెక్కించు విధానము

— సముద్రమున నడుచు యోడలయందు పనిచేయు నావికులు సగమునుండి పనిచేయుచుందురు. తక్కిన సగము మందియు విశ్రాంతిగొనుచుండి మొదటివారు విశ్రాంతి కేగుతరి తాము పనిలోఁజేరి ఓడను నడుపుచుందురు. ఇటుల పొగయోడలు రేయింబవళ్లొకేరీతిని నడుపఁబడుచుండును.

వీరి కాలపరిమితి పగలు పండ్రెండుగంటలు మొదలు, అపరాహ్ణము (Noon) మఱునాఁడపరాహ్ణమువఱకు కిరువదినాల్గు గంటలు. ఇందు పగలు మధ్యాహ్నమున కాలము ప్రారంభమై పండ్రెండు గంటలవఱకు నొకగంటయు (One bell), ఒంటిగంటకు రెండుగంటలును (Two bells), ఒంటిగంటన్నరకు మూఁడుగంటలును

(Three bells), రెండుగంటలకు నాలుగుగంటలును (Four bells), రెండున్నరగంటలవేళ ఐదుగంటలును (Five bells), మూడుగంటలవేళ ఆఱుగంటలును (Six-bells), మూఁడున్నరగంటలవేళ ఏడుగంటలును (Seven bells) నాల్గుగంటలవేళ ఎనిమిదిగంటలును (Eight bells) కొట్టుచుందురు. ఇక్కడికి మధ్యాహ్నపుపహరా లేక డ్యూటీ ముగియును. (Afternoon watch). పిదప నాలుగు మొదలు రాత్రి ఎనిమిదిగంటలగువఱకు డాగ్‌వాచ్ (Dog watch) కాలము. ఇందు సాయంకాలము నాలుగు మొదలాఱుగంటలవఱకు మొదటి డాగ్‌వాచ్ (First Dog watch) అనియును, పిదప రాత్రి ఎనిమిది గంటలవఱకును రెండవ డాగ్‌వాచ్ (Second Dog watch) అనియును, ఈ యెనిమిది గంటలకాలమును రెంటు డ్యూటీల కాలముగ పరిగణింతురు. మఱియు నిందుఁగూడ అరగంటకొకటి-చొప్పున, నొకటిమొదలు నాలుగగువఱకు గంటల (Bells) గొట్టుచునే యుందురు.

రాత్రి ఎనిమిదిమొదలు అర్ధరాత్రిమున పండ్రెండుగంటలవఱకు మొదటికాపలా (First watch) డ్యూటీ యనెదరు. అర్ధరాత్రి మొదలు తెల్లవాఱుజామున నాలుగుగంటలవఱకు మిడిల్‌వాచ్ (Middle watch) డ్యూటీ యని పరిగణింతురు. తెల్లవాఱుజామున నాల్గుమొదలు ఉదయ మెనిమిది గంటలవఱకు ఉదయపుకాపలా (Morning watch) యనియు, అంతటనుంచి మధ్యాహ్నము పండ్రెండుగంటలవ॥ఫోర్‌నూన్‌వాచ్ (Forenoon watch) యనియు డ్యూటీ (Duty) లను పరిగణింతురు.

ఇటుల After noon watch నాలుగు గంటలు, పిదప మొదటిడాగ్‌వాచి రెండుగంటలు, పిమ్మట రెండవడాగ్‌వాచ్ రెండుగంటలు కాలము కలిసిన నాలుగుగంటల కాలమును డాగ్వాచ్ (Dog watch) రాత్రి 8 to 12 P.M. మొదటికాపలా First watch తర్వాత తెల్లవాఱుజామున నాలుగుగంటలవఱకు మిడిల్ వాచ్ (Middle watch), పిదప ఉదయమెనిమిదిగంటల వఱకు మోర్నింగు వాచ్ (Morning watch), పిమ్మట నపరాహ్ణము పండ్రెండు గంటలవఱకు ఫోర్నూన్ వాచ్ (Forenoon watch) యును, కల్పి యిరువది నాలుగుగంటలకాల మగును. మఱియు ప్రతియరగంటకు నొక్కొక్క-వాచ్ యందు ప్రారంభమున నొకటిమొదలు కడ కెనిమిది యగుచో, ప్రతియరగంటకును బెల్సు (Bells) గంటలు కొట్టుచుందురు. ఇది సముద్రమున నడుచు పొగయోడల యందలి కాలపరిమాణ విధానము. ఇది నావికు లోడనడుపుటకును, విశ్రాంతిగొనుటకును తగు సౌకర్యమున కేర్పఱుపఁబడినది.

**పొగయోడలు**— (ఓడలు చూడుఁడు.)

**పొగాకు లేక పుగాకు**— లా. Nicotiana Tobacum. ఆంగ్ల. Tobacco, ఫ్రెంచి పదము. Tobac. సం. కలంజః, తామ్రకూటః, తామ్రకృమిః, ధూమ్రపత్రా, ధూమ్రపత్రికా, ధూమ్రాహ్వా.

పొగాకుచెట్టు అనాదిగా భరతదేశమున నుండినచెట్టు. దీనియాకుపొగ బీల్చుటకుపచరించి యుంట దానిపేరులే చెప్పుచున్నవి. స్పానియా దేశపువైద్యుఁడగు Francisco Fernandeo అనునాతఁడు క్రి. వె. 1558 సంవత్సరమున పొగాకువిత్తన మైరోపాలోనికి దెచ్చె నఁట. ఇట్టిగాథ లీపొగాకునుగూర్చి పెక్కు కలవుగాని ఈ గ్రంథమునకనవసరము. దీనినాంగ్లవృక్షశాస్త్రవేత్తలు "Plant of the genus nicotina అనెదరు. ఐరోపాదేశములందు పొగబీల్చు నభ్యాసము నెఱుఁగక మున్నె పొగాకుచెట్టు

గాల్చుట నితర దేశములం దెటేఁగి యుండిరని చెప్పఁబడినది. పొగాకునందు నికోటైన్ విషము కలదు.

పొగాకుచెట్టు ఆఱుమూఁడులవఱకు పెరుగునని యు, ఆంగ్లసీమను పూఁదోఁటల నిది పూవుల్కై పెంచఁబడు ననియు నందురు. బంకమట్టి బురద నేలలు, ఇసుక నేలలు దీనికిఁ బనికి వచ్చునవిగఁ జెప్పఁబడినవి. మన దేశమున లంకభూములు, పాటి నేలలు, పొగాకు సేద్యమున కమరియున్నవి. ఇసుకభూములందు పండినది పసుపురంగుగ నుండుననియు, దీనియాకు పల చన యనియు, ఇట్టి యిసుకల కడుగున బంక మట్టి (Sub soil)యుండుట శ్రేయ మనియుఁ జెప్పఁబడినది. మన దేశమున పొగా కెంత యైనను పాశ్చాత్యుల మెప్పు బడసినది కాదు. ఇక్కాలమున పేరందిన పొగాకు పంటలు Virginia, North Carolina, Syria, Kentucky, Turkey, Cuba, Jamaica, Sumatra, Borneo, Canada, Australia దేశములు విరివిగ పండించుచున్నవి. జపాన్ దేశమున, దక్షిణఆఫ్రికాలో, పొగాకుపంట విరివిగనే పండించుట కారంభమైనది. దక్షిణాఫ్రికాయందలి Rhodesia పొగాకుపంటకు ప్రాముఖ్యము నందినది.

జమైకాయందుమపొగాకునకు "జాకాస్ రోపు" అందురు.

పొగాకునుండి చుట్టలు, పొడుమె గాక హుక్కాలోఁబెట్టి కాల్చు పొగాకుముద్దయు, సిగరెట్ల పైపుటొబెకో యనఁబడు Cutting ను కూడ చేయఁబడుచున్నది. పొగచుట్టపొగను మితముగ బుచ్చుకొనుట దురభ్యాసములలో లెక్కింపఁబడినను, పలువురచే స్వేచ్ఛగ కాల్చబడుట గాననగుచుండును. ఆంధ్ర దేశమున శ్రోత్రియులు చుట్ట గాల్చుట అనాచారమని యందురు గాని పొడుము పీల్చుట యనాచారముగ నెంచరు. ఇంకనుపొగాకు బీడీయందుంచబడి కాల్చఁబడుట ఉత్తర దేశములం దలవాటైనది. దక్షిణహిందూస్థానమున చుట్టగాల్చుట అనాచారమందురు. జరథుస్త్ర మతస్థులగు పారశీకు లగ్నిపూజ నొనర్చువారు గాన, చుట్ట కాల్చుట దోషమని మానుదురు. రామానుజీయ శ్రీవైష్ణవమతస్థులు చుట్ట కాల్చుట కేవలదోష మందురు. ఇంచుక నవ నాగరికులు చుట్టలకన్న సిగరెట్లు గాల్చుచుందురు. ఉత్తరసీమలందు హుక్కా నాగరిక మనియు, సుకుమార మనియుఁ దలంపఁబడుచున్నది.

మితముగ పొగచుట్ట కాల్చుటవలన వాత శ్లేష్మములను హరించి విరేచనము గల్గించు ననియు, ఉబ్బసపుదగ్గు, ఎగుపులుగల దగ్గు, జలుబు నివారించుననియు, పొడుము బుద్ధికి చుఱుకుదనము గల్గించుననియు, పొగాకు పైన వేసికట్టిన కుఱుపులను పగిలించి, దుష్టపదార్థమును వెడలించి మాన్పఁజేయు ననియుఁ జెప్పఁబడినది. మొలగజ్జి, చిడుము మొదలగు చర్మవ్యాధుల నివారించు నందురు కొబ్బరి కాయనీళ్ళు దీనికి విఱుగుడు. పొగాకువ్యవసాయమున కడుగున గులకరాయి తగిలి, పైని బంక మట్టిపొరగల చలవభూమి వ్యవసాయమునకు మిగుల శ్రేయము. దిండిగల్ ప్రాంతముల పొగాకు పండునట్టి భూములు ఎఱ్ఱమట్టిపొర గల్గినవి గాని, బూడిదరంగు మట్టి గల్గినవి గాని యైయున్నవి. కృష్ణా, గోదావరీ, భవానీ లంకల నున్నమట్టి కేవల మిసుకగలిసిన బంకమట్టిభూములే. గుంటూరుజిల్లాయందు పాటిమట్టిభూములలో పొగాకు పండుచున్నది. కొంచె ముప్పునీటి నూతులనీరు పాఱు భూములందు పండెడు పొగాకుమిక్కిలిరుచికరమయినదని చెప్పుదురు. పొగాకునకు మెత్తగ భూమిని దున్నవలయును.

గొఱ్ఱెలమంద గాని, మేకలమంద గాని, పొల ములం దాఁపి వెంటనే దుక్కి చేసిన ఈవ్యవసాయమునకు మిక్కిలి బలకరమని తేలుచున్నది. పెంట, చెత్త, బూడిద మొదలగునవి గూడ రైతు లెరువుగ వేయుచున్నారు. పొగాకు నారు గట్టి, నాటి నీరు పోసి పెంచుదురు. నారుగట్టిన పిదప ఈతకమ్మలు గప్పుదురు. ఒక యెకరమునకు నాలుగు టీచంచాలవి తనములు చాలును.

నారు ఆఱేడువారములలో మూఁడునాలుగంగుళముల పొడు గెదిగి అన్ని ఆకులు వేసియుండును. నాటిదినమున ఉదయమున పొగాకు మళ్ళకు నీరుగట్టి, సాయంకాలము నారు పీకి నాటుదురు. అదివఱకె పొలములో నీటిబోదెలు చేసియుంచుదురు. అవసరముల వెంబడి ప్రతియుదయమునను నీరు పోయుచు, పిదప దినము విడిచి దినము నీరుపోయుదురు. మొక్క బ్రతికి తిరుగ ఆకు వేసినపిదప నీరుకట్టనారంభించి, దినము విడిచి దినము గాని, రెండురోజుల కొక్కతడి గాని యిచ్చుచుందురు. ఈ మధ్యకాలమున పెద్ద వర్షము పడినచో మొక్కలు ంట నష్టమగును. కాన, వర్షములు వెనుకఁబట్టినపిదపనే నాటవలసియుండును. ఈమధ్యకాలమున కలుపు పుట్టకుండ చూచుచుందురు. దిండిగల్లుప్రాంతముల గొప్ప, త్రొవ్వుటకు రెండురోజులకుఁ బూర్వము ప్రతిమొక్కకు పేడనీళ్ళు పోయు నాచారము గలదు. ఇంకను పొగాకుమొక్కయొక్క జీవితకాలమున నిట్లే మూఁడుసార్లు పేడ నీళ్ళు పోయునాచారము పెక్కు తావులందు గలదు. మొక్క రెండున్నర, లేక రెండడుగుల యెత్తు సమీపించుటతో లేఁతభాగ మగు తలను చిక్కి వేసి వాటిని దూరముగ పాఱవేయుదురు. అప్పటికి మొక్కయందు తొమ్మిది మొదలు 12ఆకులుగల్గియుండవలయును. చిక్కివేసినతలలందు జిగట విస్తారముగల్గియుండును. ఆజిగట యితరఆకులపైఁ బడియుండినచో ఆకులు కుళ్లియు, మచ్చగట్టియు చెడిపోవును. గాన వాటిని దూరముగ పాఱవేసి మట్టిచేఁ గప్పుదురు. తలలు త్రుంచుటవలన ఆకులు పొడవుగను, వెడల్పుగను, పెరుఁగుటయే గాక అధికముగ నాకులు వైచును. చెట్టు పెరుఁగకముందే తల త్రుంచి వైచినయెడల చెట్టు గిడసబాఱి ఆకు దళసరి యగును. దానిని పొడుముపొగా కనియెదరు. ఆకులయందు పురుగులు పట్టినయెడల పొగాకు గుడ్డిలలోనికి కోళ్ళను తోలుదురు. అవి పురుగులను తినివేయును.

పొగాకు సర్వసాధారణముగ నూఱుదినములలో పండి కోతకువచ్చును. బలపపురంగుగాని, పసిమిరంగుగాని చెట్లయందు కనిపించుటతో పొగాకుపంట సిద్ధమగుచుండును.

పిదప కోసికొని పొగాకు నెండించుకొనుట. నెఱపుకొనుటమొదలగుకార్యముల జేయుదురు.

ఒకతావున నెక్కడనైన కొంతచేను నిలవ యుంచుకొని విత్తనములు సేకరించుకొందురు.

**పొగాకుగొట్టములు**(Tobacco pipes) పొగాకుగొట్టములు Wooden tobacco pipes కట్టవయ్యును పొగాకు కాలుచో నివి కాలిపోక నిలిచియుండును. దీనికికారణము పొగాకు కట్టెలవలె నిలిచి కాలునది కాక, కాలుటతోనె బొగ్గిలిపోవుచు రొయ్యి (Ashes)గా మాఱును గాన సరియైనవేఁడియే గలుగదు. కట్టె కాలు నంతటివేఁడి యుండదు. మఱియు గొట్టములు చేయుకట్టెను చాల గట్టిజాతికట్టెగా నెంచుదురు.

ఇంకను పొగాకునందు పెక్కు పరిశుభ్రి పదార్థములు కలవు. అవి యన్నియు పొగ గల్గించునవియె గాక, సరిగా వేఁడిగల్గునట్లు కాలనిచ్చునవి గావు కాలని గట్టికట్టెను Incombustible అనెదరు.

**పొట్లపాదు**— పొట్లకాయ భోజనపదార్థము గాన పెంచఁబడును. పొట్లకాయలు పథ్యమగుకూర. పొట్ల సాధారణపుపొట్ల (లేక తీయపొట్ల) యనియు, చేదుపొట్ల యనియు రెండు ముఖ్యభేదములు కలజాతి. మంచిపొట్లయందు పొడవుకాయల గాచుజాతియు, పొట్టికాయల గాచుజాతియుఁ గలవు. అందు పొడవుకాయల జాతి శ్రేష్ఠ మందురు. చేదుగ నుండుజాతి యందు పొడవుకాయ లుండవు. ఇంచుమించు గుండ్రముగ నుండును. ఇందు చేదుపొట్ల, లేక అడవిపొట్ల యనుజాతియు, లింగపొట్ల యనుజాతియు రెండుభేదములు గలవు. అందు చేదుపొట్ల పంచతిక్తములలోనిది. దీనికాయ లందలి పైపొర గీచివైచి కూరజేసియు, ఎండించి వరుగుజేసియు భోజనపదార్థముగ వాడుదురు. లింగపొట్లకాయలు గుండ్రముగనె యుండి ఇంకను చిన్నవిగ నుండెడివి. ఇందలిగింజలు శివలింగములంబోలిన యాకారముగ నుండునుగాన నీపేరందెను. ఇదియు చేదుజాతియె. దీనిని భోజనపదార్థముగ వాడుట లేదు. కొందఱు కూర చేతురంట గాని ప్రసిద్ధము గాదు. ఇంక పణతపొట్లయనుపేరున నొక తీయనిజాతి కలదు. కాని, యది పొట్లతో సంబంధము కలది గాదు.

తీయజాతిపొట్లకు లాటిన్భాషయందు Momordica charantia అనియు, ఆంగ్లమున Snake gourd creeper అనియు, సంస్కృతమున జ్యోత్స్ని అనియు పేర్లు. చేదుజాతి పొట్లకు Trichasanthes Cucumerina అనియు, ఆంగ్లమున Wild snake gourd creeper అనియు, సంస్కృతమున పటోలీ, పటోలికా యనియు పేర్లు చెప్పఁబడినవి.

మంచిపొట్ల (సాదా లేక తీయపొట్ల) కాయ త్రిదోషహరమై సమశీతోష్ణముగల్గించుననియు, అగ్నిదీప్తిని గల్గించి విరేచనము చేయుననియు, ఆమవాతము, కఫదోషము, జ్వరము, పైత్యముల నడంచు ననియుఁ జెప్పఁబడినది. మఱియు పొట్లఆకునందు పైత్యశాంతియు, పొట్లతీగెయందు కఫదోషశాంతియు, పొట్లకాయయందు త్రిదోషశాంతియు, పొట్లవేరునందు విషదోషశాంతియుఁ జెప్పఁబడినది. పొట్లఆకులను కొందరు కూరచేతు రనియు, అది చలవజేసి త్రిదోషముల నడంచు ననియుఁజెప్పఁబడినది. పెద్దజాతి చిన్నజాతి పొట్లకాయల గుణ మొకటియే. చేదుపొట్ల లేక అడవిపొట్ల చిగుళ్ళు, లేక ఎండుకాయలతొక్కలు విరేచనము గల్గించు ననియు, జీర్ణశక్తి నుద్రేకింపించు ననియు, పచ్చియాకులరసము వాంతిగల్గించు ననియు, కాడలరసము శ్లేష్మమును వెడలించు ననియు, వేరురసము విరేచనకారి యనియు, సమూలకషాయము త్రిదోషహరమై ఉబ్బురోగము, కామిలరోగము, కుష్ఠరోగము, జ్వరములు, పాండురోగముల నివారించి, వ్రణములమాన్పి బలము గల్గించు ననియుఁ జెప్పఁబడినది. లింగపొట్లయందరుచిదోషము, ఉబ్బుజాడ్యము, పైత్యరోగము, వాతరోగముల నివారించు గుణము కలదని చెప్పఁబడినది. పొట్లజాతి కంతకును ఆగాకరకాయ, అవాలచూర్ణము, దోసకాయ, మోదుగ క్షారము పరిహారము లని చెప్పఁబడినది.

**పొటాషియుమ్** (Potassium metal). ఇది ఆల్కాలైను Metal అని చెప్పఁబడినది. దీని Chemical symbol K. అనఁగా (Arabic kali) అనియు, Atomic weight 39.1 అనియు, Atomic number 19 అనియు, Specific gravity 0.87 అనియు, Melting point సెంటిగ్రేడు థెర్మామీటరు 62 డిగ్రీల వేఁడియం దనియు చెప్పఁ బడినది. ఇంచుక Violet ధాతువుగల తెల్లని రంగుగల లోహము. నీటికన్న తేలికగానుంట నీటియందు

తేలును గాని దానికిఁ దగిలిన నీటిని Decompose అగునట్లు చేసివేయును. దీనియందు విస్తారము గా నీటితో సంబంధము కలదని చెప్పఁబడినది. అనఁగా Oxgen తో సంబంధముంచుట నీటిలోని ఆక్సిజెనును లాగునని తేలుచున్నది. ఇది Metalic base of Potash అని చెప్పఁబడినది.

ఇది ప్రత్యేకముగ భూమియందు దొరకునది కాక Felspar తోను, Mica తోను గ్రెనైట్ గాళ్ల యందునను చెదరి దొరకును. దీనికలుపులు అనేకములు కలవు.

**పొటాసియుము** — క్షారలవణములను నీటఁగరగించి, బలమగువిద్యుత్ప్రవాహమునందు నెరపి భేదించిన బయల్పడిన ధాతువులలో నొకటి. పరిశీలకుఁడు సర్. హంఫ్రీ డేవీ పండితుఁడు. (హంఫ్రీ డే: కిలకుఁడుచూడుఁడు.) ఇది క్షారధాతువు.

ఇది తెల్లనిరంగు మైనమునుబోలిన మెత్తదనము గల్గినది. గాలి తగులుటచే రంగు మారునది. నీటఁ బడవైచిన చిటపటధ్వని చేయుచు నేరేడుపండురంగు మంటలతో గిరగిరఁ దిరుగుచు నీటిని భేదించి, యందలి హైడ్రోజను గాలిని వెడలించి, క్షారము నేర్పాటుచేయును. దీనిని సీసాలలో చమురునందు నిల్వయుంచవలసియుండును.

**పొటికి పోవుట**(Dry rot)-గాలితగులని తావున చెమ్మ గాని, ఎక్కువవేఁడి గాని ఉండిన పరిస్థితులయందు కఱ్ఱ కొకరోగము పొంచియున్నట్లు తలుచుగ సిద్ధమెయుండెడిని. దానికి "ఫంగస్" (Fungus) అని పేరు.

త్రోడనే దానినిబరిహరించి కఱ్ఱకు పురుగులఁబపఁగల ఘాటగు లేపనమును రుద్దకుండిన ఆకఱ్ఱయందలి చిన్న చిన్న గూడులను Cells తినివేయ లోనికేగి సర్వమును పటిమ లేకుండ జేయును. ఈరోగము పూర్తిగపనిచేయగల్గినచో మిగులునది కఱ్ఱపొడుము మాత్రమే. మఱియు నీరోగ మంటువ్యాధి యని తలంపఁబడుచున్నది.

ఇండ్లు కట్టుతఱి వేసిన దూలముల కిరుదెసల గాలి వచ్చుచు పోవుటకు కాళీజాగా వదలుట ఈరోగము గలుగకుండుటకే.

**పొట్టికాకర**— (కాకరచెట్టు చూడుఁడు).

**పొట్టి పోతరాజుకొల్వు**— (ఆంధ్రిలోకోక్తి.)

**పొట్టివానికి పుట్టెడుబుద్ధులు** — ఈసామెత వామనుఁడు బలిచక్రవర్తి నడంచు (వంచించు) టకు పన్నినపన్నుగడచే వచ్చినది.

**పొట్టివారు (వామనులు)** — ఉండవలసినంత పొడవు లేకపోవుటకు "పొట్టి" యని ఆంగ్లదేశస్థులు వాడుచుందురు. భరతదేశపు విధానమున అన్యములతో పోల్చి పొడవు, పొట్టి, వలము, సన్నము, గొప్ప, కొలఁది యనవలయునే కాని, ఇట్టివి స్వతంత్రశబ్దార్థములుగ వాడరాదని సిద్ధాంతపఱుపఁబడినది. మనుష్యులు సర్వసాధారణముగ నుండు ఎత్తుకన్న తక్కువగ నుండువారి నాంగ్ల దేశస్థులు "Dwarf" అనియెదరు. అట్టివారు దక్షిణాఫ్రికాయందలి (అ॥ ౪ అం॥ ౭) గల బుష్మెను జాతివారు, ఆఫ్రికామధ్య భాగములందుఁ గాననగు (అ॥ ౪ అం॥ ౧౦ ల) పిగ్మీజాతివారును నెయున్నారు.

**పొట్టి**— పొట్టివారిని వామనులని యందురు. ఉండవలసినంతపొడవు లేక ఎత్తు ఉండక తగ్గియుండుటను పొట్టి యందురు.



**పొటు్నూరు** — ఆంధ్రదేశమున, విశాఖ పట్టణ మండలమున సింహాచల క్షేత్రమునకు కొంతదూరమున నీగ్రామ మున్నది. అది యొకప్పు డాప్రాంతసీమ నేలిన మేదినిరావువా రనుప్రభుపరంపరకు రాజధాని యైయుండెను. వీరిలో "కళింగమేదినీరావు" అనునొక నృపుని పేరు వాడుకయం దున్నది.

కళింగదేశ భాగములందు వైశ్యరాజువా రనియు, పొటు్నూరువా రనియు ఇంటిపేరులు గల కళింగకోమటు లనంబడు వైశ్యులు కలరు. వారిలో కులసంబంధమర్యాదలలో వైశ్యరాజు వారు రాజమర్యాదలను, పొటు్నూరివారు దివాన్గిరీమర్యాదలను కులకట్టుబాటుగ నందు చున్నారు. ఆక్షిపొటు్నూరివా రీయూరినుండియె పేరందిరంట. ఈవిషయమై యింకను పరిశీలనలు జరుగవలసి యుండును.

**పొటు్నూరు సీమ**—పొటు్నూరు విశాఖ పట్టణ మండలమున సింహాచల ప్రాంతమున నున్నది. తొల్లింటికాలమున నీసీమను రాయవంశ జుఁడగు అర్జునదేవరాజుకుమారుం డేలినట్లు తెలిసెడిని. అది క్రీ. వె. ౧౪-౧ ప్రాంతము. శ్రీకృష్ణదేవరాయ చక్రవర్తి దండయాత్రకాలమునపొటు్నూరుసీమను బాహుబలేంద్రబిరుదాంకితులగు మేదినిరావువా రేలుచుండినటుల కృష్ణదేవరాయల పొటు్నూరుజయస్థంభమున కలదు.

పొటు్నూరున పొటు్నూరువారను ఇంటిపేరు

గల కళింగకోమట్లు దివానులుగ నుండిరట. నేటికిని వారిలో భోజనమర్యాదగా పొట్నూరు వారికి మంత్రిమర్యాదలు జరుగుట యాచారమై వచ్చుచున్నది.

**పొటెన్షియోమీటర్**— (Potentiometer) ఎలక్ట్రోమోటివ్ ఫోర్సు కొలిచి లెక్కించు యంత్రపరికరము.

**పోటమోలోజీ** (Potamology) — నదులకుసంబంధించిన పరిశోధనములు సలుపు శాస్త్రము.

**పొడపత్రి (ఆకు) చెట్టు**— దీనింగూర్చి సరిగాఁ దెలియదు.

దీని రస కషాయములు కాఁకజేసి, నూనె వలనఁగల్గిన పిత్త్యవికారాదిదోషముల డంచు ననియు, తేలువిషపు బాధను నివారించు ననియు, జ్వరదోషము, నేత్రరోగములు, వాత రోగములు శమింపఁజేయు ననియు నందురు.

**పొతపినాటి సీమ** — కడప జిల్లాలో, బద్వేలు, పుల్లంపేట, సిద్ధవటము తాలూకా లీపేరంబరగుచు మట్లభూపతుల పాలనయం దుండెను. క్రీ. శ. ౧౫౭౦లో పొందలూరులోని దేవస్థానమునకుఁ గొన్ని భూము లిచ్చినటుల నం దలిశాసన మున్నది. ౧౭ శతాబ్ద ప్రారంభమున మట్ల అనంత (రామ) రాజు గొప్పదాత యని పేరందిన భూపతి. ఈతనిసోదరపుత్రుఁడే మట్ల అనంతభూపాలకవి.

**పొత్తిదుంప**-లా. Gloriosa, Superba ఆంగ్ల.-Country poison root అని కొంద రనెదరు గాని సరియగు ననువాదనామము దొరకలేదు. సం. అగ్నిశిఖః, కలిహారిః. దీనినే అడవినాభి యని కొంద అనెదరు. కాని అడవి నాభిదుంప వేరని కొంద రనుచున్నారు. కాక జేయు ననియు, స్త్రీలకు గర్భస్రావము గల్గించు ననియుఁ జెప్పఁబడినది.

దీని పతుదీసి జాగ్రతగా వాడిన వాత రోగము, ఉబ్బుజాడ్యము, అగ్నిమాంద్యరోగము నివారించు ననియు, దీనిగంధము పైన పూసిన గడ్డలు హరించుననియు, జెట్టి, తేలు, పురికొస కఱచినవిషబాధ మానుననియు, ప్రసవవేదన పడుచుండుస్త్రీల హస్తపాదములకుఁ బూసిన శీఘ్రప్రసవము గల్గించుననియుఁ జెప్పఁబడినది. నాభియు పొత్తిదుంపజాతిదే. (నాభి చూ.)

**పొదుగు కోసి పాలు త్రాగఁదలఁచి నట్లు**—(ఆంధ్రలోకోక్తి).

**పొన్నగంటికూరచెట్టు**- లా. Achyranthes triandra. సం. లోహమారకః.

నీటివార పెరుగునట్టికూర. భోజనపదార్థము. చలవజేయునది. త్రిదోషహరము. సమస్త నేత్రరోగములఁ బోనడఁచి పథ్యమైయుండును. దీనిపసరునందు నేత్రరోగములకుదుర్చుశక్తియు గాయములు మాన్పుశక్తియుఁ గలదందురు.

**పొన్నచెట్టు**— లా. Calophyllum Inophyllum ఆంగ్ల. Alexandrian Laurel సం. దేవవల్లభః (సురపొన్న), నాగ పుష్పకః (సాధారణపుపొన్న), పున్నాగం (పొన్నసామాన్యము). పొన్నపూవులందు చక్క నిపరిమళము కలదు. గాన పూఁదోఁటలందు నాటి పెంచుదురు. ఇది ఏటివార నిసుకలందు, సముద్రతీరములందు, ఇసుకలలోఁగూడ పెరుఁగు నది. పెద్దపూవులు పూచుజాతిని సురపొన్న, లేక పెద్దపొన్న యనియు, చిన్న (సాధారణపు) పూవులుపూచుజాతిని పొన్న యనియు వాడు దురు గాని రెండును నొకేజాతిగ నడచెడిని. పొన్నకాయలలోని పిక్కలనుండి నూనె తీయుదురు.

దీని చెక్క, ఆకుల రస కషాయములు, మూత్రము వెడలించు ననియు, దీనిచక్క గంధము గాని, ఆకులు వెచ్చఁజేసి గాని, పైన

నలదుటవలనను, కట్టుటవలనను గడ్డలు హరించు ననియు, పొన్ననూనె మర్దనచేసిన మేహవాతపు నొప్పులుశమించుననియుఁ జెప్పఁబడినది. ఇం దధమపుజాతి అడవిపొన్న యనఁబడుజాతియొకటి కలదు. దీనిచెక్కరసమునందతిమూత్రమునడఁచు గుణము కలదందురు.

**పొన్నాడీలు**- (ఆంధ్రబ్రాహ్మణులుచూ)

**పొన్నిగంటి తెలగన్నకవి**— ఆంధ్ర కవులలో మధ్యకవులందు పరిగణింపఁ బడిన వాఁడు నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రము. తండ్రిపేరు భావరాజు. అచ్చ తెలుఁగుకావ్యములు రచించుటకు ప్రథమమున ప్రయత్నించి శుద్ధాంధ్ర పద్యకావ్యమును రచించినకవి.

ఈతఁడు యయాతిచరిత్ర మను శుద్ధాంధ్ర ప్రబంధము రచించి, అమీనానను మహమ్మదీయప్రభున కంకితము గూర్చెను. అమీర్ ఖాన్, ఇభరామ్‌షా కొల్వునందు గొప్ప యుద్యోగి యని తెలిసెడిని. ఇబ్రహీం కుతుబ్షా గోల్కొండ నవాబులలో మూఁడవ వాఁడు ఇతనితండ్రిపేరు జంషీద్ కులి కుతుబ్షా. క్రి.వె. ౧౫౫౦-౧౫౮౧కాలము.అమీనానుసుతుఁడు ఫాజిలఖాన్.

**పొమొలజీ** (Pomology) — పండ్ల జాతుః వ్యవసాయమునుగురించిన పరిశోధక గ్రంథము. అడవియందలి వృక్షజాతులనుండి చక్కనిపండ్లజాతులను సేకరించి యభివృద్ధిలోనికి దెచ్చువిధాన మంతయు నిం దుండును.

**పొమ్మనలేక (ఇంటిలో) పొగపెట్టి నట్లు**—(ఆంధ్రలోకోక్తి.)

**పొయ్యి అఱచుట** —పొయ్యియందు కట్టెలు మండుతఱి నొక్కొకప్పు డొకవిధమగు చుంయిధ్వని గల్గించును. దానిని పొయ్యిఅఱచుచున్నదనియు, ఇంటికి బందుగులు వత్తు రనియు నందురు.

మనుష్యశరీరములందు వలెనే వృక్షములశరీరములందునను అంతటను చిన్నచిన్నగూళ్ళు, వాట్లనడుమ సన్నని రంధ్రములునుండును. ఆగూళ్ళు రంధ్రములు కఱ్ఱయొక్క వాటము ననుసరించి పొడవుగనో పొట్టిగనో గొట్టములవలె నుండును. వీట్లనిండ రస ముండును. ఈరసమునే చెట్లు వేళ్లుమూలమున భూమినుండి పీల్చుకొనుచుండును. కొన్ని గూళ్లయందు నూనెయు నుండుటకలదు. ఈనూనె చెట్టుముదిరినకొలఁది అధికమగును. చెట్టు చచ్చినపిదప కొంతకాలము వఱకీరస మెండక యందే నిలిచియుండును గాన పచ్చికట్ట మండదని మన మనెదము.

కఱ్ఱయందలినూనె కఱ్ఱఎండినకొలఁది కఱ్ఱను బట్టి చిరకాలము నిలిచియుండును. దానిని యంత్రసాహాయ్యమున దీసి కఱ్ఱనూనె యందురు. మంచిగంధమునుండి తీసినతైలము (Sandal wood oil) గూడ నిట్టికఱ్ఱనూనెయే.

కఱ్ఱలు కాలుతఱి తెఱచి బయట కందిన యొకానొకగొట్ట ముండునేని దానిగుండా పొగ పర్విడును. అప్పుడు పిల్లలు బూరా ఊఁదినరీతి సంభవించు ధ్వనియును,గట్టిగుంపులు కాలుతఱి ప్రేలుడుధ్వనియును సంభవించును. ఈధ్వనినే ప్రొయ్యి అఱచుచున్నదని పల్కుదురు. వెదురు బొంగులుగల ఇండ్లుకాలుచున్నతఱి గుంపులుకడ ధ్వనిచేయుచు పేలుట పెక్కం డెఱింగినదే.

వృక్షశరీరమునందలి గూళ్లు వలయాకారముగనుండెడిని. మొక్క ఎదిగినకొలఁది చుట్టును వేర్వేరుగూళ్ళు జనించుచు,మొక్కవలమగుచో వేర్వేరువలయములుగ నేర్పడును. చెట్టు పెద్దదగుకొలఁది ఈవలయములొకటినిజుట్టి వేరొకటి ఏర్పడుచు చెట్టు ముదురువఱకు పెక్కు లేర్పడును. ముదిరినవృక్షము నడ్డముగఁగోసిన నీవల

యములు గాన్పించెడిని. వీట్లకు గ్రెయిన్స్ ఆఫ్ వుడ్ (Grains of wood) అని వాడెదరు.

**పొయ్యిఅటిస్తే చుట్టాలు, కుక్కలుకూస్తే కఱవు, పిల్లుల కేసే కలహము**—(ఆంధ్రలోకోక్తి).

**పొయ్యి ఊదినమ్మకు బుగ్గైనా వుండకపోతే ఏలాగు?** (ఆంధ్రలోకోక్తి).

**పొయెట్రీ** (Poetry)— కవిత భావోద్రేకపూరితమును, ఛందోబద్ధమును నగు భాషారచనము.

అలంకారయుతముగను, అభినయరూపకముగను తనభావములను మృదుమధుర శైలిలో వెల్లడించుటయే పద్యము. మానవజీవితమునందలి పరమరహస్యములను వెలడించి కళాప్రవాహములో తేల్చి యానందింపఁజేయునది కళ.

గ్రీకుతత్త్వశాస్త్రజ్ఞుఁడు "మాథూఆర్నాల్డు" (Mathew Arnold)మానవజీవితమును విమర్శించుటయే కవిత యనెను.

**పొరిగింట చూడరా నాపెద్దచెయ్యి** (ఆంధ్ర లోకోక్తి.)

**పొరిగింటి కలహము వినవేడుక**— (ఆంధ్రలోకోక్తి.)

**పొలిటికల్ ఇకానమీ** (Political Economy)— ఈశాస్త్రము పాశ్చాత్యకలమైయున్నది. ఇది దేశమందలి ధనపరికరము "National wealth of Country" అని చెప్పఁబడినది.

ఇది "Production" అనియు, "Consumption"అనియు, "Distribution"అనియు మూఁడుభాగములుగ వివరింపఁబడినది.

౧ ప్రొడక్షన్- అనిన దేశమందు పండిన పంటలు, చేయఁబడిన వివిధవస్తుసామగ్రి మొదలగు నాయ తపఱుపఁబడిన వసుసంపద.

౨ కన్సంప్షన్ అనిన ఏదేశమున పండిన పంట లాదేశమున నుపయోగించుకొని అనుభవించుట, ఏదేశమున చేయఁబడిన వస్తువు లాదేశముననే వాడుకొనఁబడుట, ఉపయోగించుకొనుట మొదలగునవి. అనఁగా ఆదేశపు ప్రజలచే నుపయోగించుకొనఁబడుట యని భావము.

3 డిస్ట్రిబ్యూషన్ అనిన స్వదేశమునందవసరములేని పంటదినుసులను చేయఁబడి ఆయత్తపఱుపఁబడిన వస్తువితతి నితరదేశములకంపి విక్రయించి ధనముగ మార్చుకొనుట.

ఇది నవీనశాస్త్రము. క్రీ. వెనుక ౧౭౭౬ సంవత్సరప్రాంతముల "Adam Smith" అను మహనీయుఁ డొనర్చిన పరిశీలనలు వ్రాసిన వ్రాతలు నీశాస్త్రమునకు మూలములు. దీనిననేకగ్రంథములు వ్రాయఁబడినవి.

**పోర్టొరైకోద్వీపము** (Portoricol Island)— ఇది పశ్చిమ గోళార్థమున పసిఫిక్కు మహాసముద్రమునందు వెస్టిండీస్ అను పేరుగల ద్వీపములందు పెద్దఆంటిలీద్వీపములనిచెప్పఁబడు ద్వీపములలో నొక ద్వీపము. 3౫౦౦ చతురపుమైళ్ళవైశాల్యముగలది. అమెరికాసంయుక్తరాష్ట్రమువారికిఁజెందినది. తొల్లింట స్పానియాదేశమువారిదై యుండెను. (వెస్టిండీస్ ద్వీపములు చూడుఁడు. పెద్ద ఆంటిలీద్వీపములు చూ.)

**పొంపీస్ పిల్లరు (స్తంభము)** Pompey's Pillar)— ఇది అలగ్జాండ్రాపురము (ఈజిప్టు)నందు కలదు. తొల్లి యీపురము రోమకసామ్రాజ్యమునం దుండినతటి నీపేరు గల్గి యుండనోపు. కాని, పొంపీసంబంధము తెలియరాకున్నది. దీనిని స్థాపించినవారు "Diocletian" అను పేరుగల చక్రవర్తియని దానియందలి శాసనమునఁ గలదు. ఇది

అసో ఆన్ దేశపు గ్రెనైటురాతిపని. గుండ్రని స్తంభాకారమున నున్నది.

ఇది ఒకటవ సెటీ అను పేరుగల ఫరో ప్రభువు కాలమునందుండిన యొక దేవస్థానమును పునాదిగఁ జేసి ఒక Oblilisk స్తంభము యొక్క మూలలు చెక్కివైచి గుండ్రని స్తంభాకారముగ నొనర్చి తలను నిర్మించిరనియు, ఇది రోమనుల యధికారకాలమునఁ జేయఁబడినపని యనియు నిటీవలి పరిశోధకు లనుచున్నారు. ఒకటవ సెటీ ఫరోప్రభువు క్రీ.ము. ౧౩౦౦ ప్రాంతమువాఁడు

ఇందువలన అలగ్జాండరు నిర్మించిన అలగ్జాండ్రియాపురము తొల్లింటనే యుండినపుర ప్రదేశమున  ంపఁబడి ఆయనచే తనపే డఁబడినదిగాఁ జెప్పనచ్చును. తొల్లింటి ఒకటవ సెటీ కాలమునాటి దేవాలయ మేదియో రేమో తెలియరాకున్నది.

**పోఁకచెట్టు**—లా. Areca catechu ఆంగ్ల. Areca nut లేక Betel nut. సం. గువాకః, గుహపుష్పః, పూగః, పూగీ, వల్కతరుః, దీర్ఘ పాదపః.

నీటిపారుదల వసతి గల తావులందు పోఁక చెట్టు చక్కఁగ పెరిఁగి కాఁచి ఫలించునది. నీరు లేకున్న కాపు సరిగా ఫలింపక వ్యర్థ మగును. దీని యుపయోగములు పెక్కు గలవు. పోఁక మ్రాను ముదిరినది గట్టిగ నుండి వాసములు శోణులుగ నుపయోగించును. పోఁకపొత్తితో దొన్నెలు జేయఁబడుట విలువగలది. పోఁక పూవునందు చక్కని పరిమళము గలదు. పోఁక చెట్టు కాయలగెల పండినంతనె పలురకముల పోఁకచెక్కలఁ జేయుదురు. గాన విలువగల్గి యుండును. పోఁకచెట్లను దగ్గరదగ్గరగా నాటుట వలన తక్కువజాగాలో నెక్కువచెట్లు నాట నగును. పోఁకకాయ విరేచనము జేయును. దంతములకు బలము జేయును. జలుబు హరించును. తాంబూలమునందు పోఁకలు తప్పవివి.

పోఁకకాయల కషాయము పుచ్చుకొనరాదనియు, పోఁకకాయ ఒక్కొకప్పుడు కల్గించు డెక్కుపట్టు, వికారము, ఆయాసమునకు చింతపండు, వెట్టిపుచ్చవేరు రసము, తడిసినబట్టగాలియు పరిహారములు.

**పోకారు శాఖ క్షత్రియులు**—(క్షత్రియులు చూడుఁడు.)

**పోచనకవి**— ఆంధ్రకవులలో నాథునికులందు పరిగణింపఁబడినవాఁడు. వెలనాటి బ్రాహ్మణుఁడు. తం( పేరు నృసింహ సోమయాజి. రచించినది చంద్రాభ్యుదయమను ప్రబంధము.

**ప్రోచిరాజు వీరన్నకవి**— ఆంధ్రులలో నాథునికులందుపరిగణింపఁబడినవాఁడు. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. తండ్రిపేరు వీరభద్రయ్య. తల్లిపేరు మూర్తిమాంబ. నివాసము గుంటూరు మండలములోని కొలకలూరు.

ఈ కవి రచించిన గ్రంథములు కృష్ణార్జున సంవాదము, విభూతి మాహాత్మ్యము, మార్కండేయచరిత్ర, మనువంశపురాణము, ముక్తదేవుని కథ, ఆనందలహరి, సౌందర్యలహరి, సుభాషితము, భల్లాణచరిత్రము నునువి. ఈకవి పంచ కావ్యములుగూడ రచించెనఁట.ఇందు మనువంశ పురాణమునకు ఖండకపాలాఖ్యాన మనిపేరు. ఇది బెజవాడలో మల్లేశ్వర స్వామికిఁ గృతి సమర్పింపఁబడినది. భల్లాణచరిత్ర బందరుపుర ములోనిఆర్యకులక్షత్రియులగు (ముచ్చికులము) దాము మొగ్గన్నగారికిఁ గృతి యీయఁబడెను.

**పోజటివిజమ్** (Positivism)— దీనికి కర్త Auguste Comte యనంబడు ఫ్రెంచి దేశస్థుఁడు. క్రీ. వె. 1798–1857 మధ్య జీవించి యుండినవాఁడు. ఈయన కనిపెట్టిన సిద్ధాంతము మనుష్యు లెఱుఁగఁదగిన జ్ఞానము. అదిజగత్పదార్థవిజ్ఞానమేయనియు,మనుష్యుల యూహాలకు

మూఁడంతరము లుండు ననియు, మొదటి యవస్థయందు దేవునియందు, లేక దేవతల యందు నమ్మకము, రెండవ యవస్థయందు గడించుటయందు చిత్తము లగ్నమగుట, మూఁడవ యవస్థయందు పదార్థవిజ్ఞాన చింతనము. (ఈమూఁడవయవస్థకే ఆయన "Positive stage" అని పేరిడెను.) ధర్మము లని వైయున్నవి. వీరిమతమున మానవారాధనమే మత విధి. దీనినే "Humanity" అని వివరించెను.

పూర్వులపేర్లను, వారి ఘనకార్యములను వివరించుచు ఈయన యొక Calander ను గూడఁ గూర్చెను. అందు అనేక సత్యములను పొందుపఱచెను.

**పోటుల లేక పోతల గోత్రము** — (హారిత ఉపగణము చూడుఁడు).

**పోటు కాలమున నెక్కువ నీరు, పాటువేళ తక్కువనీరు**--సముద్రమునకు పోటు ఇతర గోళముల యాకర్షణమునుండి కల్గును. ఆకర్షణతాకని తావులనుండి తాకిన పోటుతావులకు జలములుచేరి అధికమైన పోటు తగిలినదందురు. జలములు పోటునకుఁబోయి (ఆకర్షింపఁబడి) నీరు తగ్గిపోయినతావులు పాటు నందె ననుచుందురు. పాటు అనిన పతన మని యర్థము. ఆంగ్లమున పోటునకు "High tide" అనియు, పాటునకు "Low tide" అనియు నందురు. పోటునందు నీ రెక్కువ యగుటకు "Ebb" అనియు ననుట కలదు.

**పొడవగువృక్షములు వైర్లెస్ వార్తల ను లాఁగికొనుట**--జీవించియున్న పొడవగు వృక్షములు వాయువార్తల నాకర్షించు నని General Squier అనుపేరుగల అమెరికాదేశపు ఇంజినీరుగారొకఁ డిటీవల కనిపెట్టియున్నాఁడని తెలియుచున్నది. అట్టివార్తల నాకర్షించు శక్తి వాటికిఁ గలదఁట. ఇది యింకను నిదానింపఁదగినసంగతిగా నున్నదందురు.

**పోడూరి పెదరామామాత్య కవి** — ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. ఆరువేలనియోగిబ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రము. భారద్వాజసగోత్రము. తండ్రిపేరు శివరామయ్య. తల్లిపేరు సీతమ్మ.

రచించినది శివరామాభ్యుదయమను ద్వ్యర్థి కావ్యము. దీని నాచంటగ్రామములోని రామలింగేశ్వర స్వామికిఁ గృతి సమర్పించెను.

**పోతలభవనము**—(లహసాపట్టణము చూడుఁడు).

**పోతలమఠము (లహసాపురి)**— (Potala, Lahasa) లహసా పట్టణము టిబెట్టుదేశమున ప్రధానపురము. దేశపరిపాలకుఁడగు దలైలామాస్వామికి (బౌద్ధభిక్షువు) నివాసము. వారినివాసభవనమునకు పోతలమఠ మని పేరు. ఇది యొక కొండపక్కగ శిఖరముదనుక నిర్మింపఁబడిన గొప్పభవనము. పట్టణపుపశ్చిమ ద్వారము గడచి దీనిని జేరవలసి యుండును. పురముబైట నొకమైలు దూరముండును.

టిబెట్టుదేశము వృక్షరహితమగున దైనను, లహసాపుర మంతయు చెట్లువిస్తారముగ పెంచఁబడినవి. పోతలమఠభవనము పొడవు తొమ్మిదివందల అడుగులు. ఇంచుమించు పదునే నంతస్తులుగ నిర్మింపఁ బడినది. ఇది లండను నగరమందలి సెంటుపౌల్సు దేవాలయముకన్న డెబ్బది యడుగు లధికమగునెత్తుకలదిగ జెప్పుచున్నారు.

మఠమునకు మధ్యభాగమందున నెత్తగు భాగపుమేడలకు పోడాంగు మార్పో యనిపేరు. ఇందు దలైలామా జగద్దేశికుఁడు వసించుచుండును. ఇందు మధ్యమునందు ప్రధాన దేవసానము కలదు. దానిద్వారమున ఎనుబది యడుగుల పొడవు, ఇరువదియై దడుగుల వెడల్పుగల

యాకురోమములతో నేయఁబడిన పసుపుపచ్చ రంగు తెర యొకటి వ్రేలాడుచు రోమములసముదాయము వ్రేలాడఁదీయఁబడిన ట్లగపడుచుండెడిని. పైని బంగారు మలామా కప్పివేయఁబడి యున్నది.

**పోతులూరివీరబ్రహ్మంగారిమఠము**- ఈ ప్రసిద్ధమఠము కడపజిల్లా, బద్వేలు తాలూకాయందు "కందిమల్లయపాలె" మన్న గ్రామమునం దున్నది. ఈమఠమున వీరబ్రహ్మము గారి సమాధి ముఖ్యమైనది. వారు విశ్వబ్రాహ్మణ కులజులు. పోతులూరివారింటి పేరు. జననకాలము తెలియదు. ఇదియే జన్మస్థల మందురు. ఈ ప్రాంతమున గ్రామము లధికముగ లేవు. ఒకటి కొకటి కడుదూరము. వీరికాలమున ఆ గ్రామమున పదునెన్మిదియిండ్లవారు మీరుండి రట. నీటివసతికి లోఁతైన గొప్పబావులు రెండున్నవి. కాని లోనికి దిగుట, నీటితో పైకెక్కి వచ్చుట మిగుల శ్రమకరముగ నుండును. వీరబ్రహ్మము గారు గొప్ప తత్త్వజ్ఞుఁడు. ఆయన చెప్పిన పాటలు "పోతులూరి వీరబ్రహ్మంగారితత్త్వము" లని పేరొందియున్నవి. వీరికి శిష్యులు కలరు. అందు దూదేకుల సిద్దయ్యగారు ముఖ్యులు. వారి కీప్రాంతముననే ఉన్న 'ముడుమాల' అను గ్రామమున ప్రత్యేకమఠము కలదు. వారును కొన్ని తత్త్వపుపాటలు రచించినవారే. ఆంధ్రదేశమందు విశ్వబ్రాహ్మణుల కీమఠములందు భక్తి యధికము. ఇతరకులములవారైనను భక్తులీమఠమును దర్శించు చుందురు. ఏటేట శివరాత్రులం దీతావుల జాతరలు జరపుచుందురు.

**పోతాండరోగము** — దీనిని గుజ్జపు ముష్కరోగ మని యందురు.

**పోనీ లేక టంగణాగుఱ్ఱము**—చిన్న జాతిగుఱ్ఱ మనియర్థము.

ఇంగ్లాండు దేశములందు పెట్లాండుపోనీ లని యుండును. బర్మాదేశమునందు పెగ్గోపోనీ లని కలవు. ఇట్టివి తట్లు అనంబడుచున్నవి.

**పోపీ డే** (Poppy day)— ఐరోపా మహాసంగ్రామ విరామదినమున కీపేరు వర్తించెను. అది Armistice day అనంబడు నవంబరు ౧౧ తేదీగ నున్నది.

నాఁడు పోపీపువ్వులవలె కృతకపుష్పములు రచించి అమ్మి యాసొమ్మును ఆయుద్ధసైనికులుగ నుండినవారికై యుపయోగించుచుందురు.

**పోపుదేశికుఁడు** — రోమ న్కాతలిక్కుమతస్థులగు క్రైస్తవులకు జగద్దేశికుఁడు, మత పరిపాలకుఁడు గాన పోంటిఫ్ అను బిరుదనామము కలవాఁడు. క్రీస్తుప్రభువు శిష్యపరంపర (సెంట్ పీటరుగారి శిష్యప్రశిష్యసంతతి) కగ్రగణ్యుఁడు. 'పాప్రడీ' యనుపేరుననుండి 'పో' పను పదమేర్పడి ౧౦౭౩ దనుక అందఱు బిషప్పులకు నీపే రుండెడిది. ఇప్పుడు కార్డినలు మహాపురుషులచే నెన్నుకొనఁబడుచుండువాఁడు. (వెటికాన్ చూ. రోమకపురి చూ. ఇటలీదేశము చూ. పోపుమహాత్ముని ఎన్నిక చూ.)

**పోపుమహాత్మునిఎన్నిక** (Election of Pope) — పోపు మహనీయుఁడు రోమన్ కాతలిక్కు క్రైస్తవమతస్థులకు ప్రధానాచార్యుఁడు. ఇటలీ దేశమున రోమకపురికడను వెటికానునందు మతాచార్యుఁడే గాక, వెటికాన్ నందలి ప్రభుత్వము నడుపుచుండువాఁడు. వీరిని Cardinals అనఁగా వెటికాన్‌నందలి ఆచార్యులు కలిసి ఎన్నుకొందురు. వారిసభకు Conclave అనిపేరు. ఈపదము తాళపుచెవి అని యర్థమిచ్చు Clavia అనుపదమునుండి కల్గినది. ఒకపోపు చనిపోయిన పదియవదినమున మఱియొకపోపు నెన్నుకొనుటకు Conclave సభ కూర్పఁబడును. ప్రథమమున నందలి

ప్రధాన దేవస్థానమున ప్రార్థనలు జరిగి పిదప ఎన్నికలు జరుగును.

అత్తఱి Cardinals లో Master of ceremonies ఉద్యోగి Papal cross ను పట్టుకొని దేవాలయమునకు తక్కిన Cardinals వెంట రా నడుచును. అందు Apostolic constitution విధానమును దాఁటమనియు అంతయును చక్కఁగ గమనించువారమనియు, ఆ సాంప్రదాయస్థులమే యనియు, Cardinal ఆచార్యు లందఱును ప్రమాణము లొనర్తురు. ఇది ప్రారంభము. ఇట్టివే కొన్ని రోమ న్కాతలిక్కు మతోత్సవములు జరుపఁబడును. సాయంతన మగువఱకు ఆచార్యులగు కార్డినల్సు తప్ప తక్కినవా రందఱు, ఎన్నికలు జరగు పవిత్రస్థలము నీడి, ఇవతలకు వచ్చెదరు. తోడనే లోన కార్డినల్సు తాళము వైచుకొనెదరు. లోపల మూఁడుమడతల కాగితములపై సమ్మతులను వ్రాసి రహస్యముగ ఎన్నికలను నడుపుదురు. మూఁడువంతులలో రెండువంతులు ఎవ్వరికి వచ్చునో వారు ఎన్నుకొనఁబడిన ట్లెంచఁబడుదురు. అత్తఱి కార్డినల్సులోని Deau అధికారి గట్టిగ సుపన్యసించుధోరణిని ఎన్నుకొనఁబడిన Cardinal నుద్దేశించి ఎలుఁగెత్తి "మీరెన్నుకొనఁబడిరి. నాస మీయంగీకారము దెల్పుఁ" డనును. అయన యంగీకరించినకతన Senior Cardinal Deacon అధికారి తాళము తీసికొని వెలుపలికి వచ్చి అచటఁ గూడియుండు వారలకు, ప్రజలకు ఆసంగతి ప్రకటించును. "I announce to you all a great joy. We have as pope (Pontiff) the most Eminent and most Reverend. పేరు—Cardinal of the Holy Roman Church, who has taken the name of—" అనును. ఇది లాటిన్ భాషకు ఆంగ్ల భాషానువాదము.

**పోపు మహాత్ముని ప్రభుత్వ సంస్థానము**—(ఇటలీదేశము చూడుఁడు.)

**పాప్సీ** (Popsy)— ఫ్రెంచిభాషాజన్య పదము. కన్యను ప్రేమించుటను దెల్పువిధానము.

**పోమికల్చర్** (Pomiculture)— పండ్ల యభివృద్ధులనుగురించిన కళ.

**పోయింటు**(Point)-Promolutory Head, Naze, Ness, Nose, Ras, Cape ఇవి అగ్రమునకు వాడఁబడు పదములు. Cape సముద్రములోనికి చొచ్చుకొనియుండు వెడలుపులేని భూమియొక్క కొన. (Land portions చూడుఁడు.)

**పోరానితావులకు పోతే రారాని నిందలు రాకవాన వు**-(ఆంధ్రలోకోక్తి).

**పోరిజమ్** (Porism)— ప్రాచీన గ్రీస్ దేశీయక్షేత్రగణితమునందలి సిద్ధాంతము.

**పోరునష్టము పొందు లాభము**— (ఆంధ్ర లోకోక్తి.)

**పోర్చుగలుదేశము**-ఐరోపాఖండమున ఐబీరియ న్వెనెన్సులాయందున్న దేశము. దీనికు త్తరమునను తూర్పునను స్పానియా దేశమును, దక్షిణమునను పశ్చిమమునను అట్లాంటిక్కు మహాసముద్రమును ఎల్లలు. దీనికి తొల్లింట రోమనులకాలమున లూసిటానియా యని పేరిడిరి. మనదేశమున కొందఱు వీరిది బుడతకీచు దేశ మని పేరు వాడుచున్నారు. ౩౬౦౦౦ చతురపుమైళ్ల వై శాల్యముగల దేశము. స్పానియా దేశమునందలి పర్వతపంక్తుల శేషమే యీదేశమునందలికొండలు. దేశము పీఠభూమి. ఉత్తర భాగమున మిన్హోనది, డోరోనది; టేగస్‌నది, మధ్య భాగమునను, గువాడియానానది దక్షిణ

భాగమునను ముఖ్యమగు నదులై యున్నవి. దేశము పశ్చిమపువైపు ఏటవాలుగ నున్నది. సిరాప్రా-డి - ఎస్ట్రెల్లా పర్వతపంక్తి కొస్టీలియన్ పర్వతశాఖయొక్క సాగుడుగ దనరి, కేప్రాక్ లేక రాకాప్లిస్బన్‌గా ముగియుచున్నది. సమశీతోష్ణస్థితిగల్గి, యారోగ్యవంతమై సారవంతమైన భూమిగల దేశము గాని వ్యవసాయము విస్తారముగ వ్యాపించియుండలేదు. కొంచెము ధాన్యములు, ద్రాక్ష తోటలు, నారింజ తోటలు, నిమ్మతోటలు, ఓలివృతోటలు, అంజూరా తోటలు అపరిమితముగ గలవు. స్పానియా దేశమునకన్న వర్షాధిక్యముగల దేశము. ఎఱ్ఱసారాయము. (Port wine) ఈ దేశమున ప్రసిద్ధి. అది ఒపోర్టో రేవునుండి ఇంగ్లాండున కెగుమతి చేయబడుచున్నది.

ప్రజలు స్పానియా దేశస్థులవంటివారు. ఆచారములును తత్సంబంధములుగనే యుండును. కాని, ఇరుతెగలవారికిని అంతరంగములుకలసిన మైత్రి యనుకలేదు. ఒకప్పుడిది స్పానియా దేశములో చేరియుండెను. క్రీ. వె. ౧౧౩౯లో వేఱై స్వతంత్రదేశ మాయెను. క్రీ. వె. పదునేనవ శతాబ్దమున నావికాయాత్రా సాహసములకు పేరందిన దేశమై యుండెను. అత్తఱి గొప్ప వర్తకదేశముగను, పెక్కు కోలనీ రాజ్యములు కలదిగను గూడ పేరందియుండెను. పిదప క్రీ. వె. ౧౫౮౦ లో రెండవఫిలిప్పు స్పానియా భూపతి దీని నాక్రమించి స్వాధీనపఱచుకొనెను. క్రీ. వె. ౧౬౪౦ లో తిరిగి విడిపించుకొని స్వతంత్రదేశ మయ్యెను. పిదప లిమిటెడ్ మోనార్కీయై యుండెను. కాని ఇటీవల రిపబ్లిక్కు (ప్రజాపాలన దేశము) గ జేసికొనిరి.

లిస్బను నగరము ముఖ్యపట్టణము. ఇది టేగసునదిపైనున్నది. విస్తారము వర్తకస్థలమును రేవును నై యున్నది. క్రీ. వె. ౧౭౫౫లో భూకంపమున చాల ప్రమాదమునకు లోనై, ౬౦౦౦౦ ప్రజలను గోల్పోయినది. ౩౬౦౦౦౦ జనులిందు వసించుచున్నారు. డౌరోనదీ ముఖద్వారముకడ నున్న ఒపోర్టో పురము గొప్ప రేవుస్థలమును వర్తకస్థానమును నై యున్నది. ఇది ౧౮౦౦౦౦ జనులు గల నగరము. సేతూబాల్పురము దక్షిణమున రేవుపట్టణము. గొప్ప సాల్టుగల్లీలు గలతావు. దేశమధ్యమం దున్న కోయింబ్రాపురము విశ్వవిద్యాలయస్థానము. ఇట నైరోపాయం దంతకు నధికవర్షములు కురియుచుండును. సిన్ట్రిస్పురము నైరృతిదిశగా నున్న పురము. ఇది లోకప్రసిద్ధనావికు డగు వాస్కోడిగామా జన్మస్థలము. (పోర్చుగీసు ఫారెన్ పొజిషన్సు, ఐబీరియన్ పెనెన్సులా, ఐరోపాఖండము చూడుడు).

**పోర్చుగల్ దేశప్రభుత్వము** (Portugal)— ఐరోపాఖండమందలి ప్రజాపరిపాలన దేశము.

ముప్పదియైదువేల నాలుగువందల తొంబది చతురపుమైళ్ళ వైశాల్య మనియు, ఒక కోటి యేబదిలక్షల జనసంఖ్య యనియు జెప్పబడినది. లిస్బనునగరము ప్రధాననగరము.

**పోర్చుగీస్ ఇండియా** — పోర్చుగీస్ ఇండియా యన పోర్చుగీసు టెరిటరీస్ ఇన్ ఇండియా యని యర్థము. ఇవి పశ్చిమసముద్ర తీరమందలి కొంకణదేశపు హద్దులలోని గోవా ప్రోవిన్సు ఆతీరముననే బొంబాయి కుత్తరముగ నున్న డామానును, కతియవాడ ద్వీపకల్పముకడ నున్న డయ్యూ ద్వీపమును నై యున్నవి. గోవాపట్టణమును మర్మగోవా యనియు, మర్మగావో యనియు నందురు. ఇట చక్కనిహార్బరు రేవుకలదు. పట్టణము పాడగుచున్నది. పంజము అను తొల్లింటిపేరుగల క్రొత్తగోవా నిర్మించి ప్రధానస్థాన మేర్పఱిచి యున్నారు. పోర్చుగీస్

ఇండియా మొత్తమున ౧౦౭౬ చతురపుమైళ్ళని తెల్పుదురు. పెక్కుకొండలు, అరణ్యములు గల ప్రదేశ మగుట సరిగా తెలియరాదు.

**పోర్చుగీస్ కోలనీ ఆఫ్ 'అంగోలా దేశము**—ఆఫ్రికాఖండమున ఆఫ్రికాపశ్చిమ భాగమున లోవరుగినియా దేశమున నున్నది. కాంగోఫ్రీస్టేటునకు దక్షిణముగానున్న దేశము. ఇందు సముద్రతీరముననున్న St. Paul De-Loanda పురము రాజకార్యనిర్వాహణస్థానము. బెంగ్యూయేలా దక్షిణముగానున్న రేవుపట్టణము. (లోవరుగినియా దేశము చూడుఁడు.)

**పోర్చుగీసు తూర్పు ఆఫ్రికా సెటిల్మెంట్సు**—ఇవి తూర్పుఆఫ్రికాయం దున్న తావులు. (తూర్పుఆఫ్రికా చూడుఁడు). ఒక ద్వీపమం దున్న మొజాంబిక్కుపురము ప్రధాన కార్యస్థానముగల పురము. పోర్చుగీసురాజ్యము కేప్ డెల్గాడో మొదలుకొని దక్షిణమున డెల్గోవా అఖాతమువఱకు వ్యాపించియున్నది. ఇది మొజాంబిక్కుఖండ మనియు, సోఫలా ఖండ మనియు రెండు భాగములుగ నున్నది. జాంబిసీముఖద్వారమునొద్ద క్విలిమాని పురము రేవుస్థానము. సేనాపురము జాంబీసీనదిపై వేరొక పట్టణము. సోఫలా పట్టణము దక్షిణముగా సముద్రతీరముననున్న రేవుపట్టణము.

**పోర్చుగీసు ఫారెన్ పొజిషన్సు**—అట్లాంటిక్కు మహాసముద్రమున అజోరీసు దీవులు, మడైరాస్ దీవులు, కేపువెర్డిదీవులును పోర్చుగీసుప్రభుత్వమునకుఁ జెందియున్నవి.

ఆఫ్రికాఖండమున అంగోలాటెరిటరీ, కాంగో టెరిటరీభాగ దేశము, మొజాంబిక్కు దేశమును పోర్చుగీసువారికిఁ జెందినవి.

ఇండియా దేశమున పశ్చిమసముద్రతీరమం దున్న గోవా రాష్ట్రము, డయ్యూ, డామన్ పరగణాలు పోర్చుగీసువారివి. చీనాదేశమున మకావో రాష్ట్రము వీరికిఁ జెందినది. అజోరీస్ ద్వీపములందు సెంట్ మైకేలుద్వీపము పెద్దది. ఈద్వీపములు నారింజలకు సుప్రసిద్ధములు. సగటున వీరికోలనీల వైశాల్యము ౮౦౦౦౦౦ చతురపుమైళ్ళని చెప్పఁబడినది. ౧౮౨౨ వఱకు బ్రెజిల్ వీరిహస్తగతమై యుండెను. పోర్చుగీసువారు ఆదిని గుడుహోపు అగ్రమును జుట్టి ఇండియాకు మార్గమును కనుఁగొనినవారు. పోర్చుగీసుభూపాలుఁడే గుడ్‌హోప్‌అగ్ర మని పేరిడినవాఁ డని చెప్పఁబడినది.

**పోర్చుగీసు (పోర్చుగల్) దేశామెతలు**—కుదురని రోగ మేదంటే బుద్ధిహీనతయే యన్నట్టు.

తలవెండ్రుకకుఁగూడ నీడ ఉంటుంది.

తెలచియుంచినపెట్టె దేవునికిఁగూడ భ్రమ కల్గిస్తుంది.

తొందరగా అడిగినప్రశ్నకు నిదానముగా జవాబు చెప్పవలెను.

నీరు దేనిని తేలుస్తుందో దానినే ముంచుతుంది.

నోరు జట్టి తేవడం, తల అనుభవించడము.

పొరుగువారు మంచివారుకాకపోతే దారము లేకుండా సూదిని ఎరువిస్తారని చెప్పఁబడినది.

**పోర్బందరు స్టేటు**—బొంబై రాజధాని ప్రభుత్వపు టధికారమునకు లోఁబడిన చిన్న స్వదేశసంస్థానము. ఇది కచ్ఛి ద్వీపకల్పము లోనిది. పోర్బందరుపురము రాజధాని.

**పోర్నిలెయిను**-(ఇమారీసారూను చూ.)

**పోలమ్మ-దేవత**—విశాఖపట్టణ మండల ప్రాంతమున నొకయూర పోలిరెడ్డి యను నొక పంటరెడ్డి కాపుర ముండువాఁడు. ఆయనభార్య

పేరు పోలమ్మ. పోలిరెడ్డిగారి కేమ్వురుసోదరులు. వా రందఱు సంతానవంతులు; పెద్ద పెద్దకుటుంబ ములు కలవారు. పోలిరెడ్డిగారు ధనవంతు లయ్యు సంతానము లేకుండుటకు వగచుచు, ఒకవిప్రుని రావించి బహూకరించి సాధనము నుడుగు(డని ప్రార్థింప నాతఁడు భాద్రపద బహుళ అమావాస్య దినమున కంద చెట్టు, బచ్చలిచెట్టు జేర్చిపెట్టి, వాటిక్రింద గౌరీదేవిని పూజించునట్టి సంతానగౌరీవ్రత ముపదేశించె నఁట. పోలమ్మయు నావ్రత మప్పుడాచరించి, సంతానమువడసెను. గాని ఆమరుచటిసంవత్సర మున భర్త నుడువుచున్నను పాటింపక నిర్లక్ష్య ముగ భక్తివిహీనురాలై రాజసమున సంతాన గౌరీదేవిని బరిహసించి తనతో మేలమాడుచు పైకి భర్తమాట కాదనలేక పూజయొనర్చుటను నటించెనఁట. ఆదోషముచే నామె మృతవంధ్య యై యాపూజాదినము మైలలో నుండునటు లేటేట నొకసంతానము కల్గుచు మరణించుట జరుగుచుండె నఁట.

పోలమ్మయు దుఃఖిత యగుచుండుటయే గాక బంధువర్గముచేతను, యీామెపిల్లలచావు నుండి తాముసు మైలలో వ్రతమాచరింప వీలు లేకుండుటకు, తోడికోడండ్రచేతను యీాసడిం పులు పడుచు తెలివినంది భక్తితో గౌరీదేవిని బూజించుచు స్మరించుచు పశ్చాత్తప్తురాలు కాఁగా, ఆగౌరీమహాదేవి కనికరింప నామె మృతవంధ్యాదోషము వాసి, సంతానవంతురా లయ్యెను. పిదప భక్తురాలైన పోలమ్మ యోగి నియై ఎల్లరచే గౌరవింపఁబడుచు ఈవ్రతము నెల్లర కుపదేశించి బోధించుచుండ, నానాటి కీవ్రతమునకు పోలేరమ్మనోమనియు, పోలకమ్మ గారినోమనియు, వాడుకగల్గి నేఁటికిని ఎల్లరచే నాచరింపఁ బడుచున్నది. అందు ముఖ్యముగ రెడ్లయందు యోగినియైన పోలమ్మగారిపేరు కడుభక్తితో గౌరవింపఁబడుటయే గాక రక్షకు రాలైన దేవతగా దేవాలయములం దుంచఁబడి కూడ గౌరవింపఁబడుచున్నది.

**పోలరిస్కోప్**—(Polariscope)—ప్రకృతివిజ్ఞానశాస్త్రీయపద్ధతులలో వెలుతురును Light పరిశోధించుటకు పనికివచ్చుయంత్రము.

**పోలసీహోల్డరు**— వాణిజ్యపరిభాష యందు పోలసీలాభమును బడయఁగోరి ఒక పోలసీ గైకొనినవాఁ డనియర్థము.

**పోలాండు** (Poland)— (ఆస్ట్రియా దేశము చూడుఁడు).

**పోలాండుదేశప్రభుత్వము**(Poland)- ఐరోపాఖండమునందలి స్వతంత్రపరిపాలనగల దేశము. అనఁగా తొల్లింట రష్యాప్రభువుల దేశ మైయుండి, ఇటీవల వారిసంబంధము వీడి స్వపరి పాలనాస్వతంత్రతల నందినది.

ఒకలక్ష ఏఁబదివేల చతురపుమైళ్ళ వైశాల్య మనియు, మూఁడుకోట్ల జనసంఖ్య యనియుఁ జెప్పఁబడినది.

**పోలికులగోత్రము**-(ప్రోలేఖకులచూ.)

**పోలిగేనిజమ్** (Polygenism)— జీవ జంతుకోటియందు ఏరూపముగాని పారంపర్య మగు ఒకేరూపమున వచ్చుచుండలే దనియు, అనేక పరిణామములనొంది ప్రకృత రూపములు పొందిన దనియు ప్రతిపాదింపఁబడు సిద్ధాంతము.

**పోలిటిక్సు**- (రాజ్యపరిపాలనాచతురత చూడుఁడు.)

**పోలిడేమోనిజమ్**(Polydeamonism) అసంఖ్యాకములగు దయ్యములు, దేవతలు, ప్రకృతిశక్తులను స్వాధీనపఱచుకొని అధిష్ఠించి యున్నవనెడు ప్రాచీనకాలపు నమ్మకము.

**పోలిథెయిజమ్** (Polytheism) — ఏకేశ్వరోపాసన గాకుండునట్టి బహుదేవతా

రాధనము. యూదులును, ప్రాచీనగ్రీకుదేశీయులును, రోమనులును ఈవర్గమునకు జెందినవారే. ఆసాంప్రదాయముకొన్ని క్రైస్తవసంఘములలో నిలిచియున్నది.

**పోలిష్ప్రోవిన్సు**-(ఆస్ట్రియా దేశముచూ.)

**పోలినేసియా ద్వీపములు** — ఇవి ఓసియాయందు పోలినేసియా ద్వీపసముదాయము. పోలినేసియా యను పాశ్చాత్య నామమున కనేక భూప్రదేశములని యర్థము. ఇవియన్నియు పసిఫిక్కు మహాసముద్రమునందున్న ద్వీపములే. పశ్చిమమున మలేశియా ద్వీప సముదాయము, ఆస్ట్రేలేసియాద్వీపసమూహములకివ్వలతూర్పున నమెరికాఖండముదనుక గల సముద్రభాగమంతయు పోలినేసియాద్వీపములే వ్యాపించిఉన్నవి. పెద్దద్వీపములందు మిక్కిలి యెత్తుగల పర్వతములు కలవు. అందు కొన్ని అగ్నిశిఖరములు కలవి. కొన్నిద్వీపములు పగడపుచట్టులచే నేర్పడినవి. (పగడపుచట్టు చూడుఁడు). ఈద్వీపములందు సముద్రపుగాలి వీచుటచే చల్లగనుండును సర్వసాధారణముగ భూమి సారవంతముగనే యుండి చెట్టుచేమలు చక్కఁగా పెరుఁగును. సదాపనస, కొబ్బరి, అరఁటి తోఁటలును, పెండలపుపాదులు, కందమూలము,(గెనసుగడ్డ, టాగోదుంపలు(చారకంద)విస్తారముగా నగును. పందులు వీటియం దాదిమనివాస జంతువులు. కుక్కలు తరువాతివి.ఎలుకలుకూడ కాననగును. గాని యితరజంతువులు వీటియందుఁ గానరావు.

కుక్కల నీద్వీపముల కన్యదేశస్థులు తెచ్చుకతన,వీటియందాదిమనివాసులుగ నుండిన అనాగరికపు మలేతెగప్రజలు వాటిని అఱచుపందులని పిలువసాగిరి. గుఱ్ఱములను, మనుష్యులను మోయుపందు లని వాడుచుండిరి. ఏదో యొకదినుసు చెట్టుయొక్క పట్టను నానఁబెట్టి మోదిబాది మెత్తనినారగఁజేసి, దానితో ముతుకబట్టలుగ నేసి ధరించు చుండిరని చెప్పఁబడినది. ఈ ద్వీపములందలి ప్రజలు మలేతెగవారే యైనను, పొడుగాటి బలాఢ్యులుగ నుందురు ఒకరికి లోఁబడనివారు. ధైర్యవంతులు.యుద్ధములందు సాహసమె గాక క్రూరులుగఁగూడ నైయుంట కొన్నిద్వీపములు కేవలనిర్మానుష్యములై యుంౘినవి. వీరిమత మేమో తెలియదు గాని నరబలు లుండెననియు, వీరిలో కొందరు నరమాంసభక్షకు లుండిరనియు అన్యదేశస్థులనెదరు గాని యిప్పు డెవ్వియుఁ గానరావు.

క్రైస్తవమత మీద్వీపవాసులకు చాల నిర్వాహక మొనర్చెనని క్రైస్తవపాదిరీ లనెదరు గాని, అమత మంతగా వీరియందు వ్యాపించి యున్నట్లు గానఁబడదు. కొన్నితావులందు క్రైస్తవమతదేవాలయము లమర్పఁబడినను, వాటిలోని కేగు భక్తులు నంతగఁగానరారు. జీతము లందుకొనుచుండు పాదిరీగురువులు మాత్రము వాటిని వీడకుండ, నటఁ గట్టఁబడిన వసతిగృహములందు వసించుచుందురు.

పోలీనేసియా ద్వీపము లాఱు సమూహములుగ భూగోశాస్త్రజ్ఞులచే విభజింపఁబడినవి. అవి సాండ్విచ్ ద్వీపసముదాయము, టోంగా ద్వీపసముదాయము (దీనినే Friendly islands అనెదరు). సామోవాస్ లేక Navigator islands, సొసైటీద్వీపసముదాయము, మార్కెసాస్ ద్వీపసముదాయము, లోఆర్చిపిలెగో (Low Archipelago) ద్వీపసముదాయము నని. (వీటింగూర్చి ఆయాతావులందు జూడనగును.)

మొవ్నాకియా (Mownakea) పర్వతము ౧౩౯౫౩ అడుగులయెత్తు కలది. ఓసీనియాలో పెద్దదిగా నెన్నఁబడినది. మొవ్నాలోవా (Mowna Loa)అగ్నిపర్వతము ప్రపంచమున పెద్ద అగ్నిపర్వతమని చెప్పఁబడినది. దీనికి

Kilanea అనియు పేరు వాడుకగలదు. ఇం దగ్నిశిఖరముఖద్వారము (Crater) మూఁడు మైళ్ళచుట్టుకొలత గలది. లోన నగ్నితరంగ ములమయమై ఒక్కొకతఱి చూడనగు చుండును.

**పోలు** (Pole)—భూమియొక్క-ఉత్తరపు కొనకు pole అనిపేరు. ఆప్రాంత ప్రదేశమునకు "Polar region"అనిపేరు. ఉత్తర ధ్రువమున కెప్పుడు పైగా నుండు నక్షత్రమునకు Polar Star ధ్రువనక్షత్ర మని పేరు.

'North Pole' అనియు, 'South pole' అనియు రెండు ధ్రువప్రదేశములుగ నున్నవి.

**పోలెమోస్కోపు** (Polemoscope)- దూరదృష్టి కనుకూలించు అద్దములతోనమర్పఁబడిన యంత్రము. ఇది 17-వ శతాబ్దమున "Johanu Hevelius" అను ఖగోళశాస్త్రజ్ఞునిచే కనుఁగొనఁబడెను.

**పోలేరమ్మ**- ఈమె గ్రామదేవతా భేదములలో నొకతె. పరశురామునితల్లియగు రేణుకాదేవి ఆదిశక్తియొక్క అంశముగఁ జెప్పబడినది. ఆమెయే పోలేరమ్మ అని పోల్చిరి.

**పోలోఆట** (Polo)— హాకీఆటను గుఱ్ఱములపైనుండి యాడుటకే "పోలో" యనిపేరు. దీనియం దుపయోగింపఁబడు గుఱ్ఱములకు ప్రత్యేకముగ నీయాటకు వలయుపరుగును, నడకలను నేర్పియుంతురు. మఱియునిందుపయోగించు చేతికఱ్ఱలు (Mallets) పొడవుగ నుండెడిని. బంతులను విల్లోచెట్టువేళ్ళతో చేతురఁట. తెల్లనిరంగు వైచెదరు. అవి మూఁడంగుళముల యడ్డుకొలత గల్గియుండును. రంగస్థలి కొక్కొకప్రక్కను నల్వురాటకాండ్రుందురు. ఇందు నాల్గవసంఖ్యగల కడవాని కెక్కువకష్టమందురు. (హాకీయాట చూడుఁడు.)

పోలోఆటయం దుపయోగించు గుఱ్ఱములు Fourteen hands two inches size కలవిగ నుండవలయునని యొకవాడుక గలదు.

పోలోఆటను ఈతకాండ్రు నీటియందాడుట కలదు. దానికి "Water Polo" అనిపేరు. ఇందు మూఁడడుగులలోఁతుకన్న మెరకగనుండు జలప్రదేశము పనికిరాదు. అందు కడలను జలమట్టముపై మూఁడడుగులపై క్రాసుబా రుండునటుల ఒకటికొకటి పదియడుగులదూరమున రెండు స్తంభములను నీట పాతి, వాట్లమధ్యగా ఇరువదియెన్మి దంగుళముల చుట్టుకొలత గల్గి లోన గుల్లగ నుండియు, నీటఁ దడియకయుండు బంతిని విసరుచు నాడుదురు. రంగప్రదేశము ముప్పదియడుగుల పొడవును ఇరువదియడుగుల వెడలుపును గలిగియుండవలెను. దీనిని పాలించి తీర్మానించు నధికారము ఇర్వురు Goal scorer లును, వీరిపై నొక Referee యును, ఒక Time-keeper ను ఐయుందురు. ఒక్కొక దిక్కయాట కేడు నిమిషములమేర కాట కిరుదెసఁల పదునాల్గు మినిట్లు విధింపఁబడినది.

ఇన్ని నియమములతో నున్న ఈ "పోలో" యాట పైనుదహరించిన నియమములతోడనే మన దేశమునఁ గూడ చిరకాలమునుండియు అనఁగా పాశ్చాత్య నాగరికత మన దేశమున ప్రసరింపకపూర్వము నుండియు వాడుకలో నుండె నని మన పింగళి సూరనామాత్యుఁడు తానురచియించిన ప్రభావతీప్రద్యుమ్నమున నీక్రింద నుదహరించిన పద్యములం దెల్పియున్నాడు.

పాశ్చాత్యదేశముల నీయాటయం దుపయోగించుబంతి "విల్లో" చెట్టువేళ్ళతోఁ జేయుటయు, మన దేశమున వెదురుగుంపతో చేయుటయు మాత్రము ప్రధానముగ గమనింపఁ దగిన విషయము

మఱియు పాశ్చాత్యదేశములం దీపోలో ఆటయం దుపయోగించు చేతికఱ్ఱలు Mallets పొడవుగ నుండు పాలకఱ్ఱవంటి కఱ్ఱతో తయారు చేయుదురు. ఆటలలో పందెముల గెలుపొందిన వారి కీకఱ్ఱలపై పేరులు చెక్కించి బహుమతులుగా నిచ్చునాచారము పాశ్చాత్యదేశముల దుండ, మనదేశమున నీయాటలలో పందెముగెలిచినవారికి "కనకంపుగోలలు" "రత్నమయదండములు" కానుకలుగా, బహుమతులుగా నొసంగునాచారము కలదు.

ఈ పోలోకఱ్ఱలకు (Mallets) మనదేశమున "కోల" లనియు, "దండము" లనియు వాడుక కలదు.

చ. తనహృదయంబు వెంబడిన
తప్పక ఘోటక మంతనంతనే
పనుపడ నిల్చి, ముందఱికి
బాఱి కెలంకులకుం దొలంగిరా
వెనుకకు నేగుదెంచి, కడు
వేడ్క యొనర్పఁగ బంతియాడ నె
మ్మిని గనకంపుఁగోల నట
మింటనె త్రిమ్మరఁ దాఱి కొట్టెతెన్.

చ. ఎగురఁగ వైచి కొట్టుటది
యెంతభరం బని బంతి యగ్రిగా
మిగ వడిఁ బాఱవైచి బుడమిం
బడనీకయె దాని మీఱి చి
త్రగతి హయంబుఁ దోలుచును
గ్రిమ్మఱ మీఁదికిఁ గొట్టియాడె విం
తగఁ దనచేతి రత్నమయ
దండము కాంతులు గాడిపాఱఁగన్.

ఈరెండుపద్యములయందు ఆటనేర్పే గాక ఆటనాడువిధానముగూడ కవి నేర్పునఁ జూపుటయు గమనింపఁ దగియున్నది.

**స్తోల్** (Pole)—దీనిని "Rod" అనియు నందురు. పొడవుకొలుచుకఱ్ఱ.ఇది ఐదున్నర అడుగులు లేక అయిదుపదియా అంగుళములపొడవు ఉండును. ఒక చౌకపుపోల్ అనిన 30 1/4 (చౌకపుగజముల) ప్రదేశ మని భావము.

**పోల్ స్టార్ (ధ్రువనక్షత్రము)** (Pole star)— ఇవి రెండు. ఉత్తరమున నొకటియు దక్షిణమున నొకటియు గలవు. ఈ రెండును ఉత్తరదక్షిణధ్రువము లనంబడు Celestral Poles కడ నుండెడిని. రెండుధ్రువములకు ఒక Straight line నిలువున గీచి, Equator తో దాటినతావులకడ నాలుగు రైటు ఏంగిల్సు ఏర్పడునటుల జేసినచో ఆగీత కొనకడను ఒక నక్షత్రమును, రెండవకడ నొక నక్షత్రమును ఉండి, ఆగీతకడనుండి యొకే డిగ్రి దూరమున దానిని జుట్టి తిరుగుచుండునని పాశ్చాత్యఖగోళశాస్త్రవేత్త లూహించుచున్నారు. ఇవి తిరుగుచున్నను చూచుటకుదూరమగుట నిలచియుండునటులనే గన్పించుచుండు ననియెదరు.

ఈరెండునక్షత్రములు సూర్యునివలెనే స్వప్రకాశముగల్గినవిగ చెప్పియున్నారు.వీటిరెంటికి "Ursa minor" అనియు, "Lesser Bear constillation" అనియు, "Polar star" అనియు పాశ్చాత్య ఖగోళ శాస్త్రవేత్త లిడిన నామములు కలవు.

ఈరెండును సూర్యునికన్న నెన్నియోరెట్లధికపరిమాణముగల్గియున్నను, దూరముచేఁజిన్నవిగఁ గన్పించుచు, కొంచుక వెల్గు గల్గి కన్పించుచున్నవఁట. భూమధ్యరేఖ కుత్తర ప్రదేశముల వారికు త్తరపుపోలార్ స్టార్ ను,దక్షిణ్రపదేశముల వారికిదక్షిణపోలార్ స్టారును కన్పించుచుండెడిని. భూమినుండి ఈ నక్షత్రములకుఁగలదూర మూహింపఁదగినదియేగానినిర్ధారణగవివరింప వీలులేదనియు,ఇంచుమిం చేఁబదివత్సరములు (Light years) కాలమున నటనుండి భూమికి వెలుతురే తేర పట్టునని కొంద రూహించు చున్నారు.

ఈసందర్భమున సూర్యునికాంతి భూమికిఁజేర నెన్మిదిసెకండుల (క్షణికములు లేక లిప్తలు) కాలము పట్టునని మనసునం దుంచుకొన వలయును. ఇంకను Velocity of light per second. ఒకలక్ష ఎనుబదిఅఱువేల మైళ్ళు లేక మూఁడులక్షల కిలోమీటరు లని యెఱిఁగియెయున్నాము. దీనింబట్టి యాగోళముల దూరమును, పరిమాణమును ఊహించుకొనఁ దగియుండును. వీటి నెఱుంగుటకు Astronomical Telescope యొక్కయు, Theodilate సర్వేసాహాయ్యమునను కన్గొనఁబడునని చెప్పఁబడినది.

ఈ సందర్భమున నింకొకసంగతి వివరింప వలయును. నక్షత్రములు కొన్ని భూవలయ రేఖ (Horizon) కెల్లప్పుడు పైననే గన్పించునవి యనియు, కొన్ని యెల్లప్పుడు భూవలయ రేఖకుఁ గ్రిందుగ నుండుట గన్పింపనే గన్పింపవనియు, కొన్ని ఉదయాస్తమయములం గల్గియుండునవి యనియు, అఁ దీపోలారు స్టార్సు ఎల్లప్పుడు భూవలయరేఖకుఁ బైనఁ గన్పడు చుండునవి యనియు వివరింపఁ బడినది.

ఈ నక్షత్రరాజములు రెండును తిరుగు వృత్తము (Circle) ఒకేడిగ్రి పరిమాణమని మున్నే వచింపఁబడుట మఱవరాదు.

సప్తమహర్షు లనంబడు నక్షత్రములలో (దీనికి "Ursa major" లేక "Great Bear అనియు పేరు చెప్పఁబడినది) మొదటి రెండు నక్షత్రముల కొక Straight line (నార్తు పోలున) గీచి దానిని భూవలయరేఖదిక్కునకుఁ గ్రిందికి పొడిగించినచో నటఁ గాననగు నని దిక్కు చూపఁబడినది.

**పొసిటివిజమ్** (Positivism)—(Positive Philosophy) మానవత్వము స్వతంత్రమని శాస్త్రీయ (Scientific) నిదర్శనపూర్వకముగ నిరూపించు సిద్ధాంతము. వైజ్ఞానికప్రపంచమున నత్యుచ్చదశ నొందునది మానవత్వమే యని యీ విధానమునందలి ముఖ్యాంశము. ఈమతసాంప్రదాయమునందు భగవంతుని పూజించుటకు మాఱుగ మానవ సంఘసేవచేయుటయే పరమార్థముగ స్వీకరింపఁబడినది.

**పోస్టు ఓబిట్ బాండు** (Post Obit Bond)— వాణిజ్యపరిభాషయందు "చనిపోయిన ఒకరినుండి మఱియొకరికి రావలసిన సొమ్ము రాఁగానే బాకీ తీర్చుపద్ధతిని అప్పుతీసుకొని యిచ్చిన పత్రమున కీపేరు వర్తించును.

**పోస్టునోటు** (Post note)—వాణిజ్య పరిభాషయందు "ఆర్డరునందు వివరింపఁబడిన వాని కిచ్చునటుల వ్రాయఁబడిన బాంకినోటు" అని యర్థము.

**పోస్టేజిస్టాంపుం జుట్టియున్న చిన్న రంధ్రసముదాయము**—పెద్దపెద్ద కాగితములపై ఒకేరకము పోస్టేజి స్టాంపులు పెక్కు ముద్రింపఁబడి, స్టాంపునకు స్టాంపునకు నడుమ హద్దుగ సన్నరంధ్రములవరుస లన్నిదిశల నుండుట యెల్లఱెఱిఁగినదే. అట్టిరంధ్రములవరుసల కాంగ్లమున పెర్ఫొరేషను (Perforation) అనియెదరు. నిజముగ నివి చింపుటయం దుపయోగించుటకని పరిశీలించిన తెలియ గలదు. లెక్కించుటకుఁ గూడ నీపెర్ఫొరేషన్ అవసరమనిపించెడిని.

పోస్టేజి స్టాంపులు క్రి. శ. ౧౮౪౦ లో ప్రారంభింపఁబడి మేనెలలో వాడుక ప్రారంభమయ్యెను. కాని ౧౮౫౪ర జనవరినుండి గాని యీపెర్ఫొరేషన్‌రంధ్రములపద్ధతిఆచరణలోనికి రాలేదు. బ్రిటీషు పార్లమెంటునందు హౌస్ ఆఫ్ కామన్సునందు స్టాంపుల పెర్ఫొరేషను పద్ధతియొక్క యుపయోగమును Archer గారనువారు చూపిరఁట. ఆపద్ధతియొక్క ఉపయో

గము ప్రజాంగీకారము బడయుచు ౧౮౫౧ నుండియు జరిగి ౧౮౫౩ లో వారి నాల్గువేల పౌనులధనము బహుమాన మీయఁబడె నఁట. ఇది కొంత దొంగతనము నాపిన దందురు. తంతివార్తలు వ్రాయు కాగితములు Marginal perforation చింపుటయం దుపయోగించునదిగానే యున్నది. రశీదులందునను ఇటులనే తెలిసెడిని.

**ప్రోస్త్రాశాఖ క్షత్రియులు** -(ప్రమార శాఖక్షత్రియు చూడుఁడు.)

**పౌండరీయక(ప్రపౌండరీయక)ము**-సం. ప్రపౌండరీకం. దీనిని పుండరీకము, పౌండరీయకం అని వాడుదురు. హిందిలో పుండేరీ యందురు. సుగంధముగల చెట్టు. చిన్న చెట్టు. దీని సమూలౌషధకషాయములందు నేత్రములకు చలవచేసి శిరస్సునందలి కురుపులను మాన్పు గుణము కలదనియు, తనంతట తానై వీర్యము గాని, మూత్రముగాని పడిపోయెడి లేక చెడి రోగముల నడంచి నిర్మూలించు ననియు, వ్రణములను మాన్పుననియు, పైత్యము, రక్తపైత్యము, రక్తవాతము, మూలవ్యాధి ట్లను నివారించుననియు నందురు.

**పౌండ్రము** — భీముని (పాండవద్వితీయుని) శంఖమునకుఁ బేరు. (ధనుర్విద్య చూ.)

**పౌకరసాది గోత్రము** (పరాశర గణము చూడుఁడు.)

**పౌజిష్ఠ గోత్రము**-(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**పౌజిష్ఠ గోత్రము**--(కారేణుపాలిఉప గణము చూడుఁడు.)

**పౌతికలాయన గోత్రము**— భృగుసంతతి. (ఆర్ష్టిషేణగణము చూడుఁడు.)

**పౌర గోత్రము**— (ముద్గల ఉపగణము చూడుఁడు.)

**పౌరణగణము** --దీనిని పూరణగణమని యందురు. విశ్వామిత్ర సంతతిలోని గణము. (పూరణగణము చూడుఁడు.)

**ప్పౌరణ గోత్రము** --(పూరణ చూ. పూరణగణము చూడుఁడు.)

**పౌరవదేశము (పురులదేశము)**— జీలమ్‌నది తూర్పుతీరమున నొకప్పుడీదేశ ముండె ననియు, నిందు గుజరాతుమండలము (ఘూర్జర కాదు) చేరియుండె ననియు, ప్రజలకు పురు లనిపేరుండె ననియు, అలగ్జాండరుతో పోరిన పోరస్ భూపతి పురుఁడే యగుటఁ గల్గినపేరనియు, నితనికి పురుషోత్తముఁ డనుపే రన్యులగు నార్యులు వాడినదనియు పోల్చుచున్నారు.

మహాభారతమున, సభాపర్వమున ౨౭ యందున దీనిప్రశంస కలదు. హర్షచరిత్ర యందుఁగూడ దీనిప్రశంస గాననగుచున్నది.

**పౌరవీ దేవి** బాహ్లికుని కుమార్తె. వసుదేవుని భార్య.

**పౌరవులు**— పూరుసంతతి. చంద్రవంశ క్షత్రియులు.

**పౌరశ్రవగోత్రము**- (వసిష్ఠగణము చూ).

**పౌర్ణమాసఉపగణము**—ఇదిఅగస్త్య ప్రగణమునందలి యొక ఉపగణము. ఇందు ౧ పౌర్ణమాస, - పారణ, ౩ దార్ఢ్యవాహ అను మూఁడుగోత్రములు గలవు

ప్రవర- అగస్త్య, దైర్ఘచ్యుత, దార్ఢ్యవాహ.

**పౌర్ణమాసగోత్రము**— (పౌర్ణమాసఉప గణము చూడుఁడు.)

**పౌర్ణమి లేనిపాశ్చాత్యమాసము**— ఇది విచిత్రము. సూర్యసంక్రాంతి లేని మాసమును అధికమాస మనుచున్నాము. ఈవిచిత్రపు నెల పాశ్చాత్యులమానములోని నెల. ఇందు పౌర్ణమి యుండదు. కాని, దాని ముందు నెల

యందు, వెనుకనెలయందుఁగూడ రెండేసి పౌర్ణములు సంభవించును. ఇట్టి మాసము ఇరువది యైదులక్షల సం॥రముల కొకసారి గల్గుచుండు నని పాశ్చాత్యజ్యోతిషవేత్త లనుచున్నారు.

సృష్ట్యాదిగ నెప్పుడైన సంభవించిన దేమో ఎవ్వరును జెప్పఁజాలకున్నారు. కాని, క్రీ. వె. ౧౮౬౬ సం॥రమున ఫిబ్రెవరి నెలయం దిట్లు సంభవించినది. ఆనెలయందు పౌర్ణమి లేదు. ఆసంవత్సరము జనవరి నెలయందు రెండు పౌర్ణములును, మార్చి నెలయందు రెండుపౌర్ణములును సంభవించెను.

**పౌర్ణసౌగంధిగోత్రము** — (జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.)

**పౌర్వతికగోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు.)

**పౌలగోత్రము**-(సంకృతిఉపగణము చూ.)

**పౌలవిగోత్రము**- (విధృవగణముచూ.)

**పౌలస్త్య గోత్రము**-- (జమదగ్ని భిదాఉపగణము చూడుఁడు).

**పౌలాహలి గోత్రము**- (కణ్వఉపగణము చూడుఁడు).

**పౌలి గోత్రము**-(గర్గఉపగణము చూ.)

**పౌలిగోత్రము**--(విధృవగణము చూ.)

**పౌలోమి**-పులోముఁడనురాక్షసునిపుత్రిక. ఇంద్రునిభార్య. శచీదేవి యనంబడుచున్నది. (శచీదేవి చూడుఁడు.)

**పౌల్ట్రిఫారమ్ (పక్షిదోహదస్థానము)** అన్నిజాతులపక్షులను పెంచుతావులకు సర్వసాధారణముగా పౌల్ట్రీఫారమను పేరు వర్తించినను, ఇక్కాలమున కోళ్ళు, బాతులు, గువ్వలు, పావురములు, టర్కీకోళ్ళు, గిన్నీకోళ్ళు మొదలగు కొన్నిజాతుల పక్షులను పెంచుతావులకే ఈనామము వాడుచున్నారు. (కోళ్ళజాతులు చూడుఁడు). కోళ్ళు మొదలగు పక్షుల నాహారముకొఱకు పెంచుట, వాటిఅండములను వృద్ధిగించుట మొదలగుపను లీస్థానములందు నెఱపఁబడుచుండును. ఈపనుల నెఱపుటకు ప్రత్యేకవిద్యాజ్ఞాన మవసరము. ఏలయన వాటికిఁగల్గు రోగాదుల నివారణ మొనర్పవలసి యుండెడిని. అట్టివిద్యను నేర్పుసంస్థలును భరతదేశమునందుఁ గలవు. ఈశాస్త్రముగూడ వ్యవసాయవిద్యయందలి యొకశాఖయే

పక్షు లన్నియు వెన్నెముకగల జంతువులు. వీట్ల కాంగ్లమున Vertebrates అని సాంకేతికనామము కలదు. వీటిని High ordered animals అనియు ననెదరు. వెన్నెముక లేని పక్షులకు Low ordered animals అనియుఁ బేరుకలదు. వీటిరక్తము వెచ్చగనుండును. కాన, Warm blooded animals అనియు ననుటగలదు. పక్షులు గ్రుడ్లు పెట్టునవి గాన Oviparous animals అనియు ననెదరు.

కోళ్ళయందు ౧ Leghorns అనియు, ౨ Minorca అనియు, ౩ Polish Fowls అనియు ముఖ్యముగుమూఁడుజాతులను Meditaranian group అనియెదరు. ఏలయన నీజాతులు మధ్యధరాసముద్రప్రాంతసమశీతోష్ణప్రదేశములం దుండును.

ఇందు Leghorn కోళ్ళయందు White, Black, Buff, Cuckoos, Browns, Piles మొదలగు కొన్నిజాతులు రంగులనుండి పేరిడఁబడినవి కలవు. Minarka కోళ్ళయందు Whites, Blacks అనఁబడు రెండుజాతులు మాత్రమే కలవు. Polish fowls ల్గ్వారస్థ్రాపునకుఁ జెందినవైనను ఇంచుక భేదముగల్గిన జాతి యగుట జతకట్టించుట కభ్యంతర ముండదని చెప్పఁబడినది. ఈమిడిటరేనియన్‌గూప్రు పెద్దగ్రుడ్లు పెట్టుటయు, శరీరపరిమాణము తక్కు

వగనుంటయు స్వభావలక్షణములు గాన గుడ్ల కొఱకుమాత్రమే వీటిని పెంచుచున్నారు. ఈజాతులు భరతదేశపు శీతోష్ణస్థితికి ఎదురగల్గిన జాతులనిచెప్పఁబడినది. గ్రుడ్డుబరువు(scaling) రెండున్నరమొదలు మూఁడౌన్సులదనుక నుండునని కనిపెట్టఁబడినది. వీటినిగూర్చినవిచిత్రమే మన నీజాతులు తమగుడ్లను పొదుగనేరవు గాన నితరమగు కోళ్ళచేత పొదిగించుటయో Incubator నందు పొదుగుటయో జరుపవలసియుండెను.

పిదపఁజెప్పఁదగినది Dual purpose group అనంబడునది. ఆహారమునకును, గ్రుడ్లకునుగూడ నీగూ్రపునందలిజాతు లుపయోగించును గాన నీపేరు పెట్టబఁడినట్లున్నది. ఇవి American Types అనంబడుచున్నవి. ఇవియును భరత దేశమున చక్కఁగా వర్ధిల్లుచుండుటఁ గాన నమ్మఁదగిని. వీటియందు ౧ Plymouth Rocks, ౨ Barreds, 3 Whites, ౪ Buffs, ౫ Blacks మొదలగుజాతులు కలవు.

తరువాతఁ జెప్పఁ దగినది Wiandotes అనంబడు గూ్రపునకుఁ జెందినజాతులై ఉన్నవి. ఇందిదివఱకుఁజెప్పఁబడినరంగుజాతుల లన్నియు నీ తెగయందున్నను, తెల్లరంగుజాతి మాత్రము భరతదేశమున నెక్కువ వ్యాపకమునందున్నదనియే చెప్పవలసియున్నది. ఇదియును American Types లోనిదిగనే చెప్పఁబడినది.

పిదపఁ జెప్పఁదగినగ్రూపు Rhode Island Reds అనంబడు జాతియు నమెరికా జాతియే (Type) యనుచున్నారు. ఇంతియేగాక భరత దేశమున నమెరికన్ వైపు కోడిజాతులుపెక్కు లచ్చటచ్చట వ్యాపించియున్నవి. (Widely kept) Rhode Island Reds జాతికోళ్ళు గుడ్లకుఁ గాక కేవలాహారమునకైనజాతి యని యందురు.

ఇంతటితో నీఅమెరికన్‌గ్రూపుల విషయము నాఁపి, భరతదేశమున వ్యాపించి యున్న ఆంగ్ల గూ్రపులజాతులనుగూర్చి వివరింపఁ దగును. ఆంగ్లగ్రూపులజాతులందు భరతదేశమున వ్యాపించి పేరందినజాతులందు Light Breeds అనియు, Heavy farming Breeds అనియు రెండుతెగలు కలవు. ఇవి కేవలమాహారమునకే గాని గ్రుడ్లకు రుచ్యములు కావని యనుచున్నారు. వీటియందు Light farming Breeds నకుఁ జెందినవి Sussex జాతియు, Orpington జాతియు ముఖ్యములని చెప్పఁబడినవి. ఇవి గుడ్లనుండి జన్మించిన యాఱు నెలలకే mature స్థితి కేతెంచి, తిరుగ నవియు గుడ్లు పెట్టునవిగ నగును కాన ఈత్వరితమును బట్టి Light farming జాతులుగ పేరందినవి. Heavy farming Breeds లలో Brahma జాతియు, Kochin అనంబడు తియు, English Dorking జాతియు పా ముఖ్యము నందియున్నవి. మఱికొన్ని జాతులును గలవు. ఇందు English Dorking జాతి రుచియందు Indian Asil జాతితో పోల్పఁదగినదనిగాఁ జెప్పుదురు. ఇండియనేసిల్ జాతికి భరతదేశము డిస్కస్‌జాతి యనియు ననెదరు.

మిగిలిన హిందూదేశపుజాతికోళ్ళను అధమపుజాతులని యనుచున్నారు. అవిచౌకగ లభించునఁట. పరిమాణమునందింకీయనుజాతులు చిన్నవిగఁగూడ నుండునఁట. ఇంతియేకాక వీటింగూర్చి వివరింపనగుసంగతి వేఱొకటి కలదు. విదేశపుజాతికోళ్ళుగ పైని వివరింపఁబడిన జాతులు సంవత్సరమునకు ౨౫౦ మొదలు 300 దనుక గుడ్లుబెట్టు నఁట. ఇది అవి తినునాహారము (అనఁగా ముఖ్యముగ Calcium food పై నను వాట్లంగూర్చి తీసికొను శ్రద్ధనుబట్టియు

నుంచునని పరిశీలకు లనుచున్నారు. భరత దేశపు జాతికోళ్ళు సంవత్సరమున నూటయేఁబది మొదలు రెండువందలవఱకు మాత్రము గ్రుడ్లు పెట్టునని యనెదరు. విదేశపుజాతులు పెద్దవిగను ఇండియనుజాతులు(Country breeds) చిన్నవిగనుండి వాటికన్న చాలచౌకగ దొరకు నందురు. భరతదేశపుజాతుల కోడిగ్రుడ్లుగూడ చౌకయని వేఱుగ నిట వ్రాయనక్కఱ లేదు.

భరతదేశపు కోడిజాతి పెట్టలను విదేశపు కోడిపుంజులతో జతకూర్చినతఱి కల్గుసంతానమును Half breeds అనియెదరు. ఇవి భరతదేశపుశీతోష్ణస్థితుల కెక్కువగా నిలిచియుండు ననియుఁ, ఇట్టితఱి గ్రుడ్లను భరతదేశపుకోళ్ళ చేతనే పొదించుచుండు రనియు వాడుకగలదు. కోడిగ్రుడ్లను పొదిగించుట (Hatching) కిరువదియొక్క దినములు పట్టునఁట.

కోళ్ళ కర్హమగు నాహారము ధాన్యము జాతులు (బహుశః గంటెలు). ఇవిగాక తౌఁడు నీళ్ళతోఁను, ఉప్పుతోనుకల్పి ఇడుదురఁట ఇందు నైట్రొజను కల్గియుంట మిగుల శ్రేయ మని చెప్పఁబడినది. అవి పురుగులనుగూడఁ దినును. తేళ్ళను, చెదపురుగులను మిగులప్రీతిగ భుజించును. బలముగునాహార మిడినను ఒకబొన్ను ఎత్తుకన్న నధికాహారము తినఁజాలదు గాన ఎక్కువబలమగు నాహార మిడిన గ్రుడ్లు చక్కఁగ నిడుచుండు నని పరిశీలనలనుండి తేలినది.

కోడిగ్రుడ్లయందు జీవముగలవాటిని Fertile eggs అనియు, నిర్జీవము లగువాటిని Barren eggs అనియు, జతకట్టుటను Fertilization అనియుం బేరు లాంగ్లమం దిడియున్నారు. కోళ్ళనుదినము జతకట్టుచుండిన సజీవాండములును, లేనిసమయమున నిర్జీవాండములును పెట్టుచుండు ననియు, గ్రుడ్డెట్టిదైనదియు నేడుదినములలో తెలియనగు ననియు, సగటున నూటికి డెబ్బది మొదలు ఎనుబదివఱకు గ్రుడ్లు సజీవాండములుగనుండి పిల్లలు కల్గుననియు బలమగుప్రతీతి కలదు.

కోళ్ళకు తగులు తెగుళ్ళయందు ముఖ్యములు Chickenpox, Smallpox, Fever (జ్వరము), Roup (ఇది మెడ్రవేలవేయు గళరోగము), Diarrhoea (విరేచనముజబ్బు) అని చెప్పఁబడినది. రోగముతగిలిన కోడిని తక్కినవాట్లనుండి వేఱుగ దూరముగ నుంచుట యవసర మనియు, స్థలము పరిశుభ్రపఱచుచుంట అత్యావసర మనియు, Disinfection చేయవలయు ననియు నందురు. కోడిరెట్టలు (Guano) పాదులకు విలువగల యెరువు గాన ఎక్కువమూల్యమున కమ్ముడుపోయెడిని. కోళ్ళ రెక్కలఈఁకలు తలగడాలలోనింపుట కుపయోగింతురు.

బాతులను, పావురములను, గువ్వలను, టర్కీకోళ్ళను, గిన్నికోళ్ళను గూడ పెంచుట కివియే పద్ధతులని చెప్పఁబడినది.

**పౌష్కజితి గోత్రము** — (ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**పౌష్కరసాదిగోత్రము**—(పరాశర గణము చూడుఁడు.)

**పౌష్టావత గోత్రము**— (వీతహవ్య లేక యాస్కగణము చూడుఁడు.)

**పౌష్టి గోత్రము** — (కపిఉపగణము చూడుఁడు)

**ప్రౌష్పికగోత్రము**—(ఆత్రేయగణము చూడుఁడు.)

**ప్రౌష్యందిగోత్రము** —(ఔతథ్యఉపగణము చూడుఁడు.)

**ప్రౌష్యుఁడు**— ఉదంకునకు కుండలము లిప్పించినభూపతి.

**ఫ్యూయెల్ (ఇంధనము) (Fuel)**— సర్వసాధారణముగా పొయిలోఁ గాల్చుకట్టెలను వంటచెఱకనెదరు. కాని వంటకు యంత్రాగారముల బోయిలరు (Boiler)లందు కాలు రాక్షసబొగ్గు, వంటల కుపయోగించు రాతిబొగ్గు, ఇనుపప్రొయిలందు కుంపటులందు కాల్చు కట్టెబొగ్గు, కోక్, పిడకలు, ఆయిల్ ఎంజినులందు కాల్చుక్రూడాయిల్, హాలండు దేశమున కాల్చు పీట్ దుంపరేకులు మొదలగు వేఁడికై కాలు వాటి నన్నిటిని Fuel అనెదరు. ఇందులకు సంస్కృతమున ఇంధన మని యర్థము. టిబెట్టు పాలస్తీనా మొదలగుకొన్ని దేశములందు మేఁకలయొక్కయు, గొఱ్ఱెలయొక్కయు పెంట్రుకల కాల్చెదరు. బంగాళమున రాక్షసబొగ్గు గాల్చెదరు. హిమవన్నగసీమలందలి భాట్ పరగణాలో పామామొక్కలు చీఱి కాల్చుదురు. హాలండు దేశమున పీట్ దుంపలుచీఱి యా రేకుల నెండించి కాల్చెదరు. ఏదేశములం దేవి చౌకగ లభించునో యవి యట ఫ్యూయెల్ గా నుండును ఇంధనము వేర్వేఱుతావుల వేర్వేఱుగనుండెడిని

వీటితోఁ బోల్చిచూచిన హైడ్రోజెను ఇంధనములం దగ్రిగణ్యమని చెప్పనొప్పు. అనఁగ ఒకకొంత హైడ్రోజెను కాల్చి కల్గింపఁగల వేఁడి అంత ఇతరపదార్థములు కాల్చి కల్గింపఁజాలవని భావము. కాని, అధికవ్యయమునఁగాని చేకూరదు కావున భరింప వీలుగాని వ్యయ మగుట వాడఁజాలరు. రాక్షసబొగ్గు కాల్చుటయందధికభాగము కాలి యుపయోగించునని పరిశీలనల వలన తేలినది. అది తడిసినను, పొడిగా నుండునేని నీటిని బీల్చుకొని తడిసిపోదు. దానియందు హైడ్రోజెనుకలదు. గర్భితమైచెమ్మ యుండదు. ఎండుకట్టెలం దైనను లోన నించుక చెమ్మ యుండెడిని. పిడకలు హెచ్చు వేఁడి నీయఁజాలవు. ఎండుకట్టెలును అంతటివే. కట్టెబొగ్గులు రాక్షసబొగ్గు కాల్చినంత వేఁడి నీయఁజాలవు. వాటివలె నిలువక త్వరలో రొయ్యిగామాఱును. కోక్ వేఁడినిచ్చినను ఎక్కువసేపు నిలువఁజాలనిది. పీట్ దుంపల వేఁడి యధికము. ఎక్కువసేపు నిలుచున దైనను నధికముగా దొరకఁజాలదు.

ఇటీవల రాక్షసబొగ్గునందుఁగల కార్బన్ (Carbon) చక్కఁగా కాలునట్టి వేఱుజాతిదిగా తలంపఁబడుచున్నది. అది హైడ్రోజనునకంటె నించుక తక్కువగా కాలునదఁట. కట్టెలు మొదలగువాటియం దుండునట్లు రాక్షసబొగ్గునందుఁ గూడ నుండెనేని ఆ చెమ్మ దానివలనఁ గల్గు వేఁడి నించుక చల్లపఱచి మామూలుగ అనఁగా కట్టెయు, బొగ్గులు, పిడకలు, వీట్లనిప్పు కన్న హెచ్చు వేఁడి గల్గింపనీయకుండెడి దఁట.

**ప్యూరిటాన్ క్రైస్తవ మతము** — ప్యూరిటానులనిన పరిశుద్ధ క్రైస్తవు లని భావము. ఇంగ్లాండునందు ఎలిజబెత్తు మహారాజ్ఞి కాలమునుండి ప్రొటెస్టెంటు క్రైస్తవమతప్రారంభముదనుకఁ గల క్రైస్తవమతబోధకుల కీపేరువాడుకయయ్యెనఁట. నిష్కర్షయైన వర్తనము, సాధుత్వము, నిర్దుష్టముగ నుండుట, లఘుపూజ వీరి ధర్మములుగ నుండెనఁట.

**ప్రకాశక్షేత్రము** — బొంబై రాజధాని, ఖండేశజిల్లా, ధూలియానుండి ౩౫ మైళ్ళదూరమున తపతీవేలీ రెయిల్వే పై నున్న రనాలా స్టేషనుకడ ప్రకాశక్షేత్రము కలదు. ఇట తపతీనదియందు రెండు ఇతరనదులు సంగమించు త్రివేణీసంగమము కలదు. ఇది గొప్పస్నానతీర్థమై యున్నది. ఇట గౌతమేశ్వరశివలింగము కలదు. బృహస్పతి సింహారాశిగతుఁ డగుతఱి గొప్పస్నానయాత్ర జరగును.

**ప్రకాశవంతములు, నప్రకాశవంతములు నగు పదార్థములును, వెలుతురుబింబములు నగపడురీతులు—**

(Luminous & non_luminous things, Light images, manner of appearing) దీనికి Selective reflection అని పేరుకలదు. కాని, దాని నంతగా రసాయనశాస్త్రవిదులు వాడుట లేదు. ఇది సూక్ష్మమైన యర్థము గల్గి కనునందు చేరియున్న దియే. (రిఫ్లెక్షనుధర్మము చూడుడు). ప్రకాశవంతములగు పదార్థములు (తమకన్న నెక్కువప్రకాశవంతములగు పదార్థములయెదుట వాటి నెదుర్చుచు ప్రకాశింపజాలకున్నను) చీకటియందు తమకుఁ దామే ప్రకాశింపఁగలవని యెల్ల రెఱింగిన దే. అప్రకాశవంత పదార్థములు తమకుఁదామై ప్రకాశింపఁజాలవు గాని వాటిపై నెఱ్ఱ వెలుతురును ప్రకాశింపఁ జేసిన నెఱ్ఱరంగునఁ గానఁగుచుండెడిని. దానిపై నెఱ్ఱరంగును బడఁజేసిన నవి యెఱ్ఱగఁ గాన్పించును. అన్నిరంగుల సముదాయమగు తెల్ల రంగును బడఁజేసిన నవి తెల్లరంగుగఁ చును. ఇదియే ప్రకాశ, అప్రకాశవంతములగు పదార్థముల భేదము.

అప్రకాశవంతములగు కొన్ని పదార్థములపై కొన్ని కొన్ని రంగులు పడఁజేసినతఱి, అనఁగా నారంగుల వెలుతురును ప్రసరింపఁజేసినతఱి,ఆరంగునందు గర్భితమైన రంగులలో కొన్నిటి నెన్నుకొనినట్లు (As if selected) వాటిని ప్రదర్శించుచు వాటివెలుతురునందు తామే గానవగును. దీని కాంగ్ల రసాయన శాస్త్రమున Selective reflection అనిపేరిడియున్నారు. ఇట రంగులు లేక రంగులవెలుతు రన Certain wave lengths అని మనమునందుంచుకొని గ్రహింపవలసి యుండును. (రంగుల నిజతత్త్వము చూడుడు. కీబోర్డు ఆఫ్ ఇన్విజబుల్ హీట్ వేవ్సు చూడుడు.) ఇట్లు ఒక అప్రకాశవంతపదార్థముపై తెల్లని రంగు వెలుతురును బ్రసరింపఁజేసిన నది కారణాంతరములచే నెఱ్ఱరంగును బ్రదర్శించును, అనఁగా నెఱ్ఱగ నగపడుట సంభవించునేని నాయెఱ్ఱరంగువెలుతురు Selective (red colour) reflectionగా నెఱుంగవలసి యుండును. దీనికి సాదృశ్యముగా నల్లఊదారంగుగల బట్టపై నెఱ్ఱ రంగును బ్రసరింపఁజేసిన నల్లరంగును బ్రదర్శించునేగాని ఎఱ్ఱగ నగపడదు. ఇచటినల్లరంగు ఎఱ్ఱరంగునుండి ఎన్నుకొనిన సెలక్టివ్ కలర్ (Selective colour reflection) గా నెఱుంగవలయును. ఇటులనే నల్లఊదా రంగుబట్టపై ఆరెంజి, పసుపుపచ్చరంగుల వెలుతురులం బ్రసరింపఁ జేసినతఱి నీనల్లరంగే గన్పట్టెడిని. ఇటులు గాక బ్లూ, వయోలెట్, గ్రీన్ (ఆకుపచ్చ) వెలుతురులు ప్రసరింపఁ జేసినతఱి ఆరంగులే గన్పట్టునుగాని మాఱవు. (అనఁగ సెలక్టివ్ రైటు) రిఫ్లెక్షను జరుగదనిభావము. తెల్లరంగు అన్నిరంగుల సముదాయము గాన, దానిని బ్రసరింపఁజేసిన బ్లూ రంగే కన్పించును. గాన తక్కిన రంగులందు పీల్పఁబడి గుణలక్షణములు గోల్పోవు నని భావము.

**ప్రకోపత్రయము**- బౌద్ధమతధర్మమున కాయప్రకోపము, వాక్ప్రకోపము, మనఃప్రకోపము నని ప్రకోపములు మూఁడు.

**ప్రక్కి వేంకటనరసయ్య కవి**- ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడిన వాఁడు. గౌడబ్రాహ్మణశాఖగఁ జెప్పుకొను శిష్టుకరణకులజుఁడు. భారద్వాజ... తండ్రిపేరు నారాయణమంత్రిపారకుఁడు. విశాఖ పట్టణమున క్రిస్టియన్ ఉన్నతపాఠశాలయందాంధ్రోపాధ్యాయుఁడై యుండినవాఁడు.

ఈ కవి రచించినవి శకుంతలాపరిణయ మను ప్రబంధము, అమరపదకల్పద్రుమము, నారాయణశతకము, మదనసాయకాపరిణయ మను

ప్రబంధము, కవిదర్పణచ్ఛందము, నారాయణ శతకము, కుమారీశతకము. లక్షణయుతమైన చక్కని కవిత్వము.

**ప్రచేతస్సు**—గాంధారుని సంతతి. క్షత్రియుఁడు. (గాంధారుని పౌత్రునిపౌత్రుఁడు.) ఈతనికి పెక్కుసుతు లుండిరి గాని వారందఱు మ్లేచ్ఛులైరి. ప్రచేతసుఁడు, ప్రచేతుఁడు అను నామములు వరుణునకుఁగూడఁ గలవు. ప్రాచీనబర్హికి సముద్రతనయ యగు శతధృతి యను భార్యయందుఁ గలిగిన పదుగురు సుతులకుఁ గూడ ప్రచేతసు లనిపేరు. వీరందఱు నొకే నామము, ఒకే రూపగుణవ్రతములు గలవారనియు, బహుతపోధనులనియు, వీరిభార్య మరీష యనియుఁ జెప్పఁబడినది.

**ప్రచండవాయువులు**— (నవప్రచండవాయువులు చూడుఁడు.)

**ప్రజాపతి** — ఈతఁడు కృష్ణయజుర్వేదములో కాండములకు కర్త. సామాథర్వవేదములలోఁ గొన్ని సామములు, సూక్తములు కూడఁగలవు. "కశ్యపప్రజాపతి" యను పేరితో నీతనిఁగూర్చియే కొన్ని పురాణములు చెప్పుచున్నవి.

నోటు :— కశ్యపనామముతోఁ గొన్ని ఋక్కులును, సామములును గలవు. అచటనే 'మారీచకాశ్యపుఁడు' అనుటచేత నీతఁడు వేఱైయుండనోపునని తలపవలసివచ్చుచున్నది.

**ప్రజాపతి గణము**—బ్రహ్మమానసపుత్రులు ౨౮ గురలో ౧ మరీచి, ౨ అత్రి, ౩ ఆంగిరసుఁడు, ౪ పులస్త్యుఁడు, ౫ పులహుఁడు, ౬ క్రతువు, ౭ భృగువు, ౮ వసిష్ఠుఁడు, ౯ దక్షుఁడు ననువారలు నవబ్రహ్మలు లేక నవప్రజాపతు లనంబడుదురు. వీరివలననే సృష్టి ముఖ్యముగా వృద్ధినందెను.

భారతమున బ్రహ్మసుతుఁడు మనువనియు, మనువు సుతుఁడు ప్రజాపతి యనియుఁ జెప్పఁబడియున్నది. అతనికి ౧ ధూమ్ర, ౨ బ్రహ్మవిద్య ౩ రస, ౪ శ్వాస, ౫ మనస్విని, ౬ శాండిలి, ౭ ప్రభాస అని యేడుగురుభార్యలనియు వారికుమాళ్ళు అష్టవసువులనియుఁజెప్పఁబడినది.

**ప్రజాపతిగోళము లేక నక్షత్రము**— కశ్యపప్రజాపతి యనిభావము. (నక్షత్రములు భారతీయులు గుర్తించినవి చూడుఁడు.)

**ప్రజాపతివేదికలు ౫** — బ్రహ్మయజ్ఞ మొనర్చినతావులు. (యజ్ఞవేదికలు).

౧ తూర్పున ప్రాగ్వేదిక- గయాక్షేత్రమునందు (ఫల్గుణీనదీతీరమున).

౨ దక్షిణవేదిక- ఉత్కల (ఒరిస్సా) దేశమున వైతరణీనదీతీరమందలి జాజిపూర్ (యజ్ఞపురము) నందలి విరజాక్షేత్రమున దశాశ్వమేధముకడ.

౩ పశ్చిమవేదిక- అజ్మీరుకడ. పుష్కరక్షేత్రము.

౪ ఉత్తరవేదిక- కురుక్షేత్రమున సామంతపంచకముకడ.

౫ మధ్యమవేదిక- అలహాబాద్ నగరమున ప్రయాగ (ధారాగంజి) యందలి దశాశ్వమేధఘట్టమున గంగాతీరమున.

**ప్రజాపతులు ౧౦ (దశప్రజాపతులు)**

౧ మరీచి. బ్రహ్మమానసపుత్రుఁడు. భార్య కర్దమపుత్రికయగు కళాదేవి.

౨ అత్రి. బ్రహ్మమానసపుత్రుఁడు. భార్య అనసూయ.

౩ ఆంగిరసుఁడు. బ్రహ్మమానసపుత్రుఁడు. భార్య తార.

౪ పులస్త్యుఁడు. బ్రహ్మమానసపుత్రుఁడు. భార్య హవిర్భుక్కు.

౫ పులహుఁడు. బ్రహ్మమానసపుత్రుఁడు. కిన్నరకింపురుషాదులు పుత్రులు.

౬ క్రతువు. బ్రహ్మమానసపుత్రుఁడు. భార్య దక్షప్రజాపతికుమార్తెయగుసన్నతీదేవి. కుమాళ్లు వాలఖిల్యులు ౬౫ మంది.

౭ ప్రచేతసుఁడు (వరుణుఁడు). బ్రహ్మమానసపుత్రుఁడు.

౮ వసిష్ఠుఁడు - బ్రహ్మమానస పుత్రుఁడు. భార్య అరుంధతి. కుమారుఁడు శక్తి.

౯ భృగువు - బ్రహ్మమానస పుత్రుఁడు. పుత్రుఁడు కవి. (పౌత్రుఁడు శుక్రుఁడు).

౧౦ నారదుఁడు- బ్రహ్మమానసపుత్రుఁడు. మతాంతరమున వామదేవుఁడు.

ఏకవింశతి ప్రజాపతులు- భారతమునం దేకవింశతి ప్రజాపతులు చెప్పఁబడిరి.

౧బ్రహ్మ, ౨స్థాణుఁడు, ౩మనుప్రజాపతి, ౪ దక్షప్రజాపతి, ౫ భృగువు, ౬ ధర్మప్రజాపతి, ౭ యమప్రజాపతి, ౮ మరీచి, ౯ అంగిరసప్రజాపతి, ౧౦ అత్రి, ౧౧ పులస్త్యుఁడు, ౧౨ పులహుఁడు, ౧౩ క్రతువు, ౧౪ వసిష్ఠుఁడు, ౧౫ పరమేష్ఠి, ౧౬ సూర్యుఁడు, ౧౭ సోముఁడు, ౧౮ కర్దమప్రజాపతి, ౧౯ క్రోధప్రజాపతి, ౨౦ అర్వాకప్రజాపతి, ౨౧ ప్రీతిప్రజాపతి.

**ప్రజ్ఞలేని శౌర్యముపదునులేనిఖడ్గమువంటిది**— (ఆంధ్రలోకోక్తి.)

**ప్రణవపంచాకృతులు (పంచాకారములు)**— కపిలగీతయందు:—

శ్లో॥ ప్రథమం తారకం చైవ ద్వితీయం దండ ముచ్యతే। తృతీయం కుండలాకారమ్ చతుర్థం చార్ధచంద్రకమ్। పంచమం బిందు సంయుక్తం చోమితి జ్యోతిరూపకమ్॥

౧ తారకాకృతి, ౨ దండాకృతి, ౩ కుండలాకృతి, ౪ అర్ధచంద్రాకృతి, ౫ బిందుసంయుకాకృతి.

దీనినే యోగులు పంచకృత్యములు, పంచశక్తులు, పంచభూతములు, పంచకర్తలు, పంచకలలు, పంచాక్షరము లనియు నందురు.

**ప్రణవము**—(ఓంకారము చూడుఁడు)

**ప్రణవశాఖ - విశ్వబ్రాహ్మణులు** — వీరు విశ్వకర్మసంతతిలోని సుపర్ణర్షి సంతతివారుగఁ జెప్పఁబడిరి. ప్రణవశాఖవారి మతధర్మగ్రంథమునకు "విశ్వజ్ఞసూత్ర" మనిపేరు. వీరియందు చండాలవర్ణ మనియు, స్వర్ణకారవర్ణ మనియు రెండువర్ణములు చెప్పఁబడినవి. (విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

చండాలవర్ణవిశ్వబ్రాహ్మణులు-పర్యాయవృత్తి వీరిది. సూర్యసంతతి సంజ్ఞాశక్తిపీఠము నని చెప్పఁబడిరి. వీరియం దొక్క ఆదిత్యసేన గణమును, అంద్దైదు గోత్రములును గలవు.

స్వర్ణకారవర్ణ విశ్వబ్రాహ్మణులు-ఆదివృత్తి వారనియు, వీరిది విశ్వజ్ఞసంతతి యనియు, జ్ఞానశక్తిపీఠ మనియు, ఈ విశ్వజ్ఞుఁడే జ్యోతిషమును రచించె ననియు, అతఁడే కరణమున కధిపతి యనియు వీరనెదరు. వీరియందు ౧ బోధకగణము, ౨ మైత్రేయగణము, ౩ మణిభద్రగణము, ౪ సుపర్ణగణము నను నాల్గు గణములును, అం దిరువది గోత్రములును గలవని చెప్పఁబడినది.

**ప్రతర్దనుఁడు** చంద్రవంశక్షత్రియుఁడు. ఈతనికి కువలయాశ్వుఁ డను నామాంతరము కలదు. ఈతఁడు కాశ్యపునిసంతతివాఁడు. కుమారుఁడు అలర్కుఁడు.

వేఱొక ప్రతర్దనుఁడు దివోదాసుని కుమారుఁడు. ఆతనికి శత్రుజిత్తనియు, ఋతుధ్వజుఁడనియు నామము లుండిన వందురు. (ఋతుధ్వజుఁడు చూడుఁడు).

**ప్రతాపఘుడ సంస్థానము**— (పర్తాపఘుడసంస్థానము చూడుఁడు.)

**ప్రతాపరుద్రదేవమహారాజు**-ఈయనను చరిత్రలందు మొదటి ప్రతాపరుద్రదేవుఁ డని యందురు. కాకతీయరాజ్యమును క్రీ. శ. ౧౧౪౦ మొ॥ ౧౧౯౬ వఱకు పాలించినప్రభువు. ఆంధ్ర కవులందు పూర్వకవులలో పరిగణింపఁబడిన రాజకవులలో నొకఁడు. శివభక్తుఁడు. పాల్కురికి సోమనాథకవి యీతనివలన నగ్రహారము లందినవాఁడు. విద్యావిభూషణుఁ డనిపేరందినవాఁడు. నీతిసార మనుగ్రంథము సంస్కృతమున రచించి, దానినే తెలుఁగునఁ గూడ రచించెను.

**ప్రతాపశేఖరము**—(తాళములు చూ.)

**ప్రతితాళము**— (తాళములు చూ.)

**ప్రతిధ్వని** (Echo)- మనము మాట్లాడు తఱిగాని, ఏదేని చప్పుడుచేయునప్పుడు గాని ఆధ్వని గాలియందుఁ బ్రవేశించి, ధ్వని కెరటము వలె నలుదెసలకుఁ బర్విడును. అట్లు పర్విడుచో వినువారిచెవులఁ జొచ్చి కర్ణేంద్రియమును దాఁకి లోనికి తెలుపును. దానినే మనకు వినఁబడుచున్నది అనుకొందుము.

ఇంక నీధ్వనియె పెద్దపెద్దగండశిలలు, పెద్ద భవనములు మొదలగునవి(ధ్వనియొక్క యలలు పర్విడుతఱి)అడ్డముగానుండుచో అలలు వాట్లకుఁ దాకి తిరుగ వెనుకకు ద్రోసివేయఁబడి, మరలి తిరుగ మనకడకే జేరి మనచెవులంబడి మన కర్ణావయవములకుఁ దాఁకి మనకె వినఁబడును దీనినే ప్రతిధ్వని (Echo) యందుము.

ఇట్టి యాటంకములు చుట్టునుగల ప్రదేశమున ధ్వని యొనర్చితిమేని ఇటనుండియు అటనుండియు మరలమరల ప్రతిధ్వను లొకేధ్వనికి సంభవింపును. అంతకు నిదియె కారణము.

దీనింగూర్చి యొకచిత్రమగుకథ పాశ్చాత్యులందు కలదు. దేవతకు పరిచారికగ నుండిన హెరన్ అనునామె ఆమెకు కోపముకల్గించి లిచినతఱి తప్ప, తక్కినకాలముల మౌనము వహింప నాజ్ఞాపింపఁ బడెనఁట. పిదప హెరన్ నార్సిసస్‌ను మోహించె నఁట, గాని యాతఁడు నిరాకరించినందున దుఃఖితయై యుండ, దేవత శిలయగునట్లు శపించెనఁట. గాన నిప్పుడు శిలలై యట ధ్వనిచేసిన (ప్రతిధ్వని నిచ్చు) పల్కుచుండు నఁట.

**ప్రతినిధిన్యాయము**-ఒకటికి బదులుగ నింకొకటి ఆపనినే కొనసాఁగించుటకు నియమింపఁ బడినది "ప్రతినిధి' యనంబడును. అట్లొనర్చుటయె ప్రతినిధిధర్మము.

**ప్రతిఫలము**—(కన్సిడరేషన్ చూ.)

**ప్రతిబంధపంచకము** బౌద్ధమత ధర్మమున ౧ కామము, ౨ ద్రోహచింత, 3 స్త్యానము (సోమరితనము), ౪ గర్వప్రవర్తనము, ౫ సంశయచిత్తము. ఇది ప్రతిబంధ పంచక మనఁబడును.

**ప్రతిబాహువు**- శ్రీ కృష్ణునివంశస్థుఁడు. వజ్రునికుమారుఁడు.

**ప్రతిబింబవాదము- అవచ్ఛిన్న వాదము**-వేదాంతశాస్త్రమున జీవాత్మంగూర్చి పై రెండువాదములుగ అభిప్రాయభేదములుకలవు.

౧ ప్రతిబింబవాదము-అంతఃకరణమునందు ప్రతిబింబించు చైతన్యమే జీవము గాని, వేఱుగ లేదు.

౨ అవచ్ఛిన్నవాదము- అంతఃకరణావచ్ఛిన్నమైన చైతన్యమే జీవము గాని వేఱు కాదు.

ఆకాశమంతయు నొకటి యనుట నిర్వివాదాంశము. ఐనను ఘటావచ్ఛిన్నమును ఘటాకాశ మని యన్నటుల చైతన్య మంతయు నొక్కటి యైనను, అంతఃకరణావచ్ఛిన్నమైన చైతన్యమును జీవుఁ డనుచుందురనియు, ఇది గుర్తనియు, చైతన్యముకంటె వేఱు కాదనియు వీరివాదము.

**ప్రతిమధ్యతాళము**-(తాళములుచూ.)

**ప్రతివింధ్యుఁడు** — అత్రి, చంద్ర, పూరు, కురు సంతతి క్షత్రియుఁడు. తండ్రి పాండవాగ్రేసరుఁ డగు యుధిష్ఠిరమహారాజు. (ధర్మరాజు). తల్లి ద్రౌపదీదేవి. భిన్నోదర సోదరుఁడు యౌధేయుఁడు. ప్రతివింధ్యుఁడు ఉప పాండవులలో నొకఁడు. ఉపపాండవులు యుద్ధానంతరము నిద్రించుచుండ రాత్రి అశ్వత్థామచేఁ జంపఁబడిరి.

**ప్రతిశ్రవగోత్రము**-(నిధృవగణముచూ.)

**ప్రతిసూర్యాతపవాయులక్షణపరీక్ష** - (కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.) సూర్యుఁడు సరిగా తూర్పున నుదయించిన వర్షములు చక్కఁగఁ గురిసి కాలము సరిగా నుండును. ప్రజల కించుక భయము గల్గియుండుననియు, ఈశాన్య దిశవైపున వంగి ఉదయించిన వర్షయోగ మనియు, ఆగ్నేయదిశవైపున వంగి ఉదయించిన ఎక్కువగాలి వీచుననియు, అట్లే ఈఫలములనే అస్తమించుటకును నెరుంగఁ దగుననియు రెట్ట దైవజ్ఞశేఖరుఁడు నుడివియున్నాఁడు.

**ప్రతిచంద్రులు** (Mock moons)— ఉత్తరధ్రువ ప్రదేశములను గనుంగొనుటకుఁ బశ్చిమఖండవాసులు గొంద అప్పుడప్పుడు బయలువెడలి సముద్రములో నోడలునడుచు నందాఁక నోడలతో నేగి, యావల సముద్రోదక మంతయు జాతివలెఁ బేరుకొన్న మంచు మీఁద జరుగుళ్ళవంటి బండ్లపై నెక్కి, వానికి కుక్కలుమొదలగు జంతువులను బూన్చి ప్రయాణము సేయుచుండిరి. ఇపుడిపు డంతకష్ట మక్కఱలేకయే ఏరోప్లేన్ మొదలగుసాధనములచే మునుపటికన్న సులువుగ ప్రయాణము సేయఁ గలుగుచున్నారు. ఉత్తరధ్రువప్రాంతములనున్న ఎస్క్విమక్సను కుక్కల నాజరుగుడు బండ్లకుఁ గట్టి అందుఁ గూర్చుండి ప్రయాణము సేయుచుండుకాలమున వారు మంచుగడ్డల మీఁదనే, మంచు దిమ్మలమీఁదనే కడుదూర మరుగుచు, నక్కడక్కడ కొన్ని కొన్ని దినము లుండుచు ధ్రువప్రదేశతత్త్వములఁ బరీక్షించుచుండిరి. వెన్నెలరేలవారి కాకాలములందఱచుగఁ జంద్రబింబములు రెండేసి కానవచ్చుచుండెను. అందు నిజబింబమేదో, ప్రతిఫలితబింబ మేదో పోల్చుకొనుట కవకాశము లేకుండెనఁట. ఆప్రదేశ మంతయు స్ఫటికమువలె నిర్మలమగు శిలీభూతహిమమహిమచే నావృత మయి యుండుటవలనఁ బ్రతిచంద్రుఁ డగపడుచుండుట కెంతేని యవకాశము కలదు. ఈప్రతిచంద్రదర్శనరామణీయకము నెంతయు వారు గొనియాడుచు, దానిని జూచి తీరవలె నంతియకాని చెప్ప నలవికాదని వ్రాయుచువచ్చిరి. ఈప్రతిచంద్రులకే 'మాక్ మూన్సు' అని వాడుచువచ్చిరి.

ఇఁక మనవా రీప్రతిచంద్రుల నెఱుంగుదురో యెఱుఁగరో కాని, ప్రతిసూర్యుల నెఱింగియుండుటయు, ప్రతిసూర్యులవలన లోకమున కగలుగు ఫలములను గ్రహించి యుండుటయు మాత్రము సత్యమని మన కీక్రిందిపద్యములవలన సుబోధకము కాఁగలదు.

చం॥......................................
..........................క॥

ప్పలగుమి గూసెనేనిఁ బ్రతి
భాస్కరుఁ డప్పుడె పశ్చిమంబునన్
బొలిచిన వర్షము ల్గురియు
భోరున............................"

అనియు,

సీ॥ ఊహింప సూర్యుండు నుత్తరదిశయందుఁ
బ్రభవించెనేని వర్షంబు గురియు,
నొగి యామ్యదిక్కున నుదయించినను గాలి
ప్రబలఁబుగా వీచుఁ బశ్చిమమునఁ

బొడమె నేనియు వాన జడిఁబట్టి కురియును,
హర్షంబు నొందుదు రఖిలజనులు
ప్రాగ్భాగమునను జూపట్టిన బహువృష్టి
యొసఁగియుండును భీతిహెచ్చుఁబ్రజకు''

అనియు, ప్రతిసూర్యలక్షణమున నయ్యలరాజు అయ్యలకవి, భాస్కర కవులు చెప్పియున్నారు.

**ప్రతిష్ఠాన (కోట) పురము**— ఇప్పటి పఠానోట్కోటపురము పంజాబునం దున్నది. రావీనదీతీరము. (దహమేరి దేశముచూడుఁడు.) సంయుక్తరాష్ట్రములలోని అలహాబాద్ నందలి ప్రయాగకడ గంగానదికవ్వల నిప్పుడు ఝూఁసీ (దగ్ధమని యర్థము) యనంబడు తావు తొల్లింటి చంద్రవంశపురాజు లగు పురూరవాదులరాజధానిగ నుండిన ప్రతిష్ఠానపుర మని మహాభారతము, వనపర్వము. అధ్యా ౮౫ యందునను, కూర్మపురాణము 32, అగ్నిపురాణము 3 అధ్యాయములందునను ప్రశంసింపఁ బడినది. మఱియు విక్రమోర్వసియనాటక ద్వితీయాంక రంగస్థల మిదియె. ఇది ఇలాదేవి (బుధునిభార్య) వలన నిర్మింపఁ బడినటుల రామాయణోత్తర. ౯౦ అధ్యాయమువలన తెలిసెడిని.

ఇంకనులింగపురాణ. ౧-౬౫ భవిష్యపురాణ ప్రతిసర్గపర్వ ౨-౨ యందుఁగూడ దీనిప్రశంసలు కలవు. ఇట ఉత్తరముగ హంసప్రపాతన తీర్థమును, గంగాతీరమున ఊర్వసీతీర్థమును గలవు.

ఇంకను నిప్పటి పంజాబులోని గురుదాస్పూరుజిల్లాలోని పఠానోట్కోటపురము తొల్లింటి ఔదుంబర దేశరాజధాని ప్రతిష్ఠానపుర మని పోల్చియున్నారు.

ఇంకను నిప్పటి ఔరంగాబాద్ జిల్లా (నైజాం రాజ్యము) లోని ఔరంగాబాదుపురికి దక్షిణముగా నిరువదియెన్మిదిమైళ్లదూరమున గోదావరీ నది ఉ అం అం: "పైఠణ్" అనుపురము తొల్లింటి అశ్మక (మహారాష్ట్ర) దేశపురాజధానిగ దనరి వేర్వేఱుకాలముల "పత్తణ, మంగిలపత్తణ, ముంగిపత్తన, మంగిపైతన్'' నామములచేఁబరగిన బ్రహ్మపురి ప్రతిష్ఠానపురముగ పోల్చియున్నారు. ఇది శాలివాహనునిజన్మస్థానము, రాజధాని అని కూడ తెలియుచున్నది. శాలివాహనశకము క్రీస్తువెనుక ౭౮ సంవత్సరమున ప్రారంభమయ్యెను. మఱియు నిది ఆంధ్రదేశములోని దనియు, ఆంధ్రరాజధానిగఁగూడ నొకప్పు డుండిన దనియు, పద్మపురాణము ఉత్తర ౬౨ అధ్యాయ. ప్రశంస కలదు. కథాసరిత్సాగరమున నిట్లె చెప్పఁబడినది.

మఱియు బ్రహ్మవర్తదేశపు బితూర్ (బ్రహ్మవర్తము) న రాజధానియు ప్రతిష్ఠాన నగరమె. తొల్లింటి కోట ఉత్తానపాదనిర్మితమని యిప్పటికిని జూపుచున్నారు. ఈ ఉత్తానపాద నరపతిసుతుండగు ధ్రువుఁడు జన్మించిన దిచటనే యనియు, అతఁడు మధురారణ్యముల తపం బొనర్చె ననియుఁ జెప్పఁబడినది

**ప్రతిసూర్యులు** (Mock suns) — (ప్రతిచంద్రులు Mock moons) చూడుఁడు.)

**ప్రత్తివ్యవసాయము**— పాశ్చాత్యులు ప్రత్తిజాతిని పొడవునారగలజాతిప్రత్తి యనియు, పొట్టినారనిచ్చుజాతిప్రత్తి యనియు ద్వివిధములుగ విభజించిరి. వీటియందు అనేకము లంతర్భేదజాతులు కలవు. భరతదేశమునం దగపడు చుండినజాతులను పొట్టినారనిచ్చు జాతులుగఁ దెల్పుదురు.

ఇచట నార యనిన ప్రత్తికాయలోని ప్రత్తి యందు నూలు వడికిన వచ్చు దారముంగూర్చి యైయున్నది గాని చెట్టునార కానేరదు. పొడుగు నారగలజాతి యని చెప్పఁబడిన ప్రత్తినుండి చక్కని సన్న దారములు వచ్చును. పొట్టినార

యని చెప్పఁబడిన ప్రత్తిజాతులనుండి ముతక నూలు మాత్రము తీయనగును.

ప్రత్తిజాతు లన్నిటికి గుల్లభూములు శ్రేష్ఠములు. ఉంకటివేరు క్రిందికి లోతుగఁ జొచ్చుకొని పోవుచెట్లుగాన భూమి గుల్లస్వభావముగలదిగ నుండవలయును. లేకున్న చెట్లు పెరుగవు. గట్టిగా బిగియలాగుకొనిపోవుస్వభావముగల భూములు, అడుగున రెండుమూరల లోతుగా రాయిగల ప్రదేశములు, ఏజాతిప్రత్తిపంట కైనను అనర్హములే. ప్రత్తిమొక్కలచుట్టుకలుపు పెరుగరాదు. ప్రత్తిజాతులకు నీరుకట్ట నవసరములేదు. ప్రారంభమున భూమియం దించుక తేమ యుండిన చాలును. వర్షములు మితముగా పడుటయు, భూమియం దార్చుకొని ఇంకిపోవుటయు, వేరుల యొద్ద నీరునిల్వగాక ఆరియుంటయు ప్రత్తిజాతుల కవసరమని యెఱుంగునది. మఱియు నిది యా చెట్లకు మోదావహామని పరిశీలకులనుచున్నారు.

ప్రత్తిజాతులు కాపు ప్రారంభించుటకుఁ గొంత కాలము పట్టును. కాయనారంభించినదిమొదలు కొంతకాలము కాయుచునే యుండును. అన్ని జాతులచెట్లకు తొలికాపు చాల ప్రశస్తమై యుంటయు, పిదప కాపులు క్రమక్రమముగ quality యందు క్షీణించుచుంటయుఁ గల్గును గాన, వేర్వేరుకాపుల ప్రత్తిని వేర్వేరుగా నిల్వ చేయుదురు. ఇంచుక ప్రత్తి వేలుటతోఁ గోసి వేయవలెనుగాని, ఆలస్యమయిన నలకలు, బంక మొదలగునవి పట్టి నూలు వడుకుట కనర్హము లగును. ప్రత్తిని గోయుటకు ప్రాతఃకాలములె తగుకాలము లని చెప్పఁబడినది. ఏరుటయం దజాగ్రతయు,తప్పులును ప్రత్తిధరను పాడుచేయ కారణము లగును.

ప్రత్తిజాతులకు గల్గు తెగుళ్ళలో బొల్వరమ్మ జాతి ప్రత్తికాయకు చిల్లులుచేసి, లోని గుజ్జును దినివేయును. పైరిట్లు నాశన మగును. పచ్చ యీఁగ యనంబడు తెగులు పంటను పాడు చేసెడిని. డస్కి-కాటన్ బగ్ అనంబడు ముక్క పురుగులవంటి పురుగుల తెగులు ప్రత్తిపంటకు హానికర మైనది. పక్వస్థితికి రాకముందే కాయ లను పగులఁజేసి, లోని దూదిని తనమూత్రములచే పచ్చరంగుగ నొనర్చి పాడుచేయును. ఇవి కెర్సనాయిలునందుఁ జచ్చును.

## ప్రతీకారసిద్ధి—(లోకనీతిసిద్ధులు చూ.)

(లోకనీతిసిద్ధులు చూ.)

**ప్రతీచ్య(పాశ్చాత్య)రహస్య లేఖనము**-ఈవిద్య అనేక విధములుగ నెల్ల దేశము లందునను ఎల్లభాషలందునను గానవచ్చెడిని. ఐరోపాదేశములం దెక్కువగ ప్రచారము నంది యున్న విధానములు రెండు కలవు.

ఐరోపాదేశములభాషలందే ఆయా మాటల వర్ణక్రమము (Spelling) వ్రాయఁబడును. అక్షరము లుండుతావునను చుక్కలం బెట్టుట ఒక విధానము. ఎక్కడ చుక్కయుండిన నా యక్షర మని యెఱుఁగునది. (1990పుట చూ.)

ఈ భాషా విధానమున మాటకు మాటకు నడుమ నించుక ఖాళీప్రదేశమును వదలుచుండు టయు, వాక్యాంతమున (Fullstop) నకుం బదులు...ఇటుల మూఁడుచుక్కలిడుచుంటయు పద్ధతి. తక్కిన కామాలు,సెమికోలను,ఇంటరొగేషన్, ఎక్స్లమేషన్, కొటేషన్, బ్రాకెట్లు మొదలగు గుర్తు లన్నియు యథాప్రకారమే యుండెడిని.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I |
| J | K | L | M | N | O | P | Q | R |
| S | T | U | V | W | X | Y | Z | Ch. |

A  J  S 

B  K  T 

C  L  U 

D  M  V 

E  N  W 

F  O  X 

G  P  Y 

H  Q  Z 

I  R  Ch. 

ఇంక రెండవ విధానము అంకెల భాష. అనఁగా భరతదేశపువిధాన మిది కాదనియు, ఐరోపాదేశముల అంకెలభాష యనియు మనస్సునం దుంచుకొనవలెను. ఇందు A,E,I,O, U అను నైదచ్చులు ప్రధానాక్షరములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| A | 1 | J | 31 | S | 44 |
| B | 11 | K | 32 | T | 45 |
| C | 12 | L | 33 | U | 5 |
| D | 13 | M | 34 | V | 51 |
| E | 2 | N | 35 | W | 52 |
| F | 21 | O | 4 | X | 53 |
| G | 22 | P | 41 | Y | 54 |
| H | 23 | Q | 42 | Z | 55 |
| I | 3 | R | 43 | | |

ఇందు ప్రతి అక్షరము తరువాతను చుక్క (Fullstop) ఉంచవలయును. ప్రతి మాటకు పిదప చిన్న అడ్డుగీత (Hyphen) ఉంచవలెను. ప్రతి వాక్యము (Sentence)కు పిదపమూఁడు చుక్కలు ... (Three fullstops) ఉంచుచుండవలెను.

ఈ రెండువిధానములవ్రాతలందు పెద్దఅక్షరములు (Capitals & Small letters) అనియు, చిన్నఅక్షరము లనియు భేదములు పాటింపఁ బడనక్కరలేదు.

**ప్రతీంధనుఁడు (ప్రతిరథుఁడు)** ఇక్ష్వాకు సంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి మరువు లేక మరుత్తు. పితామహుఁడు హర్యశ్వుఁడు. పుత్రుఁడు ర్తిరథుఁడు.

**ప్రతీశ్వరర్షిగోత్రము-** ణములు చూడుఁడు.) ఈగోత్రమువారికిఁ బ్రధానఋషి పరాశరుఁడనియు, ప్రవరరూపము మను, మాండవ్య, లోహిత, పురూరుహా, పరాశర, వైధృవ, ప్రతీశ్వర యనియు, సప్తార్షేయముగఁ జెప్పఁబడినది.

శిష్టుకరణములలో చక్రధరమహంతివారను ఇంటిపేర్లవా రీగోత్రస్థులై యున్నారు.

**ప్రతీపుఁడు** — భీమసేనుని కుమారుఁడు. భార్య సునంద. కుమాళ్ళు దేవాపి, శంతనుఁడు, బాహ్లికుఁడు. ఇందు దేవాపి బాల్యముననె తపస్వియగుట శంతనుఁడు నరపతి యాయెను.

**ప్రత్నసగణము** — ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. (అధర్వణశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు) ౧ ప్రత్నసగోత్రము:-ప్రత్నస, శిల్పి, వాస్తుక, రుచిదత్త, సనాభ (పంచ). ౨ రుచిదత్తర్షి గోత్రము - శిల్పి, వాస్తుపతి, రుచిదత్త (త్రియార్షేయప్రవర). 3 వాస్తుపతి గోత్రము- వాస్తుపతి, రుచిదత్త, సనాభన (త్రియార్షేయప్రవర). ౪ కౌశలగోత్రము- రుచిదత్త, సనాభస, దైవజ్ఞ, కౌశల, ఐంద్రసేన. ౫ సనాభర్షి గోత్రము-సనాభ, దైవజ్ఞ, కౌశల, (త్రియార్షేయప్రవర).

**ప్రత్యంగతాళము**- (తాళములు చూ).

**ప్రత్యంగములు**-భరత (నాట్య) శాస్త్రమున మూఁపు, బాహువులు, వీఁపు, కడుపు, తొడలు, పిక్కలు, మణికట్టులు, మోఁకాళ్ళు, మోఁచేతులు ప్రత్యంగములని చెప్పఁబడినవి. కాని పెక్కండ్రు భరతశాస్త్రవిదులు తరువాతవారు ప్రత్యంగము లుపాంగములలోనివే కాన వేఱుగ ప్రత్యేకింప నిరాకరించిరి. (హస్తాభినయము చూ. భరతశాస్త్రము చూ. షడంగములు చూ. ఉపాంగములు చూ).

**ప్రత్యగ్రహపురము** — అహిచ్ఛత్రపురమున కీపేరు కలదని హేమకోశమునందు కలదు. మహాభారతము.ఆదిపర్వము ౬౩యందు ప్రశంసింపఁబడినది.

**ప్రత్యగ్రుఁడు**—అత్రి, చంద్ర, పూరు, కురు వంశక్షత్రియుఁడు. తండ్రి ఉపరిచరవసువు.

సోదరులు బృహద్రథుఁడు, కుసుంబుఁడు, మత్స్యుఁడు, చేదిషుఁడు.

**ప్రత్యభిజ్ఞశైవ లేక అభినవగుప్తాచార్యమతము**— కాశ్మీరదేశస్థుఁడగు అభినవగుప్తాచార్యుఁ డీమతకర్త యనియు, లేక శివప్రోక్తమగు తొల్లింటి మతమును సంస్కరించిన సంస్కర్తగను,ప్రవర్తకుఁడుగనుగూడ చెప్పఁబడినవాఁడు. ఈమహనీయునకు "మహేశ్వరాచార్యుఁ" డను బిరుదనామము కలదు. ఇది అద్వైతమతములలో నొకటి. శివపారమ్యమతము. శివుఁడే నేననుజ్ఞానము కల్గుట "ప్రత్యభిజ్ఞత" యనఁబడును.

ఈమతము జగత్తంతయు పరమేశ్వరునకు శరీరప్రాయము. ఆత్మ శివపదార్థ మయ్యు, మాయకు లోఁబడుకతన తానును, జగత్తును, పరమేశ్వరునకు భిన్న మని భ్రమించుచుండు ననియు, మాయాసంజాత మగు కర్మవలన చచ్చుచుఁ బుట్టుచుండుట సంభవించుచుండు ననియు, గురూపదేశమున మాయను జయించి తానే మహేశ్వరుఁడనని (పరమేశ్వరుఁడేయని) ఎఱుక గలుగఁగనే బంధవిముక్తి గల్గి, మాయ తొలఁగి, మహిమలు శక్తులు గలుగనారంభించును. దీనికి గుణ మనిపేరు. ఈగుణముగల్గుట కాత్మస్వభావము లెఱుంగుట ముఖ్యము. బంధమునుండి విముక్తిగాంచుటయె మోక్షముగఁ జెప్పఁబడినది. బంధమగు మాయ అనాదిగ నున్నదనుటకన్న దానింగూర్చి యీమతగ్రంథమునం దేమియుఁ దెలియరాకున్నది.

ఈమతకర్త యగు అభినవగుప్తాచార్యుఁడు "ప్రత్యభిజ్ఞావివృతివిమర్శని" యను పేరుగల శైవ సూత్రభాష్యము రచించి యున్నాఁడు. ఈమతస్థులు కాశ్మీరదేశవాసులుగ నున్నారు.

**ప్రత్యయపంచకము(పంచప్రత్యయములు**— బౌద్ధవైభాషికులు జ్ఞానేంద్రియము లైదింటిని ప్రత్యయపంచక మనెదరు.

**ప్రత్యక్షే కి మనుమాన మితిన్యాయః** కన్పించుచున్నది ప్రత్యక్షప్రమాణము. కన్పింపకున్నను పూర్వానుభవ ప్రసిద్ధపూర్వకమగు ఇతరమైన ఆనవాళ్లంబట్టి ఉన్నటుల తెలియఁబడుట అనుమానప్రమాణ మనంబడును. ప్రత్యక్షముగఁ గన్పట్టుచుండినదాని కనుమానము నిరర్థకమనియు అనవసరమనియు భావము.

**ప్రత్యాసత్తిన్యాయము**— కల్గియుండుట కార్యసిద్ధికి సాధనమని భావము.

**ప్రత్యాహారము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన అష్టాంగయోగములలో నొకటి. (యోగశాస్త్రము చూడుఁడు.) ప్రత్యాహారమన స్వతస్సిద్ధమైనవృత్తినుండిమరలించి వేఱొకవృత్తియందు (మనస్సును, ప్రాణమును) ప్రవేశపెట్టుట యని యర్థము. ప్రాణాయామవిధానమున ఉత్తమప్రాణాయామకుంభకకాలమునకు పండ్రెండురెటకాలముగ పండ్రెండుమినిట్లు నలుబదియెన్మిది సెకెండ్ల కాలము కుంభించియుండఁ గలిగినచో ప్రత్యాహారావస్థ సిద్ధించిన దని చెప్పఁబడినది. యోగులు ప్రత్యాహారమును యోగసంబంధప్రత్యాహార మనియు, జ్ఞానసంబంధప్రత్యాహార మనియు ద్వివిధముగఁ జెప్పుచున్నారు.

౧ యోగసంబంధము- తాలుమూలముకడనున్న విశుద్ధచక్రము చంద్రకళాయుత మనియు, అధోముఖ మనియు, దానినుండి అమృతము స్రవించుచు, నాభిస్థానమందలి సూర్యకళాయుతము, ఊర్ధ్వముఖము, జఠరాగ్నియుక్తము నగు మణిపూరకచక్రమునంబడి హరించిపోవుచుండు ననియు, యోగాభ్యాసమున విపరీతకరణీముద్రసాధనమున విశుద్ధచక్రము నూర్ధ్వముఖముగను, మణిపూరకచక్రము నధోముఖ

ముగను మరలించి, తా ననుభవించుటనే ఇట ప్రత్యాహారమని చెప్పుచున్నారు.

౨ జ్ఞానసంబంధార్థము- ఇదివఱ కభ్యసించి స్వాధీనపఱచుకొనిన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ సాధనాభ్యాసములవలన వైరాగ్యము, శరీరేంద్రియ స్వాధీనచిత్తైకాగ్రతల నుపయోగించుచు సిద్ధాంతవిచారము చేయుచుండుట ప్రత్యాహార మనుచున్నారు.

ఈసందర్భమున యోగశాస్త్ర సంబంధ సిద్ధాంత మిటుల వివరింపఁబడినది. ప్రపంచ మంతయు పంచభూతాత్మకము. ఆపంచభూతములు తన్మాత్రలనుండి కలినవి. పంచతన్మాత్రలు పంచజ్ఞానేంద్రియసంబంధము కలవి. పంచజ్ఞానేంద్రియవ్యాపారము మనస్సాహాయ్యముననే గల్గునది. మనస్సు జడము గాన దీని కీవ్యాపారశక్తి గల్గించునది జ్ఞానశక్తి. అజ్ఞానశక్తియు సుషుప్త్యవస్థయందు నిర్వ్యాపారదశయం దుండునది. అట్టితఱిఁగూడ సాక్షీభూతుఁడై శక్తిసహితుఁడై యుండినపరమేశ్వరుఁడె పరాత్పరుఁడు గాన, సర్వజగత్తు పరమేశ్వరీపరమేశ్వర పదార్థమే. పరమేశ్వరస్వరూపము వినుధ్వనులు, చూచుపదార్థములు, వాసనగల్గినద్రవ్యములు త్వగింద్రియగ్రాహ్యస్పర్శములు జిహ్వేంద్రియగ్రాహ్యములగు రుచులు పరమాత్మస్వరూపమె గాన లోకపదార్థములందు ఇష్టము, అనిష్టము నను హేయోపాదేయభావన వదలివేయవలెను. తానును పరమాత్మపదార్థమె గాన "సోఽహం బ్రహ్మాస్మి" అని చింతించుచుండునదిగా చెప్పఁబడినది.

**ప్రథమ బౌద్ధమతమహాసభ**- (మగధ రాజ్యము చూడుఁడు).

**ప్రథమైకాదశి**- (ఏకాదశితిథులు చూ).

**ప్రధాననాడులు**— ఇడా, పింగాళా, సుషుమ్న. (నాడి,నాడులు,స్వరనాడులు చూ.)

**ప్రధానమల్లనిబర్హణన్యాయము**

ప్రధానశత్రువును బరిమార్చిన తక్కినవారు తోడనె లొంగిపోదు రనుట కీన్యాయము వర్తించెడిని.

**ప్రదరము**-(కుసుమరోగము చూడుఁడు.) ఆంగ్ల. Leucorrhoea.

**ప్రదీపే ప్రదీపం ప్రజ్వాల్య తమో నాశాయ యతమానేతి న్యాయము**— ఒకవత్తిదీపపువెల్గు చాలదని వేఱొకవత్తినిగూడ దీపమున జతపఱచుట కర్థము. యోచనలేని దుర్వ్యయమును దెలుపనీన్యాయము వాడుదురు.

**ప్రదోషము** — రాత్రియం దొకగడియ యైనను త్రయోదశి తిథి యున్నతఱి (కృష్ణపక్షమున) దానిని ప్రదోష మనియు, మాస శివరాత్రి యనియు ననెదరు. ఇది శివప్రీతికరమని చెప్పఁబడినది.

మతాంతరములందు చతుర్థి, సప్తమీ తిథులును ఇట్లె ప్రదోషము లగునని చెప్పఁబడి యున్నది గాని యవి ఈదేశమున పాటింపఁబడుట లేదు.

అనుదినము ప్రదోషకాలము లని, సాయంకాలములను వాడుచుందురు. త్రయోదశి ప్రదోషమునాఁడు శనివార మగుతఱి దానిని శనిప్రదోష మని పవిత్రాధిక్యము నొసంగుచుందురు.

**ప్రద్యుమ్ననగరము** — బంగాళములోని హుగ్లీజిల్లాయం దిప్పుడు పాండువా యను పేరఁ బరఁగుచున్న పురము.

ఇది తొల్లింటి పుండ్రవర్ధన మగు (మాల్టా సమీపమున నున్న) ఫిరోజాబా దని మాఱుపేరిడఁబడిన పాండువా కాదని యెఱుంగునది. ప్రద్యుమ్ననగరమునకుఁ దొల్లింటి పేరుబుఱావంత మని యుండెనఁట. శ్రీకృష్ణుని సుతుండగు ప్రద్యుమ్నుఁ డిట శంబరాసురుని వధించెనఁట.

దానం జేసి మారపుర మనియు, వాడుక గల్గె నట. దీనింగూర్చి హరివంశము ౧౬౬ అధ్యాయమున వివరింపఁబడినది.

బుద్ధభగవానుఁడు తండ్రియొక్క కపిలవస్తు రాజ్యమును కాంక్షింపమిం జేసి, శుద్ధోదనునకుం బిదప శుద్ధోదనుని పినతండ్రికుమారుఁ డగు పాండు లేక ప్రద్యుమ్న శాక్యుఁడు కపిలవస్తు పురాధినాథుఁడై కొంతకాలము పాలించెను. పిదపకోసలదేశమును జయించి విరుద్ధకమహారాజాక్రమించుటయు, కపిలవస్తుపురముపై దాడివెడల సిద్ధపడుటయు నెఱింగి, యాతనికి వెఱగంది ప్రద్యుమ్న శాక్యుఁ డాకపిలవస్తుదేశమును తానె విడిచిపైచి వెడలి, గంగానదిదాఁటి యవ్వల కొంతదూరమేఁగి, యీ మారపుర మనఁబడెడి బుఱౌవంతమున కేఁగి, యట నొకరాజ్యము స్థాపించుకొని ప్రభుత్వము వహించి పాలించుచుండెనఁట. ప్రద్యుమ్న భూపతితండ్రిపేరు అమితోదనుఁ డని చెప్పఁబడినది.

ప్రద్యుమ్నుని కుమార్తె భద్రకచ్చనదేవి (బంగాళములోని హుగ్లీజిల్లా సింహపురమని పిలువఁబడుచున్న) సింహపురాధీశుండగు పాండువాసుదేవనృపతి రాణియయ్యెను. సింహళద్వీపముపై దాడివెడలి యాక్రమించి యట రాజ్యమేలిన విజయభూపతికిఁ బిదప సీపాండువాసుదేవుఁడే రెండవభూపతి (సింహళమున) యయ్యెను.

నాఁడాదిగ పాండునగరమనియు, ప్రద్యుమ్న నగర మనియు వాడుక మారపుర మనుపేరును బుఱౌవంత మనుపేరును వెనుకకుఁ ద్రోసివేయ సాఁగెను. అందు పాండునగర మనుపేరె ఎక్కువవాడుకయై కాలవశమున మార్పులం జెంది కడకు పాండువా యని నిలిచెనఁట.

క్రీ. వె. ౧౩ వ శతాబ్దాంతమున మహమ్మదీయాక్రమణ మీపాండువాకు తప్పనిదయ్యెను. రెండవఫిరోజిషా మేనలుఁడు షాషుఫీ యను నతఁడు తన మేనమామసైన్యబలము చేయూతగ గొని ఇట రాజ్యమేలుచుండిన భూపతిని జయించి యాక్రమించెను. మఱియు నాతఁడే ఇచటి శృంఖలాశక్తిదేవస్థానమును బడఁగొట్టించి యట మసీదు గట్టించినవాఁడఁట. ఇచటి ౧౨౫ అడుగులయెత్తుగల పాండువాపెద్దస్తంభ మనుపేరు గల Towerను తనజయస్తంభముగనో లేక అట మసీదు ముయుద్దీన్ పిలుపులఱపుల స్తంభముగనో నిర్మించినది ఆ షాషుఫీయె అని చెప్పుదురు.

**ప్రద్యుమ్నవ్యూహము** — రామానుజీయ వైష్ణవ, చైతన్యవైష్ణవ మతధర్మములందు తదేకాత్మరూపమహావిష్ణువుఅందుఆదిచతుర్వ్యూహములలోనొకటిగనుచెప్పబడినది. దీనిని మకరధ్వజవ్యూహములోని ఉపవ్యూహమనియు, విలాసమూర్తి యనియు, వరుసగ చక్ర, శంఖ, గద, పద్మములాయుధము లనియు చెప్పఁబడినది. (విష్ణుదేవాలయములందలి విగ్రహములు చూ.)



**ప్రద్యుమ్నుఁడు**-అత్రి, చంద్ర, యాదవ క్షత్రియుఁడు. తండ్రి శ్రీకృష్ణుఁడు. తల్లి రుక్మిణీదేవి. సోదరులు (శ్రీకృష్ణుఁడు చూడుఁడు). కుమారుఁ డనిరుద్ధుఁడు. అనిరుద్ధుని బాణాసురునిమనుమరా లగు ఉష వివాహమాడెను.

ప్రద్యుమ్నునిభార్య రతీదేవి యని కొన్ని చోట్లను, రుక్మికుమార్తెయని మఱికొన్ని చోట్లను కలదు.

ప్రద్యుమ్నుఁడు పరమేశ్వర నేత్రాగ్నిచే దహింపఁబడిన మన్మథునియవతారమని చెప్పఁబడినది.

ఇంకను ప్రద్యుమ్నుఁడు శిశువుగ నుండుతఱి శంబరుఁడను అసురుఁడు దానినెత్తుకపోయి సీటం బాఱవైచె నఁట. దానినొకచేప మ్రింగెనఁట. అది జాలరులచే పట్టువడి శంబరునిగృహముం జేరె నఁట. వా రాబాలుని గుర్తింపఁజాలక పోయిరఁట. మాఱువేషమున శంబరునియింటికి పనిపాటలంజేయ సేవకురాలివలె నేతెంచి కాలము గడపుచు మాయావతి యనుపేరున మెలఁగుచుండిన రతీదేవి, వంటవాఁడను బ్రార్థించి యాబాలుని గైకొని తానుపెంచుకొనుచు పెద్దవాఁడైనపిదప నాతనికి తాను భార్య యగుటయు, శంబరుఁడొనర్చిన దుష్కార్యము నెఱింగించి ప్రద్యుమ్నునిచే శంబరునిజంపించి, తానాతనిం గైకొని ద్వారకయందున్న రుక్మిణీ శ్రీకృష్ణుల కడ కేగి సర్వము నివేదించి వారిమన్ననలంది సుఖంబుననుండె నఁట.

**(మహారాజు)**- మగధదేశాధీశుఁడు. తండ్రి సుకీర్తినకుఁడు. తొల్లింట సుకీర్తినకుఁడు మగధరాజ్యమునకు మంత్రియై యుండి, రిపుంజయుఁడను భూపతిని జంపి, తన సుతుఁడగు ప్రద్యోతునునకు సింహాసనమిచ్చినవాఁడు. ఈతనిసుత యగు వాసవదత్త కౌశాంబీనగరమున రాజ్యమేలిన అగ్నిమిత్రమహారాజు భార్య.

**ప్రధ్వంసాభావము** (అభావములు చూడుఁడు.)

**ప్రపంచమండలి సముద్రభాగము**-- ప్రపంచమున మూఁడుపాళ్లును, భూమి యొకపాలు నుండునని భూగోళశాస్త్రవిదు లనెదరు. దీని నిజతత్వ మారయుట సమంజసము. మూఁడుపాళ్లన నీటి యుపరిభాగపు లెక్క గాని లోఁతు కానేరదు.

పరిశీలకులు సముద్ర మింక నాఱువందల అడుగులలోఁ తధికమగునేని భూమినంతను ముంచివేసి జగమంతయు నొకటేజలనిలయముగ నగునని అంచనా వేసియున్నారు. వారే సముద్రము ఇక నారువందలయడుగుల మెరకయగునేని, పెక్కుతావుల అడుగుభూమి బయల్పడి ఇంగ్లాండు, ఆస్ట్రేలియా మొదలగుద్వీపములన్నియు భూమితో సంబంధమేర్పడు నందురు.

ఇప్పుడున్న మహాసముద్రములలో పశిపిక్ మహాసముద్రము గొప్పది. లోఁతుప్రదేశములం దగ్రగణ్యము. పిదపఁ జెప్పందగినది యట్లాంటిక్కుమహాసముద్రము. తరువాతచెప్పదగినది హిందూమహాసముద్రము. పిమ్మట నుత్తర దక్షిణధ్రువసముద్రములు.

పశిఫిక్ మహాసముద్రపు నీటిపైభాగపుపరిమితి భూపరిమితియంత యుండునని చెప్పఁబడియున్నది. అనఁగా నించుమించు ౫౫000000 మైళ్ళపరిమితి యుండునఁట. అం దధికభాగము ౧౨000 అడుగులలోఁ తనియు, అం దింకను కొన్నితావులు ౧౮000 లోఁతున్నవి కలవనియు, ఇంకఁ గొన్నిప్రదేశములు హిమాలయపు గౌరీశంకర (Everest) శిఖరముకూడ నందుమునిఁగిపోవగినలోఁతు గలవి కలవనియు నందురు గాని కొందర కీకడపటిసంగతియందభిప్రాయభేదముకూడ కలదు. ఇంకను గొందరు పరిశీలకులు పసిఫిక్కుమహాసముద్రమున నెక్కువ లోఁతగుతావు 3౧౯౮ అడుగు లనుచున్నారు. అట్లాంటిక్కుమహాసముద్రముయొక్క జలముల ఉపరిభాగము 30000000 మైళ్ళకన్న నించుక యధికముగా నుండునని అంచనావేసియున్నారు. దీనిలోఁతు సగటున ౧౦౨00 అడుగులుండునని అంచనాలెక్క గుదిర్చిరి. దీనియం దెక్కువ

లోఁతగుతావు ౨౭౦౦౦ అడుగులఁట. హిందూ మహాసముద్రముం గూర్చిన యిట్టిలెక్కలు లభింపకున్నవి. ఉత్తరధ్రువ దక్షిణధ్రువసముద్రముంగూర్చిన వివరముల నెఱుంగుట కశక్యమగుచున్నది. అవి మంచుచేఁ గప్పఁబడి పోవనశక్యములు.

పిదప సముద్రమం దున్న ఉప్పులు, చిప్పలం గూర్చి విచారింతము. పరిశీలన లిదివఱకే సముద్రజలములందు వేయింట నిరువదియేను పాళ్ళ సముద్రలవణము కలదని బయల్పఱచినవి. కాని యిది అన్ని సముద్రములందున్న లెక్క కానేరదు. ధ్రువసముద్రములందు లవణము చాల తక్కువ యుండెడిని. సముద్రమునందు కొన్నితావుల నధికముగ నున్నను, సగటున నిట్లు లెక్క కుదుర్పఁబడియున్నది. కొంచెము పాళ్ళు salts of lime ను, magnesium salts ను, potassium salts కొన్ని భాగము లును గలవు. ఇవి తక్కువగా నుండెడిని. ఇందు సముద్రలవణ మధికము. దానినంతయుఁ బ్రోగు చేయఁగల కేని భూమియంతటను గప్పనగునఁట. సముద్రజలములందు కార్బను-డి-ఆక్సైడు గాసును, ఆక్సిజెన్ గాసును, నైట్రొజన్ గాసును కరగిపోయి కలిసియున్నవని రసాయనశాస్త్ర విదులు పోల్చుచున్నారు. Lime Salts నుపయోగించుచు Shell creature జంతువులు తమ చిప్పలం జేసికొను ననియు, అవి చచ్చినపిదప వాటిమెత్తనిశవములు నీటఁగరఁగి కలిసిపోయి చిప్ప లడుగంటి ఒకపొరగ నగుచుండునఁట. అట్టిపొర కాంగ్లమున "Ooze" అని పేరు. అందు కడుచిన్న చిప్పలుగల జంతువుల కాంగ్లమున "Globigerinae" అని సాంకేతికనామ మిడియున్నారు. శాస్త్రగ్రంథము లందు అట్టి చిన్న చిన్న చిప్ప లడుగంటినపొరకు సాంకేతికముగ "Globigerina oose" అని వాడియుంటఁ గాననగును. అది రంగుగల బురదవలెనే కాననగును. అది సముద్రపుటడుగు భాగమున ౪౭౦౦౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యప్రదేశ మాక్రమించి యున్నటుల నంచనా వేసియున్నారు.

ఇంకను సముద్రపు టడుగుభాగమున Diatoms అనఁబడిన మొక్కలబీజు కలదనియు, అది స్వచ్ఛమై అద్దమువలె నుండుననియు, ఇదియుఁ జిప్పలసముదాయముగఁ గన్పడునదే యనియు తెలియుచున్నది. ఇంకఁ గొన్నితావుల నెఱ్ఱరంగుగలబురద కలదనియు, నందు సొర్చుల పండ్లు, వేలు, జంతువులఎముకలు గలిసియుండు ననియు వినుచున్నారము. ఇంక నీసందర్భమున సముద్రతరంగములం గూర్చియు, సముద్రజల ప్రవాహములం గూర్చియు, సముద్రపు పోటు పాటులం గూర్చియు నించుక వివరించుట సమంజసము.

సముద్రతరంగములంగూర్చి యెల్ల తెలిసిన దే. అవి నీటికదలికగాలివలన కలుగుచుండు నవి. తుపానునం దివి యధికములుగను, పెద్దవిగను, అపాయకరముగను ఉండి, శాంతకాలమున చిన్నవిగను, తగ్గియు నుండును. బలపడి యున్నప్పుడు దరుల పాడుచేసి ఓడలను ముంపఁ గలుగును. సర్వసాధారణముగ నేఁబది యడుగుల యెత్తుకన్న మించకుండును గాని ఒక్కొకచో వాటినీటిమెగురుదల రెండువందల యెత్తునకుఁ గూడ జనెడిని. స్కాట్లండు దేశములోని డన్బారున జరిగినపరిశీలనలనుండి కెరటములందలి ప్రతిఘనపుటడుగు నీటియందు ౨౦౦౦పౌనుల ఒత్తిడి యుండునని తేలినది. అట్టి తుపానునందలి కెరటములు ముప్పదినలుబదిటన్నులబరువుగల రాళ్ళను గదిలించి నెట్టఁగలబలముకలవిగ తేలుచున్నది. పోటుపాటులు చంద్రసూర్యుల యాకర్షణములవలన సముద్రజలములు ఒక

తాపునకుం జేరుకొని ఆతీరములందు నీ రధికమగుట పోటుగను (Ebb) ఇతరమైన తీరములనీ రాకారణమున తగ్గిపోయియుంట పాటుగను చెప్పఁబడుచున్నవి. భూమధ్య రేఖాపరిసరముల పోటుపాటులు కన్పింపవు. ఏలయన నట సర్వకాలము సూర్యాకర్షణమున పోటే గాని పా టుండదు. చంద్రాకర్షణ మట పనిచేయదు. చేసినను అందే చేరిపోయి యుండును. పోటుపాటులు సర్వసాధారణముగ నాలుగడుగుల యెత్తుకన్న మించి యుండక లోపుననే యుండెడిని గాని బ్రిటీషుదీవు లందలి కార్డిఫ్ (Cardiff) రేవున డాకులవద్ద నొక్కొకతఱి నలుబదిఅడుగులయెత్తుదనుక సముద్రపు పోటుపాటులు గల్గుచుంటఁ గాననగుచుండెడిని. ఇది యెప్పుడోగాని కల్గుచుండదు. ముగల్లా జలసంధివద్ద అరువది యడుగులయెత్తునకు పోటుపాటులు గల్గుచుండుట చిత్రమనిపించును. ఫండే వియుక్తాగ్రగుడము (Funday Bay)కడ సతతము డెబ్బది యడుగులయెత్తు పోటుపాటులు గలుచుండును. దీనికి గారణము సూర్యచంద్రుల యాకర్షణలే గాక ఇతరకారణములుగూడ నుండియుండవలెనని తోఁపకపోదు.

**ప్రపంచము** (Universe) — జగద్వస్తుసముదాయమునకు ప్రపంచక మనిపేరు. పంచక మన నైదని యర్థము. పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము ననునీ యైదును ప్రపంచకము. జగమంతయు నీయైదువస్తువుల సముదాయమే. ఆకాశమునందు గాననగు గోళము లన్నియు ప్రపంచక మనఁబడును.

గట్టిపదార్థములగు భూమి మొదలగు సమస్త వస్తువులు, శరీరమందలి మాంసపదార్థము, చెట్లయందలి గట్టిపదార్థములు మొదలగునవన్నియు భూపదార్థములే. ఇంక జలములు, సమస్తవస్తువులందలి రసములు, రక్తమందలి యుదకపదార్థము మొదలగు సమస్తద్రవపదార్థములు జలములుగ (జలభూతముగ) దలంపఁ బడెడిని.

అగ్నియు, తత్సంబంధమగు వేడియు, వాయువునందున్న వేడియు మొదలగునవి యగ్నిభూతముగను, వాయుమండలము, సమస్తములగు గాలులు వాయుభూతముగను నెఱుంగఁ దగును. ఇంక ఆకాశ మనిన సావకాశ మని యభిప్రాయము. భూమియు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు మొదలగు సమస్త గోళములు ఆకాశమున సంచరించుటకు ఉండుటకగు విశాలబహిఃప్రదేశమంతయు ఆకాశమే. కాళీగా నున్నజాగా యంతయు ఆకాశమగును. ఇదియె ఆకాశము. ఇటుల పృథివ్యప్తేజోవాయురాకాశము లను నైదుభూతములును వివరింపఁ బడినవి.

ఇట్టి ప్రపంచ మనంబడు జగత్సముదాయమంతయుఁ గూర్చినవిజ్ఞానము ఖగోళశాస్త్రముతో సంబంధము కలదియైయున్నది. ఖగోళశాస్త్రమును మన జ్యోతిషశాస్త్రమునందలి యొకభాగముగ నున్నది (Astronomy).

దీనింగూర్చినవిజ్ఞాతగ పాశ్చాత్యులు Simon Newcomb పండితుని గారవింతురు. పాశ్చాత్య నాగరికతయని తలంపఁబడు దానిప్రారంభకాలమునుండియు నీవిజ్ఞానము ఊహలపైనాధారపడియుండెనుగాని, ఇటీవల యంత్రసాహాయ్యము కల్గుకతన కొంతవఱకు నిజవిజ్ఞానము తమకు బయల్పడినదని పాశ్చాత్యులు పల్కుచున్నారు. ఎవరివిజ్ఞానము నెవ్వ రెంతగాఁ జెప్పుచున్నను, ఆకాశమునందలి గోళముల నందఱు రెండు తెగలుగ నెన్నుట గలదు. అం దొక గొప్ప సముదాయముంగూర్చి మనకంతగఁ దెలియదు. తెలియుననువారును తమయూహల నె చెప్పుచున్నారు. కాని, నిజసిద్ధాంతమని తెల్ప సాహసింపఁజాలరు గావ దాని నింతటవదలి వేఱొక

తెగ ఖగోళముల సముదాయముం గూర్చి యోచింతము.

ఇంక రెండవ తెగఖగోళములందు ముఖ్యము లగునవి పది. అందు భూమియొక్క గోళము Mercury, Venus, Mars, Jupiter, Saturn, Uranus, Neptune అనునవియు సూర్యబింబమును, చంద్రబింబమును కలిసి పది యగును. ఇందు చంద్రుఁడు భూమినిజుట్టి తిరుగు చుండును. తక్కిన వన్నియు భూమిసహా సూర్యునింజుట్టి తిరుగుచుండును. భూమి, చంద్రుఁడు తన్ను జుట్టి తిరుగుచుండ, దానితోసహా తాను సూర్యునింజుట్టి తిరుగుచుండును. మఱియు నిందు Mercury సూర్యునకు సమీపముగ నుండునది గాని మానవనేత్రమునకు (యంత్ర సాహాయ్యము లేక) గానరాకుండునది. ఇంకను Uranus అనుగోళమును Neptune అను గోళమును యంత్రములగుండా చూడనగునవిగ నున్నవి.

ఈ రెండవ తెగయందు ప్రధానముగ వివరింబఁబడినగోళములు పదియునుగాక ఇంకను అసంఖ్యాకములగు గోళములు కలవు. అవి ఏదో గ్రహముం జుట్టి తిరుగునవిగనో లేక స్వతంత్రములుగ తిరుగుచుండునవిగనో లేక సూర్యునింజుట్టి తిరుగుచుండునవిగనో యుండును గాని స్పష్టముగ మనకు దెలియరాకున్నది. అందు ముఖ్యములగునవి భూమికిఁగడుసమీపముగనుండునటులఁ బోల్పఁబడినది Alpha centauri అనంబడుగోళము, మఱియు Arcturus అనంబడునదియు Vega అనంబడునదియు Altair అనంబడునదియు. Sirius అనంబడునదియు నాల్గు గోళములు పేరిడఁబడినవి కలవు. ఇంకను లెక్క తెలియనివి పెక్కుగోళము లిందుఁ గలవు.

ఇందు సూర్యుఁడు ప్రధానము. దానియందు శక్తియొక్క ప్రభావ మతిశయముగఁ గలదు. అం దగ్నిజ్వాల లంతటను గలవు. వాట్లమూలమునసే ఎండయు వేఁడిమియు మనకుఁ గల్గుచుండుట మనపూర్వులు సూర్యప్రతిపాదకమగు గాయత్రీమంత్రము మనస్సును పరిశుద్ధపఱుపఁ ప్రేరేపించు నని త్రిసంధ్యలందు జపించుచుండురు. సూర్యుఁడు తక్కినగోళముల నాకర్షించుచుండునుగాన దానిం బరివేష్టించి తిరుగుచుండునని పాశ్చాత్య విద్వాంసులు నుడివిరి. దీనికి వారు Gravitational pull అనిరి. మఱి కొందరీ Gravitation ను శక్తి (Energy) యనిరి. ఇట్లు తిరుగుచుండుగోళములకు "Planets" అని పేరిడియున్నారు. మఱియు నీసూర్యు నాశ్రయించి తిరుగుచుండు గోళసముదాయమునకు "Solar system" అని ఆంగ్లపండితులు వాడెదరు.

ఈమధ్యకాలమున భూమినిచుట్టి తిరుగునట్టి చంద్రునివంటి ఉపగోళములు కొన్ని కొన్నిగ తక్కిన Mercury, Venus మొదలగు నితరగోళములకుఁ గూడఁ గలవని తెలియుచున్నది. అవియు వాటివాటిం జుట్టి తిరుగుచుండునవియె.

ఈగోళము లన్నియు gravitation pull వలన తనకుఁ దాను గిరగిరం దిరుగుచు, తానాశ్రయించియుండు గోళమును జుట్టివచ్చుచుండుట నందుపై నుండువారలు రేయింబవళులు కల దినముల భేదమును గల్గియుండ వలెను. ఇట దినము లనుతఱి భూమి తనకుతానై యొకసారి గిరగిర తిరుగుతఱి నఱువది గడియలు లేక యిరువదినాల్గుగంటలకాల మగునటుల వేర్వేఱు గోళములు సూర్యునిం జుట్టి తిరుగుచో తమకు తాము గిరగిర తిరుగుట యొకసారి యొకదినముగ నెఱుంగ వలయును. ఇంకను వేర్వేఱు గోళముల దినముల గోళములకు వాట్ల పరిమా

ణము తిరుగు వేగముల మేరకు దినపరిమాణ్ణము వేర్వేఱు విధముగ నుండెడిని.

అటుల సూర్యునకు సమీపమునఁ దిరుగు చుండునటులఁ గానంబడు Mercury గోళము నందు, దినమున కిరువదియైదుగంటలు లేక అరువది రెండున్నరఘటిక లనియు, ఆగోళ మొకతఱి సూర్యునిం జుట్టివచ్చుట కెనుబదియెన్మిది దినములు పట్టుననియు లెక్కింపఁబడినది.

తరువాత వెలుపలగా సూర్యునింజుట్టి తిరుగు చుండు "Venus" అనంబడుగోళము. దీని యందలి దినమునకుఁగలకాలము సరిగా తెలియ రాకున్నది. ఐనను నిది సూర్యు నొకతఱి చుట్టి వచ్చుటకు రెండువందల ఇరువదియైదుదినము లని పొడకట్టెడిని.

పిదపఁ గలది మన ముండుభూమి. ఇందు దినమున కఱువది గడియలకాల ముండును. (అనఁగా నిరువదినాల్గుగంటలు) ఇది యొకతఱి సూర్యునింజుట్టిరా మూఁడువందల అఱువదియైదు దినములపై పండ్రెండున్నర గడియలు లేక అయిదుగంటల కించుక ఎక్కువకాలము నడిచెడిని. ఈకాలమునె మనము సంవత్సర మనుచున్నారము.

తరువాతఁగలగోళము Mars అనంబడునది. ఇందు దినమునకు అఱువదియొక గడియలును పదునేను విఘటికలును కాలమగును. అనఁగా నిరువదినాలు గంటలనర కాలమగునని యెఱుంగునది. ఇది యొకసారి సూర్యునిం జుట్టిరా నారువందల యెనుబదియేడుదినము లయ్యెడిని.

తరువాత వెలుపలఁ దిరుగునది Jupiter అనంబడు పెద్దగోళము. తనకుతా నతివేగమున తిరుగుచుండునది గాన దినమున కిరువదియైదు గడియలకాలము, లేక పదిగంటలకాలము పట్టెడిని. మఱియు నిది సూర్యునిం జుట్టివచ్చు కాలము పండ్రెండుసంవత్సరము లని లెక్కింపఁబడినది.

పిమ్మటఁగలది Saturn అనంబడుగోళము. ఇందునను దినమున కిరువదియూరు గడియల పదునేను విఘటికలు లేక పదిన్నరగంటల కాలమనియు, ఇది సూర్యునింజుట్టి రా పండ్రెండు సంవత్సరముల కాలము పట్టుననియు తెలియుచున్నది.

పిదప వెలుపలఁ దిరుగుచుండునది Neptune అనంబడుగోళము. దీనియందలి దినపరిమాణమును సరిగా తెలియఁబడకున్నది గాని, కొందఱాంగ్లపండితు లిది సూర్యునింజుట్టివచ్చు కాలము నూట యరువదియైదు సంవత్సరము లనుచున్నారు.

కొందఱు పండితులు భూమి సూర్యునిం జుట్టి తిరుగుతఱి మినిటునకు వేయిమైళ్ళకన్న నధికముగనే బర్విడుచుండు నదని లెక్కించిరి. అట్లొకతఱి చుట్టివచ్చు కతనఁబర్విడినదూర 58 కోట్లమైళ్ళ దూర మని తలంపవచ్చును. భూపరిమాణముకన్న సూర్యునిపరిమాణము(శరీరము) మూఁడులక్షల ముప్పది మూఁడువేల నాల్గువందల ముప్పదిరెండురెట్లధికమని కొందఱాంగ్ల పండితు లభిప్రాయపడిరి.

చంద్రుఁడును భూమినిజుట్టి తిరుగుచుండుటను భూమియందలి ఆకర్షణశక్తి(Gravitational pull) కారణమై యుండవలెను. మఱియు నిట్లె తక్కినమహాగోళములచే నాకర్షింపఁబడిన చిన్నగోళములు వాట్లంజుట్టి తిరుగుచుండుటకును నిదియె కారణము గానోపు.

తొలింటి యార్యులందలి జ్యోతిషవేత్తలు తక్కిన గ్రహము లన్నియుఁ గలిసి పరిమాణమున సూర్యునితో సరిగావని నుడివిరి. మఱియు పరిశీలనలవలన భూమి సూర్యునినుండి పదునెన్మిది కోట్ల ఏఁబదిలక్షలమైళ్ళ దూరమున నుండునని

లెక్క తేలుచున్నది. మఱియును సూర్యుని శరీరముగుండా రంధ్రము వైచిన నారంధ్రము పొడవుకొలత యెన్మిదిలక్షల అరువదియారువేల మైళ్ళుండునని ఆంగ్లజ్యోతిషవేత్త లనెదరు.

ఇంక నాకాశమునందలి గోళములసంఖ్యయు ఆకాశపరిమాణమును లెక్కింపఁ బ్రయత్నించుట యసంభవము.

**ప్రపంచమున గాలి వీచునేర్పాటులు**— ప్రపంచమునందలి వేర్వేఱు భాగముల శీతోష్ణస్థితులమేరకు ఉష్ణాధిక్యముగల తావుల గాలిగూడ నెండలకు వేడియగుటయు, వేడియైనకొలఁది చులకనయగుటయు, చులకనయైనకొలఁది నాకసమునకు తేలుచు చొచ్చుకొని (అనఁగా సామర్థ్య (Energy) మగు వేడితోఁ గూడియుంట ఆకాశమునకు తేలుచు పోవుచుంటయందును బలముగనే పోవుటయు సంభవించెడిని.

అట్లు పైకెగసిన గాలి లఘు కాళీయగుట, ప్రక్కలనుండు గాలి యటుం జేరును. ప్రక్కలనుండి వచ్చుటయున కొంచెముగనే ప్రక్కనుండి జరుగుట చాల వందలమైళ్ళకడకుఁ దాకుట గలదు. అనఁగా చల్లనిగాలి యాతావునకుఁ జేరుకొని దాని సకాలమున అదియును వేడియెక్కి పైకేగుచుంటయు, ప్రక్కలనుండి అదేపనిగ వచ్చుచుంటయు, గాననగుచుండెడిని.

భూమి గుండ్రముగ బంతివలెనుండు ననియు దానినడుమగ నీక్వేటరు (Equator) అనంబడు భూమధ్యరేఖాప్రదేశ ముండు ననియు మనము మనసునం దుంచుకొనవలయును. తన కుతాను గిరగిర దిరుగుటయందునను తాను సూర్యునింజుట్టివచ్చుటయందుననుగూడ భూమి యీ భూమధ్యరేఖాస్థానముననె సూర్యునకెదురుగనుండునట్లెల్లప్పుడు తిరుగుచుండును. అనఁగా సూర్యుఁడు భూమి నాకర్షించుశక్తికి (Attraction) మధ్యస్థాన మీభూమధ్యరేఖాస్థానమే యని యెఱుంగవలయును.

అట్టి భూమధ్యరేఖాస్థానము Equator కడ వేఁడి యధికమై యుండునని చెప్పకయే చెప్పుచున్నది. ఏలయన నెల్లప్పుడు సూర్యున కెదురుగ తిన్నగ ప్రక్కలకన్నకొద్దిగనో గొప్పగనో సమీపముగ నుండుటయు భూమధ్యరేఖాప్రదేశ మత్యుష్ణప్రదేశమని స్పష్టమే. దక్షిణదేశమున ఈక్వేటరు సమీపమైనకొలఁది వేడి యెక్కువగుచునే యుండును.

ఇచటిగాలి నిత్యము వేడియై యాకాశమున కెగురుచుండుటయు, దక్షిణమునుండియు, ఉత్తరమునుండియు బలముగ గాలులు ఈక్వేటరున వీచుచుంటయు వాయుధర్మము మేరకు జరుగుచుండవలసినపనియే కాని, భూమి తనలోఁ దాను దిరుగుచుండు వేగము భూమియొక్క కొనపై ప్రదేశములు మిక్కిలి తక్కువగానుండు ఉత్తర దక్షిణధ్రువముల కడకన్న భూమధ్యరేఖాప్రదేశమున చాల ఎక్కువ వేగమునఁ దిరుగవలసియుండును. (ఇరువది నాల్గుదినములు లేక అఱువదిగడియల కాలమున భూమియొక్క మధ్యభాగ మంతయుఁ దిరుగవలసినదే). కాన ఆవేగమునకు ఉత్తర దక్షిణములనుండి ఈక్వేటరును సమీపింపఁ బోవు గాలి వంగి వెనుకబడుటయు, మరలుటయు, సంభవించి వేఱుదిశలఁ బర్విడుటతో భూమధ్యరేఖా ప్రదేశమున సరియగు గాలి లేకయేయుండును.

ఈక్వేటరున రుదెసల నిట్లు పర్విడుచు నెల్లప్పుడు నొకేరీతిని భూమినిజుట్టి తిరుగుచుండు గాలులకు ట్రేడు విండ్సు (Trade winds) అనిపేరు. వీట్లకు పెక్కుశాఖలు గలవు. అందొక శాఖ దానినుండి ఉత్తరముగ మనదేశమునకు

వీచును. దానినే మనము దక్షిణదిక్ (తెరిపి) వాయు వనియందుము.

## ప్రపంచమున గొప్ప పగడపుచట్టు.

ఇది :ఆస్ట్రేలియాఖండపు క్వీన్సులాండుతీరమున కెదురుగ కోరల్ సముద్రమునందు (ఆస్ట్రేలియా ద్వీపముయొక్క ఈశాన్యదిశయందు) ఉత్తర దక్షిణములకు వ్యాపించియున్న పగడపుచట్టు. (Coral reef) దీనిపొడవు పండ్రెండువందల మైళ్లు. వెడలుపులు మాఱుచు సగటునముప్పది వేల చతురపుమైళ్ల వైశాల్యము గల్గియున్నది. దీనిఉత్తరపుకోనయందు క్వీన్సులాండుతీరమున కిరువదిమైళ్ల దూరమును, దక్షిణపుకోనయందు నూఱుమైళ్లదూరమును నుండును. ఈమధ్యేమార్గమునందు గొప్ప పొగయోడలు నడుచును. పగడపుచట్టుగుండా కూడెడు నోడలు పోఁదగిన లోఁతుమార్గములు కొన్ని కలవు గాని వాట్లగుండా ఓడ లతిజాగ్రతతో నడువవలసియుండును. దీనిని Great Barreer reef అని నావికు లనుచుందురు.

## ప్రపంచమునందలి యెత్తైన పర్వత శిఖరములు

—ఇవి ఆయాఖండములవారీగా వివరింపఁబడినవి.

ఆసియాఖండము:—

గౌరీశంకరశిఖరము (Mt. Everest.) సముద్రపునీటిమట్టముపైనుండి లెక్కింపఁబడిన ఎత్తు అడుగులు హిమాలయపర్వతములందున్నది ౨౯౦౦౨.

కే. 2. శిఖరము. కారకోరమ్ పర్వతము ౨౮౨౫౦.

కాంచనగంగ(Kanchanganga)హిమాలయపర్వతము ౨౮౧౪౬.

ధవళగిరి. హిమాలయపర్వతము ౨౬౮౨౬

Highest Peak Kuem-lun ౨౨౦౦౦

Highest Peak Thianshan ౨౦౦౦౦

Dernavend Elburz. ౧౮౦౦౦

ఆరారాత్ శిఖరము. ఆర్మీనియా ౧౭౦౦౦

యాట్ఛవాస్కుశిఖరము. కామ్ఛట్కా ౧౫౯౮౦౦.

అరిజటషాఘు తౌరసపర్వతము ౧౨౬౦౦.

ఫుజిసాన్ (ఫుజియామా) జపాన్ దేశము ౧౨౩౬౫.

తఖ్తిసులైమాన్. సులైమాన్పర్వతముకాశ్మీరము ౧౧౩౧౭.

బయెలూఖా శిఖరము. అల్తాయిపర్వతము ౧౧౦౦౦.

లెబనాస్ శిఖరము. లెబనాస్ పర్వతము ౧౦౦౬౧.

ఎత్తైన శిఖరము ౮౮౩౭.

దోడబెట్టశిఖరము. నీలగిరిపర్వత ము౮౭౬౦

ఎత్తైనశిఖరము (మూసాశిఖరము) సీనాయి పర్వతము ౮౫౩౬.

పెద్రోతలగల శిఖరము. సింహళద్వీపము ౮౨౯౫.

టోల్పోస్ శిఖరము. ఊకల్పర్వతము ౭౪౩౦.

అర్బుద శిఖరము (Mt. Abu) ఆరావళి పర్వతము ౫౬౫౦.

ఆఫ్రికాఖండము:—

కిలిమంజారో శిఖరము తూర్పు ఆఫ్రికా ౧౯౬౮౧.

కెన్యాశిఖరము. కెన్యా తూర్పుఆఫ్రికా ౧౮౦౦౦.

రాస్ దోట్చిన్ శిఖరము. అబీసీనియా దేశము ౧౬౦౦౦.

కామేరూన్శిఖరము. పశ్చిమఆఫ్రికా ౧౩౨౦౦.

టెనిరిఫీ. కెనరీద్వీపము ౧౨౧౮౦.

మిల్ట్సిన్ (Miltsin) శిఖరము. అట్లాస్ పర్వతము ౧౧౪౦౦.

కత్కిన్ శిఖరము. డ్రాకెన్బర్గ్ ౧౦౩౫౭.

అంకారాత్ శిఖరము. మెడగాస్కరు ద్వీ. ౯౦౦౦.

టేబిల్ మౌంటెన్ శిఖరము. కేప్ కోలనీ ఆఫ్రికా ౩౫౫౦.

ఐరోపాఖండము:—

ఎల్బుర్జు కాకసన్ పర్వతము ౧౮౫౭౨.

మోంటుబ్లాంకు (Mt. Blanc) అల్ప్సు పర్వతము ప్రాన్సు ౧౫౭౮౪.

మోంటురోసా అల్ప్సుపర్వతముస్విజర్లాండు ౧౫౨౧౭.

గ్రాండ్పారడీసు. (Grand parades) ఇటలీ దేశము ౧౩౩౦౦.

Ortler Spitxe ఆస్ట్రియా ౧౨౭౮౯.

మల్హాసె శిఖరము. సియరా నివా ౧౧౬౬౧.

మాలడెట్టా శిఖరము. పెరినీస్ పర్వతము ౧౧౧౬౮.

ఎట్నా శిఖరముసిసిలీద్వీపముఇటలీ౧౦౮౪౦.

Relo dagh శిఖరము. డెస్పోటో టర్కీ ౯౮౪౨.

Zug. Spitze బవేరియన్ అల్ప్సు ౯౭౧౬.

Carno శిఖరము Apennines పర్వతము ౯౫౪౩.

ఎత్తైనశిఖరము. ట్రాన్సల్వేనియా అల్ప్సు ౯౫౨౮.

Galdhoppig శిఖరము. నార్వే దేశము ౮౫౪౬.

హెక్లాశిఖరము. ఐస్లండుద్వీపము ౫౨౦౦.

బెన్ నోవిస్ శిఖరము స్కాట్లాండు దేశము ౪౪౦౬.

వెసూవియన్ శిఖరము. నేపిల్సుసమీపము ఇటలీ ౪౦౧౧.

స్నోడన్ శిఖరము. వేల్సు దేశము గ్రేటు బ్రిటన్ ౩౫౭౦.

Scawfell శిఖరము. ఇంగ్లాండు దేశము ౩౧౬౧.

ఓసీలియా ద్వీపములు:—

మానాకియా శిఖరము. హోవాయి ద్వీపము ౧౩౯౫౩.

మానాలోవా శిఖరము. ౧౩౭౬౦

కినిబాలూ శిఖరము. బోర్నియో ద్వీపము ౧౩౬౯౮.

Owen Stanley న్యూగినియా ౧౩౨౦౫

Mt. Cook న్యూజీలాండు. ౧౩౨౦౦

ఎరిబస్ శిఖరము-అంటార్కిటికాద్వీ. ౧౨౪౦౦

ఓఫియర్ శిఖరము-సుమిత్రాద్వీ. ౯౯౪౦

కోస్కియుస్కో-శిఖరము- ఆస్ట్రేలియా ద్వీ. ౭౧౭౬.

అమెరికాఖండము:—

Aconcagua Andes చిలీ దేశము ౨౩౧౦౦

సోరాటా-శిఖరము-బొలీవియా ౨౨౯౯౦

చింబోరేజో శిఖరము- Ecuador ౨౧౪౦౦

ఏంటిసానాశిఖరము ,, ౧౯౧౩౭

కోటోపాక్సి ,, ౧౮౮౭౫

Popocatipeti శిఖరము. మెక్సికో ౧౭౮౦౦

Mt. Hooker Rocky mountains ౧౬౭౫౦

ఎత్తైనశిఖరము Cascade mountains ౧౫౭౫౦

సెంటుఎలియాస్ శిఖరము Pasific coast ౧౩౫౦౦

బ్లూమౌంటెన్సు-జమైకా ద్వీ. ౮౮౧౫

బ్లాక్డోమ్ (Black dome శిఖరము) Alleghanees. ౬౭౦౭

**ప్రపంచమున పెద్దదియగు బుద్ధ విగ్రహము**—దీనిని కామకురా డైబుట్సు అనియు నందురు. జపాను దేశమున కామకురా పురమునం దున్నది. దాని నొకతడవ జూచిన తిరిగి చూడవలయు నను భ్రాంతి కలుగునంతటి పనితనము గలది. ఎత్తు 49 అడుగు లుండును. మఠము వైచుకొని కూర్చున్నట్లు చెక్కఁబడిన బుద్ధవిగ్రహము. మఠముకడ చుట్టుకొలత తొంబదియేడడుగుల రెండంగుళములు. ముఖమే 8 అడుగుల 5 అంగుళము లుండును. నుదుట నున్న వెండిబొట్టు ముప్పదిపౌనుల తూనికగలిగి 15 అంగుళముల అడ్డుకొలత గలిగియున్నది. నేత్రములు బంగారుతోఁ జేయఁబడి మూఁడడుగుల పదునొకండంగుళముల పొడవు గలిగి యున్నవి. చెవులు 6అడుగుల 6అంగుళములును, ముక్కు మూఁడడుగుల మూఁడంగుళములును పొడవున్నవి. నోటికొలత పొడవు మూఁడడుగుల రెండంగుళములు.

ఇది యిత్తడిరేకులతోఁ జేయఁబడిన విగ్రహము. దీనిలోపల గుల్లగనుండి, తలయొద్ద కెక్కుటకు మెట్లమర్పఁబడి, తలయొద్ద నొక పీఠమున బుద్ధవిగ్రహము ప్రతిష్ఠింపఁబడి యున్నది. ఇది క్రీ॥ ము॥ ౧౨౫౨ కాలమునాఁటి దందురు. తొల్లింట నిది యొంతయు నొకమంటపమునం దిమిడియుండె ననియు,౧౩౬౩-౧౪౬౪ సంవత్సరమునందుఁ గలిగిన రెండుగొప్పయుప్పెనలు మంటపమును భగ్నపఱచినను, డైబుట్సు బుద్ధవిగ్రహమును, అందలి దేవతాస్థలమును జెడక యట్లే నిలిచియున్న వనియు నచటివా రనెదరు.

**ప్రపంచమున పెద్దవి (The biggest in the World)**—

ప్రపంచమున పెద్దగంట—రష్యాదేశమున మాస్కో నగరమునందు Monark of Moscow అని పిలువఁబడుచుండిన గంట. దీని యెత్తు డయామీటరు (అడ్డుకొలత) ఇరువది యొక్క అడుగు. తూనికబరువు ౧౯౩ టన్నులు. క్రీ. శె. ౧౭౩౪ లో పోఁత పోయఁబడినది. మహాగ్నివలని ఉత్పాతమునందు నేలఁబడి పోయి దెబ్బకు పగిలినది. క్రీ.శె ౧౭౩౭ నేలఁ గూలి ౧౮౩౮ వఱకు నట్లే భూమియందు పడియుండి ఎత్తఁబడి అటనే నిర్మింపఁబడిన ఒక Chapel నందు Dome గా నమర్పఁబడియున్నది.

ప్రపంచమున పెద్దగుహ— అమెరికా సంయుక్త రాష్ట్రములందు కెంటకీ సీమలో Mammoth Cave అనంబడు చున్నది. Bowling Green నుండి ౨౮ మైళ్ళు. Cave City నుండి ఆఱు మైళ్ళదూరమున Green నదీతీరమునఁ గలదు. ఇం దనేకములగు గదుల వంటి భాగములు కలవు. కొన్ని పెద్దవి. వివిధమగు నెత్తులందుఁ గలవు. చూచువారల కిది యొక పాఁతబడిన ప్రాసాదమా యనిపించును. చుట్టుపట్ల కొన్ని వింతచేఁపలును, కొన్ని వింతజంతువులును ఈ పరిసరములందుఁ గాననగును. చేఁపలం దిరువదిజాతుల వింతచేఁపలు గలవఁట.

ప్రపంచమున పెద్దనాటకశాల — ఇది ఫరాసు దేశమున పారిస్ నగరమున Opera House అనఁబరగుచున్నది.మూఁడుఎకరముల ప్రదేశము నాక్రమించిన గొప్ప భవనము. ఇందు ౪–౨౮2000 మంది కూర్చుండుటకు తావు కలదు. దీనిని గట్టుటకు ౧౦౦౦౦౦౦౦౦ ఫ్రాంకుల మూల్యము వ్యయపడిన దఁట.

ప్రపంచమున నెక్కువ పలుచనిబంగారు రేకులు-జర్మను దేశమున బెర్లినునగరపునివాంద్రుఁ సాఁగఁగొట్టినబంగారు రేకులను పారిస్ ఎగ్జిబిషనునందు ప్రదర్శింపఁబడినవి. ౨౮–౨౦౦౦ రేకులు కలిసి యొకఅంగుళముదళసరి యగును.

ఎక్కడను ఛిద్రములు, రంధ్రములు లేక బలమగు Electric Light వెలుతురు వీటిగుండా చొరకుండెను.

ప్రపంచమున నెక్కువవేఁడిగలభూప్రదేశము- పారశీకదేశముయొక్క నైరృతి దిగ్భాగప్రదేశము ప్రపంచమున నెక్కువ వేఁడిగల ప్రదేశమని పేరందినది. పరిషియన్‌గల్ఫుతీరప్రదేశమిూసీనుయం దేటేట జూన్, జూలై, ఆగస్టు నెలలందు అహర్నిశలయందు నూఱు డిగ్రీల వేఁడి తగ్గక, పగళ్ళు మఱి ఇరువది లేక ముప్పది డిగ్రీలవేఁడి గల్గియుండెడిని.

ప్రపంచమున నెక్కువ పొడవుగల Suspension Bridge- అమెరికాసంయుక్తరాష్ట్రములలోనిన్యూయార్కుపట్టణమునుండిబ్రూక్లిన్ పట్టణమునకు పోవునంతెన ప్రపంచమునఁగలఁ Suspension Bridgesలో పెద్దదిగా చెప్పబడినది. దీనిపొడవు ౫౯౮౦ అడుగులు. మధ్యకానా యొక్కటియె ౧౫౯౫ అడుగులని చెప్పఁబడినది.

ప్రపంచమున నెక్కువ పెద్దదియగు ఎడారి- ఆఫ్రికాఖండపువాయవ్యదిశగను,పశ్చిమదిశగనునున్న సహారాయెడారి ప్రపంచమందలియెడారులలో గొప్పదిగాచెప్పఁబడినది. సహారాయనిన ఎడారులప్రభువని యర్థము. ఈజిప్టుదేశపు నైలు డెల్టా మొదలు అట్లాంటిక్కు (పశ్చిమము) మహాసముద్రముదనుక వ్యాపించియున్నది. తూర్పు పడమరలకు 3000 మైళ్ళు,ఉత్తరదక్షిణములకు ౯౦౦ మైళ్ళు గల్గి ౨000000 చతురపుమైళ్ళ వైశాల్యముం గల్గియున్నది. ఇసుకమయమైయున్నది. ఇందు ఐదు పది లేక ఇరువదిసంవత్సరముల కొకసారి గొప్పవర్షములు పడుచుండునఁట. వేసవులందు పగటిభాగములు చాల తీక్ష్ణమైనవేఁడి విసరుచునుండ రాత్రులందు చలిగాలులు కల్గియుండునని చెప్పఁబడినది.

ప్రపంచమున నెక్కువయెత్తుగల అగ్నిపర్వతము- ఇది అమెరికాయందు మెక్సికోదేశమున Puebia పురమునుండి నైరృతిదిశగా ముప్పదియెనుమెళ్ళదూరమునఁ గలదు. దీనియెత్తు సముద్రపుమట్టముపై ౧౭౭౪౯ అడుగు లనియు, ముఖద్వార మొకమైలుచుట్టుకొలతగల్గి, వెయ్యి అడుగులలోఁ తుండునని చెప్పఁబడినది.

ప్రపంచమున నెక్కువపొడవుగల వంతెన- ఇది అమెరికాదేశమున సాల్టు లేక్ (Salt Lake) పై Southern Pacific Railway కంపెనీవారివలన నిర్మింపఁ బడినది. దీనిపొడ వేఁబదిమైళ్ళని చెప్పఁబడినది.

ప్రపంచమున నెక్కువపొడవుగల కోటగోడ- దీనిని "Great Wall of China" అనుచున్నారు. ౧౫౦౦ మైళ్ళ పొడవనియు పదిమందిసైనికులు నడువగలవెడలుపు కలదనియుఁ జెప్పఁబడినది. (చూడుఁడు.)

ప్రపంచమున నెక్కువపెద్దది యగుసొరంగము- స్విజర్లాండు దేశమునుండి ఇటలీలోనికేగు ఆల్ప్సుపర్వతము త్రవ్వఁబడిన Tunnel అయియున్నది. దీనికి Simplon అనిపేరు. 5630 గజములు పొడవు. వంకలు లేని తిన్నని మార్గము. దీనిగుండా ఇనుపదారి వేయఁబడినది. ఇది St. Golhard కన్న చాలపెద్దసొరంగము.

ప్రపంచములోని దుర్గములలో నెక్కువ పరాక్రమవంత మగుదుర్గము-స్పానియాదేశము కడ మధ్యధరాసముద్రపు పశ్చిమముఖద్వారమున సముద్రములోనికిం జొచ్చుకొని, యొక్క శిలామయద్వీపకల్పమున జిబ్రాల్టరనుపేరుగల యొకదుర్గమును, ఆదిగువనే అదేపేరుగల యొక పాటిపట్టణమును కలవు. అవి బ్రిటిషుప్రభుత్వము వారివి. ఆదుర్గము కట్టడపుబలిమిచే మాత్రము గాక, ఆస్థలమున నుంట ప్రపంచదుర్గములలో నెల్ల నధికపరాక్రమవంతమై దనరారుచున్నది.

ఇందలి బురుజులపై ఫిరంగులు మధ్యధరాసము ద్రమును, అట్లాంటిక్కు మహాసముద్రమును శత్రువుల యొడల బారినుండి కాపాడఁగలవు.

దుర్గము పొడవు మూఁడుమైళ్ళు, ముప్పాతి కమైళ్ళ వెడలుపు గల శిలాతలమున నిర్మింపఁ బడినది. మధ్యప్రదేశము సముద్రపు నీటిమట్ట ముపై ౧౪౩౫ అడుగుల యెత్తుండును. తూర్పు ణము పడమరదిక్కులం దీశిలాతలప్రదే శమున కెక్క వీలులేనంత యేటవాలులేని యె త్తుగుట ఆదిశలందు దుర్గమమై యుండును. దుర్గ మునకు దక్షిణముగ సముద్రముదనుక జిబ్రా ల్టరుపుర ముండును. ఇది Military assault నకు అన్యులకు శక్యము కాదని చెప్పఁబడినది. ఇది బ్రిటీషువారి సైన్యములుండు దుర్గమై యున్నది.

ప్రపంచములోని వృక్షములలో పెద్దవృ క్షము- (కేలిఫోర్నియా మహావృక్షములు చూడుడు.)

ప్రపంచములోని నూతులలో నెక్కువలోఁ తుగల నుయ్యి (బావి)- ఇది జర్మనురాజ్యమున Silesia సీమయందలి Ratibor నకు సమీప మున Parnsdrowitz అను తావున ప్రష్యను ప్రభుత్వమువారు త్రవ్వించిన Boring well 6573 అడుగుల లోఁతు గలది.

ప్రపంచమున పెద్ద Cantilever bridge- నయాగరా ఉక్కుకాంటిలీవరువంతెన ఆజాతి వంతెనలలో పెద్దదిగాఁ జెప్పఁబడినది. క్రి. వె. ౧౮౮౪ లో నిర్మింపఁబడినది. పొడవు ౯౧౦ అడుగులు. బరువు 3000 టన్నులు. నిర్మించుట కైన వ్యయము ౨౨౨౦౦౦ డోలరు లనిచెప్పఁ బడినది. (U.S.A.)

ప్రపంచమున పెద్ద Movable bridge— అమెరికాసంయుక్తరాష్ట్రములందలి షికాగో నగరముకడనున్న షికాగోనదిపైనున్న వంతెన ప్రపంచమున Biggest lift bridge అని చెప్పఁబడు చున్నది. ఇందు కదలుభాగము ౨౨౩ అడుగులపొడవు. అనఁగా లండను టవరు బ్రిడ్జికన్న (తేమ్సునది) ౭౫ అడుగు లెక్కువ యని చెప్పఁబడినవి. వంతెన ౪౫౦ అడుగుల పొడవు. ఇదియంతయు steel bridge అందురు. కదలెడు భాగములు రెండును ౨౦౦౦౦౦౦ పౌనులు బరువఁట.

ప్రపంచమున నెక్కువపెద్దనది- మిససిప్పి మిస్సోరీనది. ౪౩౦౦ మైళ్ళు పొడవు.

ప్రపంచమున నెక్కువ యెత్తయిన పర్వత శిఖరము— హిమాలయపర్వతశిఖరమగు గౌరీ శంకరశిఖరము. దీనినిప్పుడు Mount Everest అనుచున్నారు.

ప్రపంచమున నెక్కువ పెద్దదియగుసరస్సు- అమెరికాసంయుక్తరాష్ట్రములకుఁ జెందిన Lake Superior ప్రపంచమందలి సరస్సులలో పెద్దదిగఁ జెప్పఁబడినది.

ప్రపంచమున నెక్కువ పెద్దడెల్టా—గంగా నది బ్రహ్మపుత్రానదులు కలియుతావున ప్రపం చమునందలి ఎక్కువ పెద్దడెల్టా నేర్పడి యున్నది. ఇది బంగాళమునకుఁ జెందినది. సుందరవనము దీనిలోనిదే.

ప్రపంచమున నెక్కువ పెద్ద అగ్నిముఖ ద్వారముగల అగ్నిపర్వతము-ఓసీనియాయందు పోలీనేసియా ద్వీపసమూహమునకుఁ జెందిన సాండ్విచ్చిద్వీపములలో నున్న Mowna Loa అగ్నిశిఖరము. దీనిని Kilanea అనియు నను చున్నారు. దీనిద్వారము(Crater)చుట్టుకొలత మూఁడుమైళ్ళుండును. ఒక్కొకతతి దరికేగి చూడనగును. ఇం దగ్నికెరటములు పొరలుచు కానవచ్చుచుండెడిని.

**ప్రపంచముననెక్కువలోఁతునకు త్రవ్వఁబడిన గోతులు**—ఇట్టివి గనులుగ నున్నవి. అందుబంగారుగనులెక్కువలోఁతైనవిగ నున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రములలోని West Virginia గనులు భూమట్టమునుండి క్రిందికి ౨౫౦౦ అడుగులలోతును, బ్రెజిల్ దేశమున St. John-del-Rey గని ౬౨౦౦ అడుగులలోఁతును గల్గియున్నవి. వీటిలో వేఁడి యధికమై యుండునుగాన పనిచేయుటకు వీలగు నటుల Cooling plant యంత్రముల నమర్చి, లోనికి చల్లగాలి నంపుచుందురు. ఆయంత్ర మాఁగినచో వీటియందు ఫారన్‌హైటు తెర్మోమీటరునందు ౧౬౪ డిగ్రీలవఱకు వేఁడి యుండునఁట.

## ప్రపంచమున నెక్కువ పెద్దవి

పర్వతపంక్తులలో దక్షిణఅమెరికా పశ్చిమభాగముననున్న ఆండీసుపర్వతపంక్తులు ప్రపంచమున నెక్కువ దీర్ఘమైనవి. దీనికిం గార్డిల్లెరా స్పర్వత పంక్తి యనియుఁ బేరుకలదు.

నదులలో నెక్కువ వెడల్పైననది దక్షిణ అమెరికాయందలి ఏమజాను నది. మఱియు నిది యెక్కువ వెడల్పు లోఁతులకుం గూడ పేరందినది. ముఖద్వారముకడ నిదియు నూరుమైళ్ళ ప్రదేశమున సముద్రమువలెనే యుండునని చెప్పఁబడినది.

అగ్నిపర్వతములలో ప్రపంచమున నెక్కువ Terrific most అని పేరందిన అగ్నిపర్వత శిఖరము. దక్షిణ అమెరికాలోని ఈక్వెడోరు రాష్ట్రమున, ఆండీసు పర్వతపంక్తియొక్క తూర్పుపంక్తియం దున్నది.

ఎక్కువ వర్షములు కురియు తావులలో ప్రపంచమున నెక్కువ వర్షము గురియు తావు ఇండియాయందు అసాముదేశములోని చిరాపుంజియం దని చెప్పఁబడినది

ఎక్కువ పొడవైన నదులలో ప్రపంచమున నెక్కువ పొడవైననది ఉత్తర అమెరికాయందలి మిసిసెప్పి మిస్సౌరైన్ నదుల సంయుక్త ప్రవాహము. దీనిపొడవు ౪౧౦౦ మైళ్లు.

ప్రపంచములో నెక్కువఎత్తైనతావున గట్టఁబడినపురము. దక్షిణ అమెరికాలోని పెరూ దేశమునందున్న ఫాస్కోపురము. అది సముద్రపునీటిమట్టముపై ౧3౨౨౦ అడుగులయెత్తు.

ప్రపంచమున నెక్కువ శీతలప్రదేశము ఆసియాలోని సైబీరియాదేశమందలి యాకుటస్కుపురము.

ప్రపంచమున పెద్దద్వీపకల్పము అరేబియా. ఇది ౧౨౦౦౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము కలది. (ఇండియా ద్వీపకల్పము కాదని పెక్కండ్రు భూగోళశాస్త్రజ్ఞులమతము).

ప్రపంచమున నెక్కువయెత్తైన పీఠభూమి, (Table Land) టిబెట్టు దేశము. ఇదిసముద్రపు నీటిమట్టముపై ౧3000 అడుగులయెత్తు కలదిగాఁ జెప్పఁబడినది.

ప్రపంచమున నెక్కువపెద్దపుష్పము Victoria regia అనుపేరిడఁబడిన తామర. దీనికి తొల్లింటిపేరు "మహాపద్మము".

ప్రపంచములో నెక్కువపొడవైన నీటికాల్వ చీనామహారాజ్యములో గ్రాండుకెనా లనంబడు కేటన్ కెనాలు. ఇది ౯౦౦ మైళ్ళ పొడవు. మంచినీటి పంటకాలువ.

ప్రపంచములోని సరస్సులలో కాస్పియనన్సీ పెద్దసరస్సు. ఇది ఉప్పునీటిది. ఇది ఆసియా ఐరోపాల నడుమ నున్నది.

ప్రపంచములోని మంచినీటి సరస్సులలో ఉత్తర అమెరికాలోని లేక్‌సుపీరియరు పెద్ద సరస్సు. దీనివైశాల్యము 3౧౨౦౦, చ॥ మైళ్ళు. దీని నీటిమట్టము సముద్రపు నీటిమట్టముపై

౬౦౧ అడుగులయెత్తు ననున్నది. నీరు చాల స్వచ్ఛమైనది.

ప్రపంచములో నెక్కువయెత్తయిన గొప్ప వృక్షములు- అమెరికా సంయుక్తరాష్ట్రముల లోని యోస్మైటులోయయందున్న మరిపోజా గ్రోవునందున్న మహావృక్షములు. వాటిని జెయింటుట్రీస్ అనియెదరు. అందు గ్రిజ్లీజయంటు అను పేరుగల మహావృక్షము చాల పెద్దది.

ప్రపంచమున నైసర్గికోద్యానవనములలో అమెరికాసంయుక్తరాష్ట్రములలోని Yellow-stone National Park అనంబడువనము- ఇది ౩౫౭౫ చతురపుమైళ్ళ వైశాల్యము. ఇది ప్రభుత్వమువా రాక్రమణలనుండి రక్షణనొసంగి యున్నారు. ఇందు పెక్కు గెయిసరులు కలవు.

ప్రపంచములో నెక్కువపొడవుగల Lift bridge - అమెరికాసంయుక్త రాష్ట్రములందు షికాగోనగరముకడ నున్నది. ఇందు Movable Part 275 అడుగులు.

ప్రపంచములో నెక్కువయెత్తయిన పర్వత శిఖరము హిమవత్పర్వతమునందలి గౌరీశంకర శిఖరము. దీనిని ఎవరెస్టుశిఖర మనుచున్నారు. (హిమాలయపర్వతములు చూడుఁడు.)

**ప్రపంచములో నెక్కువచిన్న ప్రజాప్రభుత్వము**—మధ్యధరాసముద్రమున "Tarolare" అనుపేరుగల ద్వీపము కలదు. ఇది సార్డీనియాద్వీపమునుండి ఏడున్నర మైళ్ళదూరము కలదందురు. ఇది మెల్లున్నర ద్వీపము. ఇం దేబదిమైదుగురు వసించుచున్నారు. ఇది ప్రజాస్వామ్యప్రభుత్వము. అగ్రాసనాధిపతిగ నొకపెద్దను ఆరుసంవత్సరముల కొకసారి యెన్నుకొందురఁట. ఎవ్వరికిని జీతములు లేవు. స్త్రీలకు స్వాతంత్ర్యము కలదఁట. చేపలు పట్టుటవలన జీవనము. అన్యప్రభుత్వము లీదేశ ప్రభుత్వముతో జోక్యము కల్గించుకొనరఁట.

**ప్రపంచపు ఏడుమహావింతలు(ఆదికాలపువి)**— (ఆదికాలపు ప్రపంచమందలి గొప్పవింతలు చూడుఁడు.)

**ప్రపంచపు ఏడు మహావింతలు (మధ్యకాలపువి)**—(మధ్యకాలపు ప్రపంచమందలి గొప్పవింతలు చూడుఁడు.)

**ప్రపంచపు సప్తమహాసముద్రములు**-(సప్తసముద్రములు చూడుఁడు.)

**ప్రపానకరస న్యాయము**— పానకరసమున కాంగ్లమున Syrup అనియు, హిందీ భాషలో షర్బత్తనియు నందురు. కొన్నివస్తువులు కల్పి యీ ప్రపానకరసము చేసినను ఇందలిరుచి ఏకమై కన్పట్టును. కొన్నిటి కలుపుదలచే ఏకపదార్థ మగుటకును ఎన్నిటిని గల్పి చేసినను రుచి ఏకమై యొకటిగనే యుంటను దెల్పుట కీన్యాయము నందురు.

**ప్రపామేలన్యాయము** - చలిపందిరి (అనఁగా దాహము లిచ్చుతావు)కడకు దాహాతురులైనవా రందఱుజేరి దాహముపుచ్చుకొని ఎవరిదారిని వారు పోవుదురు. ఇట్టిసందర్భముల నీన్యాయము వాడుదురు.

**ప్రపోర్షనాలిజమ్**(Proportionalism)- రసవాదశాస్త్రమునందు వస్తువిభాగతత్త్వము. రాజకీయమునందు జాతులయొక్కయు, పార్టీలయొక్కయు సంఖ్యనుబట్టి శాసనసభలలో సభ్యత్వస్థాననిర్ణయవిధానము. ఏదేని తక్కువ జనసంఖ్యగల సంఘమునకు స్థాననిర్ణయము నొసంగు విధానము.

**ప్రపౌండరీయకము**--(పౌండరీయకము చూడుఁడు.)

**ప్రబంధము**—కవులు రచించినకావ్యములందు ప్రబంధములు శ్రేష్ఠములని చెప్పఁబడినవి. గద్య పద్యాత్మకములై వర్ణనలు కల్గినవి

ప్రబంధములని యందురు. ప్రబంధములు మహాప్రబంధము లనియు, ప్రబంధము లనియు, క్షుద్రప్రబంధము లనియు త్రివిధము.

యక్షగానము లనియు,జంగము కథలనియు, నాటకములనియు, గద్యకావ్యములు లేక వచనకావ్యము లనియు, చంపువు లనియుఁ గూడ గలవు. ఇవి యన్నియుఁ గావ్యములే.

౧ మహాప్రబంధము- ఇందు పదునెన్మిది వర్ణన లుండవలయునని విధింపఁబడినది. ౧ నగరవర్ణనము(పురవర్ణనము),౨ సముద్రవర్ణనము, ౩ పర్వతవర్ణనము, ౪ ఋతు(వసంతాది షడ్ఋతువులు) వర్ణనము, ౫ చంద్రోదయ వర్ణనము, సూర్యోదయవర్ణనము, ౭ ఉద్యానవన వర్ణనము (ఉద్యానవనవిహారముతోఁగూడ) ౮ జలక్రీడావర్ణనము. ౯ మద్యపానవర్ణనము, ౧౦ వివాహవర్ణనము, ౧౧ విప్రలంభవర్ణనము,౧౨ రతివర్ణనము, ౧౩ కుమారోదయవర్ణనము, ౧౪ మంత్రజపతపోవర్ణనములు,౧౫ ద్యూతవర్ణనము, (జూదమాడుట), ౧౬ ప్రయాణవర్ణనము, ౧౭ యుద్ధవర్ణనము,౧౮ నాయకాభ్యుదయవర్ణనము

౨ ప్రబంధము- ఇందు పైన పేర్కొనిన పదునెన్మిది వర్ణనలలోఁ గొన్ని తక్కువయైన (సాధారణ) ప్రబంధ మనఁబడును.

౩ క్షుద్రప్రబంధము- ఇది సంఖ్యాబద్ధము లనియు, సంఖ్యారహితము లనియు ద్వివిధము.

(౧) సంఖ్యాబద్ధక్షుద్రప్రబంధము-ఇది పదునాల్గుభేదములు కలది. ఈపదునాలుగింటిని చతుర్దశచాటువు లనియు, చాటుధార లనియుఁ గూడ నందురు.

౧ ముక్తకము-ఒకవిడిపద్యము, ౨శ్లోక్యము-మూఁడుపద్యములు, ౩ వారధిమాల- నాల్గు పద్యములు, ౪ పంచరత్నములు- ఐదుపద్యములు, ౫ ధారణమాల- ఎన్మిదిపద్యములు, ౬ నవరత్నములు- తొమ్మిదిపద్యములు, ౭ అవతారమాల-పదిపద్యములు, ౮ భాస్కరమాల- పండ్రెండుపద్యములు, ౯ శశికళ- పదునారు పద్యములు, ౧౦ నక్షత్రమాల- ఇరువదియేడు పద్యములు (దీనినితారావళియనియుసందురు). ౧౧ రాగమాల- ముప్పదిరెండు పద్యములు, ౧౨ విద్యామాల - అఱువదినాల్గు పద్యములు, ౧౩ తత్త్వమాల- తొంబదియాఱు పద్యములు, ౧౪ శతకము- నూరుపద్యములు. తఱుచుగ దీనిని నూటయెన్మిది పద్యములుగ రచించుచుండుటయుఁ గలదు.

(౨) సంఖ్యారహితక్షుద్రప్రబంధము- ఇది ఆఱువిధములుగ నున్నది.

౧ రగడలు- ఇవి వలయునన్ని చరణములతో నొక్కొకరగడగఁ జెప్పనగును.

౨ కలికోత్కలికరగడ-నాల్గేసిపాదములుగ నసంఖ్యాముగ నీరగడలు చెప్పుదురు.

౩ ద్విపద- ఇది చరణమునకు రెండేసి పాదములచొప్పున ఎన్నిచరణములుగ నైనఁ జెప్పనగును.

౪ దండము.

౫ సింహావలోకనము- అనేకచరణములుగ వచించినగద్యము. ఇందు బిరుదగద్య మనంబడునదియు నొకటి కలదు.

౬ మాలిక- చంపకము, సీసము మొదలగు పద్యములను గొన్నిటిని ఎన్నిచరణములనైనను మాలికగాఁ జెప్పుదురు.

గద్యలు, పద్యములు, దరువులు, తోహరాలు మొదలగువాటిని గల్పి యక్షగానములను పేర రచింతురు.

జంగముకథ లనంబడునవి-- ఒకమట్టుపై నంతయు నొకతేరీతిని పాడఁగల్గునట్లు రచించు వీథిపాటలు. ఒకమకుటమును, గొన్నిచరణములను గల్గి ఆనియమముల మేరకు పాటగ పాడఁదగినంతరీతిని ఎన్నిచరణముల నైనను శారద

రామాయణమునుబోలి రచించునవియు నీతెగ లోనివే.

నాటకములు-దశరూపకములు (నాటకములు చూడుఁడు).

గద్యకావ్యములు- నవలలు,కథలు మొదలగు వచనకావ్యము లనఁబరగెడిని.

పద్యములు- వృత్తము లనియు, జాతు లనియు, ఉపజాతు లనియు త్రివిధములు. చంపకములు, మత్తేభవిక్రీడితములు, శార్దూల ములు మొదలగునవి వృత్తములు. కందపద్య ములు, ద్విపదలు, దండకములు, రగడలు, తరువోజ, మధ్యాక్కర, మంజరులు, లయ గ్రాహి, లయవిభాతిపద్యములు మొదలగునవి జాతు లనంబడును. సీసము, గీతపద్యములు ఉపజాతు లనంబడును. (ఛందస్సులు చూ).

**ప్రబంధాంకము మూర్తిరాజకవి**—(రామరాజభూషణకవి చూడుఁడు.)

**ప్రబంధాంకమువారి వంశావళి**—(రామరాజభూషణుఁడు, భట్టుమూర్తివంశావళి చూడుఁడు.)

**ప్రబోధ**—కర్త శ్రీకందుకూరి బాలసూర్య ప్రసాదభూపతి. శైవుఁడు.అద్వైతి. ఈతఁడు తన యనుంగుపత్ని శివైక్యము నొందఁగా దుఃఖా క్రాంతచేతస్కుఁడై యామెజ్ఞాపకార్థ మద్వైత శైవసిద్ధాంతధర్మము నీనాటకరూపమున నాంధ్ర మున రచించెను.

**ప్రబోధచంద్రోదయము**— కర్త కృష్ణ మిశ్రుఁ డను గౌడబ్రాహ్మణయతి. అద్వైతి. ఈతఁడు శుద్ధాద్వైతసిద్ధాంతధర్మమును నాటక రూపమున సంస్కృతభాషయందు రచించెను.

**ప్రభాకరాచార్యుఁడు**-ఇదియు నించుక భేదముతో పూర్వమీమాంసా (కర్మవాది) మతమును బోలి యుండుమతము. (పూర్వ మీమాంసామతముచూడుఁడు). ఈయన భట్టా చార్యశిష్యుఁడు. గురునిమతమున కించుక భేద ముగల్గి ప్రాభాకరమత మనఁ దనరెడిని.(భాట్ట మతము చూడుఁడు). ఆత్మ శూన్యము కాదని యు, ఆనందకోశమే ఆత్మ యనియు, బుద్ధి ఆత్మ యొక్కగుణ మనియు నీతని మతసిద్ధాంతము.

**ప్రభాయనగోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు.)

**ప్రభావతి**—ఈపేరు గలవారు ముగ్వురు గానఁగుచున్నారు. వజ్రనాభుఁ డను రాక్షసుని కుమార్తె యొకప్రభావతి. ఈమె ప్రద్యుమ్నుని భార్య.మఱియొక ప్రభావతి ఇంద్రుని మోహించి గొప్పతప మాచరించి తనసాహసముచే నాయ నను మెప్పించినది. ఆమె తప మొనర్చినతావు బదరీపాచకక్షేత్ర మని చెప్పఁబడెను. ఇట నీమె రేఁగుపండ్లువంటచేయ నియమితురాలై యింద్రుని మాయచే నెంతకు నుడుకకపోఁగా కట్టె లన్నియు నైపోవుటతో తనకా లగ్నియం దుంచి వంట చేయ మొదలిడ, నింద్రుఁడు మెచ్చుకొనియె నఁట. అదియే బదరీ, (రేఁగు,పాచక = వంట) క్షేత్రము.

సూర్యునిభార్యయగు సంజ్ఞాదేవి ప్రభావతి యనునామము గలదియే.

**ప్రభాస**—ప్రజాపతిభార్య.ఈమెసుతులు ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు నను వారు. వా రిర్వురును వసువులే.

**ప్రభాసతీర్థము (సోమతీర్థము)**— కతియవాడ్ లోని జూనగర్ సంస్థానమున సోమ నాథక్షేత్రముకడనున్న ఒక ప్రసిద్ధమగుతీర్థము. దేవపట్టణ మనిపేరు. విరావల్ పురమున కాగ్నే యముగ రెండుమైళ్లదూరమున దేవపట్టణమున కొకమైలుదూరమున కౌనాక్షీ యను చిన్ననది సముద్రగామి యగుచుండును. ఆనదీతీరమున నే స్నానతీర్థము, దేవళము గలతావు. శ్రీకృష్ణ

నిర్యాణస్థలము. భాలకాఖండము లేక బాణ్కుండనంబడు జలనిలయము. (ఇది సోమనాథదేవస్థానమునకు వెనుకగ నున్న తావు.) శ్రీకృష్ణుఁడు భౌతికశరీరమును విడచిన తావుగఁ జూపుదురు. కలియుగప్రారంభదినమున సంభవించినదనియు, అటకుఁ గొంతదూరమునఁగల అమరపురి 'గోపితలా' యనంబడు తావున నాఁటిరాత్రి యాదవులొకరితో నొకరు కలహించి మరణించిన తావని భాగవతమున ద్వాదశస్కంధమున ౩ అధ్యాయమునఁ జెప్పఁబడినది.

రౌనాక్షీనది సరస్వతీనదియే యని వామనపురాణమున ౮౪ అధ్యాయమునఁ జెప్పఁబడినది. జైనులు ప్రభాసతీర్థమును చంద్రప్రభాసయనియు, చంద్రప్రభాప్రభాస యనియుఁ బిలిచెదరు.

చంద్రునకు క్షయరోగశాపము సంభవింపనిట స్నానము లొనర్చుచు నిచటి శివలింగము నారాధించుటచే నివృత్తియగుటవలన నీక్షేత్రమునకు సోమనాథము (చంద్ర) నాథక్షేత్రమని పేరయ్యెనని శివపురాణమున ౧-౪౫ యందును, మహాభారతమున శల్యపర్వమున ౩౬ అధ్యాయమునను జెప్పఁబడినది. సోమనాథశివలింగము ద్వాదశ తేజోలింగములలో నొకటియైయున్నది. ఇది గుజరాతు దేశమేలిన చాళుక్యవంశప్రభువులకు నిలువేల్పని తెలియుచున్నది.

అదివఱకు దేవాలయము కఱ్ఱతోఁ జేయఁబడినది యుండెనఁట. అనిహిలా నగరము రాజధానిగ నీరాజ్య మేలిన కుమారపాలుఁడీరాతి దేవాలయమును గట్టించెనఁట. ఈనిర్మాణమున హేమచంద్రుఁడు ప్రోత్సాహ మొనర్చువాఁడఁట. హేమచంద్రుఁడు సిద్ధహేమవ్యాకరణము, అభిధానచింతామణి యను గ్రంథములను రచించినవాఁడు. విరావల్ (దేవీపట్టణము చూ.)

కురుక్షేత్రమున చమసోద్భేదముకడ సరస్వతీనది తిరుగనుద్భవించు తావున వేఱొక ప్రభాసతీర్థము కలదు. అది మహాభారతము, వనపర్వమున ౧౨౯ అధ్యాయమున ప్రశంసింపఁ బడినది. శ్రీకృష్ణుని తండ్రియగు వసుదేవుఁ డిట నొకయాగ మొనర్చినట్లు భాగవత దశమస్కంధమున ౮౪ అధ్యాయమునఁ జెప్పఁబడినది. శ్రీకృష్ణునితో రాధికయు, గోపికలును పునస్సమ్మేళన మగుట ఇటనే యని బ్రహ్మవైవర్తపురాణమున, కృష్ణజన్మఖండమున ౫౪ అధ్యాయమున శ్లో. ౨౦-౨౩ యందుఁ జెప్పఁబడినది.

(బల్లభీపురమునుగూర్చిన శాసనము చూ.)

**ప్రభాసుఁడు** — అష్ట వసువులలో నొకఁడు. తల్లి ప్రభాస. భార్య యోగసిద్ధి. కుమారుఁడు విశ్వకర్మ. సోదరుఁడు ప్రత్యూషుఁడు. ఇతఁడే భీష్ముఁడుగ జన్మించినవాఁ డని చెప్పఁబడినది.

**ప్రభోన్నతగణము** — ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి. (సానగశాఖ విశ్వబ్రాహ్మణులు చూడుఁడు.)

౧ ప్రభోన్నతర్షిగోత్రము - ప్రభోన్నత, దేవల, వినయ, (త్రియార్షేయప్రవర.)

౨ దేవలర్షిగోత్రము - దేవల, వినయ, వైనేయ (త్రియార్షేయప్రవర.)

౩ వినయర్షిగోత్రము - వినయ, వైనేయ, జగదష్ఠ (త్రియార్షేయప్రవర.)

౪ బ్రహ్మదీక్షితర్షిగోత్రము- బ్రహ్మదీక్షిత, హారిధర్మ, జగదష్ఠ, జాంబవ, వినయ (పంచార్షేయప్రవర.)

౫ హారిధర్మర్షిగోత్రము-హారిధర్మ, జగదష్ఠ, జాంబవ (త్రియార్షేయప్రవర.)

**ప్రమతి** — ఋషి. తండ్రి చ్యవనుఁడు.

తల్లి సుకన్యక. కుమారుఁడు రురుఁడు. భార్య ఘృతాచి యను నప్సరస.

**ప్రమదాన్యాయము**—భర్తకు భార్య వలననే ఐహికసుఖములలో నెక్కువ భాగము కల్గును. మఱియు నాభార్యకొఱకే కొన్ని బాధలును నతఁడు పడవలసివచ్చును. ఇంకను భార్య వలననే భర్త సంసారబంధములోఁ దగుల్కొని తప్పించుకొనలేని యవస్థకు పాల్పడవలసి యుండెడిని.

సుఖదుఃఖములు రెండును నొకేవస్తువునుండి కల్గుటం దెల్పుతఱి నీన్యాయము వర్తించును.

**ప్రమాణచతుష్టయము**—తొల్లింటి పూర్వకాలమున:-

౧ మానము-గజకోల. కొలుచుటకు నిలువు పొడవు గల కఱ్ఱ. (తొల్లింటికాలమున ఇన్ని నిలువులపొడుగని లెక్క యుండెడిది.)

౨ జూకము- త్రాసు. తూఁచుట కుపయోగించుచుండెడిది. ఇప్పటికి నాంధ్రదేశమందలి కొన్ని దూరప్రదేశములందు తూఁచుటకు జోకుట యని వాడుచుందురు.

౩ ప్రమాణము- కొలుచుపాత్రలు. పడి, కుంచము, సేరు, తవ్వ, సోల, గిద్ద మొదలగు కొలపాత్రలకు ప్రమాణమని పేరు.

౪. లెక్క- పాదముల (అడుగుల) కొలతకు లెక్క యని పేరు. ఈనాల్గింటికి "ప్రమాణచతుష్టయ" మని పేరుండెను.

**ప్రమాణములు ౮ (అష్టప్రమాణములు)**— తర్కశాస్త్రమున:-

౧ ప్రత్యక్షప్రమాణము- ఎదురుగకన్పించుటంజేసి యొక వస్తువు కలదని నిరూపించువిధానము లేక సాధనము. ఈప్రమాణమును తర్క మీమాంసా శాస్త్రములందునను, పురాణములందునను, కణాదమతమునను, సాంఖ్యమతములను, చార్వాకమతమునందునను నంగీకరించి యున్నారు.

౨ అనుమానప్రమాణము- ప్రత్యక్షముగ నగపడనివస్తువును లోకానుభవ సాదృశ్యముల మూలమున నుండిన తెలియుంగుటను నిరూపించు విధానము లేక సాధనము. ఈప్రమాణమును తర్క మీమాంసాశాస్త్రములందునను, పురాణములందునను, కణాదమతమునను, సాంఖ్యమతములందునను అంగీకరించి యున్నారు.

౩ ఉపమానప్రమాణము - దీనిని కొంద అనుమానములోని అంతర్భాగమని యంగీకరించిరి. ప్రత్యక్షముగ నగపడనివస్తువును ఉపమాన (దృష్టాంతము) లమూలముగ నుండిన తెలియుంగుటను నిరూపించువిధానము లేక సాధనము. ఈప్రమాణమును తర్కమీమాంసాశాస్త్రము లందునను, పురాణము లందునను అంగీకరించి యున్నారు.

౪ ఆగమప్రమాణము, లేక శాబ్దప్రమాణము- ప్రత్యక్షముగ నగపడనివస్తువును తొల్లి పరమేశ్వరునినుండి కల్గిన ఆగమములందు (వేదములందుఁ గాని, ఆగమములందుఁ గాని. ఈ రెండును ఆగమములే యని యెఱుంగునది) చెప్పఁబడుటంజేసి కనుపింపకున్నను ఆవస్తువు ఉండిన తెలియుంగుటనునిరూపించువిధానము లేక సాధనము. ఈప్రమాణమును తర్క వేదాంతశాస్త్రము లందునను, పురాణము లందునను, సాంఖ్యమతమందునను అంగీకరించియున్నారు.

౫ అర్థాపత్తి ప్రమాణము - (అర్థాత్ సిద్ధము) అర్థమునుండి తేలిః సారాంశ మని భావము ఇది అనుమాన ప్రమాణములోని యంతర్భాగమే యని కొంద అభిప్రాయపడి యున్నారు. ఒకఁడు "పగలు భోజనము చేయకున్నను (బలిసి) బలాఢ్యుఁడై యున్నాఁడు" అనునప్పుడు బలాఢ్యుఁడైయుండుటవలన రాత్రి

భోజనముచేయునని స్ఫురించుచునే యుండును. దీనికర్థాపత్తి యనిపేరు. ప్రత్యక్షముగఁగనపడకున్నను కలసంగతులంబట్టి ఉండినదని యర్థము వలన నిరూపింపనగుసాధనము లేక విధానము ఈప్రమాణమును వేదాంతశాస్త్రములందునను పురాణములందునను అంగీకరించి యున్నారు. దీనిని కైముత్యన్యాయ మనియు నందురు

"ఒకఁడు నడుచుచు వెళ్ళిపోయిన ట్లగుపడుటం" జేసి ఆతఁడు జీవించియున్నవాఁడే యని వేఱుగఁజెప్పనక్కఱయుండదు. ఇట్టివిఅర్థాపత్తి ప్రమాణముచే నిశ్చయించునవిగ నెఱుంగునది.

౬ సంభవప్రమాణము - ఇదియును అర్థాపత్తియందుచేరియున్న దేయని కొందఱభిప్రాయపడియున్నారు. సంభవమన సంభవించినది లేక కల్గియున్న దియనియర్థము. చెప్పనక్కఱలేకయే ఉన్నట్టు స్ఫురించుచుండుట సంభవప్రమాణము. కోటీశ్వరునికడ లక్షరూపాయలున్నవని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. కట్టపనివాఁడు పెట్టెలం జేయుచున్నాఁ డనునప్పుడు వానికడ పనిముట్టున్నవని స్పష్టపడుచునేయున్నది. ఈప్రమాణమును అనుమానప్రమాణాంతర్భూతమే యని తోఁచెడిని. దీని ససంభవ మని కొందఱనిరి.

అనుపలబ్ధిప్రమాణము-దీని నభావప్రమాణ మని యందురు.

**ప్రమాణవన్త్యదృష్టాని కల్ప్యాని సుబహూన్యతీతిన్యాయము**- కారణమునుండి కార్యము గల్గినట్లే, కార్యమునుండి పిదప కొన్ని ఉపకార్యములు (ఫలితములు) కల్గుచుండును. సద్యః ఫలితములుగఁ గొన్నియును, దూరమున ఫలించునవిగ కొన్నియును నుండును. అవి సిద్ధాంతపఱుపఁ బడనిది చెల్లనేరవు. అనధికారజన్యము లగునవి చెల్లవని చెప్పఁబడినది. ఈ సందర్భమున నదృష్టము వివరింపఁబడఁదగినది. అదృష్ట మన కన్పింపనిది యని యర్థము. అప్రియత్నముగ నదే సంభవించిన దాని నదృష్ట మ్మందురు. దానికి అపూర్వమనియు నందురు. అపూర్వ మన నిది వఱకు లేక అధాత్తుగా కల్గినదని భావము. అపూర్వముకానిది సంస్కారము.

**ప్రమాణవత్త్వాదాయాతః ప్రవాహకేన వార్యతేతి న్యాయము** — సహేతుకముగ ఋజువుపఱుపఁ బడుచున్న వాదమునందలి ధోరణి నాఁపుట యసాధ్యమనిభావము. వాదమునందలిబలము, ప్రోత్సాహము గల్గించునని యిందలియంతరార్థము.

**ప్రమార (శాఖ) క్షత్రియులు**—వీరు అగ్నికులక్షత్రియుల నాల్గుశాఖలలో నొకశాఖవారు. ఇంద్రాంశసంభూతులుగఁ జెప్పఁబడినవారు. వీరి కాదియందు అబు, ధార్, ఉజ్జయిని రాజ్యము లొసంగఁ బడినటుల చెప్పఁబడినది. ఏ రెక్కువపరిమితిగల రాజ్యభాగములం గల్గియుండిరని ప్రతీతి కలదు. జగము ప్రమారుల దేయనులోకోక్తి వారి దేశములందు వ్యాపించియుండెనఁట.

వీరిప్రదేశమునకు "నవకోటిమరుస్థలి" యని పేరయ్యెను. ఇది సట్లెజినదినుండి సముద్రము దనుకను, సింధునదిమొదలు యమునానదిదనుకను వ్యాపించియుండినది. ఇందు ౧ నవకోటిశిఖరము, ౨ అర్బుదశిరము, ౩ ధాతమందాద్రిశిఖరము, ౪ ఖైరాలుశిఖరము, ౫ పాక్కారుశిఖరము, ౬ రోదుర్వాశిఖరము, ౭ పూగలుశిఖరము ననుసప్తశిఖరము లుండెనని చెప్పఁబడినది. ఆదియం దిది తొమ్మిదిభాగములుగ విభజింపఁబడి నవకోటిమరుస్థలి యని పేరందె నందురు. ఇదియె రాజపుత్రస్థానము. ఇందు ప్రమారక్షత్రియులలోని ముప్పదియైదు అంతశ్శాఖలవారికిని రాజ్యము లుండెనందురు. వీటి రాజధానులలో ముఖ్యములైనవి. ౧ మహేశ్వ

రము, ౨ ధార్ పురము, 3 మండూపురము, ౪ ఉజ్జయిని, ౫ చంద్రభాగ పురము, ౬ చిత్తూరు, ౭ అర్బుదపురము, ౮ చంద్రావతీ పురము, ౯ మహామైదానపురము, ౧౦ పద్మావతీపురము, ౧౧ అమరకోట, ౧౨ చికేర్పురము, ౧3 లోదుర్వాపురము, ౧౪ పట్టన్ అనునవి పెద్దవియై పేరందియుండెనందురు.

క్రీ. వె. ఏడవశతాబ్దముదనుక ప్రమార ప్రభువంశములనుండియె పెక్కుశకము లేర్పడినవని బలమగు ప్రతీతి కలదు. భోజశక మిందుకు సాదృశ్యమ నెదరు. వీరిరాజ్యము నర్మదానదిని దాటి, అవ్వలివైపునఁ గూడ వ్యాపించి యుండెను.

చేదిదేశపు మహేశ్వర పురాధిపతు లగు హైహయులు, చిత్తూరుప్రభువులు, ప్రమార శాఖాక్షత్రియులుగఁ జెప్పఁబడినవారు. రామ ప్రమారుఁ డనునృపాలుఁడు తెలింగానారాజ్య మేలినటుల చౌహానుల వందిమాగధులలో నొకఁడగు చంద నునాతఁడు తానురచించిన పాటలలోఁ దెల్పియున్నాఁడు. ఇది క్రీ. వె. తొమ్మిదవశతాబ్దకాలమనితలంపఁబడుచున్నది.

ప్రమారక్షత్రియులందు ముప్పదియై దంత శ్శాఖలు కలవు. ౧ మోరీశాఖ. వీరు మగధ దేశమేలిన మౌర్యులు, ౨ సొగ్గీశాఖ, 3 ధాత్ శాఖ, ౪ శాంగ్లశాఖ (వీరు పూగల్ప్రభువులు; మార్వారుదేశమేలినవారు), ౫ ఖైరాలు (వీరు ఖైర్పూరురాజ్య మేలిన వారు). ౬ ఉమ్రా, లేక సుమ్రా (వీ రిప్పుడు మహమ్మదీయ మతస్థులై పోయి యున్నారు తొలింట వీరిది యెడారిప్రదేశమై యుండెను.) ౭ వెహిల్ లేక విహిల్ శాఖ (బిహిల్). వీరు చంద్రావతీ ప్రభువులు. ప్రమారశాఖ లన్నిటిలోను ప్రముఖులని పేరందినవారు. ౮ మెయిపావత్ శాఖ (వీరు మేవాడులోని బిజోళీ ప్రభువులు.) ౯ బుల్హార్ శాఖ (వీరిరాజ్యమున ఉత్తరపుటెడారి లేక పెద్ద యెడారి యనిపేరు. ౧౦ కాబా (తొల్లింటి సౌరాష్ట్రదేశమున శిరోహి సంస్థానపువారు.) ౧౧ ఓమ్యా తవరశాఖాక్షత్రియులు (వీరు మాళవదేశమును పండ్రెండు తరములు పాలించిరి. ఇది ప్రమారులపాలైయుండిన రాజ్యములలోను మిగుల గొప్పది. క్రీ. వె. ౧౮౧౭ యుద్ధము నుండి వీరు స్వతంత్రతం గోల్పోయి బ్రిటీషు రాజ్యమున సామంతులైరి.) ౧౨ రేహారుశాఖయు, ౧3 ధూండశాఖయు, ౧౪ సొరతీయశాఖయు ౧౫ హరైరు శాఖయు (నాల్గుశాఖల క్షత్రియులు) తొల్లింట మాళవ దేశమునందు గ్రేసియా సామంతప్రభువులలోనివా రని చెప్పబడినవారు. ఇంకను ౧౬ చవాండాశాఖ, ౧౭ కెజూన్ శాఖ, ౧౮ సద్రోశాఖ, ౧౯ బర్కోటాశాఖ ౨౦పూనీశాఖ ౨౧సంపల్ శాఖ, ౨౨బీబాశాఖ, ౨3కాల్పూసల్ శాఖ, ౨౪ కల్మోశాఖ, ౨౫ కోహిలాశాఖ, ౨౬ పూ్యాపాశాఖ, ౨౭ హూరియూశాఖ, ౨౮ ఛండ్ శాఖ (వీరు చంపానరాజ్య మేలినవారు), ౨౯ దేబాశాఖ, 30 బర్హార్ శాఖ, 3౧ జీప్రాశాఖ, 3౨ పోస్రాశాఖ, 33 ధూంతాశాఖ, 3౪ రికంశ శాఖ 3౫ తైకాశాఖ.

ఈ అంతశ్శాఖలు గాక ఇంకను గొన్ని యంతర్భేదశాఖలు కలవందురు గాని, సరిగా తెలియరావు. మహమ్మదీయకాన్నత్యకాలమున వీరిలో కొందఱు బలహీనులై మహమ్మదీయ మతస్వీకరణ మొనర్చి తమరాజ్యాధిప ము లను నిలుపుకొని రనియుఁ జెప్పఁబడినది. అట్టి వారు సింధునదికవ్వల నున్నవారని చెప్పఁ బడినది.

## ప్రమారశాఖాక్షత్రియుల ముఖ్యపట్టణములు ౧౪— ౧ మాహేశ్వరము,

ధార్ పురము, 3 మండూపురము, ౪ ఉజ్జయిని,

౫ చంద్రభాగపురము, ౬ చిత్తూరు, ౭ అర్బుద పురము, ౮ చంద్రావతీపురము, ౯ మహా మైదానపురము, ౧౦ పద్మావతీపురము, ౧౧ అమరకోట, ౧౨ చికేర్పురము ౧౩ లోదుర్వా పురము, ౧౪ పట్టన్.

**ప్రముచుండు**—ఋషి. ఇతఁడు రైవతక పర్వతమునం దుండువాఁడు. కుమార్తె రేవతి.

**ప్రమేహము**—సెగరోగముయొక్క పరిణామము. ఇందు తత్కారణముగఁ గల్గిన అతిమూత్రవ్యాధికూడ నుండును.

**ప్రమోంటోరీ** (Promontory) — (అగ్రము చూడుఁడు.)

**ప్రయాగ**— ప్రయాగలు హిమవత్పర్వతముపై నైదు కలవు. అవి పంచప్రయాగ లనంబడుచున్నవి. ప్రయాగ యన యాగ ప్రధాన మగుపవిత్రస్థలి యని భావము. సాధారణముగ ననేకనదు లొకచో కలియుతావులకు, అనఁగా ఒకనదిలో వేఱొకనది సంగమించుతావులకు ప్రయాగత్వ మారోపింపఁబడుచుండును.

భరతదేశమున ప్రయాగ యన సంయుక్త రాష్ట్రములలోని అలహాబాద్ పురముకడ గంగానదిలో యమునానది సంగమించు తావున ప్రయాగ యని దేశమంతటను ప్రతీతి కలదు. మఱియు నత్తావుననె సరస్వతీనది యంతర్వాహినియై వచ్చి గంగానదిలో సంగమించునని చెప్పఁబడియుంట త్రివేణి యనియు నందురు. సరస్వతి గానరాదు. ప్రయాగ యనిన దేశమంతటాఁగల ప్రతీతి ఇత్తావునకే. తొల్లింటి ప్రయాగ కీనడుమకాలమున ధారాగంజ్ అనియు, అవ్వల పిదపకాలమున పెరిఁగిననగరమున కలహాబా దనియు క్రొత్తపేరులు సిద్ధమై, ఇక్కాలమున కట్లే యున్నను, ప్రయాగ యని మాత్రము వాడుక తగ్గలేదు. ఇట నదీసంగముకడ మాధవస్వామి దేవస్థాన మున్న కారణమున నాదేవుని వేణీమాధవస్వామి యనియు, నీక్షేత్రమునకు మాధవప్రయాగ యనియు ననుచున్నారు.

ఈ ప్రయాగ తీర్థనాయక మని చెప్పఁబడినది. శ్లో॥ త్రివేణీం మాధవం సోమం భరద్వాజంచ వాసుకిం। వందేఽక్షయవటం శేషం ప్రయాగే తీర్థనాయకే॥ యని యిటఁగల పుణ్యస్థలులు వివరింపఁబడినవి. తొల్లింట నిట భరద్వాజాశ్రమ ముండెను. ఆనాటి శివలింగము దర్శించుచున్నారు. సంగముకడ నక్బరుచక్రవర్తి కట్టించిన కోటయందు పాండవాగ్రసరుఁడగు యుధిష్ఠిరమహారాజుకట్టించిన పాతాళపురి దేవాలయము కలదు. అందే అక్షయవట మున్నది. మఱియు ప్రయాగయ లోపీ దేవిశక్తి పీఠమును ప్రజాపతివేదికయుం గలతావు.

ప్రయాగ తొల్లింట రామాయణకాలమున నయోధ్య కోసలరాజ్యమునకును, (రామాయణ కాలమున కోసలదేశమునకే చెందియుండెనని చెప్పఁబడినది.) చంద్రవంశపురాజులకాలమున ప్రతిష్ఠానపురరాజ్యమునకు జెందియుండె నని జెప్పఁబడినది. ప్రతిష్ఠానపురము రాజధానిగ గల రాజ్యమునకు ప్రయాగదేశ మనియేపేరుండెనని తెలియుచున్నది. ఇటకు గంగానదికవ్వల నేయుండు జూసీ(తొల్లింటి ప్రతిష్ఠానపురము) చంద్రవంశపురాజులకు రాజధాని. అందే పురూరవ చక్రవర్తియు, నహుష మహారాజు, యయాతిమహారాజు, పురుమహారాజు, దుష్యంతమహారాజు, భరతమహారాజు రాజధానిగ రాజ్యపాలన మొనర్చిరని బ్రహ్మపురాణము ౧౦-౧౧-౧౨ అధ్యాయములను, లింగపురాణము ౧-౬౩ యందునను చెప్పఁబడినది. ప్రతిష్ఠానపురము కాలవశమున చెడి దగ్ధమై పోయిన

కతన ఝాసీ (కాలిపోయినతావు) యనుపేరు వహించి నేటికి నట్లే యున్నది.

**ప్రయాగ కామేశ్వరకవి**— ఆంధ్రకవులలో నాధునికులందు పరిగణింపఁబడినవాఁడు. తెలగాణ్యబ్రాహ్మణుఁడు. విశాఖపట్టణమండల వాసి. కౌసికసగోత్రము. తండ్రిపేరు సర్వేశము. తాతపేరు నారసింహము.

రచించినది గోపాలలీలాసుధాలహరి యను శృంగారకావ్యము. దీనిని రామతీర్థస్వామికిఁ గృతి యిచ్చెను

**ప్రయోజన మనుద్దిస్య న మందోపి ప్రవర్తతేతిన్యాయము** -ఎంతబుద్ధిహీనుఁడైనను ప్రయోజనములేని పనికి జొరఁడని భావము.

**ప్రయోజనానుబంధము**-(అనుబంధ చతుష్టయము చూడుఁడు. అందులో నొకటి.)

**ప్రలంబ (పుర) ము**- రోహిల్ఖండునందు పడమరగా బిజనోర్పురమున కుత్తర దిశను ఎన్మిదిమైళ్ళదూరమున మడవార్ లేక ముండోర్ అనియు పిలువంబడుచున్నది. దీనిం గూర్చి ప్రశంస రామాయణము, అయోధ్యా కాండము ౬౮ అధ్యాయమునఁ గలదు.

దీనికి మతిపుర మనియు నొకప్పుడు పేరుండెనని తెలియుచున్నది. (మతిపురము జూడుఁడు)

**ప్రలాపసన్నిపాతము** — (సన్నిపాత దోషము చూడుఁడు.)

**ప్రవణాకులగోత్రము**—(ప్రహిణికుల చూడుఁడు.)

**ప్రవరపురము**— కాశ్మీర దేశములోని శ్రీనగరమునందలి యొకభాగము. రాజతరంగిణి యం దీపేరె వాడఁబడినది.

**ప్రవరసేనపురము**— (కాశ్మీరదేశము చూడుఁడు.)

**ప్రవర్తన ననుసరించియే బ్రతుకు తెలి వుండుట**— (ఆంధ్రలోకోక్తి)

**ప్రవారేయగోత్రము** —(వీతహవ్య లేక యాస్క-గణము చూడుఁడు.)

**ప్రవాహిగోత్రము** — (భరద్వాజఉప గణము చూడుఁడు.)

**ప్రవాహేశ్వరవాదిశైవము**—ఇది చతుర్దశశైవభేదమతములలో నొకటి. (చూడుఁడు.) ఈమతమున త్రిపదార్థములు, మలత్రయము, శివసమవాదిశైవమునందు వలెనే యుండును. ఇందు విశేషముగ ముక్తాత్మలు చెప్పఁబడిన వందురు. ముక్తాత్మలు ఈశ్వరరక్షితములు. వీరికనాది యగుమలము లేదనియు, మాయాబంధము నొంది శరీరేంద్రియములచేత నైహికానుభవమునందుచు వ్యాపించియుందు రనియు నందురు. మాయాకర్మలమూలమున జన్మములందుచుండునది యాత్మ(ప్రాణము)యనియు, వీరిమతదీక్ష నందుటచే మాయయు, కర్మలును నశించి శుద్ధావస్థ యాత్మకుఁ గల్గుననియు, అదియే ముక్తి యనియుం జెప్పుదురు.

**ప్రవాహ్లేయగోత్రము**- (భరద్వాజ ఉపగణము చూడుఁడు.)

**ప్రవీరుఁడు**— (మలయధ్వజుఁడుచూ.)

**ప్రవీరోధనమన్యువు లేక ప్రవీరుఁడు** పూరువసంతతి క్షత్రియుఁడు. తండ్రి ప్రాచిన్వానుఁడు

**ప్రవేశము**—ఇది సంగీతశాస్త్రమందలి క్రియాప్రాణములోని మార్గక్రియయందలి నిశ్శబ్దక్రియలలో నొకటి. (క్రియాప్రాణము చూ.)

**ప్రశస్తగోత్రము**--(భౌశనసగణముచూ.)

**ప్రశస్థగోత్రము**— (బౌధ్య ఉపగణము చూడుఁడు.)

**ప్రసక్తానుప్రసక్తన్యాయము**- ఒకేపనియందు ప్రసక్తి (ఒకఫలితము) అనుప్రసక్తి (వేఱొకఫలితము) కూడ గల్గుటయం దీన్యాయము వాడుదురు.

**ప్రసంగయానము** — రాజనీతియందు చెప్పఁబడిన పంచయానములలో నొకటి. (షడ్గుణము, లేక షడ్గుణైశ్వర్యములు చూడుఁడు.)

**ప్రసవగండములు** — (ప్రసూతిగండములు చూడుఁడు.)

**ప్రసాదగోత్రము**-(కణ్వాఉపగణము చూ.)

**ప్రసాదుఁడు**— ఇంద్రద్యుమ్ననిసంతతివాఁడగు నొకనృపాలుఁడు.

**ప్రసూతిగండములు (ప్రసవగండములు)**—ఇవి జననమునందు ౧ తిథిగండములు, ౨ లగ్నగండములు, 3 నక్షత్రగండములు నని త్రివిధములు. (ఈగండముల కాలముంగూర్చి దోషములు చూడుఁడు.)

అమావాస్య ప్రతిపత్తులయొక్క సంధియందును, పంచమీషష్ఠులయొక్క సంధియందును, దశమీ ఏకాదశులయొక్క సంధియందును, పూర్ణిమాప్రతిపత్తులయొక్క సంధియందును, రెండుగడియల కాలము తిథిగండ మనబడును. కటకసింహములయొక్క సంధికాలమందును, వృశ్చికధనుస్సులయొక్క సంధికాలమందును, మీనమేషములయొక్క సంధికాలమందును,అరగడియకాలము లగ్నగండమనబడును. రేవతి అశ్వినులయొక్క సంధికాలమందును, ఆశ్లేషా మఖలయొక్క సంధికాలమందును, జ్యేష్ఠ మూలలయొక్క సంధికాలమందును ఎనిమిది గడియలు నక్షత్రగండ మనఁబడును.

ఈ గండకాలములయందు జనించిన శిశువులకు శాస్త్రోక్తరీతిగా శాంతిజరుగవలెను. దుష్టనక్షత్రములయందు జనించినయెడలను శాంతి విధ్యుక్తముగా చేయవలెను. గండత్రయమందు జనించినశిశువు జీవించుట దుర్లభము.

**ప్రసూతివైరాగ్యము, శ్మశానవైరాగ్యము, పురాణవైరాగ్యము నిలుచునవి కావు**—(ఆంధ్రలోకోక్తి.)

**ప్రసూతిశాంతులు**— ఉత్తరానక్షత్ర ప్రథమపాదము, పుష్యమీనక్షత్ర ద్వితీయ తృతీయపాదములు, పూర్వాషాఢయొక్క తృతీయపాదము, చిత్తానక్షత్రముయొక్క ప్రథమ ద్వితీయపాదములు, ఆశ్రేషానక్షత్రముయొక్క చతుర్థపాదము, మఘానక్షత్రప్రథమపాదము, రేవతీనక్షత్రచతుర్థపాదము, అశ్వని ప్రథమ పాదము, జ్యేష్ఠమూలనక్షత్రముల ఒకటి రెండు మూఁడు నాల్గుపాదములు, తండ్రిజన్మనక్షత్రమునను, పిల్లగాని, పిల్లవాఁడు గాని జనించిన శాంతి చేయవలయును.

ఇంకను తిథిగండములు, నక్షత్రగండములు, రాశిగండములుగూడా శాంతి చేయవలసినవే యగును. మఱియు కృష్ణపక్షచతుర్దశి అమావాస్యలయందు జననము సంభవించిన శాంతిచేయవలయును. (గండములంగూర్చి దోషములు చూడుఁడు).

**ప్రసేనచిత్తుఁడు**— ఇక్ష్వాకు సంతతి. సూర్యవంశ క్షత్రియుఁడు. తండ్రి మాంధాత. సోదరులు సుసంధి, ధ్రువసంధి, అంబరీషుఁడు.

ప్రసేనచిత్తుఁడు జమదగ్ని మామ యనియు, రేణుకతండ్రి యనియు, పరశురాముని మాతామహుఁ డనియుఁ జెప్పఁబడినది.

**ప్రసేనుఁడు**—అత్రి చంద్ర యాదవవంశ క్షత్రియుఁడు. తండ్రి శూరుఁడు. అన్నగారు సత్రాజిత్తు. (శమంతకమణి, అక్రూరుఁడు చూ.)

**ప్రస్తము**—(ఆయుర్వేదమానము చూ.)

**ప్రస్తరప్రహరణన్యాయము** ప్రస్తరమన పిడికెడుదర్భగడ్డి యని భావము. కొన్ని క్రతువులందు పిడికెడుదర్భగడ్డిని వేదికయందాస్తరణగ వైచి, దానిపైపాత్రల నుంచుదురు. అంతమున నీప్రస్తరమును సైత మాయగ్నియందే హోమ మొనర్చుదురు. రెండుకార్యములకు పనికివచ్చుటంగూర్చి యీన్యాయము వాడుచుందురు.

**ప్రస్థలదేశము-పాటియాలాసంస్థానరాజ్యము** ఇప్పటి ఫిరోజపూరు, సిర్సా, పాటియాలా ప్రాంతసీమల కొకప్పు డీపేరుండెనని తలంపఁబడుచున్నది.

మహాభారతము, ద్రోణపర్వము ౧౭ యందు దీనిప్రశంస గలదు.

**ప్రస్థానత్రయము**-- ఉపనిషద్భాష్యము, బ్రహ్మసూత్రభాష్యము, గీతాభాష్యము వీట్లకు ప్రస్థానత్రయ మనిపేరు. వీట్లకు వేర్వేరుసిద్ధాంతములమతములవారు వారిపద్ధతుల కనుకూలమగురీతిని వేర్వేరుభాష్యములు రచించుకొనిరి.

ఉపనిషత్తులన నిట అన్నిమతములవారును అంగీకరించిన దశోపనిషత్తు లని యెఱుంగునది. ౧ ఈశావాస్యోపనిషత్, ౨ కేనోపనిషత్ ౩ కఠోపనిషత్, ౪ ప్రశ్నోపనిషత్, ౫ముండకోపనిషత్, ౬ మాండూక్యోపనిషత్, ౭ తైత్తిరీయోపనిషత్, ౮ ఐతరేయోపనిషత్, ౯ ఛాందోగ్యోపనిషత్, ౧౦ బృహదారణ్యకోపనిషత్. ఇవి దశోపనిషత్తు లనఁబడును. ఇంక బ్రహ్మసూత్రములు వేదవ్యాసకృతములును, గీతయన భగవద్గీతయు నని యెఱుఁగునది.

**ప్రహర్షణగణము** - ఇది విశ్వబ్రాహ్మణులయం దొకగణము. ఇం దైదుగోత్రములు చెప్పఁబడినవి.

(అధర్వణశాఖ విశ్వబ్రాహ్మణులు చూ).

౧ ప్రహర్షణగోత్రము- ప్రహర్షణ, శిలాదండ, లోకవేత్త, (త్రయార్షేయ)

౨ లోకవేత్తగోత్రము- లోకవేత్త, గోత్రభేద,సహస్రబాహు (త్రయార్షేయ).

౩ చిత్రకమను-శిలాదండ, లోకవేత్త,గోత్రభేద, సహస్రబాహు, చిత్రక. (పంచార్షేయ ప్రవర.)

౪ సహస్రబాహు-సహస్రబాహు, చిత్రక, భావబోధ (త్రయార్షేయప్రవర)

౫ దేశికమనుఋషిగోత్రము-సహస్రబాహు, చిత్రక, హావబోధ, మాందిని, దేశిక. (పంచార్షేయప్రవర).

**ప్రహిణికుల గోత్రము** ఆరవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు). ప్రహీణికుల (ప్రవణికుల లేక పైఁడికుల) గోత్రము. ఏకార్షేయ (౨౯) గోత్రము, సంస్కృతగోత్రము. గార్గ్యస గర్గగణము. ఆంగిరసర్షి. ఆపస్తంభయజుశ్శాఖ. ప్రమాణగ్రంథములు ధర్మసింధు, నిర్ణయసింధు. సమానగోత్రము ఆంగిరస. పర్వతేశుఁడు దేవత. పుష్పాంబ భార్య. పంపాతీరము తపస్థానము. పుష్పసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౩౦. క్షేత్రసంఖ్య ౪౦. పనసపండు దానము. కాకరకాయ వర్జనీయము.

**ప్రళయము**—ప్రళయమన కల్గినసృష్టి నశించుట యని యెఱుంగునది.

తొల్లి కల్గినసృష్టి నశించుటకగు నేర్పాటులు చిత్రములు. ప్రాణులకు నిత్యప్రళయము, నైమిత్తికప్రళయమునని ద్వివిధముగల్గును. నిత్యప్రళయము నిద్రఁజెంది మృతినందునట్లే చేష్టలు దక్కియుండుట. నైమిత్తికప్రళయము మృతి.

సృష్టినందిన జగత్తంతయు పరమేశ్వరునిచేత పరమేశ్వరునియొక్క సృష్టి యొనర్చు నవస్థకు

"విధాత, లేక బ్రహ్మ" యని నిరూపణాకారము. ఇట్టి బ్రహ్మయొక్క చర్యలు మృతి యన. సృష్టియొక్క కార్యములు, కల్గిన సృష్టి యొక్క నశింపు ననిభావము. దీనికే ప్రళయ మని పేరు.

మనుష్యమానముచే వేయిమహాయుగముల కాల మగు ౪౩౨౦౦౦౦౦౦౦ సంవత్సరముల కాలమును బ్రహ్మకు పగలని యెఱుఁగుదుము. దీనికి సృష్టికాల మనిపేరు. బ్రహ్మయొక్క రాత్రికాలముగ నెంచఁబడిన మరింతకాలము ప్రళయకాలము నందు సృష్టి యంతయు లయ మయ్యెడిని. ఇంక సంధులకాలము సృష్టిప్రళయముల నడుమఁగల సంధికాలములే. ఇది నైమిత్తికప్రళయ మనంబడును.

బ్రహ్మయొక్క ఆయు వని చెప్పఁబడు మనుష్యమాన ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦౦ సంవత్సరములకాలము గతించి, సృష్టియొక్క పరమాయువుసమాప్తిచెందఁగనే, సృష్టి సమసించి తిరుగ సృష్టిని పరమేశ్వరుఁడు తలంచువఱకు (అనఁగా తిరుగ వేఱొక బ్రహ్మ కలుగువఱకు) ప్రళయకాలమే గాన సృష్టి యుండదు. దానికి ప్రాకృతికప్రళయ మనిపేరు.

పరమేశ్వరునకుఁగలస్థిత్యవస్థనువిచారింతము. బ్రహ్మసృష్టికి నిరూపణాకార మైనట్టి పరమేశ్వరునిస్థితికి విష్ణువు నిరూపణాకారము. శివుఁడు లయావస్థకు నిరూపణాకారము. బ్రహ్మయొక్క పతనము విష్ణువున కొకదిన మనియు, విష్ణుదేవుని ఆయు వీ లెక్కను ౧౦౦ సంవత్సరములు గడచి విష్ణుపతన మగుట శివున కొకదిన మనియు, ఇట్లు శివుఁడును నూఱుసంవత్సరములు గడపి పతనమగుకతన అత్యంతికప్రళయము కల్గును. అట్టితటి నొక్కపరమేశ్వరుఁడే ఆనంద లక్షణమాత్రుఁడై సర్వసంహార మధ్యమునం దుండెడిని. దానికే మహాప్రళయ మందురు.

**ప్రళయములు**— ప్రళయ మన సర్వనాశకరమని యర్థము. ఇవి నిత్య, నైమిత్తిక, ప్రాకృత, అత్యంతిక ప్రళయము లని నాల్గు విధము లగ నద్వైతులును, లఘు గురు ప్రళయములుగ ద్వైతులును చెప్పుదురు.

నిత్యప్రళయము- నిద్రించి సర్వచేష్టలుదక్కి యుండుట.

నైమిత్తికప్రళయము-ఔషధాదులవలనను, యోగసాధనలవలనను చైతన్యముబాసి చేష్టలు దక్కియుండుట.

ప్రాకృతప్రళయము-మృతి.

అత్యంతికప్రళయము- జగత్తంతయునాశన మగుట.

లఘుప్రళయము- తుపాను, గాలివానలు, అగ్నిప్రమాదములు మొదలగు వాట్లవలన వీరువా రనుభేదము లేకుండ ప్రాణులు శరీరములను విడువవలసివచ్చుట.

గురుప్రళయము- ఇది అత్యంతికప్రళయము వంటి జగత్తంతయు నాశన మగుటయె.

**ప్రక్షాళనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరమ్** —ఇది సంస్కృతభాషయందలి లోకోక్తి.

బురద తనకుఁ దగిలినపిదప కడిగుకొనుటకన్న దూరము తొలఁగి తగులకుండ తప్పించుకొనుటయే శ్రేయమని భావము.

**ప్రాంశువు**— ప్రజానియొక్క తండ్రి.

**ప్రాకామ్యసిద్ధి**—(సిద్ధి-సిద్ధులు చూ.)

**ప్రాకృత భాష**—ద్వితీయప్రకృతి. అష్టభాషలలో నొకటి. (భాషఎన్మిదివిధములుచూ.)

**ప్రాకృతభేదములు** — ప్రాకృతభేదములు ౬. నాటకాదులయం దుపయోగించెడి ప్రాకృతభాష ఆఱువిధములు.

౧ ప్రాకృతభాష. ఇది తొల్లి మహారాష్ట్ర దేశమున వాడుకయం దుండెను. సంస్కృత నాటకములందు స్త్రీపాత్రలకు విదూషకునకు వాడఁబడును.

౨ శౌరసేని. శూరసేనదేశమున తొల్లి యీభాష వాడుకయం దుండెను. సంస్కృత నాటకములం దధమపాత్రల కీభాష వాడఁబడును.

౩ మాగధి. మగధదేశమున తొల్లి ఈభాష వాడుకయం దుండెను. సంస్కృతనాటకములం దత్యధమపాత్రల భాష వాడఁబడును.

౪ పైశాచి. తొల్లి పాండ్య, కేకయ, నేపాళ, కుంతల, చోళ మొదలగు కొన్ని దేశముల నీభాష వాడుకయం దుండెను. సంస్కృత నాటకములం దీభాష రాక్షసపిశాచాది నీచ పాత్రలకు డఁబడెడిని.

౫ చూలికాపైశాచిభాష. ఇదియు పైశాచి భాష వాడఁబడుతావులం దే వాడఁబడును.

౬ అపభ్రంశము. అడవిభాషగను, చండాల యవనాదిపాత్రలకును వాడఁబడును.

పాత్రోచితములుగ నీయాఱుభాషలు నాటకములందుపయోగింపఁ బడుచుండును. మఱియు నీషట్ప్రాకృతములందు తత్సమ, తద్భవ, దేశ్య భేదములచే పదునెన్మిదివిధము లగును. గాన అష్టాదశప్రాకృతము లని వాడఁబడుటయుఁ గలదు.

**ప్రాకృతయోగము (మంత్రయోగము)**—(అభ్యాసయోగములు చూడుఁడు.)

**ప్రాక్కాళీనది** (Kalinadi East)—ఇది కుమా న్డివిజను కడభాగమున, యూరాక్- సమీపమున, కాళాపాణి యనంబడుతావున జనించెడి కాళీనది కానేరదు. ఇది యని మెఱుంగునది.

ఈనదియు కుమానుడివిజనునందే గల పర్వతములందు జనించి పూర్వమార్గగమన యగుచు సంకాశ్యపురము, కనూజల ప్రక్కంబడి నడిచి ధవళగంగ, గౌరీ, చంద్రభాగలం గల్పుకొని కాళీగంగ యని పేరంది, కాళీనది, కాళినీనది యనియుఁ బరఁగుచు గంగానదియందు సంగమించును. దీనిప్రశంస పద్మపురాణ, సర్గ ౧౯ యందు కలదు. సుప్రసిద్ధమహాకాలక్షేత్ర మీనదీతీర మని చెప్పఁబడినది.

**ప్రాగభావము**—(అభావములుచూ.)

**ప్రాగల్భ్యహీనస్యనరస్యవిద్యాశస్త్రం యథా కాపురుషస్య హస్తే**—ఇది సంస్కృత భాషయందలి లోకోక్తి. జ్ఞాన శూన్యుని విద్య కాపురుషుని (మూర్ఖుని) చేతియందున్న ఆయుధమువంటి దని భావము.

**ప్రాగావసు గోత్రము**—(కణ్వఉపగణము చూడుఁడు.

**ప్రాగ్జ్యోతిష పురము**—ఇప్పటి ఆసాము నందలి గౌహాతిపురము. తొల్లింటి కామరూప దేశపురాజధాని ప్రాగ్జ్యోతిషపుర మని పోల్చియున్నారు.

ఇంకను వేత్రవతీనదీ (ఇప్పటి బేట్వా) తీరమున వేఱొక ప్రాగ్జ్యోతిషపుర ముండినటుల రామాయణము, కిష్కింధాకాండ, ౪౨ అధ్యాయమువలనను, బ్రహ్మపురాణము ౨౧౯ అధ్యాయమువలనను తెలియుచున్నది. ఇదియే నరకాసురుని పురమని పరిపోల్చుట యుక్తము.

**ప్రాగ్బోధిపర్వతము**—ఫల్గుణీనది కడ్డముగా నున్న మోరాపర్వతము. ఇది బుద్ధగయకు వాయువ్యదిశగా . మూఁడుమైళ్లు దూరము. ఆర్కియాలోజికల్సర్వే రిపోర్టునందు(3-౧౦౫) బుద్ధభగవానుఁ డీకొండనుండి బుద్ధగయ కేగెనని చెప్పఁబడినది.

**ప్రాగ్వాల్ పట్టా**- కాశీయందు గంగా పుత్రులును, గయయందు గయావళులును, ప్రయాగయందు ప్రాగ్వాలురును ఆదియందొక తెగవారే గాని తరువాత వేర్వేరై చీలిపోయిరఁట. అలహాబాదు పట్టణమున (ప్రయాగయందు) త్రివేణిలో స్నానమాడు యాత్రికులకడ వీరు సుంకము గొనుచుందురు. తొల్లి యక్బరు చక్రవర్తి అలహాబాదు కోట గట్ట పునాదులు త్రివేణీసంగమస్థలికడఁ దీయింప నొక నరబలి యీయనిది ఆకోటగోడ నిలువక పునాదులు జారిపోవుచుండె నఁట. అట్టితఱి నొక ప్రాగ్వాల్ చక్రవర్తికడ కేగి తనవారి త్రివేణియందు స్నానసుంకము శాసింపఁబడుట ప్రతిఫలముగా తన ప్రాణము నాకోటపునాదులందుఁ గోల్పోవ సంసిద్ధుఁడ నని విన్నవించె నఁట. అక్బరు అంగీకరింప నాతఁ డట పడి మడిసెనఁట. ఆ పునాదులు నిలిచి కోటగోడలు లేవ, చక్రవర్తి అట్లె ప్రాగ్వాలుసంఘమునకు త్రివేణీస్నానమొనర్చువారినుండి సుంకముఁగొన పట్టా నిచ్చెనఁట. నాటినుండియు తమ కది హక్కుగ నేర్పడియె నని వచింతురు.

**ప్రాగ్విజయ (పుర) ము**—ఇది యిప్పటి ఆసామునందు జ్యంతియా యనుపేరం బరఁగుచున్నది. మార్కండేయపురాణము 58 అధ్యాయమున దీనిప్రశంస కలదు.

**ప్రాచార్యగోత్రము**—(అగస్త్యుఁడుపగణము చూడుఁడు.)

**ప్రాచీకుఁడు (బుచేయువు)**-(ప్రాచిన్వానుఁడు చూడుఁడు.)

**ప్రాచీనయోగ్యగోత్రము**--(జమదగ్నిభిధాఉపగణము చూడుఁడు.)

**ప్రాచీనబర్హి లేక బర్హిషదుఁడు**—తండ్రి హావిర్ధానుఁడు. తల్లి ధిషణ. ఈతఁడు పెక్కుయజ్ఞము లొనర్చి ప్రాచీనాగ్రకుశలు జగమంతయుఁ గప్పినవాఁడని పేరందినమహనీయుఁడు. భార్య శతధృతి. ఈమెయందు సమానరూప గుణ సాహస లక్షణములు గలవారు పదిమంది సుతులు గల్గిరి. వా రందరు ప్రచేతసులను పేరుగలవారే. అందరు తపస్సంపన్నులే. (ప్రచేతసులు చూడుఁడు.)

**ప్రాచిన్వానుఁడు లేక ప్రాచీకుఁడు లేక బుచేయువు**— అత్రి చంద్ర పూరువంశక్షత్రియుఁడు. తండ్రి మొదటిజనమేజయుఁడు. కుమారుఁడు అంతిసారుఁడను నామాంతరముగల మతిసారుఁడు.

**ప్రాజ్నాటిసీమ**— (పాకనాడు చూ).

**ప్రాజ్ఞుఁడు**— పూరుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి రుచిరాశ్వుఁడు.

**ప్రాటిక్వీ** (Pratique)-వాణిజ్యపరిభాషాపదము. అంటువ్యాధు లీరేవున లేవనియు, ఓడయిటనుండి ఫలానా రేవులకు జని వర్తక మొనర్పవచ్చు ననియు, ఓడకిచ్చెడి యుత్తరువు, లేక అనుమతిపత్రము.

**ప్రాణనాతిస్కులు (ధామకుగురహాజీ)**—వీరు బోధించిన మతమునకు 'ధామకుక్మత'మని పేరయ్యెను హిందూ మహమ్మదీయు మతములందలి వేదాంతతత్త్వసారములం జేర్చి వీ రేకమతతత్త్వముగ బోధించుచుండి రఁట. ప్రాణనాతిస్కునకు బుందేలుండ మేలిన క్షత్రియు ప్రభువులయాదరణ యుండెడి దఁట. వీరు తను దేవాలయములందు మతగ్రంథములనిడి పూజించువారని చెప్పఁబడినది

వీరికి ప్రాణనాతిస్కవైష్ణవు లని వాడుక నామము కలదు. "సమరసవేదు" లని కొందఱనెదరు. సర్వసాధారణముగ నందరు ధామకు లనివాడుచున్నారు. ప్రాణనాతిస్కునకు ధామక్ గురూజీ యని వాడుక యుండెనట.

**ప్రాణవాయువు** (Oxygen) — ఇది మహావాయుమండలియందు ముఖ్యభాగమని చెప్పఁబడిన గాలి. అం దిది ఐదవభాగముగ నుండెడిని. ఊపిరితీయుటలో పీల్చుతఱి లోని కేగినగాలినుండి ఆక్సిజెనుగాలి శరీరమందలి రక్తమును శుభ్రపఱుప నుపయోగపడి, కొంత వఱకు చెడి, కార్బన్‌తో కలసి Carbon-di-oxide గనై బయటికి వచ్చి తిరిగి పరిశుభ్రపడుటకు మహావాయుమండలియందు చేరెడిని. ఆక్సిజెన్‌గాలి లేనియెడల ప్రాణములు శరీరమందు నిలుచుట యుండదు. అగ్ని యురాజదు.

ఆక్సిజెనునందు రంగు, రుచి, వాసన లుండవు. ఒకపాలు ఆక్సిజెనుగాలియు, రెండుపాళ్లు హైడ్రోజెనుగాలియు (Hydrogen gas) కలిసిన ఉదక మయ్యెడిని. ఆక్సిజెను ఆక్సైడు (Oxides) లు చేయుట కితరపదార్థము లందు కలుపుదురు. ఆక్సిజెను, హైడ్రోజెను కలిసిన మండును. Lime light నందిదివాడఁబడును. దీని మంటవేడికి లోహము లతుకుచున్నారు.

**ప్రాణవాయువు (Oxygen) ఊపిరి-గ్రీన్‌స్టఫ్** — ప్రాణవాయువును ఆంగ్లమున ఆక్సిజెన్ అనెదరు. అది ప్రాణులు ఊపిరితీయుటయందు ముఖ్యపదార్థము. అది గాలిలోని ప్రధానభాగముగ వాతావరణమునం దున్నది. అది లేనిది జీవించుట యసంభవము. మనుష్యులు, జంతువులు, పక్షులు, చేఁపలుమొదలగు జలచరములే గాక, చెట్లుగూడ ప్రాణవాయువునేపీల్చును. ఆక్సిజెనునకు వెలుతురు ముఖ్యమని కనిపెట్టఁబడినది. ఆక్సిజెనుగాలి లోనికి పీల్పఁబడి, Carbon అనంబడుగాలితో కలుపఁబడి, పైకి ఊపిరి విడుచుటతో వెడలనంపఁబడుచుండును. ఈకార్బను ఈసందర్భమున వజ్రములు, రాక్షసబొగ్గు, గ్రాఫైటు(సీసములోని నల్లగ్రాయు భాగము)లం గల్గించునదియని వివరించి విడిచెదము గాక. కార్బను వాడుక అవస్థయందు Carbon Dioxide అనఁబడుచుండును. అనఁగా ఆక్సిజెనుతో కార్బనుతో కలిసియున్నస్థితియం దీక్రియ వర్తించునని యెఱుంగునది. ప్రాణులు, మొక్కలు మొదలగున వన్నియు జీవించుటకు మొదలిడినక్షణమునుండియు ఆక్సిజెనును పీల్చుచు, కార్బను డియాక్సైడును పైకి వదలుచుండును. ఈపని మృతినందుదనుక విధియే. ఇది లేకపోవుట Suffocation అని ఆంగ్లమున పేరు.

దీని నిట్లు వదలి సూర్యరశ్మి ప్రాణులు జీవించుటకు ముఖ్యమని తొలుత వివరింపవలసియుండును. దీని ప్రాముఖ్యమునుండియే. ఆంగ్లశాస్త్రవిదులు "No Light, No Life" అనుఉక్తి నేర్పఱచి వాడుచుందురు. చెట్లు ఆక్సిజెనును చాల తక్కువగను, ఆలస్యముగను పీల్చుకొనును. ఇంక చెట్లయందు, అందు ముఖ్యముగ వాటి ఆకులందుఁ గలరంగునకు ఆంగ్లవృక్షశాస్త్రమున "Chlorophyll" అని పేరిడియున్నారు. అంత పోకవృగను, తిరుగుడుగను ఉన్న ఆశబ్దమును డఁగష్టముగనుంట నేమొ. పెక్కుం డ్రాంగ్లేయులు దానిని "Greenstuff" అని డఁదొడఁగిరి. ఈపదార్థము పుట్టకొక్కు లేక కుక్కగొడుగులు (Mushrooms) మొదలగు నథమపుజాతులందుఁదక్క దక్కిన సమస్తములగు చెట్లయందు గ్రీన్‌స్టఫ్ ఉండితీరును. ఇదియె ముఖ్యమైన పదార్థము. ఇట్లయ్యును సూర్యరశ్మియే లేకుండిన నిది చెట్టునకు నిరర్థకమే. ఇంకనుగొందఱు సూర్యరశ్మియె ఈగ్రీన్‌స్టఫ్‌ను చెట్టునందుఁ గల్గించునని యనుచున్నారు. తిరుగ నదియె సూర్యరస్మినుండి చెట్టున కుపయోగముఁ గల్గించుచున్నదనియు ననెదరు.

ఏది ఎట్లైనను చెట్లు కార్బన్‌డిఆక్సైడును పీల్చుకొని, అందలి కార్బను నుపయోగించుకొనుచు, ఆక్సిజనును పైకి వదలివేయుచుండును.

అది ప్రాణవాయువనియు, ప్రాణులకు జీవనాధారమగు ఊపిరికైన వాయు వనియు మున్ను వివరింపఁబడి యున్నదే. ఇట్లు చెట్లుజీవజంతువుల కుపయోగించుట వివరింపఁబడియున్నది. ఇట్టి కార్బను డిఆక్సైడునుండి మొక్కలకుఁగాను కార్బనును లెక్కనజంతుజాలమునకుఁగాను ఆక్సిజెనును వేఱుపఱుపఁగలశక్తియొక్క సూర్యరశ్మి యందేకలదుగాని అన్యత్రగాన రాకున్నది.

**ప్రాపంచిక సాముదాయిక భాష—** భరతదేశవుద్పత్తినిబట్టి కొన్ని సంజ్ఞలు ప్రాపంచికసాముదాయికభాషగ తలంపఁ బడినవి. ఏల యన నట్టిసంజ్ఞలు జగ మంతట నన్నిదేశముల వారిచే నొకేరీతిగ వాడఁబడుచు, గ్రహింపఁబడెడిని. సాదృశ్యముగ ముఖ మడ్డముగఁ ద్రిప్పిన వల దనియు, ఇటునటుఁ ద్రిప్పిన వల్లెయనియు చేయి జాచిన ఇమ్మనియు, హస్తము జూపి ఇటునటు నాడించిన అక్కఱ లేదనియు గుర్తులుగ నెల్లదేశములవారి కొకేరీతిని అర్థము గాక పోదు. గాన నిట్టివిప్రాపంచికభాషగా నెఱింగిరి. బాలురకుఁ గూడ తోఁచెడిని.

కాని,యధికారమదాంధత మైశ్వర్యమదాంధతచే నాక్రమింపఁబడిన చిత్తములుగల కొందఱు తమభాషయే లోకభాష మున్ముందు కాఁగలదని యాశించుచుండువారు కలరు. ఐరోపావారు లాటిన్భాషను,ఆంగ్లేయులుఆంగ్లభాషను, భారతీయులు సంస్కృతభాష ౦ ఇట్లె వాంఛించుట హాస్యాస్పదము. అమెరికావారు తమదేశముల వాడుకనందున్న రీతిభాషల నిట్లె నభిలషించుట యెన్నటికిని జరుగని పనియే. బద్ధకముకల వారు వ్యాకరణరహితముగ భాషయుండిన బాగుండునని (సులభమని) తలంచినట్లె ఉండెడిని.

ఇటీవలి లెక్కించుటలమేరకు ఐరోపా భాష లేడనియు, అవి అఱువదికోట్ల జనులచే (౬౦౦ మిలియనులు) వాడఁబడుచున్నదని తెలిసెడిని. అందాంగ్లభాష పదునేడుకోట్లజనులును జర్మను పన్రెండు కోట్లును, రష్యను పది కోట్లును, ఫ్రెంచి ఏడుకోట్లును, స్పానిష్ ఐదుకోట్ల ఏబది లక్షలును, ఇటాలియను నైదుకోట్ల ఏఁబదిలక్షలును, పోర్చుగీసు మూఁడుకోట్లజనులును మాటలాడువా రని తెలియుచున్నది.

సగటున ప్రపంచ మంతటను పదునెన్మిది వందల మిలియనులు, లేక ౧౮౦ కోట్లజనులు (మాత్రమే) కలరనియు, వారు మాట్లాడునవి ౩౮౨౪ భాషలనియు, పాశ్చాత్యులు అంచనా వేసిరి కాని ఇందెంత నిజము కలదో పరిశీలన జరుగవలసియే యుండును.

**ప్రాణహితానది** వింధ్యపాదమున జనించు వరదానదియు,వైనగంగయు నొకటితో నొకటి కలిసి ప్రాణహితానది యనంబరఁగుచు మధ్యరాష్ట్రములగుండా ప్రవహించి గోదావరీ నదియందు సంగమించును.

**ప్రాణాత్మవాదిమతము-** దీనికి హిరణ్యగర్భమత మనియు వాడుక గలదు. ఇది చార్వాకమతముతో సంబంధించినమతము. దానికిని దీనికిని గల భేద మొక్క యాత్మనిర్వచనమునందు కలదు. వీరు చార్వాకులవలె ఇంద్రియ యోగమె ఆత్మయని గాని, జీవించుట ఇంద్రియముల యధీనమందుండు నని గాని, లేక స్థూలశరీరమే ఆత్మ యనిగాని, అంగీకరింపక ప్రాణము, లేక ఆత్మ యనంబడునది ఇంద్రియములకన్నను, శరీరముకన్నను వేఱుగ శరీరమునందుండునని యనెదరు. నిద్రించుతఱి నింద్రియములు లేకయే(అనఁగా నింద్రియసంబంధము లేకయే) ప్రాణము వేఱుగ నుంట, జీవించుట, సంభవించుచున్నది.గానశరీరేంద్రియములకును, ఆత్మకును వేరువేరుగ స్థితి కలదనియు, మృతియందు శరీరేంద్రియముల వలెనె ఆత్మయు

నశించుననియు వీరిసిద్ధాంతము. తక్కిన వన్నియు చార్వాకమతమునుండియె గ్రహింపఁబడినవి.

ఈమతకర్త హిరణ్యగర్భుఁడని చెప్పఁబడినది.

(చార్వాక మతము, దేహాత్మవాది మతము, ఇంద్రియాత్మవాదిమతము చూడుఁడు).

**ప్రాణాయామము (యోగము)**—
౧ పూరక మనియు, ౨ కుంభక మనియు, ౩ రేచక మనియు త్రివిధముగ నుండి, మూఁడును గలిసినదియె ప్రాణాయామ మనిపించుకొనును. వాయుధారణము (ధరింపఁబడిన వాయువు) శరీరములోన నంతశ్శుద్ధిని గలిగించుంగాన దృఢ శరీరము ఏర్పడును.

పూరక రేచక కుంభకము లగుప్రాణాయామమే యోగాభ్యాసమున ప్రధాన మని తోఁచెడిని. వీట్ల కాలపరిమాణాదులు పలువిధములుగను, ఎవ్వరెవ్వరిశరీరస్థితి కనుకూలించునటుల వారివారికిం గుదురునట్లును తెలియఁగలదు. గాన దానిని అసలుశాస్త్రగ్రంథములకును అభ్యాసానుభవమునకును వదలి, ప్రాణాయామవిధానమందలి యంతర్భేదములను వివరింతుము గాక.

౧ పూరకము- వాయువును లోనికి పీల్చుటకు పూరకమని పేరు. ఇది నాసికారంధ్రము గుండ పీల్చవలయును. పూరక మొకేవిధము.

౨ కుంభకము- ఇం దష్టభేదములు కలవు. ఒక్కొకదానియం దింకను అంతర్భేదములు కలవు.

(౧) సహితము-ఇది యిరుతెరంగులు.నిర్గర్భ సహిత కుంభక మనియు, సగర్భసహిత కుంభక మనియు ద్వివిధముగ నున్నది.

(౨) సూర్యభేదకుంభకము.

(౩) ఉజ్జయీకుంభకము

(౪) శీతలము- ఇది శీతలకుంభక మనియు, అవాంతరమున సీత్కారికుంభక మనియు భేదములు రెండుగ నుండును.

(౫) భస్త్రికకుంభకము.

(౬) భ్రామరీకుంభకము- ఇందు ఏకాదశావస్థలు (దశనామములు) కలవు.

౧ చిణిచిణినాదావస్థ, ౨ వంశనాదావస్థ, ౩ మేఘగర్జితనాదావస్థ, ౪ భ్రామరీనాదావస్థ, ౫ ఘంటానాదావస్థ,౬ భేరీనాదావస్థ,౭ మృదంగనాదావస్థ, ౮ దుందుభినాదావస్థ, ౯ అనాహతనాదావస్థ, ౧౦ మహానాదా (ధ్వని) వస్థ. వీట్లకు దశనాదము లందురు. (దశనాదములు చూడుఁడు.) ౧౧ జ్యోతిర్దర్శనావస్థ.

(౭) మూర్ఛాకుంభకము- ఇది మూర్ఛాకుంభక మనియు, ప్లావినీకుంభక మనియు ద్వివిధము.

(౮) కేవలకుంభకము. ఇది ఒకేవిధము.

౩ రేచకము-వాయువును పైకి నాసికారంధ్రముగుండా వదలివేయుట. (ఒకేవిధము.)

**ప్రాణాయామము (అభ్యాసము)**—
వాయుధారణమునకు ప్రాణాయామ మనిపేరు వాయువును లోనికిం బీల్చి లోన నంతశ్శుద్ధిగావించి పైకి వదలుటను "వాయుధారణ" మనియు, ప్రాణాయామ మనియు నందురు. ఇది యోగశాస్త్రమునకుఁ జెందినక్రియ. అష్టాంగయోగములలో నొకటి. ప్రాణాయామము చిత్తస్థైర్యము నొసంగునది అంతశ్శుద్ధిగల్గించి శరీరబలారోగ్యములను దృఢపఱచును. ఇది పూరకము, కుంభకము, రేచకము నను త్రివిధక్రియలచేఁ దనరారునది.

ఎడమముక్కు రంధ్రముగుండా నడుచు శ్వాసమునకు చంద్రస్వరమనియు, కుడిముక్కు రంధ్రముగుండా నడుచు శ్వాసమునకు సూర్యస్వర మనియుఁ బేర్లు కలవు. రెండు

ముక్కు రంధ్రములగుండా నడుచు స్వర మగ్ని స్వర మనంబడును. అగ్ని స్వరము సూర్య చంద్రస్వరముల కాధార మనియు, కామరూప ధారిగ వృద్ధిగల్గించు ననియుఁ జెప్పఁబడినది. యోగాభ్యాసి ప్రాణాయామ మొనర్చుతతి నడుము గట్టిగ బిగించుకొని, పద్మాసనమువైచి, (మతము వైచుకొని) కూర్చుండి, సహజమగు తనసత్తువుకొలఁది పూరక, కుంభక, రేచకములు నెఱప నగునని యోగాభ్యాసపరులగు ప్రాణాయామవిధానవేత్తలు నుడివిరి. (పూరక కుంభక రేచకములు చూడుఁడు.)

యోగులు ప్రాణాయామముః ప్రాణవాయువును దానిసహజగతినుండి మరలించి విపరీతగతి గల్గించి నిరోధించి యుపయోగించుకొనుటకని నుడివియున్నారు. పాతంజల యోగ శాస్త్రమున "యోగ శ్చిత్తవృత్తినిరోధః." అనఁగా యోగము చిత్తవృత్తిని నిరోధించునని పాతంజలయోగసూత్రములందుఁ జెప్పఁబడెను. అనఁగా చిత్తస్థైర్య మని యర్థము. అట్టియోగమునకు ప్రధానాంగమగు ప్రాణాయామమును గూర్చి యిట వివరింతుము.

ప్రాణాయామములు పూరక, కుంభక, రేచకములుకల్పినది యొకటియగును. అట్టివిదినమున కెనుబది చొప్పున నభ్యసింపవలయు నని అనుభవజ్ఞులందురు. ప్రాణాయామాభ్యాస మొనర్ప ఉదయము, మధ్యాహ్నము, సాయంతనము, అర్ధరాత్రము అర్హ కాలములని చెప్పఁబడినది. సూర్యోదయమునకు పూర్వము ఒకటిన్నర గంటయు, పరమందు గంటన్నరయుఁగల్పి మూఁడు గంట లర్హకాలము. ఇటులనే సాయంతనమును మూఁడుగఁటలకాలము ప్రాణాయామకాలము. మధ్యాహ్న కాలములందు, అర్ధరాత్రములందు పదిగంటలన్నరమొదలు ఒంటిగంటన్నరవఱకు (మూఁడేసిగంటలకాలము) అర్హకాల మని చెప్పఁబడినది. కాన నాల్గు కాలములందు, కాలమున నెనుబదిచొప్పున దినమునకు మున్నూటయిఱువది ప్రాణాయామములు చేయ నగును.

ప్రాణాయామము పూరక, కుంభక, రేచకాత్మకమని మున్ను వివరింపఁ బడినది. వాట్లను గూర్చి వేర్వేఱు తావుల వివరింపఁబడును. ఆమూఁడును ఆచరించుటకు ముక్కు మూయ వలసియుండును. యోగశాస్త్రమునదానివిధాన మిట్లు చెప్పఁబడినది. స్త్రీసంపర్కము లేని బ్రహ్మచారులు, యతులు కుడిచేతిబొటనవ్రేలితో కుడిముక్కును, అనామిక, కనిష్ఠికలతో నెడమ ముక్కును రంధ్రముల మూయుచు, తర్జనియు మధ్యమయు (వ్రేళ్ళు) ముక్కునకు తగులకుండ ముడిచియుంచవలె ననియు, గృహస్థులు, వానప్రస్థులు కుడిచేతిబొటనవ్రేలితో కుడిముక్కును, తక్కిన నాల్గువ్రేళ్ళతో ఎడమ ముక్కును మూయవలె నని చెప్పఁబడినది.

యోగశాస్త్రమున ప్రాణాయామము కనిష్ఠ ప్రాణాయామ మనియు, మధ్యమప్రాణాయామ మనియు, ఉత్తమ ప్రాణాయామ మనియు మూఁడు తెఱఁగులుగఁ జెప్పఁబడినది. కనిష్ఠ ప్రాణాయామమున పూరకము ఎన్మిదియు, కుంభకము ముప్పదిరెండును, రేచకము పదునాఱును సెకెండ్లకాల మని చెప్పఁబడినది. మధ్యమప్రాణాయామమున పూరకము పండ్రెండును, కుంభకము నలువదియెన్మిదియు, రేచకము ఇరువదినాల్గును సెకెండ్లకాల మనియు, ఉత్తమప్రాణాయామమున పూరకము పదునాఱును, కుంభకము అఱువదిఎన్మిదియు, రేచకము ముప్పదిరెండును సెకెండ్లకాల మని చెప్పఁబడినది. ఈ సందర్భమున ఇట నొక్కసంగతి వివరింపవలసియుండును. శాస్త్రగ్రంథములందు సెకెండ్లువివరింపఁబ

డలేదు. ఓంకారమును మందస్వరమున నుచ్చరింపఁదగిన కాలమును మాత్ర యనిరి. మఱికొన్ని గ్రంథములందు మోఁకాలునుజుట్టి చేయిద్రిప్పి చిటికె వేయఁదగిన కాలము మాత్రి యని చెప్పఁబడినది. పరిశీలించితిమేని ఆ మాత్రియు సెకెండును నొక్కటే యగునని తేలఁగలదు.

ప్రాణాయామమునందలి కుంభకమును పండ్రెండుమినిట్ల నలువదియెన్మిది సెకెండ్లకాలము వఱకు (అనఁగా ఉత్తమప్రాణాయామకుంభక కాలమునకు పండ్రెండురెట్లకాలము) కుంభింపఁ గల్గిన, నది ప్రత్యాహారావస్థ యనియు, అట్టివి ౧౨రెట్లగునేని (అనఁగా గం౨ మి౩౩ సెక.౩౬ కాలమువఱకు) కుంభించియుండఁ గల్గుతఱి నది ధారణస్థితి యగు ననియు, అట్టి ధారణకాలములు పండ్రెండగునేని (అనఁగా గం ౩౦, మి౪౩, సెక.౧౨ కుంభించి యుండఁగల్గినచో) అది ధ్యానావస్థయగు ననియు, అట్టిధ్యానకాలములు పండ్రెండగునేని(అనఁగా దినములు ౧౫, గంటలు ౮, మినిట్లు౩౮, సెకండ్లు ౨౪కాలము కుంభించి యుండఁగల్గినతఱి) అది సమాధిస్థితి యగుననియు,అదియే పూర్ణయోగసిద్ధి యనియు యోగశాస్త్రవేత్తలు నుడువుచుందురు.

ప్రాణాయామ మభ్యసించుతఱి పూరకక్రియయందు మూలబంధమును, కుంభకక్రియయందు జాలంధరబంధమును, రేచకక్రియయందు ఒడ్యాణబంధమును జెప్పఁబడినవి. ఏలయన మూలబంధమువలన లోపలివాయువు అధోముఖమున పోకుండ నాఁపుటయును, జాలంధరబంధమున లోపలివాయువు కంఠము దాఁటి పైకిపోకుండ నాఁపుటయును, ఒడ్యాణబంధమున లోపలివాయు వంతయు నిశ్శేషముగ వెలువడి పైకి వచ్చుటయు జరుగును గాన ఈబంధములతో నాచరించుట ముఖ్యమని చెప్పఁబడినది.

ప్రాణాయామాభ్యాసకాలమునకనిష్ఠప్రాణాయామము సిద్ధిగల్గిన, మేన చెమట పట్టుటయు, మధ్యమప్రాణాయామముసిద్ధిగల్గిన మేను వడఁకి కంపము గల్గుటయు, ఉత్తమప్రాణాయామము సిద్ధిగల్గిన ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమునఁ జేరి భూమిపైనుండి లేచుటయు, ఉత్సహించి కప్పగంతులవలె శరీరము దూఁకునట్లు చలనము గల్గుటయు లక్షణములని చెప్పఁబడినది. అట్టి చెమటను గుడ్డతో నొత్తుటగాని, విసరుటగాని, గాలితగులున ట్లుండుటగాని తగ దనియు, అది నిస్త్రాణ గల్గించి చాల చెడుగుగఁ బరిణమించు ననియుఁ జెప్పఁబడినది. ప్రాణాయామాభ్యాసకాలమున నెయ్యి, పాలు కలిసిన యన్నము భుజించుచుండవలె ననియు, మార్గగమనము, శ్రమ, అతిప్రసంగము, శరీరకష్టము, ఉపవాసముండుట, స్త్రీసంపర్కము తప్పక వర్జింపవలె ననియు, తగని వనియుఁ జెప్పఁబడినది.

**ప్రాణాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన యాసనములలో నొకటి. కుడిమడమ నెడమతొడపైని, కుడిచేతిని కుడిమోఁకాలిపైని ఉంచి, ఎడమఅఱచేతిని ఎడమప్రక్కను భూమి నానించి, ఎడమమోఁకాలి నెడమభుజముపై నిడి, ఎడమమడమను లింగస్థానమున నానించి, వ్రేళ్ళను భూమి నానించి కుడివైపున కొరగియుండుట ప్రాణాసన మనంబడును.

**ప్రాణీ-ప్రణహిత లేక ప్రాణహితానది**—వార్ధా, వెయిన్‌గంగల సంయుక్త ప్రవాహనదీభాగమునకు పేరు. దీనికి ప్రణీతానది యనియు వాడుక యుండెను. దీనింగూర్చిన ప్రశంసలు అగ్నిపురాణమున ౨౧౦ యందును, పద్మపురాణమున ఉత్తరఖండము,౬౨యందును గలదు. ఇది గోదావరీనదిలో సంగమించు నది. సంగమమునుగూర్చి బ్రహ్మపురాణమున ౧౬౧ అధ్యాయమున ప్రశంసింపఁ బడినది.

**ప్రాణుఁడు**—తండ్రి విధాత. తల్లి నియతి. కుమారుఁడు వేదశిరస్సు.

**ప్రాణులు సప్తవిధములు**—౧ పుణ్యప్రాణులు (దేవదానవవిద్యాధరగంధర్వ యక్షకిన్నరకింపురుష సిద్ధ సాధ్యాప్సరోభూత పిశాచ జాతులు), ౨ మిశ్రప్రాణులు (మానవులు), పాపప్రాణులు ఐదు తెఱఁగులు. ౩ వృక్షజాతులు. (తరు గుల్మ లతాదులు), ౪ జలచర జాతులు (మత్స్యకూర్మతిమితిమింగిలాదులు) ౫ పశుజాతులు (చతుష్పాద జంతువులు మొదలగునవి) ౬ పక్షిజాతులు (రెక్కలుగల్గి యెగురునవి), ౭ క్రిమిజాతులు (చిన్న చిన్న పురుగులు మొదలగు సమస్తజంతువులు).

**ప్రాతిధేయగోత్రము**- (నిధ్రువగణము చూడుఁడు).

**ప్రాప్తి**- జరాసంధునికుమార్తె. తోఁబుట్టువు అస్తి. ప్రాప్తి కంసుని రెండవభార్య. (జరాసంధుఁడు మగధరాజు. శ్రీకృష్ణునివైరి. భీమసేనునిచే నిహతుఁడైనవాఁడు).

**ప్రాప్తిసిద్ధి**— (సిద్ధి-సిద్ధులు చూడుఁడు).

**ప్రాభాకరమతము**- దీనిని ఆనందమయకోశాత్మకమత మని కొందఱు వాడియున్నారు. ఏలయన ఆనందమయకోశమే యాత్మ యని ఈమతాభిప్రాయము. ఇది జైమిని రచించిన పూర్వమీమాంసామతము ననుసరించి యున్న మతము. దీనిని నైయాయికమత మనుటయుఁ గలదు.

ఈమతమునకు కర్త ప్రాభాకరుఁడు. ఈయన భాట్టమతకర్తయొక్క శిష్యులలో నొకఁడు. (భాట్టమతము చూడుఁడు. పూర్వమీమాంసామతము చూడుఁడు). ఈమతమునందు ఆత్మ నైసర్గికముగ జడస్వభావమునం దుండును. మనస్సంయోగమున జ్ఞానవంత మగునని చెప్పఁబడినది. తోడనే ఆత్మ చేతన మగునని చెప్పఁబడినది. బుద్ధి విజ్ఞానమయకోశమునం దుండునదిగాఁ జెప్పఁబడినది. బుద్ధి ఆత్మకు గుణమై యుండునదిగాఁ జెప్పఁబడినది.

వివేకము లేనివారికి ప్రతీతియు కలుగనియట్లు నిద్రావస్థయం దుండుతఱి నాత్మకు బుద్ధిగుణము లేక జ్ఞాన ముండదని చెప్పఁబడినది. కావుననే ఆత్మ బుద్ధి యనెడిగుణయుక్తము గాకుండినతఱి జడమని పోల్పఁబడినది. ఇందువలననే ఆనందమయకోశ మనంబడు నాత్మకు జ్ఞానము గల్గించుగుణము బుద్ధియే యని ఈమతసిద్ధాంతము. బుద్ధి ఆత్మకు జ్ఞానగుణ మైయుంట అతిగుప్తముగ నుండుకతన వివేక మెఱుఁగనివారి కగోచరముగ నుండెడిని. ఆత్మజ్ఞానము ప్రాణియందు నిత్యజ్ఞానముగ నుండలేదనియు, అది అనిత్యముగ నైయున్నదనియుఁ జెప్పఁబడినది.

ఆత్మతో మనస్సంయోగమునఁ గల్గెడి జ్ఞానమునందే ధర్మాధర్మవివేకము, రాగద్వేషములు, సుఖదుఃఖములు మొదలగున వన్నియుఁ జేరియుండునని ఈమతాభిప్రాయము. ఇచ్ఛలు, ప్రయత్నములు, అభిప్రాయభేదములు కూడ ఆత్మకు మనస్సంయోగమున సంభవించుచేత నావస్థకుఁ జెందినవే యని మతాభిప్రాయము.

ఆత్మ శూన్యము కాదని యీమతమునందు సిద్ధాంతము చేయఁబడినది. ఏది అనుభవించునో అది ఆత్మగాన ఒకరిని (అనఁగా వారియాత్మను) "శూన్యావస్థ ననుభవించితివా?" యని యడిగినచో లేదనిన ఆయాత్మ శూన్యము కాదని సిద్ధించుచునే యున్నదనియు, "శూన్యావస్థ ననుభవించితి"నని ఉత్తర మైనచో శూన్యత ననుభవించినయాత్మ శూన్యమునుండి వేఱైనదని తేలుచునే యున్నదనియు, ఎట్లైనను ఆత్మ వేఱుగనే కన్పించుట ఆత్మ శూన్యము కాదని యీమతసిద్ధాంతము.

ప్రభాకరాచార్యుని దేశికుఁడగు భాట్టునకు వార్తికకారుఁ డనియు వాడుక కలదు.

**ప్రాయణ గోత్రము**— (విష్ణువృద్ధ ఉపగణము చూడుఁడు).

**ప్రాయోపవేశము** — తనకు మృతి రానున్నదని యెఱిఁగి దానికి సిద్ధమై దర్భశయ్యపై శయనించి ఎదురుచూచుచుండుట. పరీక్షిత్తు ప్రాయోపవేశ మొనర్చెను.

**ప్రారబ్ధములు మూఁడువిధములు**

౧ ఇచ్ఛాప్రారబ్ధము- తాను ప్రయత్నించి చేసిన కార్యఫలితమును తా ననుభవింపనగుట.

౨ అనిచ్ఛాప్రారబ్ధము- అప్రయత్నముగ తా నొనర్పని కార్యఫలితము తనకు నిర్బంధముగ సిద్ధించి తా ననుభవింప నగుట.

౩ పరేచ్ఛాప్రారబ్ధము- అన్యుల ప్రయత్నమూలమునఁ గల్గినఫలిత మన్యులకుఁ గాక తనకు సిద్ధించి తా ననుభవింప నగుట.

ఈప్రయత్నములు చేయుటలు, ఫలితములు సత్ఫలితములుగఁ గాని దుష్ఫలితములుగఁ గాని యుండునని యెఱుంగునది.

**ప్రారోహి లేక ప్రాలోహి గోత్రము**— (పరాశరగణము చూడుఁడు.)

**ప్రార్థనాసనము**— యోగశాస్త్రమునఁ జెప్పఁబడిన ఆసనములలో నొకటి. ధీరాసనమునం గూర్చుండి మోఁకాళ్ళపై నిలిచి చేతులను హృదయమందుఁ జేర్చుట (జోడించుట) ప్రార్థనాసన మనంబడును. ఇందువలన కుండలినీప్రబోధ మగునని చెప్పఁబడినది.

**ప్రాశ్రోదరి గోత్రము**-(కుశికగణముచూ.)

**ప్రావర్యగోత్రము**-(నిధ్రువగణముచూ.)

**ప్రాలి గోత్రము** — (పరాశరగణము చూడుఁడు.)

**ప్రాలంబాయన గోత్రము**— (ఉపమన్యుగణము చూడుఁడు.)

**ప్రార్థితస్వప్నములు**—(స్వప్నశాస్త్రములు చూడుఁడు.)

**ప్రాసము**— పద్యములకు యతిప్రాసములు ముఖ్యములు. (యతులు చూడుఁడు) పద్యమందలి ప్రతిచరణముయొక్క మొదటి యక్షరస్థానమును, ఆయాపద్యములకు విధింపఁబడిన వేరు అక్షరస్థానములు యతిస్థానములని చెప్పఁబడినవి. అటులనే రెండవయక్షరస్థానములు ప్రాసములని చెప్పఁబడినవి. లాక్షణికులు ప్రాసముల నాఱుభేదము లనిరి.

౧ సుకరప్రాసము- సర్వసాధారణముగ నాల్గుపాదములందు రెండవయక్షరము లేకాక్షరములుగను, వాట్లపై గదియించి యుండు అచ్చులు మైత్రి గలవిగను (అనఁగా అ, ఆ, హ, య, ఐ, ఔ లు మిత్రములుగను, ఇ, ఈ, ఎ, ఏ, వట్రుసుడియు మిత్రములుగను, ఉ, ఊ, ఒ, ఓ లు మిత్రములుగను నెఱుంగఁ జెప్పఁబడినది.) ఉండి సుకరముగఁ గుదురునవిగ నుండిన సుకరప్రాస మనంబడును.

౨ దుష్కరప్రాసము- కటువుగను, సులభముగఁ గుదురన ట్లుండనిరీతి యక్షరములుగను విసర్గపూర్వకముగ నుండుప్రాసలు మొదలగునవి దుష్కరప్రాసము లని చెప్పఁబడినది.

౩ అనుప్రాసము - రేఫయుక్తాక్షరములు మొదలగునవి చెప్పిన అనుప్రాస మనంబడును.

౪ ద్విప్రాసము - ప్రాసస్థానాక్షరము, తర్వాతయక్షరము గూడ రెండేసియక్షరములు నాల్గుచరణములం దొకేరీతి జెప్పిన ద్విప్రాస మనఁబడును.

౫ త్రిప్రాసము - ప్రాసస్థానాక్షరము, తర్వాతి రెండక్షరములు గూడ నొకేరీతిని

మూఁడేసియక్షరముల నాల్గుచరణములందుఁ జెప్పిన త్రిప్రాస మనంబడును.

౬ అంత్యప్రాసము- రెండవ ప్రాసాక్షరములు విధిగాఁ జెప్పి చరణాంతాక్షరములు ప్రాసలుగనె భావించి నాల్గుచరణములం జెప్పిన అంత్యప్రాస మనంబడును.

**ప్రాసములు ౬ (షట్ప్రాసములు)**- ౧ సుకరము, ౨ దుష్కరము, ౩ అనుప్రాసము, ౪ అంత్యప్రాసము, ౫ ద్విప్రాసము, ౬ త్రిప్రాసము.

**ప్రాసాదవాసిన్యాయము**- వా రామేడలో నున్నా రనుటలో సర్వదా ఆమేడలో నున్నారని యర్థము కాదు. ఆమేడయున్న ఇంటియం దుఁదురని భావము.

**ప్రి-ఆదమిటీజనులు**— క్రైస్తవమతధర్మము మేరకు ఆదాము, ఈవులు సృష్టియందాదిమజన్ములని చెప్పఁబడిరి. అనఁగా తొలుత సృష్టింపఁబడినవారని భావము. దీనిని సంశయించువారును వారియందు కొందఱు లేకపోలేదు. అంతకుపూర్వమును ప్రపంచమున జను లుండిరనియు, వారిని Pre Adamites అనుట సమంజస మనియు తలంచెడివారు కొందఱుండి రఁట. వారిచే ఆదము ఈవులతో ప్రారంభమైనది క్రొత్తసృష్టి యనియు, అదివఱ కుండినవారి స్థానమున క్రొత్తసృష్టివారు కల్గిరనియుఁ జెప్పఁబడెనఁట. ఈవాదము క్రీ. వె. ౧౫౯౨-౧౬౭౬ కాలమువాఁ డగు Izac de la Peyrere గారిచే నుద్ధరింపఁబడి వారి అనుచరవర్గమువారికి 'ప్రి-ఆదమిటీ'లనిపేరు వచ్చెనని చెప్పఁబడినది.

**ప్రిజూడీస్ (Prejudice)** వాణిజ్యపరిభాషాపదము. పూర్వసంబంధ మని యర్థము. ఉత్తరప్రత్యుత్తరములలో పూర్వసంబంధ మగు తకరారులకు ఈవ్రాత బాధింపకుండునటుల దర్మిలా ఉత్తరములలో without prejudice అని వ్రాయుదురు. వాట్లకు పూర్వము చెల్లింపవలసినదానికి Pre Pre-ferencial అందురు.

**ప్రిన్సాఫ్ వేల్సు పదవి** — ఇది ఇంగ్లాండు దేశపు రాజ్యకార్య సంబంధమున భరతదేశపు యువరాజుపదవిం బోలినపదవి. భావిక్షితిపతిపదవికి అర్హతఁ గల్గియున్నవారి కీపదవినిచ్చి వేల్సుదేశపుసామంతునిజేయుట క్రీ. వె. ౧౩౦౧ నుండియు నాచారమై పద్ధతిగ నడుచుచున్నది. అప్పటి భూనాథుండగు ఒకటవఎడ్వర్డు భూపతి అప్పటికి తన జ్యేష్ఠసుతుండుగ నుండిన ఎడ్వర్డు అనుపేరుగల రాకొమరున కీపదవి నొసంగి, వేల్సు సామంతరాజ్యమున కధిపతిగ బిరుద మొసంగెను. ఆయనయే యీపదవినందిన మొదటి రాజపుత్రుఁ డఁట. నేటికిని నట్లె జరుగుచు నడుచుచున్నది.

**ప్రిఫరెన్సు (Preference)**—వాణిజ్యపరిభాషాపదము. దీనికి పలువిధముల ఉపయోగార్థములు కలవు. నియమితమగు వడ్డి కలిగి, తక్కినసామాన్యపత్రములపై డివిడెండు బయుటపెట్టఁబడకపూర్వము చెల్లింపఁబడవలసినపత్రములకు Preference Bonds అనిపేరు. ఇట్టివాటాలకు Preference Share లేక Preference Stock అనిపేరు. Ordinary అప్పులబాకీలు తీర్పకపూర్వము, తనఋణపత్రముల అప్పులను తీర్మానము చేయుటకు ఒక దివాలాఆసామీ ఆస్తులను వినియోగించుటకు Preferencial payments అనిపేరు.

**ప్రిమిల్లెన్మయిలిజమ్**— Premillenmailism నిత్యమగు శాంతియు సత్యమగు నానందమును పొందుకాలము క్రీస్తు రెండవమాఱు భూలోకమున నవతరించునపుడు పొందఁగలమను నమ్మకము.

**ప్రీమేజి** (Primage)--వాణిజ్యపరిభాషా పదము. ఓడయందు వేయు సామానుల Freight కు కలిపి తీసికొను పన్ను. ఇది ఓడయజమానికి Chartering, వార్ఫేజి, Lighing :Pilotage మొదలగు వ్యయములకుఁగాను నియ్యఁబడునది. ఓడపైనుండి సరకులను దింపుటకు ముందు, ఓడయందలి సరకుల విలువను నమూదు చేసుకొను లెక్కకు Prime Entry అనెదరు.

**ప్రియంవద**--ఈపేరుగలవారు పెక్కండ్రు గలరు. నహుషుని భార్య పేరు ప్రియంవద. శకుంతల చెలికత్తియ వేఱొకప్రియంవద.

**ప్రిష్టచంపచంపాదేశము**-ఇప్పటి బీహారు దేశమున పేరుండెనని వాడుక గలదు. ఇది బౌద్ధనామము.

**ప్రిస్క్రిప్షన్**—(ఆంగ్లవైద్యమున రోగముల కౌషధనిర్ణయవిధానము చూడుఁడు.)

**ప్రీతి లేక హవిర్భుక్కు**--పులస్త్యుని భార్య. నామాంతరము హవిర్భుక్కు.

**ప్రీతితో పెట్టునది పిడికెడైనను చాలునన్నట్లు**—(ఆంధ్రలోకోక్తి.)

**ప్రీతిలేనికూడు పిండాకూడువంటి ది**-(ఆంధ్రలోకోక్తి.)

**ప్రీతిద్వితీయ**-- ఆశ్వయుజశుద్ధద్వితీయ. పర్వదినము. (పండుగలు, పర్వములు, వ్రతదినములు చూడుఁడు.)

**ప్రీతోద్ధారిణీనది**- ఇప్పుడు దీనిని పైరీ యనుచున్నారు. రాజు అనుతావున మహానది యందుఁ జేరుకొనును.

**ప్రీమియమ్** (Premium)—వాణిజ్య పరిభాషయందు ఒకవ్యవహారమున వాయిదాల వెంబడి చెల్లింపవలసిన మూల్యములలో నొకవాయిదామూల్యమున కీపేరు వర్తించును.

**ప్రివీ కౌన్సిల్ సభ**—ఇంగ్లాండుభూపతియు, భరతదేశపుచక్రవర్తియు నగు నరపాలుని యాలోచనాసభ. భరతదేశపు ఉన్నతన్యాయస్థానములనుండి అప్పీళ్ళు ప్రివీకౌన్సిలునకు చేయఁబడుచుంట సర్వసాధారణమైన సంగతిగనే యున్నది. అట్టి అప్పీళ్ళయందలి న్యాయాన్యాయముల నారసి తీర్మానించుటకు భూపతికి సలహాలనిచ్చు నందలి ప్రత్యేకసభకు 'జ్యూడీషియల్ కమిటి ఆఫ్ ది ప్రివీకౌన్సిల్' అనెదరు.

ఇప్పటి బ్రిటీషుప్రివీకౌన్సిలుచరిత్ర వేర్వేఱు కాలములందు వేర్వేఱు విధములుగ నడిచెను. మూఁడవహెన్రీ నరపాలుని కాలమున నది Barons యొక్క అధికారపుసభ నుండె నఁట. అప్పుడు Magnum Concilium అనంబడెను. ఒకటవఎడ్వర్డు భూపాలుని కాలమున భూపతికి కేవలము వశవర్తిగనై Royal Council గా నుండె నఁట. వేఱొకప్పుడు అనఁగా రెండవ ఎడ్వర్డుభూపతి కాలమున Concilium Continuum Secretum లేక Privatum గా నుండెడిది. ఎన్మిదవ హెన్రీ భూపతికాలమున హౌస్ ఆఫ్ లార్డ్సు అనంబడెనఁట. అంతనుక నీసభ బ్రిటీషుపార్లమెంటు లోనఁగాని, వెలుపలఁగాని కూడ జరుగుచుండు నాచార ముండునది హౌస్ ఆఫ్ లార్డ్సుగా మాఱిపోయినది. పార్లమెంటులోన జరుగు సభగా నెఱుంగునది.

పార్లమెంటు వెలుపల గూడునదిగా నున్న సభ పెద్ద రెబిలియనుతో నంతరించెనని యనుకొనఁబడినదికాని అట్లు కాలేదు. రెండవ రిఛర్డు ప్రభువుకాలమున ప్రివీ కౌన్సిల్ అనఁబరఁగె నఁట. కాని క్రీ. శ. ౧౪౦౫ నకు పిదప దీనింగూర్చి ఏమియుఁ దెలియకుండెను.

ఏడవ హెన్రీభూపతికాలపుకడను దీని కొక అగ్రాసనాధిపతి యుండినట్లు తెలియు చున్నది. కాని ఎన్మిదవ హెన్రీ నృపతికాలమునం దిది

చక్కని ఆర్గనైజేషనుస్థితి నందెను. అనఁగా క్రీ. వె. ౧౫౮౦ నుండి చక్కఁగ పనిచేయ నారంభించినది. తొలుత పదునాలు పదునేడుశతాబ్దములం దీసంస్థద్వివిధకార్యాచరణము లొనర్చుచుండెడిది. సోమ, మంగళ, గురు,శుక్రవారములందు కౌన్సిల్ బోర్డు అనంబడుతావునఁ గూడి, రాజకీయవ్యవహారముల నాలోచించి, నరపాలునకు సలహా నిచ్చుచుండుటయు, బుధ, శుక్రవారములందు స్టార్ ఛేంబరు అనంబడు తావునఁ గూడి న్యాయతీర్మాన వ్యవహారములను విచారించి న్యాయమిచ్చుతీర్మానమునీయనరపాలునకు సలహా నిచ్చుచుంటయు నైయుండెను. ఈసంస్థ యొనర్చిన ఇతరవ్యవహారములతో నీవ్యాసమునకుఁ బనిలేదు. క్రీ. వె. ౧౬౪౧ లో లాంగు పార్లమెంటు ప్రివీకౌన్సిలుయొక్క కౌన్సిలు బోర్డుకార్యములను రద్దుపఱచి దూర మొనర్చెను. గాన నంతటినుండియు సామ్రాజ్యమున నిది మహోన్నతన్యాయస్థానముగ నిలుపఁబడెను. ఇట్లనుటవలన నిది స్వతంత్రముగ న్యాయస్థానము ౦నేరదు. భూపాలునకు సలహా నిచ్చుటయే దీనిపని గాన భూపతితీర్మానమే న్యాయస్థానాగతముగ నుండెడిని.

(బ్రిటీషురాజపరంపర చూడుఁడు. బ్రిటీషు పార్లమెంటుహౌసులు చూడుఁడు.)

**ప్రూఫ్ ఆఫ్ పుడ్డింగ్** — (Proof of pudding is the eating of it) దాని ఉపయోగము దానికి కలినయూ మోదమునుండియే తెలియు ననుట క్తివాడుచున్నారు. ఆంగ్లసీమలందు ఒకటవజేమ్సునరపతి పాలించు కాలమున, నాయనకై ఒకక్రొత్తభక్ష్యము చేసిరఁట. దాని నాతఁడు భుజింపఁబోవుచు నీప్రసిద్ధోక్తి పల్కెనఁట. అదియాదిగ నీడక్తి ప్రచారములోనికి వచ్చి సామెత యాయెనఁట.

**ప్రెషర్ ఆఫ్ లైట్** (Pressure of light)—(వెలుతురు కల్గించు నొత్తిడి చూ.)

**ప్రెయిరీస్** (Prairies)—ఉత్తరఅమెరికాదేశములందు (పచ్చికపట్టియున్న) మైదానపు (సమతల) ప్రదేశములకు Prairies అనిపేరు. (Land portions చూడుఁడు.)

**ప్రెసిడెంటురూజువెల్టుగారి నాల్గు పోయింట్ల విదేశరాజ్యాంగవైఖరి, విధానము**—ఈసుప్రసిద్ధవైఖరి, విధానము ఆంగ్లమున Four point foreign policy of United States of America by Persident Roosevelt అని వాడుచున్నారు. ఇది క్రీ. వె. ౧౯౩౯నాఁటి దేశకాలపరిస్థితుల కనుగుణముగఁ బ్రకటింపఁబడినదిగా తలంపఁబడుచున్నది. దీని నాయన క్రీ. వె. ౧౯౩౯ ఫిబ్రేవరి ప్రారంభకాలమునఁ గూడిన ఒకప్రెస్ కాన్ఫరెన్సున కంపి ప్రకటించెను.

ఒకటవపోయంటు- ఒకకార్యమునందు తగుల్కొనఁజేయునట్టి సాహచర్యసఖ్యతలను అమెరికాసంయుక్తరాష్ట్రప్ర[illegible] మంగీకరింపదు. (U. S. A. is against entangling Alliances.)

రెండవది- ప్రపంచవాణిజ్యము ప్రతివారిది అను ధర్మమును రక్షించుటయందు అ.సం.రా.ప్ర.సుముఖత వహించుచున్నది. (U. S. A. favours the maintenance of world trade for everybody.)

మూఁడవది- ఆయుధబలములు తగ్గించుటకుఁ గాని, మితమును నేర్పఱచుటకుఁ గాని నడుచు ప్రతి ఏయుద్యమముతోనైనను అ.సం.రా.ప్ర. సంపూర్ణసానుభూతి గల్గియున్నది. (U. S. A, is in Complete sympathy with any and every effort to reduce or limit armaments).

నాల్గవది-తాను ను ఒకజాతిగ ప్రపంచజాతుల అన్యోన్యరాజకీయ,ఆర్థిక,సాంఘిక, స్వాతంత్ర్యములను శాంతియుతముగఁ గాపాడుచు నిలుపుటయందు సానుభూతి గల్గియున్నది.(U.S.A. as a nation, is in sympathy with the peaceful maintenence of the political, economic, and social independence of all nations of the world.)

దీనిని బ్రకటించుటయం దాయ్రగాసనాధిఎల రెండురాజకీయసిద్ధాంతముల ననుసరించెనని తలఁపఁబడు చున్నది. అందు మొదటిది "That Economic Solutions are more vital to recovery than political remedies" అను సిద్ధాంతము దీనికొఱకు International economic readjustment ఆయన అవసరమని తలంచెనని తోఁచెడిని. అగునేని దానికి Free trade అవసరమని చెప్పకయే చెప్పుచున్నది. విదేశవాణిజ్యము ఆటంకము లేక ప్రతివారికి సందుబడిలో నుండవలెనని ఆయన తలంచెనని యూహింపఁబడుచున్నది. రెండవది "Good neighbour" సిద్ధాంతము. దీనినే Samaritan Policy అని యనుట యుంగలదు. "The good neighbour who respects his own obligations and respects the sanctity of his agreements in and with a world of neighbours" అనునది దీనికి మూలసిద్ధాంతము.

దీనిప్రకటనకు ముందు కొలఁదిదినములుగ పెరూదేశపు లీమాపట్టణమున జరగిన పశ్చిమ గోళార్ధ అంతర్జాతీయ మహాసభయందు మన్రోసిద్ధాంతము ఆధర్మము (Manro Doctrine) పశ్చిమ గోళార్ధదేశ ప్రభుత్వము లంగీకరించి యుండు ననియు, ఇది వీరిప్రోత్సాహముననే నడిచియుండుననియుఁ గొంద అనుమానించుచున్నారఁట. (మనోసిద్ధాంతము చూడుఁడు).

**ప్రెసిడెన్సీ** (Presidency)- ఈస్టిండియాకంపెనీ పరిపాలనక్రింద మన యాంధ్రాదిదేశము లుండినతఱి ఫ్యాక్టరీల ప్రెసిడెంట్లు పాలించుచుండిరి. దానినుండి ప్రెసిడెన్సీ యనుపేరేర్పడి నేఁటికిని స్థిరముగ వాడుకయం దున్నది.

**ప్రెస్ బైటేరియను (క్రైస్తవ) సిద్ధాంతము**— ప్రెస్బైటరు అనిన పురాతనపు క్రైస్తవధర్మమున జ్యేష్ఠుఁ డని (పెద్దయని) యర్థము. ఈపేరు బోధకున కన్వయించును. చర్చియుద్యోగుల కీపే రన్వయించునది యైనను అన్యు లీమతస్థుల నందఱ నీపేరుతో వాడుచున్నారు. స్కాట్లాండు దేశమునం దీమతస్థులు కలరు. జేష్ఠులచే పరిపాలింపఁబడుమతము లేక మతధర్మసంస్థ యని వీరియభిమతము.

**ప్రేంకణపు లత** -లా.Aglaia roxburghiana. సం ప్రియఁగుః, ప్రియవర్ణా, ప్రియవర్ణీ, ప్రియవల్లీ, ఫలినీ. దీనియాకులు తములపాకులఁ బోలియుండును. ఈచెట్టు సాదా ప్రియంగు, ఘూల్ప్రియంగు అని ద్వివిధము. ఘూల్ప్రియంగునం దొకవిధమగు సుగంధముండెడిని.

దీని సమూలరస కషాయములు బలము గల్గించి, అతిసారము, జ్వరదోషము, రక్తాత్యము, వాతదోషము, విదాహదోషము నడంచునని చెప్పఁబడినది.

**ప్రేతపర్వతము**- (గయ చూడుఁడు.)

**ప్రేతలు**— (ప్రకర్షేణఇతః = ప్రేతః). ఐదు విధములు- ౧ బ్రహ్మ. (సృష్టికి పరమేశ్వరనిరూపణాకారము), ౨ విష్ణువు. పరమేశ్వరుని సితినిరూపణాకారము), 3 రుద్రుఁడు (లయ

నిరూపణాకారము), ౪ ఈశ్వరుఁడు (పరమేశ్వరుని ఐశ్వర్యాకారనిరూపణాకారము), ౫ సదాశివుఁడు (పరమేశ్వరుని అధికార నిరూపణాకారము). ఈ పైదాకారములకు పంచప్రేతలని పేరు. ప్రేతయన నెప్పటికిని ఉండెడిదని యర్థము.

పరమేశ్వరునిశక్తిని (సామర్థ్యమును లేక మహిమను) పంచప్రేతాసనాసీనా (ఐదు మహాకారములం దధిష్ఠించి యున్నది) అనిఅందురు. ఈశక్తికి ఐదురూపములు ౧ సరస్వతీ, ౨ లక్ష్మి, ౩ పార్వతీ, ౪ ఉన్మనీ, ౫ మనోన్మనీ అని. దీనిఁ గూర్చి బ్రహ్మాండపురాణమందునను, దేవీభాగవతమునందునను చెప్పఁబడినది. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులను పంచకర్తలనియు, పంచభర్తలనియు ననుచున్నారు.

పంచభర్తలనుటయందు ద్రౌపదీ పాండవులని ఇట తలంపరాదు.

**ప్రేష్యంగ గోత్రము**—(గర్గఉపగణము చూడుఁడు.)

**ప్రైమరీ ఎయిర్ కరెంట్సు**—(Primary air currents) ఉత్తర దక్షిణ ధ్రువములనుండి భూమధ్య రేఖవైపుగా భూమిని గాని, సముద్రమును గాని అంటి క్రిందుగ వీచు శీతలవాయువులును, భూమధ్యరేఖకడ వేఁడి యెక్కుటంజేసి చులకనయైయొంతవఱ కాకసమున కెగసి అటనుండి పైఁగా నుత్తర దక్షిణధ్రువములవైపుగా వీచు వెచ్చనిగాలులును Primary air currents అనంబడును. (వాయువు దానికార్యములు చూడుఁడు.)

**ప్రైమరీ ప్లానెట్సు** (Primary planets)—(సోలార్ సిస్టమ్ చూడుఁడు.)

**ప్రైమ్ మినిస్టర్** (PrimeMinister) ఆంగ్లసామ్రాజ్యమున ప్రధానోద్యోగి (ప్రధాన మంత్రి) యనియర్థము. బ్రిటీషుచక్రవర్తిగారికి సలహాలనిచ్చు ప్రధానోద్యోగి. ఈయనను Premier అనియు నందురు. పార్లమెంటు సభ్యుఁడైయున్నవాఁడును, హౌస్ ఆఫ్ కామన్సునందు ఎక్కువమంది సభ్యులకు నాయకుఁడుగనో నమ్మకస్థుఁడుగనో ఉండినవాఁడు కావలయును. ఈయన కేబినెట్ మంత్రుల నెన్నుకొనుస్వతంత్రతకలవాఁడు. జీతము నెలకు నాల్గువేలపౌను లందురు.

**ప్రైరీస్**—(సెవన్నాస్ చూడుఁడు).

**ప్రైవేటు ఎరేంజిమెంటు** (Private arrangement)—వాణిజ్యపరిభాషాపదము. ఉభయపార్టీల అంగీకారముపై మధ్యవర్తుల తీర్పు అవసరము లేకుండునట్లు అయినఏర్పాటు. ఒక చిన్న లిమిటెడ్ కంపెనీకి Private Company అనియు నందురు.

**ప్రొటగోరాస్ సిద్ధాంతము** — దీనినిటుల వచించుటయె గాని ఈ Protagorus మహాత్ముఁ డెవ్వఁడో తెలియవచ్చుట లేదు. ఆంగ్లేయుల విజ్ఞానగ్రంథములందు దీనిని థియరీ యని వాడుచు దానిని "Knowledge is only relatively true" అని వివరించిరి. అది మూఁడుభాగములు.

౧. Positive knowledge is impossible. మానవచైతన్యములు, బుద్ధ్యూహలు ఒకేరీతి నుండునవి కావు గాన వాటిస్థితి ఇదమిత్థమని నిర్ణయింప వీలుండదు. అవియెట్లుఉన్న ట్లగపడుచుండునో దానింబట్టియే యన్యులు యోచింపవలసి యుండెడిని. మానవుఁడుసకలజగత్పదార్థములకు పరిమాణపుకొలతగ మాత్ర ముండువాఁడు.

ప్రతివారికిని వేర్వేఱువస్తువులు వారివారికగపడున ట్లెఱుంగఁబడుచున్నవి. అనఁగా గ్రహింపఁబడుచున్నవి గాన వేర్వేఱు మనుష్యులకుఁ దోచిన పదార్థవిజ్ఞానము వేర్వేఱుగ నుండవచ్చును. గాన Knowledge(విజ్ఞానము)

is relative అని చెప్పఁబడవలయు నని భావము.

౨. Our knolwedge of particular things depends upon the relations in which they stand to other things

వేర్వేఱువస్తువులం గూర్చి వేర్వేఱుమానవులకుఁ గల్గెడివిజ్ఞానము ఆవస్తువు లితరపదార్థములతోఁ గల్గియుండిన (లేకయున్న) సంబంధ సందర్భములనుండి కల్గినది గాని స్వతంత్రముగ నేర్పడినది కాదని భావము.

౩. In Psychology the view that sensations only possess importance when related to other simultaneous or immediately previous sensations in the mind.

తాత్కాలికముగఁ గాని అంతకుఁ బూర్వమప్పుడే గాని మనస్సునం దుండిన స్మారకము (Sensation)లతో సంబంధించినవిగ నుండిననే అప్పుడు గల్గినస్మారకము ప్రాముఖ్యముగ దోఁచు ననెడి ధర్మము మానసిక శాస్త్ర (Psychology) సంబంధ మని భావము. అనఁగా నా శాస్త్రసంబంధధర్మ మట్లుండునని భావము.

**ప్రొటెస్టు**— వాణిజ్యపరిభాషయందు "అనంగీకారము లేక ఇష్టము లేకుండుట" దెల్పుట లేక అంగీకారనిరోధమున కర్థము.

**ప్రొడ్యూస్**— వాణిజ్యపరిభాషాపదము. Produce అన చేయుటయని యర్థము. చేతిపనులకర్మాగారపు యజమానికి Producer అనిపేరు. అట్లు చేయించుపని Production అనిపేరు. అట్లు చేయించుటకు వలయుపనివాండ్రు, వాండ్రపనికిని Productive labour అనిపేరు.

**ప్రొద్దుతిరుగుడు చెట్టు (సూర్యకాంతపుచెట్టు)**- లా. Croton plicatum. ఆంగ్ల. Sun flower tree. సం. ఆదిత్యభక్తా, సూర్యభక్తవృక్షః, సూర్యభక్తా, సూర్యపత్రః, సూర్యవృక్షః, సూర్యకాంతవృక్షః, ఇంకను ఈజాతివృక్షము తీఁగగలదనియు, దానికి సూర్యలతాయని పేరనియుఁ జెప్పఁబడినది గాని యది యెచ్చటను గానరాకున్నది. ఇది యేఁటేట జనించుచెట్టు. ఇందలిపుష్పించుమించు సూర్యునివైపునకో లేక మఱియొకవైపుననో తిరుగుచుండుంగాన ప్రొద్దుతిరుగుడుచెట్టని పేరయ్యెను. దీనిపూలరెక్కలకాడలు దీనికిని తనములువాటిం గొన్నిదేశములవారు నోట నములుచుండునభ్యాసము గల్గియుండునఁట. దీనిని సూర్యావర్తిచెట్టని కొన్నిసీమలవారు పిలుతురని తెలిసెడిని.

దీనిఎండినఆకులందు కడుపునొప్పి నివారించుగుణమును ఎండినకాడలందు (ఆవాలచూర్ణముం గల్పి) కషాయము గాచియిచ్చిన కుష్ఠవ్యాధి నివారించుగుణము గలదనియు, సమూలరసకషాయచూర్ణములందు కుష్ఠరోగము, దగ్గులు, క్షయరోగముల నడంచుశక్తి కలదయు, వేఁడికషాయము ఒంటికి కాపడమిచ్చిన నరముల బలహీనత మాన్పుననియుం జెప్పఁబడినది.

**ప్రొప్రైటరీ కంపెనీ** (Proprietory Company)— వాణిజ్య సంబంధ పరిభాషాపదము. తమకు భూములు గనులు త్రవ్వుటమొదలగు పనులకుం గల్గియుండియు, నందొక భాగమితరులకు వేరువ్యవహారమునకు గాను, కొంత లాభమిచ్చు నేర్పాటుతో నొసంగిన కంపెనీకి Parent Company యనియు, Proprietory Company యనియు పేరు.

**ప్రొఫెషనాలిజమ్** (Professionalism)—వృత్తికి సంబంధించిన గుణములు, అధికారములు, స్థితి గలిగియుండుటనుగురించిన కళ.

**ప్రొమోటర్** — వాణిజ్యపరిభాషయందు ఒక కంపెనీ మొదలగు సంస్థను ప్రారంభదశయందుద్ధరించి పనిచేసి దానిని పనిచేయుస్థితి (Working order) నకుం దెచ్చినవాఁడని యర్థము.

**ప్రోటోప్లాసమ్** (Protoplasm) — న్యూక్లియస్ (Nucleus) అనంబడునది దేహమునసెల్సు (Cells) నందు ప్రధానపదార్థము అది లేకుండ సెల్సు జీవించియుండ నేరవు. వానికేదేని యపాయము సంభవించుతఁ గాని గుదుర్చుకొనుటకు న్యూక్లియస్ ప్రధానమని చెప్పఁబడియున్నది. న్యూక్లియస్ నుండియె సెల్సు తమగుణము నందునని చెప్పఁబడినది. స్త్రీ పురుషలక్షణములు భేద మగుట అనఁగా శరీరము లోకేవిధముగ నున్నను గుణమున భేదమగుట న్యూక్లియస్‌నుండియె జరుగునని పోల్పఁబడినది. అట్టి భేదకారణపదార్థమునకు ప్రోటోప్లాసమ్ (Protoplasm) అని ఆలోపతీవిధాన ఆంగ్లవైద్యశాస్త్రవేత్తలు సాంకేతికనామముగ పేరిడియున్నారు. ఇది అనేక ఎలిమెంట్సునుండి చేయంబడినదని పరిశీలకులు పోల్చియున్నారు. ఇందు కార్బన్, సిల్వర్, ఆక్సిజెన్ మొదలగునవి కలవు. (Carbon-silver oxygen and so on) ఇందుఁగల జలము ఆక్సిజెన్, హైడ్రోజన్ కలసినదైనదని యెల్ల రెఱుంగుదురు. ఇందలిచిత్ర మేమన ప్రోటోప్లాసమ్ నందు జలమున్న దనుటకన్న ప్రోటోప్లాసమ్ జలమునం దున్నదనుటయే సమంజసము. ఏలయన ప్రోటోప్లాసమ్ ఎండిపోయినను జలముయొక్క ఘనరూపమగు మంచునం దుంట సంభవించినను జీవించుట యసంభవమేయగును. అట్టితతి ఎదుగుట, ఊపిరితీయుట, శరీరమున కాఁగిపోవుంగాన ద్రవరూపమగు నుదకమునం దున్నట్లె యెఱుంగఁదగినది. ఇంతియే గాక ప్రోటోప్లాసమ్‌నందు ఆక్సిజెన్ హైడ్రోజను లధికభాగము లుండునటులఁగానవయ్యెడిని. ఈయధికభాగములు వేర్వేఱు ఎలిమెంట్సుతో కలసియుండుట గానవగుచున్నది. అందు ముఖ్యముగ కార్బన్, ఆక్సిజెన్ హైడ్రోజెన్, నైట్రోజెను, ఫోస్పారస్‌లతో నని చెప్పందగును. ఇంకను సల్ఫర్ (Sulphur) కలదేమో యని సంశయము గల్గుంగాని ఇది నిశ్చయమని పరిశీలకు లనఁజాలకున్నారు. వీట్ల కలయికలును అసాధారణవిధానమని తలంపఁబడుచున్నది. వీటికూడికల కాంగ్లరసాయనశాస్త్రవిదులు కాంపౌండ్సు (Compounds) అనియెదరు. వీట్లచేత నీశరీరములు చేయంబడినటుల పోల్చియున్నారు.

**ప్రోలేఖకుల గోత్రము**- ఆర్య వైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు).

ప్రోలేఖకుల (పోలికుల) గోత్రము. త్ర్యార్షేయ(ర) గోత్రము. సంస్కృతగోత్రము. పుండ్రకస, పుండ్రకగణము. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణఆద్యప్రవరఖండ. ప్రోలీశుఁడు దేవత. భువనాంబ భార్య. మధ్యార్జునము (తిరువడమరుదూర్) తపస్థానము. భువనాస్తి సరస్సు తటాకము. జపము కోటి. దీపములు ౩౨. క్షేత్రసంఖ్య౫౩. పాలకీదానము. నల్లజీడివర్జనీయము.

**ప్రోలెటేరియానిజమ్** (Proletaria-nism)—ప్రోలిటేరియట్ అనఁగా పనిచేసి జీవించుసంఘము. వర్తకులయొక్కయు, ధనికులయొక్కయు సంఘములతో పనివారల మేలుకొఱకు ఘర్షణము సాగించు సిద్ధాంతము

**ప్రొహిబిషన్(అడ్డు లేక నిర్బంధము)** వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Prohibition కేవలము వెళ్ళకూడని ఆటంకమునకు పేరు. కొన్ని కట్టుబాట్లు ఆటంకములు

విధింపఁబడినచో దానికి "Restriction" అని పేరు.

ప్రొక్రుస్టీన్ బెడ్ Procrustean Bed దుర్మార్గులచేతంజిక్కినవారికి వాఁడొనంగు సౌఖ్యములఁగూర్చి యీ ఉక్తి వాడుచున్నారు. Procrustes అనువాఁడు గొప్పదొంగ. మహా దురాత్ముఁడు. పాంథులంబట్టి దోఁచుకొనుటతో తనివితీరక చిత్రవధంజేసి తనవినోదార్థ మధికారము నెరపువాఁడు.

ఆతనికడ నొక కవాచీమంచ ముండెనఁట. దానిపై మనుష్యుని పవళింప బలాత్కరించి కాళ్ళుపొడవుండిన తెగనఱికియు, పొట్టిగ నుండిన సాఁగలాగించియు వినోదించువాఁ డఁట.

ప్రోక్రోనిజమ్ (Prochronism)—కార్యము సంఘటనము వీనినిగురించినది.

ప్రోక్సీ (Proxy) — ప్రతినిధి యగువాఁడొకసభయందు "ఒకరికిఁ గాని ఇంకొకఁడు" ప్రోక్సీగా పంపఁబడి, అభిప్రాయములం దెల్పుట నమ్మతినిచ్చుట మొదలగుపనుల నొనర్చును.

ప్రోజయిజమ్ (Prosaism) — వచనరూపకమగు శైలితో వెల్లడించదగినభావములు.

ప్రోటోప్లాసమ్ (Protoplasm) — (బోటనీ చూడుఁడు.)

ప్రోపెర్టీ (ఆస్తి) (Property) — ఇది ద్వివిధము. భూమి, ఇండ్లు మొదలగు వాటిని Corporal Property అనియు, వాటాలు, హక్కులు మొదలగు నదృశ్యమగు ఆస్తులకు Incorporal property అనియు (అనఁగా దృశ్యములు, అదృశ్యములు) ద్వివిధము. ఇంకను కదప వీలులేని ఆస్తులకు స్థిరాస్తు లనియు, ఒకతావునుండి యింకొక తావునకు తీసుకొనిపోఁగల ఆస్తులను చరాస్తు లనియు నందురు. నగదు, పత్రములు, నోట్లు మొదలగునవి చరాసులగును.

ప్రోఫిట్ (లాభము) Profit-వాణిజ్య పరిభాషాపదము. పెట్టినమూల్యమునకు వడ్డీయు, తగిన వ్యయములనుగాక వచ్చిన అమ్మకపు మూల్యమునందలి నికరమగు మిగిలిన లాభము.

ప్రోబబిలిజమ్ (Probabilism) — వ్యతిరేకగుణములు గలవానియందు బలమును ఆవశ్యకతను తలంపక సత్యానుగుదానినే స్వీకరింప వలయుననుసిద్ధాంతము. ఇదియు రోమను కాథలికుధియాలజీకి సంబంధించినదే యైనను, ప్రోబబిలియారిజముకు వ్యతిరేకసిద్ధాంతము.

ప్రోమిస్సరీనోటు—వాణిజ్యపరిభాషాపదము. Promissory note- దీనిని Pro-note అనియు నందురు. ఇది అడుగగనె సొమ్ము అసలువృద్ధు లిచ్చివేయునటుల వ్రాయఁబడును. ఇది Negotiable Instruments అగును.

ప్రోవిన్సుసీమ— తొల్లింటి ఛార్లెమాగాన్ చక్రవర్తి పాలించినరాజ్యములోని యొక పరగణా యైయుండెను. రోమకసామ్రాజ్యభాగ మని చెప్ప నొప్పును. ఇప్పటి ఫ్రాన్సు దేశమునందు చేరియున్న ది. దీనివిచిత్ర మేమన ఇందలి జనులు ప్రత్యేకభాషను మాట్లాడుదురు. దాని! ప్రోవిన్షలుభాష (చూడుఁడు) యనిపేరు ఆల్ప్సుపర్వతములు, రోనునది, మధ్యధరా సముద్రము ఈసీమకు ఎల్లలని చెప్పవచ్చును దీనిప్రధానపురము తొలుత Aix గా నుండెను. పిదప కొంతకాలము Arles ఆయెను. మార్సీలీసుపుర మిందులోనిదియె. బర్గండీతో ఈసీమకు కొంతరాజకీయసంబంధ ముండినను, రెండు నెప్పుడు కలుపంబడనేలేదు. ౧౫వశతాబ్దకాలమున ఫ్రాంకులపాలనక్రింది కీసీమ చేరిపోయె నందురు. (రోమేన్సుభాషలు చూడుఁడు.)

ప్రోస్పెక్టస్ (Prospectus)— వాణిజ్య సంబంధపరిభాషాపదము. ఒక సంస్థ యొక్క—

వ్యాపారప్రవిధులు, ఉన్న ఆస్తులు, ఇదివఱలోని యాదాయవ్యయములు మొదలగు సంగతులను వివరించెడి పత్రము. ఇది లోకులు నమ్మకము. ఇందు చేర ప్రోత్సాహములకొఱకు లియ్యారై ముద్రింపఁ బడుచుండెడిని.

**ప్రోస్ఫరస్**—(భాస్వరము చూడుఁడు).

**ప్రౌఢకవి మల్లన కవి**— రచించినది ఏకాదశీమాహాత్మ్య మను నామాంతరముగల రుక్మాంగదచరిత్రము. (ప్రబంధము).

**ప్రౌఢపాదాసనము**- యోగశాస్త్రమున జెప్పఁబడినయాసనములలో నొకటి. కుడితొడ క్రింద నెడమపాదమును, ఎడమతొడపై కుడి పాదమును ఉంచి మఠముపై కూర్చుండి కుడి మోఁకాలిపై చిన్ముద్ర పట్టినకుడిచేయి నానించి, ఎడమచేయి నెడమ మోఁకాలిపై నుంచి కూర్చుండుట. ఇది విశ్రాంతికరమని చెప్పఁబడిది.

**ప్రౌఢయాజికులగోత్రము**-ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.) ప్రౌఢయాజకుల (ప్రౌఢయాచకుల ప్రౌఢయాజి) గోత్రము. ఏకార్షేయ (౮౬)గోత్రము. సంస్కృతగోత్రము. సౌవర్ణస సువర్ణగణము.మౌసలర్షి. ఆపస్తంబయజుశ్శాఖ. ప్రమాణ ఆద్యప్రవరఖండ. సమానగోత్రములు పార్థివస, మౌసలస. ప్రౌఢేశుఁడు దేవత. పృథ్వీ భార్య. తామ్రపర్ణీతీరము తపస్థానము. పృథ్వీసరస్సు తటాకము. జపము దశలక్ష. దీపములు ౧౮. క్షేత్రసంఖ్య ౧౮. గోదానము పొట్లకాయ వర్జనీయము.

**ప్రౌఢశీలకుల గోత్రము**— ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.)

ప్రౌఢశీల(పగడశీల,ప్రౌఢశీల)కులగోత్రము. చతురార్షేయ(౧.గోత్రము.సంస్కృతగోత్రము. పారాశర్యస. పారాశరగణము. ప్రమాణగ్రంథ మాద్య ప్రవరఖండ. సమానగోత్రములు లేవు. శ్రీశేశుఁడు దేవత. పావకాంబ భార్య. శ్రీశైల శృంగముతపస్థానము. శ్రీరాంభోనిధి తటాకము. జపము లక్ష. దీపములు ౨౦. క్షేత్రసంఖ్య 30. ఫలములు దానము. ఖర్జూరము, కర్పూరము, మొగలి, నిమ్మ వర్జనీయములు.

**ప్లవ గోత్రము**— (జమదగ్నివత్సఉప గణము చూడుఁడు).

**ప్లవంగమగతి న్యాయము**— కోతి తిన్నగా మార్గమున నడచిపోదు. అనేకదిక్కులకు నానావికారంపుపనులు చేయుచు, కొమ్మ లెక్కుచు, దూఁకుచు మార్గమున పోయెడిని.

ఇట్టి వక్రగతిం గూర్చి యీ న్యాయము వాడుదురు.

**ప్లహ్లవనృపతులు**--శకవంశ నృపతులు. (క్రివి దేశము చూడుఁడు.)

**ప్లహ్లాదద్వాదశి**--(వరాహద్వాదశి చూ.)

**ప్లక్షి గోత్రము**-(గవిష్ఠిరగణము చూ.)

**ప్లాటో లేక ప్లేటో** (Plateau లేక Plateaux)- దీనిని Table landఅనియు నందురు. ఎత్తగు(పర్వత)ప్రదేశము పైనున్న సమతలమగు జాగా. (Mountains చూడుఁడు.) Altitude తక్కువగ నున్న Table land అనియు, ఎక్కువగనున్న Plateau అనియు సాధారణ రణముగ వాడుచున్నారు.

**ప్లానెటరీథియరీ**— (హిబ్బ్రోనుసిద్ధాంతము చూడుఁడు.)

**ప్లానెట్సు**(Planets) — (జర్మనుభాష యందు తిరుగునదియని యర్థము). ఒకపెద్ద గోళము నాశ్రయించుచు దానిని జుట్టితిరుగు గోళములకు Planets అనిపేరు.

**ప్లాక్షి గోత్రము**- పరాశరగణము చూ.

**ప్లిమ్సోలీ లైను** (Plimsoli line)—స్టీమరు కర్త్వామగు బరువునెక్కించుకొనిన పిమ్మట నీటమునిగినభాగమునకు పైగా నొకగుర్తు వేయ బడియుండును. ఆగుర్తునకు ప్లిమ్సోలీలైను అని పేరు. అది నీట మునుంగక పైకగపడుచుండునట్లు దానియందు బరువువేయవలెనను నిబంధన కలదు.

స్టీమరుల యజమానులు దురాశకొలంది ఎక్కువ బరువువైచికొనకుండ ఓడనౌకర్ల ప్రాణరక్షణకొఱకీనిబంధన తొల్లింట ఏర్పడియుండెను.

**ప్లిమ్సోల్ మార్కు** (Plimsoll mark)— సముద్రపుటోడలందు బయటను ఎంతలోతునకు ఓడ నీటియందు క్రిందికిదిగువఱకు లోన బరువువేయందగునో ఆతావున గుర్తుగీత వేయఁబడును. ఓడయందు సరకు అంతకుఅదనముగ నెక్కించి ఆగీతకూడ నీటమునుంగునట్లు బరువు వేయరాదని శాసనములు కలవు. ఈయేర్పాటుచేయుటకు గారకుఁడగు Samuel Plimsoll అనువారిపే రీగుర్తుల కిడఁబడినదఁట.

**ప్లీహ**—ఆంగ్ల. Enlarged spleen. ఇది గుల్మసంబంధము కాకుండ కడుపులో బల్లవలె పెరుఁగుజబ్బు.

**ప్లీహావన్నృపాలురు**-(ఇండోపార్తియను చూడుఁడు).

**ప్లూటోగోళము** (Pluto)— నెప్ట్యూన్ గోళమున కవ్వలనున్న యొకగోళమునకు క్రీ.వె. ౧౯౩౦ సంవత్సరమున నీపేరిడఁబడినది. దీని నాసంవత్సరమున Arizona యందు Lowell observatory (నక్షత్రశాలయందు) జనవరి నెలలో కనిపెట్టిరఁట.

**ప్లూటోనొమి** (Plutonomy) — వస్తువ్యుత్పత్తికిని, ధనవ్యుత్పత్తికిని, సంఘమునకు పంచుటనుగురించిన శాస్త్రము. ఇదియును రాజకీయఅర్థశాస్త్రమువంటిది.

**ప్లెయిన్** (Plain)—మైదానవు (లేక సమతలమైన)భూమి.(Land portion చూ.)

**ప్లెయిస్టోసిన్‌కాలము** — (Plesiosaurns period) పాశ్చాత్యదేశములందు చరిత్ర లారంభమగుటకు వెనుకటి కాలము. అనఁగా పెట్రియరీకాలమునకును చరిత్రకాలమునకును నడుమ కాలమునకు పేరు. (పెట్రియరీ కాలము చూడుఁడు.)

ఈకాలమున కథలు పాటలమూలమున కొన్ని నడిచియుండినగాథలు తెలియును. కాని అక్కాలమున చరిత్రలు లేవు.

**ప్లేగువ్యాధి**—(మహామారివ్యాధి చూ.)

**ప్లేటో**—(ప్లాటో. చూ.)

**ప్లేన్** (Plane)—సమతలము.దీనికిపొడవు వెడల్పు లుండును గాని దళసరి ఉండదు.

ఒక pointకు ఉనికియే గాని పొడవు వెడల్పులుండవు. ఒక (లైన్)గీతకు పొడవేగాని వెడల్పుండదు. అట్లే ఒక plane కు పొడవు వెడలుపుఉండును గాని దళసరి యుండదు. ఇది లెక్కలకొఱకై పరిగణించుకొను పదము. (ఈశబ్దముయొక్క ఆలంకారి కోపయోగము Mental plane గూడ చూపనగును.)

**ప్లేసింగు షేర్సు** (Placing Shares) వాణిజ్యపరిభాషయందు అమ్మకమున కొరకు బ్రోకరు బహిరంగపఱచియున్న వాటా లని యర్థము.

**ప్లైవుడ్ పరిశ్రమ**—తేలికయైన ప్యాకింగ్ పెట్టెలు మొదలగువానిని సర్వీసుతో నంటించి తయారుచేయుదానికి ప్లైవుడ్ అనిపేరు. ఈ కఱ్ఱయొక్క ప్రత్యేకప్రయోజన మేమనఁగా

ఇతరదేశములకు విశేషముగా రవాణాచేయఁబడు తేయాకు మొదలగువానిని పేక్ చేయుటకు తేలికగా నుండుపెట్టెలు చేయుట.

రైల్వేరేట్లును, స్టీమరురేట్లును అపరిమితముగా హెచ్చిపోవుచుండుటచే వ్యాపారస్థులు తాము ఎగుమతిచేయు దినుసులు పంపుటకు పెట్టెలెంత తేలికగా నుండిన అంతలాభకరముగా నుండునని కనిపెట్టుటయే ప్లయివుడ్ పరిశ్రమ అభివృద్ధియగుటకు కారణమయినది. అందులో ముఖ్యముగా తేయాకు ఎగుమతి చేయుటకు మిక్కిలి తేలికయైనపెట్టెలు కావలసివచ్చినది.

హిందూదేశమునందు తేయాకుఎగుమతి అభివృద్ధియైనకొలఁదిని రైలుమీఁదను స్టీమరుమీఁదను కేవులను సాధ్యమయినంతమట్టుకు తగ్గించుటకు తేలికయగుప్యాకింగ్ పెట్టెలవసరములైనవి. అంతకుముందు బరువైనకఱ్ఱతో చేయఁబడినపెట్టెలలో పోసి తేయాకు రవాణాచేయుచుండుటచే వ్యాపారస్థులకు ఖర్చులు విశేషముగాఁ దగులుచుండెను. యుద్ధమునకుఁ బూర్వము ప్లయివుడ్ అనఁబడు ఈకఱ్ఱ యూరోపు ఖండమునుండి విశేషముగా రవాణా చేయఁబడుచుండెను. యుద్ధానంతరమున ఆప్లయివుడ్ అనఁగా దేవదారువంటి తేలికయగు కఱ్ఱ రవాణాచేయఁబడుట ఆఁగిపోయెను. ఒకేపరిమాణముగల ప్లయివుడ్ పెట్టె 16 పౌ॥ లేక 18 పౌనులుగలది మారుజాతికఱ్ఱతోఁ జేయఁబడినది 28 పౌనులబరువుండును. అందుచే రవాణాఖర్చులలో విశేషనష్టము వచ్చును. ఇంతేకాక ప్లయివుడ్ పెట్టె మారుజాతికఱ్ఱపెట్టెకన్న బలమయినదిగాను సులభముగా వంగునదిగాను అయియుండును.

1906-7సంవత్సరములలో 23½ లక్షలరూపాయలకు వచ్చువిలువగల ప్లయివుడ్ ధర యుద్ధానంతరమున 1924-25 సంవత్సరములో తొంబది లక్షలవఱకు పెరిఁగిపోయినది. ఇది కనిపెట్టి హిందూదేశపుటడవులలో ఈజాతివృక్షములను పెంచుటకు సుర్మావేలీ సా మిల్సువారు పూనుకొని ఈజాతిమొక్కలను దిగుమతిచేయుటకు తొలి సర్టిఫికేటు పొందియుండిరి. తరువాత అస్సామ్ సా మిల్సువారు టింబర్ కంపెనీవారు మొదలగువారు ఈజాతివృక్షములను హిందూదేశమునందు పెంచనారంభించిరి.

ప్లయివుడ్ పెట్టెలు అనేకములగు దినుసులు రవాణాచేయుట కుపకరించును. కాని హిందూదేశమునందు తేయాకు రవాణాచేయుటకే విశేషముగా నుపయోగింపఁబడుచున్నవి.

ప్లయివుడ్ పెట్టెలుచేయుటకుకావలసినముఖ్యపదార్థములు రెండు. ఒకటి ఆజాతికఱ్ఱ, రెండు దాని నంటించుటకు సర్వీసుగాని సిమెంటుగాని సాధారణముగా తేలికయైన నిట్టిపెట్టెలు చేయుటయందు ఐరోపాఖండవాసులచే ఓక్, గమ్, పాప్లర్, బిర్చ్, ఫర్ జాతులకఱ్ఱ లుపయోగింపఁబడును. హిందూదేశమునందును నిట్టితేలికకఱ్ఱగల జాతులవృక్షములు విశేషముగా నుండుటనే ఈపరిశ్రమ అభివృద్ధిపొందుటకు విశేషమయిన యవకాశము కలదు.

**ఫంగస్**— (అగారిక్ చూడుఁడు.)

**ఫండింగ్ (Funding)**— వాణిజ్యసంబంధపరిభాషాపదము. Funding- ఒకకంపెనీవారు ఋణమును Floate చేసియుండఁగ దానిని వాటాలక్రింద మార్చుట కీపేరు వాడుదురు.

**ఫండెడ్ డెట్ (Funded debt)**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము.

Funded Debt తీర్మానవు తేదివివరింపబడక గాని లేక తీర్మానముకడుదూరమునదీర్ఘకాలము పిదపనుండునట్టు గాని పత్రములుగల (ప్రభుత్వమువారు గైకొసిన) ఋణము.

**ఫణిభట్టు**— ఈయాంధ్రకవి పరతత్వ రసాయనమను మైదాశ్వాసముల వేదాంత గ్రంథమును పద్యకావ్యముగ రచించి తన వేదాంతగురుండగు సదానంద యోగి కంకిత మొనర్చెను

రావుబహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులువారితని పూర్వకవులలో లెక్కించియున్నారు.

**ఫణిసార హారేయ గోత్రము**— ృవ గణము చూడుఁడు.

**ఫతేపూర్జిల్లా**--ఫతేపూరునగరముప్రస్థానము. (అగ్రా ప్రోవిన్సు చూడుఁడు.)

**ఫతేపూర్ శిక్రీ**- ఆగ్రానుండి ౨౩ మైళ్ళ దూరమున బాటపై శిక్రీగ్రామముగలదు. ఇది బేబరుచక్రవర్తి చిత్తూరు యుద్ధకాలమున తన శిబిరములు నాటించుచు విడసి యుండినతావు ఆయనయె ఆగ్రానుండి శిక్రీకేతెంచుమార్గమున క్రోసుస్తంభములను నాటించెను. అవి ఇరువదియడుగులపొడవుకుఏకశిలాస్తంభములు. ఇప్పుడందు రెండుమాత్రము నిలచియున్నవి. తక్కినవి పోయినవి. వాట్లను మిదకూరుమినారనియు, కిరావోలిమినారనియు వాడుచున్నారు. హిందూస్థానీభాషయందు మినారనిన స్తంభము. ఈ సందర్భమున బేబరు చిత్తూరును ముట్టడించుట క్రీ. శ. ౧౫౨౭ అని మనసునందుంచుకొనవలయును.

శిక్రీయందాదికాలమునుండియు నేటివఱకు చుట్టుపట్ల రాతిగనులనుండి రాయిత్రవ్వి మలచు పనివారు నివసించుచున్నారు. ఇచటికి అక్బరు కాలమున షేకు సలీమ్ భిస్తీ యను పేరుగల భక్తుడొకఁడుచేసి తొలుత యొక గుహయందు వసించుచుండెను. అతని మహిమలు, కీర్తివిస్తారముగ వ్యాపించి అక్బరునకుఁగూడ చేరెను. అక్బరుకప్పటికి సంతానము కలుగలేదు. గుజరాతుంబట్టుకొని తిరుగవచ్చుతఱి అక్బరుచక్రవర్తి శిక్రీయందు విడసి భక్తునిదర్శించి తన కోర్కెం దెలిపెను. అట్లు ఆయన వరప్రసాదమున అక్బరునకొక సుతుఁడు గల్గెను. భక్తితో నాబాలున కగ్బరు సలీమ్ అని పేరిడెం గాని అగ్బరునకుం బిదప సింహాసన మెక్కుచో నతఁడు జహాంగీరను ప్రసిద్ధనామము ధరించిన చక్రవర్తి యాయెను.

గుజరాతుం జయించిన సంతోషమునకుం దోడు సుతుఁడుగల్గిన సంతోషాతిశయముచే నతిభక్తి గల్గిన యగ్బరు శిక్రీయందే నివసింప నేర్పరుచుకొని దానికి ఫతెపూరను (జయముల నగరము) అని పేరిడి అట నొకనగరనిర్మాణ మారంభించి పూర్తిజేసి యందు వసింపనారంభించెను గాని ఆయనకడకాలమున రాజపరిస్థితులాగ్రాయందే తానుండక తీరనిస్థితిం దెచ్చెను. అగ్బరుమరణానంతరము జహాంగీరువలన ఫతేపూర్ పూర్తిగా వదలివేయఁబడి అగ్రానగరమె రాజనివాసమాట ఫతేపూరు బందిపట్టు వాండ్రకు వనమృగములకు నివాసమై పాడుగా నారంభించెను జహంగీరు (అప్పటిసలీము) శిక్రీయందే జన్మించినవాఁడు. అగ్బరు ఆగ్రాయందే మృతిఁజెందు అటకైదుమైళ్ళదూరమున నొక్క గొప్పభవనము నిర్మింపజేసి యందు జహంగీరు గోరీచేయించెను. ఆభవననిర్మాణము తానే జహంగీరు పరిశీలించుచుండువాడట.

ఫతెపూరు శిక్రీపట్టణమున నివసించుటలేదు. పాతశిక్రీగ్రామమున యథాప్రకారమె రాతిపనివాండ్రు వసించుచున్నారు. ఫతెపూరుం జుట్టి మూడువైపుల కోటగోడలు బురుజులు

కట్టఁబడి నాల్గవవైపంతయు గొప్పచెరువు త్రవ్వఁబడినది. చెరువునుండి చుట్టుపట్ల అనారోగ్య ప్రదమాట నిటీవల నాచెరువెండింపబడి పొలము లైనది. ఆగ్రానుండి ఒక ఇనుపదారి బాట నిర్మింపఁబడి డెబ్బదివేలరూప్యముల వ్యయమున చూచువారికై యొక విడిదిబంగళా నిర్మింపఁబడినది. ఫతెపూరు కేవల మొగలయిల యాకార మెగల్గి మార్పుఁజెందనితావు. ఇట భిస్తీభక్తుని గోరీ యాత్రాస్థలమై యున్నది. తావులంజూపు గెడ్డులు కాపూరువారిలో పెక్కండ్రీ భిస్తీభక్తుని సంతతివారమని చెప్పదురు.

ఆగ్రాకోటలోనున్నట్లె ఇక్కడను గొప్ప గొప్ప దర్వాజాలు మహాలులు నివాసభవనములు ఆటలతావులు మొదలగునవి పెక్కు గలవు. పంచమహాలనంబను ఐదంతస్తుల మేడయు, అగ్బరు సభాభవనములు, జుమ్మామశీదు, టంకశాల, ఖెజరీ, దివాన్ఆమ్, దివానీఖా పచ్చీసీఆటవాకలి, అంకామిఛొలీ, (జ్యోతిష్కుని గృహము) ఖాస్మహల్ తొల్లింటికాలపు వైద్యశాల మహారాజావీరబలుని భవనము, స్త్రీలమశీదు (నాగినామశీదు), సరై (ధర్మ శాల), మొదలగునవి కలవు. అన్నియు చూడదగినవిగనె నుండును. శిక్రీనిర్మాణప్రారంభము క్రీ. వె. ౧౫౭౮ గా చెప్పఁబడినది. సలీంభిస్తీ భక్తునిచావు శిక్రీయందె జరగెనట.

**ఫరీదుకోట సంస్థానము**— పంజాబులోని బ్రిటిషు రక్షిత సంస్థానములు ౩౪ లో నొకటి. సిక్కుసంస్థానము ఫరీదుకోటరాజధాని.

**ఫరీదుపూరు జిల్లా**-ఫరీదుపూరుప్రధాన సంస్థానము. (బంగాళాదేశము చూడుఁడు.)

**ఫరూఖాబాదు జిల్లా**—ఫరూఖాబాదు నగరము ప్రధానస్థానము. (ఆగ్రా ప్రోవిన్సు చూడుఁడు.)

**ఫరూకీ నృపాలురు**— వీరిని ఘోరీ నృపులనియు వాడుచున్నారు. వీరు మాళవ దేశమును పాలించిన మునల్మాన్ నృపులు.

**ఫర్ మనీ (For money)**--వాణిజ్యసంబంధపరిభాషాపదము. స్టాకుఎక్సఛేంజిపదము సొమ్ముకొఱకు అమ్మక మని యర్థము. ఇందు అమ్మకము, కొనుట పూర్తియైన వెంటనే సెక్యూరిటీ ఇప్పజెప్పటయు, తోడనె సొమ్మిచ్చివేయుటయు జరిగెడిని. మఱియు Next setting దినముననే పైసలగు Current Account లోని Stock Exchange వ్యవహారమునకు For the account అందురు.

**ఫర్మాన్-ఫర్మానా**- -ముసల్మాను ప్రభుత్వమున ప్రభుత్వపుటేర్పాటుగా నొసంగఁబడిన ఆజ్ఞకు పేరు.

**ఫలకీ (అస్థిఖండము) వనము** (కురుక్షేత్రవనములలో నొకటి.)

**ఫలవత్సన్నిధానవత్ఫలం తదంగ నితిన్యాయము**-- తనసొంతమగు ఫలితము లేనిది అన్యత్ర ఫలితము గల్గునదిగ నుండెనేని, అది అట్టి అన్యస్థలసంబంధఫలితమునె ఒసంగునని భావము. అనఁగా ఏసంబంధ ఫలితము గల్గునో ఆఫలిత మాసంబంధమే యై యుండును గాని మఱియొకటిగ నుండదని భావము.

**ఫలాశినీ నది**— గిరినార్ (జూనగడ్) పర్వతముప్రక్కగ ప్రవహించు నది. కతియవార్దేశము. ఇది ఎక్కువవడిగ దొరలుచు ప్రవహించునది. మహాభారతము, భీష్మపర్వము అధ్యాయమున దీనిప్రశంస గలదు. (గిరినగరము చూడుఁడు.)

**ఫల్గుణీనది**— (నిరంజనానది చూ.)

**ఫల్గుణుఁడు లేక అర్జునుఁడు** — ఉత్తరఫల్గునీనక్షత్రమున జన్మించినవాఁడుగాన నిది నామనక్షత్రము.

**ఫస్టు** (First)—వాణిజ్య సంబంధ పరిభాషాపదము. మొదటిది అని సర్వసాధారణముగ నర్థమిచ్చెడిని. First of Exchange Bill అనునది మూఁడు నకళుగ (Triple Copied) వచ్చిన విదేశపుహుండీ యగును. ఇందు మొదటిది చెల్లింపఁబడెనేని తక్కినవి తోడనేరద్దగును. First open water అన Baltic Ports మొదలగుశీతలప్రదేశములందలి రేవులకేగు, లేక రేవులనుండి బయలుదేరు ఓడలు, మంచుకరఁగి సముద్రమున దారినిచ్చు మొదటిసబ్బుని యర్థము.

**ఫస్టుక్లాసు పేపర్** (First Class Paper)—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. సొమ్ముపోవునని సంశయ మెంతమాత్రమును లేని గవర్నమెంటు అప్పుపత్రములు, నోట్లు మొదలగువాని కీపేరు వాడెదరు.

**ఫాంథాక్ ఆట**—ఇది చీనాదేశపుఆట. ఆదేశమున జూదపుఆటగాతలంపఁబడుచున్నది.

**ఫాగ్** (Fog) **పొగమంచు** — మిస్టు, బుగ్గియొక్క పరమాణువుల నాధారముగఁ గైకొని దానిపై నేర్పడినట్లె ఫాగ్ పొగమంచనఁబరఁగుచు, పొగయందలి పరమాణువుల నాధారముగఁ గైకొని, వాటిపై నేర్పడునది. (మిస్టు చూడుఁడు. మంచుబిందువులు గరికపై నేర్పడుట డ్యూపోయింటు, టెంపరేచర్ చూ. హైగ్రొమీటర్ ఫ్రోస్టు చూడుఁడు.) ఇట పొగ పరమాణువులందు కోట్లాను మొదలగు జిడ్డుపదార్థములుండునని మనసునందుంచుకొనవలయును. అవి ఆజలపరమాణువులపై నొకవిధమగు పలుచనిజిడ్డుపొర గల్గించునుగాన నవి తక్కినజలకణములవలె త్వరితముగ నావిరి గాక ఇంచుక తడవు అట్లు నిలువఁగల్గియుండును. ఇది ఫాగ్ నందనియు, మిస్టునందు కాదనియు మనము మరవరాదు. ఇంకను ఫాగ్ పరమాణువులు ఒకటికొకటి హత్తుకొనుటయందధికశక్తిగల్గియుండి, ఇంచుక బలము మూర్ఖతలఁ గల్గియుండునని తోఁపక పోదు. లండను మొదలగు నగరములందీఫాగ్ కొన్నివారము లట్లె నిలిచి కరఁగిపోక సూర్యరశ్మిని మరుగుపఱుపఁగలుగుచుండెడిని. ఫాగుపై వర్షముకురిసిన నాజిడ్డును కడిగివేయును గాన నది నసిపోయెడిని. గాలి బలముగ వీచినను, ఫాగు కొంతదూరము కొట్టుకపోవుటయుఁ గలదు. అట్టితటి చీలినతునుకలుగూడ పాగుముక్కలుగ వేరైవాతావరణమున దేలుచుఁగన్పట్టుచుండును.

**ఫాతమ్** (Fathom)—నావికాసంబంధ మైనకొలత. సముద్రపులోతు మొదలగువాటిని ఫాతములలెక్కతో కొలుతురు. ఆఱడుగుల లోతునకు ఫా మని పేరు.

**ఫాతీమా** — మహమ్మదు జగద్గురుని కుమార్తె యొకఫాతీమా. తల్లిపేరు ఖాదీజా బేగమ్. భర్తపేరు అ కుమాళ్లు అల్హాసేన్, అల్హుసేన్, అల్మొహాసి అనువారలు.

Perrault's story of blue beard నందు వివరింపఁబడిన ఫాతీమా మఱియొకవ్య గలదు.

**ఫాదర్ క్రిష్టమస్** (Father Christmas)— ఈతనిపేరు సెంటు నికలాస్ (St. Nicholas). రష్యాదేశస్థుఁడు. క్రైస్తవబోధకుఁడై యుండెనఁట. అచట నచట ఎవ్వరికగపడకుండ మంచిమంచి వస్తువులను (బాలు రాడు కొనునవి) తెఱచియుండినకిటికీలగుండా లోనికిఁబడవేయు చుండువాఁడఁట. రష్యాదేశమున నీమహాత్ముని తమ దేశరక్షకుండగు రుసిగాఁదలంతురు. రష్యాలోని లాప్లాండు (Lapland in Russia) దేశపుప్రజలు తమ దేవతలలోని నికలాస్ ఋషినొక్కనిగాఁదలంచి పూజింతురు. ఈయనరూపము పాదములదనుకంబడు తెలని పొడుగుకోటు, ఒకహూడ్డు, మెడచుట్టు విస్తా

రపు దళసరిరోమముల సముదాయమగు Furs కల్గి రెయిన్‌డీరు స్లెడ్జి (Sledge of Reindeer of Lapland) పైనెగురువానివలెఁ జిత్రింతురు.

ఈమహాత్మునిపై భక్తి రష్యానుండి పశ్చిమదేశమగు జర్మనీకిఁ బ్రాకెనఁట. అటనుండి హాలండుదేశ మధిగమించి సముద్రముఁ దాటి బ్రిటీషు దేశములకుఁ జేరెనట. పిదప భారతదేశమున క్రైస్తవులైనవారు నేర్చుకొనసాగిరఁట.

**ఫారెస్ట్రీ** (Forestry) - అరణ్యములను సంరక్షించి పెంచి యభివృద్ధిపఱచుటయు కలపగా (Timbers) నుపయోగించు కఱ్ఱనిచ్చు చెట్లనునాటి పెంచుటయు ఫారెస్ట్రీయనబడును.

టేకు, గుగ్గిలము, కంబ, ఇరుగుడి మొదలగు చెట్లకును కరక్కాయ, ఇండుపకాయ మొదలగు జాతులచెట్లకును నీరు విస్తార మక్కఱయుండదు. అట్టివాటిఁగూర్చి తెల్పు శాస్త్రము. ఏయే భూములందేయే అరణ్యవృక్షములు చక్కగ పెరుగునో వాటి పరిస్థితులం దెల్పుటయని భావము.

**ఫారోఆట**- ఇదిపేకాటలలోనిఆట. జూదపు ఆటగా నెన్నఁబడుచున్నది.

**ఫారోయాద్వీపములు** - ఐరోపాఖండములోని డెన్మార్కుదేశమునకుంజెంది, అట్లాంటిక్కు మహాసముద్రమునం దుత్తరభాగమున ఐస్లాండువద్దనున్న రెండుద్వీపములు. వితే (Vithey) యనియు, ఎంగే (Engey) యనియుఁ బేరులు.

వితేద్వీప మంతయు నొకనిది. అయన, యందే వసించుచు వ్యవసాయ మొనర్చుచుండువాఁడు. అయన పరివారము పశువులతో నందుండును. వేఱుజనులు లేరు. ఇట నొకవింతయగు పాతచర్చి కలదు. దీనితలుపు లెప్పుడు మూయరా దందురు

ఎంగేద్వీపము రెండుకుటుంబములవారిది. వా రందే పరివారముతో సేవకులతో వసించుచున్నారు. ఈద్వీపముల Eider ducks విస్తారము కలవు. ద్వీపము వ్యవసాయముక్రిందనే యున్నను వీరి శిస్తులు, ఈడర్డౌనులోనే చెల్లింతురఁట. మనవారు దీనిని హంసతూలిక యనుచుండుట కలదు. జూను నెలలో నీపక్షులు గూండ్లు బాగుజేసికొని తొలుత Down నిడి పఱచి, పిదప దానిపై గ్రుడ్లు పెట్టుచుండును. భూమిపై పల్లములందే గూడులు పెట్టును. పక్షులు వారికిఁ జాల చనవు. గ్రుడ్డు నొత్తిగించి దూది తీసికొందురు. దాని నెండఁబెట్టి సంచులలో నింపుకొందురు. ఇది హంసతూలిక. దీనితో తల్పములు చేయుదురు. అంగ్లమున వీటికి Eider down quilts అనుచున్నారు. చాల విలువగలది.

**ఫారోస్ ద్వీపములు** — ఉత్తరదిశగా అట్లాంటిక్కు మహాసముద్రమునందలి ౨౧ ద్వీపములసమూహము. డెన్మార్కు రాజ్యమునకుఁ జెందినవి. ౫౪౦ చతురపుమైళ్ళ వైశాల్యము.

ఫారోస ద్వీపములలో వాటియొక్క పార్లమెంటు కలదు. దానికి డేనిష్ పార్లమెంటునందు ప్రాతినిధ్య మున్నది. ౨౪౨౦౦ జనాభా.

**ఫార్మాలిజమ్** (Formalism) తటస్థుఁడుగనో పట్టుదలవీడక ఒకేదానినమ్ముకొని అన్యములజోలికిఁ బోక తటస్థుఁడై యుండురీతి.

మతధర్మమున కఠినమైనపట్టుదల కల వారింగూడ నీపేరను వాడుచున్నారు. దీనింగూర్చిన కళ ఒక నమ్మకము.

**ఫార్మోజా ద్వీపము** — ఆసియాఖండమున చీనాదేశప్రభుత్వమునకుఁ జెందియుండి క్రి. వె. ౧౮౯౫ లో చీనావారికి జపాన్‌వారితోఁ గల్గినసంగరమున జపానువారికిఁ జేరిపోయెను. ఇప్పుడు జపాన్‌వారికిఁ జెందియున్నది.

ఇందు కర్పూరపుచెట్లతోఁటలు నిండియున్నవి. ఉత్తరమున టాంసుయిపురమును, దక్షిణమున తాల్వాన్‌పురమును కర్పూరవ్యాపారము విశేషముగాఁగల రేవుపట్టణములు. (జపాన్ దేశము, చీనాద్వీపము, చీనారాజ్యము చూడుఁడు.)

**ఫార్సీస్థానము**— పారశీకదేశములోని యొకఖండము. (పారశీకదేశము చూడుఁడు.)

**ఫాలకుల గోత్రము**-ఆర్యవైశ్యులగం౧౨ గోత్రములలో నొకటి. (వైశ్య గోత్రములు చూడుఁడు.) ఫాలకుల (పాలకుల) గోత్రము. ఏకార్షేయ(ఠల)గోత్రము. సంస్కృతగోత్రము. నారదస. నారదగణము. పావనర్షి. ఆపస్తంబ యజుశ్శాఖ.ప్రమాణగ్రంథమూద్యప్రవరఖండ. సమాన గోత్రముపావనస. పోలేశుఁడు దేవత. పోలాంబ భార్య. బ్రహ్మాచలము తపస్థానము. వాల్మీకసరస్సు తటాకము. జపము లక్ష. దీపములు ౭౨. క్షేత్రసంఖ్య ౭౨. ఫలములు దానము. మాదీఫలము వర్జనీయము.

**ఫావర్‌క్షత్రియులు** — (చౌహానులు చూడుఁడు.)

**ఫాసిఫియోయిజమ్**(Fasifeoism)- క్రి. వె. 1922 అక్టోబరులో ఇటలీదేశస్థుఁడగు Signor Beneto Mussolini అనుపేరుగల రాజకీయ మహాసభ్యుఁడొకఁడు Communism కు వ్యతిరేక లక్షణములతో Fascistism అనునొకరాజకీయమతమును గల్పించి నడిపెను. దేశపాలకుఁడుగను నాతని ప్రధానమంత్రిగను నియామకుఁడుగను నియమించి నడిపించెను.

**ఫిక్చర్సు** (Fixtures)-వాణిజ్యసంబంధ పరిభాషాపదము.

భూములను సేద్యానుకూలముగ నొనర్చుటయు ఇండ్లను (అద్దెలకుగాను)నివాసార్హములుగ తగుమార్పులను, కొత్త నిర్మాణములను చేసి కల్పుటయు, ఫ్యాక్టరీలను వృద్ధిపఱచి యంత్రము లచే నితరపనులు చేయించుటకు వలయు నితర యంత్రసామగ్రిని జేర్చి యమర్చుటయు మొదలగు పనులకు ఫిక్చర్సు అనెదరు. ఇవి పిదప (వేఱుగ నుండక) అసలు సామగ్రికిఁ జేరిపోవునవియె యని యెఱుంగునది.

**ఫిక్సెడ్ కాపిటల్** (Fixed Capital) వాణిజ్య సంబంధ పరిభాషాపదము. శాశ్వత స్వభావముగల భూములు,ఇండ్లు,ఇనుపబాటలు, ట్రాంబాటలు మొదలగువానియందు తొలుత పెట్టిన పెట్టుబడి మూలధనము.

**ఫిక్సెడ్ స్టార్సు** (Fixed Stars)— ఇది ఐరోపాదేశములశాస్త్ర మగు ఎస్ట్రానామీ సంబంధమగు విజ్ఞానము. (ఎస్ట్రానామీ చూ.) చూచినంతనే కోట్లకొలఁదినక్షత్రము లాకసమునఁ గన్పట్టిన ట్లుండినను, నిజమున లెక్కింపఁదగిన పీశాస్త్రముమేరకు ౩౦౨౮ ఇప్పటికై యున్నవి. నక్షత్రములు Planets అనియు, Fixed Stars అనియు, ద్వివిధముగ విభజింపఁబడినవి. స్థితులనుండియు, గతులనుండియు వేగమునుండియు, వెలుతురునుండియు, పరిమాణములనుండియు, వాటికి భూమినుండిగల దూరముల నుండియు భేదములు పాటించియున్నారు.

ఆదికాలముననె వేర్వేరు నక్షత్రసముదాయములకు Constallation ల నేర్పఱచి వాడుటకు మొదల్పెడిరి. నాటికి పేర్లనుగూడఁ బెట్టియుండిరి. అందు Great Bear అనంబడు కాన్స్టలేషను ఆకారముచే పేరందినది. ఇంకఁ గొన్నిటికి Serius అనియు, Areturus అనియు Regulus అనియు ఈ మొదలగు ఘనులనామము లిడిన నక్షత్రములు కలవు. ఎక్కువ తేజోవంతములగు నక్షత్రము లధిక పరిమాణములు గలవి యనియు తెలిసెడిని.

నక్షత్రములు పెద్దచిన్న తారతమ్యములనుండి యాఱు తెగలుగ నిటీవలిపరిశీలకులు విభజించి యున్నారు.

Milkey way లేక Gaalxy అనంబడు Constallation చిన్న నక్షత్రసముదాయము నిండే చేర్చిరి. (చూడుఁడు.)

ఈఫిక్స్డ్ స్టార్సు పరిశీలనలందు విచిత్రములు చెప్పఁబడినవి. కొన్ని మరుగుపడుటతో క్రొత్తవి గన్పడుటయు, అవి మాయమగుటతో తొల్లింటివి తిరుగఁ గన్పడుటయు, కొన్ని పరిమాణములు, కాంతులు, మార్పుజెందుటయు ఒక్కటిగఁ గన్పట్టు నక్షత్రము రెండుగను, మూఁడుగను, నాల్గుగను కన్పట్టుటయుఁ జెప్పఁబడినవి. ఇట్టి విచిత్రనక్షత్రము లేమవందల పదిఱుఁ గలవని Dr. Herschel పరిశీలకుఁడు వివరించియున్నాఁడు. ఒక Double starనం దొకటి మెఱుపు. రెండవది ఊదారంగుగ నుండినదనియు, ఒకేనక్షత్రముగ నగుపడు Harp నక్షత్రమునందు మూఁడు తెల్లవి, ఒకటి మెఱుపుగల నాల్గునక్షత్రము లుండుట చెప్పఁబడినది.

క్రీ. శ. ౧౫౭౨-౨ లో నగుపడిన వేఱొక నక్షత్రము మధ్యాహ్నమునం దధిక తేజోవంతముగ (Venus కన్న నధికముగ) గన్పడి, తెల్లనిరంగు పసుపుపచ్చగ మాఱెననియు ౧౫౭౩ మేనెలలో నెఱ్ఱగ నగుపడి రానురాను రంగుతగ్గి యదృశ్యమాయెననియు చెప్పఁబడినది. ఇంక వీటిదూరములును అపరిమితమై యచ్చెరువు గొల్పెడిని. నక్షత్రములందెలియ Constallations కుఁగాను ఆకాశమును మూఁడుగ ఖండములుగ నేర్పఱచి, భూమధ్య రేఖపైనుండు ఆకాశభాగమునకు Zodiacal అనియు, ఉత్తర భాగమునకు Northern అనియు, దక్షిణ భాగమునకు Southern అనియు నేర్పఱచిరి. (కొట్టనలేపనములు చూ. ఎస్ట్రానొమీ చూ.)

**ఫిజికల్—ఎస్ట్రానొమీ** — (ఎస్ట్రానొమీ చూడుఁడు)

**ఫిజిక్సు (జగద్వస్తుశరీరధర్మ శాస్త్రము)**—Physics పాశ్చాత్యకల. జగద్వస్తువులు లెక్కలేనివి కలవు. వాట్ల శరీరములు (Matter) ధర్మములు. వాటియందుఁగల సామర్థ్యము (Energy) ల వివరణములను వివరించుకల.

దీనిని Laboratory physics అనియు, Mathematical physics అనియు ద్వివిధములుగఁ జెప్పఁబడినది. Matter నందలి Energy విషయము Mathematical physics క్రింద నె చెప్పఁబడినది.

**ఫిజిద్వీపములు**— వీటికి విటిద్వీపములనియుఁ బేరు కలదు. పసిఫిక్ మహాసముద్రపు దక్షిణభాగమున నున్నవి. రెండువందల ఏఁబది ద్వీపములు బ్రిటీషుసామ్రాజ్యమున క్రొన్నోకలనీగా నున్నవి. ఇం దెన్మిదింట జనులు వసించుచున్నారు. మూఁడు పెద్దవి. విటిలెవు అనంబడు పెద్దదీవియందున్న సువాపురము ముఖ్యనగరము. ఈద్వీపములందు కొబ్బరిచెట్లు కోకోచెట్లు పెరుఁగును. మొత్తము ౨౦౮౩ చతురపు మైళ్ళ వైశాల్యము కలవి. ఇందు ౯-౨౧౮౯ స్వదేశస్థులు. ౨౮౮౧-౨ హిందువులని తెలియుచున్నది.

**ఫిజియాగ్రఫీ** (Physiograpy)-భూమియొక్క స్వభావగుణమును పరిణామముల కారణములను పరిశోధించువిధానము. సముద్రమున నదులు, పర్వతములు, సరస్సులు మొదలగు భూగోళవిభాగము లన్నియు నన్నిటి స్వభావపరిణామములు నీశాస్త్రము విశదీకరించును. తుపానులు, భూకంపములు మొదలగు నాకస్మిక పరిణామముల నీ శాస్త్ర సహాయము వలన గుర్తించుటకును వీలుగ నుండును.

**ఫిజియాలోజీ** (Physiology)— ఇది జంతుదేహశాస్త్రము. ఇది పాశ్చాత్యకల. శరీరములందలి వేర్వేరవయవములు చేయుపనులంగూర్చి తెల్పువిద్య. లాటిన్భాషా పదమగు Physis అనఁగా (Nature) అనుపదమునుండియు, Logos (అనఁగా discourse) అను పదమునుండియు నేర్పడినది. సంపూర్ణారోగ్యస్థితియందు శరీరమునందలి వేర్వేరు అవయవములు చేయుపనులఁగూర్చి యెఱుగజేయువిద్య. శరీరావయవముల Structureనుగూర్చి తెల్పుకలకు anatomy అనిపేరు. అదియును దీనికిఁ జేరినదే. మఱియు నివి జూఆలోజీలోని ఉపకలలని చెప్పఁబడినవి. (జూఆలోజీ చూడుఁడు.)

ఫిజియాలోజీవిద్యకుం జేరి ఉపకలలుగా Embriology (study of foetus) గర్భస్థపిండముల విజ్ఞానకల Ostelogy (Study of the bones) ఎముకలవిజ్ఞానమునుగూర్చినకల Neurology (నరములు మెదడుంగూర్చిన విజ్ఞానమునుదెల్పుకల)లును జెప్పఁబడినవి. ఇంతియె గాక రక్తము, హృదయము (గుండె) మూత్రపుతిత్తులు, ఊపిరితిత్తులు, చర్మము, చెట్లలోని Sap (సొన) యనంబడురసము, ఈ మొదలగువాటినిగూర్చి యీ శాస్త్రమునందే వివరింపఁబడినది.

ఈఫిజియాలోజీ-కల. Human physiology (అనఁగామనుష్యశరీరసంబంధశాస్త్రము) Animal physiology (అనఁగా మనుష్యులు తప్పతక్కినజంతువులయొక్క శరీరసంబంధశాస్త్రము) Plant physiology (అనఁగా వృక్షముల శరీరసంబంధశాస్త్రము) అని మూఁడు భేదములుగ వివరింపఁబడియున్నది. జీవజంతువుల శరీరములందలి ధర్మములు ముఖ్యముగ రెండని చెప్పఁబడినవి. శరీరములు తన ధర్మములను నిర్వహించుచు పనిచేయుచుండుటకు రెండు ముఖ్యపదార్థములు గల్గియుండుట అవసరమనియు, అవి ౧ Protoplasm అనునదియు, రెండవది Energy యనియుఁ జెప్పఁబడినది. జీవకాలమున శరీరము సదా మార్పులం జెందుచుండును. భోజనముజీర్ణమగుకొలఁది నదివఱకుండిన Protoplasm నశించుచు క్రొత్త Protoplasm వాటిస్థానమునకువచ్చుచుండును. ఈపని సదా నడచుచునే యుండును. మఱియు నీప్రోటోప్లాసమ్ ఎనర్జీని కల్గించును. ఆయెనర్జీ నిల్వయగుచుండును. అట్లు నిల్వయయి యుండిన ఎనర్జీ పనిచేయుకతి కొంతకొంత వ్యయమగుచుండును. ఇది శరీరబలము లేక సామర్థ్యము ఆహారము జీర్ణమై ప్రోటోప్లాస్మ్ యోగ మగుటకు Assimilate అని పేరిడియున్నారు. మఱియు నీశాస్త్రవిధానముననే ఆహారము జీర్ణమగుటతో Raw material అగునని యు, అది శరీరమున Transmute అయి Living Protoplasm అగుననియు వివరింపఁబడినది.

**ఫిజియోగ్నమి** (Physiognomy)— ముఖముయొక్క కళలనుబట్టి స్వభావమును గ్రహించువిధానము. రెండవ జార్జిరాజుకాలములో ఈవిద్యననుసరించి ఫలములను చెప్పునట్టిపండితులను కొరడాదెబ్బలను కొట్టియు కారాగృహమునం దుంచియు శిక్షించుచుండెడివారు. ఈకాలమున నీవిధానముకూడ ఉత్తమశాస్త్రములయందు జేరఁబడి గౌరవింపఁబడుచున్నది.

**ఫిజియోగ్రఫీ** (Physiography)— ఫిజియోగ్రఫీ భూగోళ శాస్త్రమునకుఁ జెందిన ఒకకలయై యున్నది. ఇందు జియోలజీ (భూశాస్త్రము), మినరాలోజీ (ఖనిజ శాస్త్రము), Soil Physics and Chemistry భూకంపములు, అగ్నిపర్వతములు, పర్వతములు, నదులు, సముద్రములు, సరస్సులు, ద్వీపములు, అగ్రములు

మొదలగువాటిని గూర్చిన శాస్త్రము. వీటికి Configuration of Earthఅని శాస్త్రమున పేరు వాడఁబడినది. ఇంకనుదీనికి Applied Science అనియుఁ గొందఱనియున్నారు. (సర్వే చూడుఁడు.)

ఈశాస్త్రసాహాయ్యమువలన నేపర్వతములు నదులు, అగ్నగములు మొదలగునవి అదినె ట్లేర్పడినవో తెలియుచున్నది. మఱియు వేసవి, శీతకాలము,వర్షకాలము మొదలగు కాలభేదములు గల్గుటకుకారణములు తెలిసెడిని. ఇంకను ఈకాలభేదవిజ్ఞానమునకు Meteriology అని పేరిడి, దానిని ప్రత్యేకశాస్త్రముగ నిటీవలివారేర్పఱచి విభజించిరి. మఱియు ఫిజియోగ్రఫీ కలను Physical geography అనియు కొందఱు వాడిఉన్నారు.

Migration of animals and plants యీ శాస్త్రమునకుఁ జెందినవిగాఁ జెప్పఁబడినవి. జంతువుల యెముకలు, అస్తిపంజరములు, వృక్షములు (చనిపోయినవి) మొదలగువాటం గూర్చిన పరిశీలన లీశాస్త్ర సంబంధములుగనే చెప్పఁబడినది.

**ఫిజియరౌగారి ఎక్స్పెరిమెంటు** (Fizeau's Experiment)— ఇది సుప్రసిద్ధమగు పరిశీలనము A. H. L. Fiziau పండితుఁడు. తానుకనిపెట్టిన ఒకముల్లుగలచక్రముం ద్రిప్ప వెలుతు రొకయద్దముపైఁ బడునట్లొనర్చి చేసినపరిశీలనలు వెలుతురుయొక్క Velocity (గమనవేగము) తెలియనగుచున్నది.

**ఫిజోర్డు**— (ఫియోర్డ్సు చూడుఁడు.)

**ఫిడ్యూసియరీ లోన్**— వాణిజ్యసంబంధపరిభాషాపదము. Fiduciary Loan. తనఖాఆస్తి లేకుండా విచ్చిన నమ్మకపుఋణము. Fiduciary Note. అందుకుతగిన మనీరిజర్వు లేకుండా ఒకబాంకియొక్క మోతుబరితనము, గౌరవప్రతిష్ఠలు, ప్రజలనమ్మకములపై నాధారపడి ఒకబాంకీ Issue చేసిన బాంకినోట్లకీపేరు వాడెదరు.

**ఫినామినా** (Phenomena)— ఆశ్చర్యమునుగల్గించు దృశ్యము. సర్వసాధారణముగనెవ్వరి కగోచరమైనకారణమునఁ గల్గిన విపరీత పరిస్థితులు గోచరమగుట. ఇది యొకదృశ్యము.

**ఫిన్లాండుదేశము**— ఐరోపాఖండమున రష్యాస్వీడనుల నడుమనున్న దేశము. తూర్పున రష్యాదేశము, దక్షిణమున లడోగాసరస్సు, రష్యాదేశము, ఫిన్లాండుసంయుక్తాగ్రగుడమును, పశ్చిమమున గల్ఫాఫ్ బొతినియా, స్వీడన్దేశమును, ఉత్తరమున నార్వేదేశమును ఎల్లలుగాగల్గినదేశము.

ఫిన్లాండను పేరువిదేశస్థులిడినది. స్వదేశస్థులు వారిఫినిష్ భాషయందు "Suomi"అనియెదరు. తడినేలయని ఫినిష్ భాషయందు దానికర్థము. వారిచరిత్రాత్మకములకు పాటలకు Runos అనిపేరు. వాట్లయందు దీదేశము వీరులభూమియని వాడఁబడియున్నది. ఈదేశముఁజూచి యచ్చెరువందిన విదేశస్థులు దీనిని Land of thousand lakes అని కొందరును, Land of thousand isles అని కొందరును దీనిని ప్రశంసించెదరు. గాని నిజమున వేయికన్న నధికముగనే నీదేశమున సరస్సులును ద్వీపములును కూడ కలవని జెప్పఁబడినది. బాలురు దీనిని Strawberry land అనియెదరఁట. ఏలయన ఇం దావండ్లు సమృద్ధికిమించి పండుచుండు నఁట.

సరస్సు లధికముగనుండిన నీదేశమున కాలువలు, నదులు వీటిని సంయుక్తమొనర్చుచు వారములతరబడి నీటిపైనోడలయందు ప్రయాణ

మొనర్ప వీలుగలిగించినవి. సగటున ఫిన్లాండు దేశ వైశాల్యమునందు పదియవవంతు జలమయ మైనవనియు, నీరు, భూమి, కొండలు, అరణ్యములు ఇంతగాఁగల దేశములు ఇతరము లేవియు కావనియు చెప్పుదురు. ఇగి ఉత్తరధ్రువప్రదేశ పరిసర మగుట వేసవియందు దీర్ఘ దివసములు కలవు. జూన్ నెలయందు రాత్రియె యుండదు. పశుపక్ష్యాదులు నిద్రించుట మరచియుండును. బాలురలసిపోయినతటి నిద్రించుచు తిరుగ మేల్కొనుచుందురు. రేయింబవళ్ళు సూర్యాస్తమయ మనునది లేక, ఒకే రీతి నుండును. ప్రభుత్వమును దీని కనుకూలించి మే నెల మొదలు సెప్టెంబరువచ్చువఱకు బడులు మొదలగువాటికి సెలవులిచ్చుచుందురు. శీతకాలమున ఉదకములన్ని ఘనీభవించి మంచుగ నుండును. అప్పుడు మార్గగమనములు స్లెజిల పైని జరగును. ఇంకను Skating sleighing skiing (snow shoeing) విస్తారము సర్వత్ర దర్శనమగుచుండును.

ఫిన్లాండు దేశమునఁగల ఓడలకాలువలందు సైమా కెనా లనునదిగొప్పపని. (సైమా కెనాల్ చూడుఁడు). ఫిన్లాండుప్రజలందు గొప్పవిద్యాధికులు విస్తారముమంది కలరు. వారు మూఁడు నాల్గుభాషలందు ప్రవీణులుగను, ఆంగ్లము, రష్యనుభాష తప్పక నేర్చినవారుగను ఉందురు. బుద్ధిశాలురు.

సైమాకాల్వదరినే యున్న Monrepose Estate నందు ఫిన్లాండు దేశాకారము నేర్పఱచి అందు యధారీతిని సరస్సులు, పర్వతములు, నదులు, సముద్రములు, పట్టణములు, దుర్గములు, అడవులు మొదలగువాని నొక భూపటమున చిన్న చిన్న రూపములు వీలగునన్ని తఱిశీళ్ళు రచించియున్నారు.

దేశమున నడవులు దట్టమైనవి గల్గియుంట కలప అపరిమితముగ విదేశముల కనుపఁబడుచుండును. పొగయోడలందు సైతము కాల్చునది కలపయె, వంటచెఱకుగను కాల్పఁబడుచున్నది. ఓడలసరంగు లీదేశము గొప్పశక్తిసామర్థ్యములతో చతురత గలవారని పేరందియున్నారు.

దేశమున జలతీరములందు Saw-mills అనేకములు కలవు. ఇందు వలసినపరిమాణములకు కలప కోతగోయుపని జరగుచుండును. ఉత్తరభాగములందు Lapp జాతివారును, దక్షిణమున ఫిన్జాతివారును ముఖ్యులు. ఉత్తర ధ్రువదేశములుగల రష్యా, ఫిన్లాండు, స్వీడన్, నార్వే దేశముల ఉత్తరసీమల నన్నిటిని లాప్లాండని వాడుచున్నారు. (చూడుఁడు.) లాప్లాండరులు పొట్టివారు, గట్టివారు, పిఱికివారు, అనాగరికులు, విద్య చాల తక్కువగలవారు. వీరి మధ్య కొందఱు క్రైస్తవమిషనరీలు ప్రవేశించి జీవనోపాధినందుచు వీరిని క్రైస్తవులం జేయుచు, లోతరస్సని, ప్రొటస్టాంట్లని, కేథలిక్కులని చెప్పుచు సువార్త బ్రకటించుచుందురు గాని, ఎజమున నావార యేమో వారి కర్థము కాకుండునని ప్రతీతి కలదు.

వారు వసించు దేశపరిస్థితులమేరకు లాప్లాండరులందు అడవితెగ, కొండతెగ, చేపలతెగ యని మూఁడుముఖ్యభేదములు గల్గియున్నారు. చేపలంబట్టువారియం దించుక విద్య వ్యాపించినదని యనెదరు. రుష్యావారియం దీచేఁపల లాపువారు వేఱట. వారికి విద్యయు శూన్యమే. అన్యులు వీరిని లాప్లాండరులని యనెదరు గాని వీరిలోఁపి రన్యోన్యము Samelat అని పిలుచుకొనెదరు. వారిదేశమును Same అనియెదరు. ఒక్కొకతటి అపహాస్యముగా వాడుచుందురు. ఫిన్లాండుభాషయందు లప్పయనిన Land-End Folk అని యర్థము. ఫిన్నులందు లాప్లాండరు

లకు గౌరవమును, లాప్లాండరులకు సుహృద్భావమును గలదు. రష్యనుల కట్లు లేదు.

నైసర్గికముగ లాప్లాండరులు క్రొత్తమార్పుల నొల్లరు. వీరియందు దొడ్డికాళ్లుగలవా రెక్కువ మంది కలరు. అందరు మనదేశపు బుడబుడక్కలవారివలె నొకచేతి డమరుగమును వాయించుచు భవిష్యత్తుం దెల్పుచుందురు. ఒకతఱి రష్యాదేశమేలిన జారులలో నొకరు వీరిని భవిష్యత్తును గూర్చి సలహా చేసియుండె నని చెప్పఁబడినది. వారివిషయమై వారిగమనాదుల నీడమరుగమును వాయించుచుఁ దెల్పుకొనుచు అట్లె నడుచుచుండువారని ప్రతీతి కలదు. వీరికి రైండీరుమృగముల పశుధనమే ధనము. దాని పాలు ద్రావుదురు. ఛీస్ చేసికొందురు. దాని చర్మము దుస్తులగును. అవి వీరి స్లెజిబండ్లు లాగును.

నాల్గింట మూఁడువంతుల ప్రజలు వ్యవసాయము, అడవి కలపపనులు గలవారు. కొందరు కలపంగాల్చి వాటినుండి తారుతీయువృత్తి గలవారు. ఇది పైన్ మొదలగు అడవిచెట్లనుండి వచ్చును. కాగితములు చేయునిమిత్తము Wood pulp కొందరుచేయుచుందురు. టామెర్ఫోర్సు నందు లినెన్‌బట్ట ఉన్నివస్త్రములు నేత విస్తారము కలదు. ఫిన్లాండునందు పేపరుమిల్సు, ఫెల్టుమిల్సు, సెల్యూలోయిడ్మిల్సు కలవు. (రష్యాదేశము చూడుఁడు).

ఆబోపురము, హంగోపురము రేవుస్థలములు. శీతకాలమున సముద్రపునీరు ఘనీభవించి బిగిసిపోయినతరి స్టీమరులు మంచును పగులఁదీసి దానిని ఓడలు నడువ వీలగునట్లు జేయు నేర్పాటులు కలవు. గాన ఈరేవు లెప్పుడు తెఱచియుండును.

క్రీ. శ. పండ్రెండవ శతాబ్దము వఱకు ఫిన్లాండు నిజచరిత్రి తెలియదు. అప్పుడుస్వీడను భూపతియగు ఎరిక్భూపతి ఆర్చిబిషప్హెన్రీయను మతాచార్యుని వెంటఁగొని ఈదేశమున కేగి కొందఱను క్రైస్తవులంజేసితనయధికారమునట స్థాపించెనని చెప్పఁబడినది. అప్పుడు ఆబోపురము ముఖ్యపట్టణముగా నుండెనఁట. ఆయనతో పెక్కుమంది స్వీడులు అటకేగి అట నివసింప నారంభించిరి. వారికి భూవసతు లట నొసంగఁబడినవి. ఆరుశతాబ్దములలో నిట్లు జనులు అట దట్టమైరి. బాల్టిక్కుసముద్రమున తమయధికారము స్థిరపఱచుకొను ప్రయత్నముంగాంచి రష్యా తానాక్రమింప నెంచెను. యుద్ధములును ప్రజల క్రొత్తడియు నదేపనిగ నుండి క్రీ. శ. ౧౮౦౯ లో రష్యా స్వాధీనమగునట్లు తోఁచెను. నెపోలియనుతో కలహములందు స్వీడన్ నిమగ్నులుగనుండు సదనున రష్యా కలుపుకొనియెను. అక్కాలమున రష్యాప్రభువగు ఒకటవయలగ్జాండరు, ప్రజలు లొంగకున్నను వారిస్వతంత్రపరిపాలన నంగీకరింతునని సంధినెరపి తనరాజ్యమునకు గల్పుకొనెను. ప్రజలు చేయునదిలేక ఆపరిస్థితులందు రష్యాజారును తమగ్రాండుడ్యూకుగా నంగీకరించి, పట్టాభిషేక మొనర్చిరి. రెండవఅలగ్జాండరు వారి యాచారములను మన్నించుచు వారిని స్వాధీన మొనర్చుకొనియెను. అదిమొదలు ఐరోపామహాసంగ్రామకాలమున రష్యా ప్రజాస్వామ్య దేశమగుటతో ఫిన్లాండును స్వతంత్రతకుఁదోడు వేరుదేశ మాయెను. ఇప్పుడు ప్రజాప్రభుత్వదేశమై యున్నది.

**ఫిన్లాండుదేశపు ప్రభుత్వము** (Finland)- ఐరోపాఖండమునందలి ప్రజాప్రభుత్వదేశము. ఒకలక్ష నలువదినాల్గువేల మూఁడువందల చతురపుమైళ్ల వైశాల్య మనియు, ముప్పదియైదులక్షల యెనుబదివేలు జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది.

**ఫ్లియోర్డు లేక ఫ్లిజోర్డు** (Fiord or Fijord)-నార్వే స్వీడన్ దేశములందు భూమి (దేశము)లోనికిం కడుదూరము చొచ్చుకొని పోయియుండునట్లు వెడల్పుతక్కువ సముద్రపు పాయ (భాగము) లు. (దీనింగూర్చి Sea portions ను చూ. లియా చూడుఁడు.)

**ఫ్లిరంగి** (Cannon) (శతఘ్ని) — తొలుత ఫిరంగిని చీనావారు కనిపెట్టిరని తెలియు చున్నది. క్రీ. ము. ౬౧౮ నాటి చీనారికార్డు లందు వీటిప్రశంస కలదు. గాన అంతకుమున్నె వారు దీనిం గల్గియుందు రని తోఁచెడిని.

Mr. John Owen గారు ఇత్తడి ఫిరంగిని చేసిరని చెప్పఁబడినది. క్రీ. వె. ౧౫౪౭ లో ఇనుముతో ఫిరంగిని ఇంగ్లాండునందు తొలుత చేసిరఁట. తరువాత గొప్ప యభివృద్ధి నంది యున్నవి. ఇక్కాలమున ఫిరంగులు, గుండ్లను పదునేను మైళ్ళదూరము పంపగలవి కలవు. నూర్గురం జంపఁగలది గాన దీనికి శతఘ్ని యని తొల్లింట పేరు కల్గెను.

**ఫ్లిరంగిచెక్క లేక గాలిచెక్క** — లా. Smilax China. ఆంగ్ల China root. దీనింగూర్చి సరిగా తెలియరాకున్నది. ఇది దుంప యందురు.

వేడిచేసి రక్తమును శుభ్రపఱచుననియు, సర్వపైత్యములు క్రిమిరోగములు సర్వకుష్ఠములు చర్మవ్యాధులు నివారించుననియు, ఇంగిలీక దోషము, రసదోషము నివారించు ననియుఁ జెప్పఁబడినది.

ఫిరంగిచెక్క లోనికిచ్చుతఱి దేహమునిం చుక శుష్కింపఁజేసి చులకపఱచి మరియీాయ వలయు ననియు, ఏడుదినములు ప్రయాణము జేయించి శరీరమును లఘువుపఱిచి మఱియు నీయఁదగు ననియుఁ జెప్పఁబడినది. ఇత్తఱి ప్రయాణమనిన నినుపదారి ప్రయాణమును, బంధువులయిండ్లలో భోజనమొనర్చుప్రయాణ మును కాదని యెఱుంగవలయును. ఫిరంగి చెక్కను లేహ్యముగ నితరవస్తువులంగల్పి. యొనర్చి లోనికిచ్చుట శ్రేయస్కరము. యావన వంతులు, నిక్కాకతత్వముగలవారు, కఠినపథ్య మున కొడంబడ లేనివారు ఫిరంగిచెక్క సేవింప రాదు.

**ఫ్లిరోజ్పూరుజిల్లా**-- ఫిరోజ్పూరునగరము ప్రధానస్థానము (పంజాబు దేశము చూడుఁడు.)

**ఫ్లిర్తు**—Firth or Frith. స్కాట్లాండు దేశమునఁగలవు. (దీనింగూర్చి Rivers చూ.)

**ఫ్లిలాన్త్రఫ్లి** (Philanthrophy) — జీవ కోటిని ప్రేమించి స్వార్థరహితమగు(యుపకార) చింతతో సేవ చేయుటయే పరమార్థమను సిద్ధాంతము.

**ఫిలాసఫీ** (Philosophy)-- పాశ్చాత్య దేశములలో ఫిలాసఫీ రెండువిధములు. Natural philosophy (ప్రకృతిసిద్ధము)Moral Philosophy (సత్ప్రవర్తనము) ప్రకృసిద్ధమగు విజ్ఞానము ప్రకృతిశక్తులను మానవుఁడు విని యోగించుకొను మార్గముల నన్వేషించుటకు పరిణమించినది. రెండవది మానవస్వాతంత్ర్య సాధకమైనది.

అసలు "ఫిలాసాఫీ"యనఁగ నాత్మజ్ఞానము. ఆత్మయొక్క నిజతత్త్వము, ఆత్మయొక్క సర్వ వ్యాపకత్వము పశ్చిమ ఖండములయం దీత త్త్వమును సోక్రెటీస్, ప్లేటో, అరిస్టాటల్ అనువారలు మొదట చింతనజేసి గ్రంథములను రచించిరి. ప్రాచ్య దేశములం దీతత్త్వము పూర్ణముగ ప్రవర్తనమైనది. భారతవర్షమందు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, కర్మసూత్రములు, మీమాంసాశాస్త్రము రచింపఁబడినవి. బుద్ధుఁడు

కుమారిలభట్టు, శంకరుఁడు, రామానుజుఁడు, చైతన్యుఁడు, బసవేశ్వరుఁడు, మొదలగు తత్త్వజ్ఞులు నాచార్యులు ప్రబోధించిరి.

అరబ్బీ దేశమున మహమ్మదువారును, వారి తరువాత వారితత్త్వమును విపులముగ సూఫీలును ప్రబోధించిరి. ఆత్మజ్ఞానభాగమునందు ప్రాచ్యదేశములును Natural Philosophy యందు పాశ్చాత్యదేశములును ముందంజవేసిన వనుట సత్యదూరము కాదు.

(తత్త్వశాస్త్రమున ఆంగ్లవిధానము చూ.)

**ఫ్లిలిప్ డ్రంకు — ఫ్లిలిప్ సోబర్** — Appeal from Philip drunk to Philip Sober. ఇద్ద్వరు దుర్మార్గులలో నొకఁ డధికారపదవి నందియుండి రెండవవాని నొకకార్యార్థ మర్థించుట కీయుక్తిని ప్రసంగములందు హేళనగ నుడువుచున్నారు.

**ఫిలిప్పైన్ ద్వీపములు** — ఇవి అనేకములు కలవు. ఓసీనియాయందలి మలేశియా ద్వీప సమూహమునకు జెందె అందలి సుండా ద్వీపములలోనివై యున్నవి. బోర్నియో ద్వీపమున కీశాన్యదిశగా హిందూ మహాసముద్రమునకుఁ జెందిన ట్లుంకుద్వీపములు మిగుల ఫలవంతమైన భూములు కలవి. వెనుక స్పానియా దేశపు ఆక్రమణయం దుండెను గాని ఇటీవల నమెరికా సంయుక్తరాష్ట్రముల వారికిఁ జెందియున్నవి.

వీటియందు లూజాన్ ద్వీపము పెద్దది. ఇది ఉత్తరదిశగా నుండును. ఇంకను మిండానావో ద్వీపము దక్షిణ దిశయం దున్నదియు, నైరృతి దిశయందున్న ఫలవాన్ ద్వీపము (ఫలవంత ద్వీపము) ను ఇందు పెద్దవి. ధాన్యము, చెఱకు, పొగాకు, జనపనార ఈ ద్వీపములందు విస్తారముగ పైరుచేయఁబడుచున్నవి. లూజాన్ ద్వీపమునందలి మనిలాపట్టణము వీటికి ప్రభుత్వస్థానము, వర్తకస్థలమునై యున్నది. అటపొగాకు చుట్ట లధికముగాఁ జేయంబడు చుండును. అందు మూఁడులక్షల ఏఁబదివేల జనులు వసించుచున్నారు.

ఫిలిప్పైన్దీవులు తొలుత క్రీ. వె. ౧౫౨౧ సంవత్సరమున స్పానియా దేశస్థుఁడగు ముగెల్లాన్ అను నావికుఁడు కనుఁగొని, స్పానియా దేశాధిపతి యగు రెండవ ఫిలిప్పు భూపతిపేరిడెను. నాఁటినుండియు నాపేరుననే యున్నవి. మగెల్లాన్ నావికుఁడు భూమినిజుట్టి తిరిగి వచ్చినవాఁడనియు, ఈద్వీపములలో నొకదానియందు హత్యచేయఁబడి మృతిఁజెందె ననియుఁ జెప్పఁబడినది.

**ఫిలిభిత్‌జిల్లా** — పిలిభితునగరముప్రధానస్థానము. (ఆగ్రాప్రోవిన్సు చూడుఁడు.)

**ఫీ టెయిల్** (Fee Tail)— వాణిజ్యసంబంధపరిభాషాపదము. పన్నుబందెలు లేక సర్వదుంబాలామాన్యము. ఇది ఒకవిధమగు వంశానుక్రమమున జరిగెడిని.

**ఫీ సింపిల్** — వాణిజ్యసంబంధపరిభాషాపదము. Fee Simple నిస్సంశయమని యర్థము. ఏతకరరులు. లేక హక్కుగుభూమికీపేరు వాడుదురు.

**ఫుట్బాల్ఆట** (Foot ball)— ఇది గుల్లగ లోన గాలిగల్గి యుండి, ఇరువదియెన్మిదంగుళముల చుట్టుకొలతగల్గిన తోలుబంతిని



కాలితో తన్నుచు నాడు నాట. ఈ యాట ఇరుకక్షుల వారిచేనాడఁబడును. ఆకక్షులకు టీమ్సు (Teams) అనిపేరు. ఇదిప్రసిద్ధినందినయాట. గొప్పపందెములతో నాడఁబడునది. ఈయాట

అసోసియేషన్ ఫుట్బా లనియు, రుగ్బీఫుట్బా లనియు ద్వివిధమై యొప్పెడిని.

౧ అసోసియేషన్ఫుట్బాలు ఆట- ఇది నూరు మొదలు నూటముప్పది గజములకు తక్కువ గానిపొడవును, ఏఁబదిమొదలు నూఱుగజముల వఱకుఁగల వెడలుపుఁగల మైదానముపై నిరు కక్షులవారిచే నాడఁబడును. ఆటగమ్యస్థాన స్తంభము గోలటికోలటి యెన్మిది గజముల దూరముననను (Goal Posts), వాటికి అడ్డ ముగఁ గట్టఁబడు Cross bar భూమినుండి ఎన్మిదడుగులయెత్తునను ఏర్పఱుపఁబడును. ఈ రెండు స్తంభములనడుమగ రెండవకొన కొక సరిహద్దుగీత తీయఁబడుదానికి Centre line అనిపేరు. రెండు స్తంభముల మధ్యప్రదేశము నకు Goal mouth అని వాడుకనామము కలదు. ఈ గోల్మొతునుండి పదమూఁడుగజ ముల దూరమువఱకు Penalty Area యనంబడుతావు గుర్తింపఁబడి యుండును. ఈపినల్టీఏరియాపొడవు నలుబదినాల్గుగజములు. ఆటరంగస్థలితో తిన్నగనె దీని నంటియె యుం డును. రంగస్థలికడహద్దుగీతలకు Touch lines అని పేరు.

ఈఅసోసియేషను ఫుట్బాలాటయం దుప యోగింపఁబడు బంతి చుట్టుకొలత ఇరువది యెన్మిదంగుళము లుండును. ఎదుటికక్షియాట కాం డ్రెప్పుడు తమబంతి నివ్వలిస్తంభముల మధ్యకుం దన్నుంకించుచుందురు. అంతేకాక తమవైపు గోలుమౌతును కాచుచుండు ఆటకా నికి దన్నుగనుండి, ఎదుటకక్షివారిబంతి నీముఖ ద్వారమునకుఁ జేరనీయక నెదురుదన్నిత్రిప్పివేయు చుందురు. ఐనను ఆడుచుండుబంతిని ముఖద్వార రక్షకుండగు నాటకాఁడు తప్ప తక్కినవా రనవ సరముగ నడ్డు దగులరాదని నిబంధన కలదఁట. ఈయాట ఇద్దరు లైన్సుమెన్ (Linesmen) అనంబడు నధికారులచేతను, వారిపై యధికారిగ రిఫరీ (Referee) యనంబడు తీర్మానపు టుద్యోగిచేతను భద్రపఱుపఁ బడుచు ధర్మ విధానమున నడుపఁబడుచుండును.

౨ రుగ్బీ ఫుట్బాలు ఆట (Rugby) ఈ యాట ఆంగ్లసీమయందు రుగ్బీ యనంబడు తావున సుప్రసిద్ధముగను, విస్తారముగను నాడ బడుచుండుట నీపేరందె నఁట. ఇది అసోసియే షనుఫుట్బాలుఆటనుండి ఇంచుకభేదముగల్గియుం డును. విధానమునందునను భేదము గలదట.

రుగ్బీఫుట్బా లాటయందలి రంగస్థలము నూటపది గజములపొడవును,డెబ్బదిమైదడుగుల వెడలుపును తప్పక గల్గియుండవలెను. మఱియు రంగస్థలికడలందు లోపలనే ఇరువదిమైదేసి గజముల ప్రదేశమును గుర్తించియుంచుదురు. దీనిని In goal area అని పిలిచెదరు. ఇం దాడబడుబంతి గుండ్రముగా నుండక కోలగ నుండెడిని. పొడవుచుట్టుకొలత ముప్పది లేక ముప్పదియొకఅంగుళమును, వలముచుట్టుకొలత ఇరువదియారంగుళములుగల్గి పదునాల్గుఔన్సుల బరు వుండునటులఁ జేయఁబడును. ఆటనాడు ఇరుకక్షులందు టీమున పదునేనుగు రాటకాం డ్రుండుదురు. గోల్పోస్టుల నడుమప్రదేశమగు ముఖద్వారము వెడల్పు పదునెన్మిదిన్నరయడుగు లుండును. క్రాసుబారు భూమినుండి పదియడు గులయెత్తున వాటికిఁ గట్టఁబడును. స్తంభములు పదునొకండడుగులు భూమిపై నెత్తుగ నుండు నటుల పాతఁబడును.

రుగ్బీఫుట్బాలాట, అసోసియేషన్ ఫుట్బా లాటనుండి విధానధర్మములందునను భేదము గల్గియుండును. దీనిపద్ధతులు చక్కఁగ బోధ పఱచుకొనఁదగియుండును. కాని రెండాటలును బంతిని కాలితో తన్నుచు ఇరుకక్షులవారిచే నాడబడునాటలేయని ఎఱుఁగునది.

**ఫుల్‌స్టాపు** (Full-stop or Period)--ఇది ఆంగ్లభాషాసాంగత్యమునుండి ఆంధ్రభాషలోని తెచ్చుకొనినయొకగురుతు. ఒకవాక్యము పరిపూర్తియైనదని తెల్పుటకచటనిడెడి యొక చుక్క. ఒకసందర్భమునఁ గల్గిన యూహను దెల్పు వాక్యములసముదాయము ముగిసినదిగ తెల్పుగురుతు.

**ఫూరెయిరిజమ్**(Fourierism)-ఫ్రెంచి దేశమున 1772 మొ॥ 1837 (క్రీ. వె.) వఱకు జీవించియుండిన Francois Charles Marie Fourier అనుపేరుగల సాంఘికవాది బోధించిన రాజకీయమతము.

ఈతఁడు సంఘమును ఏకాభిప్రాయ లగు కొందఱను వేర్వేఱుగా విభజించి వేర్వేరు నివాసములు గల్గించిన సౌఖ్యమతిశయించునని బోధించెను. ఇది జయముగాంచలేదఁట గాని కొంద రిట్టి సిద్ధాంతమును నమ్మువా రున్నారు.

**ఫూలెరీ** ( Foolery)--తాను బుద్ధిహీనునివలె నటించి యన్యులను నవ్వించుకళ. ఇది హాస్య మనంబడును. ఇట్టి విద్యాప్రవీణులు సభలలో వాక్చాతురివలన గూడ నవ్వించుట కలదు. అన లీవిద్యకే Foolery అని పేరు వాడఁబడయుం దున్నది.

**ఫూల్స్కేపుకాగితము - వాటరుమార్క్** (Foolscap paper)--భరతదేశమున తొల్లింటికాలమున చేయఁబడు చుండిన కాగితములపైననే చిహ్నములు తఱచుగ వేయఁబడుట లేకుండెను. కొన్ని దేశములప్రభుత్వపుకాగితములపై నరపాలునిరూపము చిన్నదిగ ముద్రి గల్గియుండెడిది. కాశ్మీరదేశపు కాగితములపై నిప్పటికి నీవిధమే యాచరణయుం దున్నది.

ఐరోపాదేశములందు,కాగితముల ప్రారంభమగు నాదికాలమున, పెక్కుపొడవు వెడల్పుల (Sizes) కాగితములు చేయఁబడుటయు వాట్లపై ననేకరూపములగుర్తులు Water marks వేయఁ బడుచుండినవి. అందు $8\frac{1}{4} \times 16\frac{1}{2}$అంగుళములపరిమాణము గల కాగితములకు ఫూల్‌స్కేపు గుర్తు వేయఁబడు నాచార మయ్యెను. ఆకాలమున ఐరోపా దేశములందు హాస్యవచనములను హాస్యనటనలను నవ్వించు పనుల వలనను, జనులను వినోదింపఁ జేయువానికి "ఫూల్" అని వాడుచుండిరి. ఇట్టి పండితులు రాజాస్థానమున చాలప్రాముఖ్యముగల్గియుండురు. వారు నరపాలురను వినోదింపఁ జేయుట యం దాఱితేఱినవారై గొప్ప మన్ననల నందుచుండిరి. వారు ధరించు టోపీయొక్క యాకారము గుర్తువేయబడిన కాగితములకు ఫూల్స్కేపు కాగిత మనివాడుచుండిరి. వీటివాడుకయు బహుళమై యుండెను.

కాలములు మాఱి ఆగుర్తు లీకాలమున మానివేయబడినను ఆ పరిమాణమున (size) చేయఁబడుకాగితములకు నేటికిని ఫూల్‌స్కేపు కాగిత మని వాడుక యట్లే నిలిచియున్నది.

కాగితములపై వేయఁబడునట్టి ఫూల్స్కేపు (Foolscap) మొదలగుగుర్తులు Water marks వేయఁబడుతావున కొంచె మెత్తుగ నుండున ట్లొనర్తురు. ఈమెత్తుగనుండు ప్రదేశము ఉల్లిపొరకన్న తక్కువగనే యుంట నేత్రములకుఁ గానరాక, చేతితో తడవినఁగూడ తెలియరాక యుండునది. ఆతావున కాగితము పలుచనగుట నీటిరంగుగ వెలుఁగున జూచినఁ గానవగుచుంట 'Water mark అనఁబడును. ఈ Water mark ఇచ్చవచ్చిన రూపములు ఇచ్చవచ్చినయక్షరముల వేయించనగును.

కాగితములను మెరుఁగుజేయుటకు కొంత వ్యయమగును గాన నెక్కువమెరుగుజేయఁబడిన

కాగితములకు ధర యెక్కువయుండును. వార్తాపత్రికలు మొదలగు (చదివిపాఱవేయు) కాగితములకు ఎక్కువమెరుగు జేయరు గాన కొంత చౌకగనుండును. నిల్వయుండఁదగిన దస్తావేజులు పెద్దపెద్దపుస్తకముల కుపయోగించుకాగితముల నెక్కువమెరుగుజేతురు. మెరుగు తక్కువగలకాగితములు గాలికి, వెలుగునకు, ఎండకు పాల్పడుకొలఁది కొన్నికొన్ని రసాయనములచే బాధింపఁబడి పచ్చనిరంగుగ మాఱి పటిమ గోల్పోవును.

సాధారణముగ కాగితములను భద్రముగ పెట్టెలలో నుంచిన వేఁగముగ జెడి పటిమ గోల్పోక నిలుచును.

**ఫ్యూచర్సు** (Futures)— ాణిజ్య సంబంధపరిభాషాపదము. విదేశమునందు మున్ముందు పండగలపంటను ముందొకకాలమున స్టీమరుపైఁ దెప్పించుటకుఁగాను ఖరీదుచేయుట మొదలగు Speculative operations ఇందు చాల చిక్కులగు గడసుతనపురాకడలం గల్గియుండెడిని.

**ఫెటిషిజమ్** (Fetishism) - కార్యము సంకల్పించుతఱి నేవస్తు వెదురుగఁ గాననగునో దాని నర్చించి పూజించి యాకార్యము జరుపవీలగుననినమ్మునతము. వీరొకొక్కవస్తువునందు కార్యసిద్ధి గల్గించుశక్తి యుండునని నమ్మెదరు.

**ఫెటిషుభక్తి**.— ఆఫ్రికాదేశపు నీగ్రో జాతివారియం దేదేనియొకవస్తువు తొలుతగనఁబడి దొరకిన దానిని పూజించుదురు. దానివలన క్రియాసిద్ధి కలుగకుండిన దానిని వదలివేతురు. ఒకొక్కవస్తువునందు మాహాత్మ్య ముండునని వారిమతము గానోపు.

**ఫెడరేటెడ్‌మలె స్టేట్సు**— ఆసియా ఖండమున ఇండూచైనాపెనెన్సులాలోనిది. మలెదేశములోని ౧ పెర్కాస్టేటు, ౨ సెలాంగోరు స్టేటు ౩ నైగ్రిస్టేటు, సెంబిలాన్‌స్టేటు, ౫ పాహాంస్టేటు కలసి లేస్టేట్సనంబడుచున్నవి. (మలెయాదేశము చూడుఁడు)

**ఫెదర్ ఇన్ ది కాప్**(Feather in the Cap)— క్రొత్తగఁ గల్గినవిభవమని యర్థము. వైభవోపేతునకును ఈఉక్తిం దెలుపుట గలదు. ఆదినుండియు శిరోవేష్టన (టోపీ లేక పాగ) మందు Feathers ఉంచుకొనుట వైభవచిహ్నము. దానికి భరతభూమియందు తురాయియనియు, కల్కితురాయి యనియు, పేరుకలదు. అమెరికాఇండియను జాతులలో నిది విపరీతముగ నుండును. క్రొత్తశత్రువునుజయించి చంపినతోడనే వేఱొకక్రొత్త Feathers ను శిరోవేష్టనమందు వారు ధరించుచుందురు గాన వారిలో తఱచుగ పెక్కు Feathers తలయందు ధరించినవారు గాననగు చుందురు. వారిలో నెక్కువ Feathers ధరించినవారికి సంఘసభలయందు గౌరవము మెండు.

**ఫెనోమినాలిజమ్** (Phenomenalism)- కనిపించెడు జగత్తునకు మఱుగున నుండునవి మానవునకు తెలియఁబడ వనియును, మనము గ్రహించెడివన్నియు దృశ్యప్రపంచము నుండియే గ్రహించుట సత్యమనియు నమ్ము సిద్ధాంతము.

**ఫెన్** (Fen)—ఇంగ్లాండు దేశమున చదునైన ప్రదేశములు పల్లపుభూములకు ఫెన్సు అనెదరు.

**ఫెయిథోన్ రథసారథ్యకథనము**- గ్రీకులయొక్క ఆదికాలపు మతకథనములలో నొకటి. ఇది వారి కత్తఱి సుప్రసిద్ధముగా నుండెనఁట. వారిదేవతలలో ప్రధాని అపోలో దేవుఁడు. ఆయనను గొన్నాళ్లొకకారణమున భూమిపై నివసింప దేవతలు నియమించిరి. అక్కాలమున భూమియం దొకస్త్రీరత్నము

వలన నొకపుత్రుండు గల్గెనట. అతనిపేరు ఫైథన్. అపోలో తననిజవాసమగు ఓలింపియస్ పర్వతోపరిభాగమునంగల దేవతానివాసలోకమున కరిగినతఱి నీ ఫైథనును మనుష్యభూమియందే వదలి వెడలిపోవ, నాబాలుండిటనే పెరిగి పెద్దవాం డగుచుండెనట.

ఫెయిథోన్ చక్కని బాలుడు. సూర్యపుత్రుండగు అపోలోకును, ఆ తేజశ్శాలిమక్కువలకుం గురియగుమానవకాంతారత్నమునకు, జనించిన ముద్దులబిడ్డనికిం జక్కదనము కొఱంత యగునా? కాని, యతఁడు గర్విష్ఠి. ఒకరికిం దీసిపోవువాఁడు కాఁడు. తోడిబాలురతో నాడుకొనుచుండ నాతనిదుర్గర్వమున కసూయ జెందినవారు "నీవు మానవుఁడవే, నీయాధిక్యమే" మని గర్హించుచుండిరి. ఆతఁడు కోపోద్దీపితుండై ఓలింపసు పర్వతమునం స్వర్ణమయమై నవరత్నఖచితమై సౌఖ్యముల కాకరమై విన్నాణములొల్కు తన తండ్రినివాసభవనమునకై బయలు వెడలి అనేక కష్టములం గడచి యెట్టకేల కటకుంజని ఏకాంతమున నానందములనోనున్న అపోలో దేవుని గాంచి యాదరణముబడసి తన్నుంజూడ నరుదెంచినబాలునితో తండ్రి "నీకేమిగావలయు నిచ్చెద" నన, భక్తితో జనకా! నాపై నింపుక పుత్రప్రేమ గలదేని యొకదినము తమదివ్యరథసారథిగా నన్నుండనిండనియు ప్రపంచముంజుట్టి యారథమును ద్రిప్పుకొనిరా ననుమతి దయచేయుండనియుం గోరెను. అందులకా యపోలో, అది కష్టసాధ్యముగాన నిప్పుడు వలదని వారించినను వినక, తన దేవత్వము లోకులకుం జూప నాతృతో నదియె ప్రార్థింప నాజనకుండు వగచియుం జేయునది లేక ఇయ్యకొనెనట.

ఎట్టకేల కారథమున కుత్తమాశ్వములం గట్టించి తానుసారథియై బయల్వెడలెనట. ఆ యశ్వము లగ్నిజ్వాలలను శ్వాసించునవియట. అవి యితనిని సరకుగొనక ఈడ్చుకొని యతిత్వరితముగం బర్విడుచు పంటలను చెట్లు చేమలను దహింపంజేయు పర్వతశిలలం దొరలి పర్విడంజేయుచు, బీభత్సమొనరించుచు, వెఱ్ఱిపరుగులు పరుగిడుచుండుతఱి, భూదేవి, దేవతాచక్రవర్తి యగు జ్యూపిటరు (ద్యౌసుపితరుని) గూర్చి మొఱలిడ, నాతఁడు కనికరమంది చేయునది లేక బాలునిమూర్ఖతకు శిక్షగ తనరథసీలను పిడుగుగా విసరెనట. అది రథమును గూల్చఁదోసి భగ్నమొనర్చి సారథియగు ఫైథనును బరిమార్చి శాంతిం గల్గించెనట. నాఁడాదిగ లోకమునల్లకల్లోలముపాలొనర్చి కలవరపఱచుచున్న దుష్పరిపాలనముం గూర్చి హేళనగా "ఫైథోను రథసారథ్య" మని వచించు ఉక్తి యెప్పడి వాడుకయందున్నది.

**ఫెర్నాండో ప్రోద్వీపము**—(ఆఫ్రికాఖండమునకుం జెందిన పంప్రడెండుద్వీపములు చూ).

**ఫెల్లా** – ఈజిప్టు దేశమున సేద్యమొనరించు వారికిని, కార్మికులకును పేరు. దీని బహువచనరూపము ఫెల్లాహీన్. వీ రా దేశపుఆదిమనివాసులట. నూటియందఱువదియిద్దరున్నారట.

**ఫెర్రైట్** (Ferrite)— మైనరాలొజీలో Iron hydroxide (binding element in many rocks) నకు పేరు.

కెమిస్ట్రీలో- Iron oxide ను, basic సంబంధముగల ఇతర oxides తోడను కలగలుపులకు పేరు.

మెటలుర్గీ (metallurgy)లో pure iron Constituent of steel నకుం బేరు.

**ఫెర్రోసియానిడీస్** (Ferrocyanides)- ఫెరోసియానిక్ ఆసిడ్ సంబంధములగు salts కు పేరు. (H4 Fe) (CN) ఇందు ముఖ్యమైనది Potassium ferrocyanide అనంబడునది

దీనికి yellow prussiate of Potash అనియుఁ బేరు కలదు. దీనితో ప్రష్యన్‌బ్లూ అనంబడునది చేయుదురు.

**ఫెర్రొజు సాల్ట్సు** (Ferrous salts)- ఇవి యన్నియు Iron salts అని చెప్పఁబడును. ఇందు Ferrous sulphate అనంబడు Green vetroe సిరాలు చేయుటయందుపయోగించు చున్నారు. ఇంకను రంగులయందు తోళ్ళు పదునుచేయుటయందు నుపయోగించును. ప్రష్యన్‌బ్లూ చేయుటయం దుపయోగించు చున్నారు.

Ferrous iodide అనునదియు, Ferrous phosphate అనునదియు, Ferrous carbonate అనునదియు, Pure salt ను, ఔషధములం దుపయోగింతురఁట.

**ఫేక్టొరీ చిమ్నీలు** ( Factory Chimneys) **పొడవు**— ఇవి ఆవిరి యంత్రముల పొగను గొంపోయి ఆకాశము వైపు విడుచుపొగ గొట్టములు లేక స్తంభములు. వీట్లను స్టాక్సు Stacks అని యంత్రశాస్త్రమున వాడుదురు.

అందరెఱిఁగియున్న రీతిని నీటి యావిరియంత్రములు నడుపుటకు నీటియావిరి కావలయును. ఆవిరిచేయుటకు నీటి నగ్గిచేఁ గాచవలెను. కాలిన యగ్ని కార్బోనిక్ ఏసిడ్‌ గాస్‌ను Corbonic acid gas కల్గించును. ఇది ప్రాణహానికరము గాన ఎత్తున కీపొగ గొట్టములగుండా గొంపోయి ఆకాశమునవిడుచుట శ్రేయము. ఇంకను ఇందొక సౌకర్యముగలదు. వేడియైనగాలి పైకిలేచుటయందు వెనుదీయదు గాన గొట్టములగుండా వేడియైనగాలిని అనగా నగ్నిచే దగ్ధమైనగాలి నాకసమునకుఁ గొంపోవుట చాల సుకరము. మఱియు నీపొగగొట్టము లెంత పొడవుగ నున్న క్రింద నెక్కువ వేఁడి కల్గియుండును గాన నీటియావిరి తీసుకరముగ చేసికొనవచ్చును.

అగ్ని ప్రజ్వరిల్లుచో ననేక విస్ఫులింగముల (చిన్న చిన్న మిణుఁగురులు) గల్గించును. ఇవి యన్నియు పొగగొట్టమున పొడవుగ పైకిబోయి ఏయగ్ని ప్రమాదమును గల్గింపకుండును.

ఈపొగగొట్టముల పొడ వాయాదేశముల శాసనములం దర్హరీతిని నిర్ణయింపఁ బడును. కెర్సనైలు మొదలగునవికాల్చు యంత్రములకీపొగగొట్టములు లేకుండిన ప్రబలమగు నపాయము కల్గెడిని.

**ఫేటలిజమ్** (Fatalism) — మనుష్య ప్రయత్నము నిరర్థక మనియు దైవవిధి గాని Chance గాని యెట్లు జరిపిన నట్లు కార్యములు సాఁగు ననియు నమ్మకము, లేక సిద్ధాంతము.

**ఫేనగిరి** — సింధునదీముఖద్వారముకడ నీపర్వతము కలదని బృహత్సంహిత ౧౪-౧౮ యందు చెప్పఁబడినది

**ఫేనింగ్ ద్వీపము** (Fanning island)- పసిఫిక్కు మహాసముద్రమున హోవైకి దక్షిణమున నున్న పగడపుద్వీపము. గిల్బర్ట్సు ఎల్లిస్ ద్వీపముల కేబిల్, సబ్మెరైన్సుస్టేషనుగలకోలనీకి చేర్పఁబడిన ద్వీపము.

ఆస్ట్రేలియా వేన్కోవరులనడుమ నిది సబ్మెరైన్ కేబిలుస్టేషనుగా నున్నది.

**ఫేబియస్** (Fabian)— ఫేబియనుల వ్యూహనిర్మాణచతురత (అనఁగా నోర్పు, సామరస్యచతురత) మొదలగుగడునుందనములు సమయానుకూలమగు సామరస్యముచాలగొప్పవని పేరందినవి గాన ఫేబియన్‌టాక్టిక్సు అని సామెతగానైనది. (Fabian Tactics)

**ఫేవోనియస్** (Favonius) **గాలి**— రోమనుల పురాణములందు నైరృతిదిశనుండి గాని, పశ్చిమమునుండి గాని ఆకురాల్చు

(Spring) కాలమున వీచు వాయువుల కీపేరు పెట్టఁబడినది.

గ్రీకుదేశమున నిట్టివాయువే యగు Zephyrus వాయువులకు గౌరవమే యొసఁగఁబడినది.

**ఫేసిజమ్** (Fascism)— ఇటలీదేశమున నైరోపామహాసంగ్రామానంతరము ప్రజలందు గొప్పయసంతృప్తి కల్గి ప్రజలయం దొకయుద్దేశము బయల్వెడలెను. ప్రజాపరిపాలనము సాగించుకొందమని కొంతమంది తలంచుచుండిరి. ఇది తొలుత 'Political and Social movement' అని చెప్పఁబడినది.

Signore Benito Mussolini అనువారు దీని నాయకత్వము వహించిరి. ఆదియందు కమ్యూనిజమ్ నెదిరించుకొఱకై దీని నేర్పడఁ జేసెనఁట. వీరు సైన్యములను దగి బలపఱుప నిశ్చయించిరి. పిదప రాజును తొలగించి ప్రజాప్రభుత్వమును స్థాపించుకొఱకైను వదలుకొనిరి. క్రీ. శ. ౧౯౨౦లో కొందఱు ఫాసిస్టులు చట్టనిర్మాణసభ కెన్నుకొనఁబడిరి. (Chamber of Deputies) కాని౧౯౨౧లోమఱికొన్ని యెన్నికలు జరుగవలసివచ్చుటచేఎక్కువమంది యెన్నుకొనఁబడి, ప్రభుత్వము వారి వశమాయెను. ౧౯౨౨ అక్టోబరు నెలయందు రోమకపురియందు రెండులక్షల ఫాసిస్టులు ఊరేగిరి. ముసులోనీ నియామకునిమాటయె శాసనమనునట్లు విలువగల్గినది యాయెను. ౧౯౨౪ ఎన్నికలవిధానపుశాసన మేర్పడియెను. ఈఫాసిస్టుల వ్యవహారములు Grand national council పరిశీలించుచున్నది. వీరికి నల్లషర్టు చిహ్నము. "no discussion, only obedience" వాదము లేదు, ఒప్పందలమె అనునది వీరిMotto అని చెప్పఁబడినది.

జర్మనుదేశమున హిట్లరను మహోదయుని నాయకత్వముక్రింద నిట్టియేర్పాటె నడుచుచున్నది.

**ఫేసిమెలిస్ట్రి (చేతిపని)** (Facsimilestry)—దస్తూరిపోలికగను, దస్కతుపోలికగను, లేక ఒకరూపము లేక ఆకారముయొక్కపోలికను, దేనిపైనను చిత్రించుట గాని చిత్రించి ముద్రింపఁదగినట్లు చేయుకల.

**ఫేసెస్సాఫ్‌దిమూన్** (Phases of the moon)-భూమిపై నున్నవారలకు చంద్రగోళము వృద్ధిక్షయములకు లోఁబడి కన్పించుటకు ఎస్ట్రానోమీ శాస్త్రమున Phases of the moon అని పేరు. అమావాస్యదినమున సూర్యుఁడు, చంద్రుఁడు భూమి తిన్నగా ఒకేవరుస నుందురు. దానికి Conjunction అని పేరు. ఆనాఁడు చంద్రుఁడు, సూర్యునితోపాటు పగలే సంచరించి సాయంసమయమున నస్తమించునుగాన రాత్రియందు కానఁబడఁడు.

ఆమఱునాఁటినుండియు నెలవంక (Cresent) గఁ గాన్పించుచు, దినదినాభివృద్ధి నందుచు, తుదకు పౌర్ణమినాఁటికి పూర్ణకళాయుతుఁడై రాత్రియంతయు పండువెన్నెలలఁ గాయుచు, పౌర్ణమికిఁ బిదప దినదినము కళలు తగ్గిపోవుచు క్రమముగ నమావాస్యనాఁటి కసలె కన్పడకపోయెడిని.

చంద్రవంక (Cresent) సర్వదా సూర్యుని వైపునకే యుండి, సూర్యునివెలుతురునే తాను భూమిపై ప్రతిఫలింపఁజేయునటుల తోపఁజేసెడిని. భూమినిజుట్టి తిరుగుచుండు చంద్రుని మార్గము (Orbit) భూమిని కేంద్రస్థానము (Centre)గల్గియుండెడిని గాన,భూమిపైనుండి చూచువారలకు చంద్రుఁ డగపడుటయందు సూర్యకాంతి ప్రసరించిన వెలుగుభాగమును, ప్రసరింపని చీఁకటిభాగమును గన్పట్టుచుంటయు, అది వృద్ధిక్షీణతల నందుచు, హెచ్చు

తగ్గు వెన్నెలలను భూమిపై ప్రసరించుచుంటయు, Phases of the moon అను పేరంబరగు చుండును. (చంద్రబింబము చూడుడు. ఎస్ట్రానోమీ చూడుడు. సోలార్ సిస్టమ్ చూడుడు.)

ఈ Phases of the moon లను నాలు భాగములుగ నొనర్చి, నాలుగు Quarter లని పేరిడియున్నారు. శుక్లపాడ్యమి మొదలు శుక్ల అష్టమిదినమందలి అర్ధభాగముకడకు First quarter అనియు, అటనుండి పౌర్ణమికడకు Second quarter అనియు, బహుళపాడ్యమి మొదలు అష్టమిలో అర్ధభాగముకడకు Third quarter అనియు, అటనుండి అమావాస్యాంతమునకు Fourth quarter అనియు నందురు.

సూర్యునివెలుతురు చంద్రునిపై బడుట యందు సూర్యున కెదుటనుండు సగముభాగము పైననె పడునుగాన దానిని వెలుతురుభాగము (Bright side) లెక్కన వెనుకనుండు చంద్రుని యర్ధభాగము చీకటిభాగము (Dark side) First quarter కడకు Dicholomized అనియెదరు. ఎస్ట్రానోమీ శాస్త్రపరిభాష యందు చంద్రుని రెండుభాగములు Convex గా నుండుటను "Gibbons" అనియెదరు.

**ఫేస్ వేల్యూ** (Face value)-(వాణిజ్య సంబంధ పరిభాషాపదము.) పత్రముయొక్క ముఖమున వివరింపబడిన దానివిలువ దీనిని Nominal value అనియు నందురు. తఱచుగ నిట్టిపత్రములు నిజమగు విలువకన్న తక్కువకు అమ్మబడి (Less than par value) కొంతకాలము గడచినతఱి దానిపై వివరింపబడినవిలువ కర్హమైన దగును. ఇట్టిపత్రములకు వేరుగ వడ్డీ యుండదు. వడ్డికిబదులు Discount తొలుతనే వదలబడును.

**పైరోమీటర్** (Pyrometer)— ఎక్కువ వేడిని కొలుచుట కుపయోగపడునట్టి థెర్మామీటరువంటి పరికరము.

**ఫైలాలోజీ** (Philology)-మాటలు,వాటి ఉచ్చారణము, సాంగత్యములు, వాడుకలవలన వాటికిగల్గు మార్పులు మొదలగుసంగతులను వివరించు నాంగకళ.

దీనిని భాషాశాస్త్ర మనందగును. అక్షర పరిణామములతో స్వరసంపుటీకరణము, శబ్దనిర్మాణపరిణామములు, ఇతరభాషాసారూప్యముల పరిశోధన కర్హమార్గములను వివరించు కళ. దీనికి భరతదేశపునిరుక్తము పోల్కి గలది.

**ఫోక్ ఎటిమోలజి** (Folk etymology) ఒకశబ్దముయొక్క నిజమగు నుత్పత్తి తెలియనితఱి, దాని ననుకూలమగురీతిని దేశకాల పాత్రధర్మోచితములుగ నుండునటుల ఉత్పత్త్యర్థములను గుదిర్చి నిలుపుటనుగూర్చిన కళ.

**ఫోటోపెట్రోల్** (Photo patrol)— అమెరికా సంయుక్తరాష్ట్రములందు పత్రికలలో బొమ్మలను విస్తారముగ వాడుచుందు రనుట సుప్రసిద్ధమే. తొలుత ఫిలడల్ఫియా నగరమున నొకగొప్ప వార్తాపత్రిక, ఒకగొప్ప ఫోటో కెమేరాయంత్రము నొక ఆటోమోబిల్ బండి (మోటారు) చట్రముపై బిగింపజేసి దానిని నగరమంతట దిప్పుచు ఛాయాపటములందీసి వాటయాకారాదులను పత్రికయందు ముద్రింపించుచుండువారు. అది ప్రబలి యిక్కాలమున దేశమంతటను వ్యాపకము గాంచి ఫోటోపెట్రోలు ఆదేశమున సర్వసాధారణ మైనది. ఇటుల దినవార్త లాదేశమున బొమ్మలతో సహా పత్రికలందు ప్రకటింపబడుచుండెడిని.

**ఫోటో మైక్రోగ్రాఫీ**—(Photo micrography) ఫ్రెంచిభాషా జన్యపదము. మిగుల చిన్నఫోటోబొమ్మలను పెద్దవిగ మార్చుటకు చేయు విధానమునకు 'ఫోటోమైక్రోగ్రాఫీ' యనియు ఆపరికరమునకు ఫోటో మైక్రోగ్రాఫ అనియు బేరులు.

**ఫోనీషియాలిపి**—సిరియా (పాలస్తీనా) దేశమందలి సముద్రపుటొడ్డుభాగమునకు ఫోనీషియా యనిపేరు. ఫోనీషియాలిపి సెమెటిక్కులిపినుండికల్గినది. (సెమెటిక్కులిపి చూడుఁడు). ఫోనీషియాలిపి నుండియె ఐరోపాదేశపులిపు లుద్భవమైనవి గాన, నిది వాటికిఁదల్లిగా నెన్నఁదగును. ఫోనీషియనులు క్రీ.పూ. 3000 నాఁడే వర్తకులై భూమిపైన ఓడలపైన ఇండియాతోను ఈజిప్టుతోను బాబిలోనియాతోను వర్తకము చేయుచుండిరి. నాగరికులనియు, కళాకౌశలము గలవారనియుఁ జెప్పఁబడినవారు. ఈలిపియం దిరువదిరెండక్షరములు. అన్నియు హల్లులే గాని, అచ్చులు లేవు. ఇదియు సెమెటిక్కువలెనే కుడినుండి యెడమకు వ్రాయఁబడులిపి.

దీనినుండి గ్రీకు, లాటిన్ భాషలును, వాటినుండి ఇతర ఐరోపాదేశభాషలును, లిపుల సహితముగఁ గల్గినవి.

**ఫోనోగ్రాఫ్** (Phonograph)-ఇదిగ్రామాఫోనునకుపూర్వపుఏర్పాటు. పిదపగ్రామాఫోను కైన్మెటోస్కోపుకనిపెట్టబడినవి. వాటినుండియే చేయఁబడిన అభివృద్ధిగ సినామెటోగ్రాఫుచేయఁబడినది.

ఫోనోగ్రాఫును పరిపూర్ణస్థితికిదెచ్చినవాఁడు Thomas Alva Edison గారు.మిలాన్ నందు క్రీ. శ. ౧౮౪౭ ఫిబ్రవరి ౧౧వ తేదీని జన్మించి, ౧౯౩౧ అక్టోబరు ౧౮ తేదీని మృతినందెను.

(Phonology)— మానవులు మాట్లాడుభాషలోని స్వరములను పరిశోధించి భాషావర్గములను నిర్ణయించుశాస్త్రము.

**ఫోర్‌కేస్టు** (Forecast) **వ్రాయుట**- దీని నింకను weather forecast వ్రాయుట యనుట సమంజసముగ నుండును. దేశమునం దల్లెడల నర్వస్థానములందు స్థాపింపఁబడిన మీటియొరోలోజికల్ స్థానములనుండి ప్రధాన కార్యస్థానమునకు జేరినతంతివార్తలనుండిబారోమీటరు రీడింగులు, విండు డైరెక్షనులు, గాలి యొక్క బలప్రమాణములు, శీతోష్ణస్థితులు, తెలిసి, వాట్లమేరకు చార్టులు వ్రాసి (బారోమీటరు చూడుఁడు. ఇసోబారు చూడుఁడు) వాట్లం బరిశీలించుచు, ప్రధానకార్యస్థానమున కాలముయొక్క భవిష్యత్సూచనలు వ్రాయఁబడుచుండును. ఈసందర్భమున నాంగ్ల వాతావరణశాస్త్రమున కొన్ని ధర్మములు, పరిహారములు, పరిభాషాపదములు దెల్పఁబడియున్నవి.

ఉద్ధృతమె బాధాకరమైన వాతావరణమునకు "సైక్లో" నియు, ప్రశాంతమై సౌఖ్యప్రదమైన వాతావరణమునకు "ఏంటి సైక్లో"నియు లేక ఫెయిర్వెద రనియు పరిభాషాపదములు శాస్త్రమున నిడఁబడుచున్నవి. తుపానునకు డిప్రెషన్ అనియు, డిస్టర్బుడు వెదర్ అనియు వాడుకనామములు లిడియున్నారు. కొందరు వాతావరణ శాస్త్రవేత్తలు ౧ Storm ౨ Cyclone ౩ Typhoon ౪ Hurricane అని తుపానులను నాలుగ విభజించిరి.

శాస్త్రమునందు In cyclones the winds blow inward with a twist towards left (anti-clockwise) అనియు In anticyclones the winds blow otherwise అనియు వివరింపఁబడినది. సైక్లోన్ను unsettled weather with rain అనియు శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

ఈరెంటియొక్క పూర్వస్థితి, వాట్ల భవిష్యద్గమన వ్యాపకములను గాని అభివృద్ధి క్షీణతలనుగాని వివరించును. అటులనే ఇసోబారులలో నొండొకటి సమీపస్థితి నందుటయు, బలమగు గాలికి భవిష్యత్సూచనగా చెప్పఁబడినది. ఈభవిష్యత్సూచనలు ఓడలకు మార్గమున నపా

యములు కల్గకుండ తప్పించుకొను సాధనము లగుచున్నవి. కర్షకులకు కోతనూర్పు కాలముల నుపయోగించెడిని.

**ఫోర్తుబ్రిడ్జి - స్కాట్లండు** (Forth Bridge-Scotland)— స్కాట్లండు దేశము నందు ఎడింబరో నగరమునుండి అబ్బర్డీను పురమున కేగుఇనుపబాట, Firth of Forth, దాటి Fife County గుండా నడుచును. అట్లు దాటుటకు నిర్మింపఁబడినవంతెనకు "ఫోర్తుబ్రిడ్జి" అనిపేరిడియున్నారు. దీనినాంగ్లమున ఎంజనీయరులు 'One of the most famous engineering feats of the Nineteenth Century" అనియెదరు. Mr. M Effel పండితుఁడు "The greatest construction in the world" అని యన్నాఁడు.

ఇది క్రీ. శ. ౧౮౮౩ మొదలు ౧౮౯౦ వఱకు, అనఁగా నేడు సంవత్సరములకాలము నిర్మింప నాక్రమించెను. దీనినిగట్టుటకు మూఁడు మిలియనుల పౌనులు వ్యయ మయ్యెను. దీని పొడవు 2756 గజములు. దీనింగట్టిన ఎంజినీయరులు Sir John Fowler & Sir Benjamin Baker అను పేర్లుగల సుప్రసిద్ధులు.

ఫోర్తుబ్రిడ్జి కెంటిలీవరు అండ్ సెంట్రిల్ గర్డరుపద్ధతినంతెన. దానిబరువే దానిస్థానమున నిలుపునందుకు. మూఁడు కేంటిలీవరులు మూఁడు కెయిజనులపై నానుకొని యుండును. పునాది లోతు ౯౦ అడుగులు. ఎత్తు ౩౭౫ అడుగులు. పెద్దపెద్దఓడలు నిర్భయముగ దీనిక్రిందనుండిపోఁగలుగును. మధ్య Span 1700 అడుగులు.

ఇందుగలలోహము 50,000 టన్నులని అంచనా వేయఁబడినది. నీటిమట్టముపై 154 అడుగుల యెత్తున నినుపబాట నడుపఁబడినది.

**ఫోలియో** (Folio)—వాణిజ్య సంబంధ పరిభాషాపదము. దీనికి నాల్గు వాడుకలుకలవు. ఒక చిత్తాపుస్తకమున నొకటి కొకటి ఎదురుగ నుండు రెండుపుటలకు Folio అని యందురు. దస్తావేజులవ్రాతయందు డెబ్బదిరెండు మాటల కొక ఫోలియో అని యందురు. పార్లమెంటు సంబంధ కాగితములందు తొంబదిమాటల కొక ఫోలియో అని యందురు. అచ్చుపనుల (ముద్రాక్షరశాల) యందు రెండుపుటల (ప్రైజునను సరే)యొక్క-సంఖ్య నొకఫోలియో అనెదరు.

**ఫోసిలోలొజీ** (Fossilology)- భూమి నుండి త్రవ్వితీయు జంతువులచిప్పలు మొదలగునవి Fossils అనఁబడును. వాట్లంగూర్చినకళ.

**ఫోస్ఫోరిసెంటు లైట్ వెలుతురు**- ఇది కొన్ని పదార్థములు సూర్యరశ్మికి బహిరంగపఱుపఁబడుటతోఁ గాని, ఎక్సురే (X-ray) కార్యములపాలు చేయఁబడినట్టితఱిఁగాని, రేడియమ్ (Radium) కార్యములపాలు చేయఁబడినట్టితఱిఁగాని, పైకివిడువబడిన వెలుతురునకు ఫోస్ఫోరిసెంటు లైట్ (Phosphoriscent light) అని సాంకేతికనామ మిడి ఆంగ్లరసాయనశాస్త్రమున వాడుచుందురు.

ఇట్టిపరిస్థితులందు వెలుఁగునిచ్చునవి చాల తక్కువగ నుండునని రాసాయనికశాస్త్రవిదులనెదరు. ఇట్టిపదార్థము లివియని చెప్ప నింకను వీలుకాకున్నది. Zinc Sulphide mixed with a trace of radium and the flying particles of radium by hitting the zinc sulphide cause it to phosphoriscence అనియు, It will become luminous giving out light అనియు దీనింగూర్చి చెప్పఁబడియున్నది. గాన నీవెలుతురు ఫోస్ఫరస్‌వలన కల్గు వెలుతురు గాదని స్పష్టపడఁ గలదు. ఇంతకు నిది చీఁకటియందు కల్గువెల్తురని చెప్ప వీలుగాకున్నది.

ఫోస్ఫరసునుండి కలుగునట్టి వెలుతురు వేరని యెఱుఁగునది.

## ఫోహన్గాడ్పులు (వేఁడిగాలులు)—

ఐరోపాదేశపు ఆల్ప్సుపర్వతములందు అప్పటప్పట వీచు వేఁడిగాలి. ఇది ముఖ్యముగ స్విజర్లాండుదేశమున వీచెడిని. ఈగాలి కీవెచ్చదనము సంభవించుట, దక్షిణముగా మధ్యధరా సముద్రమున కవ్వలనున్న ఆఫ్రికాఖండపు సహారాఎడారియందని పరిశీలకు లనుచున్నారు.

Spring కాలమున ప్రారంభమునం దివి కల్గుచుండును. దక్షిణదిశగా పలురంగులుగల పలుచని మేఘములు కన్పట్టును. ఎఱ్ఱనియాకసమున సూర్యుఁడు తేజోవిహీనుఁడై అస్తమించును చంద్రోదయకాలమున బింబముఁజుట్టి యెఱ్ఱనిపరివేష మగును.

వీటిని గాంచిన యనుభవజ్ఞులు ఫోహాన్గాఁ రానున్నదని జాగ్రత్తగొనుచుందురు. నడుమ నడుమ శీతలవాయువులు వీచుచు నాఁగిపోవుచుంటయుఁ గలదు. వాతావరణ మతిస్వచ్ఛమై దూరపుకొండలు సైతము దగ్గరగాఁ గన్పించునట్లుండును. దేశమున నిశ్శబ్దత వ్యాపించినట్లు ధ్వనులు లేకయుండును. పశు పక్షి మృగాది జంతువులు గ్రహించియేమొ తహతహనందినట్లుండును. అన్నియు వీలగునంతవఱకు కొకచో గుమిగూడి యుంటఁ గాననగుచుండును. మనుష్యులు ఇంట నగ్నికణములు సైతము లేకుండునటుల నార్పి జాగ్రత పడెదరు. ప్రారంభమున నడవులనుండి యాకులశబ్దము గలగలమని వినఁబడును. వేఁడిగాలి దక్షిణమునుండి వీవ నారంభించును. ఇదియే ఫోహానుగాలి.

ఇందు గాలి బలముగనేవీచును. కొన్నిటిలో ముందు హరికేన్ గాలివలెనుత్రియు బలమై యుండును. గొప్పచెట్లం జింపివైచుటయు, ఇండ్లకప్పుల నెత్తివేయుటయు, ఎండాకులఁగాల్చివేయుటయు కూడ కలవందురు. పక్షులు చచ్చును. పశువులు బాధ నొందును. మనుష్యులు నీరసపడుదురు. నరములబాధ యధికమైకన్పించును. ఇది బలము తగ్గివీచినతఱివారముదినములుకూడ వీచునుగాని బలముగ వీచినతఱి కొన్ని గంటలలో శమించెడిని. ఇది యనేకోపకారము లొనర్చు గాడ్పు. నిల్వయై వ్యవసాయానర్హముగ నొనర్పఁబడిన మంచుప్రదేశముల నతిత్వరితముగ మంచుగరఁగించి వ్యవసాయార్హములుగ నొనర్చును. మొక్కలను త్వరితముగను, బలముగను ఎదుగఁజేయును. పొలములందు పంటల నధికముగను, బలముగను పండఁజేయును. ఫోహాను కల్గినతరువాతికాలము సుభిక్షముగ నుండును.

## ఫౌంటెన్ పేనాల (కలముల) పాళీలు

ఫౌన్ టెన్ పేనాల (Fountain Pens) లోన సిరా నిలువచేసి తలవెండ్రుకలావునకన్న నెక్కువ కారనిసిరాధార పాళీలోనికి వచ్చునట్లు కుదుర వ్రాయుదురు. ఈయేర్పాటు మాటిమాటికి సిరాలో కలముముంచునగత్యము లేకుండునట్లును బయటి కేగుతఱి సిరాబుడ్డిగూడఁ గొంపోవ నక్కఱలేకుండా ఈ సిరాకలము (Fountain Pen) సిరా కల్గియుండి, సిరాతో వ్రాసినపనినే సమకూర్చెడిని.

పాళీలుచేయు లోహము లన్నియు సిరా సంపర్కమున తుప్పుపట్టి పదునుచెడిపోవ నతిత్వరితముగ పాళీలు మార్చుచుండ వలసియుండును గాన, తరితరి పాళీమార్చుటచే సన్నముగ ప్రవహించుచుండు సిరాప్రవాహము చెడిపోవును.

బంగారుతో పాళీ చేసినయెడల తుప్పుపట్టదు. గాని చాల మెత్తనిలోహ మగుట నతిత్వరితముగ మొన అరగిపోవుటయు, వ్రాతరాపిడికి పనికిరాకపోవుటయు తప్పదు. గాన పాళీ

బంగారముతోఁజేసి, కొనను ఇరిడియమ్ (Iridium)అనంబడుగట్టిలోహముతో చేయుదురు. ఇందువలన వ్రాయుతటి కాగితమునఁ బర్విడుచు అరుగుపాళీకొన ఇరిడియమ్ ఉంటంజేసి Gold nib's point tipped with iridium ఒకతలాటమువలకు అరిగిపోకుండ నిలుచును.

**ఫౌండర్సు షేర్సు**— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. Founder's Shares ఒకసంఘమును (లేక సంస్థను) శ్రమపడి కూర్చిభద్రపఱచి ఉద్ధరించినవారికి Founders అనెదరు. అట్టివారికి వారిశ్రమలకు ఫలితముగ కొన్నివాటాల నిచ్చుటయు, తఱచుఁగ వారికి కొన్నిసావకాశముల నొసంగుటయు మామూలుగ జరుగుచున్నది. అట్టివాటాల కీపేరు వర్తించును.

**ఫౌనా ఫ్లోరా**— (ఫ్లోరాఫౌనా చూ.)

**ఫౌల్ బిల్**—వాణిజ్యసంబంధపరిభాషాపదము. (Foul Bill)కన్సాలు మొదలగు అధికారముగల ఉద్యోగులు ఒకరోడ రేవును విడచులోపల అంటువ్యాధిసంబంధము దానియందు కల్గిన దని Certify చేసియిచ్చెడి జాగ్రత ఉత్తరువు.

**ఫ్రండ్లీ (టొంగో) ద్వీపములు**—ఇవి ఓసీనియాయందలి పోలినేసియాద్వీపసమూహమునకుఁ జెందినవి. వీటిని (Captain Cook) కెప్టెన్ కుక్కుగారు క్రీ. శ. ౧౭౭౪ లో కనిపెట్టి అందలిప్రజల దయ, స్నేహభావములఁ గ్రహించి వీటి కీపేరిడి రఁట. ఇవి ఆస్ట్రేలియాకు తూర్పుగా ౨౦౦౦ మైళ్ళదూరమున పసిఫిక్కుమహాసముద్రమునందున్న చిన్నచిన్న ద్వీపములు. (ఓసీనియా, పాలినేసియా ద్వీపములు చూడుఁడు.) స్వదేశస్థులు వీటిని టొన్గో ద్వీపము లనియెదరు.

**ఫ్రాంఛైజు** ప్రభుత్వమునకు ప్రజాప్రతినిధిసభకు సభ్యులగునటుల సమ్మతి (ఓటు) నిచ్చుస్వతంత్రశక్తి కీపేరు ఆంగ్లరాజకీయములందు వాడుచున్నారు.

**ఫ్రాంజుజోసెప్‌లాండు** (Franz Josep Land)— ఇది ద్వీపసమూహము. ఉత్తరధ్రువ సముద్రమునందలి ద్వీపసమూహము. ఇందు జనులు నివసించుట లేదు.

**ఫ్రాంజు జోసెఫ్ చక్రవర్తి [ఐరోపా మహాయుద్ధకారకుఁడు]**-ఈయనహాప్సుబర్గు వంశస్థుఁడు. ఆస్ట్రియా సామ్రాజ్యము నేలిన కడపటి చక్రవర్తి. ప్రజారంజకముగ పాలించినవాఁడు. ఈయన జననము క్రీ. ౧౮౩౦ అనియు, పట్టాభిషేకము ౧౮౪౮ అనియు, సెర్వియాపై యుద్ధప్రకటన (డిక్లరేషను) పత్రముపై నీయన సంతకమిడుట ౧౯౧౪ జూలై ౨౮ తేదీ అనియు, మృతి యుద్ధముజరుగుచున్నకాలమున౧౯౧౬ అనియు తెలిసెడిని. ఈఐరోపామహాయుద్ధమే ప్రపంచసంగ్రామమునకు మూలకారణమై భరతదేశపరిస్థితులను తాఱుమాఱుజేసెను గావున నీవిషయమిాయాంధ్రవిజ్ఞానమునఁ గైకొనబడెను.

ఈయుద్ధచరిత్ర ననేకులు వ్రాయుచు ననేకరీతులతమతమపాక్షికాభిప్రాయములను బయలుపఱచుకొనిరి. జర్మనులు, ఇటాలియనులు, ఆంగ్లేయులు, అమెరికానుయుక్తరాష్ట్రములవారు, ఫ్రెంచివారు, రష్యావారు మున్నగువారనేకులు తమతమవైరులపై తమకుఁగల పూర్వస్పర్థలం దీర్చుకొన సంగ్రామమునఁ జేరి పోరిరి. వీరికందఱకు మూల మాస్ట్రియా.

ఫ్రాంజు జోసెఫ్ చక్రవర్తి ప్రజానురాగముతోనరువదివత్సరము లాస్ట్రియాసామ్రాజ్య పాలనమొనర్చెననిన నీతఁ డదృష్టశాలియని

స్ఫురించును గాని, ఈయన కుటుంబచరిత్రను దెలిసికొనినవారి కీతఁడు కడు దురదృష్టవంతుఁడని గూడ తెలియకపోదు. ఈయన సోదరుఁడు మేక్సిమిలియను ఉరిదీయఁబడుటయు, ఆయన భార్య కాలి మృతినందుటయు, నెప్యూ (అన్నగారి కుమారుఁడు) రోగపీడితుఁడై మృతినందుటయుఁ గాక, నతఁడనేక దుర్గతులపాలయ్యెను.

యువరాజగు రుడోల్ఫు రాకుమారుఁడీయన వెనుక రాజ్యమునకు రాఁదగినవాఁడు. స్టెఫినా రాకుమార్తె ఆయన భార్య. భార్యకుఁ దెలియకుండ యువరాజు బెరోనెస్ మేరీ వెట్సురా యను నామెతో రహస్యసంబంధము గల్గియుండెను. ఈవిషయ మెట్లో స్టెఫెనాకుఁ దెలిసెను. ఆమె చక్రవర్తికడ నీవిషయము దీనయై విన్నవింప, నాయనయు యువరాజును మందలించెనఁట. రుడోల్ఫు రాకుమారుఁడంతట నింటి [illegible] బెరోనెస్ వెట్సురా [illegible] గలిసి తన వేఁటవిడిదియగు మేయర్లింగు భవనమున నానాఁడంతయుఁ గడపెను. మరునాఁడు వారిద్వరి మృతకళేబరములు [illegible] యుంట సేవకులు చక్రవర్తి [illegible]తెంగింప, నాతఁడును "ఒక అపాయమునకు గురియై యువరాజు మరణించె" నని ప్రకటించి పుత్రశోకమున దుఃఖితుఁడై కాలము గడపుచుండెను. చక్రవర్తిని ఎలిజబెత్ కూడ [illegible]శము భరింపఁజాలని స్థితియందుండెను. రాజ్యపరిస్థితులుకూడ నీకాలమున చక్రవర్తికి స్థిమితము లేకుండఁ జేసినవి.

ఈపరిస్థితులందు జనీవానుండి సముద్రముపైఁ బయనించుచున్న ఎలిజబెత్ రాజ్ఞిని లింగిలాక్వేనీ యను పేరుగల ఇటలీయువకుఁ డొకఁడు తుపాకితోఁ గాల్చిచంపె నన్నవార్త తెలియఁగనే చక్రవర్తి మరింత ఖిన్నుఁడై యిలువీడక రాజ్యమున జరుగనున్న తన జూబిలీ ఉత్సవములఁ గూడ నాఁపివేయించెనఁట.

యువరాజుగాఁ జేయఁబడిన ఫ్రాం[illegible]డినాండు రాకుమారుఁడు, సోఫీచోటేక్ అనునొక కన్యను పరిణయమాడఁ గోరెను కాని, దానికి పార్లమెం టంగీకరింపలేదు. ఎవ్వరేమి చెప్పినను వినక, తుదకు తనకు జనించు పిల్లలకుఁ గల రాజ్యార్హతఁ గోలుపోయి, యువరాజామెను వివాహమాడి, మనోవృత్తినందుచు నుండెను. ఇది ౧౯౦౦ సంవత్సరము జూను నెల ౨౮ తేదీ నాఁటి కార్యము.

తరువాత కొంతకాలమునకు ౧౯౧౪ జూన్ ౨౮ తేదీని యువరాజు భార్యతోఁ గలిసి బోస్నియాదేశ రాజధానియగు సరాజవోపురమున ఊనుహాలున కరుగుచుండ, నొక కూర్రుఁడు వారిపైనొక బాంబు విసరెను. అది పేలకపోవుటచే నపాయము తప్పెను, [illegible] సభనుండి తిరిగి వచ్చుతఱి నొకవిద్యార్థి వారిద్వరను పిస్తోలుతోఁ జంపెను.

ఆస్ట్రియా ప్రభుత్వము తోడనే జూలై ౨౩ వ తేదీని సెర్వియా ప్రభుత్వము [illegible]రకార్యమునకు సమాధాన మడిగిరి. పిదప రెండు రోజులలో బెల్గ్రేడులోనున్న ఆస్ట్రియా రాయబారి వెంటనే స్వదేశమునకు మరలెను. ఆసాయంకాలమే చక్రవర్తి సైన్యసమూహముల నాయత్తపఱచుట కానతిచ్చి, ౧౯౧౪ జూలై ౨౮ తేదీని యుద్ధప్రకటనపత్రముపై సంతకము చేసెను. ౨౮ తేదినే యుద్ధము ప్రకటింపఁబడి ఐరోపాయంతటను జ్వాలలవలె నావరించెను. ఈ ఐరోపాయుద్ధమే ప్రపంచసంగ్రామముగ మాఱి ప్రపంచము నంతను తాఱుమాఱు చేసెను. పిదప రెండు సంవత్సరములకు చక్రవర్తి మృతినందఁగా, వారసులు లేకపోవుటచే ఆస్ట్రియా ప్రజాప్రభుత్వదేశముగా మాఱిపోయెను.

**ఫ్రాన్సుదేశము**—దీనిని పరాసుదేశమని యందురు. ఐరోపాఖండములోనిది. వైశాల్యము ౨౦౪౦౦౦ చతురపుమైళ్ళు. ఈదేశమున ఉత్తరదిశయు పశ్చిమదిశయు సమతలముగను, నైరృతిదిశ సముద్రతీరమున నిసుకబయళ్ళుగను మధ్యను సముద్రపుమట్టముపై 3000 అడుగుల ఎత్తుగల Auvergne అనుపర్వతములసంబంధముగల పీఠభూమిగను, తక్కినది పర్వతప్రదేశములుగను ఉన్నది. Cevennes పర్వతపంక్తియు, Auvergne పర్వతములును, Jura పర్వతములును, Alps పర్వతభాగమును ఫ్రాన్సుదేశమునఁగల పర్వతములు. ఆగ్నేయదిక్కున హద్దున Mount Blanc పర్వతశిఖరమును, దక్షిణమున స్పానియాదేశముతో సరిహద్దున Pyranees పర్వతపంక్తియుఁగలవు. మధ్యధరాసముద్రమునందుగల కోర్సికా ద్వీపమును, వాయవ్యదిశయందున్న Ushant అనుపేరుగల చిన్నద్వీపమును ఫ్రాన్సుసంబంధమగు ద్వీపములు. సీనునది ఈదేశముగుండా నడిచి ఇంగ్లీషుఛానలునందు సంగమించును. ల్వారు (Loire) నది బే ఆఫ్ బిస్కే యందు కలియును. ఇది దేశమున పెద్దనది యని చెప్పఁబడినది. గారోన్నది, బే ఆఫ్ బిస్కేయందు జేరుకొనును. రోన్నది మధ్యధరా సముద్రమున పడును. గారోన్నది కుత్తరమున ఛారెంటీనది. బే ఆఫ్ బిస్కేయందు జేరును. ఇవి గాక పెల్లునదియొక్కయు, మ్యూస్నదియొక్కయు, మోసెల్లీనదియొక్కయు పైభాగములు ఈఫ్రాన్సుదేశముగుండా జనుచుండును. రోనునది ఒడుదుడుకుప్రవాహమును అపాయకరమగువఱదలను తఱచు గల్గించుచుండుటకు పేరందినది.

దేశమున శీతోష్ణస్థితియు వేర్వేఱుగా నుండును. దక్షిణమున వేడిగను, ఉత్తరమున శీతలముగనుండును. బ్రిటనీచెమ్మగ నుండుసీమ. ఇందు వర్షము లధికము. తూర్పు దేశములందు శీతోష్ణములు రెండును అధికమే. ఫ్రాన్సునందు కొన్నితావులందు ఇనుము, రాక్షసబొగ్గు దొరకుచున్నది. సైంధవలవణపుగను లచ్చటచ్చట కలవు గాని, ఉపయోగము చాల తక్కువ. వ్యవసాయము దేశమున చక్కఁగ నభివృద్ధినంది వ్యాపించియున్నది. భూమి సారవంతమని చెప్పదగినది. ఎరువులఁజక్కఁగ నెఱిఁగినరైతు లగుట; ఫలవంతమై గోధుమలు పంచదారకొఱకు బీటుదుంపలు, ఉత్తర దేశమున ముఖ్యములగు పంటలు. మధ్య ప్రదేశములందు ద్రాక్షలు, దక్షిణభాగములందుఓలివ్ తోఁటలు, విస్తారముగ గలవు. ఇంకను రైధాన్యము, జొన్నలు బఠాణీలు, పొగాకుపంటలు దేశమున సర్వత్ర కలవు. దక్షిణసీమలందు పట్టుపురుగులం బెంచు నుల్బెర్రీ తోఁటలు, నారింజతోఁటలు పెక్కులు కలవు. దేశమున నెమ్మిదవవంతు అరణ్యప్రదేశము కలదని చెప్పఁబడినది.

ఫ్రెంచివారు, సెల్టిక్కుజాతి తెగవారు, రైనునదీప్రాంతముల నివాస మొనర్చు తొల్లింటి జర్మనుసంతతివారు, నైరృతిదిక్సీమలవారు తొల్లింటిస్పానియాదేశస్థుల సంతతివారు. రోమన్కాతలిక్కుక్రైస్తవమతము దేశమున ముఖ్యమతము. గోత్సు, సెల్ట్సు, దేశమున ఆదిమనివాసు లని చెప్పఁబడినది. క్రీ. వె. ౫౦ సంవత్సరమున రోమనులవశమైనది. క్రీ. వె. ౪౫౦ సంవత్సరములనాఁడు ఫ్రాంకులను జర్మనుతెగవారీదేశము నాక్రమించి వశపర్చుకొనిరి. Clovis అనునాయన మొదటిపరాసు భూపాలుఁడని చెప్పఁబడినది. ఫ్రాంకులనుండియె ఫ్రెంచిశబ్ద మేర్పడినదఁట. ఫ్రెంచి ప్రభువులపరిపాలనము క్రీ. వె. ౪౮౧ నుండినట్లు నిదర్శనములు కలవు. వారికి స్వేచ్ఛాప్రభుత్వమై యుండి, ఫ్రెంచిరివల్యూషనుతో ప్రజాప్రభుత్వ మేర్పడియున్నది. ఫ్రెంచి

భాష International diplomacy కాగితములను రచించు భాషగ నంద రంగీకరించిన గౌరవము నందినభాష. అనఁగా ఇంటర్నేషనల్ సంధిపత్రము లీభాషలోనె వ్రాయుచుందురు.

ఫ్రెంచి దేశము సారాయములకు పేరందినది. Champagne, Burgundy, Bordeaux Cognac సారాయము లందుపేరందినవి. చేతిపనులు విస్తారముగ జరగుచుండు దేశము. ఓడలు పోఁదగిన కాల్వ లన్నినదులం గల్పుచున్నవి. గాన వర్తకపు సదుపాయములు దేశమున చక్కఁగాఁగలవు. ప్రధానసగరమగు పారిస్ నగరము అన్ని దిశలకు ఇనుపబాటలు పోవుచు కూడలిస్థానముగఁ జేయుటచే ప్రధాననగరము ప్రయాణములమధ్యస్థానముగ నున్నది. ఆల్ప్సు పర్వతములగుండా రంధ్రముత్రవ్వి ఇనుపబాటల నిటలీదేశముతో కల్పియున్నారు. పరిపాలనకు ఫ్రాన్సు దేశమును ౮౭ క్రింద భాగించి యున్నారు. ఫ్రెంచివారు తమ దేశాతిశయముంగూర్చి గర్వముగ పల్కుచు లా. బెల్లి ఫ్రాంసెయి (Beautiful France) అనియు, ప్రధాన నగరమును పారి యనియు నందురు.

ఫ్రెంచివారి ప్రధాననగరమును ఆంగ్లేయులు పారిస్ అనియెదరు. ఇది సీనునదిపైనున్న నగరము. విశ్వవిద్యాలయస్థానము. గొప్పవర్తకస్థలము. చిత్రకళలకువిగ్రహకళలకు పేరందినది. బలమగు దుర్గము కలదు. గొప్పభవనములు, చూడ వింతగొల్పు కట్టడములును కలవు. Scientific సంస్థ లనేకములు గల తావు.

ఇచటఁగల ఎఫిమె ట్లవరు చూడఁదగినవింత (చూడుఁడు). ఈపరిసరములనేగల వెర్సలీక్ పురమున గొప్పప్రాసాదముకలదు.

Lyons పురము- (రోన్నది, సావోన్నదుల సంగమముకడ) పట్టుపనులకు పేరందినది. St. Etienne ఇనుపపనులకు రిబ్బనులకు పేరందినది. Rouen పురము (సీనునదీతీరము) పత్తివర్తకమున ప్రధానస్థానము. Lille (లీల్పురము) లీనె న్బట్టలు, నూలుబట్టలు నేతయందు ప్రధానస్థానము.

ఫ్రాంసుదేశ మింగ్లాండువలెనే గొప్పవర్తకప్రదేశ మగుట ఈ దేశమందలి యోడల రేవులు ముఖ్యములు. మెడిటరేనియన్సముద్రతీరమునందలి మార్సెలీస్పురము ప్రధానమైన గొప్ప రేవు. ఇది కడుపురాతన నగరమై తొల్లింట మసీలియా యనుపేరం బరగుచుండినది. దీనిని ఆసియామైనరునుండి వచ్చిన గ్రీకులు క్రీ. పూ. ౬౦౦ సంవత్సరకాలమున నిర్మాణమొనర్చిరని చెప్పఁబడినది. తరువాత చెప్పఁదగిన రేవుపట్టణము గేరోనునదిపైనున్న బోర్డో నగరము. సారాయములు, బ్రాందీ, నూనెలు, పండ్లు ఇచటి ముఖ్యములగు ఎగుమతిసరకులు. లోయర్నదిపైనున్న నాంటీస్పురము గొప్ప వర్తకస్థలమును రేవును కూడ నైయున్నది. సీనునదీముఖద్వారమునందున్న హావ్రీ పురము గొప్ప రేవుపట్టణము. డోవరుజలసంధిపై నున్న కలే పట్టణము ఒకపాటి రేవు. ఇది కొంతకాల మాంగ్లేయులవశమునందుండినపురము. ఇంకను ఇంగ్లీషుఛానల్ తీరమున దంకిర్కు పురము, బౌలోన్పురము, డిప్పీపురము రేవులై యున్నవి. ఇంగ్లీషుఛానల్ అనుపేరు ఇంగ్లీషువా రిడినది. ఫ్రెంచివారు వారిస్వభాషయందు లా. మాంచి యనెదరు. లామాంచి యనిన (Sleeve) అని యర్థము. దానియాకారమునుండి ఆ పేరుగల్గి యుండనోపు.

మధ్యధరాసముద్రతీరమునందున్న టౌలోన్పురమును, అట్లాంటిక్కు మహాసముద్రతీరమున నున్న బ్రెస్టుపురమును, ఇంగ్లీషుఛానల్పైనున్న చెర్బర్గుపురమును, ఫ్రెంచిప్రభుత్వము వారినౌకా

స్థానములైయున్నవి. ఇవిగాక ర్హైయింసుపురపు క్రైస్తవ దేవాలయమున ఫ్రెంచి దేశపు తొల్లింటి భూపతులు కిరీటధారణ మొనర్చి పట్టాభిషేక మందుచుండువారు. గోన్నదీతీరమున టౌలస్పురముకడ క్రీ. శ. ౧౮౧౪ లో ఇంగ్లీషు వారు ఫ్రెంచివారిని యుద్ధమున నోడించిరి. నైరృతిదిశగానున్న బైయోన్పురమున (Bayonne) తొలుత చేయంబడుట Bayonet తన పేరు నందినది. అవిగ్నాన్పురము కొంత కాలము రోమన్ క్రైస్తవమతాధిపతియు, ప్రధానాచార్యుఁడు నగు పోపు నివాసస్థానమై యుండినతావు. పోపుపురము (Pau), మాంటుపెల్లియరుపురము, కెన్నీసుపురము, నీస్పురము, మెంటోనీపురము సమశీతోష్ణస్థానములు. కోర్సికాద్వీపము ఫ్రాన్సునకుఁ జెందినది (చూడుఁడు). నీస్పురప్రాంతముననున్న మొనాకోస్టేటు స్వతంత్ర (Independent State)మైన సంస్థానము. ఇది చాలచిన్న ప్రదేశమైనను ఐరోపాప్రభుత్వములు దీనిని నిలిపియున్నవి. (మొనాకో చూడుఁడు.) ఫ్రెంచి దేశమునకును, ఆంగ్ల దేశమునకును వలెనే ఫారెన్పొజిషన్సు పెక్కులు గలవు. (ఫ్రెంచి ఫారెన్పొజిషన్సు చూడుఁడు.)

**ఫ్రాన్సుదేశ ప్రభుత్వము** (France)- దీనిని ఫ్రెంచి దేశమనియు, పరాసు దేశమనియు నందురు. ఐరోపాఖండమునందలి ప్రజాప్రభుత్వదేశము. ఫ్రెంచి రివల్యూషన్ జగత్ప్రసిద్ధము.

రెండు లక్షల పండ్రెండువేల ఆఱువందల అఱువది చతురపుమైళ్ల వైశాల్యమనియు, నాల్గుకోట్ల ఏడులక్షల ఏఁబదివేల జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది. రాజధాని పారిస్ నగరము.

ఈప్రభుత్వమునకు లోఁబడిన కోలనీ దేశములు పెక్కు గలవు.

**ఫారెన్హైటు తెర్మోమీటరు**—(శీతోష్ణముల గొలుచుయంత్రము చూడుఁడు. సింప్లన్ టన్నెలు చూడుఁడు.)

**ఫ్రిజిడ్జోన్సు ధ్రువ ప్రదేశములు** (Frigid Zones)— ఉత్తర దక్షిణధ్రువ ప్రదేశములకు Frigid Zones అనిపేర్లు. ఇవి రెండు. ఉత్తరధ్రువము మొదలు దక్షిణముగ నిరువదిమూఁడున్నర డిగ్రీల దూరమున నుండునటుల తలంపఁబడుచున్న ఆర్కిటిక్ సర్కిల్ వఱకుఁ గల ప్రదేశమునకు North Frigid Zone అనియు, దక్షిణధ్రువము మొదలు ఉత్తరముగ నిరువదిమూఁడున్నర డిగ్రీల దూరమున నుండునటుల తలంపఁబడుచున్న అంటార్కిటిక్ సర్కిల్ వఱకుఁగల ప్రదేశమునకు South Frigid Zone అనియుఁ బేర్లు.

వీట్లకే ఆర్కిటిక్ జోన్సు అనియును, పోలార్ రీజన్సు అనియు నందురు. (వీట్లంగూర్చి Arctic circle, Antarctic circle చూడుఁడు.)

**ఫ్రీ** (Free)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. నిర్బంధమునకు, లేక నిర్బంధపద్ధతులకు లోఁబడని అని యర్థము. దీనికి పలువిధములుగ వినియోగార్థములు గాననగుచున్నవి. అందు ముఖ్యమగు భేదములను వివరింతుము గాక. సముద్రమున ఓడపై గొంపోఁబడు సరకు నష్టమగుటయందు, Free of all average అన, కొంతభాగపు నష్టము గాని, average నష్టము గాని కాదనియు, మొత్తమంతయు నష్టమనియు నర్థమగును. మెరైన్ ఇన్స్యూరెన్సు వ్యాపార సందర్భమున Free of capture and Seizure అన, ఓడదొంగలచేతఁ గాని, పగవారిచేతఁగాని చిక్కినచో బాధ్యత లేదని యర్థమగును. ఓడపై సరకుపంపుతఱి Free of expence to ship అన, స్టీమరులో సరకు వేయించుటకు, స్టీమరునుండి దింపుటకు, అగు వ్యయమునందలి అన్ని బాధ్యతలు సరకు పంపు

వారిదే యని అర్థము. మెరైన్ ఇన్స్యూరెన్సు పోలెసీ వ్యవహారమునందు Free of General average అన under writer లను General average నుండి తప్పించుట కర్థమగును. మెరైన్ ఇన్స్యూరెన్సు సందర్భమున Free of particular average అన ప్రమాదమువలనఁగాని, అసాధ్యమగు అపాయమువలనఁ గాని, సంభవించిననే గాని కల్గెడి కొంత (భాగపు) నష్టమునకు ఇన్స్యూరుచేసిన సంస్థవారు బాధ్యులు కారని యర్థ మగును.

సముద్రమున ఓడపై సరకు బంపుతఱి Free over side అన ఓడనుండి సరకుదింపిన తోడనే పిదప సరకునకుఁ గల్గెడినష్టము సరకును కొనినవారే భరింపవలెను గాని, అమ్మినవారిది కాదని యర్థ మగును. Free trade అన నిర్బంధములులేని స్వేచ్ఛావర్తక మని అర్థము. Free hold అన పన్నుబందెలులేని సర్వదుంబాలాగా అనుభవించు భూమి మొదలగునవి యని యర్థ మిచ్చును.

**ఫ్రీచర్చి (క్రిస్టియానిటీ)** ప్రొటస్టాంటు ఇవేంజిలికల్ కమ్యూని ఇది Established Church కాదు. ఫ్రీచర్చాఫ్ ఇంగ్లాండు, ఫ్రీచర్చి ఆఫ్ స్కాట్లాండు, కాంగ్రిగేషనల్ బాప్టిస్టు ఎండ్ మెతడీస్టు చర్చి సొ... ఆఫ్ ఫ్రెండ్సు ఈ పేరఁబరఁగు ఫ్రీచర్చి యొక్క అనుబంధము లఁట.

**ఫ్రీసిటీ** (Free City)— ఇది ఐరోపా దేశపు ఏర్పాటు. మధ్యకాలమున ఫ్రీసిటీలు ఒక్కచక్రవర్తియొక్క పాలనకు మాత్రము లోఁబడుచుండినవి. నిజమున చిన్నప్రజాపరిపాలనాపురమై, దానిపద్ధతి ప్రభుత్వము నదియే నడుపుకొనుచు, చక్రవర్తికి మాత్రము లోఁబడి యుండినపురమని చెప్పఁబడినది.

ఇక్కాలమున పేర్కొనందగిన ఫ్రీసిటీ డేంజిగ్ (Danzig) పురము. ఇది లీగ్ అఫ్ నేషన్సువల్ల రక్షితము. తొల్లి ఇట్టివి ౧౦౦ వఱకు నుండెడివఁట. ఇప్పటి జర్మను రిపబ్లికు ప్రభుత్వమునందు హేంబర్గు, బ్రీమెన్, లాబెక్కు పురములు నిట్టివే యందురు.

**ఫ్రెంచిఇండియా**— ఫ్రెంచిఇండియా యన ఫ్రెంచిటెరిటరీస్ ఇన్ ఇండియా యని యర్థము. ఇవి చెన్నపురి రాజధానియందలి పుదుచ్చేరి ప్రొవిన్సు, కర్ణాటకతీరమున నేయున్న కారైక్కాలు, మలబారుతీరముననున్న మాహే, గోదావరి జిల్లాదరినున్న యానాము, (కనకాలపేటగ్రామ మిందులోనిది) బంగాళారాజధానిలో హుగ్లీ నది పైనున్న చందర్నాగోరు (చందర నగరము) నైయున్నవి. ఇంకను కృష్ణాజిల్లాలోని బందరు పట్టణమున వీరి కొకచిన్నప్రదేశము కలదందురు. ఇవియన్నియు వేర్వేరు అడ్మినిస్ట్రేటరులవశమునఁనుండి, పుదుచ్చేరియందుండుగవర్నరుగారి పరిపాలనయం దున్నవి. వీటికి ఫ్రెంచికలోని యల్ ప్రజాప్రభుత్వ మనియెదరు. ఫ్రెంచివారి క్రిందనున్న దేశమున సైన్యములుగాని, నాణెములు గాని లేవు. బ్రిటీషునాణెములే కరెన్సీయం దుండును. న్యాయస్థానములు మొదలగునవి కలవు.

**ఫ్రెంచికాంగోదేశము**— ఆఫ్రికాఖండమున, ఆఫ్రికాపశ్చిమభాగమున, లోవరుగినియా దేశములోనిది. ఇది అప్పర్గినియాలోని జర్మను కామరూన్సు మొదలు, కాంగోఫ్రీస్టేటువఱకు వ్యాపించియున్నది. ఇందు గబూనదియు, ఒగోవాయినదియు రెండునదులు కలవు. కాంగో నదిపైనున్న బ్రజావిల్లిపురము ప్రధానస్థానము. (లోవర్గినియా చూడుఁడు.)

**ఫ్రెంచికొొచ్చిన్చైనా**— ఆసియాఖండము ఇండోచైనీస్పెనిన్సులాయందు అనాము దేశమునకు వాయవ్యదిశగా నున్నది. ఫ్రెంచిప్రభుత్వ

మువారి కోలనీయై యున్నది. ౨౩౦౦౦ చతురపుమైళ్ల వైశాల్యముకలదని అంచనా వేయఁబడినది. దీనితో ఒకటిన్నర పరిమాణముగల తొల్లింటికాంబోడియా దేశ మిటీవల ఫ్రెంచివారాక్రమించి దీనికింగల్పియున్నారు. మఱియు సయాముదేశమునుండి మెకాంగునదికి తూర్పుననున్న కొంతప్రదేశమును ఆక్రమించి, దీనికిఁ జేర్చియున్నారు. కాంబోడియా అనాముల నడుమ తాలీసాబ్ అనుసరస్సుకలదు. దీనికి పెద్దసరస్సని యర్థమట. క్రీ. వె. ౧౮౬౧లో తొల్లింటిఆనాము రాజ్యమునుండి ఫ్రెంచికొచ్చిన్చైనా తీసికొనఁబడినది. కాంబోడియా ఒకప్పుడు బలాఢ్యమగు దేశముగా నుండెను. అందు తొల్లింటికట్టడములు పాడుపడుచుఁగానవచ్చుచున్నవి. ఈ దేశమున గాంబోజి యనుపేరుగల పసుపుపచ్చ బంక దొరకుచున్నది. కాంబోడియా తొల్లింటి కాంభోజదేశమై యుండునని తలంపఁబడుచున్నది. ఉడంగుపురము దీనియందు ముఖ్యపట్టణము; తొల్లింటి రాజధాని. ఇప్పటి ఫ్రెంచి కొచ్చిన్చైనాకు సైగోన్పురము ప్రధానపురము. ఇది మెకాంగునదీశాఖపై నున్నపురము.

**ఫ్రెంచి గుయానాదేశము**--(గుయానా దేశము చూడుఁడు.)

**ఫ్రెంచి తాజూరాబే ప్రొటెక్టరేటు**--తూర్పు ఆఫ్రికాయం దున్నది. (చూడుఁడు.) ఇది రెడ్సీసుఖముకడనున్న ప్రదేశము. ఒబాక్ దీని ప్రధానస్థానము. రేవుస్థానము.

**ఫ్రెంచిదేశపు మారియన్నీ బిరుదము**-క్రీ. వె. ౧౭౮౯ సంవత్సరపు ఫ్రెంచిరివల్యూషను సందర్భమున, విప్లవకాలమునందు, వైరుల బుఱ్ఱలు తెగవైచుటకుపయోగించినగండ్రగొడ్డలి యాయుధమునకు విప్లవకారులు మారియన్నీ యనుక్రైస్తవనామమును బిరుదముగ నొసంగి భక్తిసల్పిరఁట. పిదప శాంతికల్గినకతన ఆయాయుధమునందు గౌరవము వీడక ఒకబలాఢ్యురాలగు స్త్రీరూపముంగూడ నంటఁగట్టి ప్రజల సుహృద్భావరక్షణము Fraternity, Equality, Liberty ల విరోధులను శిక్షించుటయు లక్షణములుగ నిర్ణయించి ప్రజాపరిపాలన ప్రభుత్వచిహ్నముగ నొకగౌరవమును సాగించుచుండ నేర్పఱచిరఁట.

ఇక్కాలమున Marianne అనుపేరుగల రిపబ్లికురక్షకసంస్థలుకూడ కొన్ని యేర్పాటైనవి కానవచ్చుచున్నవి.

**ఫ్రెంచిపోలిష్ (French Polish)**—తొల్లి నరపాలపరిపాలితమైన దినములలో పరాసుసీమ విన్నాణముల కునికిపట్టు. సౌందర్యములకు రాశి. ఆరిందాపనుల కాస్పదము. అందు కఱ్ఱసామానులు కడురమ్యముగను, ఎక్కువవిచిత్రపువనితనముతోనుండుటయేగాక, అద్దమునకు పూతపూసినట్లు నునుపుగ నొనర్చి మెఱుఁగిడుట వారిపనియని లోకులు తలంచునంతటి చతురత పరాసుపనివారలకుఁ గల్గెను.

కఱ్ఱసామానులకు మెఱుఁగిడు వార్ణిషుపూత కడుప్రసిద్ధము. దానింజూచి ఆంగ్లేయులు తామును ఆవార్ణిషు జేయుటయందు నేర్పరులగుచుండిరి. అందు బాగుగ మెఱుఁగిచ్చు పూతకు ఫ్రెంచిపోలిష్ అనుపేరు సగర్వముగ వాడఁబడుచుండెను. రానురా నదియె ప్రసిద్ధమై నేటికిని ఫ్రెంచిపోలిష్ అని పేరట్లె యున్నది. కాని, అది ఆంగ్లేయులచే జేయఁబడినదైనను ఆపేరె యున్నది.

**ఫ్రెంచి ఫారెన్పొజిషన్సు**— ఫ్రెంచి ప్రభుత్వమువారికిని, ఆంగ్ల ప్రభుత్వమువారికిని వలెనేవి దేశములందు Foreign possessions విరివిగా కలవు.

అల్జీరియా-ఇదిఉత్తరాఫ్రికాలోనున్న కోలనీ. సెనిగాల్, నిగర్, కాంగో ఇవి పశ్చిమ ఆఫ్రికాలోనున్న టెరిటరీలు

క్రయిన్- ఇది దక్షిణ అమెరికాలో నున్న టెరిటరీ.

మెడగాస్కర్ ద్వీపము, బోర్బోన్- ఇవి ఇండియనోషన్ నందున్న ద్వీపములు.

పుదుచ్చేరి- ఇది ఫ్రెంచి ఇండియా ప్రధాన స్థానము. దక్షిణదేశమున నున్నది. దీనిక్రింద గోదావరీమండలములోని యానాము, బొంబై రాజధానిలోని మాహే, బంగాళములోనిచంద్రనాగూర్, దక్షిణదేశమందలికారిక్కాల్, బందరుపురములోని ఫ్రెంచిపేట యనునొక చిన్న ప్రదేశమును చేరియున్నవి.

టొంకింగు- పసిఫిక్కు మహా సముద్రము లోనిది.

ఫ్రెంచి కొచ్చిన్చీనా, న్యూకెలిడోనియా, వెస్టుఇండీస్ లోని కొన్ని ద్వీపములు.

మొరాకోలోనిభాగమును, మొరాకోరక్షిత సంస్థానమును ఫ్రెంచిఫారెస్ పొజిషన్సు.

ట్యూనిస్, అనామ్- ఫ్రెంచిరక్షణయందున్నవి.

ఇంచుమించు ౪-౨౦౦౦౦౦ చతురపు మైళ్ళ వైశాల్యము.

**ఫ్రెంచిరివొల్యూషన్** (French revolution)—పరాసు దేశపు తిరుగుబాటు విప్లవమునకు పేరు. క్రీ.వె. ౧౭౮౯-౧౭౯౫ మధ్యకాలమునిభావము. అంతకుపూర్వము దేశమున రాజ్యపాలనము ప్రజల కసంతృప్తి గల్గించుచుండెను. రాజబంధువర్గమంతయు సంస్థానము నందు జేరి అధికారగరిమ నెరపుటయే వృత్తిగ జీవనము గడపుచుండెను. భోగలాలసత్వము ప్రభువులను వీడకుండెను. పరిపాలనధర్మమునకు బాధ్యతలేనివారొనర్చువారిచర్యలు విపరీతములుగ బరిణమించెను.

క్రీ. వె. ౧౬౧౪ నుండి వ్యవహారములనుండి తాటస్థ్యము వహించియున్న స్టేట్సు జనరల్ ౧౭౮౯ మేనెలలో తిరుగ సమావేశమయ్యెను. అందు మూఁడవఎస్టేటు నేషనల్ ఎసంబ్లీగా ప్రకటించెను. ప్రభుత్వమును అబ్లె యంగీకరించెను. ఆసంవత్సరమె జూలై ౧౪ తేది తిరుగబాటు దేశమందంతట నొకేరీతి తలసూపెను. ఎటజూచిన నట మూఁడురంగుల జండాలు "Fraternity, Equality, Liberty" అను గురుతులతో నెగురవేయఁబడెను.

ఇట్టిసమయమున నేషనల్ ఎసెంబ్లీసభకూడి, అన్ని అధికారాచారములను రద్దుపఱచి, అందలిసభ్యులు Constituent assembly గా నేర్పడిరి. Nobles అనిపించుకొనుచుండువారగు రాజబంధువర్గమునం దనేకులు దేశము విడిచి పాఱిపోయిరి. కొందరు "Jacobin club" అని ప్రత్యేక సంస్థగా నేర్పడిరి. దేశపరిస్థితి యల్లకల్లోలముగ నడుచుచుండెను. ౧౭౯౧ సంవత్సరమున ఈఅల్లరి నడఁపఁదగినవాఁడగు Mirabeau మృతినొందెను. తోడనే రాజును,రాజ్ఞియుపారిస్ నగరము(రాజధానిని) విడచి పాఱిపోవుచు Varennesవద్ద నాపివేయఁబడి తిరుగ తీసుకొనిరా బడిరి. రాజుక్రిందనే అధికారములను తగ్గించిన యొకవిధమగు పరిపాలనావిధాన మేర్పఱుపఁ బడెను. దానిమేరకొకశాసననిర్మాణసభ పిలువఁబడెను. ఇందు Fenillant పార్టీవారును (వీరు Constitutionalist కక్షివారు), Giroudinపార్టీవారును, Jacobin పార్టీవారును ఉండిరి. ఇట్టిసందర్భమున ఆస్ట్రియాప్రభువును, ప్రష్యాప్రభువును, పరాసురాజుగారిపక్షమున తిరుగుబాటుప్రజలఁ బెదరించుచు వార్తల నంపించిరి. తిరుగు

బాటుకకువారు యుద్ధము ప్రకటింప సన్నద్ధులైరి గాని యీలోపున ఆస్ట్రియా ప్రష్యావారిబెదరింపుల నుపసంహరించుకొని తటస్థులై యూరకుండిరి. జాకోబినుకకువారు విజృంభించి సర్వమును వశపఱచుకొన నారంభించిరి. National conventionసభ కూడి, ఫరాసురాచరికమును రద్దుపఱచి, ప్రజాప్రభుత్వమును (Repuclic) ప్రకటించెను. క్రీ. వె. ౧౭౯౩ జనవరి ౨౧ తేదీని ప్రభువగు పదునాఱవలూయీప్రభుని శిరచ్ఛేదము జేయఁబడెను. అల్లరులు భయోత్పాతము సర్వత్ర వ్యాపించియుండెను. ౧౭౯౩ అక్టోబరులో Marie Antoinette శిరచ్ఛేదము నర్పఁబడెను.

తిరుగుబాటువా · రన్యోన్యకలహములకుఁ గడంగి, Danton అనువారిని ౧౭౯౪ ఏప్రిల్ ౫ తేదీని Robes pierreగారిని జూలై ౨౮ తేదీని ఉరిదీసిరి. అంతటితో అల్లరు లడఁగి శాంతి స్థాపింపఁబడి ప్రజాపరిపాలనపద్ధతి యేర్పఱుపఁ బడియెను.

దేశమున దుష్పరిపాలన మంతరింపఁ జేయఁ గల్గిన యీ మహావిప్లవమునకు ముఖ్యకారకులు పంద్రెండుగురని ప్రతీతి కలదు.

1. Louis XVI, 2. Robespierre, 3. Danton, 4. Carnot, 5. Mirabeau, 6. Voltaire, 7. Jean Paul Marat, 8. St. Just, 9. Charlotte Corday, 10. Madame Roland, 11. Lafayette, 12. Diderot గార్లు.

**ఫ్రెంచిలీవు** (French leave)— ఆదికాలమున ఫ్రెంచిసైనికులు తాము జయమందిన తావులనుండి ప్రజలయాస్తుల నడుగకుండనే లాగుకొనునాచారమునుండియు, చెప్పకుండ వెడలిపోవునాచారమునుండియు, చెప్పకుండ నుండిపోవుటకు పిదపకాలమున ఫ్రెంచిలీవని పేరు వాడుకయయ్యెను.

**ఫ్రెంచి ఐవరీకోస్టు కోలనీ**— ఆఫ్రికా ఖండమున, ఆఫ్రికా పశ్చిమభాగమున, అప్పర్గినియా దేశమందున్న సెటల్మెంటు స్టేషను.

ఇందు కేపుకోస్టు సెటల్మెంటు కేసిల్ (Castle)నుఎల్మినాసెటల్మెంటును చేరిఉన్నవి. ఎల్మినా సెటల్మెంటు అప్పర్గినియా దేశమున, మొదటి ఐరోపా సెటల్మెంటని చెప్పఁబడినది. దానిని డచ్చివారినుండి ౧౮౭౧లో ఫ్రెంచివారు కొనిరని చెప్పఁబడినది. (అప్పర్గినియా దేశము చూడుఁడు.)

**ఫ్రినోలోజీ శాస్త్రము**(Phrenology-) ఇది జర్మను దేశపు శాస్త్రము. భరతదేశపు సాముద్రికమునుబోలినది. జర్మనుభాషయందు Phren అనిన మనశ్శక్తి యనియు, Logos అనిన, శాస్త్రము లేక ఎటుంగువిధాన మనియు నర్థములు. ఒకసుప్రసిద్ధ ఫ్రెనోలోజీశాస్త్రవిదుఁడీద్దానిని "This science having for its basis the supposition that mental faculties and traits of character can be gauged from the shape and size of the skull" అని నిర్వచించి యుండెను. దీనికిఁగర్త F. J. Gall గారని చెప్పఁబడినది. ఈవిధానమును రచించుతఱి ఈయన మనుష్యకపాలమును (పునుకను) ఇరువదియాఱుభాగములుగ విభజించి, ఒక్కొకభాగ మొక్కొకమనశ్శక్తి (Mental faculties or talents)కి స్థానముగ వివరించెను. పిదప నొకజర్మనువైద్యుఁడు Johann, Gasper, Spurzheim అనుపేరుగలయాతఁ డీయనకు శిష్యుఁడై, ఈశాస్త్రమును వ్యాపింపఁ జేయుటతో మఱితొమ్మిదింటిని గూడ చేర్చి ముప్పదియైదు మనశ్శక్తులుగ నుపన్యసించుచు బోధించుచు దేశసంచార మొనర్చెను.

ఈశాస్త్రము బ్రిటీషుదీవులందు కొంతవఱకు చక్కఁగా వ్యాపించినదనియె చెప్పనయ్యెను. ఇటీవలి ఫ్రినోలోజీ శాస్త్రవేత్తలు ముప్పది యైదింటికి మఱి యేడుశక్తులంగూడ చేర్చి, మనుష్యకపాలము నలువది రెండుశక్తులం గల్గియున్న దని స్థలనిరూపణములు సహా గావించిరి.

ఈశాస్త్రమును బ్రిటీషు సీమలం దింతగ వ్యాపింప జేయఁగల్గుటకు ముఖ్యకారకులు ముగ్గురనియు, స్కాట్లాండు దేశస్థులు George Combe, Andrew Comb యనుసోదరు లిరువురు తమఉపన్యాసములమూలముననను, Bernard Hollander అనుగ్రంథకర్త M. D. తనగ్రంథములందు వ్రాయుటను వ్యాపించినదని వెగటుగఁ దెలుపుచు ఇది సరికానివిధానమని నిరసించువారును కలరు.

ఇంక నిందలి నలువది రెండు మనశ్శక్తులను వివరించి ముగింతుము గాక.

1. Amativeness, 2. Conjugality, 3. Parentel love, 4. Friendship, 5. Inhabitiveness, 6. Continuity, 7. Love of life, 8. Combativeness, 9. Destructiveness, 10. Alimentiveness, 11. Acquisitiveness, 12. Secretiveness, 13. Cautiousness, 14. Approbativeness, 15. Self-esteem, 16. Firmness, 17. Conscientiousness 18. Hope, 19. Spirituality, 20. Veneration, 21. Benevolence, 22. Constructiveness, 23. Ideality, 24. Sublimity, 25. Imitation, 26. Mirthfullness, 27. Individuality, 28. Form 29. Size, 30. Weight, 31. Colour, 32. Order, 33. Calculation, 34 Locality, 35. Eventuality, 36. Time, 37. Tune, 38. Language, 39. Causality, 40. Comparison, 41. Human nature, 42. Agreeableness.

పుఱ్ఱెయందలి భాగములను (విభాగమును) వివరించిన పటము.




ఫ్రినోలోజీ (Phrenology)—పుఱ్ఱెను జూచి పరిశీలించి మనస్సు ఎట్టిలక్షణములు కలదో ఎఱుంగువిధానము. ఇది పాశ్చాత్యకల. దీనిని కొందఱు విశ్వసించకున్నారు

## ఫ్రెటర్నిటీ, ఈక్వాలిటీ, లిబర్టీ

ఫ్రెంచి (పరాసు) దేశమున జాతీయ పతాకముపై మూఁడురంగు లుండును. అవి Fraternity సర్వసోదరభావము, Equality సర్వసమత్వభావము, Liberty స్వతంత్రభావములఁదెల్పు గురుతులు. ఈ ఏర్పాటు ఫ్రెంచిరివల్యూషనునకుఁబిదపప్రజాప్రభుత్వము స్థాపించుకొనుటతో చేసికొనినఏర్పాటు.

కాన, పరాసుదేశము నితర దేశస్థులు "Land of Fraternity, Equality and Liberty" అని వాడుటయుఁ గల్గెను. ఈ మూఁడురంగులు జండాయందు నిలువున తొలుత ఊదా, మధ్యను తెలుపు, కడను ఎఱుపు నై యున్నవి. వీటికి Tricolour అనియుం బేరు కలదంట.

**ఫ్రైట్** (Freight)—వాణిజ్యసంబంధపరిభాషాపదము. సముద్రమున ఓడపైఁగొంపోఁబడు సరకున కగు స్టీమరుఛార్జీ మూల్యము. ఇంకను నట్టిసరకునకుఁగూడ నొక్కొకతఱి వాడుచుందురు. మఱియు Freight charges యొక్క వివరములను తెల్పు పత్రమునకు Freight Note అనిపేరు. ఓడపై సరకు రవానాచేయుతఱి వాట్లకగు Freight స్టీమరు రుసుములు చెల్లింపఁబడినటుల స్టీమరు అధికారులకు రెండుపత్రములు అందఁజేయవలసియుండును. అవి "Freight forward Note, Freight release Note అనఁబడును. కొన్నితావుల నీరెండును నొకేనోటుగ నుండుటయుఁ గలదు.

**ఫ్లడ్బ్యాంకులు** (Flood banks)—irrigation (పంటకాల్వల) Engineering నందు చెప్పఁబడిన నిర్మాణములు (ఇరిగేషన్ చూడుఁడు.)

ఇవిరక్షణకై నిర్మింపఁబడునవి (Protective works). నీ రెక్కువ యగుతఱి Weir కట్టడమున కపాయము కలుగకుండనిర్మింపఁబడు గట్లు. ఇవి ఆగొప్పవెల్లువను మరల్చి కట్టడమును భద్రముగ నిలువఁ జేయునవి.

**ఫ్లాష్ పోయింటు** (Flash point)—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. నూనె వేఁడికిమండు (tobecome explosive) తావని యర్థము. అనఁగా అంత వేఁడిగల Temperature అనియర్థము. ఇవి వేర్వేరు దేశముల వేర్వేరైయుండునని తలంపఁబడుచున్నది.

**ఫ్లేర్ అప్** (Flare up)— ఇంగ్లాండు దేశమున Bristol పురమున Reform riots జరిగిననాఁటనుండి వాడుకలోనికివచ్చెను. A riot లేక Disturbance అని భావము. కొట్లాటదొమ్మి కీడ్క్తిని వాడుచున్నారు.

**ఫ్లోట్** (Floate)— వాణిజ్యసంబంధపరిభాషాపదము. తేలున ట్లొనర్చుట అనిఅర్థము. రచించుట, కల్పించుట యని భావము. Floaters అనఁగా Bearer securities గా loans ను సిద్ధపఱచిరచించుట. Fixed లేక శాశ్వతమూలధనముగ గాక మామూలు వ్యాపారము నడుపుటయం దవసరమగు ఖర్చు వెచ్చములకు గాను ఒక వర్తకుఁడు గాని, ఒక బ్యాంకి గాని వద్ద నిల్వయుంచుకొనుధనమునకు "Floating Capital" అనిపేరు. ఒక ఓడపైని తీసుకొనిపోఁబడు కొంతసరకు (యొక్క క్షేమము) నకు చేయించఁబడు భీమాకు Floating Policy అనిపేరు. ఒక లిమిటెడ్ కంపెనీయొక్క Security కిగాను దాని ఆస్తులపైచార్జి (charge) గా అసలు వృద్ధులు చెల్లింపఁబడక తప్పినతఱి బలాత్కరించి అమలుజరపుదానికి Floating Security అనిపేరు. ఓడ బద్దలై గాని, నష్టపోయిగాని అందులసరకు నీటిపై తేలుచుండుతఱి, దానికి Floatsam అనిపేరు. (అట్టిసరకులు ఎవరికి దొరికితే వారివి కానేరవు. అసలు యజమానికే చెందెడిని. వాటినిబట్టి తీసి దరిచేర్చినరికి అం దొక భాగ మీయఁబడును.)

**ఫ్లోటింగ్ డెట్**-(అన్ఫండెడ్ డెట్ చూ.)

**ఫ్లోరా, ఫౌనా**—ఇవి ఆంగ్లపదములు. ఫ్లోరా యనిన చెట్టుచేమలు (వృక్షజాతులు). ఫౌనా యనిన జంతుజాలములు. ఇవిసాముదాయికార్థమిచ్చు పదములు. ఆంగ్లభాషాగ్రంథము లందు స్వతంత్రోక్తులుగ వాడఁబడుచుండును.

**బంకత్ క్షత్రియులు**- (చౌహానులు చూడుఁడు).

**బంకమట్టి** (Clay)- దీని నొకపండితుఁడు "Saft plastic nonporous rock material in the earth's crust" అని వివరించియున్నాఁడు. ఇది Iron మొదలగు ఖనిజముల సంపర్కమున ఎఱుపు, పసుపు, ఊదారంగుల నన్నిటినిగాని, కొన్నిటినిగాని అందియుండెడిని. నీరు బంకమట్టిగుండా అవ్వలి కరుగఁజాలదు. గ్రెనైటు మొదలగు Ingneous rocks నుండి యేర్పడునది. బహిరంగస్థితినందీనరాళ్ళు పొటికి క్రమముగ పొట్టిపోవుటయు, దానియందున్న ఫెల్సుపార్ నీటఁగలసి బంకమట్టిగ నేర్పడఁజేయును. బంకమట్టిపొరపై ఒత్తిడిగల్గిన దానిని Shab పొరలుగఁజేయు విశేషమగు ఒత్తిడియు, భూపుటమునందు వేఁడిమియు చాల అధికమగునేని, అది స్లేటుపలకలు, మాపరాళ్ళుగ నేర్పడును.

ఇందు పరిశుభ్రమగు తెల్లబంకమట్టిని Kaolin అనియు, China Clay యనియు నందురు. దానితో చీనాసామానులం జేసి కాల్చుదురు. ఇతరమగు బంకమట్టితో చేసి కాల్చినవి కుండలు ఇటుకలు నయ్యెడిని.

**బంకించంద్ర ఛటర్జీ (లేక ఛటోపాధ్యాయుఁడు)**— యీఁడు. నవలల నాభాషయందు ప్రారంభించిన మొదటిగ్రంథకర్త. మిడ్నాపూర్ (మేదినీపురము) పాఠశాల యందునను హుగ్లీ కాలేజియందునను కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజియందునను విద్యాభ్యాస మొనర్చినవాఁడు. ఈయన ప్రథమదినమున నె అక్షరముల నన్నిటిని నేర్చెనని చెప్పుదురు.

కలకత్తా విశ్వవిద్యాలయపీఠము ౧౮౫౭ లో నేర్పడి బి.ఏ.పరీక్షలు ౧౮౫౮లో ప్రారంభించిరి. అందు తీర్ణులైనవారిలో బంకించంద్రుఁడే మొదటివాఁడు. "సంవాదప్రభాకర" అను నాకాలపుపత్రికకు వ్యాసములు వ్రాయుచుండినవాఁడు. డిప్టీకలక్టరుపనియందు ౧౮౫౮ లోనె పనిచేయ నారంభించి, ౧౮౯౧ లో పింఛనుపై విశ్రాంతి గైకొనినవాఁడు. రాయబహదూరనియు, సి. ఐ. ఇ. అనియు, బిరుదములనందినవాఁడు. ఉద్యోగకాలమున జెస్సూరునం దుండఁగా దీనబంధుమిత్రిబాబు (నాటక

రికిని ఈయనకును మైత్రి యేర్పడియెను. పెన్షను గైకొని "బంగదర్శన" పత్రికను ప్రారంభించి నడుపుచుండెను. ఇదియే మొదటి మాసపత్రిక యందురు. పిదప వారపత్రికయై వంగదేశాభిప్రాయముల వెల్లడించు పత్రిక యని పేరొందెను.

ఈమహాపురుషుఁడు రచించిన మొదటినవల "Rajamohan's wife" అను నాంగ్లభాషా నవల. రెండవది ౧౮౬౫లో బయల్వెడలిన దుర్గేశనందిని (Chieftains daughter) అను బంగాళీనవల.

కృష్ణకాంతుని మరణశాసనము (Will) నాల్గవబంగాళీనవలగా చెప్పఁబడినది. వీరి నవలలో "ఆనందమఠ"యనునది ప్రధాన మనుచున్నారు. ఇందే సుప్రసిద్ధ జాతీయగీతమగు వందేమాతరమ్‌పాట యున్నది.

వీరిజన్మము నైహాతి పట్టణమువద్దనున్న కాంతెల్పాడ గ్రామ మనియు, జన్మకాలము 1838 అనియు, మృతి 1894 ఏప్రిల్ అనియుఁ జెప్పఁబడినది.

**బంకిపూర్ గోలా కట్టడము**—బీహారమున కిప్పటి ప్రధాన నగర మగు పాట్నాకడనున్న బంకిపూర్‌నం దున్నకట్టడము క్రీ. శ. ౧౭౮౬ లో ధాన్యపుకొట్టుగా నిర్మింపఁబడిన

దంట. ఇప్పుడేయుపయోగమును లేక పేరందిన



'విస్ఫురింగుగాలరీ' అని వాడఁబడుచున్నది.

**బంగళా (గృహము)**— తొలుత బంగాళ దేశమునుండి యీనుచ్చుటిండ్లు ఇతర దేశములందు నిర్మింపఁబడుట, వీటి కీదిని ఈపేరు గల్గియుండునని తలంపఁబడుచున్నది గాని రాను రాను ఇట్టిగృహములు వేఁడిదేశములం దల్ల తావులందు వ్యాపించుచునే యున్నవి. ఇంగ్లాండునందునను, అమెరికాఖండమునందునను వ్యాపించుచున్నవి. నాల్గుదెసలందు ఇంటికి కాళీస్థలము లుండుట లక్షణము.

**బంగారపు రంగుద్రావకము**(Liquid Gold)-దీనిని Gold paint అనియుననెదరు. కాని, సరికాదు.

Bleached Schellac 6 ఔన్సులు, Acetone 9 ఔన్సులు, Gold powder 4½ ఔన్సులు కలుపుటయుం దిది పలచబడ వలెను. చిక్కగనే యుండిన Acetone కొంత యధికముగఁ జేర్పఁబడవలెనని చెప్పుదురు. బంగారపు రంగునందలి వేర్వేఱు Shades వచ్చుటకు Aniline dyes కల్పుదురని చెప్పుదురు. కాని, ఇవి చాల తక్కువగ కలుపుచుండవలెను.

Gold paint చేయుటకు:—

Solvent naphtha 10 గాలన్లు, Gum Dammar 80 పౌనులు, Gumtragacanth 10 పౌనులు, Celluloid అరపౌను. ఇందు 11 పౌనులు Bronze powder ను కల్పుదురు. ఇది గోల్డుపెయింటు అనంబడును. ఇవి మూలసూత్రముగా నెఱుంగునది. వేర్వేఱువిధములుగా చేయుటయుఁ గలదు.

**బంగారము**— లా. Aurum. ఆంగ్ల Gold. ఫ్రెంచిభాష Or (D'or). జర్మను Gold. డచ్చి Goud. సం. సువర్ణం, స్వర్ణం, హేమం, కనకం.

ఇది లోహములలో నెల్లవిలువగల లోహము. లోహరాజమని చెప్పఁబడుచున్నది. హిందువుల ఐశ్వర్య దేవతయగు ల[illegible]క్ష్మి చిహ్నము. మనోహరవర్ణకాంతులు గ[illegible]ట దాని "సువర్ణ" మ[illegible] నామమే [illegible] అన్నిటికన్న నెక్కువ విలువగల లోహము.

దీని Chemical Symbol Au. Atomic weight 197.2. Atomic number 79. Specific gravity 19.32. సెంటిగ్రేడు థర్మామీటరు 1061 డిగ్రీల వేఁడికి కరఁగుచు నీరువలె నగును. బంగారము మెఱయుచునుండు ధాతువు గల్గియుండియు, ఇందుక ఎఱుపుధాతువు గూడ స్వల్పస్వల్పముగనే గల్గియుండును. బంగారమునందు నైసర్గికపుస్థితియందు ముప్పది వన్నె, [illegible] కలదని చెప్పు[illegible] మొదలగు నితరలోహముల కల్తీ యెక్కువగు కొలఁది వన్నె తగ్గుచుండును. ఇది సీసముం బోలిన గట్టిలోహము. అనఁగా కలితీలేని ముప్పదియవవన్నె బంగారము సీసమంత మెత్తగ సాఁగునని యెఱుంగునది. సాఁగఁగొట్టినచక్కఁగ సాఁగుగుణమునందునను, సాఁగఁదీసినచక్కగను మెత్తగను . సాఁగుగుణమందునను, బంగార మత్యద్భుతశక్తి గల్గియున్నది. ఇతరలోహముల కిట్టిశక్తి లింతయెక్కువగ నుండుట గానము. ఒక వరిగింజయెత్తు బంగారము 56.5 చౌకపు అంగుళములరేకుగఁ గాని, 500 అడుగులపొడవుతీఁగ గఁగాని చేయవచ్చునని కనిపెట్టఁ బడినది.

వ్యాపించుట లేక వంగి గట్టిగ నుండుటయందు బంగారము ఇనుము, ప్లాటినమ్, వెండి, రాగి లోహములతరువాత చెప్పఁదగినది. ఆక్సిజెనుతో కలియునదికాదు. ఎట్టిశీతోష్ణపరిస్థితులయందైన ను,వాయువులకుఁగాని, తేమకుఁగాని స్వాధీనమై పోదు. మఱియు నించుమించు చన్ని Mineral acids కు నిలిచియుండదు. అనఁగా కొరకబడక, లొంగక నిలిచియుండును. లోహము లన్నిటి లోను నిది యెక్కువ బరువగునది. బంగారము వాడుకనందుచు వాఁతబడినను కాంతి తగ్గదు. ఒక సుప్రసిద్ధుఁడగు నాంధ్రకవి "మేలిమిబంగా రము నిప్పున గరఁగినను నఱికి తెగఁగొట్టినను రాచి యరఁగఁదీసినను (సరకుగొనక) వన్నె తగ్గదు గాని, వడ్లగింజలతోను గురివెందగింజల తోను తనను త్రాసునందు సమముగ తూచెద రని మాత్రము విషాదము జెందు" నని చెప్పి యున్నాఁడు.

బంగార మన్నిదేశములందు, నన్నితావు లందు దొరకునుగాని,చాల తక్కువగా దొరకు చుండుటచే కిట్టను గాన వదలివేయుచుందురు. ఇది తఱుచుగ నితర లోహములతోఁ గలిసి దొరకుచుండును. మఱియు నిది వెండితోడను, ఒకప్పుడు తామ్రముతోడను, ఒక్కొక్కతఱి Palladium, Rhodium మొదలగువాట్లను గూడి దొరకుటయుఁ గలదు. ఒక్కొక్కతఱి ఇసుకవలె త్రిసరేణురూపమున గనులలోను, నదీగర్భములను, అందు ఎండిపోయిన పాఁత నదిప్రవహించిన ఇసుకలలోను గూడ దొరకును. ముఖ్యముగ Quartz rock,. Alluvial deposits, Telluride ores ఈమూఁడును బంగారము దొరకుప్రదేశము లని చెప్పఁబడి నది. అందు మొదటిది రెండిటియందు ప్రధా నము. Quartz rock నందు విస్తారముగ దొరకును. గుండగ దొరకు బంగారమునకు పాదరసముం గూర్చి ముద్దగట్టించి, పిదప రెండింటిని విడఁదీసి బంగారము తీసికొందురు. ఇక్కాలమున దక్షిణాఫ్రికాసీమలందు, అమె రికా సంయుక్తరాష్ట్రములు, కనడా దేశము, ఆస్ట్రేలియా,భరతదేశములయం దెక్కువబంగా రము దొరకుచున్నదని చెప్పుచున్నారు.

ఇతరలోహములకువలెనే బంగారు అనేకము లగు Salts గ నున్నది. అందు ముఖ్యమగునది Gold Cyanide. దీనిచేతను బంగారము Ore నుండి వేఱుచేయఁ గల్గుచున్నారు. ఇట్టి ప్రాశ స్త్యము వహించిన లోహముగాన బంగారము నాభరణములుగఁ జేయుట యనాదిగ ప్రారంభ మైనది. గొప్పగొప్పవారియిండ్ల పళ్ళెములు, చెంబులు మొదలగునవి బంగారపువి యుండును. ఇటీవల ప్రభుత్వములు బంగారునాణెములు జేయ మొదలిడినవని పాశ్చాత్యులనెదరు గాని, శ్రీరాములవారి పరిపాలనకాలముననేవాడుకయం దుండిన శ్రీరామమాడలనఁబడు బంగారునాణె ము లచ్చటచ్చటఁ గానఁబడుచుంట, తొల్లింట నామహారాజుపాలన కాలముననే కోసలదేశ మున బంగారునాణెములు ప్రభుత్వ మవలం బించి ముద్రించినట్లు తేలుచున్నది.

తొల్లింటికాలపు ధనసంపద నేఁడు తలం చియుఁ బ్రయోజన ముండదు. ఇటీవల బంగారు నాణెములను ముద్రించుటకు ప్రభుత్వములు గైకొనినసంగతి మున్ను వివరించి యుంటిమి. ప్రపంచమున నేఁటేట బయలుదేఱు స్వర్ణమున నాల్గవవంతు వఱకు నాణెములుగ వేర్వేఱు ప్రభుత్వములు ముద్రించుకొనుచుంట లెక్కల వలన తేలుచున్నది. ఇది సుభిక్షకాలములం దని యెఱుఁగునది. ప్రపంచయుద్ధ మనిపించు కొనఁదగిన ఆంగ్ల, ఫ్రెంచి, జర్మనుల యుద్ధము బంగారపు పరిస్థితులను చెదరఁ గొట్టివేసెను. బంగారునాణెములు తిరుగుటకు బదులు కాగి

తపునోట్లు ప్రత్యక్షమై తిరుగ నారంభించినవి. కొన్ని కొన్ని దేశములందు బంగారము చేరు కొనెను గాని, అవి ఈలోటును బాపఁ జాలి నవి కావు. త్వరలో పరిస్థితులు తిన్న బడునని ఊహింపఁ బడుచున్నది. ఆంగ్ల సామ్రాజ్యము తనపరిస్థితులుచక్క బఱచుకొనుటతో మన దేశము నకును బంగారు నాణెములు వాడుకలోనికి వచ్చునుగాక.

ఇంగ్లాండు క్రీ. వె. 1925 సంవత్సరమున బంగారు పరిస్థితిని చక్కబఱచెను గాని, అది నిల్వలేదు. చీనా దేశము 1930 లో ప్రారంభిం చెను గాని అదియును కొనసాగకున్నది. అమె రికాయందు బంగారము నిల్వయైయుండుట గాన నగును.

బంగారవుపలుచని రేకులు యంత్రసాహాయ్యా మున జేసియు, కడుసన్నని బంగారము రాపిడియు, శాస్త్రోక్తముగఁ జేసిన బంగారుభస్మమును, గం ధకము మొదలగువాట్లతో వండిన వంట ఔష ధములగుసువర్ణ చంద్రోదయాదులునుఆయుర్వేద వైద్యులువాడుచుందురు. ఇవి ఆరోగ్యకరములు. (పరసవేది చూడుఁడు.)

## బంగారు (వరకు) రేకుల పరిశ్రమ

(Gold leaf industry)—బంగారు(వరకు) రేకులు చాల పలచనగా నుండును. ఇవి ఔషధ ములయందు వాడుచుండిరి. భరత దేశమునం దివ్యాపారముండెనుగాని, ఇటీవల క్షీణించినది. ఇపు డీపరిశ్రమయందు జర్మనీ దేశ మధిగమించి యున్నది. మిఠాయిలపై నీ రేకును గప్పి, వన్నె కుదుర్చుదురు మాత్రమేకాక పై నలంది వాసన పోకుండ నిలుపుట మొదలగుకార్యముల నొన ర్తురు. పాశ్చాత్యవిధానమున నివి రంగునుబట్టి Medium అనియు, Fine అనియు, Deep అనియు, Pale red అనియు, Deep orange అనియు, Lemon pale అనియు, White అనియు తరగతులుగ విభజింపఁబడినది.

Deep gold leaf నందు Alloy అధి కము చేరదు. Mediumనందు 42 భాగములు. అసలుబంగారమునకు రెండున్నర భాగములు వెండియు, రెండున్నరభాగములు రాగియుఁ జేర్చుదురు. ఇటులనే తక్కినవియు నుండును.

తొలుత నిట్లు కల్పినబంగారమును $1\frac{1}{2} \times \frac{3}{4}$ అంగుళముల పరిమితిగల Ingots గాఁ జేసి ఇనుపపట్టమునందు రేకులుగ సాగింతురు. ఆ రేకు 1.800 అంగుళముల దళసరికి సాగును. ఇది అంగుళము వెడలుపుగ నుండెడిని. దీనిని అంగుళముచౌకపు రేకులుగ కత్తిరింతురు. ఇట్టివి 150 దళసరి కాగితములం జుట్టి ఒక Parchment case నందు అమర్చుదురు. దీనికి "Kutch" అనిపేరు. దీనిని పదునాలుపౌనుల బరువుగల సుత్తితో మోదుచు సాఁగఁగొట్టి $2 \times 2$ అంగుళములు(4″ Sq.) రేకులుగ నొన ర్తురు. దీనికి First beating అనిపేరు. ఇట్లు 150 రేకులను 600 రేకు లగునట్లు తిరుగ కత్తిరిం తురు.

ఆ రేకులను తిరుగ Gold beater's skin తోఁ జేయఁబడిన యొకపు స్తకమునం దమర్చు దురు. దీనికి "Shoder" అనిపేరు. దానిని తొమ్మిదిపౌనుల బరువుగల సుత్తితో తిరుగ మోదుచుసాఁగఁదీతురు. దీనికి Second beating అనిపేరు. దీనితోనా రేకులుతిరుగ 4″ Sq. రేకులుగ సాగి, తిరుగఁ గత్తిరింపఁబడి 2400 అగును.

వీటిని మూఁడుభాగములుగఁ జేసి, ఒక్కొక భాగమున నెన్మిదివందల రేకుల నిడుదురు. తిరుగ వీటిని Gold beater's skin తోఁ జేయఁబ డిన యొకపుస్తకమునం దమర్చుదురు. దీనికి "Mould" అనిపేరు. దాని నేడుపౌనుల బరువు గల సుత్తితో నాల్గుగంటలసేపు మోదుచు సాగఁదీతురు. దీనికి Third beating అని-

పేరు. పిదప నా రేఖలను 3¼" Sq. రేఖలుగ గత్తిరించి కాగితపుపుస్తకములం దమర్చి విక్రయమున కాయత్తపఱచుదురు.

ఈ రేఖలు 230000 th of an inch దళసరి యనియు, ఒకగ్రెయినుయెత్తుగల లోహము 56 చౌకపుఅంగుళముల రేఖగునని యు, Machanical arts నందుఁ జేయఁబడి మిక్కిలి పలుచనయగున దిదియే యనియుఁ జెప్పఁబడినది.

**బంగారు వెండి ఫిరంగులు** — బరోడాసంస్థానమున నొకబంగారుఫిరంగియు, నొకవెండిఫిరంగియుఁ గలవు. ఇవి కీ. శే. మహారాజా ఖండీరావు గైక్వాడుగారిచేఁ జేయింపఁబడిన వఁట.

**బంగాళాదుంప వ్యవసాయము** — దీనిని హిందుస్తానీభాషయందు ఆలూ యందురు. కొందఱు ఆలూగడ్డ అనియు, అఱవదేశమున ఉరళక్కిళంగ్ అందురు. గాన కొందఱు ఉరలగడ్డ యనియు వాడుచుందురు. దీని కాంగ్లమున పొటేటో (Potato) అని పేరు.

బంగాళాదేశమునుండి యాంధ్రభూమికిఁ దేఁబడి బంగాళాదుంప యను పేరఁబరఁగుచున్న భోజనపదార్థము. ఇది తొలుత పెరూ దేశమునుండి స్పానియా దేశమునకును, అటనుండి ఐరోపాలోని ఇతరదేశములకును జేరినదందురు. Sir. Walter Raleigh అనువానివలన ఆంగ్లసీమకుఁ జేరెనని చెప్పఁబడినది.

ఇందు వేయిజాతులవఱకుఁ గలవని తేలుచున్నది. గాని వీటివ్యవసాయమున తెగుళ్లెక్కువ గాన, ఒకటిరెండు జాతులకన్న ఈ దేశమున పెరుగుటలేదు. ఇవి వేళ్లయందు దుంపలు పాఱుజాతి గాన, భూమి గుల్లగనుండుట యత్యావసరము. భూమి గట్టిపాఱినచో ఎంత సత్తువగల ప్రదేశమం దైనను దుంపలు పెద్దవిగ నెదుగక చిన్నవిగ గిడసబాఱి పోవును. ఒండుమట్టి విస్తారముగను, ఇసుక కొంత తక్కువగను ఉన్న నీటివార ప్రదేశము లీపంటకు ప్రశస్తములు. నీరు స్వేచ్ఛగ కాలువలగుండా పొలము తడుపఁగలిగినదిగ నమరి యుండవలయును. ఇతరభూములం దైనను ఈ పరిస్థితు లమర్పఁగలిగిన ఈ పైరు పెట్టవచ్చును. మైసూరురాజ్యమందు బలమైన భూములలో నీ పైరు పెట్టఁబడుచున్నది. బెంగుళూరునందు సర్వత్ర ఈ వ్యవసాయము గానవగును. ఉత్కలదేశమందలి కటకమున కవ్వాల, జగత్పూరనుగ్రామముకడ, మహానదీతీరపు లంకభూములందు, బంగాళాదుంపవ్యవసాయ మపరిమితముగఁ జేయఁబడుచు చక్కని ఫలితము నిచ్చుచున్నది. మహానది నుండియే [illegible] నీ రెగుర వైచి, పొలములు తడుపుచున్నారు. చెట్లనీడ బంగాళాదుంప వ్యవసాయమునకుఁ బనికిరాదందురు. సమశీతోష్ణప్రదేశములును, చక్కనిపరిస్థితులును అమరెనేని మిక్కిలి యనుకూలములు. బంగాళాదుంపచేనుపై గాలి యన్నిదిశలనుండి చక్కఁగ ప్రవహించునట్లు ఆటంకములు లేని కాళీస్థలము లమరినచో ఏరోగములు లేక ఫలమునిచ్చును. భూమియొక్క పరిస్థితినిబట్టి కుళ్లినఆకులు, గుఱ్ఱపుపెంట, బూడిద మొదలైన ఎరువులు చేర్చుకొనుచు, నితరభూములను గూడ నీవ్యవసాయము క్రిందకు తేవచ్చునందురు. ఆముదపుపిండి, ఎముకలపొడి ఈ చెట్లకు మంచిబలము నిచ్చునవి. సున్నము మూఁడు మాసములుగ భూమియందు ముక్కి, ఘాటు పోయిన పిదప వీటికి సమస్త రోగహారమగు మంచి ఎరువందురు.

సర్వసాధారణముగ ఈ పైరుపెట్టు రైతులు మూఁడువందలు మొదలు ఆఱువందలమణుగుల పేడయు, నలువదిరెండుమణుగుల ఆముదపు

పిండియు, డెబ్బదియైదు మణుగుల కట్టెబూడిదయు, పొలములం దెరువులుగ వేయుచుందురనియు, ఎముకలపొడి నుపయోగించు రైతులు నాల్గుమణుగులవఱకు వేయుదురనియు అంచనా వేయఁబడినది.

బంగాళాదుంపలు కణుపులనుండి మొలచునవిగాన, దుంప కణుపుకణుపునకు భాగములుగ తెగఁగోసి నాటుదురు. కాని, ఇటీవల పరిశీలనల బట్టి ఇట్టిపంటయందు పెద్దదుంపలు పాఱవని తేలుచున్నది. చిన్న దుంపలను దుంపలుగనే పాతిరేని పాతెడుదుంపలు పెద్దవైఎక్కువవిలువగలపెద్దపంట వచ్చునందురు. దుంపనాటినది మొదలు మొలకలు బాగుగ పైకి వచ్చుటకుపూర్వము పెద్దవర్షము పడినయెడల విత్తనముకుళ్ళి నష్టము సంభవింపక తప్పదు. కావునవర్షములు వెనుకబట్టుతఱి ఈవ్యవసాయము ప్రారంభించుట శ్రేయము. మఱియు రైతులీకారణముననే పెక్కుసారులుగా నీవిత్తనమును కొంతకొంత ప్రదేశము లందు మాత్రమే నాటుచుందురు. పూర్తియగు దుంపలు నాటినచో నంతవేగముగ కుళ్ళి నష్టమై పోవని యనుభవజ్ఞు లనుచున్నారు. ప్రాంతదుంపలలో మెత్తబడని గట్టిదుంపల నేరి (చిన్నవి) విత్తవలసి యుండును. దుంపలను భూమియందు నాటకపూర్వము పొడిగానుండి గాలితగులు నొకనీడప్రదేశమున, మట్టినేలపై ఇసుకపోసి, దుంపల నొకటి కొకటి అంటకుండునటుల దగ్గరగా పేర్చి, పొడిఇసుకపైన పల్చగ గప్పి, ఎన్మిది దినము లుంచిన దుంపలనుండి మొలకలు బయలుదేఱును. వీటిని నాటుటవలన వర్షపుబాధను తప్పించుకొనవచ్చు నని యనుభవజ్ఞు లనుచున్నారు. ఇంకను శాస్త్రజ్ఞులగువారు ఈ పౌనుల నైట్రేట్ ఆఫ్ పొటాసియమును నిఱువదియైదు గేలనులనీటియందు కలిపి, వాటియందు విత్తనపుదుంపలను తడిపి పైవిధమున పేర్చి యుంచిన మొలక లారోగ్యవంతముగ పెరుఁగునని చెప్పుచున్నారు.

మొక్కలు అడుగడుగుదూరమునకు నాటవలయును. మొలకలు చక్కఁగ లేచి పైకెదుగువఱకు నీరుపెట్ట నవసరము లేదు. చెమ్మయే చాలును. మఱియు నీటికి విత్తనపుదుంప కుళ్లినను కుళ్లిపోవచ్చును. భూమియొక్క స్థితి ననుసరించి వారమున కొకతడి గాని, రెండువారముల కొకతడిగాని, నీరుకట్టు చుండవలయును. కలుపు లేకుండ పెరికివేయుచుండవలయును. ఇట్టితఱి వేళ్లు కదలకుండునట్లు చూచుచుండవలయును. మొక్క బలహీనముగ నున్నచో ద్రవరూపకమైన యెరువు పెట్టవలసియుండును. నీరుపెట్టుచున్నను ఆకులు పండఁబాఱినతఱి, దుంపల పంట పండినదని గ్రహింపవలయును. కాడలు గూడ ఎండుటతో పంట త్రవ్వనారంభింపవలయును. విత్తనపుదుంపలను వేఱుగ నుంచుకొని, తక్కినదుంపలు (చాలదుంపలు) నిల్వయుండుటకుగాను రెండుపాళ్ల గంధకపుధృతిని, 93 పాళ్ల నీటిలో చక్కఁగ కలిపి, అందులో 12 గంటలు సేపు దుంపలను నానవిచ్చినచో అందలి విత్తనము చచ్చినను దుంప చాలకాలము నిల్వయుండును. తఱుచుగ ఎకరమున కిరువదియైదుమణుగుల విత్తనపుదుంప కావలసియుండును. ఇది 250 మణుగులదుంపలు పండును.

**బంగాళాదేశము (Bengal) వంగదేశము** -బెంగాల్దేశమున కుత్తరమున భూటాన్, నేపాలములును, తూర్పున ఆసాము, బర్మాలును, దక్షిణమున బంగాళాఖాతమును, పశ్చిమమున బీహారుదేశమును ఎల్లలు. 30 వేల మైళ్ళ వైశాల్యము. ఇండియాయందు నిది యిరువదియవభాగమని చెప్పఁబడినది. దేశము సమతలము ఫలవంతము; వ్యవసాయసమృద్ధి గలది. ఉత్తరపువైపునను, ఆగ్నేయదిక్కునను కొండలు

కలవు. తక్కినది సమతలము. గంగానది, బ్రహ్మపుత్రానది, వాటి శాఖానదులు దేశమునఁ బ్రవహించుచున్నవి. పశ్చిమపుశాఖానది యగు హుగ్లీ (గంగ) సముద్రసంగమమగు తావుననె సుందరవనమును, అటనే సగరద్వీపమును గలవు. ఇది పుణ్యతీర్థముగ నున్నది. గంగానదియొక్క శాఖలు అనేకము లేర్పడి, అందు భాగీరథీ, జాలంగి (జాహ్నవి) శాఖలు కలిసి హుగ్లీనది యేర్పడినది. బంగాళీభాషయందు హొూగ్లాయనిన బురద రెల్లున కర్థము. దానినుండి హుగ్లీ పట్టణమునకును, అది మండలమున ప్రధాన పురమై ఆ మండలమునకును, "హొూగ్లా" పేరు కల్గి పిదపఅటనే ప్రవహించు నీశాఖానదికి భాగీరథి పోయి హొూగ్లా పేరు వాడుచుండ, ఆంగ్లోచ్చారణయందు హుగ్లీయయ్యెను. పశ్చిమశాఖకు బ్రహ్మపుత్రశాఖతో సంగమమునకుం బిదప పద్మానది యని పేరు కల్గెను. మయునదియు, విభాషోచ్చారణలందు ఫుడ్డా యనంబడుచున్నది. ఇట్టిదే వేఱొక గంగానదిశాఖయగు మహద్గంగ, ఇప్పుడు మతభంగా యనంబడుచు హుగ్లీనదియందే జేరుకొనినది.

ఇంక కుశీనది నేపాలమున జనించి, బీహారు బంగాళముల హద్దుగ నడిచి, గంగానదియందు సంగమించుచున్నది. దామోదరానది బీహారదేశమున జనించి, ఆగ్నేయవాహినియై గంగానదిలో సంగమించుచున్నది. తీస్థా (ఇప్పటి టీస్టా) నది శిక్కింరాజ్యముగుండా ఆగ్నేయవాహినియై బ్రహ్మపుత్రానదిలో సంగమించుచున్నది.

బంగాళమునవర్షములు జూనునెలలో ప్రారంభించును. (ఇండియా దేశము చూడుఁడు.) ఇది జనసమృద్ధిగల దేశము. ఇండియాజనాభాలో బంగాళమున ఏడవవంతు కలరని తెలియుచున్నది. ఆంగ్లవిద్యయందు బంగాళీలు చాల నిపుణులని చెప్పఁబడినవారు. మైలున కీదేశమున ౫౭౦ మంది కలరని లెక్కింపఁ బడినది. గొప్ప వ్యవసాయదేశ మగుట దేశ మంతటను జనులు నివసించుచున్నారు, గాని పెద్దపట్టణము లధికముగఁ గానరావు. పొలములందు నారపంటయు, ధాన్యపుపంటయు నపరిమితము. నీలిమందు, చెఱకు, పొగాకు పంటల కనుకూల ప్రదేశములు కలవు. గంగానది, బ్రహ్మపుత్రానది ఏటేట వెల్లువలై ఇరుదెసల నూరేసిమైళ్ళదనుక సమతలమున నీరెగఁబొడిచి, ఒండు పోయుచు ఫలవంతముగ నొనర్చుచుండును.

పరిపాలనాసౌకర్యమునకు దేశ మైదు డివిజనులుగఁ జేయఁబడినది. వాటియందు మొత్తమున ౨౮ జిల్లాలు కలవు.

౧ ప్రెసిడెన్సీడివిజను- ౧ కలకత్తా (లేక ఇరువదినాల్గు పరగణాల) జిల్లా. కలకత్తా ప్రధానస్థానము. ఇది బంగాళమునకు ముఖ్యనగరము. ఇండియాదేశమున పెద్దపట్టణము. బ్రిటీషు సామ్రాజ్యమంతటిలో లండనుతరువాత నెక్కువ జనబాహుళ్యముగల రెండవనగరము. హుగ్లీనదీతీరము. గంగకవ్వల దీని కెదురుగ నేయున్న హౌడాపట్టణము తర్వాత జనబాహుళ్యము కలది. ఆలిపూరు బంగాళాగవర్నరుగారి నివాసభవనమున్నతావు. డండం పట్టణము సైన్యములున్నతావు. బరక్పూరు సైన్యస్థానము.

౨ జెస్సోరు జిల్లా- ఇది ఇరువదినాల్గు పరగణాలజిల్లాకు తూర్పున గలదు. ప్రధానస్థానము జెస్సూరు.

3 నద్దియా జిల్లా- ఇది సుందరవనమున కుత్తరమున నున్న జిల్లా. తొల్లింటిపేరు నవద్వీపము. తొల్లింట విద్యాపీఠముండినతావు. ఇప్పుడు చైతన్యమతమునకు ప్రధానస్థానము.

౪ ఖూల్నా జిల్లా-ప్రధానస్థానము ఖూల్నా-

౫ మూర్షడాబాదు జిల్లా- ప్రధానస్థానము మూర్షడాబాదు. ఇది జమీందారీ (నవాబు)కు ప్రధానపురము. శాంతిపురము వేలుపట్టణము.

౨ రాజషాహి డివిషను :—

౧ దినాజపూరుజిల్లా- దినాజపూర్ ప్రధాన స్థానము.

౨ రాజషాహిజిల్లా- గంగాతీరము. ఇందు బురద నేల లధికము. రాంపూరు బోలియా పురము ప్రధానస్థానము.

3 రంగపూరుజిల్లా- రంగపూరు ప్రధాన స్థానము. ఇది నారింజపండ్లకు పేరందినపురము.

౪ బోగ్రాజిల్లా- ప్రధానస్థానము బోగ్రా పురము.

౫ హబ్నా జిల్లా-గంగానది శాఖపై నున్న పాబ్నా ప్రధానస్థానము. బ్రహ్మపుత్రా శాఖా నదిపైనున్న శిరాజుగంజి నారవర్తకమునకు పేరందిన తావు.

౬ జల్పాయిగురీజిల్లా- డార్జిలింగున కాగ్నేయదిశగా నున్నది.

౭ డార్జిలింగుజిల్లా- ప్రధానస్థానము డార్జిలింగు. ఇది సానిటేరియమ్ వేసవినివాసము.

3 డక్కా-డివిజను:—

౧ డక్కా-జిల్లా- మెగ్నా నదీతీరము. డక్కా-పట్టణము బృహద్గంగాతీరమం దున్నది. తొల్లింట డక్కా-మజిలినులను సన్నపుబట్టలాను లకు పేరందినది. దీనికి రేవు నారాయణగంజి పురము.

౨ ఫరీద్పూరుజిల్లా- ఫరీద్పూరు ముఖ్య పట్టణము. గోయిలాండుపురము వర్తకస్థానము; రేవు.

3 బాకర్గంజిజిల్లా-బారిసాల్పురము ప్రధాన స్థానము. ఇందు ధాన్యపుపంట యధికము. దీనిని "Granary of Calcutta" అనెదరు.

౪ మైమన్సింగుజిల్లా-ఇది పెద్దజిల్లా. మైమన్సింగుపురము ప్రధానస్థానము. బ్రహ్మపుత్రా నదిపై నున్నది.

౪ చిట్టగాంగు డివిజను:—

౧ చిట్టగాంగుజిల్లా అడవులు గలది. తీరములందు సేద్యము కలదు. ప్రజలు బర్మావారిని బోలియుందురు. చిట్టగాంగుపురము ప్రధాన స్థానము. చిట్టగాంగునదీ (ఛత్తలానది)తీరము. చిట్టగాంగునకు తొల్లింటిపేరు పూలగ్రామము. గొప్ప వర్తకస్థలము. కలపవర్తకము, ఓడల నిర్మాణము కలదు.

౨ నోవాఖాలిజిల్లా- మెగ్నా నదీముఖద్వారమున నున్న బురదనేలలజిల్లా. సందీపద్వీపము, మఱికొన్ని దీవులు నిందులోనివి. నవాఖాలీ పురము ప్రధానస్థానము. బుల్లోవాపురము వేఱొకపట్టణము.

3 టిప్పెరాజిల్లా(త్రిపురమండలం)- ప్రధాన స్థానము కోమిల్లా (తొల్లింటి కోమలా) పురము.

౪ చిట్టగాంగు పర్వతములజిల్లా.

౫ బర్డ్వాన్ డివిజను:-

౧ బర్డ్వానుజిల్లా ధనవంతమైన మండలము. దామోదరా నదీతీరమం దున్న బర్డ్వాన్ (తొల్లింటి వర్ధమానపురము) ప్రధానస్థానము మహారాజాధిరాజు (జమీందారీస్థానము).

౨ హుగ్లీజిల్లా-ఇం దధికజనసంఖ్య కలదు. హుగ్లీపట్టణము (హుగ్లాపురము) ముఖ్య పట్టణము. పరిసరములనేయున్న బిన్సూరాపురమొకప్పుడు డచ్చివారికిం జెంది యుండినది. దానికి దక్షిణముననె యున్న చంద్రనాగోరు ఫ్రెంచివారిది. శీరాంపూరు ఒకప్పుడు డేనుల వలన బ్రిటీషువారికి వదలివేయఁబడినది.

కలకత్తాకెదురుగా హుగ్లీనది కవ్వల నున్న హౌడాపట్టణము పెద్దపట్టణము.

3 బంకూరా జిల్లా- ఇందు రాక్షసబొగ్గు గనులు కలవు. బంకూరాపురము ముఖ్యపట

ణము. దామోదర నదిపై నున్న రాణీగంజి వేఱొక పురము.

౪ బీర్భూమ్‌జిల్లా (వీరభూమి)- ప్రధాన స్థానము సూరీపురము.

౫ మిడ్నాపూర్ (మేదినీపురము) జిల్లా- ఇది యొకప్పు డుత్కల దేశములోనిదై యుండెను. దీనికిని, హుగ్లీ జిల్లాకును నడుమ రూపనారాయణీ నది కలదు. కసెయీ తొల్లింట కంసావతి లేక పిశానదీతీరమున నున్న మిడ్నాపూర్ (మేదినీ పురముముఖ్యపట్టణము.) సువర్ణరేఖానది ఈమండలమునఁ గలదు. రూపనారాయణినదిపైనున్న తామ్లూకు తమోర్ధ్వజపురము వేఱొక పెద్దపట్టణము. యాత్రాస్థలము. (తామ్రలిప్తి దేశము చూడుఁడు).

## బంగాళ (వంగ) దేశపుసామెతలు-

అట్టె పొడుగుండాలంటే గాలి తుపానులకు వెఁనవలసి యుండవలసివస్తుంది.

ఆకాశాన పట్టే గ్రహణ మంతా చూచేదె.

ఆవు రాలేదంటే ఎద్దునుపట్టుకుని పాలు పితుకమన్నాఁడఁట.

ఉద్యోగమున కాసించితే కుక్కపాదము లైన కడుగుటకు సిద్ధపడవలయును.

ఎగరలేకపోయినప్పుడే పక్షి రెక్కలు కొటుకోవడము.

ఏకపుత్రుఁడు గ్రుడ్డివానిచేతికఱ్ఱవంటివాఁడు.

ఏచెయ్యి తెగినా బాధ ఒకలాటిదే.

ఒక్కచేతివైనను ఐదు వ్రేళ్ళూ సమంగా ఉండవు.

కాగితము,కలము,సిరా, కలిసివచ్చిమనస్సు సమాధానపడితే చేయి ఎన్ని వ్రాతలు వ్రాయమన్నా వ్రాస్తుంది.

కాలమును నిలిపిపట్టుటకు చేతులు చాలవు.

గుఱ్ఱమునుజూచి కుంటినడువనారంభించినట్లు.

గొంతుక మొయ్యా తిని కుల మడిగినట్లు.

చెవిటివాఁడు గానమును, గ్రుడ్డివాఁడు నృత్యమును మెచ్చుకొన్నట్లు.

చెవులు పట్టుకు లాగితే బుఱ్ఱ తనంతటతానే కదిలి వస్తుంది.

చేఁప కనిపించేవఱకు కొంగకు యోగదృష్టి అభ్యాసమె.

దినము లుండవుగాని చేసినపనులు, ఆడిన మాటలు ఉంటాయి.

దేముణ్ణిచేయఁబోతే దయ్యం తయారైనట్లు.

నావపైని ఓడకంబమెత్తితే భరించునా?

నీప్రవర్తన నీచేతిలోనె యుండునది.

నీబండిచక్రమునకు ముందు కందిన మొక్కించుకో.

నోట పండ్లురానిపిల్ల నవ్వులో మాధుర్యమెక్కువ.

పంచదారబొమ్మలాటి దన్నట్లు.

పనివేళ కనబడకపోయినా భోజనంవేళ తప్పకుండా సిద్ధమే.

పనసపండులో మామిడిపండురసముండునా?

పండ్లు చెట్టుకు భారమా?

పాతగుడిశకు పేడా మన్నే గిలాబా.

పాముచేసేధ్వని కోడికి తెలుసును.

పాము ముంగిసా స్నేహము.

పుండు మానిన మచ్చ మానదు.

పేర్చవలెనంటే ఒక్కొకటిగానే పేర్చవలసి యుంటుంది.

బండి ఒంటిచక్రముమీఁద నడువదు.

బురద రాసుకున్నవారికి బుగ్గిభయ మేమిటి?

మామిడికఱ్ఱతోనే రోఁకలి చేయడము.

ముల్లుఁ దీయ ముల్లె ప్రయోగించవలెను.

మూఁగివానికల (చెప్పలేఁడు. ఏమిప్రయోజనము)

యుద్ధకాలమున నక్కకు నలుగురు పెండ్లాలు.

యుద్ధరంగములో నక్కలు నక్కలుగావు పెద్దపులులే.

యోగినీ చేఁపలఁ దినదు గాని ఆమెచంక లోనే చేఁపలమూట ఉన్నది.

సూదికి కన్నమున్నదని జల్లెడ వెక్కిరించి నట్లు.

సూదిలాగ ప్రవేశించి నాగటికఱ్ఱులాగ మానుకుని బైటికివచ్చినట్టు (అనఁగా బలిసిఅని భావము).

వాగ్దానములు చేసేవారు చంద్రుని అఱచేతిలో పెడతాననికూడా వాగ్దానము చేయ వచ్చును.

**బంగెనపల్లిస్టేటు**— ఇది కర్నూలుజిల్లాలోని ఒకచిన్న బ్రిటీషుప్రభుత్వరక్షిత సంస్థానము. ప్రభువు నవాబుగారు. మహమ్మదీయుఁడు. బంగెనపల్లి అంటిమామిడితోఁటలకు పేరంగినది.

**బండారుచెట్టు**- లా. Cinchona excelsa. దీని రసకషాయములు గ్రహణి, రక్తగ్రహణులను నివారించునని చెప్పఁబడినది.

**బండి ఱ అక్షరము** (శకటరేఫము చూడుఁడు.)

**బండి వేగముగఁ బర్విడుతఱి చక్రములయాకు లగపడకుండుట** (When carriage runs the Spokes of its wheels cannot be seen) - దేనినైనను జూచుటయందు దానివెలుతురుబింబము చూచువారి నేత్రములందలి తెర (Ratena) పై నానుటయని భావము. ఇట్లానుట ఎంతయో కాల మక్కఱలేదు. ఒక సెకెండుకాలము నందలి స్వల్పభాగమైనను జాలును. అత్తఱి నది లోని కగపడి తెలిసి మనస్సునం దాయాకారము గ్రహింపనయ్యేడిని. అనఁగా ఆకాలము నకుఁ దోడనే వేఱొకబింబము గ్రహింపసిద్ధమై యుండెడిని.

తాపీగా నడుచుబండ్లచక్రపుటాకులు చూడ వీలుండుట కేయాటంకము నుండదు గాని వేగముగఁ బర్విడుగుఱ్ఱపుబండి చక్రములందు, మోటారుబండ్ల చక్రములందు, ఆకు లతిత్వరితగమనమునఁ దిరుగుచుఁ బర్విడుచుండ, వాటి వెలుతురు బింబము కంటి 'రెటీనా' యం దానుటకుఁ గూడ నతివేగమునఁ దిరుగుటయందు మాఱిపోవుచుంట కంటియందు వాటి బింబ మానసే అఁగదు. కానఁ, జూడ లుకాని స్థితి సంభవించును. అవియు నించుక మందగతిని బోవుతఱిఁ జూడ వీలగుచుండును.

మానవనేత్రముచూడఁజా త్వరితగతితోఁ గదలుతఱిఁ జూడ వీలుకాదని యెఱుంగునది.

**బండేల్ఖండ్**--(యుజాభుక్తదేశముచూ.)

**బంతి త్రుళ్ళుచుఁ బై కెగురుట**— పైనుండి రబ్బరుబంతిని నేలఁ బడవైచిన, నది పైకి త్రుళ్ళి యెగురునని యందఱెఱిఁగినదే. ఈబంతి రబ్బరు దగుచోఁ గట్టిదైనను, లోన గుల్లగల్గి వాయువు గల్గియున్నను ఈసందర్భమునం దెట్టిభేదమును ఉండదు. అది త్రుళ్ళుటకు వలయునది ఆంగ్లరసాయన శాస్త్రజ్ఞులు రబ్బరును Elastic పదార్థ మని పేరిడి యున్నారు. బంతి గుండ్రముగనుండి నేలఁ బడవైచినతఱిఁ గ్రిందిభూమికిఁగాని, లేక ఏదేని వేఱువస్తువునకుఁగాని తాఁకి దానిస్వశరీరము కొంచెము లోనికివంగుట సంభవించును. అట్టిది కొంతబలముతో [illegible]కి లోనుండి త్రోసినట్లు వెలుపటికి తనమామూలు ఆకారమునకు తిరుగనగుటకే ఈపేరు. అట్లగుపదార్థమునే ఎలాస్టిక్ పదార్థ మనెదరు. రబ్బరే గాక ఎలాస్టిక్ శక్తిగల వనేకములు కలవు. ఇటీవలి పరిశీలనలు ఉక్కు ఎక్కువ ఎలాస్టిక్ శక్తిగల పదార్థ మని బయల్పడఁ జేసియున్నవి. ఉక్కుబంతులును

బాగుగనే త్రుళ్ళి యెగిరెడిని. అట్టిపని కాంగ్లమున Bounseing అనియెదరు.

బంతి త్రుళ్ళి ఎగురుతత్త్ర దానియందు కొంత చలనము లేక చలనశక్తి గలదని భావము. ఆశక్తి నాంగ్లమున Force అనియెదరు. శాస్త్ర గ్రంథములందు దానినే Energy అనియువాడి యున్నారు. ఆంగ్లరసాయనశాస్త్రవిదు లిట్టిశక్తులందు ఎక తెగనిశక్తి లేక పట్టుదల (Persistence of power) కలదని చెప్పుచుంట నాధర్మముమేరకు నొకతఱి త్రుళ్ళినబంతి యదేపనిగ నెప్పటికిని త్రుళ్ళుచునే యుండవలసియుండెడిని; లేక కొంతవడి కాఁగినచో ఆఎలాస్టిక్ శక్తి దానిని వదలిపోయిన దనిగాని, అంతమొంది నశించిన దనిగాని చెప్పవలసియుండును.

బంతి కదలుచుండుతఱి కని గ్రిందికిని గదలుచుండునని మన మెఱిఁగినదే. ఇంకను అట్లు కదలుచుండుతఱి కోట్లకొలఁదినసంఖ్యాకములగు వాయుపరమాణువులను (Particles of air) ఇటునటు నర్వ బలమునఁ దొలఁగఁజేయుచుండాఁ నరుగుచుండునని తలంపనగును. అట్టితఱి గ్రమముగ తనశక్తిని గొంతగొంతగఁగోల్పోవుచుంటగాఁ దలంతుముగాక. అట్లగునేని గాలి తీసివేయఁబడిన గుల్లవస్తువునం దీబండిని దుళ్ళఁ జేసిన నది తనశక్తిని గోల్పోవుట సంభవించియుండదు. కావున నెప్పటికి నట్లే త్రుళ్లుచునుండవలసియుండును. లేక అధమము దీర్ఘకాలముగనైన త్రుళ్లుచుండవలయును.

మఱియొకరీతిగ యోచించుటకు.నొక ఎలాస్టికశక్తిగల పదార్థముతోఁ జేయఁబడిన బంతిని మెత్తనియిసుక (Loose sand) పైఁగాని, లేక మెత్తని పరుపుపై లేక దిండు పై త్రుళ్ళఁ జేసినఁ జక్కఁగా త్రుళ్లక శక్తిని గోల్పోవునని అంద ఱెఱింగినదే. అనఁగా దానియొక్క త్రుళ్లెడు చలనశ[illegible] పటుపును గదలఁజేయుట కడుగునను,తక్కినదెసల వాయుపరమాణువులఁ గదలఁజేయుటయందునను వినియోగపటుపఁబడి తగ్గి కడకు వదలిపోవును. మెత్తనియిసుకయందునను ఇట్లే జరుగుచుండును గ్రింది ప్రదేశమును బంతియును ఎలాస్టిక్ శక్తియుతములుగనుండి ప్రక్కలందు,పైని,వాయువు లేకుండినచో నెప్పటికి నట్లే త్రుళ్లుచు నాఁగకయుండుట సంభవించెడిని. బంతియందు రంధ్రముండి, దానికి దెబ్బతగులునదనున, లోనిగాలి తప్పించుకొన వీలుండునేని,ఆశక్తి క్షీణించుట అందఱును జూచుచున్నదియే. అందలి ఎలాస్టిక్ శ[illegible] చునని భావము.

**బందె**—పట్టమునకు లేక కల్గినపట్టమునకు బందె యందురు ఇట్టిపట్టములనువుచ్చుకొనుటకై పశువుల నిడుదొడ్డికి బందెలదొడ్డి యనిపేరు.

**బంధకి** —నైఘంటికముగా నీశబ్దమునకు జారిణి యనియర్థము. ఈశబ్దప్రయోగప్రయోజనములు తెలిసికొనుట కొకపరమసూత్రము ముందుగాఁ దెలియనగును.

స్త్రీల కొక్కఁడే భర్త కావలయును. అట్టి భర్తకు కౌమారుఁ డనిపేరు. ఆపత్తులందు సంతానముకొఱ కన్యుఁడు నియోగింపఁబడును. ఎవతె మూఁడవపురుషుని పొందునో, ఆమెకు ప్రాయశ్చిత్తనియమము కలదు. నాల్గవపురుషుని పొందినస్త్రీ పతితురాలనంబడును. ఈమెకు సంఘమునఁజోటులేదు. అయిదవపురుషుని లేక అయిదుగురు పురుషులఁ బొందినస్త్రీని బంధకి యందురు. ఇట్లైదుగురను పొందుటచే,అనఁగా పంచభర్తృక యగుటచే ద్రౌపదిని బంధకి యని కర్ణుఁ డుద్దేశించి దుశ్శాసనకృత దుర్ణయమును ద్యూతసభలో సమర్థించుటకు గతం బేర్పడెను.

ఈబంధకి యనుశబ్దమేకదా యర్జునుని మనమునకు ములికివలె నాటుకొనియుండుటను శ్రీకృష్ణుఁడు సంజయునితో నొకఘట్టమున

'నరునకు నది వాఙ్మయమగు శరమై హృదయంబు నాటి చలియింపక దుర్భర వేదనఁ జేయఁగా'' నని నుటంకించినాడు. 'బంధకి' యనుశబ్ద మిట్లు నిర్వచింపఁ బడుట నది పంచభర్తృక యగుస్త్రీకే చెందఁదగును.

**బంధుగోత్రము**- (భరద్వాజఉపగణము చూడుఁడు.)

**బంధుఁడు (లేక) బుధుఁడు**-- తృణబిందునితండ్రి. ఇతఁడు మరుచ్చక్రవర్తిసంతతి లోనివాఁడు.

**బంధులగోత్రము**-- (ధనంజయగణము చూడుఁడు)

**బంపర్** (Bumper) "పరిపూర్తి యగు" అనియర్థ మిచ్చుచున్నది. దీనికి Full glass అని వాక్యార్థము. Au bon pere (అనఁగా to the good Father అని యర్థము) ఇందు bon అన good అనియు, pere అన Father అనియు నెఱుంగునది. రోమనుసీమలందు తొల్లింట (Pope) పోపులను good Father అని భక్తితో వాడుచుండిరి. పరిపూర్తియగుపంటకు Bumper crop అని యెదరు.

**బకధ్యానము**— చేప కండ్లఁబడువఱకు కొంగకు తదేకధ్యానదీక్ష యని భావము. (త్రికరణశుద్ధి చూడుఁడు.)

**బకః పరమధార్మికః**-కుటిలుఁడగువేదాంతినిగూర్చియీసంస్కృతలోకోక్తిని వాడుదురు. కపటవేదాంతి యనిభావము.

**బకబంధనన్యాయము**-కొంగను బట్టుకొనుటకు దానితలపై వెన్న బెట్టిన నది ఎండకు గరఁగి కొంగ నేత్రములందుఁ బడి కనఁబడకుండఁ జేయుననియు, నత్తఱి దానిని బట్టుకొనవచ్చు ననియుఁ దలంచుట యర్థము. జరగనిపని యనియు, నిరర్థకమగు తెలివితక్కువ ప్రయత్న మనియు భావము.

**బకవృత్తిన్యాయము**- కొంగ పరమ సాధువువలె ధ్యాననిష్ఠాపరాయణమై యుండి, చేప కన్పింపఁగనే పట్టిమ్రింగుచుండును. దుర్మార్గులయొక్క సాధుప్రవర్తన మనిభావము

**బక్కా**—(మక్కాపట్టణము చూడుఁడు)

**బక్కింగ్హామ్ పేలస్** (Buckingham Palace)— ఈభవనము బ్రిటీషుచక్రవర్తిగారి లండనునగర నివాసభవనము. అది యందు డ్యూకాఫ్ బక్కింగ్హాముగనుండిన జాను షెఫ్ఫీల్డుగారికై క్రీ. వె. ౧౭౦౩వసంవత్సరమున నిర్మింపఁబడి, ౧౭౬౧లో మూఁడవజార్జి నృపతి వలన కొనంబడి ౨౧౦౦౦ పౌనులవిలువ పట్టెనఁట. ౧౮౨౫ మొదలు ౩౬ వఱకు తిరుగఁ గట్టఁబడి ఒకభాగము క్రొత్తది చేర్పఁబడినది ౧౮౪౬లో నని చెప్పఁబడినది. ౧౯౧౩ లో అందమగు గంభీరమైనఎదుటిభాగము నిర్మింపఁబడినది. గొప్పవిలువగల పటములు, సామానులు కలవని చెప్పఁబడినది.

**బక్కెట్ షాపు** (Bucket Shops)-- (వాణిజ్యసంబంధపరిభాషాపదము) Brokers or commission వర్తకులు సర్వసాధారణముగ Stock exchange సంఘమున సభ్యులై యుందురు. అట్లుండ లేనివారిని Out side Brokers అనెదరు. ఒకసభ్యుఁడగు Broker మూలమున తమకార్యముల నిర్వహించుకొనుచుందురు. ఇట్టి outside Brokers యొక్క కార్యస్థానముల (offices) ను Bucket shops అనియెదరు.

**బక్షు (అక్ససు) నది**- (చక్షునదిచూ.)

**బగ్గీ** (Buggy)— గుఱ్ఱపుబగ్గీ యని యంద అనుచుండినమాటయే. భరతదేశము

నను, ఆస్ట్రేలియాయందునను, కనడా మొదలగు నమెరికాసీమలందునను వాడుకలోనున్న వాహనము. రెండుగాని, నాల్గుగాని చక్రములు గలది. ఒకటిగాని, రెండుగాని గుఱ్ఱములచే లాగఁబడునది.

**బచ్చలి (చెట్టు) పాదు** — బచ్చలియందు తీఁగగ బ్రాఁకి పందిరికెక్కు పాదుజాతియు, నేలను దుబ్బు లేక మట్టుకట్టి ప్రబలి అట్లే నిలుచు మట్టుబచ్చలిజాతియు నని రెండు ముఖ్యభేదజాతులు కలవు. ఈరెంటియందు ఎఱ్ఱరంగుగలవి, తెల్లరంగుగలవి మఱి రెండేసి భేదములుగ నాల్గు ముఖ్యభేదములు కలవని యెఱుంగునది. ఇం దెఱ్ఱజాతి శ్లేష్మము, అరుదునై యుండును. తీఁగప్రాఁకు తెల్ల, యెఱ్ఱజాతుల బచ్చలియందు తిరుఁగ పెద్ద, చిన్న యను భేదజాతులు గలవు. పెద్దజాతిబచ్చలి తెల్ల, యెఱ్ఱజాతులను ప్రసిద్ధముగ పెద్దబచ్చలిపాదనియే వాడుచున్నారు. చిన్నజాతిబచ్చలియం దెఱ్ఱజాతిని తీఁగబచ్చలి యనియు, తెల్లజాతిని పాలబచ్చలి యనియు నందురు.

పాదుప్రాఁకని మట్టుబచ్చలియం దెఱ్ఱ, తెల్లరంగుల భేదములుతప్ప వే ఱంతర్భేదములు గానరావు. బైటబచ్చలి యనంబడు నధమపు జాతియు, బుఱ్ఱబచ్చలి లేక అడవిబచ్చలి యనంబడు నధమాధమపు జాతియుఁ గూడఁ గలవు. కాని, అవి నిరాకరింపఁ బడుచున్న జాతులు. తీఁగబచ్చలినిగూడ నధమపుజాతిగనే యెంచుదురు.

బచ్చలి భోజనపదార్థమగుట ప్రసిద్ధమే. అది సమూలము నుపయోగకరమే.

పెద్దబచ్చలి—లా. Portulaca Quadrifida.

బచ్చలికూర చక్కఁగ పక్వముచేయఁబడెనేని మేహము, మేహవాతము, పైత్యము, రక్తపైత్యము, శ్లేష్మ తాప విదాహదోషముల నడంచు ననియు, విషదోషమును శమింపఁ జేయు ననియు, తొందరగా వండుటలో సరిగా పక్వముచేయఁబడక కక్కుర్తి యయ్యెనేని పైరోగముల నుద్రేకింపఁజేయుననియుఁ జెప్పఁబడినది. బచ్చలియాకులరసమునందు కాలిన చోట మంటను చల్లఁబడఁజేసి మాన్పుశక్తి గలదు. మండెడికుఱుపులను నిట్లే చల్లార్చును. కణతలకువేసిన తలలోని తీవ్రమైన వేడి తగ్గిపోవును. చక్కఁగనిద్రవచ్చును. ఆకులకషాయమునందు మూత్రమును వెడలించుశక్తి గలదు.

ఎఱ్ఱజాతి పెద్దబచ్చలి రాచబచ్చలి యని కొన్నిసీమలందు వాడుక కలదు. ఇది అపథ్యమనియు, గురుత్వముగ నుండి అగ్నిమాంద్య కఫముల నుద్రేకింపఁజేయుననియు నందురు. తీఁగబచ్చలియందు అధికముగ విరేచనము గల్గించుటయు, శ్లేష్మ, వాత, క్రిమిరోగముల నుద్రేకింపఁ జేయుటయు గుణములుగఁ జెప్పఁబడినది. పాలబచ్చలియు నపథ్యకరమై చలవ, శ్లేష్మప్రకోపము గల్గించుచు విరేచము జేయు నందురు.

మట్టుబచ్చలి వాతశ్లేష్మముల నుద్రేకింపఁజేయును గాని పైత్యమును, మేహమును అడంచునని చెప్పఁబడినది. ఇది అంత అపథ్యకారి కానేరదు. బైటబచ్చలి వాతమును, కఫమును, ఉద్రేకింపఁజేసి, రక్తపైత్యము నడంచి, విరేచనము గావించు ననియు, అడవిజాతిదగు బుఱ్ఱబచ్చలియాకులకు ఆముదము రాచి వెచ్చఁజేసి గడ్డలపైవేసి కట్టిన గుణ మిచ్చునదే గాని, భోజనపదార్థముగ నంగీకరింపఁబడనిది. బచ్చలి పూవు, కాయలు గూడ కూరగఁజేయుదు రంట గాని అపథ్యమైనవిగ నెన్నఁబడుచున్నవి.

**బచ్చలిపాముశాస్త్రము** — (రకపుచ్ఛికశాస్త్రము చూడుఁడు.)

**బటానీ చెట్టు**— లా. Pisum Sativum. ఆంగ్ల. Peas plant. సం. కలాయః, హరేణుః, హరేణుకః. ఇం దాయాస్థలభేదములచే పెక్కుజాతులుకలవు. పెద్దగింజలుగలది శ్రేష్ఠము. దీనిలో అధమపుజాతినే బోడిసెనగ లందురు. బటాణీ భోజనపదార్థము. పలుకులపై నుండు పొట్టు పైత్యము, కడుపుబ్బరము గల్గించును. ఉత్తమజాతిబటాణీపలుకులు దేహపుష్టి, బలము, వీర్యపుష్టి గల్గించుననియు, బోడిసెనగలు మొదలగు నధమపుజాతులు కడుపుబ్బరము,పైత్యోద్రేకము,శ్లేష్మప్రకోపము గూడఁ జేయు ననియు నందురు.

దీనికి తెల్లయుత్తరేణిక్షారము, నువ్వులు లేక నువ్వులనూనె, శొంఠి విఱుగుడుగఁ జెప్పఁబడినది.

**బట్టలు-గంజిబిగి** — బట్ట లుతుకుతఱి శుభ్రమైనతరువాత గంజిపెట్టి యారించి యించుక బిరుసెక్కునటుల భరతదేశమున చాకలి రెల్ల రొనర్చుచుంట యెల్లరెఱిఁగినదే. లేకున్న నవి వాడిపోయిన కూరాకులచెట్ల వలె కడు మెత్తగనుండెడిని. గంజియందలిపరమాణువులు (Molecules) ఒకటినొకటి హత్తుకొనుశక్తి గల్గినవి గాననే గంజియొక్క Surface tension ఇంచుక బలము గల్గియుండును. గంజి యందు రంగు లేకున్న కారణమున బట్టల రంగున కనుకూలించునదిగా నుండును ఇట్టి గంజిని పలుచగఁజేసి, ఉతికినబట్టలకిడి, యారించిన, నించుకబిరుసుగల్గి ధరించుట కనుకూలించి నిలిచెడిని. ఇట్లనుటవలన నందు జిగురుపదార్థ ముండదనియు, నొకపలుచనిపొర బట్టనూలునం దేర్పడుననియుం దెలియనగును

స్టార్చి (Starch) యనంబడుదానియందు నీగుణమే కలదు. ఎండినగంజి జిగురులేని పదార్థ మగుట ఎండినపిదప బట్టలకు నలుగుడు తగిలినకొలఁది పొడియై రాలిపోవుచుండును. తడి దగిలిన చెమ్మగిలుట మనమెఱుఁగుచున్నారము. ఇది గాలియం దెగిరిపోవునది Volatile గాదు.

**బడగ (నీలగిరిపర్వతపు అడవి మనుష్యుల) సామెతలు**—

ఇంటినుండి పొమ్మని చెప్పనక్కఱ లేదు. లోపల పొగ రగులబెట్టి మిరపకాయల గొట్టు పెట్టిన అంతా కదలి పోతారు.

ఎద్దునూ, ఎనుపోతునూ ఒకబండికి పూన్తే ఎద్దు ఎండకూ ఎనుపోతు నీడకూ లాగెడిని.

ఏమీ లేనప్పుడు ఆశలుండవు. అన్నీ కల్గిన పిదపనే ఆశ లెక్కువయగుట.

ఒక్క బొగ్గు రగులుకొనదు.

గ్రామంలోయుతి.అడవిలోబందిపోట్లగురుపు.

చేతనున్నంతసేపుకుండచేయిజారితే పెంకులు.

నక్క లఱచినవని ముసలిపశువులు చావవలసిన దేనా?

**బడవ - బడబాక్షేత్రము**— (జ్వాలాముఖీ క్షేత్రము చూడుఁడు).

**బద్దుముడిచెట్టు**-దీనింగూర్చి యంతగా తెలియదు. దీనివేరు సువాసనఁగల్గియుండు ననియు, పీనస,వాతము,శిరోవాతముల నడఁచుశక్తి గలదనియు, దీనిని నస్యములో కొంచెము గల్పుచుందురనియు నందురు.

**బత్తాయినారింజ**(Batavian orange) చ్చి ఈస్టుఇండీసులోని జావాద్వీపముననున్న ప్రధాననగరమగు బటేవియానుండి తీసికొని వచ్చినతరువాత బటేవియానారింజ యనంబడి, బత్తాయినారింజగ మాఱియున్నది.

ఇప్పు డాంధ్రదేశమున చాలచోట్ల ఈ నారింజతోఁటలు కలవు. ముఖ్యముగ గోదావరీ, విశాఖపట్టణమండలముల వ్యాపించి యున్నవి.

**బత్తీసాయుధములు**— (ధనుర్విద్య చూడుఁడు.)

**బదక్షాన్ పరగణాసీమ—** ఆఫ్ఘనిస్థానపు టర్కీస్థానమనంబడుసీమ. దీనిదక్షిణపు టెల్లలుగా ఆమూదరియా (ఆక్సను) నదియును, హిందూకుష్ పర్వతపంక్తియు నుండుననియు, ౮౫౦౦ చతురపుమైళ్ళ వైశాల్యమగుసీమ యనియు, లక్షమందిప్రజ లనియు, వారందఱు తేజిక్ జాతివా రనియు, పారసీభాష మాటాడువా రనియు, దేశమున కెంపుగనులు, లేపిజ్ లజోలీరాతిగనులు కలవనియు, ఫైజాబాదు ప్రధానపురమనియుఁ దెలియుచున్నది.

**బదనిక (వదనిక) చెట్టు**—లా. Lemodorum Spatulatum సం. వృక్షభక్షా, వృక్షరుహా, వృక్షాదనః, వృక్షాదనీ, శేఖరీ.

బదనికచెట్టు మామిడి మొదలగు ననేక వృక్షములపైఁ బుట్టి పెరుఁగును గాని స్వతంత్రముగ భూమిపై పెరుగుట యరుదు. వేర్వేరు వృక్షములపైఁ బుట్టినబదనికలకు వేర్వేరుమహిమలు చెప్పుదురు.

బదనికఆకులరసము చలవజేయు ననియు, వ్రణములు, విషవ్రణములు, గాయములు మాన్పుననియు, చెట్టుచూర్ణము పైత్యశాంతి గల్గించుననియు, మతిచాంచల్యము నివారించి స్తిమితపఱచు ననియు, దీని పచ్చనిపూవుల చూర్ణము పిచ్చి, ఉబ్బసము, క్షయల నివారించు ననియు, ఇది యించుక విరేచనబద్ధము గల్గించుననియు, యోగులు దీనిని సేవించుచు కాయసిద్ధిగల్గించుకొందురనియుఁ జెప్పఁబడినది.

**బదరి** — బదరి యనునది సౌవీరదేశము నందలి పురము.

బదరీనాథము– బదరీనారాయణము, బదరికాశ్రమము, విశాలబదరి.

ఇది నరనారాయణ క్షేత్రము. అరుణోద లేక చతురశీతిలింగదేశ మనుపేర తొల్లింట బరఁగిన ఇప్పటి గడవాల్ సంస్థానముహద్దులలోని (హిమవన్నగముపై నున్న) విష్ణుక్షేత్రము.

**బదరికారణ్యము**-(అరణ్యములుచూ.)

**బదరీకేదార క్షేత్రము**-తొల్లింటచతురశీతిలింగదేశమని పేరందిన అరుణోదదేశమగు ఇప్పటి గడవాల్ సంస్థానపు రాజ్యములోని క్షేత్రము. మందాకినీ దుగ్ధగంగానదుల సంగమమునకు దక్షిణముగా నున్న ఒక పర్వతము మీది దేవస్థానము. ఈపర్వతము రుద్రహిమాలయపర్వతపంక్తినుండి శాఖగ నేర్పడి, మహాపంథశిఖరమునకుదిగువనుండి, కేదారపర్వతమను పేరఁ బరఁగుచున్నది. ఇచటి మందాకినీజన్మస్థానమగు పవిత్రజలనిలయసరోవరమున ఊదారంగుతామరలు కలవు. అది రెండు రోజుల ప్రయాణములో నున్నది. మందాకినీనది రుద్రప్రయాగకడ అలకానందానది యందు సంగమించును.

కేదారశిఖరముండిన పర్వతపరిసరారణ్యమునకు బదరీవన మనియు, బదరికాశ్రమ మనియుఁ బేర్లు కలవు. కేదారనాథశివలింగము. ద్వాదశ తేజో (మహా) లింగములలో నొకటి. ఈగిరిం గూర్చియు శివలింగముంగూర్చియు శివపురాణము– ౧-౮౭ యందు ప్రశంసింపఁబడినది. పాండవు లిట కేదారేశు నర్చించిరని చెప్పఁబడినది.

కేదారేశ్వరశివలింగము లైదు కలవు. వీట్లను పంచకేదారము లందురు. నాల్గు కేదారలింగములు. తక్కినవీపరిసరములనే కొంతకొంత దూరముల నీహిమాలయప్రాంతములనే కలవు. అవి తుంగనాథమున బాహు కేదారశివలింగము, రుద్రనాథమున ముఖ కేదారశివలింగము, మధ్యమేశ్వర (మద్మాహేశ్వర)మున నాభి కేదార శివలింగము, కల్పేశ్వరమున జటా (లేక శిరః)

కేదారశివలింగమును, ఇచటి కేదారనాథశివలింగముసహా పంచకేదారము లనంబడుచున్నవి. అన్నియు మహాక్షేత్రములే.

దేవాలయపరిసరమున నె భైరవఝూంపనంబడుతావున నెత్తగునొకప్రదేశమును క్రింద నొకజలకుండమును గలవు. ఆపవిత్రస్థలియందు భౌతికశరీరము వీడినవారి కైక్యము సిద్ధించునని చెప్పఁబడినది తొలింటికాలమున లోకవాసనల విరక్తిఁజెందినవారట శరీరముల వీడి శివైక్యసిద్ధినందుచుండిరని వాడుక కలదు.

అద్వైతసిద్ధాంతబోధాదీక్షాదక్షులగు శంకరభగవత్పాదు లిటనే సిద్ధినొందిరి.

ఈ పరిసరములనే రేతకుండ మని యొకతావు గల దఁట. కార్తికేయుఁడు (కుమారస్వామి) జన్మించిన పవిత్రస్థలిం జూపుదురు. ఈకుండముంగూర్చిన ప్రశంసలు స్కాందపురాణము-మహేశ్వరఖండము౧-౨౭ యందునను, ౨-౭౯ యందునను గలవు.

కొండలదిగువుభాగమున నిచటికి 3౨ మైళ్ళ దూరమునఁగల ఉషామఠము (ఉఖీమఠము) శోణితపురములోనిది. బాణాసురభూపతికుమార్తెయగు ఉషానిర్మితమని యందురు. అట మాంధాతయొక్కయు పాండవులయొక్కయు విగ్రహములు కలవు. (ఉషామఠముంగూర్చి శోణితపురము చూడుఁడు.)

ఇచటిపరిసరముల పంచకేదారములు కలవు. అవి ౧ బృహత్కేదారము, ౨ తుంగనాథకేదారము,3 మధ్యమమాహేశ్వరము (మద్మాహేశ్వర్), ౪ తాళకేదారము, ౫ కేదారనాథము అనంబడునవి. ఇట భైరవతీర్థమున స్నానము లొనర్తురు. బదరీకేదారము మందాకినీగంగాతీరము. (హిమాలయప్రయాణమార్గములు చూడుఁడు.అరుణోదదేశము చూడుఁడు)

## బదరీనాథము

(అరుణోద దేశము చూడుఁడు).

## బదరీనారాయణము

బదరీనారాయణము- ఈచుట్టుపట్లపంచ బదరీనారాయణక్షేత్రములు కలవు.

౧ బదరీనాథము- బదరీనారాయణక్షేత్రము.

౨ వృద్ధబదరీనారాయణము.

3 యోగబదరీనారాయణము (పాండూకేశ్వరము).

౪ ఆదిబదరీనారాయణము.

౫ భవిష్యద్బదరీనారాయణము. జోషిమఠమున కారుమైళ్ళదూరముననున్న తపోవనమున నున్నది. (అరుణోద దేశము చూడుఁడు.)

## బద్దెనృపాలుఁడు (లేక బద్దెనకవి)

బద్దెనృపాలుఁడు (లేక బద్దెనకవి)- ఆంధ్రరాజకవులలో పరిగణింపఁబడినవాఁడు. పూర్వకవులలో నొక్కఁడు.

కృష్ణాతీరమున, దక్షిణపట్సహస్రావనీసీమ అనుచిన్న సామంతరాజ్య మేలుచుండిన సామంతరాజు. ఇది ఆంధ్రదేశములోనిదే. క్రి. శ. ౧౨౬౧ సంవత్సరప్రాంతమున నుండినవాఁడని తెలిసినది. ఈతఁడు కాకతీయ రుద్రమదేవికి సామంతుఁడై యుండెనఁట. కావ్యబ్రహ్మయను బిరుదము గూడ నుండెనందురు. రచించినది నీతిశాస్త్రముక్తావళి యనంబఁడు పద్యకావ్యము.

## బద్దెపురుగువ్యాధి

బద్దెపురుగువ్యాధి (Tap worm disease)-ఇది సూక్ష్మజీవుల (worms) జాతికిఁజెందిన పురుగులనుండి కలుగు అంటువ్యాధి. ఈపురుగు నవారుబద్దెవలెపలుచగ అంగుళమున నలుబదియవభాగము వెడల్పును, అంగుళమున నాల్గవభాగము పొడవును గల్గి శరీరమంతయు నతిసూక్ష్మములగు తునుకల నతికించి చేసినట్లుండును. అట్టిశరీరమున నేత్రములుండు నని తెలినది. మనుష్యులు, పందులు, పశువులు ఈజంతువున కాశ్రయమిచ్చుట కాధారము లఁట.

ఇది పెరిఁగి పెద్దదగుట యన దీనియందలి తునుకలధికసంఖ్యాకములగుటయు, వృద్ధినందుట యన దీనినుండి కొన్నితునుకలు తెగి వేరై తిరిగి పెరిగి పెద్ద వగుటయు జరుగుచుండు ననియు, నిది మాంసాహారులందు మాత్రము వ్యాపించునంటు రోగమై, పిల్లలకు కడుపునొప్పులు, కొరింత వాతము, రక్తలోపము కల్గుననియు పరిశీలనల వలన తేలినది. (ఎకినకాకస్ పురుగు చూడుఁడు. అంటువ్యాధులు, సూక్ష్మజీవులు చూడుఁడు.)

**బధిరకర్ణోపదేశన్యాయము** — చెవిటి వానిచెవియం దేమిచెప్పినను వానికి వినిపింపదు. దుష్కరప్రయత్నమని భావము.

**బధిరము** — వినిపింపకుండుట దీనికిఁ జెముడనియు నందురు. ఆంగ్ల శరీరశాస్త్రవిదులు కర్ణేంద్రియముయొక్క లోపలి ప్రధానభాగము పలుచనిపొరదై యుండుననియు, దానిపై ధ్వనితరంగములు (Sound waves) తగులుట వలన లోనికి వినిపించుచుండు ననియు, నదియే కర్ణేంద్రియపుఁబని యనియు ననుచు నాపలుచనిపొరకు ఆంగ్లమున "Timpenum" అని పేరిడియున్నారు. ఇదియె ప్రతిజీవజంతు శరీరములోని కర్ణేంద్రియములందు జరగుచుండు పనియైయున్నది. దీనిపై నేదేని కళంకము వ్యాపించి, దళసరియై సరిగ ధ్వనులు విన్పింప కుండుటను బధిర మందురు. దీని కపాయమే వాటిల్లిన హెచ్చారు వలె నుండుంగాని వినిపింప కుండెడిని.

చిన్న జీవజంతువు లనేకములం దీకర్ణేంద్రియశక్తి యుండదనియు, నేత్రములతోఁ జూచి పనులఁ జేయుచుండుననియు, పరిశీలనలు బయల్పఱచియున్నవి. ఈ పరిశీలనల నొనర్చిన Lord Avebury పండితుఁ డీసందర్భమున చిరస్మరణీయుఁడు. మానవకర్ణేంద్రియములు విన వీలుండనిమహాధ్వనుల నీకీటకములు గ్రహింపఁ గల్గుననియు, గ్రహించినను సరకుగొన వనియు నామహనీయుఁడు తెల్పుచున్నాఁడు. పరిశీలనలం దొకపూవున తేనె త్రాగుచున్న తేనెటీఁగ కొకయంగుళము దూరమున ఫిడేలుతీఁగెలం గీచి (ఎచ్చుతీఁగె కూడ) గీచి ధ్వనియొనర్చినను, అది గ్రహింపఁజాలకుండె నఁట. కాని పెక్కండ్రొనర్చినపరిశీలనలు సహా కీటకములకు విచిత్రమగు బలమైన గ్రాహ్యశక్తి కలదనియు, ఆశక్తి కర్ణేంద్రియములేని వాటి శరీరమం దంతట వ్యాపించి యున్నదనియు గ్రహింపనైనది. ఈఁగలు నిట్టివే.

**బద్ధకథ గోత్రము**-(కుశికగణము చూ.)

**బద్ధశిష్ట గోత్రము**—(పెద్దిశిష్ట చూ.)

**బనానా (అనఁటి) ఉపయోగము**-

అన్ని దేశములవారును అరఁటిచెట్టు నెఱుంగుదురు. అరఁటిపండ్లు రుచికరముగాను రసపుష్టి గలిగియు నుండును. ప్రపంచమునం దన్ని భాగములయందును నది ఫలించును. బహుమూత్రము, గ్రహణి, కొన్ని మూత్రరోగములు మొదలగువాని కది మంచియౌషధము.

అనఁటినిగూర్చి చేయఁబడిన యాధునిక శాస్త్రపరిశోధనలవలననందులోపుష్టినిగలిగించు పదార్థము విశేషముగా నున్నదని కనుఁగొనఁబడినది. ఇది మనప్రాచీనవైద్యశాస్త్రవేత్తలు చెప్పినదానికి పునరుక్తియేగాని క్రొత్తసంగతి కాదు. అరఁటిపండులో 'C' విటమిను లధికముగాను, 'B' విటమిను లొకమాదిరిగాను గలవు. కాని, 'A' విటమిను లున్నవో లేవో యనునది యింకను వివాదాంశము.

అరఁటిపండునందున్న యీ మహత్త్వమును గుర్తించియేగాఁబోలు దేవప్రసాదముక్రిందను, శుభాశుభనములయందు ఫలప్రదానముల క్రిందను దీని ననుశ్రుతముగా నుపయోగించుచున్నారు.

అనఁటివే రతిమూత్రమునకుఁ జెప్పిన మందు. స్కంధమునం దనేకములగుపొర లుండును. వానినే దొప్ప లందురు. ఈదొప్పల రసము గూడ నతిమూత్రరోగుల కిత్తురు. నల్లమందు మోతాదునకు మించి పిల్లల కీయఁబడి నప్పుడుగాని నిద్రమందునకు విఱుగుడుగాఁగాని యీరసము నుపయోగింతురు. మెదడు చల్లబఱచుటకు సయితం మీరస ముపయోగింపఁబడును. కాలినబొబ్బలకు, స్ఫోటకపుకుండలకు, రాచపుండ్లు మొదలగువానికి కదళీపత్రి మత్యంతశాంతిప్రదము. అరఁటిపూవు వండి తయారు చేసినకూర బహుమూత్రరోగికి చెప్పినపథ్యము. రెండుతులముల అరఁటిపూవురసము, తేనె అను పానముతో సేవించినయెడల నతిమూత్రరోగమున కద్భుతమయినగుణము కలుగఁజేయును.

పండ్లజాతులలో నరఁటిపండుకూడ చాల రుచిగలపండు. అతిమూత్రవ్యాధిలో నదిచేయు నద్భుతగుణము చాలమందికి తెలియదు. ఒకతులము అరఁటిపండుతో రెండుతులముల ఆమలకరసము కలిపి పుచ్చుకొనినయెడల నది వైరాగిచిటికివలె పనిచేయును.

అరఁటికాయలు విరేచనములు కట్టించుట కుపకరించును. దానిలో లోహ (Iron) ముండుటచే రక్తమును వృద్ధిచేసి పాండురోగమునకు మంచి Tonic వలె పనిచేయును.

**బనారస్‌పట్టణము.** ఉత్తరదేశమున సంయుక్తరాష్ట్రములందు బనారస్‌పట్టణము యాత్రాస్థలములలో ముఖ్యమైనది. గంగానదీతీరము. దీనికి మూఁడునామములు కలవు. అన్నిరసములు కల్పి చేసినపట్టణముగాన "బనారస్" అని పేరయ్యెను. ఇది హిందీశబ్దము. వరుణ అసీనదుల మధ్యగ నుంట "వారణాసి" యని పేరయ్యెను. ఇది సంస్కృతశబ్దము. కాని వ్యాకరణసాంప్రదాయముమేర కీశబ్దము చెల్లదు. ఐనను చిరకాలముగ నిట్లె వాడుకయుంట నిది వ్యాకరణదోషముగ పాటింపఁబడుట లేదు. ఇంక నిక్కాలమున రెండునదులం దాటికూడ పట్టణ మవ్వలికి వ్యాపించియుంట, వరుణ అసి నదుల నడుమనుండు పట్టణప్రదేశము పవిత్రప్రదేశమై యాత్రాస్థలముగ పరిగణింపఁబడుచు విశేషజనసమ్మర్దము గలదిగనున్నది పిదప కాశీదేవి యనుదేవతకు క్షేత్రమగుట "కాశీ" యనుపేరం బరఁగుచున్నది. ఈ పట్టణము విదేశస్థులకు ముఖ్యముగ యాత్రాస్థలమై యున్నది.

హిమవన్నగముపై ఉత్తరకాశీ యనియు, గుప్తకాశీ యనియు, మఱిరెండు కాశీక్షేత్రములు కలవు. అవియు యాత్రాస్థలములేయై యున్నవి.

సంయుక్తరాష్ట్రములలోని కాశీనగరము (బనారసు) కడుపురాతనమగుట వీధులు తీర్చి కట్టఁబడక, సందులు గొందులమయమై యున్నది. పురాతనభాగములందు గొప్పగొప్ప మేడ లున్నను, వీథులందు బండ్లుపోఁజాలమి నడిచియె పోవలసియుండును. ఎటఁ జూచిన నట దేవాలయములు, శివలింగములు, మందిరములు, మఠములు విస్తారముగఁ గలవు. ధర్మసత్రములును విరివిగనె యున్నవి. గంగానదియందు స్నానఘట్టములు గొప్పగొప్పవి ఎల్లెడలఁ గట్టఁబడి లక్షలకొలఁది జను లనుదినము స్నానము లొనర్చుచుండుట గాననగుచుండును. స్నానఘట్టములందు ముఖ్యమైనవి అసీసంగమఘట్టము, కేదారఘట్టము, దశాశ్వమేధఘట్టము, పంచగంగాఘట్టము, మణికర్ణికాఘట్టము, వరుణాసంగమఘట్టమున నఁబడునవి ప్రధానములుగ యాత్రికులు స్నానము లొనర్చుచుందురు.

దర్శింపఁదగిన దేవస్థానములందు విశ్వేశ్వర శివలింగము ప్రధానదేవస్థానము. ఈయావరణ

ముననే గల యవిముక్తేశ్వర శివలింగమును, దేవస్థానము వెలుపలనే వేఱొక ప్రత్యేక దేవాలయమునఁగల యన్నపూర్ణా దేవస్థానమును, అటనేగల డుంఠివిఘ్నేశుఁడును, యాత్రస్థులకు దర్శనీయములు. కొంత దూరమునఁగల విశాలాక్షీ దేవస్థానము శక్తిపీఠములలో నొకటిగఁ జెప్పఁబడిన దేవస్థానము.

తరువాతఁ జెప్పఁదగిన దేవస్థానము బిందుమాధవస్వామిది. ఈప్రాంతముననే దండపాణేశ్వరునిదేవస్థాన మున్నది. ఇంక భైరోనాథ మనంబడు పట్టణభాగమున కాలభైరవదేవస్థాన మున్నది. ఇంక పట్టణమునఁగల కాళీదేవియాలయము, గుహ, గంగయు యాత్రార్థులు దర్శించు తావులు. ఇవి గాక దుర్గా దేవస్థానము(తొల్లింటి దుర్గాసురునివధించినతావు) మొదలగు చూడఁదగినతావులు కొన్ని గలవు.

బనారస్ విశ్వవిద్యాలయము తప్పక చూడఁదగినది. ఇది తొలుత డాక్టరు ఏనిబిసెంటమ్మగారిచే స్థాపింపఁబడి, ధనము సమకూర్పఁబడి యొసంగఁబడిన ఉన్నతపాఠశాలగనుండి, మదనమోహనమాళవీయ పండితుని ప్రయత్నముల వలన యూనివర్సిటీగా నొనర్పఁబడినది. బనారస్ పట్టణమునఁగల సంస్కృతకళాశాలయు, తాతేరీ బజారను గంగకవ్వలనున్న తొల్లింటి వ్యాసాశ్రమపుతావున గట్టఁబడిన రామనగరుకోటయు రాజభవనములును, మహాశ్మశానము (తారకేశ్వరశివలింగము) హరిశ్చంద్రశ్మశానము (హరిశ్చంద్రమహారాజు సేవకావృత్తి సల్పిన తావు) మొదలగున వెన్నియో పురమున దర్శనీయములై యుండును.

**బన్నుపట్టణము**— ఇది కైబరుకనుమ మార్గమున కవ్వలనున్న సైన్యస్థానము. కాబూల్ ప్రభుకుమార్తెకు జావజార్ అనుభర్త వలనఁగల్గిన రుస్తుం ఇట నివసించువాఁడఁట. పిదప వారిసుత (రుస్తుంచెల్లెలు) బాను అను నామెకు వశమై, ఆమెనుండి ఆపే రందెనని చెప్పుదురు. ఇచట చాలరత్నము లానాటివి దొరకెనందురు. ఇప్పు డాంగ్లేయసైన్యస్థానమై యున్నది. (పంజాబుదేశము చూడుఁడు).

**బన్నువాడా (బన్నువారా) సంస్థానము**-ఇండియాదేశమునందలి రాజపుటానా ఏజన్సీలోని బ్రిటీషురక్షితసంస్థానము లిరువదింటిలో నొక రాజపుత్రసంస్థానము. (రాజపుటానా ఏజన్సీ చూడుఁడు.) బన్నువాద పురము రాజధాని.

**బబ్బుల్**(Bubble)-పైకి చూడ ముచ్చటగను, వింతగనుదోచునుగాని నిజముగ దృఢమై నిలచునది కాదని భావము. Bubble అన నీటిబుడగ యని యర్థము. క్రీ. వె. ౧౭౨౦ సంవత్సరప్రాంతకాలమున శక్తికిమీఱినకార్య ప్రయత్నములు తలపెట్టఁబడి, వాట్లకు నీటి బుడగలని వాడుచుండిరఁట. ఇక్కాలపు ప్రసంగములందు పైకి మంచివిగఁ దోఁచుచున్నను నిజమునకు నిలువవని తోఁచిన కార్యముల కీపేరు సామెతగా వాడఁబడుచున్నది.

**బభృగోత్రము**—(నిధృవగణము చూ.)

**బభృవసన్నిపాతము** — (సన్నిపాత దోషము చూడుఁడు.)

**బభ్రువాహనుఁడు**-పాండవమధ్యముండగు నర్జునునికుమారుఁడు. తల్లి పాండ్యరాజగు మలయధ్వజుని కుమార్తెయగు చిత్రాంగద. ఆతనికి చిత్రవాహనుఁడనియుఁ బేరు కలదు.

**బభ్రువు** —అత్రిసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి ద్రుహ్యుఁడు. కుమారుఁడు సేతువు.

ఇంకను యదుమహారాజువంశమున విదర్భుని పౌత్రుఁడును, సాత్వతునిపౌత్రుఁడును ఇదే పేర్లు గలవారు.

**బమ్మెరపోతరాజు**- భాగవతము తెలుఁగున పద్యములుగ రచించినవాఁడు. విద్వత్కవి ఆర్వేలనియోగిబ్రాహ్మణుఁడు. తండ్రి కేసన. కుమారుఁడు మల్లన. నివాసగ్రామ మేకశిలా నగరము లేక ఓరుగల్లు (ఇప్పటి వరంగల్లు) కడనున్న బమ్మెర లేక ఒరుగల్లు.

ఈతనినివాసము కడపమండలములోని ఒంటిమిట్టయని పెక్కండ్రు పరిశోధకులు పొరబడిరి గాని అది సరికాదని తేలినది.

పోతరాజువృత్తి వ్యవసాయము. ధనికుఁడు కాఁడు. ఈతని పోతన యనియు, పోతరాజనియు, పోతనామాత్యు డనియు వాడుట కలదు. అమాత్యుఁడనుట ఉద్యోగముకతన గాదు. నియోగియౌట నటనుచుండిరి. అనర్గళ ధారాకవిత్వము రచించుటలో గొప్పవాఁడు. ఈతనింగూర్చి పలుకల్పనాకథలు చిత్రవిచిత్రములు గల్పింపఁబడినవి. వాట్లను వ్రాయుచు పుటల నింపుట మాగ్రంథలక్షణము గాదుగాన వ్రాయక విరమించితిమి.

పోతనకు శ్రీరామునియందు భక్తి మెండు. విష్ణుభక్తుఁడు. ఈతని బావమఱఁది కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు. భాగవతము రచించి శ్రీరామున కంకితమొనర్చినవాఁడు. ఈతఁడు రచించిన మఱియొక గ్రంథము వీరభద్రవిజయ మను దక్షాధ్వరధ్వంసకథ. ఇది నరాంకితము చేయఁబడినది. తండ్రిపేరు కొమ్మరాజు. కౌండిన్యసగోత్రము. క్రీ.వె. ౧౪౦౦ లేక ౧౪౬౦ ప్రాంతమువాఁడని తేలుచున్నది. యౌవనమున గొలుగొండసీమలోని రాచకొండదుర్గాధీశుఁ డగు రేచర్ల రావుసింగభూపాలప్రేరితుఁడై భోగినీదండకము రచించెను. భక్తిమై బొప్పన భాగవతమును ఆంధ్రపద్యకావ్యముగ రచించి, తన ఇష్టదైవమగు శ్రీరామునకుఁ గృతినిచ్చెను. అందు తానొనర్చినకవిదూషణలకు వెఱగందుచు దోషపరిహారమునకై వీరభద్రవిజయ మను ప్రబంధము రచించెనని తేలుచున్నది.

పోతన యాంధ్రభాగవత మెల్లెట్లో కొన్ని పత్రములు శిలమాయెనఁట. దానిని గంగన కవియు, వెలిగందల నారయకవియు తిరుగ రచించి పరిపూర్తియొనర్చిరఁట.

పోతనకుమారుఁడు ప్రౌఢకవిమల్లన యని చెప్పఁబడినది. ఈకవినిగూర్చిన చాటుధారా పద్యములు కొన్ని గలవు. అవి సంశయింపఁ బడినవి.

మఱియుఁ బోతనామాత్యుని తమ్మునిపేరు తిప్పయ్య. తండ్రిపేరు కేసనమంత్రి. (భార్య లక్కమాంబ). పితామహుఁడు ఎల్లనమంత్రి. (భార్య మాచమ్మ). ప్రపితామహుఁడు సోమరాజు. (భార్య మల్లమ్మ). ప్రప్రపితామహుఁడు అన్నయ్య. (భార్య గౌరాంబ). ఆయనకు తండ్రియు మూలపురుషుఁడు నగు నతఁడు భీమన మంత్రియని తెలియుచున్నది.

**బయాగ్రఫీ,ఆటోబయాగ్రఫీ**—(Biography & Autobiography) ఒకరి జీవచరిత్ర (అన్యులచే వ్రాయఁబడినది) ఆంగ్లమున బయాగ్రఫీ యనంబడును. తనచరిత్రను తానే వ్రాసికొనిన దానికి ఆటోబయాగ్రఫీ (Auto Biography)యని యాంగ్లభాషయందు పేరు.

**బయోకెమిస్టరీ** (Bio-chemistry)- రసాయనశాస్త్రభాగములలో నిది యొక భాగముంగూర్చి తెలుపునట్టి శాస్త్రము. ప్రాణముగల జంతుజాలములు, చెట్లు మొదలగువాని యందలి జీవపదార్థముం గూర్చిన శాస్త్రము. శరీరములం దున్నను జీవసంబంధ పదార్థములు కానట్టి ఇతరవస్తువులతో దీనికిసంబంధము లేదు. క్రీ.వె. ౧౯౨౭ లో అక్సుఫర్డునందు బయోకెమిస్టరీపాఠశాలయొకటి స్థాపింపఁబడియున్నది.

**బరన్ను**- (గెయిసర్సు చూడుఁడు.)

**బర్కోటా శాఖ క్షత్రియులు**
(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు.)

**బర్మాదేశనివాసులు**— ఆదిని మాను లనుజాతివారు హెక్మెర్ జాతివారును, ఐరావతీనదియందుండి దేశమునదిగి తూర్పుగా చీనాసముద్రమువఱకు వ్యాపించి, కాపురము గుదిరి రనియు, వారిసంతతివా రిప్పుడు తలైయంగ్ జాతిగను, తెనాసిరిమ్ జాతిగను, పిలువఁబడుప్రజలుగ నున్నారనియు తెలియుచున్నది. వారి నాంగ్లమున Wild Was అనియెదరు. వా రిప్పుడు బర్మాతూర్పుహద్దునను,పలౌవింగ్స్ ప్రాంతములను గాననగుచున్నారు. వీరికిఁబిదప టిబెటోబర్మా జాతివా రరుదెంచిరి. వీరు క్రీ.ము. 423 ప్రాంతములం దరుదెంచిరందురు. వీరు ఐరావతీనదిలోయనుండి అచటనున్న వారిని తూర్పునకు, దక్షిణమునకుఁ దఱిమివైచిరఁట. వారిసంతతివారే యిప్పుడు బర్మను లనియు, కాచినులనిఁ బర్మాఉత్తరభాగములందు నను చిన్నలని బర్మా వాయువ్యభాగమునను పేరందియున్నారు. తరువాత బర్మాదేశమున కేతెంచి కాపురముగుదిరినవారు సయాం చీనా సంబంధ జాతులవారు. వీరిసంతతివా రిప్పుడు బర్మాదేశపుఈశాన్యదిశయందు గల షాన్ స్టేట్సునందు షాను లనియు, కారెను లనియుఁ బిలువఁబడువారుగ నున్నారు. కారెను లందు కొంతవఱకు క్రైస్తవమతము వ్యాపించియున్న దందురు. ఇంకను పిదప నేతెంచిన చింగ్పొజాతివారు కొందరు గాననగుచున్నారు. వీరిరాక యేలనో ఆఁపఁబడెనఁట.

**బర్మాదేశము**— దీనికి తొల్లింట బ్రహ్మదేశమని పేరుండె నందురు. ఇది యిక్కాలమున పరిపాలనాసౌకర్యమునకుఁ గాను లోవరుబర్మా యనియు, అప్పరుబర్మా యనియు రెండు భాగములుగఁ జేయఁబడియున్నది. బర్మా ప్రజలను చీనా మలయా తెగలంబోలిన మధ్యజాతివారని కొందరు తలంచుచుందురు. గిల్టుపనులు, లేకరుపనులు చేయుట, కంచుగంటలు పోయుట, విగ్రహములు జేయుట, చిత్రపుపనులు చేయుట, రత్నములనుకోయుట,సునుపుచేయుట వెదురుతో చిత్రపుపనులు చేయుటలందునను, లక్కరంగులు బంగారురంగులు పూయుటయందునను కడు నేర్పరులు. దీనిని బ్రిటీషు ప్రభుత్వమువారు భరతదేశమునకుఁ గల్పి, వైస్రాయిగారి లోఁబడిన యొక గవర్నరుపరిపాలనయం దుంచియున్నారు. షాన్ స్టేట్సునందు చీనావా రెక్కువమంది గలరు. కొన్ని స్వతంత్రములగు షాన్ స్టేట్సు గలవు. బాటలు చాల తక్కువ. వర్తకము నదులపై ఓడలందునను జరుగుచున్నది. ఇనుపబాటలునుగలవు. బౌద్ధమతము వ్యాపించిన మతము. (ఆసియా ఖండము, లోవరు బర్మా దేశ అప్పర్బర్మా దేశము చూడుఁడు.)

**బర్మాలో కోరంగి శబ్దము**— కోరంగి తూర్పు గోదావరీమండలములో కాకినాడ తాలూకాలోని యొకగ్రామము. గోదావరీనది శాఖపై నుంట పడవలపై కొంతవఱకు వర్తకము జరుగు నుండు తావుగ నున్నది. ఇచటఁగల కురంగీశ్వర దేవస్థానమునుండి పేరందినదందురు.

ఇటనుండి ఆదికాలమున బర్మాదేశమున కాదికాలమున కూలినాలులకై యాంధ్రులు బర్మాదేశమునకు వలసపోవుచుండిరఁట గాన బర్మాలో తెలుగుకూలీలకు కోరంగీ లనుపేరు వాడఁబడుచుండెనఁట. ఇటీవల నది మురిరి తెలుఁగువారినందఱను కోరంగీలనియేబర్మావారు వాడసాగిరఁట. ఇది హేయమై తోఁచి బర్మా ఆంధ్రులు ఈ వాడుకను నిరసించుచున్నారని విందుము.

**బరోడాసంస్థానరాజ్యము**— ఇండియా ప్రభుత్వాధి కారమునకు లోఁబడిన వెస్ట్ర

నిండియా స్టేట్సులలో ప్రాముఖ్యమైనది. ఇంచు మించు డెబ్బదివేల చతురపుమైళ్ళ వైశాల్యము గల రాజ్యము. దీనిని గైక్వార్సు మినియన్సు అనియు వాడుచున్నారు. తొల్లింట గైక్వాడు మహారాజు పీష్వాలకు సామంతుఁడుగా నుండిన భూపతి. గాన నేటికిని బరోడా రాజ్యాధిపతి యగు మహారాజునకు హిసు హైనెస్ ది గైక్వాడు మహారాజా ఆఫ్ బరోడా యను బిరుదము కలదు.

బరోడాపురము రాజధాని. దీనిసైన్యస్థానము దీశాపురము. మహారాజు మహారాష్ట్రుఁడు. గొప్పరాజనీతిజ్ఞుఁడని పేరందినవాఁడు. ఈయన పరిపాలనము చాల సౌఖ్యప్రదమని పేరందినది.

**బర్డు ఇన్ ది హేండ్** (Bird in the hand is worth two in the bush)— ఒకప్పుడు ఎన్మిదవహెన్రీ నరపతిహాస్యముచెప్పు సోమర్సు (Somers) అను వినోదకరుఁ డుండు వాఁడఁట. ఆతని కొకప్పుడు Lord Surrey యొక King Fisher అనుపక్షిని బహుమతిగా నొసఁగెనఁట. పిదప నాపక్షిని Lord Northampton కాంక్షించి అడిగెనఁట. దాని నీయ నొల్లక Somers నిరాకరింప, Lord Surrey దాని "నిచ్చివేయుఁడు. మీకు నేను రెండు పక్షులంబట్టియిచ్చెద"ననియెనఁట. దానికావినోదకరుఁడు పైవాక్యమును ప్రత్యుత్తరముగా బల్కెనఁట. ఉ నానాటికి ప్రసిద్ధమై సామెతగా ప్రసంగములందు వాడఁబడుచున్నది

**బర్డెన్** (Burden)- (వాణిజ్యసంబంధపరిభాషాపదము) సరకులనుదీసికొనిపోవునోడయొక్క శక్తి Tonnage అనియుఁ ననెదరు.

**బన్ను**- పాంచాలములోనిది. ఇప్పుడు దీనిని బన్ను అనుచున్నారు. హ్యూనత్సాంగు దీనిని ఫలను అనివ్రాసెను. పాణిని దీనింగూర్చి ప్రశంసించెను.

**బర్బరకొంకణము**— సప్తకొంకణములలో నొకటి కొంకణదేశము (చూఁడుఁడు.)

**బర్రటీ్ర** (Barratry)-(వాణిజ్యసంబంధపరిభాషాపదము.) సరకులంగొంపోవు నోడ పనివాండ్రు, ఉద్యోగులు నోడనువదలి ఆకాలమున పాఱిపోవుట, ఓడయందలిసరకుల నపహరించుట, ఓడను దారితప్పించుట,ముంచివేయుట మొదలగు ఓడయజమానులకు నష్టముగల్గించు కార్యము లొనర్చిన నేరమునకు పేరు.

**బరి్రంకచెట్టు**— (భరణికచెట్టు చూ.)

**బర్హర్** (శాఖ) **క్షత్రియులు**—(ప్రమారశాఖక్షత్రియులు చూడుఁడు.)

**బర్హిణాశ్వుఁడు లేక అమితాశ్వుఁడు**- కృశాశ్వునితండ్రి. ఇక్ష్వాకుసంతతి. సూర్యవంశక్షత్రియుఁడు.

**బర్హిషదుఁడు** (ప్రాచీనబర్హి)— ఈయనంగూర్చి విశేషములు తెలియవు. బర్హిషదులనంబడువారు దేవతలలో నొక తెగవారు. (పితరులు దేవతలు చూడుఁడు.)

**బర్హిష్మతి** —విశ్వకర్మకుమార్తె. ప్రియవ్రతునిభార్య. ఈమెసవతి కర్దమప్రజాపతికుమార్తెయగు సుకన్య. ఈమెయందు కుమార్తెలిరువురు, కుమాళ్ళు పదిమంది కల్గిరి. (సప్తద్వీపములు చూడుఁడు.)

**బలంధనుఁడు లేక హలంధనుఁడు** నాభాగుని కుమారుఁడు. వత్సప్రీతితండ్రి.

**బలధృతిగోత్రము**- గవిష్ఠిరగణముచూ.

**బలపపురాయి** — దీని నాంగ్లమున 'Slate stone' అనియెదరు. ఇందు తెలుపు నలుపు జాతులు కలవు. పలుచనిరేకులుగ చీల్పఁబడఁ దగినరాయి. తొలుత నిది బంకమట్టిపొరలుగ నేర్పడి, metamorphosed rocks సంబంధమున అడఁచఁబడి, వేఁడికి గట్టిపడి, శిలా

త్వము వహించియు పొరలుపొరలుగా వచ్చుచుండురాయి. ఇందు తెల్లజాతిరాయి శ్రేష్ఠమందురు. చెక్కనిపని నిచ్చును. నల్లజాతి చాల గట్టిపడి పలుచనిపొరలు సైతము గట్టిగనుండెడిని.

బలపపురాతి రేకులు ఇండ్లపైకప్పులుగ వైచిన ఎండవేడిమి తెలియకుండ చలంద నము గల్గించును గాని శీతకాలమున నాయింటియందు చలి మిక్కుటమై యుండును. కొందఱు తెల్లని బలపపురాతి దళసరిపలకలు నేలపైబఱచి యమర్చుదురు. నల్లబలపపురాతి పలుచనిరేకులను కఱ్ఱచట్రములలో బిగించి, బడిపిల్లలకు వ్రైన్రా కొననిత్తురు. ఈపలకలపై వ్రాయు స్లేట్ పుల్లలు ఎక్కుడమెత్తగ నరగు నాజాతిరాయికడ్డీలై యుండును. మంచిబలపపురాతి గట్టిపలకలు వాతావరణ భేదములకు శీతోష్ణపరిస్థితులకు చెడవు. చులకనై సులభముగ రేకులుగవిప్ప నగును. బలపపురాతిపొడుము లోనికిచ్చిన పైత్యశాంతిగల్గించి దోషజ్వరములు శూలలు ఆమము నివారించునని చెప్పుదురు.

## బలభీపురముంగూర్చిన శాసనము

క్రీ. శ. ౧౮౨౨ జనవరిలో పట్టన్ సోమనాథమునందు సౌరాష్ట్ర ద్వీపకల్పపు సముద్రతీరమున బయల్పడిన దేవనాగరిలిపిఅక్షరముల శాసనమునుండి వల్లభీపురము, అన్హిల్లాపురము అచట పాలించిన రాజవంశములంగూర్చి కొన్ని సంగతులు తెలియుచున్నవి. వీరు నెహర్వాలా బల్హారభూపతులని చెప్పఁబడినవారు. ఈశాసనపు ఆంగ్లానువాద మిటుల వివరింపఁబడినది.

"Adoration to the lord of all—to the light of the universe. (1) Adoration to the form indescribable—him at whose feet all kneel.

In the year of Mahamad 662 Vikrama saka 1320, Srimad Balabhi saka 945, Sivasinga Samvat 151, Sunday the 13th Badi of the month of Asar.

The chiefs of Anhillapur Patan obeyed by numerous princes (ఇటుల గొన్ని బిరుదావళులు వివరింపఁబడినవి). Bhataric Srimad Arjunadeva. (3) Of Chalukya vamsa. His minister Sri Matadeva—with all the officers of the Govt. of Ameer Rooknoodin and of Khwaja Ibrahim of Hormuz, son of the admiral Nakhoda Nooroo-Din Feeroz together with the Chaura chieftains Palookdeva-Ranik Sri Someswaradeva, Ramdeva, Bheemsing and all the Chauras and other tribes of rank being assembled.

Nausi Rajah of the Choura race inhabiting Deo Pattan (5) assembling all the merchants established ordinances for the repairs and the support of the temples in order that flowers 'oil' and water should be regularly supplied to Ratneswara (6) Chouliswara, (7) Pulinda devi and the rest and for the purpose of erecting a wall-round Somnath Temple with gate way to north.

Kuludev son of Modula and Loonsi son of John both of the Chaura race together with the two merchants Balji and Kurna bestowed the weekly profits of the market for this purpose, while sun and moon endure, let it not be resumed.

Feeroz is commanded to see this order obeyed and that the customary offerings on festivals are

continued, and that all surplus offerings and gifts be placed in the treasury for the aforesaid purposes.

The Choura chiefs present and Admiral Nooroodin are commanded to see these orders executed on all classes. Heaven will be the lot of the obedient, Hell to the breaker of this ordinance".

ఇందువలన బాల్కావంశ మనియెడి నరపతులు వల్లభీపురము పాలించిరనియు, వీరు సూర్యవంశపుక్షత్రియు లనియు, వీరె బల్హార రాజవంశస్థులనియు, వీరు నెహర్వాలా పురాధినాథులుగ నుండిరనియు James Todd Lef. Col. పరిశీలకుఁ డభిప్రాయ పడుచున్నాడు.

ఇంకను "Renaudot's Arabian Travellers" అను గ్రంథమున బలికారావంశీకులే బల్హారవంశస్థులుగ వివరింపఁబడినటుల నాగ్రంథకర్తయె వివరించెను.

**బలమగు నెదురుగాలియందు పొగయోడలు నడుచుట**— ఎల్లరు బలమగు నెదురుగాలియం దోడలునడుచుట దుస్సరమని యెఱుంగుదురు. సర్వసాధారణపుటోడల కట్టిగాలి వెనుకకు నెట్టఁజాలును. కాని పొగయోడలకీకష్టముండదఁట. గాలియందు సుడిలేక బలముగ నుండుతఱి, పరిస్థితుల నొక అట్లాంటిక్కు లైనర్ పొగయోడ కప్తాను (The Captain of an Atlantic liner steam ship) సముద్రపుగాలులందలి తనయనుభవముల వివరించుచు నిటుల వ్రాసియున్నాఁడు. "సుడిలేని బలమగు నెదురుగాలి పొగయోడయందలి Stoke hole లోనికి, గ్రింది కధికవాయువుం జొరఁజేయుచుండునుగాన, నచటి ఎంజనునందలి యగ్ని కెక్కువగా ఆక్సిజెను ఆయధికమైన వాయువునుండి లభింప, నాయగ్ని యెక్కువగా మండుచు, వేడి నెక్కువగల్గించి, నీటియావిరి నధికముగఁ బుట్టించుచు, యంత్రబలమునం దతిశయించి, ఓడను త్వరితగతిని ముందునకుఁ జనఁజేయుచుండును. ఇట్లనుట నాయెదురుగాలి యెంతబలముగ నోడ నెదుర్కొనుచు పురోగమనము తగ్గింపఁగల్గునో అంతకన్న నధికబలమే పైపరిస్థితులనుండి కలుగుచుండ, ఓడపురోగమన మధికమగుననియే చెప్పవలయును.

ఇంకను స్టోకుహోలులకడ పనిజేయువారి కధికవాయువు నట లభించుచుండుకతన, నలసటఁ జెందుటకు మాఱుగ బలవంతులై ఎక్కువపనిని జేయఁగల్గియుందురు. దీనినుండి ఇది బలమగు నెదురుగాలిపరిస్థితియెగాని, సుడిగాలి వీచుతఱి సంగతులు వేఱుగ నుండునని తేలుచున్నది.

**బలరాముఁడు(సంకర్షణుఁడు సీరి)**- బలరాముఁడు యదుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి శూరుఁడు. తల్లి రోహిణీదేవి. భార్య రేవతీదేవి. సోదరులు శ్రీకృష్ణాదులు. బలరాముఁడు దేవకీదేవిగర్భమునం దుండిన వాఁడు. అ యోగమాయాశ సంకర్షించి రోహిణీగర్భమున చేర్చెనుగాన నీతనికి సంకర్షణుఁడని నాడుకగల్గెను. 'ప' బలాఢ్యుఁడు. హలము (నాఁగలి) ఆయుధముగఁగలవాఁడు. కుమార్తె శశిలేఖ. అభిమన్యునిభార్య. ఈతఁడాదిశేషుని యవతారమనఁ బఱగినవాఁడు. ఉత్తరహిందూస్థానమున బలదేవుఁడనిన ఆదిశేషున కర్థమగుచుండును.

**బలవంతాన మాఘస్నానములు చేయించడమా?**—మాఘమాసమున చలిలోచన్నీటిస్నానము బాధాకరముగనుండ బలాత్కరించుట యనిభావము. (ఆంధ్రలోకోక్తి).

**బలవ దపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః ఇతిన్యాయము**-ఎంతవిద్యా

ధికుల మనస్సైనను తన్ను తాను నమ్మదని భావము.

**బలశిష్టకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.) బలశిష్ట (బలశ్రేష్ఠ బలిశిష్ట) గోత్రము. ఏకార్షేయ. (౧౮) గోత్రము. సంస్కృతగోత్రము, భరద్వాజస, భరద్వాజగణము, ఆపస్తంబయజుశ్శాఖ, ప్రమాణగ్రంథము, ఆశ్వలాయనసూత్రము, ధర్మసింధు, నిర్ణయసింధు, భార్గవేశుఁడు దేవత, భార్య బాలాంబ, పంపాతీరము తపస్థానము, బాలసాగరము తటాకము, జపము లక్ష, దీపములు 30, క్షేత్రసంఖ్య ౪౦, శాటీ దానము, బలుసుకూర వర్జనీయము.

**బలాకాస్యుఁడు** — అత్రిసంతతి. చంద్రవంశ క్షత్రియుఁడు. అజకునికుమారుఁడు. కుమారునిపేరు కుశికుఁడు.

**బలాకి గోత్రము**-(గర్గఉపగణము చూ.)

**బలాకుఁడు**— ఈపేరుగలవా రిర్వురు గానఁబడుచున్నారు. సుశర్మభార్య నెత్తుకొనిపోయిన రాక్షసునిపేరు బలాకుఁడు. మఱియు జాతకర్ణిశిష్యుఁడగు బలాకుఁడని ఋషియొకఁడు కలఁడు.

**బలాక్ష క్షత్రియులు** — (చౌహానులు చూడుఁడు.)

**బలాత్కారపుపని**-(కార్వీ చూడుఁడు).

**బలాభిదేశము** — ఈపేరుగల రాజ్యమొకప్పు డుండినదని తెలియుటకన్న దీనింగూర్చి యేమియుఁ దెలియరాకున్నది.

**బలాశ్వుఁడు లేక కరంధముఁడు**-(కరంధముఁడు చూడుఁడు).

**బలి**— అత్రి సంతతి. చంద్రవంశము. తండ్రి తితిక్షువు. భార్యపేరు సుదేష్ణాదేవి. ఉతథ్యుని కుమారుఁడగు దీర్ఘతముఁడను ఋషియొక్క తపోమహిమవలన అంగుఁడు,వంగుఁడు, కళింగుఁడు, పుండ్రుఁడు, సుహ్నుఁడు నను నైదుగురు పుత్రులుఁ గల్గి, వేర్వేఱు దేశముల కధిపతులై వారివారివంశములకుమూలపురుషులైరి.

ఇంకను ప్రహ్లాదునిపుత్రుఁ డగు విరోచనుని సుతునకు బలిచక్రవర్తి యనిపేరు. భార్య వింధ్యావళి. ఈతఁడు విష్ణుభక్తుఁడు. వామనుని (ఉపేంద్రుని) చే రాజ్యభ్రష్టుఁ డైనవాఁడు. కొందఱు పరిశోధకులు పొరపడి అంగ, వంగ, కళింగ, పుండ్ర, సుహ్నులను ఈబలిచక్రవర్తి సుతులుగ తలంచిరి గాని యది సరిగాదని తేలుచున్నది. (బలిచక్రవర్తి పాలించిన సామ్రాజ్యము చూడుఁడు.)

**బలిచక్రవర్తి పరిపాలించిన సామ్రాజ్యదేశములు**— తొలుత సంయుక్తరాష్ట్రములోని బలిపురము,లేక బలినగరము రాజధానిగఁగల దేశమని పరిశీలకులు తలంచుచున్నారు. ఇది యిప్పుడు బలియా, లేక బాలియా యనం బరఁగుపురముగనున్నది. మఱికొందఱు అయోధ్యారాష్ట్రమునందలి హార్దోయిపురముకడ నున్న బావన్ తొల్లింటి బలిపురమని తలంచుచున్నారు. గాని పెక్కండ్రయభిమతము బాలియా యనియె యైయున్నది.

మహాదాతయు, విష్ణుభక్తుండు నగు నీచక్రవర్తి, వామనావతారమున విష్ణుదేవునిచే పదభ్రష్టుండై, భరుకచ్ఛపురమున (ఇప్పటిబ్రోచి) వేఱొకయాగ మొనర్చి ప్రసన్నతగల్గించుకొని పాతాళమునకు (బాహ్లికదేశమునకు) ప్రభువై యేలెననియు, బాఖ్లు అనుపేరుగల పురముకడ ఆయనఆనవాళ్ళు కలవనియు తెలిసెడిని. పిదపనో లేక ముందుగనో ఎట్లో యెక్కాలముననో దక్షిణసముద్రములందలి కొన్ని ద్వీపములను పాలించె నఁట. ఇప్పుడు జావాకడ నున్న

బోర్నియో, సెలిబీస్ అనంబడుచున్న ద్వీపములలో నొకద్వీపము బలిద్వీపమనంబడునది కలదు. (Bali Island) అందాచక్రవర్తి వసించువాఁడఁట. ఇది చక్కఁగఁ బరిశీలింపఁ దగియున్న సంగతి. నిదర్శనములను వెతకి చక్కఁగఁ బరిశీలింప వలయును.

బాలియా పురముకడ నొకభృగ్వాశ్రమ ముండెడిదఁట. ఇప్పుడట భృగ్వాలయము (దేవస్థానము) కలదు. అది యాత్రాస్థలమై యున్నది. అట భృగుమహర్షి యాగమొనర్చె నందురు. భరుకచ్ఛదేశము రాజధానికడ నుండిన భృగ్వాశ్రమమును గూడ నీసందర్భమున నుడివెదరు. (బలిద్వీపములు, బలి చూ.)

**బలిజలు** —(తెలగాలు చూడుఁడు.).

**బలిద్వీపము** — ఇది హిందూమహాసముద్రమునందున్న సుమత్రా, జావా (యవ) బోర్నియో, సెలిబిస్ ద్వీపములకడనున్న యొక ద్వీపము. బలిచక్రవర్తిపాలనము నుండి పేరందినదనియొకవాడుకనుకొందఱుసాఁగించిరి కాని సరియగు నిదర్శనములు లేవు. ద్వీపమునం దెల్లెడలను వరిపొలములు మాత్రము గానవచ్చుచుండును. డచ్చివారి పరిపాలనమునందున్నది. డెన్పాసారు పురము, బులేలంగు పురము మొదలగు పట్టణములు చాల కొలఁదిగను, పల్లెగ్రామములు విస్తారముగను గలవు. ఇవియె సరియగు జననివాసములనియు, పట్టణములు వర్తకస్థలములే యనియుఁ జెప్పఁబడుచున్నవి. తాటి, కొబ్బరి, రొట్టెపండుచెట్ల తోఁటలు మామిడితోఁటలు, అనఁటితోటలు, బప్పాసపతోఁటలు వీట్లనడుమనీగ్రామములున్నవనితోఁచును. ద్వీపమంతటను ప్రభుత్వమువారు వేయించిన బాటలు ఉత్తరదక్షిణములకును, తూర్పుపడమరలకునుగలవు. ఇంచుమించు గ్రామములన్నియు నాల్గురోడ్డులు కలసిన సంధిని జుట్టి కట్టఁబడియె యున్నవని చెప్పఁదగును. సంధించు తావులంజుట్టిగ్రామమునకుమధ్యగా నాగ్రామాధికారి నివసించు భవనమును, సభలుజరుపు చావడియు, అంగడులుండు తావు, సంతలుగూడు ప్రదేశము మొదలగునవి యుండెడిని. ఈద్వీపమునందైదువందలమైళ్లుపొడవున బాటలు కలవఁట. ఇవి వరిపొలములగుండానడిచెడిని. బాటల కిరుప్రక్కలను నీడనిచ్చు పెద్ద వృక్షములను నాటియున్నారు. గ్రామములయందు సంబంధ బాంధవ్యములుఁ గల్గినవారు ఒకే దేవస్థానమున పూజించుచు, నొకేవంటయిందు భుజించుచు, నొకేయావరణమున కలసిమెలసి వసించుచుంటఁ గానవచ్చెడిని.

గ్రామమధ్యమునందు నాల్గుబాటలుకలియు చౌకపుమైదానమునకు దేశభాషయందు బట్జింగా యనిపేరు. ఇచట గ్రామరక్షక దేవస్థానముండెడిని. దానికి పురదేశమని దేశభాషానామము. ఇందలి పెద్దచావడియె గ్రామస్థులసభాస్థానము. ఈచావడిని బేలగంగ అనెదరు. దీనికి వాదోపవాదములని యర్థము. కోడిపందెములు జరుపుటకిట వేఱుగ నొకతావుండును. బలిద్వీపమున ప్రతిమూఁడవదినమునను సంత గూడుచుండును. కొన్ని పెద్దగ్రామములం దనుదినము కొన్ని యంగడు లుండును. పట్టణములం దంగడులు (Markets) కట్టఁబడినవి.

గ్రామరక్షక దేవస్థానమున పొడుగైనగోపురస్తంభమును, దానితలయందొకగంటయు నుండును. దీనినివాయించుచు సభలకు నెల్లరం బిలుచుటగాని, ఏవేనియాపదలం దెలుపుటగాని చేయుట నీద్వీపమంతట నాచారమై యున్నది. కొన్ని గ్రామములం దూరిబయట గొప్పమఱ్ఱిచెట్ల నీడను సంత గూడుటయుఁ గలదు గాని, సర్వసాధారణముగ బట్జింగా చౌకులోని మఱ్ఱిచెట్టు నీడనే కూడుట గల్గుచుండును.

ఈ ద్వీపమున పట్టణములందు కొందఱు అరబ్బులు, చీనాదేశస్థులు, వర్తకులుగ నంగడు లుంచుదురు గాని ద్వీప మంతటను స్త్రీలే వర్తకము సాగించుచుందురు. ధనము వారిస్వాధీన మందే యుండును. ఇచటి స్త్రీలు గణితవిద్యావిశారద లని తోఁచకపోదు. ఇచట చీనాదేశపు నాణెములుగూడ వాడుకయం దున్నవి. వాటి నడుమ రంధ్రముండి వాటి నొకదారమునకుం గ్రుచ్చియుంచుదురు. సంతలు, బజారులు మొదలగున వన్నియు పగలు పన్రెండుగంటలవేళనే జరగెడిని.

ఒకే ఆవరణయందు కలిసి వసించుకుటుంబములస్థలమునకు కురెన్ అని పేరు. ఈ ఆవరణ ద్వారముకడనే ఇందలికుటుంబముల సాముదాయికదేవస్థాన ముండును. కురెన్ ప్రహరీగోడలు వెల్ల (సున్నము) వేయఁబడి మదురువల్ల రక్షింపఁబడియుండును. దీనిద్వారములు (ధనవంతులకు) చక్కని పనితనముగల్గి యుండును. లోనివారు బయటికి కనపడకుండునటుల లోన నొక యడ్డుగోడ యుండెడిది. పిశాచములు లోనికిరాకుండ నిది రక్షణమందురు. కురెనునందు అంతఃపురగృహ మొకటి దంపతులు పరుండ నుండెడిని. దీనికి "మెటెన్" అని పేరు.

బలిద్వీపవాసు లందఱు ప్రాతస్స్నాతలు. వీరినివాసగ్రామములకు 'శావాస' మనియెదరు. వంటయింటికి 'పావో' యని పేరు. వంటయింటి యందు బ్రహ్మవిగ్రహ ముండును. దీని నగ్ని దేవుఁ డనియెదరు. వంటకము దీనికి నైవేద్య మర్పింతురు. ఈ దేశస్థులు అనఁటియాకులందు భుజింతురు. అనఁటితోఁట లిందు మెండు. నీరు త్రాగునప్పుడు పై కెత్తి త్రాగుదురు గాని కఱచిపట్టి త్రాగరు. పాత్రను నోటికిఁ దగుల నీయరు. స్త్రీపురుషులు తలలందు, చెవులపైని, సంపంగిపూవులు ధరింతురు. వాటికి 'జెంపక' అని పేరు. కల్లుదుకాణములకు "బేల్బంజ్డాన్" అనియెదరు. కల్లునిచ్చు జీలుగుచెట్లకు టుఆకు లందురు.

ఈ దేశమున నున్నపోతులు రెండుజాతులు. బూడిదగలసిన నల్లరంగుజాతి యొకటియు, స్వచ్ఛతఁగల్గిన ఊదాలో గాఢమగునట్లుండు రంగుజాతి యొకటియునై యున్నవి. ఆవులు, ఎద్దులు మంచిజాతివి కలవు. వీటికాళ్ళు సన్నముగ నుండును. పందులు పెద్దవి. కడుపులు నేల కీడ్చుకొనుచు నడిచెడిని. ముఖ్యముగ బాతులు చాల పెద్దజాతివి; ఇంచుకహంసలంబోలియుండు ననిపించెడిని. ఎత్తుగలవిగా నుండును.

భూగోళశాస్త్రవేత్తలు బలిద్వీపము లైదనియు, మలేశియా ద్వీపసమూహము (సుండా ద్వీపసమూహము)నకుఁ జెందిన వనియు, అవి ౧ బలిద్వీపము, ౨ శుంభవద్వీపము, 3 చందన ద్వీపము, ౪ ఫ్లోరీసు ద్వీపము, ౫ తిమోరు ద్వీపము ననియు నందురు.

శుంభవద్వీపమున టాంబోరో యనుపేరు గల యగ్నిపర్వతము సుప్రసిద్ధము. క్రీ. వె. ౧౮౧౧ లోని దీనియుద్రేకము వేయిమైళ్ల దూరమునకుఁగూడ కన్పించిన దఁట. చందన ద్వీపమున మంచిగంధపుకఱ్ఱ అడవు లుంట Sandalwood island అనంబడినది. తిమోరు ద్వీపమున సగముభాగము పోర్చుగీసువారిది.

**బలిపురము** — బాణాసురుని రాజధాని యగుశోణిత(శోణ)పురమే బలిచక్రవర్తికిని రాజధానియై యుండి, ఆకాలమున నీపేరంబరఁగుచుండెడి నని తెలియుచున్నది. (ఉమావనము. బాణపురము చూడుఁడు.)

**బలిపూజనప్రతిపత్తు**— ఆశ్వయుజశుద్ధ పాడ్యమి. దీనియందుబలిచక్రవర్తిని బూజింతురు. దేవీనవరాత్రములు లేక శరన్నవరాత్రములకు

ప్రారంభదినము. అనఁగా నాడు మొదలు ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, మహాష్టమి, మహానవమి దినములు నవరాత్రము లనంబడును. (పండుగలు, పర్వతిలు, ఘ వ్రత దినములు చూడుఁడు).

**బలురక్కసిచెట్టు లేక బ్రహ్మదండి చెట్టు**-లా. Argemone Mexicana ఆంగ్ల. Mexican-poppy అనియు Yellow-thistle అనియు Prickly-poppy అనియుం బేర్లు. సం. బ్రహ్మి, బ్రహ్మదండీ. కొందరు సృగాల కంటకః యనిగూడ వాడియున్నారు.

ఇది బలారికాశి (ఏనుఁగుచెవిచేమ) కానేరదు. ఆకులకొనల ముండ్లు, పసుపుపచ్చరంగు పూవులు పూచు పాలుగల కాడచెట్టు. ఇది ఏఁటేట లేచునది. దీనిపాలు పచ్చగ నుండును. ఆపాలు కండ్ల కిడిన కండ్లకలక మొదలగు నేత్రరోగముల శమింపఁజేయును. పైన పూసిన వ్రణములు, పుండ్లు, నవాయిపొక్కులు, గాయములు, కొట్టుకుపోయినటువంటియు చీరుకుపోయినటువంటియు ఎట్టిపుండ్లు మానునందురు. దీనిసమూలరసకషాయములుమూర్ఛరోగమును నిర్మూలించి, శూలల నాఁపి, విరేచనము గావించి, నిద్రపట్టించునని చెప్పఁబడినది మఱియు మొండిజాతికుఱుపులను మాన్పునదను. పచ్చివేరు తేలువిషమును హరించుననియు, విత్తులచమురు కుష్ఠవ్యాధిని పుర్రెమాద మొదలగు శిరోరోగములను, ఎండవలన గల్గిన తలనొప్పిని, తామర, తీట, గజ్జి మొదలగు చర్మరోగములను, కడుపులోని శూలలను నివారించుననియు చెప్పుదురు. విరేచనమును మూత్రమును చక్కఁగ వెడలించును. మంచినిద్రగలించును. దీనిగింజలలో నొకజాతివిషము కలదు. అది వాంతి గల్గించును. పాలు ఎండించి నచూర్ణము ఉబ్బుజాడ్యము, ఉదరరోగములు, చర్మరోగములు నివారించునందురు.

దీనినే ఏనుఁగుచెవిచెట్టు అనియు నందురు.

**బలుసుచెట్టు**-లా. Webera Tetrandra. Canthium Pasaiflorum, బలుసు పెద్దబలుసనియు చిఱుబలుసు లేక చిన్నబలుసనియు ద్వివిధము. బలుసుకూర పిత్తప్రీతి యని హిందూగృహంబుల గిర్చనలందు వండుదురు. కూర, పచ్చడి మొదలగువాట్లకు భోజనపదార్థముగ వాడుదురు.

దీనివేరు, మ్రానుచెక్క, లేక ఆకుల రస కషాయచూర్ణములందు అతిసారవిరేచనములు, నీళ్ళవిరేచనములు, రక్తగ్రహణులంగట్టి క్రిములం జంపి వాటిని వెడలించుశక్తి గలదని చెప్పఁబడినది. బలుసాకు చలవజేసి సమస్తగ్రహణులు, వింశతిమేహములు, అన్నిపైత్యములు నివారించి జ్వరము రాకుండ నాపునని చెప్పఁబడినది. బలుసుకాయ పండయును ఈ గుణములే కలవందురు.

**బల్గేరియాదేశప్రభుత్వము**- ఐరోపా ఖండమునందలి బాల్కను సంస్థానములలో నొకటి. ముప్పదితొమ్మిదివేల యెన్మిదివందల యెనుబది చతురపుమైళ్ళ వైశాల్యమనియు, ఏబదియైయెంబడుల జనసంఖ్యయనియుఁ జెప్పఁబడినది.

**బల్గేరియాస్టేటు**— ఇది టర్కీ ఇన్ యూరపులోనిది. తూర్పురూమెలియాతో కలుపఁబడినది. (తూర్పురుమేలియాస్టేటు చూడుఁడు)

**బల్లక్కసిచెట్టు**-(ఏనుఁగుచెవి చేమచెట్టు చూడుఁడు.)

**బల్లారికాశిచెట్టు**— (ఏనుఁగుచెవి చేమచెట్టు చూడుఁడు.)

**బల్లాలశాఖ క్షత్రియులు**-(క్షత్రియకులము చూడుఁడు. హొయిసల బల్లాల క్షత్రియులు చూడుఁడు.)

**బల్లి పాటు** — బల్లిపాటునకుఫలములు. శిరస్సు కలహము, ముఖము బంధుదర్శనము, కనుబొమలనడుమ రాజానుగ్రహము, పై పెదవి ధనవ్యయము, క్రిందిపెదవి ధనలాభము, ముక్కుచివర రోగము, కుడిచెవి దీర్ఘాయువు, ఎడమచెవి వర్తకలాభము, నేత్రము ఖైదు, గడ్డము రాజ దండనము, నోరు భయము, కంఠము శత్రుహాని, కుడిభుజము ఆరోగ్యము, ఎడమ భుజము స్త్రీసంగమము, కుడిముంజేయి కీర్తి, ఎడమముంజేయి రోగము, స్తనయుగ్మము దోషము, ఉదరము ధాన్యలాభము, రొమ్ము, నాభి ధనలాభము, ప్రక్కలు సుఖము, పాదము ప్రయాణము, వీపు శుభము, గోళ్ళు ధన వ్యయము, లింగము దారిద్ర్యము, జుట్టుకొన మృత్యువు. ఈ ప్రదేశములయందు తొండ ప్రాకినను ఫల మిట్లేయని తెలియునది.

**బల్లెనీద్వీపములు**- అంటార్కిటికాయందలి ఐదుద్వీపములు. రాతిగుట్టలమయముగనుండును. జాన్‌బల్లెనీ అనువారిపేరునఁ బరఁగుచున్నవి. ఆయన వీటిని తిమింగిలములవేటకై చని కనుఁగొనె నఁట. అది క్రీ. శ. ౧౮౩౯ అని చెప్పఁబడినది.

ఉత్తరాగ్రము (North cape) నుండి ఉత్తరముగా రెండువందల ఇరువదిమైళ్ళదూరమని చెప్పఁబడినది.

**బల్లెములు**— తొల్లింటికాలమున కలహములందు వేఁటలయందు ఈటెలు బల్లెములు వాడఁబడు యుద్ధపరికరములగునాయుధములుగ నుండెను. ఇవి యనేకభేదములగు నాకారములతోఁ జేయఁబడుచుండినవి. భరతదేశమునం దే గాక స్కాట్లాండు, స్విజర్లాండు, ఆస్ట్రియా మొదలగుదేశములందుఁ గూడ వాడుకయందుండినవి.

అందు ఈటెలు పొడుగుపాటి కఱ్ఱలకడ నమర్పఁబడియుండును. బల్లెము లట్లుగాక పిడినే చేతఁబట్టనైయుండునవి.

**బవేరియారాష్ట్రము**-ఐరోపాఖండము నందలి జర్మనుదేశములోని యొకదేశము. ఇందు తొల్లింటి రెండుటెరిటరీలు కలవు. ఒకటి ఆస్ట్రియా దేశవు పశ్చిమభాగమున నున్నది; రెండవది రైనునదికి పశ్చిమమున నున్నది. ఇది చిన్న టెరిటరీ. దీనిపేరు రెయినిష్పవేరియా యనియు, పెలాటినాటి యనియు నందురు. వైశాల్యము 30000 చతురపుమైళ్లు. జర్మనీప్రజా ప్రభుత్వమున చేరియున్నది. (జర్మనుదేశము, ఐరోపాఖండము చూడుఁడు). ప్రజలు రోమ న్కాతలిక్కు క్రైస్తవులు. దేశము పీఠభూమి. అచ్చటచ్చట కొండలు కలవు.

మ్యూనిచ్ పట్టణము- ప్రధానస్థానము. ఇసారునదీతీరము. ఇది వ్రాతచిత్రములు, చేతచిత్రములు, విస్తారము చేర్చి నిల్వయుంచిన సంస్థ గల్గియుండుటచే పేరందిన పట్టణము.

ఔగ్సుబర్గు(Augs' burg)-రెక్నదీతీరము. వర్తకస్థలము. రోమనులనాటి నిర్మాణము.

రేటిస్బాన్ పురము- డేన్యూబునదీతీరము. బలవత్తరదుర్గముగల పురము.

నూరెన్బర్గు పురము- ఇందు జేబుగడియారములు తొలుత కనిపెట్టఁబడెనఁట. చిన్నపిల్లలు ఆటవస్తువుల నతిసులభముగ నీపురియందు చేయుచుందురు. పసిబాలు రిట్టి ఆటవస్తువులు (Toys) చేయుచుంట నచ్చెరువు గొలిపెడిని.

స్పైరీస్ పట్టణము- రైనునదీతీరము. రేవు. ఇట క్రీ. శ. ౧౫౨౯ లో రిఫార్మరు లనంబడు మతసంస్కర్తలు ప్రొటెస్టాంట్సు అను పేరు వడసిరి. తర్వాత సర్వత్ర వ్యాపించెనఁట.

**బసవరాజు నాగేంద్రకవి** — ఆంధ్రకవులలో నాథునికులందు పరిగణింపఁబడినవాఁడు.

ఆఱువేలనియోగి. తండ్రిపేరు పాపరాజు. రచించినది ఆనందసుందరీచాతుర్యవిలాస మను ప్రబంధము.

**బసవాచార పండితాచారములు**— బసవేశ్వరునివలన ఆచరింపఁబడి ఏర్పఱుపఁబడిన వీరశైవ లింగాయతమతవిధాన శివభక్తికి బసవాచారమనియు, మల్లికార్జున పండితునివలన ఆచరింపఁబడి అదివఱకే ఆచరణయందున్న వేదోక్తమగు ఆగమవిధాన శివభ (ఇపుడు ఆరాధ్యబ్రాహ్మణు లాచరించుచున్న) పండితాచారమనియు వారినుండియె పేరు లందినవి. (బసవేశ్వరుఁడు చూడుఁడు. మల్లికార్జునపండితులు చూడుఁడు. చిన్మయదీక్ష చూడుఁడు. వీరశైవులు చూడుఁడు. వీరశైవలింగాయతమతము చూడుఁడు. పాలకురికి సోమనాథుఁడు చూ.)

**బసవేశ్వరుఁడు (మండ్రంగి బసవరాజు)**— ఈమహాత్ముఁడు కన్నడబ్రాహ్మణుఁడుగ జన్మించి, ఉపనయనమును నిరాకరించి, గాయత్రీదీక్ష నందక, వీరశైవ పంచాచార్యసిద్ధాంతమతావలంబకుఁడై, ఆ మతప్రచారమొనర్చుచు, బిజ్జలభూపతి రాజ్యమునకుఁ బ్రధానమంత్రిగ కొంతకాలము పనిచేసి, ఆ మతము నుద్ధరించుచు, శివభక్తిని తనప్రవర్తనముచే బోధించుచు, పెక్కండ్రను లింగాయతమతసంఘమునకు జేర్చినవాఁడు. (వీరశైవలింగాయతమతము చూడుఁడు). ఆ బిజ్జలభూపతిరాజధాని కల్యాణపుర మిప్పటి షోలాపురమున కిరువదిమైళ్ళదూరమునం దున్నది.

లింగాయతు లీమహాత్ముని జగద్దేశికుఁడని భక్తి సల్పుచున్నారు. జంగమదేవరకులజులు, లింగబలిజశివయోగకులజులు, దేవాంగ(ఇప్పటి దేవబ్రాహ్మణ) కులజులు, వీరిని మహాభక్తుఁడగు మతోద్ధారకునిగ భక్తిసల్పుచు నందికేశునియపరావతారముగ నెన్నుచున్నారు. ఇంక నారాధ్యబ్రాహ్మణులగు శైవులు "శ్లో. మునియాచనయా శివాజ్ఞయా భువి భక్త్యుద్ధరణార్థ మాగతమ్ వృషరాడపరావతారతామహితం శ్రీబసవేశ్వరం భజే" యని శివపూజకుముం దొనర్చుగణస్తవమునందు భజించెదరు.

వీరిది కన్నడదేశోత్తరభాగమున హింగుళేశ్వర (నావాంగుళేశ్వర) పురసీమయందు భాగవాటి యనుగ్రామము. అదియె జన్మస్థలము. తండ్రిపేరు మండ్రంగి మాదిరాజు. తల్లి మాదాంబ. జ్యేష్ఠసోదరి నాగాంబ. భార్యపేరు గంగమాంబ. మేనమామ (మాదాంబసోదరుఁడు) బాలదేవుఁడు. ఈ ప్రముఖుఁడు దేశప్రభుండగు జిజ్జల భూపతికడ ప్రధానోద్యోగిగ నుండినవాఁ డనియు, ఆయనయనంతరమే బసవరాజుగారు బిజ్జల భూపతికడ ప్రధానమంత్రియై కొంతకాలము పనిచేసి, మతద్వేషము కలతలుగలుగ ప్రాణములు దక్కించుకొని, పదవిని వదలి స్వస్థానమునకుఁ జేరి మతప్రచారమున కాలముఁ బుచ్చుచుండిరని చెప్పఁబడినది. ఈ మహాత్ముఁడు శివభక్తి నుద్ధరింపఁ జన్మించిన కారణజన్ముఁ డని చెప్పఁబడినది. భాగవాటికి పదిమైళ్ళదూరమునఁ గల కప్పడి సంగమేశ్వరశివక్షేత్రమునతలిదండ్రులాచరించిన నందికేశ్వరవ్రతఫలితముగ బసవేశ్వరులు వారికి గల్గెననియు, శైవదీక్షాపరుండును, విద్యలు గఱపినదేశికుండును, జంగమమాహేశ్వరరూపధారియునగు సంగమేశ్వరుఁడే యనియుఁ జెప్పఁబడినది. వీరి సహధర్మచారిణి గంగమాంబగారు వీరిమేనమామయగు బాలదేవ పుత్రికయే. వీరి తలిదండ్రులు కన్నడ ఆరాధ్య బ్రాహ్మణులని కొందఱు పరిశీలకు లనిరి. వీరిజన్మకాలము తెలియరాదు. మృతి క్రీ. వె. ౧౦౬౮ లేక ౭౦ ప్రాంతమని సుప్రసిద్ధపరిశీలకు లగు బండారు

తమ్మయ్య దేవరగారు సిద్ధాంతీకరించిరి. జైనుఁడగు బిజ్జల భూపతి వీరశైవులకుఁగల్గించునో కోర్వఁజాలక జగద్దేవుండను లింగాయతవీరుఁడు బిజ్జలభూపతిని పరిమార్చెనఁట.

బసవేశ్వరుని మేనల్లుఁడు (నాగమాంబ సుతుఁడు) చెన్నబసవేశ్వరుఁడు బసవేశ్వరుల .ర్యండై, వారికిం బిదప మతవ్యాపకములకు గడంగి, లింగాయతులు మొదలగు శైవుల నడిపెను. బసవేశ్వరులు సంగమేశ్వరశివలింగమునం దైక్యమై రని యందురు. (బసవాచారపండితాచారములు, వీరశైవలింగాయతమతము చూ.)

**బసుటోలాండు** — దక్షిణాఫ్రికాయందిది చిన్న టెరిటరీ. బ్రిటీషుప్రభుత్వమువారిది. ౧౦౦౦౦ చతురపుమైళ్ళ వైశాల్యము. ఒక రెసిడెంటుకమీషనరు అధికారముక్రింద పరిపాలింపఁబడుచున్నది. (దక్షిణాఫ్రికా చూడుఁడు).

**బస్తరుసంస్థానము** — (చక్రకోట్యమండలరాజ్యము చూడుఁడు.)

**బస్తి (క్రియ)** — యోగాభ్యాసమునకు వాతపైత్యశ్లేష్మదోషసంజనితరోగముల నిరోధములు గలుగకుండ నిర్బాధకముగ ప్రాణాయామాభ్యాసము నడుచుచుండుటకు షట్క్రియలు చెప్పఁబడినవి. (యోగాభ్యాసక్రియాషట్కము చూడుఁడు.) అందు బస్తిక్రియ యొకటి. ఇది జలబస్తి యనియు స్థలబస్తి యనియు నిరుతెఱఁగులు. ఇవి చాల నేర్పుగా నడుపవలసినక్రియలు.

౧ జలబస్తి- మొలబంటినీట ఉత్కటాసనముననుండి జలమును గుదద్వారముగుండా లోనికి పీల్చి, లోన కడిగి తిరిగి యాద్వారముననే బయటికి వదలివేయుట.

౨ స్థలబస్తిక్రియ- భూమిపై పశ్చిమతానాసనముననుండి అశ్వనీముద్రతో వాయువును ఆకుంచనప్రసారములుచేయుచు కడుపును నలుముఖముల త్రిప్పుచుండుట.

జలబస్తివలన గుదావర్తాదికములు కొన్ని రోగములు రాకుండ నివారింపఁబడి శరీరకాంతి వృద్ధియగుటయు, స్థలబస్తివలన మలబద్ధము, అజీర్ణము మొదలగు రోగములు రాకుండ జఠరాగ్ని అభివృద్ధినొందుటయుఁ గల్గునని చెప్పఁబడినది.

**బహమనీ నృపవంశము** వీరు క్రీ. వె. ౧౩౪౭ మొదలు ౧౫౨౬లో చీలిన వఱకు గుల్బర్గ రాజధానిగ నర్మదానదిమొదలు కృష్ణానదివఱకుగల నడుమసీమల నేలిననృపులు వీరియందు పేర్కొనందగిన నరపతి అల్లాఉద్దీన్ అనఁబడిననృపుఁడు

వె. ౧౫౨౬ లో బహమనీరాజ్యము ఐదుచీలికలై చిన్నరాజ్యములుగ నయ్యెను. ౧ బీరార్, ౨ బిదర్, ౩ అహమద్నగర్, ౪ బిజాపూర్, ౫ గోలకొండ.

**బహమా ద్వీపములు** (Bahama islands)-ఇవి పశ్చిమగోళార్థమున పసిఫిక్కుమహాసముద్రమునందు ద్వీపములందుఁగల మూఁడు ద్వీపసమూహములలోని యొకద్వీపసమూహము. బహామాద్వీపములు పెక్కులు కలవు. అన్నియు బ్రిటీషువారివి వీటిలో నొకద్వీపముపైననే క్రిష్టపర్కొలంబసుగారు తొలుత దిగిరని చెప్పఁబడినది. (వెస్టిండీసు చూడుఁడు).

**బహరెయిన్ద్వీపము**-- అరేబియాకడనున్న ముత్యాలసలాపముగలద్వీపము. బ్రిటీషువారిది.

**బహరెల్యామిన్** ఎఱ్ఱసముద్రమున (Red Sea) కరబ్బు లీపే ఠడియున్నారు.

**బహవల్పూర్సంస్థానము**— పంజాబుదేశమునఁగల బ్రిటీషురక్షితసంస్థానములు ౩౪ లోనొకటి. ఘూరా, సింధు నదులమధ్య నున్నది.

ఘూరానది, విపాశ, సట్లెజినదులు కలిసిన సంయుక్తప్రవాహము. వైశాల్యము ౧౭౦౦౦ చతురపుమైళ్ళు. ఘూరానదీతీరమున నున్న బహావల్పూరు రాజధాని సట్లెజినదికి తొల్లింటి పేరు:శతధృ.

**బహిర్వాహినీనది**--(అంతర్వాహినీనది చూడుఁడు).

**బహుచ్ఛిద్రఘటప్రదీపన్యాయము**- కన్నములు పడిపోయినకుండలోని దీపమని యర్థము.

**బహుతల్ప ద్వితీయ**-శ్రావణ బహుళ ద్వితీయ. పర్వదినము. (పండుగలు, పర్వములు, వ్రతదినములు చూడుఁడు.)

**బహువింధగోత్రము** -(శండిలగణము చూడుఁడు.)

**బహుమాత్రము**-(అతిమాత్రము చూ)

**బహురథుఁడు**— పూరుసంతతి. చంద్రవంశక్షత్రియుఁడు. తండ్రి పురంజయుఁడు.

**బహురాజకదేశన్యాయము**-- ఒకదేశమునం దనేకరాజు లధికారమునకై కలహించుచుండుతఱి, దేశప్రజల కొత్తిడి గల్గి బాధాకరమై యుండును. అట్టిదుస్థితిం దెల్పున్యాయము.

**బహుళ**— ఉత్తానపాదుని సుతుండైన ఉత్తముని భార్య. ఈమెఅయోగ్యురాలని చెప్పఁబడినది.

**బహుళాశ్వుఁడు**- మిథిలదేశాధీశుఁడు. శ్రీకృష్ణుని కాలమునాటివాఁడు. విష్ణుభక్తుఁడు. ఆకాలముననే మిథిలానగరమున శ్రుతదేవుఁడను మఱియొక విష్ణుభక్తుఁ డుండెననియు, ఇర్వురకు నొకేసారి శ్రీకృష్ణుఁడు దర్శన మిచ్చె ననియుఁ జెప్పఁబడినది.

**బహూదక సన్యాసాశ్రమము**- (ఆశ్రమచతుష్టయము చూడుఁడు.)

**బహూదకి బహూదరి గోత్రము** —(శాండిలగణము చూడుఁడు.)

**బహూనా మనురోధోన్యాయము**— అందఱను సంతోషపెట్టుట దుష్కరకార్యమని భావము.

**బహూనామనుగ్రహోన్యాయము**- కొంద రేకస్థులై కలిసిచేయుపని యతివేగముగ జయమగును. నూలుదారములు త్రాడై బలపడి తెగక నిలుచును.

**బహూనామనుమరణ న్యాయము** సంఘమరణమం దొకవిధమగుశాంతి యుండును గాని ఉగ్రత యుండదని భావము.

**బహ్వృచోపనిషత్తు**-ఇందు శరీరపురుషవ్యూహము, ఛందఃపురుషవ్యూహము, వేదపురుషవ్యూహము, మహాపురుషవ్యూహము నని నాల్గు వ్యూహములు చెప్పఁబడినవి. ఈన్యాయమువలన నాయాస్థలముల ననుసరించి, ఆయాయిఅర్థములు చతుర్వ్యూహములంగూర్చి యెఱుంగఁదగునని భావము.

**బళ్లారిజిల్లా**—ఆంధ్రకర్నాటక దేశములందు వ్యాపించియున్న జిల్లా. బళ్లారి ముఖ్యపట్టణము. ప్రత్తిపంటకు పేరొందినది. వరకస్థలము. ఇట శ్రీకృష్ణరాయ సార్వభౌమునినాటి సైన్యదుర్గము కలదు. హోసుపేట యినుపదారి కూడలిస్థానము. ఇటనే ఆంధ్రకర్నాటకసామ్రాజ్యపు తొల్లింటి రాజధానిగ నుండిన జీర్ణవిజయనగరపుపాడు కలదు. (విజయనగరరాజ్యము చూడుఁడు). ఆదోని గొప్ప దుర్గస్థానము. రాయదుర్గము,కొత్తూరు, సామేహల్లీ, ఆలూరు వేఱుపట్టణములు. దీనిని రాయలసీమ యనియు ననుచుందురు.

**బాంకిరేటు** (Bank rate)--ధాన్యము మొదలగుదినుసులు స్థానమునం దెంతవఱకు

నిల్వయున్నవో దానింబట్టియును, ఆవస్తువు లన్యస్థానముల కెంతవఱకు విక్రియింపఁబడ నుండునో దానింబట్టియు, వెళ్ళుట కెంతవ్యయ మగునో దానింబట్టియు వాట్లవిలువ లప్పటప్పట హెచ్చుచు తగ్గుచు, మార్పు నందుచుండును. ఇదియె తత్కాలమున వస్తువులయొక్క విలువ.

ఇటులనే వర్తకపుటవసరములకు నమ్మకను లగువ రకులకు హామీపై బాంకి వ్యాపార మొనర్చు (వడ్డీకి అప్పిచ్చు) సంస్థలు(బదుళ్ళు) అప్పిచ్చుచుండును. వారును తమయవసరముల గడుపుకొని, తిరుగ ద్రవ్యము తమకుఁ జేరిన తోడనె అప్పిచ్చినవారికి వడ్డీతో వారిమూల్యమును దీర్చివేయుచుందురు. ఇటుల నిల్వయున్న ద్రవ్యముంబట్టియు, అప్పుతీసికొనినవారి అవసరముల ఒత్తిడినుండియు, అప్పిచ్చుబాంకి మొదలగుసంస్థలు తామప్పిచ్చుమూల్యమునకు వడ్డీ నేర్పఱచుచుందురు. అవసరము లధికమగు వర్తకాధిక్యకాలమున వడ్డీరేటును ఎచ్చుచేయుచు, తగ్గియుండియు డబ్బు నిల్వయైయున్నతఱిని వడ్డీరేటును తగ్గించుచు, మార్చుకొను చుందురు దీనికి బాంకిరే టనిపేరు. అనఁగా బాంకివారు తత్కాలమున కప్పిచుచ్చుచో తీసికొను వడ్డీరేటు అని భావము.

**బాంకివ్యాపారము** (Banking business)— సొమ్ము నిల్వయుంచి, దానిలావాదేవీ (ఇచ్చిపుచ్చుకొనుట) వ్యాపారములను నడుపుసంస్థకు బాంకి యనెదరు. అనఁగా బదులిచ్చుటయు, తిరుగ రాఁబట్టుటయు నని భావము. దీని నిజతత్త్వ మేమన భద్రమగు తావుగాన ప్రజలు నమ్మి తమనిలువద్రవ్యము నట దాచుకొందురు. ఇట్టివారు కొందఱు వడ్డీ కాసజెందక కేవలము భద్రతకే అటనిల్వయుంచుటయు, కొందరు స్వల్పమగువడ్డీకి బాంకికి బదులిచ్చుటయు నైయున్నది.

అట్టి మూల్యమును బాంకి అప్పులగువారికి జాగ్రతయగుహామీపై నెక్కువవడ్డీకి బదులిచ్చి లాభము బొందుచుండును. ఇందు వడ్డీలేని మొదటి పద్ధతికి కరెంటుఎక్కౌంటనియు, వడ్డీగల రెండవపద్ధతికి డిపోజిట్లనియు నందురు. దానిందీసికొనుటకు Withdrawal అనెదరు. ఇంక నీబాంకివ్యాపారములు పలువిధములుగ నుండెడిని. అం దైదు ముఖ్యములు.

౧ సేవింగ్సుబాంకి- ప్రజలు స్వల్పమొత్తములు దాచుకొనుట కేర్పాటైనది. దీనికై వారికి స్వల్పవడ్డీ మాత్ర మిచ్చుచు, తక్కువ మొత్తములుగూడ వారినుండి గైకొనుచు, వారి కవసరమగుతఱి తిరుగ నిచ్చివైచుచుందురు. బాంకివారికి ఎక్కువవడ్డీ అన్యులనుండి వచ్చుట వలన లాభము చేకూరుచుండును.

౨ జాయంటుస్టాకు బాంకి- ఇవి ఏయేతావులందు ఏయేదేశములందు వ్యాపార మొనర్ప నిశ్చయించుకొని యుండునో, అచ్చటచ్చట శాఖలు (Branches) గల్గి లావాదేవి కొనుగోలు (కొనుట,అమ్ముట)వ్యాపారము లొనర్చుచుండెడిని. ఛార్టర్డుబాంకి ఆఫ్ ఇండియా ఇట్టిదే.

3 ఇంటర్నేషనల్ బాంకి- అన్యరాజ్యములతో వ్యాపారపు లావాదేవిలను సల్పుసంస్థ. ఇట్టిది క్రీ. వె. ౧౯30 లో బేసెల్పురమం దేర్పాటుచేయఁబడిన బాంకివంటిది. అన్యదేశ వ్యాపారముల బాకీపైసలాతీర్మానములు దీనికి ముఖ్యములు.

౪ స్టేట్ (సంస్థానపు) బాంకులు-ఇవి ప్రభుత్వమువారే వర్తకాభివృద్ధికై యేర్పఱచిన సంస్థలు. అమెరికాసంయుక్తరాష్ట్రములందలి ఫెడరల్ రిజర్వుబాంకియు, ఆస్ట్రేలియాయందలి కామన్వెల్తు బాంకియు నిట్టివియె.

౫ ఫారెన్ బిజనెస్ బాంకులు- అన్యదేశపు లావాదేవీలే ప్రధానముగాఁ గలవి. ఇంగ్లాండు

నందలి రాత్ ఛీల్డ్సు బాంకియు, బేరింగ్సు బాంకియు నిట్టివియె.

ఇంక నిట్టిబాంకుల వ్యాపారమున కొన్ని పరిభాషాపదములును కలవు. (బాంకి ఆఫ్ ఇంగ్లండు చూడుఁడు).

**బాండు (పత్రము లేక దస్తావేజు)** Bond— (వాణిజ్యపరిభాషాపదము) సర్వసాధారముగ పత్రి మనియర్థము. ఇందు జరుగఁగల జరగుపనిని చేసినవారిని ముందు విధులు మొదలగునవి వివరింపఁబడి, దస్కతు మొహరులు మొదలగునవి యుంచఁబడి, అవసరమగునేని సాక్షిసంతకములు, రిజస్ట్రీపను చేయఁబడియు నుండునది. రసీదులు మొదలగు నన్ని కాగితములను పత్రిము (Bond) లనుచుందురు. ప్రభుత్వముగాని, ఒక Corporation సంఘముగాని, అప్పు పుచ్చుకొన్నటుల Issue చేసినపత్రిపు అప్పులకు "Bonded Debt" అనిపేరు. కస్టమ్సుడ్యూటీ చెల్లింపఁబడవలసిన సరకులను, నిల్వయుంచు Godown లేక నిల్వసాలకు "Bonded warehouse" అని పేరు. ఇందునుండి సరకులు తీసుకొనిపోఁబడుతఱి "Customs duty" చెల్లింపఁబడవలెను. ఇటులనే భూమియందు త్రవ్వఁబడి సారాయములు మొదలగువానిని నిల్వయుంచుకొనునట్టి "Under ground cellars" కు "Bonded Vaults" అనిపేరు. Bonded ware house నం దుంచఁబడియున్న సరకులకు "Bonded goods" అనిపేరు. Bonded goods వేఱొకరేవున కెగుమతిచేయుటకుఁగాని, వేఱొకగొడౌనుకు తీసికొనిపోవలయునని గాని, Customs house ఉద్యోగుల యనుమతి పత్రిమునకు "Bond note" అనిపేరు.

**బాందాద్వీపములు**— డచ్చిఈస్టుఇండీసునకుం జెంది ఆసమీపముననే యున్న పంౘెండు చిన్న అగ్నిపర్వతసంబంధద్వీపములు. బాందానియరాయందున్న బాందా పురము ప్రధానపట్టణము. కొంతవఱకిట జాజికాయలు, సగ్గుబియ్యమువర్తకము జరుగుచున్నది. మఱియు నాపురమున పదివేలజనులు వసించుచున్నారు.

**బాంబరాస్టేటు**—ఇది ఆఫ్రికాఖండపు నిగ్రిటియా యనంబడు సౌడాన్ దేశపు నీగ్రో స్టేటులలో నొకటి సెగోపురము రాజధాని. ఇది సెగోకు (సగ్గుబియ్యమునకు) పేరందినది. సేగోబియ్యమె మనదేశమున సగ్గుబియ్యమనంబడుచున్నవి. ఇవి సేగోచెట్లనుండి చేయఁబడుచున్నవి. ఇది ఫ్రెంచి సౌడాన్ దేశములోనిది. (నిగ్రిటియా లేక సౌడాన్ చూ. ఆఫ్రికా ఖండము చూడుఁడు.)

**బాకర్గంజిజిల్లా**—బారీసాల్పురముప్రధానస్థానము. దీనిని "గ్రానరీఆఫ్‌కల్కటా" యని యందురు. (బంగాళాదేశము చూడుఁడు.)

**బాకుపట్టణము**—కాస్పియన్ సముద్రతీరమునందున్న రేవుస్థలము. ఇప్పుడు సోవియటుప్రజాప్రభుత్వమునఁ జేరియున్నది. ఈ ప్రాంతముల కెరసనైలుగను లున్నవి. పారశీకుల అగ్నిదేవాలయమొకటి బాకూనం దున్నటుల చెప్పఁబడినది.

**బాక్‌గేమ్మన్ ఆట** (Backgammon)-ఇది పాశ్చాత్త్యులనుండి మనము నేర్చినయాట. ఒకపలకను సరియగు రెండుభాగములుగ విభజించి, ఒక్కొకభాగమును నొకటివిడిచి యొకటిగ రెండు వేర్వేఱురంగులతో పంౘెండేసి గదులుగ విభజింపఁబడి యుండును. ఇందు పదునేను (౧౫) ఆటకాయలతో (ఒక్కొక భాగమున) ఇద్దరు ఆడుదురు. ఆటలో జయమునకు 'Hit' అనియు, ఎదుటికకువారిపై జయమునకు 'Gammon' అనియు పేరిడి

యున్నారు. మూఁడాటలలో రెండుజయము లందినవా రీయాట గెలిచినట్లు తలంపఁబడును. దానికి 'Rubber' అనిపేరు.

**బాక్సింగు డే** (Boxing day) — ఇంగ్లాండు దేశమున క్రిస్టమసుపండుగ గడచిన తరువాతదినము. ఈదినమున సేవకులకు బహుమానము లొసంగునాచారము కలదు.

**బాగిర్మి స్టేటు** — ఆఫ్రికాఖండమున సౌడాన్ లేక నిగ్రీటియా దేశమున నున్నస్టేటు లలో నొకటి. స్వతంత్రరాజ్యములోనిదై కనెమ్ వాడై స్టేటులతో కలిసి ఒకసుల్తాన్ ఏలుబడిలో నున్నది. (ఆఫ్రికాఖండము, సౌడాన్ లేక నిగ్రిటియా దేశము, కనెమ్‌స్టేటు, వాడై స్టేటు చూ.)

**బాగురాయణ గోత్రము**—(ఉపమన్యు గణము చూడుఁడు.)

**బాగేటిల్ లేక బాగేటిల్లి** (Bagatelle) ఇది పాశ్చాత్యులనుండి మనము నేర్చినయాట. బిలియర్డ్సు ఆటను బోలినది. ఐదడుగుల పొడవు అడుగున్నర వెడలుపు గల యొక బల్లపై నాడుదురు. బల్లయొక్క ఒకకడను తొమ్మిది పల్లపుగుంట లుండును. వాట్లకొకటి మొదలు తొమ్మిదివఱకు సంఖ్యలు గుర్తువేయఁబడి యుండును. ఆగుంటలు గుండ్రనివై యుండును. ఆమొదటిగుంట కడ్డముగ నుంచఁబడిన నల్లబంతినిగొట్టి, మొదటిబంతి మొదటిగుంటయందు పడునట్లు త్రోయఁబడును, పిదప నిట్లె తక్కిన గుంటలకు గుఱిచేయఁబడుచుండును. అన్నియు నిట్లు చేసిన జయమందినట్లు (ఆట గెల్చినట్లు) ఎంచఁబడును.

**బాగ్దాదుపట్టణమున రాజ్య మేలిన ఖలీఫాలు**-వీరుఅబ్బాసైదువంశస్థులు37గురు.

౧ అబుల్ అబాస్ అల్ సఫా ౭౫౦-౭౫౪, ౨ అల్ మన్సూర్ ౭౭౫ వఱకు, 3 మహదీ ౭౮౫, ౪ అల్హాదీ ౭౮౬, ౫ హారూన్-అల్-రషీదు(అరబియన్‌నైట్సుకథాప్రసిద్ధిఁగలవాఁడు) ౮౦౯, ౬ అల్ అమీన్ ౮౧3, ౭ అల్మామూన్ ౮33, ౮ అల్మొతాసిం ౮౪౨, ౯ అల్వాథిక్ ౮౪౬, ౧౦ అల్ ముతవక్కిలల్లా ౮౬౧, ౧౧ అల్మొంతసిర్ ౮౬౨, ౧౨ ముస్తయీన్బిల్లా ౮౬౬, ౧3 అల్మొతజ్ ౮౬౮, ౧౪ అల్మొహ్తదీబిల్లా ౮౭౦, ౧౫ అల్మొతమిదలల్లా ౮౯౨, ౧౬ అల్మొతడిద్ ౯౦౨, ౧౭ అల్మొక్తఫీ ౯౦౮, ౧౮ అల్ముక్తదిర్‌బిల్లా ౯3౨, ౧౯ అల్కాహిర్ ౯3౪ వఱకు, ౨౦ అర్రాడీబిల్లా ౯౪౦, ౨౧ అల్ముత్తకీబిల్లా ౯౪౪, ౨౨ ముస్తక్ఫీబిల్లా ౯౪౬, ౨3 అల్ముటీబిల్లా ౯౭౪, ౨౪ అల్టాయిలీ అమ్రిల్లా ౯౯౧, ౨౫ కాదిర్బిల్లా ౧౦3౧, ౨౬ అల్ఖాయిల్లీ అమ్రిల్లా ౧౦౭౫, ౨౭ అల్ముక్తదీ బీ అమ్రిల్లా ౧౦౯౪, ౨౮ అల్ముస్తజ్ హిర్బిల్లా ౧౧౧౮, ౨౯ అల్ముస్తర్షిద్బిల్లా ౧౧3౫, 3౦ రాషిద్బిల్లా ౧౧3౬, 3౧ ముక్తఫీలి అమ్రిల్లా ౧౧౪౬, 3౨ అల్ముస్తనీజిద్‌బిల్లా ౧౧౭౦, 33 ముస్తడీబీ అమ్రిల్లా ౧౧౮౦, 3౪ నాశిర్‌లీ దీనిల్లా ౧౨౨౫, 3౫ జాహిర్బీ అమ్రిల్లా ౧౨౨౬, 3౬ ముస్తన్సిర్బిల్లా ౧౨౪౨, 3౭ ముతసింబిల్లా ౧౨౫౮.

**బాగ్దాదుపురము**— చాల పురాతనపు పట్టణము. అరేబియన్‌నైట్సులో ప్రసిద్ధము. తొల్లింట మహమ్మదీయసామ్రాజ్యమునకు రాజధాని. ఇప్పు డిరాకుదేశమున టైగ్రిసునదీతీరమందున్న పట్టణము. పరిసరము లన్నియు తాడిచెట్లు, ఖర్జూరపుతోఁటలతో నుండును. దూరమునుండి స్తంభములు, డోములు, మేడలుగలిగి అతిసుందరమగు పురముగాఁ గానవగును గాని లోనికేగ నిఱుకువీధులు, మురికియిండ్లు చికాకుగ నుండును.

ఇందు చూడఁదగినవి కేలిఫ్ అరూన్

అల్రిపీదు ధర్మపత్ని యగు జోబెయిదా బేగం గోరీయును, తాలిస్మా న్దర్వాజాయును ముఖ్యములు. ఇట వర్తకము కొంతవఱకు బాగుగనె యున్నది. బాగ్దాదుండినచోట తొల్లింట నాది కాలమున సెలెయూసియా యనియు, టెసిఫాన్ అనియు రెండుగ్రామము లుండెననియు, వాటిని బడఁగొట్టి కేలిప్ అల్మన్సూర్ అబ్బాసైయద్ అనుపేరుగల భూపతి ౭౬౩ ప్రాంతమున బాగ్దాదుపురనిర్మాణము గావించెననియుఁ జెప్ప బడినది గాని కాలము సరిగా కుదురకున్నది. క్రీ. వె. ౧౯౧౭లో ఆంగ్లాక్రమణము జరిగెను. స్తంబూల్ (కాన్స్టాంటినోపిల్) నగరమున కవ్వలియొడ్డునుండి హైదరుపాషా అనఁబడుతావు నుండి ఆసియామైనరు, ఉత్తరమెసపొటెమియాల గుండా బాగ్దాదువఱకు ఇనుపబాట కలదు. దానిని బాగ్దాదు రెయిల్వే యనుచున్నారు.

**బాగ్దాదు మసొల్ ఇనుపదారి**— (Iraq Railway) వాడుకయం దిట్లున్నను నిజమున దీనిపేరు ఇరాక్ రెయిల్వే యని యున్నది కాని, భరతదేశమునం దాపేరు వాడుకలో లేదు గాన బాగ్దాదుమసొల్ ఇనుపబాట యని వ్రాసితిమి. ఇవి మెసపొటేమియా దేశమునందు టైగ్రిస్ నదీతీరమందున్న పడవల రేవులును, ఒకపాటి వర్తకస్థలములు నైయున్నవి. బాగ్దాదు కేలీఫాలనగర మని, (కేలిపాల రాజధానిగ నుండినతావని) అరేబియనునైట్సు కథల నుండి యెల్ల రెఱుఁగురుదు. దీని ప్రాముఖ్యమాంధ్రదేశమున కంతగా తెలియకున్నను, కొంచెము తరువాయిగ నైరోపాఖండమున కరుగు భూమార్గ మగుట నాంధ్రు లెఱుంగఁ దగినది. బాగ్దాదున కుత్తరముగా ౨౨౦ మైళ్ళదూరమున మసొల్ పుర మున్నది. టైగ్రిసునది పశ్చిమపుటొడ్డునచేపోవును. ఈఅయోమార్గము పూర్వపు కార్వానామార్గముల ప్రాముఖ్యమును తగ్గించినదని చెప్పక తప్పదు.

మెసపొటెమియాదేశము టైగ్రిసుయూఫ్రటీసునదులమధ్య నుండు గొప్ప ఫలవంతప్రదేశము. ఇరాకురెయిల్వే పారశీకసంయుక్తాగ్రిగుడమునందలి బస్రారేవునుండి బయలుదేఱి, కిర్కూ సంధి మీఁదుగా మసొల్ చేరి, దక్షిణాభిముఖమై బాగ్దాదున కరుగును. కిర్కూసంధినుండి ఐరోపా కరుగుట కిదివఱకే యినుపబాటలు కలవు. లండనునుండి కిర్కూసంధి మసొలుపురమునందలి రేవులమీఁదుగా బాగ్దాదునకు ౩౨౪౦ మైళ్లుండు నని చెప్పఁబడినది. ఇంక కిర్కూసంధి బాగ్దాదుపురములకు నడుమనుండు క్వారఘానుసంధిలో బండ్లు మార్చుకొని, వేఱులైనుపై నటనుండి ౧౨౫ మైళ్ళదూరమున నున్న ఖా నీపురమున కేగి, అటనుండి ౫౦౦ మైళ్ళదూరమందున్న రాజధాని థా ఇరాన్ (టెహెరన్) నగరమున కరుగ మోటారుఏర్పాట్లు కలవు. ఖానికాన్ పురము పారశీకరాజ్యమున హద్దుననే యున్నతావు. (మసొల్ పురము చూడుఁడు. పారశీకదేశము చూడుఁడు.)

**బాఫెహాలుశాఖక్షత్రియులు**- (చాళుక్యక్షత్రియులు చూడుఁడు.)

**బాటపై నడుచుపద్ధతి**- భరతదేశమున తొల్లింటికాలమున బాటపై నడుచుపద్ధతి అధికులు కుడిప్రక్కనుండియు, తక్కువవా రెడమప్రక్కనుండియు నడుచుట ఆచారముగ నుండెను. ఒకరి నొక రెదుర్కొనుతఱియు నిదే పద్ధతి. ఐరోపాదేశమునందలి పెక్కుదేశములం దిదియె విధానము. ఇంక నింగ్లాండునందు గుఱ్ఱములపై స్వారిచేయుట తొల్లి ప్రయాణవిధానముగాన, గుఱ్ఱమును గుఱ్ఱపువాఁడు పట్టుకొను నెడమవైపునుండియె గుఱ్ఱము నెక్కుటయు నాచారమగుటతో నడుచుటయు, నెడమవైపునుండి ఏర్పడెను. మఱియు నెదురుగనడిచివచ్చువారు కుడివైపున నడుచునట్లు (వారికిని అది

ఎడమవైపే యగును.) తమకుడివైపు సగము బాట వదలివేయఁబడుచుండుట యాచారమై కడకు English High ways Act of 1835 వలన పద్ధతియయ్యెను. ఆంగ్లపాలనమున భరత దేశమునకు విధింపఁబడి నేటికట్లు జరగుచున్నది. ఇటలీ, ఫ్రాన్సు మొదలగు నితర ఐరోపాదేశ ములబాటకు కుడివైపునుండి నడుచుట పద్ధతి.

ఇంక నదులయందు సాధారణముగా కుడి వైపునుండియె పడవలు నడుచును. స్టీముపవరు గాని, మోటారుపవరుగాని గలయోడలుతొలఁగి ఏబలమును లేక గెడలతోఁగాని, తెడ్లతోగాని, తెరచాఁప వలనఁగాని నడుపఁబడుపడవలకు మార్గమీయ వలయును.

తెరచాఁపవలన బలముగ పరుగిడుచుండు పడవ, తెడ్లవలన గెడలవలన నడుపఁబడుచుండు పడవలకు తావిచ్చి తొలఁగవలయును. తప్పం కొనుతఱి నీటిప్రవాహము వెంట వచ్చుపడవల నడుమ నుండవలయును. వాట్ల నడుమఁ గాను (నీటిప్రవాహమున కెదురేగు పడవలు ప్రక్కల నుండి నడువవలయును. ఇది భరతదేశమునం దములులోనున్న పద్ధతి.

**బాడిదచెట్టు**— తెల్లపువ్వులు పూచునది తెలబాడిద యనియు, ఎఱ్ఱపూవులు పూచునది ఎఱ్ఱబాడిద యనియు, పచ్చపూవులు పూచునది పచ్చబాడిది యనియు త్రివిధభేదములు గలది. లా. Erythrina Indica. సం. పారిభద్రిః, బహుపుష్పః, రక్తపుష్పః. (ఎఱ్ఱబాడిదచెట్టు.) దీనిచెక్క ఆకుల రసకషాయములు సెగరోగ మును నివారించు ననియు, కర్ణరోగములు, క్రిమి విషదోషముల హరించుననియుఁ జెప్పఁబడినది.

బాడిదకఱ్ఱబల్లలు చాల తేలిక (చులకన) గానుండునుగాన సవారీలకు, టంజనులకు వాడు దురు. బాడిదలందు తెల్లపూవులు పూచుజాతి ఎక్కువగుణము చేయు నందురు. పచ్చజాతి చాల అరుదు. ఎచ్చటనోగాని గానరాకున్నది. బాడిదపూవుల రసకషాయములు కడుపులోని బల్లలు కరగించి, శూలనొప్పుల నివారించును.

**బాడెన్ (గ్రాండుడచ్చీ) దేశము**— దీనిని సర్వసాధారణముగ బాడెన్ దేశము లేక బాడెన్ రాష్ట్రి మనియెదరు. ఐరోపాఖండ మునందు జర్మనీదేశములోనిది. ౫౮౦౦ చతు వైశాల్యము కలది.

రైనునదీతీరమునకు సమీపమునసె యున్న కారల్సురూహెపురము ప్రధానస్థానము. నెకార్నది రైన్నదిలో సంగమించుతావున నున్న మాన్హైయిమ్పురము గొప్పవర్తకస్థలము. నెకార్నదీతీరమందున్న హెయిడెల్బర్గుపురము పురాతనపు సుప్రసిద్ధ విశ్వవిద్యాలయమున్న తావు. రైనునదీతీరమందున్న బాడెన్పురము సుప్రసిద్ధ మగు Baths ఉన్నతావు. కాన్స్టన్సుసరస్సు తీరమునందున్న కాన్స్టన్సుపురము వర్తకస్థానము. (ఐరోపాఖండము, జర్మనీదేశము చూడుఁడు.)

**బాణసంచావిద్య** — దీనికి సరియగు దేశీయశబ్దము "సంచు" అని చెప్పఁబడినది. సంస్కృతమున అగ్నిబాణవిద్య యనంబడినది. ఆంగ్లమున నీకళకు "Pyroteching" అనియె దరు. భరతదేశపు చతుష్షష్టికళలలో నిది అగ్ని స్తంభనవిద్యకుఁ జెందినయొకశాఖ. అగ్నిని స్తంభింపఁజేసి (స్వాధీనపఱచుకొని) ఉపయో గించుకొనుట యనిభావము. చూడ వినోదము గను, నేత్రానందకరముగను నగ్నిని బ్రదర్శిం చుట యీవిద్యానిపుణతకు ప్రయోజనమై యున్నది.

ఐరోపాదేశములం దగ్నివిద్య యుద్ధములం దుపయోగించుకతన భరతదేశమున, కెల్లెట్లో ఆసంగతి చేరి, అగ్నిబాణవిద్యగ కొందఱిచే దలంపఁబడియుండనోపును, గాని యాదినామ మగ్నిస్తంభనవిద్య యనియే యుండెను.

ఐరోపా దేశములందుఁగూడ బాణసంచా వినోదములు వాడుకయందే యుండెను. గైఫాక్సను నొకవిప్లవకారుఁడాంగ్ల దేశము నరాజకము పాల్సేయఁ బ్రియత్నించుచు, పార్లమెంటుసభా భవనముక్రింద సొరంగమును త్రవ్వి తుపాకి మందును కూరి నిప్పంటింపఁ బ్రియత్నించుచో పట్టువడెనఁట. ఇది క్రీ.వె. ౧౬౦౫ నవంబరు ౫ తేదియఁట. నాఁడాదిగ నేఁటేట నవంబరైదవ తేదీని బాణసంచాలు కాల్చుచు గొప్పసందడి చేయుపండుగఁగ నేర్పాటు చేసికొనిరి.

చీనాదేశమునం దనాదిగ క్రీస్తు పుట్టుటకు మున్నే బాణసంచావిద్యయం దాఱితేఱినవా రుండిరి. నేఁటికిని చీనాజపాను దేశస్థులీవిద్యయం దితరదేశస్థు లెవ్వ రెఱుంగని చిత్రప్రదర్శనముల బాణసంచావిద్యయం దొనర్చుచున్నా రనుట కంద అంగీకరింతురు. చీనానుండి భరతదేశస్థులాదిని అగ్నిస్తంభనకళ కొకశాఖగ బాణసంచా చేయుటయందలి మెలకువలు నేర్చి రని కొంద అందురు. ఐరోపా దేశములందు గ్రీకులు తొలుత నేర్చిరఁట. వారు యుద్ధములందు గ్రీకు ఫైర్ అనంబడు మండెడి ద్రావకమును సంగరములం దుపయోగించిరఁట. క్రీ.వె. ౧౭ శతాబ్దప్రారంభమున పలుగ్రంథము లీవిద్యఁ పెబయలు దేఱెనఁట. ఫ్రెంచిదేశపుగ్రంథము నను వదించి యాంగ్లేయభాషయందు వెల్లడించిరఁట. ఆదియందు సైనికోద్యోగస్థులే బాణసంచా చిత్రములు చేసి యిచ్చెడివారఁట కాని, రాను రాను వర్తకసంఘములు చేయ మొదలిడినవఁట. ఇట్లైరోపాయం దభివృద్ధినొందిన దఁట.

ఇంక భరతఖండముంగూర్చి యసూయచే నెవ్వ రేమని వచించినను సరకుగొనుటకన్న యజుర్వేదము నందు, మహాభారతము నందు ఆగ్నేయాస్త్రములం గూర్చినప్రశంస లుంటయు. అశోకుని శిలాశాసనములందు నాల్గవ శాసనమున నొక యుత్సవమునం దగ్నివర్షము ప్రదర్శింపఁబడుట వివరింపఁబడి యుంటయు, సూచించుచు ముందునకుఁ జనుట సమంజసము.

భారతీయవిధానముననగ్నిచూర్ణము(తుపాకి మందు) చేయు యోగ మిట వివరింతుము.

శ్లో॥ "సువర్చిలవణా త్పంచ పలాని గంధకా త్పలమ్
అంతర్ధూమవిపక్వార్కస్నుహ్యా ద్యంగారతః పలమ్
శుద్ధా త్సంగ్రాహ్యా సంచూర్ణ్య సమ్మీల్య ప్రపుటే ద్రసైః
స్నుహ్యర్కాణాం రసో నస్యశోషయే దాతపేన చ
పిష్ట్వా శర్కరవ చ్చైత దగ్నిచూర్ణం భవేత్ఖలు
సువర్చిలవణా ద్భాగాః షడ్వా చత్వార ఏవవా
నాళాస్త్రార్థాగ్ని చూర్ణేతు గంధాంగారౌతు పూర్వవత్."

అనఁగా సురేకార మైదుపలములును, గంధక మొకపలమును, పొగ పైకిపోకుండఁగాల్చిన జిల్లేడు, చెముడు వేః బొగ్గుచూర్ణ మొకపల మెత్తును, పాళ్ళుగనుండి, అందు జిల్లేడుమొదలగువానివేళ్ళ బొగ్గుపొడి, అనఁగా వేళ్ళను గాని, బొగ్గుపొడిని గాని వెల్లుల్లిరసముతో తడిపి యెండబెట్టి పంచదారంబోలినచూర్ణముగఁజేసిన నది అగ్నిచూర్ణమగునని చెప్పఁబడినది. ఇదియే అస్త్రవిధానమని మా యభిప్రాయ మెంతమాత్రము గాదు. ఆకాలమున నటుతలంపఁబడినది. ఇక్కాలమున నాంగ్ల ప్రభుత్వముః రనేక పరిశీలనలఁ జేయించుచు దీనియోగము నభివృద్ధి పఱచుట మేముగుర్తింపకపోలేదు. ఆదికాలమున భరతదేశమున లేదనుట కీసంగతి నిట నుదహరించితిమి.

ఇంతియేగాక శుక్రనీతిలోనిఅగ్ని బాణయోగ

మిటులఁ జెప్పఁబడినది. ఇది రంగులనుట, కాంతులనుట బాణసంచా సంబంధముగ స్ఫురింపక పోదు. "బొగ్గు, గంధకము, సురేకారము, మణిశిల, హారిదళము, సీసభస్మము, ఇంగిలీకము, ఉక్కుబీడు, మైలతుత్తము, లక్క, నీలిమందు, సరళ (తెల్లతేగడచెట్లలోనిబంక) వీటి భాగములను వివిధములుగమార్చుచు, తేజోవంతములగు బాణముల పెక్కు రంగులుగఁ జేయవచ్చును."

బాణసంచావిద్య కించుక రసాయనశాస్త్ర జ్ఞానమును, హస్తకౌశలమును ప్రధానములు. కాలునప్పు డెక్కువకాంతియు, రంగులను, ప్రదర్శనములను రాణింపఁజేయును. ఇట్లనుట తోడనే ప్రాణవాయువుంగూర్చి స్ఫురింపక పోదు. అది లేనిదే అగ్ని ప్రకాశింప దనుట సర్వసామాన్యవుపలుకే గాన బాణసంచాయందు ప్రాణవాయువును గల్గించియిచ్చునవి, దానిఁ గైకొని మండఁజేయునవి రెండుద్రవ్యములుండవలసి యుండెడిని.

గంధకాదులు కట్టెలకన్న నతివేగముగ నిప్పంటుకొని మండుననియు, చమురుగల కట్టె లెక్కువదీప్తితో మండుననియు, ఎల్ల తెలిసిన దే. వేగిరము నిప్పంటుకొనుట, తేజోవంతమగుదీప్తితో మండుట ఇందు ప్రధానములు గాన నిట్టివస్తువుల సంపుటీకరణమే బాణసంచాయందు ప్రధానము. ఇంక వివిధములగు రంగులతో కాలుట విచిత్రము గాన, పసుపుపచ్చరంగునుగల్గించు సముద్రలవణము, అతివేగమున జ్వాలం గల్గించుగుగ్గిలపుపొడి, సర్జరసము, తామ్రసంబంధపదార్థములనుండి యాకుపచ్చ, మబ్బురంగులు, నీలిమందువలననీలిరంగులు, Calcium salts కలుపుటవలన లేతమెఱుపు, నీరెండరంగులును Strontium nitrate గలుపుటవలన వివిధములగు నెఱుపురంగులు, Barium nitrate (లేక బైరైటా) కల్పుటవలన వివిధములగు నాకుపచ్చరంగులు, అగ్నియందు కలుగును గానవీట్లం జేర్చుట బాణసంచాకగు నలంకారములనియు, ఈవిద్యకు మూలసూత్రమనియు తలంపఁ దగును.

గాలియందున్న ప్రాణవాయువు బాణసంచాకార్యములకు చాలదు గాన నైసర్గికముగ దీప్తి తగ్గుట తటస్థించును. ప్రాణవాయువునిచ్చు నీరు, భూమి, రాళ్ళు, చెట్లు వీటి కుపచరించునవి కావు గాన, ప్రాణవాయువును నిర్బంధించి తమయం దిముడ్చుకొనియుండి అగ్నిసంపర్కమున ప్రాణవాయువును వదలివేయుపదార్థములగు Potassium nitrate (లేక సురేకారము, లేక పెట్లుప్పు)ను Potassium chlorate (లేక పోటాష్ లేక పొటాషుహరితము) మొదలగు వస్తువులను ప్రాణవాయువు గల్గించియిచ్చు ద్రవ్యములుగను, ప్రాణవాయువును దీసికొను ద్రవ్యములలో నసఁగా ప్రాణవాయుసంయోగమునమండు పదార్థములకుగాను బొగ్గుపొడి, గంధకము మొదలగునవియు బాణసంచా చేయుటలో ముఖ్యద్రవ్యములుగ నుండును.

బాణసంచా విచిత్రరచనయం దుక్కుపొడిని వాడుట (ఉక్కుబీడు) అగ్నికణములను విస్ఫులింగములవలె తాము కాలి విరజిల్లుచు, కాకరపువ్వవత్తులు మొదలగువాటియం దుపయోగించును. ఇంకఁ గాల్చినచోటనే గిరగిర తిరుగు చక్రపటాకీలు, చక్రబాణాలు మొదలగునవియు, కాల్చినచోట నుండక పైకెగసిపోవుచుండు తారాజువ్వలు, అవ్వాయిచువ్వలు, గొప్ప ధ్వనితో ప్రేలి విభ్రమముంగల్గించెడిఅగాదాలు మొదలగునవియు, ఉన్నచోటనుండియే చెట్లం బోలి ప్రకాశమానముగఁ గాలు చిచ్చుబుడ్లు మొదలగునవియు, ఆకాశమున కెగసి యటఁ బ్రేలి రంగులదీపములను వెదఁజల్లు వెన్నముద్దలు, వెలగకాయలు, మొదలగునవియు

ఉపాయములచే నట్లు చేయునట్లొనర్పఁబడినవి. ఉదాహరణముగ నొకఫిరంగి కాల్చుతఱి తక్కువ బరువుగల ఫిరంగిగుండు ముందునకు దూర మరుగుటయు, అతిభారమగు ఫిరంగిబండి ఒకటిరెండడుగుల దూరము వెనుకకు (తన్ని) జరుగుటయు నెల్లరెఱింగినదే. అట్లే ఒక గొట్టమునందు రెండువైపులనుండి మందు దట్టించి కొనలు మూసి రెండువైపులందు ఒకకొన నొకవైపునను, రెండవకొన రెండవవైపునను రంధ్రములు చేసి అగ్ని ముట్టించిన, వెనుకకు రెండుకొనలనుండి త్రోయఁబడుట గిరగిర తిరిగెడిని. తక్కినవియు నిట్లే యూహింపఁదగినవి. బాణసంచానిర్మాణమున నేవస్తువుః కావస్తువునే గుండనూరి, పిదప పాళ్ళు కలుపవలయును గాని, కల్పి నూరరాదు. అది యొక్కొక తూరి ప్రాణాపాయముగూడఁ గల్గించినది.

బాణసంచావిచిత్రము లిన్నియని నిర్ణయింప శక్యముకాదు. దేశదేశముల వేర్వేఱుగనుంటయె గాక, పనివాండ్ర బుద్ధికుశలతనుండి, వారి అనుభవములనుండి కల్గినజ్ఞానములనుండి వేర్వేఱుగ నుండునుగాన సామగ్రిలభాగముల నన్నిటిని వివరించుట యేరికిని శక్యము గానిదిగనే యుండును.

బాణసంచాచేయుకార్యమును ముఖ్యముగ నాల్గుభాగములుగ విభజించియున్నారు. ౧ భాగములు గల్పి మందు తయారుచేయుట, ౨ మతాబులు, కాకరపూవువత్తులు మొదలగువాటికి గొట్టములు చేయుట, 3 మందు దట్టించుట, ౪ అవసరమగువాటికికాల్చువత్తులు, జానకిత్రాడు లేక కాల్చుతావులం దిడవలసిన వేఱురకము మందు అని నాల్గుభాగములుగఁజెప్పియున్నారు.

౧ భాగములు గల్పి మందు తయారు చేయుట. ఈ కలుపవలసినభాగములం గూర్చి అనేకవిధములుగ నున్నందున ఎవ్వరివో ఒక రిద్దరుచెప్పిన భాగములను మేమిట వివరించుట సరికానేరదు గాన, దానిని ప్రయత్నించువారలకు వదలివేయుదుము గాక.

౨ మందు దట్టించుటకు గొట్టములు మొదలగువాటిని జేయుట. మతాబాలకు, కాకరపూవువత్తులకు నగుకాగితపుగొట్టములు, చిచ్చుబుడ్లకు కుండగొట్టములు మొదలగునవి సరియగుకొలతల మేరకు జేయఁబడనిచో చీలిపోవుట, జాఱుట, సరిగానిలిచి కాలకపోవుట మొదలగు బాధలు సంభవించునుగాన పద్ధతిమేరకు చేయవలసియుండును.

అవాయిలు చేయుతఱి గొట్ట మరంగుళము మందముండుచో రెండున్నరతులముల మందు దట్టింపఁగల పొడవును, ఆరంగుళముల తోకయు నుండవలయునని విధికలదు. ఇది సర్వసాధారణపుపద్ధతి. ఇం దనేక పరిమాణములం దీఅవ్వాయిచువ్వలు చేయుదురు. కొన్ని గొట్టము లట్టలతోను, కొన్ని కాగితముల యంటింపుతోను చేయుదురు. పటాకీలు తాటియాకులచే బిగించుపద్ధతి భరతదేశమునను, దళసరికాగితపుగొట్టములందు చేయుపద్ధతి చీనాదేశమునందునను ఆదినుండియు నున్నది. చిచ్చుబుడ్లు మట్టిమూసలలో కూరుటకలదు. తోటాలు శిశిందీలు పలుచనితోలుతో చుట్టెదరు. ఇ అనుభవపూర్వకజ్ఞానము లేనివారు చేసిన నపాయకరము లయ్యెడిని.

నీటిబాణములని కొన్నికలవు. అవి నీటికాకులవలెనే కాల్చి నీటఁబడవైచిన నీట మున్గుచు పైకెగురుచు తిరుగ నీటంబడుచు కాలును. నీటఁబడియు నివి నానిపోవు. ఆరిపోక నిలుచును. నీటియందు తుపాకిమందుపాలెక్కువకలియునఁట.

ఇంక నధికవిద్యావంతులగు రసాయనశాస్త్రజ్ఞు లిక్కాలమున వింతవింతబాణసంచా చిత్రములు చేయుచున్నారు. మనుష్యాకార

ములు, సభలు, మృగములు, అక్షరసముదాయములు, పువ్వులు మొదలగున వెన్నియో పాశ్చాత్య దేశములందు బాణసంచాగా చేయఁబడుట వింతగొల్పెడిని. చింతకఱ్ఱబొగ్గు, జిల్లేడు బొగ్గు మొదలగువాటి కిక్కాలమున సారాయమునుగూడఁ గల్పుదురు.

**బాణపురము**—దీని నిప్పుడు మహాబలిపుర మనియు,చతురంగపట్టణమనియు నందురు. ఆంగ్లులు సాడ్రాస్ అనుచుందురు.

చెంగల్పట్టుమండలములో నున్నది. కొంత కాలము పాండ్యరాజులకు నివాసముగ నుండెనఁట. ఇట ఏకశిలయందు చెక్కఁబడిన దేవళములు, రథములు కలవు. పెక్కుచిత్రములగు పనులును గలవు. బాణాసురుని రాజధానియగు శోణితపురమున కీపేరుండెనని తెలియుచున్నది. (ఉమావనము చూడుఁడు.)

**బాణాగ్రములు పది విధములు** — ౧ ఆరాముఖము, ౨ ద్విభల్లకము, 3 వత్సదూతము, ౪ కర్ణికము, ౫ కాకతుండము, ౬ క్షురప్రము, ౭ గోపుచ్ఛము, ౮ అర్ధచంద్రము, ౯ సూచీముఖము, ౧౦ భల్లము.(ధనుర్విద్య చూడుఁడు).

**బాణాసురభూపతిరాజ్యము,శోణితపురరాజ్యము, దేవీకోటరాజ్యము**— సంయుక్తరాష్ట్రములలోని కుమాన్ డివిజనునకుఁ జేరి కేదారగంగ యనఁబడు మందాకినీనదీతీరమున ఉషామఠము (ఇప్పటి ఉఖీమఠ్) నుండి ఆఱుమైళ్ళ దూరముననుు గుప్తకాశీక్షేత్రమునకుఁ గొంతదూరముననుు శోణితపుర ముండినదని పోల్పఁబడినది. అచటిపర్వతముపైఁగల పాడుపడిన కోటజాగాను బాణాసురునిదుర్గ మని చూపుచున్నారు. ఈప్రాంతసీమ యంతయుఁ దొల్లింట ఉమావన మనంబరఁగునరణ్యమఁట. శోణితపుర మాదికాలమున విశాలమై, అచటికిఁ గొంతదూరమునఁ గల గుప్తకాశీవఱకు వ్యాపించియుండెనఁట. గుప్తకాశీశివలింగము బాణాసురమహీపాలుని ప్రతిష్ఠగ హరివంశము ౧౭౪ యందుఁ జెప్పఁబడినది. బాణాసురరాజపుత్రికయగు "ఉషాదేవి అనిరుద్ధునిభార్యయాయెను. ఈమెయే తనపేర నిర్మించిన ఉషామఠము, నేఁటికి ఉఖీమఠమై బరఁగుచున్నదఁట. ఉమావనప్రశంస హేమకోశము, త్రికాండశేషనిఘంటువులయందుఁ గానవగును. పెద్దకుమార్తె చంపావతీదేవి సిద్ధురాలు. చంపావతీపుర మామె యాశ్రయపుతావు.

బాణాసురున కింకను ఇప్పటి కుమాన్‌రిడిజనునందుఁలోహావతికడ 'సూయి' యనంబడుగ్రామముకడ వేఱొకదుర్గ ముండెడిది. ఇది నేఁటికిని ఆయనపేరఁ బరఁగుచు పాడగుచున్న స్థితియందున్నది. సూయిగ్రామముకడనున్న అంబాదేవీదేవాలయము నాటిదేయందురు.పెక్కండ్రు పరిశోధకులిది శోణితపురమని భ్రమపడిరి కాని,యాతనిరాజ్య మింతదనుక నుండెడి దని తోఁచెడిని.

మత్స్యపురాణము ౧౮౬ యందు బాణుని నివాసము త్రిపురమని చెప్పఁబడినది. ఇది పైన వివరింపఁబడిన ఉమావనమందు కొండపై నున్న దుర్గమునకు పేరైయుండనోపు. కొందఱు పరిశీలకులు తొల్లింటి త్రిపుర మిప్పుడు తివోరనఁ బరఁగుచుంట, నర్మదానదీతీరమున (పునర్భవాతీరము) దినాజపూరునకుదక్షిణమున పదునాల్గుమైళ్ళలో పాడుపడినదుర్గమా యని యనుమానించుచుందురు. అచటివారును దానిని 'బాణరాజాకా ఘడ్' అని వాడుచుండుట గానవగుచుండును. దీనింగూర్చి యీదుర్గమందే గల యొక శిలాశాసనము చక్కఁగా పరిశీలించుటతో దానినిర్మాణ మొక గౌడరాజునకుఁ జెప్పఁబడియుంటచే నాతనికో లేక వానిసంతతివా రెవ్వరికో బాణరాజను పేరుండి యుండనోపుననియు,

ఇది బాణాసురునికోట కాదనియుఁ దేలుచున్నది. (బాణుఁడు చూడుఁడు.)

**బాణుఁడు**—దానవుఁడు. భూపతి.తండ్రి బలిచక్రవర్తి. శివభక్తుఁడు. ఈతనికుమార్తె ఉష. శ్రీకృష్ణునిపౌత్రుఁడగు అనిరుద్ధుని వలచి వివాహమాడెను.

హిమాలయముపైఇప్పటి గడవాలుసంస్థాన రాజ్యమున బదరీకేదారమున కేగుమార్గమున ఉఖీమఠమునకు కొంతదూరమున పాడైయున్న శోణితపుర మీతనిరాజధాని. ఈతనికి సంయుక్త రాష్ట్రములలోని కుమాన్ డివిజనులో నిప్పుడు చేరియున్న లోహాఘాట్ (వతి)కి కొంచెముదవ్వునఁగల వేఱొకశోణితపురమును, అందొక ఏకశిలాదుర్గమును ఉండెను. అచట నిప్పుడున్న 'సూయి' అనంబడుగ్రామమునకంటియున్న దేవస్థానమునందున్న భగవతీదేవి బాణాసురుని యిలువేల్పని యందురు. ఈయేకశిలాదుర్గముకడ బాణాసురుఁడు శ్రీకృష్ణునితో యుద్ధమొనర్చెనఁట. ఆదుర్గము నిప్పుడు బిసంకట్ గ్రామముకడ కోటలగ్గా యనఁబడుచున్నది. లోహావతీ నదీతీరము. యుద్ధరక్తముజాతి నది నెఱ్ఱబడ జేసిన లోహావతియని నదికి పేరయ్యెను. బాణాసురుని జ్యేష్ఠపుత్రిక సిద్ధురాలయ్యెను. ఆమెపేరు చంపావతి. ఇంకనువసుదేవుని కనిష్ఠసోదరుఁడగు అనీకుని మూఁడవసుతునకు బాణుఁడని పేరు కలదు. కాదంబరియను గ్రంథము రచించిన కవిని బాణుఁడనియు, బాణభట్టనియు నందురు. ఈబాణకవి హర్షచరిత్ర యను గొప్పకావ్యమునుగూడ రచించినవాఁడు. బాణకవి చెప్పక విడిచిపెట్టిన కవిత్వరచనావిశేషములు వేఱుగ లేవని యతిశయోక్తిగ "బాణోచ్ఛిష్ఠం జగత్సర్వమ్" అనియెదరు. (బాణాసురభూపతిరాజ్యము చూడుఁడు.)

**బాణులు లేక బాణవంశనృపతులు**— మైసూరుప్రాంతరాజ్యమును తొల్లింట నేలినభూపతులు.

**బాత్ (Bath) కుర్చీ (Chair)**-క్రీ.వె. 1740 సం॥ ప్రాంతమున ఇంగ్లాండులోని ఇతరనగరము లెవ్వియు నెఱుఁగనిమహావైభవము లండననుభవింపసాఁగెను. లండనునగరమునకు పిదప బాత్ నగరమె నరపాలకాది ధనికులకందఱకు నారోగ్యమొసఁగఁగలతావని తోఁచి, యందఱు నటకేగి వసింపఁదొడఁగిరి.

ఆకాలమున రోడ్లు వేయఁబడక, మార్గములు బుగ్గిగనో బురదగనో యుండి, నడుచుట కష్టతరమైయుండెను. ధనికులు సీడాన్ ఛైర్ (Sedan Chair)అనంబడుచు నెనమండ్రుగురు బోయీలచే కష్టమున మోసికొని పోఁబడెడి కుర్చీయందాసీనులై ప్రయాణమొనర్చుచుండిరి. ఆకుర్చీ దండెలు చాల బరువుగను కూర్చుండుట కష్టతరముగను నుండెను.

ఆకాలమున బాత్ నగరమున వసించుచుండిన జేమ్సు హీత్ (Mr. James Heath) అనునాయన తేలికయు, గట్టియుఁగూడ గల్గి ప్రయాణమున కూర్చుండుటకు సౌఖ్యముగ నుండు నొకవిధమగు కుర్చీని తయారుచేసెను. అది యందఱియామోదముం బడసి, యెక్కువగ వాడుకలోనికి వచ్చి, యందఱిచేతను "బాత్ ఛైరు" అని వాడఁబడసాఁగెను. నేటికి నాపేరుననె ఆమోస్తరుకుర్చీలన్నియు బరఁగుచున్నవి.

**బాదంతిగోత్రము**-(ఆత్రేయగణముచూ.)

**బాదము**— సం. బాదామ, వాతవైరిః, నేత్రోపమఫలః. బాదామము సంస్కృతసమము; బాదాము- ఇది బాదము అనుశబ్దముయొక్క రూపాంతరము. బాదము- ఇది వైకృతము. అనఁగా ప్రాకృతసమమును, సంస్కృత ప్రాకృతభవమును నగుపద మిది.

లా. Amygdalus Communis Prunus amygdalus. ఆంగ్ల Almond.

బాదమునందు పెక్కుజాతులు కలవు. 1 దేశవాళీబాదము, 2 సీమబాదము, 3 ఏనుఁగు బాదము లేక అడవిబాదము, 4 చీనాబాదము.

సాధారణముగా గృహస్థుల పెరళ్ళలో నీదేశవాళీబాదము పెరుఁగును. చక్కఁగా పండినపుడు, తనకుఁ దానే నేల రాలిన పిదప అట్లెంతకాలము నిలువ యుంచినను లోపలి పలుకు చెడక,రుచిని గోల్పోక, అట్లే ఉండును. కాయ కొంకొక్క పలుకే యుండును. కాని నూటనొకట రెండుపలుకులు గూడ నుండుట చూచుచున్నాము.

2. సీమబాదము:— ఈతరగతిలో లెక్కలే నన్ని జాతిభేదములు కలవు. గుండ్రనిజాతికాయ యందు దించుక కోలవాటుపిక్క లుండును. ఇందు చము రధికము.

ఇంకొకజాతి మన కిపుడు బజారులో దొరకు నదే. ఇందు కాగ్జిబాద మనునది శ్రేష్ఠము. దీని పైపెంకులుగట్టివికావు. గట్టిపెంకులుగలజాతిఅధ మపుజాతిగ నెన్నఁబడుచున్నది. మఱియు చిన్న పిక్కలను వ్రేళ్లతోనొక్కిన చితికిపోవు పెంకులు గలజాతిని "పేపర్ పెల్ బాద"మనియెదరు.దీని ధర అధికము. ఇంకను "జార్డన్ బాదము" అను నది గింజ పొడుగుగా నుండును. ఇది పాల స్టైనులో విరివిగా దొరకును. దీనిరుచియును ధరయునుగూడ నధికమే.

ఈ సీమబాదము ఆఫ్ఘనిస్థానము, బెలూచిస్థానము మొదలగు ప్రదేశములలోను ముఖ్యముగా కాబూల్, కాంధార్, హీరట్, కాశ్మీరము మొదలగుస్థలములలోను, హిమాలయాన్తరాయి (మన్య) స్థలములలోను విరివిగా పెరుగును.

రుచి(Taste)-బాదంపప్పుకమ్మదనమును, తీయందనమును, మిశ్రమమైన లలితమగురుచి గలదిగా నుండును.

Effects- ధాతువృద్ధియు, దేహపుష్టియు, బలమును కలుగఁజేసి, స్నాయుదౌర్బల్యమును పోఁగొట్టుట కీబాదముపప్పు పాలతో మిళితముచేసి సేవించుచుందురు. బాదముపప్పు నుండి తీసినచమురు (Almond Oil) మహా వాతము నడంచును. అవయవదౌర్బల్యము పోఁగొట్టును. అకాలమున సుక్కిపోయిన పురుషాంగముపై నీతైలము మర్దించినచో యథారూపముపొందును. దేహదౌర్బల్యముచే సుక్కిన ఉరోజములపై నీతైలము మర్దించినచో, నవియును పూర్వావస్థను పొందును. మూత్రమును పరిశుభ్రపఱచుశక్తి బాదము పప్పునకు కలదు.

బాదమునందున్న పైత్త్యోద్రేకగుణమునకు శర్కరయును, అంజూరపండ్లును, రూమీమస్తకీయును పరిహారములు. (విఱుగుళ్లు). బాదము పిక్కలపైనున్న పెంకుకాల్చినబూడిద దంతరోగముల నివారించును. బాదమువేరునకు విరేచన కారకశక్తి కలదని చెప్పఁబడినది.

చేదుబాదముపలుకులు దృష్టికి బలమొసంగుననియు, నిద్రపట్టించుననియు, స్త్రీల ఋతురక్తమును చక్కఁగ వెడలించుననియు, చర్మరోగముల నివృత్తిచేయుననియు చెప్పఁబడినది.

అడవిబాద మనునది చిన్నకొబ్బరికాయ యంత యుండి, పైడిప్ప గాఢమైనయెఱుపు రంగు గలదిగా నుండును. దీని కాపుకాలము వేసవి. సాధారణముగ నీపండ్లు చెట్టునుండఁగనే పగులును. అందున్న పెద్దతామరగింజలవలె మిక్కిలిగాఢమైననల్లనిరంగుగలగింజలు20మొ॥ 25 వఱకును నేల రాలును. ఈగింజలు పగులఁగొట్టినచో అందున్న పలుకులు భుజింప సర్వాము

గానుండును. ఈగింజలు పగులఁగొట్టకున్నచో నిలువయుంచుకొనఁ దగియుండును. దీని పలుకు లకు "నీరుడివిత్తు లని" కూడ వాడుక కలదు. ఈతరగతిపప్పునుండి తీసిననూనెకు కుష్ఠరోగని వారకశక్తి కలదనియు, నితర దారుణచర్మరోగ ములపై, నేత్రరోగములపై చక్కఁగ పనిచేయఁ గల దనియుఁ జెప్పఁబడియున్నది. ఈపలుకుల యందు వికారముగలిగించుగుణమును, తలది మ్మెక్కించుశక్తియుఁ గలదందురు. ఈపలుకులు చేఁపలెంతో ఆప్యాయముగ భుజించును.

ఇక మిగిలినది "చీనాబాదము లేక "చెనాబాదము." ఈతరగతి వ్యవసాయము తొల్లి చీనాదేశమున ప్రారంభింపఁబడెను. ఇది పెసరచేనువలె భూమిపైఁ బ్రాఁకును. భూమిలోపల తనవేరునంటియే గుత్తు గుత్తులుగ కాయలు కాయుచుండును. ఒక్కమొక్క వేరునంటి కాచిన కాయలు సుమారు రొకసేరు వఱకును లభించును. ప్రతికాయకును సెనగ గింజలవలె సుమారు 4 మొ॥ 6 వఱకును గింజ లుండును. ప్రతిగింజకునుగల పైపొరదీసి భుజించి నచో నది బాదముపప్పురుచి ననుకరించును. చైనాదేశమునుండి వచ్చినపంట యగుటను, దీనికి బాదముపప్పురుచి యుండుటను, దీ చైనాబాదము, లేక చీనీబాదము అనియు, వేరునంటిసెనగగింజలవలె చిన్న చిన్న గింజలుగా కాచుటవలన వేరుసెనగయనియు, భూతలమున ఫలించి సెనగగింజలఁ బోలినదగుట భూసెనగ లేక బూశనగ యనియు వాడుకలోనికి వచ్చినది.

ఈ నాల్గుతరగతులకును పైత్యము నభివృద్ధి చేయుగుణమును, వదలిపెట్టలేని రుచియు సమానధర్మములై యయ్యును, ఈ చీనాబాదము నందు, అనఁగా వేరుసెనగయందు మాత్రము పైత్యాధిక్యము కలిగించుగుణము అత్యధికమై యున్నది.

ఇపుడిపుడు కొందఱు పచ్చివేరుసెనగపప్పు (చీనా బాదముపప్పు) మితముగ భుజించి, పాలుసేవించు నాహారనియమము ననుసరించు చున్నారు.

**బాదామీ (తొల్లింటి వాతాపిపురము)**- ఇల్వలవాతాపు లను రాక్షసప్రముఖుల పేర్లు ఎల్ల రెఱింగినవే. వీ రగస్త్యమహర్షి చే నిహతు లైనవారు. వాతాపి ఇట వసించువాఁడఁట. ఇచటి కాఱుమైళ్ళదూరమున నేర్పడిన పరేష్ గాడనుగ్రామముకడ నున్న శివలింగమును, బాణశాంకరీదేవీదేవస్థానమును వాతాపి (రక్క సునినాఁటివి) పూజించుచుండినవనియు అచటివా రనెదరు. అక్కాలమున నీప్రాంత మంతయు నరణ్యముగ నాతనిదిగ నుండె నఁట.

పిదప మహారాష్ట్రభూపతి పులికేశిమహా రాజు వాతాపీపురనిర్మాత యనియు, అది నానాటికి మాఱుచు బాదామియాయెననియు, పరిశీలకులనుచున్నారు. ఇక్కాలమున బాదామీ బొంబై రాజధానియందు బిజాపూరు మండ లమునం దున్నది. ఇచట చూడఁదగినవి జైనులనాటిగుహలు. అందు మూఁడు గుహలు హిందువుల దేవస్థానములుగ నున్నవి. ఒకదాని యందు నరసింహ (విష్ణుదేవుని) విగ్రహము పూజింపఁ బడుచున్నది. కొన్నింటి పనితనము, స్తంభములందలి విగ్రహచిత్రము చక్కనిపని తనమును బ్రదర్శించుచు, హిందువుల రచన యని తెలియఁజేయుచున్నది. ఒకగుహయందలి శాసనము క్రీ. వె. ౫౭౯ సంవత్సరమును సూచిం చెడిని. ఇవి కొండపైనున్న గుహలు. పెద్దదగు

యగు గుహ ౩౦ అడుగుల వెడల్పును, ౧౯ అడుగుల లోఁతును గలది గలదు.

**బాదర్యాయణ గోత్రము**-(ఆత్రేయ గణము చూడుఁడు.)

**బాధ కొకకాలము భాగ్యాన కింకొక కాలము**—(ఆంధ్రలోకోక్తి.)

**బాధ కొన్నాళ్లు భాగ్యం కొన్నాళ్లు**—(ఆంధ్ర లోకోక్తి.)

**బాధయందు నులుచుకొనుట** — అకాత్తుగా బాధకల్గునేని నులుచుకొనుట కొంత అప్రయత్నముగను, కొంత ప్రయత్నముగను గూడ జరిగెడిని. అకాత్తుగా సంభవించిన బాధకు విస్మయవిషాదములు పెనఁగొన, చేయుటకేమియుఁ దోచక మనస్సు నిలువక నులుచుకొందుము. తెలిసియు నాబాధనుండి తప్పించుకొనుటకు సాధనముగ బిగించుటవలె నులుచుకొందుము.

ప్రతిక్రియ తెలియమి చేయుపనిఇది. తెల్సియునేని దానినే యాచరింతుము.

**బాథర్స్టు సెటిల్మెంటు**—ఆఫ్రికా దేశమున పశ్చిమఆఫ్రికా యనంబడు దేశమునఁ గల బ్రిటీషుసెటిల్మెంటు గాంబియానదీముఖద్వారముకడ నున్నది. (ఆఫ్రికాఖండము, పశ్చిమఆఫ్రికా దేశము చూడుఁడు).

**బానిసనృపవంశము** (Slave dynasty)— వీరు మహమ్మద్ఘోరీకిఁ బిదప రాజ్యమునకు వచ్చిరి. క్రీ. వె. ౧౨౦౬ మొదలు ౧౨౯౬ వఱకు మహమ్మద్ గోరీ ఏలినరాజ్యమును పాలించిరి. అనఁగా నెనుబదివత్సరములు. కుతుబుద్దీన్, ఇతనియల్లుఁడగు అల్తముష్, అతనికూతురగు సుల్తానారిజయా, ఆమెకుమారుఁడగు నాజరుద్దీన్ బల్బన్ అనువార లీవంశమున ముఖ్యులు. వీరికి బానిసప్రభువు లని (Slave Kings) అనునామము ప్రసిద్ధమయ్యెను. (మహమ్మదుఘోరీ చూడుఁడు).

**బాప్టిస్టుక్రైస్తవమతశాఖ**-ఆదిని ప్రొటెస్టాంటువారినుండి చీలిన అంతశ్శాఖగనుండినది. పిదప స్వతంత్రత నందినది. వీరు బాప్టిజము బాలుర కీయఁదగదందురు. వారికి జ్ఞానము కల్గి భక్తి కుదిరినపిదప నే క్రైస్తవమతదీక్ష నీయవలసియుండు నందురు.

**బాబరు చక్రవర్తి**— ఈతఁడు మొదట మొగలైచక్రవర్తి. పేరు జహరుద్దీనుమహమ్మదు. బాబ రనుపదము బిరుదము. పానిపట్టుయుద్ధమున జయించి భరతదేశమున ప్రభుత్వము గైకొనెను. ఇతఁడు తైమూరుసంతతివాఁ డనియందురు. తండ్రి ఖాన్ ఆఫ్ ఫెర్ఘానాపదవియందుండినవాఁడు. క్రీ. వె. ౧౫౨౬ లో ఉత్తర హిందూస్థానమున సింహాసనమెక్కెను. కుమారుఁడు హుమయూన్‌చక్రవర్తి. బాబరుగోరీ సమర్ ఖండునం దున్నది.

**బాబిలోనియానగరము** — (బేబిలన్ చూడుఁడు.)

**బాబిలోనియాశాసనము**—(Babylonian Inscription)దీనికాలము వివరింపఁబడకున్నను, వివరింపఁబడినసంగతులనుండి తేలుచున్నది. ఇంగ్లాండుదేశమున లండనునగరమునందలి బ్రిటిషుమ్యూజియమునం దుంపఁబడి క్రీ. వె. 1905 లో ఇంగ్లీషుభాషలోని కనువదింపఁబడినది.

“ఏడవసంవత్సరమునందలి శివాన్మాసపు ఇరువదియాఱవదినమున పగలు రాత్రిగ మాఱి, ఆకాశమధ్యమునం దంతరాళమున నగ్ని ప్రజ్వలించినది” అనియుండెను. దీనిభావ మాదినమున (బహుశః అపరాహ్ణకాలమున) సంపూర్ణ సూర్యగ్రహణముసంభవించి,చీఁకటిగల్గుటయు, కొరోనాదృశ్యమగుటయు ఆఏడవసంవత్సరమన క్రీ.ము.౧౦౬౨ సంవత్సరమనియు నైయున్నది.

(ఎస్ట్రొనామీ శాస్త్రము, గ్రహణములు, కొరొనా చూడుఁడు.)

**బాబిలోనియా సింహము (జ్ఞాపకచిహ్నము)**- బాబిలోనియానగరముండిన

తావు పరిసరములం దొక యున్నతప్రదేశమున నొకవేదికపై బోర్లపరుండియున్న యొక మనుష్యునివలెను, ఆతనిపై నిలిచియుండు నొక సింహమువలెను రా జ్ఞాపకచిహ్నముగఁ గాఁబోలు గొప్పవిగ్రహము కలదు. ఇది శిలాతలము. అచటనే అట్లు మరల్చి మలిచిరని కొందఱు పరిశీలకు లనెదరు.

కొందఱు పరిశీలకు లిది చరిత్రాత్మకము గాదనియు, అక్కాలమున నీప్రాంతమున నధిక వ్యాప్తిని గల్గియుండిన సింహములబాధను సూచించుటకు రాతి నిటుల మలచిరనియు నని తలంచుచున్నారు. ఇంకఁ గొంద రిది డానియల్ జ్ఞాపకచిహ్నమని తలంచుచున్నారు.

**బాభ్రవ్యగోత్రము**-(కుశికగణము చూ.)

**బావిరు (బవేరు)**—బేబిలన్. (బాబిలోనియా చూడుఁడు.)

**బార్ (Bar)**— Bar of Sand or Sand Bank. నదీముఖద్వారమున నుండు ఇసుక గట్టు. ఇది అడ్డముగా నుండునది. (Rivers నదులు చూ.)

**బారన్ గౌరవబిరుదము**--ఇది బ్రిటిష్ బిరుదము. పీరేజిబిరుదము లైదింటిలో మొదటి చిన్న బిరుదము. ఇది యాదిని బ్రిటిష్‌సీమలందు ప్రభుసన్మానవస్తులకీయఁబడుచుండెడిది. డర్హాన్ బిషపుగారికిఁగూడనిట్టిబారన్ను ఉండెడివారఁట. వంశపరంపరగా నీ బిరుదము వహించువారికిక్కాలమున "బేరనెట్"అని వాడుచున్నారు. వీరికి సర్ బిరుదము పేరునకుముందుగను, పేరునకు పిదప "Bart" అని గాని, Bt. అని గాని వ్రాయఁబడుచుండును. ఇచట పేరనిన క్రిష్టియన్ నామమని క్రైస్తవులకుఁగా నెఱుంగునది.

**బారాతావా (నర్మదాసంగమము)**—భోపాల్ రాజ్యమునకును బ్రిటిష్‌ఇండియాలోనిదగు హోషంగాబాద్ పురమునకును నడుము నర్మదానది ప్రవహించుతావున బారాతావా నది ఒకశివాలయమున కెదురుగ సంగమించుపవిత్రస్థలము కలదు. ఇట్లు దీనిని బిందర్భాన్ అని వాడుచున్నారు. ఏటేట కార్తికశుద్ధమున నిట యాత్ర జరగుచున్నది.

**బారానగర్ (ఆనందపురము)**--దీనికి "హాటకము" అని పేరుండెను. (చమత్కారపురము చూడుఁడు).

**బారామూలాపురము**—తొల్లింటి వరాహమూలపురము (కాశ్మీరదేశము చూడుఁడు.)

**బారింకచెట్టు**—ఇది తెల్లబారింక, నల్లబారింక, ఎఱ్ఱబారింక యని మూఁడు భేదములు గలది. అందు తెల్లబారింక శ్రేష్ఠమందురు. ఎఱ్ఱబారింక చాల అరుదు. లా Ficus Benjamina.

బారింకచెక్క కషాయముతో నేత్రములు కడిగించిన నేత్రరోగములును, నోట పుక్కిలించిన దంతరోగములును, చెవిలోఁబోసిన కర్ణరోగములును, లోనికిచ్చిన మూత్రనిరోధరోగమును, పైనిపూసిన చర్మరోగములును, లోనికి బైటకుంగూడ ననుదిన ముపయోగించుచుండిన కుష్ఠరోగమును నివారణమగునని చెప్పఁబడినది.

**బారీదువంశనృపులు**—తొల్లింట బహామనీరాజ్యము క్రీ. శె. ౧౪౮౯ లో ఐదుచిన్న రాజ్యములుగ చీలుటతో నేర్పడినరాజ్యములలో నొకటి యగు బిదరు రాజ్యము నేలిన ముసల్మాను నృపులు. వీరలలో పేర్కొనఁదగిన వాఁడు అహమద్షా.

**బారోగ్రాఫ్ (Barograph)** — ఫ్రెంచి భాషాజన్యపదము. వాతావరణమందలి (Atmosphere) Pressure ను కొలిచి ముందురాఁగలవర్షము మొదలగు కాలపరిస్థితుల నెఱుంగఁజేయు పరికరమునకు బారోగ్రాఫ్

అనియు, ఏరియల్బారోమీటరు (Arieroid barometer) అనియు వాడెదరు.

ఈవిద్యకు (కలకు) బారోగ్రాఫీ యనిపేరు.

**బారోథెర్మోగ్రాఫీ** (Barothermography)--జర్మనుపదసంబంధము. వాతావరణము (Atmosphere) నందలి వేడిని, Pressure ను, వాట్లమార్పులను Charts పై Record చేసి గుర్తించుపరికరమునకు బారోథెర్మోగ్రాఫ్ అనియు, మఱియు ఈవిధానవిద్యకు బారోథెర్మోగ్రాఫీ అనియు పేరు.

**బారోమీటరు**(Barometer)— దీనిని పాశ్చాత్యులు "Weather glass" అనియు నందురు. ఇది గాలియొక్కబరువు ననుసరించి రాఁగలపరిస్థితులఁ దెల్పు పరికరయంత్రము. ఇందువలన రాఁగలవర్షము, గాలివాన మొదలగుకాలవిజ్ఞానము నెఱుంగ వీలగుచుండును. ఇంతియె గాక సముద్రపునీటిమట్టముపై నింతింత ఎత్తుననుండు గాలి, ఇంతింతభార ముండునని లెక్క గలదు. గాన పర్వతములు మొదలగు ఎత్తగుప్రదేశములపై నెక్కి, అచటి వాతావరణముయొక్కభారము నీబారోమీటరు మూలమున నెఱిఁగి,ఆప్రదేశము సముద్రపుమట్టముపై నెంతయెత్తుగ నున్నదో తెలియ వీలగుచున్నది. ఇది ఆయాప్రదేశములనిమ్నోన్నతల నెఱుంగఁ జేయుయంత్రము క్రీ. వె. ౧౬౪౩ సంవత్సరమున ఫ్లారిన్సు దేశస్థుఁడగు Evangelisa Torricelli అనువారు కనిపెట్టిరి. Galilio Pascal అనువారు తొలుతనభివృద్ధిపఱచిరఁట. ౧౬౪౫ పిదప ననేకులు దీనిని మార్పు జెందించుచు నభివృద్ధిపఱచి రనియు చెప్పఁబడినది. Wheel Barometer యంత్రమును ౧౬౬౫ లో కనిపెట్టిరఁట. Pendant Barometer ౧౬౯౫ లో కనిపెట్టఁ బడినది. Marine Barometer క్రీ. వె. ౧౭౦౦లో కనిపెట్టఁబడినది. Prof. Guyot అనువారు (Princeton University పండితుఁడు) పర్వతప్రదేశముల నిమ్నోన్నతములను లెక్కించు విధము, దీని నుపయోగించు విధము తెల్పి బహిరంగ పఱచినవాఁడని చెప్పఁబడినది. ఇది వాతావరణపుటొత్తిడి నెఱిఁగించునొకయంత్రపరికరము. లఱచుగ ముప్పదియొకఅంగుళము పొడవుగలగాజుగొట్టమున కొకవైపున పాదరసముంచుకొను నిలయమును గల్గి యుండును. గొట్టముయొక్క రెండవవైపుకొన వాతావరణపుగాలి యంటునట్లు తెఱచి యుంట గాలిలోని పాదరసమున కంటియుండెడిని. (ఐసోబార్ చూడుఁడు. వాతావరణపుటొత్తిడి చూడుఁడు.)

గొట్టములోని పాదరసమునకు గాలితగులుట యన వాతావరణపుటొత్తిడి సహితమైన గాలి తగులుటయె యగునుగాన, ఆఒత్తిడి అధికమగుతఱి గొట్టమందలి పాదరసమును పైకెత్తుటఁగాని అల్పమైనతఱి పాదరసమును క్రిందికి దిగఁజేయుటఁగాని జేయుచుండెడిని. ఇది దానికిఁగల శక్తిగ నెఱుంగుదుము గాక. బారోమీటరు Fall అనినను, Raise అనినను ఇదియేభావము. ఇదియె బారోమీటరు వాతావరణపుటొత్తిడి కొలుచుటయై యున్నది.

ఈకొలతవిధానమునే గొట్టమునందు గీతలు గీచి, వాతావరణపుటొత్తిడినుండి పైకిలేచుటగాని, క్రిందికిదిగ్గుటగాని కొలువఁగల సావకాశము నేర్పఱచి, అట్లు కొలుచుచు ప్రధాన కార్యస్థానమునకు తంత్రులమూలమునఁ దెలియపఱచుచుండుటకు దేశమంతటను అరస్థానములందెల్ల Meteorological Stations నేర్పఱచియున్నారు. అచటి యుద్యోగులు దినమునకు రెండుమూఁడుసారులు వీటినితంతిమూలమునఁ దెల్పుచుందురు. ఈతంత్రీవార్తలన్నియు ప్రధానకార్యస్థానముకుఁ జేర, అచట నవి

ఇసోబారులుగ లిఖింపఁబడుచుండును. ఇప్పుడు భరతదేశపు ప్రధానకార్యస్థానము పూనానగరమునం దున్నది.

వాతావరణపుటొత్తిడి గాలులువీచుదిక్కులను దెల్పును. గాలులు వర్షములఁ గల్గించుట కాకర ములు. (ఫోరుకేస్టు-భవిష్యత్సూచనలు చూ.)

ఇంక నీబారోమీటరునుగూర్చిన ఇతరసంగతులు విచారింతము. సర్వసాధారణముగ బారోమీటరునందు గోచరించు నెమ్మదియైనమార్పు (Slow change)నిశ్చితపరిస్థితులు (Settled weather)ను, హఠాత్తుగఁ గల్గిన మార్పు (Sudden change) అనిశ్చితకాలపరిస్థితులను దెల్పును. పైకి పాదరసము లేచుచుంట మంచి కాలపరిస్థితిని (Fine weather), క్రిందికి దిగుట, తడి, తేమ (Wet weather) పరిస్థితుల నెఱిఁగించును.

ఈసందర్భమున నింకొక్కసంగతి.ఎఱుంగఁదగినది కలదు. Warm air (వేఁడిగాలి)కన్న Cold air శీతలవాయువును Moist air (తేమగల్గిన గాలి)కన్న పొడిగాలియు, భారముగ దూఁగును. కాననె బారోమీటరు అధికపుకొలత Dry నుండియు, అధమపుకొలత Damp warm air నుండియు పరిగణించుచున్నారు.

కాని, వాతావరణశాస్త్రమునం దీవిజ్ఞానము నిశ్చయమని చెప్పవీలులేదనియు, వీటి కతాత్తుగా మార్పులు గలుగ, పెక్కుమార్గములు కలవనియు, వీటిని భవిష్యత్కాల సూచనలుగ మాత్రము గైకొనఁదగు ననియు వివరింపఁబడుట Indications అనంబడుచున్నవి. బారోమీటరుపైఁగల గురుతులు.

31" very dry అనియు, 30⅔" settled అనియు,30⅓" Fine అనియు, 30" variable అనియు, 29⅔" Rain and wind అనియు, 29⅓" much rain అనియు, 29" Storm అనియు నెయున్నవి.

కాన బారోమీటరురాఁగలకాలపువర్షము, గాలి, శీతోష్ణములు, వాతావరణపు టొత్తిడి నుండి సూచించునని తేలుచున్నది.

**బారోమెట్రోగ్రాఫీ** (Barometrography)—జర్మనుభాషయందుBaros = బరువు (గాలియనిభావము) Metrou = కొలత.ఇది గాలియొక్క ఒత్తిడిని కొలిచి ముందు రాఁగల కాలలక్షణసూచనల నెఱుంగుట. ఇట్టి యంత్రమునకు Barometer అనియెదరు. దానిం దెలుపు కల.

Barometer లు రెండురకములు కలవు. Mercury (పాదరసము) Barometer అనియు, Aneroid Barometer అనియు.

1 Mercury Barometer:- ఇది ఇటలీదేశస్థుఁడగు Evangelista Torricelli అను పండితునిచే క్రీ. వె. 1643 సం. కనిపెట్టఁబడినది. ఇందుఁగల నిలువుగొట్టమున పాదరసము పోసి,పైకొననుమూసి నిర్బంధింతురు. క్రిందికొన నొకపాదరసపుబుడ్డి లోనికి తెఱచియుండునట్లు ముంచి యుంచెదరు. పాదరసమునకుపైగాగొట్టమున గాలి యుండనేరదు గాన, గాలియొక్క ఒత్తిడిబరువే పని చేయును. అనఁగా గాలియందలి ఒత్తిడిబరువు ననుసరించి లేచుట గాని, తగ్గుటగాని జరగుచుండును. ఇందువల్ల పాదరసము వేఁడివలనపైకిలేచుతఱి స్వచ్ఛమగు కాలమనియు, తగ్గి క్రిందికి దిగిన వర్షముగాని తుపానుగాని మొదలగునవి రానున్నవనియు తెలిసెడిని.

2. Aneroid Barometer. ఇందు చదునైన (Flat) Surface గల Crinkled metal గది యుండును. అందలిగాలి కొంతతీసివేయబడుట గాలియందలిPressure పెమూతత

నైపు లోనికి పైకి దుముకుచు కదలెడిని. ఆకదలిక ఒక Pointer కు తగిలి, ఒక ఫలక ముపై ఆడుచుండును. Barometer లోని పాదరసము లేచుటచున వర్షముండ దనియు, తగుట వర్షసూచకమనియు తెలియనగును.

ఇంకను ఇట్టి గాలిబత్తికి లేచుట దిగుట మూలముగ మనముండుపర్దేశముల యెత్తును గూడ నెఱుఁగనగును. కొండలపై కెక్కుచో ఎంతయెత్తునను న్నామో తెలియుఁగనగుచున్నది. ఈశాస్త్రమునకు Barometography అని పేరు.

**బార్తోలోమ్యూ బార్ట్లీ** (Bartholomew Bartly) —హిబ్రూ పదము. ప్రియ మిత్రుని సుతుఁడని యర్థము. ఆగష్టు 24 తేదీని పూజింపఁబడెడి St. Bartholomew ఋషి పేరు. ఇందు ముద్దుపేరు Bart అని పురుష నామము. (క్రైస్తవ పురుషనామములు చూ.)

**బార్లిధాన్యము**— (యవధాన్యపు చెట్టు చూడుఁడు.)

**బార్హ్యబ్యాగోత్రము** —(ఔతథ్య ఉప గణము చూడుఁడు.)

**బార్సోప్ (Bar Soap) పరిశ్రమ**— కొవ్వు (Tallow) 50 సేర్లు, వేరుసెనగనూనె 20 సేర్లు, గుగ్గిలము (Rosin) 30 సేర్లు, కాస్టిక్ సోడా 36o Be.50 సేర్లు. పదిసేర్ల కాస్టిక్ సోడా 10 సేర్లనీటిలో కలిపి అందులో గుగ్గిలము వేసి సబ్బువలె నగువఱకు నుంచవలయును. సబ్బువలె నైనతరువాత కొవ్వు (Tallow)ను వేరు సెనగనూనెయు కలిపివేయునది. మిగిలిన Caustic Soda గూడ దానిలో పడవైచి కళపెళ మరగించునది. తరువాత దానిని Crutching Pan లోపోసి కావలసిన పరిమాణమునకు Bars తయారుచేయునది.

ఇంతకన్న చౌకరకపు Bar Soap కొంచెము Selicate అందులోఁజేర్చి కలియఁబెట్టునది. జాగ్రత్తగ కలియఁబెట్టనిచో సిలికేటు భారమయినపదార్థమగుటచే అడుగున గడ్డకట్టుకొని పోవును. Selicate వేసినయెడల నూటికి 10 వంతులు Caustic Soda అదనముగా వేయవలయును. Soapstone పొడినిగాని, China Clay గాని కలుపుదురు. అట్టిసబ్బు బరువుగాను కాంతిహీనముగాను ఉండును.

**బార్హ గోత్రము** — (జమదగ్నివత్సఉప గణము చూడుఁడు.)

**బార్హద్రథులు లేక బార్హద్రథక్షత్రియ ప్రభువులు**— వీరు చంద్రవంశపురాజులు. బృహద్రథునినుంతివారు గాన బార్హద్రథులనఁబడిరి. బృహద్రథుఁడు ఉపరిచరవసువు కుమారుఁడు. వీరు మగధరాజ్యమేలినవారు.

౧ జరాసంధుఁడు, ౨ సహదేవుఁడు 3 మార్జాలి, ౪ శ్రుతశ్రవుఁడు, ౫ ఐతాయువు, ౬ నిరమిత్రుఁడు, ౭ సుక్షత్రుఁడు, ౮ బృహత్సేనుఁడు, ౯ కర్మజిత్తు, ౧౦ శ్రుతంజయుఁడు, ౧౧ విప్రమహారాజు, ౧౨ శుచి, ౧3 క్షేముఁడు, ౧౪ సువ్రతుఁడు, ౧౫ ధర్మసూత్రుఁడు, ౧౬ సముఁడు, ౧౭ దృఢసేనుఁడు, ౧౮ సుమతి, ౧౯ సుబలుఁడు, ౨౦ సునీథుఁడు, ౨౧ సత్యజిత్తు, ౨౨ విశ్వజిత్తు, ౨3 పురంజయుఁడు లేక రిపుంజయుఁడు.

పురంజయుఁడు మంత్రిచే జంపఁబడినవాఁడు. అప్పటికి కలియుగమున వేయిసంవత్సరము లాయెనని చెప్పఁబడినది.

# బార్హద్రథులు — మగధరాజ వంశావళి.

అత్రిసంతతి. చంద్రవంశము - పురూరవ చక్రవర్తి - నహుషమహారాజు
పూరుమహారాజు - హస్తిమహారాజు (హస్తినాపురనిర్మాత.)






పురంజయమంత్రి శునకుఁడు, పురంజయుని మాయచేఁజంపి తనపుత్త్రుండగు ప్రద్యోతునునకు మగధరాజ్యము నిచ్చెను. ఇక్కాలమునకుఁ గలియుగమున వేయి సం॥రము లాయెను.

**బార్హదిషులు**—బృహదిషునిసంతతివారు. చంద్రవంశ క్షత్త్రియులు. పూరుసంతతి. అజమీఢునికుమారుఁడు బృహదిషుఁడు. బార్హదిషులలో కడపటినరపతి భల్లాదుఁడు.

**బార్హస్పత్యమానము**— బృహస్పతి (గురుఁడు) భూమినిజుట్టి తిరుగున ట్లగపడుచుండు రీతింబట్టి కాలమును లెక్కించుట బార్హస్పత్యమానము. ఇది వింధ్యపర్వతము మొదలు సమస్తోత్తరదేశములందు పరిగణింపఁబడుచున్నది. (చాంద్రమానము, సౌరమానము చూడుఁడు.) నర్మదానది కుత్తరమునం దిది ప్రారంభమగును.

బార్హస్పత్యమానమున కితరమానములతో కొన్ని భేదములు కలవు. ప్రభవాది షష్టిసంవత్సరములే బార్హస్పత్య చాంద్రమానములు. రెండును వాడుచున్నను, బార్హస్పత్యమానమాసము పౌర్ణమి వెళ్ళిన పాడ్యమితో ప్రారంభమై పౌర్ణమితో అంతమగును. సంవత్సర పరిగణము నందు ౧౪ సం. లు ముందుగ నడుచును.

ఇంక రెండు మాసములందు అయనములలో కేవిధముగ నపాటింపఁబడుచున్నవి.మాసములు చైత్రాదిఫాల్గుణాంతముగనె రెండుమాసములు వాడఁబడుచున్నను, చాంద్రమానమున శుద్ధపాడ్యమి మొదలు అమావాస్యతో నంతమగును. బార్హస్పత్యమానమున బహుళపాడ్యమి నుండి ప్రారంభమై పౌర్ణమితో నెల యంతమగును. అనఁగా ప్రతి బార్హస్పత్యమాసము నందునను తొలుతకృష్ణపక్షమును, తరువాత శుక్లపక్షమును నడుచుచుండును. (మాసములు చూ.)

అనఁగా మాసాంతమున వచ్చు పౌర్ణమి ఆమాసమందే చేరును. మాసాంతపుపౌర్ణమి నాటి నక్షత్రముపేరనే ఆమాసమును దనరెడిని. చాంద్రమానపు ప్రభవ సంవత్సరము బార్హస్పత్యమానపు విక్రమసంవత్సరముగ పరిగణింపఁబడెడిని. ఇటుల బార్హస్పత్యమానము ౧౪ వత్సరములు ముందుగ నడుచును.

# బార్హదిషుల (బృహదిషుని) వంశావళి.

అత్రిసంతతి - చంద్రవంశము - పురూరవచక్రవర్తి - నహుషమహారాజు -
పూరుమహారాజు - హస్తిమహారాజు సంతతి.

హస్తిమహారాజు
|
అజామీఢుఁడు
|
బృహదిషుఁడు (బృహదిషునినుండి వీరిసంతతివారు బార్హదిషు లనంబడిరి.)
నీలుఁడు (ద్రుపదమహారాజు వంశావళి)
ఋక్షుఁడు (కురుపాండవ వంశావళి)

బృహదిషుఁడు
|
భల్లాదుఁడు (ఈతనికి బృహద్ధనువని కూడ పేరు.)
|
బృహత్కర్ముఁడు (బృహత్కాయుఁడు)
|
జయద్రథుఁడు
|
విశ్వజిత్తు
|
సేనజితు
|
రుచిరాస్యుఁడు, దృఢహనువు, కాస్యుఁడు, వత్సుఁడు

రుచిరాస్యుఁడు
|
ప్రాజ్ఞుఁడు
|
పృథుసేనుఁడు
|
పారుఁడు
|
నీపుఁడు (ఇతనికి నూర్వురు సుతులు. అందు జ్యేష్ఠుఁడు సమరుఁడు-కంపిల్యాధిపతి.)
|
సమరుఁడు (కంపిల్యాధిపతి.)
|
సదస్యుఁడు, సుపారుఁడు, పారుఁడు

పారుఁడు
|
పృథువు
|
సుకృతి

**బాలకల్వాటోపి** దీనికి సరియగు పేరు "Balaclava Cap"అనియై ఉన్నది. సవాస్త పూల్ సైన్యస్థానమునకు నైరృతిదిశగా నెన్మిది మైళ్ళదూరమున బ్లాక్సీ సరస్సీరమున రేవుస్థలమగు బాలక్లావాపురమున తొలుత చేయఁబడుట పేరంది, చలికాలమున సైన్యములకు వాడఁబడుటకు నిర్ణయింపఁబడిన ఉన్నిటోపీ. చక్కఁగా విప్పిన నుదురునందలి కొంతభాగమును ముక్కుక్రిందనుండి మెడదనుక కప్పివెచ్చగ నుండును. ముడిచిన టోపీవలె నగును.

**బాలకి గోత్రము**— (ఉపమన్యుగణము చూడుఁడు.)

**బాలక్లావాటోపి**-(బాలకల్వాటోపీచూ.)

**బాలనాయకము బహునాయకముం బోలినదియె** — (ఆంధ్రలోకోక్తి.)

**బాలపాపచిహ్నము**— ఇంగ్లి. Convulsions of children. బాలపాపచిన్నెలం దురు. ఇది రెండుసంవత్సములలోపు బాలురకు నరములబలహీనత, వాతప్రకోప శ్లేష్మప్రకోపములవలన సంభవించు.నపాయకరమగుజబ్బు.

**బాలవత్స**--ద్యుమత్సేనునిభార్య. కుమారుఁడు సత్యవంతుఁడు.

**బాలవైద్యము** —(కుమారతంత్రి బాలవైద్యము చూడుఁడు.)

**బాలసరస్వతి**-— నన్నయ భట్టారకుని శిష్యుఁడు. రాజమహేంద్రవర నివాసియని కొందరు తలంచుచున్నారు. నన్నయభట్టీయ వ్యాకరణమునకు వ్యాఖ్య వ్రాసినవాఁడు. దీనికి "బాలసరస్వతీయ"మని పేరు.

**బాలస్య ప్రదీపకలికాక్రీడాయైవ నగరదాహరితిన్యాయము**— పిల్లవానిచేతిదీపముతో వాఁడాడుకొనినయాట నగరమునంతను కాల్చివేసిన ట్లని యర్థము.

బాలుఁడు దీపముతో నాడుకొనిన యాట క్రమముగ నగర మంతయుఁ గాల్చునంతటి యపాయకర మాయెననుట దీని భావము.

**బాలాసుందరీదేవీక్షేత్రము** — నైనైటాల్ జిల్లా, కాత్ గోడంస్టేషనునుండి, కొంతదూరమునఁగల కాశీపూ రను పట్టణమున కాగ్నేయదిశగా మూఁడుమైళ్ళదూరమునఁ గల యీ దేవళము సుప్రసిద్ధమైనది. ఇట చైత్రశుద్ధ పాడ్యమినుండి గొప్పయాత్రయు, ఉత్సవములు జరిగి, శుద్ధదశమిదినమున కాశీపూరుబజారు లోనికిం జేరి, అట గొప్పవర్తకపుసంతె ప్రారంభమగును. లక్ష జను లేతెంతురఁట.

ఇచటకోట పాండవులు ద్రోణాచార్యునికై నిర్మించి రని యాప్రదేశమును జూపుదురు. మఱియు నిట ననేక సరస్సులు కలవు. అందు ద్రోణసాగరము కడుపవిత్రమని ప్రసిద్ధి కలదు. అందు స్నానయాత్ర జరుగుచుండును.

**బాలాకిగోత్రము**—(జమదగ్నివత్స ఉపగణము చూడుఁడు).

**బాలారిష్టములు** జాతకనక్షమున బాలునకుచంద్రుఁడెన్మిదింటను, కుజుఁడేడవయింటను, రాహువు తొమ్మిదింటను, శని లగ్నమందునను, గురుఁడు మూఁడింటను, రవి ద్వాదశమందునను, శుక్రుఁ డాఱింటను, బుధుఁ డేడింటను, కేతువులగ్నమందునను ఉండుట బాలారిష్టదోష మనియు, బాలున కత్యల్ప జీవనమనియు జ్యోతిషశాస్త్రమునందుఁ జెప్పఁబడినది.

**బాలింతబోలు**— లా. Balsamodendron myrrhar. ఇంగ్లి.Myrrh. ఫ్రెంచ్ Myrrhe. జర్మను Myrrha. అరబిక్ భాష. Murr. బాలింతబోలును బోళ మనియు నందురు. సువాసన కలది. ఇది అరేబియా, అబీసీనియా దేశములందునను, ఆప్రాంతసీమలను పెరుగు Balsamodendron చెట్లనుండి.

తీయుబంక. కొంద ఱిట్టివే యగు కొన్ని యితరవృక్షములుకూడ నిట్టి బంకనిచ్చునందురు. సువాసనద్రవ్యముగ పరిమళములందు చేర్చుటయు ఔషధములందు, గల్పుటయు సుపయోగములు. ఏసుక్రీస్తుప్రభుఁడు జన్మించినప్పుడు మాగి ఆబాలునకు సమర్పించిన కానుకలలో నొకటి బాలింతబోలని చెప్పఁబడినది.

బాలింతబోలు నూరి పైనపట్టువేసిన గడ్డలు, కంతులు హరించుననియు,లోనికిచ్చిన కంతులు, పొత్తికడుపులోని శూలలు, మూలవ్యాధి, గ్రంథులు, గ్రహణి, కడుపులోని గుల్మరోగము, వ్రణములు, క్షయదగ్గు, ఉబ్బసముదగ్గు, అతి నీరసము నడంచుననియు, లోనికిచ్చిన అతార్తుగా నాడిలో వేగముగల్గించుగుణముగలది గాన జాగ్రతగలోనికియ్యఁదగుననియుచెప్పఁబడినది.

**బాలిసి గోత్రము**--(వసిష్ఠగణము చూ.)

**బాల్టిస్థానము(చిన్నటిబెట్టు)**(Little Tibet)—కాశ్మీరమున కుత్తరదిశగా కొండలమయమగు దేశము. హిమాలయ పర్వతపంక్తికి కారకోరంపర్వతములకు నడుమనున్న సీమ. సింధునదియొక్క పైభాగములోనికి దీనికి వర్షజలములు చేరునటుల ఏటవాలుగా నుండును. ఇందలి పర్వతశిఖరము ౨౮_౨౫౦ అడుగుల యెత్తు గల దందురు. దానిని K 2 అనియు గాడ్విన్‌శిఖర మనియు నందురు. ఇంకను ఇది గౌరీశంకర (Everest) శిఖరమునకుఁ బిదప నెక్కువ ఎత్తైన దనియు ప్రపంచమున రెండవది యనియుఁ జెప్పఁబడినది.

ఇస్కార్డో లేక స్కార్డో ప్రధానపురము. బాల్టిస్థానమును స్వదేశస్థులు బోలోరని వాడుచుందురు. బాల్టిస్థాన్ అనునది మహమ్మదీయున పేరు. ఆంగ్లేయులు (Little Tibet) అనెదరు.

**బాల్డ్విన్ బాల్డ్వీన్** — (Baldwin Baldwyn) ట్యూటోనిక్కునామము Princis, Friend అని యర్థము. (క్రైస్తవ పురుష నామకులు చూడుఁడు.)

**బాలురెదిగితే పాత్రములుఎదుగవలసినదే**—(ఆంధ్రలోకోక్తి.)

**బాలువాహినీనది** — బుందేలఖండము (బుండిల్ఖండ్) లోని యొకనది. దీనిని భాగినీనది లేక బాహిన్‌నది అనియు నందురు. ఇది యమునానదిలోఁ జేరును.ఇదిస్కాందపురాణ అవన్త్యఖండమున నుడువఁబడినది. రేవాఖండమునఁ గూడదీని ప్రశంస కలదు.

**బాలేయగోత్రము**- (ఆత్రేయగణము చూడుఁడు.)

**బాల్ దైవము నారాధించుట** — క్రైస్తవమత మిప్పుడువ్యాపించియున్న ఐరోపా మొదలగు పశ్చిమదేశములందు కొన్నిటిలో ఈదేవతారాధన ముండెడిది. క్రైస్తవు లైన పిదప వెనుకటిమతమువారింగూర్చి తమమతగర్వముతో "Heathen" అని హేళనగా ననుట ప్రారంభమాయెనఁట. నేటికి క్రైస్తవులుకాని యన్యమతములవారిని క్రైస్తవు లట్లె వాడుటయుఁగలదు. అట్టిమతములలో బాల్దైవతారాధన మొకటి. ఆశబ్దమునకు "స్వామి" యని యర్థమఁట. వేర్వేఱుపేరులుగల పెక్కుదేవతల నారాధించున దంతయు బాల్‌దైవతమతమే యఁట. తొల్లింటి బాబిలోనియా, బెల్‌దైవతారాధనమును, ఈ మతసముదయములంద లిదే యందురు. కొందఱు దీనిని "Nature worship" అని వివరించియున్నారు.

సిరియా దేశమున దమస్కసుపురమునుండి ముప్పదియైదుమైళ్ళదూరమునందున్న బాల్బెక్కు పురము తొల్లింట బాల్దైవతారాధనకుఁ

పేరందియుండెను. అక్కాలపు డ్యూసుపితర్ దేవాలయము, బెచ్చస్ దేవళమును, ఇటీవల త్రివ్వఁబడి బయల్పడినవి. ఇవి రోమనులనాటి వని కొందరనెదరు.

## బాలోక్ష దేశము బెలూచిస్థానము

భరతదేశమునకుఁ దొల్లింట జేఁ వాయువ్యదిశగా నున్న భూమి. బాలోక్ష, బెలూచి యైన దఁట. ప్రజలు బాలోక్షులు కాలాగతమై బెలూచీ లనఁ బడుచున్నారందురు. దీనినిగూర్చి ఏ పురాణ గ్రంథములందునను ప్రశంసలు గానరావు. అవధానకల్పలతయందు ౫౭ ప్రకరణమున, దీనిం గూర్చి యించుక చెప్పఁబడినది. రాజధాని కలాత్నగరము. ఇక్కాలపు స్వదేశీయులచే కలాత్ అనఁబడుచు ఆంగ్లులచే కీలట్ అనంబడుచున్నది.

కలాత్ నగరమునం దొక కాళికాదేవాలయ మున్నది. అది కడుపురాతనపు కట్టడము. ఈ దేశము శలద్వీప మనియు, సంగద్వీప మనియు చెప్పఁబడునది. ఇందు అస్తులాదేవి యనఁబడు కాళీదేవస్థానము గలదు. దీని కింకను కల్యాణ ద్వీపమని పేరుండె నందురు గాని నిదర్శనములు గానరావు. ఇందు తొల్లింట జనులు వసించువా రనియు, ఒకప్పుడందు నడిచిన ఘోరకృత్యముకతన కాళీదేవి నిర్మానుష్యముగ నొనర్చె ననియుఁ జెప్పుదురు. అట నెవ్వరు వసించుట లేదు.

ఈదేశమునఁ గనఁదగినది హింగుళాదేవి దేవస్థానము. ఇది హింగ్లా పర్వతపంక్తియొక్క కడభాగమున అఘోరనంబడుచున్న (తొల్లింటి హింగ్లా నది యఁట) నదీ తీర ప్రాంతసీమను ఒకలోవయం దొక గుహలో హింగ్లాదేవి దేవస్థానము కలదు. ఇది ౫౨ శక్తిపీఠములలో నొకటిగఁ జెప్పఁబడిన పీఠము. సతీదేవి బ్రహ్మరంధ్రస్థానము పడినతావుగ తంత్రచూడామణియందు చెప్పఁబడియున్నది. ఈ దేవత నాప్రాంతమువారు మహామాయ యనియు, మహమ్మదీయులు నానీ యనియు వాడుచుండుట గలదు. ఈపర్వతమునకు హరపర్వత మను తొల్లింటిపేరు ఇప్పటికిని వాడుకయందు కలదు. ఇచటి సమీపగ్రామమునకు ఉర్మురా యని పేరు.

మఱియు నీప్రాంతములవారు హింగులా దేవి హిమవత్పర్వతశాఖయగు కూర్మాచలమున కేగినదనియుఁ జెప్పుదురు. సంయుక్తరాష్ట్రములలోని కుమాన్ డివిజనునందలి చంపావతీపురము కడ హింగుళాదేవస్థానమును ఉన్నది. అల్లసాని పెద్దనామాత్యుఁ డీరెండవతావునే మనుచరిత్రయందు "హింగుళాపాదాంభోరుహముల్" అని వచించినది. (కూర్మాచలదేశము చూడుఁడు).

ఇంకను ఈదేశమున ముస్టాంగనంబడుపుర ముకడ నొక శివలింగము కలదు. అద్దానిని 'హరిదేవ్' అనిచెప్పుదురు. పర్వతమునకు హర పర్వత మని మున్నె చెప్పఁబడినది.

**బాల్కనురాష్ట్రములు**— ఐరోపా ఖండమున బాల్కనుపర్వత ప్రాంతదేశమును, బాల్కనుదేశమందలి రాష్ట్రములు, బాల్కను రాష్ట్రములు లేక బాల్కనుస్టేట్సుగను పేరందినవి. ఇక్కాలముననవి బాల్కనుస్టేట్సుగ నెఱుంగఁబడుచు వేర్వేఱుదేశములందు సంయుక్తమై కొన్నియు, స్వతంత్రమై కొన్నియు, సంయుక్తతంబడసి వేఱునామముంచఁబడినవి కొన్నియు నున్నవి.

౧ రూమేనియా— ఇప్పుడు బాల్కనురాష్ట్రముగనే యున్నది. ఇందు వలాబియా, మో వియా యనంబడు రెండు స్టేట్సు సంయుక్తమై పైపేరఁ బరఁగుచున్నవి. (రూమేనియా చూ.)

౨ సెర్వియా— ఇప్పుడు బాల్కనురాష్ట్రముగనే యున్నది. (సెర్వియాస్టేటు చూడుఁడు).

3 మాంటినీగ్రో— ఇప్పుడు బాల్కనురాష్ట్ర

ముగనే యున్నది. (మాంటినీగ్రో చూడుడు.)

౮ బోసినియా స్టేటు- ఇప్పు డిది ఆస్ట్రి యాకుఁ జేరిపోయియున్నది. (ఆస్ట్రియా దేశము చూడుడు. బోసినియాస్టేటు చూడుడు).

౯ హెర్జిగోవినాస్టేటు- ఇప్పు డిది ఆస్ట్రి యాకుఁ జేరిపోయియున్నది. (ఆస్ట్రియా దేశము చూడుడు. హెర్జిగోవినాస్టేటు చూడుడు).

౬ బల్గేరియాస్టేటు- ఇప్పు డిది టర్కీ ఇ న్స్యూరపునందు చేరియున్నది. (టర్కీ దేశము చూడుడు. బల్గేరియా చూడుడు).

౭ తూర్పురూమేలియాస్టేటు— ఇప్పు డిది టర్కీ ఇ న్స్యూరపునందు చేరియున్నది. (టర్కీ దేశము చూడుడు).

౮ మెసిడోనియా- ఇది గ్రీసు దేశమునందు చేరిపోయియున్నది. (గ్రీసు దేశము చూడుడు. మెసిడోనియా చూడుడు.)

౯ రూమేలియాస్టేటు- ఇప్పు డిది టర్కీ ఇ న్స్యూరపునందు చేరిపోయియున్నది. (టర్కీ దేశము చూడుడు. రూమేలియాస్టేటు చూ.)

౧౦ అల్బేనియా- ఇప్పు డిది టర్కీ ఇన్స్యూ రపునందు చేరిపోయియున్నది. (టర్కీ దేశము చూడుడు. అల్బేనియాస్టేటు చూడుడు.)

**బాల్ఖు పరగణా**-పశ్చిమోత్తరసరిహద్దున కవ్వల ఆప్ఘనుస్థానపు ప్రాంతముల నీసీమ కలదు. దీనిని గ్రీకులు బాక్ట్రియా యని వాడి యున్నారు. బాల్ఖుపురము రాజధాని; ప్రధాన నగరము. ఇది తొల్లింట బలిచక్రవర్తి పాలించిన రాజ్యములోని దని తేలినది. ఆనాటినివాసభ వనపుదిబ్బలు జూపుచున్నారు. (పాతాళరా జ్యము చూడుడు.)

**బాల్యగోత్రము**—(అత్రిపుత్రికాపుత్రుల గణము చూడుడు.)

**బాల్యము-జ్ఞాపకశక్తి** — బాల్యమున శక్తి నవయవములందలిశక్తితోపాటుగనే జ్ఞాప కశక్తియు బలపడియుండదు గాన, పెద్దవాఁడైన పిదప తన అయిదవయేటనుండి జరిగినసంగతులు మాత్రము సర్వసాధారణముగ జ్ఞాపకమునం దుంచుకొనఁగల్గునని కనిపెట్టఁబడినది. కొందఱు దృఢమగుజ్ఞాపకశక్తి గల్గినవారు రెండవసంవత్స రమునుండి జరిగినవాట్లను స్వప్నమునఁ జూచిన సంగతులవలె జ్ఞాపక ముంచుకొనినవారును గల రని తేలియున్నది. కాని అట్టివిశేషములు చాల యరుదని చెప్పవలయును.

ఇంతకును అతిబాల్యపుసంగతులు ప్రాము ఖ్యములేనివగుట జ్ఞాపకముంచుకొనుట ప్రయో జనహీనము గాన తఱచుగ మఱచిపోవుటయె సంభవించెడిని. ప్రయోజనముగలసంగతులనే జ్ఞాపకముంచుకొనుటయు, ప్రయోజనహీనముల గుసంగతులను మఱచిపోవుటయు, పెద్దవారైన పిదపఁగూడ జరుగుచుంట ప్రసిద్ధమే.

**బాల్యోద గోత్రము** — (ఔతథ్యఉప గణము చూడుడు.)

**బావంచాలి చెట్టు**— లా. Psoralea Corylifolia, Vernonia Anthelmintica ఆంగ్ల. Pabchi (seed) tree. సం. కృష్ణా, సోమరాజికా, సోమరాజీ, సోమరాట్, సోమ ఖండా, వాకుచికా, వాకుచీ.

బావంచాలలో భేదజాతులు కలవని చెప్పఁ బడినది గాని యెచ్చటను గానరావు. వాటినిగూర్చి యేమియుఁ దెలియదు. వీటికి కారుచెచ్చవిత్తులు, కారుబోగివిత్తులు, కాలి గింజలు, కాలగింజలు నని వాడుకనామము లచ్చ టచ్చటఁ గలవఁట. మఱియు దీనికి కుష్ఠఘ్ని యని పేరుకూడ కలదఁట.

దీని చూర్ణరసకషాయములు, కుష్ఠశ్వేతకుష్ఠ ముల నిర్మూలించుననియు, మలమూత్రముల వెడలించుననియు, అంతర్గతజ్వరముల నడంచు ననియుఁ జెప్పఁబడినది,

**బావమఱది బ్రతుకఁ గోరును. దాయాది చావఁగోరును** — (ఇది యాంధ్రలోకోక్తి.)

**బాష్కలి**— ఋషి. తండ్రి బాష్కలుఁడు. శిష్యులు గార్గ్యాదులు. వీరికి వాలఖిల్యసంహితను బోధించినవాఁడు.

**బాష్కలుఁడు**- ఋషి. ఇంద్రప్రమితి శిష్యుఁడు. ఋగ్వేదాధ్యేతకుమారుఁడు బాష్కలి.

మఱియు దైత్యుఁడగు అనుహ్లాదునిసుతుఁడొకఁడు బాష్కలుఁడను పేరు కలవాఁడె.

**బాహిక లేక వాహికదేశము** — దీనిని బాహ్లిక లేక వాహ్లికదేశముగా పొరపడరాదు. బాహిక, బాహ్లికలు (అనఁగా వాహిక వాహ్లికలు) వేఱుదేశములని యెఱుఁగునది.

బీయాస్ (తొల్లింటి విపాశ) నదికిని, శెట్లజ్ (తొల్లింటి శతద్రు) నదికిని నడుమనుండు దేశమును బాహిక లేక వాహికదేశముగా పోల్చియున్నారు. దీనికి దక్షిణపుటెల్ల కేకయదేశముగను, ఈదేశము పాంచాలములోనిదిగను జెప్పఁబడినది. ఈదేశము నర్జునుఁడు జయించినటుల మహాభారతము- కర్ణపర్వము- ౪౪ యందు చెప్పఁబడినది.

పాణిని పతంజలు లీదేశము పాంచాలములోనిదే యనిరి. రామాయణము, అయోధ్యాకాండ ౭౦ యందిది అయోధ్యా కేకయదేశములనడుమ నుండెనని చెప్పఁబడినది. ఇది బహుశః అక్కాలమున నొకప్పుడు వ్యాపించియుండనోపు. అసలు దేశము కానేరదు.

మహాభారతము కర్ణపర్వము ౪౫ యందు బాహి లేక బాహికుఁడను రక్కసుని పరిపాలననుండియీ దేశమునకీ పేరయ్యెనని చెప్పఁబడినది. దానినే అనుసరించుచు ఆర్కియాలోజికల్ సర్వే రిపోర్టు ౫వ సంపుటమునఁగూడ వివరింపఁబడినది.

ఈదేశపు ఇప్పటిప్రజ లనార్యజాతివారుగాను, తొల్లింటి బాహ్లిక (ఇప్పటి బాక్ట్రియా లేక బాల్ఖు)ప్రదేశముల నుండినజాతివారివంటివారుగను నుండుట తొల్లింటివాహికు లితరదేశములకు వెడలిపోయిరని తలంపఁబడుచున్నది. తొల్లింటి రాజధాని శకలపురము లేక శాకలపురము. త్రికాండశేషమున వాహిక త్రిగర్తలోకే దేశముగఁ జెప్పఁబడుటయు, గ్రీకుచరిత్రకారులు వ్రాసిన చరిత్రయందు "మద్రదేశపు రాజధానియగు శకలపురము లేక సంగలపురమనుటను, అచటిప్రజలకు వాహికు లనిపేరనుటను కొంతశంకకల్గుటకు కారణమగునుగాని, అక్కాలమున మద్రదేశముచే వాహికదేశమో, లేక వాహికదేశముచే మద్రదేశమో ఆక్రమింపఁబడి, ఒకటియందొకటి చేరియుండినదేమోయని స్ఫురింపక పోదు. కాని, డిల్లీయందలి ఇనుపస్తంభమందు చెక్కఁబడిన శాసనమువలన బాహిక సిందుదేశసంబంధమనుట అక్కాలమునందు వాహికము సిందుదేశమునకు లోఁబడియుండెనా యని తోఁచెడిని.

**బాహుకర్ణి గోత్రము**—(ఔతథ్య ఉపగణము చూడుఁడు.)

**బాహు గోత్రము**— (కుండిన గణము చూడుఁడు.)

**బాహుతంత్రగోత్రము**—(ఆత్రేయ గణము చూడుఁడు.)

**బాహుదానది (ధబలానది)** — దీని నిప్పుడు 'ధుమేలా'యనుచున్నారు. బృహద్రప్తి (బర్హ్వా రప్తి) యనియుఁ బేరుండెను. అయోధ్యా రాష్ట్రములోనిది. లిఖితర్షి యొక్క ఖండిత బాహు లీనదీస్నానఫలముగ బాగుపడుటంజేసి యీపేరందెనని మహాభారతము శాంతిపర్వము ౨౩ అధ్యాయమున, హరివంశము ౧౨ అధ్యాయముననను చెప్పఁబడినది.

బాహుమిత్ర గోత్రము — (ఆత్రేయ గణము చూడుఁడు.)

బాహుమిత్రాయణ గోత్రము — (జమదగ్ని వత్స ఉపగణము చూ.)

బాహులకి గోత్రము—(గర్గఉపగణము చూడుఁడు)

బాహుషిగోత్రము--(ఆత్రేయగణము చూడుడు.)

బాహ్లేలదేశము--ఇది తొల్లింటి కరూశ లేక అధిరాజ దేశము. వేఱొక కాలమునను పరిపాలనపు మార్పునను గల్గియుండిన పేరు గానోపు. బాహేల భాగల్ ఖండుగా మాఱి యుండనోపు. వింధ్యపర్వత పాదమునసుండినది. దీనిప్రశంస వామనపురాణము ౧౩ యందు కలదు. (కరూశ లేక అధిరాజ దేశము చూ.)

బాహ్యాగెనాత్రము--(ఔతథ్య ఉపగణము చూడుఁడు)

బాహ్లికదేశము — (పాతాళ రాజ్యము చూడుఁడు.)

బాహ్లికుఁడు — అత్రి చంద్ర పూరు కురు సంతతిక్షత్రియుఁడు. తండ్రి ప్రదీపుఁడు. పితామహుఁడు జహ్నువు. సోదరులు శంతనుఁడు, దేవాపి. సుతుఁడు సోమదత్తుఁడు.

ఈతనినుండి ఈతఁడేలిన దేశమునకు బాహ్లిక దేశమని పేరయ్యెను. బాహ్లికుఁడు భారతయుద్ధమున నిహతుఁడాయెను.

బాహ్యాంతర గెనాత్రము — (ఆత్రేయ గణము చూడుఁడు.)

బి "B" అక్షరమునకుం జెందిన క్రైస్తవ పురుషనామములు—

Bache- నవీన కల్పితనామము.

Baldemar- ట్యూటోనిక్కునామము. Princely fame అని యర్థము.

Baldwin, Baldwyn- ట్యూటోనిక్కు నామము. Prince's friend అనియర్థము.

Balfour- నవీననామము. (౧౦౦)

Bamford- నవీననామము.

Baptiste, Baptist- గ్రీకునామము. Baptizer అనియర్థము.

Bardolf, Bardolph- ట్యూటోనిక్కునామము. Bright Wolf అనియర్థము.

Barnabas, Barnaby- హీబ్రూనామము. Son of Consolation అనియర్థము. ఇందున్న ముద్దు పేరు Barnie.

Barnard, Barney- ట్యూటోనిక్కు పేరు. Firm Bear అనియర్థము.

Barrett- నవీననామము.

Barrington-నవీననామము. ఇది Barry యొక్క విరూపమని కొందరు.

Barry- ఐరిషునామము. సరిగా గుఱి చూచువాఁ డని యర్థము.

Bartholomew, Bartley- హీబ్రూ పదము. ప్రియమిత్రుని సుతుఁడని యర్థము. ఆగస్టు 24 తేదీని పూజింపఁబడెడి St. Bartholomew ఋషిపేరు. ఇందలి ముద్దు పేరు Bart అని.

Basil- గ్రీకునామము. రాజసంబంధము.

Bayford- నవీననామము.

Beauchamp-దీనిని Bee-cham అనియు నందురు. నవీనకల్పితనామము.

Beaufoy- నవీనకల్పితనామము. Bofoy అనియు నందురు.

Beilby- నవీనకల్పితనామము.

Benedict లేక Bennet- లాటిన్ నామము. దీవింపఁబడిన యని యర్థము.

Benjamin- హిబ్రూనామము. Son of my right hand అని యర్థము. ఈ పేరున

జాకబు రాహేలులు తమపుత్రుని పిలుచుచుండిరఁట. ఇందలి ముద్దుపేరులు Ben, Benny.

Bently-లాటిన్‌పదము. దీవింపబడినయని.

Beranger, Berenger- ట్యూటోనిక్కు-

Beresford- ఐరిషునామము.

Berkeley- దీనిని Barkley అనియు నందురు. నవీనకల్పిత నామము.

Bernard, Bernal, Bernhard-ట్యూటోనిక్కు-పదము. with bear's heart, Pucky అని యర్థములు.

Bertram, Bertrand- ట్యూటోనిక్కు-పేరు. Bright Raven అని యర్థము.

Bethune లేక Beeton- నవీననామము.

Biddulph- ట్యూటోనిక్కు-పదము Commanding Woulf అనియర్థము.

Blake- నవీనకల్పితనామము. ప్రసిద్ధుఁడగు నొక ఆంగ్లనావికసైన్యాధిపతియనియు నందురు.

Bob- Robert యొక్క ముద్దుపేరు.

Bohun - నవీననామము. ముద్దుపేరు Boone.

Boileau - నవీననామము. ముద్దుపేరు Bwalo.

Boling broke-నవీననామము.

Bolton-నవీననామము

Boniface - లాటిన్‌పేరు. మంచినొనర్చువాఁడు అనియర్థము. (ఉపకారి)

Boris -రష్యనునామము. యుద్ధవీరుఁడని.

Borlase-నవీననామము.

Bosvile-నవీననామము.

Botolph-ట్యూటోనిక్ నామము. Commanding Woulf అనియర్థము.

Bourchier-నవీనకల్పితనామము. ముద్దుపేరు Bowcher.

Boyd-స్కాచినామము. Yellow అని.

Brand,Brandon-ట్యూటోనిక్.ఖడ్గము.

Bransby-నవీననామము. Brandయొక్క విరూపమని కొందరమతము.

Breretan-నవీననామము.

Brian, Bryan, Brien-ఐరిష్‌నామము. బలమున కర్థము.

Brooke-నవీననామము.

Bruce-నవీననామము. Robert Bruce (జయశీలుని) పేరు.

Brunton- నవీననామము.

Bruno- ట్యూటోనిక్కు-నామము ఖడ్గము.

Brynmor- వెల్షునామము.

Burnett- నవీననామము.

Burney నవీననామము.

### బి. "B" అక్షరమునకుం జెందిన క్రైస్తవస్త్రీల నామములు —

Barbara, Barbora- గ్రీకు పదము. Stranger అని యర్థము. దీని యందలి ముద్దుపేరులు Bab, Babs, Babbie.

Basilia, Basile-గ్రీకుపదము. Kingly అని యర్థము. Basil స్త్రీవాచకపదము.

Bathilda, Bathilde-ట్యూటోనిక్కు-పదము. Commanding little maid అని.

Bathsheba-హిబ్రూపదము. Seventh daughter అని యర్థము.

Beatrice, Beatrica, Beatrix, Beata Beate-లాటిన్పదము. Blesser అనియర్థము. దీనిముద్దపేరు Trixy అనునది.

Becky- హిబ్రూపదము. Noosed Card అని యర్థము. Rebecca వంటిపదము.

Bega -సెల్టిక్కుపదము. life అని యర్థము.

Belinda-పురాతనపుఇటాలియ న్పదము. పాము అని యర్థము.

Bella, Belle -లాటి న్పదము. fairఅని.

Bellona -లాటి న్పదము. warlike అని యర్థము.

Benedetta,Benedicta,Benedictine, Benita-లాటిన్పదము. Blessed అనిఅర్థము. Benidict యొక్క స్త్రీవాచకపదము.

Beringaria, Beneguela ట్యూటానిక్కు పదము. Bear spear అని యర్థము.

Bernardina, Bernardine,Bernhardine-ట్యూటానిక్కు పదము. Boldasbear అని యర్థము. Bernard యొక్క స్త్రీవాచక పదము.

Bernice- గ్రీకుపదము. జయప్రారంభమని యర్థము.

Bertha,Berthe,Berthilda, Bertalda, Berta- ట్యూటానిక్కు-పదము. స్ఫురదాకారముగల పడుచని అర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరులు Bertie, Berty.

Beryl-గ్రీకుపదము. ఆభరణమని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Beril, Bessie, Bessy, Bess, Bet, Beta, Betsey, Bettine, Bettina, Betty హిబ్రూపదములు. దేవుని భూప్రదేశమని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Elizabeth.

Beth, Bethia-సెల్టిక్కు-పదములు. జీవనమనియు ప్రాణమనియు నర్థములు.

Billie- ఇది Billy అను పదముయొక్క-స్త్రీవాచకపదము. William అని ఆంగ్లరూపము. Welhelmina అనియుం గలదు. ట్యూటానిక్కు- పదము. నిశ్చయముయొక్క-శిరోవేష్టమని యర్థము.

Blanche, Bianca, Blanca. Blaudina- ట్యూటానిక్కు-పదములు. స్వచ్ఛమైన తెల్లని అని యర్థములు.

Blenda-ట్యూటానిక్కు-పదము. ప్రకాశించు అనియర్థము.

Boadicea- సెల్టిక్కు-పదము. జయమని యర్థము. దీనినుండి కల్గిన ముద్దుపేరు Bodicea.

Bona-లాటిన్పదము. మంచియనియర్థము.

Brenda-ట్యూటానిక్కు-పదము. ఖడ్గము.

Bridget, Brydget, Brighid, Brigida, Brigide,Brigitta-.ఐరిషుపదములు. బలమని యర్థము. దీనినుండిగల్గిన ముద్దుపేరు Biddy.

Burella దీనికి Bu-rella- దీనింగూర్చి ఏమియుం దెలియదు.

**బిందుమతీదేవి**—తండ్రి శశిబిందుమహారాజు. భర్త మాంధాతృచక్రవర్తి.

**బిందుమాలిని తాళము**- (తాళములు చూడుఁడు.)

**బిందువాసినీ క్షేత్రము**— (వసంతికా క్షేత్రము చూ.)

**బింద్రభాఙ్తీర్థస్థలము**—(బారాతావా-నర్మదాసంగమము చూడుఁడు.)

**బింబసారుఁడు**-మగధభూపతి. బుద్ధభగవానుని సమకాలికుఁడు. ఈయనసుతుండజాతశత్రువు. అతని మనుమఁడు చంద్రగుప్తమహారాజు. ఆతని సుతుఁడు బిందుసారుడు. ఆతని సుతుండశోకచక్రవర్తి. వీరు మౌర్యులు. (మగధదేశము చూడుఁడు.)

**బికనీరు సంస్థానము**— ఇండియాదేశములోని రాజపుటానాఏజన్సీలో ౨౦ సంస్థానములలో నొకస్వదేశసంస్థానము. పెద్దరాజ్యమే గాని చాల మెరకదేశము. నూతు లొక్కొక తావున ౨౦౦ లేక ౩౦౦ అడుగులలోఁతుండును. బికనీరుపురము రాజధాని.

**బిగాట్రీ** (Bigotry)— దురభిమానము, మూఢతయుఁగల పక్షపాతమనిభావము. పర

సహనము లేకుండిన దాని కీపేరు వాడుచుందురు.

Charles the Simple అనుభూపతియొక్క కుమార్తె నొక Duke of Normandy (ఫ్రెంచిసీమ) పరిణయ మగుకతన మామగారి పాదములను ముద్దుపెట్టుకొనవలయునని అక్కాలపు మర్యాదమేర కచటనున్న పెద్దలు చెప్ప, ఆ Duke నిరాకరించి వినకుండెను. దానిని హేళన యొనర్చుచు Charles ప్రభునిమనుష్యులు Bigot అని గేలిచేసిరట. ఆమాట కట్టి యర్థముగల్గి దురభిమానపక్షపాతముగల మూర్ఖత కన్వయింబసాగెను. ఈశబ్దమున కితర వ్యుత్పత్తి గానరాకున్నది.

**బిగ్బెన్ గడియారము**—(Big Ben) ఇది లండనునగరమున పార్లమెంటు భవనము నందుఎత్తుగ నిర్మింపఁబడిన గోపురమునందమర్పఁబడిన గొప్ప గడియారము. జగత్ప్రసిద్ధమైన నిష్కర గలిగినది. రాయల్ అబ్జర్వేటరీ విద్వాంసుడు సంవత్సరములో నిరువదియొకదినములు మాత్రమొక సెకండు(తప్పపాటు)కాలము తేడావచ్చునని తెలిపియున్నాఁడు. దీనిపెండ్యులముబిళ్ళకు దిగువ నొక ఉయ్యాలగానున్న యొకతావున (తప్పువచ్చునను కాలముగుర్తించి) నొకపెన్నీ నాణెముగాని అరపెన్నీగాని ఉంచి, అది సరిపోవుచుండుకాలమున దానిని దీసివేయుచుందురట. అట్టితేడాకాలము సెకండునం దైదవ భాగ ముండునందురు.

గోపురపుగంటస్తంభ మెత్తగునది గాన గంటలుకొట్టుతఱి భూమి కాధ్వని సెకండునం దైదవవంతు కాలమునను, నగరమునందలి కొన్ని భాగములకు విన్పించుటకు రెండుసెకండ్లును పట్టునట.

**బిగ్బెన్ గంట** (Big Ben)- ఇంగ్లాండు దేశమున లండనునగరమందలి పార్లమెంటు భవనముపై నమర్పఁబడి, గడియారమునకు సంబంధించి గంటలుకొట్టి నమర్పఁబడిన గంట. Big అనిన మహద్వాచకము పెద్దది యనియర్థము. Ben అనునది పేరు.

ఇది "Sir Benjamin Hall" అనఁబడిన Commissioner of works పేరున బరఁగుచున్నది. బెంజామిన్‌శబ్దమునుండి తగ్గించినరూపమె బెన్. క్రీ.శ. ౧౮౫౮ లో నమర్పఁబడినది. పదమూఁడున్నర టన్నులబరువు కలది. అప్పటివిలువ నలుబదివేలపౌనులని చెప్పఁబడినది.

## బిజాపూర్ (విజయపురపు) గోల్గుంబుజ్

**బిజాపూర్ (విజయపురపు) గోల్గుంబుజ్**—బిజాపూరిప్పుడు బొంబై రాజధానియందున్న పాడుదిబ్బలపట్టణమయ్యు, జిల్లాయందు ముఖ్యస్థానమై యున్నది. ఆదిని త్రిలింగ (వరంగల్లు) రాజులక్రింద నుండినతఱి విజయపురమని పేరుండెను. "గోల్" అనిన గుండ్రని యని యర్థము. "గుంబుజ్" అనిన నాంగ్లమున Dome అనియెదరు. ప్రపంచమున నిట్టిడోములలో నిది పెద్దదియని చెప్పఁబడినది. కొందఱు పరిశీలకులు పొరపడి దీనికన్న రోమకపురియందలి పేంథియానునందలి డోము పెద్దదియని లెక్కించిరి కాని, అది సరికానేరదు. దాని లోపలిభాగము వృత్తాకారము (Circular) ౧౨౨ అడుగుల డయామీటరు గల్గియుంట నట్లనిరి కాఁబోలును. గోల్గుంబుజ్ లోపలిభాగము చతురమై యెప్రక్కఁ గొలిచినను ౧౩౫ అడుగుల ౬ అంగుళములుండెడిని. ఇది భూమిపై నానించిన ౧౮౩౩౭ చతురపుటడుగుల ప్రదేశమును, పేంథియనుడోము ౧౫౮౩౩ చతురపుటడుగుల ప్రదేశమును ఆక్రమించెడిని. గాన గోల్గుంబుజే పెద్దది.

దీనినిర్మాత బిజాపూరు బహమనీసుల్తాను మహమ్మదుషా కడుసునాయాసముగ దీనిపనిని పూర్తిచేయుటకు గొప్ప యదృష్టశాలి యనిరి.

ఏలయున విజయనగరసామ్రాజ్య మస్తమించి నంతనే అటఁదోచుకొని తెచ్చినద్రవ్యము, పరికరములు,

శిల్పులు, తనకు వశులై పనిచేయ నధికప్రయత్నము లేకయే అనాయాసముగ నీనిర్మాణము పూర్తియాయె నఁట. నిర్మాణకాలమునం దాయనకు నగ్బరుచక్రవర్తితో సంభవించిన సంగ్రామున నోటమియు, ప్రాథేయపూర్వకసఖ్యమును కూడ నీగోల్గుంబుజు నిర్మాణమును కొంతకాలమైన నాఁపనవసరము గలుగఁజేయలే దఁట. ఇందు వలయుశిల్పనైపుణ్యము ప్రదర్శింపఁబడలే దనియు, తాజ్మహాలు డోమునందలి సౌందర్యముం బోలిన సౌందర్య మెందుఁ గానరాదనియు, దరినుండి చూచినవారి కికట్టడము చూడ ముచ్చటగనుండక, అధమ మొకయరమైలు దూరముననుండి చూచిననే దీనియాధిక్యము గన్పట్టెడి ననియు, పదునేనుమైళ్ళదూరమునకుఁ జందమామ వలె డోము కన్పట్టి, దరికరుగుకొలఁది పెద్దదిగ నగుచుఁ జూడఁదగి యుండు ననియు పరిశీలన దృష్టితోఁ జూచినవారికిఁ దోఁపకపోదు. ఇందు మార్బెలురాళ్ళు మొదలగు నలంకారములు లేక కేవలము రాయి, ఇటుక, సున్నములతో నిర్మింపఁబడిన భవనము. భూమినుండి ౧౯౮ అడుగులయెత్తు గలది. పండువెన్నెలయందునను, ఉషఃకాలమునను, ఒక్కొకనాటిసాయంకాలమునను దీని నిజాకారము చక్కనిదృశ్యమై కన్పట్టెడిని. సుప్రసిద్ధపరిశీలకుఁ డగు ఫెరుగ్సన్ పండితుఁడు దీనింగూర్చి ఇటుల వ్రాసియున్నాఁడు.

"At a height of 57 feet from the floor line, the hall begins to contract by a series of pendatives as ingenious as they are beautiful to a circular opening 97 feet in diameter. On the platform of these pendatives at a height of 109 feet 6 inches; the dome is erected 125 feet in diameter thus has a 12 feet wide interior; Internally the dome is 178 feet above the floor and externally the dome is 193 feet from outside the platform, its thickness at the springing is 10 feet and at the Crown is 9 feet."

గోల్గుంబుజుక్రింది కట్టడము చౌకముగ రావియాకువంటి యాకారముగల పండ్రెండులాదులు (దెసకు మూఁడువంతున) పైగోల్గుంబుజు (డోము) నిర్మింపఁబడినది. పిదప కాలమున నీలాదు లిటుకపనితో కప్పివేయఁబడి, మధ్యలాదునందు ద్వారము లుంపఁబడినవి. నాల్గుమూలలందు నాల్గుస్తంభములంబోలిన Tower బురుజులు కట్టడముపొడవున నాజేసిపలకలుగను, ఏడేసి యంతస్తులుగను నిర్మింపఁబడి తలపై గోల్గుంబుజు డోమువంటి పోల్కియెగల (నాల్గుమూలలను నాల్గు) చిన్నడోములతో ముగింపఁబడియున్నవి.

మధ్యనున్న పెద్దడోములోపలి భాగము గుల్లగనుండి ప్రతిధ్వనులిచ్చు Whispering gallery కలదు. అందు ప్రతిమాటయు ధ్వని, ప్రతిధ్వను లెన్మిదిసారులుగ స్పష్టమై వినఁబడుచు (అనఁగా చుట్టు ధ్వనినడుచుచు)వింతగొల్పెడిని.

**బిజాపూరుజిల్లా**—బాగల్కోటపురము ప్రధానస్థానము. (బొంబై రాజధాని చూ.)

**బిజిక్ఆట** (Bezique)—ఇదియు చీట్లపేకలతో నాడు నాటయె. ఇర్వుర ఆటకే ఇది తొలుత నేర్పడి, పిదప ముగ్గురు, లేక నల్గురు ఆడుటకుఁగూడ వీలు కలుగఁజేయఁబడినది. ముప్పదిరెండేసి ముక్కలుగల రెండు పేకదస్తాలతో దీనినాడుదురు. అనఁగా రెండుమొదలు

ఆరు ముక్కలు వీటినుండి తీసివేయఁబడుట ముప్పదిరెండు నిలుచును. తక్కినవాటికి వరుసగా Ace, పది, రాజు, రాణి, జాకి, తొమ్మిది, ఎన్మిది, ఏడు పంక్తుల ముక్కల నెంచుదురు. ఏడవపంక్తి ముక్కను త్రిప్పి Trump (తురుపు)గా నేర్పఱచి యాడుదురు. పేకలఁ గలిపివైచి ఒక్కొకరి కెన్మిదేసి పంచుదురు. పంచుటయందు తొలుత మూఁడేసియు, పిదప రెండేసియు, పిమ్మటఁ దిరుగ మూఁడేసియు నిట్లు పంచుదురు. ఒకపేకమైన ని ట్లగును. రెండుపేకలైన దీనికి రెట్టింపుగ నయ్యెడిని. ఏడవపంక్తితురుపునుబహిరంగపఱచి నడుమవైచి తక్కినవి గోప్యముగ నుంచుకొందురు. ఆటయందు పోయింట్సు ఈక్రిందివిధమున పరిగణింతురు.

రాజురాణి Common marriage of the same suit Points 20. Royal marriage of trumps (తురుపులు) 40. Single Bezique (queen of spades (ఇస్పేటు) Jack of Diamonds (డైమాన్) 40. Double Bezique- same combination as single bezique again declared in the course of same hand by same player but with fresh cards scores 500. Four Jacks duly declared 40 Four Queens duly declared scores 60. Four Kings duly declared scores 80. Four Aces duly declared scores 100. వరుసగ ఏస్-రాజు-రాణి-జాకీ-పదిపంక్తి. తురుపులు పోయింట్లు 250. ఏడుతురుపులుఆడఁబడిగాని త్రిప్పి చూపఁబడి గాని పోయింట్సు10 తర్వాతిఏడును duly declared scores 10- Every Ace and ten in the captured hand (Bezique) Counts 10. For taking the last trick awarded Points 10 To score these points necessary cards should be at the players hands at the same time they must be duly declared and laid on the table. The score is kept by means of Bezique makers having two dials with pointers One showing tens up to 100- and the other showing hundreds up to Thousand.

**బిజ్జలభూపతి**— రెండవ తైలపునికడ (మహారాష్ట్రభూపతి) మంత్రిగనుండి సింహాసన మాక్రమించి కల్యాణ(కుంతల)పురమున[illegible] వఱకు రాజ్యమేలెను. కల్యాణపురము షోలాపురప్రాంతము. ఈతఁడు జైనుఁడు. ఈతనికడనె బసవేశ్వరుఁడు మంత్రిగ నుండినవాఁడు. బిజ్జలుని ఒక లింగాయతవీరశైవు డాతనినగరునందే చంపివైచెనని చెప్పఁబడినది.

**బిడ్**(Bid)— వాణిజ్యసంబంధపరిభాషా పదము. ఒకక్రయమునందుగాని, వేలమునందుఁ గాని, తాను కొనఁదలఁచిన ద్రవ్యమూల్యము నెఱుకపఱచుటకు 'To bid' అనియెదరు. దాని నమ్మునాతఁడు లేక వేలమువేయునాతఁ డంగీకరించులోపల వదలుకొనవచ్చును.

**బిడాది గోత్రము** — (ముద్గలఉపగణము చూడుఁడు.)

**బిత్తరి** — ఆఁడుపిల్లలను, మగపిల్లలకు సంబంధములు విచారించునదనున యుక్త వయస్సునందున్న పిల్లలను "బిత్తరి వలె నున్నది" అనివాడుచుందురు. నైఘంటికముగ బిత్తరి యన ఆఁడుది యనియు, శృంగారచేష్ట గలయాఁడుది యనియు నర్థము గాన జవ్వన మంకురించుచున్న బాలిక యని భావముగా తేలుచున్నది.

**బిదర్ పట్టణదుర్గము**- దీనిని విదర్భ యని కొందఱును, ఇంక వేర్వేఱు పేరులతో కొందఱును పరిశీలకులు పోల్పఁ బ్రయత్నించిరి.

కాని, ఏదియునుగాదు. ఇది నైజాము రాజ్యము నం దిప్పటి హైదరాబాదునగరమున కెనుబది మైళ్ళదూరమునం దొక పీఠభూమిపై సముద్రపు నీటిమట్టమునుండి ౨౩౩౦ అడుగులయెత్తున నున్నయొకదుర్గము. బహమినీరాజ్యముండిననాటి నిర్మాణమని తెలుచున్నది. మంచి మోటార్లు నడుచుబాటయు, ఇనుపదారియు, రెయిల్వే స్టేషనును కలవు. వాతావరణ మారోగ్యప్రద మనియు నించుక ఉష్ణాధిక్య మిట తగ్గి యుండుననియు పేరందినది.

దుర్గము A. C. ౧౪౩౦ సంవత్సరమునను, ఇచటిమహమ్మదీయ సర్వకళాశాలా(మద్రాసా యె మహమూ ద్గవాన్)భవనము ౧౪౭౨ సం వత్సరమునను నిర్మింపఁబడిన వఁట. దుర్గమున రాజనివాసభవనము లున్నవి

**బిధాగోత్రము**- -(జమదగ్ని బిధా ఉప గణము చూడుఁడు.)

**బియోజెనిసిస్** (Biogenesis)- సిద్ధాంతము. జీవపదార్థము లన్నియు నిర్జీవపదార్థముల నుండి కలుగని వనియుఁ గాన,జీవపదార్థస్థానము లగు Cells లేనితఱి నచట మఱియొక పురాతనపు Cell ఉండియు అది జీవపదార్థసంబంధమేయై యుండియుండవలె నను సిద్ధాంతము జీవపదార్థవితతియే జీవనమునకు మూలమని ఈసిద్ధాంతవాదుల యభిప్రాయము.

**బిరుదాంకపురము**— దీని నిప్పుడు బిక్కవోలనుచున్నారు. ఆంధ్రదేశమున తూర్పు గోదావరి మండలమునం దున్నగ్రామము. ఇట పెద్దాపుర సంస్థానమునకు మొదటిప్రభు వగు ముసలితిమ్మరాజుగారు త్రవ్వించిన పెద్దచెఱువు కలదు.

**బిలభృత్ గోత్రము** - (జమదగ్ని వత్స ఉపగణము చూడుఁడు.)

**బిలింబిచెట్టు**— ఇది రసఉసిరిక వంటి చెట్టు. కాయలు పుల్లగను, తియ్యగను ఉండు భేదములచే రెండుగ నున్నది. కాయలందు నీ రుండును. కాయలు భోజనపదార్థము. కాయలు చలవజేసి, ఆఁకలి పుట్టించి మేహశాంతియు, పైత్యశాంతియుఁ గల్గించుచు బలము నధిక పఱచుననియు, పండు దుర్గుణములను రేపి దగ్గు నుద్రేకింపఁజేయు గుణముకలది యనియుఁ దెలియుచున్నది. దీనికివిఱుగుడు గసగసాలరస కషాయములు.

**బిలియన్ లెక్క** (Billion)- మిలియన్ అన అంద ఱెఱిఁగినదే. 1000000 పదిలక్షలని మన మనుచున్నాము. దాని కాంగ్లమున Million అనిపేరు. అమెరికా దేశమున Million times million is Billion అనెదరు. అనఁగా 1000000 × 1000000 = 1000000000000. దీనిని భరతదేశపు సంఖ్యామానమున శంఖ మనియెదరు. (న్యూమరికల్సు చూడుఁడు.)

**బిలియర్డ్సు ఆట** (Billiards) — ఇది పాశ్చాత్త్యులనుండి మనము నేర్చిన ఆట. క్లబ్బులు మొదలగు తావులందు వినోదకాలక్షేపముగ నాడఁబడుచున్నది. పండ్రెం డడుగులపొడవును, ఆఱడుగుల ఒకటిన్నర అంగుళములవెడల్పునుగల మేజాబల్లపై, స్లేటుపలకపై పొరగ నమర్చి, దానిపై ఆకుపచ్చ బనాతుగుడ్డ నంటించి చుట్టు నంచులు రెండున్నర అంగుళముల ఎత్తున పరుపుగ నమర్చి, మూలలందు నాల్గును, ప్రక్కలందు రెండును, ఆఱు చిక్కపు సంచులను క్రిందికి (pockets) అమర్చి, ఆ మేజాపై బంతుల నుంచి యాడుదురు. ఈ బంతులుద్విదంతముతోఁ గాని లేక అట్టిదే యగు కాంపోజిషన్‌తోఁ గాని చేయఁబడి ఇంచుక బరువుగ నుండును. ఒకపాటి పొడవుగల కఱ్ఱల

కడను తోలుముక్కల నంటించి వాటితో బంతులుత్రోయుచు నాడుదురు. బంతులలో తెల్లరంగువిగను, నలుపు లేక ఎఱుపుగరంగులవిగను ఇరు తెగలుగ నుండెడిని.

ఇం దెట్టు లేక నల్లబంతుల నెప్పుడు కఱ్ఱతో పొడిచి త్రోయుట యుండదు. కాని వీట్లనుంచుటకు విధింపఁబడిన తావులందు వీటి నుంచుదురు. ఒకబంతి నొకచిక్కమునందుకు పడఁద్రోయు నుద్దేశ్యముతో తెల్లబంతిని కఱ్ఱతో ఏడుదురు. దానికి హజార్డని (Hazard) పేరు. ఒక బంతిదెబ్బ రెండుబంతులకుఁ దగిలెనేని దానికి కేనన్ (Cannon) అనిపేరు. బల్కులైన్ అనంబడు గీత కవ్వలివైపున నొకతావునుండి తెల్లబంతిని బొడుచుటకు బ్రేక్ (Break) అనియెదరు. అత్తటి నెట్టుబంతి చిక్కములోఁ బడినను గాని లేక సొంతబంతి ఎఱ్ఱబంతిని దాఁకి తాను చిక్కమునఁ బడినను తనకు మూఁడు లెక్కకు వచ్చును. (అనఁగా Score అగును.)

అట్లు రెండుబంతులును చిక్కమునఁబడిన ఆఱు లెక్కకువచ్చును. (అనఁగా Score అగును). అట్లు పడిన ఎఱ్ఱ లేక నల్లబంతిని బైకిఁ దీసియుంచి, తనబంతి యెటనుండి విశ్రాంతిఁ గొననగునో అటనుండి దానిని బొడువ నగును.

ఆడుచుండు నాతఁడు తనబంతితో నితర మగు బంతిని దాఁకింపలేకపోయిన, నది అవతలి వారి కొక Point లెక్కకువచ్చును. అంతటితో నాతఁడు (1 పాయింటు లెక్కకువచ్చినవారు) ఆట నాడనగును.

ఒకవేళ మొదటియాటకానిబంతి రెండవ వారిబంతిని దాఁకక తప్పిపోయి, చిక్కమునఁ బడినచో నది యటనుండి పోఁదగినది యగుటయె గాక ఎవ్వనిబంతిని దాఁకక తప్పిపోయెనో వానికి మూఁడు లెక్కకువచ్చును. (అనఁగా మూఁడు పాయింటులు Score అగును.) ఇంక నత్తటి నెట్టుబంతి యొక్కటియే దుర్గతికి మిగులును.

## బిలో పార్ (Below par)

బిలో పార్ (Below par)— వాణిజ్య సంబంధపరిభాషాపదము. Par అనిన ఒకపత్రమున లిఖింపఁబడినదానివిలువ (Face value) యనియర్థము. దానికిఁ దక్కువవిలువ కాపత్రి మమ్ముడుపోవుటకు "Below par" అనిపేరు (Above par చూడుఁడు.)

## బిల్లాతిగోత్రము

బిల్లాతిగోత్రము- (సంకృతి ఉపగణము చూడుఁడు.)

## బిల్లాఫ్ ఎక్సుఛేంజి చెక్కు బిల్లు

(Bill of exchange cheque bill)-వర్తక సందర్భమునను మృతిసందర్భమునను తనకు బాకీ యున్నవారికి, ఏసందర్భమున బాకీపడెనో దాని నించుక వివరించుచు, అట్టిబాకీ చెల్లించుమని కోరుచు పంపుపత్రమునకుబిల్లు (Bill) అనిపేరు.

తనకు బాకీయున్న ద్రవ్యమునుండి గాని, తాను దాచుకొనినద్రవ్యమునుండి గాని, ఒక ధనాగారమునకు (Treasury) గాని, బాంకి (Bank)కి గాని, తాను బాకీయున్నవారి కింత సొమ్ము చెల్లింపుఁడనియు, ఆసొమ్ము వారికిఁ గాని, వారియనుమతినిపొందినవారికిఁ గాని, చెల్లింపవచ్చుననియు వ్రాసిపంపుపత్రమునకు చెక్కు (Cheque) అనిపేరు.

వర్తకసందర్భమున- A. యనువర్తకుఁడు B. యనువర్తకునకును, B. యనువర్తకుఁడు C. యనువర్తకునకును వెయ్యిరూప్యములు బాకీ యియ్యతేలుదు రనుకొందము. దాని నొకరివద్ద కొకరు పంపించుకొను చుండుటకు మాఱుగా B. యనువాఁడు A యనువానికి బాకీ వెయ్యిరూపాయలని వివరించుచు, బిల్ ఆఫ్ ఎక్సుఛేంజి (Bill of exchange) పత్రమును పంపుటయు, ఆపత్రముపై తన యంగీకారమును దెల్పి,

A. యనువాఁడు సంతకముచేసి చెల్లించు తేది వివరించి, B. యనువాని కందజేయును. దానిని తాను బాకీయున్న C. యనువానికిఁ గాని, వానియనుమతినందినవారికిఁ గాని చెల్లింపవల యునని వ్రాసి సంతకమొనర్చి B. యనువాఁడు C అనువాని కాపత్రి మందజేయును. C అను వాఁడు, దాని నావాయిదాదినమున Aఅనువాని నుండి ఆబాకీద్రవ్యమును వసూలుచేసికొనును.

ఒక్కొ-కప్పుడు C అనువానికి ద్రవ్య మత్యవ సరమై యుండునేని అందునుండి కొంచెముద్రవ్య మును వదలివేసి, వేఱొకమధ్యవర్తికి విక్రయించి, (Discounted) ఆమధ్యవర్తినుండి తక్కి-న సొమ్మును తోడనే తీసికొనును. అటుల Dis- count ను తనలాభముగ నెంచు మధ్యవర్తియు వాయిదాదినమువఱకు వేచియుండి తనమొత్తము మును A అనువర్తకునినుండి వసూలుపఱచు కొనును.

ఇది చాల సులువుగ వర్తకుల కనుకూలించు చుండుటచేత ఈపద్ధతి చాల వ్యాపకము గాంచి యున్నది. అట్టి పత్రమునకు "Bill of Ex- change" అనిపేరు.

ఈపద్ధతి నోట్లు వ్యాపకములేని ప్రాఁతరోజు లలో, సొమ్ము బరువుగపంపుట కష్టముగ నుండు దినములలో కనిపెట్టఁబడి ప్రారంభింపఁబడియు, నోట్లు వ్యాపించినపిదపగూడ నట్లె ఆచరణయం దుండి సాఁగుచున్నది. మఱియు విదేశవ్యాపా రములం దీపద్ధతి యెక్కు-వ పరిపాటియం దుండి నట్లు తెలుచున్నది.

ఒకరికి కొంతసొమ్ము నొసఁగుమని బాంకికి వ్రాయుపత్రి మగు చెక్కు-, అటులైనను పంప వలయును, లేకున్న దానిని క్రాసు చేసి పంప వచ్చును. మొదటిదానికి 'Open Cheque' అనియును, రెండవదానిని 'Crossed Cheque' అనియు నందురు.

Open Chequeపైని రూకలనందునాతఁడు సొమ్ముముట్టిన యొప్పుదలగా సంతక మొనర్చి మూల్య మందుకొనును. క్రాసుచెక్కు-లు ఒక బాంకువారిద్వారానే మార్చ బడవలయును. ఆ చెక్కు-పై ఏబాంకివారైనను అని గాని, లేక ఏదో యొక ఫలానిబేంకివా రని గాని ఏర్పాటు లిఖింపవలయును. దాని నాబాంకివారి కిడి వారి ద్వారానే మూల్యము నందవలసి యుండును. ఇది కొంత అనవసరపుచీకాకుపనిగ దోపనోపును గాని, ఒకబాంకివారిద్వారా యాతంతు నడుచు టంజేసి, తస్క-రులకు స్వాధీనము గాకుంటయె గాక లిఖిత నిదర్శనములు గల్గెడిని. తొల్లింటి కాలమున నీక్రాసుచేయుట × ఒకటిపై నొకటి నడ్డుగీతలను గీచి, "& Co" అని ముద్రచేసికొని ముద్రించు చుండువారు. ఇందు క్రాసుకు పిదప & Co అనునది Fashion గా నెంచఁబడునదే గాని, నిజముగా సంఘము కానితటి నర్థము లేనిదై నిష్ప్రయోజనమే యగును.

**బిల్వములు** — పంచబిల్వములు లేక బిల్వపంచకము. బిల్వ మన పూజార్హమగు పత్రియని భావము.

౧ తులసి (పత్రి), ౨ బిల్వము (మారేడు పత్రి), ౩ నిర్గుండి (వావిలిపత్రి), ౪ అపామా ర్గము (ఉత్తరేణిపత్రి), ౫ కపిత్థము(వెలగపత్రి).

అష్టబిల్వములు- శ్లో॥ తులసీ బిల్వ నిర్గుండీ అపామార్గ కపిత్థగా। శమీ ఆమలకం దూర్వామ్ అష్టబిల్వాః ప్రకీర్తితాః॥ ౬ శమీ (జమ్మిపత్రి), ౭ ఆమలకము (ఉశిరికపత్రి), ౮ దూర్వము (గరిక) ఇవి అష్టబిల్వము లనంబడును.

**బిల్వయూపి లేక బైల్వయూపిగో త్రము**—(పరాశరగణము చూడుఁడు).

**బిల్వవిభజనన్యాయము**—మారేడు పండును విభజించుట యని యర్థము. తెలియని

పని జేయఁబూనుటను దెల్పుట కీన్యాయమును వాడుచుందురు.

**బిల్హణమహాకవి**— ఈతఁడు కాశ్మీర దేశనివాసియగు రాజకలశుని మనుమఁడు. మహాభాష్యవ్యాఖ్యాత యగు జ్యేష్ఠకలశుని కుమారుఁడు. కౌశికగోత్రుఁడు. బ్రాహ్మణుఁడు. వీరు ముగ్గురు సోదరులు. తల్లి నాగాదేవి. ఈతఁడు బాల్యముననే సకలవిద్యల నభ్యసించినవాఁడు. యౌవ్వనమున కాశ్మీరదేశాధిపతి యగు ననంతవర్మమహీపాలుని కుమారుఁడగు కలశదేవుఁడు కాశ్మీరదేశ మేలుచున్నకాలమున దేశసంచారము చేయుచు మధుర, బృందావ కాన్యకుబ్జ, కాశీ, ప్రయాగ, అయోధ్య, దాహల (బందేల్ఖండ్), ఘూర్జర, సోమనాథ పురాదిస్థలంబులు తిరిగి, ఆయాయిప్రభువుల సన్మానములఁ బడసినవాఁడు. దక్షిణదేశమందలి చాలుక్యులరాజధాని యగు కల్యాణపురమందుండి (షోలాపుర ప్రాంతము) ప్రభువగుత్రిభువన మల్లుఁ డనఁబడిన ఆహవమల్లునిచే "విద్యాపతి" బిరుదముఁబడసినవాఁడు. ఆ యాస్థానముననే ఆహవమల్లుని కుమారుఁడగు విక్రమాంకదేవ రాజుకాలమునఁ గూడ నుండినవాఁడై "విక్రమాంకదేవ చరిత్ర" మను మహాకావ్యమును రచియించియుండెను. ఇంతియె గాక 1070-1094 వత్సరప్రాంతమున నుండిన అనహిలాపురము రాజధానిగానుండిన దాహలదేశాధీశ్వరుఁడగు కర్ణరాజుచే సన్మానంబులు బడసి, ఆభూపతిపేరుగా "కర్ణసుందరనాటిక" యను గ్రంథమును రచించినవాఁడు. ఇంకను "పంచాశిక" యనుగ్రంథమునుఁగూడ రచించినవాఁడు. ఈకవి 1088 సంవత్సరమున కలశభూపతికుమారుఁడు హర్షదేవునికాలమువఱ కుండి 1100 సంవత్సరప్రాంతమున చనిపోయినట్లూహింపఁ బడుచున్నది. యామినీపూర్ణతిలకయను రాకుమారిత నీతఁడు పరిణయ మయినటులు వ్రాయఁబడిన బిల్హణీయాదిగ్రంథము లన్యులచే వినోదార్థము వ్రాయఁబడినవి గాని నిజములు గావని యిటీవలిపరిశీలకులుగొందఱనుచున్నారు.

**బిల్ ఆఫ్ ఎక్సుఛేంజి**(Bill of Exchange)- వాణిజ్యసంబంధపరిభాషాపదము.) హుండీ ఒకరిపై నొకరు కొంతసొమ్ము ఫలానా వాఁడపరముగ చెల్లింపుమని వ్రాసినపత్రము. దీనిని వర్తకులు కొని కొంతకమీషనులాభము నకు అమ్ముదురు. వసూలునిమిత్తము పంపుదురు. ఇందు దర్శన (చూడఁగనె సొమ్మిచ్చు) హుండీలకు "Demand draft" అనియు నందురు.

**బిల్ ఆఫ్ ఎంట్రీ** (Bill of Entry)-(వాణిజ్యసంబంధపరిభాషాపదము). ఎగుమతి నిమిత్తమునిల్వ వేయఁబడినవి గాని, దిగుమతియై వచ్చిచేరినవి గాని, ఒక Custom House నందు నమోదుచేయఁబడిన పత్రము.

**బిల్ ఆఫ్ సఫరెన్సు** Bill of Sufferance)—వాణిజ్యసంబంధపరిభాషాపదము. ఒక బ్రిటీషుఓడ (ఒక బ్రిటీషు రేవునుండి వేర్వేఱు బ్రిటీషురేవులకేగుచు) dutiable goods తో వర్తకము చేయవచ్చుననియు, అసరకులు Bonded warehouse నందు దింపఁబడి, తీసికొనిపోఁబడునపుడు Duty వసూలుచేయ వచ్చుననియు, ఉద్యోగపు అనుమతి పత్రము (Official permit).

**బిల్ ఆఫ్ సేల్** (Bill of Sale)—వాణిజ్యసంబంధపరిభాషాపదము. సరకు అమ్మఁబడుటను దెలుపు నిశ్చయపత్రము.

**బిల్ ఆఫ్ స్టోర్** (Bill of Store)—వాణిజ్యసంబంధ పరిభాషాపదము. బ్రిటీషు దేశములందుఁ జేయఁబడిన (ఉత్పత్తిగల) సరకు

లితర దేశములకుఁ గొంపోఁబడి అమ్ముడుపో నిచో తిరుగ నైదేండ్లలో జన్మదేశమునకు మరలు నేని Customs duty అక్కఱయుండ దని శాసనము చేయఁబడినది. దానికొఱకు అట్లు సిద్ధపఱుపఁబడిన లెక్కపత్రము

**బిల్ బ్రోకర్** (Bill broker)--వాణిజ్య సంబంధపరిభాషాపదము. హుండీలను ప్రోనోట్లను కొనుచు అమ్ముచు వ్యాపారమొనర్చు వాఁడు.

**బిల్ ఆఫ్ విక్చ్యుయల్లింగ్** (Bills Victualling)—సముద్రమున సబురుచేయు తఱి భోజనాదివ్యయముల కుపయోగించుకొనుటకు వలయుసరకులను ఓడపై (పన్ను, బంధీ, మోతఛార్జీ లేమియుం దగులకుండ) గొంపోఁబడుట కీయఁబడు లైసెన్సు. దీనిని సర్వసాధారణముగ 'Victualling Bill' అనుచున్నారు.

**బిల్ ఆఫ్ లాండింగ్** (Bill of Landing)— వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ఫలానితావున దింపుటకుఁగాను ఇంతసరకు తనకు ముట్టిన దనియు, దానిఛార్జి యింత చెల్లింపఁబడినదనియు, ఎగుమతియొనర్చినవాని కొసంగఁబడిన పత్రము.

**బిషప్సు రింగు** (Bishop's ring)-- ఇది సూర్యునిఁజుట్టి కన్పించు పరివేషములలో నొకటి. ఇందు రంగు లుండెడిని. ఇది తోఁక చుక్కలతో సంబంధము కలది యని చెప్పఁబడినది. క్రీ. వె. ౧౮౧౦ సంవత్సరమునఁ నగపడిన తోఁకచుక్క ఆకసమునం దగపడు చుండుతఱి బ్రిటీషుదీవులం దగపడుచుండినది.

**బిస్కెట్** (బిసకత్తు) (Biscuit)— Bis అనిన రెండుసారులనియు, Coctus అనిన కాల్పఁబడిన దనియు నర్థము. రెండు సారులు అగ్నిచే కాల్పఁబడినదని భావము. తొల్లి రోమనుల కాలమున పటాలపురొట్టెలు రెండుసార్లు అగ్నిచే పాకముగ నొనర్పఁబడుచుండెడి వఁట. ఇప్పుడు రెండుసార్లు శుద్ధియొనర్ప దాని కీపేరు ప్రసంగములం దుక్తిగా నుడువుచుందురు.

**బిహేవియరిజమ్** (Behaviourism)- మనుష్యులయొక్కగాని జంతువులయొక్కగాని ప్రవర్తనను, అంతఃకరణమును నెఱుఁగు శాస్త్రము.

ఇది అమెరికా సంయుక్తరాష్ట్రము లందు కొంతవఱకు వ్యాపించియున్నదని విందుము.

**బీజావాపనపరీక్ష**— వ్యవసాయమున విత్తనములు చల్లుటకు ఈ క్రిందిగుణదోష పరీక్షయు, గ్రహబలమును, అర్హకార్తెలను గమనించుటయావశ్యక మని రెట్టదెవజ్ఞుఁడు ఋషులమతమును జనులకు వెల్లడించి యున్నాఁడు. కాలవిజ్ఞానశాస్త్రము చూడుఁడు.)

మూలానక్షత్రము బీజావాపమునకు కడు శ్రేష్ఠమనియు, పుష్యమి పునర్వసులు, వరిచామలకు శ్రేష్ఠమనియుఁ జెప్పఁబడినది.

లగ్నమునఁ గాని, లగ్నమున కేడవస్థానమునఁగాని శుక్రుఁ డుండఁజూచి విత్తనములు వేయుట శ్రేయమనియు, చంద్రుఁడు ౧, ౪, ౭, ౧౦ స్థానములం దున్నతఱిని గాని, క్రూరగ్రహములుబలహీనము లైనతఱినిగాని, విత్తనములు నాటిన చక్కఁగ ఫలించుననియు, అందు ముఖ్యముగ చంద్రుఁడు లగ్నమం దుండుతఱిని విత్తులు నాటుట శ్రేయ మనియు, దానిని సూర్యుఁడుచూచుచుండినఇంకను శ్రేయమనియు రవి ఆర్ద్రాప్రవేశ మైనదిమొదలు నాటినపైరులు చక్కఁగ ఫలించుననియు, ఉత్తర, అనూరాధ, మూల, రోహిణి, రేవతి నక్షత్రములు పైరు పెట్టుటకు శ్రేష్ఠములగు నక్షత్రములనియు చెప్పఁబడినది. మకర, సింహ, వృషభ, మీన, కర్కాటక రాసులు శ్రేష్ఠములగు రాసులు.

మఱియు నీరాసులందు గురు, బుధ, శుక్రులు- (శుభగ్రహములు) ఉండుట మిగుల శ్రేయ మనియు,

బుధుఁడుగాని, శుక్రుఁడుగాని యుండులగ్న మందైనను లేక వారుండు నవాంశయం దైనను ఏవిత్తనములు నాటినను చక్కఁగ ఫలించు ననియు,

గురుఁడు లగ్నమందుగాని, నాల్గవ ఏడవ ఇండ్లలో నెచటనైనఁగాని యుండుతఱి విత్తిన మంచిఫలము గల్గుననియు,

క్రూరగ్రహము లుండు నక్షత్రములందు నను, గ్రహణము గల్గిన నక్షత్రముననను, పాప గ్రహములందు, రాసులందు, వారు చూచు రాసులందు నాటిన పైరులు ఫలింప వనియు, జ్యేష్ఠ, విశాఖ, కృత్తిక, చిత్త, ఆర్ద్ర, భరణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్ర ములందు విత్తనములు నాటిన పైరు నిష్ఫల మగుననియు,

విత్తనములు వేయ నేగుతఱి పైఁడికంటి దాపల రొప్పినను, కాకి గాని, ముంగి గాని, గాడిదగాని వెలుపలికి పోయినను, కుక్క ఎడమ దిక్కున కేగినను, మంచిశకునము లనియు, స్త్రీలు మంగళప్రదమగు మాటలు, పాటలు విన్పించినను, వేదాధ్యయనము చెవినిఁబడినను, ఎద్దు ఎడమతట్టుగా చాలువోసినను, మంచిశకునము లనియు, విత్తనములు చల్లి తిరిగివచ్చునపుడు వాయనము తీర్చుట మహాఫలప్రద మనియు,

పండినపంట కోయుట కేగునపుడు వెలుపల కాకి యఱచినను, ఏనుఁగులు, అద్దములు, అరఁటి స్తంభములు, పూర్ణకుంభములు, చిత్రవర్ణముల చీరెలు ధరించినస్త్రీలు ఎదురగుట సుశకునము లనియు,

విత్తనములునాట నేగుతఱి పగ్గము మోకు తెగుట, ఎద్దులు రొప్పుట, లేక క్రిందపడుట, అపశకునము లనియు, పంటకోయ నేగుతరి వితంతువు, కుందేలు, అగ్ని, కసవు, తెలికుల నూనెంగాని, తెలకపిండిగాని యెదురగుట అప శకునమనియు, చెప్పఁబడినది.

౧ ధాన్యములు- వీటిని నాటుటకు అశ్వని, ఆర్ద్ర, పుబ్బ, అనూరాధ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర కార్తెలు శ్రేష్ఠములు.

౨ గోదుమలు - వీటిని నాటుటకు భరణి కార్తె శ్రేష్ఠము. మృగశిర తగదని చెప్పఁ బడినది. జ్యేష్ఠయందు ఫలింపదు. ఫలించినను దక్కదని పెద్దలు చెప్పుదురు.

౩ జొన్నలు- వీటిని నాటుటకు ఉత్తర, అనూరాధ, రోహిణి, రేవతి నక్షత్రములు మంచివి. అశ్వని, ధనిష్ఠ, శతభిషం, శ్రవణం, పునర్వసు మధ్యమములు. తక్కిన నక్షత్రముల నాల్గవ వంతు పంటకన్న నెక్కుడు కల్గదు. శని మేష రాశియందు, బృహస్పతి వృషభరాశియందు నుండుతఱిని, ధనుర్మాసము మొదలు మాఘ మాసమువఱకు స్వాతి, మూల, అనూరాధ నక్షత్రములు, మకర, మీన కర్కాటకరాసులు గల్గఁజూచి, విత్తిన మంచిపంట ఫలించునని చెప్పఁ బడినది.

౪ చెన్నంగివరి-, ఇది నాటుటకు శ్రవణ నక్షత్రము శ్రేష్ఠము.

౫ రాజనాలు- భరణి, రోహిణి, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, మఖ నక్షత్రములు శ్రేష్ఠ ములు. శ్రవణమున విత్తిన స్వల్పముగ పండు నని చెప్పఁబడినది.

౬ పత్తి- ఇది నాటుటకు అశ్వని, ఆర్ద్ర, పుబ్బ, అనూరాధ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు శ్రేష్ఠములు.

ఆశ్లేషయందు నాటినపంట స్వల్పమనియు, స్వాతియు మంచినక్షత్రమె యనియు, చంద్రుఁడున్న నక్షత్రము శ్రేష్ఠమనియు చెప్పఁబడినది.

౭ దుంపపైరులు, చెఱకు, ఇవి నాటుటకు శతభిషము, విశాఖ మంచివి.

౮ సెనగలు- ఇవి నాటుటకు కృత్తికా, హస్తలు మంచివి. పుబ్బ, ఆర్ద్ర, చితలు అయోగ్యములు.

౯ కందులు-నాటుటకు మూల పశ్రస్త్రము.

౧౦ పెసలు- నాటుటకు హస్త ప్రశస్తము.

౧౧ అనుములు-నాటుటకు జ్యేష్ఠ ప్రశస్తము.

౧౨ నువ్వులు-నాటుటకు ఆర్ద్ర ప్రశస్తము.

౧౩ అలచందలు- ఇవి నాటుటకు పూర్వాషాఢ మంచిది.

౧౪ అవిసెలు, మునగ- ఇవి నాటుటకు అశ్విని ప్రశస్తము. శతభిషము,విశాఖలయందు పురుగుబట్టి చెడిపోవును.

౧౫ తములపాకులతీఁగె-ఉత్తరప్రశస్తము.

౧౬ అరఁటితోఁట- దీని చంద్రుఁడు లగ్నమందుండుతటి శ్రేష్ఠము.

అంగారకుఁడు చూచుచుండు లగ్నమును యోగ్యమె. రాహువు లగ్నముంజూచుచుండిన చీడపట్టును. చంద్రుఁడు లగ్నమందుండియు, ఆలగ్నమును సూర్యుఁడు చూచుచుండిన చాల శ్రేష్ఠము.

**బీజవృక్షన్యాయము**—విత్తు ముందా? లేక చెట్టు ముందా? యని వితర్కించుట నిరర్థకవాద మని భావము.

**బీజాంకురన్యాయము** —విత్తనము, అంకురము నను రెండును కారణకార్యములు. రెండును ప్రధానములు. అవినాభావ సంబంధముం దెల్పుతటి నీన్యాయమును వాడుదురు.

**బీబాశాఖ క్షత్రియులు** —(ప్రమార శాఖక్షత్రియులు చూడుఁడు.)

**బీమ్(బ్రిడ్జి)వంతెన**(Beam bridge) (వంతెనలు చూడుఁడు.)

**బీమ్ సిస్టమ్** (Beam system) — ఇది Wireless Telegraphy లోనిది. దీనిని "Directional Wireless Telegraphy" అనెదరు. ఇందు ఎలక్ట్రిసిటీఅలలనుఏకమొనర్చి బీమ్ వలె ఆవైపునకుఁ బంపుటతో పని నడుచును. బ్రిటిష్ దీవులనుండి కెనడా దేశమునకీపద్ధతిని తంతీవార్తలను నడుపుచున్నారు.

**బీరకాయ**—తీయబీఱ, చేదుబీఱ, నేతిబీఱ, లేక పుల్లబీఱ అనునవి ముఖ్యజాతులు మూఁడు. తీయబీఱయందు పెద్దబీఱ,లేక ఏనుఁగుబీఱ, చిన్నబీఱ, గుత్తిబీఱ (గుత్తులుగుత్తులుగఁగాచు కోలజాతి) అను మూఁడును కోలకాయలుగలజాతులు. ఇంకను పొట్టికాయలుగల (అనఁగా గుండ్రని బీరకాయలు గాచు) జాతి. బరంపురప్రాంతములఁ గానఁగుచున్నది. ఇది తీయబీఱజాతియె.చేదుబీఱకాయలించుకచేఁదుగనుండుటయాహారమునకు నిరసించుచుందురు. దీని నధమపుజాతిగ నెన్నుదురు. నేతిబీఱ లేక పుల్లబీఱ యనంబడు జాతియందు లెక్కలేని భేదములు కలవు. తీఁగలుపొడవుగ చెట్లపైకిఁ బ్రాకి కాచు దేశవాళీ నేతిబీరయు,పొట్టితీఁగెలతో ప్రాకి కాచు Vegetabla marrow జాతియు, ఇంక నెన్ని యోరకములు కాయలు కాచుభేదజాతులిందుఁ గలవు.

నిరర్థకుఁడైనఃసికి పెద్దపేరుగాని, బిరుదములుగాని ఉండునేని హేళనగా నేతిబీఱకాయవాట మని వాడుచుందురు. అనఁగా నేనిబీరకాయకు నేతితోసంబంధము గాని, పుల్లబీరకాయ యనుపేరున కందు పులుపుగాని లేకుండుట నిరర్థకనామ మని యిందలి భావము. బీరకాయ సమధాతువు గల్గించు భోజనపదార్థముగాన పథ్యముగా నెన్నఁబడుచున్నది. బీరకాయపెగీచిన పొట్టునందు వాతగుణమును, కడుపుబ్బరము గల్గించుగుణమును

గలదందురు. బీరఆకులపసరు గాఢమగు ఆకు పచ్చరంగుగలది గాన దోషయుక్తమై గాఢమగు ఆకుపసరురంగును బీరాకుపసరుతో పోల్చుదురు. మఱియు నిందు పత్యమును శాంతింపఁజేసి ఉబ్బుజాడ్యము నడంచుశక్తి గలదందురు. శరీరమందలి చెడురక్తమును శుభ్రిపఱచుగుణ మిందుఁగల దందురు. తియ్యబీరయందలి ఇతర భేదజాతుల కివియె గుణములు.

చేదుబీరపాదునకు లా. Luffa amara Luffa plucketiuna. సం. సుతిక్తా, కృతి రాదనీ అనిపేరు. చేదుబీరయందు వెద్యోపయోగగుణములు కొన్ని గలవు గాని భోజన పదార్థముగఁ గాకున్నను ఉపయోగింతురు దీని సమూలరసకషాయములు ఉష్ణము జేసి మూత్రము వెడలించియు, అధికమైన వమనముచేసియు, కడుపులోని బల్ల, పాండురోగము, ఉబ్బుజాడ్యము, శ్వాసకాసలు, మూలవ్యాధి,కుష్ఠరోగముల నివారించుననియు, సర్వవిషమును హరించుననియు, చెప్పఁబడినది. పెట్టుమందు కక్కించుట కీకషాయము లోని కిచ్చెదరు. అన్నివాతములు, సన్నిపాతవాతము సహా నివారించునందురు.

చేదుబీరకాయముక్క లాముదమున వెచ్చఁజేసి తలకుఁ గట్టుచుండిన సన్నిపాతము నివారణ మగుననియు, ఆముదములో చేదుబీరగింజల చమురు కల్పి రుద్దిన సర్వవాతములనొప్పులు, వాతదోషములు నివారణమగుననియు, నరములకు సత్తువనిచ్చి పడిపోయినకాళ్ళు, చేతులు బలపడు ననియు, పచ్చికాడల కషాయము నందు మన్యపుజ్వరదోషమునఁ గల్గిన లోపలి నరముల ఉబ్బుగాని, తిత్తులఉబ్బుగాని నివారణ జేయుశక్తి గలదనియుఁ జెప్పఁబడినది.

నేతిఁబీర లేక పుల్లబీరయందు విషదోషము హరించి ఎక్కిళ్ళుకట్టి ప్రమేహము, పైత్యముల నడంచి విషమజ్వరము నివారించి యించుకవాతమును రేపి, చలవజేయుగుణములు గలవనియుఁ జెప్పఁబడినది.

బీర అధమాధమపుజాతియో లేక వేఱుజాతియో బుఱ్ఱబీర యనఁబడుజాతి కలదు. ఇది అడవిజాతిబీర యని కొంద అందురు. కొందఱదియె గుత్తిబీర యందురు. దీనింగూర్చి సరిగా తెలియరాదు.

బీరకాయకు సంస్కృతపుపేర్లు, కృతచ్ఛిద్రా కృతబంధనం, కృతవేధనా, కోశాతకీ అనునవి బీరసామాన్యమునకును, కృతవేదకః, ఘృతకోశీ యనునవి నేతిబీరకును, కృతవేదనః అనునది తెల్లపూవులుపూచెడి బీరజాతికిని సుతిక్తా యను పదము చేదుజాతిబీరకును, కృతిరాదనీఅను పేరు బీరజాతిభేదమునకును చెప్పఁబడినవి.

**బీరార్సు ప్రోవిన్సు** (Berars Province)—ఇండియాదేశమున మధ్యరాష్ట్రములకు పశ్చిమముగ నున్న సీమ ౧౮౫౩ లో ఋణములకుఁగాను నైజాముప్రభుత్వము బ్రిటీషు ప్రభుత్వమువారికి వశపఱచి యుండిరి గాన "హైదరాబాదు ఎసైన్డు ట్రిక్ట్సు" అనిగూడ వాడుచుందురు. వైశాల్యము ౧౭౭౦౦ చతురపు మైళ్లు. దీనియందు మిగిలినసొమ్ము నిజాము ప్రభుత్వమువారి కొసంగఁబడుచున్నది. హైదరాబాదు రెసిడెంటుగారు మీఁద నరు గాఁగూడ నుందురు. ఇప్పుడు మ రాష్ట్రముల ప్రభుత్వమునకు జేర్పఁబడుచున్నది. ఇందు ప్రత్తిపంట యధికము. (మధ్యరాష్ట్రములు మహారాష్ట్రము హిందీదేశభాషలు చూడుఁడు). పరిపాలన కిది తూర్పుబీరా రనియు, పశ్చిమ బీరా రనియు రెండు డివిజనులుగఁ జేయఁబడినది. అకోలా పట్టణము ప్రధానపురము. అమరావతి ప్రత్తివర్తకము విశేషముగఁ గల పురము. ఎరిచపూరు మహమ్మదీయపరిపాలన

కాలమున ప్రధానస్థానముగ నుండినపురము. తొలింటి విదర్భ దేశ ముండినకాలమున కుండిన పురము రాజధానిగ నుండినతావు. (విదర్భ దేశము చూడుఁడు). శ్రీకృష్ణునిరాణి యగు రుక్మిణీదేవి ది జన్మభూమి. ఆమె గౌరీతపం బొనర్చిన అంబాభవానీ దేవస్థానము కలదు. ఖామ్గాముపురము ప్రత్తివర్తకము విశేషముగ నడుచుచుండుతావు. (హైదరాబాదురాజ్యము, ఇండియాదేశము చూడుఁడు).

**బీర్ (Bear)**--వాణిజ్యసంబంధపరిభాషా పదము. తనకడ నిల్వలేనిసరకులనమ్మి, ఆసరకు ధర తగ్గిపోవఁగోరుచు, నందుకు వలయు ప్రయత్నము లొనర్చుచు (ధర తగ్గినతఱి తాను చౌక ధరకుఁ గొని అదివఱకు తా నమ్మియుండిన హెచ్చుధరవలన లాభముఁ బడయఁ దలఁచిన) వర్తకుని Bear అనెదరు. అట్టివాని లెక్కకు 'Bear Account' అందురు.

**బీర్సు ఎండ్ బుల్సు (Bears and Bulls)**— వర్తకవ్యాపార సంబంధమున,నకారణముగ వర్తకపుసరకులధరలఁ బెంచుటకుఁగాని దిగఁదీయుటకుఁ గాని ధరలు పెరిగినవనియు, పడిపోయిన వనియు, ప్రవాదములు సాగించి గడబిడలుచేయుచుండువారి కీపేరు పరిహాసాస్పదముగ వాడుచున్నారు.

**బీర్ ఎండ్ బెల్ (Bear & Bell)**— గుంపులుగుంపులుగా నుండు పశువులు, మేఁకలు, గొఱ్ఱెలు మొదలగుజంతువుల గుంపులలో పెద్ద దానిమెడకు గంటకట్టి, ఆశబ్దమువలన తక్కిన వాట్లను విడిపోకుండ కల్పి యుంతురు. అట్లు కట్టుటకు అర్థాకాలమున 'bell weather' అనిపేరు. ఒకరిద్వారా వారివారింగూర్చి పని చేయించుట కీఉక్తిని వాడుచున్నారు.

**బీహర (విహార) దేశము** — ఇది తొల్లింటిమగధదేశము.బ్రిటీషుఇండియాలోనిది. ఫలవంతమగు దేశము. జనబాహుళ్యము కలది. రాజమహల్పర్వతములు నైరృతిదిశగా వ్యాపించి యున్నవి. గంగానది దేశముగుండా ప్రవహించు నది. ఉత్తరమున హిమాలయమునుండి గండకినదియు, దక్షిణమునుండి శోణభద్రయు, కర్మనాశానదియు గంగయందు సంగమించు నుపనదులు. గోదుమలు, ధాన్యము, జొన్నలు, బార్లి పెరగుచున్నవి. నల్లమందు చేయఁబడుచున్నది. నూలుబట్టలనేత విస్తారము చేయఁబడుచున్నది. హిందువులు హిందీభాషను, మహమ్మదీయులురుదుభాషను మాట్లాడు చుందురు. కొందఱు బంగాళీలును కలరు. మైలునకు ౫౭౫ గురు వసించు చున్నారని లెక్కింపఁ బడినది. జనబాహుళ్యముగల దేశము. భరతదేశ మంతటిలో నిది యెక్కువ జనులుగలదేశమని చెప్పఁబడినది. ఇందు భాగల్పూరుడివిజను, పాట్నాడివిజను అని రెండు డివిజనులు కలవు. భాగల్పూరుడివిజనులందు భాగల్పూరుజిల్లా, మాంఘీరుజిల్లా, మాల్టాజిల్లా, పూర్ణియాజిల్లా, సంతాల్పరగణాజిల్లా లైదును, పాట్నాడివిజనునందు పాట్నాజిల్లా, గయాజిల్లా, షహాబాదుజిల్లా, దర్భాంగజిల్లా, ముజఫర్పూరుజిల్లా, సారాన్జిల్లా, చంపారన్జిల్లా లేడును కలవు. ఇందు క్రీ.శ. ౧౮౭౬లో మాల్టా బంగాళమునుండి బీహారమునకుఁ జేర్పఁబడినది. ఇది చాల చిన్నదియగుటయె గాక జనాభా చాల తక్కువగాఁగలది. సంతాల్పరగణా చాల వైశాల్యముకల కొండల దేశము. సారాన్ నందు జను లధికము. మైలునకు ౮౭౦మంది నివసించుచున్నారు. తర్వాతఁ జెప్పఁదగినది దర్భాంగ మండలము. ఇందు జనాభా యెక్కువ.

పాట్నా (తొల్లింటి పాటలీపుత్రము) ముఖ్యపట్టణము. ఇది గంగాతీర పరిసరముల నున్న బంకిపూర్ సివిల్ స్టేషను దినపూరుమిలిటరీస్టేషను

లు గలదైయున్నది. గయ గొప్ప పితృక్షేత్రము. ఇది ఫల్గుణీనదీతీరము. ఈపరిసరములనే యున్న బుద్ధగయ, బోధివృక్షము క్రింద బుద్ధ భగవానుఁడు బుద్ధుఁడైన తావు. బౌద్ధులపుణ్యక్షేత్రము. బీహారుపురమునుండియె దేశమున కీపేరుగల్గినది. అది యొకప్పుడు ప్రధానస్థానమై యుండిన తావు. భాగల్పూరు గంగాతీరమం దున్న పట్టణము. వర్తకస్థానము. ఇట గంగానది యేడు మైళ్ళ వెడల్పున నున్నది. మాంఘీరుపురము (తొల్లింటి మోదగిరి) కడు పురాతనస్థలము. గంగాతీరము. ఇట బలమైన దుర్గము కలదు.

పశ్చిమ తిరుహూతు డివిజనులో ముజఫరుపూరు పెద్దపట్టణము. తూర్పుతిరుహూతునందు దర్భాంగపురము పెద్దది. ఇది జమీందారీ సంస్థానమున ప్రధానస్థానము. దర్భాంగ సంస్థానము సుప్రసిద్ధము. తిరుహూతుప్రాంతము తొల్లింటి మిథిలదేశములోనిది. ఇట నీలిమందధికముగఁ జేయఁబడు చున్నది. అరా లేక ఆరాపురము (తొల్లింటి ఏకచక్రపురము) షహాబాదుజిల్లాయందు ప్రధానపట్టణము. బక్సారుపురము (తొల్లింటి వాక్సారపురము) గొప్ప యుద్ధము జరిగిన తావు. ఆదికాలమున వామనావతారస్థలము. విశ్వామిత్రమహర్షి యాశ్రమ మిటనే యుండెను. (బక్సారుయుద్ధము క్రీ. శ. ౧౭౬౪.) సారన్మండలమున చుప్రా ప్రధానపురము. గంగాతీరము.

మాల్డాజిల్లాయందు మాల్డా ముఖ్యపట్టణము. ఈజిల్లాయందే తొల్లి బంగాళదేశమున రాజధానిగ నుండిన గౌరీపురముపాడు కలదు. ఇది గంగాతీరమున నున్నది. సంతాల్పరగణాలందు ముఖ్యపట్టణము రాజమహల్పురము. ఇట తొల్లింటి రాజమహల్ భవనము పాడై ఉన్నది. ఇట నివాసప్రజలు సంతాలుజాతివారును, పహారీజాతివారును నై యున్నారు పహారీలు ద్రావిడజాతి తెగ యనెదరు.

**బీచ్**—(తీరములు చూడుఁడు).

**బుందేలుఖండము**— (యజాభుక్తిదేశము చూడుఁడు.)

**బుందేల్ఖండ్సంస్థానములు**- సెంట్రలిండియా ఏజన్సీలోని బ్రిటీషురక్షితసంస్థానములలో నొకటి. బుందేలారాజపుత్రుల దేశము. ఇందిప్పుడు చాలభాగము బ్రిటీషుఇండియాలో చేరిపోయి, తక్కినది ౩౫ చిన్న చిన్న సంస్థానములుగను, జాగీర్లుగను నున్నది. ముఖ్యములైనవి కావు. బుందేలారాజపుత్రక్షత్రియు లీదేశము నాక్రమించుట నీపే రందినదందురు.

(సెంట్రలిండియా ఏజన్సీ సంస్థానములు బుందేల్ఖండము చూడుఁడు).

**బుందేల్ఖండీభాష**—(హిందీభాష చతుర్విధములు చూడుఁడు.)

**బుకోవియా**-(ఆస్ట్రియా దేశము చూ.)

**బుక్ క్రెడిట్సు (లేక బుక్కు క్రెడిట్లు) బుక్కు డెట్సు**—వాణిజ్యసంబంధపరిభాషా పదములు. Book Credits- ఒకవర్తకుని కాతాకు కొంతసొమ్ము ఇతరమైనతావుల చెల్లింపబడినకతన, అతని Credit (అప్పు ఈయఁదగు విలువమొత్తము) నకు దానిని గలుపుట. అనఁగా ఇతరతావులనుండి ప్రత్యేకముగసొమ్ము తెప్పించఁబడి ఇచట వేరుగ జమ ఈయఁబడ నక్కఱలేని బాంకిఏర్పాటు.

Book debts- దీనిని 'Book debits' అనియు నందురు. ఒకవర్తకుని పేర (కాతాకు) ఇతరమగు తావుల కర్చువ్రాయఁబడినకతన, అతని Credit (అప్పు ఈయఁదగు విలువ మొత్తము) నుండి దానిని తగ్గించుట, అనఁగా ఇక్కడనుండి ద్రవ్యము ప్రత్యేకముగ తీసికొనఁబడి, ఇతరతావుల చెల్లింపఁబడుటకు మాఱుగ జరుపఁబడు బాంకిఏర్పాటు.

**బుడుబుడుక్కలకులము** — వీరిని శకున పక్షులనియుఁ బిలిచెదరు. వీరిఁగూర్చి తెలుపు గ్రంథములు లేకున్నను, వీరియం దనుశ్రుతముగ జ్ఞాపకపరంపరచే పోషింపఁబడుచున్న వీరి జాతికథ యిట్లున్నది. వీరిని సృష్టించినది సదాశివుఁడు. ఆ దేవునిశక్తికి అంబాభవానీ యని పేరు. వీరిసృష్టికాలము అపరాహ్ణోత్పూర్వ మని యెదరు. అట్లు సృష్టింపఁబడినవాఁడే మూలపురుషుఁడు. ఈతనిసంతతివారే బుడుబుడుక్కలకులము వారు. అంబాభవాని ఆతనికి ప్రసన్నురాలై "వత్సా ఇది సదాశివుని వాద్యపరికరము గుడక్క. దీనిని నీవువాయించుచుండిన నీకు త్రికాలజ్ఞానము గల్గుచుండును. అది నీకు వృత్తియగుఁగాక" అని దీవించెను. నాఁడాదిగ నాతనిసంతతి వారంబా భవానిని గొల్చుకొనుచు అతీతానాగతముల దెల్పు వృత్తి గలవారుగ నున్నారు.

**బుడ్డ కాకరచెట్టు**- లా. Cardiospermum halicacabum ఆంగ్ల. Heart Pea.

దీనింగూర్చి సరిగా తెలియరాకున్నది. దీని సమూలకషాయము గాని, వేరు లేక ఆకులరస కషాయములు గాని విరేచనము జేసి కామిల, మూత్రదోషము, రక్తపైత్యము, క్షయరోగము నడంచు ననియు, ఆకునందు వ్రణములుమాన్పుటయు, మేహవాతపునొప్పుల నడంచుటయు పైత్యసంబంధ మగు దద్దుర్లను మాన్పుటయు గుణములు.

**బుధనకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు). బుధనకుల (బుద్ధికుల–బుద్ధి) గోత్రము. ఏకార్షేయ (౨) గోత్రము. సంస్కృతగోత్రము. బోధాయనస, బుధగణము. భార్గవర్షి. ఆపస్తంబయజుశ్శాఖ, ప్రమాణగ్రంథమాద్యప్రవరఖండ సమానగోత్రములు, భార్గవస, బౌద్ధాయనస, నాగేశుఁడు దేవత. కమలాంబ భార్య. తపస్స్థానము కనకాద్రి. తటాకము నాశికాంబుధి. జపము లక్ష. దీపములు ౭౯. క్షేత్రసంఖ్య ౭౯. గోదానము. నిమ్మపండ్లు వర్జనీయము.

**బుధరుక్నకులగోత్రము** — ఆర్యవైశ్యుల ౧౦౨ గోత్రములలో నొకటి. (వైశ్యగోత్రములు చూడుఁడు.) బుధరుక్నకుల(బుధరు. బుధరుకుల) గోత్రము. ఏకార్షేయ (౩౮) గోత్రము. సంస్కృతగోత్రము. సౌపర్ణస సుపర్ణగణము. బోధాయనర్షి. ఆపస్తంబ యజుశ్శాఖ. ప్రమాణగ్రంథమాద్య ప్రవరఖండ. సమానగోత్రము బోధాయనస. బ్రహ్మేశుఁడు దేవత. భ్రమరాంబ భార్య. మేరుపర్వతము తపస్స్థానము. కమలజాంబుధి తటాకము. జపము లక్షవేలు. దీపములు ౪౦. క్షేత్రసంఖ్య ౨౬. భూమిదానము. శివమల్లి వర్జనీయము.

**బుధవారము** (Wednesday)-- ఇది చంద్రగ్రహముయొక్క సుతుఁడగు బుధునిపేరఁ బరఁగువారము. నాల్గవ దినము.

స్కాండినేవియా ద్వీపకల్పవాసుల ప్రధాన దైవమగు 'Woden' పేరఁ బరఁగు వారము. ఆయనను కొన్ని దేశములవారు 'Oden' అనియు ననుచుండిరి. ఆయనసుహృద్భావము, దయామయత్వము మొదలగు సుగుణములు కలవాఁడు. ఆయననివాసభవనమునకు 'Valhalla' యని పేరు. అది వెండిబంగారులతోఁ జేయఁబడినది. ఆయనచేతులపై మాలకాకు లుండుననియు, అవి లోక మంతయు సంచరించుచు వార్తల నాయనకుఁ దెల్పుచుండుననియుఁ జెప్పఁబడినది.

సాయుధపాణులైన యావను లాయనకొల్వున వేచియుందురు. వీరికి 'Valkyries' అనిపేరు. వీరు యుద్ధనిహతులగువీరుల నాయనకడకుఁ గొంపోవుచుందురు. ఆ దేవుఁడును వారిని బహూకరించుచు, విం దొసంగుచుండును. ఇట్లై

ఆయన బద్ధకములేక పనిచేయువారు, శ్రద్ధగఁ జమవుకొనువారు నగు బాలురను రాఁబంచి విం దొసఁగు చుండును. జనులను పనిచేయుఁడని హెచ్చరించుచుండుదైవ మీతఁడే.

బైబిలునందు బుధవారమున ఆరిన నేల, (భూమి) సముద్రములు, వృక్షజాతులు, గడ్డి జాతులు సృష్టింపఁ బడినటులఁ జెప్పఁబడినది.

**బుధుఁడు** — నవగ్రహములలో నొక గ్రహము. బుధునకు తండ్రి చంద్రుఁడు తల్లి బృహస్పతిభార్యయగు తార.

భార్య వైవస్వతమనుపుత్రికయగు ఇళాదేవి. కుమారుఁడు పురూరవశ్చక్రవర్తి. బుధునిసంతతి క్షత్రియులను చంద్రవంశమువారఁదురు.

**బుధోదరిగోత్రము**- (అగస్త్యఉపగణము చూడుఁడు).

**బుద్ధగయ**— బీహారములోని గయాజిల్లా. గయానుండి చక్కనిబాటను ఏడుమైళ్ళదూరము. ఇది బౌద్ధమతస్థుల [illegible]క్షేత్రము. ఇ[illegible] బోధివృక్షమును, బుద్ధునిదేవాలయమును, ఆయన కూర్చుండిన పవిత్రస్థానమును, నిలచినపాదముల ఆనికలతావులును గలక్షేత్రము.

చీనాదేశపుయాత్రస్థులగు హ్యూనత్సాంగును, ఫాహియానును దీనిని దర్శించిరి. ఫాహియానువ్రాత మాకంత యనుకూలింప లేదు. హ్యూనత్సాంగు క్రీ వె. ౬౩౭ దీనిని దర్శించి తనయాత్రాచరితమునం దిటుల వ్రాసికొనెను. "బుద్ధభగవానుఁడాదికాలమున (బోధివృక్షము క్రింద జ్ఞానవంతుఁడగు బుద్ధుఁడుగఁ గాకుండిన తఱి) బోధిసత్వుఁడై యుండెను. అత్తఱి బుద్ధుఁడగు తలంపు గలిగి, ప్రాగ్వాదిపర్వతము పైకెక్క, నాపర్వతదేవత ఆయనను నిరుత్సాహపఱచి వారించెను. ఆయన అటనుండి నైరృతి దిశగా ఆ పర్వతమునుండి దిగిపోవుచుండెను. సగముదూరము దిగువఱ కొక గుహ కన్పింప నం దలసి కూర్చుండెను. కాని మఱియొక అధిదేవత అదియుం దగినతావు కాదనిన ధ్వని యాయనకు విన్పించెను. తానెటకుఁ బోనగు నని యా బోధిసత్వుఁడు ప్రశ్నింప, నాధ్వని "యింకను నైరృతిదిశకే ఒకపిప్పల (రావి)వృక్షమువఱకుఁ జను" మని చెప్పెను. కాని, యాగుహయందు వసించుచున్న వృద్ధనాగము (ముసలిపాము) ఖిన్నతదోఁప, "స్వామీ! యీగుహ పరిశుభ్రమైనది. లోకు లందరియందును వ్యాపింపఁ జేయఁదగిన మీకనికర మును నాయందుంచుచు వ్యాపింపఁజేసి, పవిత్రవంతమగు భవద్వాంఛాపరిపూర్తి ఇటనే గాంచితురుగాక" యని వేఁడుకొన మెచ్చి యామహాత్ముఁడు తననీడ నట నుంచి తానునడుచుచుఁ బోయి, బోధివృక్షముఁ జేరెను. దానిక్రింద తపంబొనరించి జ్ఞానవంతుఁడగుబుద్ధుఁడాయెను. అదియె నాబోధివృక్షము.

ఆదినుండిన బోధివృక్షమె ఇది యని బౌద్ధులనుచున్నారు. నిమతస్థులు దానిసంతతివృక్షమనెదరు. ఇప్పుడు దానికొమ్మలనుండి పాలీభాషలో వ్రాయఁబడినమంత్రములు, ప్రార్థనలు మొదలగునవి వ్రేలాడుచు, ఎగురుచు నుండును. అందు కొన్ని జాతకములుకూడ కలవు. దీనికొమ్మనే అశోకచక్రవర్తికొమరిత సంఘమిత్రయనునామె సింహళమునకుఁ గొంపోయె నఁట.

బోధివృక్షముకడనుండి దక్షిణముగా చుట్టుదిరిగి యేగిన బుద్ధవిహారస్థలము కలదు. అది యేఁబదియడుగులపొడవుగల తిన్ననిప్రదేశము. ఇందు జ్ఞానవంతుఁడైనపిదప బుద్ధభగవానుఁడేడుదినము లొకకడ నుండి, రెండవకడవఱకు నటునిటు పచారు చేయుచు, యోచించుకొను చుండెనని మహావంశమునందు చెప్పఁబడినది. ఇందాయన అప్పటప్పట నిలచిన తావులు, పాదములయానవాళ్ళు రాళ్ళపై చిత్రింపఁబడి

యున్నవి. ఇది భూమిపై నాల్గడుగుల యెత్తున నెక్కువ వెడల్పు లేక ఏఁబదియడుగుల పొడవు గల రాతిపనిదిమ్మయని చెప్పవలెను. ఈపవిత్రస్థలి బుద్ధదేవాలయమున కుత్తరదిశగానున్నది. దేవాలయము నూటయువదియడుగుల యెత్తు గలది. ఇందుఁగల యొకశాసనముమేర కీది ౧౮౭౭ సంవత్సరమున బర్మాబౌద్ధులు పునర్నిర్మాణ మొనర్చినటుల తెలిసెడిని. ఇది బర్మా భాషలోనున్న శాసనము. ఇది యేశకమో తెలియదు. కాని క్రీ. వె. ఆఱవశతాబ్దమున అమరుఁడనువిప్రుఁ డీదేవాలయము పునరుద్ధరించెననియు నదివఱ కశోకనిర్మితమగు దేవళముండెననియుఁ జెప్పఁబడినది.

క్రీ. వె. ౧౮౮౦ సంవత్సరమునుండి ఎనుబదివేలరూప్యముల వ్యయమున దేవస్థానము మరమ్మతు చేయఁబడినది. లోన నొకవేదికపై నపరంజిపూత పూయఁబడిన బుద్ధభగవానుని విగ్రహము కలదు. అది బర్మావారివ్యయమున నపరంజి పూయఁబడిన దండము. అశోకనిర్మిత విహారమును జుట్టియుండు రాతివాసపుపని పురాతనమైనది; చూడఁ దగినది.

**బుద్ధగయాస్టేషను**— మార్గమునఁగల బరచాక్ కొండలయందుఁగల నాలుగు గుహాల నశోకచక్రవర్తి అజీవకబౌద్ధుల కిచ్చెనఁట. వీరు మంఖాలీపుత్తగోశాలుని సిద్ధాంతప్రవర్తకబౌద్ధులఁట. ఇటఁగల నాగార్జునపర్వతముపై నున్న మూఁడుగుహాలను అశోకునిమనుమఁడు దశరథుఁడు అజీవకబౌద్ధుల కొసంగెనఁట. నాగార్జున పర్వతమున కొన్ని శిలాశాసనములు గానవచ్చెడిని. అందు కొన్ని దశరథునివి గలవు.

బుద్ధగయయందు బౌద్ధక్షేత్రములలో ముఖ్యములు బోధివృక్షమును, బుద్ధదేవాలయమును, బుద్ధకుండమును, బుద్ధుఁడైనపిదప నాబుద్ధభగవానుఁడు పచారుచేసిన మార్గమును బోధివృక్షమునకింద తొల్లింటికాలమునుండి సద్దానిపై బుద్ధభగవానుఁడు కూర్చుండి తపమొనర్చుచుండిన గుండ్రపు శిలాఫలకమును, (ఇది యిప్పుడు భాగీశ్వరదేవాలయపుముందుగదియందుంచఁబడియున్నది.) వజ్రపాణిబోధిసత్త్వవిగ్రహమును, తారాదేవి దేవాలయమును (తారాదేవి పద్మపాణిబోధిసత్త్వుని విగ్రహమేయని పెక్కండ్రు తలంచుచున్నారు.) ఈ బుద్ధభగవానుని దేవాలయము చాల గొప్పది.

ఈ దేవస్థానము హిందూమహంతుపరిపాలనయందున్నది. ఆయన అటనేగల వేఱొకమఠమున వసించుచుండును. క్రీ. వె. పదునెన్మిదవ శతాబ్దప్రారంభకాలమున మహాదేవమహంతు, ఆమఠమును నిర్మించినటుల అందొకశాసనము కలదు.

క్రీ. వె. ౪౦౪ సంవత్సరమున ఫాహియాన్, బుద్ధగయను దర్శించుతఱి, బౌద్ధులచే వదలివేయఁబడి నిర్మానుష్యమైయున్నటుల గనుఁగొనెను. పిదప క్రీ. వె. ౬౩౭ సంవత్సరమున హ్యూనత్స్యాంగు దర్శించుతఱి బలవత్తరమగు హిందూపట్టణముగను, బలమగు రక్షణమునుగల్గి యజేయమై రమారమి యొకేసంతతివారగు వేయిబ్రాహ్మణకుటుంబము లట నివసించుచుండుట వివరించెను. ఆ వేయిబ్రాహ్మణకుటుంబములన గయావళీలని తోఁచెడిని.

**బుద్ధదంతము**— సింహళద్వీపమునందలి కేండీపురమున 'దాలదమాలిగావా' యనుపేరుగల పవిత్రగృహమున నొక గొప్పవిలువగల పేటికయందు భద్రపఱుపఁబడినది. దీని నాంగ్లశరీరశాస్త్రవిదులు "Right Canine Tooth" అనుచుందురు. ఈ దంతము రెండున్నరఅంగుళముల పొడవు కలది గాన నిది మానవశరీరసంబంధము గాదనియు, కృతకమనియు, క్రైస్తవమతబోధకు లనుచుందురు గాని,

బౌద్ధులు బుద్ధభగవానునితో సంబంధగౌరవము నను, బౌద్ధేతరులు "Oldest historical relec of the world" అని గౌరవమునను దీనిని సంభావించుచున్నారు. దీని నేటేట కేండీ పురమునం దూరేగించుచుందురు. ఈయూరే గింపుటుత్సవమున దీనిని భద్రపఱచు నధికారు లగు కేండీప్రముఖులుగూడ నుందురు. వారికి స్వదేశభాషయందు రతమాహాత్మేయు లనియె దరు (Candian chief). కెండీపురము బౌద్ధ స్థలమై యున్నది. ఇట పెక్కు బౌద్ధ శాలాలు గలవు. బౌద్ధుల యాత్రాస్థలమును World's show place" గను చెప్పఁ బడినది. ఇటనొకసరస్సుకలదు. మహావళి గంగ యనంబడు బౌద్ధుల పవిత్ర నది యిటకు సమీపము.

**బుద్ధనీలకంఠ దేవస్థానము** — ఇది నేపాలదేశమునందు హిమవన్నగముపై నున్న దేవస్థానము. E.B.S.R. రెక్సాల్సంధియందు దిగి, నేపాల ...ప్రభుత్వమువారి చిన్న యినుప దారిబాటపై నరిగి భీమ్‌పేడి మీఁదుగా చంద కోనలోవమార్గముగుండా కట్మాండూ నగరమున కరుగు మార్గమునందు, చంద్రకోనలోవ కనతి దూరమునమార్గము నంటియున్న దేవస్థానము. ఈప్రాంతమున నేపప్రసిద్ధ పట్టణమును లేకుంట నిది యింతదూరమని చెప్ప వీలులేదు. కొండల లోబాటలునుకొలువఁబడకయు కొండ లెక్కుట దిగుటలతో దూరమును వివరింప వీలులేక యుం టయు, దరినున్న గ్రామములు బలహీనములై సుప్రసిద్ధములు గాక యుంటయు, నింతటితో వదలుట సమంజసము. దీనిని నేపాలమహారాజు గారెప్పుడు దర్శింపఁగూడదనియాచారముకలదు. ఇట వారికే వేఱొక దేవస్థాన మేర్పఱచి యున్నారు.

నేపాలదేశభాషయందుపరమేశ్వరుని నారా యణ శబ్దముచే వాడుట సర్వసాధారణమే. అనఁగా విష్ణుపారమ్య మని యిట యర్థము గాదు. దేవుఁడు అనుతటి నెవ్వరికైనను పరమే శ్వరుని కర్థ మగునటుల, నారాయణ శబ్దము ఎవ్వరైనను పరమేశ్వరునకే ఈదేశమున వాడు చుందురు. అట్లె ఇచటి నీలకంఠదేవుని నారా యణుఁ డనుచుందురు. కాని,యిది శివదేవస్థాన మని యెఱుంగునది. ఇది శయనవిగ్రహము గాని శివలింగము కాదు.

సముద్రమథనముననుద్భవించిన హాలాహల మును భక్షించి కంఠమం దుంచుకొనిన పర మేశ్వరుండగుశివుని శయనించినవిగ్రహ మొక చిన్నజలకుండముప్రక్క నుండి జలకుండము లోనికి వ్యాపించి యున్నది. ఆజలకుండమునకు "నీలకంఠకుండ" మని పేరు. అందు పరుండిన నీలకంఠేశ్వరుని నాల్గుమూలలనున్న నాల్గుస్తం భము లొకప్పుడు వాటిపై నేరూపముననో నొకప్పు డుండియుండవలెననియు, అది మధ్య కాలమున ధ్వంసమైనదేమో యనియు స్ఫురిం చెడిని. విదాహము కలుగ, పరమేశ్వరుఁ డా కొండప్రక్కగ తన త్రిశూలమును గ్రుచ్చి మూఁడుజలధారలు గల్గించి, నీరు ద్రావి, యట కాజలధారలు ప్రవహించుచు పల్లమున కుండ మేర్పడ నందు శయనించినయవస్థయనియచటి వారనెదరు. అదిహిందూదేవస్థానమయ్యు బౌద్ధు లగు నేపాలీయులపూజలుగూడ నందుచున్నది. పెక్కం డిట తపంబు లొనరించుచుందురు. దేవునినుదుట విభూతిరేఖలు మూఁడు కలవు. గళము నీలవర్ణము. శరీరమంతయుఁ దెలుపు. రాతివిగ్రహము. ఆప్రాంతపర్వతప్రదేశమునకు 'గోసాయిన్ తాన్' (గోసాయి స్థానము) అనిపేరు.

దీనికి నకలుగ నేపాలభూపతులు పూజించు విగ్రహముండు ప్రదేశ మటకుఁ గొంతదూర

మున నున్నది. ఆతావునకు, నచ్చటి దేవునకుం గూడ 'బాలాజీ' యని వాడుకగలదు. బుద్ధనీలకంఠస్వామి శయనవిగ్రహ మొక రేతునకు తనపొలము దున్నుతఱి నీవారసీమయందే నేపాలదేశమున నాఁగలికిం దగిలె ననియు, దానిని విని నేపాలదేశపు రాణా (ప్రధాన మంత్రి) దానిం ద్రవ్వించి బయలుపఱచి యట దేవస్థానము నేర్పఱచె ననియు, నీప్రాంతముల బలమగు ప్రతీతి కలదు. దేవాలయమున తపం బొనర్చువారి మెల్లనిధ్వనులు, గువ్వలకూఁతలు, పావురముల గుబగుబలు, నితరపక్షుల పాటలు సదా యొకపాటి యోంకారధ్వనిగ కలిసి యేర్పడి సర్వకాలములందు వినఁబడుచుంట వింతగ నుండును. ఇట కోఁతులు మెండుగఁ గలవు. పరిసరముల జలపాతములు కొన్ని కలవు. ప్రశాంతమైన తావు. జనబాహుళ్య స్థలముకాదు. తపమున కర్హస్థల మనిపించును. (నేపాలదేశము చూడుఁడు).

**బుద్ధభగవానుఁడు**— ఈ మహాత్ముఁడు బౌద్ధమతకర్త. వీరికి తల్లిదండ్రు లిడినపేరు సిద్ధార్థుఁడు. తండ్రిపేరు శుద్ధోదనమహారాజు. తల్లిపేరు మాయాదేవి. సవతితల్లిపేరు గౌతమీదేవి. సిద్ధార్థితల్లి పుట్టినయేడవనాడు మాయాదేవి మరణింప గౌతమీదేవి సిద్ధార్థుని పెంచెను. సిద్ధార్థునికి సర్వార్థసిద్ధి యనియుఁ బేరు కలదు. భార్యపేరు యశోధర. కుమారునిపేరు రాహులుఁడు. విశ్వామిత్రుం డనుపండితునికడ విద్యాభ్యాస మొనర్చినవాఁడు. తొల్లింటి యుత్తరకోసలదేశమున, రోహిణీనదీతీరమందు కపిలవస్తుపురము రాజధానిగఁగల యాప్రాంతసీమకుతండ్రియగుశుద్ధోదనమహారాజు పరిపాలకుఁడైయుండెను. సర్వార్థసిద్ధుఁడు యువరాజు. వీరు సూర్యవంశక్షత్రియు లనియు, ఇక్ష్వాకుసంతతియందు గౌతమవంశస్థు లనియు, శాక్య లని వంశపరంపరగ నామ మనియుఁ జెప్పఁబడినది. కపిల మహర్షి యాశ్రమ మీతావున సుప్రసిద్ధమైన తావై యుంట, నాయనుండి కపిలవస్తుపురము పేరందెననఁట. ఇప్పు డానగరము పాడై ఇటుక దిబ్బలమయముగనై బెంగాల్ నార్తువెస్టర్న్ రెయిల్వే గోరక్పూర్ (గోరక్షకపురము) నుండి ఏఁబదినాల్గు మైళ్ళ దూరమునఁ గల గొర్ (రెయిల్వే) స్టేషనునుండి పడమరగా రెండు మైళ్ళదూరమునఁగల చందోతలావు (సరస్సు) తీరమునుండి భూయిలాతలావు (సరస్సు)తీరము దనుక నుండినది. క్రి. వె. ౪౦౦ సంవత్సరమున ఫాహియాననను చీనాయాత్రికుఁ డీతావును దర్శించుతఱి పట్టణము వదలివేయఁబడి పాడగు నిరువదియిండ్లును, కొందఱు బౌద్ధభిక్షువులునుమాత్ర ముండిరని వ్రాసెను. పిదప ౬౪౦లో హ్యూనత్స్యాంగు దర్శించుతఱి పాడై సర్వశూన్యమై యుండెనని వ్రాసియున్నాఁడు.

సర్వార్థసిద్ధి గర్భమం దుండుతఱి, తల్లియగు మాయాదేవి నదికవ్వల నున్న తన పుట్టినింటికి పురుటికిఁబోవుచు మార్గమధ్యమున లుంబినివనమున ప్రసవమయ్యె నఁట. గాన లుంబిని వనమే బుద్ధభగవానుని జన్మస్థానము. అట నిప్పుడు అశోకస్తంభమును, శాసనమును గలవు. లుంబినివనము కపిలవస్తుపుర ముండినతావునకుఁ దూర్పుగా పదిమైళ్లదూరమున నున్నది. వీరి జననము ము. ౫౬౭ అని యందురు.

యువరాజగు సర్వార్థసిద్ధి యొకనాఁటి నిశీథమున నిద్ర మేల్కాంచి లేచి తన చెలికాఁడగు సంతకుని తా నెక్కుగుఱ్ఱమును రప్పింపుమని పల్కెనఁట. దాని నధిష్ఠించి కొంతద వ్వేగి, అనోమానదిని గుఱ్ఱముపైనుండియె కుప్పించి దాఁటి, (ఇప్పటి కుద్వానది) అవ్వలిమైదానమున దిగి, తానదివఱకు ధరించియుండిన వస్త్రములందీసివైచి, సన్యాసివలెవస్త్రముల ధరించి,

శిఖాయజ్ఞోపవీతములు దీసివైచి 'సన్న్యాసోఽస్మి' యని పల్కి అనుచరులను గుఱ్ఱమును వెనుకకుఁ బంపివైచె నఁట. ఆసన్న్యాసస్వీకరణ మొనర్చిన తావిప్పుడు మాగ్వార్ (రెయిల్వే) స్టేషనునకు నైరృతిదిశగా రెండున్నర మైళ్ల దూరమున నున్నది. అత్తావున నశోకచక్రవర్తి స్థూప నిర్మాణ మొనర్చెనుగాని అది పాడైయున్నది.

పిదప ననేకతావుల తపంబొనర్చి కడకు గయానగరమునకుఁ గొంతదూరమున నొక బోధివృక్షము (రావిచెట్టు) క్రింద తపంబొనర్చి, జ్ఞానవంతుఁడగు బుద్ధుఁడనంబరఁగె నఁట. దీని నిప్పుడు బుద్ధగయ యనుచున్నారు. ఇట గొప్ప బుద్ధదేవాలయము నిర్మింపఁబడి బౌద్ధక్షేత్రమై యున్నది. పిదప బుద్ధభగవానుఁడు బనారస్ పట్టణమున కైదుమైళ్ళ దూరముననున్న సారనాథ మనుతావున (ఇప్పటి సర్నాథ్) మొట్టమొదట తనమతమును బోధించె నఁట. ఆ ప్రబోధమును బౌద్ధులు ధర్మచక్రమును ద్రిప్పుట యనెదరు. మఱియు సన్న్యాసస్వీకరణమున కిల్లు విడచి వచ్చుటను బౌద్ధమతస్థులు భక్తితో మహానిష్క్రమణ మనియు వాడుచున్నారు.

బుద్ధభగవానునకు శిష్యు లసంఖ్యాకులుగ నగుచుండిరి. రాజ్యాధిపతులు శిష్యులైరి. మతావలంబకులలో గొప్పవిద్వాంసులు కల్గి కతన మతగ్రంథములు పెక్కులు వ్రాయఁబడెను. వీరు కుశినగర (ఇప్పటి కాశియా గ్రామము) కడ నిర్వాణపదమందిరి. ఈతావున కొన్ని స్థూపములు నిర్మింపఁబడినవి. ఇత్తావు బనారస్ పట్టణమునుండి నూటపదునాలుమైళ్లు.

వీరికాలమునాటిచర్యలు, తావులు లెక్క లేక వ్రాయఁబడినవి. అవి పెక్కులు ప్రోల్పఁబడినవి. అవి యన్నియు నీగ్రంథమునకు మితిమీఱి యుంట వదలివేయఁబడినవి.

**బుద్ధవనము**—బీహారములోని గయజిల్లాలోని తపోవన మనంబడుతావునకుత్తరముగ నాలుమైళ్లదూరమున 'బుద్ధైన్' అనుపేరఁబరఁగు ప్రదేశము.

**బుద్ధానది**—పంజాబునందలి లూధియానాపురముప్రక్కఁబడి ప్రవహించునదికి 'బుద్ధానది' యనిపేరు. ఇందు చైత్రమాసమున స్నానయాత్ర జరుగునఁట.

**బుద్ధానుస్మృతి**—(దశబౌద్ధానుస్మృతులుచూడుఁడు.)

**బుద్ధి**-(మోహసంతోషదుఃఖములుచూ.)

**బుద్ధి లేక బుద్ధికులగోత్రము**--(బుధనకుల చూడుఁడు.)

**బుద్ధి సప్త విధములు (సప్తవిధ బుద్ధులు)**--౧ పండబుద్ధి- జ్ఞానము నెఱుంగు నాసక్తిగలబుద్ధి, ౨ మేధాబుద్ధి-వినినసంగతుల నవలోకన మొనర్చుకొనుబుద్ధి, ౩ చార్వాకబుద్ధి-మనంబున నూహించునేర్పుఎక్కువగాగలబుద్ధి, ౪ చత్వబుద్ధి-సంశయములను నివృత్తిచేసికొనుచుండుబుద్ధి, ౫ గృహీతబుద్ధి-శ్రద్ధగా వినుటయు వినినదానిని మఱవక గ్రహించుటయుఁగలబుద్ధి, ౬ శ్రౌతబుద్ధి-శుశ్రూష లొనర్చునాసక్తి గల్గిన బుద్ధి, ౭ ప్రతిభాబుద్ధి-బోధించు నేర్పు గల్గియు, నితరులు తన్ను ప్రశ్నింపకుండునటుల తానె స్పష్టపఱచుచు విపులముగ బోధింప నేర్పుగలిగినబుద్ధి.

**బుద్ధోక్తసాంకేతపరిభాషాపదములు**-బుద్ధభగవానుని బోధనలనుండి సంపాదింపఁబడినవి గాన, వీట్లను మాధ్యమిక, యోగాచార, సౌత్రాంతిక, వైభాషిక బౌద్ధులు నాల్గుతెగలవారు గౌరవించుచుందురు. ఇందు వివరింపఁబడినసాంకేతికములు, పరిభాషాపదములు నిరువది కలవు.

౧ ఓఘచతుష్టయము- ఓఘ మన ప్రవాహమని యర్థము. అవి ౧ కామోఘము, ౨ భవోఘము, ౩ ద౹ ౪ అవిద్యోఘము. ఇవి ఉత్తీర్యములని(అనఁగా వీట్లలోఁబ్రవేసించి సరకుచేయక దాఁటవలయునని)బుద్ధభగవానుఁ డనియెను. కామము, సంసారము, దృష్టి, అవిద్య ఈ నాల్గును జలప్రవాహము వలె నెడతెగక నడుచుచుండునవి గాని, ఒకహద్దుతో నంతమగునవి కావు. ఈనాల్గింటిని జయించినవానిని ఓఘతీర్ణుఁ డందురు.

౨ ప్రకోపత్రయము ౧ కాయప్రకోపము- శరీరముచేయు హింస, స్తేయము, జారత్వము మొదలగుతప్పులు(ప్రకోపకార్యములు). ౨ వాక్ప్రకోపము - వాక్కుచేయు మృషావాదము, పైశున్యవాదము, దూషణము, పరుషవాక్కులు మొదలగుతప్పులు. ౩ మనఃప్రకోపము- అనఁగా దుశ్చింతలని భావము. ఈ మూఁడింటిని జేయరాదని బుద్ధభగవానుఁ డనియెను.

౩ కేశపంచకము-౧ కామము, ౨ క్రోధము ౩ అవివేకము, ౪ అహంకారము, ౫ గర్వము. ఈ యైదింటిని బాపుకొనవలయునని బుద్ధభగవానుఁ డనియెను.

౪ నాశ్యపంచకము- ౧ కామము, ౨ ద్వేషము, ౩ స్వకాయదృష్టి, ౪ విచికిత్స, ౫ శీలవ్రతపరామర్శ. ఇవి అనర్థము లనియు, రూపుమాప వలసినవనియుఁ బుద్ధభగవానుఁ డనియెను.

౫ పరిత్యాజ్యపంచకము-౧ రూపరాగము, ౨ అరూపరాగము,౩ గర్వము,౪ ఔద్ధత్యము, ౫ అవిద్య. ఈయైదింటిని పరిత్యజింపవలయునని బుద్ధుఁడు చెప్పెను

౬ సంగపంచకము-౧ రాగము, ౨ ద్వేషము, ౩ మోహము, ౪ గర్వము, ౫ దృష్టి. ఇవి సంగమము లనంబడును.

౭ ప్రతిబంధకపంచకము- ౧ కామము, ౨ ద్రోహము, ౩ స్త్యానము (సోమరితనము), ౪ గర్వయుక్తమగు చెడునడత, ౫ సంశయము. ఈయైదు వ్యాఘ్రములవంటివనియు, ఇవి యున్నమార్గమున నడువ వెఱచురీతిని వీట్లకు వెఱువవలెననియు బుద్ధభగవానుఁ డనియెను.

౮ మననపంచకము-౧ శ్రద్ధ, ౨ స్మృతి, ౩ వీర్యము,౪ సమాధి,౫ ప్రజ్ఞ. వీటిని మననము చేయుఁ డని బుద్ధభగవానుఁ డుపదేశించెను.

౯ ప్రధానధర్మత్రయము-౧ శీలము (పాపకార్యముల గావింప కుండుట), ౨ సమాధి (పుణ్యకార్యాచరణము), ౩ ప్రజ్ఞ (మనోనైర్మల్యము గల్గియుండుట). ఇవి బౌద్ధులకు తప్పని నియమములని బుద్ధభగవానుఁ డనియెను.

౧౦ పంచశీలములు- ౧ అహింసాశీలము, ౨ అనృతమాడకుండుట, ౩ అదత్తదానాపరిగ్రహశీలము, ౪ పరదారాగమన వర్జనశీలము, ౫ సురాపానవర్జనశీలము. వీట్లకు పంచశిక్షాపథములని పేరు. ఇవి బౌద్ధులకు ముఖ్యశీలము లని బుద్ధభగవానుఁ డనియెను.

౧౧ స్రోతషట్త్రింశతి- ద్వాదశాయనములు (౧౨). ఒక్కొక్కటి కామతృష్ణ, భవ (సంసార) తృష్ణ, విభవతృష్ణ అని త్రివిధములుగఁ దనరుచు ౩౬ అగుచున్నవి. వీట్లకు స్రోతస్సులని పేరు.

౧౨ సంబోధిసప్తకము-౧ స్మృతి, ౨ ధర్మవిచారము, ౩ వీర్యము, ౪ ప్రీతి, ౫ ప్రశాంతి, ౬ సమాధి, ౭ ఉపేక్ష యను నీయేడును హృదయమున నాటుకొని వికసించునటుల సర్వప్రయత్నము లొనర్పుఁడని బుద్ధభగవానుఁ డనియెను.

౧౩ చతురార్యసత్యములు:—

(౧) దుఃఖము- జగత్తు దుఃఖమయమనుట.

(౨) దుఃఖసముదయము - దుఃఖము

 బుద్ధోక్తసాంకేతపరిభాషాపదములు

నకు జాతి జరా మరణములు కారణమనుట.

(౩) దుఃఖనిరోధము- అర్హ విధులచే దుఃఖమును నిరోధించుట నభ్యాసమొనర్చుట.

(౪) దుఃఖనిరోధగామినీప్రతిపదము- దుఃఖకారణములను పూర్తిగ నడఁగ ద్రొక్కుట నశింపఁ జేయుట.

౧౪ ఆర్యాష్టాంగమార్గము-౧ సమ్యగ్దృష్టి, ౨ సమ్యక్సంకల్పము, ౩ సమ్యగ్వాక్కు, ౪ సమ్యక్కర్మము. ౫ సమ్యగ్జీవనము, ౬ సమ్యగ్వ్యాయామము, ౭ సమ్యగ్విచారము, ౮ సమ్యక్సమాధి. ఈ యెన్మిదియు 'ఆర్యాష్టాంగ మార్గము' లనియు, నివి బౌద్ధభిక్షుకధర్మము లనియు, వీట్ల నర్హరీతి నుంచవలయు ననియు బుద్ధభగవానుఁ డుపదేశించెను.

౧౫ రత్నత్రయము - శరణత్రయము. ౧ బుద్ధభగవానుఁడు, ౨ ఆయన యుపదేశించిన బౌద్ధధర్మములు, ౩ బౌద్ధసంఘము. ఈమూఁటికి 'రత్నత్రయ' మని పేరు. మఱియు "బుద్ధం శరణం గచ్ఛామి" (బుద్ధుని శరణు పొందుచున్నాను.) ౨ "ధర్మం శరణం గచ్ఛామి" (బౌద్ధధర్మము శరణు పొందుచున్నాను) ౩ "సంఘం శరణం గచ్ఛామి" (బౌద్ధసంఘమును శరణు పొందుచున్నాను) అని తాను పై మూఁడింటిని శరణొందుట శరణత్రయ మని బౌద్ధగ్రంథము లందు చెప్పఁబడినది.

౧౬ బంధత్రయము- ౧ ఆగామిబంధము, (భవిష్యత్కర్మము. అనఁగా ముందు తానొనర్పనున్న పనులఫలమని భావము). ౨ సంచితకర్మబంధము. (వర్తమానమున తానొనర్చు పనులఫల మని భావము). ౩ ప్రారబ్ధకర్మము. (వెనుక తానొనర్చిన పనులఫల మని భావము). ఈమూఁడును బంధత్రయ మని బుద్ధభగవానుఁ డనియెను.

౧౭ దశాచతుష్టయము-(అనుభవింపవలసిన యవస్థలు).

(౧) స్రోతాపన్నదశ- (జననమరణప్రవాహమునఁ బడియుండి, ఈఁదుకొనుచుండురీతిని ప్రయత్నము లొనర్చుచు, నిర్వాణము నందులోపున ఏడుజన్మము లెత్తవలయునను నిబంధనము).

(౨) సకదాగామిదశ- (పిదప నాతఁడు మానవులందుఁగాని దేవతలందుఁగాని వేఱొక సారి జన్మింపవలయునను నిబంధనము).

(౩) అనాగామిదశ-(పిదప నాతఁడు బ్రాహ్మణుఁడై (అజ్ఞానిగ) యొకజన్మము నెత్తవలయునను నిబంధనము.)

(౪) అర్హతదశ (పిదప నాతఁడు నిర్వాణపథమునకుఁ దగ్గరగ నధిగమింపనుండునవస్థకు అర్హతదశయని పేరు).

ఇవి బౌద్ధాచార్యుఁడగు భిక్షువు నిర్వాణము జెందుటకుఁ బూర్వ మనుభవించు నని బుద్ధభగవానుఁ డనియెను.

౧౮ చత్వారింశతి కర్మస్థానములు- కృత్స్న కర్మస్థానములు పది. అశుభకర్మస్థానములు పది. అనుస్మృతికర్మస్థానములు పది. బ్రహ్మవిహారకర్మస్థానములునాలుగు. అరూప్యకర్మస్థానములు నాలుగు. సంజ్ఞాకర్మస్థాన మొకటి. వ్యవస్థాకర్మస్థాన మొకటి.

౧౯ దశానుస్మృతులు-౧ బుద్ధానుస్మృతి, ౨ ధర్మానుస్మృతి, ౩ సంఘానుస్మృతి, ౪ శీలానుస్మృతి, ౫ త్యాగానుస్మృతి, ౬ దేవతానుస్మృతి, ౭ మరణానుస్మృతి, ౮ కాయగతానుస్మృతి, ౯ అనాపాన (అనఁగా ఉచ్ఛ్వాసనిశ్వాస) స్మృతి, ౧౦ ఉపశమానుస్మృతి. ఇవి కర్మస్థానములలోనివనియు(విశుద్ధమార్గములు), ఇందు బుద్ధానుస్మృతి, ధర్మానుస్మృతి, సంఘానుస్మృతులు మూఁడు ప్రధానము లనియు బుద్ధభగవానుఁ డనెను. (అనుస్మృతి యను స్మరణము లేక జ్ఞాపకము).

౨౦ బుద్ధులు పెక్కండ్రు కలరనియు, వారికి తదాగతు లనియు, బుద్ధులు తత్త్వవేత్తలు, జిన దేవులు, బోధిసత్వులు, గురూత్తములు, బుద్ధ దేవులు, అర్హతులు, ఆర్యులు, భగవానులు అనిపేర్లు గలవనియుఁ జెప్పఁబడినవి.

**బురదగుంటలోనిపంది వలె**-(ఆంధ్ర లోకోక్తి).

**బురదలోని కుమ్మరిపురుగు వలె**-కుమ్మరిపురుగునకు బురదలో నున్నను బంక మన్నైనను అంటదు. (ఆంధ్రలోకోక్తి.)

**బుఱ్ఱకొకగుణము జిహ్వకొకరుచి** - (ఆంధ్రలోకోక్తి.)

**బుఱ్ఱకొకగుణము ముఖమునకొక రవాపు**-- (ఒకగుణమనియు ఒకరుచియనియు భావము.) (ఆంధ్రలోకోక్తి.)

**బుల్** (Bull) — వాణిజ్యసంబంధ పరిభాషాపదము. ముందు ధర హెచ్చు కాగలదనునిరీక్షణచేసి వాటాలను కొని (లేక కొన కంట్రాక్టు చేసికొని), అట్లు ధర లేచిన పిదప లాభములఁ బడయువర్తకుఁడు. ఈతనిలెక్కలకు 'Bull accounts' అనెదరు.

**బులాండ్ షహర్** — (ఉచ్చనగరము చూడుఁడు.)

**బుల్డాగ్ కుక్క** (Bull dog)--- ఇది బ్రిటీషు దేశపుకుక్క యందురు. క్రీ. వె. ౧౮ శతాబ్దము వఱకు Bull fights యం దుప యోగపడుచుండుట నావేరాయెనఁట. ఈ జాతి కుక్కలు కావలికిఁ బనికిరాని వందురు. బుఱ్ఱ పెద్దదియు మూతి పొట్టిదియుగనుంట దీనిలక్షణము.

ఈజాతికలహప్రియత్వము నానాటికి చాల తగ్గిపోయినను తలపై చేయివైచిన తప్పక కఱచుట మామూలెనదఁట.

**బుల్హార్ శాఖ క్షత్రియులు**--(ప్రమార శాఖ క్షత్రియులు చూడుఁడు.)

**బుల్లియన్** (Bullion)— వెండి గాని, బంగారము గాని వర్తకసందర్భమునకుఁ జేయఁబడు నాకారమునకు బుల్లియన్ అనుపేరు వాడుదురు.

ఇటుకలయాకారముగ నొనర్చినదిబుల్లియన్ అనంబడుచుండును. ఇది కల్తీలేని పరిశుద్ధమగు లోహమని తలంపఁబడుచున్నది.

నగలుగాఁ గాని నాణెములుగాఁగాని చేయబడిన వెండిబంగారములను బులియన్ అనరు.

**బుల్లెటిన్** (Bulletin)—యథార్థమగు వార్తలను దెలుపుపత్రముల కీపేరు వాడుచున్నారు. Proclamation Dispatch అని భావము. ఇందు Bulla యనిన సిక్కాముద్ర (Seal) అనియర్థము. ప్రకటనీయమగు యథార్థపత్రి మని తాత్పర్యము

**బుషాహీరుసంస్థానము** — పంజాబులోని బ్రిటీషురక్షిత సంస్థానములు ౩౪ లో నొకటి. సట్లెజి (శతద్రు) నది దీనిగుండా నడుచును. బుషాహీరు రాజధాని. ఇది కొండల రాజ్యము.

**బూందీపురము** — రాజపుత్రస్థానమునందలి బూందీసంస్థానపు రాజధానీపురము. అజ్మీరునుండి నూఱుమైళ్ల దూరమునను కోటానుండి ఇరువదిమైళ్ల దూరమునను ఉనంకొండల లోవయం దున్నది. ఆలోవకు ఒకేమార్గముగ నున్న రెండుపర్వతపంక్తులు సమీపించుమూలను నాల్గువందలగజముల వెడలుపుగల ప్రదేశమున బూందిపట్టణమునుజుట్టిన దుర్గద్వారము (ఏనుఁగుల దర్వాజా) నుండి ప్రారంభమై లోవలో పట్టణము కలదు. ఇచట పురమును జుట్టియున్న దుర్గద్వారము జేరుదనుక పట్టణమున్నజాడయే కానరాదు. లోవను జుట్టియున్న కొండలవరుసలు మహారణ్యమయములుగను, భయంకర

కూౄరమృగ నివాసములుగను నుండుటచే రక్షణాకై యిట్టితావునం దాది నీదుర్గము నిర్మింపఁబడియుండనోపు.

ఈ తావు (రెండుకొండలనడుమ దుర్గద్వారమున కెదుటనున్న ఒకపాటి బయలుప్రదేశము) నకు చౌగాన్ అని పేరు. తొలింట నీలోవయంతయు మైనాజాతిదొంగల వశమునం దుండెడిది. (తేజదశిమి చూడుఁడు). వీరు దోఁపిడిగాండ్రు. ఈప్రాంతముల వీరిభయ మధికము. వీరిని జయించి చౌహా (చతుర్వ్యాప్త) శాఖక్షత్రియ వలో ంసుడని చెప్పఁబడిన భారవంశస్థుఁడగు రావుదేవ భూపతి ఈలోవనుండి వీరిని దఱిమివైచి తనరాజధాని నిందే ఏర్పఱచుకొని పురమునుజుట్టి దుర్గమును గట్టి దాని కామైనాజాతి ప్రధాననాయకుఁడగు బుంది యనువాని పేరిడెనఁట. అందొకకొండపై నదివఱకేయుండిన తారాఘుడ మను పర్వతవనదుర్గమును తనరక్షకసైన్యస్థానముగ నమర్చి ఆకొండప్రక్క నేటవాలుప్రదేశమునందు దిగువనుండి ఒకటికన్న నొకటి ఎత్తుగనుండునట్లు ఏర్పఱుపఁబడిన సమతలప్రదేశముల తనప్రాసాదనిర్మాణ మొనర్ప నారంభించెను. తరువాతిమహారాజులు సమతలప్రదేశముల (Terrace) వేర్వేఱుప్రాసాదములు కట్ట నానాఁటికి మైనాదొంగలతారాఘుడమున కించుమించుగాఁ జేరునంతటి దయ్యెను. బూందీలోన సముద్రపునీటిమట్టముపై ౧౪౦౦అడుగుల ఎత్తున నున్నది.

ఈనిర్మాత హారవంశపు వుదేవప్రభువు క్రీ. వె. ౧౩౦౦ కాలమువాఁడఁట. కొందఱు పదునాల్గవశతాబ్దపు మధ్యకాలమువఱకుండినవాఁ డందురు. అగ్బరుచక్రవర్తికాలమున వీరికి ౧౫౫౪లో ఆయనతో సంధి నడిచెనఁట. ఒకప్పుడు రావుబుద్సింగ్ అను బూందీమహారాజునకును జైపూర్ జయసింగుమహారాజునకును గలహముగల్గి సంగరమున నోడి బూందీనృపాలుఁడు తనకోటను వీడి పాఱిపోయెనఁట. పిదప నాతనిసుతుఁడగు ఉమేద్సింగు నృపాలుఁడు తిరుగ ముట్టడించి ౧౭౪౯ లో బూందీ నాక్రమించెనఁట. వారిసంతతి (హారవంశపుక్షత్రియులే) నేఁటికిని భూపతులైయున్నారు.

ఇచటి యాయుధశాల రాజపుత్రస్థానమున గొప్పది యందురు. చిత్రశాల యొకటి ౧౭౪౮ లో ఉమేద్సింగుమహారాజునాఁడు కట్టఁబడి పురమునకు రెండుమైళ్ళదూరమునందున షికారుబురుజుభవనము (ఆభూపతి తపస్థలము), ఫూల్సాగరము, హిందోళీ (ఉయ్యాల) భవనము, నవాల్సింగుమహారాజు త్రవ్వించిన నవాల్సాగరము, జైత్సింగుమహారాజు త్రవ్వించిన జైత్సాగరము, నతవత్ జీ మహారాజ్ఞి కట్టించిన తూర్పుద్వారమున కవ్వలనున్న బావూరి యనంబడు దిగుడుబావి, ఉమేద్సింగు మహారాజు పూజించిన గొప్ప ఆంజనేయవిగ్రహము నిచట జూడఁదగిన వింతలు.

**బూందీసంస్థానము** ఇండియాదేశమందలి రాజపుటానా ఏజన్సీలోని బ్రిటీషు రక్షితసంస్థానము లిరువదింటిలో నొకరాజపుత్రసంస్థానము. (రాజపుటానాఏజన్సీచూడుఁడు) బూందీపురము రాజధాని.

**బూడావెస్టునగరము** — (హంగేరీ దేశముచూడుఁడు.)

**బూడిదలోపోసినపన్నీరు** — (ఆంధ్రలోకోక్తి).

**బూతపిల్లిగడ్డ**—ఇది పూత మనంబడు నొకజాతి అడవిపిల్లి శరీరాంగ మనియు, ఇందు సువాసనగలదనియు నందురు. పసిబాలుర కరగఁదీసి పట్టిన పెక్కురోగములు, రొంపలు,

జ్వరములు నివారించును. దీని సేవవలన అతి సారము, తలనొప్పి, తాపము, వాతము, శ్లేష్మము తగ్గునందురు. పిల్లలతల్లులు తమకడ దీనినితప్పక యుంచుకొందురు. కొందఱు మంచి గంధముతో నరగఁదీసి మేనఁ బూసికొందు రని తెలియుచున్నది.

**బూతులబుంగ**— బుంగయనిన బుట్ట యనియర్థము. ప్రసంగించుతఱి నాడఁదగని (బూతు) మాటల నాడుచుండువానిని హేయముగ బూతులబుంగ యనుచుందురు. కాని నిజముగ బుంగ మాత్రముకాదు.

**బూ (భూ) శనగ-**

**బూరుగ(దూది) చెట్టు**—లా. Bombax Malabaricum, Bombax Heptaphylla. ఆంగ్ల Silk cotton tree. సం. చిరజీవీ, నిర్గంధపుష్పా, శాల్మలః, శాల్మలీ, ఆపూరణీ, కంటకారీ, కుక్కుటీ, కుకూటీ, తూలినీ, తూలిఫలా, దీర్ఘాయుః, దురారోహః (ముళ్ళబూరుగ), కదలా, పిచ్ఛిలా, పూరణీ, బహువీర్యః, మోచా, మోచనీ, మోచాఖ్యః, యమద్రుమః, రక్తపుష్పా, రక్తోత్పలః, శాల్మలకః, శాల్మలీ, స్థిరాయుః. కొందఱు బభ్రూజ యనియు వాడిరి.

బూరుగుచెట్లయందు ముండ్లుగలవి, ముండ్లు లేనివి యని రెండుభేదములు కలవు. ఈరెండును తెల్లనిపూవులు పూచునది, ఎఱ్ఱనిపూవులు పూచునది యని తిరుగ ద్వివిధము. వీట్లలో సీమజాతి, దేశవాళీజాతి యనియు భేదములు కలవు. దేశవాళీజాతిచెట్టు వలముగను, సీమజాతి సన్నముగను ఎదుగును. ముండ్లుగలజాతియు, తెల్లపూవులు పూచుజాతియు నిందు శ్రేష్ఠమని ఆయుర్వేదవైద్యు లందురు. బూరుగుచెట్ల ముఖ్యోపయోగము బూరుగ దూదికొఱకే. ఇది పత్తిదూదికన్న చాల మెత్తగ నుండును. కావున సౌఖ్యాభిలాషులచే నెక్కువ యాదరణ మందుచు పఱుపులు, దిండ్లు, తలగడలు మొదలగువాట్ల నుంచఁబడుచుండును. దాన విలువ గల్గి యున్నవి.

బూరుగచెక్క రసకషాయములు వేడియు, నించుకపైత్యముజేసి, విరేచనబద్ధము గల్గించి, మూత్రమును వెడలించు ననియు, ఉబ్బురోగము, గజ్జి, జ్వరదోషము, నెత్తురుగడ్డలు, రక్తపైత్యము, రక్తశ్లేష్మము, వాతము, విసర్పి, క్షయ నివారించు ననియు,. అతిమూత్రము నడంచు ననియు, శుక్లవృద్ధి, దేహపుష్టి గల్గించు ననియుఁ జెప్పఁబడినది. గుప్పెడులావై పూవులు పూయకుండినతఱి, లేఁతచెట్టువేఱు ఇనుము తగులకుండఁ దీసి విఱచి ముక్కలుచేసి నీడ నెండించి గంధముతీసి ఆరించి చూర్ణముచేసి పటికపంచదారతోఁ గల్పి లోని కిచ్చిన ధాతుపుష్టిచేసి మూత్రముతో నింద్రియముపడుట స్వప్నస్ఖలనరోగముల నద్భుతముగ నివారించి పైత్యవిరేచనములు, రక్తవిరేచనములు ఆఁపి నిక్కాక, ఒడలుమంటనివారించుననిచెప్పఁబడినది. బూరుగవేఱునకుఁ గంటుపెట్టి, కాఱిననీరు పట్టి తీసి దానిని సేవించిన నించుక వాతముజేసి మూత్రము నెక్కువజేసి దేహపుష్టి, వీర్యవృద్ధి గల్గించి, స్త్రీల రక్తకుసుమరోగము, రక్తకాస, రక్తదోషము, రక్తపైత్యము, వాపులు, సర్పిరోగము నివారించు నని చెప్పఁబడినది.

బూరుగపూవులందు వాతపైత్యముల నివారించి మేహశాంతి గల్గించి గ్రహణి కట్టుగుణము కల దనియు, బూరుగబంకయందు గ్రహణి, స్త్రీల కుసుమరోగము నివారించి, మేహవాతములు శమింపఁజేసి వీర్యవృద్ధి, వీర్యపటుత్వము వీర్యస్తంభనము గల్గించుగుణము గలదనియు నందురు.

**బృందావనము**--(అరణ్యములు చూ.)

**బృందావనమహోద్యానము** — మైసూరురాజ్యము ఉద్యానవనములకుఁ బేరందినది. అందు కృష్ణరాజసాగరముకొఱకు కావేరీనది కడ్డముగ కుడివైపున బెలగులగ్రామము, ఎడమవైపున కన్నంబాడిగ్రామముల నడుమ నిర్మింపఁబడిన జలస్తంభననిర్మాణము (Dam) కడనే ఆనీటిసదుపాయమున నిర్మింపఁబడిన బృందావనమహోద్యానవన మగ్రగణ్యమని చెప్పనొప్పును. ఇది యెత్తగుతావు. ఒకప్రక్కను అంతరాయములుగ సమతలప్రదేశములఁ జేసి వాటియందు పూలమళ్లు(Flower Beds), జలోద్ధృతచిత్రములు (Fountains), విగ్రహములు అమర్చి యున్నారు. ఇట్టితోఁటల కాంగ్లమున 'Terraced Gardens' అనెదరు. రాత్రులందు రంగురంగుల విద్యుద్దీపకళికలను వేర్వేఱురంగులకాంతులతో ఔత్థానాజలము లెగురుచు, దీపావళియందురంగులు మాఱుతఱి తమజలమురంగులమార్పుల జూపుచు, చూచువారలకు వినోదమెగాక యచ్చెరువుగొల్పెడిని.

ప్రధానముఖద్వారమునుండి నాల్గు ఫర్లాంగులదూర మరిగిన క్రిందికిఁ బూఁదోఁటలోనికి దిగు సోపానపంక్తి కలదు. కొంత దిగినతోడనే సోపానమార్గము రెండుగఁ జీలి, ఇరుదెసలకు దిగుతావు (నడుమ)నందు కావేరీ (నదీదేవత) దేవివిగ్రహ మైదడుగులుయెత్తుగలది కలదు. అద్దానిపాదములనుండి చిన్నజలధార లుద్భవించి,సన్నముగ బాఱుచు నొకవృత్తకుండంబునఁ జేరుట ప్రదర్శింపఁ బడినది. అటకుఁ గొంత దూరమున నొక మరుగుప్రదేశమున యౌవ్వనసౌందర్యవతి యగు నొకస్త్రీవిగ్రహమును, దానింజూచి భ్రమజెందక నిలువఁబడియుండు విరాగివిగ్రహమును ప్రతిష్ఠింపఁబడినవి. వీట్లరచయిత మైసూరురాజ్యనివాసి యగు సిద్ధలింగస్వామి యని యట చెక్కఁబడినది.

ఈఅంతరాయపుంబూఁదోఁట లన్నిఁటికి నిలువునను అడ్డముననుపూరితజలమార్గములగు కాలువలు, నడుమనడుమ జలోద్ధృతయంత్రచిత్రములు, నడుచుటకు,విశాలములగుబాటలు, ఇరుదెసల ఛాయావృక్షములు, ప్రక్కల పూలమళ్ళు, కూర్చుండుటకు అర్ధస్థలములశిలావేదికలు మొదలగునలంకారములు నిండియున్నవి. వీటిపని యద్భుతమై తోఁచెడిని. అహోరాత్రము లొకేరీతిని జలముల నెగురఁగొట్టి జలోద్ధృతయంత్రములవింత రాత్రులందు రంగులతో నినుమడించియుంట చూడఁదగినదే కాని వ్రాయ శక్యము గాదు.

దీనిచక్కఁదనముఁజూడ పెక్కుదేశములవారరుదెంచి చూచిపోవుచు మెచ్చుకొనుచుంటనిది ప్రపంచమున వింతలలోఁ జెప్పఁదగియుండునేమో యనిపించెడిని. వచ్చినవారలసదుపాయమునకు వసతిగృహములు, హోటళ్ళు, అంగడులు మొదలగునేర్పాటులు కలవు.

మైసూరునుండి వచ్చుబాట నదియొడ్డుననే ముగియును. డాము నంటియె పైనుండి ముందున కరుగుతఱి నొకదెస నిర్బంధితజలములు, వేఱొకదెస మహోద్యానాంత రాయములు వింత గొల్పెడిని.ముఖద్వారముకడనే త్రవ్వుటయందు బయల్పడిన శిలాఫలకశాసన మమర్పఁబడినది. దానిప్రాముఖ్య మేమియు లేకున్నను క్రీ. వె. ౧౭౮౨-౯-౧౭౯౯ ఈరాజ్యమేలిన టిప్పుసుల్తానిట్టినిర్మాణముల ప్రాముఖ్యము నెఱిఁగియుండెనని మాత్రము తెలియఁగలదు.

భరతదేశపుడాములలో రెండవదిగఁ జెప్పఁబడిన యాజలస్తంభననిర్మాణము ౨౮౬౬ గజముల రెండడుగులపొడవనియు, ౧౩౦ అడుగులయెత్తనియుఁ జెప్పఁబడినది. ఇది ఆపిననీరు నదియం దేఁబది చతురపుమైళ్ళ ప్రదేశమున నిలుచుననియు, అయ్యది ౪౮౦౦౦ మిలియనుల

ఘనపుటడుగుల పరిమాణ మగుననియు లెక్కించియున్నారు. దీనినుండి వెల్వడు ముఖ్యవ్యవసాయకుల్య యగు ఇర్విన్ కైనాలు ౨౬ మైళ్లదనుక మొరకపల్లములగుండా నడిచి, మొరకప్రదేశమగు మాండ్య తాలూకానంతటిని దడుపుచు దీని వేర్వేరుతావులనుండి ఏర్పడి, ౨౦౦మైళ్ళపొడవుగల పిల్లకాలువలు పెక్కుపొలములకు బాఱి, మొత్తమున ౧౨౦౦౦౦ యకరములు తడుపుచు, చెఱకు, వరి మొదలగుపంటల కగుటయె గాక నదియందుదిగువ నేఁబదిమైళ్ళ దూరముననున్న శివసముద్రజలపాత విద్యుచ్ఛక్తిస్థానమున కధికముగనీటి నొసంగుచు, తొల్లింటి పదివేలకన్న నింక నధికముగముప్పదియాఱువేల హార్సుపవరు (శక్తి) నధికపఱచుచున్నదని చెప్పఁబడినది.

**బృహత్కథ**—ఇది గుణాఢ్యవర్మ యను వానిచే పైశాచిలిపియందు వ్రాయఁబడిన ఒక యుద్గ్రంథము. దీనిని గుణాఢ్యున కెఱిఁగించి, కాణభూతి యను నొక ప్రమథుఁడు శాపవిమోచనము నొందెననియు, పుష్పదంతుఁడు (వరరుచి) ఈకథను కాణభూతి కెఱింగించి తనశాపము నుండి విముక్తి జెందె ననియు,

బృహత్కథను ఏడులక్షలగ్రంథముగ మహారణ్యమధ్యమునందు తనగ్రంథమును విద్యాధరులపహరింపకుండుటకును, అరణ్యములో సిరా దొరకమిని స్వరక్తముచే నేడులక్షల గ్రంథముగా పైశాచీలిపియందు వ్రాసి, తనభటుల (పిశాచరూపుల)చే అప్పుడు తమదేశమును పాలించుచున్న శాతవాహనునియొద్దకు పంపె ననియు, ఆరాజు గ్రంథము పిశాచలిపియందు వ్రాయఁబడి యుండుటచేతను, మనుష్యరక్తము సిరాగానుపయోగించి లిఖింపఁబడుటచేతను, పిశాచరూపములతో నున్నభటులచే తనయొద్దకు పంపబడుటచేతను, దానిని కృతినందుట కంగీకరింపక నిరాకరించి యాభటులను పరిభవించె ననియు, రాజిట్లు తానింత శ్రమనొంది వ్రాసిన గ్రంథమును తృణీకరించి తన్నవమానపఱచుటకు స్వాభిమానపరుఁడగు గుణాఢ్యుఁడు సహింపఁజాలక, తనశాపమోక్షమునందు ఆశాభంగము కలిగినవాఁడై, ఆగ్రంథము నాశనము చేయుటకు నిశ్చయించి, కష్టపడి వ్రాసిన గ్రంథమునందుఁగల యభిమానముచే గ్రంథనిర్మూలనము చేయుటకు ముందు తనశిష్యులకైనను వినిపింపవలయునని యెంచి, ఒక్కొకలక్ష గ్రంథము చదువుట పూర్తికాఁగానే దాని నగ్నిలోఁ బడవైచి దగ్ధముచేయుట కారంభించె ననియు, అతఁ డాగ్రంథము నట్లు చదువుచుండఁగా నాయరణ్యములోని పశుపక్ష్యాదులువచ్చి వినుచు, గ్రంథము వినుటయందలి యభిరుచిచేపరవశత్వము నొంది, ఆహారవిహారములమాట మఱచి, నిలువుగ వాని చుట్టును నిలిచి తదేకచిత్తముతో నాగ్రంథము వినుచుండెననియు ఆగ్రంథమునందే చెప్పఁబడియున్నది.

ఇట్లు కొన్నిదినములు గడచెనఁట. శాతవాహనునిశరీరమునం దస్వస్థతకలిగి దినదినము నీరసించిపోవుచుండె నఁట. రాజవైద్యులు వచ్చి రాజుగారిశరీరస్థితి పరిశీలించి యీయస్వస్థతకుఁ గారణము నీరసమృగమాంసభక్షణము గాక మఱియొండు కాదని దృఢముగాఁ జెప్పిరఁట. అందుపైని రాజుగారు తమకు మాంసమును తెచ్చియిచ్చుకిరాతకులను రావించి, నీరసమృగమాంసమును పంపుటకు కారణ మేమని వారిని ప్రశ్నించి బెదరింప, వారు అరణ్యములో జరిగినవిధమంతయు విన్నవించిరి. వెంటనే రాజు మంత్రిసామంతులతో సపరివారముగా బయలుదేఱి ఆస్థలమునకుఁబోయి చూడఁగా గుణాఢ్యుఁడు తనగ్రంథముచదివియచ్చటిపశుపక్ష్యాదులకు వినిపించుచు, ఒక్కొక్కలక్ష పూర్తియైన వెంటనే యగ్నిహోత్రుని కాహుతిచేయు

చుండెను. అప్పటికే యాఱులక్షల గ్రంథము దహింపఁబడినదనియుఁ గూడ నందే చెప్పఁబడియున్నది.

బృహత్కథ భూమియందు స్థాపింపవలయునని యెంచి తనయొద్దకు గుణాఢ్యుఁడీదివఱకు పంపియుండినగ్రంథ మిదియేయని విని, రాజు తనదోషమునకు పశ్చాత్తప్తుఁడయి అప్పటికి శేషించియున్న యాలక్షగ్రంథమును నరవాహనదత్తచరిత్రమను దానిని శాతవాహనుఁడు గ్రహించెనఁట. వెంటనే గుణాఢ్యుఁడు శాపవిముక్తుఁడయ్యెనఁట.

ఈగాథయందలిసత్య మెట్లున్నను అనేకములగు పురాణగాథలతోడను, ప్రాచీనకథలతోడను గూడిన కథానకములు సహస్రసంఖ్యాకము లీబృహత్కథయందుఁ గలవు. ఈగ్రంథ మిటీవల పాశ్చాత్యభాషలలో ప్రధానములయిన వానిలోని భాషాంతరీకరింపఁబడుటయే యీ గ్రంథోత్కృష్టతను ధ్రువపఱచుచున్నది. ప్రాచీనకవియగు కాళిదాసు మాళవికాగ్నిమిత్రము, రత్నావళి మొదలగునాటకముల యితివృత్తము లీబృహత్కథనుండియే సంగ్రహింపఁ బడినట్లు కొంతమందిపరిశోధకుల యభిప్రాయము. సిందుబాదుకథకు బృహత్కథయే ప్రాతిపదికమని ప్రాచీనచరిత్రపరిశోధకులగువిల్సన్, మాల్కోమ్ మొదలగువారు చెప్పుచున్నారు.

~(Sir John Malcolm, the celeberated historian of the past says; "Those who rank the highest among the eastern nations for genius have employed their talents in works of fiction and have added do the moral lessons they desired to convey so much of grace and ornament that their volumes have found Curreney in every nation of the world, for instance (1) The Katha Sarithsagar (Bruhatkadha) (2) The Vital Panchavimsati (3) The Simhasena Dwatrimsati (4) The Suka Saptati. The first of these works is a translation of Brihatkadha in the Pisachi Language and was translated for the amusement & instruction of Sri Harsha of Kashmir by the order of his grand mother Suryavati who became Sati in 1093 A. D.)

కథాసరిత్సాగరము నాల్గవసంపుటమునందు ఓడ పగిలిపోఁగా సముద్రములో పడిపోయిన యొకపురుషుఁడు సుడిగుండములో పడినట్లును, అందునుండి యొక మఱ్ఱియూడ (The pendulous root of Ficus Indica) పట్టుకొని పైకి లేచినట్లును వర్ణింపఁబడియున్నది. Popes Odyssey XII సంపుటము 101, 104 పుటలలో యూరిసస్ సుడిగుండమునుండి పైకెగిరి Fig వృక్షముయొక్క శాఖను పట్టుకొని బయటఁబడినట్లు వర్ణింపఁబడి యున్నది. ఐరోపాఖండపు అత్తిచెట్టు (Fig tree) కొమ్మలకన్న ఇండియాదేశపు మఱ్ఱిచెట్టుయూడలె తప్పించుకొనుటకు అందుబడిలో నుండుటచే ఇది యిండియాదేశపు మఱ్ఱిచెట్టెగాని సిసిలీద్వీపమునందలి మేడిచెట్టుగాదని చెప్పి విల్సన్ పండితుఁడు బృహత్కథయొక్క ప్రాచీనతను సిద్ధాంతీకరించెను.

పైశాచీలిపియందు వ్రాయఁబడిన యీ బృహత్కథ యొక్క సంస్కృత భాషాంతరీకరణమె కథాసరిత్సాగరము. దీనిని కీ॥ శే॥ వేదము వేంకటరాయశాస్త్రిగారు సులభమైన తెలుఁగు గద్యకావ్యముగ రచియించిరి.